నీ వాల్గంటివి ఆ నగలేమో?
నీవు గుర్తుతో తెలుపుము'' అనగ
రాముడు వారిని తొందర చేసెను
పావని-సొమ్ములు తెచ్చి చూపెను.

మూటగట్టిన వలువను గాంచెను
మూటలోనున్న నగలను గాంచెను
మంచుకమ్మిన చంద్రుని రీతిగ
రాముని చూపుల నిలచె నశ్రువులు.

''హా సీతా! నా ప్రియులారా!'' యని
దుఃఖించుచును సొమ్ముల నంతట
గుండెకు హత్తుకు-సర్పము రీతిగ
బుసల మాదిరి శ్వాసించె నట

శోకించగను స్మృతి దప్పినది
తిరిగి తేరుకొని సొమ్ముల చూపుచు
''పచ్చిక నేలను నగలు రాలినవి
కావున చెక్కు చెదరక నిలచెను.

సోదర లక్ష్మణ! నగలు చూడుము
సీతవి ఇవి కద తీరుగ చూడుము''
అనుచు రాముడు నగలను చూపగ
వినయముతో సౌమిత్రి పలికెను:

''పాద పద్మముల దర్శించెదను
ప్రణామముంచి పరవశింతును
కావున అన్నా! అందెలు వదినవి
మిగిలిన నగలు గురుతు నెరుగను.''

ఆరాటముతో నిండిన రాముడు
రవి సుతు నడిగెను సీత వివరము
వంచకుడుండెడి తావు అడిగెను
కూకటి వేళ్ళతొ కూల్చెద ననెను.

''ఇచ్చట నేనయి చంపుటెట్లని
సందేహించకు సూర్యనందనా!
ఇంతటి బాధకు నను గురి చేసెను
కావున రక్కసు లందర జంపెద.

చోరుని ఉనికి తెలియ జేయుము
జాలము నేనిక సహించ లేను
సతి అపహరణము ఒర్వజాలను
దుష్టుని త్రుంచెద సూర్యకుమారా!''
॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 7 శ్రీరాముని అండ నిలచెదనని సుగ్రీవుడు బాస చేయుట

గద్గద కంఠముతో సుగ్రీవుడు
పలికెను అపుడు రామచంద్రునితొ:
''రక్కసు వివరము వాని ప్రదేశము
శక్తి యుక్తులను పూర్తిగ నెరుగను.

కానీ వినుము! వంత నొందకుము
ఏదో విధముగ భూమీ సుతను
నీ దరి చేర్చెడి యోచన చేతును
నమ్ముము నన్ను-నెయ్యము సాక్షి.

# శ్రీమద్రామాయణ మకరంద గ్రంథావిష్కరణ

**(తేది : 01-04-2001)**

(స్థలము : శ్రీప్రసన్నాంజనేయస్వామివారి ఆలయం, కొత్తపేట క్రాస్ రోడ్స్.)



Hon'ble Justice Sri **S. Dasaratha Rama Reddy** Garu (ముఖ్య అతిథి)
(Retd. Judge A.P. High Court)

Hon'ble Justice **Sri J. Chelameswar** Garu (విశిష్ట అతిథి)
(Judge A.P. High Court)

Hon'ble Justice Sri **P. Ramakrishna Raju** Garu (సభాధ్యక్షులు)
(Retd. Judge A.P. High Court)

Hon'ble Justice Sri **B. Prakash Rao** Garu (గ్రంథావిష్కర్త) .
(Judge A.P. High Court)

Sri **S. Radha Krishna Murthy**
(Advocate) Author of this book

Sri **S. Rajanna** Garu
(Retd. District & Sessions Judge) (Secretary of the Temple)

మాతను తెచ్చెద- ప్రతినగ నెంచుము
ధైర్యము విడువకు- మహాత్ముడవు కద
దుఃఖించు టది తగదు రాఘవా!
వగపే మూలము గౌరవహానికి.

సతీ వియోగపు దుఃఖము నెరుగుదు
కోతి నయినను ధైర్యము నుంటిని
ముదిత కోసమై వగచుట ఏల
పండితుడవు నువు చేయుట ఇటులా?

ధైర్యముతో కన్నీటిని కట్టుము
పట్టు సడలని పౌరుషమందుము
దుఃఖమునందు- ధన నష్టమున
ప్రాణాపాయము- భయము నందున

బుద్ధిబలముతో ధీరుడు నిలచును-
శోకవశు డగు బుద్ధిహీనుడు-
బరువుతొ కృంగిన నావ, సంద్రమున
మునిగిన రీతిగ మునుగు దుఃఖమున.

ముకుళిత హస్తము లివిగను రామా!
నా స్నేహము నువు మన్నించుమయా!
ప్రార్థన నాది-శత్రుహరణ-నువు
ధైర్యము పూనుము పురుషపుంగవా!

నెయ్యముతో-నే హితము చెప్పితి
నీకు చెప్పగా నే చాలుదునా!''
అనుచు పలుకగా- రామచంద్రుడు
అశ్రుల నాపి పలికె ప్రియముగ

''గుండెల హత్తుకు- ప్రేమపంచి మరి
పలికెడి హితునిగ పలికితి వయ్యా!
ఆపదలంచు ధైర్యము గరపిన
ఉత్తమ హితునిగ వర్తించితివి.

అక్కరలో-నా ప్రక్కన నిలచిన
ఒక్కహితుడవు- బంధువు లెందుకు
నిక్కమయిన నీ కూరిమి పలుకుల
చక్కబడినది నా మనసెంతయొ.

సతిని వెదకుట- రక్కసు త్రుంచుట
వలయు యత్నము చేయుము నీవు
విత్తు జల్లుటకు అనువగు నేలగ
నా మదివున్నది- కార్యము తెలుపుము.

సూర్యనందనా! నా పలుకులవి
నిను మెప్పించగ పలుకగ లేదు
అసత్యమెరుగను- ఇక ముందాడను
శంకవదలుము- శపథము చేసితి.''

రాముని ప్రతిన- హితవాక్యములు
విని సుగ్రీవుడు అతని సచివులు
అమితానందము నందిరి అచట
కార్యసిద్ధి యని తలచె సుగ్రీవుడు.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# శ్రీమద్రామాయణ మకరందము

## బాల, అయోధ్యా, అరణ్యా, కిష్కింధా-సుందర యుద్ధకాండములు

(గేయకవిత)



## శ్రీ సీతారామచంద్ర పాదాంకితము

నా స్వామి రాముడు - నా మనోహరుడు
ఈస్వామి జగములను - కాపాడగలడంచు
మాసీత లీలగా - వామాంకమందున
ఆసీనురాలయ్యె - ఆశోభ కనువిందు

(భద్రాద్రిశోభ)

రాధాకృష్ణమూర్తి.

# వినాయక స్తుతి

ఏకదంతము శూర్పకర్ణము
చలువచూపుల చిన్నవాడా
పార్వతమ్మకు ముద్దుకొమరుడ
విఘ్నరాజా వందనమ్ము

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం
వందే వాల్మీకి కోకిలం

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందరకర్తకు వందనముంచి
రామభక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన చేసెద

తరణికులేశ నా నుడులదప్పులు గల్గిన నీదు నామ స
ద్విరచితమైన కావ్యము పవిత్రముగాదె వియన్న దీజలం
బరగుచు వంకయైన మలినాకృతి బాఱిన దన్మహత్వముం
దరమె గణింపనెవ్వరికి దాశరథీ కరుణాపయోనిధీ :

**– కంచర్ల గోపన్న గారు (రామదాసు)**



# అంకితం

ప్రక్కన మాత శోభతోనుండి
ఇరుప్రక్కలను సోదరులుండి
కన్నులముందర నమ్మినబంటు
కొలువగు రాఘవ - కొలుతును నిన్నే.

సుందరరామా నీ ఆదేశము
దశరథాత్మజా నీ ప్రేరణ యిది
నేనన్నది అసలేదీ లేదు
నాదన్నది నీ దయవున్నదని

నీ పాదములను హృదిలో నిలపి
కొలుతును భక్తుడు భరతుని రీతి
భక్తితో నీకీ పుష్పము నుంచితి
స్వీకరించి నను దరిజేర్చుమయా.



# ఫలశ్రుతి

రామాయణమున కాండములన్నీ
అమృతభాండము లందరి కందగ
కవికోకిల వాల్మీకి యిచ్చెను
పంచిరి ఎందరొ పుణ్యమూర్తులు.

వారందరికి వందనమనుచు
మారుతిరాముడు పలికించిన ఈ
రామకథను మీరందరు పాడగ
ఎందరొ వినగా కోరితి నెల్లర

మారుతి శుభముల నిచ్చి బ్రోచును
శోకములన్నీ తీర్చును వేగమె
ధనధాన్యములు పూర్ణాయువును
శ్రీరామచంద్రుడు పూర్తిగ నిడును.

మారుతి పదములు మదిలో నిలపి
లోకశాంతిని శుభముల నిడెడి
సుందరమూర్తికి వందనమనుచు
అందరు పాడుడు ఆనందముగ.

# ప్రశంసా పద్యత్రికము

శ్రీ మద్భూమిజ వామభాగమున సు
శ్రీ మీరి సౌమిత్రితో
సామీరి ప్లవగోత్తముండు గొలువన్ :
సాకేత నాథుండు : సు
క్షేమారోగ్య యశోవిభూతినిడి : సు
శ్రీ భోగ భాగ్య ప్రసా
దామోదమ్మున పొంద గోరెదను, రా
ధాకృష్ణమూర్తిన్ సదా:

సౌందర్య సౌశీల్య సౌభాగ్య సౌముఖ్య
ముఖ్య సద్గుణ గణాద్భుత సముద్ర :
మననింపుగనిపింప పెనుసొంపు నలరింప
మెయి కంపనమునింపు మెళుకువలును :
ఇహకర్మ బాపగా బహు ధర్మ సూక్ష్మముల్
వెలయించు ఘట్టముల్ కలిగి వెలసి :
కలనైన తలపింప నలవి గాకున్నట్టి
వెల లేని చిత్రముల్ పులకరించు.
నాదికవి మౌని వాల్మీకి ప్రోది పరచె
రామచంద్రుని గాథను రమ్యముగను
గేయ కవితగా రమ్యైక గీతములను,
కీర్తి గనెను, రాధాకృష్ణమూర్తి వ్రాసి.

కమనీయంబగు భావయుక్త పదముల్
కావ్యంబు నందెల్లడన్
రమణీయంబు గూర్చి పాడుకొనగా
రామాయణంబంతయున్
సుమ పూజా విధి జేసె నద్భుతముగా
శోభాస్కరంబయ్యె : భా
వమయస్ఫూర్తిని బొందె గేయ కవితా
వాల్మీకి పట్టంబిటన్.

బ్యాంకు కాలనీ,
హైదరాబాద్:-500 036. —మండపాక పార్వతీశ్వర శాస్త్రి

# కళాప్రపూర్ణుని ఆశీస్సులు

జీవితం భక్తి ముక్తి దాయకం అన్నారు పెద్దలు. భక్తి లేనిదే ముక్తి లేదు. ఆధ్యాత్మిక చింతనలో మునిగే ప్రతి జీవి, జీవిత సాగరాన్ని తరించడానికి ఒక నావ వెతుక్కుంటాడు. ఆ నావ తప్పక కైవల్య తీరానికి చేరుస్తుందని విశ్వసిస్తాడు. చీకటి గోళంలో మునిగి ఉన్న ప్రాణికి ముందుగా వెలుగు అందాలి. అది జీవితమంతా చిందాలి. ఆ వెలుగులో నుంచే చూడగలుగుతాడు దూర దూరానగల నావను. పరమాత్మను స్మరిస్తూ అటువైపు పరుగులు తీస్తాడు, నావలో జేరతాడు. కైవల్య తీరం వైపు నావ పయనిస్తుంది. జీవి పరవశిస్తాడు. చేతులెత్తి దైవాన్ని ప్రార్థిస్తాడు. ఐహికాలకు దూరంగా నడుస్తుంది నావ. ఆముష్మికపు గాలివీచి, పారలౌకికపు తెరచాపను జాపి పడవను వడివడిగా నడిపిస్తుంది. జీవి-దేవుని చేరే మార్గమిదే.

ఎక్కడిదీనావ? ఎవరు పంపిన నావ? ఈ నావ పయనించే త్రోవ, కైవల్యానికి ఎలా చేరుతుంది? ఇవన్నీ ఈ చిన్ని మనస్సుకు సమాధానాలు అందని ప్రశ్నలు. భక్తి పారవశ్యంలో బ్రతుకును ముందుకు నెట్టుకొంటూ పయనించేవారికి అవగత మవుతుందేమో ఈ రహస్యం. అవును అవుతుంది. నామస్మరణతో ఈ నావను దర్శించవచ్చు. ఈ నామము ఒక్కటేగాదు, ఎన్నెన్నో నామాలు. అందులో ఉత్కృష్ట మైనది రామనామము. ఏనాటినుండో ఎందరెందరో జపించి తపించిన నామము. వాల్మీకి ప్రవచించిన నామము. ప్రస్తుతించిన నామము. నరులకు సొత్తుగా అందించిన నామము. వాల్మీకి నుంచి నేటి వరకూ ఎందరెందరో రామనామం ఆలపించారు.

వాల్మీకి వారసుడు త్యాగయ్య. మరియొక వారసుడు పోతన. ఇలా ఎందరెందరో రామకవిత పేరిట రసవాహినిని, మానవ జీవితపు మాగాణులలో, వాహినిగా ప్రవహింపచేస్తున్నారు. ఇంకిపోని వాహిని ఇది. పంకిలములను క్షాళన చేసే నామం ఇది. గుండెలలో పీయూషం కురిపించే నామము ఇది. బ్రహ్మాండము నిండిన రామనామము ఇది. భక్తుల బ్రతుకులు పండించిన రామనామము ఇది.

రామకథ ఎందరి హృదయాలలోనో కదిలి, మెదిలి, ఘంటాలద్వారా, కలాలద్వారా, అక్షర రూపంగా సాక్షాత్కరించి శాశ్వతత్వాన్ని సంతరించుకొన్నది. ఈ శక్తిని చాలా మందికి రాముడే అందిస్తాడు. ఎందరెందరి చేతనో తన చరిత్ర వ్రాయించుకోవడం ఆయనకు ఉబలాటం. అదే రచయితలకు జీవిత సాఫల్యాన్ని అందిస్తుంది. రామాయణం యుగ యుగాలుగా వడలిపోని, వాసన వీడని పారిజాతము.

చిరంజీవి "**రామదర్శన ప్రభాసి**" **శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి** కనబడని రామభక్తుడు. ఆయనవంక చూస్తే కనిపించేది, అకలంకోజ్వల దివ్యమూర్తి శ్రీరామచంద్రమూర్తి. రాధాకృష్ణమూర్తిగారు తొలుతగా **'సుందరకాండ'** గేయరూపంలో వ్రాశారు. దానిని శ్రీపతానేని రామచంద్రరావు ప్రభృతులు అనేక తావులలో గానం చేసి విశేష ప్రచారం గావించారు. ఇప్పుడు **'బాలకాండ'** వెలుగులోకి వచ్చినది. దీనిని భక్తకోటికి సమర్పించే భాగ్యం భాషా కుటీరానికి లభించినందులకు నేనెంతో సంతోషిస్తున్నాను. రాధాకృష్ణమూర్తిగారు తక్కిన కాండలను త్వరలో రచించి, ముద్రించి, శ్రీరామునికి అందించి, తరిస్తారని భావిస్తున్నాను. నా పక్షాన గూడా వారిని దీవించమని శ్రీరామచంద్రుని ప్రార్థిస్తున్నాను.

**కళాప్రపూర్ణ డా॥ రావూరు వెంకట సత్యనారాయణరావు**

అధ్యక్షులు

భాషా కుటీరం, హైదరాబాదు.

(కళా ప్రపూర్ణులు 1980లో అనుగ్రహించిన ఆశీస్సుల బలంవల్ల శ్రీమద్రామాయణ మకరందం పేరిట బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలు 9 సంవత్సరాల కాలంలో గేయకవితగా వ్రాసే భాగ్యం కలిగింది

**– రాధాకృష్ణమూర్తి)**



**డా॥ Er. చండిక సాంబశివరాజు, Ph.D.**

B.E.(Hons) M.Tech. M.B.A., L.L.B.
M.S.E. (Lond), A.M. Ex. A (Eng)

కృష్ణాతరంగిణి చల్లగా పాడింది
అల్ల, అరశేపల్లి ఉల్లమే పొంగింది
ఆనందనందనం కమలాంబ తల్లిదే
ఈ నందివర్ధనం శ్రీ సుబ్బరాజుదే.

నిండైన విగ్రహం భక్తిపై నిగ్రహం
మనసెంతొ స్వచ్ఛము నెయ్యంపు గుచ్ఛము
విద్య, వినయములందు ఎన్నికైనవాడు
ఆ ఉషారాణినే ఎన్నుకున్నవాడు.

శ్రీరామ సేవలో నేముందు అన్నాడు
ఈ పూవు విరియంగ నేనుందు నన్నాడు
నిండుగా నూరేళ్ళు చల్లగా వుండాలి
మారాజు– మనరాజు– ఈ సాంబశివరాజు.

– రాధాకృష్ణమూర్తి

# ఉదాత్త భక్తి

చండిక సాంబశివరాజు,

సం॥ 2000.

## సంపూర్ణ రామాయణం

భగవాన్ శ్రీ రామచంద్ర స్వామి, ఆంజనేయ స్వామి వారలు సూరంపూడి రాధాకృష్ణమూర్తి గారిని ప్రేరేపించి వ్రాయించిన తెలుగు గేయ కవిత ''**సంపూర్ణ రామాయణం**'' విశేష ప్రజాదరణ పొంది మూడు పువ్వులు ఆరు కాయలుగ విరాజిల్లుట ఎంతో సంతోషదాయకం. మొదటగ, రామాయణంలోనే అతి సుందరమయిన ''**సుందరకాండను**'' 1978 లో రచించినారు. తదుపరి నేను- ఇతర భక్తుల ప్రోత్సాహంతో, సంవత్సరానికి ఒకటి చొప్పున మిగిలిన రామాయణ కాండలు రచించినారు. రచన అవగానే ప్రతి కాండను వెంట వెంటనే స్వామి వారు నాచే ముద్రింప చేసినారు. మరల అన్ని కాండలు అంటే సంపూర్ణ రామాయణం - ఒకే పుస్తకముగ 1986 లో ముద్రించితిని. ఈ పుస్తకము లన్నింటిని, ఉచితంగా భక్తులకు పంచి పెట్టినాము. మాధవసేవ మానవ సేవగా భావించి సంతోషించినాము. ఇప్పుడు ఈ ముద్రణ జరుగుట మిక్కిలి ఆనందదాయకం. స్వామివారి కృపా కటాక్షం.

ఇంతకు ముందు రాజులు రాజ్యమేలేవారు. అందుచేత, కవులు, తోటి కవుల మెప్పుదల, పారితోషికం వగైరా భావనతో- పండిత భాషలో రచనలు చేసేవారు. కొన్ని ప్రజలకు చేరువకాలేక, బీరువాలు, గ్రంథాలయాలకు మాత్రమే పరిమితమయి నిద్రావస్థలో ఉండినాయి. ఇప్పుడు రోజులు మారినాయి. రాజులు పోయి ప్రజాస్వామ్యం వచ్చింది. అంటే ప్రజల ఇష్టప్రకారం నడిచే ప్రభుత్వం కనుక ఈనాడు, ప్రజలందరికి అర్థమయ్యే ప్రజా భాషలో తేలిక పదాలతో కూడిన రచనలు కావాలి. ఈనాటి ప్రజాకోరికను రాధాకృష్ణమూర్తిగారు సంపూర్ణ రామాయణ గేయకవిత ద్వారా నెరవేర్చి, తెలుగు ప్రజకు, తెలుగు జాతికి, తెలుగు భాషకు మరువరాని సేవ చేశారు. అందుచేత ఈ రచన ఊహించని ప్రజాదరణ పొందింది. దీనికి నిదర్శనం, ఎందరో మహనీయులు, సహృదయుల ఆశీస్సులు, మెప్పుదల, మరియు ఎందరో భక్తుల గానం, శ్రవణం, ఆస్వాదన.

కవితను చదివి, విని ఆనందించి, ఆశీస్సులు అందించిన, మహనీయులు,

– **శ్రీశ్రీశ్రీ అవధూత బోధానందేంద్ర సరస్వతీస్వామి వారు**

– **శ్రీ వడ్లమాని సోమసుందరంగారు**

– **కళాప్రపూర్ణ శ్రీరావూరు సత్యనారాయణరావుగారు**

– **అవధాన సహస్రఫణి, డా॥ మాడుగుల నాగఫణిశర్మగారు**

– **శ్రీ కుందుర్తి వెంకటనరసయ్యగారు (శ్రీరామశరణ్‌గారు)**

– **మరెందరో – వారందరికి నా వందనాలు**

## 2. గానం చేసిన భక్తులు :-

శాస్త్రీయ సంగీతంలో లలిత సంగీతంలో జానపద పాటగా, హరికథ, బుర్రకథ, పురాణ ప్రవచనంగా, భజనగా, ఎన్నో విధాలుగా ఎవరు తోచిన రీతిని వారు గానం చేశారు, చదివారు, అనేక ప్రదేశాల్లో రామ సేవ చేశారు/చేస్తున్నారు. అట్టివారిలో కొద్దిమంది :

శ్రీయుతులు : పరానేని రామచంద్రరావు,

'' సూరంపూడి రాధాకృష్ణమూర్తి, (రచయిత)

'' రాణి కామేశ్వరరావు,

'' పేరి సుబ్బారావు,

'' చిలుకూరి భీమ శంకరరావు,

'' శ్రీధర వెంకటరమణ, (అడ్వకేట్)

'' పట్టాభి (బుర్రకథ ఆర్టిస్ట్) (టెలిఫోన్ డిపార్ట్‌మెంట్)

'' హనుమంతరావు (ఇ.సి.ఐ.ఎల్.)(హనుమద్దాసు)

'' మంత్రిప్రగడ సత్యనారాయణ,

'' మంచికంటి కృష్ణమూర్తి

'' కళ్లె సుబ్రహ్మణ్య శాస్త్రి,

'' రాచకొండ సత్యనారాయణ (వృత్తి : క్షురకులు) సిద్దిపేట

'' పొన్నపల్లి రామస్వామి

'' దాసు త్రివిక్రమ నారాయణరావు

''   ఉప్పులూరి హనుమంతరావు

''   చివుకుల సత్యానారాయణమూర్తి

''   పండితారాధ్యుల సత్యానారాయణ

''   ఈమని శ్రీరామశర్మ

శ్రీమతులు :  చల్లూరి అన్నపూర్ణమ్మగారు, (స్వయంగా గానంచేసి క్యాసెట్లుచేసి అనేక దేవాలయాలకు, భక్తులకు ఉచితంగా అందించారు)

''   సూరంపూడి శ్రీదేవిగారు

''   మండపాక ఉమాదేవిగారు

''   చల్లా రామమ్మగారు

''   నాగమణిగారు

''   బొడ్డుపాటి ఉమాబాలగారు

''   రామాయణం సరోజమ్మగారు

''   కాశీ విజయలక్ష్మిగారు.. మొదలగువారు

**3. చదివి, విని, ఆనందించి, తరించి, శుభములు పొందిన–భక్తులు**

లెక్కకుమించి దేశమంతటా, అన్ని గ్రామాలలో ఉన్నారంటె అతిశయోక్తికాదు.

ఈ విధంగ గత 20 సం॥లు విశేష ఆదరణ పొంది, అనేక మందికి శుభములు, స్వామివారి ఆశీస్సులు లభించినాయి. ఇలా మా కోరిక నెరవేరింది. స్వామివారి సేవ సఫలమయింది. సంతోషం పొందుచున్నాను. ఇకముందుకూడ, ఇంకా ఇంకా సంతోషాలు పొందాలని, ఆశిస్తూ.... శలవు.

రామాయణము – ఇది పుణ్య చరితము
శుభముల రాశి – ముక్తి దాయిని
మారుతి బ్రోచును – శుభములు ఆశీస్సులతో
సర్వేజనా – స్సుఖినో భవన్తు.

హైదరాబాదు–36
16-2-674, మలక్‌పేట.

భవదీయుడు
***చండిక సాంబశివరాజు***

# రామ సేవ - ఇలా జరిగింది - జరుగుతోంది

శ్రీరామసేవ 1978లో ప్రారంభమైంది. సుందరకాండ పాడుకోడాన్కి అందరికీ అనుమతి ప్రత్యేకంగా యివ్వనక్కర లేకుండా వ్రాయాలని ప్రేరణ కలిగింది. ''**అందరు పాడుడు ఆనందముగా**'' అని మకుటంతో ప్రారంభించాను. అంతవరకే నా ప్రయత్నం ఆ తరువాత ఈ 22 సంవత్సరాలు రామసేవ జరుగుతోంది. ఆరుకాండలు వ్రాశాను-ముద్రణ కోసం ఎవ్వరినీ అడిగే శ్రమ నా కివ్వకుండా-శ్రీరాముడు-సార్వభౌముడు వారికి ప్రేరణ కలిగించి-వారినే ముందుకు పంపాడు. వారిలో ప్రథముడు **శ్రీచండిక సాంబశివరాజుగారు** ఇపుడు రిటైర్డ్ సూపరెంటెండింగ్ ఇంజనీరు, పంచాయితిరాజ్. బాల, సుందర, అరణ్య, కిష్కింధలు వ్రాశాను. ప్రతిచోట స్వామి వ్రాయించాడు అని చెప్పినట్టే **శ్రీరాజుగారు** ముద్రించారు. పుస్తకాలు అమ్ముదాం అన్న ఆలోచన మా యిద్దరికీ లేదు. అందువల్ల ఎందరికో అందించాం. ఎందరో గానం చేసుకుంటున్నారు.

అయోధ్య, యుద్ధకాండలు వ్రాయలేను శక్తిలేదు. అయినా **కల్పవృక్షకవి-కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథవారు** అన్నట్టు ''**మరల యిదేల రామాయణంబన్న**'' అన్న ఆలోచన - ఆపైననాకు శక్తి చాలదు అన్న నిర్ణయం. కానీ రాజుగారు వదలిపెట్టలేదు. ఆ సందర్భంలో - కళాప్రపూర్ణ **శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావుగారు** - వారు నన్నెంతో అభిమానించేవారు. నన్ను పిలిచి రామాయణంలో అందాలు వివరించేవారు. రావయ్యా! రాధాకృష్ణా! నువ్వువస్తే రాముడు వస్తాడు అనేవారు. అది నా పురాకృత పుణ్యం, అంతటివారి నోటిద్వారా, అందమైన రామాయణ ముచ్చట్లు వినటం.- కాసేపు నేను వ్రాసినది వినిపించమనేవారు - ఉదాహరణకు చిన్న ముచ్చట వారు చెప్పింది- అరణ్యవాసంలో జటాయువుకు శ్రీరామునికి స్నేహం ఏర్పడింది. పూర్వపరిచయం చెప్పాడు జటాయువు- శ్రీరామ వనవాసంలో తోడుగా వుండి - సీతమ్మ రక్షణ చేస్తుంటాను అని కూడా చెప్పాడు. వాల్మీకంలోవుంది మన అందరికీ తెలుసు- ఆపైన సీతాపహరణప్పుడు, యతి వేషంలో దశకంఠుడు వచ్చినప్పుడు రక్షణ చేసే జటాయువు ఏమయింది అని ఆయన ప్రశ్నవేసి-చక్కని సమాధానం చెప్పారు. రామహృదయం వున్న మహామనీషి **శ్రీరావూరు.**

అన్న సంపాతి, జటాయువును సూర్యకిరణాల బారినుండి రక్షించాడు. సంపాతి రెక్కలు కాలిపోయి ఒక పర్వతంమీద పడ్డాడు (కిష్కింధా కాండము) జటాయువు - సుఖంగా వున్నాడు. అన్నగారిని మర్చిపోయాడు. ప్రాణదానం అన్నచేశాడు - అయినా మర్చిపోయాడు. జటాయువుకు, అన్నసేవలో పరమార్థం ఇప్పుడు తెలిసింది. ఎలా- లక్ష్మణుడు, అన్న సేవలు చేస్తున్నాడు. అంతే హృదయం ద్రవించింది. అన్న అన్వేషణలో శ్రీరాముని అనుమతితో బయలుదేరాడు. ఆ సమయంలో అసురుడు వచ్చాడు. తిరిగి వస్తూన్న సమయంలో రావణుని ఎదిరించాడు జటాయువు - అదీ వరస- ఎంతబాగుంది. ఆయన పాదాలు స్పృశించి పరవశించాను. ''రామదర్శన ప్రభాసి'' అనే సత్కారం వారి భాషాకుటీరం ద్వారా చేశారు.

వారు పదేపదే నాతో అనేవారు- రామాయణం గేయంగా వ్రాయటం జన్మకి సార్థకత - ఆ పని నీవు చేస్తావు - రాముడు చేయిస్తాడు అని ఆశీర్వదించేవారు. **శ్రీకుందుర్తి వెంకట నరసయ్యగారు** (శ్రీరామశరణ్ గారు) వారిచేత ఆశీస్సులు యిప్పించారు. ఏమిటి ఆయనకు అంతశ్రద్ధ- అంటే ఆయన అన్నారు. శ్రీరాముడికి సరదా- ఆయన కథ, అనేక విధాలు, అనేక మందితో- అందులో పాండిత్యం లేనివారితో కూడా వ్రాయించుకోటం- అదీ కథ- అనేవారు నవ్వుతూ- ఆయన ఆశీర్వాదబలం- శ్రీరాజుగారి సంకల్ప బలం- యింకా ఎందరో శ్రీరామ భక్తులు ఆశీర్వచన బలంతో ఆరెండు కాండలూ పూర్తయినాయి. అప్పుడు శ్రీరాజుగారు ఒకే ఒక పుస్తకంగా వేద్దాం అన్నారు. ఆ రోజుల్లో అరవైవేలు అవుతుంది. అప్పటికి శ్రీరాజుగారు నాల్గుకాండలు ముద్రించినారు. అవ్వి వినియోగించాం భక్తులకు. ఆసమయములో వారికి ఉద్యోగంలో అడ్డువచ్చింది. సర్వీసు మధ్యలో ఆగిపోయింది. నాకు తెలియదు. ఆయన ఆసమయములో కూడా అరణ్యకాండ అచ్చువేయించారు. ఏమీ తొణుకు, బెణుకులు ముఖంలో కనబడలేదు- ఆతరువాత విషయంతెలిసి నేను చలించిపోయాను. అడిగాను విషయం. వారు వివరంగా చెప్పి నా కేసు మీరు చెయ్యాలి- మీ ఫీజు ఎంత అన్నారు. నేను చేయాలని అనుకుంటే అది రామ సేవగా చేస్తాను. ఫీజు నాకు వద్దు అన్నాను. అది ఒప్పందం. శ్రీరామనుగ్రహంవల్ల న్యాయమైన ఆయన కేసు ఉన్నత న్యాయస్థానం (సుప్రీంకోర్టు) వరకు కూడా వెళ్ళి విజయం

లభించింది. ఆయన తిరిగి ఉద్యోగంలో చేరి, బకాయి జీతాలలోంచి ముద్రణకు అర్వైవేలు యిస్తానన్నారు. నేను వద్దన్నాను. కొంత యివ్వండి. అంతాయిస్తే మీ కుటుంబ సభ్యులకు ఆ-ఆవేశం నచ్చకపోవచ్చు అన్నాను. ఈ వాదనతో కొన్నాళ్ళు ముద్రణ చేయించలేదు. ఆ తర్వాత ఒకరోజు ఆయన ఇర్వై వేలు తీసుకు వచ్చి రామద్రవ్యం- నాకు నిద్దర పట్టటంలేదు ప్రారంభించండి కార్యక్రమం. మిగిలింది పదిరోజుల్లో యిస్తానన్నారు. నేను బాధ పడకుండా మనస్ఫూర్తిగా యిస్తున్నాను. కాబట్టి గ్రంధ ప్రయోజనం నెరవేరుతుంది అన్న పెద్దమనస్సు. ఆయన స్థితప్రజ్ఞుడు ఆయనకు తోడు మరొక రామ భక్తులు **శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు.** మరి వ్రాసే సమయములో ఎందరు రామ భక్తులు వచ్చి నన్ను ప్రేరేపించారో వ్రాస్తే చాలా అవుతుంది. **శ్రీశ్రీశ్రీ అవధూత బోధానందేంద్ర సరస్వతీస్వామి వారు** స్వయంగా సుందరకాండ చదివి, వారి భక్తులకు వినిపించి, నాకు తెలియపరచారు. వారే మా యింటికి వచ్చి సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తి- రామయణంలో అన్ని కాండలూ నువ్వు వ్రాయాలి- అంటూ ఆశీర్వదించి అక్షింతలు యిచ్చివెళ్ళారు. ఒక ఎనభై ఏళ్ళ వృద్ధుడు సుందరకాండ విని, మా యిల్లు వెతుక్కుంటూ వచ్చి, నాకు పాదాభివందనం చేశాడు. ఆశ్చర్యచకితుడనైనాను. ఆయన నన్ను అభినందించి ఒక పాత బాల్‌పెన్ను బహుకరించి వెళ్ళాడు. అప్పుడు యుద్ధకాండ మధ్యలో వున్నా. ఆబహుమానం బ్రహ్మాస్త్రం అనుకొన్నా. పూర్తిచేసే ధైర్యం వచ్చింది. ఆపెన్నుతో సరిపోయిందా ఎన్ని రిఫీల్స్ వేశానో- కానీ అల్లాంటివి ఎన్నో- ఇదంతా స్వోత్కర్ష కాదు. రామాయణ రహస్యాలు చెప్పడాన్కి నేను సరిపోను. సూర్యుణ్ణి వెలుగులో చూపించనక్కరలేదు. రామాయణం- ఎల్లా వ్రాయించుకుంటాడు, రావాలయం ఎల్లా నిర్మించుకుంటాడు- ఎవర్ని ఎంచుకుంటాడు, ఎవరి పాత్ర ఎంత వుంటుంది అని నిర్ణయించేవాడు శ్రీరాముడే- మనందరికీ తెలుసు ఆ విషయం.

ఈసారి పునర్ముద్రణ నావల్లకాదు అని నిర్ణయించుకున్నాను. ఎందరో పుస్తకాలు అడుగుతున్నారు. జీవితంలో మరో ముద్రణ పెద్దగ్రంథం వేస్తే బాగుంటుంది అనివుంది. బోలెడుడబ్బు అవుతుంది. ఆప్రయత్నం ఆపేశాను. ఈలోగా భాగవతం వ్రాయాలన్న ఆదేశం- ఆవేశం- దశమస్కంధం వ్రాశాను. పూర్తిచేయమని, ముద్రిస్తానని శ్రీరాజుగారు వచ్చారు. ఆ పనిలో వున్నాను.

మరి రామయణ ముద్రణ ఎలా- **శ్రీచల్లూరి శ్రీనివాసరెడ్డిగారు,** హరిహరక్షేత్ర ఆలయనిర్మాత-ఫోన్‌లోనే యిర్వైవేలు యిస్తాను అని ప్రోత్సహించారు. రామనామంతో పొంగిన హనుమంతునిలా మనసు గెంతింది. వెంటనే **శ్రీపొరుపల్లి అంజిరెడ్డిగారు,** ప్రధాన కార్యదర్శి, హైదరాబాద్, రంగారెడ్డి జిల్లా, రైస్ మిల్లర్స్ అసోసియేషన్‌వారు నన్ను అభిమానించి గౌరవిస్తారు.- మిగతాది మేం అందిస్తాం శ్రీరామసేవకు కదలండి అన్నారు. ఎంతో విశేషం-ఇవన్నీ వ్రాయటం ఎందుకంటే శ్రీరామసేవలో ఎందరో యోధులున్నారు. అని చెప్పటం- రామభక్తి శాశ్వతం అని చెప్పటం- కొన్ని ఉడతలు కూడా వుంటాయి వాటిసేవ వ్రాయాలంటే చాలా విస్తారం అవుతుంది అటువంటి భక్తులు ఎందరో వున్నారు. అందరి పేర్లు వ్రాయాలంటే పదిపేజీలు అవసరంఅవుతాయి.

రామో విగ్రహవాన్ ధర్మః- అందువల్ల ఉన్నత న్యాయస్థానంలో, హైకోర్టులో ఉన్నత స్థానం అధిష్టించిన గౌ॥ ప్రధాన న్యాయమూర్తిగారు ఆవిష్కరించాలి అని నా కోరిక. అడిగిన వెంటనే అప్పటి ప్రధాన న్యాయమూర్తి గౌ॥ **శ్రీ చల్లా కొండయ్యగారు** సుందరకాండ ఆవిష్కరించారు. (19-6-79) బాలకాండ అప్పటి ప్రధాన న్యాయమూర్తి గౌ॥ **శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు** ఆవిష్కరించారు. (21-11-80) అరణ్యకాండ అప్పటి ప్రధాన న్యాయమూర్తి **గౌ॥ శ్రీ మాధవరెడ్డిగారు** ఆవిష్కరించారు. (22-10-82) **శ్రీ మాధవరెడ్డిగారు** నన్ను అడిగారు. తెలుగులో పాండిత్యం లేదుకదా నేను రానా అని. ఎంత పెద్ద మనస్సో ఆయనది. అందుకు నా సమాధానం- శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపం. మీరు మా రాష్ట్రానికి అంతటివారు. కావున మీరే తగుదురు అన్నాను. ఆయన ఎంతో ఆనందంగా పాల్గొన్నారు కార్యక్రమములో. అనుకున్నది ఆనందంగా చేయగలిగాను. ఈ రామాయణ వ్యయ సాయంలో .

జీవితానికి- జీవధనము
జన్మకే పరమార్ధము.
బ్రతుకునిండా రామనామం
వ్రాసుకుంటే – పాడుకుంటే

నేనెవరో- నావృత్తి ఏమిటో- నా అర్హత ఏమిటో అన్నది ప్రధానంకాదు. రామసేవ చేస్తుంటే అదే ఆనందం. ఎందరో సీనియర్ న్యాయవాదులు అడిగి గ్రంథాలు తీసుకొని చదివి ఆనందించి- ఆశీర్వదించారు.

శ్రీ శంకరమఠంలో (నల్లకుంట) మా న్యాయవాద సోదరులు, మిత్రులు ఘన సన్మానం చేశారు. అందులో పాల్గొన్న సీనియర్ న్యాయవాదులు **శ్రీచల్లా పూర్ణయ్యగారు, శ్రీచల్లా సాంబిరెడ్డిగారు, శ్రీ బి.కె. భగవాన్‌గారు, శ్రీ పి.బాలకృష్ణమూర్తిగారు, శ్రీ వి. జోగయ్యశర్మగారు, శ్రీ ఎమ్.ఎస్.కె. శాస్త్రిగారు.** నాకు కలిగిన అనుభూతి పరంపర వ్రాయాలంటే అది అతిశయోక్తి అనిపిస్తుందని వ్రాయుటంలేదు. నిదర్శనం ఎన్నటికీ ప్రదర్శనం కారాదు. అది తియ్యగా హృదయంలో పదిల పరచుకొని- మద్యమధ్యలో జ్ఞాపకం చేసుకుంటూ అనుభూతి పొందాలి. మీ పాటకు జీవధనం- తెలుగుదనం- అని, నేను వ్రాసిన ఒక గేయంచూచి ఆచార్య, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత శ్రీ **సి.నారాయణరెడ్డిగారు** ప్రశంసించారు. చాలాకాలం క్రితం- శ్రీసుందరదాసు **యమ్. ఎస్. రామారావుగారు** మా యింటికి వచ్చి వారి గ్రంథాలు నాకిచ్చి నా గ్రంథం గ్రహించి నన్నెంతో ప్రోత్సహించారు. ప్రముఖ హరికథకులు శ్రీయుతులు **ములుకుట్ల సదాశివశాస్త్రిగారు** మా యింటికి వచ్చి నన్ను ఆశీర్వదించారు. శ్రీ రావూరు అనేవారు మీ యిల్లు అయోధ్య అని- అల్లాగే ఎందరో రామభక్తులు వారి పాద ధూళితో మాగృహం పావనం చేశారు. ధన్యత కలిగించారు.

గ్రంథం నిర్గంధకుసుమంలా కాకుండా ఎందరో గానంచేస్తూ పరవశిస్తున్నారు. ప్రయోజనం సిద్ధించిందని మా అందరికి ఆనందం.

**నా స్వామి రాముడు – నామనోహరుడు**
**ఈ స్వామి జగములను – కాపాడగలడంచు**
**మా సీత లీలగా – వామాంకమందున**
**ఆసీను రాలయ్యె–అశోభ కనువిందు.**

భద్రాచలం స్వామి సన్నిధిలో కలిగిన ఆనందంలో పూసిన పూవు. ఇన్నేళ్ళ అవిశ్రాంత రామసేవకి ఆయన కరుణించి, అమ్మతో ఆలయంలో కలిగించిన అనుభూతి చాలు. అంతకన్ననేను కోరుకున్నది ఏమీలేదు. నీపాదములను హృదిలో నుంచుకు కొలుతును భక్తుడు- భరతునిరీతి- అని అంకిత భావం కలగటం. నేనన్నది అసలేదీలేదు నాదన్నది నీదయ వున్నదని నమ్మటం ఈ రామ యజ్ఞానికి ప్రధానం.

డబ్బుకోసం గ్రంథం అమ్ముదాం అని ఆలోచనవస్తే శ్రీరాముడు వ్రాయించడు. అది నిజం. మళ్ళీ ముద్రించాలనుకుంటే ఎవరో రామభక్తులు వస్తారు అని నా పూర్తివిశ్వాసం.

ఈగ్రంథం అతి విలువైనది- చిన్న పిల్లలుకూడ చదివిస్తే, చదివి ఆనందిస్తారు. చదివి, విని- లోపాలు వెదకటం కన్న భక్తి ఆవేశం ఎంత పనైనా చేయిస్తుంది అని నమ్మటం నన్ను ఆశీర్వదించటం.

సర్వేజనాస్సుఖినోభవన్తు

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు

బుధజన విధేయుడు

**సూరంపూడి రాధాకృష్ణమూర్తి**

దిల్‌సుక్‌నగర్,

(హైదరాబాద్)

# సుందర నక్షత్రమాల

## సుందరకాండ పరంగా నక్షత్రాల స్తుతి

శ్రీ హనుమంతుడు కేసరి సుతుడు
పవన తనయుడు పావన చరితుడు
రామనామమున పులకరించుచు
**అశ్వని** సురలను పలుకరించునటు

**భరణి** ఆగదు నా తాకిడికని
మహేంద్రగిరి! మరి అనువుగ నుండును
అనుచు పలుకుచు గిరిపై కెగిరెను
కాయము పెంచెను గిరి అనిపించెను

**కృత్తి**కలచె మరి పెంచగబడిన
కార్తికేయుని పరాక్రమమ్ము
ఖగపతి యంతటి గమనవేగము
కలదని తలచెను వాతాత్మజుడు

''చంద్రుని వీడని **రోహిణి** తీరుగ
సూర్యుని వదలని ఛాయరీతిగా
రామచంద్రుని అడుగుల నడచి
అడవికి వచ్చెను అతిసుకుమారి

**మృగశిరములను** తృంచునట్టుగా
అసురుల శిరములు కపులు తృంచగా
జయము జయము శ్రీరాముని కనుచు
సుగ్రీవునికి జయము పలికెదము

అభిమానముతో అందరి మనసులు
**ఆర్ద్రమైనవి** హనుమను చూడగ-
అందరొక్కటై ఆశీస్సులనిడి
అమ్మకు వందనమనుచు పలికిరి

రాముడు పుట్టినతార **పునర్వసు**
పుణ్యతారయై గణుతికెక్కెను
వెలిగే తారకు వెలుగు నింపిన
పుణ్యమూర్తి శ్రీరామచంద్రుడు

**పుష్యమి** తారలో పూర్ణశశివలె
రాముని వదనము కళకళలాడగ
జన్మనెత్తిన ఫలముదక్కును
రామసేవకే తను వంకితమనె''

**ఆశ్లేషముతో** అంగదుడపుడు
ఆంజనేయుని ఆప్యాయముగా
గుండెకు చేర్చుకు పులకరించెను
ఆనందముతో పొంగెను హనుమ

''దశరథ రాజు సంతతి కోరి
చేసిన **మఖముల** ఫలితము రాముడు
హరువిలు విరచిన అరి భయంకరుడు
అండగ నిలచెను మన కపిరాజుకు

విషభక్ష్యముతో కడుపుబ్బగను
అసువులువీడి అంతమైనటు
అబలహర్త ఆ దశకంధరుడు
ఆగడింక శ్రీరామబాణమున''

**ఉత్తరక్షణమే** బయలుదేరి అట
రావణుపాలిత లంకలోనున్న
అమ్మను వెదుకగ ఆంజనేయుడు
అపారజలధిని దాటగసాగెను

ఐదుతలలు గల పన్నగమ్ములన
**హస్తము**లపుడు అగబడుచుండగ
బాహు మూలముల చేరిన గాలి
హోరుమనుచును ధ్వని చేసినది

**చిత్త**మంతయు రామాంకితమై
మైనాకునికి ముదమును గొలిపి
సురసదీవన వరముగనెంచి
సింహికనంతము చేసి సాగెను

**స్వాతి** చినుకులకు ఎదురుచూసెడి
ముత్తెపు చిప్పల తీరుగమేము
ఒంటికాలిపై నిలబడియుందుము
అనుచు పలికెను జాంబవంతుడు

**విశాఖలున్న** భూరి తరువన
సూటిగసాగే రామబాణమన
విజయరాముని మదిలో నిలపి
సాగెను పావని–భూమిజ కొరకై

''తారల మాలలో కొలికిపూసగా
**అనూరాధ** తా వెలుగుచుండగా
రామానుగ్రహమందిన! తనకు
గ్రహములు తారలు సహకరించుననె''

దశరథ విభుని **జ్యేష్ఠ** కుమారుడు
రామభద్రుడు–కరుణించనిదే
కార్యము తీరదు–అని మదినెంచి
అమ్మను చూడక బ్రతుకననుకొనె

**మూలమూ**లలా వెదకిన మారుతి
అమ్మనుగానక పట్టువదలక
వెదకుచుండగా రాముని కృపతో
అశోకవనమున అమ్మ కనబడె

**పూర్వోత్తరాషాఢ** నక్షత్రంబులు
దీవనలిచ్చి శుభము పలికినటు
శుభములరాసి సుందరిసీత
కన్నులనిండుగ కనబడె హనుమకు

తరువునుండి తను రామగానము
అమ్మకు మాత్రము శ్రవణంబగునటు
వినిచి రాముడు గుర్తుగనిడిన
అంగుళీయకము అందజేసెను

సీతానాథనిష్టను అపుడు
మృదుమధురముగా తెలియబరచెను
అగ్నిపర్వతము తీరుగ రాముడు
ఉన్నాడమ్మా- అనుచు నుడివెను

శతభిషతారగ వెలిగెడినగను
చూడామణిని హనుమగ్రహించి
ఆనందముతో శతతారలవలె
రామభద్రునికి- సమర్పించెను

'పూర్వోత్తరాభాద్ర- తారలు కలసి
కపికుంజరునికి జయముకోరగా
గ్రహములన్నియు ఒదిగియుండగా
ఎదురే లేదిక మారుతి కనిరి.

లక్ష్మీనారాయణులిద్దరు ముదమున
ఉమాశంకరులు పుణ్యదంపతులు
రేవతి బలరాములతో కూడి
చల్లగజూతురు - సర్వజగత్తును

ఆరోగ్యంబును ప్రసాదించుచు
ఆయుర్భాగ్యము నిండుగ పెంచే
మంగళకరమగు తారలమాల
మదిలో త్రిప్పుడు రాముని తలచి.

... శుభం ...

❋ ❋ ❋



# హనుమాన్ చాలీసా

## (మూలం గోస్వామి తులసీదాస్)

### ప్రార్థన

అసమాన బలా అంజనిపుత్రా
మేరునగము నీవజ్ర శరీరము
అసురులపాలిటి కాలుడ వీవు
అగ్రగామివి జ్ఞానము నందు.

సద్గుణ ఖని ఓ భక్తులధనమా!
హనుమా వానరశ్రేష్ఠుడ వినుమా
నిలుమా నాహృది అనిలకుమారా
రాముని ప్రియతమ భక్తుడ రావా.

గోష్పదమును గావించు తీరున
వారిధి దాటిన దైత్యమర్దనా
రామాయణమను సుందరమాలకు
అందములొలికే కొలికి పూసవు

ముకుళిత కరములు వంచిన శిరసు
కన్నుల నిండుగ ప్రభువు రూపుతో
ముందర ఉందువు - రాముని కీర్తన
ఎందు చేసినా మరి సందియమా?

నీ చరణ కమలముల దివ్యరజముతో
మది పవిత్రముగ చేసి నిలచితి
బలమును బుద్ధిని విద్యా యశమును
మా కొసగుము ఓ కేసరి నందన.

జయహనుమంతా జ్ఞానసముద్రా
జయము నీకు ముల్లోకములందు
రామునిదూతా అతి బలాశాలీ
అంజనపుత్రా అనిలకుమారా!

మంచిని పెంచి చెడునే త్రుంచే
వజ్రశరీరా విక్రమధీరా
స్వర్ణవర్ణము చెవి కుండలములు
చక్కనివేషము సుందరజటివి.

||జయ||

వజ్రకరమున ధ్వజము వెలయగ
మేనున సొగసుగ మౌంజియు నమరగ
శివాంశజాతా కేసరితనయా
జగముల వందన మందెడి తేజము.

విద్యాఖని - ఓ సుగుణ చతురుడా
రామకార్యమును, తీర్చగ ఆతృత
సీతారాములు - సుమిత్ర పుత్రుని
సతతము మదిలో నిలిపి స్తుతింతువు.

||జయ||

చిరురూపముతో సీతకు కనబడి
గురురూపముతో లంక కాల్చితివి
భీకర రూపుతొ అసురుల త్రుంచి
రామకార్యమును తీర్చినవాడవు.

సంజీవినితో లక్ష్మణు కావగ
రాముని కౌగిటి భాగ్యము కలిగెను
ప్రభువు చేతనే ప్రశంసలంది
సోదర భరత సముడవైతివి ||జయ||

వేయి రీతుల రాముడు పొగడెను
లక్ష్మీపతి తన కౌగిటి నిడెను
సనకాదులు బ్రహ్మాదిమౌనులు
నారద శారద ఆదిశేషులు

కాలుడు కుబేర దిక్పాలకులు
కవులు పండితులు అందరు పొగడిరి
రాముని మైత్రి - రాజ్యభోగము
సుగ్రీవునికి కలిగించితివి. ||జయ||

నిన్ను నమ్మిన విభీషణాఖ్యుడు
లంకను ఏలుట జగమెరిగినదే
రెండువేల యోజనముల దూరము
ఎగిరి భానుని ఫలముగ గొనగా

ప్రభువు ముద్రికను నోటను దాచి
జలధి దాటగ అచ్చెరువేమది
జరగనివెన్నో నీదయ వున్న
జరుగును జగమున అతి సులువుగను

||జయ||

రాముని చేరెడి మార్గము నిడెదవు
నీ దయ లేక రాము డందడు
నిను శరణంటే సుఖములు కొదవా
రక్షకుడవు నువు - భయమస లెందుకు

నీ తేజము నువు భరించువాడవు
నీ గర్జనకే వణకు లోకములు
భూతప్రేత పిశాచ గణములు
నీ జయనామము విని హడలునుకద ||జయ||

ఆధి వ్యాధులు అన్ని పీడలు
తొలగును-నిరతము నిన్ను తలంచిన
మనసున-మాటల- ధ్యానమునందు
నిన్నే నమ్మిన సంకటహరణము

ఎన్నిక రాజు-మునులకు ఏలిక
రామచంద్రునికి నమ్మినబంటువు
అన్ని అభీష్టము లింపుగ తీరును
సొంపుగ నీ గుణ గానము జేసిన ||జయ||

నాలుగు యుగముల నీ ప్రతాపము
నిలచును నిరతము జయహనుమంతా
సతతము సాధుల రక్షణ చేతువు
రామదూత ఓ-రాక్షసహరణా!

అష్టసిద్ధులకు నవనిధులకును
దాతవు నీవు-మాతవరము కద
రామసుధా మధువన్నది నీదే
రాముని దాసుడ వంటే నీవే.

||జయ||

నిను తలంచుటది రాముని సేవ
జన్మజన్మలకు దుఃఖహరణము
శ్రీపతి భక్తులు ఎచట పుట్టినా
చేరుట చివరకు రామపాదములు

ఎవరు చదివినా స్వామి చాలీసా
సిద్ధికలుగు శివశక్తుల సాక్షిగ
తులసీదాసు-హరికేదాసు
స్వామీ నాహృది నీమందిరము ॥జయ॥

అన్యదైవముల తలచక నిన్నే
కొలచుట సౌఖ్యములన్నీ పొందుట
బలవిక్రమ సంపన్నుడవగు నిను
స్మరియించిన హరియించు పీడలు.॥జయ॥

హనుమ పాదములె మనకు శరణము
హనుమ స్మరణమె మనకు కరణము
హనుమ ధ్యానమే మనకు తరణము
హనుమ చింతనమె సంకట హరణము

జయహో-జయహో జయహనుమంతా!
కృప జూడుమయా ఓ గురుదేవా!
నూరుమార్లు మది పఠించినంతనె
బంధములన్నీ తొలగి సుఖమగు

మంగళమయ్యా మారుతపుత్రా!
మంగళమూర్తీ మంగళమిదిగో
సుందరమూర్తీ శుభ మంగళము
అందుకొనుమిదే నిత్యమంగళం.

ఆపదామపహర్తారం- ధాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం - భూయో భూయో నమామ్యహం.

# శ్రీహనుమంతుని ద్వాదశ నామములు

హనుమా నంజనా సూను : వాయుపుత్రో మహాబల :
రామేష్ట : ఫల్గుణసఖ : పింగాక్షో అమితవిక్రమ :
ఉదధిక్రమణశ్చైవ సీతాశోక వినాశక :
లక్ష్మణప్రాణ దాతాచ దశగ్రీవస్య దర్పహా
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మన :
స్వాపకాలే పఠేన్నిత్యం- యాత్రాకాలే విశేషత :
తస్యమృత్యుభయంనాస్తి- స్వర్వత్ర విజయీభవేత్.

## రామాయణ రత్నాలు :-

### సత్వరఫలితముల కొరకు శ్రీమద్రామాయణ మకరందము నందలి కొన్ని ఎంపిక చేసిన సర్గలు కాండముల వారీగా క్రింద పొందుపరిచడమైనది

## బాలకాండము

1. శీఘ్రముగా వివాహములు జరుగుటకు : సర్గ–73
   (శ్రీరామ– లక్ష్మణ– భరత– శత్రుఘ్నుల కల్యాణములు)
2. సంతాన ప్రాప్తికి : సర్గలు–15, 16
   (పుత్రకామేష్ఠి) (దివ్యపాయసము గ్రహించుట)
3. సుఖ ప్రసవమునకు : సర్గ– 18
   (శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల జననము)
4. సకలాభీష్ట కార్యసిద్ధికి : సర్గలు–75, 76
   (పరశురామ గర్వము– గర్వభంగము)

## అయోధ్యా కాండము

1. సంతానమునకు మనో వికాసము సద్బుద్ధి కొరకు : సర్గలు–1,మరియు 2
   (శ్రీరామునికి యువరాజ్య పట్టాభిషేకము చేయు, దశరథుని నిర్ణయము)
2. సౌఖ్యప్రాప్తికి : సర్గ– 115
   (పాదుకా పట్టాభిషేకము)
3. రాజద్వారమున సర్వ అనుకూల సిద్ధి కొరకు : సర్గ–100
   (శ్రీరాముడు భరతునికి చెప్పిన రాజనీతి)
4. పుష్కల ధనలాభముకై : సర్గ– 32
   (వన వాసమునకు వెళ్లుచూ సీతారాములు దాన ధర్మములు చేయుట)

## అరణ్యకాండము

1. మోక్షప్రాప్తి కొరకు : సర్గలు– 65–66–67 మరియు 68
సౌమిత్రి అనునయ వాక్కులు– జటాయు మోక్షము

## కిష్కింధాకాండము

1. సౌఖ్య ప్రాప్తికి : సర్గ– 26
(సుగ్రీవ పట్టాభిషేకము)

## సుందర కాండము :

1. భూత, పిశాచ బాధల నివృత్తికి : సర్గ– 3
(లంకారాక్షసి పరాజయము)
2. చిత్త భ్రమతొలగుటకు : సర్గ– 13
(మారుతి పరితాపము)
3. దారిద్ర్య నివృత్తికి : సర్గలు– 14 మరియు 15
(సీతా సందర్శనము)
4. హితులు సుఖముగా గమ్యము చేరుటకు : సర్గ– 36
(అంగుళీయక ప్రదానము)
5. దుస్స్వప్నదోషనివారణకు : సర్గ– 27
(త్రిజట స్వప్నము)
6. మనోధైర్యమునకు : సర్గ– 37
(సీతారాములను కలుపుటకై హనుమ ఆత్రుత)
7. మనశ్శాంతికి : సర్గ– 38
(చూడామణి ప్రదానము)

# యుద్ధకాండము :

1. సకల సౌఖ్యప్రాప్తికి : సర్గ– 115 మరియు 131

   (విభీషణ పట్టాభిషేకము–శ్రీరామ పట్టాభిషేకము)

2. కారాగృహ భయనివృత్తికి : సర్గ– 117

   (సీతాదేవికి శ్రీరామ దర్శనము)

3. సర్వ జయకరమునకై : సర్గ– 91, 111 మరియు 120

   (లక్ష్మణస్వామి ఇంద్రజిత్తును వధించుట, రావణ వధ, బ్రహ్మకృత శ్రీరామ స్తోత్రం.

4. పరిపూర్ణ ఆరోగ్యము కొరకు : సర్గ– 107–

   (ఆదిత్య హృదయం)

5. సకల విధ రోగ శాంతికి : సర్గ–59

   (రావణుడు మొదటిసారి పోరుకువచ్చి పరాజితుడగుట)

6. ఆపదలు నివారించుటకై : సర్గలు– 18 మరియు 19

   (విభీషణ శరణాగతి, విభీషణునికి సంద్రతీరమున అభిషేకము.)

7. సకలదుఃఖ నివృత్తికై : సర్గ– 116.

   (శ్రీరాముని విజయము హనుమంతుడు సీతాదేవికి తెలుపుట)



# శ్రీమద్రామాయణ మకరందంలోని
# మాణిక్యమకుటాలు

## 1. బాలకాండము

శ్రీ రఘురాముని రమ్యచరితము
మునితిలకుడు మనకొసగిన మంత్రము
రామచంద్రు డుదయించి జానకిని
పరిణయమాడుట బాలకాండము

## 2. అయోధ్యాకాండము :

శ్రీ రఘురాముడు వనముల కేగుట
సత్యవర్తిగా తండ్రిని నిలపుట
రామపాదుకలు రాజ్యమేలుట
రామాయణమున అయోధ్యాకాండము.

## 3. అరణ్యకాండము :

శ్రీ రఘురాముని– రమ్య చరితము
ముని జనములకు– అభయ ప్రధానము
సీతాపహరణము– రామునివేదన
జటాయుమోక్షము– అరణ్యకాండము

## 4. కిష్కింధాకాండము :

శ్రీరఘు రాముని రమ్యచరితము
మారుతి రాముని సందర్శనము
సీతాపతికై అన్వేషణము
కపుల సేవ కిష్కింధా కాండము.

## 5. సుందరకాండము :

సుందరమైనది సుందర కాండము
అందరు పాడుదు ఆనందముగా
మృదు మధురము మరి రసవత్తరము
మారుతి సీతను గాంచిన వివరము.

## 6. యుద్ధకాండము :

శ్రీరఘు రాముని – రమ్యచరితము
శ్రీపతి– నరుడై వెలసిన చరితము
శ్రీరాముడు– దశకంఠుని దునిమి
శ్రీని గ్రహించుట– యుద్ధ కాండము.

❊ ❊ ❊



## భగవాన్ శ్రీ సత్య సాయిబాబా గార్కి భక్త్యంజలి

శ్రీ సాయి నామాలు ఉదయించు కిరణాలు

శ్రీ సాయి తలపులే - పులకరింతలు మాకు

శ్రీ సాయి పిలుపులో కొండంత ధైర్యమ్ము

శ్రీ సత్యసాయి - నీ పాదాల ప్రణతులు.

**రాధాకృష్ణమూర్తి.**



# సుందరకాండము

## గ్రంధావిష్కరణ సభ

19-6-79 (శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం

సుల్తాన్ బజారు) హైదరాబాద్.

(కుడినుండి రెండవవారు)

గ్రంధావిష్కర్త : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అప్పటి ప్రధాన న్యాయమూర్తి

గౌ॥ శ్రీ చల్లా కొండయ్యగారు

ఒకటవవారు : శ్రీ M.S.K. శాస్త్రిగారు, (సీనియర్ అడ్వకేట్)

మూడవవారు : రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి (అడ్వకేట్)

నాల్గవవారు : శ్రీ విజయ రాఘవాచారి గారు (అడ్వకేట్)



# బాలకాండము

## గ్రంధావిష్కరణ సభ

తేది : 21-11-1980 శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం

సుల్తాన్ బజారు హైదరాబాద్

(కుడినుండి ఒకటవవారు)

గ్రంధావిష్కర్త : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు

అప్పటి ప్రధాన న్యాయమూర్తి గౌ॥ శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారు

రెండవవారు : శ్రీ కోకా రాఘువరావుగారు (అడ్వకేట్)

మూడవవారు : రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి (అడ్వకేట్)

నాల్గవవారు : కళాప్రపూర్ణ శ్రీరావూరు వెంకట సత్యనారాయణ రావు గారు.



# అరణ్యకాండము

## గ్రంథావిష్కరణ సభ

తేది : 22-10-1982 మారుతి మందిర్ (దిల్‌సుక్ నగర్)

(కుడినుండి రెండవవారు)

గ్రంథావిష్కర్త : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అప్పటి ప్రధాన న్యాయమూర్తి

గౌ॥ శ్రీ కొండా మాధవరెడ్డి గారు

మొదటివారు : కళాప్రపూర్ణ శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు గారు

మూడవవారు : శ్రీ యడవల్లి శివరామ శాస్త్రిగారు (అడ్వకేట్)

నాల్గవవారు : డా॥ శ్రీ॥ వి.వి. యల్. నరసింహారావు గారు.



# సాయినాథ భాగవతం - గ్రంధావిష్కరణ సభ

## గణేష్ ఆంజనేయస్వామి దేవాలయం, దిల్‌సుక్‌నగర్

కుడినుండి :

శ్రీ G.శ్రీధరరావు గారు - ఆలయ పాలకవర్గం సభ్యులు

శ్రీ చల్లా సాంబిరెడ్డి గారు - (అధ్యక్షులు, శ్రీ పావని సేవాసమితి)

శ్రీ లక్ష్మయ్యగారు M.R.O.

శ్రీ T.S. రావుగారు (Retd. D.G.P.)

న్యాయమూర్తి గౌ॥ శ్రీ పి. రామకృష్ణరాజుగారు (Judge A.P. High Court)

రచయిత సూరంపూడి రాధాకృష్ణమూర్తి

శ్రీ N. సుబ్బరాజుగారు (Retd. Chairman A.P.A.T.)

శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు (Builder)

శ్రీ చండిక సాంబశివరాజు గారు (గ్రంథ ముద్రణ దాత)

శ్రీ G.C.H. రామారావుగారు (శ్రీపావని సేవాసమితి, కార్యదర్శి)



## బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రిగారి సుందరకాండ ప్రవచన కార్యక్రమం

శ్రీపురంకాలనీ - శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయం

కూర్చున్నవారు : ఎడమనుండి బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రి గారు

రెండవవారు అవధాన సహస్రఫణి

అవధాన సరస్వతీ పీఠాధిపతి

అధికార భాషాసంఘం అధ్యక్షులు

బ్రహ్మశ్రీ డా॥ మాడుగుల నాగఫణి శర్మగారు

మూడవవారు సూరంపూడి రాధాకృష్ణమూర్తి

నాల్గవవారు శ్రీ A.V.V. సత్యనారాయణమూర్తి గారు



సూరంపూడి రాధాకృష్ణమూర్తి (రచయిత)
శ్రీమతి విజయలక్ష్మి

గోస్తనీ నది ఉన్న - తణుకు పుట్టిన ఊరు

జన్మనిచ్చిన పుణ్యమూర్తి - మహాలక్ష్మమ్మ

నాపాలి దేవుడు - కామేశ్వరుడు - తండ్రి

శ్రీరామచంద్రుడు - ఆరాధ్యదైవమ్ము.



1978 సంవత్సరం మే నెలలో, సుందరకాండము (ముద్రణకు పూర్వం) చి॥ సూరంపూడి శ్రీదేవి (దిల్‌సుక్‌నగర్ మారుతి మందిర్‌లో) ప్రప్రథమంగా గానం చేశారు. ఆలయ పాలకవర్గం అధ్యక్షులు శ్రీ రాయ్ దిల్‌సుక్‌రామ్‌గారు.



# రచయితకు జరిగిన సన్మాన సభ

తేది : 12.8.1998 శ్రీ శృంగేరి శంకర మఠం, నల్లకుంట

కుడినుండి : శ్రీ V. జోగయ్యా శర్మగారు (సీనియర్ అడ్వకేట్)

శ్రీ M.S.K.శాస్త్రిగారు (సీనియర్ అడ్వకేట్)

శ్రీ చల్లా పూర్ణయ్యా గారు (సీనియర్ అడ్వకేట్)

శ్రీ P.బాలకృష్ణమూర్తి గారు (సీనియర్ అడ్వకేట్)

రచయిత :- సూరంపూడి రాధాకృష్ణమూర్తి ( అడ్వకేట్)

శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు ( అడ్వకేట్)

ఆంధ్రవ్యాస బ్రహ్మశ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యా గారు.

# శ్రీరామసేవ చేయించిన రామభక్తులు



**శ్రీ చల్లూరి శ్రీనివాస రెడ్డి గారు, శ్రీమతి అన్నపూర్ణ గారు**

(హరిహర క్షేత్రం - ఆలయ నిర్మాత, విద్యుత్ నగర్, దిల్‌సుక్‌నగర్)

శ్రీమతి అన్నపూర్ణ గారు సుందరకాండ గానం చేసి ఆడియో

కేసెట్లు ఎన్నో దేవాలయాలకి బహుకరించారు.



**శ్రీ C. శ్రినివాస బాబా గారు (అడ్వకేట్)**

**శ్రీమతి సరస్వతి గారు**



**శ్రీ పారుపల్లి అంజిరెడ్డి గారు, శ్రీమతి బాలామణి గారు**

(అధ్యక్షులు ప్రసన్నాంజనేయ స్వామి దేవస్థానం, కొత్తపేట క్రాస్‌రోడ్స్)

హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల రైస్‌మిల్లర్స్ అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి

(అన్నదాత పార్ బాయిల్డ్ రైస్ మిల్ - అధినేత)



**శ్రీ కనుమూరి పెద్దిరాజుగారు శ్రీమతి సీతాదేవి గారు**

( భద్రాచలంలో కనుమూరి కాటేజి నిర్మాత

దత్తసాయి దేవాలయం (నాచారం) ప్రధాన నిర్మాత.



శ్రీ ప్రభల సుబ్బారావు గారు (అడ్వకేట్)
శ్రీమతి సీతాదేవి గారు

 

శ్రీ పబ్బా బాలయ్య గారు శ్రీమతి శశిరేఖ గారు
రేవతి పార్ బాయిల్డ్ రైస్‌మిల్ – అధినేత
ఫీర్జాదిగూడ, ఉప్పల్, హైదరాబాద్.



**కాళ్ళకూరి వెంకటరత్నమ్మ గారు**

రామసేవకు ప్రోత్సహించిన భక్తురాలు



**M.V.S.S. రామకృష్ణరావు, శ్రీమతి భారతి**

గత 20 సంవత్సరాలుగా రామసేవలో, తోడు నిలచిన మిత్రుడు.

# సాయిరాం

## ఆర్థికంగా – హార్థికంగా ప్రోత్సహించిన రామభక్తులు

1. శ్రీ ప్రసన్నాంజనేయస్వామి వారి దేవస్థాన పాలకవర్గం (సైదాబాద్ - జైల్ గార్డెన్)
2. శ్రీ భోగరాజు కోదండరామశర్మ గారు
3. శ్రీ చిల్లర రామచంద్రరావుగారు
4. శ్రీ చల్లా సాంబిరెడ్డి గారు ( అడ్వకేట్)
5. శ్రీ కంది మురళీధర రావు గారు, శ్రీమతి అనూరాధ గారు
6. శ్రీ కొల్వి కృష్ణారావు గారు
7. చి॥ ఆకెళ్ళ రవిప్రసాద్, శ్రీమతి శ్రీదేవి
8. చి॥ సూరంపూడి శ్రీకాంత్, శ్రీమతి సుధాలక్ష్మి
9. చి॥ సూరంపూడి శ్రీనాధ్ శ్రీమతి రాజ్యలక్ష్మి
10. శ్రీ A.రామరాజు గారు **(Retd. N.T.P.A. P. Raj)**
11. శ్రీ M. శ్రీరామమూర్తి గారు
12. శ్రీ గుండమరాజు శ్రీధరరావు గారు
13. శ్రీ తెలికిచర్ల మల్లికార్జునరావు గారు
14. శ్రీ అరిపిరాల చంద్ర శేఖరరావు గారు, శ్రీమతి రాజేశ్వరమ్మ గారు
15. డా॥ శ్రీ V. సత్యనారాయణగారు శ్రీమతి విజయలక్ష్మిగారు (పుత్తూరు)

16. శ్రీ పెట్టుగాని తిరువాయిగుప్త గారు శ్రీమతి నవనీతం గారు

17. శ్రీ సూరంపూడి వెంకట సత్యనారాయణ గారు

18. చి॥ సూరంపూడి వెంకట రమణారావు (అడ్వకేట్) శ్రీమతి రామలక్ష్మి (తణుకు)

19. చి॥ సూరంపూడి విశ్వేశ్వరరావు శ్రీమతి శోభ (తణుకు)

20. శ్రీ E.V.S రామకృష్ణశాస్త్రి గారు **(Dy. Registrar APAT)**

21. శ్రీ K.V. రంగారెడ్డి గారు **(Retd. Executive Engineer P.Raj)**

22. E.C.I.L. సంస్థలో కొందరు రామసేవాతత్పరులు

23. శ్రీ N.రాజన్న గారు **(Retd. District Judge)**

24. శ్రీ మేకల మల్లారెడ్డి గారు **(Spoorthy Degree College)**

25. శ్రీ మాదాసు పిచ్చయ్య గారు **(Retd. S.E.)**

26. శ్రీ కరెడ్ల లక్ష్మీ నారాయణ గారు, శ్రీమతి కామేశ్వరి గారు

27. శ్రీ తల్లా ప్రగడ హనుమంతరావు గారు శ్రీమతి కల్పవల్లి గారు

28. శ్రీ కొత్తూరు వెంకట రమణారావు గారు (అడ్వకేట్)

29. శ్రీ C.V. శర్మ గారు శ్రీమతి కాశీ అన్నపూర్ణ గారు

30. శ్రీ కంది శ్రీధర్ గారు, శ్రీమతి లక్ష్మి గారు

31. శ్రీమతి సమర్థ మాతాజీ (హనుమదుపాసకురాలు) స్నేహపురి కాలనీ హైదరాబాద్

32. శ్రీ పెద్దింటి వెంకట మురళీకృష్ణ గారు

## బాలత్రిపుర సుందరీ పీఠం

### కమలాంబికా ముక్తిధామం (ఏలూరు)

### ప॥ గో॥ జిల్లా



శ్రీదేవి పూజలో పులకరించిన తల్లి
వాగ్దేవి కరుణతో కాపాడు జనయిత్రి
భక్తులందరి పాలి కల్పవల్లివి నీవు
కమలాంబ తల్లి నీ పాదాల ప్రణతులు

రాధాకృష్ణమూర్తి

### శ్రీమద్రామాయణమకరందము

# బాలకాండము

(గేయ కవిత)

(మకుటం)

శ్రీ రఘురాముని రమ్యచరితము
మునితిలకుడు మనకొసగిన మంత్రము
రామచంద్రు డుదయించి జానకిని
పరిణయమాడుట బాలకాండము

శ్రీరామ

# శ్రీమద్రామాయణ బాలకాండము

## (విషయ సూచిక)

సర్గము — పేజీ

శ్రీమద్రామాయణ మకరందము

# బాలకాండము

(గేయ కవిత)

(మకుటం)

శ్రీ రఘురాముని రమ్యచరితము
మునితిలకుడు మనకొసగిన మంత్రము
రామచంద్రు డుదయించి జానకిని
పరిణయమాడుట బాలకాండము

శ్రీరామ జయరామ – జయ జయ రామ

❖❖❖

శ్లో.. ఏక దంతము శూర్ప కర్ణము
చలువ చూపుల చిన్నవాడా –
పార్వతమ్మకు ముద్దు కొమరుడ
విఘ్నరాజా – వందనమ్ము

❖❖❖

కూజంతం రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరుహ్యా కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్.

❖❖❖

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందర కర్తకు వందనముంచి
రామ భక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన జేసెద.

శ్రీరామచంద్రాయనమః

శ్రీమద్రామాయణము

# బాలకాండము

## 1 వ సర్గము వాల్మీకిమహర్షికి నారదుడు సంగ్రహముగ రామాయణము తెలుపుట :

(బాల రామాణము)

శ్రీరఘురాముని రమ్యచరితము
మునితిలకుడు మనకొసగినమంత్రము
రామచంద్రుడుదయించి జానకిని
పరిణయమాడుట బాలకాండము.

శ్రీహరినామము కురిసే మేఘము
మునిజనపూజిత పండిత శ్రేష్ఠుడు
స్వాధ్యాయి మరితపస్వియైన
దేవఋషిని వాల్మీకి అడిగెను.

''సత్యవాక్కుతో శోభిలువాడు
వీరుడు ఉత్తమగుణముల నిధియై
స్థిరసంకల్పుడు ధర్మనిరతుడు
సకలప్రాణులకు సంరక్షకుడు

జితక్రోధుడు ద్యుతిమంతుడును
సదాచారుడు మోహనరూపుడు
విమలచరిత్రుడు - కృతజ్ఞుడై - మరి
అసూయనెరుగని అతిసమర్థుడు.

ధృతిగలవాడు - కోపించినచో
సురలను సైతము వణకించగల
తేజోవంతుడు - శాస్త్రకోవిదుడు
ముల్లోకముల ఎవరు మునీంద్రా?''

తనుగాచెప్పగ వచ్చె నారదుడు
తననే అడిగెను మునివాల్మీకి
ఎంతో సంతోషించి నారదుడు
వినుమనిపలికెను మృదుమధురముగా.

''వాల్మీకి మునీంద్రా! అంతటివాడు
దొరుకుట ఎంతో దుర్లభమైనను
నరులలొ గలడు నారాయణుడు
సుగుణాలకు అతడాలవాలము.

రామనామముతొ రాజిలువాడు
ఇక్ష్వాకుల కులతిలకము అతడు
సకలజనులమది సతతమునిండి
మనసుదిటవుగల - వీరుడు అతడు.

నీతిమంతుడు తెలివికి పెన్నిధి
అతిచక్కగ మాటాడగనేర్పరి
శ్రీమంతుడు అతడతిసమర్థుడు
మహాబాహుడు ప్రియదర్శనుడు.

చక్కనిశిరసు - సరిపడుఫాలము
విశాలమైన వక్షస్థలము
ఆజానుబాహుడు అతి విక్రముడు
ఆరుశత్రువుల గెలిచిన వీరుడు.

సమమగురూపము రూపసంపదల
అందములొలికెడి శుభలక్షణుడు
కన్నులుచారెడు - నిగనిగఛాయతొ
మనసులుదోచే సుందరరాముడు.

శంఖమువంటి కంఠముగలిగి
కోదండముగల కోమలమూర్తి
సంగరమందు సరిరారెవ్వరు
దండధరుడు మరి పాపాత్ములకు.

సుగుణశీలుడు సత్యసంధుడు
గంభీరములో సాగరసముడు
వేదార్థముల నెరిగినవాడు
సకలశాస్త్రముల కోవిదుడతడు.

విక్రమమందు విష్ణుదేవుడు
సంపదలందు కుబేరునిసముడు
సహనమునందు పృధ్వీసముడు
చల్లనిచంద్రుడు మోహనరూపుడు.

ధర్మదేవతే అనిపించుచును
ధైర్యమునందు హిమగిరిసముడు
దర్శనభాగ్యము దొరికినచాలును
తనివితీరదు చూచిననెంత.

కౌసల్యకు శ్రీరాముడు తనయుడు
మాతకు ఎంతో ఆనందమునిడు
తపసుఫలించి కన్నదితల్లి
తను శాశ్వతముగ యశముగడించెను.

ధశరథభూపతి ప్రజల ప్రియముగని
పెద్దకుమారుడు ప్రీతిపాత్రుడు
సత్యవిక్రముడు శ్రేష్ఠగుణాఢ్యుడు
నీతికోవిదుడు - మోహనమూర్తికి.

రామచంద్రునికి పట్టముగట్టగ
సందడిచేయుట గాంచిన కైక
ముద్దులభార్య - మురిపెముగాను
కోరెను వరములు దశరథవిభుని.

రాముడు వనముల కేగుట ఒకటి
భరతుడు యువరాజగుట మరొక్కటి.
ధర్మబద్ధుడై దశరథభూపతి
కాదనలేక కానలకంపెను.

కైక కోరికలు తీర్చుటకొరకై
తండ్రి మాటను నిలుపుటకొరకై
కాననసీమకు కదలె రాఘవుడు
తమ్ముడు లక్ష్మణుడనుసరించెను.

పతిహితమే తను సతతముకోరే
ప్రాణప్రదమగు ప్రియసతి సీత
పరమసాధ్వి-అతిలోకసుందరి
సర్వలక్షణ లక్షిత శోభిత.

చంద్రుని వీడని రోహిణిరీతి
రామచంద్రుని అడుగులనడచెను
తండ్రిదశరథుడు - పురజనులందరు
వనికేగగను యత్నముజేసిరి.

శృంగిభేరియను పురముననున్న
బోయ ప్రభువగు గుహునితొ చేరి
సారథి సుమంత్రు మరలిపొమ్మని
గంగను దాటెను సతిసోదరులతొ.

రామచంద్రుడు సీతాసహితుడు
లక్ష్మణమూర్తితొ వనముల తిరుగుచు
భరద్వాజుని ఆనతిమేరకు
చిత్రకూటమును చేరెను అపుడు.

కానన సీమకు పుత్రులు చేరగ
చింతతొ-దశరథ ధరణీధవుడు
రాముని తలచుచు రోజులు గడపుచు
స్వర్గయానము చేసెను వంతతొ.

జ్యేష్ఠకుమారుడు వనముల కేగెను
దశరథరాజు స్వర్గము చేరెను
వశిష్ఠుడాదిగ పెద్దలు - భరతుని
గద్దెనెక్కమన వలదనె భరతుడు.

సామర్థ్యము గలవాడైయుండి
అరిషడ్వర్గము గెలిచినవీరుడు
రామపాదములు మదిలో నిలపిన
భరతుడు-అన్నతొ పలికెను వనమున.

''జ్యేష్ఠకుమారుడు రాజుగాదగును
తమ్ముడ-నే-నీసేవ చేయుదును''
రమ్మని రాజ్యము గొమ్మని వేడెను
అన్న వలదని ప్రియముగ పలికెను.

ఆశ్రితులందరి కానందము నిడు
అడిగినచో మరి కాదనలేడు
అయినా - రాముడు తండ్రి ఆనతిని
జవదాటక-తను రాజ్యము వలదనె.

పాదుకలిచ్చెను భరతునికంత
ప్రీతిగ చెప్పెను రాజ్యము నేలగ
పాదుకలకు తను ప్రతినిధిగాను
నంది గ్రామము నుండి ఏలెను.

పితృవాక్య పరిపాలనధ్యేయము-
రాజ్యకాంక్షయే లేని రాముడు
ప్రజలకు దూరమునుండుటకొరకై
మరల మరల వారట రాకుండగ.

చేరెను అపుడు దండకవనికి-
ముదమగు వనసోయగమును చూచెను-
విరాధుడనునొక క్రూరరక్కసుని
అంతముచేసెను శ్రీరఘురాముడు.

శరభంగుడను మునిపుంగవుని
సుతీక్ష్ణుని-మరి అగస్త్యమునిని
అగస్త్యసోదరు సుదర్శనాఖ్యుని
దర్శించెను అట అతిభక్తిగను.

సురపతి యిచ్చిన విల్లు-ఖడ్గము
అక్షయతూణీరమ్ముల నంతట
అగస్త్యముని శ్రీరామునికివ్వగ
అందెను ఆనందముతో రాముడు.

కాననమందలి అసురమూకను
అంతముచేసి శాంతినొసగుమని-
ఋషులుకోరిరి - రామచంద్రుని
వారికి అభయము నిచ్చెను ప్రతినతొ.

జనస్థానమున నున్నరక్కసి
శూర్పణఖచటకు వచ్చి అంతట
పంచవటిని గల రామచంద్రుని
చేరగబోయి శిక్షింపబడ.

ఖరుడు, త్రిశిర, దూషణులపుడు
రాక్షస వీరులు - రామునిపైబడ
అంతముచేసెను అంతమందిని
పదునాలుగువేల క్రూర రక్కసుల.

వీరులు అంతము చేయబడుటది
చెల్లెలివలన విన్న రావణుడు
కోపమునిండి - కాలముపండి
మారీచుని తనకండగ రమ్మనె

"రావణ! నీకు రామునితోను
వైరముతగదని" పలికిన వినక
మృత్యుదేవత తరుముకురాగా
వెడలె వనమునకు మారీచునితో.

మాయరాక్షసుడు మారీచుడు - తను
సాయముచేయగ రామలక్ష్మణుల
దూరముపంపి - పోరి జటాయుతొ
రామునిసతిని అపహరించెను.

జటాయువంతట రామునికంతయు
తెలియబరచగా -శోకమునిండి
జానకి కొరకై పోరెను పులుగు
తండ్రికి ఎంతో ఆప్తమిత్రుడని

అంతటిబాధలొ శ్రీరఘురాముడు
ఉత్తమగతినిడె జటాయువునకు-
వెంటనె సతికై వెదకుచు రాముడు
కబంధుగాంచెను ఆవనమందు.

మహాబాహుడు రామచంద్రుడు
కబంధువంతట అంతముచేయగ
శాపము తీరి, స్వర్గము చేరుచు
ఆవనమందు రామునికోరెను

ఉన్నత కులమున పుట్టిన వాడు
ఉన్నతమైన గుణములవాడు
శబరినిచూడగ తనకై తాను
వెడలెను రఘుపతి పూజలనందెను.

పంపాతీరమునందు రాముడు
వాయునందనుని హనుమంతునిగని
అతనిసూచనతొ వాలితమ్ముడగు
సుగ్రీవునితో మైత్రి నెరపెను.

తనవృత్తాంతము తెలిపెనుతీరుగ
సతిఅపహరణ తెలిపెనుబాధతొ
అంతట - వారు అగ్ని సాక్షిగా
చెలిమిచేసిరి మనసులు కలిపిరి.

రాముడు అడిగెను సుగ్రీవుని అట
వాలికి అతనికి గల విరోధము
అంతాచెప్పెను ఆ సుగ్రీవుడు
ఎంతోబలమగు వీరుడు అతడనె.

రాముడువాలిని చంపెదననుచు
ప్రతినచేసెను - దుందుభికాయము
కాలివ్రేలితో పది ఆమడలు
చిమ్మెను విస్మయమందగనందరు.

సప్తసాలముల ఛేదించి
మహాపర్వతము భేదించి
పాతాళమునే స్పృశించి తిరిగి
రామునిచేరిన శరమును చూచి

రామునిశక్తికి అచ్చెరువంది
వాలిని చంపగ చాలిన వాడని
రామునితో కిష్కింధకు వెడలి
పోరుకురమ్మనె వానరరాజును.

వలదని తార వారించినను
వాలివినకనే పోరుకువచ్చి
కలబడిపోరగ శ్రీరఘురాముడు
వాలిని కూల్చెను ఒక్కబాణమున.

సుగ్రీవుని కపిరాజుగనిలపి
రాముడుప్రతిన నెరవేర్చుకొనె
సీతను వెదుకగ కపివీరులను
నలుదెసలకు సుగ్రీవుడంపెను.

అతిబలవంతుడు ఆంజనేయుడు
సంపాతిడిన వివరము వరమని
నూరుయోజనములున్న వారిధి
లీలగదాటెను రాముని చలవతొ.

రావణుపాలిత నగరములంకలొ
అశోకవనమున రామధ్యానమున
జానికియుండుట గాంచెనుఘనుడు
కీర్తిమంతుడు శ్రీహనుమంతుడు.

రామునిగురుతు అంగుళీయకము
సీతకుయిచ్చి కుశలము తెలిపి
సుగ్రీవునితో చెలిమిని వినిచి
రాముడువచ్చును నమ్ముము అనెను.

అశోకవనము తోరణద్వారము
ధ్వంసముచేసి సేనాపతులను -
మంత్రిసుతులను మన్నునకలిపి
వీరుడు అక్షుని అంతముచేసెను.

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము విడువగ
బ్రహ్మాస్త్రమునకు మారుతి లొంగి
అస్త్రబంధము - విడిపోయినను
కదలక యుండి రావణుచూచెను.

మైథిలివున్న స్థలముదహింపక
లంకనుకాల్చి మహావీరుడు
మనో నిగ్రహుని రామునిచేరి
''చూచితిసీతను'' అని వందనమిడె.

ఆంజనేయుడు అంతయుచెప్పగ
కపివీరులతో కదలిరాఘవుడు
సంద్రముదాటగ దారినిమ్మన
సాగరుడంతట సరియనలేదని

వాడిబాణమున కలచివేయగా
రామునికోపము చవిచూచిన- ఆ
సాగరుడంతట నిలచె వినయముగ
'నలుని' సాయమున సేతువునిలచెను.

సేతుమార్గమున లంకనుజేరి
యుద్ధమునందు రావణుత్రుంచి
పరునియింటిలో నున్న పడతిని
స్వీకరించుటకు విముఖతచూపి

సీతతొ రాముడు పలికిన పలుకుల
పతినేతలచుచు సీతామాత
అగ్నినిజేరెను అందరిముందర
పాతివ్రత్యమే పడతి ఊపిరన.

దోషములేని పుణ్యచరితను
స్వీకరించుమని అగ్నికోరగను
సంతోషముతో సీతను గైకొన
సర్వదేవతలు రామునిపొగడిరి.

రావణవధతో ముల్లోకములు
సర్వజగత్తు సకలదేవతలు
సంతసమందగ - విభీషణాఖ్యుని
లంకాపతిగా అభిషేకించెను.

సురలవరముతో రామచంద్రుడు
మృతవానరులకు జీవముపోసి
రావణు బలసంపాదితమైన
పుష్పకమెక్కెను తనవారలతో.

భరద్వాజుని కోరిక మేరకు
ఆశ్రమమందు- ఆగి-భరతునికి
అంతయుచెప్పగ పంపె మారుతిని
అగ్ని ప్రవేశము ఆపుటకొరకై.

అతివేగముగల పుష్పకమెక్కి
నందిగ్రామమును చేరి అందరితొ
జడలనువిడచి జానకిసహితుడు
స్వీకరించెను సింహాసనమును.

రాజుగ రాముని చూడగ తహతహ-
కోసల ప్రజలకు కన్నులపండుగ
వికసించిన ముఖపద్మమ్ములతో
భక్తితత్పరులు సుఖముగనుండిరి.

కడుపుశోకమట లేనే లేదు
వైధవ్యమును ఎరుగరచ్చట
జ్వర, జల, అగ్నుల, పెనుగాలులచే
బాధలనెరుగరు రామరాజ్యమున.

ఆకలిబాధను ఎరుగరు జనులు
ధనధాన్యములకు లోటేలేదు
కృతయుగమందలి సుఖసౌఖ్యములు
కలిగియుండిరి రామరాజ్యమున.

అశ్వమేధములు వందలుచేయుచు
స్వర్ణనాణెములు లెక్కకు అందక
గోధనముతో మరి ఆనందముగా
శ్రీరఘురాముడు దానముచేయును.

రాజులకెంతో ప్రీతిపాత్రుడై
రాజ్యములేలగ చల్లగచూచును
చాతుర్వర్ణములందలి జనులను
ధర్మమార్గమును వీడనీయడు.

పదినొకవేలగు వసంతఋతువులు
రాముడు రాజ్యము చల్లగనేలి
నారాయణుడై వైకుంఠమును
జేరును-చల్లగ దర్శనమిడును

పాపహరణమిది రామాయణము
అతిపవిత్రమగు పుణ్యచరితము
వేదమువలె అధ్యయనయోగ్యము
చదివిన పాపములన్నీ తొలగును.

రామాయణమును శ్రద్ధగచదివిన
తమతమ కోరిక లన్నీతీరి
మన్ననపొంది వృద్ధినొందెదరు
స్వర్గముజేరి పూజలందెదరు

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 2 బ్రహ్మ వాల్మీకిని రామాయణము రచించుమని ఆదేశించుట

నారదు పలుకుల సారమునెరిగి
గురువులయందు గురికలవాడగు
ఋషివాల్మీకి సంతసమంది
ఎంతోపొగడెను నారదమునిని.

పూజలనంది సెలవునుపొంది
నారదుడేగెను దేవలోకము
స్నానాదులకై ప్రియశిష్యునితో
తమసాతీరముచేరె మునీంద్రుడు.

గంగకుచేరువ నున్నది తమస
తోయములెంతో నిర్మలమైనవి
'' ఉన్నతమైన మనసునుపోలి
ఉన్నవి జలములు'' అనె వాల్మీకి.

కమండలాదులు శిష్యునికిచ్చి
నారవస్త్రమును తానందుకొని
రామచరితమును మదిలోనిలిపి
ఆవనసీమలొ సొగసులుగనుచు.

తమసాతీరమునందు తిరుగుచు
తమకమునిండిన క్రౌంచయుగ్మమును
తమనేతాము మరచినపులుగుల
చూచెను ముని ఆ ప్రకృతి ఒడిలో.

ఒకటైవున్న ఉత్తమఘడియలొ
విడదీయుటకై జంకక క్రూరుడు
బోయఒకడు ఆ మగక్రౌంచమును
వాడిబాణమున నేలకు రాల్చెను.

జంటబాసిన ఒంటరిపక్షి
పెనిమిటికొరకై పెనుదుఃఖములో
ప్రియుని తలచుచు గుండియపగిలి
రోదించెను అతి దీనముగాను.

మనసుకరిగినది ముని వాల్మీకికి
కరుణపొంగినది కరుణామూర్తికి
జంటకూడిన పక్షిని చంపుట
ధర్మముకాదనె బోయవానికి.

''అతినిర్మలమగు మనసునుకలిగి
సతితోసుఖమును పొందుచున్నదగు
మగక్రౌంచమును త్రుంచి వేసితివి
బ్రతుకవు భువిని నీచ నిషాదా!''

మగక్రౌంచమట మడయుటగాంచి
ఆడక్రౌంచి తను రోదించుటవిని
వెడలినమాటలు దివ్య వాక్కుగా
కూర్చినసుమముల హారమాయెను.

శిష్యునిపిలచి పలికెమునీంద్రుడు
''నాల్గుపాదముల తియ్యని పలుకుల
మూటగట్టినటు అమరిన భావము
అచ్చముగా అది శ్లోకము తథ్యము.

హృదయతంత్రిని మ్రోగించుచును
శోకరసములో శ్లోకముపుట్టెను.''
అనవిని శిష్యుడు ఆనందముతో
శ్లోకముపలుకగ-ముని ముదమందెను.

శాస్త్రోక్తముగా స్నానాదులయి
శ్లోకముపుట్టుట మరిమరి తలచుచు
శిష్యుడుజలముతొ వెంటనడువగా
ఆశ్రమత్రోవలొ నడచె మునీంద్రుడు.

శ్లోకము మదిలో నిలచియుండగా
ధ్యాననియమము తీర్చెను విధిగా
అంతట, 'విధాత' మునిని చూడగ
వచ్చెను, ముదమును గూర్చెను మౌనికి.

నాల్గువేదములు వల్లించుటకై
నాల్గుముఖములు ఉన్న విరించిని
చూచినముని అతి సంతోషముగా
అర్ఘ్యపాద్యముల పూజలు సలిపెను.

సృష్టికర్తకు వందనమ్మిడి
శ్లోకముమదిలో పఠించుకొనుచు
ఋషి వాల్మీకి కూర్చొనియుండగ
సంతోషముతో పలికె విరించి.

''మునిపుంగవ! నీ పలుకులు శ్లోకమె!
పాడిమాటలు అవి కానేకావు
నాసంకల్పము - కావున నీవు
పూర్తిగ వ్రాయుము రామచరితము.

ధర్మాత్ముడు మరి ధీరోదాత్తుడు
ఉదారుడాతడు శ్రీరఘురాముడు
రమ్యచరితము వినిచె నారదుడు
విధిగావ్రాయుము దివ్యచరితము.

లక్ష్మణసహితుడు ధీమంతుడగు
రామునిశౌర్యము - సీతశీలము
ఎందరొరక్కసు లందరిసంగతి
తెలియునునీకు స్పష్టముగాను.

శ్లోకబద్ధమై పాపహరణమగు
ఆనందమునకు సదానిలయమగు
దోషములేనిది సత్యమైనదగు
రామచరితమును వ్రాయుమునీవు.

నదులు గలగల పారువరకును
గిరులు స్థిరముగా నిలచువరకును
రామగానమును చేయునుజగతి
శాశ్వతకీర్తిని బడయుదువీవు.''

నారాయణునే మదిలోతలచి
నా రాముని కథ నే వ్రాయుదునని
సమాక్షరముల సముదాయముతో
వందలకొలది వ్రాసెశ్లోకములు.

శాస్త్రసమ్మతము నియమబద్ధమగు
రమ్యచరితమగు సీతాచరితము
దశకంతునివధ శ్రద్ధగవినుడని
తెలిపెనుతీయగ తనశిష్యులకు.

॥శ్రీరఘురాముని॥

❖❖❖

## 3 వాల్మీకి యోగశక్తిచే జరిగిన రామాయణమంతయు గాంచుట

ధర్మ చింతనము తనస్వభావమగు
ముని వాల్మీకి రామచరితమును
వాస్తవ రీతిని కన్నులజూడగ
మనసు నిలపగ విరించి దయచే.

సీతాసహితుడు రామచంద్రుని
లక్ష్మణమూర్తిని దశరథరాజును
రాణులు ముగ్వురు-పురజనులందరి
చేతలు-మాటలు సర్వము తెలిసెను.

యోగ బలముచే పూర్తిగనరసి
కామార్థములు ధర్మమోక్షములు
నిండియుండెడి దివ్యగాథను
రామ చరితమును వ్రాసెమునీంద్రుడు.

రామజననము-బాల్యవిక్రమము
ఓర్పు-ధర్మము అభిమానమది
విశ్వామిత్రుడు గాథల నుడువుట
విల్లువిరిచి వైదేహినందుట

పట్టము కట్టుట కగు ఏర్పాటులు
కైక కోరికలు కాననవాసము
దశరథుమృతియు-గంగను దాటుట
చిత్రకూటముకు భరతునిరాక.

ఉత్తమ లోకము లిచ్చుట తండ్రికి -
దివ్య పాదుకలు భరతునికిచ్చుట
దండక వనిలో విరాధు కూల్చుట
శరభంగుని మరి సుతీక్ష్ణు చూచుట.

సీతాసతికి అనసూయమ్మ
గంధాదులను ప్రీతిగనిచ్చుట
అగస్త్యముని ఆశీస్సులుగొనుట
పంచవటిని మరి ఆశ్రమవాసము.

శూర్పణఖకు తగు శిక్షనువేయుట.
ఖరదూషణులను అంతముజేయుట
సీతాపహరణము రాముని వేదన
హనుమంతునితో సంభాషించుట.

సుగ్రీవునితో చెలిమినిజేయుట
ఒక్కబాణమున వాలినిగూల్చుట
అర్కసుతునకు గుర్తుచేయుట
గడగడవణకి సేనలనంపుట.

అంగుళీయకము మారుతికిచ్చుట
అంగదాదులు వేదననుండగ
సంపాతపుడు సర్వము తెలుపగ
మారుతి మహేంద్రగిరిపై కెగురుట.

సాగరుడంపగ మైనాకుడు అట
వాయుపుత్రుని అతిథిగ బిలచుట
శక్తియుక్తులు సురసతెలియుట
సింహికచచ్చుట - లంకజొచ్చుట.

రాతిరి లంకలొ సంచరించుట
సీతను వెదకుట ఎటఅనితలచుట
నిద్రలొనున్న రావణుగాంచుట
దివ్యవిమానము పుష్పకమరయుట.

పాకశాలను పావనిజూచుట
అంతఃపురముల శోధించుటయు
వనమున రావణు వాచాలత్వము
అమ్మకు ముద్రిక నిచ్చెడి వినయము.

త్రిజట స్వప్నము అశోకభంగము
రాక్షస వీరుల నుక్కడగించుట
మారుతి లొంగుట - రావణుజూచుట
లంకాపురమును మంటలముంచుట

సంద్రముదాటుట - మధువనధ్వంసము
చూడామణిని రామునికిచ్చుట
'నలుడు' నిలచి అట సేతువునిలుపుట
అందరు- లంకలొ అడుగు బెట్టుట.

విభీషణాఖ్యుడు శరణుజొచ్చుట-
అసురుల జంపు నుపాయము దెలుపుట
పర్వతకాయుడు కుంభకర్ణుడు
ఇంద్రజిత్తుయు రణమునకూలుట.

దశకంఠుని దశ శిరములు త్రుంచుట
విభీషణాఖ్యుని అభిషేకించుట
సీతనుజేర్చుకు పుష్పకమెక్కుట
నందిగ్రామమున భరతునికలియుట

యోధులగూడి అయోధ్యజేరుట
ముదముగొలిపి సింహాసనమెక్కుట
నమ్మినవారికి ప్రీతినిగూర్చి
సెలవునిచ్చి తమ నెలవులకంపుట.

పట్టాభిషేకము జరుగు వరకును
ఆరుకాండలుగ వర్ధిల్లుచును
ఆపై కథను ఉత్తరకాండగ
మునివాల్మీకి ముదముగ వ్రాసెను
॥శ్రీరఘురాముని॥

❖❖❖

## 4 వాల్మీకి కుశలవులకు రామాయణము ఉపదేశించుట

విరించిదయచే బ్రహ్మజ్ఞానమున
మధురమైన పదలాలిత్యముతో
విశేషమైన కావ్యశోభతో
రచియించెను ముని రామాయణమును

ఇరువది నాల్గు వేల శ్లోకములు
అయిదువందల సర్గలతోను
ఆరుకాండలుగ భాసిలజేసి
ఉత్తర కాండను కూర్చెను పిమ్మట

పాలతీపిగా పాటకనువుగా
వ్రాసిన చరితము గానముచేయగ
సమర్థు లెవరని ఆలోచించగ
ముందునిలచిరి కుశలవులిద్దరు

గురువుకు వందనముంచిరి ముందుగ
వేదాధ్యయనము చేసినబాలురు
సమానమైన కంఠస్వరములు
సుందరరూపులు సుమసుకుమారులు.

పవిత్రమైన రామాయణము
పరమసా ్వియగు సీతాచరితము
పౌలస్త్యవధయను ఫలముగలిగిన
ఉత్తమ కావ్యము ఉపదేశించెను.

సంగీతమునకు సరిపడియున్నది
నవరసభరితము దివ్యచరితము
రామచంద్రునికి ప్రతిబింబములన
గంధర్వులవలె భాసిలి పాడిరి.

వినయశీలురు వివేకనిధులు
సావధానులు బుద్ధిమంతులు
రామచరితమును ఆకళించుకొని
గానముచేసిరి పెద్దలముందర

మునులముందర ఋషులముందర
అశ్వమేధక్రతు అంతమునందు
చల్లని జల్లుగ గానముకురియగ
ఎల్లరి మనసులు పరవశించెను.

ముచ్చటపడిరి మునిపుంగవులు
ఆశీస్సులనిడి అభినందించిరి
శక్తికి తగినరీతిగ ఋషులు
బహుమతులిచ్చిరి చిరంజీవులకు

రామచరితము అతి మధురముగ
శృతిబద్ధముగా బాలురుపాడుట
భరతుడు చెప్పగ రాముడు వినెను
తహతహలాడెను బాలుర చూడగ

గానమువినగా బాలుర పిలిచి
బంగరు సింహాసనమున కూర్చొని
సచివులు సోదరులందరితోను
సుందరమూర్తులు పాడగ వినెను.

గానమాధురి మనసుకు హాయి
తనువుకు ఎంతో సుఖమునిచ్చెను
మునివేషములోనున్న బాలురకు
రాజలక్షణములున్నవి గనుడనె.

దేవతేజముతొ భాసిలు బాలురు
దివ్యగాత్రములు కలిగిన కవలల
గానమునకు రఘురాముడు మురిసి
మరిమరి వినుడనె తనసోదరులను

వీనులవిందుగ గానముచేసిరి
మార్గము - దేశి పద్ధతులందు
జంటలేక తను ఒంటరిరాముడు
అందరిమధ్యలొ కూర్చొనివినుచు.

''హృదయేశ్వరికి దూరమునున్న
నా హృదయానికి హత్తుకుపోయిన
సీతాచరితము బాలురు పాడగ
శ్రేయము నాకు కలుగుననుకొనె.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 5 అయోధ్యానగర వర్ణన

విజయవిరాజితులైన మనువు మరి
అజేయులయిన రాజోత్తములలో
సగరుడుశ్రేష్ఠుడు - భువిపాలించెను
భువిని సాగరము త్రవ్విరి సుతులు.

సరయూతీరమునందు వెలసిన
కోసలదేశము నెలవు సిరులకు
రత్నరాసులు ధాన్యపురాసులు
ఉండెను మెండుగ ప్రతిగృహమందు.

యశోవిశాలురు ఆ ఇక్ష్వాకులు
అందు రామునికి చెందు, చరితము
రామాయణము పూజనీయము
వెలుగొందినది విరించిదయచే.

జవసత్వంబులు కలిగినవారు
పరుల సంపదల కాశ ఎరుగరు
సంతుష్టులు ఆ ధన్యజీవులు
కోసలదేశపు యశము పెంచిరి.

''విరించి కృపతో విరసినపూవు
వెదజల్లెద సుమగంధము నేను
ధర్మము కామార్థములతొ నిండెను
శ్రద్ధగ వినవలె అసూయ విడచి.''

మనువు ముచ్చటగ నిర్మించినది
అచ్చముగా అది నాకలోకమన
ధనధాన్యములకు నెలవు అయినది
అందములకు కాణాచి అయోధ్య.

పదిరెండామడలున్నది పొడవు
మూడు ఆమడల వెడల్పుగలిగి
సూటిగ బాణము పోయిన రీతిగ
రాజవీథులు సొగసుగనున్నవి.

పూలజల్లులు కురిసె తరువులు
చల్లని జలకముజల్లిన వీథులు
కలిమికి నిలయము అన్నటులున్నది
అందములొలుకుచు అయోధ్యాపురి.

మంగళశోభతొ ముంగిలి వాకిలి
తీర్చిన సొగసుల ద్వారబంధములు
శ్రీమంతులు మరి పండితశ్రేష్ఠులు
సూతులు-మాగధులెందరొ గలరు.

విశాలమైన అంగడివీధులు
ఆజి గెలుచుటకు ఆయుధములతో
శిల్పచాతురితొ స్త్రీలనాట్యముల
శ్రీకి నిలయమై రాజిలుచున్నది.

అయోధ్య, అనియెడి - అతివకున్నది
ప్రాకారము అను - వడ్డాణమ్ము
లెక్కకుచిక్కని గజతురగములు
చక్కని వినయముగల సామంతులు.

నీతినియమములు నెలకొనియుండగ
దేశదేశముల జనులుజేరిరి
రత్నమయములగు ప్రాసాదములవి
స్వర్గనగరమగు అమరావతి సరి.

సమభూములలో నమరినయిండ్లు
మునిమనుమలతో దీర్ఘాయుష్కులు
నిండుగ పంటలు ఉత్తమస్త్రీలతొ
ఉండెను గృహములు అయోధ్యనగరిని.

నాల్గుదిక్కులకు నడచెను బాటలు
నడుమనున్నవి రాజగృహములు
జూదపుపీట - అన్నటు ఒప్పుచు
గొప్పగ నున్నది సుందరనగరము.

చెఱకు పాలవలె తియ్యని జలము
స్వచ్ఛమునందు ముత్యము పోలును
వీణావేణు మృదంగనాదములు
సుందరవదనల అందెలరవళులు.

విమానములతో సమమగు గృహములు
స్వర్గవాసులు కలిగియుందురు -
ఆగృహములతో సరిపడు యిండ్లు
అయోధ్యలోన అందరికున్నవి.

నిరాయుధులను అసహాయులను
వంశము నిలపగ నిలచిన నలుసును
భయముతొ దాగగ శత్రువునైనను
చంపరు, వీరులు - నీతి నియమముల

భూసురోత్తములు దానశోభితులు
నిత్యాగ్నులు మరి వేదాధ్యయనులు
గృహస్థులయ్యు - ఋషులు - నగరిలో
కానన సీమలసాటి మహాఋషులు.

❊❊❊

॥శ్రీరఘురాముని॥

# 6 అయోధ్య వైభవం

విష్ణుపాలనలొ అల వైకుంఠము
శోభిలు రీతిగ అయోధ్య నగరిని
దశరథవిభుడు పరిపాలించెను
మహారథులు మహరాజునుకొలవగ.

సురవిభుడా అమరావతినేలెడు
తీరుగ దశరథుడయోధ్యనపుడు
ధర్మార్థములు నిండియుండగా
పరిపాలించెను సత్యవర్తియై

వేదాంతమును వేదము నెరుగును
యజ్ఞయాగముల గురికలవాడు
ముందు చూపుగల రాజోత్తముడు
మహాఋషులతో సమమగువాడు.

ఆ పురమందలి జనులందరును
కాపురముండిరి సుఖసౌఖ్యముల
ధార్మికులందరు శాస్త్రకోవిదులు
సత్యవాదులు దానశోభితులు

రాజుఋషులలో శ్రేష్ఠుడు అతడు
శత్రువులందర గెలిచినవాడు
ప్రజల శ్రేయమును ప్రియముగనెంచును
వీరోత్తముడు బలసంపన్నుడు.

కలిగిన సంపద కానందపడి
గోహయమ్ములు ధన- ధాన్యములతొ
ఆస్తిక సంపద కలిసి యుండగా
బంధుప్రీతితో బ్రతుకుచుండిరి.

కీర్తి చంద్రికల దిశలు వెలుగగా
ధైర్యమునందు హిమగిరి సముడు
ఆదిశేషునకు సాటి చదువులో
రాజకులములో-సాటి- తనకు తను.

సదాచారమున స్త్రీ-పురుషులట
మహాఋషులతో పోలిన మనసుతొ
ఆభరణమ్ములు హారమ్ములతో
పరిమళద్రవ్యము లలదుకు నుందురు

బంగరురత్నపు వెలగల వలువల
ధనపతి సురపతులిద్దరి పోలి
వైవస్వత మనువన్న తీరుగా
సత్యవాదియై పురము నేలెను.

అన్నదానమున ఆరితేరిరి
ఉన్నదానితో తృప్తిగ నుందురు
యజ్ఞ యాగములు మెండుగ చేయుచు
వర్ణసంకరము చేయక నుండిరి

రాజ రూపమున వెలిగెడి ఋషియై
చతురంగమ్ములు-సంపదగలిగి
ఇంద్రియమ్ములను గెలిచినవాడు
తేజోవంతుడు దశరథవిభుడు

విజితేంద్రియులు భూసురోత్తములు
వేదాధ్యయనము నందు మనసుతో
అపాత్ర దానము అన్నదిచేయక
దానములందగ వెనుక నుండెదరు

అసూయ నెరుగని అతి శ్రీమంతులు
రోగము-దీనత్వము లసలెరుగరు
స్త్రీ పురుషులు అట తేజమునిండి
రాజు దశరథుని భక్తితొ కొలుతురు

చాతుర్వర్ణము లందలివారు
ధర్మాసక్తులు-గౌరవమందుచు
అదుపాజ్ఞలలో సుఖముగనుండి
దీర్ఘాయుష్షును కలిగియుండిరి

అధికశౌర్యమున అగ్నిసమానులు
శస్త్రవిద్యలో ఆరితేరిరి-
సింహములున్న గుహవలె నయోధ్య
ఉన్నది-విక్రములైన యోధులతొ

కాంభోజములో-బాహ్లీకములో
వనాయుదేశము-సింధుదేశముల
పుట్టిన మేలగు అశ్వములున్నవి
ఇంద్రుని ఉచ్చైశ్రవమును పోలును.

వింధ్యాచలపు మదపు టేనుగులు
కొండలవంటి హిమగిరి గజములు
'ఐరావతములు' తూర్పుదిక్కువి
'అంజన'మను ఆగ్నేయదిక్కువి.

'వామనమ'ను ఆ దక్షిణదిశవగు
మూడుజాతుల ఏనుగులున్నవి
భద్ర మంద్రములు-భద్రమృగములు
మృగమంద్రముల సాంకర్యముతో.

భద్ర, మంద్ర, మృగ, సాంకర్యముతో
గజముల సంపద నిండిన రాజ్యము
శత్రురాజుల చూపులకందక
అయోధ్య అనియెడి పేరుకు తగినది.

తేజోవంతుడు దశరథనృపతి
శత్రువులందరి మదమణగించి
తారలపోలిన ప్రజలనాతడు
చంద్రునిపోలి పరిపాలించెను.

దేవరాజుతోసరి దశరథుడు
సార్థకనాముడు అయోధ్యనగరిని
మంగళప్రదమగు తన రాజ్యమును
పరిపాలించెను-యశము పొందెను.

॥శ్రీరఘురాముని॥

❃❃❃

# 7 దశరథుని రాజ్యపాలన

దశరథవిభునకు రాచకార్యముల
ఇంగితజ్ఞులు ప్రీతిపాత్రులు
వివేకవంతులు విధేయులైన
మంత్రిపుంగవులు తోడుగ నుండిరి

స్వామికార్యముల శ్రద్ధాసక్తుల
ద్రోహచింతనము అసలే లేక
స్వార్థములేని శుద్ధమనస్కులు
ఎనిమిదిమంది మంత్రులుండిరి.

ధృష్టి, జయంతులు, విజయుడు, మరియు
సిద్ధార్థుడును అర్థసాధకుడు
అశోకుడు మరి మంత్రపాలుడు
సుమంత్రుడను వారెనిమిదిమంది

వశిష్ఠమహర్షి- వామదేవుడు
గురువులలోన అగ్రగణ్యులు
జాబాలి ఆదిగా ఋత్విజులందరు
రాచకార్యముల మంత్రుల సరియగు

నీతిశాస్త్రముల నెరిగినవారు
అంతులేని పరాక్రమవంతులు
సకలవిద్యలలొ చతురులు వారు
శ్రీకి నిలయములు వారి నిలయములు.

స్వపరదేశముల విషయములన్నీ
వేగులవలన తెలియుచుందురు
గుండెనిబ్బరము దండనీతిలో-
విడువరు దోషుల పుత్రులైనను.

దోషములేనిచొ శత్రువునైనా
దండించరు ఆ సచివులెవ్వరు
వీరపుంగవులు నీతికోవిదులు
సత్పురుషుల కాపాడుచుందురు.

అసత్యమాడక మోసము నెరుగక
పరస్త్రీ మోహము అసలేలేక
కోసలదేశము న్యాయమునిండి
ధర్మము నెలకొని శాంతిగ నుండెను

చక్కని వలువలు అలంకారముల
చెక్కుచెదరని నడవడిగలిగి
నీతి అనెడి - తమ కంటిని తెరచి
ఏమరకుండిరి జనులందరును.

సామంతులను దండించుటయో
లేదా సంధితొ లొంగదీయుటో-
రాచరహస్యము లెరుకపరచని
గుణవంతులు ఆ రాజుకు సచివులు.

దశరథరాజు మిత్రుల హితుడు
సములగునట్టి సామంతులను
అదుపాజ్ఞలలో నుంచి శత్రువుల
మదమణగించి పుడమినేలెను.

బుద్ధికుశలురు రాజుకు హితులు
సమర్థులయిన సచివులగూడి
దశరథవిభుడు తేజము నిండిన
సూర్యునివోలె వెలుగులు నింపెను.

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 8 దశరథుడు అశ్వమేధయాగము చేయ సంకల్పించుట

అంతటి సద్గుణుడైన దశరథుడు
బుద్ధిమంతుడు ధర్మశీలుడు
పుత్రులులేని లోటు తీరుటకు
అశ్వమేధమును సంకల్పించెను.

మదిలో యోచన మెదిలినంతనే
వివేకనిధులగు సచివుల పిలచి
తన తలంపును తెలియబరిచెను
పురోహితులను గురువుల పిలచెను.

సుమంత్రునంపి సంతోషముతో
సుయజ్ఞుని మరి వామదేవుని
జాబాలి మరి కాశ్యపమునిని
భూసురోత్తముల రావించెనట.

రాజోత్తముడు పూజ్యులందరికి
పూజలు సలిపి పలికె మధురముగ
బిడ్డలులేక సుఖమదిలేదు
అశ్వమేధము చేయుతలంపనె.

సంతానముకై శాస్త్రసమ్మతిగ
యాగము చేసెద కోరిక తీరగ
నిర్విఘ్నముగ నిర్వహింపగా
వీలగు క్రమమును వివరింపుడన.

భూసురోత్తములు లెస్స పలికిరి
సంతోషముతో రాజునుగాంచి
సంబారములవి సమకూర్చుమని
యాగాశ్వమును విడువగ నుడివిరి

ధర్మసమ్మతము నీ ఆలోచన
ఉత్తమ పుత్రుల బడయుదు వీవను
గురువుల ఆశీస్సుల నందుకొని
తగు ఆజ్ఞలు తనవారికి ఒసగెను.

''సంబారములు సిద్ధముచేసి
సమర్థులయిన యోధులనెంచి
ఋత్విక్కులు వారనుసరించగా
విడువుడు తురగము శాస్త్రసమ్మతిగ.

సరయూనదికి ఉత్తరతీరము
యాగశాలకు అనువగు స్థలము
విఘ్నములెవ్వీ కలుగ కుండగను
శాంతిపూజలు విధిగా చేయుడు.

అశ్వమేధము యీ క్రతువెంతో
శాస్త్రోక్తముగా అతి మెలకువతో
చేయకున్నచో అపరాధమ్మగు
లేనిచొ అందరి కందుబాటిది.

దోష కార్యములు చేసిన ద్విజులు
ప్రాయశ్చిత్తము చేసికొననిచో
బ్రహ్మరాక్షసులు అయి పడివుందురు
వారు దోషముల నెంతురు క్రతువున.

యాగము చేసెడి విధి విధానములు
తెలియును వారికి- లోపములెంచి
విఘ్నముతెచ్చి చెడగొట్టుదురు
యాగము చెడును కర్త నశించును.

కావున మీరు గురువులు నాకు
సమర్థులయిన భూసురోత్తములు
శాస్త్ర సమ్మతిగ నిర్విఘ్నముగా
యాగము నాచే చేయించు''డనె.

రాజు పలుకులకు సచివులందరు
సంతసించి ఆ రాజుతొ పలికిరి
నీదు ఆనతి తలను ధరించి
నీదు యోచనతొ నడచెదమనిరి.

ధర్మమూర్తులు ఆ ఋత్విక్కులు
దశరథవిభునకు ఆశీస్సులనిడి
రాగల చైత్ర పూర్ణిమనాడు
ఆరంభింతము యాగము అనిరి.

విప్రులందరిని గృహములకంపి
వస్తువులన్నీ లోటులేకను
సమకూర్చుడు- అని పలికి అంతట
సచివులందరిని నెలవులకంపెను.

అంతఃపురమున కేగుదెంచెను
శుభవార్తను తన సతులకు తెలిపెను
యాగదీక్షలో నుండవలసిన
కౌసల్యాది ధర్మపత్నులతొ-

''యజ్ఞదీక్షలో నుండుడు మీరు
పుత్రుల కొరకీ యాగము'' అనగా
ధర్మపత్నుల విరిసిన ముఖములు
మంచు వీడిన కమలములాయెను.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 9 సుమంత్రుడు ఇతిహాసముగా వినిన విషయము దశరథునకు తెలుపుట

పుత్రుల కొరకై అశ్వమేధమును
సంకల్పించిన దశరథ విభునితొ
సుమంత్రుడతడు సచివుడు-సారథి
ఏకాంతములో తెలిపెను అంత.

''రాజోత్తమ! యీ అశ్వమేధమును-
సనత్కుమారుడు నుడివినవిషయము
అంతయు ఇతిహాసముగా వింటిని
తెలిపెను మహఋషి మునులందరికి.

ఋషివాక్కులుయివి విను మహరాజా!
కాశ్యపమహర్షి కుమారుడతడు
విభండకునిగా వినుతికెక్కిను
అతనికి తనయుడు ఋష్యశృంగుడు.

ఋష్యశృంగుడు విప్రోత్తముడు
వనమునపుట్టి పెరుగుటచేత
నిరతము కాననమందు తండ్రితో
తిరుగుటచేత లోకము నెరుగడు.

హుతవాహుని మరి, తండ్రిని- గురువును-
సేవించుచును బ్రహ్మచర్యమును
వ్రతముగ నెంచి ఆచరించుచు
ఋష్యశృంగుడు గడుపుచుండగా.

అంగదేశమున కధిపతియైన
రోమపాదుడు ప్రతాపవంతుడు
ధర్మముతప్పిన ఫలితముగాను
అనావృష్టికి రాజ్యములోనగు

రోమపాదుడు విప్రులపిలచి
రాజ్యములోని బాధనుతెలిపి
ప్రాయశ్చిత్తము చేసుకొనుటకై
మార్గోపాయము తెలుపగవేడెను

వేదవిదులు ఆ భూసురోత్తములు
విభండకముని కుమారునటకు
వివిధోపాయము లుపయోగించి
రప్పించుటయే కర్తవ్యమని

ఋష్యశృంగునికి ఆనందముగా
అనుంగుపుత్రిక అగుశాంతమ్మను
ఆలిగ నొసగి శాస్త్రోక్తముగ
వివాహవిధిని నెరవేర్చమన.

బ్రహ్మచర్యవ్రత దీక్షాపరుని
రాజ్యములోనికి రప్పించుటఎటు?
పాదపద్మములు కడుగుటఎట్లు?
అని – ఆ రాజు ఆలోచించి

చింతలొవుండి చివరకు తేల్చుకు
ఋష్యశృంగుని గొనివచ్చుటకు
పురోహితులను సచివోత్తములను
సత్కరించి మరి పంపగ నెంచెను.

అంతట వారు భయమున పలికిరి :
'రాజా! మేమట కెట్లుపోగలము?
విభండకుడు సామన్యుడుకాడు
శాప, తాపముల సమర్థుడతడు.

అయినా – విను మా ఆలోచన ఇది
అందగత్తెలను పంపి – అతనిని
రప్పింతుము అది మేలగుమార్గము
శాపదోషము కలుగదు' అందురు.

దశరథరాజా! ఋష్యశృంగుడు
రాజ్యమునకు గొనిరాబడినంత
వలయు వర్షము కురియును అంత
శాంతను పరిణయ మాడును అతడు.

తపోవంతుడు – ఋష్యశృంగుడు
నీకు పుత్రులు కలుగు యాగమును
నడుప సమర్థుడు అని నే వింటిని
సనత్కుమారుడు తెలిపెను మున్ను.''

సుమంత్రుడాడిన మధురోక్తులకు
సంతసమంది దశరథ విభుడు
రోమపాదుడు ఋష్యశృంగుని
రప్పించుట తా వినగోరితినని.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 10 ఋష్యశృంగుని వృత్తాంతము

''ఋష్యశృంగుడు గొనిరాబడిన
వృత్తాంతమును తెలిపెద రాజా!
అందరు వినుడు'' అని పలికి అట
మంత్రి సుమంత్రుడు ఆరంభించెను :

''మంత్రులందరును పురోహితులును
పలికిరి అంత రోమపాదునితో
అపాయమెరుగని ఉపాయమిది విను
అందగత్తెలను అందుకు పంపుట.

ఆ వనవాసి–వేదాధ్యయనుడు
తపోనియమముల కాలము గడుపుచు,
స్త్రీల నెరుగడు లోకము తెలియదు
సుఖములు అసలే వినలేదతడు.

అందగత్తెలు అలంకారముల
ఆటకేతెంచి అతనిని చూచి
ఆకర్షించి కొని రాగలరు
వారిట సత్కారములందెదరు.

రాజు సరియన - సచివులానతిని
అందగత్తెలు అందుకు సరియని
ఆశ్రమవాటిక దరికేతెంచి
దర్శనమునకై పొంచియుండిరి.

ఋష్యశృంగుడు ఆశ్రమవాటిక
దాటి ఎన్నడూ వచ్చి యెరుగడు
తండ్రిని తప్ప మరియొక వ్యక్తిని
ఎరుగడు-నగరము అసలే తెలియదు.

అందగత్తెలు అతనిని చూడగ
పొంచియుండగ-ఋష్యశృంగుడు
యాదృచ్ఛికముగ అంగనలున్న
స్థలమునకేగి వారల గాంచెను.

అంతట ఆ వనసీమలో వారు
తీయని పాటలు పాడుచు-విప్రుని
వివరము లడిగిరి - ఈ వనసీమల
ఒంటరివై నువు ఏల తిరుగుటని.

సుందరరూపుల నందర గాంచెను
ముందు ఎన్నడూ చూచి ఎరుగడు
వారిని చూడగ సఖ్యము చేయగ
మనసు గలిగి తన వివరము తెలిపెను.

ఋషిపుత్రుడు ఆ సుందరాంగులను
పూజలనందగ ఆశ్రమమందు
అడుగిడమన-వారందుకు సరియని
వచ్చిరి ఆశ్రమ వాటిక లోనికి.

ఋష్యశృంగుడు శ్రద్ధాభక్తుల
అర్ఘ్యపాద్యముల కందమూలములు
మధుర ఫలములు ప్రీతిగ నొసగి
పూజలొనర్చి సంతసమందెను.

పూజలనంది ఆనందముతో
తిరిగి ఫలములు భక్ష్యములిచ్చి
కౌగిలినిచ్చి - తండ్రి వచ్చునని
భయముతో వారు తొలగిపోయిరి.

ఎన్నడుతినని రుచి విననట్టి
భక్ష్యములన్నీ ఫలము లనుకొనె
అనుభూతికి తా నచ్చెరు వందెను
వారల తిరిగి కాంచగమనసై

బ్రహ్మచర్య వ్రతదీక్షలు సలిపెడి
ముని కుమారుడు ఋష్య శృంగుడు
ఆనందముగా ఆవనసీమలో
ఎదురుచూచెను వారందరికై.

అందగత్తెలను చూడగ మనసుతొ
వచ్చుచున్న ఆ ఋషి కుమారుని
చూచిన కాంతలు సంతస మందిరి
తమ పని నెరవేరినదని తలచిరి.

అతనికి ఎదురుగ అందరు వచ్చి
మధుర వాక్కుల పలికిరి అపుడు,
'మా నగరమున మా ఆతిథ్యము
స్వీకరించుము సత్కరింతుము.'

వారి పలుకులకు ముదమును పొంది
బయలుదేరగా మనసు కలిగినది
అంతట అతనిని తోడ్కొని వారు
తిరుగుయానమున బయలుదేరిరి.

అంగదేశమున అడుగుబెట్టుటకు
బయలుదేరెను ఋష్యశృంగుడు
వరుణుడు అంతట వర్షము నచ్చట
కురిపించెను మది పులకించగను.

వర్షము తెచ్చుచు వచ్చిన విప్రుడు
ఋషికుమారుడగు ఋష్యశృంగునికి
ఎదురువచ్చి ఆ రోమపాదుడు
సాష్టాంగముగా ప్రణామమిడెను.

శ్రద్ధాభక్తుల అర్ఘ్యమునిచ్చి
విభండకుడు తమ ననుగ్రహించగ
తండ్రి ప్రసన్నుడు అగునటు చేయగ
కోరెను రాజు - ఋష్యశృంగుని.

అంతఃపురముకు తోడ్కొని వచ్చి
శాంతను యిచ్చి శాస్త్రోక్తముగా
కల్యాణమును జరిపించగను
ఋష్యశృంగుడు పురమున నుండెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 11 ఋష్యశృంగుని దశరథుడు అయోధ్యకు తోడ్కొని వచ్చుట

మరియొక విషయము దశరథరాజా!
దేవశ్రేష్ఠుడగు సనత్కుమారుడు
కృతయుగంబున కథగా చెప్పిన
మధుర వాక్కులను నే వినిపించెద.

ధార్మిక సంపద సిరిసంపదలు
సత్యప్రతినగల రాజోత్తముడు
దశరథభూపతి ఇక్ష్వాకులలో
జన్మించును ఆ వంశము శోభిలు.

అంగరాజగు రోమపాదునితో
దశరథరాజుకు సఖ్యమేర్పడు
భాగ్యశాలిని 'శాంత' పేరుగల
కూతురు కలుగును ఆ మహరాజుకు.

అంగదేశపు రాజు అంగుడు
అతనిపుత్రుడు రోమపాదుడు
దశరథవిభుడు రోమపాదుని
పంపగ కోరును ఋష్యశృంగుని.

దశరథ విభుని వచనమ్ములువిని
రోమపాదుడు ఋష్యశృంగుని
పుత్రులనొసగెడి యాగము నడుపగ
సమర్థుడని - ఋత్విక్కుగనిచ్చును.

చింతలుతొలగి దశరథవిభుడు
శాంతాపతిని తోడ్కొనిపోయి
యాగాధ్వర్యము నిర్వర్తించగ
అంజలి ఘటించి వేడును మునిని.

యాగముసాగును నిర్విఘ్నముగ
వంశకీర్తిఅది యినుమడించగా
సర్వలోకముల ప్రసిద్ధులైన
నలుగురుపుత్రుల బడయును రాజు.

కావున రాజా! త్రికాలజ్ఞుడు
సనత్కుమారుని మాటలు నిజమగు
కావున నీవు సత్కారములతొ
ఋష్యశృంగుని గొనిరావలెను.''

మంత్రి సుమంత్రుని మాటలు వినిన
దశరథరాజు వశిష్ఠమునితో
తనవారందరు వెంబడిరాగా
అంగదేశము బయలుదేరెను.

వనములు, నదులు దాటి దశరథుడు
రోమపాదుని రాజ్యము చేరెను
రాజుచెంత ఆ తేజోమూర్తిని
అనల సన్నిభుని మౌనినాయకుని

కన్నులగాంచెను దశరథరాజు
రోమపాదుడు మిత్రునిజూచెను
ప్రీతిగొలపగా ఆనందముతో
అతిథిపూజలు సఖునకు చేసెను.

రోమపాదుడు బుద్ధిశాలియగు
ఋష్యశృంగునికి మైత్రినితెలిపి
బంధుత్వమును తెలయబరచగా
దశరథరాజును ముని పూజించెను.

రోమపాదుని సత్కారముల
కొన్నిదినములు సుఖముగ గడిపి
రోమపాదునితొ పలికెను రాజు
శాంతను భర్తతొ పంపగోరెను.

ఋష్యశృంగుని పంపమనగను
రోమపాదుడు సరియని పలికి
''ధశరథవిభుని ఆహ్వానమ్ము
మన్నించు'' మని మునిని కోరెను.

మామ మాటలు ముని విని, సరియని
అనుమతినంది అనుంగుసతితో
బయలుదేరెను-మిత్రులిద్దరు
ఆలింగనమున మనసులు కలిపిరి.

దశరథవిభుడు శలవందుకొని
బయలుదేరుచు ఆ శుభవార్త
దూతలద్వారా పురముజేర్చెను
అలంకరించగ నాజ్ఞాపించెను.

అమితోత్సాహము ఆనందముతో
అయోధ్య వెలిగెను ఎంతో శోభగ
భూసురోత్తముని ముందు నిడుకొని
మంగళధ్వనులతొ రాజు చేరెను.

దేవరాజుతో సరిపడు వీరుడు
దశరథరాజు-సత్కారములతొ
తోడ్కొని వచ్చెడు మునిపుంగవుని
పౌరులు గాంచి మదము నందిరి.

అంతఃపురమున దశరథరాజు
శాస్త్రోక్తముగా పూజలు సలిపి
ఋష్యశృంగుని గొనివచ్చుటచే
కృతార్థుడైనటు సంతసమందెను.

అంతఃపురమున కాంతలందరు
శాంతను ప్రేమగ చూచుచుండగా
ఆనందముగా కొంతకాలము
పతితో శాంత గడపె నయోధ్యలో.
॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 12 అశ్వమేథయాగము నిర్వహించుమని ఋష్యశృంగుని రాజు కోరుట

కొంతకాలము గడచిన పిదప
మనోహరమ్మగు వసంతకాలము
సమీపించగా దశరథరాజు
యాగముచేయగ నిశ్చయించుకొని.

వారందరికీ పూజలు సలిపి
వినయమునిండి రాజు పలికెను.
''బిడ్డలకొఱకై పరితపించెడి
నాకోరికది యాగము చేయగ.

దేవతేజముతొ భాసిలునట్టి
ఋష్యశృంగునకు భక్తితొ మ్రొక్కి
శిరసును వంచి వందనముంచి
యాజకత్వమును చేయగ కోరెను.

అశ్వమేధము శాస్త్రోక్తముగా
చేయదలచితిని- ఋష్యశృంగముని
ముందు నిలువగా మీరందరును
ఆశీస్సులనిడ కోరిక తీరును.''

ఋష్యశృంగుడు సరియని పలికి
సంబారమ్ములు సమకూర్చుకొని
యాగాశ్వమును విడువగ నుడివెను
రాజు-సుమంత్రుని కాదేశించెను :

రాజు కోరిక వినిన విప్రులు
వశిష్ఠమహర్షి మొదలగువారు
సాధువాదముల రాజుతొ పలికిరి
నీ అభీష్టము నెరవేరునని.

''వేదవిదులను ఋత్విక్కులను
వేగమెపోయి ఆహ్వానించి
సుయజ్ఞుని మరి వామదేవుని
జాబాలిని ఆ కాశ్యపమునిని.

సంబారమ్ములు సమకూర్చుకొని
యాగాశ్వమును విడువగ నుడివిరి
ధర్మసమ్మతి నీ ఆలోచన
నలుగురు పుత్రుల బడయుదువనిరి

కుల గురువైన వశిష్ఠమునిని
విప్రోత్తములను అందరపిలువుము.''
ఆనతినంది ఆనందముతో
పిలిచెనందరిని మంత్రి సుమంత్రుడు.

వారి పలుకులకు సంతస మంది
రాజు, మంత్రులతొ ప్రియముగ పలికెను
గురువులు ఆదేశంచిన విధముగ
సంబారమ్ములు సమకూర్చుకొని

కవచధారుల రక్షణనుండగ
ఆధ్వర్యుడును ఆదిగాగల
ప్రధానఋత్విజు లనుసరించగా
యాగాశ్వమును విడువగ నుడివి.

''సరయూనదికి ఉత్తరతీరము
యాగశాలకు అనువగుస్థలము
విఘ్నములేవియు కలుగకుండగను
శాంతిపూజలు విధిగా చేయుడు.

అశ్వమేధము యీ క్రతువెంతో
శాస్త్రోక్తముగా అతి మెలకువగా
ఆచరించనిచొ అపరాధము సుమ!
కావున అందరి కందని క్రతువిది.

దోషములంటిన బ్రాహ్మణులందరు
ప్రాయశ్చిత్తము చేసికొననిచో
బ్రహ్మరాక్షసులుగ! శాపగ్రస్థులై!
వారు దోషములు వెదకుచుందురు.

యాగముచేయు విధి విధానములు
తెలియును గనుక లోపములెంచి
విఘ్నముతెచ్చి చెడగొట్టుదురు
యాగమధ్యమున కర్త నశించును.

సమర్థులైన వారు గనుకను
సరియగు రీతిని శాస్త్రోక్తముగా
పరిసమాప్తము అగురీతిగను
నిర్వర్తింపుడు'' అని పలుకగను.

సచివులందరు సరియని పలికిరి
రాజు కోరినటు సర్వము చేసిరి
విప్రోత్తములు ఆశీస్సుల నిడి
శలవునంది తమ నెలవుల కరిగిరి.

ద్విజులు-గురువులు-వెడలగ నంత
సచివులందరిని గృహముల కంపి
ఆనందముతో రాజచంద్రుడు
అంతఃపురమున అడుగుబెట్టెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 13 అశ్వమేధయాగ సన్నాహము – యాగారంభము

తిరిగి వసంతము వచ్చువరకును
పూర్తిగ నిండెను ఒక ఏడాది
రాజోత్తముడు క్రతుదీక్షితుడై
యాగ శాలకు వెడలెను సతులతొ.

వశిష్ఠమునికి వందనముంచి
శాస్త్రోక్తముగా పూజలు సలిపి
''భూసురోత్తమా! పుత్రుల కోరి
సంకల్పించితి నీ యాగమును

శాస్త్రోక్తముగా క్రియ చేయించి
ద్రవ్యదేవతా కర్మాదులగు
యజ్ఞాంగముల విఘ్నములేక
యజ్ఞ భారము వహించవలె'' నన

సరియని పలికి వశిష్ఠమౌని
సమర్థులందర కాదేశములిడె
యజ్ఞకర్మలో నిష్ఠకలిగిన
ద్విజులను ధార్మిక వృద్ధులందరిని

కర్తవ్యములను ఆచరించుమని
వలయు వస్తువులు సమకూర్చుడని
వడ్రంగులను, చిత్రకారులను
వ్రాయసకాండ్రను అందర కోరెను.

ఇటుకలు- స్రుక్కులు మొదలగునట్టివి
యాగముకొరకై పురమాయించెను
బావులు త్రవ్వగ ఆదేశించెను
నటకుల- నర్తకులందర బిలిచెను.

శాస్త్రవిదులతో పలికె వశిష్ఠుడు
రాజు ఆనతిని మీరందరును
ఉపకరణములతొ విశాలమ్ముగా
రాజభవనముల తీర్చిదిద్దుడనె.

భక్ష్యము, లన్నము పానీయములతొ
కట్టుదిట్టమై మంగళకరమగు
గృహములు వందలు-విప్రులకొరకు
పురజనులకును నిర్మించుడనె.

'' ఎల్లజనులకు ఆదరముంచి
సత్కారముల పూజలు సలిపి
తిరస్కారము ఎంతయు చూపక
భోజనాదులు ప్రీతిగ నిడవలె.

ధనముతొ- భోజన సదుపాయములతొ
స్నేహార్ద్రముగ తృప్తికలుగునటు
యజ్ఞాంగములకు లోటులేకను
తీరుగ మీరు చేయుడు'' అనగ.

''గృహనిర్మాణము లన్నీ జరిగెను
లోటుపాటులు లేవు'' అనుచును
''ఇకపై మీరు ఆదేశించుడు
అంతయు శ్రద్ధగ చేతుము'' అనిరి.

వశిష్ఠుడంతట సుమంత్రుచూచి
తీరుగపలికెను-''సచివోత్తమ! నువు
ధరణీనాథుల నందర బిలువుము
ఎల్లజనులును రావలెనయ్యా!

భాగ్య శాలియు వేదవిదుడును
సత్యశీలియు పూర్వబంధువగు
మిథిలానాథుని పురమునకేగి
స్వయముగనీవు తోడ్కొనిరమ్ము.

కాశీరాజు మిత్రుడు ప్రభువుకు
కేకయరాజు మామయగును కద
అతని కుమారుని-వారందరినీ
స్వయముగ నీవు పిలుచుకురమ్ము.

అంగదేశపు అధిపతి మిత్రుడు
కీర్తిమంతుడు భాగ్యశాలియగు
రోమపాదుడు దశరథహితుడు
స్వయముగ నీవే పోవలెను సుమా!

తూర్పుదేశము సింధుదేశము
సౌరాష్ట్రము మరి సౌవీరముల
దక్షిణదేశపు రాజులందరిని
దూతలనంపి రప్పించుము నువు.

భూతలమందలి భూమీనాథుల
వారిహితులతో పరివారములతో
రప్పించుము ''అన సుమంత్రుడంతట
సరియని పలికి దూతలనంపెను.

వశిష్ఠమహఋషి రాజునుచూచి
''సంబారమ్ములు సమకూరినవి
హితులును, రాజులు వచ్చినారయా!
యజ్ఞశాలకు బయలుదేరుము.

నియుక్తులందరు తీరుగ చేసిన
పనులు చెప్పిరి వశిష్ఠమునికి.
''శ్రద్ధా భక్తుల దానముచేయుడు
లేనిచొ కర్తకు హాని కలుగును.''

సర్వముసిద్ధము అయినవి రాజా!
శీఘ్రముగానవి సమకూరుటది
సొంపుగ అమరుట చూడుమునీవు
పొసగెనన్ని సంకల్పబలమున.''

అనిపలికెను అట వశిష్ఠమహఋషి
అంతట రోజులు కొన్ని దొరలినవి
అందరు రాజులు బహుమతులను గొని
అరుగుదెంచిరి అయోధ్యనగరికి.

వశిష్ఠ మహఋషి ఋష్యశృంగుల
ఆశీస్సులవి శిరోధార్యమని
శుభతిథి-వార-నక్షత్రమున
యాగశాలకు రాజు సాగెను.

అంతట విప్రులు వెంట నడచిరి.
వశిష్ఠమహఋషి ఋష్యశృంగుడు
యాగక్రమమును క్రమవిధితోను
శాస్త్రోక్తముగా ఆరంభించిరి.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 14 అశ్వమేధయాగ సమాప్తి-సంతానము ననుగ్రహించు క్రతువు చేయించమని దశరథుడు ఋష్యశృంగుని కోరుట

యాగాశ్వమును విడచినంతట
పూర్తిగ సంవత్సరమగునాటికి
యాగాశ్వమ్మది మరలివచ్చెను
క్రతువుమొదలయె నదీతీరమున.

శాస్త్రవిధులను తూ.చ. తప్పక
త్రికాలసవనము లంతటచేసి
సోమదేవుని స్తోత్రముచేసి
క్రమానుగతముగ యజ్ఞము నెఱపిరి.

ఋష్యశృంగుని ముందునిడుకొని
విప్రోత్తములు ఋత్విక్కులును
వేదోక్తముగ కల్పసూత్రముగ
ఉపసదనమ్మను ఇష్టిని కలిపి

హవిస్సు పూర్తిగ హోమము చేసిరి
అజాగ్రత్త ఇసుమంతయులేకను
శాస్త్రవిరుద్ధము వెదకినదొరకక
మంత్ర పూతముగ యజ్ఞము సాగెను.

యజ్ఞముజరిగెడి అన్ని దినములు
భుక్తాయాసము కలిగెనందరకు
అపండితులు అట అసలేలేక
శిష్యగణముతో నుండిరి. ద్విజులు.

స్త్రీలు, బాలురు, వృద్ధులు, రోగులు
సన్యాసులును తాపసోత్తములు
రుచ్యములయిన విందుభోజనము
నిండుగ తినిరి తృప్తినిండగా.

విందుభోజనము అందరురండని
పిలచిపిలచి మరి తినిపించిరట
పర్వతాలవలె వండినవంటలు
ఆదరముంచి వడ్డనచేసిరి.

వివిధదేశముల ఆహూతులట
అన్నపానముల సంతృప్తులయి
వివిధవస్త్రముల సత్కారములతొ
శుభములుపలికిరి దశరథవిభునకు.

తృప్తిగవిందును ఆరగించిరి
విప్రోత్తములు వేదమూర్తులు
ఒకరినిమించిన వారొకరన్నటు
శాస్త్రచర్చలు చేయసాగిరి.

వేదమునెరుగని ద్విజుడేలేడు
వాదముగెలవని విప్రుడులేడు
పెద్దలవలన విషయమునెరుగని
అపండితులు ఆ సభలోలేరు.

యాగపశువులను కట్టుటకొరకై
యూపస్తంభములు ఇరువది ఒకటి
తగినసమయము వచ్చినంతనే
శాస్త్రసమ్మతిగ నెలకొనజేసిరి.

మారేడు ఆరు-మరి చంద్రవి ఆరు
ఆవల మోదుగు ఆరు స్తంభములు
విరిగి స్తంభము వేదిక వద్ద
యిరు ప్రక్కలను దేవదారుతో.

మొత్తము ఇరువది ఒకటై నిలచిన
యూపస్తంభములు- బంగారముతో
వివిధ వస్త్రముల అలంకారముల
సప్తఋషులవలె ప్రకాశించెను.

శాస్త్రయుక్తముగ కొలతలు తెలిసిన
విప్రులు-వేదిక నిర్మించిరట
గరుడాకారము- బంగరు రెక్కలు
పదునెనిమిది అగు ప్రస్తారమ్ముల.

క్రమ పద్ధతిలో వేదిక నిలపి
అశ్వము ముందు- దానితొపాటు
మూడువందల జంతువులను అట
శాస్త్ర ప్రకారము కట్టిరి విప్రులు

పట్టపురాణి అశ్వముచుట్టు
ప్రదక్షిణించి నమస్కరించి
మూడు బంగరు సూదులతోను
సుతిమెత్తగను నాటువేసెను.

ధర్మచింతనతొ రాత్రియంతయు
నిదురించెను రాణి యజ్ఞశాలలో
శాస్త్ర విధిగను యాగబ్రహ్మకు
దక్షిణయిచ్చెను తనదేవేరిని

తదుపరి ముగ్గురు స్త్రీలను రాజు
దక్షిణగా ఋత్విక్కులకిచ్చెను
అంతట అశ్వపు వపను ఋత్విజులు
మంత్రయుక్తముగ అగ్నిలొ వ్రేల్చి

హోమము చేయగ ధూమమునపుడు
దశరథరాజు ఆఘ్రాణించెను
పదిపైయారు సంఖ్యలొ విప్రులు
అశ్వాంగములను హోమముచేసిరి.

హవిసును పాకము చేయుటకొరకై
రావిసమిధను వాడుచుందురు
అశ్వమేధమున ప్రబ్బలిసమిధతొ
పాకము చేయగ శాస్త్రము నుడివెను.

జతుష్టోమము, మక్థ్యము మరియు
అతిరాత్రములను మూడు దినములు
అశ్వమేధమును జరిపి ఋత్విజులు
వలయు కార్యములు అన్నీ సలిపిరి.

రాజ్యమునంతయు దిక్కుల లెక్కన
హోతకుతూర్పును, అధ్వర్యుకుపడమర
ఉత్తర దిక్కు ఉద్గాతకును
బ్రహ్మకు దక్షిణ దిక్కును తెలుపుచు

యాగము జరిపిన ఋత్విక్కులకు
దానము యిచ్చెను దశరథనృపతి
అంతట ఋత్విజు లందరుపలికిరి
వేయిరీతుల రాజును పొగడుచు :

"రాజా! మాకు రాజ్యమువలదు
యోగికి భోగము సరిపడదయ్యా!
ఏలుము నీవే- గోవులుగాని
స్వర్ణము రజితము దానము యిమ్ము."

వారిమాటలకు దశరథరాజు
వేయివేలగు గోవులనిచ్చి
పదియగుకోట్ల బంగరు- దానికి
నాలుగింతలుగ వెండిని యిచ్చెను.

వశిష్ఠమునికీ ఋష్యశృంగునికి
విప్రులు యిచ్చిరి ఆ ధనమంతయు
తీరుగవారు భాగములేసి
పంచి యిచ్చిరి భూసురులకును.

దానమునంది తృప్తిని పొంది
మనసు నిండుగా దీవనలిడిరి
పాపహరణమగు యాగముకాగా
ఋష్యశృంగునితొ రాజుపలికెను :

"మునిపుంగవ! నువు అశ్వమేధమును
చేయించితివి విజయవంతముగ
సంతానముయిక కలిగెడియాగము
అనుగ్రహించుము నాపైదయగొని."

॥శ్రీరఘురాముని॥

## 15 పుత్రకామేష్టి–సురలు రావణ సంహారమునకై నారాయణుని నరునిగా అవతరింప వేడుట

ఋష్యశృంగముని పలికె రాజుతో :
''విచారించగ వలదు నీ వికను
కీర్తికి నెలవగు నలుగురు కొడుకులు
కలుగగ ఇష్టిని నే చేయించెద.''

అంతట యాగము ఆరంభించిరి
సుర, గంధర్వులు కమలాసనుడు
హవిర్భాగము లందగ వచ్చిరి
బ్రహ్మను చూచి సురలు పలికిరి :

''వాణీనాథా! రావణాసురుడు
నీవొసగిన వర బలము చేతను
పెట్టని యిడుములు లేనే లేవు
నీవర మది కద! చంపగ లేము.

అసురుని భయమున దేవా! వినుము
సూర్యుడు చల్లని చంద్రుడాయెను
వాయువు కదలడు అబ్ధి మెదలడు
మాగతి యింక అడుగగ వలెనా?''

బ్రహ్మ పలికెను '' ఉపాయమ్మిది
వాడు నరులయెడ ఉదాసీనుడై
వరములో వారిని లెక్కిడ లేదు
కావున నరులే తగుదురు వానికి.''

ఆలోచన ఆట సాగుచుండగా
శ్రీవత్సాంకుడు జగన్నాయకుడు
శంఖ, చక్ర, గద, అభయ ముద్రలు
కలిగిన విష్ణువు విజయము చేసెను.

నారాయణుని సన్నుతించిరి
విన్నవించిరి తిన్నగ బాధలు
దశరథ విభుని యాగము చెప్పి
అతని సతులు శుభలక్షణ లనిరి.

''దశరథవిభు దేవేరులు తీరుగ
శ్రీ, భూ, కీర్తి, అనగ తగుదురు
మంగళమూర్తుల మహిత గర్భముల
నాలుగు అంశల అవతరించుము.

నరజన్మముతో ఓ నారాయణ!
లోకకంటకుని రావణు త్రుంచుము
ధర్మోద్ధరణము సాధురక్షణకు
భువికేగుటకై సంకల్పించుము.''

లోకరక్షకుడు అభయము నిచ్చెను
సురలను, మునులను చూచి పలికెను :
''దశముఖుడాదిగ అసురు లందరిని
అంతముజేసి శాంతినిగూర్చెద.''

అభయము నిచ్చి పద్మనేత్రుడు
దశరథరాజు తనకు తండ్రియగు
అర్హుడు అనుకొని అందుకు సరియన
పశుపతి మొదలగువారు నుతించిరి.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 16 దివ్యపాయసముచే దశరథుని దేవేరులు గర్భములను దాల్చుట

అమరులు, సిద్ధులు ప్రార్థించగను
వారల గాంచి నారాయణుడు
అసురుల జంపు నుపాయము అడుగగ
భక్తిగ వారు స్తోత్రముజేసి

అంతయు తెలిసి అభిమానము తో
అడిగెడు హరితో - ''దేవా! నీవు
నరునిరూపమున దనుజులద్రుంచుము
రావణు మరణము నరునివలననే.

బ్రహ్మ వరమున గర్వమదాంధుడు
పెట్టెడి హింసల కడ్డములేదు
నిలువ లేడు సాధారణ నరుడు
నారాయణుడవు నరుడవు కావలె.''

సరియని పలికి శ్రీవల్లభుడు
అంతర్ధానము అయినంతటను
దశరథుడంతట చేయుచున్న ఆ
పుత్ర కామేష్టి హోమము నడుమ.

నాల్గుదిక్కులా వెలుగులు చిమ్ముచు
దివ్యతేజమున ఎఱుపు, నలుపుగల
వస్త్రధారణతొ ఎఱ్ఱని ముఖముతొ
దుందుభి నాదము వంటి కంఠముతొ

పర్వతకాయుడు సొమ్ములుమెరయుచు
అగ్ని, సూర్యుల తేజము గలిగి
భుజమున బంగరు పాయసపాత్రను
ప్రియముగ ప్రాణము అన్నటు దాల్చి

రాజుతొ పలికెను :''ఒ ధరణీశా!
ప్రాజాపత్యమూర్తిని నేను''
అనగ దశరథుడు కరములు ముడిచి
''ఆదేశించుము దివ్యస్వరూపా!''

రాజు పలుకులకు మహాశక్తి అనె :
''సంతానముకై చేయు యాగమున
సంతోషించిరి దేవతలెల్లరు
దివ్యపాయసము నిచ్చిరి గొనుమిది.

పుణ్యమూర్తి! నీ కోరిక తీరును
కీర్తివంతులగు పుత్రుల బడయగ
కుల, గుణ, చేష్టా కీర్తులయందు
నీకు తగిన నీ భార్యలకొసగుము.''

దశరథ తేని మది పులకించెను
పాయస పాత్రను శిరముననుంచుకు
దివ్యపురుషునకు ప్రదక్షిణించి
భక్తితొ తాను నమస్కరించెను.

దివ్య మూర్తి అదృశ్యుడయ్యెను
పేదకు పెన్నిధి దొరికినట్టుగ
దశరథరాజు సంతసమందెను
రాణులముఖములు కమలములాయెను.

దశరథరాజు పాయస పాత్రను
కౌసల్యకును చూపుచు నుడివెను
''పూజలు చేయుము పెన్నిధి మనకు
సంతతి నొసగెడి దివ్యవరమిది''

అనుచు పలికి అట అర్థభాగము
కౌసల్యకును యిచ్చి మిగిలిన
పాయసమందు సగము సుమిత్రకు
మిగిలిన సగములో కైకకు సగము

పంచియిచ్చి మరి మిగిలిన సగమగు
శేషము నంతయు తిరిగి సుమిత్రకు
ప్రియముగ రాజు యివ్వగ వారు
కన్నుల కద్దుకు ఆరగించిరి.

రాణులు ముప్వురు గర్భవతులయి
సురలకు క్షేమము కలిగించుటకై
దేవతాంగనల చెఱవిడిపించగ
వారిసంకెలల త్రెంపగచాలిన

సత్పుత్రులకై దీక్షలో నుండగ
సతులను గాంచి సంతస మందుచు
సురలు, సిద్ధుల పూజల నందెడి
సురపతి తీరుగ నుండెను రాజు.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 17 దేవతాంశతో, హనుమ–వాలి–సుగ్రీవ–అంగదాది వానరయోధులు ఆవిర్భవించుట

హవిర్భాగము లందుకు సురలు
మరలు సమయమున కమలాసనుడు
వారల గాంచి పలికె తీరుగా
''నారాయణుడు నరుడై పుట్టును.

కావున మీరు మీమీ అంశల
అతిబలవంతుల కామరూపుల
కోరలు, నఖములు కలిగినయోధుల
సృజియింపుడు శ్రీహరి సాయముకై.

పండితులను మరి నీతిమంతులను
వాయు వేగము కలిగినవీరుల
విష్ణు విక్రమము పోలినశూరుల
అస్త్రశస్త్రముల నెరిగినవారల

కిన్నెర, కింపురుషాంగన లందు
వానర, యక్ష దేవతాంగనల
పన్నగ, భల్లూకపు స్త్రీలందున
అసురుల జంపు వానర వీరుల

సృజి యింపుడు–నే నిదివరలోను
ఆవలించగ జాంబవంతుడు
ఆవిర్భవించెను అతి బలవంతుడు
భల్లూకములకు అధిపతి అయ్యెను.''

వాణీ నాథుని పలుకులు వినిరి
వానర వీరుల భల్లూకములను
విస్తారముగ జనింప జేసిరి
కోనల, కానల తిరుగ జొచ్చిరి.

రవి, ఇంద్రులచే సుగ్రీవుడు వాలియు
వాచస్పతిచే దారుడు కలిగిరి
ధనపతి అంశతొ గంధమాదనుడు
విశ్వకర్మచే నలుడు కలిగిరి.

హుత వాహనునిచె నీలుడు కలిగెను
మైంద, ద్వివిదులు అశ్వని సురలచె
సుషేణుడంతట వరుణుని అంశతొ
పర్జన్యునిచే శరభుడు కలిగిరి.

వాయుదేవునిచె అతి బలశాలి
వజ్రకాయుడు ఖగపతి సముడగు
''ఆంజనేయుడు'' ఉదయించ గను
వానరులెందరొ ఉద్భవించిరి.

వానరు లందరు శౌర్యధీరులు
స్వామి కార్యమున దీక్షా దక్షులు
కామరూపులు బుద్ధి కుశలురు
నూరులక్షలై ప్రకాశించిరి.

వానరవీరులు వాయు వేగముతో
మేఘమునైనా పట్టగ తగుదురు
ఆకాశములో పులుగుల నైనా
నేలకు రాల్చగ నిపుణత గలిగిరి.

''వాలి''రాజు గా వారిని ఏలగ
సుగ్రీవుడు యువరాజుగ నుండి
'' ఆంజనేయుడు'' ''నీలుడు''
సచివు లాతనికి శత్రుభీకరులు.

వేగము నందు గరుత్మంతులై
యుద్ధనిపుణులు వివిధ రూపముల
తిరిగెడి వీరుల గాంచి సింహములు
పులులు, సర్పములు భీతిలసాగెను.

॥శ్రీరఘురాముని॥

❖❖❖

## 18 వైకుంఠ ధాముడు రాముడై జన్మించుట– లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల జననము – విశ్వామిత్ర ఆగమనము

దేవత లందిరి హవిర్భాగములు
యజ్ఞము శుభముగ సమాప్తి యైనది
దశరథరాజు దీక్షను వదలి
దేవేరులతో అయోధ్య చేరెను

మర్రియాకు వలె పలచని ఉదరము
వట పత్రశాయి అట పెరుగుచుండగా
కోసల సుతకు గర్భముపెరిగెను
అయినా తల్లికి భారములేదు.

రాజులందరు కానుక లందిరి
వశిష్ఠముని కడ శలవు నందిరి
ఋష్యశృంగుడు సతియు, మామతో
వీడుకోలు గొని వెడలెను అంత.

''పాల సంద్రము నుండి జగములన్నీఏలు
పరమాత్మ బొజ్జను పాలతోనింపాలి
మాదె అదృష్టమ్ము అన్నట్టు ఉరమది
ముందు కొచ్చెను అమ్మ! ఉండవమ్మా'' అనుచు

ఆహూతులను నెలవులకంపి
పసికందులకై తహ తహ లాడుచు
వేచి యుండెను దశరథరాజు
గర్భము పెరిగెను కౌసల్యమ్మకు.

భవ బంధమ్ముల పారద్రోలెడు
భక్త బంధువు నారాయణుడు
భక్తుల శ్రేయము ప్రియముగ నెంచి
బందీ అయ్యెను గర్భవాసియై.

యజ్ఞము సాంతము అయిన తదుపరి
ఆరుఋతువులు తిరిగె తీరుగా
సరిగా సంవత్సరమగు నాటికి
చైత్ర మాసమున శుద్ధపక్షమున.

నవమీ తిథితో తారపునర్వసు
అభిజిత్ లగ్న కర్కాటక మందు
చంద్రునితో సురగురు డుదయించగ
రవితో కలిపి అయిదు గ్రహములు

ఉచ్ఛస్థితిలో నుండు తరుణమున
జగత్పాలకుని సగ భాగముతో
రఘు వంశ వర్ధనుని లోకపూజ్యుని
రాముని గన్నది కౌసల్యమ్మ.

వామన మూర్తిని గన్నది అదితి
ప్రకాశించెను తేజముతోను
కౌసల్య కన్నది దివ్యబాలుని
దేవ తేజముతొ భాసిల్లినది.

మహావిష్ణువు నాల్గవ అంశతొ
శుభగుణకరుడు భరతకుమారుడు
బలవంతుడును సత్యవంతుడు
కన్నుల పంటగ కైకకు గలిగెను.

విష్ణుదేవుని శేషభాగముల
సుమిత్ర కడుపున శుభలక్షణులు
ప్రేమా దరణల నెలవు లన్నటు
లక్ష్మణమూర్తి, శత్రుఘ్నులు కలిగిరి.

పుష్యమి తార మీనరాశి లో
భరతుడు పుట్టగ ఆశ్లేష తారలో
కర్కాటక రాశిలొ లక్ష్మణ శత్రఘ్నులు
ఉదయించిరి ముద మందెను జగము.

ఏమానందము పృథివీ తలమున
అచ్చర కన్యలు నాట్యము చేసిరి
గానము చేసిరి గంధర్వులట
సంతోషము తో నిండిరి సురలు.

పూల వానలు కురిసిన వంత
దేవ దుందుభులు మ్రోగిన వపుడు
పురము పొంగె నానంద వార్నిధి
మునిగిరి ముదమున పురజను లందరు.

ప్రతి గృహమందు పుత్రోదయము
ప్రతిహృదిలోను నారాయణుడు
పురమున విరిసెను నవ్వుల పువ్వులు
కానుక లందగ ఎందరొచేరిరి.

దోషము లేక మనసులు దోచే
జ్యేష్ఠ కుమారుని రాముడ నుచును
కైక కుమారుని భరతుని గాను
రక్షణ భారము అన్నదే అనును.

రామ సేవకై ముందు నేనను
సుమిత్ర పుత్రుల లక్ష్మణుడ నుచును
కామ క్రోధముల జయించి నిలచెడు
రెండవ వానిని శత్రుఘ్నుని గను.

నామకరణములు వశిష్ఠమహర్షి
నిర్ణయించి ఆ వేడుక జరిపెను
కానుక లందిరి భూసురోత్తములు
దండిగ విందులు జరిగెను పురమున.

లోకాలన్నీ గాచెడు శ్రీహరి
శోకాలన్నీ బాపెడి రఘుపతి
నాకా నందము నరులలొ పుట్టుట
నే కారణము దివి భువి దిగుటకు.

అన్నటు ముసిముసి నవ్వుల పువ్వులు
రువ్వును, తల్లి మనసుకు హాయిగ
గుండెలు పొంగిన సంతోషముతో
పాటలు రాకయె జోలలు పాడును.

జగముల ఏలిక నిద్దురపోవగ
ఆదిదేవునికి అలసట తీరగ
ముద్దుగ తల్లి పాటలు పాడగ
సద్దు చేయక చల్లగ వినును.

నారాయణుని నమ్మిన తల్లి
తన బాలునికి అతడే రక్షని
స్నానము పూర్తి చేసిన యంతనె
రక్షగ నీటిని ద్రిప్పును ఆమె.

తమ్ములతో ను ఆటల నాడుచు
అలసిన బిడ్డకు తల్లి మురిపెముగ
పాలందివ్వగ పాల్కడలి దేవుడు
తమ్ముల కిచ్చి తనకి మ్మనును.

సోదర ప్రేమ నిండిన రాముడు
లక్ష్మణుడాతని ప్రక్కన లేనిచొ
నిద్రా హారములు దరిరానీయడు
నిరతము తమ్ముల తలచు చుండును.

పరిమళ జలముల జలకము లాడి
కస్తురి తిలకము సోయగ మొలకగ
కాటుక రేఖతొ బంగరు సొమ్ముల
ఆడగ బోవును తమ్ముల తోను.

గజ్జలందియలు ఘల్లు ఘల్లుమన
కాంచన హారము లన్నీ మెరయగ
ముద్దు లొలుకుచు గంతులు వేయుచు
తిరిగెడి బాలుని రామునిగాంచి

''మెల్లగ బాబూ! పడిపోదు వయా!''
అను కౌసల్య- అంతట తండ్రి
''నాయన యిటురా ముద్దివ్వ వయా!''
మురిసి పోవుచు గెంతును తాను.

ముద్దుగ పెరిగిరి రాజకుమారులు
విద్యా బుద్ధులు నేర్చిరి తీరుగ
శ్రేష్ఠులయిన ఆ గురువుల కెంతో
సంతోషమ్మగు శిష్యుల గాంచి.

నాల్గు వేదముల నెరిగిన వారు
ప్రజా హితమునే కొరెడివారు
సత్యవాక్కుతో సత్వగుణముతో
సాధు జనులలో రత్నములైరి.

గుండె లందు నివసించెడి దేవుడు
శీల సంపద వీర విక్రమము
సత్య సంధత సాధుసేవలు
భ్రాతృ వత్సలత మూర్తిగ నిలచి.

మనసుల దోచే సుందర రూపము
నీల నీరద శ్యాముడు రాముడు
పిత్రు సేవకై నిలచెడి జ్యేష్ఠుడు
సర్వ జగతికి ప్రియతము డాయెను.

శస్త్రవిద్యలో శూరపుంగవుడు
గజ, హయ, రథములనెక్కిపోరును
శత్రువు లందరి గుండెలవియును
తండ్రి సేవలో తృప్తినందును.

అన్న రాముడే అన్నీ అనుకొను
అన్న సేవలే పెన్నిధి అనుకొను
తన సుఖమసలే తలచని తమ్ముడు
లక్ష్మణమూర్తికి ప్రాణము రాముడు.

అంత ఆదరము చూపును రాముడు
ఎంతో ప్రియముగ నెంచును తమ్ముని
లక్ష్మణమూర్తి ప్రక్కన లేనిచొ
అన్న పానములు ముట్టడు రాముడు.

లక్ష్మణు తమ్ముడు శత్రుఘ్నుడును
అన్న భరతుని ప్రియముగ నెంచును
భరతుడు తమ్ముని తనప్రాణముగ
ఎంచును, సోదరప్రేమకు నిలయము.

యమ, కుబేర, వరుణ దేవేంద్రులతో
వెలిగెడి వాణీపతి వలె నుండి
నలుగురు పుత్రులు ఆనందమునిడ
పుడమిని శోభిలె దశరథరాజు.

సద్గుణ రాశులు శాస్త్రజ్ఞానులు
అనుచిత మన్నది తలపులొనెరుగని
కీర్తి వంతులగు పుత్రులతోను
దశరథరాజు బ్రహ్మనుపోలెను.

నలుగురు పుత్రులు వేదాధ్యయనులు
ధనుర్వేదమున కుశలత కలిగి
తండ్రి సేవలో నలుగురుఒకటై
భ్రాతృ ప్రేమలో ముందునిలచిరి.

కల్యాణమునకు సరిపడు వయసు
కావున తగిన కన్యల కొరకు
పురోహితులతో హితులందరితో
దశరథరాజు యోచన నుండగ.

మంత్రులతో పరివేష్టితుడై అట
రాజు యోచన చేయుచుండగా
తేజోవంతుడు మహాఋషి యగు
విశ్వామిత్రుడు వచ్చెను నగరికి.

రాజును చూడగ ఋషి పుంగవుడు
ప్రతీహారులకు రాకను తెలుపుచు
''గాధి నందనుడ-విశ్వామిత్రుడ
నే వచ్చితి నని తెలియ జేయు'' డన

పరుగున పోయి వార్తను చెప్పగ
ముదముతొ రాజు పురోహితులతో
బ్రహ్మను దేవేంద్రుడు కొలచి నటు
భక్తితొ మునిని తోడ్కొని వచ్చెను.

అర్ఘ్య పాద్యముల నందిన మౌని
రాజును కుశలము అడిగెను అంతట
''శుభములు నీకు కలుగు చున్నవా?
రాజ్యము, ప్రజలు, క్షేమమేకదా?

నీ సామంతులు విధేయులేనా?
శత్రువు లందర జయించి నాడవ?
యజ్ఞ యాగములు అతిథి పూజలు
చక్కగ చేయుచు సుఖముగ నుంటివ?''

అంతట మౌని వశిష్ఠు గాంచి
కుశలము నడిగి సభలో మిగిలిన
ఋషులను ముఖ్యుల నందరచూచి
కుశల ప్రశ్నల పలుకరించెను.

పొంగిన ఆనందముతో రాజు
పూజలు సలుపుచు మునిపుంగవునితొ
పలికెను ప్రియముగ '' ఓ మునిసత్తమ!
నీరాకది నా కమృతపానము.

అపుత్రకునికి పుత్రుల వోలె
ఎండిన నేలలొ వర్షధారవలె
పోయిన పెన్నిధి దొరికినట్టుగా
నామది ఉన్నది నీదగు రాకతొ.

భూసురోత్తమా! నీ యభీష్టము
తెలియ బరచుము- నా భాగ్యమది
నీవు నగరిలో అడుగు పెట్టుట,
కోరిన దానిని యిత్తును దేవా!

నా జన్మమది సఫలమయినది
పుడమిని పుట్టుక ఫలియించినది
నగరు పునీతము అయినది, నేడు
పుణ్యభూమిలో నుంటినినేను.

మదిలో సందియమందకుస్వామీ!
నీ వాంఛితమును తెలుపుము ఇపుడే
నీ యభీష్టము నెరవేర్చుటది
ఉత్తమ ధర్మా చరణము నాకు''

వినయము, శ్రద్ధ, భక్తినిండిన
కర్ణపేయ మగు రాజు పలుకులకు
సద్గుణ యుతుడు విశ్వామిత్రుడు
మదిలో ఎంతో ముదము నందెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 19 యాగ రక్షణ కై శ్రీరాముని తన వెంట పంపమని విశ్వామిత్రుడు కోరుట

విశ్వామిత్రుడు సంతస మంది
పలికెను రాజుతొ : ''రఘువంశమున
సత్య సంధతకు, దాన గుణమునకు
నిలచి పూర్వుల మరపించితివి.

ఇనకులమందు పుట్టినవాడవు
వశిష్ఠముని ఉపదేశములందిన
ఎన్నిక గుణముల యోగ్యుడవీవు
సముచిత రీతిని పలికితివయ్యా!

కోరిన దిత్తును అని పలికితివి
ఆడి తప్పక యశము నిలుపుకో
మదిలో కోరిక తెలియజేతును
ముదముతొ నీవు నెరవేర్చుమయా!

నేనొక యజ్ఞము సంకల్పించితి
యాగ దీక్షలో నుంటిని రాజా!
యజ్ఞము విఘ్నము చేయుటయందు
నిమగ్నులై 'మారీచ-సుబాహులు'

కామ రూపులగు రాక్షసులిద్దరు
దయా దాక్షిణ్యము నెరుగని క్రూరులు
అస్త్రము లెరిగిన అతి బలవంతులు
యాగ వేదికను కలుష పరచుచు

నెత్తురు- ప్రేవులు-మాంస ఖండములు
కురిపించి, తాపసుల బాధించి రట
అంతట నేను- ఆశతొ వచ్చితి
నీ సాయమును అర్థించుటకై.

చాపము పట్టగ నేర్పరినైనా
శాపము పెట్టగ చాలియున్నను
దీక్షలొనున్న నాకవితగవు
ఆ సమయములో వత్తురుఅసురులు.

కావున రాజా! జ్యేష్ఠకుమారుని
సత్య విక్రముని రామచంద్రుని
ముద్దుగ ముంగురు లాడెడు ముఖము
బలముకు నెలవగు బాలునిపంపుము.

బాలుడు పోరుట గెలుచుట ఎట్లని
సందేహించకు-నే కాపాడెద
నా రక్షణలో నీ బాలకుడు
ఆ రాక్షసులను సులువుగ త్రుంచును.

నా కార్యము నెరవేర్చుము నీవు
నీ పుత్రున కగు శుభములు ఎన్నో
కీర్తిమంతుడై ప్రకాశించును
పాపుల త్రుంచి ధర్మము నిలుపును.

పసికంద నెడి మోహమువదలుము
ఆజి నిలువగ చాలడు అనకుము
రాక్షసు లెవ్వరు రాముని ముందు
నిలువగ లేరు-నిజమిది నమ్ముము.

సత్య విక్రముడు, కారణజన్ముడు
రాముని గూర్చి నేనెరుగుదును
తేజోవంతుడు వశిష్ఠ మునియు
మిగిలిన తాపసు లందరెరుగుదురు.

ఇహ పరములు నీవందగ వలెనన
ఊర్ధ్వ లోకమున సుఖమును పొందగ
రాముని నాతోపంపుము రాజా!
వ్యర్థము-మోహము సందియమ్ములు.

వశిష్ఠ మొదలగు పురోహితులను
సుమంత్రు లోనగు మంత్రు లందరిని
సంప్రదించి వారందరు సరియన
పంపుము నాతో రామభద్రుని.

నేటి నుండి పది రాత్రులు మాత్రము
ఉండును నాతో రామచంద్రుడు
దీక్షా కాలము మించక మునుపే
సరి యను- రాముని తోడ్కొని పోయెద.''

యాగ నెపమున- దుష్టశిక్షణకు
రాముని వనముకు కొనిపోవగను
రాజుతొ పలికి కౌశిక మౌని
సమ్మతికొరకై వేచియుండెను.

'రాముని పంపుము' అనిన మాటవిని
వెల వెల బోయెను రాజు వదనము
నోట మాటలు పెగలుట లేదు
దుఃఖసంద్రమున మునిగిపోయెను.

అవుననలేక కాదనలేక
ప్రాణ సమానుడు ''పుత్రుని పంపుట''
తలంచినంతనె స్మృతి తప్పగను
మొదలునరికిన మ్రానయి కూలెను.

॥శ్రీరఘురాముని॥

# 20 దశరథుడు రాముని పంపుటకు నిరాకరించుట

ఇంచుకసేపు స్మృతితప్పినది
దశరథరాజు ధైర్యముతెచ్చుకు
పుత్రునిపైన మోహమునిండి
పలికెనుఅంత కౌశికమునితో :

''కమల నేత్రుడు- పదునారేండ్లును
నిండనిబాలుడు రామభద్రుడు
రక్కసులతో, తను- తలపడగలిగిన
శక్తిమంతుడుకాదు మునీంద్రా!

నా సేనలతో నీతోవచ్చి
నా వీరులతో వారలనెదిరి
యాగ రక్షణము నేచేసెదను
పోరెద ప్రాణములుండువరకును.

చిదిమిన పాల్గారు చిన్నారి నాబాబు
యుద్ధ నైపుణి లేని బుడుతడీ రాముడు
మనుజులను మ్రింగేటి క్రూరులాదనుజులు
పోరునకు గొనిపోవ న్యాయమామౌని!.

తల్లిని వదలి వుండగ లేడు
బాబును వదలి నే మనలేను
తీగచాటు ఆపిందె రాముని
పోరున కంపుట తగునా? స్వామీ!

అరువది వేల వత్స రమ్ములు
అలమటించితి బిడ్డల కొరకై
ఆశలు పండిన తరుణము లోన
అడిగితి వయ్యా నీకిది తగునా?

పట్టు వదలక బాలుని కోరిన
నా సేనలతో మీతో వచ్చి
వానికండగ నుందును స్వామీ!
అనుగ్రహించుడు అంత వరకును.

నలుగురిలోన జ్యేష్ఠ కుమారుడు
ఊర్ధ్వ లోకములు కలుగ జేయును
ధర్మమూర్తి నా ప్రాణము రాముడు
నీతో పంపి నే మనగలనా?

విఘ్నముచేసెడి దానవులెవ్వరు?
వారినాయకుడు ఎవ్వరుస్వామీ?
బలములెట్టివి? పోరుటఎట్లు?
అస్త్రశస్త్రముల నెరిగినవారా?''

అంతట మౌని పలికెనురాజుతో
ధనపతి తమ్ముడు పులస్త్యమనుమడు
విశ్రవసునికి తనయుడుఆతడు
రావణుపేరు వింటివికాదా?

ఆ రావణుడు - వాణీపతిచే
వరములనందిన అతిబలవంతుడు
లోకకంటకుని రావణుతలచిన
మూడు లోకములు గడగడలాడును.

రాక్షస ప్రభువు కావున వాడు
యజ్ఞ యాగముల చెరపగ రాడు
సేవకులను - తన మిత్రుల నంపును
మారీచ, సుబాహులు వచ్చినవారు.''

దశరథరాజు కలవరపడెను
మునితో పలికెను బ్రతిమాలు చును.
''అంతటి వారితొ నేనే చాలను
నా బలగమ్ములు నిలువగలేవు

పసి గందును నువు బ్రతకగనిమ్ము
బిడ్డనిచ్చిన దైవమగుదువు
తండ్రివి నీవు నీపుత్రునికి
పుత్రశోకము కలుగనిత్తువా?

యాచించుటది రాజులెరుగరు
నేయాచించితి బిడ్డడికొరకు
నా ప్రార్థన-నువు మన్నించుమయా!
బాలునిపంపుట సాధ్యముకాదు.

సుర, గంధర్వ, యక్ష, కిన్నరులె
రావణునెదిరి నిలువగలేరు
సుందోప సుందుల సంతతియైన
మరీచు, సుబాహుల గెలువగజాలము.

యమునితొ సరిపడు వారాదనుజులు
వారిపాలబడి బిడ్డడుబ్రతుకడు
గురిపెట్టగను చాలనిబాలుడు
కావునపోరెద వారితొ నేను.''

పుత్రుని యందు వాత్సల్యము తో
రాజు పలుకుట వినిన కౌశికుడు
హోమము నందు ఆజ్యము మాదిరి
మండె కోపమున కన్నులెఱ్ఱబడె.

||శ్రీరఘురాముని||

❊❊❊

## 21 గాధేయుని క్రోధము - వశిష్ఠుడు దశరథుని ఒప్పించుట

''స్వయముగ నీవు పలికినాడవు
కోరిన దిత్తును అంటివికాదా!
మాటదప్పుట రఘువంశమునా?
ఆడిదప్పి-నువు సుఖముగనుండుము.''

కోపించిన ఆ మౌనిని గాంచి
పుడమి యెల్లను కంపించినది
దేవతలందరు భయమునందిరి
తిరిగి మౌని అట రాజుతొ పలికెను :

''ఇక్ష్వాకువంశమున పుట్టినవాడవు
నియమ నిష్టలు కలిగిన వాడవు
ధర్మము నిలపగ నిలచిన వాడవు
నీవు- ధర్మము దప్పుట తగదు.

సత్య సంధుడు హరిశ్చంద్రుడు
అతని వంశమున పుట్టిన నీవు
అంతే అనుకొని యాచించితిని
నాదే తప్పు! నను క్షమియింపుము.

పలికి బొంకుట ధర్మము అయిన
అసత్యవాదిగ సుఖముగ నుండుము
వచ్చిన త్రోవనె పోదును నేను''
కన్నుల నిప్పులు రాల్చెను మౌని.

అంతట పలికెను వశిష్ఠమౌని
రాజుకు ధర్మ బోధన చేసెను
''ఆడిదప్పుట న్యాయము కాదు
నీ సమ్మతితో కోరుకొనెను కద.

సత్య వ్రతము చేపట్టిన వాడవు
కకుత్థ్స వంశము నందు జననము
ధర్మాత్మునిగా వినుతి కెక్కిన
నీకు పాడియా అసత్య మాడగ?

అనృత ఫలము తెలియుము నీవు
యాగ ఫలమును తొలగ జేయును
కావున నీవు రామచంద్రుని
కౌశిక మునితో పంపుట ధర్మము.

అగ్ని చక్రముచె అమృత భాండము
రక్షిత మగును అటులే రాముడు
అస్త్రము లేవియు తెలియ కున్నను
గాధేయునిచే రక్షితు డగును.

విశ్వామిత్రుడు బుద్ధిమంతుడు
నిలచిన ధర్మము - తెలియుము నీవు
తపసుకునిలయము - అస్త్రము లన్నీ
తెలిసినవాడు అతిపరాక్రముడు.

సురలు, ఋషులు, అసురులలోను
యక్ష, కిన్నెర, గంధర్వులలో
అన్ని అస్త్రములు తెలిసినవారు
మునికి సాటి మరి లేనే లేరు.

ప్రజా పతులలో 'భృశాశ్వ' సంతతి
ధర్మ నిష్ఠములు అతి పరాక్రమమ్మొ
పాపులకందని అస్త్రములన్నీ
శంకరుడొసగెను కౌశికమునికి

దక్షునిబిడ్డలు 'జయ, సుప్రభ లు'
భృశాశ్వుని తమ పతిగాపొంది
ప్రకాశమానులు అగు కుమారులను
ప్రసవించిరి, శత శస్త్రాస్త్రములుగ

యాబది మంది అతి బలవంతులు
దనుజుల జంపగ - చాలిన యట్టి
కామరూపు లను 'జయ' ప్రసవించెను
సుప్రభ సుతులు సంహారులయా!

వినుతి కెక్కిన - అమోఘమైన
బల పరాక్రమము కలిగిరి వారు
వారిని - కౌశికు డెరుగును బాగుగ
కొత్త అస్త్రముల సృజించ గలడు.

అంతటి తేజము యశము కలిగిన
అతి పరాక్రముడు కౌశిక మౌని
కావున రాముని పంపుట కెంతయు
సందేహించకు - నాపలుకులు విను.

స్వయముగ దనుజుల త్రుంచగలిగినను
రాముని హితము కోరిన మౌని
వచ్చెను - నిన్ను యాచించుటకు
నీ తనయునకూ నీకునుశుభమది.''

వశిష్ఠు పలుకులు వినిన దశరథుడు
మనసు కుదుటపడి సంతసమంది
రామచంద్రుని కౌశికమునితో
పంపగవలెనని నిశ్చయించుకొనె.

||శ్రీరఘురాముని||

❃❃❃

## 22 రామ–లక్ష్మణులు విశ్వామిత్రుని వెంట వెడలుట, బల–అతి బల మంత్రములు ఉపదేశము పొందుట

వశిష్ఠమునివరు వచనమ్ములువిని
దశరథరాజు నిండు మనసుతో
లక్ష్మణు తోడగు రామచంద్రుని
పిలచెను, మునితో పంపుట కొరకు.

దుష్ఠ శిక్షణ శిష్ఠ రక్షణ
చేయించుట కై ముని వచ్చెనని-
తండ్రి పిలచె నను వార్తను వినిన
రామచంద్రుడు సంతస పడెను.

వచ్చిన కొమరుల కిద్దర కపుడు
తలి దండ్రులు ఆశీస్సుల నిడిరి
మంగళ శాసన మది పలుకగను
పురోహితుడు శుభ వాక్కులతోను.

దనుజుల వలన బాధలు కలుగక
జయము నందు నటు మంత్రించ గను-
తండ్రి - తనయుని పిలిచి మక్కువతొ
శిరసు మూర్కొని మునికి ఒసగెను.

కోసలాత్మజా నందను డపుడు
కౌశికమునితో సాగునని విని
వాయువు మెల్లగ వీచెను చల్లగ
మార్గా యాసము కలుగ కుండునటు.

దనుజుల భయము లేదిక మనకు
అన్నటు మ్రోగెను సురల దుందుభులు
పూల వానలు కురిసె తరువులు
చల్లగ వెలిగెను రవి అంతటను.

విశ్వామిత్రుడు ముందు నడువగా
వెనుక లక్ష్మణుడు అనుసరించగా
కోదండము తో కోమలమూర్తి
నడచెను కాననసీమలకంతట

మూడు తలలుగల పాముల రీతిగ
భుజమ్ముల యందు అమ్ముల పొదులతొ
సొమ్ములు మెరయగ దిక్కులు వెలుగగ
రక్షణ తొడుగులు ధరించి యుండి

అందమునందు మన్మథు గెలచి-
బ్రహ్మ వెంబడి అశ్వనిసురలన
స్కంధ విశాఖులు హరువెంబడివలె
కౌశికు వెంట సాగిరి వారు.

రామ లక్ష్మణులు వెంట నడువగా
ముని పొంగెను తన మదిలో ఎంతో
నారాయణుడు నాతోడనుచును
నే తోడుందును శ్రీహరి కనుచు.

ఒకటిన్నర యోజనముల దూరము
సాగిరి - సరయూ దక్షిణ దిశలో
విశ్వామిత్రుడు మధుర వచనముల
''రామా! రమ్ము, జలములు గొనుము.

సమయము మించక ఆచమించుము
బలయు, అతిబల మంత్రమ్ములను
ఉపదేశించెద - అవి పఠియించిన
ఆకలి దప్పులు - శ్రమయు ఉండవు.

దనుజులు నీకు కీడొనరించరు
నిదురలొనున్నను జయించ లేరు
భుజ బలమందు నిన్ను మించరు
ప్రతాప సుందర! ప్రకాశింతువు

ఈ మంత్రములను బ్రహ్మ సృజించెను
కావున సామాన్యము లివి కావు
బుద్ధి బలము మరి యుక్తి చతురత
లోకోత్తరమై జ్ఞానము నొసగును.

మంత్రము పొందగ నర్హము లయిన
సద్గుణ సంపద యున్నది నీకు
అర్హున కిచ్చిన దానమువలన
ఫలములు కలుగును కీర్తి కలుగును.''

మునిపలుకగను రామచంద్రుడు
శుచియై మంత్రమ్ముల రెండింటిని
గ్రహించె నంతట ముని చెప్పగను
శరత్కాలమున రవి వలె వెలిగెను.

గురువు చెప్పినటు నిష్ఠగచేసి
కష్ట మెరుగని శ్రీమంతు లట
పచ్చిక పైన సుమ సుకుమారులు
నిదురించిరి ముని ముచ్చటలాడగ.

॥శ్రీరఘురాముని॥

## 23 కామాశ్రమము-అంగదేశపు గాథ

రాత్రి గడచి ప్రాభాత మాయెను
ఆకులు, పచ్చిక పరచిన పక్కల
నిదురించెడి ఆ రామలక్ష్మణుల
చూచి-కౌశికుడు పలికె మధురముగ :

''కౌసల్యా మాత సత్పుత్ర రామ!
అరుణోదయమ్ము కాకుండ లెమ్ము
నరులలో శార్దూల-సుప్రభాతమ్ము
తీర్చంగ లెమ్ముదైవాదికమ్ము''

మేలు పలుకులకు మేలుకొన్న
శ్రీరామ లక్ష్మణులు స్నానము తీర్చి
అర్ఘ్యము నిచ్చి గాయత్రిని ఆట
శ్రద్ధా భక్తితొ జపియించుకొని.

సంధ్యో పాసన బ్రహ్మ యజ్ఞము
సమిధాదానము ప్రాతఃసేవలు
తీర్చి- గురువుకు ప్రణామ ముంచిరి
సంతోషముగా బయలు దేరిరి.

గంగా సరయూ సంగమ మైన
మంగళ స్థలమున మూడు పాయలై
పరుగిడు గంగను - తపసులు చేసిన
పుణ్య స్థలమును చూచిరి వారు.

పవిత్ర మైన ఆశ్రమ వాటిక
తీవ్ర తపస్సులు సాగిన చోటు
చూచి సంతసము నందిన వారై
వివరము లడిగిరి కౌశికమునిని.

అంతట ముదముతొ మౌని తెలిపెను
గరళ కంఠుడు తపసులొనుండగ
శైలతనూజ సేవలు చేయగ
రూపగర్వితుడు మన్మథు డపుడు

తపోభంగము కలిగించగను
శ్రీకంఠుడు అటు హుంకరించెను
నొసటి కంటితో చూడగ నంత
బూది ఆయెను మన్మథు డచట.

కాము డిచ్చట శివ నేత్రాగ్నికి
అంగము లన్నీ ఆహుతి కాగా
అనంగు డనిన పేరుతొ నిలచెను
అపుడిది అయినది అంగదేశము

ఈ ఆశ్రమము పవిత్రమైనది
శంకరు డిచట తపమొనరించెను.
కనబడు మునులు శిష్యపరంపర
పాపము లేని ధర్మమూర్తులు.

శుభ దర్శన ఓ సుందర రామా!
నేటి రాత్రి మనముందము యిచటే
స్నాన జపములను తీర్చుకు-మనము
పవిత్రాశ్రమము ప్రవేశింతు'' మన

వారి రాకను తెలిసిన మునులు
జ్ఞాన చక్షువులు కలిగిన వారలు
పులకితు లైరి- దరికేతెంచిరి
సత్కరించి ఆతిథ్యమునిడిరి.

విశ్వామిత్రుడు కుశలములడిగెను
సాయం సమయపు సంధ్యోపాసన
ముగించి - అటనే కామాశ్రమమున
కథలతొ నిద్దుర పుచ్చెను వారిని.।
॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 24 సరయూ నది-తాటకా వని వృత్తాంతములు

ప్రభాత సమయము నందేలేచి
ప్రాతః కాలిక విధులను తీర్చుకు
విశ్వామిత్రుడు ముందు నడవగా
సాగిరి గంగా తీరమునకును.

మును లేర్పరచిన నావనెక్కిరి
వారందర కడ శలవునుఅంది
రామలక్ష్మణ సమేతుడై ముని
సంద్రము చేరెడి గంగను దాటగ.

అంతట నీటిలొ పెద్ద ఘోషను
వినిన రాముడు వివరములడిగెను
సంతోషముతో విశ్వామిత్రుడు
సరయూ పుట్టుక చెప్పసాగెను :

''బ్రహ్మదేవుడు సంకల్పమున
కైలాసములో సరస్సు సృజించెను
దానిని-మానససరస్సు అందురు
జలము పారెను సరయూ నదిగ.

సరయూ నది-మన అయోధ్య తాకుచు
ప్రవహించుచు యిట గంగను చేరును
ఎత్తు నుండి ఆ సరయూ పడగా
కలిగెడి శబ్దము వినబడుచున్నది.

గంగా సరయూ సంగమమిది విను
పుణ్య తీర్థము నమస్కరించుము''
అనవిని, శ్రద్ధతొ నమస్కరించిరి
దక్షిణ తీరము చేరిరి వారు.

కాలి నడకను ముువ్వురు సాగుచు
భీకరమై మరి జనులు తిరగని
నలగని నేల కలిగిన వనమును
చేరగ-రాముడు అడిగె మునీంద్రుని :

''క్రూర మృగములతొ నిండిన దీవని
పలు రకమ్ముల వృక్షములుండి
చొరగా శక్యము గాదు భీకరము
దీని వివరము తెలుపు మునీంద్రా!''

''కకుత్థ్సరామా! నాయన వినుము
దారుణమైన వనమిది తెలిపెద
పూర్వము-యిది-ధన ధాన్య సమృద్ధము
''మలద'' ''కరూశ'' దేశము లివియే.

పూర్వము ఇంద్రుడు వృత్రుని చంపగ
బ్రహ్మహత్యతో పాపము నంది
ఆకలి కలిగి మలము విడచుట
సంభవించగా దేవతలందరు

దివ్య తీర్థముల జలములు తెచ్చి
అభిషేకించిరి. అశుచి తొలగగా
మలద మనియును, కరూశ మనియు
పేరు గాంచినవి ఈ ప్రదేశములు.

అంతట ఇంద్రుడు సంతసమంది
సౌభాగ్యముతో విలసిల్లగను
వరములిచ్చె యిరుదేశములకును
సుర లెల్లరును పొగడిరి ప్రభువును.

అంతటి నుండి ధన ధాన్యములతో
అలరారెడి యీ రెండు దేశములు-
తాటక యను నొక యక్షిణి యొక్క
తాకిడి కిటు లివి భ్రష్టులయినవి.

నిరతము తాటక దుష్ట చేష్టలతొ
రెండు దేశముల పాడొన రించెను
కొంత దవ్వులో మార్గ మధ్యమున
నివసించును అది- అదె మన మార్గము.

వెయ్యి ఏనుగుల బలముతొ పుట్టెను
కామరూపి ఆ యక్షిణి - దానికి
భర్త సుందుడు ధీమంతుడయా!
నీకులేదు ఆ తాటక భయము.

నా ఆనతి విను-నీ భుజబలముతొ
దుష్ట తాటకను సంహరించుము
దాని బాధ ఈ దేశము లందు
నిశ్శేషముగా తీర్చుము రామా!

ఇంద్రుని పోలెడి పరాక్రమముతో
పుట్టిన దనుజుడు మారీచుండు
యక్షిణి పుత్రుడు- నిరతము ప్రజలను
హింసల పెట్టి భయముతొ నింపెను.

ముందుకు వచ్చె సాహసి లేక
యక్షిణి భయమున ఇవి యిటులున్నవి
వివరములన్నీ తెలిపితి రామా!
వనవృత్తాంతము వింటివి తీరుగ.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 25 తాటక యొక్క వివరము

అమితవిక్రముడు మునిపలుకులు విని
పురుష శ్రేష్ఠుడు రాముడు అడిగెను
''యక్షులు బలములొ తక్కువ వారు
ఆడుది అంతటి బలమెటు పొందెను?''

తిరిగి పలికెను కౌశిక మౌని
''వరము వలన- ఆ- అబలకు అంతటి
బలము కలిగినది వివరించెద విను
పూర్వము సుకేతుడను నొక యక్షుడు

అతి పరాక్రముడు బిడ్డలు లేక
ఘోర తపస్సును ఆచరించెను
అంతట బ్రహ్మ సంతస మంది
తాటక అనునొక కన్యను ఒసగెను.

బ్రహ్మ- యక్షునికి పుత్రు నీయక
అంత బలముగల బాలిక నొసగెను
కన్యను, తండ్రి ''ఝుర్ఝని'' సుతుడగు
సునందు కొసగెను ఇల్లాలిగను.

తాటక సుతుడు మారీచుడు దుష్టుడు-
సునందుడంతట అగస్త్యమునిచే
చంపబడగను - తల్లీ కొడుకులు
అగస్త్యమునిపై విరుచుకుబడగ.

అగస్త్యముని కోపించి శపించగ
మారీచుడు అట రాక్షసుడాయెను
అంతట, తాటక ఘోర యక్షిణి
రూపముమారి రక్కసి ఆయెను.

శాపము నంది తాటక యిచ్చట
అగస్త్యముని - తా తిరిగిన చోటుల
పవిత్రమైన వనము నెల్లను
నిర్మానుష్యము చేయసాగెను.

రక్షకుడైన రాజు సర్వదా
ప్రజారక్షణకు దోషము నయినా
క్రూర మైనను పాపమైనను
ఆచరించుటే - కర్తవ్య మది.

ఉపద్రవమ్మయి దురాచారిణిగ
భయము గొలుపు-ఈ దుష్టయక్షిణిని
గో బ్రాహ్మణుల హితము కొరకును
చంపుము రామా! శాంతి నొసగుము.

విరోచను పుత్రిక - మంథరఅనుస్త్రీ
భూదేవిని చంపగ యత్నము చేయగ
సురపతి - ఆమెను చంపినట్టుగా
గాథ యున్నది విను శ్రీరామా!

శాపగ్రస్త యగు స్త్రీని చంపగ
ముల్లోకముల సాహసి లేడు
ప్రజాహిత మగు క్షాత్ర ధర్మమిది
కావున స్త్రీయని దయ చూపకుము.

భృగునిల్లాలు శుక్రునితల్లి
పూర్వము - ఇంద్రుని అంతము చేయగ
యత్నము చేయగ మహావిష్ణువు
ఆమెను చంపెను నిస్సంశయముగ

రాజకుమారా! అధార్మికలగు
స్త్రీలు ఎందరో - చంపబడిరయా!
మహాత్ములైన వారివల్లను
వారు మడసినటు తెలియుము నీవు''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 26 తాటక సంహారము

దశరథ తనయుడు రామచంద్రుడు
పలికెను మునితో కడువినయముగ
''ముని ఆనతి అది శిరోధార్యమని
జనకుడు తెలిపెను ఆనతి నిడెను.

గో బ్రాహ్మణుల హితము కొరకును
ప్రజల సౌఖ్యము మదిలోనిలపి
మహిమోపేతుడ వగు నీమాట
నెర వేర్చెదను ఓ గురుదేవా!''

పితృ వాక్య పరి పాలన ధ్యేయము
బ్రహ్మవాది వగు నీ ఆనతితో
ఆమెను చంపుట కర్తవ్యముగా
ఎంచెద నేను - సందేహించను

అని పలుకుచు - శ్రీరామచంద్రుడు
శత్రు తాపము, పెంచెడి వాడు
పిడికిలి ముడిచి నారి లాగెను
నాల్గు దిక్కులు పిక్కటిల్లెను.

తాటకావనము కంపించినది
తాటక ఎంతో తల్లడిల్లినది
మూర్ఛ పోయెను- కోపమునందెను
శబ్దము వచ్చిన వైపు పరుగిడెను.

కోపము నిండి వికృతమయిన
రూపము గలిగిన తాటక గాంచి
రాముడు పలికెను తమ్ముని తోను
''చూడుము భీకర మైన రూపము

పిరికి వానికి గుండెలవియును
మాయా బలముతొ నిండి యున్నది
ముక్కు చెవులను కోసెద నిదిగో
పరుగిడ జేసెద దుష్ట రాలిని.

ఆడుది అయినది బ్రతికి పోయినది
కర చరణములు నరికి వేసెద
చలనము లేక నేల కూలును''
అనుటయు- తాటక ముందుకు వచ్చెను.

అది గాంచిన ఆ కౌశిక మౌని
హుంకారముతో భయమును గొలిపి
శుభమగు ననుచు జయమగు ననుచు
రామలక్ష్మణుల కాశీస్సుల నిడె

తాటక అంతట ధూళిని లేపెను
నింగి కెగసిన ధూళితొ నపుడు
రామలక్ష్మణులు ముహూర్త కాలము
తెలివి దప్పిరి- తాటక అపుడు

మాయ మయ్యెను- మాయతొ యక్షిణి
రాళ్ల వానను కురిపించ గను
కోపము నిండిన రామచంద్రుడు
శర పరంపరతొ అడ్డగించెను.

రాళ్లను ముక్కలు చేసివేసెను
తాటక చేతులు నరకివేసెను
అలసిన తాటక ముక్కూ చెవులు
లక్ష్మణ మూర్తి కోసివేసెను

కామరూపియగు యక్షిణిఅపుడు
వివిధ రూపముల మాయలచేత
రాళ్ళవానను కురిపించుచును
అతి భీకరము గ సంచరించెను.

రాళ్ళ వానను ఎదుర్కొనెడి - ఆ
రామ లక్ష్మణుల చూసి కౌశికుడు
తగిన సమయ మాసన్న మైనదని
సంతోషముతో పలికెను వారితొ.

''మాయలు నేర్చిన దుష్టురాలిది
యజ్ఞము చెరిపెడి పాపి, యక్షిణి
మాయాబలముచే వృద్ధినొందును
ఎంతమాత్రము దయ చూపకుము.

సంధ్యకు ముందే చంపుము దీనిని
లేనిచొ యక్షిణి బలము పెరుగును
సంధ్యా కాలము వచ్చినంత నే
పోరుట శక్యము కాక పోవును.''

అంతట రాముడు అస్త్రము వదలి
యక్షిణి చేతలు నిలుపు చేసెను
మాయా బలముగల తాటక - వేరే
త్రోవలేకను ముందుకు వచ్చెను.

కోపము నంది ముందుకు వచ్చెడి
తాటక గాంచి రామచంద్రుడు
నిశిత శరమును ఔమ్మిన నాటగ
నేల బడినది అసువులు వీడి.

తాటక వధతో - సురలు, ఇంద్రుడు
సంతోషించిరి పొగడిరి రాముని
పూజలు చేసిరి ముదము నందిరి
పలికిరి మునితో ఆనందముగా :

''ఓ మునిసత్తమ! శుభమగు నీకు
తాటక సంహారము నీ ప్రేరణ
సంతస మందిరి సకల దేవతలు
రామచంద్రుని అనుగ్రహించుము.

ప్రజాపతి యగు భృశాశ్వ పుత్రులు
సత్య పరాక్రము లైనట్టివియు
తపో బలమున సంపాదించిన
అస్త్రము లొసగుము రామభద్రునికి

రాముడు అర్హత కలిగిన వాడు
భక్తితొ నిన్ను అనుసరించును
స్థిర సంకల్పుడు - దేవకార్యమును
చేయవలసిన - కారణ జన్ముడు.

సురలు పలికి - తమ నెలవుల కరిగిరి
తాటక వధతో మునిముదమంది
రామచంద్రుని శిరసు మూర్కొని
పోదము రేపు - ఆశ్రమమున కనె.

ముని వచనమ్ములు విని సోదరులు
రాత్రి సుఖముగ గడపిరి అచట
ఆ వనమంతయు శాపము తీరి
కుబేరవనమటు శోభించినది.

యక్షిణి నట్లు అంతము చేసి
సిద్ధులు, సురల ప్రశంసలంది
రాత్రి వనమున సుఖముగ గడిపి
ప్రభాత సమయము కాగా మేల్కొనె.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 27 అస్త్ర ప్రదానము

ప్రాభాతమున విధులను తీర్చి
పలికెను మౌని రామచంద్రునితొ
''తాటక వధతో తృప్తినందితిని
అస్త్రసంపద సర్వము నిత్తును.

నే నొసగెడి యీ అస్త్ర బలముచే
దేవదానవుల గంధర్వులను
ఉరగులు మొదలగు వారందరిని
వశీకరణమున జయించ గలవు

శుభమగు నీకు దశరథ నందన!
దివ్యాస్త్రములను యిచ్చెద నిపుడు
దివ్యమయినది శక్తిమంత మగు
దండచక్రమును ఒసగెద నీకు.

మనుజపుంగవా! ధర్మచక్రమును
కాలచక్రము అతి భీకరమగు
విష్ణుచక్రమును - ఐంద్రాస్త్రమును
వజ్రాస్త్రమును యిచ్చెద నీకు.

ఉత్తమ శూలము యిచ్చెద నీకు
బ్రహ్మ శిరస్సను అస్త్రము మరియు
ఐషీకమ్మును - ఉత్తమాస్త్రమగు
బ్రహ్మాస్త్రమును ఒసగెద నీకు.

నరపుంగవ! ఓ రాజకుమారా!
మోదకి - శిఖరి - గదలను యిత్తును
ధర్మపాశమును - కాలపాశమును
ఉత్తమమ్మైన వరుణపాశమును,

వారుణాస్త్రమును యిచ్చెద నీకు
ఓ రఘునందన! శుష్కాశనిని,
ఆర్ద్రాశనిని - పైనాకాస్త్రము
నారాయణాస్త్రము నొసగెద నీకు.

దోషరహితుడా! అగ్ని దేవునకు
ప్రియమగు అస్త్రము శిఖరమ్మను నొక
ఆగ్నేయాస్త్రము - ప్రథన మనేటి
వాయవ్యాస్త్రము నొసగెద నీకు.

హయ శిరస్సను అస్త్రము మరియు
క్రౌంచాస్త్రమును - విష్ణు శక్తియు
రుద్ర శక్తియను - దివ్య శక్తుల
ఒసగెద నీకు కకుత్థ్సరామా!

అదేవిధముగ భయంకరమ్మగు
దానవవీరులు ధరించువాటిని
కంకాళమ్మును - కాపాలమును
ముసలము తోడుత కంకణ మిచ్చెద.

వైద్యాధరమను గొప్ప అస్త్రమును
నందనమను నొక ఉత్తమ ఖడ్గము
గాంధర్వాస్త్రము - మానవాస్త్రము
ప్రశ్వాపనము- ప్రశమనమిత్తును.

సౌరమను నొక అస్త్రము నిచ్చెద
శోషణమున్నూ - సంతాపనమును
విలాపనమ్మును ఓ రఘునందన!
మదనుని ప్రియమగు మదనము నిచ్చెద.

దుర్ధర్షమును - పైశాచమును
మోహనమను దివ్యాస్త్రములన్నీ
ఒసగెద నీకు స్వీకరింపుము
మనుజ శ్రేష్ఠుడవు మహిమాన్వితుడవు.

తామసమ్మును - సౌమనమ్మును
సంవర్తనము - మౌసలమ్మును
సత్యము - మాయాధరముల నిచ్చెద
దర్పణమిచ్చెద - స్వీకరించుము.

రిపుల తేజము హరించునట్టి
భయంకరమ్మగు తేజః ప్రభము
సౌమ్యము-శిశిరము-సుదామనమును
దారుణమ్మైన భగాస్త్రమిచ్చెద.

శీతేషువును-మానవమ్మను
అస్త్రములిచ్చెద గ్రహించు రామా!
నేనొసగిన ఈ అస్త్రములన్నీ
కామరూపములు అతిబలమ్మైనవి.

సర్వోత్తములగు అస్త్రములివ్వి
స్వీకరించుము-సురలకు సైతము
లభ్యముగాని అస్త్రసంపద
ఒసగెద'' నంచు ఉపదేశించెను.

అస్త్రమంత్రమును కౌశికమౌని
ఉపదేశించి జపమొనర్చగ
అస్త్రదేవతలు వచ్చి - రాముని
అధీనమ్మైరి ఆనందముతో.

అస్త్రదేవతలు అంజలులొగ్గి
అధిదైవతమగు రామునితోను
పలికిరి ప్రియముగ '' ఓ రఘునందన!
నీకింకరులము అయితిమి మేము.''

రాముడు ముదముతొ పూజలుచేసి
అస్త్రదేవతల చేతితొ తాకి
''నిత్యము మీరు నా మనస్సును
అనుసరించు''డని ఆనతి నిడెను.

అస్త్రములందిన రామచంద్రుడు
దివ్యతేజమున వెలిగెను అచట
భక్తితొ మునికి నమస్కరించి
పలికెను తీయగ సాగుచు నంత.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 28 అస్త్రముల ఉపసంహారము ఉపదేశించుట

'' భగవత్సముడవు ఓ మునిశ్రేష్ఠా!
అస్త్ర సంపదతొ బలము నిచ్చితివి
అస్త్రబలముల ఉపసంహారము
ఉపదేశించుము దయగొని నీవు.''

రాముడు అడుగగ విశ్వామిత్రుడు
''శతవక్త్రమ్ము - దశశీర్షమును
సత్యవంతము - సత్యకీర్తియు
ధృష్టము-రభసము-పద్మనాభము

ప్రతిహారతము - పరాఙ్ముఖమ్ము
అవాఙ్ముఖమ్ము - లక్షాక్షమును
విషమము మరియు దృఢనాభమ్ము
మహానాభము - దుందునాభము

సునాభకమ్ము - జ్యోతిషమున్ను
కృశనము - నైరాశ్యము - విమలమ్ము
యోగంధరము - హరిద్రమున్ను
దైత్యము - ప్రశమన - సార్చిర్మాలియు

ధృతియు-మాలి-వృత్తిమంతము
రుచిరము మరియు పితృసౌమనము
విధూతమ్మును-మకరము-మరియు
కరవీరకరము-ధనము-ధ్యానము

కామరూపము-కామరుచియును
మోహము- అవరణమ్ము-జృంభకము
సర్వనాభము సంతానమును
వరణము-శీతోదరమను-వన్నియు

భృశాశ్వ తనయులు కామరూపులు
ప్రకాశవంతము మంత్రము లివ్వి
ఉపసంహారము లుపదేశించెద-
పాత్రుడవీవు శుభమగు'' ననుచు.

ఉపదేశించగ అస్త్రదేవతలు
తేజముకలిగి సుఖము కలుగగ
దివ్యాకృతులు కలిగినవారు
అగ్ని - ధూమము రూపముతోను

సూర్యచంద్రుల పోలిన రూపులు
రాముని కంతట ప్రణామముంచి
దోసిలియొగ్గి వినయముతోను
నీ ఆనతికై వేచియుంటిమన

రాముడు ప్రేమగ వారిని గాంచి
''సమయములోన నామది నిలచి
తగు సహాయము చేయుడు మీరు
అంతవరకును స్వేచ్ఛ పొందు'' డనె.

అంతట ఆ మంత్రాధిదేవతలు
ఎంతో వినయము భక్తితోడను
రాముని కచట ప్రదక్షిణించి
మరలిపోయిరి వచ్చిన త్రోవనె.

అస్త్రము లన్నిటి ఉపసంహారము
తెలుసుకు - రాముడు బయలుదేరుచు
కౌశికమునిని మధురముగాను
అడిగెను వనసోయగమును చూపుచు

''గిరిచెంతను అట మేఘము తీరుగ
పక్షుల కిలకిల రవముతోడను
మృగములు నిండిన తరుసముదాయము
వివరము నే వినకోరితి'' ననెను.

''ఓ మునిశ్రేష్ఠా! గగుర్పు కలిగెడు
తాటకావని దాటివచ్చితిమి
ఈ ప్రదేశము సుఖముగ నున్నది
ఇదియొక ఆశ్రమ మన్నటు లున్నది.

ఈ ఆశ్రమము ఎవరిది స్వామీ?
యజ్ఞవిఘ్నము కలిగినదెచ్చట?
యజ్ఞభూమి ఎటనున్నది? దేవా!
వివరములన్నీ తెలుపుము మాకు.''

॥శ్రీరఘురాముని॥

# 29 సిద్ధాశ్రమ వృత్తాంతము

సర్వము తెలిసిన జగన్నాయకుడు
తెలియని వానిగ అడుగుట వినిన
విశ్వామిత్రుడు వాత్సల్యముతో
వివరించెను తన ఆశ్రమగాథను :

" ఓ రఘురామా! దేవ శ్రేష్ఠుడు
సకలజగత్తుకు ప్రభువగు విష్ణువు
తపోయోగములు సిద్ధించుటకై
వందల యుగములు తపమిట చేసెను.

వామనుడుగ ఉదయించకముందు
విష్ణువు తపస్సుచేసెను యిచట
కాశ్యపమౌని యీ ఆశ్రమమున
తపముచేసెనిది సిద్ధాశ్రమము.

అడిగినవారికి లేదనడెపుడు
వైరోచనుడగు బలి భూవిభుడు
సురలను, ఇంద్రుని గెలిచి-ధర్మముగ
మూడు లోకముల నేలుచుండెను.

అంతట సురలు అగ్నితొ కలసి
ఇటకేతెంచి తపసులొనున్న
హరినిగాంచిరి అనిరి దీనముగ :
"బలియొక యాగము చేయుచుండెను.

యాగసమాప్తి కాకపూర్వమే
దైవకార్యము-సురలకు మేలు
చేయుడు-లేనిచొ బలి, మాకసలు
అజేయుడగును" అని ప్రార్థించిరి.

ఘటనాఘటన సమర్థుడవీవు
వామనమూర్తిగ ఓనారాయణ!
దేవతలకును మేలు చేయుమన
శ్రీవత్సాంకుడు సరియనిపలికెను.

మునిశ్రేష్ఠుడగు కశ్యపమౌని
భార్య 'అదితి'తో అతినిష్ఠగను
పుత్రుని బడయగ తపమున నుండగ
ప్రీతినంది నారాయణుడపుడు

దర్శనమివ్వగ ముని కీర్తించెను
అంతట విష్ణువు వరము కోరుమన
"నా పుత్రునిగా అవతరించి-నువు
సురల దుఃఖములు తీర్చుము తండ్రీ!

నా తపమిచట సిద్ధించినది
సిద్ధాశ్రమముగ ప్రసిద్ధికెక్కును."
సరియని పలికెను శ్రీ వల్లభుడు
అదితి పుత్రుడై వామనుడాయెను.

వామనుడపుడు బలికడకేగి
మూడడుగులు నేలడిగి సరియన
పెరిగిన వటుడై ముల్లోకములు
నిండెను-బలిని బలిమితొ అణచెను.

ఎదిగిన వటుడు వామనమూర్తి
నిండిన లోకములన్నీ తిరిగి
ఇంద్రునికివ్వగ సురలు - మునులు
సంతోషించిరి కీర్తన చేసిరి.

ఇచ్చట తపసు చేసిన వారికి
శ్రమకలుగదయా! ఓ రఘునందన
వామను నిలయము ఈ ఆశ్రమము
పుణ్యభూమి - నే నుందును యిచటే.

నా యాగమును భగ్నముచేయగ
ఇచ్చోటకు ఆ దనుజులు వత్తురు
నా ఆశ్రమమది అచ్చట నీవు
దుష్టులనంతము చేయుము రామా!

మనమేగునది ఆశ్రమ సీమకు
నా ఆశ్రమమది నీదేనుసుమా!''
అంతటవారు మునితో అచట
ఆశ్రమమందు అడుగుబెట్టగ

చంద్రునితో పునర్వసు తారల
జంట ఉన్నటు మునితో నున్న
రామలక్ష్మణుల గాంచిన మునులు
కౌశికమునికి పూజలు సలిపిరి.

మునుల ఆదరము సత్కారములు
పొందిన - రామ లక్ష్మణు లిద్దరు
కొంత తడవు విశ్రాంతి నందిరి
విశ్వామిత్రుని కంతట ప్రణమిలి

''ఓ మునిపుంగవ! శుభమగు నీకు
నేడే నీవు యజ్ఞము కొరకై
దీక్ష వహించుము- యజ్ఞ సిద్ధిచే
సిద్ధాశ్రమము సార్థక మగును.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 30 శ్రీరాముడు మారీచుని శిక్షించి–సుబాహుని త్రుంచుట

ఉచిత సమయమున వినయకుతుకమున
రామ లక్ష్మణులు అడిగిరి మౌనిని
''ఏ సమయములో అసురులు వత్తురు
యజ్ఞ విఘ్నము నివారించెదము.

మాకు తెలియక ఆ సమయమది
అతిక్రమించుట జరుగకూడనిది''
అంతట మునులు వారితొ పలికిరి
ఉత్సాహమునకు సంతస మందిరి.

''నేటినుండి మరి ఆరు రాత్రులు
మీరీ యజ్ఞము సంరక్షించుడు
కౌశికమౌని దీక్షలొ నుండెను
మౌన వ్రతమును చేకొనినాడు.''

కీర్తిమంతులగు రాజ పుత్రులు
మునుల మాటలు విని శ్రద్ధగను
ఆరు దినములు రేయింబవళులు
తపోవనమును రక్షణ చేసిరి.

అయిదు దినములు గడచి అంతట
ఆరవ దినము ప్రారంభమున
రాముడు-తమ్ముని హెచ్చరించెను
సంసిద్ధునిగా నుండగ చెప్పెను.

ఉపాధ్యాయుడగు కౌశికమౌనితొ
ఋత్విక్కులతో కూడిన యట్టి
యజ్ఞవేదిక ప్రజ్వలించెను
కౌశికుయాగము సాగుచుండెను.

హోమద్రవ్యము పూర్తిగ నిండెను
యజ్ఞవేదిక ప్రజ్వరిల్లెను
సమంత్రకముగ యజ్ఞము సాగగ
అంతట ఆకాశములో నప్పుడు.

భయంకరమ్మగు ధ్వని పుట్టినది
మేఘము మాదిరి ఆ రాక్షసులు
మాయలు పన్నుచు పరుగిడి వచ్చిరి
అనుచరులతొ అట నింగిని నిలచిరి.

ఆ రాక్షసులు రక్త ప్రవాహము
కురిపించగను- యజ్ఞవేదిక
కలుషితమగునని గ్రహించి రాముడు
సోదరు గాంచి పలికె నప్పుడు :

''తమ్ముడ లక్ష్మణ! దుష్టులు వీరు
మాంసభక్షకులు ఈ దనుజులను
గాలికి మేఘము చెదిరిన రీతిగ
మానవాస్త్రమున పారద్రోలెదను.''

కోపించిన ఆ రామచంద్రుడు
ఉత్తమమయిన ప్రకాశమైన
మానవాస్త్రమును సంధించి అట
ఝమ్మున వేసెను మారీచునికి.

శక్తిమంతమగు అస్త్ర ధాటికి
ఆగలేక ఆ నీచ మారీచుడు
నూరు యోజన దూరమునున్న
కడలిఒడ్డుకు - విసరి వేయబడె.

మూర్ఛ నందిన మారీచుని - తన
మానవాస్త్రము గొనిపోయెడు నెడ
రాముడు తమ్మునితో పలికె నట :
''ధర్మబుద్ధిగల అస్త్రము చంపదు.''

అంతట రాముడు పాప కృత్యులను
యజ్ఞ విఘ్నము చేసెడి దనుజుల
చంపెద ననుచు ఆగ్నేయాస్త్రము
సుబాహుపైన వేసెను అపుడు.

అస్త్రఘాతముచె దనుజుడు అంత
అసువులువీడి నేల రాలెను
రాముడంతట వాయవ్యాస్త్రము
వేసి - దనుజులను చెదరగొట్టెను.

రామచంద్రుడు దనుజుని త్రుంచి
పూర్తిగ వారిని చెదరగొట్టి అట
ప్రకాశించెను ఇంద్రుని వోలె
పూజలనందెను మును లందరిచే.

యజ్ఞ సమాప్తి అయిన దనుకనే
కౌశికమౌని ఆనందముతో
రాముని చూచి పలికెను అంత
''కృతార్థుడనైతిని కీర్తిమంతుడా!

తండ్రిమాటను పాలించితివి
వీర విక్రమము చూపించితివి
నీ విజయముతో యీ ఆశ్రమము
సార్థకమాయెను సిద్ధాశ్రమమని.

॥శ్రీరఘురాముని॥

## 31 విశ్వామిత్రుని యాగసమాప్తి–జనకుని యాగమునకు రామలక్ష్మణ సహితుడై మునులతో విశ్వామిత్రుడు తరలుట

రాజుగపుట్టి ఋషియైనట్టి
విశ్వామిత్రుని యాగము గాచి
తండ్రిమాట నెరవేర్చిన తృప్తితొ
సుఖముగ నిద్రించిరి సోదరులు.

ప్రాభాతమున నిద్దురలేచి
ప్రాతఃకాల కృత్యము లొనర్చి
ముందు గురువుకు-ఆవల ఋషులకు
నమస్కరించి పలికిరి తీయగ :

'' ఈ సోదరులు మీ సేవకులు
తపోవంతుడవు అతి సమర్థుడవు
సేవ చేయుటది కల్పించితివి
తరుణోపాయము సమకూర్చితివి.

మీ ఆశీస్సులు బలము నొసగును
మీ కార్యమ్మది తెలియజేయుడు''
అనిన మాటలకు ముని ముదమందెను
అంతట మునులు పలికిరి తిరిగి :

''మిథిలానాథుడు జనక భూపతి
ధర్మాత్ముండొక యజ్ఞము చేయగ
సంకల్పించెను పోయెద మచటికి
వత్తువ రామా! మాతో నచటికి.

జనకరాజుకడ దేవదత్తమగు
అతి ప్రసిద్ధిగల ధనుస్సు గలదు
దేవరాతుడను రాజుకు-సురలు
పూర్వము యిచ్చిరి - మహిమోపేతము.

ధనుసు నెత్తగ సురాసురులకు
సాధ్యముకాదు నరులొక లెక్కా?
ఆశతొ ఎందరొ ముందుకు వచ్చి
సిగ్గుతొ వెనుకకు పోవుచుండిరి.

రఘుకులదీపక! మహాత్ముడైన
జనకుని యజ్ఞము చూతువు రమ్ము
అమోఘ చాపము హర్షదాయకము
పూజలు చేతురు ఆ చాపమునకు.

శాస్త్రవిధిగను యజ్ఞము చేసి
మెప్పించి సురలను, మిథిలానాథుడు
''సునాభ'' మను ఆ దివ్యచాపమును
కోరగ-యిచ్చిరి సురలు రాజుకు.''

ఋషుల మాటలు వినిరి సోదరులు
విశ్వామిత్రుడు సాగుచునంత
వనదేవతలకు నమస్సు లిడెను
హిమవత్ప్రాంతము పోయెదననెను.

విశ్వామిత్రుని వెంట మృగములు
పక్షులు - చనువుగ మిత్రులమాదిరి
వచ్చెను - వాటిని ముని మురిపెముగ
మరలిపొమ్మని చెప్పిపంపెను.

దూరము సాగిరి సాయం సంధ్యలొ
విధికృత్యములు శోణనదమున
తీర్చుకు-వారు కౌశిక మునియు
కూర్చొని యుండగ రామచంద్రుడు.

లతాశోభితము తరులతొ నిండిన
ఈ ప్రదేశము ఎవ్వరిదనుచు
ఉత్సాహముతో నడుగగనంత
ముదముగ కౌశికముని పలికెనట.।
శ్రీరఘురాముని॥

❉❉❉

## 3 2 కుశుని వృత్తాంతము

''రామా! వినుము పూర్వకాలమున
తపోవంతుడు బ్రహ్మపుత్రుడగు
కుశుడను గొప్ప మహిమాన్వితుడు
సాధుశ్రేష్ఠుడు ఉండెడివాడు.

ఉన్నత వంశమునందు బుట్టిన
విదర్భ రాజు కూతురు నతడు
పరిణయమాడి సద్గుణయుతులగు
నలుగురు పుత్రుల బడసె నంతట.

''కుశాంబుడు''న్ను ''కుశనాభుడును''
''ఆధూర్త రజసుడు''''వసువ''ను నలుగురు
తేజోవంతులు అగు పుత్రులతో
పలికెను - భూమిని పాలించమని

బ్రహ్మకు పుత్రుడు అయినను కుశుడు
క్షత్రియ కన్యను పరిణయమాడి
పుత్రుల బడసినవాడు - పుత్రులతొ
పుడమిపాలన పుణ్యము అనెను.

ఋషి పలుకులువిని నలుగురు పుత్రులు
యోగ్యములయిన స్థలము లందున
న్యాయము తప్పక రాజ్యపాలనము
చేయసాగిరి ప్రజలు మెచ్చగ.

''కౌశాంబి''ని ఆ కుశాంబుడుండి
''మహోదయమ్ము''న కుశనాభుడును
''ధర్మారణ్య'' నగరమునకును
ఆధూర్తరజసుడు రాజుగ నుండి

''గిరి వ్రజపురమును'' రాజధానిగా
వసువురాజుగా ఏలిరి చల్లగ
ఈ ప్రదేశమున ప్రజలందరిని
వసురాజేలెను మనసు నిండుగా.

దీనికి రక్షణ కనబడునట్టి
మహాపర్వతము లవిగో ఐదు
మగధలొ పుట్టిన ''శోణ'' నది అది
మణిహారము వలె పారును మధ్యలొ

పశ్చిమ ముఖమై పారును ఈ నది
పచ్చని పైరుల ప్రాణము శోణ
వసువు చక్కగా తీర్చి దిద్దగా
శోభలీనె యీ ప్రదేశమంతయు.

అందములొలికే సుందరి ''ఘృతాచి''
ఆమెను చేకొని కుశనాభుడట
రూపవంతులు తేజోవంతులు
నూర్గురు కన్యల బడసెను అంత.

బంగరు కాంతుల మేని సొగసుల
నిండిన వయసు పొంగుల దేలి
మబ్బులయందు చుక్కలమాదిరి
ఆడుచు పాడుచు వనమున తిరిగెడి

కన్యారత్నము లందర చూచి
మన్మథ వశమున చిక్కినవాడై
వాయుదేవుడు వారలగాంచి
తనకు భార్యలై సుఖపడమనుచు

''నా కాంతలు మీరందరు అయినచొ
మరణము లేక దేవతలగుదురు''
అనిన గాలితో కన్యలు పలికిరి.
''కుల స్త్రీలతొ మాటాడుట యిటులా?

చరాచరముల నుందువు నీవు
భూత కోటులను రక్షించెదవు
పరుల పవిత్రుల చేసెడివాడవు
పవనుడవైతివి నీకిది తగునా?

మేమెవ్వరమో తెలియగ లేవా?
శాపము నిచ్చి శిక్షించెదము
కానీ తపసు వ్యర్థము చేయము
ధర్మము తప్పి మసలకు నీవు.

ధర్మాత్ముడు అతి తేజోవంతుడు
అతనికి తగిన సంతతి మేము
తండ్రి నిర్ణయము-మా కానందము
మాకు భర్తలను అతడే తెచ్చును.''

జంకక పలికిన కన్యల పలుకులు
విని కోపించి-వాయుదేవుడు
వారి దేహముల విసురుగ తిరిగి
వంకర దేహుల గావించెనట.

వికార దేహములు కలిగినయట్టి
కన్యలు గృహమున కేగగ నంత
గాంచిన తండ్రి మనసు చెదిరినది
కోపమునిండెను వివరములడిగెను.

''శోకము నాపుడు తెలుపుడు నాకు
ఇంతటి దుర్మార్గమునకు ఎవడు
కారణమయ్యెను?'' అడిగి అంతట
ప్రత్యుత్తరము వినగ నిలచెను.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 33 బ్రహ్మదత్తుని వృత్తాంతము

కన్నుల నీరు కురియగ - కన్యలు
తండ్రికి సర్వము తెలియబరచిరి
అంతట తండ్రి - వారల గాంచి
పొగడెను వారి ఓరిమి కెంతయు.

క్షమయే దానము యజ్ఞము క్షమయే
క్షమయే సత్యము ధర్మము క్షమయే
క్షమ సాధించగ చాలిన- భువిలో
సర్వము సాధించిన వారగుదురు.

పలికెను : ఓరిమి నిలయము రాజు
తనయల ఓర్పుకు సంతసమంది
తగిన వరునికై సచివుల కూడి
కొలువుదీరి యోచించ సాగెను.

అవివాహితను శరణు వేడితి
తపోవంతుడవు పుణ్యమూర్తి వన
సంతస మందిన చూళి మహఋషి
సంకల్పముచే పుత్రు నొసగెను.

అంతట ''చూళి'' అను నొక మౌని
నిశ్చల తపమున నున్న సమయమున
ఊర్మిళ పుత్రిక ''సోమద'' యను నొక
గంధర్వకన్య కొలిచెను మునిని

సోమద యంతట తన కుమారునికి
''బ్రహ్మదత్తు''డని పేరు బెట్టెను..
కాంపిల్యమునకు రాజై అతడు
ఇంద్రుని పోలి ఏలసాగెను.

శుశ్రూషలతో మెప్పించగను
మదిలో కోరిక తెలియబరచమన
పవిత్రుడైన బ్రహ్మజ్ఞాని యగు
పుత్రుని బడయగ కోరిక యనెను.

కుశనాభుడు తన కన్యలందరిని
బ్రహ్మదత్తునికి రాణుల చేసెను
పాణిగ్రహణము జరిగినంతనే
వెనుకటి సుందర రూపము లందిరి.

పుణ్యమూర్తియగు అల్లుని గాంచి
ఆనందించెను ఆ మహరాజు
కుబ్జరూపములు పోయిన కన్యలు
భర్త మహిమకు భక్తి నిండిరి.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 3 4 విశ్వామిత్రుడు తన జన్మ వృత్తాంతము వివరించుట

కుశనాభుడు తన తనయ లందరిని
భర్త వెంబడి పంపి అంతటను
పుత్రుని కొరకై యజ్ఞము చేసెను
అంతట బ్రహ్మకు మానస పుత్రుడు

తండ్రి దీవన ఫలియించగను
ధర్మనిష్ఠుడగు ''గాధి'' యను నొక
తనయుని పొందెను కుశనాభుండు
గాధి తనయుడను నేనే రామా!

తనను తండ్రియగు కుశుడంతటను
యజ్ఞము చేసిన తనయుని గాంచి
పుత్రుని బడయగ దీవనలిచ్చి
బ్రహ్మ లోకమున కేగెను అపుడు

కుశుని వంశజుడ కౌశికుని గను
గాధి కుమారుడు గాధేయు నిగ
కీర్తిమంతులగు వారి వల్లను
పొందితికీర్తి పుణ్య ఫలమది

నా సోదరి, విను- దశరథనందన
పాతివ్రత్యపు మహిమ చేతను
దేహముతోను స్వర్గము కేగెను
స్వార్థ రహితయై జీవకోట్లను

పునీతులనుగా చేయగదలచి
ఆకాశమును వదలి పారెను
హిమవత్పర్వత ప్రాంతమందున
తనకైతాను దిగి వచ్చినది.

పుణ్యనదిగను కీర్తి గడించెను
నా సోదరి అన నాకును కీర్తియె
సత్యవతియని కౌశికి యనియు
పేరు గాంచినది ఋచీకుపత్ని.

దివ్యమూర్తి - తా పుణ్యనది అయి
లోకము యొక్క హితమును కోరుచు
సుందర హిమవత్ప్రాంతము నందు
ఉన్నది సోదరి - ఉందును అచటే.

యాగ నిర్వహణ నియమ విధులకై
సోదరి కింత దూరమునున్న
సిద్ధాశ్రమము చేరితి రామా!
నీ విక్రమమున కోరిక తీరెను.

నా వంశమును నా గురించియు
తీరుగ నీకు చెప్పితి రామా!
ప్రొద్దుపోయినది నిద్దురపొమ్ము
ప్రయాణమునకై సిద్ధము కావలె.

తరువులు నిలచెను సవ్వడి లేక
మృగములు, పక్షులు నిదురలొ మునిగెను
నింగి నిండుగా తారలు నిండగ
కనులున్నటుల కనబడుచున్నది.

చల్లని చంద్రుడు వెన్నెల జల్లెను
నిశాచరములు మాంస భక్షకులు
రాక్షస గుంపులు భయము గొలపగ
సంచరించుచు నున్నవి నిశిలో.''

కౌశికమౌని అటుల చెప్పగా
మునులందరును మేలు మేలని
పొగిడిరి విశ్వామిత్ర మునీంద్రుని
వంశోద్భవులను పొగడిరి వారు.

''బ్రహ్మ సమానులు మీ వంశజులు
నీవు కీర్తితో నిలచిన మూర్తివి
మీ సోదరి - నది యశము నందినది
ధర్మాచరణకు నెలవగు వంశము.''

ప్రశంసలందిన విశ్వామిత్రుడు
పశ్చిమాద్రిలో సూర్యునివోలె
నిదురించెను- శ్రీరామలక్ష్మణులు
అచ్చెరువందిరి, నిద్రలొ మునిగిరి.

॥శ్రీరఘురాముని॥

# 3 5 గంగ – ఉమల చరితము

''భక్త బాంధవ లెమ్ము తెల్లవారినది
నింగి భానుడు తొంగి చూచుచున్నాడు
శుభముకలుగుననీకు శ్రీరామచంద్రా!
బయలుదేరగ నీవు సిద్ధముగ నుండు.''

చల్లగ పలికిన మౌని పలుకులకు
మెల్లగ లేచి పూర్వాహ్ణమున
చేయవలసిన నిత్య కర్మలు
పూర్తిచేసుకు మౌనితొ బలికెను :

''నిర్మలమైన జలకము లుండి
ఇసుక తిన్నెల శోభల నిండి
లోతగు శోణను దాటుట ఎట్లు?
తెలియబరచుము తాపసోత్తమా!''

మహర్షులు వారేగెడి త్రోవలో
నడచెదమయ్యా రఘుకుల దీపక!''
కానన సీమల నడచుచు వారు
పవిత్ర నదియగు గంగను చూచిరి.

పావనగంగలొ స్నానముచేసి
పితృ తర్పణము నివేదనమును
శ్రద్ధగచేసి ఆ మునిశ్రేష్ఠులు
శేషము భుజించి కూర్చొనిరచట.

రామభద్రుడు అడిగె మునీంద్రుని
మూడు మార్గముల పవిత్ర గంగ
రత్నాకరుని చేరుట తెలుపుడు?
అనగా మౌని ముదముతొ తెలిపెను :

''హిమవంతుడను పర్వత రాజు
వివిధ ధాతువుల ప్రకాశించుచు
సౌందర్యములో ఎన్నికలైన
పుత్రిక లిరువుర కలిగియుండెను.

మేరువు పుత్రిక కోమలాంగి యగు
మనోరమయె హిమవంతుని భార్య
పెద్దకూతురు–గంగ, పావని
చిన్నకుమార్తె– ఉమగా పెరిగెను.

దేవతలంతట పర్వతరాజును
దేవకార్యములు నిర్వహించుటకు
పవిత్రగంగను త్రిపథగామినిగ
ప్రసాదించుమని ప్రార్థన చేయగ

సురల ప్రార్థన విని హిమవంతుడు
ముల్లోకములకు హితము కూర్చగా
పవిత్రగంగను అందజేసెను
ఆనందించెను ముల్లోకములు.

దశరథరామా! ఆ హిమవంతుని
రెండవ కూతురు ఉమయను కన్య
తీవ్రనిష్ఠతో ఫాలనేత్రుని
తపసుచేసి మెప్పించ గలిగెను.

తపోనిష్ఠ యగు ఉమాబాలను
లోక పూజ్యయగు కన్యను అపుడు
ప్రసన్నుడైన శంకరునకును
ఇచ్చి–పాదములు కడిగెను రాజు.

శైల రాజసుత లిద్దరు వారు
గంగా - ఉమలు, వింటివ రామా!
ఆకాశమునకు గంగ వెడలిన
వృత్తాంతము వినిపించితి నీకు.

సురలోకమునకు అప్పుడు వెళ్ళిన
పవిత్రగంగ ఇదియే రామా!
నిత్యము - నిర్మలమైన జలములివి.
శిరోధార్యములు పాపహరణములు.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 3 6 పార్వతీదేవి దేవతలను- భూమినిశపించుట

రామచంద్రుడు అడిగె మునీంద్రుని
దేవలోకమున - మనుజలోకముల
పావనిగంగ ప్రభవించిన ఆ
వృత్తాంతమును వివరించుమనె.

ఉత్తమనదిగా వినుతి కెక్కుట
శాశ్వతకీర్తిని పొందిన విధము
తెలియబరచుమన - కౌశికమౌని
గంగ చరిత్రము చెప్పెను అంతట.

''పూర్వము - శివుడు పార్వతిదేవిని
పరిణయమాడి - మక్కువ నిండి
నూరు దివ్య సంవత్సరమ్ములు
గడపినగాని ఆ దంపతులకు

తనయుడు ఉదయించగ లేదపుడు
బ్రహ్మ మొదలగు దేవతలందరు
భయమునందిరి - పుత్రుడు కలిగిన
తేజోవంతుని భరించు టెట్లని.

బోళాశంకరు నందరు స్తుతించి
తేజము నతనిలొ నిలుపుకొనమని
లోకములన్నీ కాపాడు మని
కోరగ-సరియనె శంకరదేవుడు.

'నా తేజమును భరించ నెవ్వరు
సమర్థులో మరి తెలుపుడు' అనగ
భూమి అందుకు సమర్థురాలన
తేజము విడచెను శంకరు డంతట.

శివుని తేజముతొ నిండిన భూమి
భగ్నమగునటు తోచగనంతట
దేవతలందరు అగ్నిని కోరిరి
'వాయువుతో, నువ్వు, తేజముదాల్చుము.'

అగ్ని-వాయువు దాల్చిన తేజము
శ్వేత పర్వతము అయినదంతట
అగ్ని-సూర్య సదృశము అయిన
రెల్లువనమట ఏర్పడెనప్పుడు.

అగ్నినుండి అతి తేజోవంతుడు
కార్తికేయుడు జననమందెను
కృత్తికలతనిని పెంచుటచేతను
కార్తికేయునిగ వినుతికెక్కెను.

ఋషిగణమంతయు ప్రీతినందిరి
శివ పార్వతులను పూజించిరట
కానీ కోపమునిండిన పార్వతి
సురలనుగాంచి శాపమునిడెను.

'పుత్రునిబడసెడి కోరిక నాకు
తీరకపోయెను మీ కొరికచే
కావున మీమీ భార్యలు కూడ
సంతులేనివారగుటది తథ్యము.'

భూమిని కూడా శపించె పార్వతి
'పుత్రులు కలుగట సహింపకుంటివి
కావున - పుత్ర సౌఖ్యమునందవు
ఎందరొ రాజుల భార్యగనుందువు.'

శాపమునందిన వారందరును
సిగ్గుతొ దుఃఖము నిండగచూచి
శంకరుడచట పార్వతితోను
హిమాద్రినుత్తర శిఖరమునందు.

తపముచేయగ సాగెను అంతట
తీవ్ర తపస్సులొ లగ్నమాయెను
రామా! ఇదియే పార్వతి చరితము
గంగ ప్రభావము వివరించెద విను.''

॥శ్రీరఘురాముని॥

❊❊❊

# 3 7 కుమారస్వామి జననము

''శంకరుడచట తపమున నుండగ
అగ్నిని ముందు నిడుకొని సురలు
బ్రహ్మను చేరి వినయము నిండి
ప్రణామముంచి పలికిరి భక్తితొ.

ఆదికాలమున సేనాపతిగ
శంకరునొసగి దయజూచితివి
తపములొనుండెను శంకరుడిపుడు
కర్తవ్యమును తెలియబరచుమన''

సర్వ లోకముల పితామహుడగు
బ్రహ్మపలికెను మధుర వాక్యముల
''శైలకుమారి శాపమువలన
దేవతలకు ఇక సంతు కలుగదు.

కావున- ఈమె - ఆకాశగంగ
అగ్నిదేవుడు ఈమెయందున
రిపులగెలిచెడి తేజోవంతుని
దేవసేనలకు అధిపతి నందును.

హిమగిరీంద్రుని జ్యేష్ఠపుత్రిక
గంగ - మాతయగు సత్పుత్రునికి
ఆ బాలుడును పార్వతిదేవికి
ప్రీతిపాత్రుడై యశమునందును.''

బ్రహ్మ పలుకుల ముదమునందిరి
పూజలు సలిపి స్తుతించి - అంతట
కైలాసగిరిని చేరిరి వారు
అగ్నిని కోరిరి సేనాపతికై.

సరియని పలికి హుతవాహుడట
గంగను చేరి తెలిపెను తీరుగ
''దేవతలందర అభీష్టమిది విను
దేవీ! గర్భము ధరించు నీవు.''

అనలుని పలుకులు విని గంగమ్మ
రూపమునందెను మూర్తిగ నిలచెను
అంతటి సౌందర్యము నటగాంచి
శంకరు తేజము విడచెను అగ్ని.

అగ్ని విడచిన తేజముతోను
నిండెను గంగ - భరించలేక
దుఃఖము నిండి నిలబడలేక
దేవ పురోహితుడగ్నితొ పలికెను :

'వృద్ధినందిన తేజమ్మును నే
భరింపలేను అశక్తురాలను'
అనగా అగ్ని హిమగిరి చరియలొ
గర్భము నుంచగ చెప్పెను గంగకు.

దశరథరామా! గంగ అంతట
గర్భమునచట వెలువరించెను
భూమిని చేరిన దివ్య మిశ్రమము
స్వర్ణము - రజతముగా వెలుగొందెను.

క్షారమువలన రాగి - ఇనుములు
అందలి మాలిన్యముతో నంతట
సీసము - తగరము లుద్భవించి, మరి
సకల ధాతువులు భువి నుదయించెను.

గర్భమునుండి వెడలిన తేజము
పర్వతప్రాంతమునంతయు ప్రాకి
స్వర్ణమైనది - అంతటినుండి
అగ్నిరూపమని బంగరునందురు.

అచ్చటనున్న తరువులు - తీగలు
పొదలు సమస్తము బంగరు ఆయెను
శరవనమందు పుట్టిన బాలుని
సేనాపతియగు దివ్య బాలుని

పెంచగ సురపతి - సురలందరును
కృత్తికలను నియమించి పంపగను
సంతోషముతో తమ బాలకుడని
వాత్సల్యముతో ఆకలి తీర్చిరి.

నేపాలిచ్చెద - నే ముందనుచును
ఆర్గురు కృత్తిక లంతటరాగా
ఆరు ముఖములతొ పాలను త్రావెను
ఒక్కపూటలో వృద్ధినందెను.

గర్భము జారుటచే ఉదయించెను
కావున - స్కంధుడు అందురు వీరుని
కృత్తికలాతని పెంచుటచేత
కార్తికేయుడని యశము నందెను.

అతి బలవంతుని తేజోవంతుని
అసురుల జయించు అమితోత్సాహుని
దేవగణములు ముందు నిడుకొని
సేనాపతిగా అభిషేకించిరి.

ఓ రఘురామా! గంగ వృత్తాంతము
కుమార జననము వివరించితిని
కార్తికేయుని భక్తులందరును
దీర్ఘాయుష్కులు అగుదురు భువిని.

కకుత్థ్సరామా! స్కందుని భక్తులు
కొమరులు - మనుమలు గలిగినవారై
భువిలో సుఖములు అన్నియు పొంది
కార్తికేయుని నెలవు చేరెదరు.''

॥శ్రీరఘురాముని॥

# 3 8 సగరుని వృత్తాంతము–అశ్వమేధము నారంభించు

భువికి దిగిన గంగమ్మను గూర్చి
తెలియజెప్పెను కౌశికమౌని
''సగరమహీపతి అతి ధర్మాత్ముడు
అయోధ్య నేలెను పూర్వము - రామా!

ఎంతో చక్కగ పరిపాలించెను
సంతులేక తను పరితపించెను
వైదర్భుని కూతురు 'కేశిని', రాజుకు
పెద్దభార్య - అతి ధార్మికురాలు.

అరిష్టనేమి పుత్రిక, 'సుమతి'
అందచందముల సాటిలేనిది
సగరుని రెండవ భార్యగ పతితో
సర్వ సౌఖ్యములు పొందుచుండెను

భార్యలిద్దరితొ రాజు వెడలెను
హిమవత్పర్వత ప్రాంతము జేరి
'భృగు ప్రస్రవణము' అనునొకగిరిపై
తపము చేసెను సంతతి కొరకై.

నూరు వత్సరము లటుల గడచినవి
'భృగుమహర్షి ఆ తపసుకు మెచ్చి
సంతతి కలుగగ వరము నొసగెను
కీర్తి కలుగునని ఆశీస్సులనిడె.

'నీభార్యలలో ఒక్క భార్యకు
వంశకర్తయగు పుత్రుడు కలుగును-
అరువదివేల పుత్ర సంతతి
కలుగును రెండవ భార్యకు' అనెను.

అంతట కేశిని వంశకర్తయగు
పుత్రుని వరముగ కోరుకొన్నది
కీర్తిమంతులగు అరువదివేల
పుత్రుల కోరెను సుమతి అప్పుడు

ప్రదక్షిణించి నమస్సులుంచి
బయలుదేరెను రాజు సతులతో
'అసమంజు' డను పుత్రుని బడసెను
సగరునివలన కేశిని అంతట.

గుంంంని రూపగు గర్భ పిండమును
ప్రసవించినది సుమతి అప్పుడు
దానిని చీల్చుకు అరువది వేల
పుత్రులువచ్చిరి - వినుమిది రామా!

నేతితొనిండిన కడవలయందు
దాదులు వారిని ఉంచి పెంచిరి
యౌవ్వనదశలో అందరు పుత్రులు
అందమునందు మిన్ననిపించిరి.

అసమంజుండు రాజుకు జ్యేష్ఠుడు
తమ్ములందరిని-పిల్లలెందరినొ
జలములందు పడవైచెడివాడు
వారుమునుగగ సంతసపడుచు

పాపకార్యముల నాచరించుచు
సజ్జనులను మరి హింసించగను
రాజు - అతనిని నగరము నుండి
వెడలగొట్టెను కకుత్థరామా!

అసమంజునికి కుమారుడాతడు
'అంశుమంతుడు' ప్రియభాషణుడు
అతిపరాక్రముడు - అతడు జనులకు
ఎంతో హితుడై యశము గడించెను.

కొంతకాలము జరిగిన పిదప
సగరుడంతట యాగము చేయగ
సంకల్పించి ఋత్విక్కులతో
శాస్త్రోక్తముగా యాగము మొదలిడె.''

||శ్రీరఘురాముని||

❊❊❊

## 39 సగర పుత్రులు భూమినిత్రవ్వుట

సగరుడు యాగము సాగించెనని
ముని చెప్పగను రాముడు అడిగెను
''మా పూర్వీకుడు సగరుడు యజ్ఞము
చేసిన విధమును వినగోరుదు'' నని.

ముదమునంది అట కౌశకమౌని
సగరుడు చేసిన అశ్వమేధమును
విశదముగా వివరించెను వారికి
తేజోవంతులు శ్రద్ధగ వినిరి.

''హిమగిరినుండి వింధ్యాచలము
నడుమనున్న ఆ పుణ్య స్థలమును
యజ్ఞము చేయుట కనువైనదియని
నిర్ణయించుకొని వదలిరశ్వమును.

కుకుత్స్థరామా! అంశుమంతుడు
మహారథముతో దృఢమగు వింటితొ
సగరుని ఆనతి మేరకునపుడు
అనుసరించెను యాగాశ్వమును.

ఇంద్రుడు అంతట మాయరూపమున
' ఉక్వాహ' మను - పర్వదినమున
యాగాశ్వమును అపహరించెను
అపుడు ఋత్విజులు పలికిరి రాజుతొ :

'యజ్ఞకర్తవగు నీకపకారము -
యజ్ఞము విఘ్నము చేయుటకొరకై
ధూర్తుడు ఎవరో యాగాశ్వమును
అపహరించెనది మాకును అశుభము.

కావున నీవు వేగమె వెదకి
తురగము తెచ్చుట కర్తవ్యమ్మన
అతిబలవంతులు అరువది వేల
తనయుల చూచి రాజు పలికెను :

'దానవు లెవరో దొంగిలించిన
తురగముకొరకై బయలుదేరుడు
ఆమడకొకనిగ అంచెలంచలుగ
వెదకుడు భూమిని మీరందరును.

యాగాశ్వమును - దొంగనుకూడా
పట్టుకొనక - యిక మరలకూడదు
అంశుమంతుడు, నేనును యిచటే
ఉందుము మీరు బయలుదేరు' డన

సంతోషముతో సగరకుమారులు
బయలుదేరి అట భూమిని వారు
ఆమడ కొకడై శిఖరము వంటి
గోళ్ళతొ పదునగు శూలమ్ములతో

భూమిని చీల్చుచు సాగిరి అంతట
భరింపరాని ధ్వని కలిగినది
పాములు మడసెను జంతువు లరచెను
పరుగిడలేక దానవు లేడ్చిరి.

నాల్గుదిక్కులు నిండెను ధ్వనులతొ
అరువది వేల సగరకుమారులు
భూమిని చిందరవందర చేయుచు
త్రవ్విరి పాతాళము వరకపుడు.

అంతట సురలు గంధర్వులును
పన్నగులందరు బ్రహ్మనుచేరి
సగరకుమారులు చేసిన దంతయు
భయముతొ నపుడు విన్నవించిరి.

'ఈతనివలన యాగము ఆగెను
ఈతడు తురగము నెత్తుకుపోయెను
అనుచు ప్రాణులను చంపుచుండిరి
భూమిని ధ్వంసము చేసిరి దేవా!'

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 40 అరువది వేల సగరకుమారులు భస్మమగుట

కమలాసనుడు పలికె సురలతో
'నవద్వీపములు కూడిన భూమి
వాసుదేవునిది- ఆ మహాత్ముడు
భస్మము చేయును వారందరిని.

ప్రతి కల్పమున భూమి యిట్టులే
త్రవ్వబడునది చింతింపకుడు'
అని చెప్పగను వచ్చినవారు
సంతసమంది వెడలిపోయిరి.

భూమిని త్రవ్వి ప్రదక్షిణించి
తురగముగానక తండ్రినిచేరి
శ్రమ వివరించి తురగముగాంచెడి
మార్గోపాయము వివరించమన

పుత్రులజూచి కోపమునంది
'తురగము కొరకై తిరిగి త్రవ్వుడు
తురగములేక తిరిగిరాకుడు'
అనగ తిరిగి అటభూమిని త్రవ్వుచు.

'విరూపాక్షమను' దిగ్గజమ్మును
చూచిరి వారు - నమస్కరించిరి
అష్టదిగ్గజములన్నవి నిరతము
శిరముల భూమిని మోయుచుండును.

బరువువల్లను కలుగుబాధను
తొలగించుకొన పర్వదినముల
శిరసూగించును భూమివణకును-
తూర్పునగాంచిరి 'విరూపాక్షమును.'

ఆవల దక్షిణ దిశలో త్రవ్విరి
'మహాపద్మ'మను మదగజమునట
చూచిరివారు - ప్రదక్షిణించిరి
అంతటవారు త్రవ్వుచుసాగి

పడమటి దిశలో 'సౌమనసమ్మును
ఉత్తర దిశలో 'భద్ర' మనియెడి
మదకరీంద్రముల చూచి భక్తితో
ప్రదక్షిణించి కుశలమునడిగిరి.

తిరిగి త్రవ్వీరి ఈ శాన్యమున
కోపమునిండి సగరకుమారులు
అటుల త్రవ్వుచు ఒక ప్రదేశమున
దివ్య పురుషుని గాంచిరి వారు.

వాసుదేవుని పరుషములాడిరి
ముని వేషముగల దొంగని పలికిరి
యజ్ఞవిఘ్నము చేయు ఘాతకా!
నీకిపుడెవ్వరు రక్షణ అనిరి.

తపస్స్వరూపుడు దేవదేవుడగు
కపిల మహర్షిని గాంచిరి వారు
ప్రక్కనవున్న అశ్వముగాంచిరి
సంతసమంది - దురుసుతనమున

మూర్ఖుల గాంచిన మౌని అంతట
హుంకరించెను క్రోధము నిండెను.
అంతట వెడలిన క్రోధజ్వాలకు
భస్మమైరి ఆ సగరకుమారులు.

॥శ్రీరఘురాముని॥

## 41 అంశుమంతుడు యాగాశ్వము తెచ్చుట-గంగను దివినుండి భువికెట్లు దించుట అని యోచించుట

పుత్రులజాడ తెలియకపోయెను
సమయము చాలా జరిగిపోయెను
చింతతొ సగరుడు అంశుమంతుని
వీరుని పంపెను వెదకుట కొరకై

'శూరుడవీవు ధైర్యవంతుడవు
జాడ తెలుసుకొని వేగమెరమ్మ
భూమియందు అతి భీకరమయిన
భూతములుండును కావున నీవు

విల్లు-ఖడ్గములందుకు పోవలె
మ్రొక్కదగిన వారందరి కచట
మ్రొక్కుచు -భక్తితొ ఆశీస్సులుగొని
విఘ్నపరులను జయించిరమ్మ.'

తాత మాటకు సరియని పలికి
బయలుదేరెను అంశుమంతుడు
భూమిని త్రవ్విన మార్గముబట్టి
అనుసరించి అట గజమును గాంచెను.

మేరువు సరియగు గజమును చూచి
ప్రదక్షిణించి అశ్వము జాడయు
వెదుకబోయిన పినతండ్రులయొక్క
వివరము లడిగెను గజరాజునట.

రవికులమ్మున పుట్టినవాడగు
తేజోవంతుడు అంశుమంతునితొ
పలికెను గజము 'జయము కలుగును
అశ్వము దొరకును కార్యము తీరును.'

ఆ విధముగను అంశుమంతుడు
దిగ్గజమ్ములను చూచి - వాటిని
అడుగుచు సాగెను అవి అన్నియును
'లభించు నీకు యాగాశ్వము' అనె.

దిగ్గజమ్ములట త్రోవ చూపగను
సాగుచు అచట బూడిదకుప్పలు
గాంచినవాడై దుఃఖమునిండి
రోదించెను తన పినతండ్రులకై.

కన్నుల నీరు కురియుచుండగా
గాంచెను అచట యాగాశ్వమును
పినతండ్రులకు జలమును విడువగ
వెదకెను అచట నీటివనరుకై.

అంత దవ్వులో ఒక ప్రదేశమున
పినతండ్రులకు మేనమామయు
పక్షికులముల అధిపతి-పూజ్యుడు
ఎఱ్ఱని-పచ్చని మేని రంగుగల

గరుత్మంతుని గాంచెను అంతట
అంశుమంతుని గాంచి ఖగపతి
ప్రియముగ బిలచి-'చింతిల వలదు
వీరి మరణము లోక సమ్మతము.

విశ్వము నిండిన విష్ణుమూర్తి-తను
కపిలుని రూపున వీరందరిని
దుష్కార్యములను చేసెడి దుష్టుల
దండించెను యీ విధముగ వినుము.

బ్రాహ్మణ కోపము దహించె వీరిని
ఉదకదానము చేయకపోయిన
ఊర్ధ్వలోకములు కలుగవు గనుక
పవిత్రతీర్థము తెచ్చుట ఉచితము.

నిస్సారమగు జలములు విడువకు
పావనిగంగను భువికే దింపుము
హిమగిరీంద్రుని పెద్దకూతురు
పవిత్రగంగతొ కార్యము తీర్చుము.

భస్మరాసులపై గంగమ్మను
పరుగిడజేయుము పవిత్రమూర్తీ!
అప్పుడు వీరు నరకము చేరక
స్వర్గము చేరి సుఖము లందెదరు.'

గరుత్మంతుని పలుకులు వినెను
యాగాశ్వముతో అయోధ్యచేరి
తాతకు సర్వము తెలియబరచెను
సగరుడు యాగము సలిపె దుఃఖముతొ.

గంగను నేలకు దింపుట ఎట్లని
ఆలోచనతో మార్గము తోచక
ముప్పదివేల సంవత్సరములు
భూమినేలి తను స్వర్గమేగెను.

॥శ్రీరఘురాముని॥

## 42 ఆకాశగంగను భరింపగ పరమశివుని ప్రార్థింపుమని భగీరథునికి బ్రహ్మ తెలుపుట

''సగరుడు స్వర్గము జేరెను రామా!
ధార్మికుడయిన అంశుమంతుని
రాజుగ అభిషేకించిరి మంత్రులు
అతని కుమారుడు 'దిలీపు'డయ్యా!

దిలీపునకును రాజ్యమునిచ్చి
అంశుమంతుడు హిమాద్రిచేరి
ముప్పది రెండు వేల ఏండ్లట
తపసును చేసి స్వర్గమేగెను.

తేజోవంతుడు దిలీపుడంతట
పితామహులకు జలక్రియలెటుల
చేయగవలెనని చింతతొ నుండెను
దిలీపు కొమరడు 'భగీరథు'డయా!

ధార్మిక చింతన కలిగినవాడగు
ఆత్మజ్ఞానియగు దిలీపునకును
యశముతెచ్చు అతి ధార్మికమూర్తి
భగీరథుడు - సత్పుత్రుడు కలిగెను.

దిలీపుడటులే గంగను దింపెడి
మార్గముతోచక - ముప్పది వేల
సంవత్సరములు రాజ్యముచేసి.
ఇంద్రలోకమున కరిగెను అంత

రాజఋషియగు భగీరథుండు
రాజ్యము - మంత్రుల పాలననుంచి
గంగను భువికి దింపుటకొరకు
యత్నము చేయగ సంకల్పించెను.

గోకర్ణ క్షేత్రము చేరెను అతడు
నెలకొకమారే ఆహారముతిని
జితేంద్రియుండై చేతులు ఎత్తి
దీర్ఘతపస్సును ఆచరించెను.

వేల ఎండ్లు అట తపముచేసెను
విధాతమెచ్చి అతని తపసుకు
వరము కోరుమన భగీరథుండు
భక్తితొ బ్రహ్మకు అంజలి ఘటించి

'సగరపుత్రులు నా ప్రయత్నమున
జలతర్పణము అందుకొనవలె
పావనగంగ బూడిద రాసుల
ప్రవహించినచో స్వర్గమేగెదరు.

వాణీనాథా! కులము నిలుపగ
కుమారునిమ్మ రెండవ వరముగ' -
అంతట బ్రహ్మ ఆనందించి
శుభమని పలికి వరములనొసగి

'హిమగిరీంద్రుని పెద్ద కూతురగు
గంగ- భూమిపై పడగా- పుడమి
ఓర్వజాలదు ఆ తాకిడికి
కావున శివుని ప్రార్థించుమునువు.'

త్రినేత్రుడొకడే గంగనుదాల్చగ
శక్తిమంతుడని రాజుకు చెప్పి
అనుగ్రహించగ గంగకు చెప్పి
వెడలెను బ్రహ్మ వచ్చిన సురలతొ.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 43 గంగావతరణము

''దేవదేవుడగు కమలాసనుడు
వెడలినంతనే భగీరథుండు
బొటనవ్రేలిపై నిలబడి, రామా!
శివునిగూర్చి అట తపము చేసెను

సంవత్సరమటు ఘోర తపముచే
ఫాలనేత్రుని మెప్పించగను
ప్రత్యక్షమైన పార్వతీపతి
గంగను శిరసున దాల్చెదనసెను.

అంతట గంగ దూకెనుశిరమున
శివుని శిరస్సున పడె వేగముతో
దూకెడి గంగ మదిలో తలచెను
'శివునితొ కూడి ఈ వేగముతో

పాతాళమునే ప్రవేశింతును'-
గంగ గర్వము గ్రహించి పశుపతి
జటాజూటమున బందీ చేసెను
బిందువు చిందక నిలచెను గంగ.

ప్రయత్నించెను పవిత్ర గంగ
నేల దిగుటకు వశముగాకను
జటామండలము నిరోధించగ
సుడులు తిరిగెనట బహువత్సరములు.

భువికై సాగిన పవిత్ర గంగ
శివుని శిరస్సున దూకిన గంగ
జాడ తెలియక భగీరథుండు
తిరిగి శివునికై తపముచేసెను.

తపసుకు మెచ్చి గరళకంఠుడు
హిమవత్పర్వత సరస్సు నందు
బ్రహ్మ నిర్మిత బిందు సరస్సున
గర్వమునణచి గంగను విడచెను.

అటు జారిన ఆ పవిత్ర గంగ
ఏడు పాయలై అందులొ మూడు
'హ్లాదిని'-'పావని'-'నళిని' అనునవి
తూర్పు దిక్కుగా సాగె వేగముగ.

మంగళతోయము లింకొకమూడు
'సుచక్షువు' మరి 'సీతయు' 'సింధువు'
సోయగములకగ సాగెపడమర
భగీరథునితో సాగె- ఏడవది.

భగీరథుడు తన తేరుతొ ముందర
యశస్వివెంట గంగ నడచెను
పాపభంగ ఉత్తుంగ తరంగ
సాగుటగాంచిరి ధన్యజీవులు.

వడిగల గంగ గలగల నడువగ
జలచరములట సొగసుగ తేలగ
సోయగమొలికెను పుణ్యభూమిని
శోభలీనినది పుడమియెల్లను.

నింగినుండి అట శంభుని శిరసుకు
శిరసునుండి అట నేలకు దిగిన
గంగను చూచిరి గంధర్వులును
సురలు, ఋషులు, యక్షులు చూచిరి.

శ్రేష్టములైన గజములపైన
విశాలమైన విమానములపై
మేలుతురగముల ఆశీనులు అయి
గాంచిరి గంగను కలుష విభంగను.

భువికి దిగిన ఆ పవిత్ర గంగను
అవతరించిన ఆకాశగంగను
చూడవచ్చిన సురల తేజముతొ
ధరించినట్టి ఆభరణములతొ.

మబ్బులు వీడిన ఆకాశమది
నూరుసూర్యు లుదయించి నట్లయి
రాలెడి జలచర సంపదలవ్వి
మెరపుతీగ లుదయించినట్లయె.

గంతులు వేయుచు సాగిన గంగ
నురగలు ఎగసెను నింగికి నేలకు
హంసల గుంపులు శరన్మేఘములు
నిండినట్టు ఆకాశము తోచెను.

వేగముగలిగి వొంపుల ఒదిగి
సూటిగసాగి ఎత్తును ఎక్కి
రాలలొపారి రవళులునిండి
పల్లములందు ప్రవహించుచును.

గాలితాకిడికి అలలై నిలచి
వెనుక వచ్చెడి నీటికిలొంగి
నేలనుండి ఆ నింగిని చూచుచు
వడిగాసాగెను పవిత్రగంగ.

పాపపంకిలము పారద్రోలెడు
పంకిలమసలే లేని తోయముల
సొగసుగ జారెను ఆకాశగంగ
నేలను పరుగిడె ఆ శివగంగ.

శివుని శిరస్సున నిలచిన గంగ
అతిపవిత్రమై నిలచిపోయినది
కావున, ఋషులు దేవగణములు
నరులందరును శిరసునదాల్చిరి.

శాపగ్రస్తులై నేలకు జారిన
స్వర్గవాసులు గంగలొ మునిగి
పాపముతీరి నాకము చేరిరి
శుభముల నెలవు గంగని పొగడిరి.

భగీరథునితో సాగెను గంగ
గంగతొసాగిరి సురలు, ఋషులు
యక్షులు-కిన్నర - గంధర్వులును
ఉరగులు - అసురులు- జలచరమ్ములు.

భగీరథుడు తను సాగినదిశలో
సాగినగంగ యజ్ఞము చేసెడి
జహ్నుమహఋషి యజ్ఞవాటికను
పూర్తిగ జలముతొ ముంచివేసెను.

గర్వించెడి ఆ గంగనంతను
యాజకుడైన జహ్ను మహర్షి
కోపమునిండి త్రాగివేసెను
అచ్చెరువాయెను వచ్చెడివారికి.

అంతట సురలు ఋషులందరును
వినుతించిరి ఆ జహ్నుమునీంద్రుని
గంగను మౌనికి సుతగాజేసిరి
వాత్సల్యములో మునిగెను ఆ ముని.

తేజోవంతుడు సంతుష్టుడయి
చెవిలోనుండి విడచెను గంగను
కావున రామ! జహ్నుసుతయని
జాహ్నవియనుచును గంగనందురు.

భగీరథుని రథ మార్గము సాగుచు
కడలిని కూడా చేరెను గంగ
పవిత్రమూర్తి మనోరథమ్మును
తీర్చగ దిగెను పాతాళమునకు.

అతి ప్రయత్నము ప్రయాసతోను
భగీరథుడు - తను పవిత్ర గంగను
గొని చేరెను అట భస్మరాసులను
సగర పుత్రులను స్వర్గము జేర్చెను.''

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 44 సగరపుత్రులకు ఉత్తమలోక ప్రాప్తి

''పాతాళమునకు గంగ చేరెను
భస్మరాసులను ముంచి వేసెను-
బ్రహ్మ అంతట భగీరథునితో
పలికెను-'రాజా! ధన్యుడవైతివి.

కీర్తిమంతుడగు అంశుమంతుడును
రాజఋషియు - మరి నాతో సమమగు
తపోవంతుడగు దిలీపు వలనను
గంగను తెచ్చుట జరగక పోయెను

అరువదివేల సగర పుత్రులు
తరింపబడిరి నీయత్నమున
సురలవోలె వారందరు - రాజా!
స్వర్గము చేరిరి పాపము తీరి

గంగావతరణము చేయించితివి
యశశ్చంద్రికలు వెలుగును నిరతము
ధర్మకార్యముల పొందగలిగిన
బ్రహ్మలోకమున స్థానమందితివి.

కడలిలొ జలము ఉండు వరకును
ఉందురు వారు నాలోకమున
పవిత్ర గంగ నీ కుమార్తె యగు
ప్రసిద్ధినందును నీ నామముతో

ఓ నరశ్రేష్ఠా! గంగలొ మునిగి
పునీతుడవయి పుణ్యము నందుము
పెద్దలందరికి తర్పణమ్మిలిడి
మరలిపొమ్ము నే-పోయెదరాజా!'

స్వర్గ - మర్త్య - పాతాళముల
ప్రవహించెడి యీ పవిత్రగంగ
త్రిపథ అనుచును పిలువబడును మరి
భగీదథిగను వినుతికెక్కును.

దేవలోకమున కేగెను బ్రహ్మ
ధర్మసమ్మతిగ జలతర్పణములు
పెద్దల కిచ్చి భగీరథుండు
రాజ్యము చేరి సుఖముగ నేలెను.

రాజా! నీవు సగర పుత్రులకు
గంగతొ శ్రద్ధగ తర్పణమిమ్ము
నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుమయా!
ధార్మిక శ్రేష్ఠుడు సగరుని వలన

రామా! అపుడు లోకమంతయు
శోకముతొలగి సుఖశాంతులతో
సిరిసంపదలతొ హర్షము నిండగ
భగీరథుని పరిపాలన సాగెను.

గంగాదేవి వివరము నంతయు
సవిస్తరముగా తెలియబరచితిని
కుశలము నీకగు శుభములు కలుగును
సంధ్యాసమయము దాటుచున్నది.

ధనము- యశము- పుత్రసంపద
స్వర్గముకూడా కలిగించునదగు
గంగదిగిన ఈ వృత్తాంతమును
వినిపించినచో ధన్యులగుదురు.

శ్రద్ధగ వినిన వారి పాపములు
తొలగును - కోరికలన్నీ తీరును
చెప్పినవారి పితృదేవతలు
ప్రీతి నందెదరు సురలు విందురు.''

॥శ్రీరఘురాముని॥

## 45 క్షీరసాగర మథనము

విశ్వామిత్రుని పలుకులు వినుచు
రామలక్ష్మణులు ముదము నందిరి
రామచంద్రుడు మునితో పలికెను
పుణ్య చరిత్రను చెప్పితివనెను.

సగరపుత్రులు త్రవ్వినదగుటచె
వృద్ధినందిన సాగర చరితము
గంగ భూమిని అవతరించుట
పాతాళమునకు సాగుట వింటిమి.

పుణ్యగాథను మదిలో తలచుచు
నిదురించెను శ్రీరామచంద్రుడు
ప్రాతఃకార్యములన్నీ తీర్చుకు
పలికెను మునితో కడు వినయముగ.

''తపోసత్తమా! పుణ్యచరిత్రను
వింటిని, రాత్రి క్షణముగ గడిచెను
త్రిపథగామిని గంగానదిని
దాటుటకొరకీ నావను తెచ్చిరి.

పుణ్యకార్యములు సలిపెడి ఋషులు
దాటయోగ్యమీ నావను చూడుము
పూజ్యుడవగు నిను దాటించుటకు
తెచ్చిరి నావను గంగను దాటగ''

నదిని దాటి ఆ పుణ్యమూర్తులు
గంగకు ఉత్తర తీరముజేరి
ఋషులందరకు పూజలు సలిపి
'విశాలాపురి' చూచిరివారు.

అంతట విశ్వామిత్రుడు వారితొ
సుందరమైన దివ్యము అయిన
స్వర్గముపోలు విశాలాపురి
చేరెను- రాముడు వివరములడిగెను.

''ఓ మునిపుంగవ! విశాలాపురి
ఏ మహరాజుచె పాలింపబడె?
శుభమగు నీకు తెలియబరచు'' మన
కౌశికమౌని ఆరంభించెను.

''రామా! వినుము దేవేంద్రుని కథ-
ఈ ప్రదేశమున జరిగిన యట్టి
వృత్తాంతమును వివరించెదను
కృతయుగమందలి విషయమువినుము.

'దితి' పుత్రులు అతిబలవంతులయి
'అదితి' పుత్రులు బలమును ధర్మము
కలిగి యుండిరి-వారందరకు
ముదిమి-మరణము-రోగము గెలువగ.

ఎటుల సాధ్యమను ఆలోచనతో
క్షీరసాగరము మథనము చేసి
అమృత పానము చేయగదలచి
మందర నగము కవ్వము చేసిరి.

కవ్వపు త్రాడుగ వాసుకి నుంచి
వేయి ఏండ్లట చిలికిరి సంద్రము
ఒరిపిడి కోర్వక వాసుకి అపుడు
ఎంతో బాధతొ! విషము కక్కెను!

సాగర మథనపు హాలహలమున
హాహాకారము చేయుచు వారు
హరుని ప్రార్థన సలిపిరి అంతట
హరునితొ హరియు ప్రత్యక్షమయి.

పలికెను హరి అట శంభుని తోను
వేల్పుల పెద్దవు- నీవు విషమును
మంచి మనసుతో స్వీకరించుమన
హరుడు కంఠమున నిలపె విషమును.

తిరిగి చిలుకుట సాగుచుండగా
మునిగె మందరము సాగరమందు
అంతట వారు హరిని వేడిరి
ఆశ్రితు లందరి పారిజాతమని.

విష్ణువు వారి మొరవిని వచ్చెను
ఆది కూర్మమై మందర గిరిని
వీపునదాల్చి-సాయము చేయగ
పాలసముద్రపు మథనము సాగెను.

వేయివత్సరము లటు చిలకగను
కమండలమును దండముదాల్చిన
ధన్వంతరియు-తేజోవంతులు-
అప్సరసలును ఉద్భవించిరి.

జలవికారమగు పాలను చిలకగ
వచ్చిన రసమున ఉద్భవించిన
సుందరాంగులు-వారందరిని
అప్సరసలు అని అందురు రామా!

అరువదికోట్ల అప్సరస లట
పరివారముతో పుట్టిన వారిని
దేవ, దానవులు గైకొనలేదు
సాధారణులై పోయిరివారు.

సముద్రమునకు అధిదేవతయగు
వరుణుని కూతురు - భాగ్యశాలి యగు
సురాధిదేవత - 'వారుణి' - మదవతి
భర్తను పొందగ వెదకుచు వచ్చెను.

వారుణినపుడు స్వీకరించనిచె
అసురులాయిరి దైత్యులందరు
సురను గ్రహించిన అదితితనయులు
సురలైనారు వారుణి నందిరి.

ఓ నరశ్రేష్ఠా! చిలికెడి కడలి
గర్భమునుండి ఉచ్చై శ్రవమను
ఉత్తమాశ్వము - కౌస్తుభమణియు
అమృతమున్నూ ఉద్భవించినవి.

రామా! అమృత మందగ నపుడు
మడసిరి ఎందరొ యిరుపక్షములలో
జగన్నాథుడు జగన్మోహినిగ
మాయతొ అమృత మప హరించెను.

మహాశక్తియు బలవంతుడగు
విష్ణువు నెదిరి సమసిరి ఎందరొ
అదితి తనయులగు సురలంతటను
దితి తనయులగు అసురుల జంపిరి.

దితిపుత్రులను దేవేంద్రుడట
అంతముచేసి రాజ్యము నంది
ఋషులు, చారణులు గూడిన లోకము
ముదమందగను పరిపాలించెను.

॥శ్రీరఘురాముని॥

# 46 దితి తపస్సు-దితి గర్భమునుదేవేంద్రుడు ఖండించుట

''మరీచి పుత్రుడు కాశ్యపమౌని
అతనిని గాంచి భార్య 'దితి' అట
పుత్రశోకమున మునిగిపోయెను
తపసు చేయుటకు అనతి కోరెను :

'స్వామీ! సురలు నా పుత్రులను
అంతము చేసిరి - అందుకు నేను
తపసు చేసెద - ఇంద్రుని చంపగ
చాలిన పుత్రుని ఒసగుము' అనగ

దుఃఖము నిండిన దితితో పలికెను
శుభము కలుగునని దీవన లిడెను
'పుత్రుడు కలిగెడివరకును నీవు
నియమ నిష్ఠతో శుచిగా నుండుము.

పరిశుద్ధముగ నీవుండినచో
వేయివత్సరము లవి గడవగనే
నా అనుగ్రహము అందిన నీకు
కొమరుడు కలుగును' అనె కాశ్యపుడు.

ఓ నరశ్రేష్ఠా! దితి అంతటను
సంతోషముతో 'కుశప్లవనము'న
ఘోరతపసులో నిమగ్న మయ్యెను
ఇంద్రుడు గ్రహించి సేవలు చేసెను.

దర్భలు- అగ్ని- ఫలములు- కట్టెలు
దుంపలు-మొదలగువన్నీ చేర్చుచు
పరిచర్యలతో దేవేంద్రుడట
కొమరుని రీతిగ సేవలు చేయగ

గడువగు-వేయి వత్సరమ్ములవి
గడుచు సమయమున దితి పలికెనట :
'వత్సా! నాకు, నీతండ్రియగు
కాశ్యప మహాఋషి వరము నొసగెను.

ఇంద్రుని చంపగ చాలిన వీరుడు-.
నీకుతమ్ముడు- ఉదయించుటకు
మిగిలి యున్నవి పది ఏండ్లికను'
అనె అతడింద్రుండని తెలియకను.

అంతట దితిఅట ఆలసటనిండి
సూర్యుడునడిమికి చేరు సమయమున
పాదములుంచెడి దిక్కునందున
శిరసునుంచి-తా నిద్రలొమునిగెను.

సురపతి ఇంద్రుడు అదే అదనని
ఆమె గర్భమును ఏడుముక్కలుగ
ఖండించగను శిశువట ఏడ్చెను-
వినగా రాముడు కలవర పడెను.

గర్భమునందలి శిశువేడ్వగను
వలదని ఇంద్రుడు అనునయించగ
చంపకు చంపకు అనెనుదితి అట
తల్లిమాట విని ఇంద్రుడు అపుడు.

గర్భము నుండి వెడలి వచ్చెను
దితితో పలికెను - 'తల్లీ! నీవు
అనాచారముగ నిదురించుటచే
శుచిత్వమ్మును గోల్పోయితివి.

నన్నుచంపగా చాలిన శిశువును
అదే అదనని ముక్కలు చేసితి
నా అపరాధము క్షమించవమ్మా!
శుచిగా నీవు లేని ఫలమిది.'

॥శ్రీరఘురాముని॥

❇❇❇

## 47 సప్తమరుత్తులవృత్తాంతము-విశాలాపురి వివరణము

''అతడు ఇంద్రుడని తెలిసినంతను
దితి పలికెను అతిదుఃఖమునిండి
'శుచిని వదిలి నే నుండుట వలన
నాగర్భమది నిష్ఫలమయినది.

నీ అపరాధము లేనే లేదు
కావున నీవు దోషివి కావు -
సప్తఖండముల గర్భపిండము
సప్తమరుత్తులుగా ఉదయించి

'మారుదః'-అన-రోదించకుడని
అంటివి కావున-మరుత్తులగుదురు
దివ్యరూపముల స్వర్గము నందు
సంచరించెదరు-దేవతలగుదురు.

బ్రహ్మలోకమున- ఇంద్రలోకమున
మూడవవాడు వాయువు అనబడి
నాల్గుదిక్కులలొ మిగిలిన నలుగురు.
ఏడ్గురు స్వర్గమునందు ఉందురు.'

దితతో పలికెను దేవేంద్రుడు అట :
'తల్లీ! నీవు పలికినట్టుగా
పుత్రులు ఏడ్గురు దేవత లగుదురు
నీకు శుభమగు నమ్ముము' అనెను.

రామా! అటుల సురనాయకుడు
ఆ- దితిసంతతి -సప్తమరుత్తులు
స్వర్గము చేరిరి, పూర్వగాథ యిది''
అనుచు చెప్పెను కౌశికమౌని.

'' ఈ ప్రదేశమున దేవేంద్రుడు-తను
దితికి సేవలు చేసియుండెను
ఇక్ష్వాకువునకు ' ఆలంబస'తో
'విశాలుడనెడి' పేరుగాంచిన

ధర్మశీలియగు పుత్రుడు కలిగెను
అతడు.'విశాల'- అను నీ నగరము
నిర్మించెను- ఆ రాజుకు పుత్రుడు
'హేమచంద్రుడు' అతిబలవంతుడు.

రామా! వినుము హేమచంద్రుని
కూరిమిపుత్రుడు 'సుచంద్రు'డయ్యా!
అతని కుమారుడు 'ధూమ్రాశ్వుడ' యా!
'సృంజయుడా' తని వంశాంకురము.

సృంజయ నృపతికి పుత్రుడు- వీరుడు
సహదేవుం' డను పేరున బరగెను
అతని పుత్రుడు కుశాశ్వుడనెడి
మహాధార్మికుడు పుడమి నేలెను.

కుశాశ్వ కొమరుడు 'సోమదత్తుడు'
'కాకుత్థ్సుడు' ఆ రాజు సుపుత్రుడు
అతని తనయుడు సుర సమానుడు
'సుమతి'- యిచ్చట వసించు చుండెను.

ఇక్ష్వాకు సంతతి అతని చలవచే
ఈ విశాలను ఏలిన రాజులు
అతివిక్రములు దీర్ఘాయుష్కులు
ధర్మశీలురై యశముగాంచెదరు.

రామా! మనమీ రాత్రి యిచటనే
సుఖముగ గడిపి- రేపటి రోజున
జనకుని చూడగ పోదము'' అనెను.
అంతట సుమతి వచ్చెను భక్తిగ.

యశోవంతుడు సుమతి అచటకు
విశ్వామిత్రుని చూడగవచ్చెను
బంధులు, ఋత్విక్కులు- అందరితో
పూజలు చేసెను కౌశిక మునికి.

కుశలమునడిగి మునితో పలుకుచు
''నీ దర్శనమున ధన్యుడనైతిని
నాదేశమిది పునీతమైనది''
అని మహరాజు ఆనందించెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 48 అహల్యా శాప వృత్తాంతము

కుశలమునడిగి సుమతి పలికెను
''కౌశికమౌనీ! నీకు శుభమగు
సురలను పోలిన యట్టి వీరులు
గజ-సింహముల నడకలు గలిగిరి.

శార్దూలమును వృషభ రాజులతో
పోలినవారీ సుందరమూర్తులు
పద్మసుందర విశాలనేత్రులు
ఖడ్గము- ధనుసు- తూణీరములతో.

సౌందర్యములో అశ్వనిసురలు
యౌవ్వనరేఖలు విరిసెడివారు
స్వేచ్ఛగ- దివిని వదలి భువికిట
దిగిన దేవతల పోలెడి వీరు.

సూర్య- చంద్రులు నింగినున్నటు
ఈ దేశములో ఉదయించిరయా!
ఎవ్వరు వీరు, కాలినడకను
ఇచటకు వచ్చిరి వివరములే'' మన.

కౌశికమౌని తెలిపెను తీరుగ
సిద్ధాశ్రమమున బసచేయుటది
దుష్టరక్కసుల త్రుంచుట మొదలగు
వివరములన్నీ వినిపించగను.

దాశరథులను చూచిన సుమతి
ఆనందముతో పొంగిపోయెను
అతిథులకెంతో శ్రద్ధాభక్తుల
పూజలుచేసి పుణ్యము నందెను.

సత్కారములు స్వీకరించి అట
రాత్రిగడపి మరునాడుదయమున
మిథిలకు చేరిరి రామలక్ష్మణులు
ముదముతో మునులు నడచిరి తోడు.

మిథిలను చూచి మునులు మురిసిరి
జనకపురికట శుభము పలికిరి
మిథిలకు చేరువ నున్న ప్రదేశము
అందువున్న ఒక ఆశ్రమమ్ముగని.

ప్రాచీనము అగు ఆశ్రమ వివరము
నిర్జనమ్ముగా నుండెడి విషయము
ముని నెలవగు- ఆ సుందరస్థలము
గాథ తెలుపమని రాముడు అడుగగ

''ఈ ఆశ్రమము ఎవరిదొ నుడివెద
ఎవరి కోపమున శాపమునందెనొ
వివరించెద విను ఓ నరపుంగవ!-
గౌతముడనెడి ఋషి సత్తముడు

అహల్య ఆతని అర్థాంగిగను
సేవించగను ఎన్నో ఏండ్లిట
తపసుచేసెను- ఆ మహాత్ముని
తపోధనమిట నిలచిన దయ్యా!

గౌతముడిచట లేని సమయమున
అతిసాహసి- ఆ నాకలోకపతి
అహల్యతోను అక్రమమయిన
సంబంధమును కోరివచ్చెను.

గౌతమమౌని వేషము తోను
వచ్చి- ఇంద్రుడు పొందుకోరెను
అంతటి ఇంద్రుని - ముని వేషములో
గాంచెను వనిత - మనసు చెదరినది.

వశము తప్పినది - నీతి తప్పినది
ఇరువుర క్షేమము కొరకై త్వరగా
పొమ్మనె - భర్త రాక పూర్వమే.
ఇంద్రుడు కొమ్మను వదలి పోవుచు

దేవదానవుల గెలిచెడి వానిని
తపోబలముతో నిండినవానిని
పుణ్యతీర్థముల తడిసిన వాడగు
ప్రకాశించెడి అగ్ని తేజమును

దర్భలు - సమిధలు చేతధరించిన
గౌతమ మునిని గాంచినవాడై
ఫాలనేత్రుసే చూచెను అతనిలొ
ధర్మతేజముతొ ముఖము మాడెను.

విషయము తెలిసిన గౌతమమౌని
ముని వేషములో ఇంద్రుని గాంచి
పలికెను - ''నీవు నా రూపమునకు
కళంక మేర్పడ చేసిన వాడవు.

కాంతలపైన ఇంత మక్కువా?
మగతనమునకిది మంచి కలుగునా?
తగు నీశాపము - ఇపుడే నీకు
తెగును బీజములు - నేల రాలును.''

శాపము తగిలి దేవేంద్రునికి
రాలి పడినవి బీజము లపుడు
గౌతము శాపము దేవేంద్రునికి
'నీతి' నేత్రమును తెరిపించినది

అహల్య కపుడు శాపము నిడెను
అతివ కన్నులు తెరిపించుటకు
''వేల ఏండ్లిట వాయు భక్షణతొ
తపము చేయుచు నేలపడుండుము.

పాపివి నీవు- ధూళిలొ నుందువు
కనబడినంతనె పాపము కలుగును
కావున, నీవు జనులకు కంటికి
కనబడకుండా కదలక యుందువు.

దశరథ తనయుడు రామచంద్రుడు
ఉదయించగను ఆ కిరణముల
పవిత్రురాలవు అగుదువు నీవు
నీతి వెలుగులో మునిగెద వపుడు.

రామచంద్రుడు ఆతిథ్యము గొన
లోభము - మోహము తొలగిన నీవు
భద్రముగా నా చెంత జేరెదవు
నీ తేజము నువు పొందెదవపుడు.''

అటుల పలికి ఆ తేజోమూర్తి
అపవిత్రమ్మగు - అతివ నహల్యను
పవిత్రురాలై రమ్మని పలికి
తపసుకు వెడలెను హిమగిరి చెంతకు.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 49 రామకిరణములతో అహల్యా శాప విమోచనము

అంతట ఇంద్రుడు-సిగ్గు అగ్గిలో
కాలిపోవుచు-పలికె సురలతొ
గౌతముతపము పరీక్షించితి
క్రోధమునాముని గెలవక పోయెను.

దేవకార్యమును సాధించితిని
అతని తపసది వ్వర్థము అయినది
శాపగ్రస్థుడను అయితిని నేను
తిరిగి సరియగు మార్గముతెలుపుడు.''

ఇంద్రుని పలుకులు విని సురలందరు
అగ్ని-మరియు మరుద్గణములతొ
పితృదేవతల సమీపించిరి
కోరిరివారిని-వినయము తోను.

''మేకబీజములు దేవేంద్రునికి
అమర్చగా మీరనుగ్రహించుడు
ఇంతటినుండి యజ్ఞమునందు
బీజమువదలి మిగిలిన మేకను

హనిస్సుగా మీకర్పించగను
సంతుష్టిగ మీరందు కొనెదరు''
అనగను వారు సరియని పలికిరి
మేకబీజములు ఇంద్రుని కమరెను.

''తేజోవంతుడవగు రామయ్యా!
రావయ్యా, నువు ఆశ్రమభూమికి
శాపముతొలగును అహల్యకిపుడే
పుణ్యతీర్థమున మునుగుము మునిసతి.''

కౌశికమౌని మాటలు వినిన
రాముడు-తమ్మునితో నంతటను
అడుగిడె నపుడు- ఆశ్రమ మందు
వేయి సూర్యులు దయించెనప్పుడు.

సౌందర్యముతో నిండిన అతివ
శాపమనియెడి తమస్సు తొలగగ
మేఘము కప్పిన చందమామయై
నీటిలొ కనబడు సూర్యబింబమై

కనుపించెను - శ్రీరామచంద్రునకు
దర్శనభాగ్యము కలిగె నహల్యకు
అంతట-రామ లక్ష్మణులిద్దరు
ఆమెపాదముల ప్రణామముంచిరి.

అతిభక్తిగను అహల్య-వారికి
అర్ఘ్యము-పాద్యము- ఆతిథ్యములు
ఒసగగ రాముడు శాస్త్ర సమ్మతిగ
స్వీకరించెను- ఆమె తరించగ.

దేవదుందుభులు మ్రోగిన వపుడు
పూలవానలు కురిసిన వంతట
అచ్చర-గంధర్వులు ముదము గను
నృత్య-గీతములు నింపిరి నింగిని.

తపోబలమున శుద్ధికాబడి
రామకిరణముల శాపము తొలగిన
అహల్యకంతట సురలందరును
పూజలుచేసిరి ముదము నందిరి

తేజోవంతుడు గౌతమమౌని
సతితో పూజలు సలిపె రామునకు
రాముడు- వారి పూజలనంది
మిథిలకు సాగగ వెలుగులు సాగెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 50 విశ్వామిత్రునకు జనకుని స్వాగతము- జనకుడు రామలక్ష్మణుల వివరములు అడుగుట

తమ్ముని గూడి రామచంద్రుడు
కౌశికమునిని ముందు నిడుకొని
ఈశాన్యముగా మిథిలానాథుని
యజ్ఞశాలకు చేరెను అంతట.

కౌశికమునితో పలికె దాశరథి
''జనకుని యజ్ఞ సంబారములు
చక్కగ నున్నవి- వివిధ దేశముల
వేదవేత్తలు వేలు వచ్చిరి.

భూసురోత్తములు ఋషులు వచ్చిరి
నిండుగ నున్నవి బండ్లతొ సరుకులు
యాగ ప్రదేశము జనసమ్మర్దము
మనము ఎచ్చట వసించవలెనో?''

విశ్వామిత్రుడు - అనువగుస్థలము
జలసమృద్ధము అయిన ప్రదేశము
జనసమ్మర్దము లేని నెలవులో
నివసించగ - ఏర్పాటును చేసెను

విశ్వామిత్రుడు ఏతెంచెనని
వినిన జనకుడు - పురోహితుడగు
శతానందుని ముందు నిడుకొని
వినయముతోను ఎదురు వచ్చెను.

ఋత్విజులందరు శాస్త్రోక్తముగా
రాజుతొ కలిసి కౌశికమునికి
పూజలు చేసిరి - కౌశికుడపుడు
వారిపూజలు అంది ముదముతో

కుశలము నడిగెను జనకరాజును
యజ్ఞము నిర్విఘ్నముగా జరుగుట
ఆదిగాగల వివరములన్నీ
అడిగి - కుశలము అందర నడిగెను.

జనకరాజు తలవంచి వినయమున
ఉచితమైన ఒక ఆసనమందు
కౌశికమౌనిని - అలంకరించగ
కోరెను అతడు సుఖముగ కూర్చొన,

మిథిలానాథుడు పలికెను ముదముతొ
''కౌశకమౌనీ! నీ దర్శనమున
యజ్ఞఫలము నేనందితినయ్యా!
నీదు రాకతో ధన్యుడనైతిని.

బ్రహ్మఋషీ! యిక యజ్ఞ సమాప్తికి
పదిపై రెండు దినములున్నవి
హవిసును గొనగ సురలు వత్తురు
వారల గాంతువు ఇచటే వుండుము.

ఆనందముతో జనక భూపతి
అంజలి ఘటించి కౌశికమౌనికి
''సురలను పోలిన వీరులు వీరు
గజ - సింహముల నడకలు కలిగి

సూర్య-చంద్రులు నింగినున్నటు
ఈ దేశములో ఉదయించిరయా!
ఎవ్వరువీరు? కాలినడకను
ఇచటకు వచ్చిరి - వివరములే''మన

శార్దూలమును - వృషభరాజులతొ
పోలినవారీ సుందరమూర్తులు
రమ్యసుగాత్రులు రాజీవాక్షులు
ఖడ్గము- ధనుసు తూణీరములతో

జనకుని పలుకులు విని కౌశికుడు
తెలిపెను-వారు దాశరథులు అని
సిద్ధాశ్రమమున తనతో గడపుట
దనుజులనంతము చేయుట-మరియు

సౌందర్యములో అశ్వని మూర్తులు
యౌవనరేఖలు విరసెడివారు
కార్యార్థమ్ముగ నాకము వీడి
దిగిన దేవతల పోలెడి వీరు

విశాలాపురి సందర్శించుట
అహల్యాశాపము తొలగ జేయుట
గౌతమమునిని దర్శించుటయు
శివుని ధనుస్సును చూడ వచ్చుటయు.

తీరుగ-వివరము లన్నీతెలిపెను
రామలక్ష్మణుల నిరువుర గాంచిన
మిథిలానాథుని మనసు పొంగెను
సోయగమొలికెను జనకపురమున.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 51 శతానందుడు రామచంద్రునికి గాధేయుని గాథను తెలుపుట

విశ్వామిత్రుని పలుకులు వినిన
గౌతమమౌని పెద్దకుమారుడు
శతానందుడు తపోధనుడు అట
పులకితు డయ్యెను రామునిగాంచి.

పుణ్యసాధ్వి మా అమ్మ అహల్య
లోక పూజ్యుడగు రఘురామునికి
పూజలుచేసెన? పుణ్యమూర్తియై
విధికృతమంతయు తెలియ బరచితివ?

కౌశికమునితో పలికెను అపుడు
''స్వామీ! నీవు చెప్పిన రీతిగ
మాతృమూర్తి-శ్రీరామచంద్రునికి
కనబడి-ధన్యత నందెన? చెప్పుము.

శుభమగు నీకు విశ్వామిత్రా!
రామ దర్శనము చేసిన జనని
పితృదేవుని చెంతజేరెనా?
రామపూజ వారిద్దరుచేసిర?''

శతానందుని సంతోషము గని
కౌశికమౌని పలికెను తీరుగా
''సమయము మించక కర్తవ్యముగా
సర్వముచేసితి శుభములు కలుగగ.

జమదగ్నితొ శోభిలు రేణుక వోలె
అహల్య చేరెను గౌతమ మునిని.''
ఆనందించెను శతానందుడు
తీరుగ పలికెను రాముని చూచి.

''రామా! నీకు స్వాగతమయ్యా!
అపజయ మెరుగని కౌశికమౌని
ముందు నిలచుటన-హితముకూర్చుటే
తపోశక్తిచే బ్రహ్మఋషి అయి.

రక్షగ నీతో ఉండుట వలన
ధన్యుడవైతివి ఓ రఘురామా!
శత్రువులందర గెల్చిన మౌని
ధర్మము నెరిగిన రాజై ఏలెను.

ప్రజాపతియగు ''కుశు'' రాజునకు
''కుశనాభు''డను కుమారు డుండెను
ఆ కుశనాభుని కొమరుడు ''గాధి''
గాధితనయుడీ తేజోవంతుడు.

వేలయేండ్లు గాధేయుడు తేడై
పరిపాలించెను ప్రీతిగ రాజ్యము
వనములు -నదులు - పర్వత పంక్తులు
ఆశ్రమమ్ములను చూచుచు అతడు

ప్రశాంతి నిలయము అగునాశ్రమము
సిద్ధ చారణులు సేవలు చేసెడి
బ్రహ్మఋషులతో దేవఋషులచే
తపస్సిద్ధిని పొందినవారితొ

పక్షుల కిలకిల రావమ్ములతో
జింకలతో అలరారు చుండెడి
కోపము గెలిచిన మనో నిగ్రహులు
తపోబలమును నిండిన వారితొ

వాయుభక్షకులు తపోసత్తములు
దుంపలు - జలముల కడుపు నింపుకొను
అగ్ని సమానులు తపోధనులతో
జప- హోమములు నిరతము చేసే

వాలఖిల్యులతొ వైఖానసులతొ
శోభలీనెడి వశిష్ఠా శ్రమము
మరియొక బ్రహ్మలోకము అన్నటు
ఒప్పుచుండగ చూచెను రాజు.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 52 వశిష్ఠుడు ఆతిథ్యమును స్వీకరింపుమని విశ్వామిత్రుని కోరుట

తపోధనుడగు వశిష్ఠ మహఋషి
విశ్వామిత్రుని వందనమందుకు
ఉచితాసనమున కూర్చొన జేసి
ఫలముల - దుంపల నిడెను ప్రీతితో.

విశ్వామిత్రుడు మహఋషి నంతట
కుశలము అడిగి- జపహోమములు
నిర్విఘ్నముగా జరుగుట మరియు
శిష్యుల కుశలము లన్నీ అడిగెను.

కుశలము తెలిపి - కౌశికరాజును
న్యాయమ్ముగను ధనమార్జించుట
పెంచుట - దానిని రక్షణ చేయుట
యోగ్యత నెరిగి దానము చేయుట.

శత్రురాజులను జయించు చుండుట
సేవకులందరు విధేయు లగుటయు
బలముల క్షేమము ధన సమృద్ధియు
మొదలగు కుశలములడిగెను మౌని

వినయముతోను బదులిడె రాజు
పుణ్యగాధలతొ కాలము గడిపిరి
అంతట ఋషి- ఆ రాజుకు- అతని
సైన్యముకంతయు ఆదరమొలకగ.

ఆతిథ్యమును ఇచ్చెదననెను
శ్రేష్టము అయిన అతిథివినీవనె.
అంతట రాజు మునితోపలికెను
నీ ప్రియవాక్కులె ఆతిథ్యముఅని.

''ఫలములు-దుంపలు ప్రేమాదరణలు
పంచిన నీవు పూజనీయుడవు
నీ దర్శనమది కలిగెను నాకు
అతిథి పూజను అందితి నేను.

ఓ భగవంతా! మరలిపోదును
కటాక్షించుము'' అని పలుకగను
మరిమరి కోరెను వశిష్టమౌని
ఆతిథ్యముగొని తృప్తినందుమని.

సరియని పలికెను కౌశికరాజు
మహఋషి అంతట చిత్ర వర్ణమగు
కామధేనువును కోరెను- రాజుకు
అతని సైన్యముకు విందొనర్చగ.

''సంబారమ్ములు కూర్చుము శబలా!
వలయు రుచులతో వీరందరికీ
భక్ష్యము- భోజ్యము పానీయములతొ
అన్నపు రాసుల విందు చేయుము.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 53 విశ్వామిత్రుడు కామధేనువును కోరగా వశిష్ఠుడు సౌమ్యముగా నిరాకరించుట

కోరినదిచ్చెడి కామధేనువు
వశిష్ఠమహఋషి కోరిక మేరకు
ఇక్షు రసములు మధుపూర్ణమ్ములు
భక్ష్యములెన్నో రుచులు రుచులుగా.

అన్నపురాసులు పర్వతాలవలె
పాయసాదులు పప్పులు - పెరుగు
సమకూర్చగను సుష్ఠుగ తినిరి
విందునందిరి తుష్టిగ పుష్టిగ.

సచివులు, సేనలు తృప్తినందగా
ఆనందముతో రాజు పలికెను :
''పూజనీయుడవు- నీచేతను- నే
పూజలనందితి పుణ్యముచేసితి.''

అనుచు రాజు ఆ మౌనిని గాంచి
శబలను తనకు యిమ్మని కోరెను
''రత్నమువంటిది రాజుకు తగును
లక్ష గోవులు యిచ్చెద''ననెను.

రాజుతొ వశిష్ఠమహాఋషి పలికెను !
''రాజా! నేను.శబలను వదలను
గోవులు కోటి యిచ్చిన గాని
రజితరాసులు యిచ్చిన నొల్లను.

సురలకు వలయు హవ్యము మరియు
పితరులకందెడి కవ్యము మరియు
హోమద్రవ్యము సర్వము నాకు
ఇచ్చును శబల! ఇది శాశ్వతము.

జ్ఞానవంతునికి కీర్తి యన్నటు
కామధేనువే సర్వము నాకు
సత్యము శబల - కావున రాజా!
దీనిని యిచ్చుట సాధ్యముకాదు.''

తిరిగి పలికెను రాజు అంతట :
''బంగరు సొమ్ముల మెరసెడి గజములు
పదునాలుగువేలు నీకుయిచ్చెద
బంగరుతేరులు నాలుగు యిచ్చెద.

వేగముకలిగిన అశ్వరాజములు
పదునొకండు వేలిచ్చెద నయ్యా!
రంగురంగులవి కోటి గోవులు
నీకు ఇచ్చెద శబలను యిమ్ము.

తపసులోనుండెడి నీకీశబల
ఎందుకు మౌనీ! ధరణీధవుడను
సర్వము పొందగ అర్హుడ నేను
కావున యిమ్ము కామధేనువును.''

పలికెనుఋషి ఆ రాజుతొనంత
''గాధినందనా! ధర్మాత్ముడవు
యితరుల ద్రవ్యము కోరుట తగదు
శబలే ధనము - జీవాధారము.

హోమకార్యములు తపోయజ్ఞముల
సర్వము కూర్చును నాకీ శబల
నీవిచ్చెడివి సర్వ వస్తువులు
కామధేనువు యిచ్చును కావున

శబలనుకోరకు గాధినందనా!
శ్రమతో నీతో వలదనిచెప్పితి
సర్వసిద్ధికై నాకు లభించిన
పుణ్యఫలము నువు కోరకురాజా!''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 5 4 విశ్వామిత్రుడు కామధేనువును బలిమిని గొనిపోనెంచుట

కామధేనువును విడువనుఅనగా
కోపమునంది కౌశికరాజు
బలవంతముగా శబలను కట్టి
తనతో తోడ్కొని పోవుచుండగా

దుఃఖమునిండెను శబల అంతట
ముని- తననావిధి వదలివేయుటకు
అపరాధము తా నేమిచేసెనో
తెలియగ-నంతట కట్లుత్రెంచుకు

పరుగునవచ్చి గోలున ఏడ్చుచు
''బ్రహ్మకుమారా! నిరపరాధిని
నన్నీ విధముగ వదలి వేయుటకు
నేరము ఏమి నేను చేసితిని.''

వశిష్ఠమహాఋషి పలికె దీనముగ
''బలవంతముగా- బలవంతుడగు
రాజు- తోడ్కొని పోవుచుండెను
అడ్డుకొనగ-నే బలహీనుడను

అంతట శబల పలికెను మునితో
''బ్రహ్మబలము నీకున్నది స్వామీ!
దానిముందు యీ రాజులు ఎంత?
ఆనతినిమ్ము మదమణ గించెద.

మంత్ర బలము నీకున్నది - దానితో
దుష్ట బలమును అణచి వేసెదను''
అనిన శబలకు - వశిష్ఠమహాఋషి
ఆనతినిచ్చెను శూరుల సృష్టికి.

అతి బలవంతులు శత్రు భీకరులు
''పప్లవు'' లనెడి శూరులెందరో
హుంబా రవముతొ సృష్టించబడి
రాజు సేనలను కాలరాచిరి.

రాజు అంతట కోపమునంది
భీకరమయిన శర సంపదతో
పప్లవులను అట అంతము చేయగ
''యవన'' సేనలు ''శక'' సేనలను

సృజించి వారిని పంపెను శబల
వారందరును కార్చిచ్చువలె
విజృంభించగ విశ్వామిత్రుడు
అస్త్ర బలముతో వారిని కూల్చెను.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 55 విశ్వామిత్రుడు తపస్సుతో అస్త్రములను పొంది వశిష్ఠాశ్రమము బీభత్సము చేయుట

విశ్వామిత్రుని శస్త్రాస్త్రములతొ
వీరులందరు అంతము కాగా
వశిష్ఠమహాఋషి శబలకు చెప్పెను
యోగబలముచే వీరుల సృజించి.

హుంకారముతో కాంభోజులను
పొదుగునుండి మరి పప్లవ వీరుల
నేల యీనినటు మ్లేచ్ఛ - కిరాతుల
యవనుల - శకుల సృష్టించగను.

వీరులు సేనతొ ఎదిరి పోరుచు
అంతము చేయగ అంత మందిని
విశ్వామిత్రుని నూర్గురు పుత్రులు
వశిష్ఠ మౌనిని ఎదిరింపగను

వశిష్ఠ మహాఋషి హుంకరించగ
నూర్గురు వీరులు భస్మమాయిరి-
అంతట రాజు అవమానముతో
దీన వదనుడై నేలను బడెను.

చలనములేని సంద్రము రీతిగ
కోరలుతీసిన ఫణిమాదిరిగా
గ్రహణమునాటి సూర్యుని తీరుగ
తెక్కలూడిన పక్షికి వోలె

వరమునందిన విశ్వామిత్రుడు
సంతసమంది గర్వము పొంగి
పున్నమినాడు పొంగు వారిధై
పోరగవచ్చెను వశిష్ఠమునితో.

వెలవెలబోయిన విశ్వామిత్రుడు
వశిష్ఠమౌనిని జయింపగోరి
రాజ్యభారము పుత్రుని కొసగి
తపసు చేయగ హిమగిరి కేగి

దివ్యాస్త్రముల శక్తిచేతను
బ్రహ్మతేజుని తపోవనమును
కాల్చివేసెను - పులుగులు ఎగిరెను
మునులందరును భయపడిపోయిరి.

తీవ్రతపస్సు చేయగనంతట
ఫాలనేత్రుడు దర్శనమిచ్చి
వరము కోరుమన - విశ్వామిత్రుడు
స్తోత్రముచేసి త్రిపురాంతకుని

నాశము చేసెను ఆశ్రమసీమను -
భయవిహ్వాలులకు వశిష్ఠమౌని
ధైర్యముగొలపగ వినకే పరుగిడ
అగ్రహమందెను రాజుపైనను.

కోరెను వరముగ అస్త్రబలమును-
దేవదానవులు యక్ష - గంధర్వులు
మునులందరును తెలిసినవన్నీ
ఉపదేశించగ కోరె పశుపతిని.

బ్రహ్మఋషి అట గద్దించుచును
''సహించనింక నీ ఆగడ'' మనె
తేజము నిండిన సూర్యుడాయెను
బ్రహ్మతేజముతొ వెలిగిపోయెను.

జ్వాలలు చిమ్మెడి బ్రహ్మదండము
రెండవ యమదండముగా తోచగ
చేతధరించి నిలచెను మహఋషి
ఫాలనేత్రుడై తోచె దండముతొ.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 5 6 బ్రహ్మాస్త్రము నిరుపయోగముకాగా బ్రహ్మత్వ సిద్ధికై విశ్వామిత్రుని కఠోర తపము

బలగర్వితుడై విశ్వామిత్రుడు
నిలు-నిలుమనుచు ఆగ్నేయాస్త్రము
విడువగ మహర్షి పలికె రాజుతో :
బ్రహ్మబలము నే చూపెద నివుడే.''

అనుచు నాతడా అస్త్రమునపుడే
బ్రహ్మదండముచె చల్లార్చగను
విశ్వామిత్రుడు వరుసగ నంతట
వారుణాస్త్రము రౌద్రాస్త్రమును.

పాశుపతమును ఐషీకమును
స్వాపనమ్మును గాంధర్వమును
మోహనమున్నూ మానవమ్మును
జృంభణమ్మును మదనాస్త్రమ్మును.

సంతాపనమును విలాపనమ్మును
శోషణమ్మును దారణమ్మును
వజ్రశరమును బ్రహ్మపాశమును
కాలపాశము వారుణపాశము.

దండము-పైశాచము-దయితమును
క్రౌంచాస్త్రమును -శుష్కము-అర్ధము
పైనాకమ్మును ధర్మచక్రమును
కాలచక్రము విష్ణుచక్రము.

మదనాస్త్రమును వాయవ్యమును
హయశిరమ్మును ముసలము మరియు
కంకాళము అను రెండు శక్తులు
కాలాస్త్రమును వైద్యాధరమును.

కాలపాశమును త్రిశూలమ్మును
కంకణాస్త్రమును అస్త్రశస్త్రములు
ప్రయోగించగా-వశిష్ఠమహఋషి
బ్రహ్మదండముతొ హరించి వేసెను.

వ్యర్థముకాగా అస్త్రములన్నీ
క్రుద్ధుడయ్యెను విశ్వామిత్రుడు
మూడులోకములు కంపించునటు
బ్రహ్మాస్త్రమును విడచెను ఋషిపై.

జ్వాలలు ఎగయుచు వచ్చెడి అస్త్రము
బ్రహ్మాస్త్రమును - బ్రహ్మకుమారుడు
మింగివేసెను తపోబలముచే
విస్మయమందిరి వశిష్ఠు మహిమకు.

బ్రహ్మాస్త్రమును గ్రహించి నంతనె
రోమకూపముల ద్వారమ్ములలో
జ్వాలలు ఎగయగ చూచిరి ఋషులు
స్తోత్రము చేసిరి వశిష్ఠమునిని.

ఋషి గణమంతయు స్తోత్రముజేసిరి
బ్రహ్మ ఋషిని శాంతింపజేసిరి
తేజము శమింప చేయగ కోరిరి
బ్రహ్మశక్తి గెలుపొందినదనిరి.

బ్రహ్మఋషి అట శాంతివహించెను
అంతయు గాంచిన విశ్వామిత్రుడు
తపోబలమునకు అచ్చెరువందెను.
క్షత్రియబలము ఎంతో తెలిసెను.

''క్షత్రియబలమది నిలువకపోయెను
బ్రహ్మతేజమను బలమే - బలము
బ్రహ్మదండము ఒక్కటి నిలచి
సకలాస్త్రముల హరించి వేసెను.

కావున శాంతము ఎంతయొ పెంచుకు
ఇంద్రియాలను జయించి నేను
బ్రహ్మత్వమును పొందుట కొరకై
యత్నించెదను - తపము చేసెదను.''

॥శ్రీరఘురాముని॥

## 5 7 దక్షిణ దిశలో విశ్వామిత్రుని తపోవృత్తాంతము

''ఆ విధముగను నిశ్చయించుకొని
పట్టుదలతొ ఈ విశ్వామిత్రుడు
పట్టమహిషితో - దక్షిణ దిశలో
తపము చేయగ వెడలెను రామా!

తీవ్ర తపస్సు ఆచరించెను
ధర్మ తత్పరులు హవిష్యందుడు
మధుష్యందుడు - దృఢనేత్రుడును
మహారథుడను - తనయులు కలిగిరి.

వేయి ఏండ్లట తపసుచేయగ
వాణీపతి ఆ తపసుకు మెచ్చి
దర్శనమిచ్చి '' ఇకపై నిన్ను
రాజ ఋషిగ గుర్తించెద'' మనెను.

రాజ ఋషిగ గుర్తించుట వినిన
విశ్వామిత్రుడు విన్నబోయెను
''ఇంత తపస్సుకు ఫలమింతేనా?''
తిరిగి తపమ్మున లీనమయ్యెను.

అదే సమయమున ఇక్ష్వాకులలో
సత్యవాదియు - జితేంద్రియుండగు
''త్రిశంకు'' డనెడు ధరణీ ధవుడు
ప్రసిద్ధుడై ధర నేలుచుండెను.

త్రిశంకురాజుకు యాగముచేసి
తనువుతోడనే స్వర్గము కేగగ
మనసుకలిగినది - అంతట - రాజు
వశిష్ఠమౌనిని సంప్రదించెను.

కోరిక వినిన ఋషి వశిష్ఠుడు
''తనువుతొ నీవు స్వర్గమేగగా
సాధ్యముకాదని'' తెలియ బరచగా
వశిష్ఠ పుత్రుల నడిగెను రాజు.

తపోధనులగు వశిష్ఠ పుత్రుల
గాంచి పలికెను త్రిశంకురాజు
''తిరస్కరించెను వశిష్ఠ మహర్షి
తీరుగ స్వర్గము చేర్చుడు నన్ను.

నాయాగమును నిర్వర్తించుడు
అంజలిఘటించి వేడుచుంటిని
తనువుతొ నేను స్వర్గము చేరెడి
సాధనమైన యాగము నెరపుడు.

వశిష్ఠమహర్షి పరమపూజ్యుడు
అతని సంతతి గురుపుత్రులగు
మీరు - నాకు యిక దేవసమానులు
గురువుకాదనె, తప్పదుమీకనె.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 5 8 త్రిశంకుని వశిష్ఠ పుత్రులు శపించుట

త్రిశంకుపలుకులు వినిన విప్రులు
వశిష్ఠమహర్షి నూర్గురు కొడుకులు
విరుచుకుపడిరి రాజుపైనను
''తండ్రికాదన-తగుదుమ మేము?

ఇక్ష్వాకుల కుల రక్షాదక్షుడు
వశిష్ఠ మహర్షి సత్యవాది కద
ఆయన కాదన - అట్టి యాగమును
చేయసమర్థులు భువిలో ఎవరు?

మూర్ఖత్వముతో ప్రవర్తించక
మరలి పొమ్ము నీరాజధానికి
ముల్లోకముల ఎవరును కూడా
ముందుకురారు-మేము తగుదుమని.

అసాధ్యమని మా జనకుడు చెప్పిన
యాగము చేయగ సంకల్పించుట
వశిష్ఠమహర్షి నవమానించుట-
మమ్ముకోరితివ ఆకార్యమునకు?''

త్రిశంకుడంతట పలికెను వారితొ
''మీరుకూడ నను తిరస్కరించిరి
మిగిలిన ఆశతొ మరియొకరిని-నే
ఆశ్రయించెద శుభమగు మీకు.''

తండ్రిమాటపై గురి నిలపకను
బ్రహ్మఋషిని తా నవమానించుచు
పలికిన రాజును - ఋషికుమారులు
శాపముతో ఛండాలుని చేసిరి.

నల్లనిరంగు బిరుసు శరీరము
ఆభరణమ్ములు ఇనుపవి గలిగి
పొట్టివెండ్రుకలు చితాభస్మముతొ
మారెను రాజు ఛండాలునిగా,

రాజు వెంబడి వచ్చినవారు
భయపడి పరుగుతొ నగరముచేరిరి
ఒంటరిగా ఆ రాజు కుములుచు
విశ్వామిత్రుని చేరెను అంత.

తపోవంతుడగు విశ్వామిత్రుడు
ఆదరించి ఆ రాజుతొ పలికెను :
''అయోధ్య నేలెడి రాజుకు - ఏమి
కారణమిటుల శాపము తగులుట?''

మునిమాటలు విని త్రిశంకురాజు
ప్రణామముంచి పలికెను తీరుగా
తెలియబరచెను సర్వము అపుడు
''నాకము చేరగ నా అభిమత''మనె.

''నూరు యాగములు చేసితిగాని
నాకోరికది ఫలించలేదు
సత్యవాదిని - క్షాత్రముపైన
ప్రమాణమిదిగో విను మునిసత్తమ

యజ్ఞ యాగములు చేయబడినవి
ప్రజలు సుఖముగా బ్రతుకుచుండిరి
పూజనీయులు - నా సౌశీల్యము
నడవడి గాంచి తృప్తి నందిరి.

ధర్మాచరణము నా అభిమతము
కీర్తిని ఎంతో బడసితి నేను
కానీ యిపుడు - గురువులు నాపై
దయచూపక నను తిరస్కరించిరి.

తెలిసితి నేను దైవబలమును
పౌరుషమసలు నిలబడ దచట
దైవమునకును లోబడు సర్వము
శ్రేష్ఠము దైవము - సకల శుభదమది.

దైవము నాపై అనుగ్రహించగ
దయచూడుమయా తపోవంతుడా!
నీవుతప్ప మరి రక్షకు లెవరు?
అనుగ్రహించుము'' అనెను త్రిశంకుడు.

॥శ్రీరఘురాముని॥

## 5 9 వశిష్ఠ పుత్రులను విశ్వామిత్రుడు శపించుట

విశ్వామిత్రుడు అంతట దయగొని
ఛండాలునిగా నున్న రాజుతో
పలికెను - ''నీవు ధర్మాత్ముడవు
నీకు రక్షణగ నేనుందునయా!

పుణ్యకర్మలను చేయు మహఋషుల
నాహ్వానించెద సాయము చేయగ
శుభముగ నీవు యాగము చేయుము
ఈ రూపముతో దివి కేగెదవు

రక్షకుడైన కౌశిక మౌనిని
చేరిననీవు భయపడ వలదు
స్వర్గము నీకు చిక్కినదనుకొను''
అనుచు పలికి తన శిష్యగణమునకు

ఆనతినిచ్చెను గాధినందనుడు
''మీరందరును శిష్యుల గూడి
ఋత్విక్కులతో పండితులతొ మరి
ఎల్ల ఋషులతో విచ్చేయు''డన.

శిష్యులందరూ దేశ దేశముల
ఋషులను ఋత్విక్కులనందరిని
ఆహ్వానించిపలికిరి మునితో
''మహోదయు''డను ముని రాలేదని-

వశిష్ఠపుత్రులు నూర్గురు పలికిరి
''యాజకత్వము నెరప క్షత్రియుడు
యజమానుండొక ఛండాలుడుగద
హవిస్సునెటుల సురలు గ్రహింతురు?

అట్టియాగమున హవిస్సునెటుల
ఋషులు గ్రహింతురు? మహాత్మువైన
విప్రోత్తములట భుజించి - వారు
స్వర్గముచేరుట ఎటు''లని పలికిరి.

ఓముని శ్రేష్ఠా! మహోదయుడును
వశిష్ఠపుత్రులు ఆవిధముగను
విశ్వామిత్రుడె వారి రక్షయని
కఠినోక్తులను పలికిరి మాతో.''

కోపమునంది విశ్వామిత్రుడు
రుసరుసలాడుచు పలికెను వారితొ
''ననుదుర్భాషలు ఆడినవారు
బూడిద యగుదురు సందియమేల?

వశిష్ఠపుత్రులు యమపాశమున
బంధింపబడి యమలోకములో
ఏడువందల జన్మల వరకు
మృతదేహములను తినుచు బ్రతికెదరు

తిరిగి జన్మము ముష్టి కులములో
వారందరు మరి శునకమాంసము
భక్షించుచును - వికృతచేష్టల
తిరుగుచుదేశ ద్రిమ్మరులగుదురు.

దుష్టబుద్ధియగు మహోదయుండు
దూషించెను నను - కావున అతడు
నిందితుడైన బోయ జన్మతో
ఆత్మహత్యతో దుర్గతి నందును.''

కోపము గెలవని విశ్వామిత్రుడు
తాపము తరగని గాధినందనుడు
తపసు వ్యర్థము అగునని తెలియక
కోపతాపముల శాపము నిడెను.

॥శ్రీరఘురాముని॥

## 60 త్రిశంకు స్వర్గ వృత్తాంతము

శాపము లిచ్చిన విశ్వామిత్రుడు
వచ్చిన మునులకు రాజును చూపుచు
''ఇక్ష్వాకు విభుడీ త్రిశంకురాజు
భాగ్యశాలియు అతి ధర్మాత్ముడు

తనువుతొ ఈతడు స్వర్గము కేగగ
నాసాయమును కోరివచ్చెను
ఏయజ్ఞముచే రాజుకోరిక
తీరునో దానిని చేయించెదము.''

విశ్వామిత్రుని పలుకులు వినిరి
వచ్చిన మునులు తమలోతాము
అనుకొనిరంతట-''కోపి యీతడు
కాదంటిమ మరి శపించి తీరును.

హితవు చెప్పి యిక లాభము లేదు
సరిసరి యందుము సానుకూలమది
ఈతని తపసుతొ - రాజు, స్వర్గము
చేరిన చేరును మనకెందు'' కని.

సవ్వడి చేయక యాగము నందు
నియమించిన తమ పనులన్నిటిని
జాగరూకులై నిర్వర్తించిరి
విశ్వామిత్రుడు యాజకుడాయెను.

యాగము సాగుచు నుండగ నపుడు
విశ్వామిత్రుడు సురలందరిని
హవిర్భాగముల నందగ రమ్మన
తిరస్కరించిరి వారందరును.

కోపము నిండిన విశ్వామిత్రుడు
యాగము వలన లాభములేదని
తపోధనము వెచ్చించి రాజును
దివికి పంపగ నిర్ణయించుకొని.

''స్రువ''మను కొయ్యగరిట చేతగొని
రుసరుస లాడుచు విశ్వామిత్రుడు
తనువుతొ రాజును పైకిలేపెను
స్వర్గ మార్గమున సాగగ చేసెను.

స్వర్గము చేరెడు త్రిశంకురాజును
చూచిన యింద్రుడు పలికె రాజుతో
''స్వర్గము నుండగ యోగ్యత నీకు
లేదు మూఢుడా! మరలిపొమ్మిక.

గురుశాపమును పొందిన నీవు
ఉండ తగవు - నీ ఉనికి సహింపము
తలక్రిందుగ నువు భూమిమీదను
రాలుము'' అనెను ఆ దేవేంద్రుడు.

తలక్రిందుగను నేల కూలుచు
మొరలిడె రాజు రక్షింపుమని
కోపమునిండిన కౌశికు డంతట
ఆపెను రాజును దివి - భువి మధ్యలో.

కౌశికుడటులే - కొన్ని తారలు
సృజించి - అంతట ఆవేశముతో
''మరియొక ఇంద్రుని సృష్టించెదను
లేదా ఇంద్రుని అంతము చేసెద.''

అనుచు పలుకుచు విశ్వామిత్రుడు
సురల సృజించ నారంభించగ
ఋషులు-సురలు-మునులందరును
ప్రార్థనచేసి-పలికిరి అపుడు.

''విశ్వామిత్రా! తపోవంతుడా!
గురుశాపమది తగిలిన రాజు
తనువుతొ స్వర్గము చేరననర్హుడు
మదిలొ మచ్చర మేల విడువవు?''

విశ్వామిత్రుడు శాంతిని పొంది
పలికెను వారితొ - ''నేనీ రాజును
నిలపెద నాకము నందని పలికితి
కావుననాదుమాట నిలువవలె.''

విశ్వామిత్రుని పలుకులు వినిన
సురలందరును తిరిగి పలికిరి
''నీవు సృజించిన నక్షత్రములవి
సుప్రసిద్ధమై నిలచు నింగిని.

జ్యోతిశ్చక్ర మార్గమునకును
వెలుపల - తారలు వెలుగుచుండును
వాటినడుమ తలక్రిందుగ రాజు
సుర సమానుడై వెలుగు చుండును.

నీవు సృజించిన తారలన్నియు
కీర్తిమంతుడగు త్రిశంకురాజును
స్వర్గమునున్నటు అనుసరించును''
అనుచుమౌనిని తృప్తిపరచిరి.

విశ్వామిత్రుడు సురలందరిచే
స్తోత్రములంది సురలందరకు
శుభముపలికెను, వచ్చినమునులు
వారి నెలవులకు సుఖముగ వెడలిరి.

॥శ్రీరఘురాముని॥

✼✼✼

# 61 పశ్చిమ దిశలో విశ్వామిత్రుని తపము

మునులను గాంచి కౌశికుడనెను
దక్షిణదిశలో చేసెడి తపసుకు
విఘ్నము కలిగెను ఈ విధముగను
కావున పడమర దిక్కుకు పోదము.

పడమరదిక్కులొ పుష్కర మున్నది
చక్కగ తపసు సాగును రండని
ఘోరతపస్సును ఆచరించెను
ఫలములుమాత్రము తినుచుగడిపెను.

ఆ సమయములో అయోధ్యనగరిని
'అంబరీషు'డను రాజుఏలుచు
యాగము చేయగ - యాగపశువది
అపహరింపబడె దేవేంద్రునిచే.

అంతట ఋత్విక్కులు పలికిరట
''రాజా! నీవు ఏమరుపాటుతో
ఉండుటవలన విఘ్నము కలిగెను.
పశువుల నాశన దోషము కలుగును.

కావున నీవు యాగ పశువును
వెదకితెమ్ము మరి లేదామరియొక
మార్గము - అది ఒకమనుజునితెచ్చుట
అతనిని యాగ పశువును చేయుట.''

చింతలొ మునిగి అంబరీషుడు
వెదకెను స్వయముగ యాగ పశువుకై
లేదా స్వయముగ ఏనరుడైనా
దొరకునొ ఏమొ అని వెదకుచును.

ఒక ప్రదేశమున 'ఋచీకు'డనెడి
ఋషిని గాంచెను సంతతితోడ
ఋషిని కోరెను అంజలి ఘటించి
లక్షగోవులకు కొడుకు నిమ్మని.

''యాగపశువుకై తిరిగితి నేను
దొరకలేదు మరి బదులుగ స్వామీ!
ముగ్గురిలోన ఒక కుమారుని
యిచ్చి- యాగమును రక్షింపుమనె.''

ఋచీకుడనెను అంబరీషునితొ
''పెద్దకొడుకు నా ప్రేమకు పాత్రుడు''
అంతట పలికెను ఋచీకుపత్ని
''చిన్నకొడుకు నాకతి ప్రియతముడు''

'తమ్ముడు' ''శునకుడు'' తల్లికి ఇష్టుడు
అన్న అనినచొ తండ్రికి ప్రాణము
నడిమివాడను అయితిని కనుక
కానివాడను కావున నేను-

రాజుతొ వెడలి యాగముగాచెద'
అనుకొని అంతట ''శునశ్శేపుడు''
రాజుతొపలికెను ''తల్లిదండ్రులకు
నా విక్రయము సమ్మత మయినది.

నీతో వచ్చెద నీవిచ్చెడివి
లక్షగోవులు తండ్రికి యిమ్ము''
అని పలుకగను రాజు అట్టులె
గోవులనిచ్చి బాలుని గొనెను.

యజ్ఞముసాగెడి మార్గము గాంచిన
రాజు సంతసము నంది- బాలునితొ
సాగుచు - సూర్యుడు నడిమికి రాగా
పుష్కర తీర్థమునందు ఆగెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 62 శునశ్శేపుని వృత్తాంతము

విశ్రమించెను అంబరీషుడు
అచటనె తపము ఆచరించెడు
విశ్వామిత్రుని చూచెను బాలుడు
శునశ్శేపునికి మామ అతడు.

'' 'మమ' అని అనరు ఎవ్వరు నన్ను
'మామా' దయతో చూడుము నన్ను
మాతాపితలు ఉండియు లేరు
జ్ఞాతులు - బంధువు లసలేలేరు.

రక్షణభారము భారము కాదు
విభుని యాగము నెరవేర్చుమయా!
దీర్ఘాయువును నాకొసంగుము
తపసు చేసి నే దివి కేగెదను.

తండ్రి-తనయుని గాచిన రీతి
అనాథుడను నన్నాదుకొనుమయా!''
అనిన బాలుని ఊరడించెను
తనయుల జూచి పలికె కౌశికుడు.

''పుడమినిపుత్రుల బడయుదురందరు
ఉత్తమ గతులను కలుగ జేతురని
అట్టిసేవలు పుత్రుల విధియగు
అట్టివిధిని మీరొనరించవలె.

బాలుని ప్రాణము నిలుపుటకొరకు
పుణ్యతత్పరులు మీలో ఒకరు
యాగపశువుగా ఆహుతి కండు
అగ్నిదేవునికి తృప్తి కలుగగా.

అటులచేసి నా మాట నిలుపుడు
శునశ్శేపుని రక్షణ చేయుడు
రాజు యాగము సాగును అపుడు
దేవతలందరు తృప్తి నందెదరు.''

తండ్రిమాటలు వినిన తనయులు
'మధుష్యందుడు' మొదలగువారు
పరిహాసముతో పలికిరి తండ్రితొ
''తగునా తనయులకీ ఆదేశము?

పరాయివానిని రక్షించుటకై
కన్నవారిని చంపుటన్నది
భోజనమందు శునక మాంసము
తినునటులున్నది, నిషిద్ధమైనది.''

విశ్వామిత్రుడు కుపితుడాయెను
కన్నులు భగభగ మండుచుండగా
''పితృభక్తి మీ కసలే లేదు
ధర్మభయమది ముందే లేదు''

అనుచు పలికెను శాపము నిడెను
''వశిష్ఠ పుత్రుల వలె మీరందరు
ముష్టికులములో వేయి ఏండ్లుగా
శునకమాంసము తినుచుబ్రతుకుడు.''

పుత్రుల కటుల శాపమునిచ్చి
శునశ్శేఫునితొ పలికెను మౌని
మంత్ర విబూదిని పెట్టెను అతనికి
వెన్ను నిమిరి మరి అభయమునిచ్చి

''వైష్ణవీయమగు యూపమ్మునకు
నాయన! నిన్ను కట్టినప్పుడు
నే నుపదేశించు రెండు స్తోత్రములు
అగ్నిని చూచి భక్తిగజెప్పుము.

తేని యాగము సాగునుబాబూ!
నీ జీవితము సార్ధకమగును
అనగా బాలుడు మునిచెప్పిన ఆ
ఇంద్ర-ఉపేంద్ర స్తుతుల గ్రహించి

వడిగావచ్చి అంబరీషునితొ
పలికెను-''రాజా! బయలుదేరుము
యజ్ఞభూమికి త్వరగా పోదము
యాగదీక్షతో నెరపుము యాగము.''

శునశ్శేఫుని పలుకులు వినిన
అంబరీషుడు శీఘ్రమె సాగి
యజ్ఞశాలకు చేరెను అంత
వేదవేత్తల అనుమతి నంది

పవిత్రుడై మరి ఎఱుపు వస్త్రములు
ధరించినట్టి శునశ్శేఫుని
యాగపశువుగా యూపమ్మునకు
కట్టించెను తన యాగశాలలో

అంతట భక్తితొ ముని కుమారుడు
యజ్ఞభోక్తయగు ఇంద్రుని మరియు
యూప దైవతము ఆ ఉపేంద్రుని
స్తోత్రము చేసెను ముని చెప్పినటు.

రామా! అంతట దేవేంద్రుడు తను
స్తోత్రమువలన తృప్తి నందెను
విష్ణుస్తోత్రము భక్తిగ చేయగ
ప్రీతినంది ఆ బాలుని కపుడు

దీర్ఘాయుష్షును ప్రసాదించెను-
అంబరీషుడు ఇంద్రుని కృపచే
యాగఫలమును ఎన్నోరెట్లు
పొందెను, ఎంతో ముదము నందెను.

ఓ నరశ్రేష్ఠా! విశ్వామిత్రుడు
పుణ్యక్షేత్రము పుష్కరమందు
పుణ్యమూర్తియై పుడమిని నిలవగ
వేయి ఏండ్లు తను తపసుచేసెను.

॥శ్రీరఘురాముని॥

# 63 మేనక వలన విశ్వామిత్రుని తపోభంగము

వేయి ఏండ్లట తపసును చేసి
దీక్షాస్నానము చేసినంతనే
తపఃఫలమును అనుగ్రహించగ
సురలువచ్చిరి దర్శన మిచ్చిరి.

బ్రహ్మ అంతట శుభములు పలికి
శుభకర్మలచే ఋషి వయితి వని
ఆశీస్సులనిడి వెడలి నంతనే
తిరిగి తీవ్రముగ తపసు చేయగ.

ఎంతోకాలము గడచి నంతను
అప్సరసలలో అతి రూపసియగు
మేనక- పుష్కర తీర్థము నందు
స్నానము చేయుచు కనబడె మునికి.

అందచందముల పోత బొమ్మయన
మెరుపు తీగవలె వెలిగెడి మేనక
మునికన్నులలో మెరిసి పోయెను
మురిసిపోయి ఆ ముని పలికెనట.

''వరారోహ! నే విరిశరమ్ములచె
వివశుడ నైతిని తూలితి సోలితి.
నా ఆశ్రమమున వసించి నీవు
అనుగ్రహించుము శుభములు కలుగగ.''

మేనక సరియని ముదముతొ పలుకగ
ముని గడపెను పది ఏండ్లు ఆమెతో
అంతట మౌని మోహము తగ్గగ
సిగ్గుతొ ఎంతో చింతనందెను.

విశ్వామిత్రుడు మదిలో తలచెను
తపసు హరించగ సురల పనియని
కామ, మోహముల వశమున చిక్కి
తపసు విఘ్నము చేసికొంటినని.

వణుకుచు నిలచిన మేనకనంత
మధురవాక్కులతొ అనునయించెను
తిరిగితపసును చేయగనాతడు
ఉత్తరదిక్కుకు సాగిఅచ్చట.

కౌశికీనది ఒడ్డున నిష్ఠగ
ఇంద్రియమ్ముల జయింపగోరి
తీవ్రతపమును ఆచరించగ
సురలందరును బ్రహ్మను చేరి

పలికిరి – '' దేవా! సజ్జన శ్రేష్ఠుడు
విశ్వామిత్రుడు మహఋషి యగుటకు
చాలినతపసు చేసెను కనుక
ముని మనసుకు నువు శాంతి నొసగుము.

తీవ్రతపసుకు లోకములన్నీ
కలవర పడుచు నున్నవి'' అనగ
బ్రహ్మస్వయముగ వచ్చిచెప్పెను
''మహఋషివైతివి గాధేయా!'' అని.

బ్రహ్మమాటలకు పొంగిపోకను
పలికెను విశ్వామిత్రుడు అపుడు
మహఋషి అని నువు అంటివి కావున
''జితేంద్రియుడ నేనయితిని కాదా!

అనగా బ్రహ్మ పలికెను మునితో
''జితేంద్రియుండవు అగుటకు నీవు
ప్రయత్నమింకా చేయవలె నయా!
సాధనతోనే సమకూరునది.''

బ్రహ్మ వెడలగ తిరిగి కౌశికుడు
రెండు బాహువులు పైకి ఎత్తి తను
ఏ ఆలంబన లేకనె అచట
వేయి ఏండ్లుగా తపసుచేసెను..

గ్రీష్మమునందు పంచాగ్నులలో
వర్షములోను ఆరు బయలున
చిక్కని చలిలో చల్లని నీళ్ళలొ
దివారాత్రములు తపసు చేసెను.

వాయు భక్షణతొ తీవ్రతపమును
విశ్వామిత్రుడు ఆచరించగా
గాంచిన సురలు దేవేంద్రుడును
భయ శంకలతో కలవర పడిరి.

అంతట ఇంద్రుడు సురలకు మేలు
విశ్వామిత్రుని తపసుకు కీడు
కలుగ జేయగ మనసులొ తలచి
రంభను పిలచి పలికెను తీరుగ.

॥శ్రీరఘురాముని॥

❉❉❉

## 64 విశ్వామిత్రుడు రంభను శపించుట

రంభతొ పలికెను సురపతి అపుడు
విశ్వామిత్రుని తపసుకు విఘ్నము
తేవలె- నీవు ప్రలోభ పరిచి
దేవకార్యమది నీకర్తవ్యము.

అంజలిఘటించి రంభపలికెను
''ఆతడు ఎంతో ఉగ్రమూర్తియై
కోపముతో నను శపించ గలడు
భయముగనున్నది ఓ సురనాయక!''

పలికెను ఇంద్రుడు ధైర్యముగొలిపి
''శుభము కలుగును నాశాసన మిది
తరు శాఖలలో వసంతు డుండును
కోకిల నేనై తోడుగ నుందును.''

సరియని రంభ - ఒంపుల సొంపులు
ఒలకపోసుకొని నవ్వుల పువ్వులు
చల్లుచు వచ్చెను చల్లగ పాడెను
జిల్లున ఉల్లము పొంగెను మునికి.

సుందర మూర్తిని ముందర గాంచెను
సుమ సుకుమారిని కన్నుల గాంచెను
సురపతి ఇంద్రుని పన్నాగమ్మని
గ్రహించి కటువుగ రంభతొ పలికెను.

కామ క్రోధముల జయింప నెంచి
తపసు చేసెడి నా తపసుకు నువు
విఘ్నము చేయగ వచ్చి నందుకు
పదివేలేండ్లు శిలవై యుండుము.

తపో బలమును బుద్ధి బలమును
తేజము నిండిన బ్రహ్మకుమారుడు
తీర్చగ చాలును శాపమునీకు
అంతవరకును శిలవై యుందువు.

ఇంద్రుడు, మన్మథులిద్దరు అపుడు
శిలనట గాంచిరి భయపడి పోయిరి
పారిపోయిరి వారిద్దరును
అంతట కౌశికుడనుకొనె మనమున

"కామము జయించి నిలచితి గాని
క్రోధము సుంతయు వదలకపోతిని
శాప తాపముల ఫలమిటులుండును
తపసు నాశనము చేసుకొంటిని.

ఇకపై కోపము జయించి తీరెద
వాయువు పీల్చక మౌనము పూని
ఇంద్రియాల పొగ రణగించెదను
శుష్కించగ నా దేహమంతయు.

శ్వాసించకను-మనసును నేను
శాసించెదను-కామక్రోధముల
జయించి నిలచి, బ్రహ్మత్వమును-
పొందువరకు నే తపసుచేసెదను."

॥శ్రీరఘురాముని॥

❀❀❀

## 6 5 విశ్వామిత్రుడు బ్రహ్మఋషి యగుట

తూర్పుదిక్కులో నియమనిష్ఠతో
కోపము వదలి విశ్వామిత్రుడు
వేయి ఏండ్లట తపసునుచేసెను
సంకల్పించిన తీరుగ ముగియగ.

ఆహారమును తినుటకు కూర్చొనె-
అంతట ఇంద్రుడు విప్రవేషముతొ
ఆకలిగొంటిని అన్నమునిడుమన
అంతయు నిచ్చెను కోపించకను.

ఉపవాసములతొ శ్వాసను విడువక
మరియొక వేయి సంవత్సరములు
ఉగ్రతపస్సును చేసినంతనే
శిరమునుండి పొగ వెడల జొచ్చెను.

భీకరమైన ధూమముగాంచిరి
భీతినొందిరి సుర-గంధర్వులు
బ్రహ్మనుచేరి పలికిరి అంతట
"విశ్వామిత్రుడు విజయమునందెను.

కామ క్రోధముల జయించినాడు
నిర్మలమైన మనసుతొ నిండెను
ఆలసించుట తగదు యింకను
లోకము ధ్వంసము చేయును తపసు.

దిక్కులు వ్యాకుల మందుచున్నవి
సంద్రము కాగి పొంగు చున్నది
నగములు కరగి పారుచున్నవి
పుడమి యెల్లను వణకు చున్నది.

మిత్రుని కాంతి తగ్గిపోయినది
హోరున గాలి వీచుచున్నది
నిత్యకర్మలను జనులు వదలిరి
తపోగ్ని కీలలు ప్రాకసాగెను.

ఉపేక్షించక అతని అభీష్టము
సుర పదవైనను - యిచ్చి నీవిక
జగమును కావగ లెమ్మనిపలుక''
విధాత వచ్చెను వారందరితో.

విశ్వామిత్రుని ఎదుట విధాత
''తపము చాలునిక శాంతినందుము
బ్రహ్మఋషివి నువు అయితివి గాధిజ!
దీర్ఘాయుష్షను ఇచ్చితి'' ననగ.

బ్రహ్మనుగాంచి బ్రహ్మఋషి అట
పలికెను ''దేవా! వేదాధ్యయనము
వషట్కారము - యాజకత్వమున
ఓంకారమ్ముల హక్కునుయిమ్ము.

అంతియగాక మిగిలిన కోరిక
వేదములన్నీ తెలిసిన వారిలో
ప్రథముడు అయిన వశిష్ఠమహఋషి
బ్రహ్మఋషిగ నను పరిగణింపవలె''

కోరిక వినిన సురలందరును
కోరిరి వశిష్ఠ మునినంతటను
కోపముగెలచిన విశ్వామిత్రుని
కోరికతీర్చగ ప్రార్థన జేసిరి.

వశిష్ఠ మహఋషి - విశ్వామిత్రుని
బ్రహ్మఋషివి నువు అయితివి అనెను
మైత్రిని నెరపెను - వేదకార్యములు
చేయగ చాలిన మూర్తివి అనెను.

దేవత లందరు విశ్వామిత్రుని
బ్రహ్మఋషివి నువు అనుచు పలికిరి
రామా! అటుల ఈ మహనీయుడు
బ్రహ్మఋషిగ తను కీర్తిగాంచెను.

దశరథ నందన! ఈ మునిశ్రేష్ఠుడు
ధర్మతత్పరుడు తేజోవంతుడు
మూర్తిగ నిలచిన పుణ్యమే సుమా!
అనుచు తెలిపెను శతానందుడు.

శతానందుని పలుకులు వినిన
జనకరాజు మది పులకించినది
గాధేయునికి ఆమహరాజు
అంజలి ఘటించి పలికెను తీరుగ.

''బ్రహ్మఋషీ! నీ దర్శన భాగ్యము
దొరకెను - నాకీ జన్మ ధన్యము
రామలక్ష్మణుల చేర్చుకు నీవు
వచ్చుటవలన చరితార్థుడను

కౌశికమౌనీ! నీ తపమింతని
నుడువగరానిది - బలవంతుడవు
కీర్తిమంతుడవు నీకథలన్నీ
వినగ తరగనివి నిధులు మాకవి.

ఓ మునిశ్రేష్ఠా! భాస్కరదేవుడు
పశ్చిమదిశలో సాగుచుండెను
సాయం సంధ్యను ఉపాసించగా
సమయమయినది సాగెద నేను.

ఆనతినిమ్ము- తిరిగి ఉదయమే
దర్శింతును నీ ముఖబింబము అని
మిథిలానాథుడు బంధులగూడి
పురోహితులతో సాగగనంత

మునుల పూజలు అందిన మహఋషి
రామలక్ష్మణుల చేర్చుకు తాను
మదిలో ఎంతో పొంగి పోవుచు
ముదముగ మిథిలలొ విడిది చేసెను.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 66 జనకుడు తెలిపిన శివచాప వృత్తాంతము

ప్రభాతమున విధులను తీర్చుకు
మిథిలానాథుడు- కౌశికమౌనిని
రామలక్ష్మణులతోడ రమ్మని
ఆహ్వానించి పలికెను ప్రియముగ.

దక్షునియాగము ధ్వంసము చేయగ
తలపెట్టిన ఆ ఫాలనేత్రుడు
యజ్ఞభాగము అందనివ్వని
దేవతలందరపై కోపించి

కౌశికమౌని! మీకోరికది
తెలియబరచుడు అనగా మౌని
"రాజా! వీరు దశరథ తనయులు
రవివంశమునకు మణి హారములు.

మీలోమీరు పంచుకొంటిరా?
భాగమునాకు లేకపోయినది
కావున వింటితొ మీతలలన్నీ
పుడమిని రాలగ చేతును" అనుచు

మహావీరులగు ఈ సోదరులు
మహిమాన్వితమగు ధనుసును చూడగ
వచ్చిరి, ధనుసును చూపుము నీవు
కోరికతీరి ముద మందెదరు."

నిలబడినట్టి నిటలాక్షుని గని
గడగడలాడి దేవతలందరు
ప్రార్థింపగను దయగొని శివుడు
ధనుసును వారికి అందజేసెను.

"ఓ మునిసత్తమ! ధనుస్సు గూర్చి
వివరించెద-"నిమి"మావంశజుడు
దేవరాతుడు ఆరవవాడు
మంచి మనసుగల మహిమాన్వితుడు.

దివ్యధనుసును అందిన సురలు
దేవరాతునకు దాచగ యిచ్చిరి
ధనుసుకు పూజలు చేతుము నిరతము
ధన్యులమైతిమి ధనుసు రాకచే.

నేనొకసారి యజ్ఞము చేయగ
తలంపునిండి యజ్ఞభూమిని
దున్నుచుండ నొక దివ్యబాలికను
దర్శించితి- నా పుణ్యవశమున.

నాగటిచాలుల-నెలవంకవలె
నిగనిగలాడుచు మెరిసే పాపకు
నాకన్నులలో నిలచిన కాంతికి
నామకరణము చేసితి-సీతగ

సీతను సుతగా పెంచుకొంటిని
పవిత్రమైన తీరుగ పుడమిలొ
ఉదయించిన - నా సీతమ్మను నే
వీర్యశుల్కయని తలంచుచుంటిని.

సీతను సతిగా యిమ్మని కోరుచు
లోకమునందలి రాజకుమారులు
కోరగ-వారికి చాపము చూపితి
దండిగ నున్నవి బిరుదులు వారికి

దర్శించిరి వారందరు ధనుసును
దరికిచేరగా చాలక కొందరు
ధనుసునెత్తగా చాలక కొందరు
దానిని చేతితొ కదల్చలేక

ఓటమిగలిగి - కోపముతోను
మిథిలను వారు ముట్టడించిరి
వారితో నేనొక ఏడుపోరితి
దుర్గరక్షణము క్షీణించినది.

అంతట నేను తపసునుచేసి
దేవగణములను మెప్పించగను
చతురంగబలములు వారివ్వగను
గెలిచితి రిపులను - తరిమితి వారిని.

ఓ మునిశ్రేష్ఠా! తేజోవంతము
దేవదత్తము అయిన ధనుస్సును
చూపెద - రామ లక్ష్మణులకును
రమ కల్యాణము జరుగుటకొరకు.

కౌశికమౌనీ! రామచంద్రుడు
వింటిని ఎక్కుపెట్టినంతనే
ఇంటి కల్లునిగ చేసుకొందును
కాళ్లుకడిగి నా సీతనిత్తును.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 67 శివధనుర్భంగము

జనకునిపలుకులు విని ముని అంతట
చూపుము చాపము అనగా నపుడు
జనక మహీపతి చాపముతెమ్మని
మంత్రులందరితొ పలికె వినయముగ.

జనకు నాజ్ఞను ఔదల దాల్చి
అయిదు వేలగు దీర్ఘదేహులు
అతి బలవంతులు అతికష్టముతో
ధనుసునుంచిన పెట్టెను తెచ్చిరి.

కరములు మోడ్చి పలికెను జనకుడు
''విను, మునిసత్తమ! దివ్యచాపమిది
ఎందరొ వీరులు ముందుకువచ్చి
సిగ్గుతొ వెనుకకు తిరిగిపోయిరి.

సురలు- అసురులు- యక్ష- కిన్నరులు
ధనుసునెత్తగా చాలక పోయిరి
మంగళకరము మహిమాన్వితమగు
ధనుసు చూపు మా - దాశరథులకు.''

మిథిలాధీశుని మాటలు వినిన
మిత్రతేజుడు విశ్వామిత్రుడు
రామచంద్రుని చూచి పలికెను
''నాయన! రామా! ధనుసు చూడుము.''

విశ్వామిత్రుని ఆదేశము గొని
వింటినుంచిన పెట్టెను తెరచి
వీరపుంగవుడు వినయము నిండి
విజయలక్ష్మికై తొందరపడుచు

''ఓ గురుదేవా! ఆదేశించిన
వింటిని ఎక్కు పెట్టెద'' ననగ
జనకుడు, విశ్వామిత్రులు ముదముగ
ఆశీస్సులతో సరియని నంతనె.

అవలీలగను అతిహేలగను
లీలామానుష విగ్రహుడపుడు
కేలనెత్తెను శివధనుస్సును
శిరసులెత్తిరి రాజలోకము.

వింటిని ఎక్కుపెట్టుట కొరకు
అల్లెత్రాటిని బిగించబోగా
బలము తెలిపెను - బలమగు విల్లు
ఫెళ్లున విరిగెను నడిమికి రెండుగ.

శంకరువిల్లు గుల్ల అన్నటు
అందరిగుండెలు ఝల్లుమన్నటు
సీతమనస్సును కొల్లగొట్టెను
అల్లదె! రాముడు విల్లువిరచెను.

విల్లువిరుగుటో నింగి కూలుటో
నిశ్చయించుకొనలేక పోయిరి
పిడుగులు పడినటు గిరులు చీలినటు
పుడమి వణకెను ధనుర్భంగమున.

రామచంద్రుడు లక్ష్మణమూర్తి
విశ్వామిత్రుడు జనకమహీపతి -
నలుగురుతప్ప సభలో నందరు
పుడమినిపడిరి స్మృతితప్పగను.

'వింటిని ఎక్కుపెట్టు సమర్థుడు
నరులలొ - సురలలొ - కనరాడాయె
ఇట్టి ప్రతిజ్ఞను చేయగనేలా?
అల్లుడు నాకిల దొరకడొ, ఏమొ?

దశరథ తనయుడు రామచంద్రుడు
తగిన వరుడు నా సీతమ్మకును
తను మాత్రము యీ వింటిని పట్టి
ఎక్కుపెట్టగా చాలునొ? లేదో?

కోరిన అల్లుడు రామచంద్రుడు
కోమలి - కన్నియ చెర విడిపించిన
కోటిసుఖములు అందుట నిజము
కోరిక తీరునొ? లేదో? నాకు'

అని భయపడెడు జనక భూపతి
భయమును వీడి కరములు మోడ్చి
పలికెను మునితో పరవశమ్ముతో
''పావనమూర్తిని రాముని గాంచితి.

రామచంద్రుడు శివచాపమును
విరచుట కన్నుల గాంచితి నేను
గాంచితి నాతని భుజబలమ్మును
మహిమనుగాంచి ముదమునందితి

ఆశ్చర్యమును కలిగించునది
అసాధ్యమైనది అపురూపమిది
అసలు మాటలే వెలువడనట్టి
ఆనందము నే పొందుచుంటిని.

నాసుత సీత రామచంద్రుని
పతిగా పొందగ ధన్యుడ నైతిని
జనకవంశపు కీర్తి పెరుగును
జన్మనెత్తిన ఫలము దక్కును.

వీరశుల్క నా కూతురుసీత
అనిన ప్రతిజ్ఞ - నెరవేరినది
ప్రాణము కన్న మిన్న నాసుత
భూమీసుతను రాముని కిచ్చెద.

ఓ మునిశ్రేష్ఠా! శుభమగు నీకు
నీ ఆనతితో నా సచివులట
వేగమె అయోధ్యనగరము చేరి
దశరథ విభునకు సర్వము తెలిపి.

సీతాదేవిని రామచంద్రునకు
కూర్చెడి వివరములన్నీ తెలిపి
వినయముగా నా మహరాజునిట
తోడ్కొని వత్తురు మంగళకరముగ.

రామలక్ష్మణులు యిద్దరుకూడ
విశ్వామిత్రుని రక్షణనున్నటు
తెలియబరచెదరు దశరథరాజుకు
రాజును వేగమె తోడ్కొనివత్తురు.''

విశ్వామిత్రుడు సరియనినంతనె
జనకుడు-సచివుల-పిలిచి-మిథిలలో
జరిగినందంతయు దశరథ విభునకు
తెలియబరచమని తీరుగ జెప్పి

''ఆ మహరాజును అయోధ్యపతిని
మిథిలకు మీరు తగుమర్యాదల
తీసుకురండని ఆనతినిచ్చెను''
మనోరథము నెరవేరిన జనకుడు.

॥శ్రీరఘురాముని॥

❉❉❉

# 68 దశరథునకు శుభవార్త నందించుట

జనకుని ఆనతి నందిన దూతలు
తురగములలసి పోవునట్టుగా
మూడు రాత్రముల త్రోవనుసాగి
నాల్గవనాడు అయోధ్య చేరిరి.

రాజద్వారమున కావలివారితొ
జనకరాజుకు దూతల మనుచు
శీఘ్రమెపోయి కబురు చెప్పమన
సంతసించి వారటు చేయగను.

దశరథరాజు సంతసమంది
తొందరగా వారందర పిలచెను
దూతలు - దేవ సమానుడు అయిన
దశరథరాజుకు అంజలి ఘటించి.

పలికిరి, ''రాజా! జనకభూపతి
మంత్రులు- ఋత్విజులందరితోను
అగ్నిహోత్రములు-సచివులందరితొ
కూడిననీదు క్షేమమడిగెను.

మిథిలానాథుడు - విశ్వామిత్రుని
ఆనతితో మీ కిచ్చునట్టి దగు
సందేశమును తెలియబరచగ
సంతసమంది వచ్చితి మయ్యా!

''వీర్యశుల్క నా కూతురనుచును
ప్రతిజ్ఞచేసితి - వీరులెందరో
గెలువలేక మరి ఓడిపోయిరి
వివరములన్నీ తెలుసును నీకు.

ఓ మహరాజా! విశ్వామిత్రుని
అడుగుజాడలో నడచుచు వచ్చిన
నీ పుత్రుడు - శ్రీరామచంద్రునిచె
నా సుత సీత జయింపబడెను.

పేరోలగమున శివుని ధనుస్సును
ఫెళ్లునవిరచెను రామచంద్రుడు
వీర్యశుల్కయగు నా సుత సీతను
వీరపుంగవుడు రామునికిచ్చెద

సీతారాముల కల్యాణమును
జరిపంచగ నువు ఆనతినిమ్ము
శుభమగురాజా! సచివులందరితొ
ఋత్విక్కులతో శీఘ్రమెరమ్ము.

నీరాకతొ మా కానందమ్మగు
నీ రాముడు నా రాముడగుటది
నయనానందము - మదికానందము
నీవందగను బయలుదేరవలె.''

దశరథరాజా! ఈ విధముగను
మిథిలాధీశుడు - విశ్వామిత్రుని
అనుమతినంది శతానందునితో
ఆలోచించి పలికెనుప్రియముగ.''

జనకుని దూతల పలుకులు వినిన
దశరథవిభుని మది పులకించెను
వశిష్ఠమహాఋషి వామదేవులతొ
సచివులందరితొ పలికెతీరుగా.

''విశ్వామిత్రుని రక్షణ నందిన
కౌసల్యమ్మ కన్నుల పండుగ
తమ్ముడు సుమిత్ర తనయునితోను
విదేహ పురమున విడిసి యుండెను.

మహాత్ముడైన జనక మహీపతి
రాముని విక్రమ మెరిగినవాడై
కూతురునిచ్చి కల్యాణమును
చేయగనెంచెను - కావున మీకు

సమ్మతి అయినచొ మనమందరము
జనకపురికి మరి తరలిపోదము
ఆలస్యమును చేయుట ఎందుకు?''
అనగానందరు ''తథాస్తు'' అనిరి.

ఆనందముతో దశరథరాజు
''రేపేపోదము జనకపురి కనె''
జనకుని దూతలు ఆదరింపబడి
ఆనందమును పొందిరి అచట.

॥శ్రీరఘురాముని॥

## 6 9 జనక మహారాజుచే దశరథ మహారాజు స్వాగతమందుట

సభను తీర్చెను దశరథరాజు
బంధులు-మునులు కొలుచుచుండగా
సుమంత్రుగాంచి పలికె తీరుగా
ఆదేశములను యిమ్మని చెప్పెను.

విశేష ధనమును గొని రావలెను
వివిధ రత్నముల రాసులు తేవలె
వారివెంట చతురంగబలములు
వేగమె సాగగ సిద్ధము చేయుడు.

నా ఆనతి విను - మంత్రి సుమంత్రా!
దివ్య పల్లకీ సిద్ధము చేయుము
వశిష్ఠ మహఋషి వామదేవుడు
జాబాలి మరి కాశ్యప మౌని.

చిరాయువైన మార్కండేయుడు
కాత్యాయనుడు విప్రోత్తములు
ముందు నడువగా మంగళ కరముగ
తేరును సిద్ధము చేయుము త్వరగా.

దశరథు నానతి పరిపాలించిరి
తీరుగ ఏర్పాటులు జరిగినవి
బయలుదేరెను దశరథ భూపతి
మనసు వెడలెను మిథిలానగరము.

నాలుగు దినములు ప్రయాణించిరి
మిథిలాపురమును ముదముతొ చేరిరి
శ్రీమంతుడగు జనక మహీపతి
వార్తనువిని తను స్వాగతమిచ్చెను.

దశరథరాజుకు విప్రోత్తములకు
పూజలు సలిపి, పుణ్య చరిత్రుడు
పొంగిన ఆనందముతో నపుడు
దశరథరాజుతొ పలికె జనకుడు.

''ఓ మహరాజా! స్వాగతమయ్యా!
నా భాగ్యము - నువు మిథిలకు వచ్చుట
పుత్రుల శౌర్యము వలన కలిగిన
సంతోషమును ప్రీతిగ నందుము.

నిన్ను గాంచెడి పుణ్యము కలిగెను
విప్రుల గూడిన వశిష్ఠ మౌనిని
చూచెడి భాగ్యము కలిగెను నాకు
విఘ్నములన్నీ విడిపోయినవి.

పుణ్యవశమున సూర్య వంశముతో
వియ్యమందెడి భాగ్యము కలిగెను
జనకవంశపు కీర్తి పెరుగును
పూజనీయముగ అయినది రాజా

ఓ నరపుంగవ! రేపు ఉదయమే
యజ్ఞము సాంతము అయిన దనుకనే
ఋషిసమ్మతిగా వివాహవిధిని
జరిపించగ నువు అనతినిమ్ము.

జనకుని మాటలు విని దశరథుడు
పలికెనుతీరుగ ఋషుల నడుమన
''ధర్మశ్రేష్ఠుడా! స్వీకరంచుటది
దాతయధీనము అనగా వింటిని

కావున నీవు చెప్పిన రీతి
ఆచరింతుము'' అనగా - జనకుడు
దశరథవిభుని ధర్మవాక్యమును
విని మదినెంతో పరవశించెను

మునులందరును ముదముతొ నంత
మృదువచనములు సల్లాపములతొ
రాత్రిసుఖముగా గడిపిరచ్చట
జనకపురము కల్యాణపురమయె.

రామలక్ష్మణుల నిద్దరగాంచి
హర్షమునందెను దశరథరాజు
జనకుని పూజల నందిన రాజు
పుత్రోత్సాహము నందెను అపుడు.

తత్వవేత్తయు తేజోవంతుడు
జనకభూపతి ధర్మసమ్మతిగ
యజ్ఞము సాంతము చేసి - సుతలను
సాలంకృతలుగ సిద్ధము చేసెను.

||శ్రీరఘురాముని||

✽✽✽

## 70 వశిష్ఠమహర్షి దశరథరాజు వంశక్రమమును వివరించుట

మరునాడుదయము జనకభూపతి
ప్రాతఃకాలిక విధులను తీర్చి
పురోహితుడగు శతానందునితో
పలికెను ఎంతో ప్రియముగ నపుడు.

''మహాధార్మికుడు ప్రతాపశాలి
నాకుతమ్ముడగు ''కుశధ్వజుండు''
''ఇక్షుమతీ'' నది తీరమందున
పుష్పక మన్నటు ఉన్ననగరము.

''సాంకాశ్య'' మను నగరమందున
వసించి - అతడు క్రతు సమాప్తిగా
కాపాడెను - ఆ తమ్ముని యిపుడు
చూడగ నాకు మనసు కలిగినది.

కల్యాణోత్సవ సంతోషమును
వానితొ నేను పంచుకొందును
కావున నీవు శీఘ్రమె వానిని
రప్పించుటకై దూతల నంపుము.''

అన్న పిలచెనను వార్తను వినెను
ఉన్నపాటున బయలు దేరెను
మిథిలకు వచ్చి- అన్నకు- అచటి
పురోహితులకు నమస్కరించెను.

ఉచితాసనముల అన్న దమ్ములు
ఆసీనులు అయి - సుధాముడనెడి
మంత్రిని పిలచి పలికె జనకుడు
దశరథరాజును తోడ్కొని రమ్మనె.

సచివులందరితొ పురోహితులతో
తోడ్కొని రమ్మనినంత సచివుడు
వార్తను చెప్పగ దశరథ భూపతి
వచ్చెను, మంత్రులు పురోహితులతో.

సుఖాసీనులై అందరుండగా
దశరథుడంతట జనకుని చూచి
''రాజవరేణ్యా! వశిష్ఠమహర్షి
మావంశమునకు వేలుపు సమము.

విశ్వామిత్రుడు ఆదిగాగల
మునులందరును అనుమతించినచొ
మావంశమును దాని క్రమమును
వశిష్ఠమహర్షి తెలుపును'' అనగ.

వాక్యకుశలుడు భగవత్సముడు
వశిష్ఠ మహర్షి జనకరాజుతో
పురోహితులు మరి హితులందరితో
శోభిలు రాజుతొ పలికెతీరుగ.

''అవ్యక్తసంభవు డవ్యయుడున్ను
శాశ్వతుడైన బ్రహ్మ దేవునికి
''మరీచి'' అనెడి కొమరుడు కలడు
మరీచి కొమరుడు'' కశ్యపుడ'' య్యా!

కశ్యపు తనయుడు ''వివస్వంతుడు''
అతని కుమారుడు ''మనువు''- ప్రజాపతి
మనువు పుత్రుడు '' ఇక్ష్వాకు'' వయా
అయోధ్య నేలెను పూర్వము అతడు.

ఇక్ష్వాకువునకు కొమరుడు ''కుక్షి
కుక్షికి తనయుడు ''వికుక్షి'' రాజు
అతని తనయుడు ప్రతాప వంతుడు
''బాణుడు'' అనెడి తేజోవంతుడు.

బాణుని కొడుకు ప్రతాప వంతుడు
''అనరణ్యుడు'' అను రాజోత్తముడు
అతని కుమారుడు ''పృథు'' మహరాజు
పృథువు తనయుడు ''త్రిశంకు'' డయ్యా

త్రిశంకు తనయుడు యశస్వి అయిన
''దుందుమారుడు'' - మరియొక పేరు
యవనాశ్వుండని అందురు రాజా!
అతని తనయుడు ''మాంధాత'' యగు.

''సుసంధి'' ఆ మాంధాతకు సుతుడు!
''ధృవసంధియు'' మరి ''ప్రసేనజిత్తు'' లు
సుసంధి యొక్క తనూజులయ్యా
''భరతుడు'' తనయుడు ఆ ధృవసంధికి

భరతునిపట్టి ''అసితుడు'' రాజా!
అతడు - హైహయ తాలజంఘులు
శశిబిందువులను - రిపులచె ఓడి
రాజ్యభ్రష్టునిగ విందుము మనము.

ఓడిన అసితుడు హిమవత్పర్వత
భృగు ప్రస్రవణమునందు వసించెను
అతని భార్యలు ఇద్దరు అపుడు
గర్భవతులని విందుము రాజా!

అందొకభార్య సవతి కంతట
విషము కలిపిన భక్ష్యము నిచ్చెను
భృగువంశజుడగు ''చ్యవన మహాఋషి''
హిమగిరి గాంచి అందు వసించెను.

భాగ్యశాలియు విశాల నేత్ర
సవతులిద్దరిలొ ఒక్కతి అంతట
చ్యవనుని గాంచి అంజలి ఘటించి
పుత్రుని బడయగ కోరిక అనెను.

అంతట సవతికి విషము నిచ్చిన
''కాళింది'' యను రెండవభార్య
వచ్చి- చ్యవనునికి తానును కూడా
నమస్కరించి నిలచి నంతనే

మొదటి ఆమెతో పలికెను మహాఋషి
''భాగ్యవతీ! నీ కోరిక తీరును
బలవంతుడును తేజోవంతుడు
యశస్వియు మరి శ్రీమంతుడగు

మంచి కుమారుడు- గరళము వెంబడి
కలుగును నీకు - చింతిల వల''దనె.
ఆమె కుమారుడు ''సగరుడు'' రాజా!
అతి ధర్మాత్ముడు ఆ మహారాజు.

సగరునితనయుడు ''అసమంజు''డయా
అతని ఆత్మజుడు ''అంశుమంతుడు''
అంశుమంతుని కొడుకు ''దిలీపుడు''
దిలీపు తనయుడు ''భగీరథు''డయా!

భగీరథునికి కీర్తిమంతుడగు
''కకుత్స్థు'' డనెడి పుత్రుడుగలడు
అతనితనయుడు ''రఘుమహారాజు''
రఘువు కుమారుడు ''ప్రవృద్ధు''డయ్యా!

వశిష్ఠుశాపము తగిలిన వాడై
రాక్షసుడయ్యెను ఆ ప్రవృద్ధుడు
తిరిగి వశిష్ఠుని శపియించుటకై
దోసిలి నిండా జలమును గొనగ.

పతివ్రతయగు ఆతని భార్య
వలదని భర్తను శాంతపరచగా
జలము భూమిపై విడువ కూడదని
విడుచు కొనెను తన పాదమ్ములపై.

మంత్రజలమది పడిన పాదములు
కమిలి పోయినవి- ఆ కారణమున
''కల్మషపాదుడు'' అయ్యెనురాజు
అతనికుమారుడు ''శంఖణు''డయ్యా!

శంఖణు తనయుడు ''సుదర్శనుండు''
అతని ఆత్మజుడు ''అగ్నివర్ణుడు''
అగ్నివర్ణుని కొడుకు ''శీఘ్రుగుడు''
అతనికి తనయుడు ''మరు'' మహరాజు.

మరువు కుమారుడు''ప్రశుశ్రుకు''డయా
అతనితనయుడు ''అంబరీషుడు''
అంబరీషుని తనయుడు 'నహుషుడు
నహుషుని కొడుకు 'యయాతి' రాజా!

యయాతి పుత్రుడు 'నాభాగుడయా'
అతనికి తనయుడు 'అజ' మహరాజు
అజమ హరాజుకు అతి బలశాలి
'దశరథరాజు' సత్పుత్రుడయా!

దశరథరాజుకు తనయులు నలుగురు
అందు - వీరు - శ్రీరామలక్ష్మణులు
ధర్మ నిరతులు సత్యవాదులతో
ప్రసిద్ధిగాంచెను వీరి వంశము.

సర్వలక్షణ శోభితలయిన
నీకుమార్తెలను - జనక భూపతీ!
రామలక్ష్మణుల కిచ్చి పరిణయము
చేయుము నీవు - శాస్త్రసమ్మతిగ''

॥శ్రీరఘురాముని॥

## 71 జనక వంశక్రమము : కల్యాణ నిర్ణయము

వంశ క్రమమును వశిష్ఠ మహఋషి
నుడివి నంతనే జనక భూపతి
అంజలియొగ్గి నుడివెను అంత
జనక వంశపు ప్రసిద్ధి వినుమనె.

''కన్యాదాన సమయము నందు
ఉత్తమ వంశ సంజాతులకు
వంశ ప్రతిష్ఠ తెలుపు టన్నది
ఆచారము - ఓ మునిసత్తమ! విను.

ముల్లోకముల ప్రసిద్ధుడైన
ధర్మాత్ముడు అతి బలవంతుడగు
'నిమి' యనురాజు మూల పురుషుడు
అతని తనయుడు 'మిథి' మహరాజు

మిథి మహరాజు నిర్మించినదే
ముచ్చటైనది మిథిలానగరము
మొదటి జనకుడు అతడేనయ్యా!
'ఉదావసువు' ఆ మిథికుమారుడు.

ఉదావసువునకు ధర్మాత్ముడగు
నందివర్ధనుడు' తనయుడు కావలె
అతని కుమారుడు 'సుకేతు'వయ్యా
దేవరాతుడా' సుకేతుసుతుడు.

దేవరాతుడు అతిధర్మాత్ముడు
రాజఋషిగను వినుతికెక్కెను
అతనితనయుడు 'బృహద్రథుండు
'మహావీరుడు అతని ఆత్మజుడు.

మహా వీరునకు ధైర్యవంతుడగు
'సుధృతి'-సుతుడై యశము గాంచెను
సుధృతి తనయుడు ధర్మాత్ముడగు
'ధృష్టకేతు' వను నామధేయుడు.

ధృష్టకేతునకు ప్రసిద్ధి నందిన
'హర్యశ్వ'డను తనూజుడుండెను
అతని తనయుడు 'మరు' మహారాజు
'ప్రతింధకుడు'-మరు రాజుకు తనయుడు.

ప్రతింధకునికి కుమారు డాతడు
'కీర్తిరదథుడ' రాజకుమారుడు
కీర్తి రథునికి కుమారుడతడు
'దేవమీఢు'డను ధర్మాత్ముడయా!

దేవమీఢుని తనయుడు 'విబుధుడు'
విబుధుని తనయుడు 'మహీంధ్రకుండు'
అతని కుమారుడు 'కీర్తిరాతుడు'
'మహారోముడు' అతని తనూజుడు.

మహారోమునికి 'స్వర్ణరోముడు'
స్వర్ణరోమునకు 'హ్రస్వరోముడు'
ధర్మ శ్రేష్టుడగు హ్రస్వరోమునికి
ఇద్దరుకొడుకులు ఉద్భవించిరి.

వారిలో జ్యేష్ఠుడ నేను మునీంద్రా!
'కుశధ్వజుడు' నా సోదరుడితడు
తండ్రి ఆనతిని శిరసునదాల్చితి
తమ్ముని ప్రేమగ చూచుచుంటిని.

సాంకాశ్యమును ఏలు సుధన్వుడు
శివధనుస్సును, సీతాదేవిని
తనకు యిమ్మని అడిగెను అంతట
నేనొల్లనిచే పోరుకు దిగెను.

భీకరమైన పోరుసాగినది
సుధన్వునంతట వధించి -నేను
పట్టముకట్టితి నా సోదరునకు
ఇతడే సాంకాశ్యమునకు అధిపతి.

ఓ నరపాలా! సంతోషముగా
సీతను రాముని కిచ్చెద నేను
లక్ష్మణమూర్తికి 'ఊర్మిళ' నిచ్చెద
త్రికరణ శుద్ధిగ సుతలను యిచ్చెద.

కావున నీవు నీ పుత్రులచే
గోదానములను చేయించగ నగు
శ్రద్ధగ మిగిలిన కార్యములన్నీ
చేయించుము నువు శుభములు కలుగగ.

రాజా! నేడు మఖాతార కద
మూడవదినమున ఉత్తరఫల్గుణి-
శుభనక్షత్రము కల్యాణమునకు
శుభమగు, దానము లిప్పించు మయా!''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 7 2 కుశధ్వజుని కుమార్తె లైన మాండవి–శృతకీర్తులను భరత - శత్రుఘ్నుల కివ్వవలసినదని విశ్వామిత్రుడడుగుట, జనకుని సమ్మతి

జనకుని పలుకులు విని కౌశికుడు
వశిష్ఠమునితో ఆలోచించి
తిరిగి పలికెను మిథిలాధిపునితొ
''రాజా! శ్రేష్ఠము రెండు వంశములు.

మహిమగలవి మరి గొప్పవంశములు
అందము నందు గుణముల యందు
సీతా - ఊర్మిళ లిద్దరు రాజా!
రామలక్ష్మణుల కీయగ తగుదురు.

సమ్మతిమాకు సంతోషమది
మరియొకవిషయము వినుమహరాజా!
నీ తమ్మునికి సుత లిద్దరుకద
భరత, శత్రుఘ్నుల కొసగుము వారిని.

సౌందర్యములో వీరత్వములో
వారు నలుగురు సమాను లయ్యా!
దిక్పాలురతో సమాన బలులు
ప్రీతికలిగెడి నడవడి కలదు.

చిలకా గోరింకల వలె నుందురు
ఈడుజోడు మరి కలసి యున్నవి.
యశోవంతములు మీవంశములు
యశము పెరుగు నీ వియ్యముతోను.''

జనకుడు పలికెను వినయము నిండి
''సూర్యవంశముతొ వియ్యము నకును
సరిపడు వంశము మాదని నుడువగ
ధన్యత నొందెను జనక వంశము.

మహాత్ములారా! మీరు చెప్పినటు
కుశధ్వజుని సుత లిద్దరు కూడా
భరత - శత్రుఘ్నుల కొరకై యున్నటు
ఉండుట - అది నా సోదరు పుణ్యము.

వారిద్దరినీ ఇచ్చెద నేను
నల్గురి కళ్యాణము లొకమారే
జరిపించగను దశరథ విభునకు
కోడళ్ళందరు సమకూరెదరు.

ఉత్తరఫల్గుణి నక్షత్రమునకు
అధిపతి-'భగు'డను ప్రజాపతి కద
అతడు శుభకరుడు ఆ సమయములో
శుభకార్యములను జరిపించెదము.

మీ శిష్యుడను మ్రొక్కెద ననిశము
కన్యాదాన ఫలమిడ వచ్చిరి''
అనుచుపలికి ఆ జనకభూపతి
మూడు ఆసనములట చూపించి

సుఖాసీనులతొ తిరిగి పలికెను
''మా సోదరులవి దశరథవిభునిది
మూడు రాజ్యములు మీ అధీనము
సందేహించగ పనియే లేదు.

నారాజ్యమిది దశరథు విభునిది
అయోధ్యనాకు అతి చనువయినది
కావున ఇవి మీ రాజ్యములుసుమా!
మీకు నచ్చినటు కార్యముతీర్చుడు.

సందేహించగ పని లేదసలు
లోపము జరుగదు - అడ్డము ఎవరు?''
అనగ దశరథుడు జనకుని పలుకుల
ప్రీతినందెను తిరిగి పలికెను.

''జనకభూపతీ! మీసోదరులు
శుభలక్షణులు వినయ శీలురు
కోట్లకొలదిగా మునులందరికి
పూజలుచేసెడి పుణ్యమూర్తులు.''

అనుచు పలికి అట దశరథరాజు
వశిష్ఠ, విశ్వామిత్రులిద్దరితో
జనకుని వద్ద శలవందుకొని
విడిదికి వచ్చెను విధులనుచేయగ.

నాందీకార్యములన్నీ తీర్చుకు
ఉదయమునందే పుత్రుల బిలచి
బంగరు తొడుగులు కలిగిన కొమ్ముల
ధండిగపాలను ఇచ్చెడిగోవులు.

పాలు పిదుకుటకు కంచు పాత్రలతో
పాలు చేపుటకు కడుపు పంటలతో
నాల్గులక్షలను నలుగురు కొడుకులు
లక్ష కొకరుగ దానములిచ్చిరి.

పుత్రులయందు ప్రీతికలిగిన
దశరాథరాజు - విశేషధనము
విప్రులందరికి దాన మిచ్చెను
శుభాశీస్సులను అందిరందరు.

నలుగురుపుత్రుల నడుమ దశరథుడు
నలుగురు దిక్పాలకుల మధ్యలో
నలువరీతిగా ఒప్పెను అపుడు
నాకము భువిలో నున్నది నాడు.

॥శ్రీరఘురామuని॥

❋❋❋

## 73 సీతారాముల కల్యాణము : ఊర్మిళ, మాండవి, శృతకీర్తుల పరిణయములు

గోదానములను యిచ్చిన దినము
కేకయరాజు కుమారు డున్ను
భరత కుమారుని మేనమామ యగు
'యుధాజిత్తు' ఆ మిథిలకు వచ్చెను.

బావగారగు దశరథరాజును
కుశలప్రశ్నల పలుకరించెను
తనతండ్రియగు కేకయరాజు
మనుమని చూడగ కోరెను అనెను.

దశరథుడంతట బావమరదికి
సత్కారములను తీరుగ జరిపెను
మరునాడుదయపు విధులను తీర్చుకు
ఋషులను ముందు నిడుకొని వెడలి

యజ్ఞశాలను చేరెను రాజు
నిర్విఘ్నముగా సాగునట్టిదగు
ముహూర్తమున శ్రీరామచంద్రునికి
సర్వాభరణము లలంకరించిరి.

సోదరు లందరితో రఘురాముడు
వివాహ సూత్ర బంధనమ్ములను
మంగళకరముగ ఆచరించుకొని
వశిష్ఠమునితో తండ్రిని చేరెను.

వశిష్ఠమహఋషి పలికె జనకునితొ
''వర రత్నములతొ దశరథభూపతి
వేంచేసెనయా మిథిలాధీశా!
సూత్రబంధనము చేసిరి వరులు.

కన్యాదానము ఉత్తమ ధర్మము
కీర్తికలుగును ఇరు వంశములకు
కావున రాజా! దాతవు నీవు
కన్యాదానము నాచరించుము.''

అనగా తేజోవంతుడు జనకుడు
పలికెను తిరిగి వశిష్ఠమౌనితొ
''ఎవరి ఆనతికి వేచియుండిరి?
ఇదిమీగృహమని అంటినికాదా!

చనవు కలిగిన ఋషి సత్తముడవు
ఇరువంశములకు వేల్పుసముడవు
సంకోచించక సర్వవిధులను
మీయిల్లనుకొని నిర్వహించుము.

నాకుమార్తెలు వివాహమునకై
సూత్రబంధనము లొనర్చి నారు
హోమజ్వాలలన ప్రకాశించుచు
వేచియుండిరి వేదిక వద్ద.

ఓ మునిశ్రేష్ఠా! ఋషులందరితో
స్వయముగ నీవు బ్రహ్మగనుండి
సీతారాముల కళ్యాణమది
శాస్త్రోక్తముగా జరిపించుమయా!''

అంత వశిష్ఠుడు సరియనిపలికి
విశ్వామిత్రుడు శతానందుడు
తనకు సహాయము చేయుచుండగా
శాస్త్ర ప్రకారము వేదికతీర్చెను.

చలువ పందిరిలొ చల్లనివేదిక
పూలూ పరిమళ ద్రవ్యములుండి.
బంగరు పాలిక లందుమెరయగా
మొలకలెత్తిన పాలికలుంచి

ధూపపాత్రలు ధూపమ్ములతో -
స్రుక్కులు- స్రువములు- అర్ఘ్యములుంచి
లాజపూరిత పాత్రములనుంచి
సంస్కరించిన అక్షతలుంచెను.

అంతట మహఋషి సమంత్ర యుతముగ
పరిశుద్ధములగు దర్భలపరచి
శాస్త్రోక్తముగా వేదికయందు
అగ్నినుంచి - మరి హోమముచేసెను.

శ్రీకినిలయమగు సీతాదేవిని
శ్రీరస్తు - శుభమస్తు - దీర్ఘాయురస్తని
శ్రీలుపొంగు నువు మెట్టిన యింటని
స్త్రీలదీవనలు కురియు చుండగా.

కౌసల్య ఆనంద వర్ధనుడు
కన్నియనందెడి పురుషోత్తముడగు
కోమలమూర్తితో పలికె జనకుడు
కల్యాణమునకు శుభముహూర్తమున.

సర్వాలంకారములతొ శోభిలు
సర్వలక్షణ శోభిత సీతను
అగ్ని కెదురుగా రాముని కెదురుగ
నిలపి జనకుడు పలికె తీయగా :

''ఈసీత - నాసుత - శ్రీరామచంద్రా!
ఈమెనీకింక సహధర్మచారిణి
ఈమె పాణిని నీవు కొదండపాణీ!
అందుకో శుభములు అందుకోరామా!

రామచంద్ర! యీ వెన్నెల నిన్ను
అన్ని సమయముల తోడునీడయ్యై
అనుసరించును యీ భాగ్యవతి
పతివ్రతయు మరి పుణ్యచరిత్ర''

అనుచు పలుకుచు జనకభూపతి
సమంత్రయుతముగ పవిత్రజలముతొ
రామచంద్రుని హస్తమునందు
ధారపోసెను సీతా సుతను.

నీలనీరదశ్యాముడు రాముడు
నీలవేణి ఆ సీతాదేవి
పాణిగ్రహించెను పరిణయమాడెను
పరమానందము నందెను జగము.

శివుని విల్లును అవలీలగను
విరచినయితడు సుమ సుకుమారుడు
సుమలత పోలిన సీత పాణిని
అందెను మెల్లగ ఉల్లముచల్లగ.

కోమలి, కన్నియ - రాముని సుందరి
అందరి మనసులు చలువ పందిరై
చూపులు చల్లని అక్షింతలయి
లక్ష శుభముల సుమములు అయినవి.

రాముని చూచెను నవవధువపుడే
రాముడు చూచెను నవ వధువునట
రాజీవాక్షుని తెరచినకన్నుల
రమణి నిలచెను నిలచె వక్షమున.

రంగవల్లిలా సింగారించిన
రత్నశోభితను చూచిన స్త్రీలు
రమణి అందము ఏమని అందుము?
రామునికొరకై పుట్టిన దందుము!

దేవతలందరు ఋషులు మొత్తము
మేలు మేలు యని శుభముపలికిరి
దేవదుందుభులు మ్రోగిన వపుడు
పూలవానలు కురిసిన వంతట.

సంతోషముతో నిండిరి సురలు
ఇంద్రుడు మొదలగు దేవతలందరు
మనసు హాయిగా, క్లేశము విడిచి
వచ్చెడి శుభముల తలచి మురిసిరి.

కన్నియ సీతను ధార పోసెను
కన్నుల ముత్యము లన్నటు అపుడు
ఆనందముతో పొంగి నట్టివగు
భాష్ప సుమములను ఉంచెనుజనకుడు.

జనకుని పలుకులు వినిన వరులట
వశిష్ఠు ఆదేశము నందుకొని
వధువుల పాణిగ్రహణము చేసిరి
వ్యధలను మరచెను సకలప్రాణులు.

సంతోషముతో లక్ష్మణు గాంచి
ఊర్మిళ నిచ్చెద గ్రహింపు మనుచు
పాణి గ్రహింపగ జేసి అంతట
భరతుని చూచి పలికెను తిరిగి

సపత్నియుతముగ వారందరును
అగ్నికి - వేదికి - రాజుకు నపుడు
ఋషులందరికి ప్రణామముంచి
శాస్త్రోక్తముగా వివాహమాడిరి.

మాండవి నాసుత నీదేనుసుమా!
పాణిగ్రహించి పరిణయ మాడుము
అనుచు అంతట శ్రుతకీర్తిని తను
శత్రుఘ్నునకు ధారపోసెను.

పూలవానలు కురిసెను శుభముగ
దివ్య దుందుభులు మ్రోగెశ్రావ్యముగ
అచ్చరకన్యలు నాట్యముచేసిరి
గంధర్వులంతట గానము చేసిరి.

కకుత్థ్సవంశపు కీర్తిచంద్రికలు
నలుగురు మీరు సపత్నియుతముగ
చక్కగ వ్రతములు ఆచరించుడు
కాలము మించక చేయుడు సర్వము.

మంగళవాద్య నృత్యగీతములు
మ్రోగు చుండగా వధూవరులట
మూడుమార్లుగా అగ్నికి నపుడు
ప్రదక్షిణించి పరిణయ మాడిరి.

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు
పత్నీసహితులు విడిదికిచేరగ
అనుసరించెను దశరథవిభుడు
బంధుజనముతో ఋషులందరితో.

॥శ్రీరఘురాముని॥

## 74 అయోధ్యాపుర పయనము – మార్గమధ్యమున పరశురాముని ఆగమనము

కళ్యాణ వేడుకలు జరిగె తీరుగా
రాత్రి గడచె అతి తీయగ నపుడు
విశ్వామిత్రుడు ఆశీస్సుల నిడి
తన నివాసమగు హిమగిరి కేగెను.

విశ్వామిత్రుడు వెడలి నంతనే
దశరథభూపతి జనక రాజుకడ
వీడుకోలుగొని - వధూవరులతో
పరి వారముతో అయోధ్య కేగెను.

జనక భూపతి నవ వధువులకు
లక్షల గోధనమిచ్చె అరణముగ
రథములు-తురగము లెన్నో యిచ్చెను
అలంకరించిన ఏనుగు లిచ్చెను.

రత్న కంబళులు పట్టు వస్త్రములు
కాల్బల మెంతో యిచ్చెను అపుడు
ఇచ్చెను దాస - దాసీ జనముల
వెండి-బంగరు-ముత్యము లిచ్చెను.

సంతోషముతో సాగ నంపుచు
మిథిలాధీశుడు - కానుక లెన్నో
సుతలకు యిచ్చి - దశరథవిభుని
శలవందుకొని మిథిలకు చేరెను.

తాటక నంతము చేసిన వీరుడు
కౌశికు యాగము రక్షణ చేసెను
మారీచుని మద మణగించి - మరి
సుబాహు శిరమును త్రుంచిన ఘనుడు.

శివుని విల్లునే లీలగ విరచి
సీతను అందెను ఈ సుకుమారుడు
ఎన్ని నోములు నోచి కన్నదో
కౌసల్యమ్మదె జన్మము అంటే.

సీత పూజలు ఫలించెనమ్మా!
జనకుని తపము పండినదమ్మా!
అయోధ్యనేలగ ఆ పురజనులు
ఏమి ధన్యులు - వారిదె పుణ్యము!

రాజీవాక్షుని చూడగ రండి
రామచంద్రుని దర్శించండి
రమణి సీతను చూడండమ్మా!
ఈ ఆనందము నందగరండి

అనుచు పలుకుచు - స్త్రీలు మిథిలలో
కన్నుల పండుగ అన్నటు చూచిరి -
బారులు తీర్చి పురజను లందరు
చూసిరి అయోధ్య కేగెడి రాముని.

మహాత్ములైన పుత్రులతోను
ఋషులతొ ముందు రాజు నడచెను
బలములు వెనుక వచ్చుచుండగా
అయోధ్య త్రోవలొ సాగె దశరథుడు.

నర వ్యాఘ్రములగు తనయుల తోను
దశరథ భూపతి సాగుచుండగా
ఆకాశములో కొన్ని పక్షులు
అశుభ సూచన చేయుచు కూసెను.

అదే సమయమున శుభ సూచనగా
నేలను తిరిగెడి మృగములు అచట
ప్రదక్షిణించెను - దానిని గాంచి
దశరాథరాజు వశిష్ఠు నడిగెను.

''పక్షుల కూతల అశుభము - రాజా!
ఉపశమించెను మృగ ప్రదక్షిణల
నీమది కలవర మందగవల'' దని
శాంతి వచనములు పలికె వశిష్ఠుడు.

అంతట భూమి కంపించునటు
తరువుల నెల్ల పెకళించుచును
పెనుగా లెగసెను అతి తీవ్రముగా
చీకటియైనది పగటి పూటనే.

ధూళి మేఘమై ఎగసెను అచట
వశిష్ఠమహాఋషి - మిగిలిన ఋషులు
దశరథరాజు తనయులు తప్ప
తక్కినవారు తెలివి దప్పిరి.

చిక్కని చీకటి అల్లుకొన్నది
నేల నిండెను పడిన సేనతో
అంతట - భార్గవరాముడు అచట
ఫాలనేత్రుడై నేలకు దిగెను.

జటాధారి - అతి భీకరుడయిన
జమదగ్ని తనయుడు-పరశురాముడు
కైలాసగిరి అంతటి వాడు
ప్రళయాగ్నివలె ప్రజ్వరిల్లుచు.

తేజమునిండి - కన్నులకందని
తీవ్రమూర్తియై పరశువు బట్టి
మెరపుతీగల సముదాయమన
వింటిని-శరమును-దాల్చిన వాడు.

త్రిపురారులను సంహరించెడి
త్రినేత్రుడేయన - పరశురాముడు
కనిపించగను తాపసోత్తములు
తమలోతాము గుసగుసలాడిరి.

లోగడ - తండ్రిని - రాజు చంపెనని
రాజు లెందరినొ చంపెను ఇతడు -
మనసు శాంతిని పొందినవాడు
హాని చేయునా మన మహరాజుకు!

అర్ఘ్యము లొసగి ఋషు లందరును
భీకరరూపుని పరశు రాముని
రామా! రామా! అనుచు మధురముగ
శాంత పరచిరి మృదు వచనముల.

ఋషుల పూజలు అందిన యట్టి
పరశురాముడు ప్రతాప వంతుడు
రాముని చూడగ వచ్చినట్టుగా
రామచంద్రుని చూచి పలికెను.

॥శ్రీరఘురాముని॥

❖❖❖

## 75 పరశురాముని గర్వము

"దశరథతనయా, రామా! వింటిని
నీపరాక్రమము-ఆశ్చర్యమది
శివునివిల్లును విరచుట వింటిని
బలవంతుడవని-విని-వచ్చితిని.

ఊహల కందని దివ్య చాపమిది
శుభకరమైన మరియొక విల్లు
భయంకరమ్మగు ఈ చాపము-విను
నాజనకుడు జమదగ్నివరమయా!

బలము చూపు - నీ విలువ చూపుము
వింటిని శరముతొ సంధించుము నువు
వీరుడ వగుచో - నీతో నేను
ద్వంద్వయుద్ధము చేతును అపుడు.''

భార్గవ రాముని పలుకులు విని - అట
దీన వదనుడై పలికె దశరథుడు
''రాజులపైన ద్వేషము వదలిన
భూసురోత్తమా! అభయము నిమ్ము.

వేదాధ్యయనపు వెలుగుల నిలయము
భృగువంశమున ఉదయించితివి
ఆయుధమును ఇక పట్టను అనుచు
ప్రతినచేసితివి సురపతి ముందు.

తనయుల చూచుకు బ్రతుకు చుంటిని
తనయుల కొరకై బ్రతికి యుంటిని
తనయులు వీరు - భార్గవ రామా!
అభయము నిచ్చిన నిలచును తనువు.

పుడమి జయించి - సత్యము పెంచుకు
కశ్యపమునికి ధార పోసితివి
రాముడు ప్రాణము- ఆతడు లేనిచొ
ప్రాణము లుండవు మా కెవ్వరికి''.

దశరథు డటులే పలుకు చున్నను
లక్ష్యపెట్టక పరశురాముడు
సూటిగ రాముని చూచి పలికెను
ధనుసు గురించి వివరించె నట.

''రామా! వినుము - దివ్య ధనుస్సులు
శ్రేష్ఠములయినవి రెంటిని వెనుక
విశ్వకర్మ - అతి శక్తివంతముగ
నిర్మించెను, ఇది రెండవ దయ్యా!

త్రిపురారులను సంహరించగా
సురలు - శివునకు - ఇచ్చిన వింటిని
విరచి నాడవు - చూడుము దీనిని
వైష్ణవ చాపము ఎక్కు పెట్టుము.

పూర్వము సురలు - బ్రహ్మను అడిగిరి
శివ, కేశవుల బలమెంతయని -
అంతట బ్రహ్మ సురలకు తెలియగ
శివ, కేశవులలొ పోరు సృజించెను.

శివ, కేశవులు ఒకరిని ఒకరు
జయింప గోరి ఘోర యుద్ధము
చేయ సాగిరి - విష్ణువు అంతట
హుంకరించెను భీతి గొలుపగ.

కేశవ హుంకారమునకు అంతట
శివుని బలమును అతని విల్లును
సన్నగిల్లినవి జడత్వ మందెను
సురలు పోరును ఆపిరి అపుడు.

విష్ణువు గెలిచెను అనుకొని రంత
శివుడు క్రోధము నిండెను అపుడు
శివుడు ధనుస్సును విదేహ రాజగు
దేవరాతునికి ఇచ్చె శరములతొ.

రిపులను గెలిచెడి విష్ణు చాపమును
విష్ణువు అంతట భృగు వంశజుడు
ఋచీకునకును న్యాసము గాను
ఇచ్చెను రామా! ఇది ఆ ధనుసు.

ఋచీకు డపుడు తన తనయునకు,
మహాత్ముడైన నా జనకుడగు
జమదగ్ని కిచ్చెను ఈ చాపమును
తపోవంతుడు నా జనకుడయా!

తపోబలముతో నిండిన తండ్రి
శస్త్రమ్ములను సన్యసించగా
గర్వము నిండిన కార్తవీర్యుడు
దుష్టబుద్ధితో చంపె నాతనిని.

తండ్రి వధను - నే వింటిని రామా!
రాజు లెందరినో త్రుంచితి నేను
పుడమి యెల్లను జయించి నాడను
కశ్యపునికి - నే దానమిచ్చితిని.

పుణ్యమూర్తియగు కశ్యపమునికి
ధరణి నిచ్చి నే మహేంద్రగిరిని
తపసు చేసుకొనుచుండగ వింటిని
శివధనుస్సు - నువు విరచినాడవని.

తండ్రి తాతలనుండి వచ్చినది
విష్ణుచాపమును - క్షాత్ర ధర్మముతొ
గ్రహించి - బాణము ఎక్కుపెట్టుము
సమర్థునిగ నే తెలిసికొందును.

సరిపడ బలము కలదని తెలిపి
సమర్థుడవని జగతికి తెలిపి
సమ ఉజ్జీవై ద్వంద్వ యుద్ధమున
సరిచేయుము మరి రాముడెవ్వడో?''

॥శ్రీరఘురాముని॥

❈❈❈

# 76 పరశురామ గర్వభంగము

జమదగ్ని తనయుని చూచెను రాముడు
తండ్రి యెదుట-తను దురుసు లేకను
పలికెను అంతట ''వింటిని భార్గవ!
శత్రుల చంపుట విని - ముదమందితి.

కానీ నన్ను క్షాత్రధర్మమగు
పరాక్రమమ్మది లేని వానిగా -
అశక్తుడను అని తలంచుచుంటివి -
అవమానము-నే సహించ నింక.''

అనుచు కృద్ధుడై దశరథ తనయుడు
భార్గవరాముని కరమున నున్న
దనుర్బాణములు గ్రక్కునగైకొని
ఎక్కుపెట్టి-మరి పలికె తీవ్రముగ

''విప్రుడ వీవు అగుట చేతను
విశ్వామిత్రుని బంధు వగుటచే
ప్రాణము తీయక విడుతును నిన్ను
విడచుట తప్పదు మరి యీశరము.

గమనము త్రెంచగ పదములు కూల్తున!
గడించినట్టి పుణ్యము త్రెంచన?
నిర్ణయించుకో నీకది వదలితి
విష్ణు శరమిది విఫలము కాదు.''

విష్ణుచాపముతొ విక్రమ స్ఫురణతొ
దశరథ తనయుని రాముని చూడగ
బ్రహ్మ వచ్చెను ఋషి గణములతో
వచ్చిరి సురలు - సిద్ధ - చారణులు.

శ్రేష్ఠమైన ఆ విష్ణుచాపముతొ
నిలచిన రాముని పరాక్రమముతొ
లోకము జడమై నిలచి పోయెను
నిలచె భార్గవుడు వెల వెల బోయి

ఓటమి తెలుపుచు భార్గవ రాముడు
పలికె వినయముగ రఘురామునితో
''ధరణి నిదానము' చేయగ నంత
కశ్యపుడనెను పుడమిని విడుమని,

కావున రామా! పుడమిని వుండగ
తగదు నాకు - నా ప్రతిన కావున -
పదములు లేక నేనెటు పోదును
మహేంద్రగిరి మరి చేరుట ఎట్లు?

దయగొని రామా! తపో ఫలమగు
పుణ్యలోకముల దూరము చేయుము
నాకన్నులతో చూచెద నేను
నేపోయెద మరి మహేంద్ర గిరికి.

శత్రుహరణ! ఓ శేషశయన - నువు
చాపము నెక్కు పెట్టుట చేతను
నాశ రహితుడవు మధు సంహారివి
దేవశ్రేష్ఠుడగు విష్ణుమూర్తివి.

తెలిసితి నిన్ను - శుభమిక నీకు
సురలందరును యోధుడవగు నిను
తనివితీరగా చూచు చుండిరి
తీర్చుము రామా! నా కోరికను.

ముల్లోకములకు ప్రభువగు నీచే
ఓటమి నొందుట పుణ్యము రామా!
అవమానము అది కానే కాదు
కావున విడువుము శరమును రామా!''

పరశురాముడు అటుల పలుకగా
శ్రీమంతుడగు దశరథ రాముడు
జామదగ్నిపై నంతట సూటిగ
విడచెను బాణము విక్రమమూర్తి.

భార్గవ రాముడు తన కన్నులతో
తన సంపాదన - తపోధనమగు
పుణ్య లోకములు పోవుట గాంచి
మహేంద్రగిరికి శీఘ్రమె చేరెను.

రామచంద్రునికి ప్రదక్షిణించెను
రాజీవాక్షుని స్తోత్రము చేసెను
రఘురాముని పదకమలము లంటెను
మహేంద్రగిరికి చేరె భార్గవుడు.

దిశల చీకటులు తొలగి పోయెను
దేవ గణములు పొగడె రాముని
దశరథ రాముని విక్రమ మంతయు
తెలిసెను - తెలివి కలిగిన వారికి.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 77 సీతారాముల దాంపత్యము

పరశురాముడు వెడలగ నంత
రఘురాముడు ఆ చాపము నపుడు
మహిమా న్వితుడగు వరుణున కిచ్చెను
వశిష్ఠమొదలగు మునులకుమ్రొక్కెను

వివశుండైన తండ్రితొ పలికెను :
''పరశురాముడు వెడలి పోయెను
బలములతో ఇక అయోధ్య చేరగ
ఆనతి నిమ్ము ఆనందముగా.''

రాముని పలుకులు విని దశరథుడు
ఆలింగనమును చేసి కొనుచును
శిరసును మూర్కొని సంబరపడెను
పులకితు డయ్యెను రాముని గాంచి.

పునర్జన్మను పొంది నట్టుగా
తన కుమారుని మరిమరి చూచెను
కన్నకొడుకు - తన కన్నుల ముందు
తనయుడు రాముడు కన్నుల నిండెను.

అంతట రాజు సాగె నయోధ్యకు
వార్తను వినిన సచివులు - జనులు
తీరుగ నగరిని అలంకరించిరి
స్వర్గ నగరమగు అమరావతిలా.

ధ్వజ, దండములు పతాకములతో
మంగళ తూర్యము లెగయగ నంత
చల్లని జలకముజల్లిన వీథులు
తోరణాలతో శోభిలె నగరి.

పూల బాటలు వేసిరి అంతట
పూలమాలల - తోరణాలతో
కలహంసల వలె నడచు స్త్రీలతో
కళకళ లాడెను నగరి యంతయు.

విప్రోత్తములు పురజనులున్ను
ఎదురుకోలుగా రాగా - రాజు
శ్రీమంతులగు తనయుల తోను
శ్రీకరమైన తన కోడళ్ళతొ.

యశస్వీఅయిన దశరథ భూపతి
హిమవత్పర్వత మన్నటు నిలచిన
ఉన్నతమైన తన భవనమును
ప్రవేశించెను శుభకరము గను.

పూజల నందెను దశరథరాజు
తన దేవేరులు కౌసల్య, సుమిత్ర
చక్కని కైకతక్కిన స్త్రీలు
వేడుకలెన్నో సలుపుచు నంత.

కోడండ్రను తమ తనయల తీరుగ
ముదముతొ అంతఃపురము లోనికి
గొని పోయిరి - అట - ఎన్నో వారికి
శుభా శీస్సులను ఒసగిరి అంతట.

మంగళ శాసన మందిన వారు
పట్టువస్త్రములు దాల్చిన వారై
అంతఃపురమున గల దేవతల
పూజలు చేసిరి కోడళ్ళందరు.

భాగ్యవతులును కీర్తిమంతులగు
సీత- ఊర్మిళ - మాండవి మరియు
శృతకీర్తులను, వారి అత్తలు
కంటి వెలుగువలె గాంచిరి ముదముగ.

పెద్దలందరికి వందన ముంచిరి
ఆశీస్సులను అందిరి శుభముగ
సంతోషముతో తమతమ కాంతుల
చేరి సుఖముగా నుండిరి కాంతలు.

కొంతకాలము గడచిన యంత
భరతుని జూచి పలికె దశరథుడు
"మేనమామయగు యుథాజిత్తిట
ఉండెను నిన్ను గొని పోవుటకై."

తండ్రి ఆనతిని అందిన భరతుడు
శత్రుఘ్నునితో కలిసి అంతట
అన్న రామునికి - తల్లులందరికి
నమస్కరించి బయలు దేరెను.

భరత - శత్రుఘ్నులు వెడలగ నంత
రామలక్ష్మణులు - దేవ సమానుని
తండ్రిని ఎంతో శ్రద్ధాభక్తుల
పూజలు చేయుచు ముదము గొలిపిరి.

తండ్రి ఆనతిని ధర్మాత్ముడగు
శ్రీరఘురాముడు ప్రియముగ నపుడు
ప్రజలకు హితమగు పనులను చేయుచు
ప్రజల మనసులను ఏల సాగెను.

నియమముతో తమ తల్లుల పనులు
వినయముతో తమ గురువుల పనులు
తీరుగ చేయుచు - చేయించుచును
సేవానిరతుడు యశము నందెను.

రాముని నడవడి ఒరవడి అన్నటు
దశరథరాజు - పుర జనులందరు
విప్రోత్తములు, వణిజోత్తములు
ప్రీతినందిరి పొగడిరి ఎంతో.

కీర్తివంతుడు శ్రీరఘురాముడు
సత్యవిక్రముడు శ్రేష్ఠ గుణాఢ్యుడు
సకల ప్రాణులకు ప్రీతిపాత్రుడై
బ్రహ్మదేవుడై భాసిలె భువిలో

మంచి మనసుగల రామచంద్రుడు
సీత యందు బహు ప్రీతి పాత్రుడై
సీత మనస్సున నిలచెను నిండుగ
ఎన్నో ఋతువులు గడిపెను సుఖముగ.

దశరథరాజు మెచ్చిన కోడలు
జనకభూపతి కూతురు సీత
వినయ సంపద సౌశీల్యముతో
సాటిలేని తన సౌందర్యముతో

అదే విధముగా మిథిలాధీశుని
అనుంగు సుతయగు సీతాదేవి
లక్ష్మీదేవి అన్నటులుండి
రాముని గుండియ బాసల నెరుగును.

రామునికెంతో ప్రియము అయినది
రాముని యందే లీన మయినది
రాముని కొరకే పుట్టి నట్టయి
రాముని ప్రాణము సీతనిపించెను.

సుందర రూపము దేవత సమము
ఆది లక్ష్మియే అన్నటు లుండి
అనురాగవతి సౌభాగ్యవతి
జనక నందినితొ దశరథ తనయుడు

రాముడు మెచ్చిన అనురాగమది
కలిగి యున్నది సీతాదేవి
భార్య మనసులో భావము లన్నీ
రాముని గుండెలొ పలుకు చుండును.

దేవశ్రేష్ఠుడగు విష్ణుదేవుడే
లక్ష్మీసహితుడు అన్నటు - ఎంతో
శోభగ నిలచెను అయోధ్య నగరిని
నిలచును అందరి మనసుల లోను

శ్రీరఘురాముని రమ్యచరితము -
మునితిలకుడు మన కొసగిన మంత్రము
రామచంద్రు డుదయించి జానకిని -
పరిణయమాడెను బాలకాండమున.

✼✼✼

## సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు

## లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు

## సర్వేజనా స్సుఖినో భవన్తు

## మంగళం

✼✼✼

శ్రీ మ ద్రా మా య ణ మ క రం ద ము

# అయోధ్యాకాండము

(గేయ కవిత)

శ్రీ రఘురాముడు వనముల కేగుట
సత్యవర్తిగా తండ్రిని నిలపుట
రామపాదుకలు రాజ్యమేలుట
రామాయణమున అయోధ్యాకాండము.

శ్రీరామ

# శ్రీమద్రామాయణ అయోధ్యా కాండము

సర్గము పేజీ

❈❈❈

శ్రీ మ ద్రా మా య ణ మ క రం ద ము

# అయోధ్యాకాండము

(గేయ కవిత)

శ్రీ రఘురాముడు వనముల కేగుట
సత్యవర్తిగా తండ్రిని నిలపుట
రామపాదుకలు రాజ్యమేలుట
రామాయణమున అయోధ్యాకాండము.

శ్రీరామ జయరామ – జయ జయ రామ

శ్లో.. కూజంతం రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరుహ్యా కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్.

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందర కర్తకు వందనముంచి
రామ భక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన జేసెద.

ఏక దంతము శూర్ప కర్ణము
చలువ చూపుల చిన్నవాడా –
పార్వతమ్మకు ముద్దు కొమరుడ
విఘ్నరాజా – వందనమ్ము

శ్రీమద్రామాయణము

# అయోధ్యాకాండము

## 1 వ సర్గము శ్రీరామునికి యువరాజ్యాభిషేకము చేయవలెనని దశరథుడు నిర్ణయించుట

శ్రీరఘురాముడు వనములకేగుట
సత్యవర్తిగా తండ్రిని నిలపుట
రామపాదుకలు రాజ్యమేలుట
రామాయణమున అయోధ్యాకాండము.

భరతునియందు భక్తిప్రపత్తులు
ప్రేమాదరణలు కలిగిన తమ్ముడు
బుద్ధిమంతుడు విజితేంద్రియుడు
శత్రుఘ్నుడు తా అన్నను కొలచును.

భరతకుమారుడు శత్రుఘ్నునితో
గిరివ్రజపురమున - తాతగారగు
కేకయరాజును చూడగ వెడలెను
సోదరులిరువురు చేరిరి ఆపురి.

భరతకుమారుని మేనమామయగు
యుధాజిత్తు ఆ సోదరులిరువుర
పుత్రులవోలె - ఆదరించెను
ఆప్యాయముగా చూడసాగెను.

అన్నిసుఖములు - ఆదరంబును
అమరియున్నను - సోదరులిరువురు
అనిశము . వృద్ధుడు దశరథ విభుని
తలంపుతోనే గడపెడి వారు.

దశరథరాజుయు అదేవిధముగ
భరత శత్రుఘ్నుల తలంచుచుండెను
నలుగురు కొడుకులు - సమానులైనను
రామధ్యానమే - ఆ మహరాజుకు.

సురలందరిలో బ్రహ్మదేవుడన
మక్కువ ఎక్కువ శ్రీహరికెపుడును -
అటులే రాజుకుజ్యేష్ఠకుమారుడు
రాముడనినచో ప్రీతి ఎక్కువ.

దశకంధరుని దునుముటకొరకై
దశరథరాముడు దిగిన దేవుడే
ఇంద్రుని కనినఅదితివోలెను
యశముగాంచినదికౌసల్యమ్మ.

సద్గుణయుతుడు దశరథరాజు
అట్టిగుణములే రాముడుకలిగి
అసూయనెరుగని అతిసుందరుడు
ఆజానుబాహుడు అతి పరాక్రముడు.

మృదువుగ భాషణ చేసెడివాడు
అస్త్రవిద్యలో ఆరితేరెను
వయోవృద్ధులు శీలవంతులతొ
జ్ఞానవృద్ధులతొపలుకును ప్రియముగ.

కిరణమ్ములతో సూర్యుడు శోభిలు
అటులే - మంగళమూర్తి రాముడు
శుభకరగుణముల శోభతొ వెలుగును.
చల్లని చూపుతొ - మదినే ఏలును.

ముందుగ తానే పలుకరించుచు
అందరిమనసులు దోచిన రాముడు
కోపముగెలిచిన దయాశీలుడు
ధర్మసూక్ష్మముల నెరిగినవాడు.

దృఢవ్రతుడాతడు నిలచినధర్మము
మూర్తిగనిలచిన క్షాత్రధర్మమే
శరణాగతులకు చల్లనినీడ
ప్రజలకు ప్రియమును గూర్చెడివాడు.

వేదవిదులకు పూజలుచేయును
క్షాత్రధర్మమును పాలించుటచే
స్వర్గసౌఖ్యము కీర్తికలుగునని
మదిలోనమ్మిన మంగళమూర్తి.

ఎనలేనన్ని - అపకారములు
ఎదుటివారు మరి చేసిన గాని
మరచి పోగల మనుజోత్తముడు
మరుపు నెరుగడు మహిమాన్వితుడు.

చెడు సంగతులు సంగతి నెరుగడు
ధర్మ విరుద్ధము సంభాషించడు
బృహస్పతికి తా తగినటువంటి
యుక్తి చెప్పగచాలిన శక్తి.

ముఖమును చూచి మదినే చదువును
ప్రజలకు రాముడు బహిః ప్రాణము
ఆరోగ్యముతో దేహకాంతితో
వేదాధ్యయనపు వెలుగులు చిమ్మను.

మంత్ర సహితముగ అస్త్రము వేయుట
భుజబలమ్ముతో శరములు వేయుట
అమోఘమ్ముగా తెలిసిన వీరుడు
దశరథరాజును మించునురాముడు

తల్లిదండ్రుల - వంశమ్ములకు
వన్నె తెచ్చెడి - కులదీపకుడు
కష్టములందు - క్రుంగుట యెరుగడు
ఆడితప్పడు - అయోధ్యా రాముడు.

కోపము సంతోషమ్ము లెన్నడు
వ్యర్థముచేయడు ధీరోదాత్తుడు
ముఖకవళికలు హావ భావముల
మదిలో విషయము తెలియనీయడు.

గురువులన్నచో గురిగల భక్తి
కృతజ్ఞుడాతడు స్థిత ప్రజ్ఞుండు
పరుషభాషణము పలికి ఎరుగడు
ఏమరపాటుఎరుగడు రాముడు.

ఆలస్యమును చేయుట ఎరుగడు
తొందరపాటు లేనే లేదు
తన దోషము తను తెలియగ నేర్పరి
దుష్ట శిక్షణ తెలిసినవాడు.

మనుజుల తీరు తెలియగ నేర్పరి
దగ్గర చేర్చి ఆదరించుటది
తీరుగ తెలియును రామచంద్రుడు
నెయ్యము చేయుటయందు నిపుణుడు.

ధనార్జనమ్ము తెలిసినవాడు
సవ్యముగా నది వినియోగించును
దేశకాల పాత్రమ్ము లెరుగును
పెద్దల మన్నన చేయు నాతడు.

ధర్మము కొరకు, యశస్సుకొరకు
లౌకికమ్ముకై, హితులు బంధులకు
తన కొరకును – ఈ ఐదు విధముల
అర్థ విభాగముతెలిసినవాడు.

సకల శాస్త్రములు – కావ్యములన్నీ
నాటకాదులు ఆరు భాషలలో
గ్రంథములన్నీ కూలంకషముగ
చదివిన యట్టి పండితు డతడు

ధర్మార్థములకు లోపము లేక
సుఖముగ గడిపెడి సంతుష్టుండు
అలసుడుకాడు – లలిత కళలలో
అందెవేసిన నేర్పరి రామడు

గజహయమ్ములను నడుపగ నేర్పరి
వాటికి శిక్షణ నివ్వగ నిపుణుడు
ధనుర్వేదము తెలిసిన వారిలో
శ్రేష్ఠుడు రాముడు యుద్ధచతురుడు.

శత్రువునతడే ముందుగ తాకును
సేనల నడుపగ ఆరితేరెను
సురాసురులుమరి ఒక్కటైనను
గెలువ లేరు శ్రీరామచంద్రుని.

పరుల లోపములు ఎన్ననివాడు
గర్వము తెలియని వినయశీలుడు
పరులను నింద చేయుట ఎరుగడు
మదిలో మత్సర మెరుగడు రాముడు.

సమయము వినయము తెలిసినవాడు
వాటికి బద్ధుడు తానైయుండి
సూర్యుని వోలె రవికుల తిలకుడు
ఉత్తమ గుణముల వెలుగుచుండెను.

ఆశ్రిత వత్సలు డయోధ్యారాముడు
ముల్లోకములకు పూజ్యుడాయెను
లోక పాలకుల సరియగు రాముని –
పుడమి ఏలికగ వరించినది యని.

దశరథరాజు తెలిసినవాడై
తను బ్రతియుండగ రామచంద్రుని
రాజును చేయగ ఆలోచించి
మదిలో ఇటుల నిర్ణయించుకొనె.

''లోకవృద్ధికి దోహదమతడు
దయా సముద్రుడు, ధర్మస్వరూపము
తాపము తీర్చగమేఘము పోలును
బుద్ధికి రాముడుబృహస్పతి యగు

పరాక్రమమున, యమ, ఇంద్రుల, సరి
ధైర్యమునందు మేరువు సరియగు
క్షమాగుణములో భూమికి సరియగు
తననుమించిన ఇష్టుడు ప్రజలకు.

రాముడు రాజ్యము నేలుచుండగా
చూచి సంతసముపడిన యంతట
తనువు వదలుట జరుగవలెనని
నిశ్చయించుకొనె దశరథవిభుడు.''

మదిలో విషయము దశరథరాజు
మంత్రులందరకు తెలియబరచెను
అనేకమైన అపశకునమ్ములు
కనబడుచున్నవి అనుచు నుడివెను.

''భూమ్యాకాశములందున మరియు
తారామండల మందున కూడ
ఉత్పాతములు కనబడుచున్నవి
మనసుకలతపడె అపశకునములతో.

వార్ధక్యమ్మది మీదపడినది
ప్రజాహితముకై - జ్యేష్ఠకుమారుని
రామచంద్రుని యువరాజుగను
అభిషేకించుట - అభిమత మనెను.''

ఆనందముగ సచివులందరు
అంగీకారము తెలియబరచిరి
అందుకు తగిన సమయమైనదని
ఆలోచనకై సభనేర్పరచిరి.

నగరముఖ్యులను - రాజముఖ్యులను
జానపదులలో ముఖ్యులందరిని
సభకు రమ్మని - పిలుపు నంపిరి
చేరువనున్న వారిని పిలచిరి

దూరమునున్న కారణమ్మున
కేకయరాజుకు - జనకరాజుకు
వ్యవధి చాలదని వర్తమానమును
తెలియపరచక ఉండిపోయిరి.

ఆహ్వానమును - అందిన ముఖ్యులు
అరుదేరగను అయోధ్యలోను
ఆనందముగా వారందరిని
ఆభరణాదుల సన్మానించిరి.

సురలనువిధాత పలుకరించినటు
స్వయముగరాజు - వారినిచూచి
సగౌరవముగా - ఆహ్వానించెను
నిండుసభ యది తీర్చిదిద్దిరి.

ఎందరొ ప్రముఖులు సభలో శోభిల
అందరిమధ్యలో అయోధ్యరాజు
సురలమధ్యలో సురపతి వోలె
అందరి కన్నుల పండుగ జేసెను.

॥శ్రీరఘురాముడు॥

# 2 దశరథుని నిర్ణయము వినిసభికులు ఆనందపరవశులగుట

గంభీరముగా మనోహరముగా
స్పష్టముగా మరి మధురముగాను
సభాసదులను ఉద్దేశించి
దశరథనృపతి పలికెను తీరుగ.

''మా పూర్వీకులు యశోవిశాలురు
విశాలకోసల పరిపాలించిరి
ఉత్తమమ్మైన సుఖప్రదమ్మైన
రాజ్యముగా నిది వెలసియున్నది.

ఇక్ష్వాకువంశపు కీర్తికి తగినటు
యధాశక్తిగా పాలించితిని
వయసూకాయము పండినవిపుడు
ఈ తనువుకువిశ్రాంతి కావలె.

ధర్మస్థాపన రూపము రాజ్యము -
రాజ్యభారము మోయుటకష్టము
జితేంద్రియునికే సాధ్యము మోయుట
ఇంతవరకు నే మోసి అలసితి.

వశిష్ఠమహాఋషి ఆదిగాగల
వేదవిదులను - మిమ్మందరినీ
సంప్రదించి ఈ రాజ్యభారము
జ్యేష్ఠకుమారుని కీయగ నెంచితి.

సద్గుణయుతుడు రాముడు జ్యేష్ఠుడు
పుష్యమి తారలొ పూర్ణ శశివలె
కాంతుల వెలిగే సుందరమూర్తి
అతి పరాక్రముడు పరమ ధార్మికుడు.

ముల్లోకంబుల నేల సమర్థుడు
మీకు యుక్తమగు ప్రభువాతడగు
రాజుగ రాముని అభిషేకించి.
విశ్రాంతి నందగ కోరుచుంటిని.

నా యోచన మరి సమ్మతమ్మైనచొ
తెలియబరచుడు ఆచరించెద
నా సంతోషము కొరకై మీరు
సరియన వలదు ఆలోచించుడు.''

రాజు పలుకుట పూర్తిచేసెను
పులకితులైరి సభలో వారు
మేఘమ్ములను గాంచిన నెమళుల
కోలాహలము తలపుకు వచ్చెను.

బాగు - బాగు అని ముదముగ నరచిరి
ధ్వనులకు సౌధము కదలినట్టయె
వారిలొ వారు ఆలోచించిరి
రాజును గాంచి పలికిరి అపుడు.

''శత్రుంజయ మను - గజము మీదను
శ్వేత ఛత్రముతొ రామచంద్రుడు
ఊరేగుట మా కానందమగు
చూడగ ముచ్చట పడుచుంటిమయా.''

దశరథరాజు మదిలో పొంగెను
తిరిగి పలికెను సభాసదులతో
''అడిగిన వెంటనె సరియని పలికిరి
సరియగు నిర్ణయమగునా మీది?

ఎందుకు - రాముని యువరాజుగను
అభిషేకించగ సరియని పలికిరి
కారణమేదియొ తెలియ బరచుడు
నావల దోషము కలదా ఏమి?''

అంతట వారుపలికిరి తీయగ
''సద్గుణఖని శ్రీరామచంద్రుని
గుణముల నెన్నగతరమా మాకు
ముల్లోకములను ఏలగ చాలును

స్వజనులవలె మమ్మాదరించును
మాసుఖ - దుఃఖము లందు నిలచును
కన్నతండ్రివలె కాచు మమ్ములను
నిరతము నవ్వులు చిలకరించును.

రామచంద్రుని క్షేమముకోరుచు
నిరతము పూజలు చేతురు ప్రజలు
ఇంద్రియమ్ములను జయించె రాముడు
ప్రజాపాలనము తెలిసినవాడు.

మరీచి మహాఋషి కాశ్యపు గన్నటు
పొందిరి మీరు రామచంద్రుని
రాముడు మీకు తనయుడగుటది
మా భాగ్యమని మురియుచుందుము

మానవులమగు మేమే కాదు
సుర గంధర్వులు, ఉరగులందరును
రామచంద్రుని గౌరవింతురు
ఆయుర్భాగ్యము కోరెదరతనికి.

శ్యామ సుందరుడు శ్రీరఘురాముడు
యువరాజెప్పుడు అగునా యనుచు
ఎదురు చూచుచు నుండి రందరు
మీకై మీరే నుడివిరి ఇపుడు.

ఓ మహారాజా! మీ నిర్ణయము
మాకానందము శిరోధార్యము
దేవదేవుడగు విష్ణుసమానులు
లోక హితమది మీ ఆశయము.

లోక హితమ్ము - మాముదమునకై
రామచంద్రుని యువరాజుగను
అభిషేకించుట కోరుచుంటిమి
పరవశమ్మున పలుకు చుంటిమి.''

॥శ్రీరఘురాముడు॥

## 3 దశరథుడు శ్రీరామునికి తన నిర్ణయము తెలిపి, రాజ్యపాలన గురించి చెప్పుట

సభికుల ముదమును గాంచిన రాజు
మదిలో పొంగి - పలికెను వారితొ
''నే ధన్యుడను - భాగ్యశాలిని
మీ నిర్ణయము హర్షదాయకము.''

వశిష్ఠమహర్షి వామదేవులతొ
రాజు పలికెను - చైత్రమాసమిది
శ్రీకరమైనది - తరులు లతలవి
మనోహరమ్ముగ చిగిర్చి నిలచును.

యువరాజుగ పట్టము కట్టుట కొరకై
తగు ఏర్పాటులు చేయించవలె
ఆలస్యమది చేయవలదన
సరియని పలికిరి సభలో వారు.

సంబారమ్ములు తెలుపుడు అనగా
వశిష్ట మహాఋషి పలికెను అపుడు
దశరథ విభుని పూజా గృహమున
వలయు వస్తువులు తెలిపెను ఇటుల.

''పూజా ద్రవ్యములన్నీ తేవలె
తెల్లని పూవుల మాలలు కావలె
ఓషధులున్నూ నవరత్నములు
బంగరు, వెండి నూత్న వస్త్రములు.

ధగధగమెరిసే నూరు కలశములు
పులితోలున్ను వింజామరలు
తేనెయు, నెయ్యి లాజలు తేవలె
వేరువేరుగా గిన్నెల నుంచుడు.

చతురంగబలములు సిద్ధము గావలె
శత్రుంజయము ఏనుగురావలె
కొమ్ముల బంగరు తొడుగులు వేసిన
ఆబోతులను తీసుకురావలె.

శ్వేతఛత్రము గొనిరావలెను
ధ్వజము, ఆయుధములన్నీ కావలె
పరిమళద్రవ్యములన్నీ కూర్చుడు
శుభకరమైనవి తీసుకురావలె.

పూలదండలతో మంచిగంధముతో
దీప ధూపముల మంగళకరముగ
నగరునంతను అలంకరించుడు
అన్నదానము దండిగచేయుడు.

వేదవిదులను సత్కరించవలె
దండిగదక్షిణ లీయగవలెను
తెల్లవారగను స్వస్తివాచకము
చెప్పగ విప్రుల రప్పించవలె.

చల్లనిజలకము వీధులచల్లుడు
గృహముల పతాక లెగురుచుండవలె
నటకులు - సుందరస్త్రీలు భవనపు
రెండవకక్ష్యకు చేరువనుంచుడు.

దేవాలయముల కూడలు లందు
పూలదండలు అలంకరించుడు
పిండివంటలతో మృష్టాన్నమిడ
శ్రద్ధగలిగిన వారల నుంచుడు.

రాజభవనమున కెదురుగ మీరు
కవచమ్ములతో కత్తులుదాల్చిన
యోధులందరిని నిలువబెట్టుడన''
తగినవారిని నిర్ణయించిరి.

వశిష్ఠమహాఋషి వామదేవుడు
తగువారలకు పనులనుచెప్పి
సంతోషముతో దశరథరాజుకు
జరిగెడిపనులు తెలియబరచిరి.

రాముని చూడగ కోరిక కలిగి
దశరథరాజు వార్త నంపెను
సుమంత్రుడంతట రామచంద్రుని
తోడ్కొనిరాగా బయలుదేరెను.

అరుదెంచిన ఆ రాజులందరితొ
దిక్కుదిక్కుల రాజముఖ్యులతొ
వెలిగెడిసభలో దశరథరాజు
సురలమధ్యలో సురపతి పోలెను.

మరుత్తులందరి మధ్యలొనున్న
మహేంద్రునిగ ఆ రాజుతోచెను
రాజవీధిలో రథము మీదను
వచ్చెడి రాముని రాజుగాంచెను.

రూపసంపదల రామచంద్రుడు
గంధర్వరాజును పోలియుండును
ఆజానుబాహుడు అతిపరాక్రముడు
మత్తేభమును పోలెడి నడక

పున్నమ చంద్రుని మించిన అందము
సుందరరూపము సౌశీల్యాదుల
పురుషుల మనసుల దోచగ చాలిన
పుంసాంమోహన రూపుడు రాముడు.

చల్లని మేఘము పోలును రాముడు
ఎల్లరి మనసును గెలిచెను రాముడు
రథమున రాముని గాంచెను రాజు
చూచెను చూచెను మరి మరి చూచెను.

కైలాస గిరి వలె రాజమందిరము
నిలచియున్నది - రథము నిలచెను
తేరును దిగెను రామచంద్రుడు
సోపానములు అధిరోహించెను.

సభా భవనమున ప్రవేశించెను
కరములు ముడిచి పేరు చెప్పుకొని
దశరథ ప్రభువుకు సాష్టాంగముగా
వినయము నిండి ప్రణామ మిడెను.

ముకుళిత హస్తములున్న రాముని
తండ్రి ప్రియముగ కౌగలించుకొని
రత్నఖచితమగు దివ్యాసనమును
చూపెను - రాముడు ఆశీనుడయె.

మేరుగిరిని ఉదయించు భానుడు
గిరికంతటికి కాంతుల నిడును
సభాభవనమున నున్న రాముడు
సభ కంతటికీ వెలుగు నిచ్చెను.

వశిష్ఠమహాఋషి రాజఋషులును
ఆసీనులగు సభలో రాముడు
శరత్కాలపు తారల నడుమ
చందమామలా తోచెను అపుడు

రామచంద్రుని రూపురేఖలు
తండ్రి యౌవనము తలపించినవి
కశ్యపు డింద్రుని పిలచి పలికినటు
తండ్రి ప్రియముగ పలికె తనయునితొ

''రామా! నీదు ప్రియతమజనని.
కోసలతనయ పుణ్య చరిత్ర
యోగ్యురాలు నినుకన్నదివరముగ
నాకు ప్రియతమ పుత్రుడ వీవు.

ప్రజారంజకుడ వైతివి కావున
రాజును చేయగ ప్రజల కోరిక
కావున రేపే పుష్యమి తారలో
నిను యువరాజుగ చేయుచుంటిని.

నీతో పుట్టెను మంచి గుణములు
గుణవంతుడవు వినయశీలివి
అయినను కానీ పుత్రప్రేమతో
చెప్పెడి హితము విను రఘురామా!

అణుకువ ఇంకా పెంచుకోవలె
విజితేంద్రియుడవు కావలె ననిశము
స్త్రీ ప్రసంగము - మద్యపానము
వేటయు, జూదము కామహేతువులు

కటు భాషణము క్రూరదండనము
ధనవ్యయమ్ములు వ్యసనములయ్యా!
కోపోద్రిక్తత కలుగచేయును
వ్యసనమ్ములను దరిరానీయకు

సచివులతోను ప్రత్యక్షమ్ముగ -
సేవకులతొ మరి పరోక్షమ్ముగ -
అధికారులను ఆజ్ఞాపించుచు
వలయు పనులను చేయించవలె

పొరుగు రాజ్యముల విషయము తెలియుచు
స్వయముగ స్వరాజ్య విషయమ్ములను
శ్రద్ధగ నిరతము తెలియుచుండవలె
ప్రజాహితమది పరమధ్యేయము.

సేనాపతులకు సచివులకున్ను
పురరక్షకులు ప్రజాముఖ్యులకు
అనిశము సంతస మిడుచుండవలె
ప్రజలకు నిరతము ముదము గూర్చవలె.

కోశాగారము ధాన్యాగారము
ఆయుధగారము నిండియుండవలె
అపుడే ప్రజలకు సుఖము కలుగును
మంత్రిసామంతులు, సురలని తలతురు.

మనోనిగ్రహము స్థైర్యము గలిగి
రాజ్యపాలనము చేయగవలెను''
అనుచు ప్రియముగ దశరథరాజు
రామ చంద్రునికి ఉపదేశించెను.

రాముని మిత్రులు ఆనందముతో
శుభ వార్తను వినిపించగ నంత
కౌసల్యమ్మ పొంగిపోయెను
బంగరు రత్నపు బహుమతులిచ్చెను

తండ్రికి తనయుడు నమస్కరించి
తేరునెక్కి తన భవనము చేరగ
తన్మయులైన ప్రజలందరును
జై, జై ధ్వనులతొ మురిసిపోయిరి.

ఆనందముతో అయోధ్య ప్రజలు
గృహములకేగి తమ దేవతలను
రామచంద్రునికి అభిషేకమ్మును
జరిపించమని ప్రార్ధన చేసిరి.

॥శ్రీరఘురాముడు॥

## 4 శ్రీరాముడు పట్టాభిషేక వార్తను కౌసల్యమ్మకు తెలుపుట

కొలువు ముగించి దశరథరాజు
సచివులతో నట అలోచించెను
జరుగు విధులను నిర్ణయించెను
రాముని మరల పిలువ నంపెను.

రామచంద్రునికి సుమంత్రు రాకను
తెలియ బరచగా రాముడు వచ్చి
అంతలోనె మరి ఏలవచ్చెనో
ప్రియముగ నడిగెను సుమంత్రునపుడు.

''ప్రభువులు తిరిగి మిమ్ము చూడగా
పంపిరి నన్ను, విషయము తెలియదు''
అనగా రాముడు అతి శీఘ్రముగా
బయలుదేరెను ప్రభువును చూడగ.

రాముని రాక విని దశరథుడు
లోనికి తోడ్కొని రమ్మని చెప్పగ
రాముడు వచ్చి సాష్టాంగ పడె
తండ్రి తనయుని కౌగలించుకొని

ఆసనంబున కూర్చొన జేసి
అంతరంగమును విప్పెను తండ్రి
''రామా! నేను వృద్ధుడనైతిని
బహుకాలము నీ రాజ్యమేలితి.

శాస్త్రవిహితమగు సుఖములు బడసితి
సకలశాస్త్రములు చదివితి నేను
వేదాధ్యయనము చేసినవాడను
యజ్ఞదానముల - ఋణము తీర్చితిని.

సుఖములు బడసి దేహఋణమును
తనయుల పొంది పితృఋణమును
తీర్చినాడను నా అదృష్టము
జ్యేష్ఠుడవీవు నాకు ఇష్టుడవు.

నీసరివారు భువిలో లేరని
పేరు గడించిన ప్రియపుత్రుడవు
నీ అభిషేకముకన్న మించిన
కోరికలేదు సరియనుమయ్యా!

ప్రజలకోర్కె - నిను అభిషేకించగ
అమంగళములు కలలో గంటిని
కలవరపడినది నా మనసంతయు
కావున నిన్ను పిలువనంపితిని.

పిడుగులవంటి ధ్వనితో నిప్పులు
నేలనుపడుట కలలోగంటిని -
శన్యంగారక - రాహుగ్రహములు
ఇపుడుచేరె - నా జన్మతారలో.

కలలో గాంచిన దుర్నిమిత్తములు
రాజమరణమును సూచన చేయును
లేదా రాజు! బ్రతికియున్నచో
ఆపదలెన్నో వచ్చితీరును.

అందుకు నిన్ను యువరాజుగను
రేపే చేయగ నిశ్చయించితి
మనుజుని బుద్ధి చంచలమయ్యా
మారకముందే మంచి చేయవలె.

నాయన రామా! నామనసంతయు
అభిషేకముకై తొందర పెట్టెను
నేడు పునర్వసు - రేపు పుష్యమి
రేపు మంచిదని విజ్ఞులు చెప్పిరి.

రేపటి రోజు నీ అభిషేకము
జరిగి తీరవలె మంగళమూర్తీ!
నియమ నిష్ఠతో నీవుండవలె
సతితో కలసి ఉపవసింపవలె.

దర్భశయ్యపై పడుకొన వలెను
నీ రక్షణ అతి ముఖ్యము రామా!
ఈ సమయములో విఘ్నములెన్నో
వచ్చుట సహజము ఏమరకుండుము.

భరత కుమారుడు దూరము నుండెను
ఆతని రాకకు ముందే నీకు
అభిషేకమ్ము జరిగి తీరవలె
మనుజుల మనసులు చంచలముసుమా.

పెద్దలు చెప్పిన మార్గమునందే
నడిచే తమ్ముడు అయినను భరతుడు
జ్యేష్ఠుని నిన్ను అనుసరించినను
దాన ధర్మముల నాచరించినను.

విజితేంద్రియుడే అయినను కానీ
మనుజుని మనసు నిశ్చలమ్ముగా
ఒక తీరుండదు అని నేనమ్మెద
మిత్ర భేదముల లొంగుట సహజము.

ధర్మ పరాయణులను సైతము
మిత్ర భేదము లొంగతీయును
కానీ రామా! ధర్మకాంక్షులు
జరిగిన దానికి చింతించరయా!

అందువల్లను - రేపే నీకు
అభిషేకమ్ము జరిగి తీరవలె
సుఖముగ నీవు సదనము కేగుము''
అనుచు మనసును విప్పెను రాజు.

భవనము చేరిన రామచంద్రునికి
తల్లిని చూడగ ఆత్రత కల్గెను
శుభ వార్తను తన కౌసల్యమ్మకు
తెలియబరచగ చేరెను భవనము.

పాలనురుగువలె పట్టుచీరతో
పూజామందిరమందు మౌనముగ
ధ్యానమునున్నది పట్టపురాణి
సుమిత్ర లక్ష్మణులుండిరి ప్రక్కన.

సౌమిత్రి, సుమిత్రలు శుభవార్తనువిని
చేరిరి అచటకు-సీతను పిలచిరి
కౌసల్యమ్మ ఆ ముగ్గురితో
పూజాగృహమున ప్రవేశించినది.

మరునాడుదయము యువరాజగు తన
తనయుని శుభములు మంగళవృద్ధికి
ప్రాణాయామము నాచరించుచూ
నారాయణ - ధ్యానమ్మున నున్నది.

మంగళకారిణి కౌసల్యమ్మకు
వందనమ్మునిడి ఆనందముతో
రాముడు పలికెను సంతోషమునిడ
''అమ్మా! రేపే ముహూర్తమమ్మా.

ప్రజాపాలనము చేయవలెనని
జనకుని ఆనతి - కావున రాత్రి
నేనూ, సీతయు ఉపవసింపవలె
నాయనగారు నాతో చెప్పిరి.

మేము చేయదగు వ్రత దీక్షలను
మంగళ విధులను చేయించవలె.''
తనయుడట్టుల పలుకుచుండగా
తన్మయురాలై తనయునితో ననె.

బహుకాలముగా రామచంద్రుని
శిరమున అభిషేకించు ఘడియకై
ఎదురుచూచెడి ఆ పుణ్యవతి
ఆనంద భాష్పముల పలికె తనయునితో.

''తండ్రీ! నీవు కలకాలమ్ము
ఆనందముగా జీవించవలె
నీ పగవారు హతము కావలె
ఇక్ష్వాకులక్ష్మి నిను చేరనున్నది.

నన్నూ నీ పినతల్లి సుమిత్రను
బంధువులను నువు సుఖపెట్టవలె
తారా బలముతొ పుట్టితి వీవు
సుగుణ శీలివి తండ్రి మెచ్చెను.

నా వ్రత దీక్షలు ఉపవాసములు
సఫలము చేసెను నారాయణుడు
దేవ దేవుని అనుగ్రహముతో
రాజ్యలక్ష్మి నిను చేరనున్నది.''

తల్లి మాటలు తనయుడు వినెను
వినయము నిండి వందన మిడెను
తమ్ముని చూచి రామచంద్రుడు
చిరునగవొలుకుచు పలికెనప్పుడు.

''సోదర లక్ష్మణ ఈ భూభారము
నాకు తోడుగా వహించ వలెను
నీవు నాకు మరి రెండవ ప్రాణము
నిరతము నీదు సుఖమును కోరెద

విలువగు వలువలు ఆభరణమ్ములు
సర్వ భోగములు అనుభవించవలె
నా జీవితము రాజ్యభోగములు
అన్నియు నీవే లక్ష్మణమూర్తీ!''

తమ్మునితో నటు రాముడు చెప్పి
తల్లులకచట వందనమ్మొలిడి
వారి అనతిని సీతను తోడ్కొని
భవనము చేరెను ఆనందముగా

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 5 పట్టాభిషేక ప్రయత్నములు – పొంగిన ఆనందము

ఉపవాసదీక్షలో తనయునుండమని
రాముని పంపి దశరథరాజు
వశిష్ఠమునిని పిలువనంపెను
వచ్చిన మునకి వందనమిడెను.

'ఓ తపోధనా! తాము ఇప్పుడే
సీతారాముల సదనముకేగుడు
రాజ్యము, యశము కలుగుటకొరకై
వారిచె దీక్షను నిర్వహించుడు.''

సరియని పలికి వశిష్ఠమహాఋషి
వేదవిదులకు ఉద్దేశించిన
అరదము నెక్కి రామసదనమును
చేరగ సాగెను ఆనందముగా.

తెల్లనిమేఘము పోలు భవనమున
వశిష్ఠమహాఋషి ప్రవేశించగా
వార్తను చెప్పిరి కావలివారు
వేగమె రాముడు ఎదురు వచ్చెను.

బ్రహ్మఋషికి తా నెదురు నడచెను
ఊతనిచ్చి అరదమ్ము దింపెను
వినయశీలి శ్రీరామచంద్రునికి
మౌని ముదముతో ఆశీస్సులనిడె.

''రామా! నీపై నీ జనకునికి
అనుగ్రహమ్మది కలిగినదయ్యా!
యువరాజుగ నీవు కానున్నావు
సతితో దీక్షను ఆరంభించుము.

చక్రవర్తియగు నహుషుడు ముదముగ
తనయుడైన తన యయాతికపుడు
రాజ్యము నిడినటు దశరథరాజు
పుడమి రక్షణను నీకు ఇచ్చును.''

సీతా రాముల కాశీస్సులనిడి
ఉపవాస దీక్షను ఇచ్చెను వారికి
పుణ్య దంపతుల గౌరవమంది
బయలు దేరెను వశిష్ఠ మహాఋషి.

రాముని మిత్రులు అభినందించిరి
నృత్య గీతముల అలంకారముల
మంగళ కరమగు భవనము అపుడు
పద్మములున్న పద్మాకరమయె.

ముదము పొంగెను రాజవీథిలో
చేరెను అచ్చట జన సమూహములు
సంద్రపు ఘోషగ కోలాహలముతొ
అభిషేకము తిలకింపజేరిరి.

రాజ వీధులు శుభ్రపరచిరి
అరటి పోక స్తంభమ్ములు నిలపి
శుభముగ ముదముగ సింగారించిరి
ప్రతి గృహమందు పతాక లెత్తిరి.

'' ఎంతసేపటికి చీకటి పడునో
ఇంకెంత సమయమున తెల్లవారునో''
కనుల పండువుగ అభిషేకమ్ము
తిలకించుటకై తహ తహ లాడిరి.

జనమును దాటుకు అతి కష్టముతో
వశిష్ఠ మహాఋషి స్యందన మపుడు
ముందుకు సాగి తళ తళ లాడెడి
దశరథ విభుని భవనము చేరెను.

ఇంద్రుని చూచెడి దేవ గురువు వలె
వశిష్ఠ మహాఋషి రాజును చేరగ
వందన మిడెను అయోధ్య రాజు
అందరు లేచిరి - గౌరవించిరి.

ఉపవాస దీక్షను తన తనయునకు
ఇచ్చితిరా యని రాజు అడుగగా
ఇచ్చినాడనని - ముని చెప్పగను
సభ చాలించెను దశరథ రాజు

అంతఃపురమున సింగారించిన
అతివలుండిరి తారలవోలె
చందమామవలె దశరథరాజు
ప్రకాశించెను తన తేజముతో

॥శ్రీరఘురాముడు॥

## 6 శ్రీరాముని వ్రతదీక్ష

వశిష్ఠ మహాఋషి వెడలిన యంత
సీతారాములు స్నానము చేసి
త్రికరణ శుద్ధిగ నారాయణుని
పూజలుచేసి పులకితులైరి

రామచంద్రుడు - హవిస్సు నుంచిన
దివ్య పాత్రమును శిరసున దాల్చి
జ్వలించుచున్న అగ్నిహోత్రమున
నేతితొ హోమము చేసేనప్పుడు

హోమము చేయగ మిగిలిన హవిస్సు
భక్తిగ రాముడు భుజించినాడు
మనోవాంఛితము నేరవేరుటకై
మహాదేవుని ధ్యానము చేసెను

అచ్చట నున్న దేవాలయమున
దర్భశయ్యపై మౌనవ్రతమున
నిశ్చల మనసుతొ జానకి దేవితొ
శయనించెను శ్రీరామచంద్రుడు.

తెల్లవారుటకు ఝాము ముందుగా
నరవ్యాఘ్రము శ్రీరాముడు లేచెను
స్తోత్ర పాఠములు మేలుకొలుపులు
వినుచు కాల్యములు ముగించినాడు

సంధ్య వార్చి గాయత్రి జపించి
సూర్యమండలము మధ్య నిలచిన
శ్రీ నారాయణ స్తోత్రము చేసి
సాష్టాంగముగా ప్రణామమిడెను

ధవళ కాంతులతొ తెల్లగ మెరిసే
ఉత్తరీయమును ధరించి రాముడు
విప్రోత్తములను - వేదమంత్రముల
పఠించ భక్తిగ కోరగ నంత.

గంభీరముగా సుస్వరములతో
పుణ్యాహవచనము చెప్పుచుండగా
మంగళ వాద్యము ముదముగ కలవగ
అయోధ్య నగరము మారుమ్రోగెను.

నిద్రలేచిరి పౌరులందరు
సూర్యోదయము దాటిన వెనుక
రామచంద్రునికి అభిషేకమ్ము
జరుగు ననుచును పరవశించిరి.

అయోధ్యనంతను రమణీయమ్ముగ
అలంకరించుట ప్రారంభించిరి
గిరుల, మేఘముల పోలియుండిన
దేవాలయముల పతాకలెత్తిరి.

కూడలి స్థలముల కోట బురుజుల
రాజవీధుల ఎత్తగు తరువుల
రంగు రంగుల పతాక లెత్తిరి
నృత్య గానముల నిండె నయోధ్య.

గృహములందున గృహముల వెలుపల
కళ కళలాడే స్త్రీ సమూహములు
రాముని అభిషేకమ్ము తలంచిరి
పిల్లలు కూడా పరవశించిరి.

పూలమాలలతొ రాజవీధులను
పూల పందిరిగ అలంకరించిరి
సుగంధ ధూపము లెగయుచుండగా
శోభిల్లినది అయోధ్యనగరి.

ఊరేగింపుకు చీకటి పడునని
ఎత్తగు దీపపు స్థంభములుంచిరి
'ఎప్పుడు వచ్చును ఈ సూరీడు'
అనుచు ప్రజలు ఆత్రంబున నుండిరి.

''దశరథరాజు బుద్ధిశాలియే
వార్థక్యములో పడినటు తెలిసి
రామచంద్రునికి అభిషేకమ్ము
నిశ్చయించెను శ్రీఘ్రముగాను.

ధర్మాత్ముడు శ్రీరామచంద్రుడు
నిగర్వి - జనులను తమ్ములనుకొను
మదిలో కోరిక నేడే తీరును
అందరినింక రాజై ఏలును.''

అనుచు ప్రజలు తమ సంతోషమును
ఒకరితొ నొకరు పంచుకొనిరట
వేడుక చూడగ వచ్చిన జనులతొ
కిట కిట లాడెను అయోధ్య నగరము.

దిక్కు దిక్కులలొ జనులు వచ్చిరి
హర్ష ధ్వానములు మింటి కెగసెను
కోలాహలము నిండి పోవగా
మాటలు వినరాకున్నవి తిన్నగ.

పున్నమి నాటి కడలి ఘోషతో
జలచరమ్ములతొ కల్లోలమగు
సంద్రముపోలి అయోధ్యాపురి
అమరావతి సరి అనిపించినది.

॥శ్రీరఘురామ్ముడు॥

❈❈❈

## 7 కైకకుమంథర హెచ్చరిక

ఎచట పుట్టెనోతెలియదు కాని
కై కేయమ్మకునమ్మిన దాసి
'మంథర' అనునదినామధేయము
మండనిఅనలము- కాల్చగ చాలును.

ప్రాసాదముపై నిలచిన మంథర
యాదృచ్ఛముగా నాల్గు వైపుల
చూచు చుండగా కంటబడినది.
నగరి శోభనది తిలకించినది

అలంకారముల రాజవీధులు
మంగళ కరముగ ధ్వజ పతాకలు -
విప్రోత్తములు రాజముఖ్యులు -
వెల్లి విరిసిన ఆనందమ్ము.

నింగికి వినబడు వేదఘోషలు
మృగములు సైతము ముదముగ నుండుట
ఆలమందల ఆనందమ్ము
రంకెల గెంతే ఆబోతులను

కన్నులగాంచెను పాపదర్శిని
విషయము తెలియక తికమక పడినది
ప్రక్కనె యున్న మరియొక దాసిని
విషయము అడిగెను ముసలి మంథర

''ఏమి చోద్యమే చేయి విదపని
కౌసల్యమ్మ బహుమానములిడు
మన మహరాజు శుభకార్యమును
తలపెట్టెన? మరితెలియ చెప్పుము.''

ఆనందముతో దాసి అంతట
విషయము సర్వము తెలియ బరచగా
కన్నులు మండెను - కడుపు మండెను
నిలబడలేక రుసరుస లాడుచు

పాపదర్శిని పరుగు పరుగున
కైక మందిరము చేరి - అచ్చట
నిద్రలోనున్న రాణిని గాంచెను
ఉద్రేకముతో అరవ సాగెను.

''మూర్ఖురాలవుఓ మహరాణీ!
ఇంకా సుఖముగ నిద్రలో నుంటివి
నీ సౌభాగ్యముతొలగెడి దుర్దశ
మీద పడిననుతెలియక పోతివి.

అందగత్తెనని - ప్రియసతి ననుచు
అహంకారమున తిరుగుచుంటివి
ఇంకి పోయెడి యేటి నీటివలె
నీ ఆనందము మరుగున పడునిక.''

మంధర కోపము గాంచిన కైక
మృదువుగ అడిగెను తనప్రియ దాసిని
''ముఖము వాడినది దుఃఖము నుంటివి
నీకు వచ్చినఆపద ఏమి?''

కైకకు మేలును చేయగోరిన
మంధర- కోపమునణచుకు పలికెను
''ఓ మహారాణీ నీ నాశముకై
అఖండమైన కుట్ర జరిగెను.

దశరథ ప్రభువు రామచంద్రుని
యువరాజుగను అభిషేకించగ
నిశ్చయించినటు విని భయపడితి
దుఃఖము తెలుపగ మాటలు రావు.

నిప్పులలో నను త్రోసినంతటి
బాధపడితినిఓ మహారాణీ!
నీదు మేలునే నిరతము కోరెద
పరుగిడి వచ్చితి విను మహారాణీ!

నీ ఆనందము నాకానందము
నీ దుఃఖము మరి నా దుఃఖమగు
సద్వంశములో పుట్టిన దానవు
దశరథరాజుకు భార్యవైతివి.

రాజ్యతంత్రముల క్రూరత్వమును
తెలియనట్టి పసిపిల్లవు నీవు
ధర్మవచనములు పలికెడి రాజు
మోసగాడని తెలియుము నేడే.

తీయగ పలికి వంచించెను నిను
కల్లాకపటములేని దానవు
కంటిముందర విషయము తెలియదు
దుష్టుడు రాజు తెలియక పోతివి.

కౌసల్యమ్మకు ఐశ్వర్యములు
కట్టబెట్టుటకు కుట్ర జేసెను
భరత కుమారుని తోలివేసెను
నిరాటంకముగ పని ఇక చేయును.

విష జంతువది కాటు వేసినటు
రాజకుమారీ! నీ విభుడైనను
శత్రువు తీరుగ నడచెను రాజు
ఉపేక్ష చేసినఘోరము జరుగును.

సుఖముల తేలగ సిరిగల దానవు
హితులతొ నీవు నాశనమగుదువు
నిన్నే నమ్మిన హితులందరను
రక్షణ జేసెడు భారము నీదే.

ఆకర్షించే కన్నులు నీవి
అంతటి కన్నులఎంతటి పనినీ
చేయగ చాలినశక్తివి నీవు!!
అనుచు మంధర బోధించినది

మంధర మాటలు విన్నది కైక
ఆనందముతో పరవశించెను
ఆ శుభవార్త తెలియనందుకు
ఆశ్చర్యములో మునిగి పోయినది -

విలువ గలిగిన - ఆభరణమ్ముకను
బహూకరించెను, తన ప్రియ దాసికి
''ఎంతటి చల్లని వార్తను నేడు
వినిపించితివి ధన్యురాలవు.

రామచంద్రుడు - భరత కుమారుడు
ఇద్దరు ఒకటే సుందర నయనా!
దశరథవిభుడు రామచంద్రుని
అభిషేకించుట పరమానందము.

ఇంతకు మించిన శుభవార్తను నువు
చెప్పలేవిక- కోరుకోయిక
అడిగిన దిత్తును.'' అన్నది కైక
పొంగెను కైక - కృంగెను మంథర.

॥శ్రీరఘురామడు॥

# 8 మంథర దుర్భోధ

ఆనందముగా కైక పలుకుట
నచ్చలేదు ఆ గూని దాసికి
బహుమతి నిడిన ఆభరణమ్ము
విసరివేసెను రుసరుస లాడుచు.

హితవు వినని ఆ కైకను చూచి
''వెర్రిదాన విటు సంతస పడితివి
నీకువచ్చు నీ కష్టము తెలియదు
శోకసంద్రపు మధ్య నుంటివి.

దుఃఖము వదలి సంతస పడితివి
నిన్ను జూచి నాకేడుపు వచ్చును
నీపిచ్చికి - విను - నవ్వు వచ్చును
సవతికొడుకు నీ మృత్యువు సముడగు''

రాముని యంతటి సమర్థుడిలలో
ఒక్క భరతుడే తెలియము నీవు
కావున భరతుని గాంచి భయపడు
వారందరును కీడొన రింతురు.

ఓ మహరాణీ! సర్ప వ్యాఘ్రములు
మనుజులచూచి భయపడుచుండును
కావున మనము మిన్నకున్నను
మీదకురికి అవి మనుజుల జంపును.

రాజ్యము నేలే అధికారమ్ము
లక్ష్మణ శత్రుఘ్నుల కసలే లేదు
కావున వారిచె అపకారంబు
జరగదు అని ఆ రాముడెరుగును.

అస్త్రవిద్యలో ఆరితేరిన
వీరుడు లక్ష్మణుడెల్లవేళల
రాముని వెంబడి నడచుచుండును
శత్రుఘ్నుడు నీ తనయుని తోడు.

కావున రాణీ! లక్ష్మణ శత్రుఘ్నులు
స్వతంత్రులసలే కానే కారు
అందువల్ల ఆఇద్దరివలన
రాముని కసలే హానిజరగదు.

రాముని సోదరు లందరిలోను
భరతుడు పెద్దకావున రాజ్యము
రాముడు లేనిచొ భరతుని దగును
రాముడున్నచో భరతు డేలడు.

నీతిమంతుడు మతిమంతుడయి
సర్వజ్ఞుడు కౌసల్యతనూజుడు
అంతటి అర్హుడు భరతుడు కాడు
అట్టి సమర్థత అతనికి లేదు.

కావున రాణీ! నీ తనయు డగు
భరతుని తలచిన దుఃఖముపొంగును
రేపటిరోజున రాముడు రాజగు
రాజమాత ఆ కౌసల్యమ్మగు

మహాద్భాగ్యమున మురిసిపోవును
సవతులందరిని తృణీకరించును
కేకయ పుత్రీ! కౌసల్యమ్మకు
వందన మిడెడి దాసి వగుదువు.

నీ దాసీలము ఆమెనెకొలుతుము
భరతుడు రాముని సేవకుడగును
అనుచు మంథర పలుకుచుండగ
కైకవాటిని లెక్కచేయక.

''గూనిదాన! నీమతి చెదరినదా?
ధర్మమూర్తి మన రాముడు వినుము
దశరథరాజుకు జ్యేష్ఠకుమారుడు
కృతజ్ఞుడతడు అసత్యమాడడు.

పెద్దకుమారుడు రాముడు రాజగు
తమ్ముల నతడు తండ్రిగ చూచును
అభిషేకమునకు ఆనందించక
దుఃఖపడుటదితగదు మంథరా!

ముదముగరాజ్యము ఏలిన పిదప
భరతుని కిచ్చును చల్లగ నేలగ
భరతుని కన్న రామచంద్రునే
మిన్నగ తలతును - ఎన్నిక అన్నిట.

రాముడు అటులే ఆప్యాయముగా
తల్లిని మించిన దానను నేనని
తలచుచుండును నాభాగ్యమది
భేద భావములు లేవు రామునికి.

రాముడు రాజ్యము నేలుచున్నచో
భరతుడు రాజ్యము ఏలి నట్లగు''
అనుచు కైక అట పలుకుచుండగా
కోపము పెరిగెను గూని మంథరకు.

నిట్టూర్పులతో పలికెను మంథర
''మూర్ఖురాలవు మంచి తెలియదు.
సవతి కొడుకు నీస్వంతముఅగునా?
వచ్చెడి ఆపద తెలియకుంటివి.

సవతి సేవలు చేయుచుందువు
అప్పుడు తప్పక ఏడ్చెద వీవు
నాహితమును నువు వినకున్నావో
నీకర్మకు నే కర్తనుగాను.

రాముని తదుపరి రాజ్యమేలునది
రాముని తనయులు అని ఎరుగవు నువు
అయోధ్య నేలెడి మహరాజులలో
భరతుని పేరుఉండదు వినుము.

రాజుకు పుట్టిన తనయులందరు
రాజ్యమేలరనితెలియదు నీకు
చిన్నకుమారులు సమర్థులైనను
రాజ్యార్హతమరి జ్యేష్ఠుని దగును.

నామది వేదనతెలియదు నీకు
అనాథగా నీ కొడుకును చేయకు
దాస్యము చేసేఘడియ వచ్చునని
దానికి పొంగి బహుమతి నిడితివి.

కైకా! రాముడుతప్పక రాజగు
దేశాంతరమో - లోకాంతరమో
తప్పకభరతుని పంపి తీరును
ఎంత చెప్పినా నీచెవి కెక్కదు?

పుట్టినదాదిగ భరత కుమారుని
మేనమామ కడ నుంచుచుంటివి
దగ్గరలేక జనుల మనస్సుల
దూరమయ్యేను నీకుమారుడు.

నరకెడి చెట్టునుకంటక లతలు
కొంతవరకుమరి కాపాడును కద
అటులే ఇచట ఆ శత్రుఘ్నుడు
ఉన్నచొకొంత మేలు జరిగెడిది.

రామలక్ష్మణులు అన్యోన్యముగా
అశ్విని సురలైఅయోధ్య నుండిరి
కావునరాముడు లక్ష్మణమూర్తికి
హాని చేయడు - భరతుని వదలడు.

కావున కైకా! ఆలోచించుము
భరతుని రమ్మని పిలువ నంపకు
అటులే అడవికి పొమ్మని చెప్పుము
అసువుల నైనా నిలుపు కొమను.

కైకా! నిరతము మంచిని కోరెద
భరతుడు రాజై నిను సుఖపెట్టును
మేమందరము ఆనందింతుము
మా భాగ్యమని మురిసిపోదుము.

ఓ మహరాణీ! రామచంద్రునికి
పట్టము కట్టుట జరిగి తీరును
అధికారములు భోగము లతనివి
భరతుడు మాత్రము దుఃఖము నందును.

సవతి తమ్ముడు భరతుడగుటచే
సహజవైరము రామునికుండును
హరి వాతబడు కరియగు భరతుని
కాపాడుట నీ ధర్మము రాణీ!

ప్రియసతి ననుచు విర్ర వీగితివి
సమయము దొరకును కౌసల్యమ్మకు
తగిన శాస్తి మరి చేసితీరును
సవతిగ నిన్ను ఈసడింమను.

విశాల కోసల రాముడేలును
కొడుకుతొ కలిసి దుఃఖము నుందువు
అవమానమ్ముల పాలై పోదువు
అమంగళమ్ముల ననుభవింతువు.

భరతునికాపద తప్పదు కైకా!
కావున తనయుడు రాజగుమార్గము
రాముడు రాజ్యము వదలేమార్గము
తెలివిగ ఇపుడే యోచన చేయుము.''

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 9 దశరథునిచేవరములు తీర్చెదనన్న శపథమును గొనమనుట

మంథర బోధలు చెవికెక్కినవి
కైకలొ కోపము ప్రజ్వరిల్లెను
ముఖము ఎఱ్ఱబడి రుసరుస లాడెను
నిట్టూర్పులతో నిలబడలేక.

'' ఓసీ మంథర! నేను ఇప్పుడే
రాముని అయోధ్య దాటించెదను -
యువరాజుగ నా భరతుని చేయగ
తగిన యోచనచెప్పక తప్పదు.''

అంతట మంథర పొంగిపోయెను
తన ఆలోచన చెప్పెను మెల్లగ
''ఓ మహారాణీ! నాకానందము
భరతుడురాజగు మార్గము చెప్పెద.

దేవీనన్ను అడుగుచుంటివి
నిజముగ నీవు మరచిపోతివా?
పరీక్ష కొరకై అడుగుచుంటివా?
మనసు దాచి మరి అడుగుచుంటివా?

ఏమైనను సరె నే చెప్పెద విను
ఆపై నీవుఆలోచించుము''
అనగ వెంటనే కైక లేచెను
ఉత్సాహముతో ముందుకు వచ్చెను.

''ఓ మహారాణీ! శ్రద్ధగ వినుము
అనుచు మంథర ఆరంభించెను
పూర్వకాలమున ఘన సంగ్రామము
దేవాసురులకు జరిగెను కాదా!

సుర నాథునికి సాయము చేయగ
దశరథ రాజు బయలుదేరుచు
రాజఋషులను నిన్నును కూడ
వెంటబెట్టుకొనిసాగె రణమునకు.

దక్షిణ దిక్కున దండకాటవిలొ
తిమిధ్వజుడను శంబరాసురుడు
వసించు పట్నమువైజయంతము
మీరు చేరిరి జ్ఞప్తియున్నదా!

శంబరాసురుడు బహుమాయావి
సురలకు వాడుఅసాధ్యుడయ్యెను
అసురుడు పోయి ఇంద్రుని పైబడె
ఘన సంగ్రామము జరిగె నప్పుడు.

శరములు తగిలి బాధలొ నున్న
దేవతలందరు అలసిపోయిరి
నిద్రలొ జారిరి - అర్ధరాత్రమున
అసురులు తిరిగి విరచుకు పడిరి.

ఆ సమయములో నీ ప్రాణేశుడు
అమోఘ యుద్ధము చేసెను గాదా!
అసురుల ద్రుంచెను - వారి తాకిడికి
మన మహారాజు నీరసపడెను.

నిలబడలేక దశరథరాజు
మూర్ఛిలి పడెను అరదముపైన
రథము నప్పుడు నీవు తోలుచు
రహస్య స్థలమున దాచివేసితివి.

ఎటులో అసురులు తెలుసుకు వచ్చిరి
తిరిగి నీవు అతి చాకచక్యముగ
మరియొక నిగూఢ స్థలము నందున
రథమునుంచి నీ పతిని గాచితివి.

ఆ విధముగ నీ భర్తను నీవు
రక్షించితివి రెండు తడవలు
ఉపచారములతొ సేదను తీర్చి
ప్రాణములిడితివి మన మహారాజుకు.

అసువులు నిలచిన ఆనందముతో
రెండు మార్లునువు కాపాడితివని
రెండు వరములనుఇచ్చెను నీకు
దాచితి వవ్వినాథుని కడనే.

ఇంతవరకు నువు ఆ వరములను
అడగలేదు మరి అందలేదవి!
అంతయు నేనుచూడకున్నను
నీవు చెప్పినది మరువ కుంటివి.

తనయుని పట్టము కట్టుట ఒకటి -
పదునాల్గేండ్లు వనవాసముగా
రాముని అడవుల కంపుట రెండు -
దాచిన వరములు నేడే కోరుము.

ముందుగ రాముని అభిషేకమ్ము
ఆపెడి మార్గము ఆలోచించుము
పదునాల్గేండ్లు రాముడు లేనిచొ
భరతుడురాజుగ స్థిరపడి పోవును.

రాణీ! ఇప్పుడు చేయవలసినది
ఆలోచించి నిశ్చయించితిని
కోప గృహమునకుశీఘ్రమె పోయి
మాసిన చీరతొ నేల పరుండుము.

నిన్ను గాంచగా భర్త వచ్చును
ఉలకక, పలుకక కన్నులు విప్పక
ఏడ్చుచు నేలను పొర్లాడ వలె
అమితమైన అనురాగము రాజుది.

నాకు పూర్తిగాతెలుసును మనసు
నీవు దశరథుని హృదయ రాణివి
నీపై రాజు కోపించడు - విను
నీ కోపమునకు ఆగలేడు తను.

నీ కోసమునీ విభుడు తప్పక
ఎంతటి పనినీచేయగ చాలును
నిప్పుల దూకును ప్రాణములిచ్చును
నీ సౌందర్యము అంతటి దమ్మా!

ఓ మహారాణీ! ఆభరణమ్ములు
కోరిన యంతటిబంగారమ్మును
ఇచ్చెద నను ఆ మహారాజు -
పుచ్చుకొనకుమా! పట్టు సడలకు.

భాగ్యవతీ! నువు మహారాజుకు
వెనుకటి వరములు గుర్తు చేయుము
ఇచ్చెదనన్న వాగ్దానము గొను -
సంతస పరచగ యత్నము నుండును.

అంతటితో నువు ఆనందించి
లేవకుమా! మరి నేలను బడియే
ఇచ్చెదనన్న రెండు వరములు
చెల్లించెదనను ప్రమాణమునుగొను

పదునాల్గేండ్లు సవతి కుమారుడు
అడవుల తిరుగుచు దూరము నున్నచొ
భరతుడు ఇచ్చట బలపడి పోవును
మూల బలములు ఆనతి మీరవు.

అప్పుడు తప్పక నీకుమారుడు
రాజ్యమేలును కావున కైకా!
రాముడు నగరము వదలుట శ్రేయము
ప్రేయము భరతుడు రాజ్యమేలుట.

అరణ్యవాసము పూర్తి చేసుకొని
రాముడు రాగా - హితులిట లేక
అనామకునిగా అగునా రాముడు
భరతుని పాలన చెక్కు చెదరదు.

ఓమహారాణీ! భయపడ వలదు
తలచిన కార్యము చేయ జాలుదువు.
చల్లగ నీపని తీర్చు కొనుమిక
అభిషేకమ్ము జరుగ నీయకు.''

దురూపదేశము విన్నది కైక
గురూపదేశము అనుకొన్నదిక
మబ్బులు విడినటు కలతచెదరెను
గూని దానిపై మమత పెరిగెను.

దాసిని చూచి నవ్వుచు పలికెను
''గూని దాన! నువు అసాధ్యవు సుమా!
తెలివికి నిలయముఅన్నది తెలియదు.
గూని- గడసరి అని నే వింటిని.

నిన్ను మించిన తెలివితేటలు
పృథివిలోమరి ఉండవెవ్వరికి
నాహిత కాంక్షివి నీవొక్కతివే
లేనిచొ ఇంతటి విషయము తెలియదు.

ఓసీ మంథర! అందగత్తెవే
సాధారణమగు గూనివి కావు
వంగిన తామరపువ్వే నువ్వు
ముంగిట నిలచినశుభముల నెలవు.

ఎంతని పొగడెదనీఅందమును
పొందిక చెప్పగ నావశమవ్వదు
చంద్రబింబమునుపోలు వదనము
మంథర మంచికి మారు పేరగు

ధవళ వస్త్రమున తళతళ లాడుచు
మెరసే గజ్జెల మొల నూలుండి
పొడవగు పదముల ముందునడువగా
రాజహంసలా భాసిల్లెదవు.

శంభరాసురుడు మాయలమారి
వందమాయలే తెలియును వానికి
వేలమాయలు తెలియునె నీకు
గూనిలొ దాచితి వన్ని మాయలు.

రాజనీతికి నిలయముగూని
కోర్కెలు తీరగ ఓసీ! దాసీ
గూనికి బంగరు హారము వేసెద
బంగరు రవిక తొడిగించెదను.

బంగరు సొమ్ముల ముంచెద నిన్ను
మంచి చీరెలు కట్టబెట్టెద
నాసవతులను చులకన చేసి
నీవు తిరిగెడి రోజు తెచ్చెద.

నీ సేవలకై దాసీలుందురు
దాసీ! నీవు! శుభముల రాశివి''
అనుచు మంథరను పొగిడెను కైక
తెల్లని పాన్పున మేను వాల్చెను.

నడుము వాల్చిన కైకకు అపుడు
ఆలోచనలు చుట్టు ముట్టినవి
అగ్నిజ్వాలలై ముందుకురికినవి
అది గమనించెనుగూనిమంథర.

తిరిగి పలికెను ముద్దుల దాసి
''ఓమహరాణీ! గతించు నీటికి
కట్టకట్టినఫలితము ఏమి?
అక్కరరాని వరములు ఎందుకు?

రాముని పట్టము కట్టిన వెనుక
వరములు పట్టుకుఏమిచేతువు
నేను చెప్పినటుచేయగ వలెను
రాజురాకకైఎదురు చూడుము''

అనుచు మంథర కైకాదేవిని
అందగత్తెనను అహంభావిని
పురికొల్పినది దుర్బోధలతో
వరముల విషము గ్రక్కించినది

అనుకొనినటుల ఆచరించుటకు
అందగత్తె తన దాసిని తోడ్కొని
చీకటిగదిలో ప్రవేశించెను.
విలువగు నగలు తీసి వేసెను.

బంగరు బొమ్మను పోలినకైక
కటికనేలపై కూర్చొని పలికెను
''కుబ్జా! వరములు విభుడు ఇవ్వనిచొ
అసువులు వీడెద నానిశ్చయమిది.

నామరణమ్మును దశరథవిభునికొ
లేదా కేకయమహరాజునకో
నీవేపోయి చెప్పగవలెను
పట్టిన పట్టు విడువను నేను.

రాముడు అడివికి పోయి తీరవలె
భరతడురాజై ధర నేలవలె
అంతకు మించిన కోరికలేదు
ఆభరణమ్ములనలంకరించను.

కైక పలుకులువినిన మంధర
తిరిగి పలికెను క్రౌర్యము నిండి
"రాముడు రాజైఏలగ వచ్చిన
భరతుడురాజ్యము ఏలడెన్నడును."

అనుచు మంధర పదే పదిగను
చెప్పిన మాటలు నాటెను కైకకు
దుఃఖము వచ్చెను క్రోధమెగసెను
ఊగిపోయినది ఆవేశముతో.

గుండెలు బాదుకు అరచెను కైక
"ఓసీ మంధర! నా తనయునికి
అభిషేకమ్ముజరిగి తీరవలె
రాముడుతప్పక వనము కేగవలె.

రాముడు అడవికి పోక పోయినచొ
కటిక నేలను వీడను నేను
స్నానముచేయక ఏమియు తినక
నీరుముట్టక అసువులువీడెద.

అనుచు కైకఅట ఘన శపథమున
మిగిలిన నగలు అలంకారములు
తీసివేసెను నేలకు విసరెను
మహిత కార్యమును చేయగ నెంచెను.

పుణ్యముతరిగి భూమిని రాలిన
కిన్నెర స్త్రీవలె నేలనుపడినది
హారములన్నీ తీసివేయగా
చీకటి నిండిన ఆకాశమయె.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

# 10 దశరథుడు కైకను కోపకారణ మడుగుట

మంధర బోధలుపనిచేసినవి.
దిగులు భయములతొ నిండెను కైక
విష శరఘాతము తాకిన కిన్నెర
నేల పడినటు వ్రాలిన దచట.

బుసలు విడచెడి ఆడుపామువలె
కోపమునిండి కదులుచున్నది
కర్తవ్యమును నిశ్చయించుకొనె -
శంకతొ తిరిగి యోచన చేసెను.

సాధించెద నను నమ్మకమ్ముతో
దాసినిచూచి తన సంకల్పము
గట్టిగ చెప్పెను, మంధర మురిసెను
మాలలు విసరెను నేలనుబడగా.

మాసినచీరతొ చెదరిన కురులతొ
భృకుటిముడితొ అట వ్రాలిన కైక
పుణ్యము తరిగి పుడమిని రాలిన
కిన్నెర స్త్రీ వలె అగపడు చున్నది.

పగయను చీకటి మదిలో నున్నది
చీకటి గదిలోనున్నది కైక
నేలను పడిన ఆభరణమ్ములు
నింగి తారలై మెరయుచున్నవి.

అయోధ్యాపతి రామచంద్రునికి
అభిషేకంబును తా ప్రకటించి
కొలువు ముగించి గృహమున కేగగ
బయలు దేరుచు మదిలో తలచెను.

కైకకు విషయము తెలియదు గావున
స్వయముగ చెప్పెద నని తలపోసి
బయలుదేరెను ఆమె గృహమునకు
సంతోషముగా సాగెను రాజు.

రాహువునింగిని ఉన్నటు తెలియక
పైకి వచ్చెడు శశిబింబము వలె
దశరథ రాజు కైకను చూడగ
చేరెను ముదముగ దివ్యమందిరము.

చిలుకలు కోకిల క్రౌంచ పక్షుల
అంచ నెమళుల ఆట పాటల
అశోక సంపెగలతా గృహముల
సుందరమైనదికైక మందిరము.

అన్ని ఋతువులలొపూసే లతలు
కాయలు, పండ్లు నిండిన తరువులు
చిత్రగృహములు చక్కని తిన్నెలు
మనసును దోచును కైక మందిరము.

వీణా వేణుమృదంగ వాద్యముల
మాట కారులగు దాసీ జనముల
స్వర్ణపు-దంతపు-పనులతో పీటలు
రుచ్యములైన భక్ష్య భోజ్యముల.

అలంకారముల అంగన లుందురు
స్వర్గ సమముగా నుండును సదనము
దశరథరాజు అతి తొందరగా
అంతఃపురమున అడుగుబెట్టెను.

కైక అచ్చట కనబడలేదు
కలవర పడుచు పిలచెను దేవిని
కాలి యలికిడే వినబడి వచ్చెడి
కైక- కంటికి కనబడ లేదు.

ప్రతీహారిని విషయము అడిగెను
వణకుచు చెప్పెను-''ఓ మహరాజా!
అమిత కోపమున ఆ మహరాణి
కోప గృహమునకు పరుగెత్తినది.''

మనసు కలత పడి దేహము వణకెను
కటిక నేలపై చీకటి గదిలో
కైకను చూచెను దశరథ రాజు
దుఃఖము పొంగెను ఆ మహరాజుకు.

వృద్ధుడు రాజు చిన్న భార్యను
ప్రాణము కన్న మిన్నగ చూచును
ఆమెకు కష్టము కలుగ నీయడు
కానీ ఆమె కఠిన మనస్క.

నరికి వేసిన పూలతీగ వలె
పుణ్య క్షయమై నేల కూలిన
దేవ కిన్నెర అప్సరాంగనల
తలపించుచు ఆకైక ఉన్నది.

బందీకృత యగు లేడి పిల్ల వలె
అలసి సొలసిన ఆడ గుబ్బిమన
విషశరమున బడు ఆడుదంతి వలె
ఉన్నది కైక రాజు చూచెను.

ఆప్యాయముగా ఆ మహరాజు
కైకను చేరి విషయము తెలియక
''దేవీ! ఇంతటి కోపంబునకు
కారణమేమి? తెలియబరచుము.

ధూషించితిరా అవమానించిర?
వివరించుము నువు మంగళకారిణి
నీవిటుధూళిలో నేల నుండుట
చూడలేను ఓ సుందర నయానా!

శారీరకమగు రుగ్మతయగునా?
సమర్థులైన వైద్యుల పిలచెద
నీవు కోరిన వారిని నేను -
అమితముగా సంతోష పెట్టెద.

కృశించిపోకుము ఓ కుసుమలతా!
నీకు మోదము కలిగెడి పనిని
చేతును నేను చేయించెదను -
బీదను చేతును భాగ్యశాలిగా

ప్రాణాంతకమగు ఏ పనినైనా
నీకొరకై నే చేతును కైకా!
నా మక్కువది నీకు తెలియదా
మది సందియమును వదలుము ముదితా.

పుణ్యకర్మపై ఆన చేసితి
ప్రమాణమ్ముగా పలుకుచుంటిని.
ప్రాచ్య సింధు సౌవీర దేశముల
అంగ వంగ ఆ మగధ దేశముల

కాశీ కోసల దక్షిణాపథము
ధన ధాన్యములతొ సమృద్ధమైనవి
ఆ దేశముల అమూల్య దినుసులు
అడిగితివా తెప్పింతును తృటిలో.

మంగళమూర్తీ! బాధ వదలుము
మంచు వీడినటు నీ భయమును నే
విడగొట్టెదను విషయము తెలుపుము''
అనుచు కైకను అనునయించెను.

దశరథ విభునకు అప్రియమైనది
శపథము చేయక తెలుపరాదని
నిర్ణయించినది కైకాదేవి
పథకము పారుట తెలిసెను మదిలో

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 11 కైక తన వరములు కోరుట

మనసు నిండుగా మమత నిండిన
మగనితొ పలికెనుమరుని బాణము
''నాథా! నాకు రుగ్మత లేదు
అవమానమ్మకు గురి కాలేదు.

మదిలో కోరిక తీర్చగ వలెను.
శపథము చేసిన కోరిక చెప్పెద.''
అనుచు కైక చిరు దరహాసమున
అయోధ్యాపతి మనసు దోచెను.

దశరథ విభుడు కురులు నిమిరెను
కోమలమూర్తితొ పలికెను ప్రియముగ
''స్త్రీలలొ - నీవు పురుషుల రాముని
మించినవారు మరి ఇంకెవ్వరు.

కైకా వినుము తనయు లందరిలొ
రాముడు నాకు అతి ప్రియతముడు
ప్రాణము కన్న మిన్న రాముడు
రాముని చూడక నే మనలేను.

అజేయు డాతడు అందరి పూజ్యుడు
అంతటి రాముని పైన ప్రమాణము -
నీ కోరిక నే తీర్చెద వినుము
నా పుణ్యముపై ఆనగ పలికితి.''

మగని ప్రమాణము విన్నది కైక
మూడు మార్లుగ పలికించినది
తనయునిపైన మమకారం బది
కనులు కప్పినది కైకాదేవికి.

అయోధ్య విభునితొ పలికెను కైక
''స్వామీ! కోర్కెలు తీర్చెద ననుచు
కొడుకుపైననే ప్రమాణ మిడితిరి
తమ పుణ్యము పై బాస చేసితిరి.

అగ్ని హోత్రుడు ఆదిగా గల
ముప్పదిమూడు కోట్ల దేవతలు
భూమ్యాకాశము సూర్యచంద్రులు
సర్వభూతములు గ్రహములు విన్నవి.

అయోధ్యలో ఇల వేల్పులందరు
ఆకర్ణించిరి మీదు శపథము
సత్యసంధులు పరమ ధార్మికులు
సురలు సాధ్యులు అందరు వినిరి.''

అనుచు కైక అట పలుకు చుండగా
మురిసిపోయెను దశరథరాజు
మెల్లగ పలికెను విభునితొ కైక
''రాజా! కోర్కెలు కోరెద వినుడు.

దేవాసుర సంగ్రామము నందు
శంబరాసురుడు విజృంభించెను
నాటి రాత్రి మిము రక్షించితిని
మీ ప్రాణములను నిలప జాలితి.

తమరు మెచ్చిరి వరము లిచ్చిరి
ఆ వరము లవి నే కోరెదివి.
కాదన్నచొ మరి అవమానమగు
మీ ఎదుటనె నేలసువులువీడెద.''

అనుచు కైక అతి చాకచక్యముగ
ధర్మ పాశముల బంధించినది
వలలో పడిన జింక మాదిరి
వరము లిత్తునని జారెను రాజు.

విరిసిన కన్నుల కైక చూచెను
రాజు దగ్గరకు చేరెను మెల్లగ
ప్రశాంత కడలిగ నటించు మనసుతో
పలికెను ఎంతో వినయము నిండి.

''నాథా! నాటి వరములు నేడు
కోరుచుంటిని - అభిషేకమ్మది
భరతునికే మరి జరిగి తీరవలె -
రాముడు అడవికి పోవలె స్వామీ!

సమకూర్చిన అభిషేక వస్తువుల
నా తనయుని యువరాజు చేయ వలె
జటాజినమ్ముల ఋషి వలె రాముడు
పదునాల్గేండ్లు వనము కేగ వలె.

కంటి ముందరే రాముడు నడచి
అడవుల చేరుట ముఖ్యము రాజా!
నిరాటంకముగ నా కుమారుడు
యువరాజై ధర నేలగ వలెను.

సత్య వర్తనులు - రాజ రాజులు
శపథము చేసిరి వమ్ము చేయకుడు
కోరిక తీర్చి యశము పెంచుకొని
వంశ గౌరవము నిలుపు కోవలె.

ఆడి తప్పని సత్యవాదులకు
ఇహ పరములు అని చెప్పుచుందురు
జన్మ సార్థకము చేసికొన వలె''
అనుచు ఋసల వలె పలికెను కైక.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

## 12 వరములు విని దశరథుడు కృంగిపోవుట - కైకను నిందించుట

పిడుగు పడి నటు కైక కోరికలు
శిరమున పడినవి దశరథ రాజుకు
వణకుచు రాజు మూర్ఛిలి పడెను
తేరుకొనెను మరి యోచన చేసెను.

ఊహకందని వేదన యైనది
తిరిగి మూర్ఛలో పడెనారాజు
సమయము చాలా గడిచిన పిదప
మెల్లగ మూర్ఛను తేరెను రాజు.

స్వప్నమొ ఏమో! అనిపించినది
కైకే అన్నద? చిత్త భ్రమణమా?
పూర్వ జన్మ వృత్తాంతము తలచెన?
మనో జాడ్యమా అనుచు తలచెను.

ఆడుపులికి మరి అందిన యట్టి
జింకను పోలి దశరథ రాజు
నిలబడలేక నేలను బడెను
మంత్ర బద్ధమగు సర్ప మాయెను.

బుసలమాదిరి నిట్టూర్పులతో
ఛీ.ఛీ యనుచు అరచి మూర్ఛిలె
ఎంతోసేపు గడచినపిదప
తెలివి గలిగినది కృద్ధు డయ్యెను.

కన్నుల నుండి నిప్పులురాల్చుచు
పలికెను రాజు ఆవేశముగా
''దుష్టచారిణీ! మా వంశమును
తుడిచివేయగా తలచితివా నువు?

ఏమపకారము చేసితి నేను
ఎట్టిహాని నా రాముడు చేసెను
కన్నతల్లివలె సేవలు చేసెను
అట్టివానికా కీడు తలచితివి.

రాకుమారి వని నమ్మితి నిన్ను
విషఫణి వని నే తెలిసితి నేడు
అజ్ఞానముతో నిన్ను తెచ్చితి
అందుకు ఫలితము అనుభవించ వలె.

సకల ప్రాణులు పొగడును రాముని
నా కుమారుడు పరమ యోగ్యుడు
ఏమితప్పు మరి చేసె ననుచును
అడవికి పంపే శిక్ష వేతును.

కౌసల్య సుమిత్రల నిద్దరి నైనను
ఐశ్వర్యమును అధికారమును
చివరకుప్రాణము త్యజించ సిద్ధము
కానీజ్యేష్ఠుని రాముని వదలను.

పితృ భక్తిలో మిన్న రాముడు
వాడున్నాడని బ్రతుకు చుంటిని
రామునిచూడక ప్రాణము నిలువదు.
కోర్కెలు వదలుము పదముల బడెదను.

దారుణమైన కోర్కెల నెందుకు
కోరితి వీవు తెలుపుము కైకా!
భరతునిపై నాప్రేమ తెలియుటకు
అడిగి యుందు వని నే తలంచెద.

అది నిజమైనచొ నీ తనయునికి
రాజ్యము నిమ్మని కోరగ వలెను
కానీ రాముని అడవుల కంపెడి
కోరిక ఏల కోరుకొంటివి?

రాముడు జ్యేష్ఠుడు అన్నిట మిన్నని
ఎన్నో మారులు నీవు చెప్పితివి
కల్ల మాటలా - ఇచ్చకాలవా?
రాముని సేవలనంద పలికితివ?

రాముడు రాజగు నని తెలియగనే
కోప గృహమునకు ఏల వచ్చితివి?
ఏల వంత నీ వనుభవించుట
నన్నెందుకు నువు దుఃఖ పెట్టుట.

దుర్బోధలను ఎవ్వరు చేసిరి
లేదా అదృశ్యమ్ముగ నున్న
పిశాచమ్మెలే ఆవహించెనో
నిన్ను పిశాచిగ మార్చిన వేమో!

॥శ్రీరఘురాముడు॥

విపరీతముగా బుద్ధిమారినది
ఇక్ష్వాకువంశమున కొరవియగు నది
అప్రియంబులు పలుకుటెరుగవు
రామభరతులు సమానులంటివి.

ధర్మభీతి ఏమైనది రాణీ!
పరమధార్మికుడు రామచంద్రునికి
పదునాల్గేండ్లు వనవాసమ్మును
విధించుటకు అఘమేమి చేసెను.

కోమలమూర్తి ఆ సుందరుడు
భరతునికన్న నీకుమిన్నగా
సేవలు చేసెను నిను పూజించెను
అడవి కంపుటకు ఏవిధి మనసగు.

వేల సేవకులు స్త్రీ పురుషులును
ఎందరుండిరో ఈ నగరములో
ఒక్కరైనను రామచంద్రునిలొ
తప్పుపట్టిరా! తెలియద నీకు.

ప్రాణికోటిని సంతస పరచును
ప్రియదర్శనుడు రామచంద్రుడు
దీనుల దైన్యము తొలగ జేసెను
గురుశుశ్రూషల మెప్పునందెను.

సకలవిద్యలను నేర్చెను రాముడు
కోదండముతో రిపుల ద్రుంచెను
సత్యవ్రతముతో పుణ్యలోకములు
రామచంద్రునికి లోబడియున్నవి.

సత్యము, దానము, త్యాగము, తపము
స్నేహ పాత్రత శుచిత్వమున్నూ
మూర్తిగ నిలచిన - రాముడే యగును
సురలను ఋషులను పోలును రాముడు

మదిలోనైనా అప్రియమ్మును
రామచంద్రునికి చేయగ లేను
కోసలలో మన పౌరముఖ్యులు
రాముని రాజుగ చేయ గోరిరి.

జనులందరును పాలించ మన
నీవొక్కతెవూ కోరినందుకు
అడవికిపొమ్మని ఎటులచెప్పుట?
లోక హితుడు మనరాముడు కైకా?

విజితేంద్రియుడు త్యాగమూర్తియు
శమ దమాది గుణశ్రేష్ఠుడు రాముడు
నాకు రాముడే దిక్కగు - కైకా!
ముసలివాడ నెటు నే - మనగలను.

జీవయాత్రలో కొసకు వచ్చితిని
రాలిపోదును నేడో రేపో
సమస్తభూమిని నీకు ఇచ్చెద
భయంకరమగు కోర్కెలు వదలుము.

ముకుళిత హస్తము లివి గను కైకా?
నీపదములు నే పట్టు కొందును
రాముని నీవు కనికరించుము
ధర్మహానికి నను గురిచేయకు.''

అనుచు దశరథుడు విలవిలనేడ్చుచు
దుఃఖ సంద్రమున మునిగి తేలుచు
కోర్కెలు తలచుచు కైకను చూచుచు
గుండె పగులునటు ఏడ్చుచుండెను.

విభుని చూచినది మది కరగనిది
కఠినముగా ఆ రాజు తొపలికెను
''ఓ ధర్మాత్మా! వరము లిత్తునని
ఒట్టు పెట్టి మరి దుఃఖము నుండిరి.

ధార్మికులని ఇక ఎటుల చెప్పెదరు
రాజఋషులు మరి తపోధనులును
అడిగిన - మీరే జవాబు నిడెదరు?
మాట దప్పినటు చెప్పకొందురా.

వరము లిత్తునని ఇపుడే చెప్పిరి
మాట తప్పటకు సిద్ధము నుండిరి
ఈ అపకీర్తి మీకే కాదు
రాజ లోకమున కెల్లను చెందును

ధర్మ హానికై సిద్ధ పడితిరి
కౌసల్యకు మరి ఆనందమును
భోగభాగ్యములు సమకూర్చుటకు
యోచనచేయుట నే గ్రహించితి

ధర్మా ధర్మములన్నవి వదలుడు
వరము లిత్తునని బాస చేసిరి
మాటదప్పి రామాభిషేకమును
పూర్తిచేసినచో అసువులు వీడెద.

రాజ మాతగా కౌసల్యమ్మ
ఆనందముగా తిరుగుచుండగా
నేనీ భూమిని ఒకరోజైనా
మనలేనిక నా నిశ్చయమ్మిది.

భరతునిపైన నా ప్రాణముపై
ప్రమాణముంచి పలుకు చుంటిని
వనముకు రాముని మీరు పంపనిచొ
నాకు ముదము కలిగించగ లేరు.''

కటువుగ కైక పలుకుట వినిన
దశరథరాజు బ్రతిమాలుకొన
మిన్నకున్నది కైకాదేవి
మేనువణకెను ఆ మహరాజుకు.

జరిగిన వన్నీ తిరిగెను మదిలో
నిలబడలేక నేలను బడెను
వ్యాధిగ్రస్తునిగ మారిపోయెను
హీనస్వరమునకైకతొ పలికెను.

''కైకా! ఇంతటి దుర్బోధలను
నీకు చేసినది ఎవ్వరు రాణీ!
పిశాచ మేదో ఆవహించెనా
సిగ్గును వదలి పలుకు చుంటివి.

దుష్ట స్వభావము తెలిసితి నేడే
నేను గాని నా రాముడు గాని
నీకు హానిని చేయగ లేదు
నీకే కష్టము కలుగనె లేదు.

భరతునికి మరి నాకును కూడ
మేలు చేయ మనసున్నచొ నీకు -
రాముని వనముల కంపెడి యోచన
వదలి వేయుము కేకయ పుత్రీ!

ఏమియు తెలియని మూర్ఖురాలవు
రాముడు అడవులకేగుట వినినచొ
అతి ధార్మికుడగు భరత కుమారుడు
అయోధ్య నేలడు నీకు తెలియదు.

అడవికి పొమ్మని నేను చెప్పిన
ఆ పసికందు ముఖము వడలును
రాహు గ్రస్తమగు చంద్ర బింబమై
వివర్ణమగును ఆ ముఖబింబము.

మంత్రి పురోహిత సామంతులును
హితులందరును ఆలోచించి
రామచంద్రునికి అభిషేకించగ
నిర్ణయించిరి - సమ్మతించిరి.

అంతటిలోనే పట్టము కట్టుట
రాజ్యమేలుట - వానప్రస్తుడై
అడవి కేగుట ఉదయములోనే
అయిపోయెన? అని పరిహసించరా.

సేనలతో మరి పోరుకు నడచి
రిపు సేనలగని మరలి వచ్చుట
ఎంత హేయమొ - ఇప్పుడు నేను
అభిషేకమ్మును ఆపుట అట్టిది.

కైక కోరిక నెరవేర్చితి నన -
సభలో మాట తప్పుట అనరా
వశిష్టమహర్షి వామదేవుల
సముఖమ్మునసే పలికితి కాదా.

నాల్గు చెరగులరాజులు వచ్చిరి
నే నెటువారిని తిరిగి చూతును
తనయుని దోషము ఏమని అడిగిన
కౌసల్యకు నేనేమని చెప్పెద.

హితురాలిగను తోబుట్టువుగ
తల్లిగ, దాసిగ, సహధర్మిణిగా
సుఖమును కోరే ఆ కౌసల్యను
నీ మూలముగా ఉపేక్షించితి.

సుఖపెట్టితి నిను - వికటించినది
వార్తను వినిన సుమిత్ర ఇంక
నా మాటలను ఎటుల నమ్మును
నన్ను క్రూరునిగా జనులు చూడరా!

రాముడు వనముల కేగుట వినిన
సీత దుఃఖమున, కుమిలి పోవును
హిమగిరి చరియల నున్నకిన్నెరగ
ఆ పుణ్యవతిదుఃఖించును కద.

సీత అట్టుల దుఃఖించుట గని
నా అసువులవి నిలువవు వినుము
నీవు అప్పుడువైధవ్యముతో
తనయునితో ఈ రాజ్య మేలెదవ?

రూపవతి వని భ్రమించినాను
విషపూరిత మగు సురవగుదువు నువు
తనయునమ్ముకొని స్త్రీ సుఖమ్మును
కొనినహీనునిగ నే నైతిని గద.

మద్య వశుడగు విప్రోత్తముని
దూషించినటు నను నిందింతురు
ఉరి త్రాడును నాతోడుగ నుంచితి
పురా కృతమ్మగుదుష్కృతమ్మిది.

నీవు మృత్యువనితెలియక నేను
భార్యగ తలచితినేటి వరకును
పసికందు - పామును పట్టు కొన్నటు
చేర్చు కొంటిని పరమ పాతకివి.

స్త్రీ భోగముకై ప్రియసుతు నైనా
అడవికి పంపిన కాముకుడ నని
మూర్ఖుడ ననుచు మరి మరి జనులు
తలంచి - ఎదుటనె ఈసడించెదరు.

గురు శుశ్రూషలు వ్రత నియమములతో
గార్హస్థ్యసుఖమును అనుభవించని
రాముడు - సుఖపడు రోజులు రాగా
ఇడుమల బెట్టగ సిద్ధ పడితివి.

కానకు పొమ్మన - మరి మాటాడక
ముందుకు సాగును రామచంద్రుడు
ఎదురాడినచో అది మేలగును
కానీ! అంతటి మాట పలుకడు.

నిర్మలమైన మనస్సు నాదని
నమ్మిన రాముడు ఎదురు పలుకడు
పాపిని నేను - రాముడు లేనిచో
అనిశము కుమిలెదఅసువులు వీడెద.

అడవికి రాముడు వెడలి నంతనే
వార్తను విని నే మరణించగనే
కౌసల్య మాత్రముతనువు నిలపదు -
రాముని అడుగులనడచు లక్ష్మణుడు.

ఊరడించుటకు శత్రుఘ్నుడును
దగ్గరలేక సుమిత్ర దేవి
బ్రతుకదు అంతటి ఘోరము జరుగును
నీ వొక్కతివే మనదలచితివి.

కోసల రాజ్యము చెక్కు చెదరక
నిలచి ఉన్నది నేటి వరకును
పాపివి నీవు పరమ పాతకివి
ప్రజా క్షేమమే మరచితి వీవు.

నీ కోర్కెలకుతనయుడు భరతుడు
సరి యనెనా మరి వినుమోకైకా!
ప్రేతకర్మకు వాడనర్హుడు
దుష్టురాలవు శతృవువేయిక.

భర్తృహీనవై బ్రతుకుమునీవు
తనయునితో ఈరాజ్యమేలుము
అఘములందితిని భార్యగచేసుకు
దుర్దశతో నే నల్పుడనయ్యెద.

గజ తురగముల రథముల తిరిగే
తనయుడు రాముడు కాలినడకతో
కారడవులలో చరించవలెనా
కందమూలములు భుజించవలెనా!

నార చీరలతొ కటిక నేలపై
నాతనయుడు కడు ఇడుమలపడడా!
దుర్బోధలు నీకెవ్వరు చేసిరి
ఆహా! అతివలు ఎంతసమర్థులు.

ఆలోచించక అపకారమ్మును
అవలీలగను ఆడది చేయును
అంతస్వార్థము స్త్రీలకున్నది
అంతముకావలె అంతటి అతివలు.

అందున భరతుని తల్లివంటిది
అతిపాపిష్టి అంతముకావలె -
ఏమికీడు నే చేసితికైకా!
ఇంతటి బాధను కలుగజేసితివి.

జగతికి హితవును కోరెడి రాముని
దోషము ఏమితెలియబరచుము
రాముడు ఇడుమల బడినచొ కైకా
జగతి దుఃఖమున మునిగిపోవును.

తండ్రీ కొడుకుల ప్రేమ సన్నగిలు
భార్యాభర్తల ప్రేమ తొలగును -
దేశమంతయు క్షోభించును విను
కటికదాన! నీమనసు కరుగదా.

దేవ కుమారునిపోలు రాముడు -
చెంతనుండ నే బ్రతికియుంటిని
ఇంతటి వృద్ధుడ నైనను నేను.
రాముని చూచిన గెంతి నడచెద.

అయోధ్యలో నా రాముడు లేనిచొ
అడవిగ మారును నగరమంతయు
జీవరాసులు రాముని గొలుచుచు
అడవి అయోధ్యగ మార్చివేయును.

సద్గుణయుతుని దోష రహితుని
వెడల గొట్టుమని కోరికకోరిన
నీ దంతములు వేయిముక్కలై
నేలరాలును పరమ పాతకీ!

దుష్టురాల నీ కోర్కెలు తీర్చను
నిప్పుల దూకి నాశనమగుము
సౌధమునుండి నేలకు దూకుము
గుండె పగులగా రోదించుము నువ్వు.

ప్రేమనటించే ఘాతకి వీవు
వంశ నాశనివి - విషపు కత్తివి
నాగుండియను దహించినావు
నీవుమనుట నే సహించలేను.

తనయుడు లేక బ్రతుకను కైకా
రాముడులేక నే మనలేను
పదములంటెద అనుగ్రహింపుము''
అనుచు వణకుచు తూలెనురాజు.

॥శ్రీరఘురాముడు॥

✤✤✤

# 13 దశరథుని దీనావస్థ

కైక మనస్సు కరుగక పోయెను
కోరికలను తను వదలకపోయెను
కోమలమూర్తిని అడవికి పంపగ
కఠినముగా మహరాజుతొ పలికెను.

'' ఓ మహరాజా! సత్యవర్తినని
తమరే నిరతము చెప్పుకొందురు
బాస చేసియు వరము లిచ్చుటకు
ఏల మీరువెనుకాడుచుండిరి.''

సూటిగకైక పలుకుచుండగా
క్రోధవశుడయిదశరథరాజు
కైకను తిట్టెను - ''మహాపాతకీ!
ఎంతటి శత్రుత్వమును పూనితివి.

ఎంతటి క్రౌర్యమునీలోనున్నది
రాముని పంపి నన్నిట చంపి
ఆనందముగారాజ్యమేలుము
అన్ని సుఖములు అనుభవించుము.

అహా దైవమ! నాకము చేరియు
నా కక్కడ మరి సుఖములుండవు
రాముని గూర్చి సురలడిగినచో
విషయము చెప్పిన పరిహసించరా!

మాట నిలుపుకొన వరము లిడితినన
''నీవే రామునికిచ్చిన మాట -
అభిషేకింతును అను వాగ్దానము''
వమ్మైపోయెనుఅని దూషించర!

పుత్రులులేక పరితపించితిని
పుణ్యవశమున యాగము చేసితి
పుణ్యమూర్తి నా రాముడు పుట్టెను
పుడమి పునీతము చేయగపుట్టెను.

సర్వ విద్యలలొ ఆరితేరెను
శమ, దమ, క్షమాది సద్గుణములతో
విజితేంద్రియుడు సుందరమూర్తిని
కమల పత్ర నేత్రమ్ముల రాముని.

ఆజానుబాహుని ఆనందమూర్తిని
అడవులకంపి నేమనగలనా
అంతటి కష్టమురాకపూర్వమే
నేనీ తనువును వదలుట మేలు.

మదిలో వ్యథతో కుమిలెను రాజు
వలవల ఏడ్చెను నింగిని చూచెను
వశము తప్పి ఆ శశిని చూచుచు
ప్రొద్దే పొడవగ రాదని కోరెను.

'' ఓ నిశిరాత్రమ! శుభముల రాశివి
అట్లే నిలబడు - తెల్లవారకు
నమస్సులివిగో నను కరుణించుము
కాదంటివ నువూ కటికదానవే.

మొర వినకున్నచొ తెల్లవారిపో
తెల్లవారు నా జీవిత మింక
క్రూరురాలను చూడగలేను''
అనుచు దశరథుడు మ్రొక్కె నిశీధికి.

మనసు కరుగునని మదిలో తలచి
మంచిమాటలు పలికెనుకైకతో
"మంగళకారివి! నా హృదిరాణివి
నాపై గురిగల యిల్లాలివి నువు.

సత్యవ్రతముతో జీవించితిని
ఎంతోకాలము ఇక జీవించను
సభా మధ్యలో ప్రకటించితిని
ఆడితప్పినటు లోకులాడరా.

వరముగ రాజ్యము నొసగెద నీకు
నీవే రాముని కప్పగించుము
భరతుడు ఎన్నడు ఎదురు చెప్పడు
చల్లగ చూడుము భరతుని తల్లీ!

భరతుడు మదిలో ఆనందించును
గురువులు, మంత్రులు, జనులందరును
నిను పూజింతురు యశము పెరుగును
శాశ్వతమైన కీర్తి నిలచును."

అనుచు దశరథుడు కంటనీటితో
అనేక విధముల వేడెనుకైకను
అతివ మనసు ఇసుమంతయు కరుగక
అంతకంతకు కఠినమైనది

రాత్రి గడచెను - వైతాళికులు
మేలుకొలుపులు పాడ సాగిరి
దుఃఖమునున్నఅయోధ్యరాజు
పాటల నాపగ నాదేశించెను.

॥శ్రీరఘురాముడు॥

# 14 దశరథుడు రాముని పిలువనంపుట

ధుంఖజలధిని మునిగిన రాజు
నేలను బడెను పొర్లసాగెను
రాజును అటుల గాంచిన కైక
ధర్మబద్ధునిగ చేయగ పలికెను.

"బాసచేసి మీ రపరాధివలె
కృంగిపోవుటకు కారణమేమి?
ధర్మముకన్న గౌరవమే మరి
మిన్నయైనచో అటులే చేయుడు.

ధర్మచరితులని తెలిసిన నేను
వరము లడిగితిని, సరియంటిరి కద!
మీకు తెలియనిధర్మము కలదా!
మహాపురుషుల విషయము తెలియద.

పావురమ్మును కాపాడుటకై
మాట యిచ్చిన శిబిమహరాజు
తనువును కోసి డేగకిచ్చెను
మాట విలువ - ఆ మహరాజెరుగును.

అలర్కరాజు ఆడినమాటగ
వేదవిదుడగు విప్రోత్తమునికి
రెండు కండ్లను పెరకి ఈయగా -
మాట నిలుపుకొని యశమునందడా.

నదులన్నిటికీ నాయకుడైన
సత్యవ్రతమున నిలచిన కడలి
చెలియలికట్టను దాటక నిలచెను
భూమిని జలముతొనింపకున్నది.

ఓ భూనాయక సత్యము మాత్రమె
క్షరము కానిది బ్రహ్మమైనది
ప్రణవ మంత్రమగు ఓంకార మది
ధర్మము అదియే జగతికి మూలము.

సత్య వర్తనము పురుషార్థమ్మని
వేదములే మరి చెప్పు చున్నవి
ధర్మ చింతనలొ చెదరక యున్నచొ
సత్యము తప్పరు - తప్పకూడదు

వరములు నొసగుడు, వ్యథ వలదింక
రాముని వనముల కంపుడు శీఘ్రమె
మాట తప్పినచొ నే మన నింక
మీ ఎదుటనె నే అసువులు వీడెద.''

వామనునకు మాటిచ్చిన బలివలె
దశరథరాజు వరముల నిచ్చి
ధర్మపాశమున బిగుసుకు పోయెను
ధర్మ శకటపు వృషభ మాయెను.

కన్నులు తిరిగెను నోరు ఎండెను
గుండియ వేగము పెరిగి పోయెను
బలవంతముగా అరచెను రాజు
''పాపీ! నిన్ను పరిణయ మాడితి

అగ్ని సాక్షిగా నాడు గ్రహించితి
నేడు నిన్ను నీ తనయుని తోడ
పరిత్యజించితి- భార్యవు కావు
భరతుడు ఇకపై తనయుడు కాదు.

రామా భిషేకపు సంబారములతొ
ఉత్తర క్రియలను నాకు జ్యేష్ఠుడగు
రామచంద్రుడు చేయగ వలెను
నీ కుమారునికి అర్హత లేదు.''

అనుచు దశరథుడు బాధగ పలుకగ
రోషము పెరిగి కైక పలికినది
''రాజా! మీరిటు పలుకుట తగదు
కర్తవ్యము - నా వరములు తీర్చుట.''

ఆ మాటలకు దశరథ రాజు
ఆగ్రహమంది కైకతొ పలికెను
''ధర్మపాశమున బద్ధుడ నైతిని
రాముని రమ్మను - చూడ గోరితిని.''

నింగిని భానుడు నిద్ర లేపెను
తూరుపు దిక్కున వెండి పూసెను
పుష్యమి తారలొ రామచంద్రునికి
అభిషేకమ్మని ఆనందించెను.

రాజవీధులు శుభ్ర పరచిరి
రంగుల పూలతొ అలంకరించిరి
పతాక లెత్తిరి పరవశించిరి
సుమ హారములతొ తీర్చి దిద్దిరి.

అంగళ్ళెన్నో తెరిచిరి నగరిని
చందనాదులతొ సుమ గంధములతొ
శోభిల్లినది అయోధ్య యంతయు
వేడుక చూడగ వచ్చుచుండిరి.

వశిష్ఠమహర్షి శిష్యగణముతో
సరయూనదిలో స్నానముచేసి
అభిషేక ద్రవ్యములు సమకూర్చుకొని
ప్రాసాదమున అడుగు బెట్టెను.

రాజభవనము కళకళ లాడెను
వేదఘోషను ఆరంభించిరి
రాజులు ముఖ్యులు చేరి రచ్చట
పక్షులు శుభముగ కూయ సాగెను.

అచటకు వచ్చిన సుమంత్రు గాంచి
వశిష్ఠమహర్షి పలికెను మంత్రితో
''అభిషేకమునకు సర్వము సిద్ధము
మన మహరాజును తోడ్కొని రమ్ము.

శుభ ముహూర్తము దగ్గర పడెను
తోడ్కొని రమ్ము అయోధ్య రాజును''
ఆ మాటలకు సుమంత్రు డపుడు
ఆనందముగా ముందుకు సాగెను.

అంతఃపురమున అతి చనువుగను
తిరుగ జాలిన సుమంత్రు డపుడు
దశరథ రాజును తోడ్కొని రాగా
కైక మందిరము లోనికి పోయెను

రాజు అవస్థను తెలియని మంత్రి
శయ్యాగృహముకు వెలుపలి నుండి
శుభములు పలికెను దశరథ రాజుకు
వినయము నిండి పలికెను ఇటుల

''ఓ మహారాజా! ఏలుము మమ్ము
చంద్రో దయమున పొంగు కడలి వలె
సంతోషముతో మేలుకో వలె
శుభ సమయము ఆసన్న మయినది

సురపతి ఇంద్రుని మాతలి లేపెను
అంతటి భాగ్యము నాకు కలిగెను
బ్రహ్మవలననే వేదము పుట్టెను
వేదము లన్నీ బ్రహ్మను చెప్పెను.

ఓ మహరాజా! మేలుకో ఇక
శుభకారిణి యగు పృథ్వీ మాతను
ఉదయాస్తమయపు సమయము లందు
సూర్యచంద్రులు నిద్రలేపెదరు

భాగ్యవశమున నేను మిమ్ములను
మేలుకొలుపగా వచ్చితి రాజా!
మేల్కొని మంగళకరముగ మీరు
అలంకరించుకు బయలుదేర వలె

ఉదయాద్రిని రవి వెలుగునట్లుగా
వెలుగులుచిమ్మే దేహకాంతితో
ఇనకుల శ్రేష్ఠా! దశరథ రాజా!
పేరోలగమున అడుగు బెట్టుడు

సూర్యచంద్రులు అగ్నిహోత్రుడు
శుక్రవైశ్రవణులు - వరుణదేవుడు
ఉమాశంకరులు రక్షయె మీకు
నిద్రలేచి మమ్మేలు కోవలె!

అభిషేకమునకు వలయు కార్యములు
పూర్తియైనవి ఓ మహరాజా!
వశిష్ఠమహర్షి - విప్రోత్తములు
రాజులు ముఖ్యులు వేచి యుండిరి

సభలో తాము లేక పోవుటచె
శశిలేనట్టి నింగిగ నున్నది
సేనాధ్యక్షుడు లేని సేన వలె
కాపరి లేని గొఱ్ఱెల మందగా

ఆబోతులేని దగు ఆలమందగా
వెలవెల బోవుచున్నది ఆ సభ
రాజు - కంటికి కనబడకున్నచొ
అరాచకమ్మగు, మేలుకొనుమయా

దర్శన కాంక్షులు అయోధ్యవాసులు
తహతహ లాడుచు వేచి యుండిరి
అభిషేకమునకు అనుజ్ఞనీయుడు
అతి తొందరగా అరుదెంచుడయా.''

అనుచు సుమంత్రుడు ఉచిత రీతిగా
వినయము భక్తి నిండి పలికెను
ఆ మాటలు విని దశరథ రాజుకు
మరింత దుఃఖము ఎగసి పడినది.

జ్యోతులవోలె కన్నులుండగా
హృదయ మప్పుడు జ్వలించు చుండగ
దీనముగా నట పలికెను రాజు
మేలుకొలుపులు-హృదయ శల్యమనె.

జాలిగొలిపెడి పలుకులు వినెను
రాజును చూడగ లోనికి బోయెను
ముందుకు నడువగ సందేహించి
కరములు మోడ్చి నిలచి యుండెను.

అంతటిలోనే కైక వచ్చెను
సుమంత్రు గాంచి పలికె చతురముగ
''మంత్రిపుంగవా! మన మహరాజు
నిద్ర మరచెను రాముని తలపుతొ.

శీఘ్రమె మీరు రాముని ఇచటకు
తీసుకురావలె, నే నుడివితిని -
మారు యోచన చేయక మీరు
మరలిరండు మన రాముని తోడ్కొని.''

ఆ విధముగను కైక పలుకగా
అశుభమేమియు లేదని తలచెను
ఆమె మాట రాజాజ్ఞగ తలచెను
ఆనందించి ముందుకు నడచెను.

కడలి మధ్యలో సుడిగుండమది
వెలువడి నట్లు సుమంత్రు డపుడు
కైక మందిరము నుండి వెడలెను
రాముని చూడగ బయలు దేరెను.

ద్వారమువద్ద భక్తిప్రపత్తుల
విలువగు కానుకలెన్నో తీసుకు
రాజభక్తులు వేచి యుండిరి
వారందరిని గాంచె సుమంత్రుడు.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 15 సుమంత్రుడు రామ మందిరములో ప్రవేశించు

సూర్యోదయము దాటిన పిమ్మట
పుష్యమి తారలో రామచంద్రుని
జన్మలగ్న మగు కర్కాట లగ్నమున
అభిషేకమ్మును నిర్ణయించిరి.

వేద విదులగు విప్రోత్తములు
రాజభవనమున రాత్రి యంతయు
అభిషేకమునకు వలయు విధులను
నిర్వహించుచు వేచియుండిరి.

మేడికఱ్ఱతో చేసిన యట్టి
భద్రపీఠమును సిద్ధపరచిరి
ఆ పీఠముపై రామచంద్రునికి
శాస్త్రోక్తముగా అభిషేకింతురు.

సింహాసనమును అలంకరించిరి
వ్యాఘ్ర చర్మమును పరచిరి పైన
రథము, పల్లకి సిద్ధ పరచిరి
పుణ్య తీర్థములు తెచ్చి ఉంచిరి.

గంగా యమునల పుణ్యజలమ్ము
సంగమ మందలి పవిత్ర జలములు
నదీ నదముల పుణ్య తీర్థములు
కడలి జలములు తెచ్చిరి అపుడు.

తెచ్చిన యట్టి పుణ్య తీర్థములు
బంగరు వెండి బిందెల నింపిరి
రావి ఆకులు కలువ తామరలు
జలములనుంచి భద్రపరచిరి.

నెయ్యి, తేనెలు, లాజలు, పెరుగు
పాలు, పూలు, దర్భలు తెచ్చిరి
నవ ధాన్యములు నవ రత్నములు
ఖడ్గ చాపములు సిద్ధపరచిరి.

బంగరు పిడులతొ మణులు పొదిగిన
చామరంబులు తెచ్చి యుంచిరి
శశికాంతులవలె చల్లగ వెలిగే
శ్వేత ఛత్రమును తెచ్చి ఉంచిరి.

ధవళకాంతి గల ఆబోతులును
తెల్లగమెరిసే గుఱ్ఱము తెచ్చిరి
గిరివలె నున్న కరిని తెచ్చిరి
మద జలమ్ము నది విడచు చున్నది.

వృషభమ్ములును, మృగములు, పక్షులు
వలయు నట్టివి తెచ్చి యుంచిరి
అగ్ని హోత్రమును వేదిక నుంచిరి
ఎనిమిది మంది కన్యలు వచ్చిరి.

వీణావేణు మృదంగ వాద్యములు
వంది మాగధులు సూతు లుండిరి
సాంప్రదాయమును అనుసరించుచు
కానుక లందుకు వచ్చిరి భక్తిగ.

సామంతులు అతి వినయము నిండి
వేచి యుండిరి ద్వారము వద్ద
ప్రొద్దు గడచుచు నుండెను గాని
రాజదర్శనము లభించలేదు.

అంతటి లోనే మంత్రి సుమంతుడు
వెలుపలకడుగిడి సామంతుల గని
''రాముని పిలవగ పోవు చుంటిని
రాజు ఆనతిని శిరసున దాల్చితి.

రాజ భక్తులు మీరందరును
వేచి యుండిరిట ఈ విషయమ్మును
దశరథరాజుకు చెప్పివచ్చెద
దర్శన భాగ్యము కలిగించెదను.''

అనుచు సుమంత్రుడు లోనికి బోయెను
దశరథవిభుని దరికి చేరెను
తిరిగి స్తోత్రమును ప్రారంభించెను
'ఓ మహరాజా! తెల్లవారెను

సామంతరాజులు వేచి యుండిరి
కానుకలందుకు వచ్చిరి రాజా!
విప్రులు, మంత్రులు చూచు చుండిరి
మేలుకోవలె అయోధ్యాపతీ.''

ఆ మాటలకు దశరథరాజు
సుమంత్రునితో పలికె నప్పుడు
''అమాత్యశేఖర! నిద్ర ఎరుగను
రాత్రి పూర్తిగా మేలు కొంటిని

రాముని తోడ్కొని రమ్మని కైక
ఆదేశించెను అది నా ఆజ్ఞ
పరిపాలించక మరలి వచ్చితివి
మరలిపొమ్ము నారాముని గొనిరా.''

ఆ మాటకు సుమంత్రుడప్పుడు
అభిషేకపు ఆనందము నిండి
అరదమునెక్కి బయలు దేరెను
రామచంద్రుని తోడ్కొనిరాగా

అభిషేకముకై తహతహలాడే
ప్రజల ముచ్చటలు వినుచు సాగెను
మంగళ శోభలు చూచుచు సాగెను
పొంగిన ఆనందముతో సాగెను.

రాముడు రాజై తమను ఏలగా
కలిగెడి శుభములు తలచెడి జనులు
రామచంద్రుని ప్రశంసించుట
ఆనందముగా వినెను సుమంత్రుడు

మేరుపర్వతపు గుహను పోలిన
భవనము లోనికి అరదము సాగెను
కైలాసమును పోలెడి సదనము
రామభవనమట వెలుగు చున్నది.

మేరుగిరి వలె ఎత్తుగ నున్నది
దుర్ధర గిరివలె గుబాళించుచు
ధనపతి భవనము వలె శోభిల్లుచు
ఇంద్ర భవనమై ఒప్పెను సదనము.

వెలుపలి ద్వారము ఎత్తుగ నున్నది.
ద్వారబంధములు రత్నమయములై
బంగరుపూలతొ తోరణాలతో
స్వర్గ సమముగా నిలచెను భవనము.

తోరణాలలో మధ్యలొ వెలిగే
ముత్యపు మాలలు చంద్ర కాంతితో
సూర్య కిరణముల శోభలు నిండి
తళుకులీనెను మనోహరముగా

భవన శిఖరమున బంగరు మూర్తులు
గోడల అందము లొలుకు చిత్రములు
తలుపులపైన చెక్కిన లతలు
కన్నులపండుగ చేయు చుండెను

సారస పక్షలు పాడు చుండెను
ఆటలాడుచు నెమళు లున్నవి
వచ్చెడి వారికి స్వాగత మన్నటు
ముచ్చటగా ఆ పక్షులు కూయును.

పెంపుడు మృగములు గంతులేయుచు
నేత్రపర్వము చేయు చున్నవి
దాసీజనము ముదముగ నుండిరి
దేవ సదనమును పోలెను కక్ష్యలు.

అరదము పైన లోనికి సాగెను
మూడు కక్ష్యలను దాటుచు సాగెను
అలంకారముల గజ తురగముల
రథముల పైన వీరు లుండిరి.

అమాత్యు లుండిరి రాముని చూడగ
అయోధ్య ముఖ్యులు వేచి యుండిరి
రాముని ఆనతి పరిపాలించగ
నిలచి యుండిరి యువకు లందరు

సుమంత్రు డపుడు వారల గాంచి
వందనములిడి అభినందించెను
సంతోషముతో మనసు పొంగెను
ముందుకు సాగెను రాముని చూడగ.

అంతఃపురమున కెదురుగ నచ్చట
నల్లని మేఘము పోలెడి ఏనుగు
గిరివలె ఉన్నతమైన గజమది
''శత్రుంజయము'' నిలచి యున్నది.

అంకుశమ్మునకు లొంగని గజమది
అలుపునెరుగక పరుగిడు గజమది
రామచంద్రుని కొరకై యున్నది
చూచి సుమంత్రుడు పులకితుడాయెను.

ధగధగలాడే గిరి శిఖరమువలె
ఏడంతస్తుల రామ సదనమున
నదీగర్భమున మొసలి సాగినటు
ముదముగ సాగెను మంత్రి సుమంత్రుడు.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 16 శ్రీరాముడు దశరథుని సందర్శించుటకై బయలుదేరుట

రామచంద్రుని దర్శనార్థమై
లోనకు సాగిన మంత్రి సుమంత్రుడు
రాకను తెలుపగ వార్త నంపెను
సందడిగా ఆ భవనమున్నది.

అంతఃపురమున అడుగుబెట్టెడి
చనవు కలిగిన మంత్రి సుమంత్రుడు
దశరథవిభునకు ఆంతరంగికుడు –
భటులు సేవకులు వందన మిడిరి.

సతితో రాముడు కూర్చొని యుండెను
ఆ సమయమున వార్త చేరెను
వెంటనె రాముడు మంత్రి సుమంత్రుని
లోనికి రమ్మని ఆనతిచ్చెను.

ధనపతి వలె శ్రీరామచంద్రుడు
స్వర్ణాసనమున తేజరిల్లెను
దివ్య చందనము నలదిన మేను
దయా వీక్షణము కలిగిన కన్నులు.

సుగంధ పరిమళ మా సుకుమారుని
మేన తాకుచు మురిసి పోయెను
మంగళకారిణి సీతాదేవి
వింజామరను వీచుచున్నది.

చిత్రా తారలొ చంద్రుని వలెను
రామచంద్రుడు దర్శన మిడెను
పరవశించిన మంత్రి సుమంత్రుడు
వినయము నిండి వందన మిడెను.

కుశలము నడిగి మంత్రి పలికెను
''కీర్తిమంతుని బడసిన తల్లి
కౌసల్యమ్మ పుణ్యచరిత్ర''
అనుచు తెలిపెను! వచ్చిన విషయము.

''కైకాదేవియు మీ జనకులును
మిమ్ము చూడగా ఆదేశించి
తోడ్కొని రమ్మని పంపిరి నన్ను
శీఘ్రమె మీరు బయలు దేరుడు.''

వార్తను వినిన రామచంద్రుడు
సీతను చూచి పలికెను అపుడు
''పట్టాభిషేకము తెలిసి యుండును
యోచన చేయుచు నుండవచ్చును.

తండ్రి నిర్ణయము తగినదియనుచు
కైకాదేవి సంతస పడును
అభిషేకముకై భర్తను తాను
తొందరచేసెడి పుణ్యచరిత్ర.

భర్త మాటపై గురిగల భార్య
కేకయరాజుకు పుత్రిక ఆమె
నిరతము నాకు హితమును కోరును
నా ఉన్నతిని తలంచు నామె.

మేలుకోరెడి మాత కైక యగు
యశము తెచ్చెడి యోచన చేయును
ప్రజాపాలనము నప్పగించును
శీఘ్రమె పోయి దర్శించెదను.''

ఇపుడే వత్తును అనుచు రాముడు
మెడలోదండను సీతకు వేసి
సంతస పరచి బయలు దేరెను
భర్తకు శుభమును పలికెను సీత.

''బ్రహ్మదేవుడు సుర నాయకుని
అభిషేకించెను - అటులే తండ్రి
యువరాజుగ మిము అభిషేకించును
ఆపై అయోధ్య ఏలిగ చేయును.

రాజసూయమును చేయు దీక్షతో
కృష్ణాజినము కురంగ శృంగము
ధరించి - దర్శనమిడు సమయమున
మిము పూజించెడి భాగ్యము నొసగుడు.

నాల్గు దిక్కులలొ దిక్పాలకులు
ఇంద్ర, వరుణ, యమ, కుబెరులనిశము
మహాత్ము లందరు అనవరతమ్ము
మీకు రక్షణ నొసగెదరనఘా!''

అనుచు పలుకుచు అవనిజ అచ్చటి
ద్వారము వద్దకు వచ్చెను భక్తిగ
నిలబడ మనుచు ఆశీస్సుల నిడి
రాముడు ముందుకు సాగెను ఠీవిగ

గుహలో నుండి వెడలు సింహమన
ధీరో దాత్తుడు నడువ సాగెను
అన్న సేవకై అంకితమైన
అనుజుడు లక్ష్మణు డనుసరించెను.

అభిషేకము గన అట కేతెంచిన
అమితోత్సాహులు అభిమానులను
ఆనందముతో రాముడు గాంచెను -
అది ధన్యతయని మురిసి పోయిరి.

మణులు తాపిన వెండి రథమది
మంగళ శోభతొ వెలిగే తేరు
రవి కిరణములన ధగధగ లాడుచు
నిలిచియున్న దట రాముని కొరకై.

దివ్యరథముపై ఇంద్రు డున్నటు
రామచంద్రుడు రథము నెక్కెను
ఛత్రము పట్టిన లక్ష్మణమూర్తి
వింజామరను వీచు చుండెను.

సుమంత్రుడపుడు రథమును తోలగ
ముందుకూర్చొని వదలె పగ్గములు
మహేంద్రగిరిపై పూర్ణశశి వలె
మహిత రథమది ముందుకు సాగెను.

సింహ నాదమును చేసిరి శూరులు
వందిమాగధులు స్తోత్రము చేసిరి
వాద్యఘోషలు నింగి కెగసినవి
ఆయుధాలతో వీరులు నడచిరి.

అరదమ్ములపై గజ తురగమ్ముల
పౌర ముఖ్యులు రాజ ప్రతినిధులు
రాముని రథమును అనుస రించిరి
రామ మయముగా నుండెను సర్వము.

సింగారములతొ సుందరాంగనలు
పూలవానలు కురిపించి రట
పుణ్యస్త్రీలు మరి కొందరప్పుడు
రాముని అరదము కెదురు వచ్చిరి.

''కౌసల్యా ఆనందవర్ధనా!
కలుగును శుభములు సుందరమూర్తీ
యువరాజుగ నువు మమ్మేలు మయా!
నిను గని తల్లి పొంగిపోవును.

హృదయచంద్రిక సీతాదేవి
సువాసినులలో సిరిగల స్త్రీయై
నిను చేరినది - తపస్సు ఫలమది
రోహిణి, చంద్రుల పోలిన జంట

జయము కలుగును ధర్మ స్వరూపా!''
అనుచు శుభములు పలికిరి అతివలు
ఆశీస్సులను రాముడు వినెను
అరదము సాగెను రాజవీధిలో
॥శ్రీరఘురామ॥

❋❋❋

# 17 రాజవీధిలో రాముని దర్శనము

రాజవీధిలో రథము సాగెను
రథమున రాముడు వెలుగు చుండెను
చూడ వచ్చిన జనులు భక్తితో
నమస్సు లిడుచు త్రోవ ఇచ్చిరి.

జన సందోహము నిండి పోయెను
పరిమళ వాయువు వీచు చుండెను
ఇరువైపులకు అంగళ్ళుండెను
అందు లెక్కలకు అందని సరుకులు.

పట్టు వలువలు గుట్టలు గుట్టలు
నూలు బట్టలు లెక్కకు చిక్కవు
స్ఫటిక, రత్నములు, ముత్యపు రాసులు
భక్ష్య, భోజ్యములు, పరిమళ దినుసులు.

పూల దండలు పూజా దినుసులు.
పరిమళమ్ములు దిక్కుల కెగయగ
విప్రోత్తముల ఆశీస్సులను
వినుచు - రాముడు రథమున సాగెను.

రాజవీధులలో జనులందరును
రాముడు రాజై ఏలును అనుచు
రామ రాజ్యమున లోటు ఉండదు
రండి రండని పిలచు చుండిరి.

పౌర ముఖ్యులును పెద్దలు కొందరు
రాముని రథమున కెదురు వచ్చిరి
ముదముగ పలికిరి ఆశీస్సులతో
''రామా! రాజై ధర నేలెదవు.

తాత ముత్తాతల ఏలు బడిని నువు
మరపించు నటు మమ్మేల వలె
అన్నము కన్నను మిన్నగు కోరిక
పట్టాభిషేకము కన్నుల గాంచుట.

పట్టాభిషేకము మించిన వేడుక
మరియొక టసలే లేదు రాఘవా!
మే మందరము వేచి యుంటిమి''
అనుచు భక్తిగా పలికిరి వారు.

జనుల పొగడ్తకు పొంగడు రాముడు
నిర్లక్ష్యముగా చూడడు వారిని
వారికి తగినటు బదులు పలుకుచు
వారి మదికి మరి ముదము గూర్చెను.

రాముని ఎవ్వరు చూడగ లేరో
రాము డెవ్వరిని తాను చూడడో
అట్టివాడు మరి లోక నిందితుడు
అతని ఆత్మ నిందించు నతనిని.

రామునిరథము ముందుకు సాగెను
రాజ వీధిలో సాగిన రథము
దూరముగానది సాగుచున్నది
ప్రజా హృదయమున పదిలము నున్నది.

కైలాస గిరివలె ఎత్తగు భవనము
"వర్ధ మానమను" దివ్య భవనము
దశరథ విభుని మందిరమ్మునకు
రాముని రథము వచ్చి చేరెను.

రాముని తెలియని పౌరుడు లేడు.
రాముడెరుగని వారు లేరట?
ఆదరించుచు గౌరవించుచు
అందరి మనసుల రాముడు నిలచెను.

కావలి భటులను దాటుచు నరదము
మూడు కక్ష్యలను అధిగ మించెను
అరదము దిగెను రామచంద్రుడు
పాదచారియై నడువ సాగెను.

దేవాలయములు - మందిరమ్ములకు
సభాభవనములు చైత్యములకును
ప్రదక్షిణించి రథము సాగెను
దశరథ విభుని సదనము చేరెను.

వెంట వచ్చెడి హితు లందరినీ
ఆగిపొమ్మని ప్రియముగ చెప్పి
రెండు కక్ష్యలు నడిచి సాగెను
అంతఃపురమున ప్రవేశించెను.

చంద్రోదయమున కెదురు చూచెడి
మహాజలధి వలె జన సమూహము
రాముని రాకకు వేచి యుండిరి
రాముని కన్నుల నిలపి యుంచిరి.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 18 వరముల విషయము, వనవాసము కైక తెలుపుట

కైకా దేవి నిలబడి యున్నది
పాన్పుపైన మహారాజు వుండెను
కాంతులు తరిగి దైన్యము గొలుపుచు
దశరథ విభుని వదన మున్నది.

కంటి నీటితో కనులు విడకను
నోటి మాటలు పెగిలి రాకను
తండ్రి వ్యధ నటు మ్రింగు చుండగా
కలవర పడెను రామచంద్రుడు.

తండ్రికి, రాముడు ప్రణామ మిడెను
పిమ్మట కైక పదముల నంటెను
'రామా' అనుచు పిలచెను రాజు
కన్నుల నీరు ధారగ వెడలెను.

అట్టి స్థితిలొ తన తండ్రిని చూచుట
అదే ప్రథమము రామచంద్రునికి
పామును త్రొక్కిన వాని మాదిరి
కలవర పడెను రామచంద్రుడు.

రాహు గ్రస్తమగు సూర్య బింబమై
రాజు దేహము కుమిలి యున్నది
కాంతులు తరిగి కనబడు చున్నది.
ఇంకెడి వారిధి అనినట్లున్నది

అనృత మాడిన మహాఋషి వలె
వెలవెల బోవుచునున్నది వదనము
ఊహకు చిక్కని దుఃఖమూర్తిని
తన జనకునిలో చూచెను రాముడు.

పర్వ సమయమున కడలి తీరుగా
రాముని హృదయము కల్లోలమయె-
ఆవేదనను అణచుకు రాముడు
ఆప్యాయముగా అడిగెను తండ్రిని.

''తండ్రీ! మీరు దుఃఖ పడుటకు
కారణమేమి తెలియ బరచుడు.
అభినందించే సమయములోన
ఆవేదనతో నుంటిరి ఏల?

నన్ను చూడగా కోపము వదలి
ప్రసన్న మయ్యెడి ప్రేమమూర్తులే
కానీ నేడు, నను గని మీరు
దుఃఖించుటకు హేతువు ఏమి.''

ఆ ప్రశ్నకు శ్రీరామచంద్రునికి
సమాధానము అందక పోయెను
ధైర్యము చెదరెను మనసు కలతపడి
కైకకు వందన మిడుచు పలికెను.

''అమ్మా నేను అజ్ఞానముతో
ఏ అపరాధము చేసినాడను?
ఇంతటి కోపము తండ్రికి కలిగెను
కోపము తీర్చి ప్రసన్నుని చేయుము.

తండ్రిగారు నను పలుకరించరు
కనికరించి నావంక చూడరు
మదిలో స్వస్థత లేదా తల్లీ!
శారీరక మగు రుగ్మత కలదా.

వ్యాధిలేక మరి ఎల్లకాలము
ఒక్క మాదిరిగ వుండుట కష్టము
భరత శత్రుఘ్నులు సేమమే కదా
తుల్లులందరు సుఖముగ నుండిర.

తండ్రి మాటకు ఎదురు చెప్పను
జన్మ నిచ్చిన జనకుడు తండ్రి
కనబడు దైవము తండ్రే యగును
తండ్రి కోపమున నే మన లేను.

నీ అభిమానము దెబ్బ తిన్నదని
నీవే మైనా అంటివ తల్లీ!
మనసు కష్టపడి ముఖము కమిలెను
ఈ రూపము నే చూడలేను కద.''

అటుల రాముడు పలుకు చుండగా
భర్త దుఃఖము మదిలో తలచక
కైక పలికెను రామచంద్రునితో
అతి తేలికగా అరంభించెను.

''రామా! వినుము మీ జనకునికి
కోపము లేదు దిగులును కాదు
ప్రేమ నిండిన తనయుడ వీవు
నీ కప్రియము చెప్పగ లేరు.

పూర్వకాలమున నీదు జనకుడు
నన్ను మెచ్చుకొని వరము లిచ్చిరి
రెండు వరములు బాస చేసిరి
అవి యిచ్చుటకై దుఃఖము నుండిరి.

పామరుని వలె కుములు చుండిరి
గత జలమునకు సేతువు కట్టగ
యోచన నుండెను మన మహరాజు
సత్యమె కాదా ధర్మ హేతువు.

సర్వ ధర్మముల మూలము సత్యము
అనుచు పెద్దలు చెప్పిరి రామా!
తెలియుము నీవు నీ విషయమున
నాపై- ప్రభువుకు వచ్చెను కోపము.

ధర్మ హానికై సిద్ధపడిరయా
నీవు – వారిని కాపాడ వలె
నీ కప్రియమును కలిగిన గాని
బాసచేసిన వరముల నిడవలె.

వరముల వలన కీడు గలిగినను
శిరసున దాల్చెద నన్న మాటలు
నీవు పలికినచొ నేనే చెప్పెద
మాట పోవునని మధన తండ్రికి.

తండ్రి శపథమును నెర వేర్చెద నని
నీవు శపథమును చేయుము రామా!
అటుల చేసినచొ నేనే చెప్పెద''
అన్నది కైక గడసరి పలుకుల.

ఆ మాటలకు రామచంద్రుడు
వ్యథతో కుమిలి పలికెను తల్లితొ
''అమ్మా ఎంతటి మాట పలికితివి
నన్నా నీవు శంకించుటది.

అమ్మా! ఏల బ్రతికి యుండుట
నీకు తెలియనటు పలుకు చుంటివా
తండ్రికొరకు నే అగ్నిని పడనా
విషము ముదముగ స్వీకరించనా.

తండ్రి కొరకు నే కడలిని దూకెద
దశరథ ప్రభువు నాకు జనకుడు
గురువే ఆయన – ఏలెడిరాజు
ఆయన ఆనతి శిరో ధార్యము

తండ్రి చెప్పినటు నేను చేయ వలె
తప్పక నేను చేసెదనమ్మా!
రెండవ మాట రాము డెరుగడు
రెండు నాలుకలు లేవు రామునికి.

అది విని కైక ధైర్యము తెచ్చుకు
రామచంద్రునికి సర్వము తెలిపెను
పూర్వ కాలమున జరిగిన గాథ
దేవాసురసంగ్రామపు సంగతి.

''రామా అప్పటి యుద్ధములోన
శరఘాతమునకు దశరథ విభుడు
బాధ నందిన సమయము లోన
రెండు మారులు రక్షించితిని.

దశరథ ప్రభువు మెచ్చెను నాడు
ఇచ్చెను రెండు వరములు నాకు
భరతుని పట్టము - నీ వనవాసము
కోరితి నప్పటి వరములు నేడు.

నీ కై తెచ్చిన సంబారములతొ
యువరాజుగ నా భరతుని చేయుట
పదునాల్గేండ్లు దండకాటవికి
వనవాసముగా నిన్ను పంపుట.

నీ తండ్రిని నే కోరినవివ్వి
సత్యవర్తులని నీవును తండ్రియు
నిరూపించగా నీవు దలంచిన,
వనవాస దీక్షకు నేడే పొమ్ము.

జటాజినములు ధరించి నీవు
దండ కాటవికి యిపుడే పోవలె
పదునాలుగేండ్లు అడవి నుండవలె
నాటి వరములు తీర్చు తరుణ మిది.

రామా వినుము వాగ్దానమును
నీవు చేసిన తండ్రి తరించును
ధర్మహాని మరి కలుగదు వారికి''
అనుచు తెలివిగా పలికెను కైక.

మాటలు విని దుఃఖించె దశరథుడు
అంతో యింతో కైక కలవరము -
కానీ రాముడు చలించ లేదు
దుఃఖ ఛాయలు ముఖమున లేవు.

అతడే రాముడు జగదభి రాముడు
అగ్ని పర్వతము పడినా కదలడు
అన్న మాటకై నిలబడు రాముడు
అయోధ్య వాసుల గుండెల నేలును.

॥శ్రీరఘురాముడు॥

✻✻✻

## 19 వనవాసము చేతునని, కైకకు రాముడు ప్రతినగ చెప్పుట

రామచంద్రునితొ అతి తేలికగా
కైక చెప్పినది - గుండె పగులు నది
కానీ రాముడు చలించలేదు
దిగులు లేక అట పలికె తేలికగ.

''తల్లీ! నీవు కోరిన విధముగ
జరుగును సర్వము సందేహించకు
తండ్రి శపథమును తల దాల్చెదను
వన వాసమునకు నడతును నేను.

ఎప్పటి మాదిరి నాయనగారు
పలుకరించరు దయను చూపరు
దిగులు వదలుము - నీ ముందటనే
జటా జనమ్ముల వనము కేగెదను.

మేలు కోరెడి మహాత్ము డాయన
తండ్రి - నాకు గురుదైవ సమానులు
నా మది పూర్తిగ తెలియును వారికి
ఆజ్ఞ మీరనని తెలియును వారికి.

## అయోధ్యాకాండము

భరత కుమారుని అభిషేకించెడి
కోరిక నాయన తెలపక పోయిరి
అది నా హృదిని దహించుచున్నది
భరతుని కొరకై అసువుల నిడెదను.

మా యిద్దరిలో భేదము నెరుగను
తండ్రి ఆనతిని తెలిపితి నీవు
నీవు ముదముగ కోరితి నంటివి
నీకు మాటను ఇచ్చి యుండిరి.

మాట తప్పడు రాముడు తల్లీ
రాజ్యము వదలుట పెద్ద విషయమా?
తండ్రి వంతతో దుఃఖిలు చుండెను
వారిని నీవే ఊరడించ వలె.

భరతుని ఇచటకు రావించ వలె
రాజు ఆనతిని దూతల నంపుము
తండ్రిగారు తను స్వయముగ నాతో
చెప్పలేదు అను చింత వదలితిని.

భరతుని త్వరగా రప్పించ వలె
నే నిట నుండే వనమున కేగెద.''
అనుచు రాముడు పలుకు చుండగా
అనందించెను కేకయపుత్రి.

ఆలసించక అమిత విక్రముని
అడవి కంపగ యోచన చేసి
అన్నది కైక - ''రామా! నీవు
అంత వరకును ఆగుట ఏల?

అనుకొన్నటుల దూతలు పోదురు
అతి తొందరలో భరతుడు వచ్చును
అంగీకారము నిచ్చితి నీవు
అడవుల కేగుము ఇపుడే నీవు.

ఈ విషయమును తండ్రి విశదముగ
నీకు చెప్పుటకు మాటలు రాక
ముఖము చెల్లక మిన్న కుండిరి
అంతకు మించిన దుఃఖము నెరుగరు.

నీవు అయోధ్య వదలిన వెంటనె
ఆయనగారి దిగులు తగ్గును
అంతవరకు స్నానాదులుచేయరు
అన్న పానములు ముట్టరు వినుము.

కావున రామా! కావుము వారిని
కానల కీవు కదలుము నేడే
నీతో పలుకగ మాటలు రాక
మూగవోయి నట్లుండెను తండ్రి''

రామచంద్రునితొ కైక పలికినవి
వినబడు చుండెను దశరథ రాజుకు
వశము తప్పెను ఛీత్కరించుచు
లేవ లేకను పాన్పున పడెను

రామచంద్రుడు కలవర పడెను
ఉపచారమ్ములు చేసెను తండ్రికి
కైక మాటలు మదిలో మెదలెను
కానకు పోవుట మేలని తలచెను.

తండ్రి గురించి యోచన వదలెను
తండ్రి క్షేమము తన కర్తవ్యము
కానకు కదలిన తండ్రి మనసుకు
ఊరట కలుగును అని తలపోసెను.

వినయము నిండి రామచంద్రుడు
కైకతొ పలికెను ''అమ్మా! వినుము
రాజ్యకాంక్ష నా కసలే లేదు
ఋషివలె మనుగడ కోరితినమ్మా!

ధర్మమె నాకు శిరోధార్యము
తండ్రి మాట జవదాటను నేను
తండ్రికి ముదమగు ఏపని నైనా
చేతును తల్లీ – అది నా వ్రతము

పితృవాక్య పరిపాలన – సేవలు
పుత్రుని ధర్మము కావున నేను
తండ్రి మాటకై వెనుదీయకను
ప్రాణములైనా విడతును తల్లీ!

తండ్రి స్వయముగా చెప్పక పోయిన
తండ్రి యానతిని తెలిపితి వీవు
తప్పక వనముకు పోదును తల్లీ!
పదునాల్గేండ్లు కానల గడపెద.

దేవత సమమగు తల్లివి నీవు
నీ ఆనతిని తల దాల్చెదను
భరతుని పట్టము నా వన వాసము
నీవు చెప్పినా చేతును తల్లీ!

స్వల్ప విషయము ఘనముగ నెంచి
వరముగ తండ్రిని కోరితివా నువు?
నా స్వభావము తెలియక పోతివి
నా గుణములను ఎరుగక పోతివి.

''వినుమిది తల్లీ! ఇపుడే నేను
కన్న తల్లి కడ శెలవందుకొని
దుఃఖపడుచును సీత యున్నచో
ఊరడించి మరి కానకు సాగెద.

అంతకు మించిన జాప్యము చేయను
వింటివ తల్లీ! నమ్ముము నన్ను
రాజ్య పాలనము పితృ సేవలు
భరతునిచే నువు చేయించ వలె.

పితృ సేవలు పుత్రుని ధర్మము
అందుకు మరిమరి చెప్పు చుంటిని
విహిత ధర్మము చేయించనగు
అట్టి భారము నీదే తల్లీ!

కంట నీటితో దశరథ రాజు
రామచంద్రుని పలుకులు వినెను
అలవలె హృదిలో దుఃఖము ఎగసెను
ఒక్కసారిగా బావురుమనెను.

రామచంద్రుడు వినయము నిండి
తండ్రి పదములకు నమస్కరించెను.
కైక పదములకు వందన మిడెను.
భక్తిగ వారికి ప్రదక్షిణించెను.

ప్రశాంత వదనము కలిగిన రాముడు
అంతఃపురమును దాటి వచ్చెను
సర్వము గ్రహించి క్రోధము నిండిన
లక్ష్మణమూర్తిని గాంచెను వెలుపల.

అభిషేకముకై తెచ్చిన యట్టి
సంబారములను తిలకించకనే
మదిలో వేదన అన్నది లేక
మనుజోత్తముడు సాగెను ముందుకు.

అభిషేకమ్మది ఆగిపోయెను
వనవాసమ్మది కర్తవ్యమయె
ధీరసత్తముడు రామచంద్రుడు
రెంటిని ప్రియముగ స్వీకరించెను.

మబ్బు లున్నను చంద్రుని కాంతి
మాసిపోదు గద - అటులే రాముడు
మది సంక్షోభము అన్నది లేక
పురుషోత్తముడు భాసిలినాడు.

ముఖ కాంతులవి తరగకున్నవి
మానావమానము సుఖదుఃఖములను
ద్వంద్వమ్ములకు అతీతుడైన
యోగీంద్రుని వలె నడచెను రాముడు.

శ్వేత ఛత్రము వలదని పలికెను
వింజామరలను తిరస్కరించెను
వెండి రథమది వద్దని పలికెను
రాజ లాంఛనములన్నియు కాదనె.

కన్నతల్లి తన కౌసల్యమ్మకు
స్వయముగ విషయము చెప్పగ నడచెను
మిత్రులు హితులు దుఃఖించెద రను
జాలి మాత్రము రాముని కున్నది.

అతి చనువైన ఆప్తులు కూడా
రాముని ముఖమున ప్రసన్నతను గని
జరిగిన విషయము తెలియక పోయిరి
రాముని హృదయము తెలియగ వశమా!

శరశ్చంద్రునిగ సహజ కాంతితో
అప్రియ మసలే కనబడ నీయక
కుశలప్రశ్నల పలుకరించుచు
గంభీరముగా నడచెను రామడు.

అన్ని గుణములలో అన్నకు సరియగు
లక్ష్మణమూర్తియు దుఃఖము నిండి
రాముని అడుగుల నడువ సాగెను
రాముడె అతనికి సర్వస్వమ్ము.

ఆనందముతో కళకళ లాడెడి
కౌసల్యమ్మ మందిరమ్మునకు
రామలక్ష్మణులు చేరిరి అపుడు
రాముడు ముందుగ నడచు చుండెను.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 20 కైక కోర్కెలు విన్న కౌసల్యా దుఃఖము

కైక భవనమును వదిలి ముందుకు
రాముడు సాగుట గాంచిన కాంతలు
దుఃఖము నిండి ఏడువ సాగిరి
అంతఃపుర మది మునిగె దుఃఖమున.

''రాముడు కానకు కదలు చుండెను
రాముని విడచి బ్రతుకుట ఎట్లు?
తల్లుల మాదిరి మన లందరినీ
గౌరవించుచు సేవలు చేసెను.

మనసుకు శాంతము కూర్చెడి వానిని
మన రఘురాముని అడవికి పొమ్మని
మూర్ఖత్వముతో రాజు చెప్పెను''
అనుచు రాజును పరుషము లాడిరి.

లేగలు పోయిన గోమాతల వలె
అంతః పురమున స్త్రీ సమూహము
బిగ్గరగా విలపించ సాగిరి
వశము తప్పి రోదించ సాగిరి.

దుఃఖ జలధిని మునిగిన రాజు
స్త్రీల దుఃఖము రోదన వినెను
నిందా వాక్కులు వినబడె నతనికి
మూర్ఛిలి పడెను శయ్య మీదనే.

కౌసల్యమ్మ అంతఃపురమున
అడుగిడు రాముడు వినెను రోదన
నిట్టూర్పులతో దృఢ చిత్తముతో
ముందుకు సాగెను మత్తేభము వలె.

అంతఃపుర ద్వారమ్ము వద్దను
ద్వారపాలకులు రాముని చూచిరి
జయజయ ధ్వానులతొ కీర్తించుచును
నమస్కరించిరి పుణ్య శీలునికి.

రెండవ కక్ష్యలొ విప్రోత్తములకు
రామచంద్రుడు వందన మిడెను
మూడవ కక్ష్యలొ నుండెడి స్త్రీలు
రామలక్ష్మణుల కాశీస్సుల నిడి

కౌసల్యమ్మకు చెప్పుట కొరకై
పరుగిడి రపుడు గృహములోనికి
రాత్రి యంతయు పట్టపు రాణి
జాగారముతో పూజలు చేసెను.

తనయుని క్షేమము తలచుచు మాత
విష్ణుదేవుని పూజను చేసెను
విప్రోత్తములతొ శాస్త్రోక్తముగా
హోమాదులను చేయగ చెప్పెను.

ధవళ కాంతితో మెరుయుచునున్న
పట్టు వస్త్రమున మాతృమూర్తిని
కౌసల్యమ్మను రాముడు చూచెను
శుభకర ద్రవ్యము లచ్చట గాంచెను.

తెల్లని పూవుల మాలలున్నవి
పెరుగు, నేయి, అక్షత లున్నవి
పూర్ణకుంభములు హవిస్సు లున్నవి
లాజలు మొదలగు వస్తువు లున్నవి.

మంగళ కరమగు ప్రదేశమందు
మంగళకారిణి కౌసల్యమ్మను
మంగళమూర్తి రాముడు గాంచెను
మాత గాంచెను వచ్చిన తనయుని.

వ్రత నియమాదుల కృశించి యున్నను
తేజోమూర్తిగ వెలుగులు చిమ్ముచు
జలతర్పణమును చేయుచు నున్న
తల్లిని గాంచెను వచ్చిన తనయుని.

పిల్లను తన దరి చేర్చుకు మురిసే
పెంటి గుఙ్ఞమును పోలు ప్రేమతో
తనయుని వద్దకు అతి తొందరగా
అమ్మ చేరినది ఆనందముగా.

భక్తి వినయముల రామచంద్రుడు
సాష్టాంగముగా ప్రణామ మిడగ
ఆనందముగా ఆ మహారాణి
కౌగలించుకొని శిరసు మూర్కొని.

పలికెను అపుడు ''రామా వినుము
నీ పూర్వీకులు రాజ ఋషులయా!
పరమ ధార్మికులు మహానుభావులు
వారితొ నీవు సముడవు కావలె.

వారిని బోలు దీర్ఘాయువుతో
యశము గడించి ధర నేలవలె
వంశ ప్రతిష్ఠకు వన్నె తెచ్చెడి
ధర్మ మార్గమున చరించ వలెను.''

ఆశీస్సులతో తల్లి పలికెను
''అభిషేకమునకు సమయము అగును
తండ్రిని గనుము సత్య సంధుడు
యువరాజుగ నిను అభిషేకించును.

ఉపవాసముతో నీరసించితివి
తెల్లవారినది - దైవ ప్రసాదము
ఆరగింతువు రమ్మని పిలచి
పీట వేసినది వడ్డన చేయగ.

కన్నుల నీరు గిర్రున తిరుగగ
తనయుడు అనెను! ''అమ్మా! వినుము
నీకు తెలియని విషయము వినుము
నా కొరకై నువు దుఃఖపడెదవు.

నీవు, సీతయు లక్ష్మణమూర్తియు
నన్ను గురించి వంత నొందెదరు
దండకాటవికి పోవుచుంటిని
దర్భాసనమున కూర్చొనవలెను.

రాజోచితమగు వంటలు దొరకవు
వనభోజనము లభించునమ్మా
అడవులయందు పదునాల్గేండ్లు
గడపగ వలెను అది నిర్ణయము.

భరత కుమారుని అభిషేకమ్ము-
నా వనవాసము నిర్ణయమయినది''
అనుచు రాముడు పలికినయంత
కుప్పగ కూలెను ఆ మహారాణి

నరికి వేసిన తరుశాఖ వలె
గాలికి పడిన కదళీ తరువై
నేలను బడినది ఆ మహరాణి
అలసిన గుఱ్ఱము తీరుగ బడినది.

తల్లిని రాముడు లేవదీసెను
అప్యాయముగా సపర్య చేసి
ధూళిని దులిపి కూర్చొన బెట్టెను
కంటి ధారతో తల్లి పలికెను.

''రామా నిన్ను కన్నది ఇందుకా?
ఇంతటి దుఃఖము నందుట కొరకా
అసలు బిడ్డలే పుట్టక పోయిన
గొడ్రాలుగ ఆ దుఃఖము మేలగు.

సుఖము లెరుగను సంతస మెరుగను
ఐశ్వర్యములు కోరి ఎరుగను
తనయునివలన సుఖపడనుండగ
ఈ విధముగను విధి వక్రించెను.

ఇంతటి వరకు పట్ట మహిషిని
ఇకపై సవతులు గేలి చేతురు
నీవిట నుండగ సవతిటు చేసెను
నీ పరోక్షమున నాగతి ఏమి.

తేలిక మాటలు హృదయశూలములు
వినుచు దుఃఖము భరించలేను
బ్రతుకుటకన్న మరణము మేలగు
కైక దాసితోసమాన మగుదును.

కైక కుమారుడు ఏమనునో యని
భయపడి నాతో పలుక రెవ్వరును
సేవకులుండరు - పోటు మాటలను
ఏ విధముగ నే భరింతురామా!

యువరాజగుదువు అన్న ఆశతో
పదిహేడేండ్లుగ లెక్కిడుచుంటిని
ఇంతటితోనది తీరిపోయినది
తేలిక మాటలు భరించలేను.

చందమామను పోలెడి ముఖమును
చూడకుండ నే బ్రతుకుట ఎట్లు
ఉపవాసములు, దానధర్మములు
వ్రత నియమాదులు వ్యర్థమైనవి.

నేను చేసిన తపస్సు అంతయు
చవిటి నేలలో విత్తుగ మారెను
వరదకు బలమగు గట్లే పగులును
ఇంతటి వంతకు గుండియ పగలదె?

గుండియ కాదిది బండరాయి యగు
పగుల కున్నది ఇంత దుఃఖమున
లేడిని సింగము కబళించినటు
యముడు నన్ను మరి గొనిపోకుండెను.

యమలోకములో చోటులేదని
చావు ఇంకను రాలేదేమో!
గుండియ, తనువు, ఇనుపవి ఏమో?
పగులక నిలచెను యింత క్లేశమున.

రామా! కాలము వచ్చు వరకును
కాలుడు కబురును పంపడుకాదా
కృంగి కృశించి దుఃఖించవలె
కోరిన వెంటనె మృత్యువురాదు.

దూడ వెంబడి నడచు గోవుగా
నీ వెంటను నే వచ్చెద రామా!
నీ ముఖబింబము చూచుకొనుచును
బ్రతుకు చుందును బంగరు తండ్రీ!''

తండ్రి మాట జవదాటని తనయుడు
రామచంద్రుడని తెలిసియున్నను
బందీ కృతుడగు బాలుని గాంచి
ఏడ్చిన కిన్నెర స్త్రీవలె నేడ్చెను.

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

## 21 రాముడు తన స్థిర సంకల్పమును తెలుపుట

కౌసల్యమ్మ విలపించుట గని
సుమిత్రసుతుడు పలికె నప్పుడు
''తల్లీ వినుము! రామచంద్రుడు
కానకు కదలుట సరిగాదమ్మా!

మన్మథవశుడై యువకుని మాదిరి
తండ్రి నడచెను - ధర్మ దూరమది
రాజనీతిని తెలిసిన తనయుడు
అతని ఆనతి ఆమోదించడు.

స్త్రీ మాటలకు లోబడి తండ్రి
వృద్ధుడగుటచే యోచన లేక
విషయలోలుడై ఆనతి నిడినచొ
ఆచరించుట సరిగాదమ్మా.

విషయము బయటకు పొక్కకముందే
అన్నా! రాజ్యము వశము చేసుకో
ధనుర్ధారినై ప్రక్కన వుందును
దండ ధరునివై నీవు నిలతువు.

రాజ్య బహిష్కరమగు నేరమ్మ
రాజద్రోహము ఏమి చేసెను
అజాత శత్రువు, ప్రజాహితుడగు
అన్నను అడవికి పంపుట ఏల?

నిన్నెదిరించే వీరపుంగవులు
అయోధ్యలోన లేనేలేరు
తొందరపడి మరి ముందుకు వచ్చిన
నిర్మానుష్యము చేతును నగరము.

ఋజువర్తనుడు విజితేంద్రియుడు
కైక మొదలగు శత్రు పక్షమును
మనసు నిండుగా ఆదరించెను
అంతటి సుతునా అడవికి పంపుట?

భరతుని భృత్యులు - కైకహితులను
ఎదురు నిలచిన తుదముట్టించెద
కైక పంపగా రాజే వచ్చిన
చంపుటొ - చెరలో నుంచుటొ చేతము.

కామవశుడయి వివేక మెరుగక
యుక్తాయుక్తము తెలియక పోయిన -
తండ్రియైనను దండన కర్హుడు
నీకు తెలియని ధర్మము కలదా!

నిన్నూ ప్రజలను త్రోసిరాజని
భరతుని రాజుగ చేయగ సాధ్యమ?
నీదగు రాజ్యము దశరథరాజు
కైక కీయగా తలంచెనెందుకు?

ఏ బలముతొ మన దశరథ ప్రభువు
ఇంతటి పనికి సిద్ధపడెనయా!''
అనుచు లక్ష్మణుడు ఆవేశముతో
కౌసల్యమ్మతొ పలికెను అపుడు.

''తల్లీ! నేను రామానుజుడను
అన్నను వదలను అనుసరింతును
అడవులకైనా పోదును అన్నతొ
నా ధనుస్సుపై ప్రతినగ చెప్పితి.

నేను చేసిన దానధర్మములు
యజ్ఞయాగముల మీద ఆనగొని
పలుకుచుంటిని - విను మహరాణి!
రాముని కొరకై అగ్నిని బడెదను.

నీ దుఃఖమును తీర్చెదనమ్మా
నా పరాక్రమము చూపెద నిపుడే''
అనుచు లక్ష్మణుడు పలుకుచుండగా
కౌసల్యమ్మ పలికె రామునితొ.

''నాయన రామా! వింటివ నీవు
తమ్ముడు చెప్పినదంతయు వింటివ?
బాగుగ యోచన చేయుము తండ్రీ
సవతి చెప్పినది అధర్మమైనది.

కైక మాటలు ధర్మము అనుకొని
అడవులకేగగ నిశ్చయించితివి
ధర్మాధర్మము నీకు తెలియదా
అడవికి పోవుట ఆలోచించకు.

ధర్మమ్మును నువు ఆచరించుటకు
ఇచ్చట వుండి నా సేవలలో
కాలము గడుపుము, మాతృ సేవయది
పుత్రుని పాలిటి పరమ ధర్మము.

తల్లి సేవలు కశ్యపుడెంతో
నియమబద్ధుడై చేసెను కాదా
స్వర్గవాసము లభించె నతనికి
ప్రజాపతిగను యశము గడించెను.

తండ్రి పూజలు చేతునంటివి
తల్లిని నన్ను నువు పూజించుము
అడవికి పోవుట వలదని నుడివితి
ఆచరించుము ఆ విధముగను.

అడవికి నీవు పోదునంటివా
నీతో నడచెద అదియే మనుగడ
నన్ను కాదని నీవు నడచిన
ప్రాయోపవేశము చేసెద నిచట

పిప్పలాద ఋషి పుంగవునెడల
అధర్మమ్ముగా నడచినందుకు
పుణ్యనదుల ప్రభువైన కడలికి
బ్రహ్మ హత్య పాపమ్ము కలిగెను.

నే నిచ్చటనే కృశించి మడసిన
నీకు పాపము కలుగును కావున
నా మాటవిని! అంతటి ఆపద
కొనిరావలదు'' అని బ్రతిమాలెను.

అంతట రాముడు ధర్మ విహితముగ
తల్లితొ పలికెను '' అమ్మా! వినుము
తండ్రి మాటను అతిక్రమించను
నీ పదములకు ప్రణామ మిడెద.

తండ్రి మాట విని ధర్మనిరతుడు
''కండువు'' మహాఋషి గోవధ చేసెను
పరశురాముడు తల్లిని నరకెను
సగరులు భూమిని త్రవ్వి - మడసిరి.

పితృవాక్య పరిపాలకు లెందరొ
సద్గతినందిరి జననీ! వినుము
క్రొత్తగ నేను చెప్పుటలేదు
వారి త్రోవలో నడచెద నేను.

పితృవాక్య పరిపాలన అన్నది
పరమ ధర్మము పుత్రుని కిలలో
అది నమ్మితిని- వదలను దానిని
మది నిశ్చయము తెలిపితి తల్లీ.

పితృవాక్య పరిపాలన వలన
ఎట్టి అఘమును కలుగదు తల్లీ
నీకు వంత నే కలిగించితిని.''
అనుచు అనుజునితొ పలికెను రాముడు.

''సోదర! నీకు నాపై ఎంతటి
అభిమానమ్ము కలదో తెలియును
నీదు బలమది తెలియును నాకు
అమ్మ దుఃఖమున మునిగి యున్నది.

వాస్తవ మెరుగక పుత్ర ప్రేమతో
దుఃఖము నున్నది లక్ష్మణ మూర్తీ!
పురుషార్థములకు ధర్మము, మూలము
సత్యము నిలచిన ధర్మము నెలకొను.

ఇప్పుడు నాకు, సత్య, ధర్మములు
ఆచరించు అవకాశము కలిగెను
పితృవాక్య పరిపాలన వలన
దొరికినదయ్యా! చక్కని సమయము.

తల్లిదండ్రులకు వేద విదులకు
ఇచ్చిన మాట తప్పుట దోషము
ఆనతి నిడినది కన్నతండ్రియే
ఆనతి తెలిపెను కైకేయమ్మ.

క్షత్రియ ధర్మము కోప స్వభావము -
పెరగనీయకు ఈ సమయములో
నా మార్గమును అనుసరించుము''
అనుచు రాముడు తమ్మునితో నసె.

తిరిగి పలికెను మాతృమూర్తితో
''అమ్మా! నేను వనమున కేగెద
వనవాసమ్ము తప్పదు తల్లీ
నా ప్రాణముపై ప్రతినగ చెప్పితి.

స్వర్గము నుండి యయాతిరాజు
భూమికి జారితిరిగి స్వర్గమును
చేరినట్టుగా - అడవులకేగి
వ్రతము తీరగా పురము చేరెద.

ప్రభువు ఆనతి మనమందరము
తలదాల్చవలె నీకు తెలియదా
అదియే ధర్మము కావున తల్లీ!
ఆశీస్సుల నిడి పంపుము నన్ను.

అభిషేకమునకు సమకూర్చినవి
భరతుని అభిషేకమ్మునకిమ్ము
దుఃఖము వలదు ధైర్యము నుండుము
నా వనవాసము ధర్మ సమ్మతము.''

తనయుని మాటలు విని కౌసల్య
ధుఃఖము నిండి మూర్ఛిలి పడినది
కొంత సేపటికి తెలివి గలిగినది
తనయునితో నిటు పలికె దుఃఖమున.

''నాయన రామా! నువు దరిలేక
బ్రతికి యుండుట వ్యర్థము కాదా
పరలోకములో సుఖములు వలదు
కంటిముందు నీ వున్నచొ చాలును.''

అనుచు బాధతో కౌసల్యమ్మ
తెలివితప్పి తా నేలను బడినది
తల్లి- తమ్ముల నడుమ రాముడు
స్థిర సంకల్పుడు చెదరక నిలచెను.

నిశిలో అడవిలొ కొరవులు చేకొని
అడ్డగించెడి వేటగాండ్రను
లక్ష్యపెట్టక సాగు మదకరిని
తలపించినది రాముని లక్ష్యము.

ధర్మ మార్గమును అనుసరించుకొని
సాగుచున్నది రాముని మనసు
అంతట రాముడు అనునయముగను
లక్ష్మణమూర్తితొ పలికెను అచట.

''సోదర! నీకు నా యెడనున్న
మమత తెలియును - కానీ నీవు
నా మది తెలియక నా తల్లివలె
బాధకు నను గురిచేయుచుంటివి.

ధర్మమువలనే పురుషార్థములు
సిద్ధించును విను నిస్సందేహము
అనుకూలవతి యైన భార్యతో
ధర్మార్థ కామములు లభించుగాదా.

ధర్మ పథమును వదలని వానికి
పురుషార్థములు సిద్ధించునయా
అర్థకామములె లెక్కిడువానిని
లోకము తప్పక గర్హించునయా.

దశరథ ప్రభువు మనకు తండ్రి గద
ఆయన మనకు గురువును రాజు
కావున ఆనతి పాలించవలె
కాదను శక్తి మనకు లేదు విను.

ధర్మదూరుడు పాపకర్ముడు
తండ్రి మాటను కాదన గలడు
నే నావిధముగ చరించ జాలను
పితృవాక్య పరిపాలన నా విధి

భరత కుమారుని అభిషేకమ్ము
జ్యేష్ఠకుమారుని వనవాసమ్ము
వరముగ తండ్రి ఇచ్చెను గావున
వాటికి విఘ్నము కలుగ కూడదు.

కౌసల్యమ్మకు పెనిమిటి రాజు
రాజు ఆనతిని తలదాల్చవలె
భర్త వుండగా అనాథ మాదిరి
కొడుకు వెంబడి రాకూడదయా!''

అనుచు రాముడు తల్లిని చూచి
'' ఓ మహరాణీ! నేను ఇప్పుడే
వనవాసమునకు సాగుచుంటిని
ఆశీస్సుల నిడి పంపుమునన్ను.

తల్లీ! ఇప్పటి రాజ్యము కొరకు
ఎల్లప్పటికీ నిలబడు కీర్తిని
కాదనలేను - ధర్మము వదలను
రాజ్యసుఖములు కోరను నేను.''

మదిలో మాట సూటిగ జెప్పి
ఒంటిగ కానకు కదలగ నెంచి
కౌసల్యమ్మకు మనసు నిండుగా
ప్రదక్షిణించెను రామచంద్రుడు.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

# 22 దైవబలము అతీతమైనదని రాముడు చెప్పుట

కోపవశుడయి కన్నులెర్రబడి
బుసల మాదిరి శ్వాసను వదలుచు
జ్వలించుచున్న అగ్నిని పోలిన
లక్ష్మణమూర్తిని గాంచెను రాముడు.

ఆవేశములో నున్న తమ్ముని
అనునయించక సాగుట తగదని
రామచంద్రుడు పలికెను ప్రియముగ
''సోదర! కోపము నిగ్రహించుము.

నా కవమానము జరిగినదనుచు
మది తలబోయకు శాంతి వహించుము
వనవాసమునకు సాయము చేయుము
వలయు వస్తువులు సమకూర్చుమయా!

పదునాల్గేండ్లు గడచిన తదుపరి
సుఖముగ వత్తునొ రానో అనెడి
శంకతొ అమ్మ వున్నది సోదర
ఆమెను నీవు ఊరడించవలె.

పదునాల్గేండ్లు ఇట్టే గడచును
అనుచు అమ్మను ఊరడించుము
మాటలలో మరి జాగు జరిగిన
కైకా దేవికి సందేహమగు.

పితృవాక్య పరిపాలన ధర్మము
అనుచు నుడివితిని ఇప్పుడు వినుము
ఆలోచించగ మది కిటు తోచును
దైవిక మిదియని తెలియుచున్నది.

నీ ప్రోత్సాహము లభించగానే
వనవాసమ్ము మానితి ననుకొని
కైకమ్మచట అనుమానించును
ఇచటి దుఃఖమును చూడగలేను.

నిర్ణయించిన అభిషేకమ్ము
వనవాసముగా మారిపోయినది
కన్న కొడుకువలె ఆదరించెడి
కైకమ్మే నను కానకు పొమ్మనె.

నాయనగారు సత్యసంధులు
భువిలో సుఖములు బడసినవారు
భార్య కోరికనెరవేర్చనిచో
ఇచ్చిన వరములు అసత్య మగును.

భరతుని - నన్ను ఒక్క తీరుగా
అభిమానించే మాత - తానుగా
కానకు పొమ్మనె - వింతను గనుము
ఇది యంతయును దైవికమయ్యా!

అసత్యవాదిగ మన జనకుడట
పరలోకములో బాధలు పడెదరు
ఇది అంతయును నాయనగారు
తలంచి - మదిలో వ్యధతో నుండిరి.

ఉత్తమ కులమున పుట్టిన అతివ
భర్త యెడల తా నణకువగలది
అంతటి ఆమె సిగ్గును వదలి
భర్తను ఇటుల నిలవేసినది.

ఆలశ్యమునకు తావునీయను
తండ్రి దుఃఖమును తొలగించెదను
నేరుగ సాగెద వనవాసమునకు
ఆనందముగా నడచెద నేను.

భర్తను అంతటి కోరిక కోరెను
ప్రియపుత్రుని తా కానకు పొమ్మనె
దీని కంతకూ దైవము మూలము
దైవానికి ఇల తిరుగు లేదయా.

జటావల్కలము కృష్ణాజినములు
కమండలాదులు ధరించి నేను
కనబడినంతనె కైకాదేవి
కొడుకును తలచి మురసిపోవును.

ఊహించనివి జరిగినప్పుడు
దైవము అనుచు తెలియుచుండును
జరిగెడి దసలే తెలియదు ముందుగ
కావున దైవము స్వతంత్రమైనది.

ఎంతో శ్రద్ధగ చేసిన పనులకు
ఫలితము దొరకదు కొన్ని సమయముల
శ్రమ లేకుండా చేసిన పనులకు
ఫలితము దొరకును - దైవికమ్మది.

కావున మనము ఫలితమ్ములను
అనుభవించవలె - తలను దాల్చవలె
దైవము నెదిరి నిలువగలేము
దైవబలమది అజేయమైనది.

మనో నిగ్రహము కలిగిన ఋషులు
క్రోధమునందుట దైవికమయ్యా!
అంతయు చూచి తెలిసితి నిటుల
మనో నిగ్రహము వంత తీర్చినది.

సోదర! నీవు ఆలోచించుము
దుఃఖము తొలగును'' అనుచు రాముడు
అభిషేకముకై తెచ్చిన జలముల
తపోస్నానము చేసెద ననెను.

వెంటనె రాముడు సరిదిద్దుకొని
పలికెనప్పుడు - '' ఈ కలశమ్ముల
జలము తెచ్చిరి అభిషేకముకై -
కావున దీనిని తాకగ రాదు.

స్వయముగ నీటిని చేదుకొందును
వ్రత స్నానమును ఆచరించెద
రాజ్యలక్ష్మి నను దూరము నుంచెను
దుఃఖము వలదు! వినుము సోదరా!

రాజ్య పాలనము కన్నను సోదర!
వనవాసమ్ము శుభముల నిడును
కైకమ్మసలే హేతువు కాదు
దైవ ప్రభావము చేసినదిటుల.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 2 3 కోపమునున్న సౌమిత్రిని రాముడు శాంతపరచుట

ధర్మ పథమును నమ్మిన రాముని
ధర్మ బోధనలు తమ్ముడు వినెను
మదిలో ఎంతో పొంగి పోయినను
వనవాసమ్మని కృంగిపోయెను.

తిరిగి క్రోధము ఎగసె నొక్కపరి
బుసల సర్పమై కన్ను లెఱ్ఱబడె
కోపము నిండిన సింహమాయెను
కృద్ధ గజముతొండమ్ము విసరినటు.

కరమును గట్టిగ విదలించుచును
కనుబొమ్మలను చిట్లించుచును
అన్నను చూచి సూటిగ పలికెను
మదిలో నున్నది తెలిపెను ఇటుల.

''పితృ వాక్యమును గౌరవించనిచొ
ధర్మహాని యని భయపడుచుంటివి
ఇతరులు కూడ ధర్మదూరులై
అనుసరింతురని నీభయమయ్యా!

ధర్మాత్మునిగా లోకులు నిన్ను
పరిగణించరని తలంచు చుంటివి
నువు కల్పించుకునున్న భ్రాంతి యది
వనవాసముకై సాగనెంచితివి.

పైగా, నీవు దైవము అనుచును
పలుకుచుంటివి తగదిది నీకు
దైవము తనుగా ఏమియు చేయదు
దానికి కావలె ఆశ్రయమన్నది.

అసహాయులును అశక్తులున్ను
దైవమ్మనకు తల ఒగ్గెదరు
వీరులు శూరులు తిరస్కరింతురు
క్షత్రియ శ్రేష్ఠుడ పలుకుట తగదటు.

కైక, దశరథులు అధర్మ వర్తులు
ఆ విషయము నువు తెలియక పోతివి
కపట వేషమున కొందరు ఇలలో
ధర్మపన్నములు చదివెదరయ్యా.

కైక, దశరథులు ఆప్యాయతను
కనబరచుచును పన్నిన వల ఇది
ముందుగ వారు నిర్ణయించుకొని
చేసిరి ఇటుల తెలియకపోతివి

అటుగాకున్నచొ అంతటి రాజు
ఆనాడన్న వరములు ఇవ్వడ?
అతడా విధముగ ఉపేక్షించిన
అమ్మ కైక తా నాగి యుండునా?

పోనీ అది యే నిజమనుకున్నను
ఇది యా సమయము వరము లడుగుటకు
చక్కగ పన్నిన కుట్రయే యిది
కావున, కాదన దోషము లేదు.

వీరపుంగవా జ్యేష్ఠుడ వీవు
రాజ్యార్హతను కలిగినవాడవు
నీ వుండగను నీ తమ్ముడు తను
రాజ్య మేలుట ధర్మ విరుద్ధము.

పితృ వాక్యమే ధర్మమనుకొని
అభిషేకమునకు సమ్మతించితివి
అదే తండ్రి తా నాదేశించగ
అడవుల కేగగ తలంచినావు.

నిన్నటి ధర్మము నేటికి మారెను
అటుల మారెడి ధర్మము- ధర్మమా?
అట్టి ధర్మమును కాదనవలెను
నీవు ధర్మమని తలంచుచుంటివి.

అది ధర్మమని నీవు తలంచిన
దశరథరాజు కామవశుడయి
ముద్దుల భార్య మోహములోబడి
పలికనట్టిది అధర్మమగును.

నీవారే నీ శత్రువులైరి
కానకు పంపెడి కుట్ర చేసిరి
వారి కోరికను కాదనవలెను
ఎదిరి నిలువగల వీరుడవీవు.

దైవికమ్ముగా వారిద్దరును
పలికిరి అనుచు చెప్పితి వీవు
అట్టి దైవమును లక్ష్యపెట్టకు
ఆ దైవమును గురిగానెంచను.

ధైర్య వంతులు నిశ్చల వ్రతులు
మనో ధైర్యమున అట్టి దైవమును -
జంకక నిలచి - అణచివేతురు
పురుష శక్తితో దానిని గెలతురు.

దైవము - మానవ శక్తులలోన
ఏది గొప్పదో చూచెద నేను
అభిషేకమ్మను విఘ్నపరచిన
దైవము నిపుడే అంతము చేసెద.

మదించి పరుగిడు గజమును మావటి
అంకుశమ్ముతో మరల్చి నటుల
నేర్పుగ నేను దైవము నిపుడే
మళ్ళించెదను పురుష శక్తితో.

సురనాథుడును ముల్లోకమ్ములు
ఎదిరి నిలచినను నీ అభిషేకము
ఆపలేరు వినునిలచితి నచట
దశరథరాజు నిలబడ గలడా!

వనవాసమ్మును చేయించుటకై
కుట్ర పన్నిన వారిని నేను
పదునాల్గేండ్లు వనముకు పంపెద
కైక దురాశను త్రుంచెద రామా!

కైక దశరథుల కిద్దర కిపుడు
దైవము అనుకూలమ్మని తలచకు
నాతో పగ యది తెచ్చుకున్నచొ
దైవము వారిని రక్షించదయా!

రామా! నీవు రాజ్యమునేలి
వార్ధక్యములో వానప్రస్థమున
వనవాసమ్మను చేయగనగును
ఇపుడే అడవికి పోవుట తగదు.

నీ పరిపాలిత రాజ్యము తప్పక
నీ కుమారులకు చెందునుగాని
భరతుడు రాజ్యము ఏలుట ఎటుల?
రాజ్యపాలనకు అర్హుడు కాడు.

కన్న బిడ్డలుగ ప్రజల నేలుచు
శక్తి తగ్గగా జ్యేష్ఠ పుత్రునకు
రాజ్యము నిచ్చిరి పూర్వపు రాజులు
వారి మార్గమున నీవు నడువవలె

దశరథరాజు చపల చిత్తుడు -
మనము రాజ్యమును వశపరచుకొన
ఆందోళనలు చెలరేగునని
సందియ మెంతయు వలదు సోదరా!

మహా వీరుడవు మహిత మూర్తివి
నీకు శంక మరి వలదు నమ్ముము
నీకు తోడుగా నుందును నేను
అన్న సేవ పరమార్థము నాకు.

మహాసంద్రమును చెలియలికట్ట
నిరోధించినటు అశాంతి రేగక
రక్షగ నిలతును, ప్రతినగ చెప్పితి
కల్ల పలికిన స్వర్గము దొరకదు.

వశిష్ఠాదులను ఆహ్వానించుము
మంగళ జలముల అభిషేకమ్మి
మమ్మేలుమయా! మహానుభావా
అడ్డంకులను నిరోధింతును.

విఘ్నమ్ములను నా భుజబలమున
తరిమి వేసెద సుందరమూర్తీ!
నేనొక్కడనే చాలుదునయ్యా!
బాహువులున్నవి అందుకె రామా!

చాపము ఆభరణమ్ముగ తలచను
వీరభూషణము ఖడ్గముకాదు
అమ్ముల పొదులు బరువుకుగాదు
భుజములు కావు అలంకారములు.

రిపు సంహరణకు అమరిన వవ్వి
పగతుర ప్రాణము నిలువనీయను
వజ్రాయుధమున సురపతి దిగినను
మెరపు ఖడ్గమున త్రెంచ సమర్థుడ.

ఖడ్గము దూసి విజృంభించిన
రిపుల శిరములు కరములు తెగును
వారి గజములు, హయములు ఒరిగి
నేల కనబడక కుప్పలు నిండును.

మండెడి కొండల తీరుగ గజములు
మెరపుల - మబ్బులు కూలినట్టుగా
నేల కూలును - నీ కెదురుగను
నిలచెడి మగవాడెవ్వడు రామా.

గజతురగమ్ముల, వీరవరేణ్యుల -
ఎదిరి నిలచిన రిపు సేనలను
అవలీలగను త్రుంచెద రామా!
దశరథపాలన నంతము చేసెద.

చందన చర్చకు స్వర్ణభూషలకు
దానమ్మునకు సహాయమునకు
వినియోగించిన ఈ భుజములతో
విఘ్నకారుల భరతము పట్టెద.

రామా! నీవు ప్రభుడవు ఇపుడు
నీ కింకరుడను ఆనతి నిమ్ము
ఎవ్వని నిపుడు నేలకూల్చవలె
ఆదేశించుము ఆలసించకు''

ఆవేశముతో ఊగిపోవుచు
అశ్రుపూరిత నయనమ్ములతో
అనుంగు తమ్ముడు పలుకుట వినిన
అన్న పలికెను అతి శాంతముగా.

ఆదరమ్ముతో అతి సౌమ్యముగా
అక్కున జేర్చుకు లక్ష్మణ మూర్తికి
అశ్రులు తుడిచి పలికెను రాముడు
అంత కోపము వలదని పలికెను.

''ఓ సౌమిత్రీ! కోపము వలదు
తండ్రి ఆనతిని మీరను నేను --
అదియే అగును మంచి మార్గము
ధర్మపథమది అనెను చల్లగా.''

॥శ్రీరఘురాముడు॥

✲✲✲

## 24 శ్రీరాముడు కౌసల్యకు ఊరట కలిగించుట

పితృవాక్య పరిపాలన యందు
రామునిపట్టు సడలదనుకొని
కంట నీటితో తల్లి పలికెను
గద్గద స్వరముతో పలికెను బాధగ.

''కష్టము లెరుగని కన్న తండ్రివి
కానల యిడుముల సహించుటెట్లు
నీ భృత్యులిట సుష్టుగ తినగ
కంద మూలములు తిని బ్రతికెదవా!

సద్గుణ యుతుని వనవాసమునకు
రాజు పంపెనన, నమ్మశక్యమా!
నమ్మినచో మరి తమకేగతియో
అనుచు - ప్రజలిక సంశయ మందర?

రామా! నీవు అడవికి పోవుట
దైవ వశమని నమ్మవలెను కద
సుఖముల తేలగ సిరిగల రామా!
దైవ మెంతటి బలమైనదయా.

నీవు నడువగ - కట్టెగ మిగిలెద
శోకాగ్నియది ప్రజ్వ రిల్లును
నీ ఎడబాటనుగాలి వీచగ
నా దుఃఖమనుసమిధలు మండును

నా కన్నీరు ఆజ్యము కాగా
నా వేదన యను ధూమ మెగయగ
నా నిట్టూర్పులు ఎగసి పడుచును
కార్చిచ్చై నను కాల్చి వేయును.

నీవు లేక నే బ్రతుకను నాయన
దూడ వెంబడి గోవు చందముగ
నీ వెంబడి నే నడచెద రామా!''
అనుచు బిగ్గరగ ఏడ్చెను తల్లి.

అంతట రాముడు తల్లితొ పలికెను
''అమ్మా - తండ్రిని కైకాదేవి
వశపరచుకొని దుఃఖము నింపెను
నీవు వారిని కాపాడవలె.

నాతో నీవు బయలుదేరిన
తండ్రి బ్రతుకుట దుర్లభమమ్మా!
పతి సేవలను చేయుము తల్లీ
పరమధర్మమది తెలియుము నీవు.''

ఆ మాటలకు కౌసల్యమ్మ
యాదార్థమన్నటు తల వూపినది
దుఃఖపూరితను ఊరడించుటకు
తిరిగి పలికెను రామచంద్రుడు.

''దశరథరాజు మన యజమాని
గురువు-పోషకుడు మన ప్రభువాయన
ఆ ఉత్తముని ఆజ్ఞలన్నిటిని
మనమిద్దరమును గౌరవించవలె.

పదివత్సరములు - ఆపై నాలుగు
ఇట్టే గడిపి తిరిగి వత్తును
ఆపై నీకు సేవలు సేతును
అంతవరకు పతి సేవలు చేయుము.''

దుఃఖపూరిత ఏడ్చుచు పలికెను
''రామా! నీతో వచ్చెదనయ్యా
నను కాదనకు బ్రతుక లేనిక''
అది విని రాముడు పలికెను తిరిగి.

''అమ్మా! స్త్రీ తన జీవితాంతము
భర్తను నమ్మి సేవ చేయవలె
పరుని ఆశ్రయము తలంచకూడదు
పతియే దేవుడు - అతడే గతియగు.

తండ్రిగారు జీవించువరకును
అనాధవీవు కాకూడదు గద?
భరతుడు ఎంతో ధార్మికుడమ్మా
నీకు సేవలతొ ప్రియము గూర్చును.

వ్రతములు నోముల ఉపవాసములతొ
ఉత్తమురాలుగ పేరుగడించియు
భర్తను నీడగ అనుసరించని
స్త్రీకి- దుర్గతి కలుగును తల్లీ.

దైవ పూజలు చేయకున్నను
భర్త సేవను చేసెడి స్త్రీకి
ఇహపర సౌఖ్యములమరును తల్లి!
వేద శ్రుతులలో చెప్పబడినది.

సుఖముగ నేను తిరిగి వచ్చుటకు
నీవిట పూజలు చేయించుచును
వేదమూర్తులను సత్కరించుచు
తండ్రిగారికి సేవలు చేయుము.

పదునాల్గేండ్లు గడచిన పిదప
తండ్రి దీవనలు నాకు లభించిన
నీ కోర్కెలవి సఫలము అగును.''
అనుచు తల్లిని అనునయించెను.

కనుల భాష్పముల కౌసల్యమ్మ
పలికెను, ''రామా! నీ నిశ్చయమును
మార్చగ నాకు అసాధ్యమైనది
కాలము గెలువగ ఎవ్వరితరము?

చెదరని గురితో దృఢ నిశ్చయముతొ
అడవుల కేగుము, శుభములు కలుగును
పితృవాక్య పరిపాలన చేసి
తిరిగి రమ్ము, నా కష్టము తీర్చుము.

దైవ బలమును గెలువగలేము
నేడే నీవు అడవికి పొమ్మ
సుఖముగ తిరిగి అయోధ్య జేరి
మధుర వాక్యముల సంతస పరచుము.

వనవాసమునకు వలయు దీక్షను
నీవు గ్రహించి రామా! రమ్ము
మనసు నిండుగ ఆశీస్సులనిడి
మంగళదీవన లొసగెద నీకు.''

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 2 5 కౌసల్య శ్రీరామునకు మంగళాశీస్సు లొసగుట

మాతృ ప్రేమను రంగరించుకొని
మమతా బంధము సడలించుకొని
మంగళకరమగు ఆశీస్సులను
మాతృ మూర్తి కౌసల్య ఒసగినది

''రామా! నేడే దీక్ష గ్రహించుము
వనమున సుఖముగ కాలము గడిపి
వంశ కీర్తిని నిలబెట్టుకొని
అభిషిక్తుడవై రాజ్యమేలుము.

రఘుకుల సోమా! మనో బలముతో
నియమ నిష్ఠతో అనుసరించెడి
ధర్మాచరణము నీకు రక్షనిడు
ధర్మ మార్గమే దారి చూపును..

ఆలయాలలో పూజల నందే
దేవతలందరు నీకు రక్ష నిడి
దుర్గమ కాననసీమలయందు
మునులమధ్య నిను వశింప జేతురు.

మహాత్ముడైన కౌశిక మహర్షి
నీకు ఒసగిన అస్త్ర శస్త్రములు
నిన్నేమరక అండగ నిలచును
నిరతము నిన్ను అనుసరించును.

మాతా పితరుల సేవా ధర్మము -
సత్యవ్రతమ్ము నిను కాపాడును
దీర్ఘాయుష్షును ఒసగును నీకు
ధర్మ మూర్తిగా కీర్తి గడింతువు.

ముని యాశ్రమముల యాగ వేదికలు
పూజార్థమగు సంభారమ్ములు
నీకును ఎంతో ఉపకరించును
గిరులు, తరువులు సంతస మిడును.

విశ్వ దేవులు మరుస్సాధ్యులు
సిద్ధులు బ్రహ్మయు విరాట్ పురుషుడు
పూషాభగులు, అర్యములున్ను
దేవేంద్రాదులు లోకపాలకులు.

అహర్నిశము నిను సుఖపెట్టెదరు
దివారాత్రములు నెలలు ఋతువులు
సంవత్సరములు సుఖముగ జరుగును
కాలము నిన్ను కాపాడునయా!

ధర్మ వర్తనము, ధైర్య గుణమ్మును
జ్ఞాపక శక్తి నిను రక్షించును
రవి చంద్రులును నక్షత్రములు
నింగీ నేలా నిను రక్షించును.

సప్తఋషులును గ్రహములన్నియు
నారదాదిగా దేవఋషులును
నిన్నే మరక కాపాడెదరు
వనమున మౌనిగ వశింతువయ్యా.

ఆదిత్యులును దైత్యులు నిన్ను
అహర్నిశము ఆనంద పరతురు
క్రూర రక్కసులు నీ దరిరారు
పిశాచములు నీవంక చూడవు.

పులుగులు పాములు విష జంతువులు
ఈగలు దోమలు క్రిమి కీటకములు.
పులులు సింహములు ఎలుగుబంట్లును
అడవి దున్నలు మదకరీంద్రములు.

నర మాంసమును తినెడి ప్రాణులు
నాయన రామా! నిను గనినంతనె
ఎదురుగరాక తప్పుకు పోవును
కోతులు నీకు సంతస మిడును.

నీ కొరకై ఇట పూజలు చేతును
నీ సుఖములనే కోరుకొందును
స్నానార్థమయి నదుల మునుగగ
దివ్య మంత్రములు రక్షణ నిడును.

అగ్ని దేవుడు వాయు దేవుడు
అనిశము నిన్ను కాపాడెదరు
ఆకాశము నీ శిరసును గాచును
దిక్కులన్నియు చెవులను గాచును.

ఇంద్రాగ్నులు నీ ముఖమును గాయగ
సూర్యదేవుడు చక్షులు గాయును
మనసును చంద్రుడు చల్లగ కాయును
ప్రాణమ్ములను వాయువు గాచును

అంతరిక్షము నాభికి రక్ష
పాదమ్ములను భూమిగాయును
బ్రహ్మదేవుడు నారాయణుడు
సురలు, ఋషులును కాపాడెదరు.''

అనుచు ప్రేమగా ఆ మహారాణి
అయోధ్యరాముని కాశీస్సుల నిడి
ఆ యా దేవత లందరినపుడు
అమిత భక్తితో స్తోత్రము చేసెను

రుగ్మత లేవియు దరి రాకుండగ
హోమకర్మలను చేయించినది
స్వస్తివాచకము-పుణ్యాహవచనము
వేదపండితులు పఠించి రపుడు.

వేదవిదులకు దక్షిణలిచ్చి
విజయ వంతునిగ దీవన లిచ్చి
వీరమాత కౌసల్య పలికెను.
విజయరాముని దీవించె నిటు

''వృత్రుని వధకై వెడలు ఇంద్రునికి
దేవత లొసగినమంగళ వాక్కులు
అమృతమ్మునకై గరుడుని పంపుచు
అమ్మ ఒసగినమంగళమ్ములు

క్షీరపయోధిని తరచి, అసురులను
అంతముచేసి అమృతముమ గొన
ముందుకుసాగుఇంద్రుని కతని
తల్లి అదితితానిడు ఆశీస్సులు.

బలిని అణచగా వామనుడైన
త్రివిక్రమునికి ఇంద్రుని తల్లి
ఒసగిన యట్టి ఆశీస్సులివే''
అనుచు అక్షతలు చల్లెను తల్లి

మంత్రపూతముగ ఆశీస్సుల నిడి
మంత్రాక్షతలు శిరమున జల్లి
మంచి గంధము మేనుకు పూసి
విశల్యకరణిని రక్షగ కట్టెను

మదిలో దుఃఖము కనబడనీయక
శిరసుమూర్కొని కౌగిలించుకొని
తడబడు మాటల తనయునితోనసె
సుఖముగ రమ్మని పలికెను. తల్లి

''కోరిక తీరి పురము జేరగా
కన్నుల పండుగ నా కదిరామా!
రోజులు లెక్కిడు చుందును ఇచట
శుభముగ వెళ్ళి- జయముగ రమ్ము

అసువులు నిలపి ఉందును ఇచట
అయోధ్య నేలు సింహాసనమున
అభిషిక్తుడవగు నిను గాంచెదను
అది ఆనందము నాకును సీతకు

రామా! ఇచ్చట గౌరీపతికి
దేవగణములకు పూజలు చేతును
రక్షగ నిలతురు వారందరును
నిన్నేమరక చూచుచుందురు.''

అనుచు పలుకుచు గుండె పొంగగా
అశ్రులు నిండిన కన్నులతోను
రక్షగ రాముని చుట్టుచు ఆమె
ప్రదక్షిణముగ తిరిగినదపుడు

అంతట తల్లి అమిత దుఃఖమున
లేగను జేర్చెడి గోమాతవలె
రామచంద్రుని దరికి తీసుకొని
కౌగిలించెను - అశ్రులు రాల్చెను.

ముఖమును గాంచెను మసకకమ్మెను
తిరిగి తనయుని గుండెకు జేర్చెను
భుజములు నిమిరెను పరవశించెను
మరల మరల తన గుండెలొ నిలపెను.

మాతృమూర్తి పాదమ్ముల పైన
భక్తిగ ప్రణమిడె రామచంద్రుడు
మరిమరి వందన మిడెను తల్లికి
సీతను చూడగ ముందుకు సాగెను

॥శ్రీరఘురాముడు॥

# 26 రాముడు సీతకు వనవాసము చెప్పి-కర్తవ్యము బోధించుట

రాజవీధిలో రామచంద్రుడు
పాదచారయ్యై నడచుచుండగా
చలించిపోయిన జనుల గుండెలు
పరచుకొన్నవా రాచబాటపై

విషయమేమియు తెలియని సీత
వేచియున్నది భర్త రాకకై
భావి నేతకు శుభము కోరుచు
దైవ పూజలు చేసిన దామె.

సతీ ధర్మము తెలిసిన సీత
సహధర్మిణి - ఆ జనక రాజ సుత
రామ పాదములు పూజించుటకై
వేచియున్నది సంబారములతొ.

మందిర మెంతో సందడి నిండెను
అలంకారముల శోభిలుచుండెను
రామచంద్రుడా మందరమ్ములో
అడుగు పెట్టెను సవ్వడి లేక.

భర్త ముఖమును చూచెను సీత
భరించరాని దిగులు నందెను
గుండె నిబ్బరము కలిగి యున్న
సీత నేత ముఖమామె చదివెను.

భర్తను గాంచి సీత పలికెను
''స్వామీ! ఇది విడ్డూరము కాదా
రాజ లాంచన, శ్వేత ఛత్రములు
కనబడవేమి కల ఏమో ఇది.

వంది మాగధులు వింజమరలు
వదలి మీరిటు కదలి వచ్చిరి
పుష్యమి తారలొ అభిషేకమ్మది
జరుగుననుచును విప్రులు చెప్పిరి.

అభిషేకమునకు అనువుగ మిమ్మల
అలంకరించి కొనిరారేమి
బంగరు రథము, ముందర లేదా
శత్రుంజయము ఏనుగు ఏది.

ముఖమున ముదము కనబడదేమి
మదిలో దిగులుతొ నుంటిని స్వామి
మిమ్మల నిటుల చూచుట ప్రథమము''
అనుచు ఏడ్చినది ధరణీనందిని.

రాముడు మెల్లగ సీతతొ పలికెను
''సీతా! వినుము నాదు జనకుడు
వనవాసము నాకాజ్ఞాపించెను
వేగమె సాగెద కాననసీమకు.

పూర్వకాలమున దశరథ ప్రభువు
రెండు వరములు కైకకు యిచ్చెను.
తల్లికైక ఆ రెండు వరములు
కోరుకొన్నది ఈ తరుణములో.

భరతుని పట్టము - నావనవాసము
అమ్మ కోరిక వరములు సీతా!
ధర్మపథమున నడిచే తండ్రి
కాదనలేడు ఆ వరములను

కానకు బోవుట ధర్మ సమ్మతము
తలదాల్చుటది తనయుని ధర్మము
జనక వంశమున పుట్టితి వీవు
సర్వ ధర్మములు తెలిసిన దానవు.

అడవికి నేనే పోవలె సాధ్వీ
నీకు చెప్పగా వచ్చితి నిటకు
కోసల భూపతి భరతుడు వచ్చి
నీ ఆశీస్సులు కోరును సీతా!

భరతునిముందు నను కీర్తించకు
ప్రభువులు దానిని సహించలేరు
నేత సర్వదా పొగడు వారినే
ఆదరించుటది లోక సహజము.

వదినవు కావున బంధుత్వముతో
పోషణ భారము భరతుడు చూచును
భరతరాజును దశరథరాజును
గౌరవించుచు మన్నన పొందుము.

ఉపవాసములు వ్రత దీక్షలతో
కాలము గడుపుము జనకనందినీ
ఉషఃకాలమున పూజలు జేసి
మామగారికి నమస్కరించుము.

కృశించి పోయెడి కౌసల్యమ్మకు
హితమునుచెప్పి ముదము గూర్చుము
నా తల్లులు నిను ఆదరించిరి
వారి సేవలు చేయుము నీవు

భరత శత్రుఘ్నులు వారిద్దరినీ,
ప్రాణముకన్న మిన్నగ నెంచి -
నీ తమ్మునిగా భరతుని చూడుము
పుత్రునిగా శత్రుఘ్ను నెంచుము.

ఓ వైదేహీ! ధర్మము విడువక
సత్యవర్తివై మసలుము నీవు
పరుల మనస్సులు నొప్పింపకుమా!''
అనుచు రాముడు సీతకు చెప్పెను.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 27 శ్రీరాముని అడుగుల సీత నడచెద ననుట

జనక రాజసుత మంగళ కారిణి
మధుర భాషణము చేయగ నేర్పరి
మదినొప్పించుట తెలియని మానిని
ఆమె మదిని నొప్పించ రెవ్వరును.

భర్తమాటలు విన్నది సాధ్వి
అలుక నిండెను సతి సీతమ్మ
భర్తతొ పలికెను - రాజపుత్రుడిటు
సహధర్మిణితో పలుకుట తగదనె.

''స్వామీ! మీరిటు పలుకుట తగునా
సుఖదుఃఖములను భర్తతొ తాను
పొందెడి అర్హత భార్యకున్నది
అడుగుల నడచే హక్కు వున్నది.

అడవి మార్గమున ముందుగ నడచి
త్రోవ మెత్తగ నణగ త్రొక్కుచు
నడక సుకరము చేసెద స్వామీ!
వనవాసమునకు వెంబడి వత్తును.

మీతో బాటు పుణ్యఫలమును
మీరనుమతినిడ అందుకొందును
ఆడుది ఇటుల మాటాడినదని
కినుక వలదయా కారుణ్యాలయ.

వనవాసము - నా నిర్ణయమిదియే
వలదని వెడలుట ధర్మముకాదు
కోర్కెలు కోరను, ఫలములు తిందును
కష్టమెంతయును కలుగనీయను.

భర్తను నమ్మి అడుగుజాడలో
భార్య నడచుట నే నెరిగినది
నింగినైనను నేలనైనను
పడతి నడుచుట పతి అడుగులలో

మీ రక్షణలో వన సౌందర్యము
మనసునిండుగా చూతును స్వామీ!
నేత్రపర్వముగ పర్వతాలను
నదీనదముల చూతును హాయిగ.

నాథా మీతో వచ్చుట తప్పదు
క్రూరమృగములు నిండియున్నను
నిర్జనమై కారడవి యున్నను
మీ వెంబడి నే నుండక తప్పదు..

మీ వెంబడి నే సరస్సులందు
నియమము నిండి జలకములాడెద
మీ సన్నిధిలో వనవాసమ్ము
లక్షల ఏండ్లును - సుఖవాసంబగు.

మీ సేవలు నే చేయుచున్నచో
పుట్టినింటిలో నున్నటు తలచెద
సేవ దొరకనిచొ, మూడు లోకముల
ఆధిపత్యము సుఖము నీయదు.

మీకు దూరమై స్వర్గవాసము
నిముసమైనను భరించలేను
రామరక్షలో భయమసలుండదు
రామపాదములు వదలియుండను.

వీరపుంగవా వనవాసములో
బ్రహ్మచారిణిగ సేవలు చేతును
ఎందరినైనా కాపాడగల
శక్తిమంతులే నే బరువగుదున?

ఎదలో మిమ్ము పదిలపరచితి
హృదిలో పదములు నిలుపుకొంటిని
మీ వెంబడి నను రావలదన్నచొ
అసువులు నావి మిగలవు స్వామీ!''

అనుచు సీత తా ప్రార్థించినను
దయాసముద్రుడు రామచంద్రుడు
అడవులలోగల యిడుములన్నియు
చెప్పసాగెను సీతాసాధ్వికి.

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

## 28 వనవాసకష్టము శ్రీరాముడు సీతకు చెప్పుట

ధర్మవత్సలుడు రామచంద్రుడు
వనవాసములో కష్ట సుఖములు
హృదయేశ్వరికి తెలియబరచెను
కనుల భాష్పముల సీత విన్నది.

ఉపవాసములు ఆయాసములు
సుమబాలవు నువు భరించలేవు
జటావల్కల ధారణచేసి
అతిథి దేవుల పూజించవలె.

''ఉత్తమ కులమున పుట్టిన దానవు
ధర్మ విచక్షణ కలిగినదానవు
నీకు స్వతంత్రతలేదని తెలియద?
నా మాటలు మన్నించవలె కద!

నియమ నిష్ఠతో ప్రతిదినమున్ను
మూడు ప్రొద్దులా స్నానముచేసి
ఋషి మాదిరిగా జీవించవలె
అర్ధాకలితో గడుపుచుండవలె.

వనవాసమది కష్టమైనది
జలపాతములతొ భయము గొలుపును
భీకరమృగముల అరపులెగయగ
ప్రాణాంతకమగు ప్రాణులుండును.

హోరు గాలులు జోరు వానలు
కటిక చీకటులు కంటక తరువులు
పాములు తేళ్ళు విష కీటకములు
వనవాసము అతి కష్టమైనది.

మొసళ్ళు నిండిన నదులుండునట
మెసల నీయని బురదనేలలట
ముళ్ళతీగలు నీళ్ళు దొరకవు
రాలిన పండ్లే తినుచు బ్రతకవలె.

ముళ్ళను పోలిన దర్భలు నిండి
అడుగిడనీయని తరువులు లతలు
అసాధ్యమైనది అరణ్యవాసము
ఆవేశముతో పలుకుట తగదు.

కోపము వలదు జనక నందిని
యోచన చేసి పలుకుచుంటిని
నీవిట నుండుట యుక్తమైనది.
అన విని సీత దిగులు పడినది.

॥శ్రీరఘురాముడు॥

❃❃❃

## 29 వనవాసమునకు వత్తునని సీతాదేవి ప్రార్థన

కనుల భాష్పముల సీత పలికెను
పతి దేవుని ప్రార్థించెను యిటుల
''స్వామీ! అడవుల యిడుములన్నియు
మీ సన్నిధిలో సుఖము లేయగు.

మూర్తిగ నిలచిన ధైర్యమె - మీరు
మృగములు మిముగని బెదరిపోవును
మీ వెనకనె నేనుందును గావున
నాకామృగముల భయమసలుండదు.

సహధర్మిణిని అనుసరించవలె
అటు కాదన్నచొ బ్రతుకుట జరగదు
మీ సన్నిధియే రక్షణ నాకు
పరులెవ్వరు నను చూడగ లేరు.

మీ సేవలవి పాప హరణములు
మిమ్ముల మించిన దైవము లేదు
ఈ లోకములో పై లోకములో
మిమ్మొడబాసి నేమనలేను.

భర్త వదలిన స్త్రీ బ్రతుకు టెటు?
మీరే నాతో చెప్పిన ధర్మము
నా జాతకమున వనవాసమ్ము
లిఖించబడినటు పెద్దలు చెప్పిరి.

కన్యను తండ్రి ధారపోయుచు
భర్తయె సర్వము అనుచు చెప్పును
ఇహపరములలో అతడే గతియని
వేద మంత్రములు వింటిరినాడు.

నా బాల్యములో ఒక తపస్విని
నన్ను గాంచి నా భవిత చెప్పుచు
భర్తతొ నేను కొంత కాలము
వనవాసమ్ము చేసెద ననెను.

సేవలు చేసే భక్తురాలను
అడవుల నడచే అర్ధాంగిని - నే
సుఖ దుఃఖములలో భాగస్వామిని
రావల దనుటకు కారణమేమి.

ఎన్నో మారులు గంగాతటమున
తపోభూముల వసించ కోరుచు
మిమ్మడిగితిని మరచిపోతిరా
కావున వనముకు నడచెద నేను.

కాదని నన్ను యిటవుంచినచొ
విషము త్రాగియో జలముల బడియో
అగ్ని దేవుని సాయము గొనియో
అంతమగుటది నా నిశ్చయము.''

కంటి నీటితో ఆదరెడి పెదవుల
దుఃఖ తప్తయై నిలచెను సీత
ఒంటరి స్త్రీని వనముల గొనిపో
తగదని రాముని మదిలో యోచన.

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

## 30 సీత కోర్కెను శ్రీరాముడు మన్నించుట

భర్త వెంబడి వనవాసమ్మును
నిశ్చయించుకొనె సీతాదేవి
పౌరుష మెగసెను రాముని మాటల
కోపము వినయము-నిండి పలికెను.

''నాథా! మీరు సుందర మూర్తులు
అందరి మనసులు భ్రమించి పోవును
పురుష రూపమున నున్నస్త్రీయని
తలంచగలడుజనక భూపతి.

అడవుల యందు అలి రక్షణ
చేయగ లేక - ఇట వదలిరని
లోకులాడరా! ఆలోచించుడు
అల్లుని ఘనతకు మామ దుఃఖిలు.

పరాక్రమమ్మున ప్రశంసనీయులు
రవివలె తాపము నింపగ చాలిన
మీరే నన్ను వదలి సాగిన
మీ వీరత్వము చులకన చేయర!

వెంబడి గొనిపో సంశయమేల
కాని పనియది కానేకాదు
సత్యవంతునితో సావిత్రివలె
నాథుని ఛాయగ నడతును నేను.

నాథుని వదలి నే మనలేను
నవయవ్వనమున వుంటిమి మనము
తమ్ముని పంచలో వుంచుట తగునా
అత్తమామల సేవ చేయనా?

తల్లిదండ్రుల సేవ చేయుట
తనయునిగా మీ ధర్మము అగును
భార్యగ మీకు సేవ చేయుటే
నాకు తెలిసిన పరమ ధర్మము.

తపసుకుగానీ వనముకుగానీ
స్వర్గవాసమే చేయగ సాగుచు
మీరు నడువగా మీ వెంబడి - నే
ఉండవలెనని మీకు తెలియద?

మీ సన్నిధియే పెన్నిధి అగును
కంటక తరువులు పూలచెట్లగు
ధూళి - చల్లని చందనమగును
పచ్చికనేల పట్టుపరుపగు

మీ చేతులతో యిచ్చెడివన్నియు
అమృతతుల్యములగు భోజనమగు
మీతో వనముల సంచరించగా
అయోధ్య, మిధిలలు గుర్తుకురావు.

మీకు కష్టములు కలుగనీయను
మీకు బరువుగా ఉండను నేను
మీకు దిగులు నే కలుగజేయను
మిమ్ముల వదిలి స్వర్గము కోరను.

మీరులేని స్థలమది నరకమగు
మీ వియోగ మొక ముహూర్తమైనను
భరించలేను మీ ఎదుటనె - నే
ప్రాణత్యాగము చేయుట జరుగును.

ఒకటా రెండా పదునాల్గేండ్లు
మీకు దూరమై నే మనగలనా!''
అనుచు రాముని హృదిలో చేరి
విలపించినది సీతాదేవి.

దుఃఖము ఎగసి ధరణీనందిని
విషపూరిత శరఘాతమ్మునకు
నేలనుబడిన ఆడు దంతివలె
నిలబడలేక ధరణిని బడెను.

కాటుక రేఖలు కరగిపారెను
పద్మముఖమున అశ్రులు జారెను
కోసిన కమలము తీరుగ పోలెను
దుఃఖాగ్నికి ముఖమంత కమిలెను.

దుఃఖిలు సీతను గాంచెను రాముడు
కరములనెత్తి కౌగలించుకొని
పలికెను సీతతొ - స్వర్గవాసము
అమె లేనిచో వలదందుననె.

''రక్షణ చేయగశక్తి మంతుడను
మనో నిశ్చయము తెలియగ పలికితి
వనవాసమునకు సిద్ధపడితివి
వద్దన నింక వదలను నిన్నిట.

పూర్వపురాజులు వనవాసమ్మును
సపత్ని యుతముగ ఆచరించిరి
సూర్యదేవుని వెంబడి నిరతము
సువర్చలాంబ తిరుగుచుండుకద.

నాతోనీవు బయలుదేరుము
నే నీ దినమున సాగెదననుచు
కైకమ్మకట చెప్పివచ్చితి
మాతా పితరుల ఆనతి ధర్మము.

తల్లి దండ్రులు, గురుదేవులును
కనబడుదైవము లగుదురు సీతా!
వారిని కొలచిన ముల్లోకములు
స్వాధీనమగు - శిరోధార్యమది.

తపస్స్వాధ్యాయన క్రతువుల మించిన
ఫలము నిచ్చును పితృసేవయే
పుత్రుల ధర్మము అదియే అగును
బ్రహ్మాలోకము పుత్రుల కమరును.

వనముకు గొనిపోనెంచగలేదు
వనవాసము నువు చేతునంటివి
వంశగౌరవము ఇనుమడించును
నీకేభయము కలుగనీయను.

నాతో వనవాసమ్ము చేయుటకు
పుట్టినయట్టి సుందరాంగివి
నావెంబడి నువు లేకున్నచొనిక
స్వర్గమునైనా వుండగలేను.

సీతా! నీవు వనవాసమునకు
తగు ఏర్పాటులు చేయగవలెను
విప్రోత్తములకు మణిమయాదులు
దానము చేయుము ఆలసింపక.

అన్నార్తులకు అన్న దానమిడి
ఆభరణంబులు మన వాహనములు
పాన్పులు మొదలగు వస్తువులన్నీ
మన సేవకులకు యిచ్చి వేయుము.''

రాముని మాటల సంబరపడినది
మదిలో విభునకు వందనమిడుకొని
నిండుమనసుతో దాన ధర్మములు
అరంభించెను రాముని పత్ని.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 31 లక్ష్మణుడు అనుసరించుటకు శ్రీరాముడు సమ్మతించుట

అన్నా వదినల సంభాషణవిని
సుమిత్రతనయుని మనసు ద్రవించెను
కంటి నీటితో అనుంగుతమ్ముడు
రామ పాదములు స్పృశించి పలికెను.

''అన్నా! నీవు కానకుకదలుట
నాకే మాత్రము యిష్టములేదు
కాదని నీవు కదలనుంటివి
కావున ముందుగ నేనడచెదను.

ధనుర్ధారినై ముందు నడచెదను
క్రూరమృగమ్ముల చేరనీయను
మీ సేవలనే చేయుచుందును
హాయిగ మీరు కాలము గడుపుడు.

అన్నా! నిన్ను అనుసరింతును
నీవులేక అమరత్వము కోరను
స్వర్గవాసము ఒల్లను నేను
ముల్లోకముల పాలన వదలెద.''

లక్ష్మణమూర్తిని రావలదనుచు
ఎన్నో విధముల రాముడు చెప్పెను.
''నన్నెడబాయని తమ్ముడ నీవు
నీ సేవలవి సుఖముల నిడును.

మంచి మనసుగల ధర్మవర్తివి
ప్రాణసముడవు సఖుడవు సోదర!
నా సుఖములకై తపన పడెదవు
నీ సహచర్యము హర్షదాయకము.

నాతో నీవు వనముకు వచ్చిన
మన తల్లులను చూచెడి దెవ్వరు?
కైకమ్మ తన సవతులిద్దరిని
తిన్నగ చూచున - ఆలోచించుము.

తల్లిమాటకు లోబడి భరతుడు
వారి దుఃఖమును తీర్చగలేడు
నా మాట విని లక్ష్మణమూర్తి!
అపూజ్యులను కాపాడుమయా.

సర్వ ధర్మములు తెలియును నీకు
కౌసల్యా సుమిత్రలిద్దరిని
కంటి రెప్పలా కాపాడుచును
ముదము కూర్చి నా కోరిక తీర్చుము.''

రాముని పలుకులు వినిన తమ్ముడు
భక్తి వినయముల బదులు పలికెను
''అన్నా! భరతుడు నీ పరాక్రమము
తెలియునుగావున తొందరపడడు.

కౌసల్యమ్మ తన ఆశ్రితులకు
వేయిగ్రామములు దానమిచ్చెను
ఆ యశశ్విని నన్ను బోలిన
ఎంతో మందిని ఆదరించును.

నాదు జననిని కాపాడగల
కరుణామూర్తి కౌసల్యమ్మ
కావున రామా వారిగురించి
చింతను వదలుము - నిజము నుడివితి.

రామా నేను నీకింకరుడను
నీ సేవలను ప్రసాదించుము
ధనర్బాణములు - గడ్డపారలు
గంపను తీసుకు అనుసరించెద.

కందమూలములు త్రవ్వితీయుచు
తాపసోత్తములు తినునాహారము
సమకూర్చెదను రక్షణ చేతును
నిర్భయమ్ముగా ఉందురు మీరు.

రామప్రభో! నే నిన్ను వదలను
దివారాత్రములు సేవలు చేతును
అదినాధర్మము నా నిర్ణయము''
అనగా రాముడు తమ్మునితోననె.

''లక్ష్మణమూర్తి! నీ స్నేహితులకు
వీడ్కోలిచ్చి వేగమెరమ్ము
జనకుని యజ్ఞము చూడగ - నాడు
మనము వెడలగా వరుణు డొసగిన.

అక్షయాతూణీరమ్ములు ధనుసులు
అభేద్యమైన దివ్య కవచములు
రవితేజముతో వెలిగే కత్తులు
వశిష్ఠ మహాఋషివద్ద నుంచితిమి.

పూజార్థమయి ఉంచితిమచట
ఇపుడేపోయి తీసుకురమ్ము''
అనుచు రాముడు ఆనతిచ్చెను
లక్ష్మణుడటులే తెచ్చెను వాటిని

మిత్రులందరకు వీడ్కోలిచ్చి
ఆయుధాలతో తమ్ముడు రాగా
ఎదురుచూచెడి రాముడు పలికెను
తనమదిలోని మాట చెప్పెను.

''లక్ష్మణమూర్తి! నా ద్రవ్యమును
విప్రోత్తములకు మన ఆశ్రితులకు
దానమీయగా తలంచినాను
వారందరిని తోడ్కొనిరమ్ము.

వశిష్ఠ మహర్షి పుత్రులందరిని
స్వయముగ నీవే పిలుచుకు రమ్ము
విప్రోత్తములలో పరమపూజ్యుడగు
మన సుయజ్ఞుని పిలుచుకురమ్ము.

విప్రోత్తములకు సత్కారములిడి.
ఆశీస్సులను మనమందుకొని
అరణ్యావాసము చేయుట కొరకె
నేడే సాగెదమనెను రాముడు.''

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

# 32 సీతారాములు దానధర్మములు చేయుట

రామాజ్ఞను విని రామానుజుడు
సుయజ్ఞునకు తా విషయము చెప్పెను
మాధ్యాహ్నికమును పూర్తిచేసుకొని
రామసదనమును చేరె సుయజ్ఞుడు.

లక్ష్మికి నిలయము రామమందిరము
శోభల వెలిగెడి హేమమందిరము
అగ్ని హోత్రమేనడచునట్టుగా
వేదవిదుడు భవనమ్ము చేరెను.

సీతారాములు భక్తి మీరగా
నమస్కరించి ప్రదక్షిణించి.
విప్రోత్తముని కూర్చొన బెట్టిరి
అభిమానముగా కుశలము అడిగిరి.

మణిమయశోభిత బాహుపురులను
చెవికుండలములు బంగరు సరములు
రత్నాభరణ కంకణంబులు
రామచంద్రుడు విప్రునికొసగెను.

సీత అంతట కనుసన్నలతో
మదిలో మాట భర్తకు చెప్పెను -
అంతట రాముడు సుయజ్ఞుగాంచి
తనతో సీత వచ్చుట తెలుపుచు.

"భూసురోత్తమా నా యిల్లాలు
వనవాసమునకు వచ్చుచున్నది
ఆమె వస్తువులు నీకు యిచ్చును
నీ యిల్లాలికి ఒసగుము వాటిని."

ఆనందముగా సీతాదేవి
మణిమయశోభిత కంఠహారమును
బాహు పురులను బంగరుదండలు
విప్రోత్తమునికి దానము చేసెను.

రాముడంతట రత్నఖచితమగు
పర్యంకమును దానముచేసి
మేనమామలు ఇచ్చిన యట్టి
శత్రుంజయమను ఏనుగు నిచ్చెను.

శత్రుంజయముతొ సహస్రకరులను
రామచంద్రుడు దానము చేసెను
తరగని సంపద రాముని ప్రేమ
గొని ఆవిప్రుడు ఆశీస్సులనిడె.

చెంతనెవున్న లక్ష్మణుగాంచి
అగస్త్యపుత్రుని - కౌశికుతనయుల
ఆదరమ్ముగా తీసుకువచ్చి
తన సంపదను దానమీయమనె.

"వర్షధారలు పైరు పంటలకు
ముదము గూర్చునటు లక్ష్మణమూర్తీ!
మణిమయాదులను విరివిగనిచ్చి
వేదవిదులను సంతస పరచుము.

వెండి బంగరు గోధనంబును
భూమీసురులకు దానమీయుము
నిరతము అమ్మకు ఆశీస్సులిడే
వేదమూర్తిని సత్కరించుము.

పట్టువలువలు వాహనమ్ములు
దాసీజనమును దానము నిమ్ము
చిత్రరథుడు ఆ సూతుని పిలిచి
తృప్తినిండుగా దానము చేయుము.

నా మందిరమున వేదము చదివే
బ్రహ్మచారులు వేదమూర్తులు
చక్కని భోజన మపేక్షవారికి
పెద్దల మన్ననలందే యోగ్యులు.

ఎనుబది బండ్లతొ మణులనుయిమ్ము
ధాన్యముతో మరి వేయివృషభములు
దుక్కిటెడ్లు మరి రెండువందలు
పాడియావులొక సహస్రమిమ్ము.

లక్ష్మణమూర్తీ వారేగాక
నిరతరము అమ్మను చూడవచ్చెడి
వేదవేత్తలు ఎందరుగలరో
వేలగోవులొక్కొక్కరికిమ్ము.

లక్ష్మణమూర్తీ! మాతృమూర్తికి
ముదముగలుగునటు వేదమూర్తులకు
దానధర్మములు చేయుము ఇపుడే''
అనగా తమ్ముడు చేసెను అటులే.

రామచంద్రుడు దయాసముద్రుడు
కంటనీటితో నిలబడియున్న
సేవకులందర చూచిపలికెను
పేరుపేరున పిలచి పలికెను.

అయోధ్యనగరికి వచ్చువరకును
ఎప్పటి మాదిరి తమగృహములను
చూచుచుండుడు అని పలుకుచును
వారిభుక్తి కేర్పాటు చేసెను.

మిగిలిన ధనము తెమ్మని చెప్పెను
అంతులేని ఆధనరాసులను
వృద్ధులు, పేదలు, బాలురకిచ్చెను
లేమికలిగిన వారలకాచెను.

అటకు వచ్చెనొక పేదబ్రాహ్మణుడు
త్రిజటుడు అనెడి నామధేయుడు
కాయకష్టముతొ అడవుల తిరిగి
కందమూలములు త్రవ్వి తెచ్చుచు.

గంపెడు బిడ్డలు కలిగిన కొంపను
అతిభారముగా లాగుచుండెను
రామచంద్రుడు దానము చేయుట
వినిన భార్య తన భర్తతొ చెప్పెను.

''స్వామీ మాతో అయోధ్యకేగి
రామచంద్రుని దయను కోరుడు
వనముకు సాగే రామచంద్రుడు
లేదనకుండా యిచ్చుచుండెను.''

భార్యాబిడ్డల వెంటనిడుకొని
జీర్ణవస్త్రముల మేనుకప్పుకొని
నేరుగ సాగెను రాముని చూడగ
అడ్డులేక భవనమ్మును చేరెను.

రాముని చూచి త్రిజటుడు పలికెను
''కరుణామూర్తీ! కటిక పేదను
బహుసంతతితో కంద మూలముల
కడుపే నిండక కుములుచుంటిని.

దయగొని రామా! దారి చూపుము
ఇల వెలసితివి ధర్మ మూర్తిగా''
మనసు కరిగిన రామచంద్రుడు
మందహాసముతొ పలికె విప్రునితొ.

''భూసురోత్తమా! అల్లదె చూడుము
కనబడుచున్నవి ఆలమందలు
చేతనున్న తమ కఱ్ఱను విసరుడు
అది పడు దూరము నంతటి వరకు.

లెక్కిడకుండా ఆవులమందలు
తమ కర్పింతును - ఇంత వరకును
దానము చెయ్యని ధేనువులవ్వి''
అనగా త్రిజటుడు ఆనందముతో

చింకి పాతను నడుముకు చుట్టి
చేత కఱ్ఱను గిరిగిర త్రిప్పి
బలము నంతను భుజమున నింపి
విసెరెను కఱ్ఱను ఉత్సాహముతో.

విసరిన కఱ్ఱ - కక్ష్యలు దాటి
సరయూ దాటి ముందుకు సాగి
ఆవలి గట్టున వేల కొలదిగా
ఆవులదాటి నేలను బడెను.

విప్రుని శక్తికి అచ్చెరు వందిరి
రామచంద్రుడు కౌగలించుకొని
ఆ గోవులను విప్రునికిచ్చి
విప్రుని గాంచి పలికె ప్రియముగ.

''దానము కోరి వచ్చిన మీకు
పరీక్ష పెడితిని అనుకొనవలదు
మీ శక్తిని మరి తెలియుట కొరకు
పరిహాసముగా నంటిని అటుల.

మదిలో కోరికలున్న తెలుపుడు.
ముదముగ తీర్చెద వాటన్నిటిని
విప్రుల కొరకే ధనమును దాచితి
అర్హులు మీరు కోరుడు అనెను.''

విప్రోత్తముని మది పులకించెను
మరి ఇంకేమియు అడుగక నతడు
సీతారాములు లక్ష్మణమూర్తికి
మనసు నిండుగా ఆశీస్సుల నిడె

అర్హులందరికి యోగ్యత తెలిసి
దానమీయమని చెప్పెను రాముడు
రిక్త హస్తముల పోలేదెవ్వరు
లేదను మాట లేనేలేదు.

విప్రులందరూ భృత్యులందరూ
దేహీ అను వారందరు ముదముగ
ఆ ముర్వురకు ఆశీస్సులనిడి
దీర్ఘాయుష్యును కోరుచు వెడలిరి.

||శ్రీరఘురాముడు||

❋❋❋

## 33 శ్రీరాముడు దశరథుని అనునయించుట

రామచంద్రుడు లక్ష్మణమూర్తితో
సహధర్మిణియగు సీతాదేవితో
తండ్రివద్ద సెలవందుకొనుటకై
రాజమార్గమున నడువసాగెను.

రామలక్ష్మణుల ఆయుధాలను
అలంకరించెను సీతాదేవి -
సీతాదేవికి ఇరుప్రక్కలను
మెరయు ఆయుధము లందుకుసాగిరి.

రాజవీథులలో రద్దీ పెరిగెను
ప్రభువును చూడగ క్రిక్కిరిసినవి
సామాన్యునివలె సాగెడి రాముని
మేడలు భవనము లెక్కి చూచిరి.

రాజలాంఛనము లేమియులేవు
అచ్ఛాదనకై ఛత్రములేదు
పాదచారియై సాగుచుండెను
చలించిపోయెను జనుల గుండెలు.

కనుల వెంబడి నీరు కారినది
కరిగి పారినవి వారి గుండెలు
కాదనకుండా దానములిచ్చి
కానకు కదలెను ధర్మరక్షణకు.

సిరిపంసదలను త్యజించివేసి
అందెడు సింహాసనమును వదలి
సత్యవర్తిగా తండ్రిని నిలపగ
సుకుమారుడు తా కదలెను అడవికి.

పరమసాధ్వి ఆ జనక నందిని
పరుని కంటికి కనబడ దెపుడు
నింగి భూతముల కంటి కగబడని
కమలనేత్రి కనుపించెను అపుడు.

దశరాథరాజుకు దయ్యముపట్టెను
ధర్మమధర్మము మరచిపోయెను
కొడుకును అడవికి పంపుచుండెను-
పంపడు - అని మరికొందరు తలచిరి.

''కన్న కొడుకు గుణహీనుడైననూ
తండ్రి - తనయుని కానకు పంపడు
సద్గుణయుతుడు రామచంద్రుడు
సత్యధర్మముల నిధి రఘురాముడు.

అంతటి ప్రభువుకు కష్టము కలిగెను
మనకు రక్షణ మరి యిక ఏది
మండుటెండలకు నీరు యింకగా
బయటపడిన జలచరములైతిమి.

ద్యుతిమంతుడు శ్రీరామచంద్రుడు
జగత్తు అనెడి వృక్షము పోలును
ఫలపుష్పములు పత్రమ్ములవలె
మనమందరము ఆశ్రయింతుము.

ఆ వృక్షమునకు తల్లివేరిపుడు
నరకబడినది - మనమందరము
అనాథలైతిమి అతిత్వరలో
అంతరించెదము'' అనుచు వగచిరి.

''రామానుజుడు అనుసరించినటు
రామచంద్రుని వెంట సాగెదము
రామునికన్న గృహములు మిన్నా?
సుఖదుఃఖములలో భాగమందెదము.

గృహములన్నియూ కళాహీనమై
దుమ్ము ధూళితో ఎలుకల మయమై
జపహోమములు యజ్ఞ కర్మలు
వంటలు లేక వెలవెల బోవును.

దుర్భర క్షామమునందు గృహములు
పాడుబడినటు కాంతులు మాయును
రాముడు లేనిచో అయోధ్య - ''అడవి''
రాముడున్నచో అడవియె అయోధ్య.

పాడుపడిన ఈ అయోధ్య నగరము
కొడుకుతొ కలిసి కైకే ఏలును
రామ సన్నిధి స్వర్గ ధామమై
అరణ్యమైనను సుఖముగ నుందుము.''

మనలను చూచి క్రూర మృగములు
ప్రాణ భయమున పరుగిడిపోయి
మనము వదలిన అయోధ్యయందు
మనుగడ సుఖముగ కొనసాగించును.

జనవాక్యంబులు రాముడు వినెను
దీరోధాత్తుడు చలించలేదు
మత్తేభము వలె ముందుకు నడచి
దశరథ విభుని భవనము చేరెను.

చెంతనె వున్న సుమంత్రు గాంచెను
రాక తెలుపుమని రాముడు కోరెను
నిట్టూర్పులతో బరువగు గుండెతొ
అడుగులు తడబడ లోనికి నడచెను.

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

## 34 రాముని నిశ్చయము మారదని దశరథుడు తెలియుట

తామర రేకుల కన్నులవాడు
సన్నని నడుము అందములొలికే
ధర్మాత్ముడు శ్రీరాముడు మంత్రితొ
తన రాకను అట తెలుపగ కోరెను.

''రామా-రామా'' నామ స్మరణతొ
దుఃఖ తప్తుడై ప్రభువుండగను
దిగులు భయములతొ ఆ సుమంత్రుడు
కరములు మోడ్చి నమస్కరించెను.

రాముడంపగా దుఃఖమునున్న
సుమంత్రుడంతట లోనికిబోయి
నిట్టూర్పులతో కలత నిండిన
దశరథరాజును గాంచెనచ్చట.

శుభాశీస్సులు - చల్లగ పలుకుచు
మెల్లగ ప్రభువుకు వార్తను చెప్పెను
''దర్శనమ్మునకై రాముడు వచ్చెను
దానధర్మములు చేసి వచ్చెను.

రాహు వాతబడు చంద్రబింబమై
నివురు గప్పిన అగ్ని హోత్రమై
నాచు నిండిన తటాకమన్నటు
మనసు కలతపడి ఉండెను రాజు.

వనవాసమునకు బయలుదేరుచు
రవివలె తేజము నిండిన రాముడు
సతి సోదరులతొ కలిసి వచ్చెను
దర్శనమిడుడు ధర్మమూర్తికి.''

ధర్మనిరతుడు సత్యసంధుడు
సంద్రమువలె గంభీరుడు రాజు
నింగిని పోలెడి నిర్మలమూర్తి
తన భార్యలను రప్పించమనె.

ఆనతి వినిన సుమంత్రుడపుడు
వారందరిని రప్పించగను
వనవాసమువిని కంటనీటితో
వగచుచు వచ్చిరి రాజువద్దకు.

తండ్రి ఆనతి మంత్రి తెలుపగ
లోనికి నడచెను రామచంద్రుడు
ముకుళిత హస్తములున్న రాముని
ముందర గాంచెను దశరథరాజు.

సీతా లక్ష్మణు లిద్దరుకూడా
రాముని వెంబడి నడచుచువచ్చిరి
దుఃఖము నిండిన దశరథరాజు
ఎదురుగనేగి మూర్ఛిలిపడెను.

రామలక్ష్మణులు పరుగిడి వచ్చిరి
రోదననిండి సతులు వచ్చిరి
ఆభరణంబుల ధ్వనుల - ఏడ్పుల
కంపించినదా రాజ భవనము.

రామలక్ష్మణులు సీతాదేవియు
సపర్య చేసిరి దశరథరాజుకు
స్పృహ వచ్చినది అయోధ్య నేతకు
రాముడు పలికెను అప్యాయముగ.

''ఓ మహరాజా! ప్రభవులు మీరు
మీ ఆనతితో దండకవనికి
బయలు దేరితిమి వనవాసముగా
సీతయు లక్ష్మణుడనుసరించిరి.

వలదని చెప్పిన వినకున్నారు
వెంటవచ్చుటకు అనుమతి నీయుడు
విధాత- జనులకు భూమిని తిరుగగ
ఆనతిచ్చినటు అనుమతి నీయుడు.''

వనవాసమునకు సాగుచునున్న
తనయుని గాంచి తండ్రి పలికెను
''వరముల నిచ్చి మోసపోతిని
వనముల కేగక రాజ్యము నేలుము.''

వినయ శీలుడు ధర్మమూర్తియగు
రాముడు పలికెను తండ్రితొనపుడు
''బహుకాలమ్మీ అయోధ్య నేలుచు
సత్యవర్తులై యశము గడించిరి.

అసత్య దోషము నావల్లను మరి
మీకు కలుగక నే నడువవలె
అదే విధముగ మీవల నాకు
అఘము కలుగక మీరు చూడవలె.

పదునాల్గేండ్లు యిట్టే గడుచును
తొమ్మిదేండ్లును ఆపై అయిదు
అడవుల గడపి అడుగిడిపురమున
పదములనంటి యశము గడింతును.''

ధర్మవర్తుడై దుఃఖ తప్తుడై
రాజు ఉండగా కైకాదేవి
త్వరగా అడవికి పంపమనుచును
పలుకు చుండెను రాజుతో మెల్లగ.

అప్యాయముగ రాజు పిలచెను
''రామా! సాగుము వనవాసమునకు
తిరిగివచ్చి ఈ ధరను ఏలుము
ఇహపర సౌఖ్యములమరును నీకు.

సత్యసంధుడవు సద్గుణయుతుడవు
ధార్మికమూర్తివి రఘుకుల శశివి
వనవాసమ్ము మదిలొ నిలచెను
వలదని చెప్పి మాన్పగవశమా!

నేటి రాత్రి ఇట నిలువుము రామా!
కన్నులార నిను గాంతును రామా!
మాతాపితరుల మా ఆనందము
మాదరి నీవీపూట ఉండుట

పరలోకములో నాకు సౌఖ్యమిడ
రాజ్యభోగమును వదలుచుంటివి
అడవుల ఇడుములు కోరుకొంటివి
ఒరులెవ్వరు - ఇల - నీ సరిరారు.

సత్యవచనమిది రామా వినుము
అడవికి పంపే కోరిక లేదు
నిలువునకాల్చెడి నిప్పే కైక
నన్నీవిధముగ మోసము చేసెను.

అప్పటి వరములు కోరుట ఇప్పుడ?
తప్పని సరియని పట్టుపట్టుటా?
తనయునైనను అడవికి పంపుట
కైక గుండెలో క్రూరత్వమిది.

వంశాచారము మంటగలిపెను
జ్యేష్ఠ కుమారుని అడవికి పొమ్మనె
ఆమె కోరిక తీర్చుట కొరకై.
కదలుచుంటివి కాననసీమకు.''

కంటి నీటితో దశరథరాజు
కన్నకొడుకును చూచుచుండగా
రాముడు పలికెను వినయము నిండి
దృఢనిశ్చయమును తెలియబరచెను.

''తండ్రీ! మీరు నా విషయములో
వంతనొందుట ఎంతయు తగదు
సుఖములు నిరతము యివ్వలేరుగద
నేనా సుఖములు వదలి వేసితి.

వనముల కేగుట నా నిశ్చయము
చెదరని నిర్ణయమది మహరాజా!
తల్లి వరములు తీర్చుట ధర్మము
తండ్రి యాజ్ఞ తలదాల్చుట ధర్మము.

రాజ్యము నేలగ కోరికలేదు
సుఖములు నామది కోరుటలేదు
మీ ఆనతి నెవేర్చుట ధ్యేయము
దిగులుతొ అశ్రులు రాల్చగవలదు.

గంభీరమగు కడలి ఎంతయు
కలవరపడదు - అంతటి మీరు
సత్యవ్రతముతో శోభిలువారు
ఆడితప్పుట నే వినలేను.

తండ్రి యాజ్ఞ తలదాల్చుట మోదము
కష్టపడెదనని కాదనవలదు
అసత్య దోషము మీకు వచ్చుటది
సహించలేను సెలవీయుడయా.

సత్యముపైన ఆన చేసితి
నా సుకృతమున బాస చేసితి
నిలబడనిచట ఒక క్షణమైనను
తల్లి కోరినది - వల్లె యంటిని.

సత్యవ్రతముకై సర్వసుఖములు
సునాయాసముగ వదలుకొందును
కావున రాజ్యము వదలుటన్నది
ఘనకార్యమ్మది కానేకాదు.

సురలకు సైతము జనకుడు దైవము
కావున తండ్రే నాకు దైవము
వనవాసమును పూర్తి చేసుకొని
దర్శించెదను ధర్మప్రభువును.

జానకితోను లక్ష్మణుతోను
వన సౌందర్యము ముదముగ తోచును
మదిలో దిగులును వదిలి- మీరిక
సుఖముగ నుండుడు ఓ మహరాజా!''

తల్లుల దుఃఖము తీర్చవలసిన
మీరే దిగులుతొ వంతనొందెదర?
సిరిసంపదలతొ శోభిలు రాజ్యము
భరతునికీయుడు చల్లగ నేలగ.

రాముని మాటలు విని దశరథుడు
దుఃఖము పొంగి పెద్దగ ఏడ్చుచు
గుండెకు తనయుని హత్తుకొనుచును
ఆగలేక తా మూర్ఛిలిపడెను.

కైకేయి తప్పు - మిగిలిన వారు
బిగ్గరగా రోదించి రప్పుడు
అంతయు గాంచి మంత్రి సుమంత్రుడు
దుఃఖము ఎగసి మూర్ఛిలిపడెను.

॥శ్రీరఘురాముడు॥

## 35 సుమంత్రుడు కైకకు హితవు చెప్పుట

స్పృహ తప్పిన ఆ సుమంత్రునకును
తెలివి వచ్చెను ముఖము ఎర్రబడె
దశరథతేని హృదయము తెలిసెను
మదిలో బాధను తెలుపనెంచెను.

ములుకుల పలుకుల ముద్దుల రాణికి
మదిలో వ్యధ కలిగించ నెంచెను
ఆమె మనస్సును అందరి ముందర
తేటతెల్లము చేయగ పలికెను.

''ఓ మహారాణీ! జగతి కంతటికి
దశరథరాజు ప్రభువని తెలియద?
వారి మాటలే కాదంటిరి గద
మీకసాధ్య మిల లేనేలేదు.

ఇంద్రుని పోలిన అజేయు డాతడు
హిమగిరి పోలిన నిశ్చలు డతడు
క్షోభకు లొంగని సంద్రము బోలును
దుఃఖ తప్తునిగ చేసిరి మీరు.

ప్రభువు మనుగడ సాగనీయరో!
వంశనాశము చేసి వేతురో -
అమ్మా - అతడు సద్గుణ యుతుడు
మనకందరకు పోషకుడమ్మా!

కోటి కొడుకులను పెంచుటకన్న
కూరిమి పెనిమిటి సేవలు మిన్న -
అదియే ధర్మము తెలియద మీకు!
రాజార్హత మరి జ్యేష్ఠునిదే కద.

వంశాచారము మంట గలుపుచు
భరతునిచే భువి నేలించినచో
రాముని వెంబడి సాగెద మమ్మా!
వివేకులెవ్వరు అయోధ్య నుండరు

మీ కోరిక విని పుడమి యింకనూ
చీలక పోవుట ఆశ్చర్యమ్మో -
బ్రహ్మఋషులు తమ శాపతాపముల
చంపక మిమ్మల బ్రతుక నిచ్చిరా!

మధుర ఫలములను మామిడి యిచ్చును
ఎరువులు వేసిన - వేప ఈయదు
పట్టపు రాణిని మించి మిమ్మలను
ఆదరించుటకు ఫలమిపు డొసగిరి.

ఉన్నత వంశము నందున పుట్టియు
తల్లిగుణములతొ ఉద్భవించిరి
మీ అమ్మగారి వృత్తాంతమంతయు
లోక విదితము తెలియబరతు విను.

ఒక మహనీయుడు మీ జనకునకు
సర్వప్రాణుల భాషలు నేర్పెను
ఒక దినమున మీ నాయనగారు
చీమల సంభాషణ వినినవ్విరి.

నవ్వుకు కారణమడిగెను భార్య
తనను గూర్చి యే నవ్వెననుకొని
మరి మరి అడిగెను పట్టుబట్టెను
వలదన్నను మరి వినదా తల్లి.

భాషను నేర్పిన మహానుభావుని
విషయము అడుగగ ఆ మహనీయుడు
ఆ రహస్యము తెలియబరచిన
తలపగిలి మరి చత్తువు అనెను.

చెప్పిన చత్తును అనె మహరాజు
చెప్పి చావమనెఆ యిల్లాలు
మరియొక మార్గము లేదని తెలిసి
బయటకు గెంటెను దుష్టరాణిని.

నీ తల్లిని మరి బయటకు గెంటగ
సుఖపడెనమ్మా నీదు జనకుడు
మూడుమూర్తులా తల్లికి తగిన
ముచ్చట గుణముల మూర్తివి నీవు.

మోసముచేసి పొందిన వరములు
చెల్లించునని ఆశపడకుమా!
రాముడు జ్యేష్టుడు రమ్యగుణాఢ్యుడు
ధర్మ రక్షకుడు లోకహితుండు.

రామచంద్రునికి పట్టము కట్టగ
నిర్ణయించెను దశరథరాజు
వారి మాట మరి చెల్లకపోయిన
అపకీర్తి గదా ఆలోచించవ!

సదాచారుడు దానగుణాఢ్యుడు
ధరణి నేలగా యోగ్యుడాతడు
పట్టాభిషేకము జరగనీయుము
ధర్మ హానిని కలుగనీయకు.

రాముని వనవాసమ్మని వినిన
ప్రజలు దుఃఖమున మునిగిపోయిరి
వారందరిని సంతస పరచుడు
పాపులు చెప్పిన బోధలు వినకుము

వనవాసమ్ము ఆగకపోయిన
నీ కపవాదు వచ్చి తీరును
జ్యేష్ట కుమారుని రాజుగ జేసి
దశరథరాజు తపసుకు వెడలును.''

భూవిభుడైన దశరథరాజు
మీకు విభుడని మరువకు తల్లీ!
రాజ్యము కన్నను మిన్నగునట్టి
సిరిసంపదలతొ వరములు తీర్చును.

సుమంత్రుడాడిన పలుకుల కెంతయు
చలించలేదు కైకాదేవి
మది కాఠిన్యము కనడుచున్నది.
జంకక గొంకక నిలబడి యున్నది.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 3 6 రాముని వెంబడి సిరిసంపదలను పంపెదనని దశరథుడు అనుట

మాట తప్పక మధనపడుచును
కంట నీటితో దశరథ రాజు
సుమంత్రు గాంచి ఆనతిచ్చెను
రత్న రాసులను రామునికిమ్మనె.

గాయకులను మరి అందగత్తెలను
త్రోవను చూపెడి బోయవాండ్రను
రాముని అడుగుల నడచెదమనెడి -
జనులందరినీ వెంట పంపమనె''

చతురంగబలములు అస్త్ర శస్త్రములు
రాముని వెంబడి పంపుము అనెను
ఆశ్రితులను మరి అశ్వికసేనల
వర్తకులను మరి నర్తకులందర.

వారందరికి వలయు వస్త్రములు
సంబారమ్ములు సొమ్ములు యిమ్మనె
''ధనాగారము ధాన్యాగారము
రాముని వెంట పంపివేయుము.

సౌకర్యములు వెంట పంపిన
అడవుల రాముడు సుఖపడగలడు
పుణ్య నదులలో స్నానము చేయుచు
ఋషుల నడుమన వసించగలడు.

భోగ భాగ్యముల వనవాసమ్మును
రామచంద్రుడు చేయగవలెను
భుజబలముతొ ఈ అయోధ్య పాలన
భరతకుమారుడు చేయగవలెను.''

రాజు ఆనతిని విన్నది కైక
దిగులుతొ గొంతు తడి యారినది
బిక్కమొగముతో రాజును గాంచి
లజ్జ వదలి తా పలికెను అపుడు.

'' ఓ మహరాజా! రాముని వెంబడి
సర్వస్వమును పంపివేయుచు
జనులందరిని పంపినచో యిక
మిగిలిన దేనిని భరతుడు ఏలుట?

అట్టి అయోధ్యను భరత కుమారుడు
ఎంత మాత్రము గైకొనడయ్యా''
అనుచు పలికిన కైకను గాంచి
ఆవేశముతో పలికెను. రాజు.

చతురంగ బలములను పంపకూడదని
వరములొ నన్ను అడుగలేదు కద!''
సూటిగ రాజు వేసిన ప్రశ్నకు
తికమకపడి ఆ కైక పలికెను.

కైక కోపము ఇనుమడించెను
రాజుతొ పలికెను'' ఓ మహరాజా
తమ పూర్వీకుడు సగరుడు - తనయుని
వెడలగొట్టినటు పంపుడు రాముని.''

గట్టిగ అరచెను దశరథ రాజు
ఏవగించుకొని రందరు కైకను
అంతట వృద్ధుడు, యోగ్యుడు అయిన
సిద్ధార్థుడను మంత్రి పలికెను.

''అమ్మా కైకా! సగరతనూజుడు
అసమంజుడు అతి క్రూర కర్ముడు
అయోధ్యలోని పసిపిల్లలను
సరయూ నదిలో త్రోసి, మురిసెను.

దుష్టుని వేడుక భరించలేక
మొరపెట్టిన తన ప్రజల హితముకై
తనయుని తరిమెను సగర భూపతి
అట్టిశిక్షనిడె తన తనయునకు.

అసువులతో ఆ అసమంజుడట
అడుగిడరాదని ఆనతి నిడెను
ఆలితొ అతడు అడవులయందు
ఇడుముల బడుచు గడపెను కాలము.

అంతటి శిక్షను వేయుట కొరకై
రాముడు చేసిన తప్పిదమేమి?
దోష రహితుడు రామచంద్రుడు
దోషమొక్కటియు ఎంచలేవునువు.

నిరపరాధికి శిక్ష వేయుటది
నిలువున కాల్చే అధర్మమగును''
అనుచు పలికిన మంత్రి మాటలకు
రాజు పలికెను కైకను చూచి.

''దుష్ట బుద్ధివి మూర్ఖురాలవు
మంచి చెడ్డలు తెలియగ నేరవు
మంత్రి పలికిన మాటలు నచ్చవు
సన్మార్గంబును వదలి వేసితివి.

కైకా! రాజ్యము వదలి వేసితి
నీ తనయునితో ఏలుము స్వేచ్ఛగ
రాముని వెంబడి నడచెద నేను''
అనుచు పలికెను దశరథరాజు.

॥శ్రీరఘురామునుడు॥

❈❈❈

# 37 వశిష్ఠుడు కైకకు హితవు చెప్పుట

మంత్రి పలుకులు రాముడు వినెను
భక్తి వినయముల తండ్రితొ పలికెను
''ఓ మహరాజా! భరతుని కొరకై
సర్వ భోగములు వదల నుంటిని

అడవుల యందు కందమూలములు
తినుచు గడిపెడి నా సేవలకై
పరిచారకులు సేనలు ఎందుకు
నిరాడంబరము కావలసినది.

మత్తేభమును దానము యిచ్చి
కట్టు తాడునా - నే కోరునది
సర్వస్వమును భరతుని కీయుడు
నారబట్టలు నాకు ఒసగుడు.

కంద మూలములు త్రవ్వి తీయుటకు
పారయు గంపయు కావలసినవి''
అనుచు రాముడు పలుకుచుండగా
నార బట్టలు తెచ్చెను కైక.

సంకోచమ్ము మదిలో లేక
సంతోషమ్ము కనబడునటుల
ఆ ముగ్గురికి నార బట్టలు
కైక యిచ్చెను ధరించమనుచు.

రామలక్ష్మణులు అప్పటికప్పుడు
నారబట్టలు ధరించినారు
సీత మాత్రము నార బట్టలను
చూచి నిలచెను దిక్కుతోచక.

ముతక బట్టలు అతి చిన్నవవి
మేను దాచగా శక్తి చాలనివి
సిగ్గుతొ వంచిన తలతో జానకి
ధరించ నెంచెను ఆ వల్కలములు.

కట్టుకొనుట కవి లొంగకపోయెను
కంట నీటితో రాముని గాంచి
''నాథా! వీటిని తాపసాంగనలు
ఎటుల ధరింతురొ తెలియకున్నది.''

అంతట రాముడు వాటిని దీసుకు
చీరపైననే కట్టి చూపగను
ఆ దృశ్యము గని అచ్చటి స్త్రీలు
గుండె పగులునటు ఏడ్చిరి గట్టిగ.

వారందరును ముక్త కంఠమున
సీతను అచటే ఉంచగ కోరిరి
''తండ్రి యానతిని కానకు కదలే
రామా! సీతను ఉంచుము ఇచటే''

మంగళ కారిణి ముందర వున్నచొ
మా ప్రాణములు నిలచును రామా!
నిన్ను వేడినను - నీవిట నుండవు
సీతనైన మా ముందర ఉంచుము

ఉలుకక పలుకక కైక నిలచెను
విషయము సర్వము గ్రహించినట్టి
కులగురువైన వశిష్ఠ మహఋషి
కోపము నిండి కైకతొ పలికెను.

''కేకయ పుత్రీ! నీకిది తగదు
దుర్మార్గమునకు పాల్పడితివిగా
దశరథ విభునే మోసగించితివి
వంశ నాశనము చేయనెంచితివి.

ఇంత చేసినను చాలదనుకొని
సీతను యిడుమల పెట్టనెంచితివి
సీత ఇప్పుడు రాణియగును విను
భర్తదైన సింహాసన మెక్కును.

భర్త ఆత్మగా భార్య ఎంచబడు
వేదవాక్యమిది - తెలియుము నీవు
రామచంద్రుని ఆత్మ స్వరూపము
రామపత్ని ఈ ధర నేలవలె.

కైకాదేవీ, - కోడలు సీతను
నారచీరలు ధరించ మందువ?
మేలగు వలువలు భూషణంబులు
నీవు కోడలుకు ఈయవలెను గద.

దశరథ విభుని తనయుడైనచో
భరతుడు రాజ్యము ఒల్లడు వినుము
నిన్ను తల్లిగా గౌరవించడు
నీ వాత్సల్యము అతనికి హాని.

వంశాచారము భరతుడు త్రెంచడు
రాముడు వనముల వున్నటు వినిన
నార చీరలతొ శత్రుఘ్నునితో
రామ సన్నిధిని గడుప నెంచును.

రాముని వనవాసమ్ము కోరితివి
సీతకు ఆ నియమమ్ము లేదుకద
కావున సీత ఆభరణమ్ముల
అనురించనగు రామచంద్రుని''

వశిష్ఠ పలుకుల కైక చలించదు -
వనవాసమ్మే సీత నిర్ణయము -
భర్త మనస్సును తెలిసిన సీత
నారబట్టలు ధరించి నిలచెను.

✽✽✽

॥శ్రీరఘురాముడు॥

## 3 8 నార బట్టలు ధరించిన సీతను గురించి దశరథుని వే

రామపత్ని ఆ జనక రాజసుత
పరమ పతివ్రత అతి సుకుమారి
నార చీరలు ధరించి నిలువగ
కంట నీటితో కుమిలిరందరు.

దుఃఖతప్తుడై దశరథ భూపతి
కీర్తి ప్రతిష్టలు - బ్రతుకు పైననే
ఏవగింపుతో పలికెను కైకతొ.
ఉరుమునట్లుగా పలికెను కైకతొ.

''అతి సుకుమారి జనకుని తనయ
వనవాసమ్ము తెలియని బాల
సుఖపడ సిరిగల సుమలత - సీత
నారచీర లెటు ధరించగలదు.

ఇందరి ముందర ఈ పతివ్రత
నార చీరలతొ ఋషి పత్నివలె
నిలబడి యున్నది గుండెకరుగదా
ఏ మపకారము చేసెను సీత.

రాముని వెంబడి నార చీరలతొ
సీత వెడలునని వరమిడలేదు
భర్త అడుగుల సీత నడచినచొ
సర్వభూషితగ అనుసరించవలె.

కైకా-నాకు రోజులు తీరెను
కావున వరములు తీర్చెదనంటిని
పువ్వు పుట్టి అది వెదురు చెరచినటు
నా శపథము నను కాల్చుచున్నది.

పాపివి నీవు - దుష్ట స్వభావివి
సీతారాములు కలలోనైనా
నీ కపకారము చేసి ఎరుగరు
ఎందుకు పాపము ఒడిగట్టెదవు.

రాముని పొమ్మని కోరుకొంటివి
చాలదన్నటు - సీతను కూడా
నార చీరలతొ పంపుచుంటివి
నీ కోర్కెలలో భాగము కాదది.''

గుండె చించుకొని పలికెను రాజు
కంటనీరది కురియుచున్నది
కైక మనస్సది కరుగకున్నది
కరుడుగట్టి పాషాణమ్మైనది.

బయలుదేరుచు పలికెను రాముడు
''తండ్రీ తాము పరమధార్మికులు
యశోమూర్తి యగు కౌసల్యమ్మ
మిము నిందించక నిలచియున్నది.

దుఃఖ జలధిలో మునుగును తల్లి
దరికి చేర్చెడి భారము మీది
కోర్కెల నొసగే ఇంద్రతుల్యులు
నా ఈ కోర్కెను తీర్చుడు తండ్రీ!''

॥శ్రీరఘురాముడు॥

❃❃❃

# 39 కౌసల్యా సీతాదేవికి పతివ్రతల నడవడి చెప్పుట

మునివేషములో రామచంద్రుని
ముందర గాంచి మూర్ఛిలిపడిరి
దశథరాజు తన కుమారుని
సూటిగ చూడగలేక పోయెను.

దశరథరాజు తనలో ననుకొనె
''తల్లీబిడ్డల ఎడబాపితినా?
లేగల - తల్లుల నుండి లాగితి
పూర్వజన్మలో ఘూతుకమ్ములగు.

ఇంతక్లేశము భరించుచుంటిని
అసువులెట్టుల నిలచియున్నవో
కాలము - మీదకు రాకపోయినచొ
జీవుడు బొందిని వదలుట జరుగదు.

నిలచిన దర్మము జ్యేష్ట కుమారుడు
అగ్ని తేజమే రామచంద్రుడు
నారవల్కలము లమరియుండగా
నా ప్రాణములు పోలేదేమి.''

రామా! అనుచు పిలువనెంచెను
మాట గొంతులో నిలచిపోయెను
అతి కష్టముతో సుమంత్రు పిలచి
కంట నీటితో చెప్పెను రాజు.

''మంత్రి సత్తమా! రథమును తెమ్ము
రాముని దింపుము వలయుచోటను
సద్గుణయుతుని పంపుచుంటిని
గుణవంతుని కిది సన్మానంబగు.''

రాజు ఆనతిని సుమంత్రు డపుడు
రత్న భూషిత స్వర్ణ స్యందనము -
జాతి గుఱ్ఱములు పూన్చిన రథము
అతి తొందరలో సిద్ధము చేసెను.

మేలగు వలువలు ఆభరణమ్ములు
పదునాలుగేండ్లకు సరిపడునట్లుగ
సీతకు ఇమ్మని ఆనతి నిడగా
కోశాధ్యక్షుడు తెచ్చెను వాటిని.

ఆభరణమ్ములు అలంకరించుకు
ఆ భవనమ్మున సీతాదేవి
బాలభానుని వన్నెగ తోచెను
లక్ష్మిగ తోచెను చూచువారికి

కౌసల్యమ్మ ముందుకు వచ్చి
గుండెకు సీతను చేర్చుకు పలికెను
''అమ్మా! ఇలలో స్త్రీలందరును
సుఖముల - భర్తను గౌరవింతురు

ఇడుములయందు తమ పెనిమిటిని
సాధారణస్త్రీ లెక్కచేయదు
కలహమ్ములతో కాపురంబును
కూలద్రోయుటకు వెరువరు వారు.

అగ్ని సాక్షిగా పెండ్లి యాడిన
భర్తను వారు గౌరవించరు
దుష్ట స్వభావులు వారిలవుందురు
పతివ్రతలు మరి కొంద రుందురు.

పతియే గతియని తలచుచుందురు
సత్యవర్తులై చరించుచుందురు
సదాచారములు అనుసరింతురు
గురుజనములను గౌరవింతురు.

పతియే దేవుడు అనినమ్మెదరు
అమ్మా సీతా! నా కుమారుడు
ధనికుడైనను కాకపోయినను
నీకు మాత్రము పెనిమిటి యగును.

అడవుల కంపితి మనుచు తలంచి
అలక్ష్యపరచకు నా కుమారుని
రాముడు నీకు దేవుడే సుమా!''
అనుచు మెల్లగా చెప్పిన దామె.

ధర్మబద్ధముగ అత్త పలుకగా
కరములు మోడ్చి సీత పలికెను
''అమ్మా! మీదగు ఆనతి నెపుడును
శిరసున దాల్చి నడచుకొందును.

భర్త విషయమున నడచు విధంబు
జననీ జనకులు చెప్పిరి - వింటిని
సాధారణమగు అతివ మాదిరిగ
తలంచ వద్దు పతియే గతియగు.

వెన్నెల - చంద్రుని విడువనట్లుగా
నా ధర్మమును విడువను తల్లీ!
భర్త అడుగుల నడచెద నేను
కష్ట సుఖములలో కలిసి వుందుము.

తంత్రులు లేని వీణ మ్రోగదు
చక్రములుండని రథము నడువదు
నూర్గురు కొమరులు కలిగిన కానీ
భర్త దూరమై స్త్రీ సుఖపడదు.

తండ్రియు కొమరుడు మితముగ నిత్తురు
అమితముగా మరి యిచ్చును భర్త
పతివ్రతా ధర్మమ్ములన్నియు
తెలిసికొంటిని పెద్దలు చెప్పగ.

పతియే దేవుడు పూజలు చేతును
అలక్ష్య పెట్టను నమ్ముము నన్ను''
అనుచు వినయముగ సీత పలుకగా
ఖేద, మోదముల ఏడ్చెను అత్త.

తల్లులందరిలో పూజ్యురాలగు
కౌసల్యమ్మకు ప్రదక్షిణించి
నమస్కరించి రాముడు పలికెను
''అమ్మా ! నీవు దుఃఖిలవలదు.

నాయనగారి సేవలు చేయుము
ఇట్టే నేను తిరిగి వత్తును
కనులు మూసుకొని తిరిగి తెరువుము
పదునాల్గేండ్లు గడచి వచ్చును.''

అనుచు చల్లగా తల్లికి చెప్పి
మిగిలిన తల్లుల కచ్చట మ్రొక్కి
''తెలియక చేసిన అపచారమ్ములు
ఉన్నచొ నన్ను మన్నించుడనె.''

దుఃఖము నిండి ఏడ్చిరి తల్లులు
దశరథ విభుని భవనమంతయు
మంగళ వాద్య ధ్వనులకు బదులుగ
రోదన ధ్వనులతొ నిండి పోయినది.

॥శ్రీరఘురాముడు॥

## 40 రథము వెంబడి దశరథ కౌసల్యాలు దుఃఖముతో పరుగెత్తుట

రామలక్ష్మణులు సీతాదేవియు
దశరథ విభునకు నమస్కరించిరి
సతి సోదరుల వనవాసముకై
తండ్రి యానతిని గొనెను రాముడు.

దుఃఖము నిండి రామచంద్రుడు
శోక తప్తయగు తల్లిని గాంచెను
సీతతొ కలిసి ఆ సుకుమారుడు
తల్లి పదములకు ప్రణామముంచెను.

కౌసల్యమ్మకు వందనముంచి
తల్లిని గాంచెను లక్ష్మణమూర్తి
సుమిత్ర దుఃఖము పొంగి పొరలెను
పదముల పడిన పుత్రుని లేపెను.

తనయుని శిరసు మూర్కొని పలికెను
''లోక రక్షణకు రామచంద్రుని
కౌసల్యమ్మ కన్నది నాయన
నేను గంటి నిను రాముని సేవకు

సీతారాముల సేవలు చేయుము
నిరతము రాముడు దిక్కగు నీకు
అన్న సేవలు తమ్ముడు చేయుట
ఆచారమ్మ్మ ఇనకులమందు.

దాన ధర్మములు యజ్ఞ దీక్షలు
సర్వస్వమును త్యజించి వేయుట
అన్న కొరకు తన తమ్ముడు చేయుట
ఆచారమ్మ్మ ఇనకులమందు.

రాముడె - దశరథ మహరాజనుకో
సీతమ్మను గని - నేనే - అనుకో
అడవి యంతయు - అయోధ్య అనుకో
సీతారాముల కంకితమై పో.''

పేరుకు తగిన సుగుణ రాసియగు
సుమిత్ర అచ్చట తన - తనయునకు
కర్తవ్యమ్మటు బోధించినది
విని పరవశమున - నిలచిరందరు.

అంతట మంత్రి సుమంత్రుడు వచ్చి
మాతలి ఇంద్రుని గాంచి పలికినటు
రామచంద్రుని చూచి పలికెను
రథము సిద్ధమని తెలియబరచెను.

''మహానుభావా! శుభములు నీకగు
కోరిక మేరకు రథము తోలుడు
తల్లి కోరిక నేడే తీరును
వనవాస దీక్షకు మొదటి రోజగు.''

బంగరు సొమ్ముల మెరిసే సీత
జ్వలించుచున్న అగ్ని హోత్రమన
రామచంద్రుని కనుసన్నలతో
అరుణ సూర్య ప్రభ అరదము నెక్కెను.

రామ లక్ష్మణులు అరదము నెక్కిరి
వివిధాయుధములు పొరలు గంపలు
రాజు ఆనతిని రథమున నుంచిరి
రథము సాగినది ఆ ముప్వురతో.

అయోధ్య యంతయు కదలి పోయెను
జీవకోటి నిర్ఘాంత పోయెను
అగ్రహమ్ముతో గజ తురగములు
సవ్వడి చేయుచు తిరిగెను పురమున.

పెద్దలు పిన్నలు వయో వృద్ధులు
పరుగు లెత్తిరి రథము వెంబడి
రామ దర్శనము కోరుచు వారు
రథము నాపమని అరచుచుండిరి.

''ఎన్నాళ్ళకు మా దేవుని చూతుమొ
కన్నీళ్ళతొ యిపుడగపడకుండెను
కరుణజూపి ఆ రథమును నీవు
మెల్లగ తోలుము మంత్రి సుమంత్రా!''

గుండెలు బరువై అరచిరి కొందరు
కైకకు గుండే లేదని రందరు
''కౌసల్యమ్మకు గుండేపగలద
లేదా ఆమెది ఇనుప గుండెయా?

మేరుగిరిని రవికాంతి వీడనటు
రాముని అడుగుల నడచెను సీత
ఆహా! ఆమె పరమ పతివ్రత
నీడగ సాగే ధర్మచరిత్ర.

లక్ష్మణమూర్తీ! చరితాత్ముడవు
అన్న సేవ పరమార్థమంటివి
కైంకర్యమయి సాగుచుంటివి
స్వర్గద్వారము తెరచి వుండును

అంతః పుర స్త్రీలందరు అపుడు
రోదించుచు తమ రాజును చూచిరి
దుఃఖ జలధిలో మునిగిన రాజు
రామా! అనుచు అరచుచు నడచెను.

రాహు గ్రస్తమగు శశి బింబము వలె
తేని ముఖమున కళ తగ్గినది
జన సమూహమును చూచిన రాముడు
వడిగా తేరును తోలగ చెప్పెను.

రామ దర్శనము కోరుచు జనులు
తేరు నాపమని అరచెడి అరపుల
కాదని - వేగము పెంచగలేకను
మధనతొ రథమును మెల్లగ త్రోలెను.

తేరు నడవగా లేచిన దుమ్ము.
జనుల బాష్పముల తడసి అణగినది
అరచుచు ప్రజలు రథము వెంబడి
పరుగు లెత్తుట రాజు చూచెను.

చేప తాకిడికి నదిలో కమలము
నీటి బిందువులు రాల్చినట్లుగా
కాంతల ముఖ కమలమ్ముల నుండి
రాలుచున్నవి భాష్ప ధారలు.

లేగ కోసమై పరుగిడు గోవుగ
పట్టపు రాణి పరుగిడుచున్నది
''రామా! సీతా: లక్ష్మణమూర్తీ!''
ఉనికి మరచి తానరచుచు పరుగిడె.

దుఃఖ భారమును భరించ లేక
నరికిన తరువై రాజు కూలెను
రామా! రామా! కౌసల్యాయని
అరపులు రోదన మింటి కెగసెను.

దశరథుడంతట అతి బిగ్గరగా
రథము నాపమని అరచుచుండెను
త్వరగా సాగగ రాముడు చెప్పెను
సందిగ్ధములో పడెను సుమంత్రుడు.

తల్లియు తండ్రి రథము నందుకొన
పరుగిడి వచ్చుట రాముడు గాంచెను
కన్న కుమారుని హృదయము కరగెను
కానీ ధర్మము బంధించినది.

విషయము తెలిసి రాముడు పలికెను
''వారి అవస్థను చూడగలేను
ప్రభువు పిలుపది వినబడ లేదని
చెప్పి - తప్పుకో సమయ స్ఫూర్తిగ.''

బంధీ కృతయగు అశ్వపు పిల్ల
తల్లి గుఱ్ఱమును చూచు చందమున
రెప్పల నెత్తగ రామచంద్రుడు
బాధతో గాంచెను తల్లి దండ్రులను

సుమంత్రు డంతట జనులందరికి
రథము వేగముగ పోవును అనుచు
తెలుపుచు రివ్వున తోలెను రథమును
ప్రజలు ప్రయత్నము మాన కుండిరి.

అంకుశ పోటును తిన్న దంతి వలె
ఎంతో బాధకు గురియైనాడు
దుఃఖము నణచుకు మంత్రిసుమంత్రుని
వడిగా తేరును సాగనిమ్మనె.

మంత్రులు అప్పుడు రాజుతొ పలికిరి
''ప్రయాణమ్ముగా సాగెడివారు
త్వరగా రావలెనని కోరినచో
ఎక్కువ దూరము సాగ నంపరు.

కావున రాజా నిలువుడు ఇచటే''
అనుచు మంత్రులు చెప్పిన మాటల
రొప్పుచు రాజు సతులతొ నచటే
రథమును చూచుచు నిలబడి పోయెను.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 41 అంతఃపుర స్త్రీల – అయోధ్య వాసుల దుఃఖము

తల్లి పదములకు వందనముంచి
వనవాసముకై రాముడు వెడలగ
అంతఃపురమున స్త్రీలందరును
విలపించిరి శ్రీరాముని కొరకు

''ఇలలో దిక్కు మన కెవ్వరిక
తాపసోత్తముల రక్షకు డెవ్వడు
కన్న తల్లితో సమానమ్ముగా
తల్లులందరిని చూచెడి వాడు''

దుఃఖము నున్న స్త్రీల బాధను
విని మహరాజు కృంగి పోయెను
రాముని చూడగ అరచుచు నడచెను
రామా! రామా! అని దుఃఖించెను.

పట్టాభిషేకము ఆగి పోవగ
అగ్ని హోత్రములు రగులుట మానెను
హోమ క్రియలను వంటలు వార్పులు
వదిలి వేసిరి అయోధ్య వాసులు.

పశు పక్ష్యాదులు తిండి మానినవి
ప్రేమాదరణలు సన్నగిల్లినవి
రామ కౌసల్యల అభిమానమ్ములు
తలచు కొనుచు దుఃఖించి రందరు.

భార్య మోసముతొ పతిని గెలిచెనని
భార్యాభర్తల ప్రేమ తగ్గెను
భార్యకు కష్టము పతి కలిగించెను
అనుచు భర్తలను ఈసడించిరి.

అన్న దమ్ముల అను రాగమ్ములు
ఎండ మావులా! అనుచు పలికిరి
రవి తేజమ్మది క్షీణించినది
కడలి గట్టిగా ఘోషతొ పొంగెను.

హోరు గాలితో నింగి నిండగా
మబ్బు లున్నటు తోచె ఆకసము
దుఃఖ జలధిలో మునిగిరి జనులు
రాముని మిత్రులు మూర్ఛ పోయిరి.

స్థాణువులై జను లందరు నిలచిరి
చల్లని గాలి వీచుట మానెను
సూర్యాస్తమయము అయినటు ఎరుగరు
కాంతులు తరిగి నిలచె చంద్రుడు.

ఇక్ష్వాకుల కులతార విశాఖ
ధూమము క్రమ్మి కళ తప్పినది
అశ్వని ఆదిగ నక్షత్రములు
వెలుగులు మాసి వెలవెల బోయెను.

సప్తర్షి మండలము కాంతులు తగ్గెను
నింగిని వెలిగే త్రిశంకు తార
చంద్ర బింబమును కలుసు కొన్నది
రాముని రథము సాగుచున్నది.

గురు బుధ గ్రహములు చంద్రుని కలిసెను
కుజుడు మొదలగు క్రూర గ్రహముల
కలయిక కలిగెను శశిబింబమునకు
వనవాసమునకు ఆరంభమది.

ఇంద్రుని రక్షణలేని భూమి వలె
భయము నందిన పృథివి మాదిరి
రాముని వనవాసమ్మును చూచి
కలవర పడినవి జీవులన్నియు

॥శ్రీరఘురాముడు॥

## 42 దశరథుడు దుఃఖతప్తుడై కౌసల్యా మందిరము చేరుట

సాగుచు నున్నది రాముని రథము
నింగి తాకునటు ధూళి లేచెను
దశరథ రాజు కన్ను లార్పక
చూచు చుండెను దివ్య రథమును.

సాగిన రథము కనుమరుగయ్యెను
స్పృహను దప్పి మహరాజు నేలబడె
కౌసల్యమ్మ సపర్యలు చేయగ
కనులు తెరచెను కైకను గాంచెను.

అమిత కోపమున ఆ మహరాజు
కైకతొ పలికెను "పాపీ నీవు
దూరము పొమ్ము, నన్ను స్పృశించకు
నీ ముఖమును నే చూడను పొమ్ము.

నా భార్యవు నువు కానే కాదు
నీ బంధువులకు తెగ తెంపులివే
అర్థకాంక్షివి ఆధర్మవర్తివి
నిన్ను వదలితి నేనీ క్షణమున.

ఇహపర సుఖముల నొసగే క్రియలలొ
నా ఇల్లాలుగ పరిగణించను
రాజ్య కాంక్షియై భరతుడు వదిలే
తర్పణాదులను నేను గ్రహించను."

భక్తి మీరగా ప్రభువును లేపి
ధూళిని దులిపికౌసల్యమ్మ
రాజ మందిరము చేర్చగ రాజు
వెనుకవెనుకకు చూచుచు నడచెను.

తండ్రి మనస్సు తనయుని వెంబడి
తనువు మాత్రము గృహము లోనికి
అడవుల తిరిగే రాముడు - మదిలో
తాపసి వేషము దాల్చి కనబడె.

బ్రాహ్మణ హత్య చేసినట్టుగా
కలిగిన బాధను భరించ లేక
ఏడ్చుట మొదలిడె అయోధ్యరాజు
కరగని హృదయము లేనే లేదు

రాముని రథము ఊరు దాటెనని
విని మహరాజు కృంగి పోయెను
రాహువు మ్రింగిన సూర్యుడాయెను
కౌసల్యమ్మ స్పృహ తప్పినది.

"అయ్యో రామా! అడవుల పాలా
రాజ్య భోగములు దూర మయ్యెనా
జగన్నాథుడవు అనాథ వైతివ!
జనకుని తనయకు ఎంతటి కష్టము.

కైకా నీదు కోరిక తీరెను
రాముడు లేక నేనిక బ్రతుకను
భర్తృహీనవై భూమి నేలుకో''
దుఃఖము నిండి రాజు అరచెను

రాజ వీధిలో రాజు నడచెను
కళాహీనమై వీధులన్నవి
దేవాలయములు అంగడు లన్నియు
తలుపులు తెరువక మూసి యున్నవి.

శక్తి కలిగిన వారందరును
రాముని రథముతొ పరుగిడి నారని
రాజ వీధిలో మిగిలిన వృద్ధులు
చెప్పక చెప్పిరి దశరథరాజుకు.

మబ్బు మాటుకు రవి సాగినటు
సదనములోనికి రాజు సాగెను
వ్యథతోరాజు పలికెను అపుడు
రామజనని సదనమ్ముకు చేర్చగ.

''రాముని గన్న కౌసల్యమ్మ
మందిరమందు శాంతి కలుగును''
రాజు కోర్కెను తెలిసి అంతట
రాజును చేర్చిరి ఆ మందిరము.

సీతారాములు లక్ష్మణ మూర్తులు
లేని మందిరము శోభలు తరిగెను
తారా చంద్రులు లేని నింగివలె
వెల వెల బోవుచు కనబడె రాజుకు.

''రామా! నన్ను వదలి పోతివా
అక్కున చేర్చుకు ఆనందించెడి
భాగ్యము నాకు కలుగుట కష్టము
అంత వరకు నేనిట మనగలనా.''

దుఃఖించుచును ఆ మహారాజు
సొమ్మ సిల్లి తా నిద్రలొ జారెను
అర్థ రాత్రమున మెళకువ వచ్చెను.
కాళ రాత్రిగా తోచెను రాజుకు.

కౌసల్యమ్మను పిలుచుచు పలికెను
''నాకిపు డేమియు కనపడ కున్నది
చూపు రామునితొ నడిచి పోయినది
అంధుడ నైతిని ఓ మహారాణీ!

రాముని లాలన చేసిన చేతుల
చల్లని చేతుల నన్ను స్పృశించిన
ఉపశమనమ్ము కలుగును'' అనగా
కౌసల్యమ్మ సేవలు చేసెను.

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

# 43 కౌసల్యా దుఃఖతప్తయై దశరథునితో పలుకుట

దుఃఖార్తుడయి రాజు వుండెను
మరింత కృంగి రాణి యున్నది
కౌసల్యమ్మ మెల్లగ పలికెను
మదిలో బాధ ప్రభువుకు తెలిపెను.

''విషమును గ్రక్కెడి ఫణివలె కైక
నా కుమారుడు రాముని పైన
మోసమనెడి తన విషమును గ్రక్కగ
తనయుడు అడవుల పాలైనాడు.

కుబుసము విడచిన క్రూర నాగువలె
గృహమున కైక తిరుగు చుండగా
నామది కెంతో భయము కలుగును
ఇంటా బయటా భయపడి పోదురు.

తన కుమారునికి రాజ్యము కోరెను
నా కుమారునికి దాస్య మిడినచో
బిచ్చ మెత్తుకొని తినుచు - భరతుని
సేవ చేయుచు పురమున నుండును.

దేవత లందెడి హవిర్భాగమును
అసురుల కిడినటు ఓ మహరాజా!
రాజ్య పదవిని రాముని కీయక
మనసు కొచ్చినటు కైక కిచ్చిరి.

సుఖపడ వలసిన నా సుకుమారుని
సుమలత సీతను లక్ష్మణ మూర్తిని
అడవికి పొమ్మని ఆనతి నిడిరి
దిక్కు లేనటు చేసి వేసితిరి.

నవ యౌవనమున అడుగు బెట్టిరి
రాజ్య భోగముల కర్హులు వారు
కంద మూలములు తినుచు బ్రతకమని
కడు ఇడుమల పాల్జేసిరి మీరు.

ఇప్పటికిప్పుడు పదునాల్గేండ్లు
గడచి పోయి నా రాముడు వచ్చిన
నా కానందము కలుగును కాదా
అంతటి భాగ్యము ఎన్నటి కమరునో!

సీతారాములు లక్ష్మణమూర్తియు
ఆనందముగా తిరిగి వచ్చుట
అయోధ్య పౌరులు పరవసించుట
నగరి శోభగా నలంకరించుట.

పూల వానలు కురిపించుటయు
ఆ ముప్వురును ఆనందముగ
విప్ర కన్యలకు ఫల పుష్పములిడి
అయోధ్య నెప్పుడు ప్రదక్షిణింతురొ.

ఓ మహరాజా! పూర్వ జన్మలో
క్రూర కృత్యములు చేసితి నేమో
పాలుద్రావెడి పాపను లాగి
తల్లి స్తన్యములు కోసితి నేమో.

మురిపెపు లేగను సింగము గొనినటు
కైక వల్లనే నాకీ కష్టము
ఒకడే ఒక్క బిడ్డడు కలిగెను
సద్గుణ రాసిగ ఇలలో వెలసెను.

సర్వ శాస్త్రముల పారంగతుడు
అతి సుకుమారుడు జ్ఞాన వృద్ధుడు
ఓ మహరాజా! తనయుని వదలి
నే బ్రతుకుట ఎటు సెలవీయుడయా!

రాముని చూడక బ్రతుకగ లేను
గ్రీష్మ తాపమున భూమి ఉడికినటు
నన్నీ బాధ దహించుచున్నది''
అని విలపించెను కౌసల్యమ్మ.

॥శ్రీరఘురాముడు॥

✽✽✽

# 44 సుమిత్ర, కౌసల్యమ్మను ఊరడించుట

దుఃఖము నున్న కౌసల్యమ్మను
ధార్మికు రాలగు సుమిత్ర వచ్చి
చల్లని మాటల అనునయించెను
శోకించుటది తగదని పలికెను.

''సద్గుణ యుతుడు రామచంద్రుడు
పురుషోత్తముడు అమిత విక్రముడు
ఇహ సుఖములపై మమతలు వదలి
పర సుఖములపై మనసు నిలపెను.

మన రఘురాముడు వనముల కేగుట
సత్యవర్తిగా తండ్రిని నిలపుట
కావున నీవు దుఃఖము వదలుము
లక్ష్మణు కొరకై చింతిల వలదు.

పాప రహితుడు భ్రాతృ సేవకై
అన్న అడుగుల అడవికి నడచెను
సత్కార్యమును తనయుడు చేసెను
వారిరువురకై దుఃఖిల వలదు.

పరమ పతివ్రత జనక రాజ సుత
ధర్మాత్మునకు ఇల్లాలైనది
ధర్మము, తెలుసును, ఇడుమలు, తెలిసియు
భర్త అడుగుల వెంబడి నడచెను.

ధర్మ పథమున సీత నడచెను
ఆమె కొరకు నువు దుఃఖిల వలదు
నీ కుమారుడు సత్య ధర్మములె
పెన్నిధి అనుకొని తలంచినాడు.

రాముని కీర్తి ఇలలో వెలుగును
రమ్య గుణాఢ్యుడు త్వరలో వచ్చును
రాజుగ నేలును ప్రజ లందరినీ
రామ రాజ్యమది చూతువు తల్లీ.

సూర్యుడు ఎండను తగల నీయడు
సుమ గంధముతో వాయువు వీచును
తంద్రిగచంద్రుడు కౌగలించును
రాముని కేమియు బాధ కలుగదు.

మహా యుద్ధమున రామచంద్రుడు
రిపు లెందరినో సంహరించగా
దివ్య వరముగా అమోఘాస్త్రములు
రామచంద్రుడు అందెను గాదా!

అంతటి రాముడు శరములు విడువగ
ఎంతటి వారు నిలబడ లేరు
గృహమున నున్నను అడవుల నున్నను
వీరుడు సుఖపడు – నమ్ముము నన్ను.

రామచంద్రుని ఆనతిభక్తిగ
పుడమి శిరస్సున దాల్చును వినుము
వన వాసమ్మును పూర్తి చేసుకొని
రాజై రాజ్యము చల్లగ నేలును.

సూర్యునికే మరి సూర్యుడు రాముడు
అగ్ని హోత్రునికి అగ్నియే యగు
సంపద కాతడు పెన్నిధి యగును
ప్రభువు లందరికి రాముడు రాజు.

కీర్తికి కీర్తి - క్షమకు క్షమయగు
సురలందరకూ దేవుడాతడు
భూతమ్ములకు పెను భూతమ్మగు
రాముని సాటి ఇలలో లేరు.

నార వల్కలము దర్భా సనముల
ధర్మాత్ముడు తా నడవికి నడువగ
అనుసరించిన భార్య మాదిరిగ
రాజ్యలక్ష్మి తా ననుసరించినది.

ధనుర్బాణములు ధరించి ముందర
లక్ష్మణమూర్తి నడచుచుండగా
పురుషోత్తమునికి బాధ కలుగదు
దుర్లభమన్నది వారికి లేదు.

పౌరులందరు దుఃఖము నుండిరి
తిరిగి రాముడు వారిని ఏలగ
ఆనందించే సమయము వచ్చును
అజ్ఞానములో పడవలదమ్మా!

మంగళమూర్తీ! రామచంద్రునికి
ఎట్టి అశుభము కలుగదు తల్లీ
మాకు ధైర్యము చెప్పగ తగుదువు
నీకు ధైర్యము చెప్పుట ఎటుల.

రాముని జననికి దుఃఖము తగునా
రాముని నడవడి సాటి మరెవ్వరు
నింద లెరుగవు పుణ్యమూర్తివి
రాముడు తప్పక వచ్చును వినుము.

చంద్రుని తీరుగ రామచంద్రుడు
నీ కన్నులలో వెలుగు నింపును
సతి సోదరులతొ సుఖముగ వచ్చును.
స్నేహితులందర జేర్చుకు కనపడు.

మెత్తని కరముల నీ పదములపై
నమస్కరించి రాముడుండగా
మేఘము గిరిని కడిగినట్లుగా
ఆనందాశ్రులు చిలకరింతువు.''

సుమిత్ర చెప్పిన చల్లని మాటల
రాముని తల్లి మనసు చల్లబడె
శరత్కాలమున మబ్బుల మాదిరి
దుఃఖము హరించె రామ జననికి.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 45 రాముని–పురమునకు మరలమని పౌరుల ప్రార్థన

రాజుయు, రాణులు, రాముని మిత్రులు
అతి కష్టముపై వెనుదిరిగినను
అయోధ్య పౌరులు పట్టు వదలక
పరుగిడు చుండిరి రథము వెంబడి.

కంటికి రథము కనబడ కున్నను
పోవలదనుచు వెంబడి వచ్చెడి
పౌరుల కపుడు నచ్చ చెప్పగా
తేరు మెల్లగ తోలగ చెప్పెను.

రథమును చేరిన ప్రజ లందరితో
ప్రియ దర్శనుడు మెల్లగ పలికెను
"ఓ ప్రజలారా! మీ వాత్సల్యము
మరువ లేనిది మధురమైనది.

మీరీ ప్రేమను ఆదరమ్మును
భరతుని పైన చూపగ కోరెద
కైక తనయుడని తలంచ వద్దు
సద్గుణ యుతుడు భరత కుమారుడు.

మీకు తప్పక మేలు చేయును
పండిన జ్ఞానము కలిగినవాడు
మెత్తగ నున్నను వ్యాఘ్ర సమానుడు
రాజగుణములతొ శోభిలువాడు.

భరతుడు యువరాజన్న నిర్ణయము
రాజ నిర్ణయము - శిరోధార్యము
నే సాగెదను వన వాసమునకు
సాగుడు మీరు అయోధ్య లోనికి

నాకై రాజు పరితపించక
కాపాడుకొను భారము మీది
మీరటు చేసిన ముదము నందెద
అనుచు ప్రజలకు రాముడు చెప్పెను.

అంతటిలోనే రథము సాగెను
వినరా ప్రజలు పరుగిడు చుండిరి
కంట నీటితో పరుగు లెత్తిరి
తమ ప్రయత్నము వదల కుండిరి.

తండ్రి మాట నెర వేర్చెడి పట్టు
రామచంద్రునిలొ గట్టిగ నున్నది
పురమునకు రాముని గొని పోవలెనని
ప్రజలందరిలో గట్టి యోచన.

రామచంద్రుని సద్గుణమ్ములు
రథముకు వారిని బంధించగను
పరుగిడు అరదము వెంబడివారు
పరుగు లెత్తిరి రామహృదయమున

విప్రోత్తములు వయో వృద్ధులు
పరుగిడ లేక హయములు వినునటు
"గుఱ్ఱములారా! పరుగిడ వలదు
ప్రభువును దూరము చేయగ వలదు

సునిశితమైన చెవులుమీవి కద!
మా మొర మీకు వినబడ లేదా
విహారమ్మునకు గొని పోదగిన
మీరే రాముని అడవుల విడతుర."

విప్రోత్తముల మాటలు వినెను
గుండియ కరిగెను పురుషోత్తమునికి
పెద్దలు నడచుట తగదని తోచి
సతి సోదరులతొ రథమును దిగెను.

వారిని కలువగ వెనుకకు నడచిన
వ్రత భంగమని రాముడు తలచి
అతి మెల్లగను నడువ సాగెను
వచ్చెడి వారు కలుసు కొనుటకై

వేద విదులు వారందరు పలికిరి
''విప్రు లందరము వచ్చు చుంటిమి
శ్వేత ఛత్రముతొ వాజ పేయులు
వచ్చు చుండిరి గొడుగు పట్టెదరు.

విప్రుల కోరిక వినుట ధర్మము
యజ్ఞ యాగములు చేయ నెంచితిమి
నీవు లేక మా మనసు నిలువక
మూల పడును మా యజ్ఞ యాగములు

ఓ సుకుమారా! నీ దేహమది
ఎండకు కములుట చూడగలేము
వేదమంత్రముల యెద నిలువకను
కదలు చుంటిమి కారడవులకు.

నీ వల్లను ఆ క్రతువులు ఆగిన
ఆ దోషము మరి నీదగునుసుమా!
దుఃఖము నున్న సర్వ ప్రాణుల
ప్రార్థన యిది నిను పురముకురమ్మని

వేద ధనము మాకున్నది రామా!
అది దాచితిమి మాగుండెలలో
పాతి వ్రత్యము సతులకు రక్షణ -
నిర్భయముగ నీ వెంట నడచెదము.

నడువ గలిగిన మేము నడచితిమి
నడువ లేని ఆ తరువు లన్నియు
నేలను నిలచి వేళ్ళు పెగలక
నిను గని - వంగి ఏడ్చు చున్నవి.

నీవు మమ్ములను రావలదన్నచొ
మాతో నగరికి నీవు రావలె
నినుగొని పోక పురమున కేగము
పండిన తలలప్రార్థన వినుము.

పక్షులు సైతము తినుట మానినవి
పురము కేగమని కోరుచున్నవి''
అటులా విప్రులు కోరుచుండగా
తమసానదిని సమీపించిరి.

విప్రుల కోరికతీర్చ మనునటు
తమసానది తా నడ్డము వచ్చెను
సుమంత్రు డంతట హయముల విప్పి
సేద తీర్చెను నదీ జలముల.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

# 4 6 రాముడు కనబడలేదని అయోధ్య పౌరుల వేదన

తమ సాతీరము చేరిన రాముడు
తమ్మునితో తా పలికెను ప్రేమతొ
''సోదర లక్ష్మణ! వన వాసములో
రాత్రి ఇచ్చట గడిపెదమయ్యా!

అయోధ్య నగరిని మన గృహములను
తలంచి దిగులు పడ వలదయ్యా!
పక్షుల కూతలు మృగముల అరుపులు
సాయం సంధ్యలొ మూల్గు చున్నవి.

కటిక చీకటిలో ఆ కారడవి
బావురు మన్నటు తోచు చుండును
అయోధ్యలోన జనులందరును
దుఃఖతప్తులై యుందురు గాదా.

దశరథ ప్రభువు గూర్చియె దిగులు
అమ్మ గురించి మది కలవరపడు
వారిద్దరును కండ్లు కరగునటు
విలపించెదరని తోచును సోదర.

భరతుడు ప్రేమాదరణకు నెలవు
వారికి ఊరట కలుగ జేయును
నీవు వెంబడి వచ్చుట చేతను
సీత రక్షణ తేలిక యగును.

వన భోజనము దొరుకును మనకు
నేను - రాత్రి ఉపవాసము చేసెద
ఈ నది జలములు అతి పవిత్రములు
వీటిని త్రాగెద కడుపు నిండుగా''

సుమంత్రు గాంచి రాముడు పలికెను
హయముల రక్షణ తప్పదు నీకనె
రాముడు అపుడు తమ్ముని తోడుగ
సాయం సంధ్యను పూర్తి చేసెను.

లక్ష్మణు సాయము నంది సుమంత్రుడు
పండి రాలిన పత్రమ్ములతో
సీతారాముల పడకలు తీర్చెను
స్వామి సేవలో మురిసి పోయెను.

సీతారాములు నిద్రలొ మునిగిరి
రక్షగ నిద్దరు మెళకువ నుండిరి
లక్ష్మణమూర్తి అన్న గురించి
మది పులకించి చెప్పెను ఎన్నో.

పుణ్య చరిత్రుని మాటలతోను
ఇట్టే గడిచెను రాత్రి యంతయు
తెల తెల వారెను ఆలమందలు
నీరు త్రాగుటకు వచ్చెను నదికి.

రామచంద్రుడు నిద్ర లేచెను
మేను మరిచి అట నిద్రలొ నున్న
పౌరులందరిని చూచెను రాముడు
సుఖమగు నిద్రలొ ఉనికి మరచిరి.

వారిని గాంచి రాముడు చింతిలె
''సోదర లక్ష్మణ! గృహములు వదలి
నాతో వనముకు వచ్చిన వీరు
అలసి సొలసి ఇట నిద్రలొ నుండిరి.

వారికి వారై అయోధ్య కేగరు
నను గొనిపోగా వెంబడి వచ్చిరి
అసువుల నైనా వీడ సమర్థులు
నన్ను వీడనని పట్టుతొ నుండిరి.

వారికి మెళకువ వచ్చెడి లోగా
మన మీ స్థలమును వీడుట మేలు.''
రాముని మాటలు విని సుమంత్రుడు
శీఘ్రమె రథమును సిద్ధపరచెను.

ఉరుకుల పరుగుల సాగెడి నదికి
అద్దరి తీరము చేరిరి సుఖముగ
కంటక రహితము అయినట్టిది యగు
కాలి బాట కనుపించెను వారికి.

రాముడు చక్కని యోచన చెప్పెను
''మంత్రిసుమంత్రా! మేమిటనుందుము
రథమును వెనుకకు తోలుకు పోయి
వేరు మార్గమున మమ్ముల కలియుము.

వెనుకకు మరలిన గుర్తులు గాంచి
నిద్రలేచిన జన సమూహము
అయోధ్య కేగితి నని భ్రమించెదరు
కావున వారు మరలి పోదురు.''

మంత్రి సుమంత్రుడు అటులే చేసి
మరలి వచ్చి ఆ ముప్పురతోను
శుభ సూచనగా ఉత్తర దిశలో
కొంచెము నడిపి ముందుకు సాగెను.

మహారథుడు శ్రీరామచంద్రుడు
సతీ సమేతుడు అతి బలవంతుడు
అడవికి రథమున గొని పోచుండగ
ధీరోదాత్తుడు సుఖముగ కూర్చొనె.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

## 47 రథముగానక పౌరుల వేదన

తపోవనముల దిశలో రథము
అతి వేగముగా సాగుచున్నది
తెల్లవారినది పౌరులు లేచిరి
రాముని గానక దుఃఖిల సాగిరి.

మొద్దునిద్దరలో మునిగితి మనుచు
వారిని వారే నిందించుకొని
ప్రాణ సమానము రాముడు లేనిచొ
ప్రాణము లెందుకు అనుచు తలచిరి.

ఎండు కట్టెలు కనబడుచున్నవి
వాటితొ పెద్ద చితి నేర్పరచి
మంటల దూకిమరణించెదము
రాముని చూడని తనువు లెందుకు.

వెఱ్ఱి ముఖములతొ వెనుకకు మరలిన
ప్రజలందరకు ఏమని చెప్పుట
తగుదుము మేమని తరలి వచ్చితిమి
రాముని అడవుల దించి వచ్చితిమి.

మనమా విధముగ చెప్పుట తగునా!
భార్యా బిడ్డల కేమి చెప్పెదము
దుఃఖ జలధిని ఊరు మునిగినది
మనసు చెల్లునా మరలి వెళ్ళుటకు.

రథము సాగిన గుర్తుల నచ్చట
గాంచిరి కొందరు సాగిరి ముందుకు
కొంత దూరము సాగిన వెనుక
గుర్తులు లేవు తికమక పడిరి.

ఏమియు తోచక చింతలో మునిగి
చేయున దేమియు లేదని తలచి
దీన వదనమున వారందరును
తిరిగి చేరిరి అయోధ్య నగరికి.

గృహముల నడుగిడ మనసులు రాక
కంట నీటితో నిలబడి పోయిరి
రాముడు లేని అయోధ్య నగరము
చంద్రుడు లేని ఆకాశమ్ము.

రఘుకుల తిలకుడు లేని అయోధ్య
ఎండిపోయిన కాసారమ్మగు
అతి కష్టముతో గృహముల కేగిరి
స్వజనుల గుర్తే మరచిపోయిరి.

॥శ్రీరఘురాముడు॥

## 48 రాముని తీసుకు రాలేదని స్త్రీ జనము పరుషము లాడుట

భార్యా బిడ్డలు ఎదురు వచ్చిరి
రాముని విషయము అడిగిరి వారు
మాటలు రాక మనసు నిలువక
నిలచిరి వెర్రిగ - పలుకక పోయిరి.

రాక తప్పదని - చత్తుము మేమని
పదముల పడి మరి ప్రార్థించినచో
కదలి వచ్చును కరుణామూర్తి
చేతకాని వారైతిరి మీరు.

శుభ వార్తలు మది కెక్కుట లేదు
ఆనందమది అగ పడకున్నది
ప్రాణము లున్నను అచేతనమ్మై
రామ ధ్యానమున మూగగ నిలచిరి.

పురుషులందరిలో ఉత్తమ పురుషుడు
ఒక్క లక్ష్మణుడు కావున అతడు
సీతారాముల సేవకు సాగెను
ఆయోగ్యత మరి మీకు లేదు కద.

వంట ప్రయత్నము చెయ్య రెవ్వరును
నిత్య కర్మలకువిప్రులు లేవరు
వర్తకు లంగడి తెరువక పోయిరి
తల్లులు పిల్లల ముద్దు చేయరు.

సీతారాములు మునిగిన జలములు
పుణ్య తీర్థములు అతి పవిత్రములు
వెంట సాగినచొ కనుల చూచెడి
భాగ్యము నిరతము కలిగి యుండెడిది.

విలపించుచును స్త్రీలు పలికిరి
వారి భర్తలను ఈసడించిరి
"మమ్ముల నంపిన మేమే పోయి
రామచంద్రుని తీసుకు రామా!

ఘనమగు తరువులు గొడుగై నిలబడు
తేట నీటిని నదులు ఇచ్చును
పర్వత సానువులా మహాత్ముని
విశ్రాంతికయి పడకలు అగును.

చరాచరము ఆ మంగళ మూర్తిని
గుండె నిండుగా ఆహ్వానించును
ముడిచిన పూలతో పుష్పాంజలితో
వనస్త్రీ మంగళ కరముగ నిలచును.

ఇష్ట దైవమును పూజించినటు
విరిసిన తరువులు పూలు జల్లగా
తుమ్మెద నాదము మంగళ గానము
సీతారాముల సేవలొ మురియును.

అంతటి భాగ్యము లేక పోయినది
రాముని తీసుక రాకపోతిరి
రాముని పదములు సోకిన నేలను
అకాలమైనను తరువులు పూయును.

మధురఫలములను ఇచ్చు తరువులు
చల్లగ వీచును రామచంద్రునికి
జన్మసార్థకము చేసుకొనునవి
స్వచ్ఛ జలమ్ములు పరుగిడి వచ్చును.

రాముడున్నచో భయ మసలుండదు
రాముని విడిచి ఉండగ లేము
కాపురమ్ములను కానకు మార్చి
కనుల గాంతుమా ప్రియదర్శనుని.

సీత సేవలు మేము చేసెదము
రాముని సేవలు మీరు చేయుడు
అలసింపక బయలు దేరుదము
రామ దర్శనము చేసికొందము.

రాముడు లేని అయోధ్య నగరము
వాసయోగ్యము కానే కాదు
నిరతము రాముని తలపుల నిండి
దుఃఖము నిండి జనులిట వుందురు.

అనాథగానగు అయోధ్య నగరము
ధర్మ దూరమై పోవును రాజ్యము
సిరి సంపదలు కలిగి యున్నను
మనుగడ కష్టము ఈ రాజ్యములో

రాజ్య కాంక్షతొ కైకాదేవి
భర్తకు తాను దూరమైనది
జ్యేష్ట కుమారుని అడవుల కంపెను
దుష్టురాలు మరి అధర్మవర్తి.

కైక - కొడుకుతో రాజ్యము నేలిన
బానిస బ్రతుకే ప్రసాదించును
రాజ్యము నుండుట మావశ మవ్వదు
తగునని తోచిన మీరిట నుండుడు.

ఉద్రేకములో పలుకుట కాదిది
బిడ్డల ఆనగ చెప్పుచుంటిమి
ఒడిదుడుకులతో రాజ్య ముండును
రాముడు లేని అయోధ్య నుండము.

దశరథరాజు బ్రతుకుట కష్టము
కైక వల్ల మరి నాశము తప్పదు
మూర్ఖులు మీరు జ్ఞాన హీనులు
అందువల్లనే తిరిగి వచ్చితిరి.

పదండి అందర మొకటై పోదము
లేదా ఇంత విషము త్రాగెదము
కానిచో అయోధ్య మాటే తెలియని
దూర దేశముల చేరుకొందము.

మొలక నవ్వులతొ పలుకరించును
పురుషోత్తముడు నడిచిన నేల
పునీతమై అది శోభలీనును!
అనుచు నగరిలొ అతివలు ఏడ్చిరి.

వృద్ధరాజు బ్రతికుండు వరకును
ఉందమన్నను ప్రమాద మదియగు
గొర్రెను కసాయి కిచ్చినట్లుగా
ప్రజలందరను భరతుని కిచ్చును.

శోకతప్తులై స్త్రీలుండగను
చూడలేక రవి అస్తమించెను
చీకటి పడినది చైతన్యమది
అయోధ్య నగరిలొ కనపడలేదు.

నీలనీరద శ్యాముడు రాముడు
పద్మ పత్ర నేత్రమ్ములు కలిగి
ఆజానుబాహుడు అతి బలవంతుడు
ప్రియదర్శనుడు ప్రియ భాషణుడు.

ఆహితాగ్నుల అగ్ని మండక
అంగడులన్నీ మూసియుండగా
సందడి లేని అయోధ్య నగరము
తారలు లేని నింగిగ తోచెను.

కన్న కొడుకునో తోబుట్టువునో
వెడల గొట్టినటు ఏడ్చి రతివలు
ఆ సమయములో అయోధ్య నగరము
నీరు ఇంకిన సంద్రము పోలెను.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 4 9 శ్రీరాముని రథము కోసల చేరుట

తండ్రి ఆనతి పాలించుటకు
సతి సోదరులతొ వన వాసమునకు
ఆనందముగా సాగెను రాముడు
ప్రకృతి శోభను చూడ సాగెను.

సీతారాముల గాంచిన ప్రజలు
దశరథ రాజును కైకా దేవిని
తగని కార్యమును వారు చేసిరని
తోచిన విధముగ ఆడిపోసిరి.

పెద్ద గ్రామములు చిన్న పల్లెలు
చక్కని చేలు విరసిన తరువులు
నయనానందము చేయుచుండగా
సాగిన దూరము తెలియక పోయెను.

జనకుని కూతురు అతి సుకుమారి
అడవులలో తానెటుల గడపును
దయాదూరుడై దశరథరాజు
అడవుల ఇడుమల పాలు జేసెను.

కోసల రాజ్యము సమీపించెను
''వేద శ్రుతి'' యను నది ఎదురైనది
దక్షిణ దిశగా రథము సాగెను
ఆల మందలు అగపడె శుభముగ.

పుణ్య జలముతో ''గోమతి నది'' యది
సంద్రము చేరెడి స్థానము చూచిరి
ముందుకు సాగిరి ఆనందముగా
హంసల గొంతులు మురిపించినవి.

నేత్ర పర్వముగ మయూరమ్ములు
నృత్యము చేయుట చూచిరి వారు
స్యందనదిని రథము దాటెను
ఇక్ష్వాకువు లేలిన భూమినిగనిరి

వైవస్వత మనువు ఆ ప్రదేశము
ఇక్ష్వాకు విప్వగా నేలెను పూర్వము
ఆ రాజ్యమది అచ్చటి వరకే -
ఆ వివరములు సీతకు చెప్పెను

రాముడంతట సుమంత్రునితో ననె
సరయూ ఒడ్డున పుష్పిత వనముల
తల్లి దండ్రులతొ ఆనందముగా
విహరించుటది ఎన్నటికో మరి.

సరయూ ఒడ్డున వనముల యందు
వేటాడుటది ఎన్ని రోజులకొ
అనగా మంత్రిఅడిగిన ప్రశ్నకు
తిరిగి రాముడు బదులు పలికెను.

''దోషమైనను వేటను మాత్రము
క్రీడార్థముగా - అభ్యాసముగా
శ్రార్థాదులలో తప్పనిసరిగా
నియమమ్ముగను నడుపు చుందురు.

వేటను మించిన వేడుక ఏదియు
రాజుల కుండదు గావున పెద్దలు
రాజ ఋషులును వేటను మాత్రము
సమ్మతించిరి మంత్రి సత్తమా!

నాకు మాత్రము వేటయందున
మక్కువ ఎక్కువ లేదు అనుచును -
మాటలు సాగుచు నుండగ నంతట
రథము కోసలను చేరె సుఖముగ.

॥శ్రీరఘురాముడు॥

❊❊❊

## 50 గుహునకు రామ దర్శనము లభించుట

విశాల కోసల రమణీయమ్మది
నగరము వదలుచు రామచంద్రుడు
నగరము యొక్క అధి దేవతలకు
వందన మిడెను ఆశీస్సులకై.

అయోధ్యలో ఆ జన సమూహమున
వీలు పడక శ్రీరామచంద్రుడు
కోసల దాటుచు ఆ సమయములో
కోర్కె తీరగావందనమిడెను.

''పుణ్య నగరమా! మా వంశములో
పుణ్య పురుషులు పాలించిరి నిను
వీడ్కోలిదిగో - నిను రక్షించే
గ్రామ దేవతల ప్రణామ మిదిగో.

తండ్రి మాటను తలను ధరించి
వనవాసమునకు సాగుచుంటిమి
తిరిగి వచ్చుచు ముమ్మందుగ నే
నీ దర్శనము చేసి కొందుము''

సజలనయనముల వెంబడి వచ్చిన
ప్రజలను గాంచి పలికెను రాముడు
''నాపై మమత అను రాగముతో
ఎంతో దూరము వచ్చిరి మీరు.

మీ దయకెంతో ఆనందించితి
అతిగా దుఃఖము అనర్థకమ్మది
కావున గృహముల కేగుడు మీరు
మిమ్ముల గాంచిన నాకు దుఃఖమగు.''

వారందరును రామచంద్రునికి
ప్రదక్షిణించి నమస్కరించి
బరువగు గుండెల బయలు దేరిరి
నడచుచు వెనుకకు చూచుచు నడచిరి.

సిరి సంపదలకు నెలవు కోసల
యజ్ఞశాలలు దేవాలయములు
జలా శయములతొ సుందరమైనది
ఆలమందలవి అసంఖ్యాకములు.

సుఖశాంతులతో ప్రజలు ఉండిరి
వేద ఘోషలు వినబడుచున్నవి
ప్రతిమహరాజు చూడదగినది
పురుషోత్తముడు వదలిసాగెను.

కోసల దాటి దక్షిణ ముఖముగ
కొంత సాగగా పావన గంగను
పుణ్యమూర్తి శ్రీరాముడు చూచెను
సతితో కలసి వందన మిడెను.

స్వర్గమర్త్య పాతాళములలో
త్రిపథ గామినిగ వెలసిన గంగను
దర్శించినచో శుభములు కలుగును
శిరసున దాల్చిన పాపము తొలగును.

ఋషులందరు తమ ఆశ్రమమ్ములు
గంగ ఒడ్డున నిర్మించుకొన
పావన గంగకు అలంకారముగ
వన్నెలీనును ముని ఆశ్రమములు.

దేవ గంధర్వ అప్సరాంగనలు
మంగళ జలముల స్నానము చేతురు
పంకిల మసలే కాని జలములవి
పాప పంకిలము పారద్రోలునవి.

స్వర్గ వాసులను ఉద్ధరించగా
గగన మార్గమున దివికి చేరినది
వారందరికీ ప్రీతి పాత్రమై
పునీతులనుగా చేసెను వారిని.

మంగళ జలములు జారుచుండగా
మంగళ కారిణి అగు నొక తొయ్యలి
గాజుల శోభిలు దివ్య హస్తముల
తప్పెట్లు కొట్టెడి సవ్వడి అయ్యెను.

తెల్లని నురుగు చిరునవ్వులుగా
కొండలజారే జల ప్రవాహమది
శోభగ జారే జడ మాదిరిగా -
సుడులు తిరుగుట నాభిగ తోచెను.

గంభీరముగా నడచు నొక్కపరి
మృదంగ నాదము చేయుచు సాగును
వేగము గలిగి వంపుల ఒదిగి
వడిగా సాగును ఆ గంగమ్మ.

నల్ల కలువలు కన్నుల పోలును
కమలమ్ములవి చేతుల పోలును
తీరమునున్న తరువుల వరుసలు
మెడలో హారములన్నటు మెరయును.

ఇసుక తిన్నెలు ఘన జఘనములై
వన్నెల పుప్పొడి చందన చర్చగ
మెరయు జలములు మణిహారములై
జల జంతువులు ఆభరణమ్ములు.

సారస పక్షులు చక్ర వాకములు
హంసలు ముదముగ ఆడి పాడగా
అడవి ఏనుగులు దిక్కుల కెగసే
ఘీంకారమ్ములు సలుపు చుండగా.

సాగర సంగమమునకై సాగే
మదవతి అన్నటు సాగెడి గంగ
విష్ణు పాదమున ఉద్భవించినది
నారాయణునే స్మరించు నానది.

మర్త్యలోకమున మంగళమ్ముకై
భగీరథుని బహు ప్రయత్నమ్ముతో
శంకర దేవుని జటాఝూటమున
నిలచిన గంగ నేలకు దిగెను.

ఉరుకుల పరుకుల సాగే గంగను
పురుషోత్తముడు రాముడు గాంచెను
గంగ సేవలో తరింతుననెను
గంగను గాంచి పులకరించిరి.

శృంగిబేర పురమున్నది ముందర
గుహుడను భక్తుడు - ఏలుచుండెను
నిషాదరాజు - ''స్థపతి'' ఆతడు
చల్లగ రాజ్యము నేలుచుండెను.

బలవంతుడు ఆ నిషాదరాజు
రామని ప్రియ సఖుడా పుణ్యాత్ముడు
రాముని రాక విని ముదమంది
మంత్రుల సచివుల చేర్చుకు నడచెను.

రామదర్శనము చేయుట కొరకై
పొంగిన గుండెతొ పరుగులెత్తుచు
పుణ్యమూర్తిని అంత దూరమున
గాంచెను గుహుడు జన్మ తరించెను.

గుహుని గాంచెను రామచంద్రుడు
గుండియ కలపగ ముందుకు వచ్చెను
రామ కౌగిలిని అందిన గుహుడు
చరితార్థుడయి నిలిచి పోయెను.

గుహుడు పలికెను అతిభక్తిగను
''రామా ! నాదగు రాజ్యమంతయు
అయోధ్య సమము - నీ దేనయ్యా!
పుణ్య వశమున అతిథి వైతివి.''

కర్తవ్యమును బోధించుమయా''
అనుచు గుహుడట పలుకుచుండగా
అర్ఘ్య జలములు ఆహారములు
అతని అనుచరులు తీసుక వచ్చిరి.

గుహుడు పలికెను ముడిచిన కరముల
''నా పాపములను కడిగి వేసుకొన
రామప్రభో! నీ కాళ్ళు కడిగెద
భక్ష్య భోజ్యముల నిడెదను భక్తిగ.

అశ్వమ్ములకు గ్రాస మిడెదను
గంగ జలములను త్రావించెదను
జగతిని ఏలే జగన్నాథుడవు
దాసుని రాజ్యము ఏలుము దయతో.''

ఆప్యాయముతో రాముడు పలికెను
''గుహుడా! నీవు స్నేహ వశమున
పాదచారివై! వచ్చితి విటకు
మనసు నిండుగా సత్కరించితివి.

నాకానందము అయినది మిత్రమ!
సంతుష్టుడను అయితిని నేను''
అనుచు రాముడు బలమగు కరముల
ప్రేమగ గుహుని కౌగలించుకొనె

''మిత్ర సత్తమా! నేనీ దినమున
భాగ్య వశమున నీ బంధువులను
నీహితులను మరి చూడ గలిగితిని
రాజ్యము, ప్రజలు క్షేమమే కదా!

ధనాగారము సమృద్ధమేకద
ప్రేమతొ నీవు తెచ్చిన కాన్కలు
నీకే ఇచ్చితి గొనుము వాటిని
కాన్కలందుకొన అర్హుడగాను.

తండ్రి మాటను పరిపాలించగ
నార వల్కలము ధరించినాను
వనభోజనమే నేను తినునది
వనవాసమునే నే చేయునది.

విందు భోజనము నాకు వలదయా
మంచి మేతను హయముల కిడుము
నాయనగారి గుఱ్ఱములవ్వి
హయములన్నచో ప్రియము వారికి.''

సాయంసంధ్యను రామచంద్రుడు
ఉపాసించుకొని, తమ్ముడు తెచ్చిన
గంగా జలము ముదముగ త్రాగి
సతితొ నేలను పవ్వళించెను.

లక్ష్మణమూర్తికి సాయముగాను
గుహుడు సుమంత్రులు ధనసులుదాల్చి
సీతారాముల రక్షగ తిరిగిరి
పుణ్య దంపతులు సేవకు నిలచిరి.

సుఖపడ సిరిగల రామచంద్రుడు
కటిక నేలపై పవ్వళించగా
చూడలేను నే నన్నటు సూర్యుడు
ఆలశ్యముగా వచ్చినట్టులయె.
॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 5 1 రాముని గూర్చి దుఃఖముతో లక్ష్మణుడు గుహునితో పలుకుట

రక్షగ తిరిగెడి లక్ష్మణమూర్తితో
గుహుడు పలికెను ఆదరమ్ముగా
''నాయన లక్ష్మణ! అలసి పోతివి
పడుకొను శయ్య సిద్ధము నున్నది.

సుఖముగ పెరిగిన రాకుమారుడవు
కష్టము చేయుట తెలియును మాకు
సీతారాముల కావలి కాతును
నీవు సుఖముగ నిద్దుర పొమ్ము.

రాముడు నాకు ప్రాణ సమానుడు
అతనిని మించిన మిత్రుడు లేడు
రాముని దయ ఈ భోగభాగ్యములు
ధర్మార్థములు తెలిపెను రాముడు.

నా అనుచరులతొ ఏమర కుండగ
దిక్కులన్నిట కావలి కాసెద
నాకు తెలియని స్థలములు లేవు
అడవి యంతయు తిరిగిన వాడిని.

చతురంగ బలములు ఎదిరి వచ్చినను
నన్నెదిరించి నిలబడ లేవవి
కావున లక్ష్మణ! కావలి కాతును
నీ వొకింత విశ్రాంతిని గొనుము.''

బదులు పలికెను లక్ష్మణమూర్తి
''నిషాదరాజా! ధార్మిక శ్రేష్ఠుడ!
నీ సామర్థ్యము నే నెరుగుదును
కటిక నేలపై రాముడు పడుకొనె.

దశరథ విభుని జ్యేష్ఠ కుమారుడు
సతితో నేలను పడుకొని యుండగ
కరిగెను గుండియ - నిద్దుర రాదు
సుఖముల మాట తలచదు మనసు.

దేవాసురులకు అజేయుడైన
అన్నను ఇటుల గాంచిన దుఃఖము -
దశరథ విభుని పూజాఫలము
రామచంద్రుడు రమ్య గుణాఢ్యుడు.

అడవుల చేరెను రాముడు అన విని
దశరథరాజు అసువులు నిలపడు
శోక సంద్రమున మునుగును కోట
కోసల దేశము అనాథ యగును.

కౌసల్యమ్మ, తల్లి సుమిత్రయు
దశరథ విభుడును బ్రతుకుట కష్టము
ఎటులో బ్రతికిన ఈ ఒక రాత్రికి
బ్రతికి యుందురని నమ్ము చుంటిని.

శత్రుఘ్నుని గని అమ్మ బ్రతికినను
కౌసల్యమ్మ బ్రతుకుట కష్టము
కోరిక తీరక మన మహరాజు
అసువులు వీడుట జరిగి తీరును.

అంత్య క్రియలను తండ్రికి చేసే
యోగ్యత మాకు లేదు కావున
నగరము వదలి వచ్చినారము
తండ్రి తలపులతొ మది కలవరము.

మంగళ కరమగు అయోధ్యయందు
భరత శత్రుఘ్నులు గడుపు చుందురు
స్థపతీ! తండ్రిని కనగలమా మరి?
అంతటి వరకు తండ్రి బ్రతుకునా!

అరణ్య వాసము పూర్తి చేసుకొని
అయోధ్య చేరి తండ్రిని గాంచెడి
సుముహూర్తమది వచ్చునొ రాదో?
అనుచు లక్ష్మణుడు విలపించెనట.

॥శ్రీరఘురాముడు॥

# 5 2 సీతారామ లక్ష్మణులు గంగను దాటి పాదచారులై ముందుకు సాగుట

రాత్రి గడచి ప్రభాతమయ్యెను
రామచంద్రుడు నిద్ర లేచెను
లక్ష్మణుమూర్తిని చూచి పలికెను
''సూర్యోదయము కావచ్చినది.

కోకిల గానము వినబడుచున్నది
నెమళ్ళ కేకలు ఎగసి పడినవి
సంద్రము చేరెడి పవిత్ర గంగను
త్వరగా దాటి ముందుకు పోదము.

అన్న కోర్కెను లక్ష్మణ మూర్తి
గుహునకప్పుడు తెలియ బరచగా
మంత్రుల పిలచి రామ సేవకై
చక్కని నావ తెమ్మని చెప్పెను.

అందము లొలికే చక్కని పడవ
అమరెను అపుడు గంగ ఒడ్డున
ఆ విషయమును గుహుడు భక్తిగా
తెలియ బరచెను రామచంద్రునికి.

రాముడు ముదముగ గుహునతొ పలికెను
''మిత్ర సత్తమా! కోర్కె తీర్చితివి
ముందుగ జానకి వస్త్ర భూషలను
నావలోనికి చేర్పించు మయా!''

ఆ విధముగను గుహునకు చెప్పి
దాశరథులు కవచమ్ములు దాల్చిరి
ఘన చాపములు ధరించినారు
సీతతొ కూడి రేవుకు చేరిరి.

సుమంత్రుడంతట రామ చంద్రునితొ
కర్తవ్యమును బోధించమనె
ప్రేమగ సచివుని భుజమును తట్టి
వినయముగా శ్రీరాముడు చెప్పెను

''మంత్రి సత్తమా! అయోధ్య కేగుడు
రాజు ఆనతితొ ఇంతటి వరకూ
రథమున మమ్ముల తీసుక వచ్చిరి
ఇకపై మేము నడచి సాగెదము.

గృహమున కేగి శ్రద్ధా భక్తుల
దశరథ విభుని సేవ చేయుడు''
అనుచు రాముడు చెప్పుచుండగా
దుఃఖము పొంగి పలికె సుమంత్రుడు.

''ఓ ధర్మాత్మా ! వనవాసమ్ము
మాన్పించుట మాకసాధ్యమయ్యెను
విష్ణుమూర్తి వలె తేజోవంతులు
ఎచ్చట నున్నను శుభములు కలుగును.

పౌరు లందరిని మభ్య పెట్టుటకు
అప్పుడు నన్ను ఉపయోగించిరి
ఇప్పుడు నన్నే మభ్య పెట్టుచు
మరలి పొమ్మని చెప్పుచుండిరి.

కైకేయి అధీనము అయ్యెదమయ్యా!
అనుచు సుమంత్రుడు ఏడువ సాగెను
రాముని వీడి నడువగ లేక
మదిలో వ్యథతో కుమిలి పోయెను.

అశ్రుల నాపి మంత్రి సుమంత్రుడు
గంగా జలముతొ సేద తీర్చుకొన
రాముడు పలికెను అనునయముగను
''మంత్రి సత్తమా! ఆప్తుడ వీవు.

నిన్ను మించిన మంచి మిత్రుడు
ఇక్ష్వాకులకు లేనే లేడు
నా తలపులతో కృంగెడి తండ్రిని
ధైర్యోక్తులతో కాపాడ వలె.

కైకమ్మ ముదముకై మన మహారాజు
చెప్పెడి పనులను శ్రద్ధగ చేయుము
తండ్రికి నాదగు ప్రణామ ముంచి
నా మాటలివి చెప్పుము మంత్రీ!

వనవాసమ్మని వ్యథ మదిలేదు
ఎంత వంతయు ముప్వు రెరుగము
పదునాల్గేండ్లు గడిచిన పిదప
మీ పద సేవలు పరమార్థమ్ము.

మంత్రి సత్తమా! తల్లు లందరికి
మరి మరి మాదు వందన మిడుము
భరత కుమారుని రప్పించమని
అభిషేకమ్మును చేయించమను.

యువ రాజైన భరత కుమారుని
గుండె నిండుగా కౌగిలించుకొన -
మేము దూరమను దుఃఖము తొలగి
తండ్రి మనసుకు శాంతి కలుగును.

భరతునితో నా మాటగ చెప్పుము
తండ్రితొ సమముగ తల్లు లందరిని
గౌరవించి ఆనంద పరచమను
అందుకు రాజువు అగుచున్నావను.

శత్రుఘ్నుని తల్లిని - కైకేయమ్మను
గౌరవించుటది గొప్ప కాదను -
నే దరి లేని నాదు జననిని
ఆదరించుటది ఘన కార్యంబను.''

అటుల రాముడు మంత్రికి చెప్పి
మరలి పొమ్మని ప్రేమగ చెప్పెను
మంత్రి సుమంత్రుడు దఃఖతప్తుడై
రామచంద్రునితొ పలికెను అపుడు.

''రామా! నేను నీదు భక్తుడను
నిర్భయమ్ముగా పలుకు చుంటిని
మీరు లేక నే అయోధ్య కేగను
శోక సంద్రమున మునిగెను నగరము.

రథమున మిమ్ము గొని దెచ్చితిని
మీరు లేక నే రథము తోలను
నే నొక్కడనే రథముతొ సాగిన
నిరాశలో ప్రజ దుఃఖించెదరు.

యుద్ధ రంగమున యోధుని రథము
యోధుడు లేక తిరిగి వచ్చినచొ
సేనల గుండెలు పగిలినట్లుగా
కృంగి పోదురు అయోధ్య వాసులు.

నిద్రాహారములన్నియు వదలి
మీ రాకకు వారెదురు చూచెదరు.
మీరు లేక రథమచటకు వెళ్ళిన
మరింత కృంగి మనుగడ సాగదు.

కౌసల్యమ్మతొ ఏమి చెప్పను
అడవుల దింపితి నని నిజమాడన?
మేన మామకడ దించితి ననినా
రెండు మాటలు చెప్పగలేను.

మీరు ఎక్కనిచొ అశ్వరాజములు
రథమును ముందుకు లాగవు రామా!
మీతో యిట నే వనముల నుందును
కాదన - రథముతొ అగ్నిని పడెదను.

క్రూరమృగములను వేటాడుచును
మీ తపస్సుకు సాయ పడుదును
అశ్వమ్ములను నన్నును కూడా
మీదు సేవలు చేయ నీయుడు

మీరు లేక నే నయోధ్య కేగను
స్వర్గ వాసమది అసలే కోరను
వన వాసమ్మది పూర్తి కాగనే
మిమ్ముల నేనే గొనిపోవలెను.

మీ సన్నిధిలో పదునాల్గేండ్లు
ఇట్టే గడుచును జానకీపతీ!
అనుమతి నిడనిచొ పదునాల్గేండ్లు
అన్ని వందల వత్సరంబులగు.

మీ సేవకుడను మీ భక్తుడను
కాదన వలదు కరుణా సాగర''
అనుచు పలికిన సుమంత్రు గాంచి
దయామూర్తి అతి ప్రియముగ పలికెను.

''మంత్రి సత్తమా! మీ ప్రభుభక్తి
తెలియును నాకు తెలియు నందరికి
కైకమ్మకు మరి మీరే చెప్పిన
నమ్మును ఆమె అడవి నుంటిమని.

మాట తప్పని మహా రాజనుచు
దశరథ విభుని నమ్మును ఆమె
కావున తప్పక అయోధ్య కేగుడు
నా మాటలను చెప్పుడు వారికి''

అతి కష్టముతో రామచంద్రుడు
మంత్రి సుమంత్రుని ఒప్పించి తను
గుహుని గాంచి తన కోరిక తెలిపెను
జటలు ధరించెద ననుచు పలికెను.

''మిత్ర సత్తమా ! వనవాసమ్మది
తండ్రి విధించిన ఆజ్ఞ కావున
ఇచట వుండుట సమ్మతి కాదు
జటలు ధరించి సాగెద ముందుకు.

మఱ్రిపాలను తెప్పించినచొ
వాటిని తలలకు పట్టించినచో
జుట్టు చిక్కుపడిజట లేర్పడును
అనగా గుహుడవి తెప్పించగను.

రామలక్ష్మణులు మఱ్రిపాలతో
జటలను తీర్చగ మునులై తోచిరి
వైఖానసముని పద్ధతిలోను
వానప్రస్థ వ్రతదీక్షను గొనిరి.

గుహుని గాంచి శ్రీరాముడు పలికెను
''ఓ స్నేహితుడా! రాజ్య రక్షణము
కష్టమైనదని తెలియుము నీవు
కోశాగారపు రక్షణ ముఖ్యము

ధర్మ మార్గమున ప్రజల నేలుము
ధర్మ వర్తివై పేరు గడించుము.''
అనుచు రాముడు గుహునికి చెప్పి
సతి సోదరులతొ నావ నెక్కెను.

పుణ్యమూర్తి పాదమ్ములు కడిగి
పునీతు డయ్యెను గుహుడానాడు
జానకీ పతి కౌగిలి లభించి
జన్మ సార్థకము అయ్యెను గుహునికి

నావను నడుపగ తన సేవకులకు
ఆనతిచ్చెను రామ భక్తుడు
ఆరోహణ మంత్రమ్ము నప్పుడు
రామచంద్రుడు పఠించె శ్రద్ధగ.

గుహుని వందనము రాము డందెను
నది కడ్డముగా నావ నడచెను
గంగా నదికి వందన మిడుచు
సీతాదేవి పలికెను అపుడు.

''పరమ పావనీ! గంగా భవానీ
భక్తుల కోర్కెల తీర్చే తల్లివి
దశరథతేని జ్యేష్ఠ కుమారుని
రామచంద్రుని కాపాడమ్మా!

వనవాసమ్మును పూర్తి చేసుకొని
నన్నూ తమ్ముని వెంట నిడుకొని
నీ దర్శనము చేయగ వచ్చును
నీ పూజలునే చేతును తల్లీ.

త్రిపథ గామినీ! పావన నదివి
బ్రహ్మలోకమున వెలసితి వీవు
రత్నాకరుని చేపట్టితివి
నీ స్తోత్రము నే చేయు చుంటిని.

సుఖముగ భర్తతొ తిరిగి వచ్చునటు
ఆశీస్సుల నిడు శుభముల రాశీ
విభునకు పట్టము గట్టిన యంత
నిన్ను తప్పక సంతస పరతును.

వేద విదులకు లక్ష గోవులను
దానమిచ్చి మృష్టాన్న మిడెదను
వస్త్ర భూషలతొ సంతస పరతును
నీకు తృప్తిగా విందు చేసెద.

నీ తీరమున వెలసిన యట్టి
దేవాలయములు తీర్థములన్నియు
సేవించెదను విను గంగమ్మా!
దోష రహితుడు నా పతి దేవుడు.

కళంక మెరుగని కరుణామూర్తి
నన్నూ తమ్ముని వెంట బెట్టుకొని
తిరిగి వచ్చునటు అనుగ్రహించుము''
అనుచు సీత తా గంగకు మ్రొక్కెను.

అవ్వలి ఒడ్డుకు చేరెను నావ
సుఖముగ ముగ్గురు దిగిరా నావను
అడవి మార్గమున నడువ సాగిరి
అంతట రాముడు తమ్మునితో ననె.

మాకు రక్షకుడ వీవేనయ్యా!
ముందుగ నీవు నడచు చుండగా
వెనుక జనకజ నడచుచు రాగా
ఆమె వెనక నే రక్షగ నడతును.

లక్ష్మణమూర్తీ! కానన సీమల
తోడు నీడగ వుండగ వలెను
ఆపద కలిగిన ఆపై మనము
చేయున దేమియు లేదని తెలియుము.

సీతను జూచి రాముడు పలికెను
అడవుల యిడుములు తెలియును యింక
జన సంచారము కనపడ దసలు
ఉద్యానమ్ములు వుండవు యిచట.''

ముందు లక్ష్మణుడు రక్షగ నడువగ
వెనుక జనకజ నడచు చుండగా
ఆమె వెనుక కోదండ రాముడు
ప్రణవ మంత్రమో! అన్నటు సాగిరి.

దాశరథులను సీతాదేవిని
కంటి కగుపడు నంతటివరకు
మంత్రి సుమంత్రుడు చూచుచుండెను
కనుమరగవగా అశృలు జారెను.

అడవిని దాటి పావన మూర్తులు
వత్సదేశమును గాంచిరి అపుడు
ఆకలి దీర్చుకు ఆ ముగ్గురును
నీడ కోసమట చెట్లను వెదకిరి.

॥శ్రీరఘురాముడు॥

# 5 3 తల్లిదండ్రుల దుఃఖము తలచుకొని రాముడు వంత నొందుట

విస్తరించిన మర్రిని గాంచి
దాని ఛాయలో పడుకొనెదమని
నిర్ణయించుకొనె రామచంద్రుడు
సోదరు లిరువురు సంధ్యను తీర్చిరి.

తమ్ముని గాంచి రాముడు పలికెను
"చాలా దూరము వచ్చినారము
సుమంత్రుడున్నూ వెడలి పోయెను
ముప్వురముండుట-కిదే మొదలయా

రాత్రుల యందు మేలు కొందము
సీత క్షేమము చూడగ వలెను
చీకటి పడినది కావున మనము
విశ్రాంతికి ఏర్పాటు చేతము."

పండి రాలిన ఆకులపైనే
పవ్వళించగ చేర్చిరి వాటిని
బడలిక చెందిన సీతాదేవి
నిద్రలో జారెను కటిక నేలపై.

మృదు తల్పముపై పడుకొనురాముడు
మర్రి నీడలో పడుకొనియుండి
మదిలో బాధను తమ్ముని తోను
చెప్పగ సాగెను ఈ విధము గను.

"లక్ష్మణమూర్తీ! నాయనగారు
నిద్రించకను దుఃఖము నుందురు
కైకాదేవి కోరిక తీరెను
సంతోషముతో నుండును ఆమె.

భరతుని రాజ్యము స్థిరము చేయుటకు
భర్తను కూడా చంపునొ ఏమో?
వృద్ధాప్యములో నుండెను తండ్రి
మన మిద్దర మట లేక పోతిమి.

మన కష్టములకు తండ్రి గారట
మది కలవరమున వంతలొ మునిగిరి
భార్యపైన మమకారము హేతువు
కామ మెంతయో బలమైనది గద.

భరతుడు కోసల నేలు చుండునా?
భార్యతొ అడవుల నే పోవలెనా?
దశరథరాజు అసువులు నిలుపున?
కామ ఫలితము ఆపదలయ్యా?

రాజ్య గర్వమున కైకాదేవి
మన తల్లులను ఇడుమల బెట్టును
వారి బాధలకు కారణ మగుదును
ఆ విధముగను జరుగ కూడదు.

తమ్ముడ! నీవు అయోధ్య కేగుము
ధార్మికుడైన భరతుని కిపుడే
నా తల్లిని నువు అప్పగించుము
లేనిచొ ఆమె అనాథ యగును.

ఏదో జన్మలొ నా ప్రియ జనని
తల్లీ బిడ్డల వేరు చేసెనా?
కావున యింతటి దుఃఖము కలిగెను
నవమాసములు మోసి కన్నది.

గారాబముగా పెంచెను నన్ను
సుఖపడు సమయము దరి చేరగను
ఈ ఎడబాటు దుఃఖము నింపెను
కొడుకునైనను కష్టము నిడితిని.

నన్ను బోలిన తనయు డెన్నడూ
ఏ స్త్రీకి ఇల కలుగ కూడదు
అమ్మ పెంచెడి గోరువంక తను
చిలుకతొ నాడు చెప్పెను యిటుల.

'చిలుకా! వినవే మన శత్రువగు
కైకా దేవిని కొరికి వేయుము'-
అటులా పిట్ట కౌసల్యమ్మను
మనసు నిండుగా గౌరవించెను.

ఏ విధము గను తల్లిని నేను
సంతస పరచని తనయుడ నైతిని
నేనీ పృథివిని త్రుంచగ చాలుదు
అధర్మ భయమున ఆగిపోతిని.

అధర్మమ్ముతో పరలోకమ్ములు
అందవు వినుము సుమిత్ర తనయా.''
అనుచు రాముడు నిద్దుర రాక
దుఃఖతప్తుడై కుమిలి పోయెను.

ఆరిపోయిన అగ్నిహోత్రమన
అలలు అణగిన కడలి తీరుగా
రామచంద్రుడు తన తమ్మునికి
అగపడ, తమ్ముడు దుఃఖము నిండెను.

దుఃఖము నున్న అన్నను గాంచి
రామానుజుడు పలికెను అపుడు
''అన్నా! నీ విటు చింతించకుమా!
వదినను నన్నును దుఃఖ పెట్టకు.

నీకు దూరమై మేము బ్రతకము
స్వర్గ వాసము నేను కోరను
అయోధ్యనసలే తలచను నేను
నీ పదములనే కొలుతును నిరతము.

ధైర్యము చెదరక నిలబడ వయ్యా!''
అనుచు తమ్ముడు అనునయించగ
గిరిలో సింహములున్న తీరుగా
మర్రి నీడను సోదరు లుండిరి.

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

## 5 4 భరద్వాజ మహర్షి చిత్రకూటగిరి వాసయోగ్యమని చెప్పుట

ఉదయము కాగా ఆ ముప్పురును
ముందుకు సాగి మనోహరమ్మగు
గంగా యమున సంగమ త్రోవలొ
వనములు పల్లెలు చూచుచు సాగిరి.

హోమ ధూమముల పొగ లెగయుచును
అంత దూరమున కనబడు స్థలము
భరద్వాజ ముని ఆశ్రమ స్థల మని
రామచంద్రుడు తెలిపె తమ్మునకు.

గంగా యమునల సంగమ స్థలమున
భరద్వాజముని ఆశ్రమమ్మునకు
సాయం సంధ్యా సమయము నందు
చేరిరి వారు - మృగములు బెదరెను.

పర్ణశాలలో ప్రవేశించిరి
హోమము చేయుచు నున్న మునీంద్రుని
తపోధనుని - ఆ భరధ్వాజుని
చూచిరి ముగ్వురు నమస్కరించిరి.

భక్తి నిండి శ్రీరాముడు పలికెను
''ఓ పుణ్యాత్మా! దాశరథులము
రాముడ నేను - లక్ష్మణుడీతడు
నా సహధర్మిణి సీతాదేవి.

వనవాసము మా తండ్రి ఆనతి
కంద మూలములు తిని గడుపుచును
ధర్మ వర్తనము వ్రతముగ మేము
గడుప నెంచితిమి దయను జూపుడు.''

''స్వాగత మయ్యా! దశరథరామా!''
అనుచు మహఋషి ఎదురు వచ్చెను
అర్ఘ్యజలమ్ములు వారికి ఇచ్చి
ప్రీతిమీరగా ఆతిథ్యమునిడె.

సీతారాముల లక్ష్మణమూర్తిని
ఆదరించి ఆ భరద్వాజుడు
వారి ప్రక్కన ఆసీను డయె
మునులందరును కూర్చొని రచట.

వనమున మృగములు పులుగులు కూడ
వచ్చి చేరినవి రాముని చూడగ
అంతట మహఋషి పలికె రామునితో
''రామా నిన్ను గాంచితి భాగ్యము.

అకారణమ్ముగ నీదు జనకుడు
కానకు నిన్ను పంపుట వింటిని
గంగా యమున సంగమ స్థల మిది
ఇచ్చట సుఖముగ వసించ వచ్చును.''

అంతట రాముడు పలికె వినయముగ
''స్వామీ! ఇది మరి ఊళ్ళకు చేరిక
జనులు - మమ్ము గన వచ్చు చుందురు
ఏకాంతమునకు భంగము కలుగును.

రాముని మనసు గ్రహించి మహఋషి
పలికెను ''రామా! పది క్రోసులలో
చిత్ర కూటగిరి పవిత్రమైనది
గంధమాదన గిరికి సమమది.

అతి రమణీయము ఆ ప్రదేశము
అందు వసింతురు మహఋషు లెందరొ-
పుణ్య చింతనలు కలుగును అచట
తపసు ఫలించే స్వర్గధామమది.

అచ్చట మీరు వసించ వచ్చును
లేదా ఇచటే వసించ వలెను''
అనుచు పలికి ఆ ముగ్వురకచట
విశ్రాంతికి ఏర్పాటును చేసెను.

బడలిక నిండిన ఆ ముప్వురును
సుఖముగ అచట నిద్రపోయిరి
తెల్లవారగనె మునికి మ్రొక్కిరి
బయలు దేరుటకు శలవును కోరిరి.

భరద్వాజుడు ముదముగ చెప్పెను -
చిత్ర కూటము ఫలసమృద్ధ మనె
మది కాహ్లాదము కలుగు నెల వనె
కిన్నెర, ఉరగు లుండెడి తావనె.

నదీ నదములు సెలయేళ్లున్ను
జింకల గుంపులు ముదము గూర్చును
ఆశ్రమమచ్చట నిర్మించుకొని
సుఖముగ నుండుడు అనుచు చెప్పెను.

॥శ్రీరఘురాముడు॥

# 5 5 సీతా రామలక్ష్మణులు చిత్రకూట గిరికి బయలు దేరుట

ఆశీస్సుల నిడి భరద్వాజ ముని
రామచంద్రునితొ ప్రియముగ పలికెను
పుత్ర ప్రేమతో సాగనంపుచు
వివరములన్నీ తెలిపెను తీరుగ.

మఱ్ఱి నీడను బడలిక తీరి
క్రోసెడు ముందుకు సాగినచో నట
మోదుగు - రేగు - వెదురు పొదలతో
యమున తీరమున వనము వెలసినది.

''గంగా యమునా సంగమమ్ము గని
ముందుకు సాగి అటుపై మీరు
పశ్చిమ దిశలో యమున వెంబడి
సాగుడు - యమునకు వేగము హెచ్చు.

అందమైన ఆవనము నందున
నడచుట కనువగు త్రోవ యున్నది
చిత్ర కూటమును చేర్చును త్రోవ
అనేక మారులు నడచితి నేను''.

దూరమైనను ముందుకు నడచి
జనులు దాటెడి రేవును గనుడు
అచ్చట మీరు తెప్ప కట్టుకొని
నదిని సుఖముగా దాటుడు మెల్లగ.

మునికా ముప్వురు వందన మిడిరి
ముని అభిమానము మరి మరి తలచుచు
ముందుకు నడచి యమున రేవు గని
నదిని దాటెడి యోచన చేసిరి.

నదిని దాటి మరి నడుచు చుండగా
కనబడు నచటొక ఘనమగు మఱ్ఱి
''శ్యామము'', దానికి సీత మ్రొక్కినచొ
కోర్కెలు తీరును - మహిమ గలదది.

లక్ష్మణు డంతట వెదుళ్ళు చేర్చి
చక్కని తెప్పను అట నిర్మించి
లతలు తీవలతొ ఆసన మొకటి
సీతాదేవికి యేర్పరచె నట.

పతి సాయముతో సీతాదేవి
తెప్పను ఎక్కి కూర్చొని యుండగ
లక్ష్మీదేవిగ భాసిల్లినది
సీత సొమ్ములు తెప్పలో నుంచిరి

సోదరు లిరువురు తెప్పను నెట్టుచు
నదిని దాటగా ముందుకు సాగిరి
జనక నందిని నదీ దేవతకు
మనసు నిండుగా ప్రార్థన చేసెను.

నదిని దాటి ఆ ముగ్గురు సుఖముగ
''శ్యామము'' ఛాయకు చేరుకొన గను
సీతాదేవి భక్తి ప్రపత్తుల
ప్రదక్షణించి మఱ్ఱికి మ్రొక్కెను.

''భర్తతో తిరిగి అయోధ్య చేరి
అత్త మామలను చూచు భాగ్యము
అనుగ్రహించుము వృక్ష రాజమా''
అనుచు సీత తా కోరు కొన్నది.

లక్ష్మణమూర్తి ముందు నడచుచు
సీత మధ్యలో నడచు చుండగా
వారి వెనుక శ్రీరాముడు రక్షగ
సాగిరి వారు ఉత్సాహముగ.

రాముని ఆనతి మేరకు తమ్ముడు
పూలను పండ్లను కోసి యిచ్చుచూ
సాగుచుండగా సీతాదేవి
భర్తతో ముచ్చట లాడుచు నడచెను.

హంసల - సారస పక్షుల చూచుచు
క్రోసెడు సాగి - ఒక కారడవిని
కోతుల కిచకిచకరి ఘీంకారము
వినుచు ముదముగా సాగిరి ముందుకు.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

## 56 వాల్మీకి మహర్షిని గనుట– చిత్రకూటమున ఆశ్రమ ప్రవేశము

రాత్రి వనమున నిద్రపోయిరి
ప్రాభాతమున రాముడు లేచి
ప్రయాణమ్మునకై తొందర చేసెను
శుభముగ పక్షులు కూయుచున్నవి.

స్నాన సంధ్యలు తీర్చిరివారు
చిత్ర కూటగిరి త్రోవలో సాగిరి
వసంత శోభను రామచంద్రుడు
సీతాదేవికి చూపుచుండెను.

''నిండుగ పూసిన పూలతో తరువులు
సుమ హారములతొ నిలచి నట్లయె
ఎఱ్ఱని పూలతొ మోదుగ చెట్లు
మంటల మండుచు నున్నటు లున్నవి.

నల్లజీడి అదె విరగ కాసినది –
కడివెడు మధువును కురిపించ గల
తేనె పట్టులవి తరువుల కున్నవి
వాసయోగ్య మీ ప్రదేశ మగును.

సీతా! కను మటు - నేల యంతయు
రాలిన పూలతో పాన్పుగ నున్నది
వాన కోయిలలు - కూయుచుండగా
నెమళ్ళు ప్రతిగా - అరచు చున్నవి.

సోదర! గనుమది చిత్ర కూటము
మందలుగా అట ఏనుగులున్నవి
పక్షులు ముదముగ ఎగురు చున్నవి
అనువగు స్థలమట నిర్ణయింతము.''

చిత్ర కూటగిరి నెక్కిరి వారు
ఫల జల సమృద్ధి గలిగిన స్థలము
రాముడు చూచి తమ్మునితో నట
ఆశ్రమమ్ము నిర్మించగ చెప్పెను.

నలువంకలకు చూచిన రాముడు
ముని ఆశ్రమములు వున్నటు కనుగొని
వారిని చూడగ సతి సోదరులతొ
ముందుకు నడిచెను చిత్ర కూటమున.

చక్కని ఆశ్రమ మందు ముువ్వురు
అడుగిడిరది వాల్మీకి ఆశ్రమము
ఆ మహర్షికి ముగ్గురు భక్తిగ
నమస్కరించి పులకితు లైరి.

పురుషోత్తముడు ధర్మమూర్తి యగు
రామచంద్రుడు వచ్చుట గాంచి
పరవశించెను ముని పుంగవుడు
ఆదరించి అట కూర్చొన బెట్టెను.

రామచంద్రుడు కుశల వార్తలు
తెలియబరచెను ముని తిలకునకు
ఆశీస్సులుగొని బయలుదేరిరి
ఆశ్రమమ్ము నిర్మించ నెంచిరి.

అన్న ఆనతిని రామానుజుడు
వాసమ్ములను - దుంగలు - కర్రలు
తీసుక వచ్చి - అతి నిపుణతతో
ఆశ్రమమ్ము నిర్మించెను అచట.

ముచ్చట గొలిపే ఆశ్రమమ్ము గని
తమ్ముని ప్రేమగ చూచి రాముడు
వాస్తు శాంతిని చేయుట కొరకై
తగు ఏర్పాటులు చేయగ చెప్పెను.

రామచంద్రుడు స్నానము చేసి
వాస్తు మంత్రము - జపముల చేసి
వాస్తు దేవతల పూజలు చేసి
పర్ణశాలలో ప్రవేశించెను.

భూత బలులను తీరుగ నెరపి
మంగళ కరముగ - వలయు క్రియలను
పూర్తి చేసెను - పుణ్య పురుషుడు
మంత్ర కోవిదుడు రామచంద్రుడు.

పూజకు అనువగు వేదిక లుంచి
అగ్ని దేవత మొదలగు వారికి
వేరు వేరుగ నెలవుల నచట
ఏర్పరచెను ఆ పర్ణశాలలో.

కన్నుల కింపగు పూల తరువులతో
వీనుల విందగు శుకపిక ధ్వనులతో
వన్య మృగములు ముచ్చట గొలుపగ
మాల్యవతీ నది పారుచుండగా.

చల్లని గాలి ఆశ్రమమ్ములో
ఆహ్లాదముగా వీచుచుండగా
మది కానందము కలుగ జేసెడి
పర్ణశాల అట శోభ లీనినది.

దేవ గణముతో దేవేంద్రుడు తను
''సుధర్మ'' మనెడి సభా భవనమున
అడుగు పెట్టినటు రామచంద్రుడు
సతి సోదరులతొ లోనికి నడచెను.

నదీ స్నానము నియమాదులతో
వన విహారము సలుపుచు ముదముగ
సీతారాములు మది వ్యధలేక
ఆనందముగా గడుప సాగిరి.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 57 సుమంత్రుని గాంచి దశరథుడు దుఃఖించుట

సీతారాములు లక్ష్మణమూర్తియు
కంటి కగుపడు నంతటి వరకు
గుహుడు సుమంత్రులు నిలచి చూచిరి
బరువగు గుండెతొ వెనుకకు మరలిరి.

శృంగిబేర పురమందు సుమంత్రుడు
నాలుగు దినములు గుహుని వెంబడి
రామ స్మరణతో గడపగ నంత
రామచంద్రుని వార్త తెలిసెను.

భరధ్వాజముని సందర్శనము
చిత్రకూటమున విడిది చేయుట
వివరములన్నీ గుహుని సేవకులు
తెలియ బరచిరి నిషాద రాజుకు.

గుహునిచె, అనుమతి, నంది, సుమంత్రుడు
తిరిగి అయోధ్యకు బయలు దేరెను
మూడు దినములకు అయోధ్య చేరెను
మూగబోయి ఆ అయోధ్య యున్నది.

రాముడు అడవుల పాలైనాడని
శోకా నలమున అయోధ్య యంతయు
కాలిపోయెనా! అనిపించినది
మంత్రి సుమంత్రుడు పురమును జేరెను.

అయోధ్య వాసులు ఎదురు వచ్చిరి.
'' ఏడీ రాముడు!'' అనుచు అడిగిరి
''వెనుకకు పొమ్మని రాముని ఆజ్ఞ''
విని వచ్చితినని చెప్పె సుమంత్రుడు.

గంగను దాటి రామచంద్రుడు
అడవుల కేగెను అని తెలియగను
దుఃఖ జలధిని మునిగిరి జనులు
నిరాశగా మరి పలికిరి యెన్నొ.

సుమంత్రుడొకడే రథము తోలుకొని
తిరిగి వచ్చుట చూచిరి స్త్రీలు
దీనముగా విలపించ సాగిరి
వినిన సుమంత్రుని గుండియ కరిగెను.

దశరథ జేని మందిరమ్ముకు
నేరుగసాగి మంత్రి సుమంత్రుడు
రథమును దిగి అట లోనికి నడచెను
తలను వంచి తా నడచు చుండెను.

ఏడు కక్ష్యలను దాటుచు నడచెను
సుమంత్రు గాంచి స్త్రీ లందరును
గుస గుస లాడుచు పలుకు చుండిరి
''కౌసల్యమ్మ విని మనగలదా.''

అందరి బాధలు రంగరించుకొని
అందరి మాటలు తనకు గ్రుచ్చుకొన
శోకాగ్నిలొ తను కాలిపోవుచు
రాజు వద్దకు చేరెను మంత్రి.

దుఃఖ తప్తుడై యున్న రాజుకు
నమస్కరించి మంత్రి సుమంత్రుడు
రాముడు చెప్పిన మాటలన్నియు
నమ్రత నిండి తెలియ బరచెను.

ఆ మాటలు విని దశరథరాజు
స్పృహను తప్పి అట నేలను బడెను
కౌసల్యా - సుమిత్ర లప్పుడు
లేవదీసిరి సపర్య చేసిరి.

తెలివి వచ్చినది దశరథరాజుకు
భర్తతొ పలికెను కౌసల్యమ్మ
''ఓ మహరాజా! మీ కుమారుడు
లోకోత్తరమగు కార్యము చేసెను.

తనయుడు పంపిన సందేశమును
మంత్రి సుమంత్రుడు తీసుక వచ్చెను
ఆయనతో మరి పలుకరదేమి?
జరుగ వలసినది జరిపినారు గద.

కైక ఇచ్చుట లేదు లెండి ఇక
నిర్భయమ్ముగా మాటాడండి
తనయుని కానకు అప్పుడు పంపి
ఇప్పుడు దానికి వంత ఎందుకు.''

కౌసల్యమ్మ అటుల పలుకుచు
విలపించుచును నేలను బడినది
ఆమెను గాంచి స్త్రీలు ఏడ్చిరి
అయోధ్య యంతయు దుఃఖించినది.

॥శ్రీరఘురాముడు॥

## 58 సీతారామలక్ష్మణులు చెప్పిన మాటలు–సుమంత్రుడు దశరథునకు చెప్పుట

రామా రామా! అనుచు దశరథుడు
విలపించుచు తన మంత్రిని గాంచి
జాలిగ పిలచి కంట నీటితో
గుండె కరుగగా అడిగెను అపుడు.

''మంత్రి పుంగవా! నా రఘురాముడు
ఏ తరు ఛాయలొ నిద్రించాడు
సుఖపడ సిరిగల ఆ సుకుమారుడు
కటిక నేలపై పవ్వళించెనా

కందమూలములు తినుచు, తనయుడు
అడవుల యందు తిరుగుచుండెనా
సుమసుకుమారి సీతాదేవి
ఎటుల నడచినది మంత్రి సుమంత్రా!

అశ్వని సురలు మందర గిరికి
సాగుట గనినటు రామలక్ష్మణులు
అడివికి పోవుట కనుల గాంచితివి
చరితార్థుడవు మంత్రి సుమంత్రా!

నా రాముడు తానేమన్నాడు!
లక్ష్మణుడింకా ఏమన్నాడు!
జనక నందిని ఏమనె నయ్యా!
ఏమి తినిరి అది వివరించు మయా!

స్వర్గము నుండి యయాతి జారి
సత్పురుషులలో పడినట్టు గను
తనయుని మాటలు నువు జెప్పగ విని
కొంత కాలము బ్రతికి యుందును''.

మాటలు తడబడ మంత్రి పలికెను
''ఓ మహరాజా! రామచంద్రుడు
ధర్మము తప్పక మిమ్ముల తలచి
సాష్టాంగముగా ప్రణామ మిడెను.

తమరు మహాత్ములు అనుచు పలికెను
రాజు లందరికి వందనీయులని
భక్తిగ పలికెను రామచంద్రుడు
పితృవాక్య పరిపాలన దక్షుడు.

అంతఃపురమున పెద్దలందరికి
భక్తి నిండుగా నమస్సు లిడెను
సుఖముగ తాను కానన సీమకు
సాగుచున్నటు తెలియ బరచ మనె.

కౌసల్యమ్మకు తన కుశలమును
తెలియబరచెను - ఎల్ల వేళలా
ధర్మ చింతనతొ పతి సేవలను
చేయగ చెప్పెను రామచంద్రుడు.

పెద్ద భార్యను అను తలంపును
మదిలో నుంచక తన సవతులతో
నెయ్యముతో మరి మెలగగ చెప్పెను
కైకమ్మను తా గౌరవించ మనె.

అధికారమ్మును మన్నించ వలె
కావున భరతుని గౌరవించ మనె -
రాజ ధర్మమది అనుచు రాముడు
కౌసల్యమ్మకు చెప్పగ నుడివెను.

కుశలము తెలిపి భరతుని కిటుల
చెప్పగ నుడివెను రామచంద్రుడు
తల్లులందరిని ఒకే విధముగా
ఆదరించుచూ గౌర వించమనె.

తండ్రి మాటను తలను ధరించి
రాజ్య భోగము లనుభవించమనె
తండ్రి మాట కెదురాడ వద్దని
మరి మరి చెప్పెను రామచంద్రుడు.

కంటి నీటితో తిరిగి పలికెను
సోదర భరతా! నీపై తల్లికి
ఎంతటి ప్రేమో అంతటి ప్రేమయె
నాపై నున్నది కౌసల్యమ్మకు.

దుఃఖతప్తయగు కౌసల్యమ్మను
నీ తల్లివలే ఆదరించ వలె''
అనుచు రాముడు కంట నీటితో
చెప్పెను రాజా! కరిగి పోతిని.

ఓ మహరాజా! లక్ష్మణమూర్తి
క్రోధ వశుడయి పలికెను యిటుల
రాముడు ఏమపరాధము చేసెను?
రాజు ఇట్టుల అడవికి పంపెను.

రాజ్యము కోరి అన్యాయముగా
కైక తానుగా వరము కోరినను
వరము నిచ్చిన మన మహరాజుది
దుష్ట కార్యమని నొక్కి చెప్పెను.

ఆ మహారాజు ప్రభువు కావున
తలచు కొన్నటు వెడల గొట్టెను
ఫలితము తప్పక అనుభవించును
అంతకు మించి చెప్పెడి దేమనె.

ప్రభువైనను మరి తండ్రియైనను
అన్నయైనను బంధువైనను
రాముడొక్కడే సర్వము నాకని''
సుమిత్ర సుతుడు పలికెను రాజా!

రామ పత్ని తా వెర్రిదాని వలె
కనుల నీటితో నమస్కరించుచు
నిలచెను – కన్నుల చెరగని దృశ్యము
మాటల చెప్పట ఎటు మహరాజా!''

॥శ్రీరఘురాముడు॥

# 5 9 శ్రీరాముని వద్దకు గొనిపొమ్మని దశరథుడు సుమంత్రు నడుగుట

సుమంత్రుడటుల చెప్పుచుండగా
వివరము లింకా రాజు అడుగగా
కంటి నీటితో మంత్రి అప్పుడు
తెలియ బరచెను ఆ మహరాజుకు.

''ఓ మహరాజా! రామ లక్ష్మణులు
వనవాసమునకు యోగ్య మగునటు
జటలు ధరించి గంగను దాటిరి
ప్రయాగ ముఖముగ సాగినారయా.

తమ్ముడు ముందుగ నడచు చుండగా
వెనుక జానకి నడచు చుండగా
వారి వెనుక శ్రీరాముడు నడచెను
నా కన్నులతో చూచితి స్వామీ.

గంగానదికి యిద్దరి నుండే
సజల నయనముల నమస్కరించితి
రాముడు పిలచును అనెడి ఆశతో
శృంగిబేర పురమందున వుంటిని.

రథ హయములవి ఏడ్చెను రాజా!
నా దుఃఖము మరి చెప్పగలేను
రాముడు అడవులపాలై నాడని
దుఃఖము నిండి మొగ్గలు వాడెను.

అచట ఆకులవి రాలి పోయినవి
పక్షులు కూయుట మాని వేసినవి
తటాకమ్ములలో నీరు ఇంకెను
క్రూర మృగములే తినుట మానెను.

ప్రకృతి యంతయు నీరసించి నది
శోభలు తరిగి నిలచియున్నది
అయోధ్యలోన ఉద్యానములలో
పక్షులు కూయుట మానివేసినవి.

రథమున రాముడు లేడని తెలిసి
కంట నీటితో జనులు నిలచిరి
తనయుని కొరకై శోకమూర్తి యగు
కౌసల్యమ్మను పోలెను అయోధ్య.''

దశరథరాజు కుమిలి ఏడ్చెను
మంత్రితో పలికెను '' ఓ ధర్మాత్మా!
దుష్టకార్యమును చేసితి నేను
పాపికైక నను మోస పుచ్చినది.

హితులు మంత్రులతో వేద విదులతో
యోచన చేయక చేసితి నిటుల
స్త్రీ వ్యామోహము ఇంత చేసెను
విధి నిర్ణయము ఇటుల వున్నది.

మంత్రి సుమంత్రా నేనెపుడైనా
నీకు సాయము చేసియున్నచో
అది మది నిలపి - నన్నీ క్షణమున
రాముని వద్దకు తీసుక పొమ్ము.

నా అధికారము సాగుచున్నచో
నా ఆజ్ఞలవి చెల్లుచున్నచో
నా రాముని యిట తీసుకురమ్ము
నా ప్రాణములు నిలుపుము నీవు.

చాలా దూరము సాగియుందురు
కావున నన్నే తీసుక పొమ్ము
సీతారాముల లక్ష్మణమూర్తిని
చూడక బ్రతుకుట కష్టము నాకు.

ఓ కౌసల్యా! శోక జలధిలో
మునుగు చుంటిని రాముడు లేక
రాముని ఎడబాటగును సంద్రము
సీత - కనబడని తీరము ఆగును.

నా నిట్టూర్పులు సుడి గుండములు
నా కన్నీళ్ళు కెరటపు నురుగులు
బాధతొ కదలే చేతులు - చేపలు
నా రోదనయే సంద్రపు ఘోష.

నా శిరోజములు అందలి నాచు
కైక అందలి బడబాగ్ని యగు
నా కన్నీరు అందలి నీరు
కైక వరములు సంద్రపు పోటు.

మంథర చేసిన దుర్బోధలవి
సంద్రము నందలి మహా గ్రహములు
కన్న కొడుకును వెడలు గొట్టుటది
అపారమైన సంద్రపు లోతు.

అంతటి సంద్రము - రాముడు లేక
దాటుట ఎటుల ఓ కౌసల్యా!
తనయుని కొరకై దుఃఖము నిండి
అసువులు బాయుట విధి లిఖితమగు.

రాజు - దుఃఖమును భరించ లేక
మూర్ఛిలి పడెను శయ్యా మీదనే
భర్తను గాంచి కౌసల్యమ్మ
కలవర పడినది - కంట నీరిడె.

❋❋❋ ||శ్రీరఘురాముడు||

# 60 సీతారామ లక్ష్మణులకు దిగు లెంతయు లేదని సుమంత్రుడు చెప్పుట

కంటి నీటితో కౌసల్యమ్మ
మంత్రి సుమంత్రుని చూచి పలికెను
''మంత్రి పుంగవా! నన్నీ క్షణమే
తనయుని వద్దకు తీసుక పొమ్మ.

సీతారాముల లక్ష్మణమూర్తిని
చూడక నేను బ్రతుకుట కష్టము
నీవు వచ్చిన అరదము పైనే
తనయుని వద్దకు తీసుక పొమ్మ.''

రాణి మాటలు విని సుమంత్రుడు
సజల నయనముల ముడిచిన కరముల
పలికెను - ''అమ్మా! దిగులు నందకు
మనసు చెదరక నిబ్బరించుము.

సీతారాములు లక్ష్మణ మూర్తియు
మది వ్యథ లేక హాయిగ నుండిరి
అన్న సేవలే పెన్నిధి అనుకొను
జితేంద్రియుడు లక్ష్మణమూర్తి.

నిరతము రాముని - మదిలో నిలపి
ముదముగ నున్నది జనకనందిని
కానన సీమయె ఉద్యానమ్మ్గగ
తలంచి సుఖముగ నున్నది ఆమె.

రాముని వెంబడి యున్నది గనుక
కాంతులు తరగక ఆ కుసుమలత
దిగులు నందక గడుపు చున్నది
రామ సన్నిధియె అయోధ్య ఆమెకు.

ఓ మహరాణీ! త్రోవలొ కనబడు
స్థలముల, తరువుల వివరములన్నీ
భర్తను - మరిదిని అడుగు చున్నది
వారు చక్కగా చెప్పుచు సాగిరి.

అడవి గాలికి - అచటి ఎండకు
చంద్ర వదన ఇసుమంతయు స్రుక్కక
పతి అడుగులలో పరవశించుచు
పతివ్రత అట సుఖముగ నున్నది.

మంగళ కారిణి నడుచుచుండగా
తామర మొగ్గల పోలు పదముల
అందెలు సందడి చేయుచున్నవి
అలుపులేక తా నడచు చుండెను.

భర్త రక్షణలో నున్న జానకి
క్రూర మృగములకు భయపడకున్నది
ఓమహరాణీ! ఆ మువ్వురకై
వంత నొందుట ఎంతయు తగదు.

కంద మూలములు తినుచు వారట
మహా ఋషులవలె గడపు చుండిరి
ఆ మహనీయుల దివ్య చరితము
శాశ్వతముగ ఇల నిలచును తల్లీ!''

మంత్రి సుమంత్రుడు ఆ విధముగను
చెప్పుచుండగా కౌసల్యమ్మ
భరించరాని దుఃఖ మెగసి పడి
''నాయన - రామా!'' అనుచు ఏడ్చినది.

||శ్రీరఘురాముడు||

❋❋❋

# 61 కౌసల్యా దశరథునితో కటువుగా పలుకుట

దుఃఖ తప్తయగు కౌసల్యమ్మ
దశరథ ప్రభువును చూచి పలికెను
''స్వామీ! మీరు దయామయులయా
ధర్మ పాలనకు పేరు గడించిరి.

ప్రజా హృదయముల పదిలమునున్న
ప్రియ భాషణుడు సత్యవర్తి యగు
రామచంద్రుని - కారడవులకు
పంపినారు - అది తగునా మీకు!

రామలక్ష్మణులు సీతాదేవియు
అడవులయందు ఇడుమలు పడెదరు
కంద మూలములు ఎటుల తిందురు!
ఎండ వానలకు ఎటుల ఓర్చెదరొ.

కటిక నేలపై పవ్వళించెదర?
క్రూరమృగముల ధ్వనులు విందురా
కన్న కుమారుడు అడవుల కేగగ
పగులకున్నది నాదు గుండియ.

పదునాల్గేండ్లు రాజ్యము నేలి
ఆపై వచ్చిన అన్నగారికి
భరత కుమారుడు రాజ్యము నిచ్చున?
ఇచ్చినచో మరి రాముడు గొనునా?

ఎద్దు కొరికిన గడ్డి పరకలను
ఆబోతు తినుటకు ముందుకు వచ్చున?
తమ్ముడు యిపుడు అనుభవించిన
రాజ్యము-రాముడు స్వీకరించునా?

ఏదో జంతువు చంపిన మాంసము
వ్యాఘ్రము ఎన్నడు ముట్టుకోదు కద!
నర శార్దూలము రామచంద్రుడు
అవమానమగు పనిని చేయడు.

ఒక యజ్ఞములో వాడిన దినుసులు
మరియెక యజ్ఞమునందు వాడరు
భరతుని కందిన రాజ్య సంపదను
రాముడెన్నడును ఆశించడు కద!

ప్రతాపవంతుడు రామచంద్రుడు
అప్రతిష్ట యగు పనులు చేయడు
వాడి బాణముల గిరుల చీల్చగల -
గ్రహముల - తారల నేల రాల్చగల -

సమర్థుడైన రామచంద్రునికి
పదునాల్గుభువనములు వణకునుకాదా
పంచ భూతములు, ఏడుసంద్రములు
రామ బాణముల గడగడ లాడును.

మీ యందు గల గౌరవమ్ముతో
మీ మాటలను అతిక్రమించక
అడవులకైనా సాగెను భక్తిగ
లేనిచొ రాముడు లొంగ డెవ్వరికి.

పెద్ద చేప - తన పిల్లచేపను
మ్రింగి వేసినటు - దయా దూరులై
మీ కుమారునికి కీడుచేస్తిరి
వాని భవితను తృంచి వేసితిరి.

జ్యేష్ట కుమారుని అడవికి పంపుట
ధర్మ శాస్త్రములు సమ్మతించునా
వేదవిదులిది వల్లె యందురా
ధర్మ సూక్ష్మములు మీకు తెలియవా!

ప్రభువులు మీరు మీ సేవలకై
ముద్దుల భార్య కైక ఉన్నది
భరతుని వంటి తనయు డుండెను
నా బ్రతుకేమరి శోచనీయము.

స్త్రీకి భర్తయే కావలసినది
తనయుని ప్రేమ కోరుకొనునది
వారిద్దరును లేనిచో యిక
బంధువులెవరో ఆదరింతురు.

సవతికి వశులై మీరు దూరమై
కన్న కొడుకును దూరము చేస్తిరి
బంధు వర్గము ఉండియు లేరు
అన్ని విధముల దుఃఖము నింపిరి.

నన్నూ, తనయుని ఇటుల చేసితిరి
అయోధ్య నంతయు పాడుచేసితిరి
కైక ముదముకై ఇంత చేసితిరి''
అనుచు బిగ్గరగ ఏడ్చెను రాణి.

కౌసల్యమ్మ కరగిన గుండెతొ
విలపించుట ఆ మహరాజు విని
ఎట్టి అధర్మము చేసితి నేనని
ఆలోచించుట ఆరంభించెను.

॥శ్రీరఘురాముడు॥

## 62 కౌసల్య దశరథుని మదికూరట కల్గించుట

మనుష్య కలత పడి భార్య పలికిన
నిష్టురమ్ములను విని మహరాజు
ఆలోచించగ - పూర్వపు సంగతి
స్ఫురణకు వచ్చి చలించి పోయెను.

విధివశమ్మున ఆనాడాతడు.
చేసిన యట్టి దుష్కృతమ్మది
మదిలో మెదలగ దుఃఖజ్వాలలు
దహించ సాగెను ఆ మహరాజును.

దీన వదనమున చేతులు మోడ్చి
తనదేవేరిని ప్రార్థించె నిటు
''ఓ కౌసల్యా! దయా మూర్తివి
రిపుని సైతము ఆదరింతువు.

ధార్మిక స్త్రీకి పతియే దైవము
గుణహీనుడు తన భర్తయైనను
ప్రత్యక్షమగు దైవము అనుకొను -
అంతటి ఉత్తమ యిల్లాలివి నువు.

నిష్ఠురమ్ములతొ కష్ట పెట్టకు
పోటు మాటలతో గాయ పరచకు''
అనుచు జాలిగా భర్త అనగను
భార్య మనస్సది కరిగి పోయెను.

అశ్రులు ధారగ కారుచుండగా
పతికరములపై శిరమును జేర్చి
''స్వామీ ! నన్ను క్షమించ వలెను
సాష్టాంగముగా ప్రణామ మిదిగో.

మీరు నన్ను అర్థించుట తగదు
పాపకార్యమును చేసితి నేను
పుత్ర ప్రేమయది అధికము కాగా
వివేక హీనగ పలికితి నేను.

భర్తను బాధలు పెట్టెడి స్త్రీకి
ఇహపర సౌఖ్యము లందవు స్వామీ!
తెలియును నాకు - సత్య సంధులు
మనసు కలతపడి పలికితి నేను.

పరమ శత్రువే శోకము స్వామీ
వివేక ధైర్యమ్ముల రెండింటిని
సర్వనాశనము చేసి వేయును
దుఃఖము ఓర్చుట సాధ్యము కాదు.

వనవాసమునకు రాముడు నడిచి
అయిదు రోజులు పూర్తియైనవి
అయిదు యుగములుగ కాలము గడిచెను
దుఃఖ కెరటములు ముంచు చున్నవి.''

కౌసల్య చల్లగా ఓదార్చ గను
విభుని దుఃఖము ఇనుమడించెను
రాత్రియైనది - ఆ మహరాజు
అలసి పోయెను నిద్రలొ జారెను.

॥శ్రీరఘురాముడు॥

❃❃❃

## 6 3 ముని కుమారుని చంపినట్లు – శాపగ్రస్తుడైనట్లు దశరథుడు కౌసల్యకు తెలియ బరచుట

అర్ధరాత్రమున దశరథ రాజుకు
మెళుకువ వచ్చి చెంతనె వున్న
కౌసల్య నట నిద్రలేపెను
మదిలో బాధ చెప్ప సాగెను.

''ఓ పుణ్యవతీ! ప్రతి జీవుడును
కర్మ ఫలమును అనుభవించవలె
ముందు వెనుకలు ఆలోచించక
పనిని చేసిన మూర్ఖుడు అగును.

చిన్నిపూవులు పూసెడిమామిడి
చిన్ని కాయలు కాయును అనుచు
పెద్ద పూవులను పూసెడి మోదుగు
పెద్ద కాయలిడు అనుట మూర్ఖత.

అటుల తలంచి - మామిడి నరకి
మోదుగ నాటిన - ఫలితము శూన్యము
బాలుడు తెలియక విషము తిన్నను
వానికి కీడు జరిగి తీరును.

అజ్ఞానముతో దుష్కృతమ్మును
నాడు చేసితిని - దాని ఫలితమిది.
వివాహమునకు పూర్వపు సంగతి
చెప్పెద వినుము ఓ మహరాణీ!

విలువిద్యలొ నే ఆరి తేరితి
శబ్ధవేధి అను పేరు గడించితి
వేటాడుటకై ఉత్సాహముగా
రథమున సాగితి సరయూ తీరము.

వర్షాకాలము - నేల యంతయు
జలమయమ్ముగా తోచుచుండెను
కప్పల బెకబెక వినబడుచున్నది
నెమళ్ళు ముదముగ అరచుచున్నవి.

బారులు కట్టి చాతక పక్షులు
ఆకాశములో ఎగురుచున్నవి
నింగిని మేఘము లలము కొన్నవి
కొండల పోలి ఏనుగులున్నవి.

వేటకుసాగితి ధనుర్బాణముల
చీకటి అపుడు అలుముకొన్నది
అర్ధరాత్రమున నది సమీపమున
వేచి యుంటిని వేటాడుటకై.

నీటికివచ్చు అడవిఏనుగునొ
అడవి దున్ననో వేటాడుటకై
కారుచీకటిని శబ్దసాయమున
శరము వదలగా నిశ్చయించితిని.

నీరు త్రాగెడి శబ్దము వినబడ
రెండు బాణములు సూటిగ వేసి
రెండు మృగములను చంపితి నపుడు -
మూడవసారి శబ్దము వచ్చెను.

బుడ బుడమను శబ్దమ్ము వింటిని
నీరు త్రాగెడి జంతువు అనుకొని
విష సర్పమ్ము పోలిన బాణము
విడచితి నపుడు విను కౌసల్యా!

శరము సాగిన దిక్కు నుండి అట
అయ్యో- బాబూ- అనెడి వాక్కులు
మనుజ గొంతుతో వినవచ్చినవి
స్పష్టముగా నే వింటిని మాటలు.

"తపో నియమమున నుండెడి వాడను
పరులకు హాని చేయని వాడను
ఫలములుతిని-మను-మునిబాలుడను
ఎవ్వరు నన్నీ శరమున గొట్టిరి.

జటా వల్కలములున్న నన్నిట
వధించగాను ఒరిగెడిదేమి!
నా ప్రాణముపై దుఃఖము లేదు
నా తలి దండ్రుల గూర్చియె వంత.

ముదుసలి అంధులు నా తలిదండ్రులు
ఇకపై వారు జీవించుట ఎటు!
మూర్ఖుడెవ్వడో మా ముగ్గురిని
ఒకే మారుగా చంపినట్టయె.''

రాణీ! నేనా మాటలు వింటిని
ధనుర్బాణములు జారి పోయినవి
భయము, దుఃఖముల ఎటులో నడచి
ఆ ప్రదేశము చేరుకొంటిని.

శరము చీల్చగా రక్తపు మడుగున
ఒక మునిబాలుని చూచితి నచ్చట
అతని ప్రక్కన నీళ్ళ ఒలికిన
ఘటమును చూచి తెలిసితి విషయము.

నన్ను గాంచి ఆ ముని బాలకుడు
కన్నుల నిప్పులు రాల్చుచు పలికెను
''ఏ మపరాధము చేసితి రాజా!
నన్నీ శరమున వధించినావు.

అంధులైన నా తలిదండ్రులకు
దాహము తీర్చగ నీటికి వచ్చితి
ఒక్క శరముతో నన్ను చీల్చినను
మూడు ప్రాణములు తీసెను శరము.

దాహముతో అట వేచి యుండిరి
నా దేహము యిట త్రుంచితి వీవు
వారికి విషయము తెలియదు యింక
తెలిసియు వారు కదలగలేరు.

తోటి తరువును నరకుచుండగా
మిగిలిన తరువులు అసహాయముగా
నిలచి చూచినటు నా తలిదండ్రులు
అసహాయులయి తనువు వీడెదరు.

మా తపస్సుకు ఫలమిదియేమో!
రాజా! నా తలిదండ్రుల గాంచి
విషయము తెలుపుము, లేనిచొ తండ్రి
తపోగ్నితో నిను దహించురాజా!

కాలిబాట అది కనబడుచున్నది
అది చేర్చును నిను ఆశ్రమమ్మునకు
త్వరగా పొమ్ము - లేనిచొ తండ్రి
శాపము నిచ్చును అనుచు పలుకుచు.

బాధతొ దహించుచున్న శరమును
వెలికి లాగమని ప్రార్థన చేసెను
శరము లాగినచొ బాలుడు బ్రతకడు
లాగకున్నచో నరక బాధయది.

దిక్కుతోచక నిలచి యుంటిని
నాస్థితి తెలిసి బాలుడు పలికెను.
రాజా! ధైర్యము తెచ్చుకొంటిని
నీవు మనస్సును నిగ్రహించుకో.

బ్రాహ్మణ పుత్రుడ నేను కానయా
బ్రహ్మ హత్య పాపమ్ము తగలదు
వైశ్యునకు మరి శూద్ర స్త్రీకి
పుట్టితి నేను - గిట్ట నుంటిని.

భరించలేని బాధలొ నుంటిని
దయగొని శరమును లాగి వేయుము
అనుచు బాలకుడు అర్థించగను
శరములాగి ఆ బాలుని చంపితి.

ఓ కౌసల్యా! ఆ నిశిరాత్రి
సరయూ తీరము నందున నాడు
దుఃఖము నిండి విలపించితిని
బాలుని చూచుచు విలపించితినట.''

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 6 4 రాముని తలచుచు దశరథుడు తనువు వీడుట

దుఃఖార్తుడయి దశరథరాజు
గద్గద స్వరమున చెప్పసాగెను
''తెలియక నే నపరాధము చేసితి
మహాపాపమును చేసితి దేవీ!

అడుగుల చప్పుడు విని పలికిరట
''నదిలో ఈతలు కొట్టు చుంటివా!
ఆలస్యమునకు భయపడిపోతిమి
ముందుగ అమ్మకు నీళ్ళను యిమ్ము.

ముని బాలకుడు కోరినట్లుగా
కడవ నిండుగా నీళ్ళు తీసుకొని
వృద్ధులైన తలిదండ్రుల వద్దకు
అడుగులు తడబడ చేరితి నెటులో.

పలుకవ దేమి అలుక వచ్చెనా
తెలియక ఏమో అన్నచొ తప్పే -
మా ప్రాణములు నీవే తండ్రీ!
జాగు చేసితివి పలుక వదేమి.''

పండు వృద్ధులను చూచితి నచట
రెక్కలూడిన పక్షుల మాదిరి
అంధులిద్దరూ తనయుని కొరకై
దప్పికతో నట వేచి యుండిరి.

బాధతొ భయముతొ పలికితి నప్పుడు
మాటలు పెగలక పలికితి నప్పుడు
దుష్కృతమ్మునకు దిగులుతొ పలికితి
జరిగిన దంతయు తెలియబరచితి.

వారిని కాంచగ - మాటలు వినగా
భయముతొ గుండియ దడదడ లాడెను
ధైర్యము తెచ్చుకు లోనికి నడచితి
కొడుకు వచ్చెనని తలచిరి వారు.

విషయము నంతయు విని ఆ వృద్ధుడు
దుఃఖార్తుడయి కృంగి పోయెను
కన్నుల నిప్పులు కురియగ పలికెను
అమిత కోపమున పలికె నప్పుడు.

''రాజా! నీవే స్వయముగ వచ్చి
నీ దుష్కృతమును చెప్పితి వీవు
లేనిచొ నీతల పగిలి యుండును
ఇక్ష్వాకువంశమే మిగలక పోవును.

తెలిసి నీవు అప రాధము చేసిన
నీ వంశమది అంతరించెడిది
రాజా! మమ్ముల తనయుని వద్దకు
తీసుకు పొమ్ము అనుచు అడిగిరి.

వృద్ధుల నవుడు చేర్చితి నటకు
రక్త సిక్తమగు బిడ్డ దేహమును
కరముల తడుముచు ఏడ్చిరి వారు
తల్లి బాధతో మూర్ఛిల్లినది.

తనయా! మమ్ముల పలకరించవా
ఆప్యాయముగా కౌగలించవా!
మా సేవలనిక చేసెడి దెవ్వరు
హోమాదుల నిక చేసెడి దెవ్వరు.

నీ తల్లిని ఓదార్చుట ఎటుల
ఉదయము వరకు తాళుము బిడ్డా!
మా వల్లనె ఆలస్య మైనదని
ఆ యమరాజుకు చెప్పుకొందుము.

ఏపాపమును ఎరుగవు నీవు
పుణ్య లోకముల కేగెద వీవు
తపోనిష్ఠులు మన వంశీయులు -
తపోధనుల లోకమ్ము కేగెదవు.

పాపకర్ముడు నిన్ను చంపెను
అధోగతికి ఈ రాజు పోవును.
అనుచు ఏడ్చుచు వృద్ధుడంతట
జలక్రియ చేయుట ఆరంభించెను.

అంతటిలోనే ఆబాలకుడు
దివ్య తేజమున దేవయానమున
తల్లిదండ్రులను చూచి పలికెను
వారిద్దరినీ ఊరడించెను.

మీ సేవలను చేయుట చేత
దివ్య లోకమున కేగుచుంటిని
తొందరలోనే మీరిద్దరును
నను చేరెదరని పలికి సాగెను.

కరములు ముడిచి నిలచి యుంటిని
దేవీ! నను గనివృద్ధుడు పలికెను
కొడుకు పోయెను బ్రతుకుట ఎందుకు
మమ్మిద్దరినీ సంహరించుము.

రాజా నీవు నా కుమారుని
తెలియక పోయి చంపినాడవు
పశ్చాత్తాపము నందు చుంటివి
కావున పాపము నిను బాధించదు.

కానీ రాజా! వృద్ధాప్యములో
పుత్ర శోకమను - దుఃఖము నిడితివి
కావున నీవునువృద్ధాప్యములో
పుత్ర శోకమునపుడమి వీడెదవు.

అటుల పలుకుచు ఆ దంపతులు
తనయుని చితిలో పడిరంతటను
నాకము చేరిరి పుణ్య మూర్తులు
తలపుకు వచ్చెను విను కౌసల్యా!

శరమును వదలి ఆనాడటుల
మునికుమారుని చంపిన పాపము
ముని వృద్ధుడు నాడిచ్చిన శాపము
వ్యర్థము కావని తెలియుచున్నది.

పుత్ర శోకమున బ్రతుకను నేను
నా కన్నులవి కనబడకున్నవి
కౌసల్యా! నువు పలుకవదేమి!
నన్ను స్పృశించుము వేదన తీర్చుము.

ఎంత దుష్టుడును కన్న కుమారుని
కారడవులకు పంపడు దేవీ!
ఏ తనయుడును రాముని మాదిరి
మారు పలుకక అడవుల కేగడు.

కౌసల్యా! విను రాముడు వచ్చి
కౌగలించినచొ బ్రతుకుదు నేమో-
లేనిచొ వానిని చూచుట జరుగదు
యమ కింకరులు అగపడు చుండిరి.''

రాముని తలచుచు వేదన పడుచు
దగ్గర లేడని బాధనందుచు
రాముని రూపము మదిలోనిలిపి
కన్ను మూసెను దశరథ రాజు.

॥శ్రీరఘురాముడు॥

❃❃❃

## 6 5 రాజ భవనము – శోక సంద్రమున మునుగుట

తెల్లవారినది రాజ భవనమున
స్తోత్ర పాఠకులు, వంది మాగధులు
మేలు కొలుపులు పాడుచు వచ్చిరి
కైవారమ్ము చేసిరి ప్రభువుకు.

పక్షులు కిలకిల నిద్ర లేచినవి
పాడుచున్నవి ప్రాభాతమున
వేద ఘోషను చేసిరి విప్రులు -
మందిర మంతయు మార్మోగినది.

దంత ధావనకు స్నానాదులకు
వలయు జలములు ఓషధిరసములు
మేలు వస్త్రములు పుష్పాదులును
తిను పదార్థములు అమరుచున్నవి.

సూర్యోదయము అయినను గాని
ప్రభువు నిద్రను లేవ కుండెను
కొందరు స్త్రీలు లోనికి పోయి
మధుర గాత్రముల మేలు కొలిపిరి.

ఉలకక పలకక రాజు వుండగా
మృదువుగ తట్టి లేప నెంచిరి
ఆప్రయత్నము విఫలము కాగా
అనుమానించి శ్వాస చూచిరి.

వారికి విషయము తెలిసె నప్పుడు
గజగజ వణకిరి ఆ స్త్రీలందరు
దశరథ ప్రభువు మరి లేడనుచు
తెలిసిరి వారు ఘొల్లున ఏడ్చిరి.

కౌసల్య సుమిత్రలు మేను తెలియక
స్పృహ లేనట్లు పడివుండి రట
కంటి నీరది చారలు కట్టి
కళాహీనమై వున్నవి ముఖములు.

విషయము తెలిసి కౌసల్యమ్మ
నేలను పొర్లుచు ఏడువ సాగెను
వారి ఏడ్పులకు కైక మొదలగు
స్త్రీలందరును వచ్చి చేరిరి.

కట్టలు త్రెంచుకు దుఃఖము రాగా
ఘొల్లున ఏడ్చిరి స్త్రీలందరును
కౌసల్య సుమిత్రలు కలవర పడుచు
లేచి - ప్రభువు దరిచేరిరి వారు.

ఆనందముగా వుండెడి భవనము
రోదన ధ్వనులతొ ప్రతి ధ్వనించెను
దిక్కులన్నిట నిండెను రోదన
శోక సంద్రమున మునిగె భవనము.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

## 66 దశరథుని దేహము తైలద్రోణిలో భద్ర పరచుట

కళ దప్పిన పతి వదనము గాంచి
వణకి పోవుచు కౌసల్యమ్మ
పతి శిరస్సును వడి యందుంచుకు
కైకను చూచి ఏడ్చుచు పలికెను.

వరములు తీర్చెను మన మహరాజు
కాలము చెల్లెను వాటి వల్లనే
శాశ్వతమ్ముగా భర్త లేడిక
ఇక్ష్వాకు వంశమే అంతరించునా.!

''ఓ కైకా! నీ కోరిక తీరెన!
స్వర్గ వాసమున కేగెను పెనిమిటి
రాముడు అడవుల పాలైనాడు
దుష్టురాల! యిక రాజ్యమేలుకో.

పుత్రిక దూరము అయిన బాధతో
జనకరాజు మది దుఃఖిలు చుండి
భార్యను సంతస పరచుట కొరకై
ప్రభువు చేసిన తప్పు తెలియును.

పతియే దైవము భార్యకు యిలలో -
పతిలేని సతి బ్రతుకుట యేల
పెనిమిటి లేక బ్రతుకను నేను
నీకు ధర్మముతొ పనియేలేదు.

కైకా! ఎంతటి కర్కశురాలవు
రాముడెచ్చట తిరుగు చుండెనో
కోడలు ఎంతటి బాధలొ నున్నదొ
అనాథ నైతిని యిప్పుడు నేను.

విషము కలిపిన ఆహారమును
ఆశగ తినిన - కీడు చేయదా
కుబ్జ చెప్పిన బోధన వింటివి
ఆలోచించక వరము లడిగితివి.

పతివ్రతను నే బ్రతుక కూడదు
సహగమనమ్ము చేసెద నేను''
అని విలపించెడి కౌసల్యమ్మను
ఓదార్చుచు నడిపించిరి బయటకు.

జరుగ వలసినది నిర్ణయించుటకు
సమాలోచనము చేసిరి మంత్రులు
తనయులప్పుడు లేరు గావున
దహనము చేయుట తగదని తలచిరి.

ధర్మమూర్తిని సతి సోదరులతో
అడవుల కంపిన కర్కశురాలు
మమ్మిక పురమున ఉండ నిచ్చునా -
అనుచ ఏడ్చిరి అతివలందరు.

తైలద్రోణిలో నుంచిరి దేహము
అంతఃపుర స్త్రీలందరు ఏడ్చిరి
విధవలైతిమని విలపించిరట
అనాథలైతిమి అనుచు ఏడ్చిరి.

అయోధ్యాపుర కాంత అప్పుడు
పెనిమిటి పోయిన స్త్రీవలెతోచెను
అచేతనమ్మై జనులు వుండిరి
వీధులనైనను ఊడ్చక పోయిరి.

గృహకృత్యములు మరిచిరి జనులు
కైక దుష్కృతము తలచుచుండిరి
కళాహీనమై నిలచెనయోధ్య
అతి కష్టముగా చీకటి పడెను.

॥శ్రీరఘురామడు॥

## 67 రాజ్యము అరాచకము కాకుండ చూడమని వశిష్ట మహర్షిని ప్రార్థించుట

సూర్యోదయము అయిన వెంటనే
సచివోత్తములు బ్రాహ్మణోత్తములు
రాజ ముఖ్యులు అందరు చేరి
సభ నేర్పరచిరి శీఘ్రముగాను.

రామ లక్ష్మణులు అడవుల కేగిరి
భరత శత్రుఘ్నులు ఇద్దరు కూడా
కేకయ విభుని పురమున నుండిరి
తనయులెవ్వరును ఇచ్చట లేరు.

మార్కండేయుడు, మౌద్గల్యుడును
వామదేవుడు, కాశ్యపుడున్నూ
కాత్యాయనుడు, జాబాలి మహఋషి
కులగురువగు వశిష్టులు వచ్చిరి.

యోచన చేసి ఓ ఋషిసత్తమ
ఇక్ష్వాకు వంశజుని ఒక మహనీయుని
ఎన్నిక చేసి రాజును చేయుడు
లేనిచొ రాజ్యము అరాచకమ్మగు.

కర్తవ్యమును ఆలోచించి -
వశిష్టమౌనిని గాంచి పలికిరి
''ఓ ఋషి సత్తమ! రాత్రి యంతయు
నూరు వత్సరములన్నటు గడిచెను.

అరాచకంబగు దేశమునందు
వర్షము పడదు - పంటలు పండవు
శిక్షించుటకు రాజు వుండనిచొ
విచ్చల విడిగా జనులుండెదరు.

తండ్రీ కొడుకుల మమతలడగును.
భార్యా భర్తల ప్రేమలుడుగును
దుష్టులు రేగి స్త్రీల హరింతురు
నీతి నిజాయితి నశించి పోవును.

జార చోరుల ఉనికి పట్టులై
పుణ్య స్థలములు పాడై పోవును
వేద వేత్తలు విప్రోత్తములు
యజ్ఞ యాగముల తలంచరపుడు.

ధనమున్నటుల తెలియు భయమున
ధనవంతులు తా దానము చెయ్యరు
పుణ్య కార్యములు జరగవు అపుడు
తీర్థ యాత్రలను తలచరు జనులు.

వ్యవహారమ్ము తెలిసిన జనులు
న్యాయా న్యాయము చెప్పరప్పుడు
కన్యలు భయమున బయటకు రారు
భార్యాభర్తలు తిరుగరు బయట

నిర్భయమ్ముగా తలుపులు తెరచి
నిద్దుర పోరు పురమున జనులు
వీర పుంగవులు అస్త్ర శస్త్రములు
ఉపయోగించిన సవ్వడి వినము.

చోర భయమున వాణిజ్యమ్మది.
అంతరించును అరాచకమ్మున
స్వేచ్ఛగ తిరిగే యతీంద్రులుండరు
పండిత సభలు జరుగ వప్పుడు.

వ్రత నియమాదుల నైవేద్యముల
ఇష్ట దేవతల కొలవరు ప్రజలు
అరాచకమ్మగు రాజ్యము స్వామీ!
ఎండిపోయిన నదివలె నుండును.

రక్షకులుండని గోవుల మందగు
పచ్చిక లేని బీటి చందమగు -
రథముకు టెక్కెము శోభ కూర్చును
ప్రజలకు శోభను యిచ్చును రాజు.

అగ్ని హోత్రునకు సముడు రాజగు
అంతటి రాజు స్వర్గ మేగెను
మరియొక రాజును ఎన్నిక చేయుడు
రాజ్య రక్షణము చేయుడు మీరు.

ఓ ఋషి సత్తమ! శరీరమ్మునకు
చూపు వంటి అతి ముఖ్యుడు రాజు
సత్య ధర్మముల రక్షణ చేయును
మాతా పితరుల పోలును రాజు.

దండన చేసెడి కాలుని కన్నను
ధనమిడునట్టి కుబేరు మించి
ఇంద్ర వరుణులను మించిన యట్టి
గౌరవమ్ము మరి రాజున కిత్తురు.

గుణ దోషమ్ముల నిర్ణయమ్మది
రాజు చేయును కనుక మహాత్మా!
రాజులేని దేశమ్ము అంతయును
కారు చీకటి క్రమ్మినట్లగు.

సంద్రము నిరతము చెలియలి కట్టను
దాటదు - అటులే ఓ బ్రహ్మఋషీ!
మీదు ఆజ్ఞ మేమింతటి వరకు
మీర లేదు మరి విధేయులమ్ము.

దశరథ ప్రభువు లేక పోయినను
మీదు ఆజ్ఞలను శిరసున దాల్తుము
కావున మీరు మన రాజ్యమునకు
తగిన రాజును ఎంపిక చేయుడు.''

॥శ్రీరఘురాముడు

❃❃❃

## 68 భరతుని గొని వచ్చుటకు దూతలు బయలు దేరుట

మంత్రులు హితులు విప్రోత్తములు
చెప్పిన సూచన విని వశిష్టుడు
తెలిపెను వారికి రాజ నిర్ణయము -
జరగ వలసినది వివరించె నిటు.

''మిత్రులార! మన అయోధ్య రాజుగ
భరత కుమారుని నిర్ణయించుచు
దశరథ ప్రభువు మాట యిచ్చెను
ఆ నిర్ణయము అమలు జరగవలె.

మేనమామ కడనున్న భరతుని
శీఘ్రమె యిటకు రప్పించ వలె
అందుకు దూతల నంపెద మిపుడె.''
అనగా సరియని రందరు అపుడు.

సిద్ధార్థ విజయుల జయంతు అశోకుల
నందుడు అనెడి దూతల బిలచి
వశిష్ట మహఋషి వివరముగాను
చేయవలసినది వారికి చెప్పెను.

''వేగమ్ముగను పోవు నశ్వముల
అధిరోహించి గిరి వ్రజపురమున
భరత కుమారుని సందర్శించి
ఆయన నిటకు తోడ్కొని రావలె.

విషాదచ్ఛాయలు మీ ముఖములలో
కనబడనీయక మెలగవలె నట
వస్త్ర భూషలు కానుక లన్నియు
వెంబడి తీసుకు వెళ్ళుడు మీరు.

ఆ కానుకలను భరతుని చేత
కేకయరాజు - యుధా జిత్తులకు
దగ్గర వుండి యిప్పించవలె
భరతునితోను యిటుల జెప్పుడు.

అయోధ్యలో - అతి ముఖ్యమైన పని
మీరు చేయవలె - అందుల కొరకు
వశిష్ట మహఋషి - మంత్రులందరు
మిమ్ముల తోడ్కొని రమ్మని పంపిరి.

ఆ విధముగను అతనికి చెప్పి
వేగమె యిటకు తోడ్కొని రండు
రాముని వనవాసమ్ము చెప్పకుడు
జేని మరణము తెలియ నీయకుడు.''

వశిష్ట మహఋషి ఆ దూతలకు
ఆజ్ఞలనిచ్చి కానుకలిచ్చి
గిరి వ్రజపురము చేరగ పంపెను
కార్యదక్షులు బయలు దేరిరి.

అయోధ్య నగరికి పశ్చిమ దిక్కున
అపరతాల గిరి ప్రాంతము చేరిరి
కొండల దాటి - ''మాలిని నదిగని
ఉత్తర దిక్కులొ సాగిరి వారు.

అచ్చట నుండి పడమర కేగి
హస్తినాపురి దగ్గరనున్న
యమునను దాటి ముందుకు సాగి
పాంచాల దేశమున ప్రవేశించిరి.

అచ్చట నుండి పడమర కేగి
నదులు సరస్సులు చూచుచు వారు
పని ప్రాముఖ్యము గుర్తించుచును
విశ్రాంతి గొనకయె సాగుచుండిరి.

''శరదండనది'' - దాటిరి వారు
కోరిన కోర్కెల నిచ్చే తరువు.
''సత్యోప, యాచన''మనుతరువునుగని
ప్రదక్షిణించి - కుళింగ జేరిరి.

కుళింగ నుండి - ముందుకు సాగి
''ఇక్షుమతీ నది'' తీరము జేరిరి
నది ఒడ్డునగల పుణ్యాత్ములకు
నమస్కరించి నదిని దాటిరి.

బాహ్లీకమునకు - సుధామగిరికి
మధ్యన వున్న పుణ్యభూమిని
విష్ణుపాదాంకిత మనెడి భూమిని
దర్శించి - చేరిరి ''విపాశ నదిని.''

నదీ తీరమున నిలచిన యట్టి
ఘనమగు శాల్మలి తరువును గాంచిరి
అచ్చట నుండి అడవుల వెంబడి
కార్య దీక్షతో సాగిరి ముందుకు.

అశ్వము లలసియు వారు డస్సియు
చీకటి యైనను లెక్క చేయక
రాచ కార్యమును మదిలో నిలపి
చేరిరి దూతలు గిరివ్రజపురము.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

## 69 భరతుడు పీడకల గాంచుట

అయోధ్య దూతలు రాత్రి సమయమున
గిరివ్రజ పురమున అడుగు బెట్టిరి
అదే రాత్రమున భరత కుమారుడు
దుస్వప్నములతొ కలవర పడెను.

దిగులుతొనున్న భరతుని గాంచి
ముదము గూర్చుటకు మిత్రులందరు
ఎన్నో విధముల ప్రయత్నించిరి
కానీ ఫలితము శూన్య మాయెను.

నృత్య గీతములు ఆట పాటలు
మనసును సంతస పరచక పోయెను
చిరునవ్వుయును వెలువడ లేదు
హాస్య ప్రసంగము వ్యర్థమైనది.

విషయము తెలియగ మిత్రు డొకండు
కారణమడిగెను భరత కుమారుని
దిగులు నిండిన రాజకుమారుడు
తన దుస్వప్నము తెలియబరచెను.

''ఓ స్నేహితుడా! నిన్నటి రాత్రి
భయంకరమ్మగు కలవచ్చినది
మలిన దేహముతో నాన్నగారట
తల విరబోసుకు కనబడినారు.

దివిపై నుండి ఆ మహనీయుడు
దుర్గంధమగు పేడలో పడిరి
తైలము త్రాగుచు కనపడినారు
వెర్రిగ నవ్వుచు అగపడినారు.

నువ్వుల అన్నము తినుచు కనబడిరి
నూనె పూసుకొని కనబడినారు
నూనెలో మునుగుచు తేలుచుండిరి
పీడకలనను కలవర పరచెను.

కడలి ఎండినటు కలగాంచితిని
శశి బింబమ్మది ఊడిపడినది
కటిక చీకటి నిండిపోయెను
పట్టపు టేనుగు దంతము విరిగెను.

మండెడి అగ్ని ఆరిపోయెను
తరువు లెండినవి - భూమి చీలినది
కొండలు పగిలి పొగలుచిమ్మెను
దుస్వప్నములకు మది చెదిరినది.

నలుపు వస్త్రములు తండ్రి ధరించెను
ఇనుప పీటపై కూర్చొని యుండెను.
నల్లని - తేనె - వన్నెల స్త్రీలు
తండ్రిని చూచి నవ్వుచుండిరి.

నల్లటి రంగు వంటికి పూసుకు
ఎర్రని పూల మాల లేసుకొని
ఖరములు పూన్చిన రథమును ఎక్కి
దక్షిణ దిశగా సాగిరి తండ్రి.

ఎర్రటి వలువల రాక్షసాంగన
వికృతమ్ముగా నవ్వుచు అపుడు
రథమునవున్న నాయన గారిని
నేలకు లాగుట కలలో గంటిని.

కలఫలితమ్ము భయంకరమ్మగు
నాకో- అన్నకొ- లక్ష్మణమూర్తి కొ
లేదా-నాయన దశరథ విభునికొ
మరణము తప్పదు - అన్నటు తోచును.

ఖరములు పూన్చిన రథమున వున్నటు
కలగాంచినచో మరణము తథ్యము
భయముతో నామది కలతపడినది
సంతోషమ్మది దూరమ్మైనది.

స్వప్నము లెన్నడు ఎరుగను నేను
నిన్న గంటిని దుస్వప్నమును
తండ్రిని తలచిన దిగులగుచున్నది''
అనుచు దుఃఖమున తెలిపెను భరతుడు.

||శ్రీరఘురాముడు||

# 70 భరత శత్రుఘ్నులు అయోధ్యకు బయలు దేరుట

స్వప్న వివరము భరత కుమారుడు
తన మిత్రులకు తెలుపుచుండగా
అయోధ్య దూతలు కేకయరాజును
యుధాజిత్తులను సందర్శించిరి.

భరత కుమారుని తోడ్కొని పోవగ
వచ్చితిమని వినయమ్ముగ చెప్పిరి
ఆ దూతలను కేకయరాజు
భరతకుమారుని వద్దకు పంపెను.

భరతుని గాంచి పలికిరి దూతలు
''రాజకుమారా! వశిష్టమహర్షి
తమ క్షేమమును తెలుసుకొనుటకై
పంపిరిమమ్ము - వచ్చితిమిటకు.

అయోధ్యలోన అతి ముఖ్యమగు
రాచ కార్యము నెర వేర్చుటకై
మిమ్ముల తోడ్కొని రమ్మని పంపిరి
తమరు శీఘ్రమే బయలు దేరుడు.

అతి విలువైన కాన్కలు పంపిరి
తమరు స్వయముగ ఈ కానుకలు
తాతగారికి - మేనమామకు
అందజేయమని వారు చెప్పిరి.''

తెచ్చిన కాన్కలు భరత కుమారుడు
మేనమామకు - తాతకు పంపి
తండ్రి కుశలము అన్నల కుశలము
అడిగెను. వారిని ఆత్రుత నిండి.

''ధర్మమూర్తి - మా కౌసల్యమ్మ
ధర్మశీల మా సుమిత్ర తల్లి
అహంకారిణి స్వలాభమెంచే
కైకమ్మయును - కుశలమేకదా.''

సమాధానముగ దూతలు పలికిరి
''రాజకుమారా! అందరు కుశలము
తొందరగామరి బయలుదేరుడు
నేడే మనము ప్రయాణమగుదము.''

భరతుడంతట తాతను గాంచి
విషయము చెప్పి సెలవు కోరెను
తలంచినంతనె తిరిగి వత్తునని
అయోధ్య కేగగ అనుమతి కోరెను.

కేకయరాజు మనుమని, ముదముగ
కౌగలించుకొని ఆశీస్సులనిడి
యోగ్యత మీరగ అయోధ్యలోని
హితులు, పెద్దలకు వందనమ్ములనె.

ఆ మహరాజు తన మనుమనికి
రెండువేల బంగారు హారములు
పదహారు వందల ఉత్తమాశ్వములు
మదపు టేనుగులు, ధనమును ఇచ్చెను.

ధైర్య వంతులగు వీరోత్తములను
స్వామి భక్తిలో ఎన్నిక వీరుల
భరతుని వెంబడి తోడు పంపెను
మనుమని రక్షణ మరిమరి చెప్పెను.

యుధాజిత్తు తన మేనల్లునకు
జాతి ఏనుగులు - బరువు మోయగల
కంచర గాడిద లొసగెను కాన్కగ
పులుల బోలు శునకమ్ముల నిచ్చెను.

భరత శత్రుఘ్నులు అంతఃపురమున
కేకయరాజుకు యుధాజిత్తుకు
వందనముంచి - తలవంచుకొని
దిగులుతొ నుండి ప్రయాణమైరి.

కానుక లన్నియు భరత కుమారుని
దిగులు దూరము చేయకున్నవి
తొందరగా మరి రమ్మని పంపిన
వార్త - మనస్సును పీకుచున్నది.

భరతుని రథము ముందు నడువగ
వందలకొలది రథములు - బండ్లు
మత్తేభములు - జాతి కుక్కలు
రక్షణ నిచ్చే సైన్యము సాగెను.

దేవ సైన్యమును వెంట బెట్టుకొని
నాకము నుండి ప్రయాణమైన
సిద్ధునివలె ఆ భరత కుమారుడు
తోచెను చూచెడి వారందరకు.

॥శ్రీరఘురాముడు॥

# 71 శంక ముదిరిన మనస్సుతో భరతుడు దశరథుని భవనమున అడుగిడుట

సోదర ప్రేమకు నెలవగు భరతుడు
శత్రుఘ్నునితో బయలు దేరెను
తూర్పు దిక్కుగా ప్రయాణించుచు
''సుదామ-హ్లాదిని''-నదులను దాటెను.

కుళింగ నదిని చూచుచు సాగి
కుళింగ - యమునా సంగమమ్ముగని
ఆ ప్రదేశమున బడలిక తీరి
అంశుదారమను - గ్రామము చేరెను.

అచ్చట నుండి పశ్చిమ ముఖముగ
సాగెడి ''శరద్రునది'' ని దాటెను
''శిలావహయను'' నదిని దాటుకొని
ఆగ్నేయముగ ముందుకు సాగెను.

ప్రాగ్వ పట్టణము చేరి అచ్చట
గంగను దాటి - ముందుకు సాగి
''కుటి కోష్ఠిక - యను నదిని దాటెను
ధర్మ వర్తన - గ్రామము చేరెను.

శల్య వర్తన - గ్రామము చేరెను
చైత్ర రథమను వనమున సాగి
గంగా - సరస్వతి నదుల సంగమము
దాటి - ముందుకు ప్రయాణించెను.

దక్షిణ దిశగా ప్రయాణించుచు
జంబూ ప్రస్థ గ్రామము నుండి
వరూథమనెడి గ్రామము చేరెను
అమిత వేగమున సాగుచుండిరి.

ఆ గ్రామమున ఉద్యానమ్ముల
బడలిక తీరి ముందుకు సాగి
ఉజ్జిహాన - గ్రామమ్ము నందుగల
మద్ది-కడిమి-తరు తోపున ఆగెను.

స్వదేశమ్ములో అడుగు బెట్టిరి
అలసియున్న తన రాజ సేవకుల
విశ్రాంతి గొనమని భరతుడు చెప్పెను.
మెల్లగ రమ్మని చెప్పెను వారికి.

వారందరిని తీసుక రమ్మని
శత్రుఘ్నునకు ఆదేశించి
అతి వేగముగల అశ్వములున్న
రథమున ఒకడే బయలు దేరెను.

సర్వతీర్థ గ్రామమ్మును చేరి
''ఉత్తాని కానదిని'' అచ్చట దాటి
''హస్తి పృష్టకము'' అను గ్రామము కడ
''కపీవతి యను నదిని దాటెను

ఏకసాల- యను గ్రామము దగ్గర
స్థాణుమతీ నది - చేరి అచ్చట
వినతా గ్రామము - చేరి సాగి మరి
గోమతి నదిని దాటెను భరతుడు.

కుళింగ నగరము చేరి అచ్చట
మద్దితోపులో - బడలిక తీర్చుకు
అదేరాత్రి ఆ రాజకుమారుడు
అయోధ్య త్రోవలొ సాగె వేగముగ.

అరుణ భానుడు అగపడుచుండెను
అయోధ్య నిలచెను చూపు మేరలో
అహో రాత్రములు ఏడుగడచిమరి
భరతుని రథము చేరె నయోధ్య.

కనబడు నయోధ్య చూపుచు, భరతుడు
రథ సారథితో చెప్పుచుండెను
''అదిగో! అయోధ్య, గనుము సారథీ!
ఇలలో ఎన్నికయైన పట్టణము.

మా పూర్వీకుడు అతి పుణ్యాత్ముడు
వైవస్వతమను నిర్మితమ్మది
వేద విదులతో యజ్ఞ యాగముల
పురమున జనులు సుఖముగ నుందురు.

దశరథ ప్రభువు ధర్మ పాలనతొ
రాజ ఋషిగను వినుతి కెక్కెను
ఆయనగారి పూర్వీకులును
రాజ ఋషులయి అయోధ్య నేలిరి.

అయోధ్య చూడగ వెనుకటి వలెను
ఆనందమది కలుగ దదేమి?
ఉద్యానమ్ములు కళదప్పినవి
వాహ్యాళికి మరి కదల రెవ్వరు.

తరువులన్నియు ఆకులు రాలి
ఏడ్చునట్టుగా నున్నవి గనుము
కోకిల గానము వినబడ కున్నది
పక్షుల సందడి కనరాకున్నది.

పట్టణమ్మును సమీపించితిమి -
సుగంధ పరిమళ ధూమము లెగయవు
భేరీ - మృదంగ నాదము లేవీ!
మంగళ స్వనములు - వినరాకున్నవి.

మదిలో దిగులు కలుగు చున్నది
దుర్ని మిత్తములు అగపడు చున్నవి
నావారందరు క్షేమమే యని
అనిపించదు నా మనసు కెందుకో.''

బాధతొ హృదయము బరువెక్కినది
భయముతొ దేహము కంపించినది
అలసిన హయములు అతి కష్టముగా
వైజయంతమను ద్వారము చేరెను.

ద్వారములోనికి సాగిన రథము
అయోధ్యలోన ప్రవేశించెను
ద్వార పాలకులు చూచిరి రథమును
జయము పలికిరి ఆశీస్సులతో.

దిగులు తొనున్న భరత కుమారుడు
ద్వార పాలకుల పలుకరించెను
రథ సారథితో పలికెనప్పుడు
మదిలో శంక ముదురు చున్నదని.

''అమంగళమ్ము జరిగినట్టుగా
మదికి తోచి నా ధైర్యము చెదరెను
గృహములముందు ముగ్గులు లేవు
తలుపులు తెరచిన సందడి లేదు.

నిత్య పూజలు చేసినట్టుగా
దీప ధూపములు కనబడకున్నవి
పూల మాలలతొ దేవాలయములు
అలంకరించి కనబడలేదు.

అంగడి తెరచి బేర సారములు
జరుపు చున్నటు తోచుటలేదు
దేవాలయములు - చైత్యమ్ములపై
దిగులు నిండి ఆ పులుగులున్నవి.

దుఃఖము నిండి కన్నీరిడుచు
స్త్రీ పురుషులు నా కగపడుచుండిరి''
అనుచు భరతుడు పలుకుచుండగా
రాజ భవనమును చేరెను రథము.

ఇంద్రుని పురమగు అమరావతివలె
అందము లొలికే అయోధ్య నగరము
కళాహీనమై కనబడుచుండగ
తండ్రిని చూడగ నడచెను భరతుడు.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 72 కైక తన కోర్కెలు దాని పర్యవసానము భరతునకు తెలుపుట

తండ్రి మందిరము నందు భరతునకు
తండ్రి దర్శనము లభించ లేదు
అచ్చటి నుండి భరత కుమారుడు
జనని కైక - సదనమ్మున కేగెను.

కళాహీనమై గృహము తోచెను
లోనికి నడచెను భరత కుమారుడు
అలసి వచ్చెడి తనయు నప్పుడు
కైక చూచి సంతోషపడినది.

పాదములంటి ప్రణామ ముంచిన
తనయుని - గుండెకు హత్తుకున్నది
శిరసు మూర్కొని కూర్చొన బెట్టుకు
తన తండ్రి కుశలము అడిగినదామె.

తాత కుశలము భరతుడు చెప్పి
బహుమానమ్ములు యిచ్చుట తెలిపి
తండ్రి వివరములు తల్లినడిగెను.
ఏ మందిరమున కలరని అడిగెను.

రాజ భవనముల సంతోషమ్మది
కనబడకున్నది కారణ మేమనె
తండ్రి పాదముల నమస్కరింతును
ఎచ్చట గలరో చెప్పుము అనెను.

రాజ్యలోభమున తను చేసిన పని
తన తనయునకు ప్రియము గూర్చునని
కొడుకు హృదయము తెలియని కైక
అతి తేలికగా చెప్పెను విషయము.

''యజ్ఞములెన్నో చేసిన యట్టి
సత్పురుషుడు మరి తేజో వంతుడు
పుణ్య పురుషులను ఆదరించిన
మహాత్ముడైన దశరథ ప్రభువు.

ప్రాణులన్నిటికి ఏదో నాటికి
కాలము తీరును అన్నట్లుగనే
నాయనగారి కాలము తీరి
స్వర్గవాసనమున కేగిరి''- అనెను.

పిడుగువంటి ఆ మాటలు వినెను
కృంగి పోయెను భరత కుమారుడు
వెక్కివెక్కి తా నేడ్వ సాగెను
నేలను పొరలుచు ఏడువ సాగెను.

నరకిన మానై నేలను కూలెను
కట్టలు తెగిన దుఃఖము నిండి
ఆ సుకుమారుడు భరత కుమారుడు
నేలను దొరలుచు ఏడువ సాగెను.

విలపించెడి తన కుమారునపుడు
లేవ నెత్తుచూ కైక పలికెను
''సర్వము తెలిసిన వివేకవంతుడ-
దాన- యజ్ఞములు చేసెడి వాడవు

నీవీ విధముగ - ఏడ్చుట తగదు
పోయిన వారు తిరిగి రారుకద''
అనుచు తల్లి అట ఊరడించగ
ఇనుమడించెను భరతుని దుఃఖము.

విలపించుచు ఆ భరతుడు పలికెను
''అన్నగారి పట్టాభిషేకమో
యజ్ఞ యాగమో తలపెట్టిరని
పిలవనంపిరని సంతస పడితిని.

ఏమి జబ్బుతో తండ్రి పోయెను
తండ్రిగారికి అంత్య క్రియలను
రామ లక్ష్మణులు చేసిరి - ధన్యులు
ఆ పుణ్యమునకు దూరమైతిని.

ఆప్యాయముగా కౌగలించుకొని
శిరసు మూర్కొని కుశలము అడిగే
తండ్రి స్పర్శ యిక నాకు లభించదు
దర్శనమైనను నోచక పోతిని.

అమ్మా! ఇంక రామచంద్రుడే -
అన్నయు తండ్రియు అగును నాకిక
దుఃఖములన్నీ తీర్చును రాముడు
రామ సేవ కర్తవ్యము నాకు.

రాముని పదముల వందనముంచెద
తండ్రి స్థానము రామచంద్రునిది -
కన్ను మూయుచు పితృ దేవులు
సందేశము నాకేమి ఇచ్చిరి.''

విషయము పూర్తిగ తెలియ చెప్పటకు
కైక పలికెను - ''భరత కుమారా
రామా! లక్ష్మణ సీతా యనుచు
దుఃఖించుచును కన్ను మూసిరి.

సీతారాముల లక్ష్మణ మూర్తిని
చూచెడి భాగ్యము ధన్యుల కమరును
నాకది లేదు అని విలపించిరి
అంతకు మించి అనలేదేమియు.''

ఆ మాటలకు భరత కుమారుడు
మరింత కలవర పడుచు అడిగెను
''సీతా రాములు లక్ష్మణ మూర్తియు
అట లేకుండా ఎచటకు పోయిరి''?

ఆ ప్రశ్నలకు సమాధానము
అతి తేలికగా కైక చెప్పెను
''రాముడు వనముల కేగెను నాయన!
సతి సోదరులు వెంబడించిరి.''

ఆ మాటలు విని భరత కుమారుడు
రాముని యోగ్యత తెలిసిన వాడై
''ఎట్టి అకార్యము రాముడు చేసెను
అడవికి పోయెడి దుర్గతి ఏమి?

పరమ ధార్మికుడు రామచంద్రుడు
పర ధనములను అపహరించడు
సజ్జనులను తా బాధ పెట్టడు
అకారణమ్ముగ శిక్ష విధించడు.

పర స్త్రీలను కన్నెత్తి చూడడు
సద్గుణ యుతుడు లోక హితుండు
అంతటి వానిని అపరాధివలె
అడవుల కేల పంపిరి తల్లీ!

భ్రూణ హత్యను చేసిన వానికి
విధించు శిక్షను ఏల విధించిరి''?
సమాధానముగ - ఆ గర్వోష్టి
తనయుని ముదము కోరి పలికెను.

''రాముడు ధర్మము తప్పలేదు విను!
బ్రాహ్మణ ధనమును హరించలేదు
అయోగ్యమైన పనిని రాముడు
చేయలేదయా! భరత కుమారా!

నాయనగారు రామచంద్రునికి
పట్టాభి షేకము చేయనెంచిరి
ఆయన - నాతో చెప్ప లేదది
కానీ నేనా మాట వింటిని.

నేను బాగుగా యోచన చేసితి
నీకై రాజ్యము కోరుకొంటిని
రాముని అడవికి పంపగ కోరితి
నా వరములవి యిమ్మని కోరితి.

సత్యవర్తి మీ తండ్రి సరియనె
రాముడు అడవికి నడచినాడయా!
సీతా - లక్ష్మణు లిద్దరు కూడా
సంతోషముగా సాగిరి వెంట.

ప్రియ పుత్రుడు కారడవి కేగెనని
చింతతొ తండ్రి అసువులు వీడిరి
నాయన భరతా! యిది యంతయును
నీదు కీర్తినే కోరి చేసితి.

ఈ దేశమునకు రాజువు నీవే
కోసల నేలెడి ఏలిక వగుదువు
జరగవలసినది వశిష్టాదులు
అతి తొందరలో జరపెదరనెను.''

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

## 73 భరతుడు తల్లిని దూషించుట

పిడుగుల పోలెడి రెండు వార్తలు
చెప్పిన తల్లిని గాంచి భరతుడు
దుఃఖతప్తుడై ఆవేశముతో
మదిలో వ్యథను వెలువరించెను.

''కన్న తండ్రియా - కన్ను మూసెను
తండ్రిని పోలిన అన్న రాముడు
సతి సోదరులతొ అడవుల కేగెను
వారిట లేరని ఏడ్చు చుంటిని.

నాకు రాజ్యము ఎందుల కొరకు?
తండ్రిని నీవు చంపి వేసితివి
అన్నను అడవుల పాలు జేసితివి
వంశ నాశనము చేయ వచ్చితివి.

కాళ రాత్రివలె దాపురించితివి
అగ్నివి నీవని తెలియక పోయి
దగ్గర జేర్చుకు తండ్రి మడసెను
కులపాంశనివి పాప దర్శినివి.

రాజ్య కాంక్షతో మా వంశమున
అశాంతి నింపి ఇడుముల నిడితివి
కౌసల్య సుమిత్రలు తనయుల కొరకై
తపించిపోయి తనువులు వీడర?

తల్లి కన్నను మించిన సేవలు
రామచంద్రుడు చేసెను నీకు
కౌసల్యమ్మ ఆప్యాయముగా
చెల్లెలి మాదిరి భావించెను నిను.

నార చీరలతొ ధర్మ మూర్తిని
అడవుల కంపి సుఖముగ నుంటివ?
ఎందుకు - అన్నను అడవికంపితివి
నా విషయము నువ్వు తెలియక పోతివి.

రామునిపైన నా గౌరవము
భక్తి ప్రపత్తులు తెలియవు నీకు
రాజ్యలోభమున ఇంతటి విపత్తు
తెచ్చితి వీవు అహంకారివి.

రామ లక్ష్మణుల నిరతము చూడక
రాజ్యమేలుట జరిగెడి పనియా
రాముని చూచుచు ధైర్యము నిండి
రాజ్య మేలెకద మన మహరాజు.

పెద్ద వృషభము మోసెడి బరువు
లేగ దూడ తా మోయ గలుగునా?
రాముడేలగల రాజ్య భారము
దుర్బలుడను నే నెట్లు మోతును.

రాజ్య పాలనము నేను కోరినచొ
సామదాన భేదమ్ములతోను
నేనే రాజ్యము పొంది ఏలెదను
నీ అత్యాశను గౌరవించను.

నీవు చేసిన దుష్కార్యమునకు
నిన్ను బయటకు గెంటి వేయవలె
కానీ రాముడు తల్లిగ నెంచెను
కావున నిన్ను వదలి వేసితి.

జ్యేష్ఠుడు రాజ్యము పాలించవలె
అన్నను తండ్రిగ భావించవలె
లోకరీతి - ఇది నీకు తెలియదా!
ఇక్ష్వాకులలో సాంప్రదాయ మది.

సదాచారములు తృంచి వేతువు
రాజ ధర్మములు లెక్క చేయవు
దోషకార్యముల వెరవవు నీవు
క్రూరురాలవు తల్లివైతివి.

నీ పుట్టింటను ఈ ఆచారము -
జ్యేష్ఠుని రాజుగ చేసెడి న్యాయము
ఉందని - నీకు తెలియక పోయెను
దుష్టబుద్ధి నీ కెట్లు కలిగినది.

ప్రాణాంతకమగు పని చేసితివి
నీ కోరికను తీర్చను నేను
నీ మది - వ్యధతో కాలిపోవలె
అన్న నిప్పుడే తీసుకు వత్తును.

లోకహితుని శ్రీరామచంద్రుని
వనముల నుండి తీసుకు వత్తును
సింహాసనమున కూర్చొన బెట్టి
రామ పాదముల సేవ చేతును.

రామదాసునిగ బ్రతుకుట ఘనత
అనుచు భరతుడు దుఃఖతప్తుడై
తల్లిని గాంచి చీదరించుకొని
సింహము మాదిరి గర్జన చేసెను.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 74 భరతుడు తల్లిని పరుషము లాడుట

భరతుని కోపము ఉపశమించదు
తలచుకు తలచుకు ఎగయు చున్నది
తల్లిని గాంచగ అతని కోపము
కట్టలు తెంచుకు దూకుచున్నది.

తిరిగి కఠినముగ పలికెను భరతుడు
''దుష్ట చారిణీ రాజ్యము వదలుము
నేను చచ్చితిని అనుకొని ఏడ్వుము
ధర్మ పథమును తప్పితి వీవు.

తండ్రిగాని నా- రాముడు గాని
నిను దూషించి ఎరుగరెన్నడు
తండ్రిని నీవు స్వర్గ మంపితివి
అన్నను అడవుల కంపించితివి.

భ్రూణ హత్యను చేసిన యంతటి
పాపము నీకు తప్పదు పాపీ!
నరక వాసము నీకు లభించును
భర్త చేరిన లోకము చేరవు.

నిన్ను చూడగ భయమగుచున్నది
క్రూరురాలవు పతి ఘాతుకవు
అపకీర్తిని నా కాపాదించిన
పాతకి? - నీతో మాటాడనిక.

ధర్మాత్ముఁడగు కేకయ ప్రభువుకు
వంశము చెరపగ పుట్టితి వీవు
సర్వలోకముల జీవుల ముందర
ద్రోహిగ నన్ను నిలబెట్టితివి.

ధర్మ చరితయగు కౌసల్యమ్మను
దుఃఖ సంద్రమున ముంచితి వీవు
నీకు సరియగు నరకము లేదు
క్రూరురాలవు శాంతి లభించదు.

కౌసల్యానంద వర్ధనుడు
ఆశ్రయ మిచ్చెడి అనఘుడు రాముడు
తండ్రి యంతటి స్థానము అన్నది
అంత మాత్రము తెలియక పోతివి.

ఆత్మాభిమానముల నెలవు హృదయము
తనయుని ప్రేమ పుట్టుక స్థానము
అందువలననే - ఆత్మబంధువగు
తనయుని మించిన బంధువులుండరు.

కామ ధేనువు సంతతి - గోవులు
జగమంతయును నిండియున్నవి -
అయిననుగాని పుణ్య ధేనువు
బిడ్డ కష్టమును గాంచి ఏడ్చినది.

రెండు వృషభములు - మండు టెండలో
నాగలితో - ఒక రైతు పొలమును
దున్నుచుండగా అలసి పోయినవి
అలసియు - అవ్వి దున్నుచున్నవి.

ఆకాశములో కామ ధేనువు
బిడ్డలైన ఆ ఎద్దుల గాంచి
మనసు కలతపడి దుఃఖించినది
అశ్రువులవ్వి జారిపడినవి.

అంతట ఇంద్రుడు అడిగెను విషయము
కామ ధేనువు మదిలో బాధ
తెలియ బరచెను దేవేంద్రునకు
బిడ్డలు పడెడి బాధను చెప్పెను.

కడుపు తీపి అది ఎంతటిదో మరి
ఇంద్రుడప్పుడు తెలిసెను-వింటివ!
కౌసల్యమ్మ కడుపు పంటను
దూరము చేసిన దుష్టురాలవు.

ఆ తల్లి బాధను తెలియక పోతివి
ఆమె బ్రతుకుట దుర్లభమగును
తల్లీ బిడ్డల వేరు జేసితివి
ఇహ పరములకు దూరమైతివి.

కోసలరాజుగ రాముని చేసెద
తండ్రిని-అన్నను గౌరవించెద
వనవాసమునకు నిన్ను పంపెద
అపకీర్తిని తొలగించు కొందును.

పుణ్యసాధ్వి కౌసల్యదేవికి
తెలిసి - తీరని హాని చేసితివి
పాతకి వీవు - బ్రతుక కూడదు
మరణమె నీకు తగినది ఇపుడు.

విషము త్రాగియో - అగ్నిని బడియో
ఉరిపోసుకుని మరణించుటయో
ప్రాయశ్చిత్తము అగును నీకిల
లేదా అడవుల పాలైపో నువు.

నీ వల్లను మరి నాకు లభించిన
పాపము తీరగ, ఇపుడే - రాముని
సింహాసనమున కూర్చొన బెట్టిద
కృతార్థుడనయి జీవించెదను.''

ఫణివలె బుసలను విడచుచు భరతుడు
వశము తప్పి తా నేలను బడెను
నేలను బడిన ఇంద్ర ధ్వజముగ
కటిక నేలపై బడెను అనఘుడు.

॥శ్రీరఘురాముడు॥

## 75 రాముని అడవికి పంపుటి ఎంతటి పాపకార్యమో భరతుడు చెప్పుట

భరత కుమారుని ఆగమనము విని
కైక భవనమును చేరిరి మంత్రులు
తల్లిని చూచి- సచివుల గాంచి
కంటి నీటితో పలికెను భరతుడు.

''సచివోత్తములు మీరందరును
నామది తెలియుడు - రాజ్యము కొరకై
తల్లిని ప్రేరేపించగ లేదు
రాజ్య కాంక్ష నాకసలే లేదు.

తల్లి కోరుట - తండ్రి ఇచ్చుట -
నాకే మాత్రము తెలియదు అసలు
అయోధ్య కెంతో దూరములోను
శత్రుఘ్నునితో వుంటిని నేను.

రామచంద్రుడు వనముల కేగుట
సీతమ్మయును లక్ష్మణ మూర్తియు
అనుసరించుట తెలియదు నాకు
కుట్రలు పన్నుట ఎరుగను నేను.

భరతుని రాక విని కౌసల్య
కైక తనయుడు అయినను గాని
దూరదృష్టి గల బిడ్డడనుకొని
అతనిని చూడగ బయలు దేరెను.

కృంగి కృశించి నడువ లేకను
శోక భారమున కౌసల్యమ్మ
అడుగు పడక తా నేలను బడెను
ఆమెను చూడగ వచ్చెను భరతుడు.

విలపించెడి ఆ కౌసల్యమ్మను
భరత శత్రుఘ్నులు గాంచిరి అచట
దుఃఖ కెరటము ఎగసి పడగను
తల్లి ఒడిని ఆ బిడ్డలు చేరిరి.

ఏడ్చుచు దగ్గర జేరిరి బిడ్డలు
కౌసల్యమ్మ దుఃఖము పెరిగెను
అంతట పలికెను భరతుని గాంచి
మాటలు పెగలక పలికెను ఆమె.

''నాయన భరతా! నీవు కోరినటు
అడ్డులేని ఈ రాజ్య సంపద
తేలికగా నీ తల్లి కూర్చినది
అడవుల కంపెను నా కుమారుని.

నీకు రాజ్యమును కోరుట సహజము
నా బిడ్డను మరి అడవి కంపగ
ఏమి సుఖమొ- అది తెలియక పోయెను
క్రూర కార్యముల నేర్పరి ఆమె.

నన్ను మాత్రమిట నిలవ నీయునా!
కావున భరతా! పతికాయముతో
అగ్ని హోత్రముతొ ఆ సుమిత్రతో
రాముని చెంతకు చేరెదనిపుడే.

తనయుని వదలి ఉండగలేను
నాపై నీ కభిమానమున్నచో
రాముని వద్దకు చేర్చుము నన్ను
అమ్మ ఇచ్చిన ఫలమును గొనుము''

కౌసల్యమ్మవి పలుకుల ములుకులు -
అవి బాధించగ ఏడ్చెను భరతుడు
కొంత సేపటికి తెప్పిరిల్లెను .
కౌసల్యమ్మతొ పలికెను బాధతొ.

''మాతా! నీవు పూజ్యురాలవు
రాముని ఎడ గల భక్తి నెరుగుదువు
ఏ పాపము నే నెరుగను తల్లీ!
నను నిందించకు - నిర్దోషిని విను.

సత్యవర్తి శ్రీరామచంద్రుడు
పరమ పూజ్యుడు శ్రీరఘురాముడు
పురుషోత్తముడు పుణ్యశీలుడు
రాముని ఎడ నా భక్తి నెరుగవా!

రాముని అడవికి పంపిన వాడు
ఇలలో దుష్టుడు - అతి పాపాత్ముడు
రవికెదురుగ మల మూత్రము విడచెడి
మూర్ఖునితోసరి అతడు అగును.

నిదురించు గోవును కాలితొ తన్నిన
బుద్ధి హీనునితొ సరియగు నాతడు
సేవను పొంది ప్రతి ఫలమిడని
దుష్టుడైన యజమానిని బోలును.

కన్న బిడ్డలుగ ప్రజలను ఏలెడి
రాజుకు ద్రోహము చేసిన వాడగు -
ఆరవపాలు పన్ను గ్రహించి
ప్రజల రక్షణ చేయని రాజగు -

వేద విదులకు దక్షిణిత్తునని
యజ్ఞము వారిచె చేయించుకొని
ఆపై వారికి దక్షిణ నిడని
దుష్టుని బోలిన వాడాతడగు.

సంగ్రామములో వెన్నుచూపి మరి
పిరికి పందవలె బ్రతికెడు వాడు
అన్నను అడవుల కంపును తల్లీ!
అంతటి అఘమది నాకు తెలియును.

గురూప దేశము, ధర్మ సూక్ష్మములు
మదిలో నుంచని జ్ఞాన హీనుడు
రామచంద్రుని అడవులకంపును
అంతటి అఘమది తెలియును తల్లీ!

తేజోవంతుని - అమిత విక్రముని
ఆజాను బాహుని అరవిందాక్షుని
సింహాసనమున చూడగలేని
దుష్టుడు అట్టి యోచన చేయును.

గురు ద్రోహియును మిత్ర ద్రోహియు
కృతఘ్నుడున్ను లోక కంటకుడు
హితులకు పెట్టక తను మాత్రము తిను
దుర్మార్గుడు ఆ పనిని చేయును.

అమ్మా! రాముని అడవుల కంపిన -
తగిన భార్య మరి దొరకక అతడు
బిడ్డలు లేక పాప కార్యముల
ఉభయ లోకముల భ్రష్టుడు అగును.

అట్టి వానికి బిడ్డలు కలుగరు
అర్థాయుష్షుతో అసువులు వీడును
ఉన్మత్తుడై మరి పుర్రె చేతగొని
బిచ్చ మెత్తుకొను దేశ ద్రిమ్మరగు.

అపాత్ర దానము చేసినవాడగు -
అధర్మ వర్తిగ బ్రతుకు నాతడు -
అధిక సంతతితొ రోగగ్రస్తుడై
అమిత బాధలకు లోనగు నాతడు.

అంతటి ఖలుని ద్రవ్యము నంతయు
చోరులు హరించి వేతురు తప్పక
ఉభయ సంధ్యలలొ నిద్రపోయెడి
జ్ఞానహీనునిగ ఆతడు అగును.

దుర్మార్గుడయి మోసగాడయి
రాజ దండన భయమున బ్రతుకును
మాతా పితరుల సేవలు చేసే
భాగ్యము వానికి కలుగదు తల్లీ.

పితృ దేవతల తృప్తి పరచక
అతిథుల కింత భోజనమిడక
అంతయు తానే తినెడి దుష్టుని
పాప లోకముల కాతడు పోవును.

విప్ర సత్కారము పాడుచేసెడి
పాపి దుర్గతి పట్టును వానికి
లేగ దూడలకు పాలు మిగల్చక
త్రాగునంతటి అఘమది తల్లీ!

బాలుర-వృద్ధుల-స్త్రీలను-రాజును
చంపినంతటి అఘమది తల్లీ!
నమ్మిన భృత్యుల పోషణ చేయని
దుర్మార్గునితో సముడాతడగు.

నీరు యుండియు దాహము తీర్చని
దుష్టుని దుర్గతి పట్టును వానికి'' -
అనుచు ఘోరముగ ప్రతినలు చేయుచు
దుఃఖతప్తుడై నేలను బడెను.

యుద్ధ రంగమున వెన్ను చూపెడి
భీరుని చంపిన పాపమ్మదియగు
వ్యసన పరునికి వచ్చునంతటి
అఘము ఆతనికి వచ్చును తల్లీ!

ఆ విధముగను బాధలొ మునిగి
నేలను బడిన భరత కుమారుని
లేవ నెత్తి శ్రీరాముని జనని
అనునయించెను ఆప్యాయముగా

గృహ దహనమ్ములు చేయు ధూర్తునికి
కలిగెడు పాపము అతనికి కలుగును
దేహీ! యని యాచించు యాచకుని
ఆశను తృంచిన రాజు గతియగు.

''నీ ప్రతినలు నను బాధించినవి
లక్ష్మణు వలెనే నీవును కూడ
ధర్మవర్తివి - నా కానందము
సత్పురుషుల లోకమ్ములు దొరకును.''

పవిత్ర జలముల పాడొనరించెడి
పాపి దుర్గతిపట్టును వానికి
విషమిడి జనులను చంపినంతటి
పాపమ్మదియగు తెలియును తల్లీ!

అనుచు పలుకుచు కౌసల్యమ్మ
భరత కుమారుని మేనునిమురుచు
ఇనుమడించిన దుఃఖముతోను
విలపించినది బిగ్గరగాను.

రామజనని దుఃఖమ్మును గాంచి
భరతుని మనసు చెదరి పోయినది
నేలను బడి నిట్టూర్చ సాగెను.
ఆ విధముగ ఆ రాత్రి గడచినది.

||శ్రీరఘురాముడు||

❖❖❖

# 7 6 భరతుడు తండ్రికి అగ్ని సంస్కారము చేయుట

ఆ విధముగ ఆ రాత్రి గడచినది.
తెల్లవారగనె భరతుని గాంచి
దుఃఖము వదలి తండ్రిగారికి
ఉత్తర క్రియలను చేయగ చెప్పిరి.

మది నిబ్బరమున భరత కుమారుడు
ప్రేత కార్యములు చేయగ వచ్చెను
తైలము నుండి తేని కాయమును.
వెలికి తీసిరి అంత్య క్రియలకై.

రత్నతాపడము అగు నొకశయ్యలో
ఆ కళేబర ముంచిరి అపుడు
పసుపు వన్నెతో నిదురలొ నున్నటు
తోచెను దశరథ రాజు శరీరము.

దుఃఖము ఎగసెను భరతునికపుడు
''తండ్రీ! నేను వచ్చెడి లోపలె
అన్నను అడవుల కంపి వేసితివి
ఎందుల కంతటి పని చేసితివి.

ప్రియతముడైన రామచంద్రుడు
అడవి కేగెనని ప్రజలు దుఃఖిల
నీవు ఎచటకు పోతివి తండ్రీ!
రాజ్య క్షేమము చూచెడి దెవ్వరు.

నీవు వదలి దివి కేగుటచేత
రాముడు అడవుల కేగుటచేత
పృథివి విధవగా మారెను తండ్రీ
కళాహీనమై నిలచెనయోధ్య.

చంద్రుడు లేని రాత్రి మాదిరిగ
వెలవెల బోయి వున్నదయోధ్య.''
అని విలపించెడి భరత కుమారుని
ఊరడించెను వశిష్ఠ మహాఋషి

దశరథరాజు అసువులు వీడగ
వెలుపలనుంచిన అగ్ని హోత్రమును
తీసుకు ముందు నడచిరి కొందరు
కళేబరమ్మును తీసుకు నడచిరి.

పితృమేధిక మంత్రమ్ములను
ఋత్విక్కులట చదువుచుండగా
శాస్త్ర విధిగను భరత కుమారుడు
అగ్ని హోత్రమును చితికి పెట్టెను.

పరిచారకులు భార్యలు హితులు
దుఃఖ సంద్రమున మునిగిరచ్చట
భరతుని వెంట అపసవ్యముగా
చితికి అందరూ ప్రదక్షిణించిరి.

అచ్చటి నుండి వారందరును
భరతుని వెంబడి సరయూ నదికడ
దశరథ రాజుకు ఉదక క్రియలను
శాస్త్ర ప్రకారము నిర్వర్తించిరి.

రాజును తలచుచు అయోధ్య చేరిరి
సజలనయనముల దుఃఖతప్తులై -
నేలను బడుకొని నియమనిష్ఠతో
పదిరోజులవి గడపి వేసిరి.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

# 77 భరత, శత్రుఘ్నుల దుఃఖము

ఉత్తమ లోకము చేరుట కొరకై
దశరథ రాజుకు చేయవలసిన
క్రియలన్నిటిని - శ్రాద్ధకర్మలను
శాస్త్రోక్తముగా భరతుడు చేసెను.

గోదానమ్ములు వస్త్ర భూషలు
గృహములు ధనమును దానములిచ్చి
అతి భక్తిగను ఆ మహారాజుకు
ఔర్ధ్వదైహిక క్రియలను చేసెను.

అస్థి సంచయన కార్యము కొరకై
పదమూడవదిన మచటకు జేరి
చితిని గాంచి ఆ భరత కుమారుడు
బిగ్గరగా విలపించ సాగెను.

"రామచంద్రునికి నా బాధ్యతను
అప్పగించు కర్తవ్యము వదలి
అన్నను అడవికి పంపి వేసితివి
అనాథగా నను చేసి వేసితివి.

కౌసల్యమ్మ కన్నబిడ్డను
అడవుల కంపి వదలి పోతివి
అనాథజేసి వదలి పోతివి
మా అపరాధము ఏమది స్వామీ!"

చితిలోనున్న అస్థికలను గని
నిలబడలేక భరత కుమారుడు
కూలిన యట్టి ఇంద్ర ధ్వజమన
నేలను బడెను దుఃఖము నిండి.

భరతుని గాంచి మంత్రులు గూడ
పుణ్యము తరిగి పుడమినిబడిన
యయాతి ఋషివలె నేలను బడిరి
శత్రుఘ్నుడును వశము తప్పెను.

శత్రుఘ్నుడట నేలను బడెను
శోక జలధిలో ముంచితివా యని
తండ్రిని తలచుకు ఏడువ సాగెను
మనసు కరగునటు రోదించెనట.

"తండ్రీ! నీవు స్వర్గ మేగితివి
రామచంద్రుడు అడవుల కేగెను
భరత కుమారుడు స్థిమితము తప్పెను
నే బ్రతుకుటది దుర్లభమింక.

ఇక్ష్వాకు వంశజులు శోభగ నేలిన
అయోధ్య ఇపుడు పాడుబడినది
అయోధ్య కేగను - ఇచ్చట నుండే
తపోవనములకు పోయెద నింక."

ఆ విధముగను రుద్ర భూమిలో
అన్నదమ్ములు దుఃఖము నిండి
నేలనుబడి విలపించుట గాంచి
కులగురు వంతట పలికె భరతునితో.

"రాజ కుమారా! మిగిలిన కార్యము
అస్థి సంచయన మొక్కటె వున్నది
దానిని నీవు శ్రద్ధగ జేయుము
ఆలసించక జరుపుము దానిని.

ఆకలి దప్పులు - జరామరణములు
శోక మోహములు జీవులకుండును
వాటిని దాటగలేరు జీవులిల
వాటి గురించి వంత కూడదు.''

సుమంత్రు - వశిష్టులు ఆదరమ్మగా
శత్రుఘ్ననట ఊరడించిరి
పుట్టి, గిట్టుటలు ప్రాణి స్వభావము
సహజమ్మైనవని అనునయించిరి.

వశిష్ఠ మహాఋషి అనునయించగా
అన్నదమ్ములు లేచి నిలచిరి
సచివులు విప్రులు సహకరించగా.
జరగవలసినది చేసెను భరతుడు.

॥శ్రీరఘురాముడు॥

## 78 శత్రుఘ్నుడు మంధరను శిక్షించుట

రామచంద్రుని దర్శించుటకు
భరతుడు మదిలో నిర్ణయించుకొని
బయలు దేరు యత్నమ్మును నుండెను
అంతట పలికెను శత్రుఘ్నుడట.

''అన్నా: రాముడు రక్షకుడయ్యును
తన రక్షణ తను చేసుకొనకను
ఆడది పలికిన మాటను బట్టుకు
అడవుల కేగెను ఎంతటి చిత్రము.

పితృవాక్య పరిపాలన కొరకై
రాముడు అడవికి బయలు దేరినను
లక్ష్మణుడైనా తండ్రికి చెప్పి
వనవాసమ్మును ఆపలేదు గద!.

కైక వలలో మరి పడకుండగను
రాజుకు - నీతిని తెలియ జెప్పుచు
వచ్చెడి ఆపద లక్ష్మణమూర్తి
ఆపలేదు కద - దుర్విధిగాదా''!

శత్రుఘ్నుడట పలుకుచుండగా
ద్వారము దగ్గర అలజడి రేగెను
అచటకు జేరెను ఆ శత్రుఘ్నుడు
గూని మంధర కనబడెనచట.

గూని దానిని ద్వారపాలకులు
లోనికి పంపక ఆపివేసిరి
చందనమలదుకు అలంకారముల
కురూపి - వింతగ అగుపించినది.

శత్రుఘ్నుని గని పలికిరివారు
''వనవాసమునకు రాముడేగుటకు
దశరథరాజు తనువు వీడుటకు
గూనిది మూలము-శాస్తి జేయుడు.

దాసీజనము అచ్చట వుండిరి
అందరి మధ్యలో ఉన్నది మంధర
దానిని గాంచి శత్రుఘ్ననకు
అమితమ్మైన కోపమ్ము ఎగసెను.

''ఓసీ గూనీ! ఇంత విపత్తుకు
నీవే కారణమన్నది తెలుసు -
కర్మఫలము నువు అనుభవించెవలె
అనుచు బలముగ త్రోసెను గూనిని.

బంతిలాగ ఆ గూని మంథర
నేలను బడెను గొల్లున ఏడ్చెను
దాని ఏడ్పులకు భవనమంతయు
దద్దరిల్లెను పరుగిడి రందరు.

గూని దాని బ్రతుకంతమైనదని
దాసీజనము కలవరపడుచు
కరుణామయి కౌసల్య తప్ప మరి
రక్షకు లింక లేరని తలచిరి.

కౌసల్యమ్మ భవనమ్మునకు
పరుగున జేరిరి విషయము జెప్పగ-
శత్రుఘ్నుడు ఆ గూని దానిని
నేల నీడ్చెను - ఏడ్చెను గూనిది.

బంగరు సరములు ఆభరణమ్ములు
విడివడి నేలను రాలిన వపుడు
శరత్కాలమున ఆకాశములో
తారలన్నటు నేల రాలినవి.

మంథర అరపులు విని కైకమ్మ
ముందుకు వచ్చెను పరుగు పరుగున
కైకను గాంచి అతని కోపము
ఇనుమడించెను - అరచె నాతడు.

నిప్పులు రాల్చే కన్నులతోనట
నిలచినట్టి శత్రుఘ్నుని గాంచి
కైక వణకెను పరుగు పరుగున
భరత కుమారుని దగ్గర జేరెను.

క్రోధ వశుండై ఉన్న తమ్ముని
భరతుడు గాంచి పలికెను అపుడు
''సోదర! వినుము! ప్రాణికోటిలో
స్త్రీలను చంపుట నిషిద్ధమైనది.

తల్లిని చంపిన దుష్టుడనుచును
రాముడు నన్ను జేరనీయడని
భయమున నుంటిని - లేనిచొ సోదర
కైకమ్మ నెప్పుడోచంపి యుందును.

నీవు మంథరను చంపినచో యిక
అన్న ఎన్నడూ మన్నించడయా!
పెదవి విప్పిమాటాడడు రాముడు.
కావున వదలుము గూని దానిని.

భరతుని మాటలు విని శత్రుఘ్నుని
కోపమంతయు చల్లబడినది
చచ్చినంతటి పనియై - గూనిది
కైక పాదముల పెన వేసినది.

॥శ్రీరఘురాముడు॥

✥✥✥

# 79 రామ దర్శనమ్ముకై భరతుడు అడవికి బాటలు వేయించుట

పదునాల్గవ రోజు ప్రాభాతమున
సచివులు హితులు భరతుని గాంచి
''రాజకుమారా! రాజ్య భారమును
వహించి - రాజ్యము నేలుము అనిరి.

రామలక్ష్మణుల నడవుల కంపి
దశరథరాజు స్వర్గమేగెను
భద్రముగా నీ రాజ్యమున్నది
రాజై ప్రజలను కాపాడవలె.''

సమకూర్చిన అభిషేక వస్తువులు
భరతుడు గాంచి - వాటన్నిటికి
భక్తి మీరగా ప్రదక్షిణించి
హితులందరితో పలికె వినయమున.

''పెద్దలార మా ఇక్ష్వాకులలో
జ్యేష్ఠుడు రాజ్యము నేలుట జరిగెను.
వంశాచారము పాటించిరయా!
సర్వము తెలిసిన విజ్ఞులు మీరు.

మీరీ విధముగ నన్ను కోరుట
న్యాయ బద్ధము కానేరదు కద!
అన్న రాముడు రాజ్యమేలవలె
అన్న బదులు నే వనముల నుందును.

అడవికి పోయి ప్రార్థనచేసి
అన్నను అయోధ్య తీసుకు వచ్చెద
అందుకు మీరును బలము లన్నియు
అండగ నిలువగ కోరుచుంటిని.

అభిషేకమునకు సేకరించిన
దివ్య దినుసులను గొని పోయెదను
నరవ్యాఘ్రము శ్రీరామచంద్రునికి
అభిషేకించి గొనివచ్చెదను.

యజ్ఞశాలలో నుండిన యట్టి
త్రేతాగ్నిని మరి తెచ్చినట్టుగా
రామచంద్రుని తీసుకు వచ్చెద
కోసల నేలును రామచంద్రుడు.

రూపమాత్రముగ తల్లిగ నున్న
కైకేయమ్మ కోరిక తీర్చను
ఆమె కోర్కెకు విరుద్ధముగను
వనవాసమ్మును నేను చేసెద.

పనివారందరు శీఘ్రమెసాగి
అడవి మార్గమును బాగుచేయుడు
సేనలు నడచెడి వీలు కలుగునటు
దండు బాటను నిర్మించవలె.

గంగ వరకును బాట వేయుడు
మారు మూలలు తెలిసినయట్టి
రక్షకులను మరి వెంటనంపుడు
నా ఆనతి ఇది పని మొదలిడుడు.''

భరతుని ఆజ్ఞను విని వారందరు
''లక్ష్మి సర్వదా నీతో నుండును''
కీర్తికి నెలవై ఇల మనగలవని
ఆశీస్సులను ప్రీతిగ నిడిరి.

''శీఘ్రమె పోయి భరత శత్రుఘ్నుల
పిలచుకు రండు నా మాటగను
బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ముఖ్యులను
సచివు లందరిని ఆహ్వానించుడు.''

వశిష్ఠమహఋషి పిలుపు నందుకొని
అతిశీఘ్రముగా వారందరును
సభా భవనమున ప్రవేశించిరి
భరతుని కందరు వందన మెుంచిరి.

భరత శత్రుఘ్నులు వశిష్ఠమునియు
మంత్రిసత్తములు రాజ ముఖ్యులతో
దశరథ రాజుతొ శోభలీనెడి
సభను పోలి అట సభ ఏర్పడినది.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

## 8 2 భరతుడు తన నిర్ణయము సభాసదులకు తెలియ జేయుట

శుక్ర, బృహస్పతు లుత్తమ గ్రహముల
నిండిన యట్టి విశాల నింగిని
పూర్ణ చంద్రుడు తిలకించి నటు
భరత కుమారుడు గనెనాసభను.

తమ యోగ్యతలకు తగు నాసనముల
మేలు వస్త్రముల చందన మలదుకు
ఆశీనులగు సభా సదులతో
ప్రకాశించినది ఆ సభ యంతయు.

వశిష్ఠ మహఋషి భరతుని గాంచి
సభలో పలికెను ఆప్యాయముగా
''నాయన భరతా! నీదు జనకుడు
ధర్మ మార్గమున రాజ్యము నేలెను.

సిరి సంపదలతొ ధన ధాన్యములతొ
విలసిల్లెడి ఈ రాజ్యలక్ష్మిని
నీదు తండ్రి నీ కొసగినారయా!
ఆయనగారు స్వర్గమేగిరి.

సత్య ధర్మముల చరించు రాముడు
చంద్రుడు - వెన్నెల నొదలని రీతిగ
పితృవాక్యమును పరిపాలించగ
వనవాసమునకు వెడలెను నాయనా !

అన్నయు తండ్రియు ఈ రాజ్యమును
నీ కందించిరి - ఇప్పుడు నీవు
అభిషిక్తుడవై రాజ్యమేలినచొ
అయోధ్య వాసులు ఆనందింతురు.

సామంతులందరు ఆనందముగ
అమూల్యమైన కానుక లొసగి
రాజుగ నిన్ను గౌరవింతురు''
అనుచు పలికెను వశిష్ఠమహఋషి.

ఆ మాటలకు భరత కుమారుడు
దుఃఖము నిండి కనుల భాష్పముల
రాముని తలపులు మదిలో నిలువగ
మరింత కృంగి పలికె నేడ్చుచు.

''సభికులార! మా అన్న రాముడు
ధర్మ నిరతుడు పరమ యోగ్యుడు
దశరథరాజు ఏలిన రాజ్యము
రామునిదే మరి నాది కాదు గద.

ఈ రాజ్యమును హరించ రెవ్వరు -
దశరథ రాజుకు పుట్టిన తనయుడు
రాజ్య హర్తగా కాడు మహాత్మా!
ధర్మము చెప్పుడు ఓ గురుదేవా!

దిలీపు నహుషుల బోలిన శ్రేష్ఠుడు
జ్యేష్ఠ కుమారుడు రామచంద్రుడు
ఈ రాజ్యమును ఏలగ యోగ్యుడు -
పాప కార్యమును చేయను నేను.

కులభ్రష్టునిగ పేరు గడించను
కైకాదేవి చేసిన పాపము
ఎంత మాత్రము సహించ లేదు
ఇకముందసలే సహించలేను.

ఓ గురుదేవా! నా రామునికి
ఇచ్చట నుండే వందన మిదిగో -
అన్న రాజ్యమును ఏలు చుండగా
అనుసరించెడి తమ్ముడ నేను''

ధర్మయుక్తముగ భ్రాతృ ప్రేమతో
రామ హృదయమున భరతుడుపలుకగ
సభలో వారు పరవశించిరి
ఆనందాశ్రులు నిలచెను కన్నుల.

''సభికులార! నా నిర్ణయ మిదియే
రామచంద్రుని గొని వచ్చెదను
ఎంత వేడినా అన్నరానిచో
లక్ష్మణుతోడుగ అడవుల నుందును.

సద్గుణయుతులు ధర్మతత్పరులు
మీరందరు నా వెంబడి రావలె
మీ సమక్షమున రామచంద్రుని
అయోధ్య నడుగిడ ప్రార్థన చేతును.

రాముడు వశించు అడవి లోనికి
దండు నడచుటకు బాట వేయుమని
ఆజ్ఞాపించితి - ఆ పనులన్నీ
పూర్తియైనవి అతి శీఘ్రముగా''

అనుచు భరతుడు చెంతనె వున్న
మంత్రి సుమంత్రుని గాంచి పలికెను
''సచివోత్తమ! నే రామ యాత్రకై
సాగుచుంటి నని తెలుపుడు ప్రజలకు.

నా వెంబడి ఈ అయోధ్య పౌరులు
చతురంగ బలములు అనుసరించవలె
అది నా ఆనతి చాటించండి
శీఘ్రముగా మరి బయలు దేరుదము''

రాజ శాసనము మంత్రి సుమంత్రుడు
అయోధ్యలోన తెలియబరచెను
ఆనందముగా అయోధ్య వాసులు
తగు వాహనముల బయలు దేరిరి.

భరతుని ఆజ్ఞను శిరసున దాల్చి
మంత్రి సుమంత్రుడు దివ్యరథమును
జాతి అశ్వములు పూన్చిన అరదము
అతి శీఘ్రముగా తోలుకు వచ్చెను.

రామ కింకరుడు మహావీరుడగు
భరతుడు - మంత్రిని గాంచి పలికెను
''ప్రార్థన చేసి రామచంద్రుని
ప్రసన్నునిగా చేసుకొందును.

అన్నను అయోధ్య తీసుకు వత్తును
రేపటి ప్రాభాతమ్మున సాగెద
సేనలు మీరు అందరు కూడ
ప్రయాణమ్మునకు సిద్ధము కావలె''

భరతుని వెంబడి బయలు దేరుటకు
గజ తురగమ్ములు - ఎద్దుబండ్లను
ఒంటెలు- కంచరగాడిదల నట
సిద్ధపరచు కొనుచుండిరి పౌరులు.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 8 3 భరతుడు హితులందరితో గంగా తీరమున విడిది చేయుట

ఉషఃసంధ్యలో భరత కుమారుడు
ఉత్తమ రథమున ఆశీనుడయి
ఉత్తమ పురుషుని రామచంద్రుని
ఊరికి గొనిరా బయలు దేరెను.

రాకుమారుని రథము ముందర
పురోహితులును సచివులు సాగిరి
తొమ్మిదివేల గజములు నడచెను
అరవైవేల రథములు సాగెను.

లక్ష సంఖ్యలో అశ్వికు లుండిరి
వివిధాయుధములు ధనుసు లందుకు
భరతుని వెంబడి వీరులు నడచిరి
రాముని చూడగ ఆతృత నిండిరి.

కౌసల్య సుమిత్ర - కైకేయలును
మేనా లెక్కి - బయలు దేరిరి
రాముని గుణగానమ్ము చేయుచు
నడచి రందరు రామ హృదయముల

వివిధ వృత్తులను నిర్వహించెడి
కుమ్మరి - కమ్మరి - కంసాలులును
రజకులు రత్నపు పనిమంతులును
వైద్యులు - దర్జీ పనివారుండిరి.

నటకులు- గాయక ముఖ్యులుండిరి
అనేక విద్యల ఆరితేరిన
పనివాంఁడ్రందరు బయలు దేరిరి
రామ ధ్యానమున సాగిరి వారు.

గ్రామ పెద్దలు జనపద ముఖ్యులు
వేదవేత్తలు విప్రోత్తములు
వేలకువేలు బయలు దేరిరి
రామదర్శన కాంక్షులు వారు.

ప్రొద్దువాలెడి సమయమ్ము నకు
గంగా తీరము జేరిరివారు
హంసలు బెగ్గురు చక్రవాకములు
మంగళగానము చేయుచున్నవి.

రాముని సఖుడు నిషాదరాజగు
గుహుని రాజ్యమును గాంచిరి వారు
శృంగిబేరపురమున్నది చెంతనె
భరతుని సేనలు ఆగిన వచ్చట.

మంగళతో యమ్ములతో గంగ
కనుపించగనే భరతు డప్పుడు
రాత్రి అచ్చట విడిది చేతమని
ఆదేశించెను తన సేనలకు.

పవిత్ర గంగతొ దశరథ ప్రభువుకు
తర్పణమ్ములు విడువగ నెంచెను
విడిదుల లోన దిగి రందరును
రాముని తలచుచు నుండెను భరతుడు.

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

# 8 4 గుహుడు భరతుని సందర్శించుట

గంగ ఒడ్డున విడిది చేసిన
భరతుని సేనను గాంచెను గుహుడు
తనవారలను వేగమె రమ్మని
సమాలోచన చేసె నప్పుడు.

ప్రభువగు రాముని రక్షించవలె
మీరందరును ఆహారమ్ముతొ
అయిదు వందల నావల నిపుడే
గంగ ఒడ్డున సిద్ధ పరచుడు.

''కోవిదార ధ్వజమున్నది గావున
భరతుని సేనలు అగునని తెలియును
మంచి మనసుతో భరతు డున్నచో
ముందుగ మనకు వార్త నంపును.

యుద్ధము చేయగ సిద్ధము కావలె
ఒక్కొక నావలొ నూరు మందిని
సమరోత్సాహుల నిలబెట్టవలె
భరతుని భరతము పట్టగ వలెను.

వార్త నేమియు పంపలేదు కద!
అందుకు నాకు సంశయ మొదవెను
దుష్ట బుద్ధితో రాముని వద్దకు
భరతుడేగుచున్నట్టు తోచును.

మంచి మనసుతో భరతు డున్నచో
గంగా నదిని దాటించెదము
అటుగాకున్న సమరము చేతము
స్వయముగ నేను నిర్ణయింతును.

ముందుగ మనము ఎదిరించినచో
బంధించును మరి నిర్దయతోను
దుర్లభమైన రాజ్యము దొరకెను
రాముని చంపగ భరతునియత్నము

కాన్కలు తీసుకు నిషాదరాజు
భరతుని చూడగ సాగెను ముందుకు
గుహుని గాంచిన వివేక వంతుడు
సుమంత్రు డంతట పలికె భరతునితొ.

''రాజకుమారా! నిను దర్శించగ
గుహుడు మంత్రులతొ వచ్చుచుండెను
ఈ ప్రదేశమును పరిపాలించును
రామచంద్రునికి ప్రీతిపాత్రుడు.

ధనుర్బాణములు కలిగిన యట్టి
వీరులు భృత్యులు అండగ నుండగ
గుహుని ఏలుబడి చక్కగ నున్నది
ఈ వనభూములు తెలియు నాతనికి.

సీతారాములు లక్ష్మణమూర్తియు
ఎచ్చట నుండిరొ తెలియు నాతనికి
మిమ్ము చూడగా వచ్చు చుండెను
అతినికిప్పుడే దర్శన మొసగుడు.''

అతి శీఘ్రముగా దర్శనమిడిన
భరతుని గాంచి ఆనందించి
గుహుడు పలికెను '' ఓ మహరాజా!
నా రాజ్యమిది నీదేనయ్యా!

మీరు రాకను తెలియక - మేము
అనుమానించుట జరిగినదయ్యా!
విషయము తెలిసెను రామసోదరా!
దాసుని యింటికి దయచేయవలె.

అడవుల యందు వసించు నట్టి
బోయవాంఛ్రము తగినట్టి వగు
కంద మూలములు వనభోజనముతొ
సత్కరించి నే ధన్యుడ నయ్యెద

ఈ రాత్రికి మీ సేనతో ఇచట
మాకు అతిథిగా నుండగ వేడితి
రేపటి ఉదయము ఆనందముగా
రామ దర్శనము చేయగ సాగుడు.''

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

## 85 భరతుని యెడల గుహునికి గల సందియము తీరుట

గుహుని మాటలు ముదము కూర్చగ
భరతుడు ప్రియముగ పలికెగుహునితో
''రామసఖా! నీ ఆప్యాయతతో
కడుపు నిండినది- ఆనందించితి

భరద్వాజుని సెలవు కేగెదము
అరణ్య మార్గము త్రోవ తెలియదు
వడిగాసాగే గంగానదిని
దాటుట ఎటులో తెలియ కున్నది.''

గుహుడు పలికెను ముడిచిన కరముల
''స్వామీ! నేను నా అనుచరులు
ముందు వుందుము మార్గము చూపుచు
మీరు చింతను వదలుడు ఇంక.

రామచంద్రుడు దయాసముద్రుడు -
రాజకుమారా! అన్నను చూడగ
బయలుదేరుటకు సేనలెందుకో!
సందేహమ్మది తీరకున్నది.?''

సందేహించిన గుహునితో నపుడు
ఆగ్రహించక పలికెను భరతుడు
''నిషాదరాజా! నను శంకించకు
అన్న అనినచో తండ్రితో సముడు.

అన్నను పిలచుకు వచ్చుట కొరకై
అందరి నొకటిగ చేసుకు సాగితి
అయోధ్యలోన అడుగిడ మనుచు
అన్ని గొంతుకలు ఒకటై వేడును.

ఒక్కని మాట కాదను నేమో -
మందిమాట మరి ఆమోదించడ!
అందు వలననే ఇంత మందితో
రామ దర్శనము చేయగ సాగితి.''

ఆ మాటలకు ఆనందించిన
గుహుడు పలికెను అమిత భక్తితో
''భరత ప్రభో! నువు పుణ్యమూర్తివి
జగతిని ఎన్నిక ధర్మవర్తివి.

చేతి కందిన రాజ్యలక్ష్మిని
త్యజించ గలిగిన ధర్మవేత్తవు
అయోధ్య రాముని తోడ్కొని పోయి
అఖండ కీర్తిని పాలించ వయా!''

సంబాషణ అట సాగుచుండగా
చీకటి పడినది - గుహు డంతటను
వారందరికి ఉచితరీతిని
ఆతిథ్యమ్మిడి విడిది చూపెను

భరత శత్రుఘ్నులు విశ్రమించిరి
భరతుని హృదిలో బాధ పెరిగెను
రామధ్యానమను అగ్ని హోత్రము
భరతుని హృదిని దహించ సాగెను.

ఎండ వేడికి హిమవన్నగమున
నీరు కారినటు దుఃఖాగ్ని యది
భరతుని మదిని దహించు చుండగ
స్వేదజలమ్ము వెలువడ జొచ్చెను.

రామ ధ్యాసయది బండరాయియై
నిట్టూర్పులవి ధాతువు లన్నటు
దైన్యమ్మనునది వృక్షమ్ములయి
శోకము - వ్యధయు, శిఖరమ్ములయి

మధ్యమధ్యలో తెలివి తప్పుట
క్రూర మృగమ్ములు అన్నటులుండి
సంతాపమ్మను పొదలు - ఓషధుల
దుఃఖ పర్వతము భరతుని అణచెను.

ఆల మందలో త్రోవ తప్పిన
ఆబోతు వలె నున్నదివేదన
అది గ్రహించి మదికూరట కలుగగ
రామ ప్రసంగము తెచ్చెను గుహుడు.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 86 లక్ష్మణమూర్తి సేవానిరతిని గుహుడు చెప్పుట

సుమిత్ర సుతుని సేవానిరతిని
గుహుడు చెప్పెను భరతున కపుడు
''సీతారాములు నిద్రించగను
మేల్కొని యుండెను లక్ష్మణమూర్తి.

శర చాపములు ధరించి అతడు.
కంటి రెప్పలా కాపాడుచును
అన్న సేవలో మేల్కొని యుండెను
అన్న కంకితము లక్ష్మణమూర్తి.

విశ్రాంతి గొనమని నేను చెప్పితిని.
రక్షణనీయ సమర్థుడ నంటిని
నా మాటలకు బదులుగ నాతడు
మదిలో బాధను తెలియ బరచెను.

దశరథ విభుని జ్యేష్ఠ కుమారుడు
భార్యతొ నేలను విశ్రమించగా
చూచి బ్రతుకుటకు దుర్లభమైనది
నిద్రమాట  మరి తలంచగలనా.

సుఖపడ సిరిగల ఆ సుకుమారుడు
దశరథ విభుని యజ్ఞఫలమ్ము
సద్గుణయుతుడు అమిత విక్రముడు
వనవాసమున ఇడుమల నుండెను.

రాముడు లేక తండ్రి బ్రతుకడు
కోసల రాజ్యము అనాథ యగును
మా పెదతల్లి కౌసల్యమ్మ
అసువులు నిలుపుట దుర్లభమయ్యా!.

సుమిత్ర తల్లియు బ్రతుకుట కష్టము
ఈ ఒక రాత్రియు బ్రతుకుదు రేమో
శత్రుఘ్నునిగని తల్లి బ్రతికినను
కౌసల్యమ్మ మనుట దుర్లభము.

గుహుడా! ఎంతటి దుర్గతి కలిగెనొ
దశరథరాజుకు అంత్యక్రియలను
భరత శత్రుఘ్నులు నిర్వర్తింతురు
వారిద్దరును ధన్యు లగుదురు.

రాజ్యభోగములు భరత శత్రుఘ్నులు
అనుభవింతురు భాగ్యశాలురు
నిరపాయముగ మా వనవాసము
పూర్తియైనచో పుర వాసమ్మగు.

అన్న రామునితొ వదిన సీతతో
అయోధ్య కేగెడి రోజు వచ్చునా?
అనుచు లక్ష్మణుడు చింతిల్లుచును
అన్న రక్షణ చేసెను భక్తిగ.''

ఉదయము కాగా రామలక్ష్మణులు
జటలు ధరించి చక్కని నావలొ
గంగను దాటి వన మార్గమున
అతి మెలకువగా సాగిరి ముందుకు.

॥శ్రీరఘురాముడు॥

❃❃❃

# 87 రాముని గురించి వివరములను గుహుడు చెప్పుట

నార బట్టలకు తోడుగ నచట
రామలక్ష్మణులు జటలు ధరించుట
గుహుడు చెప్పగా వినిన భరతుడు
పరి పరి విధముల యోచన చేసెను.

మునివృత్తికి తగు జటలు ధరించెను
చెదరని నిర్ణయ మన్నగారిది
తన ప్రయత్నము సఫలము అగునా
మది సంశయము ముదిరి పోయినది.

శంకతొ దుఃఖము ముంచి వేయగా
ఆ సుకుమారుడు - రామ భక్తుడు
బల్లెపు పోటుకు కూలిన కరివలె
నేలను బడెను అచేతనమ్ముగ.

శత్రుఘ్నుడు - తా సేద తీర్చుటకు
ప్రయత్నించినను వ్యర్థముకాగా
పట్టరాని దుఃఖమ్ముతొ నపుడు
బిగ్గరగా విలపించె నాతడు.

అచ్చటి స్థితిగని రాణులు ఏడ్చిరి
కౌసల్యమ్మ - భరత కుమారుని
గుండెకు హత్తుకు దుఃఖించినది
మిగిలిన ఆశ నీవే నన్నది.

''నాయన భరతా! మా అసువు లవి
నిన్ను గాంచుచు నిలిపి వుంచితిమి
సీతారాములు లక్ష్మణు గూర్చి
అశుభ వార్త లేమైన వింటివ?''

తెలివి తెచ్చుకొని భరతకుమారుడు
కౌసల్యమ్మను ఊరడించెను
చెంతనె వున్న గుహుని గాంచెను
అన్న వివరములు అడిగెను అపుడు.

''స్థపతీ! ఎచ్చట రాము డుండెను
ఎచట పరుండెను ఏమి తినెనయా?
వదిన సీత తానేమి తిన్నది
లక్ష్మణమూర్తిని గూర్చి చెప్పుము.''

బదులు పలికెను రాముని మిత్రుడు
''రాజకుమారా! రామచంద్రుడు
వనవాస నియమమున ఉంటిని అనుచు
భక్ష్య భోజ్యములు వలదని చెప్పెను.

గంగా జలమును తమ్ముడు తేగా
సీతారాములు స్వీకరించిరి
ఆ ముగ్గురును అతి నిష్ఠగను
సాయం సంధ్యను ఉపాసించిరి.

కుశలను తెచ్చి సుమిత్రసుతుడు
పడక నమర్చగ పుణ్య దంపతులు
దర్భాసనమున విశ్రమించిరి
అదిగో తరువు! అచట పరుండిరి.

సీతారాములు విశ్రమించగా
ధనుర్బాణముల లక్ష్మణమూర్తి
కావలి కాయుచు మేల్కొని యుండెను
రామ సేవలో నుంటిమి మేము.''

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 88 రాముడు రానిచో అన్నతో వనముల నుందు నన్న భరతుని నిర్ణయము

గుహుడు చెప్పినది వినెను భరతుడు
ద్రవించి పోయెను హృదయ మంతయు
సచివుల - తల్లుల వెంట నిడుకొని
గార చెట్టును సమీపించెను.

చెట్టు క్రిందన దర్భశయ్య అది
చెదరిపోయి కన్పించెను వారికి
దానినిగాంచి దుఃఖితులైరి
రాముడు కన్నుల మెదలె నందరికి.

''రాజా సౌధమున మెత్తని శయ్యల
దివ్య ధూపముల పరిమళమ్ముల
శ్రావ్యమైన సంగీత ధ్వనులతొ
మంగళ కరముగ నిద్రిడు రాముడు.

వందిమాగధుల స్తోత్ర పాఠకుల
మేలు కొలుపులకు మేల్కొను రాముడు
కటిక నేలపై నిద్రపోయెనా?
కలయా నిజమా చిత్త భ్రమణమా.

దైవ బలమును మించెను కాలము
దశరథ విభుని యజ్ఞ ఫలమిట
దర్భ శయనమున పడుకొని నాడు''
అనుచు భరతుడు దుఃఖితుడయ్యెను.

''జనక నందిని పరమపావని
దశరథ విభుని పెద్దకోడలు
కటిక నేలపై నిదురించినదా
ఎంతటి కష్టము కలిగెను వారికి.

పరమసాధ్వి తా పతి అడుగులలో
అడవుల సాగిన ఆ సుకుమారి
భర్త సన్నిధియె పెన్నిధి అనుకొని
అడవి అయోధ్యగ తలంచు నామె.

నా వల్లను నా రామచంద్రుడు
ప్రియ దర్శనుడు లోక పూజ్యుడు
కోసల రాజ్యము అతి తేలికగా
త్యజించి ఇడుమల నందెను కాదా.

కష్ట కాలమున రామచంద్రునికి
సతి సోదరులు వెంట నుండిరి
వారిజన్మ చరితార్థ మైనది
నా కోరిక నెరవేరునొ లేదో

దశరథవిభుని స్వర్గ వాసముతొ
రామచంద్రుని వన వాసముతో
చుక్కాని కాసెడివాడు లేని దగు
నావ తీరుగా అయోధ్య యున్నది.

నగర ద్వారములు తెరచియున్నవి
ఉదాసీనముగ నుండి రందరు
అయినను అయోధ్య వంక చూచుటకు
రామ భయమ్మున రిపులు హడలెదరు.

నా నిర్ణమమిది ఇప్పటి నుండి
జటా వల్కములమర్చు కొందును
కంద మూలములు తినుచుండెదను
కటిక నేలపై నిదురించెదను.

అన్న బదులుగ వనవాసమ్మును
నేను గ్రహించి అడవుల నుందును
శత్రుఘ్నుడు నా వెంట నుండును
రాముని ప్రతిన నిలబెట్టెదను.

అయోధ్య ఏలిక రామచంద్రుడే
భూసురోత్తములు - పుణ్యమూర్తికి
పట్టాభిషేకము శాస్త్రోక్తముగ
చేయగ వలెను నాకోరికది.

దేవతలారా! నా కోరికను
సఫలము చేయగ ప్రార్థన చేతును.
అన్నరానిచో అతని సన్నిధిని
అడువులలోన ఉండి పోదును.''

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

## 8 9 భరతుడు పరివారముతో గుహుని సాయముతో గంగను దాటుట

మరునాడుదయము భరతుడు లేచి
తమ్ముని ప్రియముగ పిలువగ నంత
రామ ధ్యానమున నిద్రఎరుగని
శత్రుఘ్ను డచ్చట లేచి నిలచెను.

ప్రభువు ఆనతిని నావలు గంగలో
అతి శీఘ్రముగా నిలచెనప్పుడు
''స్వస్తిక'' మనెడి ఘనమగు నావను
రాకుమారులకు సిద్ధపరచిరి.

రామదర్శనము చేయుట కొరకై
తొందర గలిగిన సోదరులిద్దరు
గుహుని రాకకై చూచు చుండగా
గుహుడువచ్చి తా వందన మిడెను.

శోభ లీనెడి చక్కని నావను
భరత శత్రుఘ్నులు అధిరోహించిరి
రాజమాతలు రాణులు ముగ్గురు
మంత్రి పురోహితు లందరు ఎక్కిరి.

''రాత్రి సుఖముగా గడచెన స్వామీ!''
అనుచు గుహుడు అట అడిగి నంతనే
గుహుని సేవలకు గలిగిన తృప్తిని
తెలియ బరచెను భరత కుమారుడు.

బలమగు నావల బరువగు బండ్లను
హయములు ఎడ్లను రథముల నుంచిరి
కంచర గాడిద లెక్కెను నావలు
అయిదు వందల నావలు నిండెను.

గంగానదిని దాటించమని
భరతుడు కోరగ నిషాదరాజు
నావలు సిద్ధము చేయ మనుచును
తన వారలకు ఆనతి నిడెను.

కొన్ని నావలలొ స్త్రీలు ఎక్కిరి
కొన్ని తెప్పలలొ సైన్యము ఎక్కెను
గడ్డి- గాదములు వస్తువు లన్నియు
భద్రముగ నట నుంచిరి నావల.

పతాకములతో మావటి వాండ్రు
అధిరోహించిన గజములు - గంగలొ
ఈదుచుండగా ఘనమగు గిరులు
పతాకములతో సాగినట్లయె.

తెర చాపలను ఎత్తగ నావలు
అమిత వేగమున గంగలొ సాగెను
శుభ దర్శనుని దర్శించుటకు
శుభముగ నందరు గంగను దాటిరి.

వారందరును నావలు దిగిరి
చిత్రగతులలో నావలన్నిటిని
కనులపండువగ మరలించుచును
మరలిపోయిరి గుహుని సేవకులు.

గంగానదిలో స్నానముచేసిరి
మైత్ర-ముహూర్తమునందున వారు
భరతుని వెంబడి బయలు దేరిరి
ప్రయాగ వనమున అడుగు బెట్టిరి.

సేనల కుశలము అడిగెను భరతుడు
అచ్చటనే వారందర నుంచి
భరద్వాజముని ఆశ్రమమ్మది
కనుపించగను గాంచెను భక్తిగ.

వేద వేత్తయగు వృద్ధమౌనియు
మహాజ్ఞానముతొ పండిన ఋషియగు
భరద్వాజముని దర్శనమ్ముకై
వశిష్ఠాదులతొ సాగెను భరతుడు.

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

# 90 భరతుడు భరద్వాజ మహర్షిని సందర్శించుట

ధనుర్బాణములు ఆభరణమ్ములు
రాజ లాంఛనము లన్నియు వదలి
మంత్రులందరితొ వశిష్ఠమునితో
భరత కుమారుడు ముందుకు సాగెను.

భరద్వాజముని ఆశ్రమమ్మునకు
కోసెడు దూరము నందే భరతుడు
మంత్రులందరిని నిరీక్షించమని
వశిష్ఠమునితో బయలు దేరెను.

వశిష్ఠమునిని గాంచినంతనే
భరద్వాజముని ముదము నందెను
అర్ఘ్యజలమ్ములు తెమ్మని చెప్పుచు
మహాఋషికి తా నెదురుగ నడచెను.

ఇరువురు మునులు సమ వయస్కులు
అమితానందము నందిరి అపుడు
భరతుడు అపుడు అమిత భక్తిగా
భరద్వాజుని పదముల నంటెను.

భరద్వాజముని భరతుని గాంచెను
అర్ఘ్య పాద్యములు ఫలముల నొసగి
వారిద్దరిని సంతస పరచెను
భరత కుమారుని కుశలము అడిగెను.

కుశల వార్తను చెప్పి అంతట.
భరద్వాజముని కుశలము నడిగిరి
అగ్ని హోత్రములు - తపోనిష్ఠలు
సాగుచున్నవాఅనుచు అడిగిరి.

''ప్రశాంతమ్ముగా వనము ఉన్నదా -
ఆశ్రమ సీమలో తిరుగుచుండెడి
మృగములు పక్షులు సుఖముగ నున్నవ!
ఫల వృక్షములు కాయుచున్నవా.''

వారి ప్రశ్నలకు భరద్వాజుడు
కుశలము తెలిపిభరతుని అడిగెను
''నాయన భరతా! రాజ్యము వదలి
వచ్చితి వేమి - సందేహమది.

తల్లి మాటను కాదన లేక
తండ్రి - రాముని అడవుల కంపెను
మారు పలుకక కోసలాత్మజుడు
వన వాసమునకు సాగెను నాడు.

అందిన రాజ్యము ఆఖరి వరకు
అనుభవించగా కోరిక గలిగి
అన్నకు ఆపద తెచ్చుట కొరకై
అడుగిడినావా! అడవుల లోన.''

ముని మాటలకు భరతు డచ్చట
నిలబడ లేక కుమిలి పోయెను
అశ్రు ధారలతొ వందన మిడుచు
గద్గద స్వరముతొ పలికెను మౌనితొ.

''స్వామీ! మీరు త్రికాలజ్ఞులు.
మీరుకూడ నామది తెలియకను
దోషిగ నన్ను పరిగణింతురా-
ఇక నే బ్రతుకుట వ్యర్థము స్వామీ!

ఏ దోషము నే నెరుగను స్వామీ!
కైక కొడుకుగా పుట్టుట తప్ప
మరి యేదోషము ఎరుగను స్వామీ!
కఠిన వాక్కులు వినలేనయ్యా.

అమ్మ కోరికలు నేను ఎరుగను
నేనా కోర్కెలు సమ్మతించను
రామచంద్రుని పదములపై బడి
ప్రసన్నునిగా చేసుకొందును.

అన్నను అయోధ్య గొని పోవుటకై
బయలు దేరితిని పురమును వదలి
ఆ మహనీయుడు ఎక్కడ గలడో
వివరము తెలుపుడు మౌని సత్తమా!''

భరతుడు అటుల పలుకు చుండగా
వశిష్ఠమహర్షి భరతుని విషయము
భరద్వాజునికి విన్నవించెను
అంతట పలికెను భరద్వాజుడు.

''భరత కుమారా! అన్నను కొలచుట
సత్పురుషులను అనుసరించుట
ఇంద్రియ నిగ్రహ మాదిగాగల
సద్గుణములవి రఘుకుల సంపద.

ఆ సద్గుణములు నీలో విరిసెను
నిన్ను గాంచి నాకానందమగు
నీదు మనస్సు నాకు తెలియును
నీవు చెప్పగా విన నడిగితిని.

నీదుకీర్తి ఇల శాశ్వతమ్మగు
నీదు భక్తి ఇల వెలుగు నిరతము
సీతారాములు! లక్ష్మణ మూర్తియు
చిత్ర కూటమున నున్నారయ్యా.

నాయన భరతా! అన్నను గాంచగ
రేపటి రోజున బయలు దేరుము
నీ మంత్రులతో పరివారముతో
నేటికి నాదు అతిధ్యము గొను.

కోర్కెలు తీర్చే రాకుమారుడవు
నాదు కోరిక కాదనవలదు''
ముని మాటలకు భరతుడు భక్తిగ
ఆరోజచ్చట ఉందుము అనెను.

॥శ్రీరఘురాముడు॥

✤✤✤

# 91 భరద్వాజ విందు

ససైన్యమ్ముగా హితులతొ వచ్చిన
భరతుని కపుడు ఆతిథ్యమునిడ
భరద్వాజముని సంకల్పించగ
వినయము నిండి భరతుడు పలికెను.

బదులు పలికెను భరత కుమారుడు
''ఆశ్రమ సీమలొ సేనలు అడుగిడ
కోలాహలము జరుగును స్వామీ
వన ప్రశాంతతకు భంగము కలుగును.''

''మౌని సత్తమా! అర్ఘ్య పాద్యముల
ఆదరించిరి ఫలముల నిడిరి
అంతకు మించిన సత్కారమ్ము
అడవిలొ చేసెడి ఆప్తులు ఎవ్వరు.''

''ఈ వనభూమికి భంగము కలుగదు
నీ సేనల - హితులను రమ్మని చెప్పుము
ముని మాటలు వినిభరత కుమారుడు
సేనల - హితులను రమ్మని చెప్పెను.

ఆ మాటలకు మౌని పలికెను
''నాయన భరతా! నాయందుగల
గౌరవమ్మున పలుకుచుంటివి
నేనేమిడినను తృప్తి నందెదవు.

అగ్ని హోత్రము వుంచెడి గృహమున
భరద్వాజముని అడుగిడినాడు
అతిథులందరిని సత్కరించుటకు
దేవతలందరి సాయము కోరెను.

రాజకుమారా! నేటి రాత్రికి
మీ కందరకు విందు చేసెద
నీ సేనలను అంత దూరమును
ఉంచితి వేమి రప్పించు మిట.''

పూజా గృహమున ఆసీనుడయి
ఆచమించెను - ఆపైనిష్ఠతొ
విశ్వకర్మను మయుని పిలచెను
వలయు గృహములు నిర్మించమనె.

వరుణ కుబేర యమదేవులను
పిలిచి - వారిని సాయము కోరెను
అగ్నిహోత్రుని - ఆహ్వానించి
కార్య నిర్వహణ అప్పగించెను.

భూమి మీదను నాకమునందున
ప్రవహించేటి నదులను పిలచెను
చెరకు రసముతో సమమగు జలములు
మేలగు-మధువును ప్రవహించమనె.

ఆహా - ఊహూ - అనెడి దేవతల
అప్సరసలను - గంధర్వులను
పిలుచుక రమ్మని ఆదేశించెను
అతిథి సేవలు చేయగ చెప్పెను.

ఘృతాచి - విశ్వాచి - మిత్ర కేశిలను
హిమ - ఆలంబస - నాగ దంతులు
అప్సరాంగనలందరి నపుడు
అతిథి సేవలు చేయగ కోరెను.

ధనపతి ఇంద్ర బ్రహ్మ దేవులను
వారి కొలువులో నర్తకి మణులను
వారి గురువగు తుంబురు తోను
వాయిద్యములతొ పంపగ కోరెను.

ఓషధులకును అధిపతియైన
చంద్రుని పిలచి భక్ష్యభోజ్యములు
చోష్య లేహ్యములు వివిధ మధువులు
ఆహారమ్మును సమకూర్చమనె.

చక్కని పూలతొ మాలలమర్చగ
చంద్రుని కోరెను భరద్వాజముని
ఆ విధముగను తపో ధనముతో
భరతుని సేనకు విందును చేసెను.

ధ్యాన నిష్టలో భరద్వాజముని
దేవతల నట ఆహ్వానించగ
వారందరును శీఘ్రమె వచ్చిరి
వారి పనులలో నిమగ్నమైరి.

మలయదుర్దర గిరి నెత్తాలతొ
వాయుదేవుడు పరుగిడిరాగా
పరిమళించెడి చల్లని గాలులు
సేనలన్నిటికి హాయి గొలిపెను.

పుష్ప వృష్టి కురిపించిరి సురలు
దేవ దుందుభులు మ్రోగె శ్రావ్యముగ
సుర గంధర్వులు గానము చేసిరి
అచ్చర కన్యలు నాట్యము చేసిరి

వీణా వేణుమృదంగ వాద్యములు
తన్మయత్వమున ముంచి వేసెను
ఒక్క సారిగా ధ్వనులు ఆగినవి
అమోఘ దృశ్యము కనబడెనచట.

విశ్వకర్మ నిర్మించినయట్టి
దివ్య భవనము నిలచె ముందర
ఆశ్చర్యాంబుధినందు మునిగిరి
కలయా నిజమా అనిపించినది.

చదును చేసిన చక్కని నేలను
వైడూర్యములు నీలములున్నటు
పచ్చిక బయళులు నేత్ర పర్వముగ
కనుపించినవి ఆ వన భూమిని.

మారేడు - పనస - వెలగ - మామిడి
మాతులుంగ - మరి వుసిరి చెట్లును
మధ్య మధ్యలో - అగుపించినవి
దేవ మాయ అట కనుపించినది.

ధనపతి వనము చైత్ర రథమ్ము
వచ్చి వెలసెను ఆవన భూమిని
ఒడ్డున నిలచిన తరు సంపదతో
దివ్య నదులట ప్రవహించినివి.

రమ్యహర్మ్యములు ప్రాసాదములు
కరి తురగముల శాలలు వెలసెను
ధవళ కాంతితో శోభిలునట్టి
రాజ గృహమట నిలిచి వెలిగెను.

పూల మాలలతొ సువాసనలతో
విశాలమైన గదులతొ నిండి
దివ్య శయనములు సదుపాయములు
వంటకాలతో నిలచె గృహములు.

భరద్వాజముని కోరిక మేరకు
మంత్రి పురోహితు లనుసరించగ
రాజ గృహమున అడుగిడె భరతుడు
అమితాశ్చర్యము కూర్చెను భవనము.

శ్వేతఛత్రముతొ వింజామరలతొ
సింహాసన మట వెలుగుచున్నది
అన్నను తలచి భరత కుమారుడు
సింహాసనముకు ప్రదక్షిణించెను.

సాష్టాంగముగా ప్రణామముంచి.
సచివులు కూర్చొను ఆసనమందు
భరత కుమారుడు ఆసీనుడయె
మిగిలినవారు కూర్చొని రచట.

రాజసౌధపు ముందు భాగమున
పాయసమ్ముతో నది ప్రవహించెను
నది కిరు ప్రక్కల రమ్య సదనములు
అప్పటి కప్పుడు తయారైనవి.

గృహముల నుండి అచ్చరకన్యలు
ఆ భవనమునకు వచ్చి చేరిరి
అరవై వేలు బ్రహ్మ పంపగా
మెరపు తీగలై వచ్చిరి వారు.

ఇరవై వేల అప్సరాంగనలు
ధనపతి పంపగ వచ్చి చేరిరి
ఇరవై వేల అచ్చర స్త్రీలు
ఇంద్రుడు పంపగ వచ్చి చేరిరి.

నారద-తుంబురు గోపుడు ముగ్గురు
సంగీత నిధులట గానము చేసిరి
అచ్చర కన్యలు రమణీయమ్ముగ
నాట్యము చేయుట ఆరంభించిరి.

నందన వనము చైత్ర రథముల
లభించునట్టి దివ్య సుమముల
మాలలు అచ్చట కొల్లలు కొల్లలు
నాక లోకమే దిగినటులుండెను.

సేనలన్నిటికి ఆనందము నిడ
తరువులు నాట్యము చేసిన వచట
మారేడు మద్దెల మ్రోయించగను
తాళవృక్షము తాళము వేసెను.

రావి తరువులు - నృత్యము చేసెను
కానుగు - బొట్టుగు దేవదారులు
కుబ్జ రూపుగల స్త్రీలుగ మారి
ఆశ్చర్యమును కలిగించినవి.

మల్లె - మొల్లలు సన్న జాజులు
అందము లొలికే స్త్రీలుగ మారి
ఆ సైనికులను ఆహ్వానించిరి
భోజనమ్మునకు పిలచిరి వారిని.

ఏడు మందికి తక్కువ కాక
సుందర స్త్రీలు ముందుకు వచ్చి
ఒక్కొక సైనికు నప్పుడు బిలచి
చక్కగస్నానము చేయించిరట.

కొందరు వచ్చి చక్కగ తుడిచి
అలంకరించి మధువు నిచ్చిరి
ఆనందముగా ఆ సైనికులు
తమనే తాము మరచి పోయిరి.

భరద్వాజముని మహిమతొ నటకు
కొందరు వచ్చి గజ తురగములకు
ఒంటెలు - ఎద్దులు వాహనమ్ములకు
ఆదరమ్ముగా మేతను బెట్టిరి.

మావటివాండ్రు అశ్వ రక్షకులు
తనివి తీరగా మధువు త్రాగిరి
ఒడలు మరచి ఆనందము నందిరి
దివ్య భోగములు అనుభవించిరి.

ఆ భోగములలొ మురిసి పోయిరి
అయోధ్యకింక రామని చెప్పిరి
రాముని కొరకై రామని పలుకుచు
ఇచటే సుఖముగ నుందుము అనిరి.

''భరత కుమారుడు సుఖముగ నుండును
వనమున రాముడుసుఖముగ నుండును
మన మిచ్చటనే ఉండిపోదము
ఇంతకు మించిన స్వర్గము లేదు.''

ఆ విధముగను సైనికులందరు
ఆనందముగా అరచు చుండిరి
అతి రుచ్యంబగు పదార్థంబులు
సంతుష్టిగ వారందరు తినిరి.

దాసీ జనము పరిచారికలు
నూత్న వస్త్రముల పరవ సించుచూ
విందు భోజనము ఆరగించిరి
ఆకలి అనునది లేదు అచ్చట.

నెమలి, కొక్కెర, మేక మాంసములు
పెద్దపాత్రల నిండిన వచట
అన్నపు రాసులు - పిండి వంటలు
బంగరుభోజన పాత్రలుండెను.

శొంఠి కలిపినపెరుగు నుంచిరి
కమ్మని పెరుగుకడవల నింపిరి
సుగంధ ద్రవ్యములన్నీ వేసిన
చిక్కని పెరుగునిండెను కడవల.

పిండి వంటలు పాయసాలు గని
ఆ సైనికులు విస్మితులైరి
అచ్చటి ఆవులు లేదనకుండా
పితికిన కొద్దీ పాలను యిచ్చెను.

తరువుల నుండి తేనెలు కారెను
మైరేయి మద్యమున నిండెను బావులు
సుగంధ ద్రవ్యములన్నీ వేసి
నలుగు పిండిని అమర్చినారు.

పండ్లు తోముకొన కుంచె లుంచిరి
మేన నలదుకొన చందన ముంచిరి
అలంకారముల కనువగు నట్టివి
అతిథుల కొరకై అమరె నచ్చట.

నూత్న వస్త్రములు పాదరక్షలు
శర చాపములు శిరస్త్రాణములు
కవ చాదులును అమరె నచ్చట
ఆసనమ్ములు శయ్యలు అమరెను.

తమతో వచ్చిన వాహనమ్ములకు
చక్కని మేతను సిద్ధపరచిరి
చల్లని జలముల సరస్సు లచ్చట
ఆ జంతువులకు ముదము గూర్చెను.

స్వర్గ భోగములు అమరి యుండగా
స్వప్న మేమొ అనిపించుచుండగా
మేను మరచిన ఆనందముతో
రాత్రి గడచిప్రాభాత మాయెను.

అప్సరసలును గంధర్వులును
నదీ దేవతలు భక్తిగ వచ్చి
భరద్వాజముని సెలవు నందుకొని
తమ నెలవులకు సాగిపోయిరి.

మధు పానముతో మత్తు నిద్రలో
చందన చర్చలు హాయి గొలుపగా
ప్రొద్దెక్కినను సైనికు లెవ్వరు
మెలకువ రాక - నిద్రలొ నిండిరి.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 92 రామ దర్శనమునకై భరతుడు–ముని అనతిగొని బయలు దేరుట

రామ దర్శనము చేయు తొందరతొ
మది పులకించి - రామధ్యాసతో
ప్రయాణమ్మునకు సిద్ధము చేసుకు
మౌని దగ్గరకు భరతుడు వచ్చెను.

పూజాదులను నిర్వర్తించుకు
భరద్వాజముని ఆప్యాయముగా
భరతుని గాంచి తన ఆతిథ్యము
తృప్తినిచ్చెనా అనుచు అడిగెను.

వినయము నిండి భరతుడు పలికెను
''మౌని పుంగవా! మీ అదరణ
మరపురాని దివ్యానుభూతి యది
మమ్మందరను తృప్తి పరచినది.

సుఖముగ విందును ఆరగించితిమి
హాయిగ రాతిరి నిదుర పోతిమి
వంత ఎంతయు లేక వుంటిమి
మీ దర్శనమున ధన్యుల మైతిమి.

మౌని పుంగవా! సెలవు నొసగుడు
రామచంద్రుడు వసించు తావు
తమరు తెలిపిన శీఘ్రమె సాగెద
రాముని చూడక మనసు నిలువదు.''

భరతునిగాంచి మౌని పలికెను
''అదిగో! భరతా! కనుబడునట్టి
నిర్జన కానన సీమలొ నడచుచు
రెండు యోజనములటు సాగుమయా.!

అచ్చట మీకు ఆనందము నిడు
అందమైన ఒక అడవి కనబడు
అడవి దాటగా అచ్చట గలదు
చిత్ర కూటగిరి - రమణీయమ్మది

గిరికి ఉత్తరమునున్న తరువులు
విరగబూసి ఆనందము నిడును
తరువుల ప్రక్కన మందాకిని నది
నేత్ర పర్వముగ పరుగిడుచుండును.

మందాకినికి చిత్ర కూటముకు
మధ్యన పర్వత సానువులందు
పర్ణశాల నీ కగపడు నచట
సీతారాములు లక్ష్మణుడుందురు.

దక్షిణ దిక్కు - నైఋతి దిశలొ
రెండు మార్గములు చేర్చు నచ్చటికి
ఏ మార్గము నీ కనువుగ నుండునొ
ఆలోచించి సాగుము నాయన.''

భరతుని ఆనతి నందిన సేనలు
బయలు దేరుటకు సిద్ధము నున్నవి
భరతుడు, తల్లులు ముగ్గురు వచ్చి
మునికి భక్తిగా వందన మిడిరి.

కృశించి పోయిన కౌసల్యమ్మ
సుమిత్ర ఊతము నందుకు నడచి
ముని పదములకు నమస్కరించెను
సుమిత్ర అంతట మ్రొక్కెను మునికి.

ముఖము చెల్లక కైకాదేవి
మునికి మ్రొక్కి అట నిలబడలేక
ప్రదక్షిణించే నెపమున నడచి
భరత కుమారుని వెనుక నిలచెను.

భరతుని గాంచి మౌని పలికెను
తల్లుల వివరము తెలియబరచమని-
అంతట భరతుడు చెంతనె వున్న
కౌసల్యమ్మను చూపుచు పలికెను.

''ధర్మ దేవతగ కనబడునట్టి
కృశించియున్న మహా సాధ్వియే
విష్ణుమూర్తిని అదితి కనినటు
రామచంద్రుని కన్నది స్వామీ!

దశరథ ప్రభువుకు పట్టపు రాణి
కౌసల్యమ్మ రాముని తల్లి -
ఆమెకు ఊతగనిలచిన యట్టి
పరమ సాధ్వి మా సుమిత్ర తల్లి.

ఎవ్వరి వలన రామలక్ష్మణులు
అడవుల పాలై యిడుమల నుండిరొ
దశరథ ప్రభువుస్వర్గ మేగెనో
ఇంతటి దుఃఖమునాకు కలిగెనో -

ఆమెయె- ఈమె నన్ను గన్నది
అతి గర్విష్టి కోప ధారియు
ఐశ్వర్యముపై అమిత కాంక్షియై
ఇంతటి దుఃఖము కోరి తెచ్చెను.''

ఆ విధముగను గద్గద స్వరమున
కంటి నీటితో భరతుడు చెప్పెను
కోపావేశము ఎగసి పడగను
బుసల సర్పమై రొప్పసాగెను.

భరతుని గాంచి భరద్వాజముని
ఆదరమ్ముగా పలికెనప్పుడు
''నాయన భరతా! నీదు తల్లిని
దోషిగనీవు పరిగణించకు.

దైవ ప్రేరితము గావునఆమె
అట్టి వరములు పతి నడిగినది
రాముని వన వాసమ్ము వల్లను
జగతి కంతయు సుఖము కలుగును.

సురలందరికీ మనుజు లందరికి
మేలు కలుగును అనుచు మహర్షి
శుభాశీస్సులను అందచేయగా
మునికి మ్రొక్కి వీడ్కోలు నందిరి.

చతురంగ బలములు సాగె నప్పుడు
ఘన మేఘములు క్రింద నడచినటు
మహాగజములు తోచిన వచట
వాహనమ్ములు బయలు దేరినవి.

రాముని చూచే ఆనందములో
కౌసల్యాది స్త్రీలందరును
ఉత్తమమైన వాహనమ్ములను
అధిరోహించిరి అతి శీఘ్రముగా.

చందమామ వలె కాంతుల వెలిగే
చక్కని పల్లకినెక్కెను భరతుడు
గజ తురగములు రథములు నడువగ
మృగములు పక్షులు బెదరి పోయినవి.

॥శ్రీరఘురాముడు॥

✤✤✤

# 9 3 రామాశ్రమము యొక్క ఉనికి తెలుసుకొను ప్రయత్నములు చేయుట

చిత్ర కూటగిరి చేరుట కొరకై
వన మార్గమున సేనలు సాగెను
ఆ సవ్వడికి మదపు టేనుగులు
కలవర పడినవి పరుగు లెత్తినవి.

జలధి పొంగి అట సాగుచున్నటు
సేనలు అచట కనబడె నప్పుడు
చాలా దూరము సాగిన సేనలు
అలసి పోయినవి గమనము తగ్గెను.

రమణీయంబగు ప్రదేశమును గని
వశిష్ఠమునితో పలికెను భరతుడు
''ఓ గురుదేవా: అల్లదె గాంచుడు
ఆనందము నిడు చిత్ర కూటము.

మందాకిని నది పారుచున్న దదె
అదిగో! అచ్చట చిక్కటి వనము
అచ్చట నున్న పర్ణశాలలో
సీతారాములు లక్ష్మణుడుందురు.''

అనుచు ముదముగ మునికి చెప్పెను
చెంతనె వున్న తమ్ముని గాంచి
వన సౌందర్యము ప్రశంసించెను
ప్రకృతి శోభను వివరించె నిటు.

''గిరులను పోలెడి మదక రీంద్రములు
గిరి ప్రదేశమును త్రొక్కి వేయుచు
నడువగ - కొండలు పిండై పోయి
నడకకువీలగు బాటలేర్పడె.

వర్షపు చినుకుల తలపించుచును
పొగడ పూలవి రాలుచున్నవి
మన సేనల గని - మృగములు, పక్షులు
కోలా హలముగ పరుగిడు చున్నవి.

నల్లని మబ్బుల పోలెడి కురులను
పైకి దువ్వి ముడి వేసిఅక్కడ
పూల చెండునుఅమర్చుకొన్నటు
కొమ్మల చివరపూవులు తోచెను.

ఈ వన మిప్పుడు జన సందడితో
అయోధ్య అన్నటు తోచుచున్నది
ఎగసిన ధూళిని ప్రక్కకు విసరి
పవనుడు ముదమును గూర్చుచుండెను.

అనుజా! గనుము - రాముని చూడగ
ఆత్రుత కలిగిన రథ సారథులు
అమిత వేగమున తోలుచుండిరి
నెమళ్ళు భయపడి పరుగిడు చున్నవి.

రాముని చెంతకు చేర్చెడి బాట
స్వర్గ పథముగా తోచుచున్నది
తాపసోత్తముల నెలవది అన్నటు
చక్కని జింకలు తిరుగు చున్నవి.

సేనలు యిచటే విడిది చేయవలె
యోధులు కొందరు ముందుకుపోయి
సీతారాములు లక్ష్మణ మూర్తియు
ఎచ్చట గలరో తెలుసుకు రావలె.''

భరతుని ఆనతి నందిన యోధులు
అన్వేషించి - ఆ వన భూమిని
దూరముగా నొక ప్రదేశమ్మున
పొగ ఎగసినది - చూచిరి వారు.

భరతుని చేరి చెప్పిరివారు
''నిప్పులేక మరి పొగరాదు కదా!
తప్పక రాముడు వుండును అచ్చట
లేదా వుందురు తాపసోత్తములు.

ఆ తాపసులను భక్తిగ అడిగిన
సీతారాముల వివరము తెలియును''
ఆ మాటలతో భరతుడు సరియని
సేనల నచ్చట వుండగ చెప్పెను.

వశిష్ఠ మునితో సుమంత్రు మంత్రితొ
ఆ ప్రదేశమును చూచి వత్తమని
ధూమము ఎగసెడి దిక్కును గాంచి
పరిశీలించి చూచెను భరతుడు.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 94 సీతారాములు చిత్రకూట సౌందర్యము తిలకించుట

చిత్ర కూటమున పర్ణశాలలో
నెల దినము లవి గడిచి పోయినవి
ప్రకృతి శోభను తిలకించుచును
పరవశమ్మున రాము డుండెను.

సీతాదేవికి ఉల్లాసమది
కలిగించుటకు ఆవనమందు
గిరిప్రదేశముల సౌందర్యమును
చూపగ రాముడు బయలు దేరెను.

ఇంద్రుని వెంట శచీ దేవివలె
రాముని వెంట సీత నడచినది
గిరి సోయగమును చూచుచు నడచిరి
రాముడంతట పలికెను సీతతొ

''సీతా! ఈగిరి శోభల గాంచగ
రాజ్యము పోయిన దిగులే లేదు
హితులకు దూరము గుర్తుకు రాదు
పులుగుల సందడి మదికి హాయి నిడు.

ధాతువులున్న గిరిశిఖరములు
నింగి తాకునటు ఎదిగి యున్నవి
వివిధ వన్నెలతొ గిరులు వెలిగెను
తారాకాంతుల శోభతొ నున్నవి.

ఓ వైదేహి! ఇచటి విశేషము
క్రూర జంతువులు - సాధు జంతువులు
వైరము లేక ఒకటిగ నున్నవి
కలసి హాయిగా బ్రతుకు చున్నవి.

కొండ చరియలో! చిక్కగ పెరిగిన
నేరేడు - మామిడి - వేగిస చెట్లు
లొద్దుగు - పనస - చంద్ర వృక్షములు
బొట్టుగు చెట్లు ఏరు మద్దులును.

మంకెన పొగడ - ఉసిరి చెట్లును
మారేడు తరువులు అరటి చెట్లును
పూవుల కాయల శోభగ నున్నవి
వెదురు పొదలవి నిలచి యున్నవి.

విద్యాధరులు కిన్నెర లిచ్చట
ఆనందముగా నుండిరి గనుము
భార్యా భర్తలు అన్యోన్యముగా
విహరించుటకై వచ్చిరి ఇటకు.

జల ప్రవాహము జారు చుండగా
నిలిచిన యట్టి ఈ పర్వతము
మదజలమ్మును కారుచు నున్న
మదపు టేనుగును గుర్తుకు తెచ్చును.

పూలపుప్పొడి గుబాళింపులతొ
మలయమారుతము హాయి గూర్చెను
ఈ ప్రదేశపు సోయగమ్ములకు
మురిసి పోదురు గాంచిన జనులు.

లక్ష్మణమూర్తి సేవలు చేయగ
నా యిల్లాలువు నాతోనుండగ
దిగులు లేక నే నుందును ఇచట
వత్సరమ్ము లవి లెక్క తెలియవు.

ఈ ఆనందము లభించు చుండగ
భరత కుమారుని దశరథ ప్రభువును
సంతస పరచే వీలు కలిగినది
వనవాసమిది మేలయినది గద!

సీతా! నీవీ వనవాసములో
మనసుకు హాయిని పెంచు కున్నచో
వనవాస ఫలితము జన్మాంతమున
అనుభవించెడి యోగ్యత కలుగును.

గిరి శిఖరములు ఓషధులుండి
రాత్రి యందు అవి వెలుగుచుండగా
అగ్ని శిఖలవలె అగపడు చుండును
నేత్రోత్సవము చేయు చుండును.

నేల చీల్చుకొని చిత్రకూటగిరి
ఉద్భవించినటు అగపడు చున్నది
అందు వల్లనే ఈగిరి ఇంతటి
రమణీయముగా నిలిచి యున్నది.

అమరావతిని అలకాపురిని
మానస-సౌగంధ, సరస్సుల మించి
ఉత్తర కురు దేశమ్ముల కాదని
చిత్ర కూటగిరి సొగసు లీనినది

దేవీ! నీతో పదు నాల్గేండ్లు
నియమ నిష్ఠతో కాలము గడిపి
రాజ ధర్మమగు రాజ్య పాలనము
చేయుదు ననుచు'' రాముడు చెప్పెను.

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

# 95 సీతారాములు మందాకినినది అందము తిలకించుట

చిత్ర కూటగిరి వర్ణన చేయుచు
మందాకిని తటి చేరిరి వారు
నది సోయగమును రామచంద్రుడు
సీతాదేవికి చెప్పుచుండెను.

సీత అందములు నదితో పోల్చుచు
ముదము గూర్చుచు పలికెను రాముడు
''ధనపతి సరస్సు సౌగంధిక మన
వెలసిన దిచ్చట ఈ మందాకిని.

మృగ సమూహములు నీరు త్రాగుచూ
కలచి వేయగా - బురద నిండెను
మందాకినిని గాంచిన మనసు
స్నానము చేయగ ప్రోత్సాహించును.

విజితేంద్రియులగు తపోనిధు లిట
స్నానము చేయగ వారి తపస్సుల
జలము పవిత్రత సంతరించు కొని
పుణ్య జలముతో పారుచున్నది.

సుందరి గనుమటు - తపోనిష్ఠులు
ప్రార్థన, జపముల- లోక బాంధవుని
స్తోత్రము చేయుచు నున్నారచ్చట -
దివ్య తీర్థముల స్నానము పుణ్యము.

ఓ జవరాలా! ఆనందముగా
జలక మాడగా రమ్మా - నిన్నుగని
మృదువుగ మెరసే నీ కరములు గని
ఎఱ్ఱ తామరలు సిగ్గు పడును గద.

నదికిరు ప్రక్కల నిలచిన తరువులు
గాలికి ఊగుచు నాట్యము చేయుచు
పూలను నదిలో జల్లుచున్నవి
నదిశోభను గని తరువులు ఆడెను.

చిత్ర కూటము అయోధ్య అనుకో
మందాకిని నది సరయూ అనుకో
అడవి మృగములు జన సమూహముగ
మదిలో తలచి - ముదము నందుము.

ఇసుక తిన్నెలు అమరె నందముగ
పూలగుత్తులు కదలుచున్నవి
ఈ సోయగము సగము జారిన
మగువ వలువగా తోచుచున్నది.

నన్నెడ బాయని అర్ధాంగివి నువ్వు
మాటమీరని తమ్ముడాతడు
నాకు లభించిరి నా భాగ్య మిది
లోటు అన్నది లేదు నాకిక.

నదిలో స్నానము సుఖము గూర్చును
నీటిని త్రాగి వైరము లుండక
అన్యోన్యముగా జంతువు లుండును
అనుచు రాముడు చెప్పెను సీతకు.

॥శ్రీరఘురాముడు॥

❉❉❉

# 9 6 సేనతో వచ్చు భరతుని అంతము చేసెదనని- లక్ష్మణుడు ఆవేశముతో పలుకుట

ప్రకృతి శోభను తిలకించుచును
పర్వతాలలో విహరించుచును
నది సొగసులను గనుచు ముదముగ
ఆశ్రమమ్మునకు చేరిరివారు.

వన భోజనము రుచులు చెప్పుచు
రామచంద్రుడు సీతాదేవియు
భోజనమ్మును చేయుచుండగా
వనమున సవ్వడి వినవచ్చినది.

చిక్కని ధూళి నింగి కెగసెను
మహా ధ్వనులని వినవచ్చినవి
వనము నందలి మద కరీంద్రములు
భయముతొ పరుగిడు సవ్వడి వినబడె.

కోలాహలమును వినిన రాముడు
తమ్ముని పిలచి చెప్పెను అపుడు
''వేటాడుటకు-రాజు లెవ్వరో
అడవికి వచ్చిన చందము తోచును.

మృగములు, భయపడి, పరుగిడు, చున్నవి
పక్షులు సైతము కదలక నిలచెను
విషయము తెలియుము లక్ష్మణమూర్తి''!
అనుచు రాముడు చెప్పిన యంత.

లక్ష్మణమూర్తి చెంతనె ఉన్న
ఎత్తగు తరువును ఎక్కి చూచెను
ఉత్తర దిక్కున - గజ తురగములు
రథములు వచ్చుట కనుపించనది.

నిశితముగా నట చూచిన యంత
చతురంగ బలములు ఉన్నటు తోచెను
అచ్చట నుండే రాముని పిలచెను
శర చాపములు గ్రహించ మనెను.

''అన్నా! రామా! సీతాదేవిని
ఆ గుహలోనికి పంపుము యిపుడే
కవచాదులను ధరించి నిలబడు
పోరుకు సంసిద్ధుడవై యుండుము''

రాముడంతట తమ్ముని అడిగెను
వచ్చెడి సేనలు ఎవరివి అనెను
లక్ష్మణమూర్తి గతము తలచుచు
క్రోధ వశుడయి పలికె రామునితొ.

''అన్నా! రామా! కైక వరముతో
రాజ్యము దొరికిన భరత కుమారుడు
అడ్డులేక తను రాజ్య మేలుటకు
అంతము చేయగ వచ్చు చుండెను.

కోవిదార ధ్వజమది కనబడెను
మంగళ కరమగు ''విటపీ'' ధ్వజమును
సైనికులదిగో తెచ్చుచుండిరి
ఉత్సాహముగా నున్నవి సేనలు.''

చూపులతోనే సేనల కాల్చుచు
పలికెను అపుడు లక్ష్మణమూర్తి
''ఎవ్వని వలన మన ముగ్గురకు
కష్టము కలిగెనొ వాడే వచ్చెను.

వీర పుంగవా! ఎవ్వని వలన
రాజ్యము నీకు లభించ లేదో
వాడే భరతుడు - వచ్చు చుండెను
వాడు వధ్యుడు - వదలను నేను.

మనకపకారము చేసిన వానిని
చంపుట వలన దోషము రాదు
ధర్మ దూరుని చంపగ వలెను
ఆ పని ఇపుడే చేతును నేను.

ఘనమగు తరువును కరివిరిచినటు
వానిని చీల్తును - కైక ఏడ్చును
భరతుని చంపి కైకను చంపెద
పీడను నేను వారి హితులను

మూర్తిగ నిలచిన పాపము కైక
భూమి మీద మరి మిగులనీయను
నా కోపమును - అవమానములను
అణచినాను అవి ప్రజ్వరిల్లినవి

గడ్డివామును కాల్చినట్లుగా
శరముల చీల్చెద వచ్చెడిసేనను
ఈ గిరిప్రాంతము నెత్తురు మయమగు
క్రూర మృగములకు తిండి దొరకును.

అన్నా రామా! సేనలందరితో
భరతుని కూల్చి నా శౌర్యముతో
శర చాపమ్ముల ఋణము తీర్చెద''
అని కోపముతో పలికె లక్ష్మణుడు.

||శ్రీరఘురాముడు||

❇❇❇

# 97 శ్రీరాముడు లక్ష్మణుని శాంత పరచుట

ఆవేశముతో పలుకుచు నున్న
తమ్ముని గాంచి రాముడు పలికెను
''సోదర లక్ష్మణ! భరత కుమారుడు
ధనుర్ధరుడును ప్రాజ్ఞుడు-వినుము.

భరతుడు స్వయముగ వచ్చు చుండగా
ధనుర్బాణముల అవసర మేమి
తండ్రి మాటపై రాజ్యము నేలెడు
తమ్ముని చంపిన అపకీర్తి కదా.

పోరున నీవు భరతుని చంపి
రాజ్యము నొసగిన ఏలు కొందునా!
హితులు చావగా వచ్చిన రాజ్యము
విషభక్ష్యముగా నెంచెద నేను.

ధర్మార్థ కామములు- రాజ్య పాలనము
కోరను నేను - సోదర వినుము
మీ సౌఖ్యముకై కోరెద వాటిని
నా ఒక్కనికై కోరను వేటిని.

లక్ష్మణమూర్తి! నమ్ముము ఇదిగో
శపథము చేసి పలుకు చుంటిని
నా సోదరులను సుఖ పెట్టుటకై
రాజ్య పాలనము చేయగ కోరితి.

ఓ సౌమిత్రీ! భూమి నంతను
నా భుజ బలమున జయించ గలను
కానీ వినుము - ధర్మవర్తిని
ధర్మ మార్గమున కోరెదనన్నియు.

అధర్మమ్మున అమరత్వ మది
లభించినను నే నొల్లను వినుము
నా సోదరులకు లేని సుఖమ్ము
ఎంత మాత్రము నేను కోరను.

నా సోదరులకు అందని సౌఖ్యము
నాకు లభించిన - దానిని కాల్చెద
లక్ష్మణమూర్తీ! శాంతిగ వినుము
ప్రాణము కన్న మిన్న భరతుడు.

భ్రాతృ వత్సలుడు ధర్మ చరితుడు
మనము వనమునకు వచ్చుట వినిన
భరతుని హృదయము పగిలి యుండును
దుఃఖ జలధిలో మునిగి యుండును.

కోపము నిండి భరత కుమారుడు
తల్లి కైకను తిట్టి యుండును
తండ్రి సమ్మతితొ పరి వారముతో
నను గొనిపోవగ వచ్చు చుండెనో.

అయోధ్య చేరిన భరత కుమారుడు
మనలను గనుటకు వచ్చుట సరియగు
రాకపోయినచొ దుష్టబుద్ధియగు.
మనకపకారము చేయడు అతడు.

ఓ సౌమిత్రీ! ఎపుడైనా మరి
నీకపకారము భరతుడు చేసెన?
నీవలె భరతుడు ఇంతటి వరకు
ఇంత భయముతో పలికి ఎరుగడు.

ఓ సోదరుడా! శంక వదలుము
భరతుని నీవు తిట్టినచో మరి
నన్ను తిట్టినటు భావించెదను
మన సోదరుడు భరత కుమారుడు.

ఆపద కంతకు కారణ మనుచు
తండ్రిని తమ్ముల చంపి వేయుటది
హేయమైన పని లక్ష్మణమూర్తీ!
నేనా పనిని చేయగలేను.

రాజ్య విషయమున నీవు పలికినచొ
రాజ్యము నీకు ఇమ్మని చెప్పెద -
మరు మాటాడక రాజ్య పాలనము
భరతుడు నీకు అప్పగించును.''

ఆ విధముగను అన్న పలుకగా
సిగ్గుతొ కృంగెను లక్ష్మణమూర్తి
సౌమిత్రికి మరి స్వార్థము లేదు
రామ సేవ పరమార్థ మాతనికి.

సేనతొ భరతుడు వచ్చుచుండగా
ఆపద ఏదో తెచ్చు ననుకొని
శంకతొ పలికెను మది కలవరమున
రాముని పలుకుల శంక అణగెను.

లక్ష్మణు డంతట అన్నతొ పలికెను
''అన్నా! మనలను చూచుట కొరకై
తండ్రియె ఇటకు వచ్చు చుండెనో -
విషయము తెలియక పలికితి నటుల.''

ఆ మాటలకు రాముడు పలికెను
నీ ఆలోచన సరియగునేమో
మనల నయోధ్యకు గొనిపోవుటకై
ఆ వచ్చెడిది తండ్రి ఏమో మరి!

సీతనైనను పురముకు గొనిపో
యోచనతోను వచ్చుచుండెనో
లక్ష్మణా గనుము తురగము లవియే
నాయన గారివి - వచ్చుచున్నవి.

నాయనగారు అధిరోహించెడి
శత్రుంజయము ఏనుగు అదిగో
కానీ సోదర లోక వంద్యమగు
శ్వేత ఛత్రము అగుపడలేదు.

శ్వేత ఛత్రము లేక పోవుటచే
మదిలో ఏదో సందియమొదవెను
తరువున దిగుము లక్ష్మణమూర్తీ!''
అనగా తమ్ముడు తరువును దిగెను.

చిత్ర కూటగిరి ప్రదేశమ్మునకు
కొంత దవ్వులో సేనలు కనబడె
చతురంగ బలములు విడిసి యుండుట
రామలక్ష్మణులు చూచిరి అపుడు.

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

# 98 శ్రీరాముని తలంపులతో భరతుడు ఆశ్రమమ్మునకై వెదుకుట

ఆశ్రమ ప్రాంతపు ప్రశాంతి యంతయు
చతురంగ బలములతొ దూర మగునని
దాని వలనను రామచంద్రునికి
బాధ కలుగునని భరతుడు తలచెను.

దూరము నందే బలములనిలపి
రామాశ్రమమును వెదకుట కొరకు
నిర్ణయించుకొనె భరత కుమారుడు
రామ దర్శన కాంక్ష నిండెను.

తమ్ముని గాంచి పలికెను భరతుడు
''సోదర వినుము! మన మందరము
కాలి నడకనే ముందుకు సాగి
ఆశ్రమమ్మును కనుగొన వలెను.

గురువులు, మంత్రులు, పౌర ముఖ్యులు
విప్రోత్తములు వెంబడి వత్తురు
బోయ వాండ్రను తీసుకురమ్ము
నిషాదులతొ మన గుహుడు వచ్చును.

క్షణ మొక యుగమై రాముని చూడక -
మది నిలువదయా! నిద్దురరాదు
పద్మ పత్ర నేత్రమ్ముల రాముని
సుందర వదనము గాంచిన ముదమగు.

రాజలక్షణ శోభితు డతడు
రాజ్య రక్షణకు సమర్థుడాతడు
ధ్వజము, వజ్రము, అమృత కలశము
అరికాళ్ళ రేఖలుగ అమరి యున్నవి.

కమలము మరియు అంకుశమ్ములుగ
అరికాళ్ల రేఖలు శోభిలుచున్నవి
పితృ పితామహు లేలిన కోసల
ఏలెడి అర్హుడు రామచంద్రుడు.

పురుషోత్తముని అయోధ్య రాజుగ
అభిషేకించే ఘడియ వరకును
నా మది నున్న వ్యథ తొలగదయా!
రామ దర్శనము ఊపిరి నిచ్చును.

నిరతము రాముని ముఖ బింబమును
గాంచు లక్ష్మణుడు ఎంతో ధన్యుడు
అడుగుల నడచిన పరమ పతివ్రత
జనక నందిని పవిత్రురాలు.

రామచంద్రుని ప్రార్థించుటకు
యోగ్యముగా నెటు మాటాడుటయో
అన్న యుక్తికి తగిన యుక్తిగా
ఎటు మాటాడుటొ ఊహించుచును

చైత్ర రథమును వదలి- కుబేరుడు
నందన వనము చేరినట్లుగా
అయోధ్య వదలి- రామచంద్రుడు
చిత్ర కూటము వచ్చి చేరెను.

ఆశ్రమమ్మును వెదకుట కొరకై
నడచి నడచి ఆ భరత కుమారుడు
ఎత్తుగ నుండి విరగ బూసిన
సాలవృక్ష మొక దానిని ఎక్కెను.

క్రూర మృగములతొ నిండిన ఈ గిరి
రామచంద్రుని రాక చేతను
హిమవన్నగముగ పవిత్రమైనది -
అది దంపతుల నివాసమది కద''

దగ్గరలోనే కంటి ముందర
అన్న ఆశ్రమము కనుపించినది
ఆశ్రమమ్ములొ అగ్ని హోత్రమున
ఎగసెడి ధూమము గాంచెను భరతుడు.

రామాశ్రమము ఉనికి చెప్పగా
పరవశించిరి వచ్చినవారు
సంద్రము నుండి ఒడ్డుకు చేరిన
తన్మయత్వమున భరతు డుండెను.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 99 శ్రీరామ భరతుల సమాగమము

వెంబడి వచ్చిన వారిని భరతుడు
వెనుకకు పొమ్మనిచెప్పి అంతట
తల్లులనటకు తోడ్కొని రమ్మని
వశిష్ఠమునిని ప్రార్థన చేసెను.

సుమంత్రుడున్ను మంత్రు లందరు
భరతుని వెనుక నడచు చుండిరి
రామ ధ్యానమున నడచు చుండగా
రామాశ్రమ మది కనబడె వారికి.

తమ్ముడైన తన శత్రుఘ్నునితో
రామ భక్తుడగు గుహునితొ కలసి
రాముని చూడగ ఆత్రము నిండి
పరుగిడు నట్లుగ నడచెను భరతుడు.

తాపసోత్తముల ఆశ్రమమ్ములకు
మధ్యలొ రాముని ఆశ్రమ మున్నది
ముని ఆశ్రమమును పోలి యున్నదది
మంగళ కరముగ తీర్చి యున్నది.

అగ్ని హోత్ర గృహ మమరి యున్నది
వచ్చినవారు విశ్రమించు టకు
మంటపమ్ముల వసతి యున్నది
పూలు-సమిధలు ఉన్నవి అచట.

చలిగాచుకొన పిడకలున్నవి
దారి తెలియుటకు అచటి తరువులకు
వల్కలమ్ములు - దర్భలు కట్టిరి
మునివాటిక యది ముదముగ నున్నది.

ఆ ప్రదేశమును గాంచిన భరతుడు
భరద్వాజముని చెప్పిన స్థలమని
మందాకిని అట ఉండును అనుచు
చెంతనున్న తన తమ్మునితో ననె.

ఆ మార్గమున నడువగ నెంచిరి
కానీ అచ్చట మదగజమ్ములు
పొడుచు కొనుచును నేలను త్రొక్కుచు
మార్గము నంతయు కలచి వేసినవి.

శత్రుఘ్నునితో భరతుడు పలికెను
''అదిగొ సోదర! హోమ ధూమము -
అచ్చట నున్న ఆశ్రమమ్మున
ఋషివలె రాముడు కూర్చొని యుండును.

ఇపుడే మనము రామచంద్రుని
దర్శించెదము'' అనుచు నడచుచు
మందాకిని నది దరికి చేరిరి
భరతుడు పలికెను వారితో నట.

''పుడమిని ఏలగ యోగ్యుడు రాముడు
పురుషోత్తముడు ఈ వన సీమలొ
మునివలె ఉండెను ఆశ్రమమందు
నా జన్మమది వ్యర్థ జన్మము.

ద్యుతి మంతుడు శ్రీరామచంద్రుడు
లోక నాథుడగు శ్రీరఘురాముడు
నా వల్లనె తన సుఖములు వీడి
అడవుల పాలై ఇడుముల బడెనను

అప కీర్తియది నాకు వచ్చినది
అసువులతో నే నుండుట తగదు
అన్న పాదముల సాష్టాంగ పడి
వేడు కొందును కోరిక తీర్చగ.

వదిన పదములకు నమస్కరింతును
లక్ష్మణు పదములు పట్టు కొందును
ప్రసన్నులుగను చేసుకొనుటకు
శక్తి వంచన లేక వేడెద.''

ఆ విధముగను భరతుడు చెప్పుచు
దుఃఖ భారమున బరువుగనడచుచు
ముందుకు సాగెను-చూచె నాశ్రమము
రాముడు వసించు పర్ణశాల యది.

ఎత్తుగ నుండి విశాలమైనది
తాటి - మద్ది- ఇనుమద్ది ఆకులతొ
పై భాగము నిర్మించి యున్నది
పూజాగృహమున దర్భలు పరచిరి.

ఎంతటి శత్రువు నైనను త్రుంచే
దివ్య ధనుసులు రెండు ఉన్నవి
వ్రేలాడుచును పర్ణశాలలో
ఉన్న ధనుసులవి అతి బరువైనవి.

వజ్రాయుధమును పోలిన యట్టి
ఘన చాపములవి కనబడుచున్నవి.
కాంతుల వెలిగే రవికిరణములుగ
అమ్ముల పొదులలొ శరములు భాసిలె.

భోగవతినిగల సర్పము లన్నటు
ఆశరములవి భయము గొలుపునవి
తళతళ మెరిసే ఖడ్గములున్నవి
చేతి కవచములు తొడుగు లున్నవి.

అంగుళీ త్రాణము లగ పడుచున్నవి.
పర్ణశాలయది అజేయమైనది
సింహములున్న గుహవలె వుండెను
ఈశాన్యములో హోమ మున్నది.

పుణ్యమూర్తి వసియించు ఆశ్రమము
పుడమి పునీతము చేయు ఆశ్రమము
పరవశమ్ము కలిగించు ఆశ్రమము
పలుకరించుచు నున్నటు లున్నది.

భరత శత్రుఘ్నులు మిగిలిన వారు
ఆశ్రమమ్మున అడుగు బెట్టిరి
జటాధారియై తేజము నిండిన
రాముని గాంచెను భరత కుమారుడు.

మునివలె కూర్చొనియున్న రాముని
మరిమరి చూచెను భరత కుమారుడు
ఆ మహనీయుడు రామచంద్రుడని
నిశ్చయమ్మునకు భరతుడు వచ్చెను.

పద్మపత్ర నేత్రమ్ముల రాముడు
సింహతుల్య పరాక్రమ వంతుడు.
భూమి నంతటిని ఏలగ యోగ్యుడు
మహాబాహుడు ధర్మబద్ధుడు.

జింక చర్మము మేన నమరెను -
వల్కలాలను కట్టుకు - మునివలె
దర్భలపై పద్మాసనమ్మున
ధ్యాన నిష్టలో కూర్చొని యుండెను.

సీతాదేవియు లక్ష్మణ మూర్తియు
ప్రక్కన కూర్చొని రాముని కొలువగ
శాశ్వతమైన బ్రహ్మ దేవునిగ
భాసిల్లెను శ్రీ రామచంద్రుడు.

ధర్మ మూర్తియగు రామచంద్రుని
భరతుడు గాంచి పరుగున పోయెను
ఆపలేని దుఃఖమ్ము వచ్చెను
అతి కష్టముతో నిలబడె నచట.

సభా మధ్యమున యోగ్యులు కొలువగ
కొలువు తీరు శ్రీరామచంద్రుని-
వన్య మృగములు ఆ వనభూమిలొ
కొలుచుచుండ గని దుఃఖిలె భరతుడు.

ఉత్తమమైన వస్త్ర భూషలు
అమరెడి మేనున వల్కలమ్ములవి -
పూల మాలలతొ శోభిలు శిరము
జటలు తీర్చి అట కనబడుచున్నది.

చందన చర్చలనందెడి మేనున
విభూతి రేఖలు మెరయుచున్నవి
యజ్ఞ యాగములు చేయ నర్హుడు
వనవాసమ్ము చేయవచ్చెను.

మహిమాన్వితుడగు రామచంద్రునికి
కష్టములన్నీ తనవలవేనని -
''ఘనమగు పేరును గడించినాను
బ్రతికి నేను సాధించెడిదేమి.''

అటుల తలచుచు శోక వశుడయి
దుఃఖ జలధిని మునిగి యుండెను
చెమటతొ మేను తడిసి పోయెను
తన ఉనికిని తా మరచి పోయెను.

కన్నుల నిండుగ అశ్రువు లుండగ
అడుగిడలేక అనుంగు తమ్ముడు
కరముల నెత్తి కరుణ కలుగగా
''పూజ్యుడా!'' యని పలికెనప్పుడు.

గొంతు పెగలదు మాటలు రావు
మదిలో వేదన కాల్చుచున్నది
హృదిలో బాధ అడుగిడ నీయక
సాష్టాంగప్రణామము చేసెను భరతుడు.

రోదించుచును శత్రుఘ్నుడట
రామ పాదముల వ్రాలె నప్పుడు
రాముడు ప్రియముగ తన సోదరులను
లేవదీసెను గుండియ కలిపెను.

భగచక్రములో రవి చంద్రులను
శుక్రుడు, బృహస్పతు లిద్దరు కలియుట
తలపించునటు - గుహుడు సుమంత్రులు
రామ లక్ష్మణుల కలసిరి అపుడు.

అన్నదమ్ముల కలయిక గాంచి
అనురాగ వారిధి ప్రవహించగను
ఆప్యాయత యను పూలు విరియగ
శోభ లీనినది రామాశ్రమము.

నయనా నందము కలిగించినను -
హృదిలో వేదన రగిలించగను
ప్రక్కన ఉన్న తాప సోత్తములు
కంట నీరిడి దుఃఖము నిండిరి.

రామ భరతుల సమాగమమ్ము
రమ్యమైన ఒక చిత్రముసుమ్ము -
భక్తి నిండిన గుండె లోపల
భద్రముగానది నిలచు నిరతము.

॥శ్రీరఘురాముడు॥

❈❈❈

# 100 కుశల ప్రశ్నల వంకతో-రాముడు రాజనీతి బోధించుట

కృశించి పోయిన దేహముతోను
పాలిపోయిన వదనముతోను
యుగాంతమ్మున హీన తేజుడగు
సూర్యుని బోలిన భరత కుమారుడు.

జటా వల్కలములమరి యుండగా
సాష్టాంగముగా ప్రణామమిడగ
భరత కుమారుని చూచిన వెంటనె
గుర్తు తెలియక పోయె రామునికి.

గుర్తుపట్టిన వెంటనె రాముడు.
లేవనెత్తి తన అనుంగు తమ్ముని
కౌగలించుకొని శిరసు మూర్కొని
తన ఒడియందు కూర్చొన బెట్టుకు.

''నాయన భరతా! కుశల మేకదా
కారడవికి నువు వచ్చితి వేమి
నాయన గారు ఎచ్చట ఉండిరి
వారిని వదలి వచ్చుట తగునా -

నిన్ను గాంచి బహుకాలమైనది
నన్ను చూడగా వచ్చితి వీవు
గుర్తు తెలియనటు మారిపోతివి
ఇంత దూరము ఏల వచ్చితివి.

రాజ సూయము అశ్వమేధము
యజ్ఞ యాగములు చేసిన యట్టి
ఆడి తప్పని పరమ ధార్మికుడు
నాయన గారు కుశలమే కదా!

తండ్రి సేవలు చేయుచుంటివా
నాయన భరతా! దుఃఖతప్తుడై
తండ్రి గారు పరలోక మేగిరా!
వారుండగ నువు వచ్చుట తగునా.

కౌసల్యమ్మ కుశలమే కదా
సత్సంతానము కలిగిన యట్టి
సుమిత్ర తల్లి క్షేమమే కదా -
తెలుపుము నాయన వివరముగాను.

పూజ్యురాలు నీ కన్నతల్లి యగు
కైకాదేవి కుశలమే కదా
పసివాడవు నువు భరత కుమారా
తండ్రిని వదలి వచ్చితివా ఇటు.

అయోధ్య రాజ్యము పాడైపోయి
నీవు ఇటకు మరి రాలేదుకద!
నా సందేహము తీర్చుము తండ్రీ!
అనుచు భరతుని అడిగెను రాముడు.

రాజ్యము - నీవు - కోల్పోయితివా!
వదలి వచ్చుటకు కారణమేమి?
సచివులు - సత్కుల యుతులై, తెలివిగ
రాచ కార్యముల తోడ్పడు చుండిర.

సన్మార్గులు మరి సచివులు కానిచొ
రాజుకు శ్రేయము కలుగదు భరతా!
స్వల్ప ప్రయత్నము అధిక ఫలమును
యోచన చేసి పనులు చేయవలె.

రహస్యమ్ములు వెల్లడిగాకను
తగు శ్రద్ధను నువు చూపుచుంటివా -
మూర్ఖుల నెంతయు దరిరానీయక
తగు జాగ్రత్తగ మెలగు చుంటివా.

మూర్ఖ సహస్రము ఉండుట కన్న
తెలివి మంతుడొక డున్నచొ చాలును
యోగ్యత లెరిగి శక్తికి తగినటు
కార్య భారముల నిచ్చుచుంటివా.

వంశము తెలిసి పరీక్షచేసి
సచివులుగా నియమించుచుంటివా?
తప్పుకు మించిన దండన వలదని
మంత్రులు నిన్ను నివారింతురా.

పన్నుల భారము పెంచలేదుకద!
రాజ ద్రోహులను ఏరివేసితివ
నీ సేనాపతి సమర్థుడేనా?
రాజ భక్తిగల ఉత్తముడేనా?

భృత్యులకీవు వేతనమ్ములు
సకాలమ్మున ఇచ్చు చుంటివా -
సమయమ్మునకు వేతన మిడనిచొ
ఎన్నో చిక్కులు ఎదురగునయ్యా.

దూతల ఎంపిక సరిగా నున్నద?
పరీక్షించి మరి నియమించితివా?
చారుల విషయము పూర్తిగ తెలిసి
యోగ్యత నెరిగి నియమించితివా.

నాస్తిక విప్రుల పూజించవు గద -
ఆస్తిక విప్రుల నాదరింతువా
నీకు ప్రజలపై - ప్రజలకు నీపై
అభిమానమ్ములు పెరుగు చున్నవా.

వణిజోత్తములకు తగు రక్షణ నిడి
వ్యాపారమ్మును పెంచుచుంటివా
ప్రజల సుఖమది వాణిజ్యముపై
ఆధారపడి యుండును సోదర.

రహస్యమ్ములను స్త్రీలకు తెలుపక
జాగరూకత కలిగియుంటివా?
నాగ వనము రక్షించుచుంటివా
ప్రజలకు దర్శన మిచ్చుచుంటివా.

ఆయుధశాల దండిగ నున్నద
ధన వ్యయమ్మున మెళకువ గలిగి
ప్రతి దినమ్మును - ఉదయము నందు
ప్రజలకు దర్శన మిచ్చుచుంటివా!

కృషికులు చక్కగ సేద్యము చేతుర
గోరక్షకులు సుఖముగ నుండిర
ధర్మ మార్గమును తప్పక- అచ్చటి
జనులందరును నడచుచుండిరా?

లంచమ్ములు గొని నీ అధికారులు
అన్యాయముగా నడువరుగదా!
ధనికుడు బీద గణించకుండా
న్యాయముగా మరి తీర్పునిత్తురా!

న్యాయ విచారణ పక్షపాతమై
నిరపరాధి మరి శిక్షనందిన
వానియొక్క ప్రతి ఒక్క బాష్పమున
రాజు-పుత్రులు- ధనము- నశించును.

ధర్మార్థకామములు తగు సమయముల
ఒకటితొ నొకటి విరోధించక
ఆచరించుచు సుఖముగ నుంటివ!
రాజ దోషములు త్యజించినావా.

పెద్దల మార్గము వీడలేదు కద
న్యాయ పాలనము రాజు చేసినచో
ఇహ పరములలో యశము గలుగును
రాజ్య క్షేమమే - రాజు క్షేమమగు.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 101 దశరథుని స్వర్గవాసము శ్రీరామునకు తెలుపుట

భక్తి ప్రపత్తుల భరతుడు పలికెను
''రామప్రభూ! నీ సేవ చేయుటయె
కర్తవ్యముగా నెంచెద నేను
అది నా ధర్మము - నాకు తెలియును.

ధర్మవర్తనతొ మనుజు లందరిలొ
పురుషోత్తమునిగ నిలబడితివిల
దేవుడ వీవు - రాజ్య పాలనతొ
ముక్తిని పొందెడి శక్తి మంతుడవు -

నా ధర్మము నే అనుష్ఠించక
రాజ్య పాలనము చేయుట తగునా?
జ్యేష్ఠుడ వీవు - నీవుండగను
తమ్ముడు రాజ్యము నేలుట ధర్మమ?

కేకయ రాజ్యములోన నుంటిని
ఆ సమయములో దశరథ ప్రభువు
మనలను వదలి స్వర్గ మేగెను
మీరు వచ్చిన తదుపరి జరిగెను.

రాజ్య పాలనము జ్యేష్ఠుడు చేయుట
వంశాచారము కావున నీవు
నాతోవచ్చి అభిషిక్తుడవై
పుడమి నేలవలె పుణ్య స్వరూపా!

మహాను భావా! ఇపుడే నీవు
సతి సోదరులతొ తండ్రిగారికి
జల తర్పణములు విడువగ వలెను.
మేము మావిధి నెర వేర్చితిమి.

ప్రియ పుత్రుండు వదలిన యట్టి
తర్పణమ్ములు ఫల ప్రదమగును
నిన్నే తలచుచు నీకై వగచుచు
తండ్రి - స్వర్గమును చేరెను రామా''.

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

# 102 భరతుని వెంబడి వచ్చిన వారికి రామదర్శనము

భరతుడు చెప్పిన వార్త-పిడుగులా
రామచంద్రుని చెవిలో పడినది
దుఃఖభారమును భరించ లేక
కూలిన తరువన నేలను బడెను.

కనులు మూసుకొని ఆచేతనమ్ముగ
నేలను బడిన రాముని గాంచి
దుఃఖమునున్న సతి సోదరులు
ఉపచారమ్ములు చేసిరి అపుడు.

తెలివి వచ్చినది కొంత సేపటికి
కనుల నీటితో కుమిలి పోవుచు
''ఏమి చేయుదును-నన్ను తలచుచు
తండ్రిగారట అసువులు వదలిర.

అంత్యక్రియలను చేయక పోతిని
బ్రతుకుట ఏల అనుచు ఏడ్చెను''
''తండ్రి ఋణమును తీర్చిరి మీరు''
చరితార్థులని తమ్ములతో నసె.

''భరత కుమారా! వనవాసమ్ము
పూర్తి చేసినను - అయోధ్య రాను
మంచి చెడ్డలు చెప్పుట కొరకు
తండ్రి లేరట - అయోధ్య ఏల.''

శోకించుచును రామచంద్రుడు
సతినిగాంచి మరి చెప్పుచు ఏడ్చెను
లక్ష్మణుగాంచి చెప్పుచు ఏడ్చెను
అశ్రుధారలతొ నిలచిరందరు.

దుఃఖమునున్న సీతాదేవి
విలపించినది మామను తలచుకు
లక్ష్మణు దుఃఖము ఎగసిపడినది
తండ్రిని తలచుచు ఏడ్చెను అతడు.

రామచంద్రుడు మెల్లగ లేచి
సతి సోదరులను ఊరడించెను
లక్ష్మణమూర్తిని గాంచి పలికెను
''సోదర స్నానము చేతము లెమ్ము.

అంగ వస్త్రములు తీసుకు రమ్ము
గార విత్తుల పిండిని తెమ్ము
తండ్రిగారికి తర్పణమిడెదము
నదికి సాగెదము బయలు దేరుడు.

ముందుగ సీత నడువగ వలెను.
ఆమె వెనుక నువు నడువుము లక్ష్మణ!
నీ వెనుకను నే నడచి వత్తును
ఈ సమయములో అటుల నడువవలె.''

తరతరాలుగా సేవలు చేసెడి
మంచి మనసుగల సుమంత్రుడపుడు
అన్న దమ్ములను ఓదార్చుచును
నది ఒడ్డునకు తీసుక వెళ్ళెను.

స్నానము చేసి రామచంద్రుడు
మందాకిననది తోయమ్ములతో
దక్షిణముఖముగ నీటిలొ నిలచి
తండ్రిని తలచి నీళ్ళు వదలెను.

''పితృ లోకమున ఉన్నటువంటి
తండ్రీ! నీకీ చల్లని జలములు
అక్షయ సుఖమును అందించవలె''
అనుచు జలమును వదలెను రాముడు.

జలమును వదలి రామచంద్రుడు
గార పిండిలో రేగు గుజ్జుతో
ముద్దలు చేసిఆ పిండములను
దర్భల పైన ఉంచెను అపుడు.

గార పిండితో పిండమ్ములుగని
దుఃఖము ఎగసెను రాముని కపుడు
లభించు దానిని మాత్రమె బిడ్డలు
పితృ దేవులకు ఒసగెదరనెను.

అచ్చటి నుండి ఆపుణ్యాత్ముడు
ఆశ్రమమ్మునకు వచ్చి చేరెను
తమ్ముల గాంచి కౌగలించుకొని
పెద్దగ ఏడ్చెను రామచంద్రుడు.

అన్న దమ్ములట ఏడ్చుచుండగా
ప్రతిధ్వనించెను చిత్ర కూటగిరి
దూరమునున్న సేనకు వినబడె
కవలవరపడిరి దుఃఖము నిండిరి.

'భరత శత్రుఘ్నులు రాముని కలసిరి
తండ్రి మరణము విని సోదరులు
భరించలేక ఏడ్చు చుండిరి –
అనుచు సేనలు మదిలో తలచెను.'

అచట నిలువక వారందరును
బయలు దేరిరి వాహనాలపై
రాముని గాంచి నెల దాటినను
యుగములన్నటు అనిపించినది.

వర్షాకాలపు మేఘ గర్జనలు
నిండి పోయినటు ధ్వను లెగసినవి
అడవి ఏనుగులు ఆసవ్వడికి
భయపడిపోయి పరుగిడుచున్నవి.

అడవి పందులు, జింకలు, పులులు
కలవర పడుచు పరుగు లెత్తినవి
పక్షులు నింగికి ఎగిరి పోయినవి
భూమి కనబడని సేనలు అవ్వి.

బయలు దేరిన రామ భక్తులు
పర్ణశాలలో కూర్చొనియున్న
పురుషోత్తముని – రాముని చూచిరి
కన్నుల నిండుగ గాంచి మురిసిరి.

కైక మంధరల దూషించుచును
కంట నీరది పారుచుండగా
రామచంద్రుని సన్నిధిలోనికి
మెల్లగ నడచిరి వారందరును.

వారిని గాంచి రామచంద్రుడు
పెద్దలందరిని తండ్రులన్నటు
ఆడవారిని తల్లులన్నటు
ఆప్యాయముగా పలుకరించెను.

భక్తి మీరగా వారందరును
రామచంద్రుని పదములంటిరి -
మనసు నిండుగా పలుకరించెను
కుశల వార్తలను అడిగెను వారిని.

పుడమినేలెడి పుణ్య పురుషుడు
అడవుల పాలై పోవుట గాంచి
పెద్ద పెట్టున ఏడ్చిరి వారు
నింగీ నేలా దద్దరిల్లెను.

॥శ్రీరఘురామ॥

❋❋❋

## 103 తల్లులకు, వశిష్ఠ మహర్షికి శ్రీరాముడు ప్రణామ మిడుట

రాజ పత్నులను వెంట తీసుకొని
వశిష్ఠమహర్షి రాముని చేరగ
నడచుచు చేరిరి నది ఒడ్డునకు -
స్నానము చేసెడి రేవును గాంచిరి.

రామ లక్ష్మణులు స్నానము చేసెడి
ప్రదేశమ్మును గాంచిరి వారు
అమిత దుఃఖమున కృంగి పోయిరి
అనాథలైరని విలపించిరట.

సుమిత్ర తనయుడు చేయు సేవలను
కౌసల్యమ్మ మరిమరి తలచుచు
అడవుల యిడుముల నున్నారనుచు
కంట నీటితో దుఃఖించినది

ముందుకు నడచిరి నది ఒడ్డున అట
దర్భలపైన పిండములుండుట
కౌసల్యమ్మ గాంచిన దపుడు
అమిత దుఃఖమున మునిగి పోయెను.

ఆ పిండములను చూపుచు పలికెను
''జ్యేష్ఠ కుమారుడు రామచంద్రుడు
శాస్త్రోక్తముగా నిడిన పిండములు
వీనిని గాంచి గుండియ పగిలెను.

ఇంద్ర తుల్యుడగు మహానుభావుడు
సర్వ భోగములు అనుభవించెను
నాల్గు సంద్రముల నడుమ భూమిని
పాలించిన ప్రభు ఆహారమ్మిది.

గార పిండితో చేసిన యట్టి
ఈ పిండములను బట్టి చూచిన
రాముడు తిను ఆహారమ్మిది యని
తెలియుచున్నది - విధి బలీయము.

ఎంతటి దుస్థితి బిడ్డకు కలిగెను
ఇంతకు మించిన దుఃఖము ఏమి
నాగుండియ మరి పగులదదేమి?
అని కౌసల్య విలపించినది

విలపించెడి ఆ కౌసల్యమ్మను
ఊరడించిరి మృదు వచనముల
మెల్లగ ఆమెను నడపించుచును
రామాశ్రమముకు తీసుకు వెళ్ళిరి.

నాకము నుండి దిగిన దేవునిగ
కనబడె రాముడు ఆశ్రమమ్మున
భోగ భాగ్యములు త్యజించినట్టి
తనయుని గాంచి ఘొల్లున ఏడ్చిరి.

తల్లుల గాంచి రామచంద్రుడు
సాష్టాంగముగా నమస్కరించెను
కంటి నీటితో కౌసల్యమ్మ
రామచంద్రుని లేవదీసినది

అప్యాయముగా మృదు హస్తముల
రామచంద్రునికి అంటిన ధూళిని
దులిపిరి వారు – పుత్ర ప్రేమతో
గుండె పొంగగా కనులు చెమర్చెను.

లక్ష్మణమూర్తి తల్లుల గాంచి
సాష్టాంగముగా ప్రణామమిడెను
సుమిత్ర సుతుని వారందరును
ఆప్యాయముగా పలుకరించిరి.

కంటి నీటితో సీతాదేవి
అత్తగార్లకు నమస్కరించెను
పాదములంటి ప్రణామమిడినది
ఆమెను గాంచి వగచిరి వారు.

కౌసల్యమ్మ తన కోడలును
కొడుకు తీరుగ కౌగలించుకొని
అడవుల ఇడుములు పడుట అడిగెను
దుఃఖించుచును కుశలమునడిగెను.

''జనక భూపతికి కూతుర వీవు
దశరథ ప్రభువుకు కోడలవీవు
పురుషోత్తముని ఇల్లాలివయి
అడవులపాలై ఇడుముల నుంటివి.

ఎండకు వాడిన కమలము వోలె
నలిగి పోయిన కలువ పూవువలె
ధూళినిండిన స్వర్ణము మాదిరి
మబ్బులు కమ్మిన చంద్ర బింబమై.

సీతా! నిన్ను చూచుచుండగా
దుఃఖాగ్ని నను దహించుచున్నది.''
అని కౌసల్య దుఃఖించినది
చూచెడి వారి మనసు ద్రవించెను.

అగ్ని హోత్రముతొ సమమగునట్టి
తేజో వంతుడు వశిష్ఠమునికి
బృహస్పతికి ఆ ఇంద్రుని తీరుగ
రామచంద్రుడు నమస్కరించెను.

సాష్టాంగముగ ప్రణామ మిడిన
రామచంద్రునికి ఆశీస్సుల నిడి
వశిష్ఠమహర్షి కూర్చొనెనచట
అంతట రాముడు ఆసీనుడయె.

అయోధ్య ముఖ్యులు సచివులతోనూ
విప్రోత్తములు పరివారముతో
రామచంద్రునికి నమస్కరించి
భరతుడు అచ్చట ఆసీనుడయె.

. బహ్మ ముందర ఇద్రుని తీరుగ
కూర్చొనియున్న భరత కుమారుడు
అన్నతొ ఏమి పలుకు నోయని
వినెడి కోరికతొ ఉండిరందరు.

యజ్ఞశాలలో త్రేతాగ్నుల వలె
అన్న దమ్ములట కూర్చొని యుండిరి
వారి మాటలు వినుట కోసమై
నిశ్శబ్దముగా కూర్చొనిరందరు.

॥శ్రీరఘురాముడు॥

## 1 0 4 భక్తిగా భరతుడు అయోధ్యకు రమ్మని శ్రీరాముని కోరుట

తన యందుగల భక్తి భావమున
జటలు ధరించి నార వస్త్రముల
భరతుడున్నటు రాముడు తెలిసెను
భరతునిహృదయము గ్రహించినాడు.

లక్ష్మణమూర్తిని కూర్చొన బెట్టుకు
భరతుని గాంచి పలికెను రాముడు
''జటలు - వల్కలములున్నవి ఏల?
ఇటకు వచ్చితివి కారణమేమి''?

మాటలు రాక ఏడ్చుచునున్న
భరతు నంతట కౌగిలించుకొని
అనునయమ్ముగా అడిగెను రాముడు
అడవికి వచ్చుట ఏలని అడిగెను.

రాముని మాటలు వినిన తమ్ముడు
భరత కుమారుడు భక్తి నిండుగా
చేతులు రెండు జోడించుకొని
అన్నకు ఇటుల విన్న వించెను.

''అన్నా రామా! దశరథ ప్రభువు
నిన్ను అడవులకు పంపి వేసెను
అకార్యమాయన చేసెను అన్నా -
బాధతొ ఆయన స్వర్గమేగెను.

ఆడది కోరిన వరముల కొరకై
జ్యేష్ఠ కుమారుని అడవికి పంపెను
అటు చేయుటది అపకీర్తియని
ఆ మహరాజుకు తోచ లేదుకద

అకారణమ్ముగ జ్యేష్ఠ కుమారుని
అడవికి పంపుట పాపమేకదా!
కోరిన కోరిక తీరకుండగనె
కైకమ్మ తను విధవయైనది.

అమిత దుఃఖమున కైక ఇంకను
బాధ పడుటది సమంజసమ్మా
ఘోర నరకము అనుభవించవలె
ఆమెకు పుట్టితి - పాపము నాది.

అన్నారామా! నీ దాసుడను
అనుగ్రహించి రమ్మా అయోధ్యకు
అభిషిక్తుడవై రాజ్యమేలుము
అందరి ప్రార్థన అదియే స్వామీ!.

భర్తృహీనులై వచ్చిన తల్లుల
కోరిక అదియే - మన్నించుమయా!
జ్యేష్ఠుడు రాజ్యము నేలుటన్నది
మన కులధర్మము - కాదన వలదు.

దశరథ ప్రభువు మరణించగను
అయోధ్య రాజ్యము అనాథయైనది
సింహాసనమును అధిష్ఠించి నువు
రాజ్యలక్ష్మిని పాలించవయా!

శరద్రాత్రిలో శోభగ వెలుగుచు
ముదము గూర్చెడి చందమామ వలె
చల్లగ నీవు రాజ్యమేలుచు
ముదము గూర్చుము మంగళమూర్తీ!

మంత్రులు సచివులు జన సమూహము
శిరసు వంచి ప్రార్థించుచుండిరి
నీ సోదరుడను – నీ శిష్యుడను
నీ దాసుడను అనుగ్రహించుము.

ఓ పురుషోత్తమ! మన పరివారము
తరతరాలుగా సేవలు చేయుచు
మనయెడ ఎంతో భక్తి పెంచుకొని
మనసు నిండుగా ప్రార్థించిరయా!''

అనుచు భరతుడు మనసు కరుగునటు
ప్రార్థన చేసి అన్న పాదములు
కడిగివేసెను కంటి నీటితో
కోసల నేలగ రమ్మని కోరెను.

పదముల చెంత నేలను బడిన
భరతుని గాంచెను రామచంద్రుడు
లేవ దీసెను కౌగిలించుకొని
వాత్సల్యముతో పలికెనప్పుడు.

''నాయన భరతా! సత్య సంధుడవు
ధర్మ చరితుడవు సత్కులయుతుడవు
రాజ్యము కోరెడి పాపము – నీవు –
ఎంత మాత్రము చేయ జాలవు.

నీవు దోషివి కానేకావు –
పసితనమున నువు కన్న తల్లిని
దూషించితివి తగదు నీకది
పాపర హితుడవు నీవని తెలియును.

ప్రాజ్ఞుడ వీవు అన్నియు తెలుసును
భార్యా-పుత్రుల-శిష్యుల-దాసుల
మదికి తోచినటు ఆదేశించే
అధికారమది గురువుల కున్నది.

దశరథ ప్రభువుకు మన మందరము
బిడ్డలమైతిమి – కావున భరతా!
వారికి తోచిన ఆదేశమ్ము
వారు ఇచ్చుటది తప్పు కాదయా!

నార బట్టలతొ కృష్ణా జినముతొ
వనవాసము నా కొసగెను తండ్రి
లేదా ఆయన అయోధ్య నేలగ
చెప్పగ వచ్చును – కాదనలేము.

తండ్రి యధీనము నుంటిమి మనము
ఆయన మాటను కాదనరాదు
తండ్రితొ బాటు మన తల్లులను
గౌరవించుట మన ధర్మమయా!

అడవి కేగమని ఆనతి నిడిరి
మరియొక విధముగ పలుకుట తగదు
విశాల కోసల పరిపాలించగ
ఆజ్ఞాపించిరి కాదనరాదు.

వనవాసమ్ము - రాజ్య పాలనము
మన భాగములుగ పంచిరి భరతా!
ఆ ధర్మాత్ముడు స్వర్గ మేగెను
ఆయన మాట కాదన రాదు.

సోదర భరతా! నీ భాగమును
చక్కగ నీవు అనుభవించ వలె
పదునాల్గేండ్లు నా భాగమును
ఆనందముగా అనుభవింతును.''

ఆ విధముగను రామచంద్రుడు
మెత్తని మాటల తెలియ బరచెను
తండ్రి కోరికే మన్నింతు ననె -
అంతటి లోన చీకటి పడినది.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 105 శ్రీరాముడు తమ్మునకు ఆధ్యాత్మ బోధతో ఊరట కలిగించుట

ప్రాభాతమున నిద్దుర లేచి
స్నానాదికములు పూర్తి చేసుకొని
రామచంద్రుని చెంత కూర్చొని
భరతుడు పలికెను రామచంద్రునితొ.

''స్వామీ! నీవు అమ్మమాట విని
తండ్రి మాటను గౌరవించితివి
నీ రాజ్యము నాకిచ్చి వేసితివి
ఆ రాజ్యమునే తిరిగి గ్రహించుము.

నీవు యిచ్చిన కోసల రాజ్యము
నీదేకాని నాది కాదయా!
దాసుడ నేను - ప్రభు వుండగను
రాజ్యము నేలుట పాపము కాదా!

కోసల నేలెడి సమర్థుడవు నువు
మరి ఇంకొకరికి సాధ్యము కాదు.
గుఱ్ఱమువలె మరి ఖరము పరుగిడదు
ఖగపతి మాదిరి కాకి ఎగురదు.

నీకున్నంతటి సామర్థ్యమది
నాకు లేదని తెలియును నాకు
అందరిపైన ఆధారపడి
అసమర్థుడనై ఏలుట ఎట్లు.

స్వయముగ విత్తును భూమిలొ నాటి
ఎంతో శ్రద్ధగ పోషణ చేసి
ఫలించు ననుచు వేచియుండగ
ఆ వృక్షమది గొడ్డు పోయెను.

విత్తు జల్లినవాని దుఃఖము
ఊహించుమయా! ఓ రఘురామా!
భృత్యుల నీవు పాలించనిచో
అంతటి బాధకు లోనయ్యెదము.

అభిషేకమ్మును చేసుకు నీవు
కిరణమ్ములతో తేజము నింపే
బాల భానునిగ సింహాసనమున
కూర్చొని వుండుట చూడగ వలెను.

అమాత్యులున్నూ - పౌరముఖ్యులు
అదే ప్రార్ధన చేయుచుండిరి
సరియని నీవు అని నంతటనే
తల్లుల ముఖములు వికసించునయా."

ఆ విధముగను భరత కుమారుడు
రామచంద్రుని ప్రార్థించగను
పౌర ముఖ్యులు సచివులందరు
సంతోషమును తెలియబరచిరి.

భరతుని కోరిక రాముడు కాదన
దుఃఖముతో నట భరతుడేడ్చెను -
భరతుని బాధ తెలిసిన రాముడు
మదిలో వేదన గ్రహించినాడు.

తండ్రి మరణము తన వనవాసము
భరించలేక భరత కుమారుడు
దుఃఖము నున్నటు తెలిసి అప్పుడు
ధర్మమూర్తి శ్రీరాముడు పలికెను.

"నాయన భరతా! తల్లి కోరికతొ
తండ్రిగారు నను అడవి కంపిరని
బాధతొ వారు మరణించి రని
మదిలొ దిగులుతొ నుంటివి నీవు.

దీని కంతటికి కారణమ్మది
కైకమ్మసలు కానేకాదు
దైవ ఘటన యని తెలియుము నీవు
దైవము నెదిరి నిలబడ లేము.

మనమందరము అస్వతంత్రులము
దైవ పరిధిలో తిరుగు వారము
అందు వల్లనే కూడ బెట్టియు
అనుభవించగా లేరు కొందరు.

అనుకూలముగా దైవము లేనిచొ
పతనము తప్పదు ఎంతటి వారికి
ఎంత దగ్గర చేరి యున్నను
విడిపోవుటది జరిగి తీరును.

ఎంతటి గొప్ప బ్రతుకు బ్రతికినను
మరణముతొ నది అంత మగునయా!
కావున నీవు - తండ్రి పోవుటకు
తల్లి కర్తయని దుఃఖించ కయా.

తల్లి కోరికల ఫలితమ్ము గనే
నా వనవాసము అనుకోవలదు
నాయన భరతా పండిన పండుకు
రాలి పోవునను భయము కలదయా

పుట్టిన యట్టి ప్రతి జీవి కిల
మరణ భయమ్మది పెద్ద భయమయా!
ఎంత దృఢముగా ఇల్లు కట్టినను
ఎపుడో కూలును జీర్ణావస్థలొ

ఆ విధముగనే నాయన భరతా!
జరా మరణములు జీవి లక్షణము
గడచిన రాత్రి తిరిగి రాదుకద
పారిన జలము తిరిగి మళ్ళదు.

గ్రీష్మ ఋతువులో సూర్య కిరణములు
మూల మూలలా నీటిని పీల్చును
అదే విధముగా అహో రాత్రములు
జీవుల ఆయుర్ధాయము పీల్చును.

ఒక్కొక ఋతువు అడుగిడు చుండగ
అనుభ వించు ఉత్సాహ పడెదరు
ఆయుర్దాయము క్షయమగు చున్నటు
తోచదు వారికి - దైవ మాయ అది.

నిలబడి యున్నను నడుచుచున్నను
ఆయువు హరించి పోవు చుండును
దాని కోసమై ఎవరికి వారే
దుఃఖపడుటది సహజము నాయన.

ఏదో అడవిలొ పుట్టిన యట్టి
రెండు కొయ్యలు సంద్రములో పడి
తెప్ప కొయ్యగా సాగును కలసి
మరియొక గాలికి విడిపోవునవి.

ఇతరుల గూర్చి దుఃఖించుటచే
ప్రయోజనమ్మిసుమంతయు లేదు
మృత్యువు నిరతము వెంట వుండును
జీవితొ బాటు వెంట నడచును.

అదే విధముగా ఆలు బిడ్డలతొ
ధనధాన్యములతొ బ్రతుకు చుండియు
ఏదో ఒక సమయమ్మునకు
యెవరికి వారై పోదురు వారు.

ఎంత దూరము వాడు సాగినను
వదలక - వెంబడి వచ్చును మృత్యువు
వాడు కూర్చొన అది కూర్చొనును
వాడు నడచిన వెంబడి నడచును.

యథేచ్ఛగా మరి సంచరించుటకు
శక్తి లేదుకద ప్రాణుల కిలలో
కావున మనము మృతుని కోసమై
దుఃఖించినను బ్రతికి రాడు కద!

అవయవమ్ముల పట్టు తప్పుచు
మేనంతయును ముడుతలు పడుచు
జుట్టు తెల్లగా నెరసి పోవుచు
ముసలి తనమది మీద కురుకును.

త్రోవ తప్పిన బాటసారి - తను
తోటి వారిని గుర్తులు అడిగి
గమ్యము చేరును- ఆ విధము గను
పెద్దలు చూపిన పథము త్రొక్క వలె.

తెల్లవారగనె ఆర్జింత మని
రాతిరికాగా అనుభవింత మని
ఆశతొ మనుజులు ఎగురు చుందురు
ఆయువు హరించు చున్నటు తెలియరు.

ఆ మార్గమును వదల కూడదు
తిరుగు లేని పథమగు నయ్యా అది
అట్టి బాటలో సాగువారికై
దుఃఖము ఏల భరత కుమారా?

ప్రవాహమ్మువలె ఆయుర్దాయము
పరుగిడు చుండును వినుము సోదరా!
కావున పరలోకమ్ముల నిచ్చెడి
ధర్మ పథమును అందుకో వలె.

ధర్మము నటుల శిరసున దాల్చిన
వానిని మానవుడందురు సోదర
ధర్మమ్మునటు ఆచరించనిచొ
జంతువుతో మరి సమాను డగును.

ధర్మాత్ముడగు దశరథ ప్రభువు
యజ్ఞయాగములు శ్రద్ధగ చేసెను
దాన-దక్షిణలు ముదముగ నిచ్చి
జనరంజకముగ పాలన చేసెను.

ఐహిక భోగము లనుభవించెను
ధర్మ మార్గమున ధనమార్జించెను
సత్పురుషులను సత్కరించెను
సురలను సైతము మెప్పించెనయా.

బహు కాలమ్ము రాజ్యము నేలి
దేహయాత్ర చాలించె నాయన
దివ్య దేహముతొ బ్రహ్మలోకమున
తండ్రిగారు విహరించును నాయన!

సోదర భరతా! బుద్ధి మంతుడవు
సర్వ శాస్త్రములు చదివిన వాడవు
తండ్రి మరణముకు దుఃఖిల వలదు
దృఢ చిత్తముతో ధైర్యము నుండుము.

కష్టములున్నను ధైర్యవంతుడు
కంటనీరు తాపెట్టడు వినుము
అయోధ్య పాలన నీవు చేయవలె
తండ్రి నిర్ణయము అదియే నయ్యా.

ధర్మము నిలపిన తండ్రిగారికి
దివ్య లోకములు లభించు సోదర!
ధర్మమూర్తి మన తండ్రి గావున
ఆయన ఆనతి శిరసున దాల్చుము.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 106 భరతుడు శ్రీరాముని రాజ్యమేలమని బ్రతి మాలుట

సర్వజ్ఞుడగు రామచంద్రుడు
అర్థవంతముగ చెప్పిన మాటల
రాముని తిరిగి బ్రతిమాలుటకు
ధర్మ యుక్తముగ పలికెను భరతుడు.

''రామచంద్ర! నువు విజితేంద్రియుడవు
ఐశ్వర్యమునకు పొంగవు నీవు
ఆపదలందు కృంగి పోవుగద –
అందుకె అందరు గౌరవింతురు.

చావు పుట్టుకలు కలిమి లేములు
విమర్శగా నువు తెలసిన వాడవు
ద్వంద్వాతీతుడ వీవు కావున
దేవ సమానడ వైతివి యిలలో.

సత్య ప్రతినగల పురుషోత్తముడవు
బుద్ధి మంతులలొ శ్రేష్ఠుడ వీవు
కష్టము నీవు భరించగలవు
నీకు దూరమను కష్టము మాది.

మా కష్టము నువు దూరమగు టది
ఆ కష్టము నే భరించ లేను
నాకు తెలియక దుష్ట బుద్ధితో
వరముల నడిగెను పాపదర్శిని.

లోక నిందకు గురియగు నట్టి
అకార్యమ్మును తండ్రి చేసెను
పాప కూపమున నాయన గారిని
జారనీయక కాపాడుమయా!

పాప కార్యము చేసినందుకు
తల్లిని నేను దండించవలె
ధర్మబద్ధుడను ఆమెను వదలితి
దశరథతనయుడు మెలగునుఇటులే.

కోసల ప్రజలను - కైకాదేవిని
నన్నూ - హితులను బంధులందరిని
రక్షించుమయా - పరిపాలించుము
రాజ్యపాలనకు సమర్థుడవునువు.

అన్నా! వినుము నాయనగారు
యజ్ఞయాగములు చేసిన - వృద్ధుడు
అందుకు తండ్రిని నింద చేయుట
ఇందరి ముందు తగదు - అయినను.

పట్టము కట్టుకు రాజ్యము నేలుట
క్షత్రియ కులమున ప్రథమ ధర్మము
అట్టి ధర్మము అసమర్థుడైనను
విడువడుగాదా! వీర పుంగవా.

ధర్మము నెరిగిన రాజ్య పాలకుడు
ఒక స్త్రీ ముదమును మదిలో నెంచి
ధర్మ దూరమగు పాప కార్యమును
చేయుట ఎంతటి సమంజసమ్ము?.

కష్టమునిచ్చే ధర్మాచరణము
నీవు కోరినచొ రాజ్యపాలనలొ
చాతుర్వర్ణపు జనులందరిని
ధర్మ పథమున నడిపించు మయా -

వినాశకాలము నందున కలుగును
విపరీతమగు బుద్ధులు అందురు
ఆ - సామెతను యాదార్థమనుచు
మనమహరాజు చాటి చెప్పెను.

వర్ణాశ్రమములు నాల్గిటి లోను
గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనది
దానిని నీవు ఎటుల వదలెదవు
ఆలోచించుము ధర్మ స్వరూపా.

మోహ పాశముల చిక్కిన తండ్రి
ధర్మ పథమును వదలి నడచెను
ఆయన తప్పును సరిచేయుటది
తనయుని విధియని నీకు తెలియదా!!

పుట్టుకలోను - సామర్థ్యములో
విద్యలోను మరి విజ్ఞతలోను
తమ్ముడనేను - నీకు వెనుక గద
రాజ్యము నేలగ ముందు నిలతునా!

బుద్ధిబలమున - శక్తి యందున
తక్కువ వాడిని రాజునగుదునా!
నీవులేక నే మనలేనయ్యా
మరి ఇక రాజ్యము నేలుట ఎట్లు

సత్పథ చరితా!- అకంటకమ్మగు
కోసలనేలుము మెలకువ తోను
నీ తమ్ములను తోడు చేసుకొని
మమ్మేలుచును రాజ్యమేలుము.

వశిష్ట మహాఋషి - ఆధ్వర్యములో
విప్రోత్తములు - సచివోత్తములు
సమంత్రకమ్ముగ అభిషేకింతురు
జన రంజకముగ రాజ్య మేలుము

సురలు ఇంద్రుని అభిషేకించిరి -
అటుల మేము నిన్నభిషేకింతుము
అమ్మ చేసిన దుష్కృతమ్మది
అభిషేకమ్మున క్షాళన యగును.

అయోధ్య నేలుచు శత్రుల దునుముచు
దేవ ఋణమ్ము ఋషి ఋణమ్మును
పితృ ఋణమ్ము అనెడి ఋణములు
తీర్చుచు, తమ్ముల శాసించు మయా!

అన్నా రామా! ప్రార్థన వినుము
శిరసువంచి నిను వేడు చుంటిమి
జీవుల రక్షణచేయు దేవునిగ
మమ్మందరినీ కాపాడు మయా.

రామప్రభూ! నా నిర్ణయ మిదియే-
నా ప్రార్థన నువు మన్నించనిచో
నీతో నే వనవాసము చేసెద''
అనుచు రాముని పదముల బడెను.

మనసు కరుగునటు అనుంగు తమ్ముడు
పదముల వ్రాలి ప్రార్థించినను
పితృవాక్య పరిపాలన దక్షుడు
విజితేంద్రియుడు చలించ లేదు.

స్థిర సంకల్పుని రాముని చూచి
పులకితులైరి జనులందరును
అయోధ్య నగరికి రానన్నాడని
మదిలో బాధతొ కృంగి పోయిరి.

భరతుని హృదయము తెలిసిరందరు
కంట నీరిడి దుఃఖము నందిరి
అశ్రు ధారలతొ మాటలు రాక
తల్లులు - రాముని బ్రతిమాలి రట.

అయోధ్య ప్రజలు నమస్కరించుచు
ప్రార్థించిరి - శ్రీరామచంద్రుని
ఆడితప్పని రామచంద్రుడు
అనునయించెను వారందరిని.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 107 రాముని నిర్ణయము

అందరు వినగా రామచంద్రుడు
భరతుని చూచి పలికెను యిటుల
''కామవశుడయి దశరథ ప్రభువు
వరము లిచ్చెనని తలంచ వలదు.

కైక తల్లి గర్భమ్మున పుట్టిన
సుతునికి రాజ్యము నిచ్చెద ననుచు
కేకయ రాజుకు - దశరథ ప్రభువు
మాట యిచ్చెను తెలియుము నీవు.

సచివులందరికి కూడా తెలియును
ఈ విషయము నే వింటిని లోగడ
కావున భరతా కోసల రాజ్యము
నీదేకాని నాది కాదయా.

దేవాసుర సంగ్రామ మందున
సాయము నందిన ఫలితముగాను
రెండు వరములు నాయనగారు
నాడు యిచ్చినవి చెల్లించిరయా.

తండ్రి ఆనతి శిరసున దాల్చితి
పదునాల్గేండ్లు వనమున నుందును
అయోధ్య నేలుచు తండ్రిగారిని
సత్యవర్తిగా నిలుపుము నీవు.

సోదర భరతా! పూర్వకాలమున
గయా క్షేత్రమున గయుడను యశశ్వి
పితృ యజ్ఞమును చేయుచు చెప్పిన
సూక్తిని నీకు వినిపించెదను.

పున్నామనరకము దాటించు నది
పుత్రు డనుచును చెప్పెను ఆతడు
కావున పుత్రుల కొరకై తపనను
రాజ ఋషులును కలిగియుండిరి.

నరకము నందు తండ్రిని చేర్చక
కాపాడినచో పుత్రుల మగుదుము
కావున రాజ్యము నేలుము నీవు
దండక వనికి సాగెద నయ్యా!

మనుజుల కీవు రాజుగ నుండుము
మృగముల రాజుగ నుందును నేను
శ్వేత ఛత్రము నీ కమరగను
తరుఛాయ యది నాకు అమరును.

బుద్ధిశాలి శత్రుఘ్నుడచ్చట -
స్నేహశీలి సౌమిత్రి ఇచ్చట -
నలుగురు మొకటిగ అన్యోన్యముగా
తండ్రి ఆజ్ఞ పాలింతము భరతా!''

॥శ్రీరఘురాముడు॥

❖❖❖

## 108 జాబాలి మహర్షి నాస్తికత్వపు బోధ

భరతునితో శ్రీరామచంద్రుడు
పలుకుట వినిన సచివోత్తముడు
'జాబాలి' యను బ్రాహ్మణోత్తముడు
నాస్తికత్వపు పలుకులు పలికెను.

''రామా! నీవు మతి మంతుడవు
అప్రతిహతమగు ధైర్యవంతుడవు
మూర్ఖత్వముతో నీదు బుద్ధిని
మళ్ళించుటది మంచిది కాదు.

ఎవరికివారు పుట్టెదరిలలో
ఎవరికివారై పోదురు వారు
ఒకరికి తోడుగ పుట్ట రెవ్వరును
ఒకరికి తోడుగ చావ రెవ్వరును.

బంధువు లెవ్వరు? కన్నది యెవ్వరు?
వారి మధ్యలో మమతలు ఏమి?
ప్రయాణమ్ములో మజిలీ చేయుచు
సాగునట్లుగా సాగు జీవితము.

ఒకరి కోసమ్మై మరియొక రిలలో
బాధపడుటది నిరర్థకమ్ము
ఈలోకములో జన్మనెత్తుటకు
కారకులంతే - తల్లిదండ్రులు.

గృహము - ధనము వుండెడి వరకే
వాటితొ మనకు సంబంధమయా!
కావున రామా! బుద్ధిమంతులు
అవిషయములు అలోచించరు.

లభించు రాజ్యము కాలదన్నుచు
కష్టమ్ములను ఆహ్వానించకు
రాజ్యలక్ష్మి అట వేచి యున్నది
గ్రహించి- రాజుగభోగములందుము.

దశరథరాజు అప్పటి రాజు
నీవు యిప్పటి అయోధ్య రాజువు-
అంతకు మించిన సంబంధమ్ము
నీకూ- దశరథ రాజుకు లేదు.

నా మాటలు నువు ఆలకించుము
అయోధ్య నేలుము ఆనందముగా
తండ్రితొ నున్న సంబంధమ్మది
బీజ మాత్రమని తెలియు చున్నది.

శుక్ల, శోణిత మిశ్రమమ్ముతో
మానవు లిలలో పుట్టుచుండిరి
అంతకు మించిన బంధము లేదు
మరణించు టది మర్త్యుల కుండును.

తన గమ్యమునకు దశరథరాజు
చేరెను రామా! తెలియుము నీవు
ఏదో తెలియని ఊహా బంధము
నిర్మించుకొని దుఃఖిలు చుంటివి.

ధర్మార్థములు కోరెడివారు
బ్రతి కుండగను సుఖపడరయ్యా -
చచ్చినవాడు తినుట జరుగునా?
విడ్డూరముగా - లేదా రామా!

చచ్చిన వారికి శ్రాద్ధము పెట్టి
ఎంత అన్నము పాడు చేతురో -
చచ్చినవాడు తినుట జరుగునా?
విడ్డూరముగా - లేదా రామా!

బ్రతికినవాడు అన్నము తిన్నచొ
చచ్చినవాని కడుపు నిండునా!
పొరుగూరెళ్ళిన వాని విషయమున
వాడే తినవలె కడుపు నిండుటకు.

ఊరులో లేని వాని కోసమై
ఊరులో నున్న వారు తిన్నచో
వాని ఆకలి తీరినచో మరి
వాడు వండుకొను పనియిక లేదు.

దైవారాధన యజ్ఞ దీక్షలు
తపస్సు- త్యాగము మొదలగువాటిని
తెలివి మంతులు దనార్జనముకై
శాస్త్రమ్ములలో చెప్పిరి రామా!

పరలోకమ్మది లేనేలేదు
ఇహలోకమ్మున సుఖము లందుము
తండ్రి ఆజ్ఞ పాలించు ధర్మమది -
లేని పరమును ఎటుల ఒసగును?

భరతుడు నిన్ను వేడు చుండెను
చేతికందిన రాజ్యము నేలుము
ప్రత్యక్షముగ కనబడు సుఖమును
ధర్మ సూత్రముల దాట వేయకు.''

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

# 109 జాబాలికి రాముని సమాధానము

జాబాలి మాటలకు ఇసుమంతయును
చలించ లేదు రాముని హృదయము
ధర్మ పథమును వదలని రాముడు
విప్రుని గాంచి పలికెనప్పుడు.

''ఓ బ్రాహ్మణుడా! నీవు చెప్పినది
హితముగ నున్న అహిత మగును
అనాచారము అయోగ్యమైనది
కీడేగాని మేలు చేయ దది.

శాస్త్ర విరుద్ధము ధర్మ దూరమున
సత్పురుషులకు దూర మగుదుము
నడవడి బట్టి మంచి చెడ్డలు
మనుజుల కిలలో తెలియు చుండును.

అయోగ్యుడనై - యోగ్యుని తీరుగ
నటించలేను - నాక ప్రియ మది
మంగళ కరమగు వైదిక విధులను
కాలదన్నుచు ధర్మము వదలను -

దురాచారమున నేను నడచిన
యోగ్యులు నన్ను గౌరవించరు
ఆడినమాట తప్పను నేను
అటుచేసిన నా విలువ ఏమిటి?

నాకు తోచినటు నేను నడచిన
ఎవరికివారై ప్రజలు నడతురు
సనాతనమ్మగు రాజధర్మము
దయా సత్యముల మీద నడచును

ఉత్తమ మైనది సత్యమే నయా
ఋషులు - దేవతలు చెప్పిన దదియే
సత్యవర్తికి మోక్షము దొరుకును
అసత్యవర్తికి దూరము నుండును.

సత్యమె అగును ఈశ్వర రూపము
సత్యము వెంబడి లక్ష్మి వుండును
సత్యము మించిన ధర్మము లేదు
సత్యము నెలకొను శాస్త్ర విధులలో.

వనవాసమ్మది తండ్రి ఆనతి
సత్య వచనమున సరియని అంటిని
ఆ వచనమ్మును మీరను నేను
అసత్య వాదిగ పేరు గడించను.

రాజ్య లోభము - భోగ వాంఛతో
ఆడిన మాట కాదని అన్నచో
సత్య వాదియగు తండ్రి వాక్యము
సత్య దూరము చేసినట్లగు.

అసత్యవాది సత్పథ దూరుడు
హవ్య కవ్యములు ఇచ్చినచో నవి
పితృ దేవతలు - దేవతలున్ను
అందుకోరని తెలియుము నీవు.

సత్య రూపముగు ధర్మము - నాకు
పరమాత్మగను దర్శన మిడును
క్షాత్ర ధర్మము - కాదని నేను
వనవాసములో ధర్మము చూచితి.

మనుజుడు ఇలలో పాప కార్యములు
మదిలో తలచుచు చేతల చేయుచు
వాక్కుతొ చెప్పుచు మూడురకములుగ
చేయుచుందురు ఓ జాబాలీ!

స్థిర సంకల్పము కలిగి యుంటిని -
సత్య వాక్యములు నమ్మి యుంటిని -
చేసితి ప్రతిన నాయన ముందు
కౌసల్యమ్మయు సంతస పడినది.

వనవాసమున కంద మూలముల
వైదిక కర్మలు ఆచరించుచు
కపటములేక చరించు చుండి
పితృ దేవతలసురల కొలుతును.

ఓ జాబాలీ! ఈ లోకములో
శుభ కర్మలతో చంద్రు డాతడగు
అగ్ని వాయువుల జన్మలెత్తెదరు
నూరు యజ్ఞములు ఇంద్రత్వ మిడు.

సత్య- ధర్మ పరాక్రమములు
ప్రియ భాషణము, భూత దయయును
బ్రాహ్మణ పూజ, అతిథుల సేవల
స్వర్గ ద్వారములు అనుచు నుడివెదరు.

బ్రాహ్మణు లిలలో వాటిని తెలిసి
యథా శాస్త్రముగ ధర్మ నిష్ఠతో
ఏమరక మరి అనుష్ఠించుచు
స్వర్గ సుఖములను కాంక్షింతు రయా''

అనుచు రాముడు కఠినము గాను
జాబాలితొ నట పలికెను తిరిగి
''వైదిక వేషము నున్న నాస్తికుడ!
ధర్మ పథమును తప్పితి వీవు-

పరలోకమ్ము లేదని చెప్పి
నాస్తిక బోధలు చేయుచుంటివి
నిన్ను చేర్చిన తండ్రిది తప్పు
వేద దూరుడవు- దొంగతొ - సముడవు-

బుద్ధిమంతుడు - నాస్తికు నెదుట
నిలబడదయ్యా! ఓ జాబాలీ!
నీకన్నను మరి తెలివి మంతులే -.
నీ పూర్వీకులు తెలియుము నీవు.

వారందరును శుభ కర్మలతో
ఇహపరములను జయించ గలిగి
గ్రహములు - తారల రూపముతోను
వెలుగు చుండిరి ఆకాశములో.

కర్మా చరణము ఇహపర మిడునని
బ్రాహ్మణు లిలలో - హోమాదులను
అనుష్ఠించుచు నుండిరి గాదా!
ధర్మవర్తిని పూజింతురయా!''

అనుచు పలికిన రాముని గాంచి
వినయముతో జాబాలి పలికెను
రామచంద్ర! విను - నేను ఎన్నడూ
నాస్తికత్వపు బోధ చేయను.

నాస్తికుడను నే కాదు రాఘవా!
ధర్మ సంకటము ఏర్పడి నప్పుడు
కార్యము జరిపే యత్నము లోను
నాస్తికత్వము పలికెద నయ్యా.

అయోధ్యకీవు రానను చుంటివి
ధర్మ సంకటము ఏర్పడెనిపుడు
అందుల కటుల చెప్పితి రామా!
నిను ప్రసన్నునిగ చేయగ చెప్పితి.''

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

## 110 రాజ్యాధికారము జ్యేష్ఠుని దని వశిష్ఠ మహర్షి చెప్పుట

జాబాలి పలుకులకు రామచంద్రుడు
ఆగ్రహించెనని తెలిసి -వశిష్ఠుడు
రామచంద్రునితొ మెల్లగ చెప్పెను
జాబాలి - నాస్తికుడు కాదని చెప్పెను.

''పరలోకమ్మును నమ్మ నీతడు
సత్కర్మలను పూర్తిగ నమ్మను
కానీ - నీదు మనసును మార్చి
అయోధ్య చేర్చగ చెప్పెను అటుల.

రామా! వినుము నేను ఇప్పుడు
లోకోత్పత్తిని గూర్చి చెప్పెద
అది కాలమున భూమి యంతయు
జలముతొ నిండి యుండెడి దయ్యా!

జలము నుండి మరి విరించి, సురలును
ఉద్భ వించిరి ప్రప్రథమముగా
వరాహ రూపము నెత్తిన విష్ణువు
భూమి నప్పుడు ఉద్ధరించెను.

అంతట బ్రహ్మయు - అతని కుమారుడు
సృష్టి నంతయు చేసినారయా!
అవ్యయుడాతడు - బ్రహ్మ దేవుడు
అక్షరు డాతడు సృష్టి కర్తయగు.

బ్రహ్మదేవునికి - మరీచి పుట్టెను
మరీచి కొడుకు కశ్యపుడయ్యా
కశ్యపు తనయుడు సూర్య దేవుడు
సూర్యుని కొడుకు మనువగు నయ్యా!

మనువు - సూర్యునికి పుట్టెను గావున
వైవస్వతమను వందురాతనిని
మొదటి ప్రజాపతి అతడేనయ్యా
ఇక్ష్వాకు వాతని తనూజు డగును.

మొట్టమొదటిగా అయోధ్య రాజ్యము
ఆ ఇక్ష్వాకువు ఏలెను రామా!
కుక్షి - అతని కుమారు డయ్యా!
వికుక్షి - కుక్షికి తనూజు డయ్యా.

వికుక్షి రాజుకు - తేజోవంతుడు
బాణుడు అనెడి తనయుడు పుట్టెను
బాణుని కొడుకు అనరణ్యు డయా!
సుఖముగ నాతడు రాజ్యమేలెను.

అనరణ్యునికి పృథువు పుట్టెను.
త్రిశంకు డాతని తనూజుడయ్యా!
విశ్వామిత్రుని తపో బలముచే
తనువుతొ స్వర్గము త్రిశంకు డేగెను.

త్రిశంకు తనయుడు యవనాశ్వుండు
'దుంధువు' - అనెడి అసురుని చంపగ
దుంధు మారుడని మరియొక పేరును
యవనాశ్వుండు కలిగి యుండెను.

యవనాశ్వునికి మాంధాత యను
యోగ్యుడైన - ఒక కొమరుడు పుట్టెను
మాంధాత కుమారుడు సుసంధి యగును
సుసంధి కొమరులు ఇద్దరు రామా.

ధృవ సంధి, - ప్రసేన జిత్తను-వారిలో
ధృవ సంధి కొమరుడు భరతుడు రామా!
భరతుని కొమరుడు అసితుడు- అతనిని
హైహయ, తాలజంఘ, శశిబిందులు గెలిచిరి-

రాజ్యము నుండి అసితుడు వెడలి
హిమగిరి యందు వసించినాడు
అతిని భార్యలు! ఇద్దరు రామా!
వారి విషయము చెప్పెద వినుము.

రెండవ భార్య - పెద్ద భార్యయగు
కాళింది గర్భమును పాడు చేయుటకు
మోసము చేసి విషము పెట్టినది
కాళింది అంతట చ్యవనుని వేడెను.

చ్యవన మహర్షి ప్రసన్ను డయ్యెను.
కాళింది గర్భమున వంశకర్తయగు
లోకోత్తరుడగు కొడుకు పుట్టునని
ఆశీస్సులనిడి అనుగ్రహించెను.

ఆ మహరాణి తేజోవంతుని
సగరుని గన్నది - రామా వినుము!
గరళము తోడ పుట్టెను గావున
సగరుడు అనెడి పేరు వచ్చెను.

సగరుడు చేయు అశ్వమేధమున
అశ్వము హరింపబడి నందులకు
అశ్వమ్మును మరి వెదకి తెమ్మన -
సగరుని కొడుకులు బయలు దేరిరి.

సగరుని కొమరులు అశ్వము వెదకుచు
భూమిని త్రవ్విరి పాతాళముగా
సాగరమైనది అదియే రామా!
సగర కుమారులు త్రవ్విరి దానిని.

సగరుని యొక్క పెద్ద కుమారుడు
అసమంజుడను అతి దుర్మార్గుడు
అతనిని తండ్రి తరిమె నడవులకు
అసమంజుకుమారుడు, అంశుమంతుడు.

అంశుమంతుడు రాజ్యము నేలెను
అతని కుమారుడు దిలీపుడయ్యా!
దిలీపు తనయుడు భగీరథుండు
కకుత్థ్సుడాతని తనూజుడయ్యా!

కకుత్థ్సు కొమరుడు, రఘుమహరాజు
జగత్ప్రసిద్ధిగ పాలన చేసెను
అందువలననే ఇక్ష్వాకులందరు
కాకుత్థ్స-రఘువులు అయినారయ్యా.

రఘువు కుమారుడు ప్రవృద్ధుడయ్యా
ప్రవృద్ధ తనయుడు పురుషాదుడయా
ఆ పురుషాదుని ఇతర పేర్లవి
కల్మష పాదుడు - సౌదాసుండు

కల్మష పాదుని కొడుకు శంఖణుడు
శంఖణు పుత్రుడు సుదర్శనుండు
అగ్ని వర్ణుడు అతని తనూజుడు
అగ్ని వర్ణుని కొడుకు శీఘ్రకుడు.

శీఘ్రకు తనయుడు మరు మహరాజు
మరువు తనయుడు ప్రశుశ్రుకుడయా!
అతని కుమారుడు అంబరీషుడు
అంబరీషుని తనయుడు నహుషుడు.

నహుషుని కొడుకు నాభాగుడయా!
నాభాగునికి ఇద్దరు కొడుకులు
అజుడు, సువ్రతుడు అను వారయ్యా
అజుని కుమారుడు దశరథ ప్రభువు.

దశరథ ప్రభువుకు జ్యేష్ట పుత్రుడవు
నీదే రాజ్యము నేలెడి అర్హత
ఇక్ష్వాకు వంశమున సాంప్రదాయముగ
జ్యేష్ఠుడు రాజ్యము నేలుచు వచ్చెను.

కావున రామా! ఆచారమ్మది
జ్యేష్ఠుడు ఉండగ అతని తమ్మునికి
రాజ్యార్హత మరి లేదని తెలియుము
సాంప్రదాయమును నిలబెట్టుమయా!

||శ్రీరఘురాముడు||

❋❋❋

# 111 భరతుడు ప్రాయోపవేశము ప్రారంభించుట

వశిష్ఠమహఋషి పలికె రామునితో
కన్నతల్లి ఇల మొదటి గురువయా!
రెండవ గురువు తండ్రియగు నయా
మూడవ గురువు ఆచార్యుడగు.

నీ తండ్రికిని - నీకును గురువును
నామాట నువు వినుట వల్లను
ధర్మహాని మరి నీకు కలుగదు
ప్రజల కోరిక కాదన వలదు.

వృద్ధురాలగు కౌసల్యమ్మకు
నీవు సేవలు చేయుచుండ వలె
ఆమె మాటను పాటించుటచే
ధర్మ పథమునకు దూరము కావు.

అంతియెగాక రామా! వినుము
అడిగిన వారికి కాదన వేదియు
భరతుని కోరిక తీర్చుట వలన
ధర్మదూరుడవు కావు నీ విల.

కావున రామా! నీవు ఇప్పుడు
అయోధ్య నగరికి వచ్చుటలోను
ఎట్టి దోషము లేదని తెలియుము!!
అనుచు యుక్తిగ చెప్పె మహర్షి

వశిష్ఠమహాఋషి మాటల కపుడు
రాముడు పలికెను వినయము నిండి
స్వామీ ! ఇలలో తల్లిదండ్రులు
ప్రాణసమముగా బిడ్డల నెంతురు.

బిడ్డను గందురు పోషణ చేతురు
కంటి రెప్పలా కాపాడెదరు
తల్లిదండ్రుల ఋణము తీర్చుట
చాలా కష్టము మీకు తెలియదా!

తండ్రికి నేను మాట ఇచ్చితి
ఇచ్చిన మాట వమ్ము చేయను
పదునాల్గేండ్లు వనవాసమ్ము
తప్పక నేను చేయగ వలెను''

తిరుగు లేని తన అన్న నిర్ణయము
వినిన భరతుడు భరించలేక
ప్రాయోప వేశము చేసెద ననుచు
నిర్ణయమ్మును తెలియబరచెను.

మంత్రి సుమంత్రుని దర్భలు తెమ్మనె-
''దర్భల పరచుకు వాకిలి ముందర
అన్న పానములు అన్నీ వదలి
అసువులు వీడెద అన్న సన్నిధిని''

రాముని మనసు మంత్రి గ్రహించెను
దర్భల నతడు గొని రాలేదు
అంతట భరతుడు తానే లేచి
దర్భలు వాకిటముందు పరచెను.

పరచిన దర్భలపైన భరతుడు
పడుకొనె నపుడు అన్న ముందర
అంతట రాముడు తమ్ముని గాంచి
అప్యాయముగా పలికెనుఅచట.

''సోదర భరతా! నీకపకారము
ఏమిచేసితి – ఈ ప్రయత్నము
నావాకిలికి అడ్డముగాను
ప్రాయోపవేశము మొదలు పెట్టితివి.

అభిషిక్తుడవై రాజ్య మేలెడి
రాచపట్టికి తగని పని ఇది
దారుణ వ్రతమును వీడుము నాయన
అయోధ్యకేగి రాజ్యమేలుము''

దర్భలపైనే పడుకొని భరతుడు
అయోధ్య ముఖ్యుల - సచివుల కోరెను
రామచంద్రుని ప్రార్థనచేసి
ప్రసన్నునిగా చేయగ కోరెను.

భరతుని చూచి పలికిరి వారు
''రాజ కుమారా! మేము పూర్తిగా
రాముని మనసు గ్రహించినాము
స్థిర సంకల్పుని మార్చగతరమా!

రామచంద్రుడు చెప్పిన విషయము
యోగ్యమైనదని తెలియుచున్నది
అనుచు వినయముగ చెప్పిరివారు
అంతట రాముడు భరతునితో ననె.

''సోదర భరతా! ధర్మసమ్మతిగ
వారు పలికిన మాటల వినుము.
నీ ప్రయత్నము విరమించు మయా
నన్ను స్పృశించుము- ఆచమించుము.''

మరియొక మార్గము తోచక భరతుడు
మెల్లగలేచి - దోష నివృత్తికి
అన్న పాదములు స్పృశించి అంతట
ఆచమించెను పలికె వినయముగ.

''సజ్జనులారా! శ్రద్ధగ వినుడు
రాజ్యము కావలె నసుచు ఎన్నడును
తల్లిని నేను కోరగ లేదు
తల్లి కోరికలు తెలియవు నాకు.

అయోధ్యలోని సంగతు లెరుగను
ధర్మమూర్తి మా అన్న రాముడు
పితృవాక్య పరిపాలన చేయగ
వనవాసమునకు బయలు దేరెను.

కావున వినుడు పదునాల్గేండ్లు
వనవాసమ్మును నేను చేతును
నాబదులుగను అయోధ్య రాజ్యము
అన్న రాముడు పాలించ వలె.

ఆవిధముగను చేసినచో మరి
తండ్రి మాటకు భంగమురాదు.''-
అనుచు భరతుడు మనసు విప్పగా
పులకితులైరి అచ్చటి వారు.

అంతట రాముడు తమ్ముని గాంచి
తెలియజెప్పెను అనునయమ్ముగ
''తండ్రి నిర్ణయము మార్చెడి హక్కు
మన యిద్దరికీ లేనే లేదు.

వనవసమునకు బదులుగ నేను
రాజ్య పాలనము చేయగ తగదు-
స్పష్టముగాను తల్లికోరినది
స్పష్టతతో మరి తండ్రి యిచ్చెను.

సోదర భరతా! ప్రాణ సముడవు
నీదుభక్తి నేనెరుగుదునయ్యా
భ్రాతృ భక్తికి ప్రతి రూపము నువు
సత్య సంధుడవు సద్గుణ యుతుడవు-

వన వాసమ్మును పూర్తిచేసుకొని
అయోధ్య నగరికి తిరిగి వచ్చెద
నీ సాయముతో రాజ్య మేలెద
తండ్రిమాట పాలింతము నాయన.''

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 112 శ్రీరాముడు స్వర్ణపాదుకలపై పదములుంచి భరతునను గ్రహించుట

ధర్మ తత్పరులు తేజోవంతులు
రామ భరతుల సమాగమమ్మున
ఋషుల హృదయములు పులకించినవి
వారి మమతలకు వారు ద్రవించిరి.

నింగినివున్న దేవఋషులును
వారిద్దరితో పలికిరి అపుడు
''సోదరులారా! మే మందరము
అదృశ్యముగా నుండి వింటిమి.

మీ సంభాషణ లోకోత్తరము
మీ అనురాగము మాటల కందదు
మిమ్ముల గన్న తండ్రి ధన్యుడు
మిమ్ము చూడగా వచ్చితి మిటకు.''

అని ఆ ఋషులు మనసు నిండుగా
ప్రశంసించిరి ఆ సోదరులను
రావణ వధను వారు కోరెదరు
లోక హితమునే అభిలషింతురు.

ఋషులందరును ముక్తకంఠమున
భరతుని గాంచి పలికిరి అపుడు.
''ఓ ధర్మజ్ఞా! సదాచారుడవు
సత్కుల మందు జన్మించితివి.

పరలోకమున తండ్రి సుఖమ్ముకై
రాముని మాటను వినవలె నయ్యా!
తండ్రికి రాముడు ఋణపడ కూడదు
అదియే మేముకోరుకొందుము.

కైకాదేవి ఋణమును తీర్చి
దశరథరాజు స్వర్గమేగెను
వరములు యిపుడు చెల్లక పోయిన
స్వర్గము నుండి రాజు జారును.''

ఆ విధముగను దేవఋషులట
వారితొ చెప్పి అదృశ్యమైరి
మరియొకసారి రామ నిర్ణయము
తలపుకు వచ్చి చలించె భరతుడు.

దిగులు నిండిన భరత కుమారుడు
అయోధ్య రమ్మని అన్న గారిని
పదముల నంటి ప్రార్థన చేసెను
కంట నీటితో జాలిగ అడిగెను.

పదముల వ్రాలిన భరత సోదరుని
ప్రియముగ రాముడు లేవ దీసెను
కౌగిలించుకొని కూర్చొన బెట్టెను
అప్యాయముగా పలికె నప్పుడు.

''సోదర! నీవు భయపడ వలదు
బుద్ధిమంతుడవు సుశిక్షితుడవు
పృధివి నంతటిని పరిపాలించే
శక్తి కలిగిన ధీరుడ వీవు.

మంత్రుల-హితుల విప్రోత్తముల
ఆలోచనలతొ - సామర్థ్యముతో
రాచ కార్యములు నెరవేర్చు మయా
తగు ఏర్పాట్లను తండ్రి చేసెను.

నా నిర్ణయమిది శ్రద్ధగ వినుము
''చంద్రుని కాంతి తగ్గిపోయినను
హిమగిరి పూర్తిగ కరిగి పోయినను
సంద్రము - భూమిని ముంచి వేసినను.

మరి యేమైనా ఎంతటి దైనను
సంభవించుట జరుగునొ? యేమో?
గురు సన్నిధిలో చేసిన ప్రతిన
తప్పుననేను తెలియుము సోదర.

నీపై మమతతొ రాజ్యము కోరెనొ?
నీ ఐశ్వర్యము కోరుకొన్నదో?
కోరిక కోరెను కైకాదేవి-
అది యంతయు నువు మరిచిపొమ్మిక.

మాతృ గౌరవము తల్లికి యిమ్ము
మమతాబంధము తెగనీయకుము''
అనుచు రాముడు ప్రేమగ చెప్పగ
పరవశించిరి అచ్చటివారు.

వశిష్ఠ మహాఋషి మనసు లెరుగును
ఆ సోదరుల మమత లెరుగును
కావునతగిన ఉపాయమ్మును
తెలియ బరచెను అయోధ్యలోనే.

భరతుడంతట అన్నతొ పలికెను
''మహానుభావా! శ్రీ రఘురామా
ఇవిగో గనుము నా పెన్నిధి యివి
రాజ్యమునేలే స్వర్ణ పాదుకలు.

నీ చరణ కమలములు సోకిన యట్టి
ఈ పాదుకలుపవిత్ర మగును
కావున పదములు నిలపుము స్వామీ!
కారుణ్యానిధి కాదన వలదు.

ఈ పాదుకలే జగతికి రక్ష
ప్రజల క్షేమము నిరతము చూచును
అందరి హృదిలో నిలచి పోవును
రామానుగ్రహ మందరి కందును.''

భరతుని కోరిక తీర్చెను రాముడు
స్వర్ణ పాదుకల పాదము లుంచెను
భరతుడు వాటికి ప్రదక్షిణించి
పరవశమ్మున పలికెను అన్నతొ.

''రామప్రభో! నీ రాజ్యభారము
పాదుకలకు నే నప్పగించితిని
వీటితొ నేను పదునాల్గేండ్లు
రాజ్యపాలనము చేయించెదను.

జటా జినమ్ములు నేను ధరించి
కంద మూలములు మాత్రమె తినుచు
రాజ ప్రతినిధిగ ఉందును నేను
నీ పాదుకలే రాజ్యమేలును.

నీదు రాకకై పదునాల్గేండ్లు
నిరీక్షించుచు బ్రతికి యుందును
అపై నీవు రాక పోయినచొ
అగ్నిహోత్రునికి ఆహుతి అయ్యెద.''

ఆ విధముగను భరతుడు పలుకగ
పులకితుడైన రామచంద్రుడు
అభిమానముతో ప్రియ సోదరుని
కౌగిలించుకొని పలికెను అపుడు.

''సోదర భరతా! కైకమ్మను నువు
భక్తి ప్రపత్తుల చూచు కోవలె
నాపై ఆనగ చెప్పు చుంటిని
సీతా లక్ష్మణు లానగ చెప్పితి.''

అనుచు రాముడు కంట నీటితో
భరత కుమారుని కౌగిలించుకొని
అయోధ్య కేగగ ఆదేశించెను
కదల లేకనే భరతుడు కదలెను.

పట్టపు టేనుగు శత్రుంజయము
అచటకు రాగా భరత కుమారుడు
ప్రదక్షిణించి నమస్కరించి
పాదుకలుంచెను కరిశిరస్సున.

రాము డంతట పేరు పేరున
వచ్చిన వారికి అభిమానముతో
శలవును చెప్పి కన్నీరిడెడి
తల్లుల ముఖములు గాంచె నప్పుడు.

అమిత భక్తిగ తల్లులందరికి
నమస్కరించెను కంట నీటితో
ఒక్కసారిగా ఏడ్చుచు రాముడు
నిలబడలేక లోనికి నడచెను.

॥శ్రీరఘురాముడు॥

## 113 రామ పాదుకలతో భరద్వాజముని ఆశీస్సులతో భరతుడు అయోధ్య కేగుట

రామ పాదుకలు శిరమున నిడుకొని
శత్రుఘ్నునితో కలిసి భరతుడు
అరదము నెక్కెను అయోధ్య కేగగ
అనుసరించిరి హితు లందరును.

వశిష్ఠ మహఋషి – విప్రోత్తములు
వాహనమ్ములను అధిరోహించి
ముందుగ సాగిరి – వారి వెనుకనే
భరతుని తేరు సాగెనప్పుడు.

మందాకిని నది ఒడ్డున వారు
గైరిక ధాతువులుండి మెరసెడి
పర్వత సానువులను తిలకించుచు
ప్రయాణించిరి అయోధ్య త్రోవలొ.

భరద్వాజముని ఆశ్రమ తావుల
రథమును దిగెను భరత కుమారుడు
పాదచారియై ముందుకు నడచి
మునికి భక్తిగ వందన మిడెను.

భరతుని గాంచి ముదము నందిన
భరద్వాజముని అడిగెను భరతుని
మనోరధము నెరవేరినదా యని
రామదర్శనము లభించెనా యని.

భరతుడు భక్తిగ విషయము చెప్పెను
రాముని స్థిర సంకల్పము చెప్పెను
వశిష్టు మహాఋషి యోచన చెప్పెను
పాదుక లొసగుట తెలియ బరచెను.

రామ పాదుకలు రాజ్యమేలు నని
రామ ధ్యానమున తానుందు నని
రామ సేవలొ తరింతు ననియు
రామ భక్తుడు భరతుడు చెప్పెను.

భరతుని భక్తి భ్రాతృ ప్రేమకు
పరవశించెను భరద్వాజముని
''నాయన భరతా! పురుష శ్రేష్టుడవు
సదాచార సంపన్నుడ వీవు.

నీరు పల్లమున నిలిచినట్లు గా
అన్నను కొలిచే భ్రాతృ ప్రేమ యది
సహజమైనదిగ నీలో నుండుట
ఆశ్చర్యమ్మది కానే కాదది.

నిన్ను పోలిన సత్పుత్రుని గని
దశరధరాజు మృత జీవు డయె''
అనుచు ప్రేమగా భరద్వాజముని
భరత కుమారుని అభినందించెను.

మునికి భక్తిగా ప్రదక్షిణించి
పాదములంటి నమస్కరించి
ఆశీస్సులను గ్రహించి భరతుడు
అయోధ్య త్రోవలొ సాగె హితులతో.

యమునను దాటిరి అతి తేలికగా
అలుపు లేకను ముందుకు సాగి
శృంగిబేర పుర మందరు జేరిరి
అచ్చటి నుండి సాగె ప్రయాణము.

అచిరకాలము అయోధ్య చేరిరి
సీతారాములు లక్ష్మణమూర్తియు
అగుపించని ఆ అయోధ్య నగరము
భరతుడు గాంచి భాధతొ పలికెను.

''ఓ రథసారథి! అయోధ్య ఇపుడు
పాడుపడినటు కనబడు చున్నది
సంతోషమ్మది కన రాకున్నది
అతి దీనముగా అగబడు చున్నది.''

అనుచు భరతుడు చెప్పుచుండగా
అరదము అయోధ్యలోనికి నడచెను
అన్నలేని ఆ అయోధ్య నగరము
కన్నులే నటు తోచుచున్నదనె.

॥శ్రీరఘురాముడు॥

❀❀❀

# 114 రాముడు లేని అయోధ్య – భరతుని ఆవేదన

అయోధ్య నగరము కళాహీనమై
అగు పించినది భరతునకపుడు
రాజ వీధులలో సందడి లేదు
గుడ్లగూబలు తిరుగుచున్నవి.

కృష్ణ పక్షమున చీకటి నిండిన
నిశిరాత్రివలె తోచె నయోధ్య
అంగారక గ్రహబాధ నందిన
రోహిణి వలెను తోచె నయోధ్య.

ఎండకు కాగిన వేడి నీటిని
పక్షులు త్రాగగ భయపడు చుండి
జలచరములవి కదల లేకను
నీరసించి అట నీట నున్నవి.

పొగ లేకుండగ జ్వాలలు లేచుచు
యజ్ఞజ్వాలగ తోచుచున్నది
ఖండిత సైన్యము నిండిన యట్టి
యుద్ధభూమిలో సేనగ తోచెను.

యజ్ఞసమాప్తి అయిన తదుపరి
వేద ఘోషయది లేనటు వంటి
యాగ వేదికగ తోచె నయోధ్య
సవ్వడిలేక వున్నది నగరము.

అబోతుకోసమై చింతలో మునిగి
పచ్చిక తినని గోవుల మందగ-
పుణ్యము తరిగి పుడమిని రాలిన
తారను బోలి యున్నది అయోధ్య.

వసంత కాలము పూర్తికాగనే
వాడిపోయిన లతవలెనున్నది
చిందర వందర యైనటు వంటి
పానశాలలా తోచె నయోధ్య.

జల భాండములు పగిలి పోవగా
జలమంతయును నేలపాలవ
నాశనమైనచలివేంద్రముగా
అయోధ్య నగరము తోచుచున్నది.

రిపులధాటికి తెగిపడి నట్టి
అల్లెత్రాటివలె నున్నది నగరము
యుద్ధము నందు పరుగిడ లేని
గుఱ్ఱపు పిల్లగ తోచె నయోధ్య.

నీరంతయును ఆవిరి కాగా
జల చరమ్ములవి కనబడుచుండి
కమలమ్ము లవి వాడిపోవగా
కళతప్పిన నడబావిగ నున్నది.

వర్షాకాలపు మేఘము లందు
చిక్కుడి పోయిన సూర్యకాంతివలె
దుఃఖమునున్న సుకుమారునివలె
అయోధ్య నగరము కనబడెనపుడు.

రథసారథితో పలికెను భరతుడు
"ఓ రథసారథి! అయోధ్య లోన
ఆనందమది కనరాకున్నది
మంగళ ధ్వనులవి వినరాకున్నవి.

చందన చర్చలు మానిరి జనులు
గజతురగముల సందడి లేదు
అన్న రామునితొ అయోధ్య శోభ
అడవిలోనికి తరలి పోయినది.

కళాహీనమై కనమడు చున్నది
ఉత్సవాదులు జరుగుట లేదు
గ్రీష్మఋతువులో మేఘమన్నటు
అన్న ఎన్నడు అడుగిడునో యిట.''

ఆ విధముగను భరత కుమారుడు
పలుకుచుండగా ఆతని రథము
సింహములేని గుహవలెనున్న
దశరథు నంతఃపురముకు జేరెను.

సూర్యుని, రాహువు మ్రింగివేయగా
దివారాత్రములు తెలియనియట్టి
కళాహీనమై నున్న భవనమును
భరతుడుగాంచి కంటనీరిడె.

॥శ్రీరఘురాముడు॥

***

## 115 పాదుకా పట్టాభిషేకము

తల్లులందరిని అంతఃపురమున
భరతుడు దింపి - దుఃఖతప్తుడై
వశిష్ఠాదులను గాంచి పలికెను
మదిలో వేదన తెలియబరచెను.

''అంతఃపురమున ఉండగ లేను
అయోధ్యలో నేనుండగ లేను
రాముడు దూరము అన్న బాధయు
తండ్రి వియోగము భరించలేను.

వన వాసములో నున్న రాముని
రాకకు - భక్తిగ నిరీక్షించుచు
నంది గ్రామమున ఉందును నేను
రామ రాజ్యమున వత్తును ఇటకు.

దూరము నున్నచొ దుఃఖము కొంత
తగ్గుననుచును నిర్ణయించితి''
ఆ మాటలకు వశిష్ఠాదులు
శ్లాఘించిరి - ఆశీస్సుల నిడిరి.

సారథి తేరును సిద్ధము చేసెను
తల్లులందరికి భరతుడు మ్రొక్కి
రామపాదుకలు శిరమున దాల్చి
రథము నెక్కెను అమిత భక్తితో.

వశిష్ఠాదులు విప్రోత్తములు
భరతుని ముందర సాగిరి ప్రియముగ
భరతుని వెంట పౌరులందరు
అనుసరించిరి నందిగ్రామము.

నంది గ్రామమును భరతుడు జేరెను
జనులందరును వినగా పలికెను
''ప్రజలారా! మీరందరు వినుడు
ఈ రాజ్యము శ్రీరామచంద్రునిది.

రామ పాదుకలు రాజ్యమేలును
ప్రతినిధిగా నేనుందును ఇచట
ఇల్లడమ్ముగా ఇచ్చిన రాజ్యము
తిరిగి - అన్నకు అప్పగించెద.

రాజ్య క్షేమము ప్రజల ప్రియమును
ఈ పాదుకలే చూచు చుండును
పాదుకలకును ఛత్రము పట్టుడు
ప్రియముగ - అన్న ఒసగెను వీటిని.

రామచంద్రుడు అడుగిడు వరకు
పాదుకలకు నే సేవ చేయుచు
రాజ్య భారము వహించి యుందును
అన్న రాజ్యమును అన్నకిచ్చెద.

అన్న రాగనే పాదములంటి
పాదుకలివ్వి పదముల తొడిగి
రాజ్య భారము అప్పగించెద
రామ పాదముల సేవ చేసెద.

నాకు వచ్చిన అపకీర్తిని - నే
అంతమొనర్చగ ప్రయత్నమిది యగు
అభిషిక్తునిగా అన్నను చూడగ
కీర్తి పెరిగినటు నేను తలంచెద.''

ఆ విధముగను భరతుడు పలికి
ఆనందమది వెల్లివిరియగా
ఆ పురజనులు చూచుచుండగా
రామ పాదుకల కభిషేకించెను.

పట్టాభిషేకము జరిగిన యట్టి
రామ పాదుకలకందరు అపుడు
రామ ప్రభువట ఉన్నటు తలచి
మ్రొక్కిరి భక్తిగ మనసు నిండుగా.

జటా జినమ్ములు వల్కలమ్ముల
మునివలె భరతుడు నందిగ్రామమున
రామ ధ్యానమున రాజ్య ప్రతినిధిగ
రాజ్యపాలనము చేయు చుండెను.

రాముని రాకకు రోజులు లెక్కిడి
రాముని తలపుల ధైర్యము తెచ్చుకు
రాముని రూపము మదిలో నిలిపి
రాజ్యమేలుచు నుండెను భరతుడు.

రామ పాదుకల చెంత కూర్చొని
రాచ కార్యములు విన్న వించుచు
కానుకలన్నియు అర్పించుచును
రాజ్యమేలెను భరతుడు - భక్తిగ.

॥శ్రీరఘురాముడు॥

# 116 చిత్రకూటమును వదలి వెళ్ళు ఋషులు–రామునికి రాక్షస వివరము తెలిపి తమతో రమ్మనుట

చిత్ర కూటమున ఉండెడి ఋషులు
భయపడు చున్నటు రాముడు తెలిసెను!
వినయము నిండి వారిని అడిగెను
మదిలో దిగులు తెలుపగ కోరెను.

''మేమేమైనా అపరాధమ్మును
తపోనిధుల యెడ చేసినచో మరి
తెలియ జెప్పుడు అనుచు అడిగెను''
వారిలో వృద్ధుడు పలికెనప్పుడు.

''రామా! నీవు అయోగ్యమైన
పనిని ఎన్నడూ చేయవు నాయన
మంగళ కారిణి సీత వలనను
లక్ష్మణు వలన తప్పు జరుగదు.

రావణు తమ్ముడు ఖరుడను అసురుడు
క్రూరకర్ముడు యుద్ధ చతురుడు
అపజయమన్నది ఎరుగడువాడు
నర మాంసముతో మదము నిండెను.

జన స్థానమును జేరెను వాడు
ఋషు లందరిని ఇడుమల బెట్టి
అచ్చట నుండి తరిమి వేసెను
వాని అకృత్యము లెన్నో గలవు.

నీవిట నున్నటు తెలిసెను వాడు
వాడు ఇచటకు రానున్నాడని
మాకు తెలిసినది - మేమందరము
భయపడుచుంటిమి కారణమదియే.

అసురుల నతడు పంపు చుండెను
దుష్ట చేష్టలు వారిట చేసి
హడల గొట్టుచు హింస పెట్టుచు
ముదము నందుచు ఉండిరి రామా!

నాయన రామా! ఏదో క్షణమున
ఖరుడిట వచ్చి కష్టము తెచ్చును
యాగ వేదికలు పాడుచేయును
రక్త మాంసములు పడ వేయించును.

కావున మేము ఈ ప్రదేశమును
వదలి పోవగా నిశ్చయించితిమి
దూరము నున్న మా ప్రదేశమును
తిరిగి చేరగ నిశ్చయించితిమి.

మేము ఇప్పుడు వెళ్ళెడి వనము
ఫల జలములతో విశాలమైనది
కంద మూలములు లభించు నచ్చట
మాతో వచ్చిన తీసుకు పోదుము.

ఏదో నాడు ఖరుడు వచ్చును
కావున మాతో రమ్ము నాయనా!
యుద్ధము చేసెడి శక్తి యున్నను-
భార్యతొ నుంటివి భద్రత కావలె.''

ఆ మాటలు విని రామచంద్రుడు
భయము లేదని నచ్చ చెప్పెను
వారిని అచటే ఉండగ కోరెను
కాదని వారు బయలు దేరిరి.

వృద్ధుడైన ఆ కులపతి అపుడు
రామచంద్రునికి ఉపదేశము నిడి
అభిమంత్రించి ఆశీస్సుల నిడి
ఋషులందరితో నడచెను ముందుకు.

రామచంద్రుడు సతి సోదరులతొ
వారి వెంబడి భక్తిగ సాగి -
సాగనంపి మరి తిరిగి వచ్చెను
మునులందరును సాగిరి ముందుకు.

అచ్చట నుండి రామచంద్రుడు
సతి సోదరులతొ వెడలనెంచెను
కానీ అచ్చటి ప్రకృతి శోభ
రామచంద్రుని ఆకర్షించెను.

॥శ్రీరఘురాముడు॥

❇❇❇

## 117 అత్రి మహాముని అనసూయమ్మల సందర్శనము

కొంతకాలము సాగిన తదుపరి
రామచంద్రునికి చిత్రకూటమున
భరతుని భక్తి మదిలో మెదలుచు
తల్లుల మమత తలపుల నిండెను.

వశిష్ఠాదులు, అయోధ్య పౌరులు
మరిమరి రాముని కన్నుల మెదలిరి
ఆ ప్రదేశమును సేన లన్నియు
వాహనమ్ములు త్రొక్కి వేసెను.

అన్నియు తలచి రామచంద్రుడు
ఆ ప్రదేశమును వదల నెంచెను
సతి సోదరులను వెంట నిడుకొని
అత్రిమహాముని దరికి చేరెను.

ఆశ్రమమ్మునకు వచ్చిన యట్టి
సీతారాముల లక్ష్మణమూర్తిని
ఆదరించెను అత్రి మహాముని
తనయుని తీరుగ రాముని చూచెను.

సీతారాములు లక్ష్మణమూర్తియు
ముని పాదములకు నమస్కరించిరి
ముని పుంగవుడు ఆ ముువ్వురకు
సత్కారమ్ములు చేసెను ప్రేమగ.

అత్రిమహాముని ఆనందముగా
వృద్ధురాలును - పూజ్యురాలగు
సతి అనసూయ వద్దకు వారిని
తీసుకు వెళ్ళి ప్రియముగ చెప్పెను.

''సీతా! ఈమె నా ఇల్లాలు
అనసూయమ్మ మహా తపస్విని
అనుచు మహాముని రాముని గాంచి
సతి అనసూయ మహత్తు చెప్పెను.

''రామా! పూర్వము క్షామము కలిగెను
పది వత్సరములు వానలు లేవు
లోకము లన్నియు కాల జొచ్చెను
భీభత్సమది తాండ వించెను.

ఆ సమయములో నా ఇల్లాలు
తపోబలమున - ఫలములు దుంపలు
సృజించి - అందరి కిడినది ప్రేమగ
గంగను అచటికి రప్పించినది.

పది వేలేండ్లు తపస్సు చేసెను
ఋషుల తపస్సును రక్షించినది
దేవ కార్యము తీర్చుట కొరకై
పది రాత్రులను ఒకటిగ చేసెను.

ఈమె చేసిన సత్కార్యములకు
అనసూయ అని పేరు గాంచెను
కోపము ఎరుగని సాధు స్వభావము
సీతా! నీకు తల్లి వంటిది.

జనకనందినీ! ఈమెకు నీవు
నమస్కరించి పూజను చేయుము
శుభమగు నీకు అనుచు మహర్షి
సతి అనసూయ మహిమను తెలిపెను.

రాముడు అపుడు సీతకు చెప్పెను
పుణ్యమూర్తిని పూజించ మనె -
మహాతపస్విని - ముదుసలి వగ్గు
ముడతలు పడిన దేహము ఆమెది.

నెరసిన జుట్టుతొ వణకు చున్నది
ప్రేమాదరణల ముద్దగ నున్నది
సీతారాములు లక్ష్మణ మూర్తియు
ప్రదక్షిణించిరి పుణ్యమూర్తికి.

వారు ముగ్గురు పేరు చెప్పుకొని
నమస్కరించిరి అనసూయమ్మకు
సీతాదేవి కరముల ముడిచి
పుణ్యమూర్తి కుశలమ్మును అడిగెను.

అనసూయమ్మ సీతను గాంచి
ఆనందించి పలికెను అపుడు
"సీతా! నీవు ధర్మ చరితవు
పతియే గతియని నమ్మిన దానవు.

భోగభాగ్యములు కాలతన్నితివి
భర్తతొ అడవికి అనుసరించితివి
నిన్నుగాంచి నా కానందమగు
సహధర్మిణివై పేరు నిలపితివి.

సుఖ దుఃఖములు సమముగ నెంచి
భర్త వెంబడి నుండెడి సతికి
ఇహపరము లవి లభించగలవు
భర్త అడుగుల నడువగ వలెను.

భర్తను మించిన అనురాగమ్మును
ఏ బంధువులు ఇవ్వలేరు గద!
ధర్మ పథమున నడచిన స్త్రీకి
ఇహపర సుఖములు అందును సీతా!

నిరతము నీవు పతి సన్నిధిలో
సహ ధర్మిణిగా నుండుము సీతా!
చక్కని యశము కలుగును నీకు
సర్వ ధర్మములు సమకూర్చునది."

అనుచు ప్రియముగా అనసూయమ్మ
సీతాదేవికి సతీ ధర్మమును
కూతురన్నటు ప్రేమతొ చెప్పెను
పుణ్యమూర్తి ఆశీస్సులనిడెను.

॥శ్రీరఘురాముడు॥

❋❋❋

# 118 అనసూయమ్మ కానుక లిచ్చుట–సీతారామ కల్యాణము–సీతమ్మ అనసూయమ్మకు చెప్పుట

అనసూయమ్మ చెప్పిన దంతయు
శ్రద్ధగ విన్నది సీతాదేవి
భక్తి నిండి వైదేహి పలికెను
''నీవు చెప్పినది యదార్థ మమ్మా!

స్త్రీకి దైవము భర్తని నమ్మెద
సదాచారము భర్త వదలినను
భర్త సేవలు భార్య చేయవలె
స్త్రీకి ధర్మము ఇలలో అదియగు.

నా పెనిమిటి మరి ధర్మ స్వరూపుడు
దయామయుండు విజితేంద్రియుడు
అనురాగమ్ముతొ చూచును నన్ను
తండ్రిని పోలి మేలు చేయును.

తల్లివోలె నను సంతసపెట్టును
నాకాతడు అతి ప్రియతముడమ్మా!
అతిబలవంతుడు సద్గుణ యుతుడు
తల్లులందరిని సమముగ చూచును.

భర్త వెంబడి అడవికి రాగా
కౌసల్యమ్మ నాకు చెప్పిన
సతీ ధర్మములు నిలచెను మదిలో
పతివ్రతల ధర్మమ్ములు చెప్పెను.

కన్యాదానము చేయు సమయమున
అగ్ని ముందర తండ్రి చేసిన
హితబోధ యది మరువరానిది
మదిలో నిలుచును నిరతము నాకు.

పరమ పావనీ! అనసూయమ్మా!
మీరు చెప్పిన మంగళ వాక్కులు
నా మదికెంతో సంతోషము నిడె
పతి సేవలను తపసుగ నెంచెద.

పతి సేవలను చేసిన మీకు
ఇహపరమ్ములు చేతికి దొరుకును
పతి సేవలలో పుణ్య సతియగు
సావిత్రమ్మ ఆదర్శమగు.

పుణ్యస్త్రీ యగు రోహిణి, నింగిని
ముహూర్తమైనను చంద్రుని విడువదు
పాతివ్రత్యమున పూజల నందుచు
దేవ లోకమున ఎందరొగలరు.''

సీత మాటలకు అనసూయమ్మ
ఆనందముతో పులకరించెను
దగ్గర తీసుకు శిరసు మూర్కొని
వరము కోరుమని ప్రియముగ అడిగెను.

జానకి అంతట పలికె భక్తిగ
''మీ వాత్సల్యము అయోఘ వరమది
ఏమి కోరుటో తెలియకున్నది.''
అనగా – సీతకు ఆశీస్సుల నిడె.

అనసూయమ్మ సీతతొ పలికెను
''సీతా! వినుము! సంతోషముతో
దివ్యకానుకలు ఇత్తును నీకు
చిరకాలమ్ము మంగళ మిడునవి.

దివ్య పుష్పముల మాలను ఇత్తును
మంగళ కరమగు చీరయు-సొమ్ములు
అంగరాగము దివ్య గంధము
ముదముగ ఇత్తును అందుకొను మివి.

నేను ఇచ్చెడి సుమహారమిది
దివ్య తేజమును ఇచ్చును నీకు
ఎన్నడు వాడదు - వాసన పోదు
సుమంగళివి - అది శుభముల నిడును.

అనులేపనము మేన నలదిన
అనురాగమ్మది ఇనుమడించును
విష్ణుదేవుని హృదయరాణి యగు
లక్ష్మీదేవిగ సుఖపడ గలవు.''

అనుచు పలుకుచు అనసూయమ్మ
అనురాగమ్ము ఇనుమడించగా
అమోఘమైన కానుకలప్పుడు
అందించినది రామపత్నికి.

సీతాదేవి కానుకలందుకు
భక్తిగ తిరిగి నమస్కరించెను
అంతట అడిగెను అనసూయమ్మ
స్వయంవరమ్మెటు జరిగెననుచును.

'అమ్మా సీతా! రామచంద్రుడు
హరువిలు విరచి నిను చేపట్టెను
ఆనందమగు తలచినంతనే
ఆ విషయము నువు తెలుపుము నాకు.''

సిగ్గు మొగ్గలు జారు చుండగా
సీతాదేవి వినయము నిండి
అనసూయమ్మకు తెలిపెను వివరము
రామచంద్రుని ఘనత చెప్పెను.

''ధర్మచారిణీ! మిథిలాధీశుడు
ధర్మ మార్గమున ధరను ఏలుచు
యజ్ఞము చేయగ సంకల్పించెను
అప్పటి వరకు సంతతి లేదు.

యాగ యోగ్యమగు నేలను అపుడు
నాగళ్ళతో అట దున్నసాగిరి
ఆ మహారాజు ఓషధులను గొని
చల్ల సాగెను నాగటి చాలుల.

ఆ సమయములో భూమి నుండి అట
ఉద్భవించిన - నన్ను గాంచిన
జనక భూపతి ఆనందముతో
నన్ను బిడ్డగా స్వీకరించెను.

నా కూతురు అని జనకుడు అనెను
ఆ మాటలకు అంతరిక్షమున
యుక్తముగా నువు పలికితి వనుచు
దివ్య వాక్కులు విన వచ్చినవి.

గృహమున నన్ను గారాబముగా
తల్లిదండ్రులు పెంచసాగిరి
వివాహ యోగ్యము అయిన సమయమున
ననుగని రాజుచింతలొ మునిగెను.

ధనహీనుడగు తండ్రి మాదిరిగ
దిగులుతొ నిండెను జనక భూపతి
అయోనిజనగు నన్నుందుకొను
వరుడు దొరకడని తండ్రి వేదన.

ఎంతటి సంపద కలిగి యున్నను
ఇంద్రుని యంతటి వాడైనా మరి
అవివాహితయగు పుత్రిక యున్నచొ
సాటివారిలొ చిన్నతనమది.

ఆలోచించగ - ఆ మహరాజుకు
చక్కని యోచన స్ఫురణకు వచ్చెను
వరుణ ప్రసాదిత శివధనుస్సది
మదిలో మెరసెను, ముదము నందెను.

ఎంతో బరువు కలిగి ధనుస్సు
మానవ మాత్రులు ఎత్తగ లేరు
కలలోనైనా తలంచ లేరు
ధనుసు చూపెను మహరాజులకు.

రాజులందరిని మిథిలకు పిలచి
ధనుసు చూపుచు రాజు పలికెను
విల్లును - ఎక్కు పెట్టు వానికి
పిల్ల నిత్తునని వెల్లడి చేసెను.

ఆశతొ ఎందరొ రాజవరేణ్యులు
అమోఘ ధనుసును తాకి చూచిరి
అందుకొనుటకు వశముగా కను
అమిత భక్తిగా నమస్కరించిరి.

కొంతకాలము గడిచిన తదుపరి
కౌశిక మహఋషి యజ్ఞము చూడగ
మిథిలకు వచ్చెను - ఆయన వెంబడి
రామ లక్ష్మణులు వచ్చిరి ఆటకు.

యధావిధిగను భక్తిప్రపత్తుల
మిథిలాధీశుడు కౌశికమునికి
పూజను చేసెను కుశలమునడిగెను
అంతట మౌని విషయము తెలిపెను.

దశరథ తనయులు రామ లక్ష్మణులు
ధనుసు చూడగా వచ్చిరి అనెను
దివ్య ధనుస్సును ఆసోదరులకు
చూపించ మని మౌని చెప్పెను.

అతి కష్టముతో అతి బలవంతులు
ఆ హరువిల్లును తెచ్చిరి అటకు
అవలీలగను రామచంద్రుడు
ఎత్తెను తల్లీ! - విస్మయ పడిరి.

అవ లీలగను అతి హేలగను
లీలామానుష విగ్రహుడపుడు
కేలనెత్తెను శివధనుస్సును
శిరసులెత్తిరి రాజ లోకము.

రెప్పపాటులో పురుషోత్తముడు
అల్లెత్రాటిని బిగించబోగా
ఫెళ్ళున విరిగెను నడిమికి విల్లు
పిడుగులు పడినటు ధ్వనులెగసినవి.

మాట నిలపుకొను సత్యసంధుడు
మది పులకించి అప్పటికప్పుడు
కన్యాదానము చేయుట కొరకై
జల కలశమ్మును చేత ధరించెను.

మిథిలాధీశుడు - అయోధ్య ప్రభువును
ఆహ్వానించెను - అంతయు చెప్పెను
దశరథ ప్రభువు ఆమోదించిగ
కల్యాణమ్మది జరిగెను తల్లీ!

పితృవాక్య పరిపాలన దక్షుడు
పితృ సేవలో అగ్రగణ్యుడు
తండ్రి మనస్సు తెలియక తాను
నన్ను గ్రహించను అనుచు తెలిపెను.

కన్నుల పండుగ నాకల్యాణము
కోమలమూర్తి నను చేపట్టెను
కోరిన పెనిమిటి దొరకెను నాకు
కోటి స్వర్గములు నిలచెను ముందర.

ఆ మాటలకు అచ్చటి వారు
ఆనందించిరి పొగడిరి రాముని
జనక భూపతి విషయ మంతయు
దశరథ ప్రభువుకు తెలియ బరచెను.

రామ ప్రభువుతో నా వివాహము
లక్ష్మణ మూర్తితొ ఊర్మిళ పెండ్లి
శాస్త్రోక్తముగా జరిగెను తల్లీ!
జనకుని హృదయము పులకరించెను.

ఆ విధముగను వీర వరేణ్యుడు
వీర శుల్కయగు నన్ను గ్రహించెను
పతి అడుగులలో నీడ మాదిరిగ
నడచుచుంటిని'' అనుచు చెప్పెను.

॥శ్రీరఘురాముడు॥

❊❊❊

## 119 శ్రీరాముడు–సతి–సోదరులతో దండకాటవికి బయలుదేరుట

సీతారాముల కల్యాణమ్మది
సీతనోట విని అనసూయమ్మ
ఆనందముతో పులకించుచు
సీతను ముదముగ గుండెకు చేర్చెను.

కాంతి మంతుడగు సూర్య దేవుడు
యామిని దేవిని కలుసుకొనుటకై
సాగుచుండెను - సంధ్య వాలెను
పులుగులు చెట్లను చేరుచున్నవి.

శిరసు మూర్కొని అనసూయమ్మ
సీతతొ పలికెను - సుందర వదనా!
మధురముగా నువు చెప్పుచుండగా
కనులకు కట్టిన రీతిగ తోచెను.

సాయం స్నానము చేసిన మునులు
సంధ్య నియమము నెర వేర్చుటకు
శుభ్ర జలమును గొనిపో చుండిరి
అగ్నిహోత్రముల పొగ లెగసినవి.

చీకటి అలముకు నున్న సమయమున
చెట్లన్నియును ఆకులు నిండి
చిక్కగ నున్నటు అగపడుచున్నవి
మృగములు తిరుగుచు అలసి పోయినవి.

తారలతోను అలంకరించుకు
నిశాకాంత తా వచ్చుచున్నది
చంద్రుడు నింగిని శుభముగ నుండెను
మధురమైన నీకథ ముద మగును.

ఇపుడే నీవు మంగళకరముగ
అలంకిరించుకు ఆనందముగా
రామచంద్రుని చెంత చేరుము
ఆనతి నిడితిని ఆలసించకు.

అలంకరించుకు నా కగపడుము
నా కన్నులతో చూచి మురిసెద''
అనగా సీత అలంకరించుకు
అనసూయమ్మకు నమస్కరించెను.

పుణ్యమూర్తి ఆశీస్సులందుకొని
రామచంద్రుని చెంతకు చేరెను
అలంకారములు చూచి రాముడు
మరిమరి చూచెను సర్వమంగళను.

ఆ కానుకలు - దివ్య వస్తువులు
అనసూయమ్మ ఇచ్చిన వనుచు
సీత చెప్పెను - రామలక్ష్మణులు
ఆనందించిరి ఆ మాట విని.

తపోనిష్ఠులు అచటకు వచ్చి
సీతారాముల పూజను చేసిరి
పుణ్యదంపతులు రాత్రి అచ్చట
అత్రి ఆశ్రమము నందు గడపిరి.

ప్రాతఃకాలపు స్నాన సంధ్యలు
నిష్ఠగ తీర్చుకు - సీతారాములు
లక్ష్మణమూర్తియు బయలుదేరిరి
మునులందరు వీడ్కోలు చెప్పిరి.

బయలు దేరెడి రామచంద్రునకు
దండక వనిలో మునుల బాధలు
అసురుల ఆరడి - దుష్టచేష్టలు
వినిపించిరి ఆ ముని పుంగవులు.

అచ్చటి మునులను రక్షించుటకు
అసురులనంతము చేయగ కోరిరి
దండక వనికి త్రోవ చూపిరి
ధర్మరక్షణము చేయగ కోరిరి.

''రామా! అదిగో కాలిబాట యది
దండక వనికి పోవు మార్గము
నీవావనికి సతి సోదరులతొ
సాగుము నాయన! మంగళమగును.''

వివిధ రూపముల దుష్టరక్కసులు
బాధ పెట్టెదరు - రక్త పిపాసులు
క్రూర మృగమ్ములు విరివిగ నున్నవి
అతి మెలకువతో చరించవలెను.''

ఆ విధముగను మునులు చెప్పగా
సీతారాములు - లక్ష్మణ మూర్తియు
భక్తి నిండుగా మునులందరికి
నమస్కరించి ముందుకు నడచిరి.

రామచంద్రుడు సతి సోదరులతో
మేఘము లోనికి సాగు సూర్యుడన
దండకవనికి బయలు దేరెను.
**కోదండమది తొందర జేసెను.''**

❇❇❇

**శ్రీ రఘురాముడు వనముల కేగుట**
**సత్య వర్తిగా తండ్రిని నిలపుట**
**రామ పాదుకలు రాజ్యమేలుట**
**రామాయణమున అయోధ్యా కాండము.**

శు భ ం

మ ం గ ళ మ్.

❇❇❇

# మంగళం

మంగళం - మంగళం - వాయుపుత్ర మంగళం
ఆంజనేయ మంగళం - రామదూత మంగళం
రామచంద్ర మంగళం - జనక సుత మంగళం
సుమిత్ర పుత్ర మంగళం - భరత, శత్రుఘ్న మంగళం
కొలువు తీరు రామునకు - కోదండ ధామునకు
ఎల్ల గృహములందు ఉండి - చల్లగాను చూచేటి
రామచంద్ర మూర్తికి - మంగళం - మంగళం
రామబంటు హనుమకు - మంగళం - మంగళం

❉ ❉ ❉

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

సర్వేజనా స్సుఖినో భవన్తు

శుభం

సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు!

❉ ❉ ❉



శ్రీ మ ద్రా మా య ణ ము

# అరణ్యా కాండము

(గేయ కవిత)

శ్రీ రఘురాముని - రమ్య చరితము
ముని జనములకు - అభయ ప్రదానము
సీతాపహరణము - రామునివేదన
జటాయుమోక్షము - అరణ్యకాండము

శ్రీరామ

# శ్రీమద్రామాయణ అరణ్య కాండము

## (విషయ సూచిక)

అరణ్య కాండము

✤✤✤

శ్రీ మ ద్రా మా య ణ ము

# అరణ్య కాండము

(గేయ కవిత)

శ్రీ రఘురాముని - రమ్య చరితము
ముని జనములకు - అభయ ప్రదానము
సీతాపహరణము - రామునివేదన
జటాయుమోక్షము - అరణ్యకాండము

శ్రీరామ జయరామ–జయ జయ రామ

❋❋❋

శ్లో.. కూజంతం రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరుహ్యా కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్.

❋❋❋

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందర కర్తకు వందనముంచి
రామ భక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన జేసెద.

❋❋❋

ఏక దంతము శూర్ప కర్ణము
చలువ చూపుల చిన్నవాడా –
పార్వతమ్మకు ముద్దు కొమరుడ
విఘ్నరాజా – వందనమ్ము

శ్రీరామచంద్రాయనమః

శ్రీమద్రామాయణము

# అరణ్య కాండము

## 1వ సర్గము శ్రీరాముడు, సీతాలక్ష్మణ సమేతుడై దండ కారణ్యము జేరుట

శ్రీరఘురాముని - రమ్య చరితము
మునిజనములకు- అభయ ప్రదానము
సీతాపహరణము - రాముని వేదన
జటాయు మోక్షము- అరణ్య కాండము.

పితృవాక్య పరిపాలన దక్షుడు
రామభద్రుడు - సీతా సహితుడు
సుమిత్ర తనయుడు అనుసరించగా
కదలెను - కానన సీమల కంతట

రామచంద్రుడు - అమిత విక్రముడు
మృగములు నిండిన దండక వనిలో
పవిత్రమై - అతి రమణీయంబగు
ముని కుటీరముల ముదమున గాంచెను.

కంద మూలములు, ఫలములు తినుచు
ఇంద్రియాలపై నిగ్రహమ్ముతో
నారచీరలు - కృష్ణ జినముల
బ్రహ్మ తేజమున సూర్యాగ్నుల వలె

వేద విదులును బ్రహ్మ జ్ఞానులతొ
తేజము నిండిన పుణ్య మూర్తులతొ
బ్రహ్మలోకమే అన్నటులున్న
ముని అశ్రమముల గాంచెను రఘుపతి.

రామచంద్రుడు శాంతమూర్తియై
ఆశ్రమ సీమలొ అడుగిడు చుండగ
కోదండమును సడలించి - అట
నడచె నచ్చటి తపోసీమకు.

దివ్యదృష్టిగల ఋషిపుంగవులు
ఎదురు వచ్చిరా దివ్యమూర్తికి
ముదము నందిరి మువ్వుర గాంచి
మురిసి పోయిరి పుణ్యము తమదని.

ఉదయ చంద్రుడగు రామ భద్రునికి
సేవా నిరతుడు లక్ష్మణమూర్తికి
పతివ్రతయగు సీతాదేవికి
పలికిరి మంగళ శాసనమ్ములు.

సీతా వల్లభు సౌకుమార్యము
''పుంసాంమోహన'' రూపుని రాముని
ప్రియదర్శనుని - దర్శనమ్ముతో
ముదము నందిరి మునిగణ మంతయు.

ఆ మహాత్మునికి- ఆనల సన్నిభులు
అతిథి పూజలు చేసిరి శ్రద్ధగ
ఆసనమ్మున కూర్చొన జేసి
అంజలు లొగ్గి పలికిరి భక్తితొ

''ఈ ముని కోటికి - రక్షకుడవు నువు
స్వామివి నీవు - మాన నీయు డవు
వనమున నున్నను-పురమున నున్నను
శాశించగల నాథుడ వయ్యా!

జితేంద్రియులము - క్రోధములేదు
దండన చేయగ మునులకు తగదు
నీ రక్షలో - మమ్ముంచుము స్వామీ!
తపోధనులము - నీ యాశ్రితులము''

ఇంద్రుని నాల్గవ భాగము తేజము
అందిన యట్టి ధరణీధవుడు
హెచ్చరికతొ - తన ప్రజలను ఏలుచు
శ్లాఘనీయుడై సుఖముల నందును.

అని పలుకుచు - ఆ సంయమీంద్రులు
దాశరథులకు - జానకి దేవికి
పూజలు చేసి పుణ్యము నందిరి
ఫలమూలముల ఒసగిరి ప్రియముగ.

కావున రామా! కావుము మమ్ము
నీ పాలనలో నుంటిమి స్వామీ
నీ రక్షణలో నుండగ తగుదుము
నీ దయ చూపుము నీరద శ్యామా!

అగ్ని సమానులు - తాపసోత్తములు
న్యాయ వర్తనులు - సిద్ధసాధకులు
ఉచిత రీతిగ భక్తి మీరగ
రామ పూజతో ముదమునందిరి.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 2 విరాధుడు సీతను ఎత్తుకు పోనెంచుట

మునిజన సేవల నందిన రాముడు
ఉదయ కార్యముల తీర్చుకు వెడలి
మృగములు-పులుగులు-పూపొదలుండి
తరువులు నిండిన వనమున సాగెను.

నిలచెను గిరివలె - దారి కడ్డముగ
రాముడు గాంచెను వికృత రూపుని
దనుజుడు - మనుజుల గాంచిన వాడై
వడిగా - భీకర గర్జన చేయుచు

భీకర కానన మందున-ముందొక
భయంకరమగు పర్వత కాయుని
క్రొత్తనెత్తురు కారుచుండెడి
పులి చర్మమును కట్టుకు నిలచిన

సీతాదేవిని గ్రక్కున చేకొని
ఒడియందుంచుకు పలికెను క్రూరుడు
''ఋషుల వేషము - చేత ధనుసులు
భార్యతొ - అడవుల స్వేచ్ఛ విహారమ?

త్రిలోకముల కబళించగ చాలిన
పెద్దనోటితో - నాలుగు పులులు
వృకములు రెండు - పది దుప్పులును
కరితల - శూలమునందు గుచ్చుకొని

ఎవ్వరు మీరు? పొగరుతొ నుండిరి
మునుల కీర్తికి కళంక మేర్పడు
నే విరాధుడను-వీరుడ, వినుడు-
మునులను తినుచు తిరుగు చుందును.

నెత్తురు త్రావెద-చంపెద నిపుడే
భామను - భార్యగ చేసికొందును''
ఆ మాటలకు అవనిజ భయపడె
వణకెను గాలికి కదళీ తరువన.

భయపడి వణకెడు సీతను గాంచి
దుఃఖము నిండి రాముడు పలికెను
''లక్ష్మణ! గనుము-జనకనందిని
నా యిల్లాలు-సుమసుకుమారి

సుఖముల తేలగ సిరిగల దయ్యా
భయ విహ్వాలయై వణకుచున్నది
భీకర వనిలో - సుమిత్ర తనయా!
భూమిజ కెంతటి ఆపద వచ్చెనొ.

ఏమికోరి ఆ కైక మమ్ములను
కానలకంపెనొ - అది నెరవేరెను
రాజ్యము కోరియు - కానకు పొమ్మని
కోరిన కోరిక - ఇందుకే గదా!

తండ్రి మరణమున కలిగిన దుఃఖము -
రాజ్యము పోయిన దుఃఖము కన్నను
అన్యుడు - ఆలి తాకుట వలన
కలిగిన దుఃఖము నుడువ లేనిది.''

శోకతప్తుడై కన్నీరిడెడి
అన్నను గాంచి - ఫణివలె బుసలతొ
పలికెను అపుడు రామానుజుడు
''అన్నా! వదలుము దుఃఖము నీవు.

భూత కోటికి రక్షకుడవు - నువు
దిక్కులేనటు దుఃఖమునందకు
నీ దాసుడను - నా అస్త్రములతొ
నా భుజ బలమున దనుజుని కూల్చెద.

వేగముతో-నే విడచిన శరములు
వీని రొమ్మును చీల్చును వినుము
అసువులు వీడి - అసురుడు రాలును.''
ధైర్యోక్తులను పలికెను తమ్ముడు.
॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 3 రామ లక్ష్మణులు విరాధునిపై శరములు వదలుట

లక్ష్మణమూర్తి రక్కసు గాంచి
నవ్వుచు అడిగెను - నీ వెవ్వడవు?
వనమున ఏల తిరుగుచుంటివి.
అంతట అసురుడు అరచె నచ్చట.

''నా స్థలమునకు వచ్చిన మీరు
నన్నెవ్వడవని అడుగుచుండిరా?
తెలుపుడు ముందు - మీరలెవ్వరు?''
తీరుగ తెలిపెను - వీరవరేణ్యుడు.

''ఓరీ! వినుము-ఇక్ష్వాకులము
క్షత్రియ వంశ సంజాతులము
వనమున తిరిగెడి వానప్రస్థులము
నీవీ వనమున-తిరుగుట ఏల?''

''జయుని కుమారుడ-అతి బలవంతుడ
తల్లి - శతహ్రద - నే విరాధుడను
బ్రహ్మచె వరమును పొందితి నేను
అస్త్రశస్త్రముల మరణము లేనటు.

నరకిన-చీల్చిన-చావను నేను
చావరు మీరు పారిపోయిన
అబలను వదలిన - చంపను వినుడు''
అన విని రఘుపతి కోదండముతో

క్రోధము నిండి ఫాలనేత్రుడై
''దనుజ కులాధమ-మృత్యు దేవతను
వెదకుచు వచ్చితి విచటకు నీవు''
అనుచు తీవ్రముగ శరమును తీసెను.

ఘన కోదండము నెక్కు పెట్టెను
ఖగపతి వేగము కలిగిన శరములు
బంగరు పిడిగల ఏడు శరములు
రాముడు విడువగ అసురునిపైన.

దనుజుని ఱొమ్మున దూరిన అమ్ములు
చీల్చి - ధరణిలో జొచ్చినవంత
నెత్తురు మడుగై ప్రవహించినది
బాధతొ అసురుడు - సీతను దింపి

సింహనాదమును చేయుచునంత
దూకెను - సోదరు లిద్దరివైపు
శరవిన్యాసము చూపుచువారు
శర వర్షము కురిపించిరచ్చట.

''మీ శరములివి నాకొక లెక్కా!''
అనుచు అసురుడు దేహము పెంచెను
దేహమునున్న శరములు రాలెను
తిరిగి రాముడు వదలెను శరములు.

రక్కసు డంతట క్రోధమునిండి
విసరెను ఘనమగు శూలము నొకటి
అంతట-రాముడు రెండు బాణముల
నేలరాల్చెనా శూలము నచట.

ధైర్యము నిండి దాశరథులట
దైత్యుని కొట్టిరి ఖడ్గమ్ములతో
ప్రళయ కాలమున యముడై అసురుడు
ఇద్దరి నెత్తుకు ఎగిరెను నింగికి.

రాముడు పలికెను లక్ష్మణమూర్తితొ
''అడవిలొ - త్రోవ తెలియక పోయెను
అసురుడేగగ త్రోవ తెలియును
చూతుము అసురుని శక్తి యుక్తులు.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 4 విరాధ వధ

బాలుర నెత్తుకు పోయెడి తీరుగ
అసురుడు - సోదరులిద్దరి నెత్తుకు
పరుగు తీయగా - సీతాదేవి
బిగ్గరగా విలపించినదచట.

''దానవుడా! ఈ దారుణ వనిలో
భీకర మృగముల పాలబడుదును
మ్రొక్కెదనీకు - వదలుము వారిని
నను గొని పొమ్ము-అసువులు తీయుము.''

సీత దుఃఖము వినిన సోదరులు
త్వరపడి రచ్చట - అసురుని కూల్చగ
దక్షిణ - వామ హస్తమ్ములను
రామ లక్ష్మణులు నరకి వేసిరి

అసురుడు అటుల చావడు అనుచు
తెలిసిన వారై - వీరు లిద్దరును
పిడికిట పొడిచి కాళ్ళతొ తన్ని
మర్ధించి - మరి నేలకు రాల్చిరి.

రాముడు అనెను ''బ్రహ్మ వరమది
శస్త్ర ఘాతముల - చావడు వీడు
కావున వీనిని - పల్లములోనికి
త్రోసి-పూడ్చిన-చచ్చును తప్పక.

ఆ మాటలను వినినంతటనే
జ్ఞానము కలిగెను దనుజునకపుడు
పలికెను - వినయము, భక్తి నిండగ
''రామా! నువ్వే - చంపవలెనయా!

కౌసల్యాసుత! కరుణామూర్తీ!
తెలిసితి నిన్ను పురాణ పురుషా!
తల్లిని గాంచితి - తమ్ముని గాంచితి
తప్పు క్షమించి - బ్రోవుము స్వామీ!

తుంబురుడను గంధర్వుడ, నేను
రంభతొ కూడి - సర్వము వీడి
చరించినందుకు - ధనపతి శాపము
దనుజునిగా ఇట జన్మనెత్తుట

దయగొని ధనపతి పలికెను అపుడు
దశరథ తనయుడు రామచంద్రుడు
దనుజుడ వగునిను అంతము చేయగ
శాపము తొలగును - పాపము తీరును

శ్రీ రఘురామా! నీదయవలన
భీకరశాప విమోచనమైనది
మీ దర్శనమున ధన్యుడనైతిని
దయాసింధు! నన్నను గ్రహించుము.

మేలుకలుగును మంగళమూర్తీ!
ఇటుగా ఒకటిన్నర యోజనమున
సూర్య తేజుడగు శరభంగుడను
మహబుషిగలడా మహితమూర్తిని

దర్శించుమయా! దయాసాగరా!
నన్నొక పల్లములోన పూడ్చుము''
అనగా-రాముడు-కరికి పరిపడు
పల్లము చేయగ ఆదేశమునిడె.

రామలక్ష్మణులు దనుజనకపుడు
శాపము తీర్చిరి - అసువులుతీసి
బంగరు ధనుసులు దాశరథులుగొని
సాగిరి దండక వనిలో ముందుకు.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

# 5 శరభంగ మహర్షిని దర్శించుట

వేగమె వచ్చి సీతను చేరి
భయమును తీర్చి - జానకీపతి
భీకర వనమిది - ఇపుడే మనము
శరభంగుని గన పోదము అనెను.

ఆశ్రమతావుకు పోయినంతనే
రామచంద్రుడు గాంచెనచ్చట
సూర్యతేజుడగు సురనాయకుని
గగన యానమున సాగెడి వానిని.

ఆకు పచ్చని హయముల రథము
చంద్రబింబమగు తెల్లని ఛత్రము
దివ్యా భరణములెన్నో దాల్చిన
ఇంద్రుని గాంచెను - ఆశ్రమమందు.

దేవ సుందరులు కరకమలముల
బంగరు పిడుల చామరమ్ములతో
వీచుచుండిరి-సిద్ధులు, ఋషులు
సుర-గంధర్వులు స్తోత్రము చేయగ.

శరభంగునితో - సంభాషించెడి
ఇంద్రునిగాంచిన రామచంద్రుడు
''వివరము తెలుసుకు వచ్చెదనిపుడు
నిలువుము ఇచటే'' అనె తమ్మునితో.

రాముడు వచ్చుట గాంచి వాసవుడు
మునితో పలికెను -''నే పోయెదను
నేనామానవ మూర్తిని - ఇపుడే
దర్శించుట మరి తగదు మునీంద్రా!

రామచంద్రుడొక దుష్కరకార్యము
చేయగ వలెను - ఆ ఘన కార్యము
అసాధ్యమైనది మరియొక వ్యక్తికి.''
అనుచు పలుకుచు వెడలె శచీపతి.

వాసవు డేగుట గాంచిన రాముడు
తిరిగివచ్చి తన సతి - సోదరులతొ
అగ్ని హోత్రముతొ ప్రకాశించెడి
ముని కుటీరమున అడుగు బెట్టెను.

రామచంద్రుడు మహఋషికచట
శిరసును వంచి మ్రొక్కెను భక్తితొ
ముని ఆ ముువ్వర కూర్చొన జేసెను
రాముడు అడిగెను వాసవు వివరము.

''దాశరథీ! నే - తపసును చేసి
క్షుద్రుల కందని బ్రహ్మ లోకము
చేరగనర్హత కలిగి యుంటిని
ననుగొని పోవగ వచ్చె వాసవుడు.

నీవు వత్తువని తెలిసితి రామా!
నిను దర్శించగ వేచియుంటిని
పుణ్య లోకములు, సత్యలోకముల
మించిన శ్రేష్ఠము నీ దర్శనము.

పుణ్యలోకముల సుఖములు రామా!
పుణ్య వశమున నాకు లభించెను
అవి నీకొసగెద - గ్రహించు తండ్రీ!''
అనగా రాముడు పలికె ప్రియముగ

''మునిపుంగవ! నీ సుకృతమ్ములను
అనుభవించుము - మేము వసించగ
తగు ప్రదేశమును చూపుము నీవు''
అనగా ప్రాజ్ఞుడు - శరభంగుడు అనె.

''వాసయోగ్యమగు స్థలమును మీకు
సుతీక్ష్ణుడను-ముని-తెలియబరచును
మందాకినికి ఎదురుగ నడచిన
పూవుల తెప్పలు నదిలో గననగు

ఆ మార్గము మీరేగ వలసినది
రామా! తాళుము - యిపుడే నేను
సర్పము కుబుసము విడచినట్టుగ
విడతును దేహము-నిను దర్శించితి''

అని పలుకుచును మునిపుంగవుడు
తపోబలమున అగ్ని రగిల్చి
మంత్రోచ్ఛారణ చేయుచు - తనువును
అగ్ని హోత్రుని వశమొనర్చెను.

ఆహుతియైన ఆ శరభంగుడు
దివ్వ రూపమును పొందినవాడై
దేవలోకమును దాటి - అంతట
బ్రహ్మలోకమును చేరె - పుణ్యమున.

స్వాగత వచనము పలికె - విధాత
ముని శక్తిని ఆ ముప్వురు తెలిసి
ఆశ్చర్యాబ్ధిని మునిగి తేలిరి
తిరిగి వారు తమ త్రోవను సాగిరి.

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 6 ముని పుంగవులకు అభయ ప్రదానము

తేజోవంతుడు రామచంద్రుడు
వాలఖిల్యులను - తపోధనులను
వైఖానసులను - ఋషి పుంగవులను
వాయు భక్షకులు - అగ్ని తేజులను

పత్రమ్ములనే తినెడి ఋషులను
జలాహారమున బ్రతికెడి వారిని
నిద్ర యెరుగని ఋషి సత్తములను
ఆరు బయలులో తపసులొ నుండెడి

జలమున - తపములు ఆచరించెడి
యోగ నిష్ఠలో మునిగిన మునులను
ఇంద్రియాలను జయించినట్టి
పుణ్య మూర్తులను వనమున గాంచెను.

ధర్మ శీలురు నిర్మల హృదయులు
బలశాలిని శ్రీరాముని గనిరి
పలికిరి ప్రియముగ-స్తోత్రము చేసి
''ఓ రఘుసత్తమ-పురుష పుంగవా!

సురలలొ - ఇంద్రుడు పుట్టినట్టుగ
ఉదయించితివి రఘువంశమున
ధర్మ నిరతుడవు - సత్యావాదివి
పితృవాక్య పరిపాలన దక్షుడ!

ధరణీ నాథుడ వీవేనయ్యా!
దాశరథీ! జగమెల్ల నుతించును
ధర్మ వత్సలా! దయగొను స్వామీ!
నీ ఆశ్రయమును గోరితిమయ్యా!

కన్నబిడ్డల మాదిరి ప్రజలను
తన ప్రాణముగా ఎంచుకొనుచును
భూమి నేలెడి - రాజు - కీర్తితో
బ్రహ్మలోకమున గౌరవ మందును.

సంపాదనలో ఆరవ భాగము -
రాజున కిత్తురు ప్రజలు - కప్పముగ
నాల్గవ వంతు తపఃఫలమును
ఋషులు ఇత్తురు తమ రక్షణకై

అర్తత్రాణ పరాయణ - రామా!
ఆశ్రయించితిమి - వాన ప్రస్థులము
దుష్ట రక్కసుల బారినుండి - మము
రక్షించుమయా రఘు కులతిలకా!

ఓ రఘురామా! కరుణాధామా!
కనబడునవిగో మునుల ఎముకలు
రక్కసులందరు తినగా మిగిలెను
దక్కుట కష్టము మిగిలిన మునులము

మందాకినితటి పంపాతటముల
చిత్ర కూటమున వసించు దనుజులు
ఋషులను బాధలు పెట్టుచుండిరి
శరణు జొచ్చితిమి - కరుణతొ నేలుము

భూతల మందున జానకీపతీ!
నిన్ను మించిన రక్షకు లెవ్వరు
అతి బలశాలివి శరణు వేడితిమి
బాధలు బాపుము - భగవత్సముడవు.''

అనవిని - రాఘవుడనెను వారితో
వినయము - భక్తినిండి పలికెను
''మీరు మహాత్ములు - మీరిటు నన్ను
అడుగుట తగదు - ఆజ్ఞాపించుడు.

స్వకార్యమ్ముగా కానన సీమకు
వచ్చితి - పాపుల త్రుంచెద నిచ్చట
శుభములు కూర్తును సంయమీంద్రులకు
తండ్రి వాక్యమది వరముగ నెంతును.

మీ విరోధులను - తమ్ముని అండతొ
బాహు బాలముతో త్రుంచెద ఆజిని''
అనుచు రాముడు అభయము నొసగి
సాగెను సుతీక్ష్ణ ఆశ్రమత్రోవలొ.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 7 సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమమున కేగుట

సాగనంపగా వచ్చెడి మునులతొ
ముచ్చట లాడి - దూరము సాగి
నదిని దాటి మరి ముందుకు నడచి
అంజనాద్రివలె ఎత్తగు గిరిని

నల్లని మేఘము పోలిన ఘనమగు
గిరినిగాంచి - అట సుందర స్థలము -
ఫలముల - సుమముల శోభిలు గిరులతొ
ఆర వేసిన నారచీరలతొ.

శుభా(శమమ్మును గాంచిరి వారు
అందు జడలతో దుమ్ము పారిన
శరీరమ్ముతో కూర్చొని యున్న
పాపరహితుని - సుతీక్ష్ణుగాంచిరి.

వినయముతో శ్రీరాముడు పలికెను
''తాప సోత్తమా! రాముడ నేను
నిను దర్శించగ వచ్చితి స్వామీ!
దయా వీక్షణము నాపై చూపుము.''

అనగా మౌని ఆనందముతో
కౌగిలించుకొనె రఘునందనుని
''సేమమా'' యని - సీతాపతిని
ప్రియముగ కుశలము నడిగి అంతట.

''దాశరథీ! నీ రాకతొ ఈ వని
పవిత్రమైనది - సనాథయైనది
నీ రాకను - నే తెలిసితి రామా!
వేచి యుంటిని తనువు వదలక

కకుత్థ్సవంశ కులదీపకుడవు
కౌసల్యాసుత - కారుణ్యాలయ
భార్య సీతతో తమ్ముని తోను
నార చీరలతొ చిత్ర కూటమున

విడిసి యుంటివని వింటిని రామా!
పుణ్యలోకమును సంపాదించితి
ననుగొని పోవగవచ్చె శచీపతి
కానీ, వేచితి నిను దర్శించగ.

పుణ్యలోకముల సతి, సోదరులతొ
విహరించుము నువు ఓ రఘునందన!''
కశ్యప మహాఋషి - బ్రహ్మతొ పలుకుట
తలపించునటు పలికెను రాముడు

''నీ సుకృతము తపస్సు ఫలమది -
నే నిలచుటకు అనువగు స్థలమును
తెలుపుము స్వామీ! నీ హితబుద్ధి
తెలిసితి నేను - శరభంగునిగని''

అనగా ముదముతొ ముని పలికెనట
''రామా! రమ్యము - ఈ ఆశ్రమము
ఈ భూములలో ఫల-సుమములవి
పుష్కలమ్ము-మరి భయము ఉండదు.

విచ్చలవిడిగా తిరుగు మృగములతొ
కొంత విఘ్నము తపసుకు కలుగును
కావున ఇచ్చట వసింపు'' మనగా
రాముడు పలెకును సుతీక్ష్ణమునితో

''క్రూరమృగములను చంపుట వలన
మీ మనస్సుకు దుఃఖము కలుగును
కావున ఇచట వసించుట నాకు
ఉచితముగాదు'' - అని పలుకుచును

సాయంసంధ్యాకృత్యము తీర్చి
ముని ఆతిథ్యము ముదమున పొంది
సీతా- లక్ష్మణులిద్దరితోను
బడలిక తీరెను రాత్రి అచ్చట.

||శ్రీ రఘురాముని||

✽✽✽

## 8 సుతీక్ష్ణ మహర్షి శలవు నందుకొని సాగుట

వేకువయందే రామచంద్రుడు
సీతయు-తమ్ముడు-కమలములున్న
సరస్సునందు స్నానముచేసి
కర్మసాక్షికి పూజను సలిపి

సుతీక్ష్ణమునిని సమీపించెను
అంజలి యొగ్గి పలికె వినయముగ
''ఓ మునిశ్రేష్ఠా! నీ ఆశ్రమమున
సుఖముగ గడిచెను రాత్రి యంతయు

శలవు నొసగుము సాగెదమయ్యా!
దండక వనిలో మునిపుంగవులు
రమ్మని కోరిరి పోయెదమచటికి
అనుగ్రహించుము తాపసోత్తమా!

అనుచిత రీతిగ ధనమార్జించి
నడిమంత్రపుసిరి నందిన - దుష్టుని
తలపించునటు - భానుడు - నింగిని
కొరవిచేతులను చాచకముందే

ఎండతీక్ష్ణత ఎదగకమునుపే
శలవునిమ్ము'' అని చరణములంటగ
కౌగలించుకొని ముని పలికెనట
''జనకజ ఛాయగ అనుసరించగా

సుఖముగ నీవు సాగుము స్వామీ!
పుణ్య మూర్తులగు ఋషిపుంగవులు -
విరిసిన తామరలున్న కొలనులు
నిత్యము పూసే తరుల గిరులతో

నెమళుల కేకారవములతోను
మదికానందము కలుగ చేయును
లక్ష్మణమూర్తీ! సాగుడు మీరు
సౌఖ్యముగా మీ పయనము సాగును

రాక్షసాంతకా! నా ఆశ్రమమున
తిరిగి ప్రియముగా వేంచేయు'' డనె -
ముని దీవనలు పొందినవారు
బయలు దేరుటకు సిద్ధముకాగా

త్రిభువన సుందరి సీతాదేవి
పదును కత్తులు - శరచాపమ్ములు
దాశరథులకు ఇచ్చినయంత
వాటిని దాల్చిరి - ముందుకు నడచిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 9 శ్రీరామునికి సీతాదేవి హితోక్తులు

కాననమందు సాగు సమయమున
ప్రేమాస్పందిత హృదయమునిండి
పలికెను సీత - రామచంద్రునితొ
మధుర వాక్యముల-పతితో పలికెను.

''ప్రాణేశ్వర- యీ వాన ప్రస్థమున
కామజ వ్యసనములన్న మూడును
అసత్యమాడుట - పరస్త్రీ భోగము -
నిష్కారణముగ హింసను చేయుట

మూడు వ్యసనములు వదలగవలెను.
అందు మొదటిది రెండవదీను
మదిలోనైనా తలచవు స్వామీ!
మిగిలిన మూడవ వ్యసనము వదలుము.

లక్ష్మణాగ్రజా! సత్యధర్మముల
చలించనట్టి మదిగల వాడవు
మూడవ విషయము - వైరము లేకయె
ప్రాణిహింస మరి తగునా నాథా!

మహాభాగ! నువు దండక వనిలో
తపసుల హేతువు మదిలో నిలపి
అసురుల జంపగ ప్రతిన గొంటివి
అందుకె నీకీ శర - చాపములు.

యుద్ధోన్ముఖులై ఉన్నటులుండిరి
హితముగోరి - నే పలుకుచుంటిని
దనుజుడు కనబడ శరమును విడతురు
అది కారణము పగ పెరుగుటకు

అగ్నిహోత్రునకు కట్టెల సాయము
పెంచును బలతేజమ్ముల-నటులే-
క్షత్రియ ప్రభువుకు చేతనాయుధము
పెంచును రోషము- బల- తేజమ్ములు

ప్రాణేశ్వర! విను, పూర్వకాలమున
సత్య ధర్మముల చరించునొక ముని
జంతు కోటికి దయా పూర్ణుడై
తపమున నుండగ - విఘ్నము చేయగ

వాసవుడపుడు భటుని రూపమున
మునినిగాంచి - ఒక ఖడ్గము నిచ్చి
''దాచుము ఖడ్గము - తిరిగి వత్తును
అంతవరకును కాపాడుమనె''

ఖడ్గము నందుకు తాప సోత్తముడు
చోర భయమున - దానిని తనతో
అహోరాత్రములు ఉంచుకొనుటచే
మునిలో కలిగెను కోరిక యనునది.

కోరికతో మరి రౌద్రము కలిగెను
దానితొ మతిచెడి క్రూరకర్ముడయె
ధర్మవిదుడగు తాప సోత్తముడు
దుర్గతి పొందెను ఖడ్గస్నేహమున

నే నుడివినది సత్యము స్వామీ!
శస్త్ర సంయోగము కీడు తెచ్చును
అగ్నిహోత్రము కాల్చును కట్టెను
ధరించువానిని ఖడ్గము చెరచును.

చనవున చెప్పితి స్వామీ వివరము
నీకు తెలియని ధర్మము కాదిది
జ్ఞప్తి తెచ్చుటకు నుడివితి నిటుల
ముని వృత్తికి - మరి ఆయుధమేల?

ఆయుధ బలము గర్వము పెంచును
పగలేనట్టి వారల త్రుంచుట
సరికాదని-నా మనసుకు తోచును
జనపాలక! విను హితము నుడివితి.

అడవుల తిరిగెడి వీరులు రాజులు -
ఆర్తరక్షణము చేయగ తగుదురు
అంతియెగాని అకారణముగా
పరుల దండన చేయగ తగదు.

రాజ్యము - భోగము వదలిన నీవు
వనమున మునివలె నడచిన - స్వామీ!
ముదము గలుగును అత్త-మామలకు
మాన్యుడ! వీడుము - శస్త్రమ్ములను.

క్షాత్రమునకును - మౌనివృత్తికి
శస్త్రమునకును - తాపస వృత్తికి
పొంతన కుదరదు విరుద్ధమైనవి
దేశ కాలముల చరించనగును.

అర్థము కలుగును ధర్మముతోను
సుఖముల నిడునది ధర్మమె కాదా!
సత్కర్మ హేతువు ధర్మమె అగును
లోక హితమ్ము - ధర్మమే కదా!

కావున స్వామీ! కాననమందు
శస్త్రముదాల్చగ వలదయ్యా విను!
అయోధ్య నగరికి జేరినయంత
క్షాత్రవిధిగ మరి ధరించు శస్త్రము.

సత్యమైన సుఖమన్నది కావలె
కఠోర వ్రతము అనుష్ఠించగ
ధర్మము పూర్తిగ అలవడు స్వామీ!
సౌమ్యుడ! నీకు తెలియని దాయిది

అడవుల తిరుగుచు - అహింసవ్రతముగ
చరించరాదా ఓ ధర్మాత్మా!
నుడివితి నేను స్త్రీ చపలతచే
మీకు తోచినటు చేయుడు మీరు.''

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 10 శ్రీరాముడు తన స్థిర చిత్తమును సీతకు తెలుపుట

అమిత భక్తితో - పతిహితమతియై
సీత పలికిన పలుకులు వినిన
రాఘవుడనెను - ధర్మబుద్ధితో
''నీవు నుడివిన ధర్మము వింటిని.

దిక్కని నన్ను - వేడిన వారిని
పో-పొమ్మని నేననగా తగునా!
అడవులయందు కంద మూలములు
తినుచు - ధర్మమున చరించు వారిని

ఆర్త రక్షణచేయగ - రాజులు
చాపము దాల్చగ తగునని- నీవే
నుడివితివిపుడే దేవీ! వినుము
ముని పుంగవులు - మహాను భావులు

దనుజులు హింసలు పెట్టుచుండగా
విడువని వైరము - పూనిన అసురుల
త్రుంచుట- అగునెటు ధర్మ విరుద్ధము?
దండక వనిలో మునులందరును

దుఃఖము నిండి ఇడుములు తెలుపగ
కావుము అనుచు ప్రార్థన చేయగ
వారి పాదముల నమస్కరించితి
వారై స్వయముగ వచ్చిన వారితొ

నేనై మిమ్ముల చూచుట ధర్మము
కావున కోరుడు - అనగా వారు
ముక్త కంఠమున దండక వనిలో
శాంతి నిలుపమని ప్రార్థన చేసిరి.

రక్షకుడెవరని చూచుచుండగా
పుణ్య వశమున వచ్చితి వనిరి
తపోబలమున శపింపగలిగియు
వ్యర్థము చేయము తపమని పలికిరి.

నేనే దిక్కని వేడిరి వారు
వేరు రక్షకులు లేరని నుడివిరి
అంతట - రమణీ! వారికి అచ్చట
అభయము నిచ్చితి - ఆడి తప్పను.

నా ఆశ్రయమున నిలచిన వారిని
సాధు స్వభావము నిండిన వారిని
జీవ హింసతో అసురులు చంపగ
అట్టి అసురులు-నా విరోధులే!

అసువులనైనా విడిచెద వినుము-
నిన్నయినను - నా తమ్ము నయినను
విడచెద-విను-నా ప్రతిన విడువను -
భూమీసురులకు చేసిన బాసది.

కోరకున్నను నేనేపోయి
రక్షించుటది నా ధర్మమ్ము-
అట్టివారికి అభయము నిచ్చి
ప్రతిన విడచుట తగునా లలనా!

నేయ్యమునిండి హితమును కోరి
ప్రియముగ పలికిన ధర్మపత్నివి
జనక వంశపు కీర్తికి తగినటు
సౌశీల్యముతో పలికితివీవు!

సహ ధర్మిణివి - ఛాయగనుంటివి
ప్రాణము కన్నను మిన్నగ నెంచెద''
అనుచు పలుకుచు రామచంద్రుడు
సాగెను - ముందుకు సతి సోదరులతొ

||శ్రీ రఘురాముని||

## 11 తిరిగి సుతీక్ష్ణ సందర్శనము-అగస్త్యమహర్షి దర్శనకాంక్ష

కోదండముతో రాముడు ముందై
నడుమ జనకజ - వెనుక లక్ష్మణుడు
ప్రణవ మంత్రమే నడచుచున్నటు
ఓం కారమువలె నడచిరి ముగ్గురు.

వికసిత కమలము-కలువలు-సుమముల
పరిమళ భరితము మలయా నిలము
తుమ్మెద ఝుంకారమ్ముల రవము
నదీ నదములు పవిత్ర జలములు-

అడవి దున్నలు - మదకరీంద్రములు
వనసూకరములు - పెను బాములను
సింహములుండెడి గుహలను చూచుచు
సాగిరి ముచ్చురు దండక వనిలో

సాయంసంధ్యా సమయములోన
తేట నీటి తటమచ్చట గాంచిరి
కలువలు - హంసలు శోభిలుచుండగ
మధురమైన సంగీతము వినబడె.

వీణా-వేణు మనోహర ధ్వనులు
వినగా-చిత్రము - వివరము లేమని
వెనుక వచ్చెడి 'ధర్మభృతు'డను
మునిని అడిగెను రామచంద్రుడు.

రామా! వినుమని ముని పలికెనట
''మాండకర్ణి'' యను ఋషి పుంగవుడు
తపస్వి- ఆతడు తపో బలముచే
నిర్మించెను యీ తటాకమ్మునిట.

జలములు నిత్యము నిలచును యిందు
'పంచాప్సరము' దీనికి పేరు
నిరాహారుడై పదివేలేండ్లు
జలమున తపమును చేసెను మౌని

ఘోర తపస్సుకు సురలు భయపడి
ఏ పదవిని యీ ముని కోరునోయని
భయముతొ తపసుకు విఘ్నము తేగా
తలచి - తరుణులను పంపిరి అపుడు

మెరుపు తీగలై మెరసిపోయెడి
మేనితొ అచ్చర కన్నెలైదుగురు
మునికన్నులలో మిలమిల మెరిసి
మనసు దోచిరా మునిపంగవునిది

ఆత్మ దర్శనము చేసిన మౌని
విరిశరములగురి తప్పకపోగా
యోగ బలముచే జలముల సౌధము
నిర్మించుకొని సుఖముల తేలెను

రామచంద్ర! విను - యౌవ్వన వంతుడు
తరుణుల వశమున సుఖముల తేలుచు
ఆటల-పాటల ఆనందించగ
భూషణ ధ్వనులివి వినవచ్చునవి.''

ఆశ్చర్యముతో వినెను రాముడు
ముందుకు సాగి ముని నెలవులలో
నార చీరలు పవిత్రాగ్నులు
మంత్ర విదులు మరి నిండిన స్థలముల

శర చాపములతొ రక్షణ నిచ్చుచు
సుఖముగ గడిపిరి కొన్ని దినములు
దినములు నెలలై - నెలలు ఏండ్లయి
పది వత్సరములు - గడిపిరి అచ్చట.

పది వత్సరములు ఆశ్రమ సీమల
నెలలు - నెలలుగా తిరుగుచు నంత
ముని సేవలలో రఘుకుల సోముడు
గడిపి వచ్చెను సుతీక్ష్ణుకడకు.

సుతీక్ష్ణ మహఋషి కోరిన యట్టుల
తిరిగి అచ్చట వసించి - రాముడు
అగస్త్య మహఋషి వివరము అడిగెను
ముని పుంగవుని దర్శింతుననె.

''రామా! నేనే చెప్పదలచితిని
అడిగితి వీవు - సతి సోదరులతొ
ఆనందముగా - అగస్త్యమునిని
దర్శించుము ఓ ప్రియదర్శనుడా!

దక్షిణమ్మ్మగా నాలుగామడలు
నడచిన కననగు రావిచెట్లవి.
అందు - తుమ్మెదలు, కమలమ్ములతో
శోభిలు జలముతో - తటాకమ్ములు

పండ్ల బరువుతో పూలగుత్తులతొ
నిండిన తరువులు నిలచియుండును
అది 'సుదర్శన' ఋషి ఆశ్రమము
అతడు అగస్త్యుని ప్రియ సోదరుడు.

సుదర్శనాశ్రమమందు ముప్వురు
రాత్రి గడిపి మరునాడు దయమ్మ
దక్షిణముగ అట తరువులు దాటి
ఆమడ నడచిన దివ్యాశ్రమమది.

అగస్త్య మహఋషి ఆశ్రమమున్నది
అందు నీవు - నీ సతి - సోదరులతొ
సుఖముగనుండుము బయలుదేరుము
జాగు చేయక ఋషిని చూడుము.''

ముప్వురు సాగిరి ముని చెప్పినటు
మనోహరమ్మగు కొండలు - వనములు
ప్రకృతి శోభను తిలకించుచును
గాంచిరి అచట శుభాశ్రమమ్మును

పండ్ల బరువుతో వంగిన కొమ్మలు
రాలిన ఫలముల ఘుమాయింపులు
హోమ విధులకై కూర్చిన కట్టెలు
వైఢూర్య కాంతితొ వెలుగు దర్భలు

నల్లని మేఘము అన్నటు పొగతో
ద్విజులు తెచ్చిన పుష్పమ్ములతో
శోభిలు ఆశ్రమ మచ్చట గాంచిరి
అది సుదర్శను నెలవని తలచిరి

అసురుల జంపి లోక హితమ్ముకై
ప్రజలను - దక్షిణ దిశలో జేర్చిన
మహిత మూర్తియగు అగస్త్య మహఋషి
అనుంగు తమ్మునిదా యాశ్రమమని.

తీరుగ రాముడు తెలిపె తమ్మునకు
''పూర్వము - ఇరువురు మాయ రక్కసులు
వాతాపి- ఇల్వలుడు - అనెడు క్రూరులు
ద్విజుల వేషముతొ - ద్విజులను చంపిరి.

ఇల్వలు డసురుడు ద్విజుని వేషమున
శ్రాద్ధము రండని - సంస్కృత భాషలొ
పిలువగ - ద్విజులు ఇంటికి రాగ
వాతాపిని - మేకగ చేసి వండుచు.

మేక వంటకము వారు తినగనే
మోసగాడగు ఇల్వలుడంతట
వాతాపిని రమ్మని బిలచినయంత
పొట్టలు చీల్చుకు అసురుడు వచ్చును.

అటులా దనుజులు వేల కొలదిగా
ద్విజులను జంపిరి- అంతటవారు
అటులే పిలచిరి- అగస్త్యమునిని
నమ్మిన మౌని- తినెను వంటకము.

యథాప్రకారము తమ్ముని పిలచెను
కడుపు నుండి మరి తమ్ముడు రాడయె
అపుడు పలికెను అగస్త్య మహఋషి
"నీ భ్రాత- ప్రేతయై యముని చేరెను.

జీర్ణమయ్యె నా కడుపున వాడు
వాడిక వచ్చుట సాధ్య మెట్లురా?"
అనగా అసురుడు మునిపై బడగా
చూపుల కాల్చెను- దనుజుని- ఆ ముని.

అట్టి మహాత్ముని అనుజుడు అయిన
సుదర్శనాఖ్యుని ఆశ్రమమ్మిది"
తెలిపె తమ్మునకు - మౌని ఘనతను
చేరిరి ఆశ్రమ సీమకు వారు.

ముని ఆతిథ్యము ముదముగ గైకొని
మరునాడుదయము- వినయము నిండి
శలవు గైకొని సాగిరి ముప్పురు
సుతీక్ష్ణ మహఋషి చెప్పిన త్రోవలో.

కొంత దూరము సాగినయంత
మనోహరమగు లతా కుంజములు
అశోక- తాల- తమాల తోపులు
మొల్ల- మాలతి- సుర పొన్నలతో

తిమిశ వృక్షములు- పనస తోటలు
మారేడు- మద్దియు- తుమ్మికి చెట్లు
తేనెతొ నిండిన ఇప్పతరువులు
తుమ్మెద స్వనములు తీయగ సాగగ

కపులు వూపగా కనపడు తరువులు
కరులు లాగగా కదలిన తరువులు
కన్నుల పండుగ చేయుచుండగా
అన్న పలికెను తమ్మునితోను

"లక్ష్మణ! గనుము- ఇచ్చటి తరువులు
మునులు పెంచగ శుభముగ నున్నవి
జింకలు- పులుగులు- శాంతి నిండినవి
సమీపముననే ఆశ్రమముండును.

హోమ ధూమముచె వనము నిండెను
నార చీరలు వరుసగ నున్నవి
బడలిక తీర్చును ఈ వనభూమి
దనుజులు వణకెద రీవనమును గని.

దక్షిణ దిశలో - వింధ్య పర్వతము
ఎత్తుగ ఎదిగి సూర్యుని ఆపెను
సురలు ఆగస్త్యుని వేడుకొనగను
మొరలు వినిన ఆ ముని పుంగవుడు

నడచుట కనువగు రీతిగ నువ్వు
అణగుము-వింధ్య గిరీంద్రమ అనగా
మునిపై గౌరవ ముంచిన ఆ గిరి
అణగెను-సాగెను ముని ఆ దారిని

తిరిగి వత్తును అట్లే వుండుము
అనగా- ఆ గిరి అణగి యుండెను
తిరిగి ఆ ముని మరలి వెళ్లడు
గిరికి ఎదుగుటకు వశము కాదయె.

దీర్ఘాయుష్మ్కుడు - దివ్య తేజుడు -
వినయ వంతులగు శిష్యులు - భక్తులు
సేవించెదరు దివ్య మునీంద్రుని
సేవలు చేసిన - మనకు శుభమగు

వన వాసమున మిగిలిన భాగము
ముని సేవలలో గడుపుదమయ్యా!
సుర గంధర్వులు - ఈ మిత భుక్తుని
భక్తి మీరగా కొలుచుచుందురు.

అసత్య వాదులు - క్రూరులు - మరియు
కామ ప్రవృత్తులు - బ్రతుకరు ఇచ్చట
అమరులు - యక్షులు-పతంగ-నాగులు
నియమ నిష్ఠలతొ సేవలు చేతురు.

ఇచ్చట తపములు చేసిన మునులు
తపస్సిద్ధిచే దేహము వదలి
సూర్య తేజమును కలిగినవారై
నాకము చేరిరి-లక్ష్మణమూర్తీ!

ముని సేవలకై వచ్చిన సురలను
స్తుతించి-వారికి నమస్కరించగ
మునులకు మరియు సర్వ జగతికి
ఐశ్వర్యము-దేవత్వము నిడెదరు.

నాయన లక్ష్మణ! దివ్యా శ్రమమును
చేరితిమయ్యా-ముందుగ బోయి
వినిపించుము-నే-జానికి తోను
దర్శనమ్ముకై వచ్చితి ననుచు.''

॥శ్రీ రఘురామునిll

❃❃❃

## 12 అగస్త్య మహర్షి సందర్శనము-విష్ణు చాపము-అక్షయ తూణీరమ్ములు-దివ్యఖడ్గము ముని ఇవ్వగా శ్రీరాముడు స్వీకరించుట

రామానుజుడు ఆశ్రమమందు
అగస్త్య మహాఋషి శిష్యుని గాంచి
''దశరథ విభుని జ్యేష్ఠ కుమారుడు
రాముడు-సతితో వచ్చెను స్వామీ!

ముని దర్శనము చేయగ నిలచెను
అనుజుడ నేను-లక్ష్మణుడందురు
భక్తి ప్రపత్తుల-అన్నను-నేను
నిరతము కొలుతును నా భాగ్యమని.

తండ్రి యానతిని వరముగ నెంచి
కానన సీమకు వచ్చితిమయ్యా!
తెలియ బరచుము మాదగురాక
కలిగించుమయా ముని దర్శనము.''

సరియని-శిష్యుడు-హోమగృహమున
ప్రవేశించి-ఆ తపోనిష్ఠునకు
తెలియ బరచెను ముప్పురిరాక
ఆనతి నిచ్చిన తోడితెత్తుననె.

అంతట మహాఋషి పొంగి పోయెను
ఆహా! నా అదృష్టము అనెను
''ఇన్ని దినములకు వచ్చెను రాముడు
ముగ్వుర నిపుడే తోడ్కొని రమ్ము

భక్తితొ వారిని తోడ్కొని రమ్ము
ఎదురు చూచుచు నుంటిని అనుము
వాకిలి ఎదుట నిలబెట్టితివా!
జాగు చేయక - త్వరగా బొమ్ము''

అనగా శిష్యుడు వడిగా వచ్చి
సుమిత్ర సుతునకు భక్తిగ మ్రొక్కి
అడిగెను-శ్రీరఘురాముడు ఎచటని-
వేగమె సాగిరి రామ సన్నిధికి

రాముని గాంచి వందనముంచి
ముని పలుకులను శిష్యుడు తెలిపి
వినయము నిండి తొడ్కొనిరాగా-
పెంపుడు జింకల చూచుచు నడచి

ఆశ్రమమందు పూజా స్తలములు
బ్రహ్మ స్థానము-విష్ణుస్థానము
ఇంద్ర-సూర్యుల-చంద్ర స్థానములు
భగుని స్థానము-కుబేరు స్థానము.

ఆనంతు నెలవు-అనిలుని స్థానము
గాయత్రి స్తానము-వసువుల నెలవు
వరుణుని స్తానము-స్కందుని నెలవు
ధాత-విధాత స్థానమ్ములును

ధర్ముని స్థానము-అగ్ని స్థానము
మొదలగు పూజా స్థలములు చూచుచు
ముందుకు సాగి-తేజో వంతుని
ఎదురు వచ్చు ఆ మునిని గాంచిన

రాముడు అనెను అనుజునితోను
''తేజోవంతుని చూడగ మదికి
అగస్త్య మహాఋషి- అనిపించునయా!''
అనుచు రాముడు వందన మిడెను.

శీఘ్రమె సీతయు లక్ష్మణమూర్తి
ముని పదములకు మ్రొక్కిరి భక్తిగ
అంతట ఆ ముని ఆనందముతో
అర్ఘ్యపాద్యముల నిడెను వారికి.

వైశ్వ దేవమును చేసి-పిమ్మట-
అర్ఘ్యము నిచ్చి - ఆదరముంచి,
అతిథి పూజను వారికి సలిపి
ప్రేమ మీరగ విందును చేసెను.

ఆవల మహాఋషి ఆసీనుడయి
వారిని కూర్చొనజేసి - తీరుగా
ధర్మ కోవిదుని రాముని గాంచి
ధర్మ బోధన చేసెను తీయగ

''హోమము చేసి- అతిథికి ప్రియముగ
అర్ఘ్యము నిచ్చి-సేవలు చేయని
వాన ప్రస్థుడు-కూటసాక్ష్యమును
చెప్పిన పాపము నందును రామా!

జగతికి నీవు - ప్రభుడవు రామా!
నిలచిన ధర్మము - మహరథుడవు
విరాజిత కీర్తివి - మాన్యమూర్తివి
పూజకు పూర్తిగ - తగిన యోగ్యుడవు

మహితమూర్తివి-స్వయముగ - నీవే
అతిథిగ వచ్చితివయ్యా రామా!
ఇంతకు మించిన పుణ్యఫలము మరి
ఎందుగాంచెదను-రాక్షసహరణా!''

అనుచుపలుకుచు-ఫల మూలములు
సుమములు ఇచ్చి సత్కరించి - అట
జానకీ పతికి - ఘన చాపమును
అక్షయతూణీరమ్ముల చూపుచు

''ఇది మహనీయము - దివ్యచాపము
హేమమణులతో - అలంకారముల
విష్ణు ధనుస్సును - విశ్వకర్మ - తను
నిర్మించెను అతి రమ్యముగాను.

ఈ శరములు రవికాంతి సమములు
బ్రహ్మ ఇచ్చె నీ దివ్య శరములు
అక్షయ తూణీరమ్ములు ఇవ్వి-
దివ్యఖడ్గమిది- ఇంద్రుడు యిచ్చెను.

విష్ణుదేవుడీ ధనుర్బాణముల
దనుజుల జంపి - విజయము నందెను
ఇంద్రుడు-వజ్రాయుధమును గొన్నటు
స్వీకరించుము - నీకగు జయము''

విష్ణు ధనుస్సును - విజయ ఖడ్గమును
అక్షయ తూణీరమ్ముల నపుడు
ఆనందముగా రాముడు గ్రహించి
అగస్త్యమునికి భక్తిగ మ్రొక్కెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 13 అగస్త్య మహర్షి ఆశీస్సులు-పంచవటి వాసయోగ్యమని ముని నుడువుట

ప్రీతి గొలపగ అగస్త్య మహఋషి
పలికెను - ''రామా! నను గనవచ్చుట
సంతోషము - మరి భూమిజకూడ
వచ్చెను నడచి-శ్రమలకు ఓర్చి

కోమలాంగి - తను బడలియున్నది
కోసలాత్మజా! నీ వెనువెంట
కానన సీమకు వచ్చెను భక్తితో
కావున ఆమె సుఖమును చూడుము.

సృష్టి నుండి-విను-స్త్రీ ఎల్లప్పుడు
భర్త-సుఖమును ఇచ్చిన పొంగును,
ఇడుముల బెట్టిన భర్తను స్త్రీలు
గౌరవించరు - గర్హింతురయా!

మెరపుల వంటి చంచల మతులు
కరకుదనమున వాడికత్తులు
బిరుసుదనమది ప్రకృతి గుణములు
అతివల సహజగుణములు రామా!

నీ యిల్లాలు దోషరహితయగు
అరుంధతికి మరి సాటి యగునయా
పతివ్రతలచే పూజల నందగ
యోగ్యత సీతది- జనక నందినిది.

త్యాగమూర్తి నీ తమ్ముడు తోడుగ-
ఛాయ రీతి వైదేహి యుండగా
నీ విచ్చటనే వసించి యుండిన
పావనమగు ఈ ఆశ్రమసీమ''

అంతట రాముడు పలికెను మునితో
''నీ దయకెంతో ధన్యుడ స్వామీ!
జల సమృద్ధము- అనువగు స్థలము
తెలిపిన ఉందును ఆ ప్రదేశమున.''

తృటి కాలము ముని ఆలోచించెను
ముదమగు నెలవు పంచవటియని-
రెండామడల దూరము ఇచటకు
ఫల- జల- సుమ సమృద్ధము అనెను.

''వన వాసములో అధిక భాగము
గడచెను- మిగిలిన శేష భాగము
అచట వసించి- తండ్రి ఆనతిని
పాలించిన- ఘనకీర్తిని పొందుము.

యయాతి రాజుకు- జ్యేష్ఠ కుమారుడు
కోరిక తీర్చగ- పుణ్యగతిని గొనె-
అటులే నీవు ప్రతిన తీర్చుకొని
భూమినేలి- సుఖ మందు కొనెదవు.

తపోబలమున సర్వము తెలిసితి
నీ గురించి నేనంతయు తెలిసితి
కావున ఇచటే వసించు మనియును
అడుగగ చెప్పితి- పంచ వటియని

శ్లాఘ నీయము- కడురమ్యమది
గోదావరి నది దాపున నున్నది
ఫలములు- సుమములు మెండుగ నుండును
దాపు ననున్నది- నా నెలవున కది.

జానకితో నువు అచట వసించి
మునుల కావుము కారుణ్యానిధి!
అదిగో చూడుము- ఇప్పతోపు అది
దానికి ఉత్తర దిశలో - రామా!

మఱ్ఱిచెట్టును దాటిన వెనుక
మిట్ట ప్రదేశము- దాటి పోవగా
పర్వతమున్నది- దాని సమీపము
పంచ వటిని గని- విడిది చేయుడు.''

మునికి భక్తితో నమస్కరించిరి
సెలవునందుకొని ఆ రణధీరులు -
జనకజ మధ్యలొ- నడచుచుండగా
పంచవటికి ఆ ముప్పురు నడచిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 1 4 జటాయువుతో నెయ్యము– భూతకోటి జన్మించిన విధము జటాయువు తెలుపుట

అడవిలో నడచుచు గాంచిరి వారు
పెద్ద దేహముతొ నున్న పక్షిని
అసురుడు అగునని– తలచెను రాముడు
వివరము లడిగెను సందర్భముగా

తియ్యగ పలికెను పక్షి అచ్చట
''రామచంద్ర! నే దశరథ విభునకు
ప్రియ సఖుడను, నను జటాయు వందురు''
అనగా రాముడు– వినయము నిండెను.

తిరిగి పలికెను జటాయు వంతట
భూతకోటి జన్మించుట తెలిపెను
''భూత సృష్టికి – ఆది కారణులు
ప్రజా పతులను పుణ్యమూర్తులు

వారిలొ ప్రథముడు కర్దముడగును
విక్రీతుడు–శేషుడు– సంశ్రయుండును
స్థాణువు– మరీచి– అత్రి– క్రతువులు
పులస్త్యుడున్ను– అంగిరుడున్ను

ప్రచేతుడు మరి– పులహుడు– దక్షుడు
వివస్వతుడును– కశ్యపుడున్ను–
వారిలొ దక్షుని సంతతి అరువది –
అందులొ ఎనిమిది మంది కన్యలను

కశ్యప ప్రజాపతి కిచ్చెను దక్షుడు
అదితి– దితియు– దనువు– కాళియు
క్రోధ వశయును– తామ్ర– మనువులు
అనలను వారు కశ్యపు భార్యలు.

మూడు లోకముల రక్షించగల
తనతో సమమగు శక్తి మంతులగు
సంతతి కనమని కశ్యపు డనగా
అదితి– దితియు– దనువు– కాళియు

భర్త మాటలు వరముగ నెంచి
అదితి కన్నది స్వర్గ వాసులగు
ఏకాదశరుద్రులు– అష్ట వసువులను
ఆదిత్యులను– అశ్వని సురలను.

దితికి కలిగిరి దైత్య సంతతి–
సంద్రము, వనములు నిండిన భూమి
దైత్యుల వశమున నుండెను పూర్వము
రామా! వినుము సృష్టి వివరము.

అశ్వగ్రీవుడు – దనువుకు పుట్టెను
నరక– కాలకులు కాళిక సంతతి
అంతట తామ్రకు క్రౌంచియు– భాసి
శ్వేని– ధృతరాష్ట్రి– శుకియు కలిగిరి.

క్రౌంచికన్నది– ఉలూకములను
భాసములను గనె భాసి అంతట
గ్రద్దల – డేగల శ్వేనిగన్నది.
హంస– కలహంస– చక్ర వాకముల

ధృతరాష్ట్రి కన్నది సంతతిగాను
శుకి అంతటగనె– నతను బిడ్డగ
నత సంతతి యగు వినత అనునది
క్రోధకు తనయులు ఈ పదిమంది

సురస- మృగమంద- హరి- శ్వేత- సురభి
భద్రమద- మాతంగి- శార్దూలి- కద్రువ
మృగి యనువారు- శ్రీరఘురామా!
మృగికి పుట్టినవి- జింకలగునయా!

ఎలుగులు- సృమరము- చమరములన్నవి
పుట్టిన వపుడు ఆ 'మృగ మంద' కు
హరికి సింహములు పుట్టిన వయ్యా!
భద్రమద మరి నిరావతిని గనె.

ఐరావతమును- మాతంగములను
నిరావతి కన్నది అంతట రామా!
శార్దూలి సంతతిగ వ్యాఘ్రము లున్ను
గోలాంగూలములన్నవి పుట్టెను.

శ్వేత సంతతి దిగ్గజమ్ములవి
సురభి సంతతి రోహిణి- గంధర్వులు
అందు రోహిణికి గోవులు కలిగెను
గంధర్వి సంతతి హయములు రామా!

అనేక పడగల నాగుల నపుడు
సురస కన్నది సంతతిగాను
కద్రువ సంతతి విను రఘురామా!
సాధారణమగు పాములన్నవి.

మనువు సంతతిగ మనుజులు పుట్టిరి
ఫల వృక్షములు అనలకు పుట్టెను
వినత కుమారులు అరుణుడు- గరుడుడు
కద్రువ తనయుడు సహస్రఫణియై

భూమిని మోసెడు ఆదిశేషుడు.
అరుణుని సంతతి ఇద్దరిమయ్యా!
అందు సంపాతి నా అగ్రజుడు
అతని తమ్ముడను జటాయువందురు.

శ్రీ రఘురామా! నీ సేవకుడను
సరియని నంతనె సాయ పడుదును
భీకరాటవిని వేటకు పోగా
సీత రక్షణగ నుందును నేను.''

జటాయు వటుల పలుకగనపుడు
తండ్రిసఖుని గని రామచంద్రుడు
ఆనందముతో కౌగలించుకొని
సాగిరి పులుగుతొ పంచవటి కట.

పుణ్యమూర్తియగు పక్షిరాజుతో
ఎగిసిన జ్వాల - మిడుతల దండును
కాల్చినట్టుగా - అసురుల త్రుంచగ
పంచవటికి రఘురాముడు సాగెను.

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 15 పంచవటి నివాసము

వివిధ సర్పములు- మృగములు నిండి
వెలయుచు నున్న పంచవటిని గని
పొంగిన ఆనందముతో రాముడు
పలికెను తమ్మునితో నంతటను.

''పూచిన పూలతొ మంగళకరమై
మనసును దోచును ఈ పంచవటి
మన ముగ్గురకు వాసయోగ్యమగు
ఆశ్రమ స్థలమును నిర్ణయించుము.

నీటికి చేరువ సమ ప్రదేశము
దర్భలు-సమిధల కందుబాటుగా
పూలు పుష్కలము నుండెడి చోటు
ఇసుక తిన్నెల నేలను గనుము.''

రామానుజుడు ప్రియముగ పలికెను
'శతాబ్దములు-నే-మీతోనున్నను
సేవ చేయుట నా కర్తవ్యము
ఆదేశించుట - నీకే తగును.''

తమ్ముని మాటకు గుండియ పొంగెను
గురుతుగ చేతిని అన్న అందుకొని
అనువగు స్థలమును చూపి అచ్చట
ఆశ్రమమును నిర్మించగ చెప్పెను.

తామర పూలతొ నిండిన కొలను
తీరుగ పూసిన తరులు-లతలతో
చక్ర వాకములు-హంసల శోభతొ
ముని చెప్పినది గోదావరి నది.

విస్తరించిన పెద్ద వృక్షములు
విరివిగ తిరిగెడు నెమళుల రవములు
వివిధ ధాతువులు నిండిన నేల
వెలుగులు చిమ్ముచు వెలసియున్నది.

మద్ది-మామిడి-వంజుల-సింధుక
చంపక-చందన-కదంబ-నంబ
నిమ్మయు-మోదుగ- ఇప్ప-తమాల
పొన్నలు-కాంచన-అశోక తరువుల

శోభగనున్నది ఈ ప్రదేశము
గిరుల-పులుగులతొ పుణ్యప్రదేశము
తీరుగ తీర్చుము పర్ణశాల'' యన
అన్న ఆనతిని తమ్ముడు అచట

పునాది త్రవ్వి-గోడలు నిలిపి
వెదురు స్తంభములు బలముగ నాటి
జమ్మి వాసములు- ప్రక్క వెదుళ్లతొ
తెల్లును కప్పి-నేలను సర్దెను.

కుటీరమ్మునట సిద్ధము చేసి
గోదావరిలో-స్నానము చేసి
ఫలములు-పూలతొ వాస్తు పూజయు
శాంతి కార్యములు-తీరుగ తీర్చగ

రామచంద్రుడా కుటీరమ్ము గని
ఆనందముతో-నిండినవాడై
ప్రేమగ-తమ్ముని కౌగలించుకొని
ముదముగ పలికెను ఆ-సౌమిత్రితొ

''సోదర! ప్రేమతొ-గుండియ పొంగెను
నీ సేవకు-నే ప్రతిఫలమిడు టెటు
ప్రతిగా గుండియ కలిపితినయ్యా!
కౌగిలింతయే కలిమికడలి యగు

నా మది తెలిసి-మసలు చుందువు
నన్నేమరక కాచి యుందువు
నాదు పాలిట-తండ్రిగ నుంటివి
తండ్రిలేని లోటన్నది లేదు.''

అనుచు పలుకుచు రామచంద్రుడు
అవనిజ సేవలు అందుకొనుచును
అనుజుడు భక్తితో పూజలు చేయగ
అందు వసించెను విష్ణుమూర్తివలె.

||శ్రీ రఘురాముని||

❈❈❈

## 16 హేమంత ఋతువర్ణన

భార్య సపర్యలు ముదముతొ నందుచు
తమ్ముని సేవలు- భక్తియు నందుకు
సుఖముగ రాముడు గడుపుచుండగా
హేమంతమట విరిసినదావని

అన్న-వదినతో కొలనుకు నడువగ
సేవలు చేసే తమ్ముడు పలికెను
''అన్నా! నీకు ప్రియమగు ఋతువు
మనసుకు నచ్చిన మాసము వచ్చెను.

చలితో-మేను కరకు తేలెను
స్నానము చేయగ కరచును నీళ్లు
పచ్చని పైరు కళకళలాడెను
చలిలో- అగ్నికి దగ్గరగుదురు.

క్రొత్త ధాన్యములు శ్రీతోరాగా
పొంగళ్లతొ మరి పితృదేవతల
ఆహ్వానించి నివేదించుచు
పాపరహితులు అగుదురు జనులు

రాజులు యుద్ధోన్ముఖులై యుందురు
పాలు, పెరుగులు దండిగ నుండును
పల్లెలొ జనులు ప్రీతిమీరగా
పాడి పంటలను అనుభవింతురు.

దక్షిణ దిశ- ఈ దక్షిణాయనము
భానుడుండగ శోభిలుచున్నది
ఉత్తర దిశ-మరి భానుడు లేకను.
తిలకములేని- అతివగ తోచును.

చల్లని కాలము-మంచు కరగదు
పేరిన మంచు పెరిగిపోవగ
హిమవంతుడని సార్థక నామము
కలిగియుండెను- పర్వతరాజు.

నును వెచ్చగను ఎండ తగులును
మధ్యాహ్నమున తిరుగు చుందురు
చల్లని నీళ్లు- తాకగ జిల్లను
వనవిహారములు శక్యముగావు.

చలిలో-సూర్యుని కోరుచుందురు
చంద్రుడు తనదగు సౌభాగ్యమును
రవికి యిచ్చి-తను మంచు కణములతొ
ఆవిరి సోకిన- అద్దము పోలెను.

చల్లనిదైన పడమటి గాలులు
శీతలమ్ము మరి జత కూడుటచే
ద్విగుణీకృత మగు చల్లదనముతో
తిరుగుచున్నవి ఉదయ కాలమున.

ఖర్జూర పూవుల కాంతులు కలిగి
గింజల బరువుతొ తలలు వంచిన
బంగరు వన్నెతొ మెరయు పైరులను
చూచిర-మీరు-మనసుకు హాయిగ.

మంచు తుంపరలు నిండిన నింగిని
భానుడుండెను చందమామ వలె-
మధ్యాహ్నమున సూర్యకిరణములు
కొంచెము ఎఱుపు కలిగి యున్నవి.

పచ్చికపైన-హిమ బిందువు లవి
సూటిగ పడిన సూర్య కిరణముల
వజ్రములన్నటు మెరయుచున్నవి
మది పులకించే మనోహరమ్ము.

సూర్యకిరణములు చల్లగ నున్నవి
వేడిమి లేక వెలుగుట చేతను
జలములు చల్లగ నిలిచియున్నవి
దప్పిక యున్నను-తాకగలేము.

నీటిపక్షులు నీటికి భయపడు
కరులు-నీటిని తాగగ భయపడు
మంచు చీకటిచె-వనము నిండగ
నిద్రించినటు పుష్పరహితమయె.

కమలములన్నీ రేకులు రాలి
మంచు వశమున చిక్కిపోయినవి
కాడలు మాత్రము నిలచియుండగా
కొలనుల శోభలు చెదరియున్నవి.

పుండువంటి ఈ చలికాలములో
భరతుడు-భోగములన్నియు వదలి
ఫలమూలములు తినుచు గడుపుచు
రామధ్యానమున నుండును అన్నా!

ఇదే వేళకు నిద్రలేచును
మంత్రులు తనను కొలుచుచుండగా
సదమలమతియై సరయూనదికి
స్నానముకై చను-యోగిగ మెలగును.

చిక్కని చలిలో- ఆ సుకుమారుడు
గారాబముగా పెరిగిన భరతుడు
చల్లని జలముల-సరయూ నందు
ఏ విధి మునుగునొ అనిపించును కద!

సుకుమారుడు-వీరుడు-సుందరమూర్తి
సర్వ ధర్మములు తెలిసిన యోగ్యుడు
సత్యవాదియు, దోషరహితుడు
రిపుల గర్వమును అణచగ చాలిన

ఆజానుబాహుడు-విజితేంద్రియుడు
పాప కార్యములు చేయని విజ్ఞుడు
భక్తి నిండిన భరత సోదరుడు
విరాగి అయ్యెను నీవలె అన్నా!

ధర్మమూర్తికి పత్నియైనది
సుగుణరాశికి - తల్లియైనది
కైక-అంతటి కఠిన మనస్సును
ఎటుల కలిగి మరి యున్నదొ చిత్రము.!

మనుజులలో మరి తనయుడెప్పుడు
తల్లి గుణములను పొంది యుండునను
లోకవార్త- ఈ భరతుని యెడల
తిరగ బడినదని తోచును అన్నా!''

ఆనాడాతడు పలికిన పలుకులు
మధుర వాక్కుల హృదయము పొంగును
అమృత మయమై- అనిశము మదిలో
మెదలు చుండును-మరపేరావు.

అనగా రాముడు తమ్మునితో ననె
''సోదర! కైకను నిందించ కయా!
ఆమె కుమారుని కీర్తించు మయా!
భరతుని తలచిన నా మది కరుగును.

నాయన! నిన్ను- భరత, శత్రుఘ్నుల
సీతను, అందరి నొక్కమారుగ
ప్రేమగ గాంచెడి రోజు ఎన్నడో''
అనుచు బాధతో రాముడు నడచెను.

తమ్ముడు- తన సతివెంట నడువగా
స్నానము చేసి విధులను తీర్చుకు
గిరిజ-నందుల సేవల నందెడి
రుద్రుని తీరుగ తోచెను రాముడు.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 17 శూర్పణఖ రామచంద్రుని మోహించుట

గోదావరిలో స్నానము చేసి
రామచంద్రుడు సతి-సోదరులతొ
పంచ వటిని తన ఆశ్రమమందున
ముదముగ ముచ్చటలాడుచు గడుపుచు

శత్రు కర్శనుని సజ్జన పూజ్యుని
నీల నీరద శ్యాముని రాముని
రాజ చిహ్నముల రాజిలు మూర్తిని
జటావల్కలము లమరిన పూజ్యుని

తమ పూర్వీకుల దివ్యగాథలను
తీయగ చెప్పుచు-సుఖముగ గడపగ
మోహనమూర్తిని రామచంద్రుని
దశముఖు సోదరి గాంచిన దచట.

సన్నని నడుముతొ సుకుమారుడట
వెన్నెల కురిసే చందమామలా
వెలిగెడి రాముని- రావణు చెల్లెలు-
పెద్ద కడుపుగల రక్కసి గాంచెను.

సింహమువంటి విశాలవక్షుని
తామర రేకుల కన్నుల వాని
ఆజానుబాహుని, అతి సుందరుని
ఇంద్ర సమానుని కోమలమూర్తిని

సుందర వదనుని- విమల చరిత్రుని
మోహనరూపుని - సుస్వర గాత్రుని
విశాల నేత్రుని- వినయ శీలుని
భ్రమరవినీల కుంతల మూర్తిని

దుర్ముఖి- మిక్కిలి పాపచరిత్ర-
కురూపి- భీకర కంఠము కలిగిన
భీకరాక్షి మరి తామ్ర శిరోజ
భయము గొలుపు శూర్పణఖ గాంచినది.

మనసు కెక్కినది రాముని అందము
మురిసి పోయినది- ముచ్చట పడినది
మన్మథు శరములు మనసును కాల్చగ
మరి మరి చూచి పలికెను అపుడు :

''ఎవ్వడవీవు? ముని వేషముతో
ఇవ్వన భూమిలో భార్యతో కలసి
దానవులుండగ- చరించు చుంటివి
కారణమేమి? తీరుగ చెప్పుము.''

అసత్య మాడని రామచంద్రుడు
అతివ ముందర- తపోనియమమున
అనృత మసలే తలపులోనుండక
తెలిపెను అపుడు వికృత రూపికి :

''దేవ సముడగు దశరథ రాజుకు
కొడుకులందరిలో జ్యేష్ఠుడ నేను
రాముడందురు- ఈతడు తమ్ముడు
లక్ష్మణాఖ్యుడను లలిత గుణాఢ్యుడు.

సీత- ఈమె నా యిల్లాలగును
తల్లిదండ్రుల ఆనతి - ధర్మము
నిలప వచ్చితిమి- వింటివ- నీవు
నిజము చెప్పుము ఎవ్వతె వీవు?''

''దేవ స్వరూపా! శూర్పణఖను- నే
కోరిన రూపము దాల్చగ నేర్తును
కానన మందున తిరుగుదు నేను
సర్వ భయంకర చరితను నేను.

విశ్రవసునికి కుమారుడైన
దనుజ నాయకుడు రావణాఖ్యుని
పేరు వింటివ? నాకు సోదరుడు-
కుంభకర్ణుడు అతి నిద్రితుడు.

రాక్షస చేష్టల నెరుగనివాడు
ధర్మచిత్తుడు విభీషణుండును
ఖర, దూషణులను శూరపుంగవులు
అన్నలగుదురో అందగాడ విను.

అదుపులేక- నే మదికి తోచినటు
తిరుగ జాలుదును- ఎందునుకూడ
నీతో ఈడగు సుందరాంగుని
చూడగలేదు మగడవు గావలె.

ఏమను కొంటివొ- అతి బలశాలిని
అనుకొనినటుల చరించుదానను
మగనిగ నీవు సుఖముల నందుము
ముందు వదలు- ఈ రోత సీతను.

ఛీ- ఛీ! ఇంతటి వికృత రూపిని
ఇంకా నీదరి నుంచుట ఏలా?
నీ రూపమునకు తగిన దానను
నన్నేలుము నువు- భార్యగ చేసుకు.

భయము గొలుపు ఈ దుష్టవనితను
నీచమైన ఈ మానవ కాంతను
తమ్మునితో నిట కబళించెదను
మగడా! సుందర వనముల పోదము.

పర్వత గుహలలో - వనసీమలలో
ఉల్లాసముగా విహరింతమయా!
ముద్దుల మగడా-మురిపెము తీర్చుము
ముందు నిలచిన ముద్దు గుమ్మను.''

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

## 18 శూర్పణఖ శిక్షింప బడుట

మరులు గొన్న ఆ-శూర్పణఖను గని
రాముడు పలికెను పరిహాసముగా
''నన్ను చేరిన-సవతి పోరు గద
నాకీ ఆడది- ప్రియసతియైనది.

నమ్మిన స్త్రీని-వదలుట తగదు
తగు నీ కాతడు - నా సోదరుడు
లక్ష్మణమూర్తి - ప్రియ దర్శనుడు
తేజోవంతుడు - ఒంటరి ఇపుడు.

యౌవ్వన వంతుడు - యోగ్యుడాతడు
తరుణీ తగును -పతిగా నీకు''
అనగా రక్కసి -మోహము నిండి
పలికెను అపుడు రామనుజునితొ :

''అన్నలమిన్నను- అందుకొనుమయా!
అందగాడ-నువు మగడవు నాకు
సుందరాంగ-నా కరము గ్రహించుము
అందమైన ఆ గిరుల చరింతము.''

దరహాసముతో పలికె లక్ష్మణుడు
''జవ్వని వినుము - బానిస నేను
బంటుగ సేవలు చేయుచుంటి గద!
బానిస భార్యగ సుఖపడు టెటుల?

ముదితా! నీవు ఆలోచించుము
ముద్దు లొలికెడి చిన్న భార్యగ
మురిపెము తీరగ సుఖపడగలవు
కావున రాముని - కరము గ్రహించుము.

ముందర నిలచిన సుందర స్త్రీవి
అందము లొలికెడి రక్కసి వీవు
అందుకు - నీకై ముందుకు వచ్చును
మానవ కాంతల మరిపింతువు కద!''

రామానుజుని పరిహాసమ్మును
తెలియని వెకిలి - వికృత రూపి
పర్ణశాలలో - సీతతొ నున్న
రామచంద్రునితొ పలికెను తిరిగి :

''ఈ కురూపిని కరాళ రూపిని
చెంత నుంచుకొని - చూడవు నన్ను
కావున దీనిని మ్రింగిన సరియగు
సవతిపోరు యిక వుండదు మగడా!''

రోహిణిపై బడు కొరవి తారవలె
భీకరాక్షి అట సీతను చేరగ
రాముడు బలముగ నిగ్రహించెను
తమ్ముని గాంచి పలికెను అపుడు :

"సోదర! మనము నీచులతో - మరి
పరిహసించుట ప్రాణాంతకము
ఆయుధమ్ముతో పోరుగాదిది
ఆడుది గనుక-విరూపిగ జేయుము."

అన్న మాటలు వినిన తమ్ముడు
అతి బలవంతుడు - రక్కసి యొక్క
ముక్కు - చెవులను కత్తితొ కోసెను
రోదించుచు ఆ రక్కసి పరుగిడె.

నోరు కొట్టుకొని - బొమ్మ బాదుకొని
దిక్కు లవియగా అరచుచు - రక్కసి
జనస్థానమున నున్న సోదరుని -
ఖరుని ముందుపడె పెద్ద బండవలె!

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 19 ఖరుడు రాముని పైకి వీరుల నంపుట

నెత్తుట దడిసిన దేహము నున్న-
వికృత రూపిగ నేలను బడిన
ముద్దుల సోదరి నచ్చటగాంచిన
ఖరుడు ఉరిమెను-పెద్ద మేఘమై.

"బుట్టలొ నున్న మిన్నాగును మరి
పొడిచె నెవ్వడు - విషము త్రాగగ
మృత్యు పాశమున చిక్కిన దెవ్వడు
తెలుపుము త్వరగా నెత్తురు త్రావెద.

బలవిక్రమ సంపన్నవు నీవు
ఇచ్చ వచ్చినటు తిరుగ జాలుదువు
కామ రూపిణీ - నీకు కష్టమును
తెచ్చి - మృత్యువును కోరిన దెవ్వడు?

బాకాసురుని జంపిన ఇంద్రుడు
నాకప్రియమును చేయగ భయపడు
నీటి పాలలో పాలను ద్రావిన
హంస రీతిగా - అసువులు త్రావెద.

పక్షిజాతికి ఎవ్వని దేహము
ఆహారముగా వేయ మందువు
దేవాసురులు వానిని యింక
రక్షణ చేయగ చాలరు వినుము.

సేదతీరి నువు వివరము చెప్పుము.
అనగా-సోదరి-కనుల బాష్పముల
రోదించుచును తన సోదరునికి
జరిగిన దంతయు వివరించె నిటు :

"తరుణ వయస్కులు-చక్కని వారు
మునుల వేషములు దాల్చిన వారు
కోమల మూర్తులు బలసంపన్నులు
జితేంద్రియులు మరి ధర్మ మూర్తులగు

దశరథ తనయులు-రామ లక్ష్మణులు
రాజ చిహ్నముల రాజిలు మూర్తులు
తేజము గాంచిన, సురలో-నరులో
తెలియరాదు, గంధర్వ నాయకులో?

వారి మధ్య నొక నారీమణిని
ఆభరణమ్ములు అమరిన అతివను
తామర రేకుల కన్నుల కాంతను
కాంచితి - నట్టి కాంతలుండరు.

అట్టి పడుచుకై ఇద్దరు ఒకటై
అనాథ చేసి అవమానించిరి
తండ్రి వగుదువు - తప్పక నేను
ఆ స్త్రీ రక్తము - త్రాగగ వలెను.

వారల జంపక ఆమె రక్తము
పానము చేయగ-సాధ్యము గాదు
అజిని - వారిని అంతము జేయుము
అంతకన్న నే కోరెడిదేమి?''

కోపము నిండి ఖరుడు అంతట
యమునితో సమమగు బలము కలిగిన
రాక్షస వీరులు-పదునాల్గురను
చూచి - పలికెను కోపము నిండి :

''దండక వనిలో దుష్ట చరిత యగు
స్త్రీతో - ఇద్దరు పురుషులుండిరి
కోదండములు కృష్ణాజినములు
ధరించి యుందురు - హతమార్చవలె.

వారల జంపక - వేడి నెత్తురు
సోదరి త్రాగుట దుర్లభమైనది
కావున వేగమె పోవలె మీరన''
శూర్పణఖతో - వారంద రేగిరి.

॥శ్రీ రఘురాముని॥

## 2 0 ఖరుని వీరులను శ్రీరాముడు హతమార్చుట

గాలికి చేదరిన మేఘము లన్నటు
ముందుకు వచ్చిన దనుజుల గాంచి
రామచంద్రుడు - లక్ష్మణమూర్తికి
సీత రక్షణము నప్పగించెను.

దనుజుల గాంచి పలికె రాఘవుడు :
''దశరథ విభుని తనయుల మగుదుము
రామలక్ష్మణ నామ ధేయులము
సీతతో వనికి వచ్చినారము.

కందమూలములు తినువారలము
ధర్మమ్మనె మది నిలిపినారము
మునుల సేవలో - దనుజుల త్రుంచగ
మనసు గలిగి మేమిట నిలచితిమి.

ధైర్యము గలిగిన ఎదిరిపోరుడు
బ్రతుక నెంచిన పరుగిడి పొండు''
అంతట వారు ఆయుధ ధారులు
పలికిరి అచట రామచంద్రునితో :

''అతి పరాక్రముడు - ఖర మహరాజు
కోపమ్మునకు గురియైనారు
నిలువ లేవు మా ముందర నీవు
ఎదిరిపోరుటది తలచుట ఎటుల?

అందరమొకటై అంతు చూచెదము''
అనుచు-విసిరిరి శూలమ్ములను
అంతట రాముడు - బంగరు పిడిగల
అమ్ములతో నట త్రుంచె శూలముల.

అంతట ఆగక- రవివలె వెలిగెడు
పదునాల్గమ్ములు వదలి నంతనే
అసురుల- అసువులు తీసెను- శరములు
అవనిని పడిరి- ఖరుని వీరులు.

కూలిన తరువుల తీరున పడిన
నెత్తుట తడిసిన- ప్రాణము లూడిన
దనుజుల గాంచి- భయ విహ్వాలయై
పరుగు తీసెను ఖరుని సోదరి.

॥శ్రీ రఘురా॥

❋❋❋

## 21 శూర్పణఖ- ఖరుని రెచ్చగొట్టుట

జన స్థానమున ఖరుని ముందర
అసుర వినాశము కొరకై వచ్చిన
అతివను గాంచి- ఖరుడు పలికెను :
''ఏల ఏడ్చుట! పొరలుట ఏల?

నీకై మడసిన వీరులపైన
ఈ సోదరిపై- దయగలిగినచో
ధైర్యము గలిగి - రాక్షసవైరిని
ఎదిరి పోరుము యుద్ధము నందు.

దిక్కులేదని ఏడ్చెద వేల
నేను నిలచితిని- దైన్యము వదలుము
భయమును వదలి- జరిగినదేమి
వివరించుము నువు తొందరగాను.''

కాకుత్థ్సుని నువు మట్టు పెట్టుటకు
వలయు యత్నము చేయకున్నచో
వదలెద అసువులు- నీ ముందరనే
అవమానముతో చచ్చితి ముందే.

అనగా- ఖరునితొ పలికెను రక్కసి
''నీవు పంపిన వీరవరేణ్యులు
చచ్చిరి- వినుము- రాముని చేబడి
వచ్చితి పరుగిడి- తగ్గదు వణకు.

సత్యము నుడివెద- రాముని ముందు
నిలువగ లేవు- పిరికి పందవు
దుర్బలుడవు నువు- శూరుడగావు-
ఎచ్చట నీవు? రాముడెచ్చట?

విషాదమ్మను మకరులు నిండి
మహాభయమును అలలు నిండిన
దుఃఖ సంద్రమున మునిగి యుంటిని
దరికి చేర్చగ దయగొను సోదర!

బలము గలిగిన బయలు దేరుము
జన స్థానమున ఉండగ తగవు -
కులదూషక! విను రామచంద్రుడు
పూడ్చును- పందా! పారిపో యిక.

రఘుకుల తిలకుడు అసమాన్యుడురా!
ముక్కు- చెవులను కోయగ చాలెను.''
పెద్ద పొట్టను- దబదబ బాదుకు
ఏడ్వగ నపుడు ఖరుడు పలికెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 2 2 పదునాల్గు వేల వీరులతో ఖరుడు వచ్చుట

అవమానముచే పుట్టిన కోపము
పొంగెడి సంద్రము నాప నసాధ్యము
''నీచ మానవుడు మృతతుల్యుడు-మరి
నేను చంపగా పనియే లేదు.

దుష్ట చేష్టలు కల్గిన నరుడు
చచ్చునువాడు-పేరు నిలచునా?
ఏడవ కేడవ కిపుడే పోదును
వేడి నెత్తురు జుఱ్ఱుకో యిక''

అనుచు-సోదరిని అనునయించుచు
అతి-బల-పౌరుష విక్రముడైన
దూషణుడను తన సేనాపతికి
కోపము నిండి ఆనతి నిడెను.

''పదునాల్గు వేలుగా బలభీములను
సాహస వంతులు-వెన్ను చూపని
నల్లని మేఘము వన్నెతొ వెలిగెడు
దయా దూరులను -హింస విహారుల

సింహ విక్రములు - నాపై గురిగల
యుద్ధమందు ఆసక్తినిండిన
వీరుల నిపుడే ఎంపిక చేయుము
శర-చాపములు - కత్తులు తేవలె.

పౌలస్త్య వంశమున పుట్టిన దనుజుల
ముందుగ పోదును-వెంట వత్తురు
చావు జాడగని-రాముని పంపెద
అనుసరింతురు అందరు నన్ను.''

ప్రభువు పలుకులు వినెను దూషణుడు
ప్రళయ కాలమున రవివలె నిలచి
వివిధ వర్ణముల జాతి ఆశ్వముల
బంగరు మయమగు తేరును నిలపెను.

అఖండ సేనావాహిని-నిలువగ
ఆనతి నిచ్చి-ఖరుడు సాగెను
దిక్కులు ధ్వనితో పిక్కటిల్లినవి
మృగములు తికమక చెంది-మూర్ఛిలె.

శూల-ముద్గర-కృపాణములతో
విల్లమ్ములును ఇనుప గుదియలు
వజ్రాయుధముతొ సరిపడు కత్తుల-
భూమి వణకగా సేన కదిలెను.

అతిశయించిన కోపముతోను
అతి వేగముగా తేరు తోలమని
మేఘము లొరిపిడి ధ్వనిగా - అరచుచు
సారథి నెంతో తొందర చేసెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 2 3 ఖరునకు అపశకునములు తోచుట

సాగెడి ఖరునకు అపశకునములు
అమితముగా అగుపించె-త్రోవలో
గార్దభ ఛాయ కలిగిన మేఘము
రక్త వర్ణమగు నీటిని కురిసెను.

సమ ప్రదేశమున జారె నశ్వములు
రథ ధ్వజముపై గ్రద్ధ వ్రాలెను-
సూర్యుని చుట్టును భయంకరముగా
నల్లని వలయము కాన వచ్చినది.

సూర్యుని కెదురై నక్కలు కూసెను
నల్లని మబ్బులు నిండెను నింగిని
సంధ్యకు ముందే నింగి ఎఱ్ఱబడె
దిక్కులు తెలియక తికమక యైనది.

వృకములు- గ్రద్ధలు- ఖరుని కెదురుగ
వికృతమైన సవ్వడి చేసెను -
రెక్కలు తెగినటు గిరులు తోచెను
నక్కలు భీకర ధ్వనితో అరచెను.

సూర్యుడురాహువు వశుడై యుండెను
రవి కెదురుగ- ఒక వికృత మేఘము
మొండెము వంటిది- కాన వచ్చినది-
ఎదురు గాలి అది రివ్వున వీచెను.

పగటి పూటనే చుక్కలు తోచెను
తరువుల పూవులు- ఫలములు రాలెను
ఎఱ్ఱని దుమ్ము ఎగిరి పడినది
గోరువంకలు భయముగ కూసెను.

కొండలు-నదులతొ భూమి వణకెను
వామ భుజమది అదిరెను ఖరునకు
సింహనాద మది గొంతు పెగలదు
ఆకారణముగ చెమర్చె కన్నులు.

అపశకునములకు భయపడ ననుచు
పిరికి పంద-మరి జంకు ననుచును
భయము వలదని- ఖరుడు- సేనకు
మనసు నిండుగా ధైర్యము నిడెను.

''శర వర్షముతో తారల త్రుంచెద
యమునే-దండన చేయగ చాలుదు
అట్టి వీరుడను- రామలక్ష్మణుల-
అంతుచూడక వెనుకకు మరలను.

ఆజిలొ-వాసవు గెలిచితి నేను-
అపజయమన్నది ఎరుగని వాడను
సోదరి-ముదముగ రుధిరము త్రాగును
అల్పులు మనుజులు-నాముందెంత?''

ధైర్యము గొలిపి సింహనాదమును
చేయగ-సేనలు సంతస మందెను
యుద్ధము చూడగ సిద్ధులు- ఋషులు
సుర-గంధర్వులు నిండు మనసుతో-

గోబ్రాహ్మణులకు- హిత కాంక్షులకు
మేలు కలుగునటు శుభము పలుకుచు
లోక హితముకై శుభముల నిడగా
రామ భద్రుడు భద్రత నిడునని-

చక్రదారి ఆ విష్ణు దేవుడు
అసురుల చంపి విజయము నందెను-
అటులే రాముడు విజయము నందును
అనుచు-సమరమును చూడగ నిలచిరి.

సేనల కన్న ముందుగ సాగెను-
సాగిరి మంత్రులు శ్యేనగామియు-
పృధుగ్రీవుడు- కాలకార్ముకుడు-
యజ్ఞశత్రువు-సర్పాశ్యుడును

దుర్జయమంత్రి-మేఘమాలియు-
మహామాలియు-పురుష మంత్రియు-
విహంగముడును-రుధిరాశనుడు
కరవీరాక్షుడు-అనుసరించిరి.

దూషణు వెంబడి నలుగురు వీరులు
స్థూలాక్షుడును-మహాకపాలుడు
ప్రమాధి-త్రిశిరుడు-అనుసరించిరి-
ధూళితొ-రాతిరి అనిపించినది.

రవి-చంద్రులను ఎదిరించుటకై
దుష్ట గ్రహములు పరుగిడు రీతిగ
రవికుల తిలకుల శరముల కొరకై
రక్కసి సేన-కదలి పోయెను.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 24 సమరోత్సాహుడై శ్రీరాముడు నిలచుట

అసుర వినాశము తోచు శకునములు
అగపడ-చూపుచు లక్ష్మణమూర్తికి
అన్న పలికెను-''నీ ముఖ బింబము
శోభగ వెలుగుట విజయ సూచన.

ఆపద రాగల సమయము తెలిసి
ఆలోచనతో నిలచును ధీరుడు
కావున నీవు-విల్లంబులతో
సీత రక్షణము చేయగవలెను.

ఖరము వన్నెతో మేఘము లుండుట
గాడిద తీరుగ అరచుట-మరియు
రక్త వర్ణమగు నీళ్లను కురియుట
భయముతొపులుగులు అరచుటవినుము.

చిక్కగ తరువులు నిలచిన వచట
అచ్చట గుహలో-సీతను చేర్చుము
శూరుడ వీవు-బలవంతుడవు
బదులు పలుకకు-పదములు అన.

కోదండము లివి పొగలను ఎగయుచు
తమకై తామే-కదలుచున్నవి
భీకరమైన పోరు జరుగును
శత్రు వినాశము జరుగుట తథ్యము.

దనుజులందరిని త్రుంచగలవయా!
అయినా-వారిని స్వయముగ జంపెద
వీరపుంగవా! వడిగా సాగుము
జనకజ రక్షణ నీ కర్తవ్యము.''

నా కుడిచేయి అదరుట గనుము
అసురులు సేనతొ వచ్చుచుందురు
నగార ధ్వనులు వినవచ్చినవి
దగ్గరలోనే దానవులుందురు.

లక్ష్మణమూర్తి ధనుర్ధారియై
జనక నందినితొ-సాగెను అపుడు
రామచంద్రుడు-ఘనమగు కవచము
మండెడి అగ్నిగ తోచగ దాల్చెను.

పొగలేనట్టి అగ్నిహోత్రమై
పదునగు శరములు-ఘన కోదండము-
అల్లె త్రాటి ధ్వని దిక్కులవియగా
సమరోత్సాహుడు రాముడు నిలచెను.

భేరుల భాంకారావమ్ములతో
రథికుల ధిక్కారమ్ములు నిండి
పదముల సవ్వడి మింటి కెగయగా
రక్కసి సేనావాహిని కదలగ.

మూర్తిగ నిలచిన వీర రసమును
నిండుగ గాంచిరి-సుర-గంధర్వులు
గోబ్రాహ్మణులకు శుభములు కలుగును.
అనుచు-మునులు మరి సంతస పడిరి.

వనమున మృగములు భీతిలి పరుగిడి
సవ్వడిరాని సందున దాగెను-
సంద్రము వంటి సేనలు రాగా
రాముడు చూచెను-చూపుల కాల్చెను.

చక్రపాణి శ్రీ విష్ణుదేవుడు
దైత్యులద్రుంచి జగతిని బ్రోచును,
పౌలస్త్య వంశపు అసుర వీరులను
అంతము చేయును రామచంద్రుడు.

అల్లెత్రాటికి శరమును జేర్చి
అసురుల అసువులు హరించ నిలచి-
అంతటి కన్నులు-చలించుచుండగ
కల్పాంతమున అగ్నిగ తోచుచు

పినాక పాణిగ తోచెను రాముడు-
ఉగ్ర రూపమున క్రోధము నిండి
రుద్ర రూపుడై నిలచిన రాముని
చూచి-లోకములు భీతిల్లినవి.

దక్షుని యాగము ధ్వంసము జేయగ
నిలచిన రుద్రుడొ ఫాలనేత్రుడో-
అన్నటు-నిలచిన రామచంద్రుడు
భయము గొలిపెను ప్రాణికోటికి.

భయంకరమగు ఆయుధములతో
ధ్వజములతో మరి కవచమ్ములతో
హుంకారములతొ వీరులు అరచుచు
చాపమ్ములతో-టంకారధ్వని

భీకర క్రోధపు బుసలు విడువగా
భూతములన్నీ భయముతొ పరుగిడ
ధ్వజములు-ధనుసులు ఆభరణమ్ములు
అగ్ని వంటివగు కవచమ్ములతో

సూర్యోదయమున మేఘము లన్నటు
అసుర సేనలవి ముందు నిలువగా
కోదండముతో నిండుగ నిలచి
రామభద్రుడు గాంచెను సేనను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 25 శ్రీరాముని శరములకు అసుర సేన సమసి పోవుట

శత్రుహరణుని-సమరోత్సాహుని
కోదండముతో నిలచిన వీరుని
ఖరుడు గాంచెను-క్రోధము ఎగసెను
రాముని దరికి-తేరు తోల మనె

సింహనాదముతొ దనుజులు జేరిరి
భీకరమైన వాడి బాణములు
ఖరుడు వదలెను రాముని పైకి
వివిధ ఆయుధములందరు విసరిరి.

గజముల నుండి-రథములనుండి
రవికుల తిలకుని అంతు చూడగా
వర్షధారలతొ గిరిని ముంచి నటు
శర వర్షము కురింపించి రంతట.

సాగరమ్ములో నదులు జేరగా
రూపు తెలియక-కలసి పోవును
అటులే రాముడు శరములు వదలి
వివిధా యుధముల రూపు మాపెను.

పిడుగుల తాకిడికెదిరి నిలచిన
పర్వతమన్నటు - రామభద్రుడు
ఆయుధమ్ములవి తగిలిన గాని
వేదన నెరుగక నిలచె ధీరుడై.

నెత్తురు కారెడి దేహముతోను
క్రొత్త అందముతొ వెలిగెను రవియన-
రాముని గాంచిన సుర సమూహములు
రక్తముగాంచి-పరితపించిరి.

అంతట రాముడు విజృంభించెను
వందలు వేల శరములు వదలెను
కంటికి శరములు కనబడ కుండెను
ఉరముల జీల్చి నెత్తుట మునిగి

యమదండములై అసువుల తీసి
అగ్నిజ్వాలలై మింటి కెగసెను-
కర-చరణములు-శిరసుల కుప్పలు
రక్కసి సేన తల్లడిల్లెను.

అలంకరించిన హయములు కూలెను
మత్తేభములు తునక లాయెను
తేరులు-పదునగు శరముల విరిగెను
శాకము లన్నటు తరిగె భటులను.

ఆకర్ణాంతము లాగిన విల్లు
వలయాకారము తిరుగు చుండగా
సూర్యదేవుడై-రాముడు-శరములు
వాడి కిరణములు-అన్నటు వదలెను.

దావానలమున వనము కాలినటు
హరించి పోయెను అసుర సేనలు
కొందరు వీరులు ముందు కురికిరి
శరములు తాకి నేల కొరిగిరి.

తరిగిన తలలు-విరిగిన కరములు
కుప్పలు-తెప్పలు-ధనుర్బాణములు
ధ్వజ-పతాకలు-తేరుల గుట్టలు-
మిగిలిన వారు ఖరుని జేరిరి.

గరుత్మంతుని రెక్కల విసురుకు
కొట్టుకు పోయిన వృక్షము లన్నటు
రాముని శరముల తాకిడి కోర్వక
భయముతొ - ఖరుని జేరిరి కొందరు.

ధైర్యము గరపి- ఖరుడు ఎదుర్కొన
వీరులు తిరిగి రామునిపై బడి
పౌరుషమ్ముతో ఎదిరిపోరగా
రాముని శరముల ఒరిగిరి వారు.

గిర్రున తిరిగెడి గుండ్రటి విల్లు
శరములు తీసిన జాడ తెలియదు
అక్షయమ్ములా శరములైనవి
సమరము గాంచిన గగుర్పు కలిగెను.

ఈటెలు- కత్తులు- శరపరంపర
రాముని పైకి విసరిరి దనుజులు
సింహనాదము- టంకార ధ్వని
దిక్కులు నిండెను రామబాణముల

రాముడు ఒడుపుగ- గాంధర్వాస్త్రము
విడిచెను - మహిమాన్విత మగు అస్త్రము
భీకరాస్త్రములు సృజించి వేసెను
దిశల చీకటులు క్రమ్ముకున్నవి.

రవి కిరణములవి నేలబడవయె
ఆకసమంతయు చీకటి నిండెను
రాక్షస సేన తునకలైనది
భీకర దనుజ వినాశము జరిగెను.

శరములు తగులుట- ఖండము లగుట
అసువులు వీడుట- అన్నియు కూడ
ఏక కాలమున జరిగిపోయెను
గాంచి-మునులు అతి సంతసమందిరి.

శిరస్త్రాణముల- శిరసుల కుప్పలు
భుజకీర్తులతో- కరముల గుట్టలు
తెగిన తొడలవి- గజాశ్వము లవి
రథములు- టెక్కెములన్నీ ముక్కలు.

తెరచిన నోరుల పరుగిడు భటులు
తెగిన వీరులు- కూలిన గజములు
దానవసేవ దహింపబడగా
దూషణు డపుడు వీరుల నంపెను

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 26 దూషణుడు సేనతో మడయుట

అయిదు వేలగు కఠిన దేహులను
దూషణు డంపెను రామునిపైకి
వజ్రసమమగు శూలమ్ములతో
రాముని తాకిరి వారందరును

అతిశయించిన తేజము తోను
ఆయుధమ్ములను- త్రుంచె- శరముల
మేఘము వర్షము కురిసినట్టుగ
శర వర్షముతో తడిసిరి అసురులు.

భుజ బలమ్ముతో దూషణు డపుడు
వజ్రము పోలు శరములు వదలెను
రామచంద్రుడు ఒక్క బాణమున
అసురుని ధనుసును ఛేదించుచును

నాల్గు బాణముల-నాల్గు అశ్వముల
కూల్చి- అంతట మూడు బాణములు
దూషణు రొమ్మున నాటగ విడచెను-
అంతట అసురుడు అగ్రహమంది

బంగరు కట్లతొ గిరి శిఖరము వలె
సురల మర్దన చేయగ చాలిన
పిడుగులు-వజ్ర సమానము అయిన
పరిఘ నందుకొని ముందు కురికెను.

విసురుగ ముందుకు వచ్చెడి అసురుని
కరముల-రెండు-శరములు వేసి
ఒడుపుగ త్రుంచెను రామచంద్రుడు
ఇంద్ర ధ్వజమై పరిఘ కూలెను.

కరములు తెగిన దూషణు డంతట
ధరణిని బడెను అసువులు వీడెను
భూతములన్నీ పొగడెను రాముని
కొందరు వీరులు రాముని తాకిరి.

స్థూలాక్షుడొక పట్టసమ్మును
మహాకపాలుడు శూలమునంది
ప్రమాధి దనుజుడు గంద్ర గొడ్డలిని
త్రిప్పుచు రాముని పైబడరాగా

పదును బాణముల రామచంద్రుడు
మహాకపాలుని తలను నరికెను
ఘనమగు శరమున ప్రమాధి కూలెను
స్థూలాక్షు కళ్లలొ-శరములు కూరెను.

అయిదు వేలగు శర పరంపరతొ
అయిదువేలగు దనుజుల త్రుంచగ
క్రోధము నిండిన ఖరుడంతటను
వీరులనంపి-తానే సాగెను.

కాల కార్ముకుడు-మేఘ మాలియు
మహామాలియు-దుర్జయుండును
యజ్ఞశత్రువు - విహంగముడును
రుధిరాసనుడు - సర్పాస్యుడును.

పృథుగ్రీవుడు-శ్యేనగామియు
కరవీరాక్షుడు-పురుషుడు-మొదలగు
ద్వాదశ సంఖ్యలొ సేనాపతులు
ఒక్కుమ్మడిగా రాముని తాకి

శర వర్షము కురిపించగ నపుడు
వజ్రము వంటి శరములు వదలి
శత్రు శరములను లీలగత్రుంచి
తరువులు పడినటు-వీరుల కూల్చెను.

గన్నేరాకుల పోలు శరములు
ఆకర్ణాంతము సూటిగ లాగి
నూరు వదలగా-నూర్గురు మడసిరి
వేయి శరములతొ చచ్చిరి వేయి.

నెత్తుటి కాల్వలు-దేహ ఖండములు
విరిగిన తేరులు-ఒరిగిన గజములు
జరిగిన శిరసులు-సొమ్ముల రాసుల
కాలుని - పాక శాలగ తోచెను.

నేలనుబడిన దుష్ట రక్కసుల
కేశములచ్చట నెత్తుట తడిసి
దర్భలు నిండిన యాగ వేదికను
పోలియుండెను సమర వేదిక.

దుష్టులు-గర్వోన్మత్తులు అయిన
క్రూర కార్యముల చేయి తిరిగిన
పదునాల్గువేలగు దనుజ వీరులను
ఒంటిగ నిలబడి రాముడు త్రుంచెను.

ఖరుడు - త్రిశిరుడు మిగిలిపోయిరి
మిగిలిన వీరులు యమపురి కేగిరి
రామభద్రుడు - వీరభద్రుడై
సమరాంగణమున నిలచెనప్పుడు
॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 27 త్రిశిరుని వధ

సమసిన సేనల కన్నుల గాంచి
సాగెనుఖరుడే సమరము చేయగ
సేనాపతి ఆ త్రిశిరు డంతట
వీరుని నిలిపి పలికెను అపుడు :

''సుర నాయకునే గెలిచిన వాడవు.
నా అసువులవి-నిలచి యుండగా
పోరుకునిన్ను పంపుట జరగదు
పోరెద-ప్రతిన నా చాపముపై.

రాముడొ-నేనో-మడయుట తథ్యము
రాముడు ఒరిగెన - సుఖముగ బొమ్మ
రెండవదే మరి జరిగి పోయినచొ
నీవు స్వయముగా ఎదిరి పోరుము.''

మూడు శిఖరముల కొండను పోలి
తేరును ఎక్కి పోరుకు పోయి
నగార ధ్వనిగా-సింహ నాదమున
శర వర్షము కురిపించె నచ్చట.

విజయమూర్తి శ్రీరామచంద్రుడు
వింటిని గిరగిర త్రిప్పుచు నంత
వాడి బాణములు-కఠిన శరములు
విడచెను త్రిశిరునిపై నంతటను.

త్రిశిరుడు క్రోధము నిండిన వాడై
అతి ధైర్యముతో పోరగ సాగెను
అద్భుత యుద్ధము జరిగెను అపుడు
కరి-సింహముల తీరుగ పోరిరి.

త్రిశిరుడు-మూడు వాడి బాణములు
రామచంద్రుని-నొసట నాటెను
అంతట రాముడు హేళన చేసి
నాల్గు బాణములు తొమ్మన విడచెను

నాల్గు బాణముల-హయముల దునిమి
ఎనిమిది శరముల-సారథి ద్రుంచి
ఒక్క బాణమున-టెక్కెము గూల్చి
దుముకుచు పైబడు త్రిశిరుని పైన

అగ్రహమ్ముతో అమిత శక్తిగల
బాణము వేయగ వక్షము చీలి
చేష్టలుడిగి ఘన శిరములు రాలి
నేలనుబడి ఆ అసురుడు చావగ

ఖరుని సేవకులు- అశ్రితులందరు
చెదరిపోవగా ధైర్యము గొలిపి-
చంద్రుని పైబడు రాహువు తీరుగ
ఖరుడంతటను పోరగ నిలచెను.
॥శ్రీ రఘురాః

❋❋❋

# 2 8 శ్రీరాముడు ఖరునితో పోరుట

''ఒక్కడు - ఇందర వీరుల కూల్చెను
నిక్కమా యిది - ఎట్టి విక్రమము!
దక్కుదునా మరి - అయినా తప్పదు
ఒక్కడినై నే పోరెద నిపుడు''

శరముల- రాముని నొప్పించి అట
నిలచెను- లయకాలములో యముడై
అలుపు నెరుగని రాముని గాంచి
అదిరిపోయెను- గుండెలు- ఖరునకు.

ఇంద్రుని పైకి- నముచి రక్కసుడు
పోరగ పోయిన తీరుగ నపుడు
క్రూర సర్పముల తీరుగనున్న
శరములు కుప్పలు తెప్పలు వదలెను.

వీరవిక్రముని బలమిది ఏమి!
అని ఆశ్చర్యము నందు చుండగా
అల్పమృగమును హరి చూచినటు
ఖరుని చూచెను సింహ విక్రముడు.

అస్త్రశస్త్ర పాండిత్యముతో
భ్రుకుటిని ముడిచి నిలచిన ఖరుడు
నాల్గు దిక్కులలొ నింపె శరములు -
రాముడు- తన భుజల బలముతొ తిరిగి

అసురుడు ఖరుడు- రవి కాంతులతో
వెలిగెడు తేరును అధిరోహించి
వింటిని త్రిప్పుచు పాశము దాల్చిన
యముని తీరుగా తాకెను రాముని.

జాగుచేయక శరముల నపుడు
నింగి నిండునటు వదలగ నంత
సందులేక నా శర కిరణములు
రవి కిరణములను నిలపెను నింగిని.

కార్చిచ్చును మరి తాకు శలభమై
శర విన్యాసము వెలయునట్టుగా
రాముని వింటిని- వింటిని దాల్చిన
పిడికిలి విడునటు- నాటె శరములను.

పోరగ సాగిరి జయాభిలాషులు
మదగజమ్మును అంకుశమ్ముతో
పొడిచిన రీతిగ- ఖరుడు- బాణముల
బాధించెను శ్రీరామచంద్రుని.

రవికాంతులను పోలి వెలిగెడు
ఏడు శరములతొ రామచంద్రుని
కవచము త్రుంచి ఉత్సాహముగా
సింహనాదము చేయుచు నంత

ఎన్నో శరముల రాముని గొట్టగ
రామచంద్రుడట నిలచెను వీరుడు
పొగలేనట్టి అగ్ని హోత్రమై
ప్రళయ కాలమున రుద్రమూర్తియై.

మూర్తిగ నిలచిన కోపమన్నటు
ముని యొసగిన ఆ విష్ణు చాపమును
మహిమా న్వితుడు సంధించి అట
ఖరుని ధ్వజమును నేలకు రాల్చెను.

యుద్ధ రహస్యము తెలిసిన ఖరుడు
వాడి శరములు నాలుగు విడచి
రామచంద్రుని ఆయువు పట్టుల
బాధించగను- రాము డంతట.

ఖరుని శిరముపై నొక్క బాణము
బాహువులందు రెండు బాణములు
మూడు బాణములు వక్షమునందు
విడిచి - అసురుని బాధించె నట.

ఖరుని బాణముల లక్ష్య పెట్టక
పదమూడమ్ములు రాముడు వేయగ
ఒక్క బాణమున- కాడి విరిగెను
నాల్గు శరముల- హయములు కూలెను.

మరొక్క అమ్మున సారథి కూలగ
ఇరుసును త్రుంచెను రెండు బాణములు
మూడు శరములు నొగను విరిచెను
పదిరెండవ శరము ధనసును త్రుంచగ.

పదమూడవదై పదునగు బాణము
ఖరుని దేహమును గాయపరచెను
సారథి ఒరిగి- అశ్వములుడిగి
విరిగిన తేరు గలిగిన ఖరుడు.

ఘనమగు గదను చేత ధరించి
రాముని పైబడ - ధరణికి దూకెను
అంతట-సురలు అంబర వీథిని
కోసలాత్మజుని స్తోత్రము చేసిరి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 29 ఖరుని నిర్వీర్యుని జేయుట

గదతో నిలచిన ఖరుని గాంచి అట
రాముడు మెత్తగ వినబడు మాటల
గుండెను చీల్చే కఠిన వాక్కులతో
దుష్కార్యములు చేసితి వనుచు.

"గజములు-హయములు-శాశ్వతమ్మని
అహంకారమున- దయనే మరచి
లోకులందరు ఛీ- ఛీ- అనెడి
దుర్మార్గములో నడచిన-నీచుడ!

జనులను-హింసల పాలు జేసిన
పరమేశ్వరుడే ఫలితము నందును
నీవన నెంత-నీచదనుజుడవు
చేసిన కర్మ అనుభవించ వలె.

జనులను-హింసలు పెట్టిన వానిని
మట్టు పెట్టగా చూతురు వినుము
ఇంటిలో దాగిన పామును-జనులు
సాధులు-దుష్టులు ఒకటై చంపర?

స్వలాభమ్ముతో ధూర్తుడు నడచి
దుష్టబుద్ధితో జనులను అతడు
ఇడుమల పాలు చేసినచో మరి
నలికిల పామై-చచ్చును దెబ్బల.

దండక వనిలో తపసులొ నుండెడి
సాధుపుంగవుల చంపిన హీనుడ!
ధర్మనిష్ఠులను దునిమిన దనుజుడ
ఏమి ఫలమును పొందగోరితివి!

ధర్మ వర్తనులు - మునిపుంగవులను
చంపిన నీదగు సంపదలన్నియు
వేరు నశించిన తరువు కూలినటు
నిలబడ లేక - ధరణిని బడవా?

విత్తు నాటగనె ఫలములు రావు
ఋతువులు మారి ఫలముల నిచ్చును
నరుడు చేసిన పాపము లటులే
సమయము రాగా- అనుభవించనగు.

విషాహారము కీడు చేసినటు
పాపకార్యముల - ఫలములు తప్పక
అనుభవించవలె- జనులందరును
దాట నశక్యము- దనుజుడ వినుము.

దుష్కార్యములను చేసెడి దనుజుల
లోకాపకారము చేసెడి దుష్టుల
దునుమగ-నేను- రాజు ఆనతిని
వచ్చినాడ-విను దనుజ వీరుడా!

పుట్టలోనికి పోవు నాగులై
నీ శరీరమున శరములు దూరి
నిను- నీ భృత్యుల- నీచే మడసిన
మునులత్రోవలో నడపును వినరా!

తాపసోత్తముల చంపుట ఘనతా!
కండ కావరము చూపర నాపై!
యుద్ధము నందు నేల కొరిగిన
నిన్ను గాంతురా పుణ్యమూర్తులు.

తాటి పండును రాల్చినట్టుగా
రాల్చెద నీ తల- అసురుడ! ఇపుడే
నీ బలమంతయు చూపుము నీవు
అటు పిమ్మట నే- చంపెద నిన్ను.''

గుండియ పగిలెడి కఠినోక్తులను
పలికిన రాముని గాంచి ఖరుడట
''నిస్సారమగు సేనను చంపిన
వీరుడ వగుదువ! మాటలు చాలు.

బలవంతుడవా- పొగడు కొంటివా
నిన్ను నువ్వు మరి పొగడు కొనుటెటు-
మగసిరి గలిగిన బలవంతుడు- తను
తన కార్యములను చెప్పుకోడయా!

నీచ భూపతులు - నీవలె - యిటులే
వ్యర్థభాషణము చేయుచుందురు
మరణ సమయమున- పొగడు కొనుటది
దర్భాగ్రమున మంటగ తోచద?

నిన్ను నువ్వు మరి పొగడు కొనుటచే
హీనత్వమది కనబరచితివి
గదతో నిట-నే-ధాతువులున్న
గిరివలె నుండుట కనబడలేదా?

లయకాలములో-యముడు-పాశమున
లోకమ్ములను హింసించినటు
నా-యీ గదతో చంపగ చాలన?
బలహీనుడ-నువు చూడుము నన్ను.

నిన్ననవలసిన వెన్నో యున్నవి
లేదు నాకు మరి వ్యవధి ఇప్పుడు
రవి జారినచో యుద్ధము సాగదు
నిశీథిలో నిను చంపిన ఘనతా?

భర్తలు మడసి- ఏడ్చెడి స్త్రీల
అశ్రులు తుడిచెడి - పని యొకటున్నది
ఘన కార్యమది - మాటలలోబడ
సాగదు గనుక జాలము చేయను.''

అటుల పలుకుచు ఘనమగు గదను
రామచంద్రుని పైకి విసరగా
నాశము చేయగ వచ్చెడి గదను
త్రుంచెను రాముడు వాడి బాణమున.

మంత్ర బలముతో పన్నగమ్మది
ముక్కలయినటు రామ బాణమున
ముక్కలైన తన గదను గాంచిన
మనసు వికలమయె ఖరుని కంతట.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 30 ఖర రక్కసుని వధ

నిర్వీర్యుడయి నిలబడి చూచెడి
ఖరునితొ పలికెను రామచంద్రుడు :
''ప్రగల్భమ్ములు పలికిన దనుజుడ
ఏదీ నీ గద? చీల్చబడినది.

మూర్ఖుడ వీవు వదరితి వెన్నో
చచ్చిన వీరుల కొరకు ఏడ్చెడి
స్త్రీల అశ్రువులు తుడిచెద నంటివె!
సత్యదూరము ఆ మాట యిక.

గరుత్మంతుడు అమృతమ్మును
హరించినట్టు-నా బాణములు
నీ ప్రాణమును హరించగానే
భూమి త్రాగు-నీ వేడినెత్తురు.

చేతులు చాచి-ధరణినిబడి-నువు
ప్రియురాలిని మరి కౌగిలించినటు
మరణించ గను మునులందరును
సుఖశాంతులను పొందగలరురా!

నా శరములతో-జనస్థానము
రుద్రభూమిగా మారిపోవగా
దండక వనిలో సంయమీంద్రులు
స్వేచ్ఛగ తిరుగుచు సుఖపడగలరు.

మిగిలిన రాక్షస స్త్రీలు భయముతో
పరుగిడి పోదురు నాల్గుదిక్కులా
నీకై ఏడ్చెడి నీ యిల్లాండ్రకు
శోకమన్నది తెలియును-నీచుడ!

విప్రకంటకా! దయాదూరుడా!
నీ భయమున ఇట మునిపుంగవులు
హవిసును వ్రేల్చగ భయపడు చుండిరి
కలుగున వారికి- అట్టి భయ మిక?''

రామభద్రు డటు పలుకుట వినిన
ఖరుడు పలికెను :''నీచ మనుజుడా!
ప్రాణాంతకమగు సమయములోన
పొగరుతొ నుంటివి తగునా నీకు?

మృత్యువు చేరువ కాగా-మతిచెడి
మంచిచెడ్డల వివరము తెలియదు-
ఇంద్రియమ్ముల జ్ఞానము తొలగును
వదరును ఇటులే - వదరితి వీవు.''

అనుచు పలుకుచు నలువంకల గని
రక్తము కారెడి పెదవుల నొక్కి
సాలవృక్షమొక దానిని పెరకి
చచ్చితి వీవని విసరెను అసురుడు.

వచ్చెడి తరువును శరముల చీల్చి
దుష్టుని పైన- దయ తగదను కొని
ఇనుమడించిన కోపముతోను
కన్ను లెఱ్ఱనై చెమటలు నిండి

బ్రహ్మ దండమును మించిన తేజము
అగ్ని హోత్రమై మండెడి శరము
అగస్త్య మహఋషి ఇచ్చిన బాణము
ఇంద్రుని బాణము-విడచెను రాముడు.

అమోఘ శరమున దిక్కులవిసెను
ఖరుని వక్షమున శరము దూరగా
కాలరుద్రునిచె కాల్చగబడిన
అంధకాసురుని తీరున బడెను.

తడియు-పొడియు, గానిది-నురుగు
దానిని వజ్రాయుధముకు పూసి
ఇంద్రుడు చంపెను-నముచి రక్కసుని
కృత- బలులిద్దర త్రుంచె వజ్రము.

అటులే- రాముని అమోఘ శరమున
జనస్థానమున ఖరాసురుండు
చచ్చిపడెను- అట సంయమీంద్రుల
అగ్ని హోత్రములు మండె నొక్కపరి.

ఖరుడు కూలగా ముదము నందిన
రాజ ఋషులును-ముని పుంగవులు
సీతాపతిని చూచి పలికిరి :
''రామా! నిన్ను ఇటకు పంపమని

శరభంగుని కోరగ-సురపతి వచ్చెను
శరభంగ-సుతీక్ష్ణాది ఋషులందరును
అగస్త్య మహర్షి- ఉపాయమ్ముగా
దండక వనికి నిను రప్పించిరి.

దుష్టుల దునుమగ నిన్నీవనికి
జేర్చితిమయ్యా! కార్యము తీరెను
నిన్ను తలచుచు దండక వనిలో
మునులు సుఖముగ బ్రతుక గలరయా!''

మునులా విధముగ పలుకు చుండగా
దేవ దుందుభులు మ్రోగెను నింగిని
సురలు-చారణులు-పుష్ప వర్షమును
దివ్యమూర్తిపై కురిపించి రట.

సురలు-మునులచె పూజల నంది
సతి-సోదరులు వెంట నడవగా
ఓటమి నెరుగని విక్రమమూర్తి
గజ గమనముతో చేరె నాశ్రమము.

''కార్య సాధనా సామర్థ్యమ్మది
అతిశయించిన విక్రమమ్మది
పదునాల్గు వేలగు దనుజుల త్రుంచెను
కావున రాముడు విష్ణుమూర్తియగు.''

ఆశ్రమమందు అడుగిడి నంతనె
రిపు సంహరుని-ముని సేవకుని
నిజకాంతుని శ్రీరామచంద్రుని
కౌగిలించుకొనె మైథిలి ముదముతొ

రాముని పొగడుచు-మనశ్శాంతితో
సెలవుల కరిగిరి సురలందరును
అంతట-సీతతొ-రామానుజుడు
వచ్చెను-గుండెలు పొంగిన భక్తితొ.

ఒక్కడె- అక్కడి రక్కసు లందర
ఉక్కడగించి - చెక్కు చెదరక
చక్కగ నిలచిన - ముని పూజితునకు
గ్రక్కున కౌగిలి యిచ్చెను జానకి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 31 సీతాపహరణ వలదని మొదటి మారు మారీచుడు చెప్పుట- దశవదనుడు హితము వినుట

జనస్థానమున మిగిలిన - అసురుడు
అకంపనుండు బ్రతికి బయటపడి
లంకాధీశున కంతయు జెప్పెను
ఖరాది అసురులు మడయుట తెలిపెను.

హుతవాహనుని దహింపగలను
మృత్యు దేవతకు మృత్యువు నగుదును
సూర్య చంద్రులను కాల రాచెద''
అనగా - భయపడి పలికెను అసురుడు :

అదిరిపోయెను-దశవదనుడట
కన్నుల నిప్పులు రాల్చుచు పలికెను :
''మనోహరమ్మగు జనస్థానమును
కూల్చినవాడు- ఎటమన గలడు?

''అభయము నిమ్ము లంకాధీశా!
అంతయు నుడివెద'' - అనగా రాజు
అకంపనునకు అభయము నియ్యగ
అంతయు చెప్పెను రావణ ప్రభువుకు.

ఇంద్రుడు-కాలుడు-విష్ణు-కుబేరులు
నన్నెదిరించి సుఖపడ గలరా?
దండధారి - ఆ యముడే వచ్చిన
దండించగ-నే చాలుదు వినుము.

''గౌరవింప దగు బాహు సంపదతొ
చంద్ర బింబమగు వదనము గలిగి
శరకీలలు గల అగ్నిహోత్రుడు
అపజయ మెరుగని అమిత విక్రముడు.

దశరథరాజుకు తనయుడాతడు
సత్కీర్తికి- తా-నెలవగు వాడు
ఒక్కడె నిలచి ఖర-దూషణులను
జనస్థానమున రూపు మాపెను.''

వార్తను వినిన రాక్షస నాథుడు
పెనుబాములవలె శ్వాసను విడచి
''ఇంద్రాదులను తోడు తెచ్చుకొని
పోరెన-చెప్పుము- ఒకడెటుగెలుచును?''

''విను మహరాజా! వివరించెదను
ధనుర్ధారులలో మేటి ఆతడు
దివ్యాస్త్రములు -సుగుణ సంపదల
పోరున - సురపతి సమమగు వాడు.

సుర విక్రముడు - సూర్య సమానుడు
రామ నామముతొ రాజిలు వాడు
అగ్నికి - వాయువు తోడయినట్టు
అతని తమ్ముడూ అంతటివాడే.

కమలము వంటి వదనము గలిగి
లక్ష్మణు డనెడి పేరున బరగును
తమ్ముని సాయము లేకనె-రాముడు
ఒంటిగ కూల్చెను జనస్థానమును.

దేవత లాతని తోడుగ లేకయె
శరముల నాతడు తీయుట తెలియక
అయిదు తలలుగల విష నాగులయి
అసుర వీరులను మ్రింగి వేసినవి.

ఏవిధముగను భయపడి పోదురొ
ఆయా విధముగ-రాముడు తోచెను
ఎక్కడ చూచిన అక్కడె రాముడు
ఉక్కడగించెను ఒక్క వీరుడే!''

అమిత కోపమున లంకాధీశుడు
పోరగ పోదును అనగా నపుడు
రామ విక్రమము దశకంథరునకు
లీలగ తెలిపెను-అకంపనుండు :

''రాజా! పోరగ-పోయిన సాగదు
బ్రహ్మేంద్రాదులు గెలవగ చాలరు
వరద నాతడు ఆపగలుగును
నింగిని - శరముల చీల్చగ చాలును.

శరముల-వాయువు నరికట్టును-విను
భూమిని-జలధిలొ ముంచగ చాలును
శ్రీమంతుడు-శ్రీరామచంద్రుడు
ఉద్ధరింపగా చాలును భూమిని.

సర్వలోకముల-సంహరించి మరి
సృజించ గలడు-శ్రీరాముడు-విను!
పంక్తికంథరా! పోరున నీవు
రాముని గెలువగ సాధ్యము కాదు.

పాపికి మోక్షము దక్కదు-అటులే
దనుజులు-మనుజులు అందరు కూడి
రాముని గెలువగ చాలరు వినుము
నీ వన్నది- ఒక లెక్క కాదు కద!

అయినా వీలగు మార్గము తెలిపెద
రాముని జయించ సాధ్యమైనది
నిండు మనసుతో- లక్ష్యముతోను
విను-నే చెప్పెడి ఉపదేశమ్మును.

రాముని మోహన రూపము తెలిపితి
అతని భార్య- అతిరూపసి మరి
ఆమె అందము పొగడ నసాధ్యము
అంతటి అందము ఎందునలేదు.

సింహ మధ్యయై- రత్న విభూషిత
ప్రాయపు వెలుగుల నవయౌవ్వనవతి
సుర- గంధర్వ- అచ్చరలందున
ఆమెకు సరిపడు అందము లేదు.

ఆమెను- లంకకు తెచ్చితివా మరి
ఎడబాటుతొ- ఆ సుమశరు శరముల
రాముడు- అసువులు నిలపగ చాలడు''
అనగా రాజు ఆమోదించెను.

ఉదయము కాగా పోదును అనుచు
అకంపనుని మరి పొమ్మని చెప్పి
రవి తేజముతో వెలుగు ఖరములను
పూన్చిన తేరును ఎక్కి వెడలెను.

గగన మార్గమున సాగెడు తేరు
మేఘములందు చంద్రుడాయెను
తెల్లని రథమున సాగిన రాజు
మారీచాశ్రమ మందు ఆగెను.

తేరు దిగిన ఆ లంకాపతికి
ఆసనమ్మును- అలభ్యమైన
భక్ష్య భోజ్యముల నిచ్చి అంతట
మారీచుడు- తానడిగె కుశలము :

''రాక్షస రాజా! క్షేమమేకదా?
ఎట్టి ఆపద కలుగలేదు గద
ఒంటరివై నీ విట వచ్చుటది
సందేహమును కలిగించునది.''

''రాముడనియెడి మానవు డొకడు
జనస్థానమున అసురుల జంపెను
అతని ఆలిని- అపహరించగా
వచ్చితి-సాయము చేయుము తండ్రీ!''

మాటలు విని మారీచుడు పలికెను :
''మదిలో నీయెడ శత్రుత్వమును
పైకి మాత్రమే మిత్రత్వమును
కలిగిన వాని- దురూపదేశము.

సీతను తెమ్మని చెప్పిన వాడు
హితుడు మాత్రము కానేకాడు
ముల్లోకముల నీ విక్రమము
భగ్నము కావలె నన్న కోరికది.

విషసర్పమునకు కోర పీకమని
పురిగొల్పిన వాడెవ్వడు రాజా!
నిద్రలోనున్న- హరితల తన్నగ
నిను పురిగొల్పిన దెవ్వరునాయక!

గొప్ప వంశమను-తొండము గలిగి-
పరాక్రమమ్మను-మద జలమ్ముతో-
గొప్ప బాహువులు దంతములై-మరి
శత్రు భయంకర మత్తేభమయా!

ఓ సురవైరీ! అట్టి గజమును
రెప్పలనెత్తి తేరి చూడకు
యుద్ధ భూమిలో-నిలచుట అనెడి
పైకి ఎత్తిన-వాలము గలిగి-

రాక్షసులనెడి మృగముల చంపెడి
వాడి శరములే-గోళ్లుగ నున్న
కరకు కత్తులను-కోఱలు గలిగిన
బలిష్ఠమైన నరసింహము వలె

నిలచిన రాముడు-పరులెవ్వరిని
బాధించక-తా-నిద్రించగను
తెలివిలేక మరి నరసింహమును
లేపుట తగునా? ఆలోచించుము.

చాపము-ఘనమగు మొసలిగ నుండి
భుజబలమనెడి బురద గలిగియు
శరపరంపరను అలలు గలిగిన
సీతాపతి- ఒక పాతాళమయా!

పాతాళమున బడితివ - అంతే -
అంతు తెలియదు లంకాధీశా!
క్షమించు రాజా! కటువుగ చెప్పితి
నిజముగ-మేలు కోరెడి వాడను.

కోపము మరచి లంకకు పొమ్ము
భార్యలజేరి సుఖముగ నుండుము
రామచంద్రుడు-ప్రియసతి సీతతొ
సుఖముగ నుండును-మరలుము ఇపుడే.''

సూటిగ చెప్పిన హిత వాక్యమ్ములు
మనసు నిండుగా వినిన రావణుడు
మరలిపోయెను లంకాపురికి
మందిరమందు సుఖముగ నుండెను.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 3 2 రావణాసురుని కొలువునకు శూర్పణఖ వచ్చుట

ఖర-దూషణులు-త్రిశిరుడాదిగా
పదునాల్గు వేలగు రక్కసులందరు
జనస్థానమున హతులైపోగా
హతాశురాలై పోయి-శూర్పణఖ

రావణు పాలిత లంకకు పోయెను
పుష్పక మందు-తేజము నిండి
మంత్రులతో పరివేష్టితుడైన
హోమాగ్నివలె వెలుగుచునున్న

సర్వ భూతములు-గంధర్వులకు
తాపసోత్తములు మొదలగువారికి
జయింప సాధ్యముగాని వీరుడు
యమునిగ తోచెడు రాక్షసరాజు.

దేవాసుర సంగ్రామ మందున
వజ్రాయుధపు దెబ్బల గురుతులు
ఐరావతము పొడచిన మచ్చల
కరకు దేలిన వక్షస్థలము.

ఇరువది కరములు పది శిరములతో
వెల్లగొడుగు-వింజామర లుండగ
ఎత్తగు విశాల వక్షస్థలముతో
రాజ చిహ్నముల రాజిలు వీరుని

వైడూర్యము వలె మెరసెడి వానిని
రత్నకుండలము లమరిన వానిని
మెరయు దంతములు-విశాల వదనము
చక్రాయుధపు గాయపు గురుతులు.

సముద్రాలనే-కలంచ గలిగిన
ఇంద్రాదులనే తిరస్కరించే
గిరులన్నిటిని మీటగ చాలిన
ఒకే ఒక్కడగు-రాక్షస ప్రభువును

పరస్త్రీ మోహము నిండిన వానిని
దివ్యాయుధములు గలిగిన వానిని
యజ్ఞవిఘ్నము చేసెడి వానిని
సర్పరాజునే గెలిచిన వానిని

తక్షకు భార్యను హరించితెచ్చి
కైలాసమున ధనపతి నెదిరి
దివ్య పుష్పకము గెలిచిన శూరుని
లంకా ధీశుని - పంక్తి కంధరుని.

నందన వనము - చైత్ర రథముల
అందమైన - ఆ ''నళిని'' సరస్సును
కోపము నిండి - నాశము చేసిన-
సూర్య-చంద్రులను నిలుపగ చాలిన

పదివేలేండ్లు తపస్సు చేసి
శిరములు కోసి పూజలు చేసి
దేవ-గంధర్వులు-దైతేయులచే
పిశాచ-పతంగ- ఉరగాదులచే

మనుజులుగాక మరి ఇంకెవరిచె
మరణము లేదని వరమును పొంది
హోమమ్ములను భగ్న పరచుచు
హవిస్సులను మరి హరించు అసురుని

కఠిన మనస్కుని-దయాదూరుని
ఇంద్రవైరిని-లంకాధీశుని
సర్వప్రాణుల పీడించుచును
సురలను పరుగిడ జేసిన వానిని

అట్టహాసముగ నవ్వినంతనే
గర్భ స్రావమగు సుర స్త్రీలకును
భుజ బలమ్ముతో ఐరావతపు
దంతమ్ములనే విరచిన వానిని.

ప్రజా పీడనము పరమధ్యేయమై
దురాలోచనల తొందర గలిగిన
ప్రళయ కాలమున యముడై తోచెడు
అన్నను గాంచి-పలికె శూర్పణఖ.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 3 3 శూర్పణఖ రావణుని నిందించుట

సభా మధ్యమున సచివులు వినగా
విషయము అడగని అన్నను గాంచి
దురాగ్రహమ్ము నిండిన సోదరి
పలికెను ''మూఢుడ-దుర్మదాంధుడా!

పరిపాలించగ ముందుకు రాక
పరులకు పెత్తన మిచ్చినచో మరి
జలధిని మునిగిన పర్వతమ్ము వలె
చెడిపోయెదరు-నాశన మగుదురు.

కామ- భోగముల నిత్యము తేలుచు
నీ ఉనికిని- నువు మరిచేపోయి
నిన్ను మ్రింగగా అదనుకు వేచిన
మృత్యువు నసలే చూడక పోతివి.

నీ కపకారము చేయుట కొరకు
దేవ- దానవులు వేచియుండగా
అప్రమత్తుడై యుండక పోతివి
అసువులు నీవి-ఎటుల నిలచును?

నిరతము అతివల సుఖముల తేలి
కామ విషయముల కాలము మరచిన
రాజును- ప్రజలు గౌరవించరు-
శ్మశాన శిఖలను గౌరవింతురా?

వయసు గడిచినా వివరము రాదు
రాజై- ఎట్లు సుఖపడగలవో!
తెలివి తేటలు తరిగి పోయినవి
స్వంత వేగుల లేక పోయిరా?

మతి చెడిపోయి - రాచకార్యముల
గతి గమనించని స్త్రీ లోలుఢు - విను
పూర్తిగ చెడును- రాజ్యము చెడును
వాని కార్యములు సర్వము చెడును.

వేగుల గుట్టు తెలియక పోయి
ధనాగారమున పెత్తన మిచ్చి
ఇతరుల మాటలు- విని-పాలించే
రాజు-తప్పక పామరు డగును.

వేగులులేక- విషయము తెలియక
మిత్రులు, శత్రులు ఎవరో తెలియక
పుర జనులకు మరి దర్శన మివ్వక
చెప్పుడు మాటలు నమ్ముచు పోయెడి

చార చక్షువని రాజునందురు -
దూర విషయములు-వేగుల వలన
సమక్షమందే చూడగ వలెను -
కానీ, నీకది వర్తించదయా!

అస్వతంత్రుడగు అవనీ నాథుని
వీడిపోదురు జనులందరును
బురదను గాంచి పరుగిడు గజమై
తొలగి పోదురా రాజును వదలి.

సచివులు-నిన్ను కొలుచు చుండగా
సర్వ సుఖముల మునిగిపోయి - నువు
స్వజనులందరు - జనస్థానమున
సమసిన విషయము తెలియక పోతివి.

పదునాల్లు వేలగు వీరులందరిని
ఖర-దూషణులను, బంధులందరిని
వింటి బలముచే- ఒంటిగ నిలచి
రామచంద్రుడు చంపెను వినుము.

తమ్ముల, బంధులనందరి నొకడే
సమూలమ్ముగా జంపి- అంతట
దండక వనిలో ఋషులందరికి
రావణ భయమును తీర్చెను వినుము!

లోభివి-వేగుల వేతన మీయవు
విషయము లేవియు తెలియవు తీరుగ
వారల వీరల మాటలు విందువు
నిన్నేమందును సోదర-రావణ!

శ్రమకు తగినటు వేతన మీయక
మదము నిండిన పొగరు బోతగు
స్వామికి- ఆపద కలిగినప్పుడు
సేవకులెవ్వరు సహాయపడరు.

అకారణముగ కోపించుచును
తన్నుతాను మరి పొగడు కొనుచును
గర్వము నిండిన రాజును-వినుము
భృత్యులు-బంధులు చంపెదరయ్యా!

కార్యాలోచన తెలివిగ చేయక
ఆపదలందు అండ నిలువని
రాజు-భ్రష్టుడై-తృణ హీనుడయి
దూరమగునయా! సానుభూతికి.

ఎండిన కట్టెలు-మట్టియు-దుమ్ము
ఏదో విధముగ ఉపకరించును
కానీ-రాజ్యము పోయిన రాజు
గవ్వకైనను పనికిరాడయా!

కట్టి విడచిన వస్త్రము మాదిరి
సిగలో వాడిన పూల మాలవలె
రాజ్య భ్రష్టుడగు అవనీ నాథుడు
నిరర్థకుండై-అనాథుడగును.

హెచ్చరికతొ మరి విజితేంద్రియుడై
ధర్మశీలుడై తెలివిని వీడక
ధరణి నేలెడు రాజు-సర్వదా
సిరులతొ సుఖముగ నుండును కాదా?

కనులు మూసికొని నిద్రించినను
నీతి నేత్రమును తెరచి ఉంచుకొని
దుష్టశిక్షణ - శిష్ట రక్షణతొ
ఏలెడి రాజును కొలుతురందరూ.

అట్టి గుణములలొ ఒక్కటైనను
నీలో వెదకిన దొరకవు-నిజము
దండక వనిలో విషయము తెలియదు
చారులు లేరా భోగలాలసా!

దేశ-కాలములు-గుణదోషములు
తెలియవు నీకు - రాక్షసరాజా!
శీఘ్రముగా నీ సిరులు తొలగును
దుఃఖించెదవు లంకాధీశా!''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 34 శూర్పణఖ దుర్బోధ

నిర్భయమ్ముగా సభలో పలికిన
సోదరి మాటలు వినిన రావణుడు
కన్నులెఱ్ఱగా జేసి పలికెను
విషయము తిన్నగ వివరించమనె.

''ఎవ్వడు రాముడు-ఎట్టి విక్రమము
రూపమెట్టిది - ఏల వచ్చెను
ఏ ఆయుధముతొ వీరుల జంపెను?''
అనగా చెల్లెలు విశద పరచెను :

''నిడుపగు కన్నులు-పొడవగు భుజములు
నారచీరలు - కృష్ణా జినమున
రూపమునందు మన్మథుడగును
దశరథ తనయుడు రామచంద్రుడు.

భీకర శౌర్య పరాక్రమ వంతుడు
బంగరు తొడుగుతొ భయమా విల్లు-
మిన్నాగులవలె చిమ్మ శరములను
శరములు తీయుట-వేయుట తెలియదు.

పండిన పైరు-వడగండ్లతొ మరి
వాలి పడినటు - సేనలన్నియు
నేల బడుట - నే గాంచితి నన్నా!
అమోఘ బలమా అస్త్ర బలమ్ము.

ఖర దూషణులను-వారి సేనలను
పదునాల్గు వేలగు వీరులందరిని
మూడు ఘడియలలొ- ఒక్క వీరుడే
నిలబడి పోరి - యమపురి కంపెను.

దండక వనిలో మునిజనములకు
అభయము నిడెను రామచంద్రుడు
ఆడుదానినని - దయతో వదలెను
చచ్చి బ్రతికితి కొన ఊపిరితో.

రాముని తమ్ముడు - లక్ష్మణు డన్నా!
అన్నిట - రాముని సరియగువాడు
అజేయు డాతడు - సేవలు చేయుచు
అన్నకు ఆతడు బహిఃప్రాణమే.

రాముని ప్రియసతి-పతిహితమతి-విను
నిండు చంద్రుని పోలెడి లలన
బంగరు వన్నెతొ - ఎన్నిక కీర్తితొ
శుభముల నెలవా లోకారాధ్య

సింహ మధ్యయై శోభకు గనియై
సర్వమంగళ శ్రేయోదాయిని
సుర-గంధర్వ కిన్నెరాంగనలు
చాలరు-కన్నులు చాలవు చూడగ.

కింపురుషాంగన లందము చూచితి
యక్ష కాంతలను-దైత్య కాంతలను
కాంచితి-కానీ-రాముని సుందరి
అందము వినలే-కన్నుల కనవలె.

సుందరి సీత-కౌగిలి అందిన
త్రిలోక పూజ్యుడై- ఇంద్రుని మించును-
లక్ష్మీ ప్రదయగు లోకారాధ్య
మూడు లోకముల గెలిచిన అందము.

అందములోన ఎందున వినని
సుందరి-యౌవ్వన-సుచరిత్రను గని
నిన్నూ - ఆమెను పోల్చి చూచుకొని
ఆమెకు తగిన భర్తవు నీవని.

దండక వనిలో వారల జంపి
అనాథ చేసి - ఆ అందమును
తోడి తెచ్చుకొని తేలుము సుఖముల
ఇపుడే లెమ్ము ఆలసించక.

నీకా అన్నుల మిన్న తగునని
నేనా జవ్వని నెత్తుక తెచ్చి
నీకర్పించగ బోతిని అన్నా!
నా ముకు-చెవులు కోసెను తమ్ముడు.

రామునిచేబడి మడసిన వీరులు
ఖరాది అసురులపైన నీకు మరి
ప్రేమ యున్నచో - దశరథ తనయుని
అతని సహాయుల చంపి రావలె.

స్వయముగ నీవే పోయి చూచిన
మన్మథునకు నువు దాసుడ వగుదువు
సీతను-భార్యగ గైకొనదలచిన
ముందుకు నడువుము కుడి కాలుంచి.

నా మాటలవి నీకు రుచించిన
అసుర నాయకా! శ్రీఘ్రమె బోయి
మల్లెసువాసన పోలు సుందరిని
అపహరించగ బయలుదేరుము.

నీ బలమెంతో తెలుసుకు - నీవు
బలవంతులతో పోరగ పొమ్ము -
నే నుడివితిని నీసుఖమున్కై
మునుల విరోధీ! ముందుకు సాగుము.

॥శ్రీ రఘురాముని॥

## 3 5 రావణాసురుడు రెండవమారు మారీచాశ్రమమునకు వెళ్ళుట

కొలువు తీరిన దశకంథరుడు
సోదరి పలుకులు-ములుకులు కాగా
గగుర్పాటుతో భయోత్పాతమున
సభ చాలించి-యోచన చేసి

పిశాచ ముఖముల ఖరములు గల్గిన
రథమును-సారథి సిద్ధము చేయగ
వెల్లగొడుగు-వెలిచామరమ్ములు
కాంచన-కుండల ద్వయము మెరయగ

నిర్ణయించుకొని, ఆ వెనువెంటనె
సారథి నొకనిని-తేరు తెమ్మన-
మనసగురీతిని పోగలిగినది
బంగరు రేకుతొ శోభలీనునది

వైడూర్యమువలె మెరసెడివాడు
ఇరువది చేతుల పంక్తికంధరుడు
పది శిఖరముల కొండగ తోచుచు
విలువగు వలువల - తేరును ఎక్కెను.

మేఘము వలె గర్జించు తేరుతో
అంబుదమ్మువలె ఆకాశమున
బయలు దేరెను- క్రూర కర్ముడు
మునుల విరోధి- రాక్షసరాజు.

చల్లని జలముల పవిత్ర కొలనుల
చక్కని ఫల- సుమ తరువులు నిండి
యాగ వేదికలు గల ఆశ్రమములు
మద్ది- తాళముల- నారికేళముల

కదళీ- పోక వృక్షమ్ములతో
నాగ- గంధర్వ- గరుడ- కిన్నెరులు
మితాహారమున నుండెడి మునులు
కామము గెలిచిన మహాను భావులు.

వైఖానసులు- వాలఖిల్యులు
సిద్ధ- చారణులు- మాషులు నిండి
ఒప్పు మీరగ వెలిగెడి తీరము
సాగర తీరము చేరెను రాజు.

ఆటల- పాటల- అలంకారముల
సురస్త్రీ లెంతో శోభగ నుండగ
హంస- క్రౌంచుల- తియ్యని స్వరముల
మహిత గంధము- మంగళకరముగ.

ఇంపగు వాద్యము- సంగీతమ్ము
దివ్య విమానములున్న స్థలమును
తపోబలము గల మహిత మూర్తులను
త్రోవలో గాంచెను రాక్షసేడు.

మనోహరమ్మగు వనములు నిండి
ధనధాన్యములతొ మంగళ కరమై
కరి- తురగములు- స్యందనమ్ములతొ
వెలిగెడి సంద్రపు తీరము గాంచెను.

ఆ ప్రదేశమున- నూరామడలు
విస్తరించిన- మఱ్ఱి వృక్షము
'సుభద్ర' మనెడి పేరు గలిగినది-
పూర్వము- వినతాసూనుడు బలముగ

స్వర్గము కేగి సుర తేబోవుచు
మార్గ మధ్యమున ఆహారముగా
కరినొక దానిని - ఒక తాబేలును
గోళ్ళతొ పట్టి- తరువును చేరి

తరువు శాఖపై వాలగనంత
ఫెళ్లున విరిగెను- అంతట ఖగపతి-
తరువు శాఖకు వ్రేలాడుచును
తపములో నున్న వాలఖిల్యులకు

హాని జరుగును- అనెడి భయముతో
ముక్కుతొ తరువు శాఖను పట్టి
కాలిసందులో ఆహారముగొని
మునులను ప్రార్థన చేయగనంత.

తరువు శాఖను వదలిరి మునులు-
వైనతేయుడు అతి బలవంతుడు
సురనాయకుని గృహమును జొచ్చి
అమృతమ్మును హరించినాడు.

తాపసోత్తములు నిలచిన తరువు
వినతాసూనుని గుర్తుగ నిలచిన
సుభద్రమనియెడి వట వృక్షమును
పంక్తి కంధరుడు గాంచి సాగగా.

నిర్మలమైన స్థలము నందున
మితాహారమున తపమును నున్న
జింక చర్మము ధరించి యుండి
నార వస్త్రముల జటాధారియగు.

మారీచుడు- రాక్షస రాజును గాంచెను
లంకేశ్వరునకు పూజలు చేసి
అతి భక్తిగను అతిథ్యము నిడి
మరల వచ్చుటకు కారణ మడిగెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 3 6 రావణుడు మారీచుని సాయము కోరుట

మారీచునితో పలికెను రాజు :
''తంట్రీ! సర్వము విశద పరచెద
అర్తుడనై-నిను చేరితినయ్యా!
నీవేగతి - ఇకవిను వివరముగ.

నీచ క్షత్రియుడు - నీతి నెరుగడు
ఇంద్రియ జయము లేనటువంటి
కరుణా శూన్యుడు - అధర్మవర్తి
వివేక మసలే - లేనేలేదు.

నిశాచరేశ్వర! జనస్థానమున
నా సోదరులగు ఖర- దూషణులు
శూర్పణఖయును - రాక్షస బలములు
ధర్మాత్ములను హింసించుచును.

రాజనీతి మరి తెలియనివాడు
స్వధర్మమ్మును వదలినవాడు
భూత కోటికి- కీడొనరించెడి-
రాముడు-మానవ మాత్రుడు వింటివ!

స్వేచ్ఛగ తిరుగుచు కోపము నిండి
ఆయుధములతో రామునిపై బడ
ఒంటిగ నిలచి వీరులందరిని
వింటి బలముతో త్రుంచెను వినుము.

నాతో పగయది లేకపోయినను
నా చెల్లెలిని-విరూపి చేసెను
కావున నేను- రాముని భార్యను
అపహరించగా పోవుచుంటిని.

జన స్థానమున మునులందరికి
అసుర భయమును బాపెను వినుము
తండ్రిచె అతడు వెడలగొట్టబడి
సతితొ- అడవుల తిరిగెడు వాడు.

సౌందర్యములో ఎన్నికయైన
సురస్త్రీ సమమగు - జానకినిపుడే
అపహరించగా సాగుచుంటిని
నీ సాయమది కోరుచుంటిని.

నీ తమ్ములును- నీవును- నాకు
అండగ నిలచిన- యుద్ధము నందు
సురలందరినీ తృణ ప్రాయముగా
పరిగణించి-మరి జయింపగలను.

శౌర్యమునందు బలము నందున
ఉపాయమ్ముగానడచుట యందు
మాయలు నేర్చిన ఘనుడవు నీవు
కావున వచ్చితి నింత దూరము.

ఏమి సాయము చేయుట అందువ-
బంగరు వన్నెతొ- చిత్రపు చుక్కల
వన్నెలీను ఒక జింకరూపుతో
రాముని ఆశ్రమతావుల తిరుగుము.

జింకను గాంచిన జానకి యంత
రామ- లక్ష్మణుల పంపును తెమ్మని-
ఒంటరి జానకి నంతట నేను
అపహరించెదను అతి తేలికగా

జంట బాసిన రామచంద్రుడు
జానకి తలపుల- వీరంపుంగవుడు
కృశించిపోగా- వధించి వేతును
తంత్రీ! తప్పదు సాయము చేయుము.''

రావణు పలుకుల- రాముని వివరము
విని- మారీచుడు వణకి పోయెను
గుండె ఝల్లుమన- పెదవులు తడుపుచు
శవసమానుడై- నిలచిపోయెను.

రాముని శౌర్యము ఆమూలాగ్రము
తెలిసిన వాడగు మారీచుడట
చేతులు రెండును జోడించి మరి
దశకంధరునితొ- పలికె భక్తితో.

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

## 37 రావణునకు మారీచుని హితము

''లంకాధీశా! ముఖప్రీతికయి
ముచ్చట లాడెడి వారుందురయా
మేలగు మాటలు- కటువుగ నున్నవి
చెప్పెడి వారు దొరకుట కష్టము.

రామునితో పగ వలదని చెప్పితి
చపలచిత్తమున తిరిగి వచ్చితివి
అరాక్షసంబగు పుడమి యంతయు
పుడమి అల్లునితొ వైర మేలయా?

నీ ప్రాణములు నిలువున తీయగ
పుట్టెనొ ఏమో జనక నందిని-
ధరణీసుత - నా కెంత మాత్రము
కష్టము కలుగక చూడగవలెను.

కామ చరితుడవు - నీ నడవడితో
క్రుంగి పోవదా లంకాపురము!
విచ్చల విడిగా తిరిగెడి వర్తన
బంధులందరిని నాశము చేయద?

నీచక్షత్రియుడు రాముడు కాడు
లోభికాదు మరి- కాదు కుత్సితుడు
తండ్రిచె నతడు వెడల గొట్టబడి
అడవి చేరెనన- సత్యదూరము.

తండ్రిని కైక వంచించినదని
విషయము తెలిసిన రామచంద్రుడు
సత్యవర్తిగా తండ్రిని నిలపగ
కైక ప్రీతికై కానకు కదలెను.

మూర్తిగ నిలచిన ధర్మమె రాముడు
సత్య పరాక్రముడా రఘురాముడు
జగతికంతయు సురవిభుసాటి
మంచి మనసుగల మహిమాన్వితుడు.

సూర్యుని కాంతిని- హరించ శక్యమ?
అటులే- సీతను హరించ సాధ్యమ?
శరకీలలచే సురక్షితంబగు
భగభగమండెడి అగ్నియె ధనుసు.

భగభగ మండెడి- విల్లను- వక్త్రము
అస్త్రములన్న జ్వాలలు గలిగి
చాపమనియెడి పాశము దాల్చిన
సీతాపతియను యముని చెంతకు.

సుఖములు- రాజ్యము- నీ ప్రాణమ్ము
వదలి- చేరగ తలచకు నాయన!
జనక నందినిని అందిన రాముడు
అమిత విక్రముడు- అజేయుడయ్యా!

సింహ వక్షమును పోలు వక్షముతొ
నరసింహుడు రాముడు- రాక్షసరాజా!
సత్యశీలయై పతివ్రతయగు
పావని సీతను- హరించనెంచకు

ప్రాణము కన్నను మిన్నయె సీత
రాముని ప్రియసతి పరమ పతివ్రత-
అవివేకముతో మోహము నిండి
అగ్ని శిఖలను అంటకు నాయన!

నీవు తలచిన కార్యమసాధ్యము-
రాముని కన్నుల కనబడినంతనె
అయుర్దాయము తీరిన దనుకొను
అంతవరకు నువు రానీయకయా!

నీ కోరికలు - రాజ్య భోగములు
సుఖములు - ప్రాణము - వీటన్నిటిలో
ఒక్కటి కూడా మిగలవు రాజా!
చక్కగ పోయిక- లంకాపురము.

విభీషణాదులు ధర్మతత్పరులు
వారితొ విషయము ఆలోచించుము
కీడు- మేలు మరి మదిలో నెంచి
మంచి కార్యమును చేయుము రాజా!

కదన రంగమున వీరవరేణ్యుని
ముందు నిలువగ మదిలో తలచకు
బుద్ధిగరపితిని- హద్దుమీరకు
విశదపరచెద రాముని ఘనత.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 38 మారీచుడు స్వానుభవము చెప్పుట

''ఓ దశకంధర! విను-వివరముగా
వేయి ఏనుగుల బలగర్వముతో
కొండవంటి ఘన శరీరమ్ముతో
మెరసెడి బంగరు కుండలమ్ములతో

ఇనుపగుదియను చేత ధరించి
భూతకోటులు వ్యాకులపడునటు
మునుల మాంసమును మృష్టాన్నముగ
ఆరగించుచు - భూమిని తిరిగితి.

విశ్వామిత్రుడు విసిగి పోయెను
దశరథరాజును సాయము గోరెను
రాముని తనతో పంపగ నడిగెను
యజ్ఞరక్షణము చేయగ వలెననె.

బాలుడు రాముడు పసివాడయ్యా!
పాపుల త్రుంచగ చాలడు మౌనీ!
ముందు నిలచెదను నా సేనలతో
అనుచు దశరథుడు-వేడెను మునిని.

అంతట మహఋషి పలికె రాజుతో
రాముడు గాక మరి యింకొకరికి
సాధ్యము గాదాదనుజుల త్రుంచగ
కావున పంపుము రామ భద్రుననె.

మునితో రాముడు ముదముగ నడచెను
విల్లు ధరించి-జ్వాలను పోలి
పద్మపత్రముల పోలెడి కనులతో
పులిగోళ్లున్న ఆభరణమ్ముల

శ్రీయుతమూర్తి-శ్రీరఘురాముడు
వింటిని మీటుచు వీర బాలకుడు
నెమలి కంఠము రంగును బోలిన
కోమలమూర్తి నడచెను మునితో.

భద్రమూర్తియై-యాగముగాచుచు
ముని ఆశ్రమమున ఉన్న వీరుని
లక్ష్యపెట్టక-ముందుకు సాగి
యాగవేదికను సమీపించగా

విను-దశకంధర! విల్లును తీసి
విడచెను శరమును-నాపై గురితో-
నూరు యోజన దూరమునున్న
సాగర గర్భమునందు పడితిని.

చంపక వదలిన కారణమ్మున
మూర్ఛిలిపడితిని పాదోధినట
పరుగిడి లంకను జొచ్చితి రావణ
గర్వము పరుగిడిపోయెను రాజా!

నాడు-రాముడు పసివాడయ్యా!
అస్త్ర-శస్త్రములు తెలియనివాడు
నేడు-రాముడు వయసులో నుండెను
రాడు-రామునకు సాటి ఎవ్వడును.

ఆటల-పాటల- ఆనందముతో
అందరొక్కటిగ బ్రతికెడి అసురుల
బంగరు హర్మ్యములందు సుఖముగా
మనెడి వారిని-యమపురికంపకు.

పాపుల చేర్చిన-పుణ్యవర్తనుడు
అనుభవించును ఆపదలన్నీ-
పాముతో-కొలనున ఉన్న చేపలు
చావక-బ్రతుకుట జరుగదు కాదా!

రాముని చేతిలో-చావక మిగిలిన
అసురులు-భార్యల వెంట నిడుకొని
ప్రాణ భీతితో పరుగిడి పోగా
లంక నాశనము చూతువు రాజా!

పరుని భార్యను తలచుట పాపము
ఓ సురవైరీ! నీ ప్రియసతులగు
పదివేల భార్యలతో-సుఖపడుమయ్యా!
మదిలో బాగుగ యోచన చేయుము.

నీ భార్యలతో భోగము లందుము
నీ వంశమునకు రక్షకుండవై
దీర్ఘకాలము బ్రతుక నెంచిన,
రామచంద్రునికి హాని చేయకు.

సీతను హరింప యోచన చేయకు
నీ క్షేమముకై చెప్పితి రాజా!
బలాత్కారముగ సీతను తెత్తువ
చత్తువు సత్యము-సబాంధవముగ.''

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 39 మారీచుని భయము రావణునకు తెలుపుట

''మరియొక విషయము, నూతనమైనది
వివరించెద-విను సావధానముగ-
బ్రతికిన నేను-దండక వనిలో
ఇద్దరు అసురుల సాయముతోను

వారిద్దరును జింక రూపమున
అనుసరించగ-బలగర్వముతో
పెద్దమేనితో-కోరలు మెరయగ
విశాల వక్త్రము కలిగిన నేను.

తాపసోత్తముల కుటీరములలో
తీర్థము లందు-రచ్చ ప్రాకుల
మునుల మాంసము తినుచు-మదించి
ఒడలు తెలియక- ఒక్క దినమున

తాపసి రూపము మితాహారమున
ప్రాణి కోటికి రక్షకుడైన
రాముని చూచితి-సతి -సోదరులను
జూచితి వారని తెలియకపోయి

ముని దొరికెనని బలగర్వముతో
శృంగమ్ములతో పొడవగ బోతిని
నన్ను గాంచెను రామచంద్రుడు
విసురుగ చాపము తీసి-అంతట

మూడు బాణములు విడిచెనప్పుడు
గరుత్మంతుడు సాగు సమయమున
వాయువుతో మరి ఉద్భవించెడి
ధ్వనివలె-శబ్దము వినవచ్చినది.

వజ్రము వంటి శరములు వదలెను
శరవేగము - మరి తెలియుట చేతను
పారిపోతిని- బ్రతికితి గానీ
చచ్చిరి- నాతో వచ్చిన యిద్దరు.

అదే మొదలుగా- మాంసము వదలి
యోగాభ్యాసము చేయుచు-నేను
మునివలె నుంటిని- రాముని దలచిన
మదిలో భయము తెలియదు నీకు

ఘన కోదండము - నార చీరలు
కృష్ణా జినమున రామచంద్రుడు
చెట్టు చెట్టున ఎల్లవేళలా
పాశము దాల్చిన యమునిగ తోచును.

వేల వేలుగా రాములు కనబడి
రామమయముగా సర్వము కనబడు-
స్వప్నము నందు రాముడు కనబడ
భయపడి అరచెద- నిద్ర మరచెద.

రాముని భయము- రాముని చూచిన
కానీ- రాముని పేరే భయమగు
ఎంతని చెప్పెద- ఓ లంకేశ్వర!
'ర' శబ్దమది గుండెలు చీల్చును.

రత్నము- రథము- మొదలగునట్టి
'ర'- తో మొదలగు మాటలు వింటిన
రాముడు వచ్చెను అన్నటు తోచును
కలవర పడెదను- భయముతొ బ్రతికెద.

లంకాధీశా! నా మాటలు విను
రామచంద్రునితొ వైరము వలదు
లేదా- నీవేపోయి పోరుము
బంధునాశము- నిగ్రహించుము.

భువిలో బ్రతుకగ మనసు గలిగిన
చెప్పకు రాముని విషయము నీవు
చెప్పద వినుము- తలపై కొచ్చెడి
సీతాపతి కథ మరచిపోయిక.

అసమాన బలమున- తేజోవంతుడు
అతి విక్రముడగు రామచంద్రుని
అసురజనమ్ముల నంతము చేసెడి
అరిభయంకర మూర్తిగ జేయకు.

అడవిలొ ఒంటిగ బ్రతుకుచునున్న
దాశరథులతో ఏమి పనియని
చుప్పనాతి- అట చేరినదయ్యా!
ఖరాది వీరుల అంతము చూచెను.

రాముడు చేసిన అపరాధమ్ము
ఎట్టిదొ చెప్పుము? ఆలోచించుము
తప్పు మనది- మరి ఒప్పుకొయిక
హితులతొ- కీర్తితో- చచ్చెద వనిలో.''

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

# 40 మారీచునిపై రావణుని కోపము

హితమును పలికిన మారీచుని గని
కోపము నందెను రాక్షసరాజు
మరణాసక్తుడు-వైరాగ్యముతో
ఔషధమ్మును సేవించడు గద!

''ఓరీ! నిన్నీ కథలన్నిటినీ
చెప్పగ కోరిన దెవ్వరు-మూర్ఖా!
అల్పుడు-మనుజుడు-పాపాత్ముడగు
రామునితో-నే పోరగజాలన?

రాజుకు-నీవా నీతులు నేర్పుట
వదరితివీవు ఇచ్చ వచ్చినటు
పడతి మాటలతో-హితులను వదలి
అడవుల బట్టుట ఘనమగు పనియా?

ఖరుని చంపిన వ్యర్థమానవుని
ప్రియసతి సీతను హరించి తెచ్చెద-
చూచుచు నీవటు నిలిచియుండుము
నా నిశ్చయమది తిరుగులేనిది.

వాసవుడాదిగ సురలందరును
ఆపగ జాలరు-నా ప్రయత్నము
గుణ దోషములు అడిగినప్పుడు
చెప్పుట ధర్మము సచివులకెపుడు.

కార్యము-రాజు నుడివి నంతనే
సచివులు-కరములు ముడిచి భక్తిగా
మదిలో నున్నది-అతి వినయముగా
విన్న వించుటది ధర్మము-తెలియద?

మెత్తని మాటల-రాజుతొ-సచివులు
చెప్పగ వలెనని తెలియదు నీకు!
శుభకర వాక్కుల-రాజుకు తగినటు
విన్నవించుటది మంత్రి ధర్మము

గౌరవహీనము అగు హితములవి
ఎంతటి శుభకరమైన వైనను
గౌరవమ్ముగల భూపతి ఎన్నడు
గౌరవించడని తెలియక పోయెను.

వాసవు మాదిరి విక్రమమ్మును
అగ్ని తీక్షణము-శశివలె చల్లన
యమునికి దీటై దండనమందు
వరుణ ప్రసన్నత-రాజుకు వలయును.

కీడు-మేళ్లు మరి అడిగినదెవ్వరు
బుద్ధిహీనుడా! వదరుట ఇటులా
సాయము కోరితి-ధర్మము నెరుగవ?
నీవు చేయదగు పని నుడివెద విను.

వెండి చుక్కలతొ-బంగరు మేనితొ
జింక రూపుతో-సీత కెదురవ
రాముని పంపును నిన్ను తెమ్మని
అంతట-రాముని దూరము గొనిపో

దూరము నుండి చావు గొంతుకతొ
రాముని కంఠ స్వరమును పోలి
హాసీతా! హా లక్ష్మణా! యని
బిగ్గరగా నువు అరచుట వలన

నమ్మిన సీత-తమ్ముని పంపును
వాసవుడంతట-పులోమునిదగు
శచిని హరించిన రీతిగ-నేను
సీతను హరించి సుఖము లందెదను.

మోసము చేత సీతను హరించి
యుద్ధ ప్రసక్తి లేకనె-నేను
అతి తొందరలో లంక కేగెదను
నే నుడివినటు-చేయకపోతివ

నిన్ను శీఘ్రమే చంపుదునిచటే
చేయక నీవు నిలచిపోయిన
బలవంతముగా చేయించెదను
రాజుకు బలముల తక్కువ ఏమి?

పోయిన-చచ్చుట సందేహమది
పోక పోయిన-చచ్చుట తథ్యము
తిరిగి నీవు మరి ఆలోచించుకు
నిర్ణయించుకో శీఘ్రమె ఇపుడు.''

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 41 లంక నిలవదని మారీచుడు చెప్పుట

రావణు నిష్ఠుర వాక్యమ్ములు విని
కటువుగ పలికెను మారీచుడట :
''పుత్రులు, మిత్రులు, భృత్యులు, మంత్రుల
కూడిన-నీ కపకారము చేయగ.

నీచుడు ఎవడో-నీ విరోధియే
నీతో నిలిచి పోరగలేక
మృత్యు గహ్వరము నీకు చూపెను
మంచి పలుకుచు-ముంచును నిన్ను.

మంత్రులు లేరా హితము చెప్పుటకు!
తప్పని చెప్పి వారించుటకు
రాజును దిద్దని మంత్రులు-వారు
బ్రతికి యున్నను మృతతుల్యులు గద!

గెలుపు-ధర్మములు గలుగు రాజుచే
కావున-రాజు రక్షితుడగును
క్రూరుడు-నీతిని వదలిన రాజు
రాజ్య పాలనము చేయుట ఎట్లు?

సచివులు క్రూరులు అయినచో యిక
రాజుతో కూడి కూలిపోదురు
సారథి-తెలివిగ నడుపక పోయిన
రథము కూలును తురగమ్ములతో-

సాధు వర్తనులు - మేకల మాదిరి
మంచి రాజుచే సుఖము లందవలె
రాజు-క్రూరుడు-దుష్టుడైనచో
నక్కల రక్షణ నున్న మేకలే.

నాకొరకై నే వంతనొందను-
మూర్ఖత్వముతో ధర్మము వదలి
నీ సైన్యముతో అన్యాయముగా
నాశనమగుదువు-అని నా వంత.

నన్ను వధించిన రామచంద్రుడు
నిన్ను వధించుట జరిగి తీరును
శత్రువైనను-పరమ గుణాఢ్యుని
రాముని చేబడి మడయుట ధన్యత.

రాముని కంటబడిన వెంటనే
చచ్చిన వాడను నేనగుదునయా!
రమణిని హరించ-మిగలదు లంక
రక్కసు లెక్కడ- ఇక నేనెక్కడ?

లంకేశ్వర నీ మేలుకోరితి
కాలదన్నితివి నా పలుకులను
కాలము మీదకు వచ్చినవాడు
వినకోరడు-విను మంచి మాటలు.''
॥శ్రీ రఘురాము

❋❋❋

## 42 మారీచుడు మాయా మృగమగుట

రాక్షసతేనితొ భయముతొ పలికెను
''పోదము రమ్ము-లంకాధీశా
కోదండముతో - నిలచిన రాముని
చూచిన చత్తును-గెలువ రెవ్వరును

యమదండముచే కొట్టబడితిమి
కావున-నెయ్యము చక్కగ కుదిరెను-
చేటు కాలము వచ్చుట చేతనె
చెడిన బుద్ధితో చెడిపోదువయా!

ముందుగ-నేను పోదును రావణ!
మేలు కలుగును'' అని పలుకగను
ప్రేమతొ లంకాధీశుడంతట
కౌగలించుకొనె-అట-మారీచుని

''భళిరా! పౌరుష వచనమ్ములతో
నిజమగు మారీచుడవే-యిపుడు
ఇంతకు ముందు-నిజముగ నీవు
అసలగు మారీచుడవు కాదయా!

రత్న భూషితము-దివ్య స్యందనము
త్వరగా ఎక్కుము పోదము ఇపుడే
సీతను-మోసము చేసి సాగుము
ఆపై కార్యము నే చేసెదను.

కొండలు-నదులు-వనములు దాటి
అరటి చెట్లతో విలసిల్లెడి- ఒక
ఆశ్రమమ్మును చూసి అంతట
కార్యారంభము చేయుము'' అనగా

ఇంద్ర నీలమణి కాంతితొ కొమ్ములు
తెలుపు-నలుపుతో శోభిలు ముఖము
ఎఱ్ఱ కలువలు, తామర బోలు
తళుకులీనెడి వదనము గలిగి

ఇంద్ర నీలముల పోలెడి చెవులతొ
కొంచెము ఎత్తగు మెడ భాగముతో
మొల్లలు-వెన్నెల-వజ్ర కాంతివలె
తెల్లగ మెరసే ఉదర భాగము.

తామర పూవుల కేసరమ్ములతొ
పోలెడి వీపు-కలిగిన జింక
ఇప్ప పూలవలె పార్శ్వము గలిగి
వైడూర్యమువలె గిట్టలున్నది.

సన్నని పిక్కలు కలిగిన మృగము
ఇంద్ర ధనుసు వలె ఇంపగు రంగులు
తోకపైన మరి మెరయుచుండగా
మురిపెము పెంచే జింక నిలచెను.

శ్రేష్ఠమైన అపరంజి జింక అట
వనమున సొగసుగ తిరుగుచునంత
రాముని ఆశ్రమ తావులందున
సీత చూపుకై తిరుగ సాగెను.

గరిక కొరకును-గంతు లేయును
చిగురులు త్రుంచును-పరుగులెత్తును
ఉలికిపడును మరి-వెనుకకు మరలును
తొందరగా అట జింకల చేరును.

ఆవలించునటు మెలికలు తిరుగును
మార్గము లందు బడలి వ్రాలును
తిరిగి ఛెంగుమని గెంతి-లేచును
మేని చుక్కలు తళతళ మెరయును.

పరుగిడి-జింకల గుంపుల జొరబడు
బంగరు జింకను వాసన జూచి
భయపడి-పరుగిడు జింకలన్నియు
దిక్కు-దిక్కులకు చెదరిపోవును.

జింకల చంపగ మనసు గలిగినను
సీత-తనను మరి చూడగవలెను-
కావున కనబడు జింకల త్రుంచక
గెంతెడి జింకను జానకి గాంచెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 4 3 సీతాదేవి బంగరు జింకను కోరుట

రామచంద్రుని జీవితేశ్వరి
సుమబాల-అట సుమములు కోయుచు
అశోక-చూత లేత చిగురులతొ
నిండిన వనిలో జింకను గాంచెను.

మనోహరముగా మెరయు దంతములు
మురిపించిడి వగు కన్నులు గలిగి
మరి మరి చూడగ మనసు గొలిపెడి
బంగరు జింక-కనబడె సీతకు.

జింకను గాంచి మురిసి పోయినది
ముదముగ భర్తను రమ్మని పిలచెను
ఆయుధమ్ముతో తిరుగుచునున్న
లక్ష్మణమూర్తిని రమ్మని పిలచెను.

లక్ష్మణమూర్తి జింకను గాంచి
పలికెను అపుడు-సందేహముతో
''అన్నా! విను-మారీచ రక్కసుడు
మాయతొ మనుజుల తిను యత్నమిది.

మాయ రక్కసుడు-మనసగు జింకగ
తిరుగుచుండును-ఈ విధముగను
గంధర్వ నగరము అన్నటు-మిథ్య
నిజమగు జింక కానేకాదిది.

కనక కాంతి గల జింకను గంటిమ
వింటిమ మనము-వింత జింకను''
మాయ జింకయని లక్ష్మణుడనగా
ముదముగ సీత పతితో పలికెను :

''వల్లభా! యిది మక్కువ గొలుపుచు
మిక్కిలి ముదముగనున్నది స్వామీ!
సులభముగా మరి పట్టుము దీనిని
ఆడుకొనుటకు అభిలాషయగు

వనిలో-ఎలుగులు-చమరములెన్నో
కపులు-కిన్నెరములున్నవి-గంటిమి
వేటికి ఇంతటి మేనికాంతి మరి
కనరాకున్నది కన్నుల నిలచెను.

ఎన్నో జింకలు వనిలో గలవు
ఎన్నిక జింక ఇదియే స్వామీ!
ఉన్నది చల్లని చంద్రుని పోలి
నిన్నడిగితిని పట్టుకురమ్ము.

అందమునందిది అందదు దేనికి
చేసెడి శబ్దము సొగసుగ నున్నది
దేహకాంతి మరి ఎంతని నుడువుదు
జీవితేశ్వరా! మనసు దోచినది.

అసువులతో మరి పట్టుబడినచో
అంతఃపురమున భూషణ మగును
అత్తలు-మరదులు- ఆనందింతురు
ఆలోచించుము-అరుదైనదిది.

అసువులు బాసి పట్టుబడినచో
అందమైనదగు-చర్మము ప్రియము
ఆసనమ్మునై దీనిని పరచుకు
నీ సరసన-నే కూర్చొన కోరితి.

ఇది యది కావలెననెడి కోర్కెలతో
భర్తకు-వ్యధ కలిగించుట క్రూరము
మేని కాంతితో మనసు నిండినది
మురిపెము తీర్చగ కోరితి'' ననగా.

బంగరు కాంతుల మెరయు రోమములు
రత్నకాంతుల వెలుగు కొమ్ములు
తారలు-సూర్యుని-కాంతుల చుక్కల
మెరసెడి జింకను రాముడు గాంచి

సీత కోరిక తెలిసినవాడై
జింకను పట్టగ మనసు గలిగిన
రామచంద్రుడు పలికె తమ్మునితో
''ధరణిజ కోరిక వింటివ లక్ష్మణ!

ఎన్నడు వినని అపురూపమిది
నందన వనమున-చైత్ర రథమున
ఉన్నటు వినలేదిట్టి మృగమును
కాంతులు నింగిని-తాకుచున్నవి.

మేఘము నుండి వెడలిన మెరుపుగ
నాలుక జ్వాలగ నోట వెలుగుచు
ఇంద్ర నీలములు ముత్యపు కాంతితొ
మనసు హరించే మృగమిది సోదర!

వివిధ రత్నముల కాంతులు నిండి
స్వర్ణమయముగా వెలుగులు నిండి
ఎల్లరి మనసును హరించగలదు
బాల సీత - మరి కోరుట సహజమె.

వేటలో విశేష వస్తువులను మరి
ధరణీనాథులు పొందుచుందురు
జింక చర్మమున-నాతో కలసి
సీత-కూర్చొన కోరినదయ్యా!

నేలను నిలచిన బంగరు జింక
నింగిని-శశిలో వెలిగెడి జింక
రెండే మిక్కిలి మనోహరమ్ము
తక్కిన జింకలు లెక్కకు రావు.

మాయ రూపుడగు దనుజుడయినచో
ముందుగ చంపుట యుక్తమైనది
తాటక తనయుడు మారీచుడిటు
మునులను తినినచొ వదలకూడదు.

ఈ ప్రదేశమున మోసము చేసిన
వాతాపిరక్కసుని జీర్ణము చేసుకు
అసురుని భయమును తీర్చె నగస్త్యుడు-
అటులే కపటుని కూల్చెద మిచట

వేటాడగను వెడలెద నేను
సీత రక్షణ నీపై నుంచితి
పదిలమ్ముగను రక్షణ చేయుము
మన ప్రయత్నములు-నిలచె నామెపై

రక్కసి మాయను ఉక్కడగింతును
నిజమగు జింక అయినచొ తెత్తును
చక్కని జింక చర్మము పైన
మక్కువ నిండెను చక్కని చుక్కకు.

ఒక్క పదునగు శరముతొ చంపి
జింక చర్మమును తెత్తును సోదర
అంత వరకును అతి శ్రద్ధగను
ఏకాగ్రతతో రక్షణ చేయుము.

అతి బలవంతుడు పక్షిరాజగు
వృద్ధ జటాయువు సాయపడగను
ప్రమాదమెంతయు కలుగనీయక
వ్రతముగ-సీత రక్షణ చేయుము.''

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 44 శ్రీరాముడు మాయామృగమును వధించుట

మూడు వంకరలు గలిగిన విల్లు
బంగరు పిడిగల ఖడ్గము దాల్చి
అమ్ముల పొదులు-రెండు ధరించి
మాయ మృగముకై రాముడు నడచెను.

వింటితొ రాముడు కంట బడగనే
గుండెలు దడదడ కొట్టుకొనగను
మాయమయ్యెను బంగరు జింక
అంత దవ్వులో తిరిగి కనబడె.

పట్టగ-దగ్గర కనబడు జింక
పరుగిడు-గెంతును ఎంతో దూరము
పొదలో దూరును దొరకునట్టుగ
పచ్చిక మేయుచు కనబడు తిరిగి

బెదురు చూపుల చూపుల దోచును
ఎదురు వచ్చును దొరకునట్టుగ
భయముగ-బాణము వంక జూచును
బంగరు కాంతితొ వినోద పరచును.

వింత వింతల ఆటలాడును
రొప్పుచు-రోయుచు-బడలి నిలచును
పట్టుకొనగను-పరుగిడి పోవును
పచ్చికపైన పొర్లుచు కనబడు.

ఎంతో దూరము పరుగిడె జింక
మాయ జింకతో రాముడు పరుగిడె
అలసిన రాముడు-మనసు కలతబడి
నిలచె నొక్కతరు ఛాయలో నంత.

జింకల గుంపులొ జొరబడె జింక
చేతికందునటు దగ్గరైనది
అందుకొనుటకై రాముడు నడువగ
చెంగున దూకి-పరుగిడి పోయెను.

విసిగిపోయెను రామచంద్రుడు
విడువక పరుగిడి-అలసి పోయెను
విడువను-దీనిని చంపెదననుచు
బ్రహ్మాస్త్రము సంధించి విడచెను.

సూర్యకాంతి గల బ్రహ్మాస్త్రమది
సూటిగ-అసురుని దేహము జొచ్చెను
మాయజింక అది మాయమయ్యెను
తాళప్రమాణపు అసురుడు పడెను.

ఆయుర్దాయము తీరిన అసురుడు
లక్ష్మణమూర్తిని - సీత పంపుటకు
రావణు కార్యము సుకరమగుటకు
అరచుచు - పుడమిని వ్రాలెను అంత.

'హా సీతా! హా లక్ష్మణా' యని
బిగ్గరగా నట అరచుచు అసురుడు
అసువులు వీడెను-పుడమిని వ్రాలెను
పుడమీసుతకు అరుపులు వినబడె.

బంగరు సొమ్ములు - భుజకీర్తులతో
పెద్ద కోరలతొ - భీకరరూపము
రక్తపు మడుగులొ పడియుండగను
చూచిన రాముని మది కలవరపడె

లక్ష్మణు పలుకులు మదిలో మెదలెను
జనక నందిని తలపులొ నిలచెను
'హా సీతా! హా లక్ష్మణా' యని
అరచుచు చచ్చెను- భయపడిపోదురు'

సతి-సోదరులు మదిలో మెదలగ
భయముతొ మేను గగుర్పొడచెను
తమ్ముని మాటలు మరి మరి మెదలగ
ఆశ్రమ త్రోవలొ వడిగా సాగెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 45 సీత లక్ష్మణుని కఠినోక్తులాడుట

దుఃఖము నిండిన భర్త కంఠమును
వినిన జానకి-కలవరపడెను
''అయ్యో లక్ష్మణ! ఇది విపరీతము
పతిదేవునకు ఆపద కలిగెను?

ఆక్రందనము వినవచ్చినది
వడిగా పొమ్మొ-సాయము చేయగ
రాక్షస గుంపుల నడుమ-రఘుపతి
సింహ వలయమున-కోడెగ నిలచెనొ-

తమ్ముడు తోడగు ననుకొనుచుండును
అన్న రక్షణకు శీఘ్రమె''పొమ్మన
అన్న ఆనతిని- మీరక తమ్ముడు
నిలచియుండుట- గాంచిన సీత

కోపము నిండి పలికెను తిరిగి
''అన్నకు- కష్టము కలిగినప్పుడు
సాయము చేయగ పోకపోతివి
నీకే హానిని- రఘుపతి చేసెను?

మిత్రుని వేషమునున్న శత్రువని
నిను నే తలతును- వంచకుడవు నువు
దుష్కామివి నువు- తెలిసితి బాగుగ
పాపపు మనసు కలిగినవాడవు.

ఆర్తనాదము వినబడినది కద!
నాపై మోహము కలిగిన నీవు
నన్ను గ్రహింపగ నెంచిన నీవు
కొంచెమైనను కదలక పోతివి.

అన్నకు- ఆపద కలిగినదని విని
ముందు కురుకును సుజనుడైనచో
అన్నకు- కీడు- నీకు సమ్మతము
కావున కదలక నిలచితి విచటే

అన్నపైన నీ స్నేహము సున్న
అమ్మ చెప్పిన మాటలు సున్న
అన్నకు ఇంక అపాయమైనచొ
నన్నిక రక్షణ చేయుట సున్న.

ఎంత చెప్పినా మనసు కరుగద!
నన్నేమని రక్షించెద వీవు?''
బెదరు జింకవలె కన్నులు గలిగిన
సీత ఏడ్చుచు కటువుగ పలికెను.

లక్షణమూర్తి పలికె వినయముగ
''వదినా! వలదు- భయము నందగ
సురాసురులును- యక్షులు- మనుజులు
ఫణులు- పిశాచులు ఎంతటి వారును

నీ మనోహరుడు రామచంద్రుని
ఎదిరి నిలువగ చాలరు తల్లీ!
ప్రాణము లెవరికి చేదగునమ్మా?
కావున- అనిలో రాముని తాకరు.

మూడు లోకములు ఒకటై నిలచియు
సురనాయుకుడు- సురలందరును
ఒక్కుమ్మడిగా ఎదిరించినను
ఒక్క రాముడే చంపగలడు గద!

నీకు తగినటు పలుకుము నీవు
అజేయుడమ్మా- రామభద్రుడు
మాయ రక్కసుడు అరిచియుండును
మారీచ రక్కసుని- ఆర్తనాదమగు.

అమ్మా! నమ్ముము- నాదు పలుకులు
మృగమును జంపి అన్న వచ్చును
ఎట్టి ఆపద కలుగదు తల్లీ!
గట్టి నమ్మకముతోడ- పలికితి.

నీ రక్షణగా నన్నిట నుంచెను
నిన్నిట-వంటరి చేసి పోదునా?
ఖరుడు చావగా అసురు లందరు
కుట్రలు పన్నుచు వేచియుండిరి.''

లక్ష్మణు పలుకులు వినిన జానకి
కోపము నిండి క్రోధ నేత్రముల
సత్యము పలికెడి లక్ష్మణ మూర్తితొ
కఠినోక్తులను పలికెనంతట :

''దయాశూన్యుడవు-నయ వంచకుడవు
వంశము చెరచెడి అనార్యుడవుగా!
కావున- ఇటుల పలుకుచుంటివి
రాఘవు కీడు - నీకు సమ్మతము.

చిత్రము కాదిది నీ విటు నడచుట
జ్ఞాతులు ఇటులే- ప్రచ్ఛన్నముగ
కీడు చేయగ తలచుచుందురు
వింటివ! అటులే-నీవు మసలితివి.

నీకై నీవే వచ్చినాడవో -
కైక తనయుడే పంపెనొ-నిన్ను
మాయ వేషమున-మాతో వచ్చుట
మంచి మనసుతో కానే కాదు.

దుష్టులు మీరు దయాదూరులు
నా కొరకై మీ యోచన సాగదు
రాముని భార్యను కలలోనైనా
గైకొన శక్యమె ఎవరికైనను?

రాముని కొరకే- జీవితమయ్యా!
రాముడు లేనిచొ ప్రాణములుండవు
నీ ముందట - నే - అసువులు వీడెద''
అనుచు సీత అట కటువుగ పలుకగ

వినుటకు యోగ్యము కాని పలుకులు
విని- విజితేంద్రియుడెంతో కుమిలెను
మేను గగుర్పుతొ కరములు ముడిచి
పలికెను- ''అమ్మా! దేవత నీవు

బదులు పలుకగా మనసు లేదిక
అనుచిత వాక్కులు గుండియు చీల్చెను
అయినా- స్త్రీలిటు పలుకుట- ఎంతయు-
వింత కాదు-మరి వదినా వింటివ!

పరుష భాషణము స్త్రీకి సహజము-
కఠిన మనస్కులు-చంచలమతులు
భేద కారిణులు- ధర్మము నెరుగరు
క్రూర మనస్కులు- ఇంతులు - వింటివ!

కాల్చిన ఇనుప చువ్వల మాదిరి
నీ పలుకులవి చెవిలో పడినవి
ఎంత మాత్రము సహించలేను
వనదేవతలవి సాక్షిగ వినవలె.

కోప స్వభావము కలిగిన దానవు.
పాపిష్ఠిదగు స్త్రీ జన్మమిల-
నన్నీ విధముగ శంకించితివి
ఛీ! పో-పాపము నందితి వీవు..

రాముని కడకు పోయెద నిపుడే
నీకు స్వస్తి మరి జనక నందినీ!
వన దేవతలు-వదలక-నిన్ను
రక్షణ చేయగ నుండగ వలెను.

అపశకునములు తోచుచున్నవి
అన్నతొ కలసి తిరిగి వచ్చి మరి
అమ్మా-నిన్ను కాంతునొ లేదో''
అనుచు లక్ష్మణుడు పలుకగ నంత

కనుల బాష్పముల సీత పలికెను :
''విషము మ్రింగియో-నదిలో దూకియో
ఉరి పోసుకునో-అగ్నిని బడియో
చచ్చెద కానీ పరుని కందను.''

గట్టిగ ఏడ్చెడి సీతాదేవిని
ఊరడించినను హెచ్చెను రోదన
సుమిత్ర సుతుడు-వదినను చూచుచు
మదిలో బాధతొ సాగెనంతట.

॥శ్రీ రఘురాముని॥

## 4 6 సన్యాసి వేషమున రావణుడు వచ్చుట

లక్ష్మణమూర్తి వెడలగ నంతట
సందు దొరికెనని-లంకాధీశుడు
సన్యాసి వేషము-దాల్చి నిలచెను
సన్నని కాషాయాంబరమ్ముతో-

ఎడమ భుజమున త్రిదండమ్ముతో
చేత ఛత్రము కమండలము
శిఖను ధరించి - పావు కోళ్ళతో
దశకంధరుడు బయలుదేరెను.

సూర్య-చంద్రులు వెడలగ-సంధ్యను-
ఆవరించుకొను-చీకటి తీరుగ
రోహిణి తారను-శని-అంగారక
గ్రహములు-తాకిన తీరుగ-నా యతి

జనకజ కొరకై సాగుచుండగా
వాయువు భయపడి-మెదలక నిలచెను
చెట్ల ఆకులవి-కదలక నిలచెను
గోదావరి నది-నడిచె మెల్లగా-

పచ్చిక కప్పిన బావి తీరుగా
సాధు రూపమున సాగెను ధూర్తుడు-
పుణ్యవేషమున సాగిన - పాపి
రాముని సతిని - ఆశ్రమమున గనె.

నల్ల కలువలను పోలు కన్నులతొ
పచ్చని-పట్టు వస్త్రము దాల్చిన
సీతను చూచెను దుష్ట స్వభావుడు
చిత్రాతారను శని చేరినటు.

హస్తమునందు కమలము లేని
లక్ష్మీదేవిగ నున్న సీతను
దిక్కులు వెలిగే దేహకాంతితో
మెరుపు తీగవలెనున్న అతివయట

ఆశ్రమమందు ఉండుట గాంచెను-
మన్మథ శరములు తగిలె నసురునకు
మోసగాడట-వేదఘోషతో
వినయము నిండి పలికెను సీతతొ :

''పచ్చని చీర కట్టిన పడతీ!
పసిమి బంగరు అందము నీది!
చంద్రుని పోలు ముఖము గలిగిన
తామర తీగను పోలెడి అబలా!

భూకాంతవ? - మరి కీర్తికాంతవా?
లక్ష్మీదేవివ? - రతీదేవివా?
ఆడ ఏనుగును పోలెడి నడకల
సురసుందరివా? మనసు దోచితివి.

మెరసే పలువరసున్నది నీకు
విశాలమైన కన్నులు నీవి
అంగ సౌష్ఠవము- అంద మెవరికి
ఎవ్వతి వీవు? నిజము తెలుపుము.

పిడికిటి నిమిడే సన్నని నడుము
అందమైన చిరునవ్వులు జల్లుచు
విలాసమ్మునకు సాగర మగుదువు
ఒంపు సొంపుల- ఇంపుగ నుంటివి.

ఏటి ప్రవాహము గట్టును కోయును
అటులే నా మది కరగిపోయినది
వయసు- అందము ఒలక పోయుచు
ఒంటరివైతివి- వెఱ్ఱి పుట్టును.

గృహమున కేగుము- వనమునఅసురులు
కామ రూపమున తిరుగుచుందురు
శీఘ్రమె బొమ్మ- సౌధమ్ములలో
నీవుండుట యది అలంకారము.

కమలము వంటి కన్నులదానా!
ఎన్నిక మాలల- ఎన్నిక విందులు
ఎన్నిక వలువలు - ఎన్నిక భర్త
నీకు తగునని- నే తలంచెద.

దేవకన్యవని నమ్మితి నేను
రుద్రకాంతవో- మరుత్సతివో మరి
దేవ- కిన్నెరలు- రారీ వనికి
మానవభోజులు ఉందురిచ్చట

ఎక్కడిదానవు? నిక్కము చెప్పుము
ఒక్కతె వీవు ఉంటివ దేల?
క్రూర ప్రాణులు తిరిగెడి వనిలో
భయము లేక నువ్వుంటివి ఎటుల?

మదపు టేనుగుల గుంపులు తిరుగును
మది భయపడక నిలచితివిచట
మదిరేక్షణ- నువు ఎవ్వరి దానవు?
మది తెలియగను వివరించు'' మన

విప్రవేషపు కపటుని- తెలియక
మాయ సన్యాసని తెలియని జానకి
యతులకు తగినటు పూజలు చేయగ
దర్భాసనమును- చూపించెనట.

కాషాయాంబరధారుని కంతట
అర్ఘ్య- పాద్యములు- సమకూర్చినది
ఉత్తమ ఫలములు- ఆహారము నిడి
ఆరగించమని పలికె వినయముగ

అతిథి పూజలో అతివయుండగా
అందము- తినుచునుండె నసురుడు
అంతము కోరి తెచ్చుకొనటకై
ఆమెను హరింప నిశ్చయించుకొనె.

మాయ మృగమును వేటాడుటకై
వెడలిన సోదరు లిద్దరి కొరకై
నలువంకలకు జానకి చూడగ
కనబడె వనము- భయముతో వణకెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 47 సీత మాయ సన్యాసిని దూషించుట

తన్ను హరింపగ వేషము దాల్చిన
దానవనాథుని ప్రశ్నను వినిన
జానకి- అతిథులు సేవలు తెలిసిన
సన్నుత శీల- మదిలో తలచెను.

రాముని- రాజుగ చేసినచో మరి
నీరూ, తిండి- ముట్టను, బ్రతుకను
అనుచు- పట్టుతో నున్నది కైక
పతి మాటలు మరి వినకపోయినది.

విప్రవేషమున వచ్చిన అతిథి-
నిజము నుడువనిచొ శపించుననుకొనె
ముహూర్త మాత్రము సందియ మొదవెను-
పలికెను సీత- వివరము తెలుపుచు :

యుద్ధమునందు ఎదురే తెలియని
పతి- వయసప్పుడు ఇరువదియైదు-
నా ప్రాయమ్ము పదునెనిమిదయా!
అడవుల బడితిమి గుణశీలీ! విను.

''మిథిలాధీశుడు- మహాత్ముడైన
జనకుని తనయను- సీతని పిలతురు
శ్రీ రాఘురాముని సతిని నేనయా!
పదిరెండేడులు సుఖముగ నుంటిమి.

రామ నామముతొ ప్రసిద్ధికెక్కిన
సత్యవంతుడు- సద్గుణయుతుడు
విశాల నేత్రుడు- ఆజానుబాహుడు
భూతకోటికి మేలొనరించే

మామగారు- తన మంత్రుల పిలచి
యోచన చేసి రామచంద్రునకు
పట్టము కట్టగ సందడి చేయగ
మురిపెపు భార్య కైక అంతట

రామచంద్రునికి - దశరథరాజు
పట్టము కట్టుట నిలపి వేసెను
వరములు తీర్చగ కోరిన భార్య-
కైక అంతట పలికె రామునితో

కోరిక తీర్చెదనన్న ప్రమాణము
ముందుగ గైకొని- రెండు వరములవి
నా పతి వనముల పోవు వరమును
తన తనయునకు రాజ్యము కోరెను.

'తండ్రి ఆనతిని తల దాల్చుమయా!
పదునాల్గేండ్లు వనమున కేగుము-
భరత కుమారుని రాజును చేయుము
సత్యవర్తిగా తండ్రిని నిలుపుము

నిశ్చల వ్రతుడు-సత్యసంధుడు
కైక మాటలకు ఎదురు చెప్పక
కదలె కానలకు - నా పతిదేవుడు
సత్యసంధునిగ తండ్రిని నిలపగ.

ఇచ్చుటెగాని గైకొనుటెరుగడు
సత్యమెగాని అసత్య మెరుగడు
రామచంద్రుని వ్రతములు అవ్వి
నిలుపును నిరతము- బ్రహ్మతేజ! విను.

లక్ష్మణమూర్తి- రాముని తమ్ముడు
సవతి తల్లియగు సుమిత్ర తనయుడు
ధర్మాత్ముడును-శత్రువిజేత
మాకు రక్షణగ వచ్చెను వీరుడు.

కైక వరములతొ కానలయందు
తిరుగుచుంటిమి ముగ్గుర మిటుల
తాళుము- ఇపుడే భర్త వచ్చును
వన భోజనము వెంట తెచ్చును.

భూసుర! నీదు నామము ఏమి?
గోత్రము ఏమి? తెలియ బరచుము
ఒంటరివై నువు దండక వనిలో
తిరుగుట ఏల? తీరుగ తెలుపుము.''

అంతట సీతతో దుష్టుడు పలికెను :
''ఎవ్వని పేరు విని నంతటనే
మనుజులె గాక సురాసురులును
గడగడ లాడెద రట్టి వాడను

అసురనాధుడను- రావణుండను
నీకు క్షేమమగు అబలా వినుము
నిను గంటిని-మరి నా భార్యలపై
మనసు కలుగదో మదిరేక్షణ విను.

ఎందరొ సుందర స్త్రీల హరించితి
అందరికీవు రాణి వగుదువు
సంద్ర మధ్యమున గిరిపై నున్న
లంకలొ గలదు-సుందర గృహము.

బంగరు మేడల-నందన వనముల
సౌధ వీధుల-విలాస స్థలముల
విహరించుటకు మనసు గలుగును
భీకర కాననమెటుల రుచించును?

నా సతివైనచొ - భూషిత సతులు
ఐదువేలు - నీ సేవలు చేతురు
ఉత్తమ వంశము నందు బుట్టిన
అతివలు శ్రద్ధా భక్తితొ కొలతురు.''

రావణు పలుకులు వినిన జానకి
కోపము నిండి - పరుషముగాను
పలికెను రాక్షస రాజుతొ నంత :
''నా పతి వివరము తెలియదు నీకు

గిరివలె చెదరక నిలచు నాతడు
సంద్రమువలె గంభీరుడాతడు
నా హృదయేశుడు రామచంద్రుడు-
రాముని అడుగుల నడతును నేను.

పూజ్య గుణములకు నిలచిన మూర్తి
సత్య వ్రతము చేపట్టిన వీరుడు
భూమిని నిండిన కీర్తివంతుడు
రాముని సతిని- రాక్షస రాజా!

సుక్షత్రియుడు శ్రీరఘురాముడు
పూర్ణ పురుషుడు- పురుషోత్తముడు
విజితేంద్రియుడు- కీర్తికి నిలయము
రారాజే- నా జీవము రఘుపతి.

నక్కమాదిరి - వంచకుడవు నువు
ఆడు సింహమును అందగ శక్యమ?
సూర్య తేజమును గ్రహించ సాధ్యమ?
రామచంద్రుని హృదయేశ్వరిని.

రాముని ఆత్మగ నుండెడి సతితో
మందభాగ్యుడా! వదరితి విటుల
మరణ సమయమాసన్న మాయెనా?
కనక తరువులను కాంతువు ఇపుడే

ఆకలిగొన్న హరి దంతములు
మిన్నాగు కోరలు పెరకునట్టుగా
మందరగిరి నరచేత నిమిడ్చెడి
యోచన అగును- నన్ను హరించుట.

హాలాహలమును ద్రావి మనుటగ-
సూదితొ కన్నులు గోకి కొనుటగ-
బండ గట్టుకొని - వారిధి బడుటగ -
అట్టి అపాయము నన్ను హరించుట.

ఉక్కుశూలము పైన గంతులుగ-
అగ్ని శిఖలను - ఒడిగట్టుటగ
నాలుకతో మరి కత్తిని నాకుట
అట్టిది వినుము - నన్ను హరించుట

రవి- చంద్రులను చేత బట్టుట
ఎట్టిదొ- అటులే యుద్ధము నందు
భయంకరమ్మగు శరములు గలిగిన
రామచంద్రుని సతిని హరించుట.

సింహమెక్కడ? నక్క ఎక్కడ?
పాదోధికి చాలున పిల్ల కాలువ?
ఖగరా జెక్కడ? కాకి ఎక్కడ?
ఏనుగునకు మరి చాలున- ఎలుక?

శ్రీగంధముతో చాలున బురద?
నెమలి ఎక్కడ? - నీటి కాకివి
శ్రేష్ఠమైన సుర సాటి వచ్చునే
పులిసిపోయిన కడుగు నీళ్ళవి

కనకమ్మునకు- సీసమ్మునకు
రాజ హంసకు - గద్దకు గల- ఆ
భేదమె గలదు సుగుణమూర్తియగు
రామచంద్రునికి- నీకును రాక్షస!

ఈగను కలిపి అజ్యము త్రాగిన
ఉదరము నుండక వాంతి చేయును
అటులే- రాముని రక్షణ నున్న
నన్ను హరించుట అసాధ్యమైనది.''

దృఢ చిత్తముతో- కఠినముగాను
సీత పలికి- అట హోరు గాలికి
కదలునట్టిదగు కదళీతరువన
వణకుచు భయముతొ నిండి పోయెను.
॥శ్రీ రఘురామునిll

❉❉❉

## 4 8 రావణుని ఆత్మ ప్రశంస

విశాల ఫాలము- భృకుటిని ముడిచి
కోపము నిండి కఠిన వాక్కులతొ
సురవైరి- అట- సీతతో పలికెను :
''నన్నెవ్వనిగా తలంచుచుంటివి?

శంకరు మిత్రుడు కుబేరునకును
సోదరుడను నే- వింటివ తీరుగ
దశ శిరములు గల రావణుడను-నే
సార్థకనాముడ- లంకాధీశుడ.

గరుడ- గంధర్వులు- పన్నగులందరు
మృత్యువుగా నను చూచి-పరుగిడు
కుబేరుడంతటి వాడు సంపదను
విడిచి- చేరె విను కైలాసమ్మును.

మనసగు రీతిని పొగలిగినదగు
పుష్పకమ్మును హరించినాను
సురనాయకుడు- సురలందరును
పదములు వణకి పరుగిడి పోదురు.

సూర్యుడు- చల్లని చంద్రుడు అగును
వాయువు వీచును మెల్లగ వినుము
నే నిలచినచో- ఆకులు కదలవు
భయమున-మెల్లగ సాగును నదులు.

క్రూరులు భీకర రక్కసులుండి
బంగరు సౌధములుండిన నగరము
మణితోరణములు- రథ- గజాశ్వముల
సంపద కాపుర మా లంకాపురి

సంద్ర మధ్యమున ఇంద్రుని పురముగ
మంగళవాద్య శోభలు నిండగ
ఎల్లవేళల సుమ- ఫల భరితము
నందన వనమును మించిన వనములు.

కోమలాంగి! నువు- కాననమందు
చూచి అలసిన కన్నులతోను
సుందరమగు నా లంకాపురము
చూతువు రమ్ము- సుందరనయనా!

నాతో సంతోషముతో- నీవు
మంగళ కరముగ లంకలొ నున్నచొ
మనుజుల నింక మదిలో తలచవు
మనుజ సుఖములే తెలియును నీకు

లంకలొ- నీవు- మనుజ సుఖములతొ
సుర భోగములు అనుభవింతువు
భాగ్యహీనుని- అల్పుని- రాముని
మరతువు- మదిలో తలచవు ముదితా!

రాజ్యము పొందగ బలమది లేక
బలహీనుండై అడవుల బట్టెను
రాజ్యభ్రష్టుడు - అల్పాయుష్కుడు
మునివలె నడచును- ఇడుముల బెట్టును

ఎంతటి కఠిన మనస్కవు నీవు!
మన్మథు శరములు తగిలిన నన్ను
రాక్షస ప్రభువును- లక్ష్యపెట్టవు
అవమానముగా పలుకుచుంటివి.

ఊర్వశి- మున్ను పురూరవుని మరి
కాలితొ తన్ని-వ్యథ నొందినటు
నను కాదని- నువు వ్యథ నొందెదవు
రాముడు సాటియె నా గోటికిని?

నీ అదృష్టము ఫలించ-వచ్చితి
నన్ను కాదని కాలదన్నకు''
అనగా సీత క్రోధము నిండి
పరుష భాషణల పలికె నసురునితొ :

''యక్ష- గుహ్యకుల నాథుండైన
భూత వంద్యుడగు కుబేరు సోదర!
ఇంద్రియ జయము లేని వాడవు
ఎంతటి పాపము చేయ నెంచితివి.

అసురులందరు చత్తురు నీకై
ఇంద్రుని సతిని శచిని హరించియు-
బ్రతుకునేమొ మరి- రాముని- భార్యను
హరించి- బ్రతుకుట అసాధ్యము సుమా!

దుష్ట చిత్తుడా! భ్రష్ట శీలుడా!
నీచ వాక్యములు పలికిన నీకు
మోక్షము లేదు సుధ త్రాగినను
రాముని కాంతను మదిలో తలచకు.''

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 49 సీతాపహరణము

సీత పలుకులు వినిన రావణుడు
కోపము నిండి పలికె దురుసుగ :
''వివేక హీనా! విక్రమమ్ము విను''
అనుచు భుజములు చరచుకొనుచును

''నింగిని నిలచి-రెండు చేతులతొ
పుడమిని పైకి లేవనెత్తనా?
మృత్యుదేవత మొర పెట్టునటు
యుద్ధమునందు మోదివిడతునా?

హిమగిరి చీల్తున- భుజ బలమ్ముతో
సూర్యుని-నేలకు రాల్చి వేతునా
సంద్రము నీటిని త్రాగివేతునా
సరసమ్ముగ-నే పలికిన వినవా?

కోరిన రూపము దాల్చగ నేర్తును
సుఖముల నిత్తును-మరునికి చాలుదు
నా నిజరూపము చూడుము'' అనుచు
భీతి గొలుపగ రూపము జూపెను.

పది తలలున్న నల్లని మేఘము
లయకాలములో సూర్యాగ్నులవలె
వెలిగెడి బంగరు కుండలమ్ములతొ
విల్లు- బాణముల- యమునితొ సమమగు

ఎఱ్ఱని వలువలు దాల్చినవాడై
ఎఱ్ఱని కన్నులు మండుచుండగా
సూర్య తేజ సమమైన - వేడితో
కఠినముగా నట సీతతొ పలికెను:

''వినుమా సీతా! తగిన భర్తను
ప్రసిద్ధిగాంచిన పతిని చేరుము
నీ కప్రియమును ఎన్నడు చేయను
మనుజుని వదలి దనుజుని చేరుము.

మెచ్చెడి మోహమ? ఎన్నిక గుణముల?
ముదిత మాటపై రాజ్యము వదలి
భీకరాటవిని పడిన వాడుగద
వివేకియని- నీ వనుకోవలదు''

అనుచు కఠినముగ పలుకుచుదుష్టుడు
స్పృహను తప్పిన- జనక నందినిని
తల్లి రోహిణిని- బుధుడందినటు
అందుకొనెను- తన అంతము కొరకై.

ఎడమ పిడికిట శిరోజములగొని
కుడి హస్తముపై- అబలను త్రోసుకు-
మాయ రథము- అట వచ్చి నిలువగా
సీతను హరించి రథమును జేరెను.

తీక్షణమ్ముగా మెరయు కోరలతొ
యమునితొ సముడగు అసురుని జూచి
వన దేవతలు భయపడి పోయిరి
అడవుల బడిరి పరుగు లెత్తిరి.

నింగిని- తేరు సాగుచుండగా
సీత ఏడ్చెను భయ విహ్వలయై
పిచ్చిదానివలె ఏడ్చెను సీత
రామలక్ష్మణుల తలచి ఏడ్చెను.

''అయ్యో లక్ష్మణ! సేవాతత్పర!
నన్నీ అసురుడు దొంగతనముగా
ఎత్తుకు పోవుచు నుండెను నింగిని
భుజ బలతేజా! కనబడలేదా?

సుఖము- ధనము- జీవితమ్మును
ఆశ్రితులందరి కొరకై నిడెదవు
ఆశ్రితురాలను ఓ రఘురామా!
అధర్మమిదిగో కనబడలేదా!

దుష్ట శిక్షకుడవయ్యా - దేవా!
ఈ విధి అసురుడు హరించినాడు
వీడు రావణుడు- వీని ఆగడము
అణచవు ఏల? అనాథవత్సల!

ఓరీ పాపీ- రావణ వినుము
పాపఫల మిది ఫలించి తీరును
పైరు - పంటకు వచ్చిన రీతిగ
ఫలించు పాపము సమయములోన.

చేటు కాలము దాపురించినది
పాపకార్యమును ఆచరించితివి
నీకు మృత్యువే-శ్రీరఘురాముడు
ప్రాణము పోయెడి కష్టము కలుగును.

ధర్మశీలుని సతి అపహరణతొ
కోరిక తీరిన కైక-పురములో
సుఖముగ నుండును ఓ రఘురామా!
అధముని అంతము చూడుము స్వామీ!

ఫలసుమ తరువులు-తల్లుల్లారా-
అడవిలొ నున్న తీగల్లారా -
రామునితో మరి దయతో చెప్పుడు
రావణుండు నను గొని పోయెనని

నింగిని తిరిగే ప్రాణుల్లారా-
మాల్యవంతగిరి పర్వత రాజమ-
నా రామునితో అందరు చెప్పుడు
దేవ విరోధి హరించె నన్నని.

వనిలో నున్న దేవతలారా-
దండక వనిలో పక్షుల్లారా-
మృగ నాయకులు అందరుకలిసి
నా పతికిపుడే తెలుపుడు సర్వము.

ఓ గిరులారా! దయతో మీరు
నాకీ సాయము చేసినంతనే
యమ-సురలోకములైనను కూడ
గెలిచి-నన్ను శ్రీరాముడు చేకోను.''

అని విలపించు సీతాదేవికి
పెద్ద చెట్టుపై నున్న జటాయువు
కనుపించగనే - శోకము పెరిగెను
పెద్దగ అరచి పులుగుతొ చెప్పెను.

''అయ్యో! తండ్రీ-అబలను నన్ను
ఒంటిగ నుండగ-ఈ పాపాత్ముడు
హరించి-నింగిని గొని పోచుండెను
అసాధ్యుడయ్యా! గెలువగ నీకు.

కావున తండ్రీ! పక్షికులోత్తమ
పరుగున పోయి-దాశరథులకు
వివరించుమయా దారుణ వార్తను
దీనురాలిపై దయ జూడుమయా!''

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 50 జటాయువు రావణు నెదిరించుట

సీతాదేవి-ఆర్తనాదమును
కునుకుచు నున్న పక్షిరాజు వినె
నింగిని-అసురుడు కనబడినాడు
పావని సీత-కనబడె నంతట

ఎదురు నిలచెను రాక్షస రాజుకు
పలికెను-''నన్ను జటాయు వందురు
ధర్మము-సత్యము-దాస్య ధర్మముల
విశేష బలుడను-వినుమో అసురుడ.

ఇంద్ర! - వరుణులతొ సరిరా- రాముడు
జగతికి హితము చేయును రాముడు
భూతకోటికి- ప్రభువే రాముడు
దేవ విరోధీ! ధర్మము తప్పకు.

జగన్నాథుని జీవితేశ్వరి
జగన్మాతగా ప్రసిద్ధి కెక్కిన
సీతను-హరించ చెల్లున నీకు?
ధర్మము నెరిగిన ప్రభవిటు చేయున?

భార్య రక్షణము ముఖ్యమైనది
పరస్త్రీహరణము పరమ నీచము
అలిని-మగడు రక్షించునటు
అన్యుని సతిని- గౌరవించవలె.

పులస్త్యు మనుమడ! ధర్మ నిరతులై-
శాస్త్ర నిషిద్ధము చేయరు రాజులు
పురుషార్థములు ఆచరించుటకు
నిధివలె నిలచును భూమీనాథుడు.

పాపస్వభావుడ- చపలుడవీవు
నీకీ రాజ్యము ఎటుల లభించెర!
పాపికి-స్వర్గము దొరికినట్టుగా
దొరికెర నీకు- సజ్జన శాత్రవ!

పుట్టుక గుణములు- పోవును కట్టెల-
దుష్టుని మనసుకు- నీతులు పట్టున
నీ వైరమునకు కారణమేది?
కయ్యాని కిటు కాలు దువ్వితివి?

దాశరథులు నీకే విధమైన
హాని-ముందుగా తలంచలేదు
ఖరుడు చచ్చె-నీ సోదరి వల్లనె-
కారణ మేమీ దుష్కార్యమునకు.

వలదు రావణా! సీతాపహరణము-
వృత్రుని- ఇంద్రుడు త్రుంచినట్టుగా
వీరపుంగవుడు చూపులతోనే
దహించు నిన్ను- వింటివ తీరుగ

కాలనాగును కొంగున కట్టుకు
కాలపాశమును మెడకు తగుల్చుకు
తెలియక పోతివి- రాగల కీడు
రాముని కీడు- లేనే లేరు.

తగిన బరువునే మోయగ వలెరా-
తినదగు తిండియె తినవలయునురా-
యశము- దానము తొలగి పోయెడి
పనులు చేయరు మతిమంతు లిల

అరువది వేల వత్సరమ్ములు
రాజ్యము నేలి-ముదుసలి నైతిని
దృఢమగు వాడవు-వయసులొ నుంటివి
శర- చాపములు-తేరును గలవు

అయినా- సుఖముగ నిను బోనియ్యను
వేదార్థమును-తర్కయుక్తులతొ
తేలిక పరచుట సాధ్యము గాదు
కావున నిలబడు-పోరుము నాతో

శూరులు-దూరము కాగా చూచి
పిరికివి-అబలను హరించినావు
పారిపోవగా నెంచు చుంటివి
దూరము కావుర మిత్తికి నీవు

ముదుసలి అనుచు చులకన చేయకు
ముందుకు నిన్ను పోనీయనురా!
ముదిత-రాముని ప్రాణము వినరా!
మడయుటకైనా సిద్ధము-పోరుము.

పోబోకుర ఓ పంక్తి కంధర!
తొడిమ నుండి-మరి పండు రాల్చినటు
తేరు నుండి నిను ధరణికి త్రోసెద
నన్ను దాటుకొని పోగలవాడవ!''

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 51 జటాయువు నేలకూలుట

జటాయు వటుల పలుకు చుండగా
రావణు కన్నుల నిప్పులు రాలెను
పోరగ తాకిరి-వీరు లిద్దరు
ఘన మేఘముల తీరుగ తోచిరి.

మరియొక చాపము ధరించి అసురుడు
శర వర్షము కురిపించగ నంత
గూటిలొ నున్న పక్షి తీరుగ
నిలచిపోయెను జటాయు వపుడు

మాల్యవంత గిరు లన్నటు తలపడి
పోరగ సాగిరి-రావణు డంతట
కుప్పలు-కుప్పలు శరములు విడచెను
ముక్కుతొ-గోళ్లతొ రాల్చెను పులుగు.

రెక్కలతో ఆ శరముల త్రోసి
రావణు కవచము, ధనుసును త్రుంచి
రథముకు పూన్చిన ఖరముల చంపి
తేరును కూల్చెను నేలమీదకు.

రావణు దేహము గోళ్ళతొ చీరెను
అంతట-అసురుడు యమదండములగు
శరములు విడచెను చచ్చితి వనుచు
జటాయు వంతట లెక్కబెట్టక

వెల్లగొడుగును విరిచి వేసెను
రథసారథిని అంతము చేయగ
సీతాదేవిని-చేత బట్టుకొని
నేలబడెను ఆ లంకాధీశుడు.

కన్నీరొలికెడి సీతను గాంచి
మనసు తపించిన-పక్షి రాజట
ముందుకు దూకి-రావణాసురుని
చాపము త్రుంచెను-నడిమికి రెండుగ

విరిగిన ధనుసు-విరిగిన తేరు
కలిగిన దశముఖు గాంచి-నింగిని
జటాయునంతట స్తోత్రము జేసిరి
ఆనందించిరి మనసునిండుగా.

బడలిన పక్షి చేయునదేమని
తిరిగి అసురుడు నింగి కెగిరెను
అంతట పులుగు- అడ్డము నిలిచి
పలికెను-''అసురుడ! నిశ్చయమిది విను

శూరుడవగుచో తాళుము కొంచెము-
రాముడు త్రుంచును- నీ శిరములను
పరమేశ్వరుడైనా పాపఫలమును
అనుభవించక తప్పదు వినరా!''

వజ్రతుల్యమగు శరములు గలిగిన
రాముని సతిని- అపహరించుట
రాక్షస కులమది సమూలమ్ముగ
హరించిపోవుట కొరకేనుసుమా!

హితము- నీతిని పలకుచు పులుగు
వీపున వ్రాలి గోళ్లతొ చీరుచు
అంకుశమ్ముతో కరిని పొడిచినటు
పొడవ సాగెను రాక్షస రాజును.

మిత్రుల- బంధులు- పుత్రులతోను
సచివులు- సైన్యము- మనుమలతోను
విషము- నీటివలె త్రాగుచుంటివి
వివేక హీనుడవగుదువు రావణ!

జటాయు వంతట రావణాసురుని
శిరోజములను పట్టి పెఱకగా
కోపము పెరిగిన పంక్తికంధరుడు
వామ హస్తమున సీతను బట్టుకు

యమపాశమది గట్టిగ బిగిసెను
ఎరతో- గేలము మింగ్రెడి చేపను
పోలి యున్నది- నీ కృత్య మది
రాముని సరి మరి ఎవ్వరురా అని

పక్షి రాజును బలముగ కొట్టగ
దెబ్బ తప్పుకొని పులుగు శ్రేష్ఠుడు
ఒడుపుగ రావణు వామహస్తములు
త్రుంచివేయగా తిరిగి పుట్టినవి.

కోపము నిండి- నిలచిన రాముని
కోదండముతో అసురు లంతమగు
చెడిపోవద్దుర- వద్దుర- వద్దు
వలదని చెప్పితి- వినరా- రావణ!

కరములు త్రుంచగ- రోషము పెరిగి
జనకజ నచట దింపి- అసురుడు
భీకరమైన పోరు సలిపెను.
పక్షిరాజు తను పోరెను శక్తితో.

పోరగ లేక పిరికిపందవై
హరించి- పరుగున పోవు చుంటివి
శూరుని విధ మిది కానేకాదు
చోరుడవని- నిను లోకు లాడెదరు.

రాక్షసరాజు ఖడ్గముతోను
పక్షిరాజు పక్షమ్ములు నరికెను
కాళ్లు నరికెను- కూలెను పులుగు
కొన ఊపిరితో నేలను బడెను.

గొంతులో ప్రాణము గుటగుట లాడగ
నేలనుబడిన పులుగును గాంచి
విలపించినది సీతాదేవి
బంధువు మాదిరి దుఃఖించినది.

నల్లని మేఘము పోలినవాడు
తెల్లని వక్షము మెరయుచుండగా
పక్షిరాజట ఆశ్రమ తావుల
నేల కూలగా-వగచెను సీత.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 5 2 సీతాదేవి దుఃఖించుట

కంఠములోన నిలచిన అసువుల
నేలను బడిన పులుగును గాంచి
సీతాదేవి కడు దుఃఖించెను
ఆపద సూచన అగపడ జొచ్చెను.

''పక్షులు-మృగములు అపశకునమ్ము
తోచునట్టుగా సాగుట కంటివ
రామా! నీవు రాకపోవుటచె
నా పాపమది అల్పము కాదులె.

రామా! రమ్ము రక్షించుమయా
లక్ష్మణమూర్తీ, కాపాడుమయా!
భూమీసుతను కావగరండి''
అని బిగ్గరగా విలపించినది.

జడివానై కన్నీరు కురియగ
విలపించినది ఆ కుసుమలత
సీతాదేవి శిరోజములను
పట్టి లాగెను దుష్ట రావణుడు.

''రామా-రామా-రఘురామా!'' యని
ఆక్రందించెను అవనీ నందిని
స్థావర-జంగమ జీవ కోటులు
గాఢ నిశీధిలొ మునిగిపోయెను.

వాయువు అట్లే నిలిచి పోయెను
సూర్యుడు వెలవెలబోయి నిలచెను
దేవ కార్యమది చక్కబడినదని
సృష్టికర్త-తన మదిలో తలచెను.

సురలు-ఋషులు-సర్వజగత్తు
రావణు చేటు-మోదము కాగా
సీత వ్యధ మరి -శోకము కాగా
నిలచి చూచిరి శోక-మోదముల

రామా రామా - లక్ష్మణా యని
విలపించెడి ఆ సీతాదేవిని
గగనయానమున దశకంధరుడు
హరించి పరుగిడె శీఘ్రముగాను.

నల్లని మేఘము రావణుడనగా
మెరుపు తీగవలె తోచెను అతివ
కాంచన చేలము నెత్తిన బడగా
కాలెడి గిరివలె - తోచె నసురుడు.

సాధ్వీముడిచిన పూలు రాలినవి
అసుర వినాశము సూచన అన్నటు-
పచ్చని చీర సూర్యకాంతిలో
కాలెడి మేఘము అన్నటు తోచెను.

రావణు తొడపై సీతాదేవి
రాముని కెడమై సీతాదేవి
చక్కని నాసిక గలిగిన సీత
కాడ లేనిదగు కమల మాయెను.

వికసిత వదనము సీత వదనము
పతివ్రత యగు జానకి మోము
అంబుదమ్మును చీల్చుకు కనబడు
చంద్రబింబమై తోచెను. అపుడు.

తెల్లని దంతములున్న మోమది
సంపెగ పూవుగ తోచు నాసికతొ
బంగరు సొమ్ములు వెలుగు చుండగా
పగటి వెలుగులో చంద్రబింబ మయె.

బంగరు కాంతితొ సీతాదేవి
నల్లని మేఘము ప్రక్కనుండగా
కాంతి తరిగినది- ఇంద్రనీలములు
అమరిన బంగరు వడ్డాణము వలె

నల్లని అసురుడు దంతిగ తోచగ
మెరపు తీగ యగు రాముని సుందరి
కరికి- కట్టిన- బంగరు గొలుసుగ
తోచెను అంబర వీథిని అపుడు.

అతివ సొమ్ములవి ఘల్లుఘల్లు మన
మెరపులు నిండిన మేఘము తీరుగ
తోచెను అపుడు- రాక్షస రాజు-
భయము నిండి ఆ మేఘము సాగెను.

రాలిన పూలు నేలను బడుచు
గాలి తాకిడికి సుడులు తిరుగుచు
మేరు గిరికి అవి చుట్టినట్టుగ
రాక్షసరాజు చుట్టు తిరిగినవి.

రత్న శోభతో ప్రకాశించెడి
కాలి అందియ జారి పడినది
మధుర ధ్వనితో మెరపు తీగ వలె
భూమికి చేరెను బంగరు అందియ.

పెద్ద ఉల్క నొకదానిని చేకొని
పోవుచున్నటు తోచెను అసురుడు.
సీత సొమ్ములవి రాలి పడినవి
తారలు రాలుట తలపించె నట.

జానకి మెడలో ముత్యపు సరము
దివిజ గంగవలె అమరియున్నది-
పక్షులు నిండిన తరు శాఖలవి
కదలుచు - భయపడవలదని చెప్పెను.

చెదరిన కమలములున్న జలముల
బెదరిన మీనము లన్ని- భీతితో
శ్వాస నిలచి- తమ దేవి కోసమై
తపించు నట్టుగ తోచె నప్పుడు.

పులులు- సింహములు- పులుగులన్నియు
కోపము నిండిన చూపుల తోను
సీత నీడ గని- నేలను - ఆ దిశ
పరుగులెత్తినవి సీత సేవలో -

నీటి వంక లవి కంటిధారలై
గిరులు ఏడ్చునటు కానవచ్చెను
ఎత్తుగ నున్న గిరి శిఖరము లవి
ఎత్తిన చేతుల వందన మిడెను.

పెద్ద మృగములు నేలను పరుగిడ
పిల్ల జంతువులు నింగిని చూచుచు
కంటి ధారతో రెప్పలు వేయక
అమ్మ సీతకై ఏడ్చి -మూర్ఛిలె-

ధ్వనితో వీచెడి గుహలో - గాలులు
రోదన ధ్వనిగా విన వచ్చినవి
గిరులు ఏడ్చునటు కానవచ్చినవి
కాంతులు తరిగెను సూర్యబింబము.

నేలను చూచుచు రక్షణ కొరకై
రామా- లక్ష్మణ అని రోదించెడి
సీతను గాంచి వన దేవతలు
భయముతొ పెద్దగ రోదించి రట.

ఎక్కడ ధర్మము? సత్యమెక్కడిది?
దయ ఎచటున్నది-నిష్కపటమెట?
ఛీ- ఛీ తగదిది-మోసగాడ వని
నిందించగ మరి ముందుకు రారే!

తెగిన సరములు- కరిగిన తిలకము
చెదరిన కురులు- భయముతొ ముఖము
స్వయముగ మిత్తిని గొనిపో చున్న
అసురుని అంకము నుండిన సాధ్వి-

అయ్యో! పాపము- అని ఒక్కడును
ఎదిరించర ఈ దుర్మార్గమును?
అనుచు భూతములు రోదించినవి
నిరోధించనే లేరా అనిరి.

కన్నులు రెండు జ్వాలలు కాగా
పరుల హింసయే పరమావధి యగు
అసురునితోను అతి కోపముతో
పలికెను గుండెలు త్రెంచెడి పలుకులు.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 5 3 సీతాదేవి రావణుని దూషించుట

''రాక్షస వంశము కాల్చెడి వాడా!
దొంగిలించుటకు సిగ్గు పడవలె-
మాయ మృగముతో నా మనోహరుని
దూరము చేసి - వంచించితివి.

నిండుగ నిలచి పోరగలేక
పిరికి పందవై దొంగిలించితివి
పరుని భార్యను అపహరించిన
భీరువువీవు- శూరుడ గావు.

నాదు మామకు సఖుడు జటాయువు
ముసలి పులుగుతో యుద్ధము చేసి
చంపితి వీవు- శూరుడ వగుదువ?
ఆజిలొ నిలచిన ఘనమగు పనియది.

పెద్ద మాటలు- వీరుడ ననుచు
చెప్పితివీవు- వదరు బోతువు
కలకాలమునకు కళంక మిదియగు
వంశ నాశము కోరుకొంటివి.

చావు పరుగుతో పోవుచుంటివి
నిలచి రాముని గెలచి బ్రతుకుము
ఘోర కృత్యము చేసిన దానికి
ఫలితము నొసగును శ్రీరఘురాముడు.

వైతరణీ నది నీదు లాడెదవు
కత్తుల ఆకులు కలిగిన వనముల
నిశ్చయముగ నువు సంచరింతువు
సందియ మేల యమలోక మది.

రాముని కన్నుల కనబడి నంతనె
నీతో కలసి నీ బలగములు
ముహూర్త కాలములో సమసెదరు
కార్చిచ్చువలె కాల్చు మిమ్ములను.

విషము త్రావిన అసువులుండునా?
నేటితో నీ కథ ముగిసి పోయెను
నీవు ఎచ్చట దాగియున్నను
కూల్చును తప్పక రామచంద్రుడు.

హితము నుడివెదను వినుమో అసుర!
రాముని చెంతకు చేర్చుము నన్ను
లేదా రాముని తీవ్ర శరముల
నీవా నక్కల- గ్రద్దల పాలే

తమ్ముని సాయము లేకనె ఒంటిగ
పదునాల్గు వేల అసురుల త్రుంచెను
ఆలిని హరించు దుష్టుని- నిన్ను
ముక్క-ముక్కలుగ కోసి వేయడా!''

మరణ సమయమున మంచి పట్టదు-
మరణోద్యుక్తుడు పథ్యము చేయడు
మరణించెదవు రాముని చేబడి
బంగరు తరువులు చూచుట తథ్యము.

తిట్టుచు-ఏడ్చుచు-మూర్ఛిలిపోవుచు
తిరిగి మేలుకొని మరల ఏడ్చుచు
మంగళకారిణి దుఃఖము నుండగ
అసురుడు నింగిని గొనిపోసాగెను.

||శ్రీ రఘురాముని||

❈❈❈

# 54 సీతాదేవి నగలను జార విడుచుట

అసురుడు గొనిపోచుండు సమయమున
కనరాకుండెను ఒక్కడైనను
అంతట- జానకి- ఒక గిరిపైన
ఐదు మంది కపులుండుట గాంచెను.

తొందరగా మరి పోవుచుండగా
నగలు విసరుట యెరుగడు అసురుడు
రామా- రామా అను అరపులను
వినిరి కపులట గిరిపై నుండియె.

వారి వలన విషయమ్ము రామునికి
తెలియగలదని- అశతొ -సీత
నగలను కట్టి మూట విసరెను
వారి చెంత పడునన్న ఆశతో.

కాలనాగును అంకము నుంచుకు-
మృత్యు దేవతను గొనిపో చున్నటు-
వింటి నుండి మరి వెడలిన శరమై
నదులు-వనములు- గిరులను దాటుచు

పాతనమ్ములు-పెద్దమొసళ్ళు
తిమింగిలమ్ములు-గల-సాగరము
చేరెను అసురుడు-బ్రతికితి ననుకొనె
చచ్చెను వీడని-సిద్ధులు తలచిరి.

పరుగున లంకలొ అడుగు బెట్టెను
హేమను-మయుడు బిలమున దాచెను-
అటులే సీతను అంతఃపురమున
చేర్చి-సీతకు కావలి నుంచెను.

''పురుషుల గాని-స్త్రీలను గాని
సీతను చూడగ ఆనతి నిడక
ఆమె అడిగిన వస్తువులన్నీ
బంగరు-రత్నపు-వస్త్రము లీయుడు

దేహముపైన ఆశ కలుగుచో
కాంతకు- ఎదురు చెప్పక మీరు
పరుషోక్తులను పలుకుట మరచి
సేవలు చేయుడు''-అని ఆనతి నిడి

బ్రహ్మవరము నాకున్నది గావున
నన్నెదిరించుట కెవ్వడి వశమని
మదిలో తలచెను రావణాసురుడు-
అసురులు ఎనిమిది మందిని బిలచి

''మీకు నచ్చిన ఆయుధములతో
దండకవనిలో తిరుగుడు మీరు
ఖరుడుండిన ఆ జనస్థానమున
నిర్భయముగ మీరుండుడు యిపుడు.

నాచే నియమితులైన ఖరుని - మరి
అసురు లందరిని రాముడు చంపెను-
పగ తీర్చుకొన వేచియుంటిని
పగతుర పోకడ తెలుపుచుండుడు

అమిత కోపమున పగ తీర్చుకొన
వీలుపడకను ఉన్నది ఇపుడే
రాముని-రణమున కూల్చినగాని
మైమరచి మరి నిద్రపోనిక.

రాత్రిం-బవళులు జాగరూకులై
వారి యత్నములు తెలుపుడు నాకు
క్షత్రియ వీరుల చంపుడు మీరు
శత్రు భయమది తీరగవలెను.

మీ శౌర్యమ్ము-బల-విక్రమము
తెలిసి-నేను మరి పంపు చుంటిని
నాకు నమ్మకము మీపై గలదు''
అనగా వారు సాగిరి భక్తిగ.

ఆ విధముగ-తను-సీతను హరించి
రామచంద్రునితొ విరోధమును గొని
ఆనందించెను-అవివేకుడయి
పది తలలున్నను-పరమ మూర్ఖుడు.

॥శ్రీ రఘురాముని॥

# 5 5 రావణుని వాచాలత్వము

జనస్థానముకు యోధుల నంపి
సంతసించెను రావణ రాజు-
మరుని బాణములు మనసు కలంచగ
సీతను చూడగ వెడలెను అసురుడు.

రక్కసి స్త్రీల మధ్యలొ - సీత
కంటి ధారలు కురియు చుండగా
పెనుగాలికి ఊగెడి నావ తీరుగా
వ్యాకుల మతియై యున్నది అచట

తోడి జింకలు వదలిపోవగా
రేచుల చిక్కిన- ఆడు జింక వలె
బుసలను విడచు త్రాచుపాము వలె
సీత-అసురుని పురమున నుండగ

బలవంతముగా-లంకా విభవము
చూపగ-అసురుడు అతివను గొని-అట
స్పటికము-బంగరు-వైడూర్యములు
వజ్రమ్ములతో నిండిన యట్టి

మనోహరమ్మగు స్థంభము లుండి
విశాలమ్మైన హర్మ్యము లున్న
సోపానములు-దాటి అసురుడు
లంకా విభవము చాటె గర్వమున

''అన్నులమిన్న-కన్నుల నిండుగ
బంగరు-దంతపు-పనితనములతో
కాంతులీనెడి గృహముల-గనుము
ఆనందము నిడు వనములు-గనుము

ముప్పది రెండు కోట్ల సంఖ్యలో
అసురులు-నాకు సేవలు చేతురు
ఒక్కొక సేవకు-వేయిమందిగా
బాలురు-వృద్ధులు-వేల సేవకులు

శ్రేష్ఠములైన రాజ్య సంపదలు
వేల కొలదిగ రాణి వాసము
నీ స్వాధీనము చేతును తరుణీ!
వగచుట ఏల-భర్తగ తలచుము.

శోకము నాపుము సుందర నయనా!
రాముడు- ఇటకు రాలేడు సుమా!
మరుడు బాణముల మది కలంచెను
మగువా! కాదన తగునా నీకు?

నూరామడలు దాటుట శక్యమ?
సురనాయకుడే దాటగ లేడు-
పోరున-నాతో సురలే చాలరు
యక్షులు-అసురులు-నిలువగ లేరు.

రాజ్యహీనుడు-అల్పతేజుడు
రాముడు తగడు-రమణీ నీకు
యౌవ్వన మన్నది నిలువదు-నమ్ముము
శంకను వదలి-చేరుము నన్ను

మనసుతొనైనా రాలేడిచటకు
ముదితా! రాముని-మరచుట మేలు
వీచెడి గాలిని కట్ట సాధ్యమా?
అగ్ని శిఖలను పట్ట శక్యమా?

నన్ను గెలిచి-నిను గొనిపోవు టది
ముల్లోకముల కసాధ్యము కాంతా!
చరాచరములు భూత కోటులు
సురలందరు నీ సేవలు చేతురు.

శంక ఏలనిక- ఏలుము లంక-
ఈ కింకరుని సేవల నందుము-
వనవాసముతో పాపము తీరెను-
పుణ్య వశమున సుఖముల తేలుము.

చందన మలదుకు నుందము సుందరి
విరిసరములు మరి ముడుచుకొందువు
బంగరు సొమ్ములు ధరించ లెమ్మ
పుష్పకమన్న విమానము నుందము.

ధనపతి నెదిరి గెలిచి తెచ్చితి
పుష్పకమనెడి దివ్య విమానము
మనోజ్ఞమైనది సుఖముల నిడునది
సుందరి వినుమా! సుఖముగ నుందుము.

కమలము బోలు నీ ముఖ కమలము
దుఃఖము వలన కమిలిపోయినది
హృదిలో కలతను వదలుము ఇంక
మది సదనమున-పదిలపరచు నను.''

అధిక ప్రసంగము చేయు అసురునికి
ముఖమును కనబడనీయక సీత
చీర చెరగుతో కప్పుకొన్నది
కనుల బాష్పములు ధారగ కురిసెను.

''పాతివ్రత్యము నిలుపుకొనుటకై
సిగ్గుపడితివి-చాలును ఇంక-
ధర్మహాని ఇట లేనేలేదు-
ధర్మ సమ్మతియె నిన్ను తెచ్చుట

నీ కాలిధూళి-నా శిరమున దాల్చెద
కాంతా-దాసుడ- ఏలుము నన్ను
విరిశరముల బడి-దిగబడి పోతిని
లంకాధీశుడ-నీ అధీనుడ''

అనుచు పలికి ఆ దానవరాజు
మదిలో తలచెను, ముదిత దక్కెనని-
కాలపాశమున దగిలినవాడు
తననే తాను మోసగించు కొనె.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 5 6 అశోక వనిలో సీతాదేవి నుంచుట

రావణు పలుకులు ములుకులు కాగా
దుఃఖము నిండెను ధరణీనందిని
గడ్డిపోచ నొకటడ్డము వేసి
పలికెను అపుడు నిర్భయమ్ముగా.

''సత్యసంధుడు దశరథ నృపతి
ధర్మ సేతువై నిలిచినవాడు
ఆయన జ్యేష్ఠ కుమారుడు రాముడు
ధర్మాత్ముడుగా త్రిభువన పూజ్యుడు.

ఆజానుబాహుడు- విశాల నేత్రుడు
ప్రాణ విభుడు- నా దైవము రాముడు
నిన్ను చంపగల వీర పుంగవుడు
లక్ష్మణమూర్తితొ కలసిన- కేసరి.

ఇక్ష్వాకు వంశమున పుట్టినవాడు
క్షాత్ర ధర్మమున నిలచినవాడు
రాముని ముందే నన్ను హరించిన
నిను బలిగొనడా? ఖరుని మాదిరి.

ఒడ్డును మ్రింగెడి గంగ తీరుగా
గరుడుని ముందు నాగుల రీతిగ
రాముని శరముల కెర యయ్యెదవు
బొంకకు- బలమున అజేయుడ నని

వరములవల్ల మరణము లేదని
విఱ్ఱవీగకు- రాముడుండెను
యాగపశువువై దక్కవు నీవు.
నిక్కము రాముని కంటబడినచో

కోపము నిండిన నా పతి చూపులు
కాల్చును నిన్ను-శరము లెందుకు
నింగిని శశిని నేలకు రాల్చగ
సంద్రము నీటిని ఎండగట్టగ

సమర్థుడాతడు- జనకుని యల్లుడు
జగతికి పూజ్యుడు అపజయ మెరుగడు
నా ప్రాణేశుడు - ఆలి రక్షణము
చేయలేడని తలచకు రాక్షస!

ఆయువు తీరిన వాడవైతివి-
లక్ష్మి తొలగెను- ఇంద్రియ లోలుడ!
నీ వల్లనె- ఈ లంకాపురము
పతి లేనిదయి పరితపించును.

భర్తనుండి నను ఎడము చేసితివి-
పాపకృత్య మది- సుఖపడ నీయదు
నా పతి- మహిత ద్యుతిమంతుడు- విను
దైవబలము గల దివ్య పురుషుడు.

ధర్మశీలి- సద్భావుడు- రాముడు
నిర్భయుడాతడు- భీకర వనిలో
తిరిగెడి వాడు- నిన్ను మిగల్చడు
బల- గర్వములు హరించి వేయును.

మంత్ర పూతమగు క్రతు మధ్యమున
వేదిని తాకగ- నీచున కగునే?
పతివ్రతను- శ్రీరామపత్నిని
చూడగ శక్యమ? అసురుడ నీకు?

తామరలున్న కొలను యందున
రాజహంసతో నుండెడి- హంస
గడ్డిలొ తిరుగు- నీటి కాకిని
చూచున? నీ వెట- రాముడెక్కడ

జడమీ తనువు- బంధించుకొను
తినెదనందువా- తినుము కాదన-
మనసు వశమున నున్న దానను
నీవు మాత్రము మనుట అసాధ్యము.''

కోపము నిండి కఠినము గాను
సీత పలికి మరి మిన్నకుండెను
భీతి గొలుపునటు సీతను గాంచి
పలికె నసురుడు ప్రభంజనముగా

''సీతా! వినుము- గడువు నుడివెద
పది రెండు నెలలలొ మనసు మార్చుకో-
మూర్ఖత నిండిన- గడువు తీరగనె
ప్రాతఃకాలపు భోజన మగుదువు.''

కోపము నిండిన అసురుడు పలికెను-
దానవకాంతల నుంచె కావలిగ
''పొగరు దించుడు మానవ కాంతకు-''
బలముగ-నేలను తన్నుచు పలికెను :

''కొత్త చిగురులు నిండిన వనమున
పూజ్యము అయిన అశోక వనమున
దాచి- తెలివిగా- రహస్యమ్ముగా
జాగరూకులై కావలి కాయుడు.

భీకర రూపులు మీరందరును
భయమున గాని- నయమునగాని
అడవి ఏనుగును లొంగదీసి నటు
నాకు లొంగునటు చేయుడు మీరు.''

ఆనతినిడి- చనె లంకాధిపతి-
అంతట అసురకాంతలు సీతను
అశోక వనిలో- ప్రకృతి ఒడిలో-
ఆ శోక లతను- భూమిజ నుంచిరి.

తరగని వ్యథతో కలవరపడుచు
ఆడ పులులలో హరిణిగ సీత
రాక్షస స్త్రీల మధ్యలొ సీత
అసురకాంతల వశమున నుండెను.

సహింపరాని మనోవేదనతొ-
కృశించినట్టి రాముని పత్ని-
గట్టి పగ్గముల కట్టగ బడిన
ఆడ జింకవలె- దుఃఖము నుండెను.

భయము గొలుపు ఆ రక్కసి వనితల
నడుమనున్న- ఆ రాఘవు రాణి
శ్రీకరుడైన శ్రీ రఘురాముని
పతిదేవుని- ధ్యానించుచుండెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 57 రాముడు అపశకునములు గాంచుట

రామచంద్రుడు టక్కరి అసురుని
ఉక్కడగించి బయలుదేరగా
అపశకునముగా నక్కలు కూసెను
మదిలో శంక ముదిరి పోయెను.

''నా కంఠధ్వని వినిన జానకి
పరితపించుచు లక్ష్మణు నంపును
ఒంటరి సీతను అదను చూచుకొని
మ్రింగుదు రేమో మానవభోజులు.

బంగరు జింక ఉండున ఇలలో
ఇంతదూరము మాయతొ తెచ్చి
చచ్చెను అసురుడు- అరచుచు నిచట
మాయలమారి అసురుల పని యిది.''

ఒంటరి సీతకు-సుమిత్ర సుతునకు
క్షేమము- కలుగగ మదిలో తలచెను
జనస్థానమున విడిసి యుండుటచె
అసురులతో శతృత్వము కలిగెను.

అపశకునములు తోచుచున్నవి
నక్కలు- భీతిగ అరచు చున్నవి
ఎట్టి విషయము తెలియగ నగునో
అనుచు రాముడు వ్యథతో నిండెను.

మృగములు-పులుగులు- కుడినుండెడమకు
భయముగ నరచుచు పరుగిడి పోగా
కలతచెందిన మనసుతోడను
సీతను- తమ్ముని తలచుచు నడచెను.

ఆశ్రమ సీమకు అంత దవ్వులో
దీనవదనుడగు తమ్ముని గాంచెను
దుఃఖము నిండిన సీతాపతి అట
తమ్ముని- కరమునుబట్టి పలికెను :

''అయ్యో! సోదర-సీతను వనిలో
ఒంటరిగా నువు ఏల వదలితివి?
అసురులామెను మ్రింగి వేసిరో
హరించి నారో అశుభము తోచును.

లక్ష్మణ! మనము సీతాదేవిని
అసువులతో మరి చూతుమొ లేదో-
అపశకునములు తోచునట్టుగా
మృగములు-పులుగులు- అరచుచున్నవి.

మాయ రక్కసుని- జిత్తులమారిని
చంపితి నేను-మృగమది కాదు
ఎడమకన్నది అదరుచున్నది
అశుభ సూచనగ తోచుచున్నది.

నాయన! సోదర- ఆశ్రమమందు
సీత లేదని తోచుచున్నది
అసురులు చంపిరో-మనలను వెదకుచు
వనిలో-వనిత త్రోవ తప్పెనో.''

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

# 5 8 శ్రీరాముని ఆవేదన

''రాజ్య సుఖములు వదలి-వనమునకు
భక్తితొ-సీత బయలుదేరెను
అడుగుల నడచెను దండకవనిలో
వీడి వచ్చితివి - ఏగతి బట్టెనొ

అసువులు నావి ఆమె నిలుపును
అట్టి సీతను వదలి బ్రతుకు టెటు
ధరాధి పత్యము-సురాధిపత్యము
కోరను- కోమలి తోడుగ నున్నచొ

సీత ప్రాణముతో నున్నదొ? లేదో?
పలుకుము తమ్ముడ తొందరగాను
వనవాసమున పతి నెడబాయని
సీత లేనిచో నే మనలేను.

సీతను గానక నే మరణించిన
నీవు- పురములో అడుగిడి నంతనె
కోరిక తీరిన కైకాదేవి
మదిలో సంతస మందును కాదా!

కొడుకుతొ రాజ్యము నందిన కైకను
కొడుకు లేని నా కౌసల్యమ్మ
కొలుచుట ఎట్లు-సుమిత్రనందన
కోమలి వివరము తెలుపుము శీఘ్రమె.

సీతయున్నచో వచ్చెద నచటికి
ఆశ్రమ మందు అడుగు బెట్టెద
సతి అటలేనిచొ అంత దూరము
రానిక- తనువును వీడెద నిచటే-

ముద్దులొలికెడి ముద్దరాలు- తను
ముద్దుగ సుద్దులు చెప్పకున్నచో
వద్దు తమ్ముడా- ఆశ్రమ వాసము
ఇద్దర నే నాఅసువులు వీడెద.

పలుకుమయానువు- ప్రాణేశ్వరి అట
ప్రాణమ్ములతో నున్నదా మరి-
హెచ్చరికను నువు తప్పియుండగా
భక్షించిర ఆ దానవు లామెను?

నీచుడు- గొంతుక మార్చి అరవగా
నీకును భయము కలిగెన సోదర!
నా కంఠ ధ్వని- అని నిను పొమ్మన
వదలి వచ్చుట తగునా తమ్ముడ!

ఖరుడు చావగా- అసురులు పగ గొని
అదను కోసమై వేచియుందు రని
ఆలోచించవ- ఓ సుకుమారా!
అడుది - ఒంటరి - దొరుకును కాదా?

నాయన! నిన్ను ఏమని అందును
దుఃఖ జలధిలో పూర్తిగ మునిగితి
ఈ గతి నాకు. ప్రాప్తమయ్యెనని
తలతును- విధి ప్రతికూల మయ్యెనని.''

సీతను తలచుచు నోరెండగను
ముఖము సోలినది సీతాపతికి
ఆశ్రమ త్రోవలొ నడచుచుండగా
వెక్కివెక్కి తానేడ్చె రాఘవుడు.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 59 శ్రీరాముని దుఃఖము

ఆశ్రమ సీమకు వచ్చుచు త్రోవలొ
శోకము నిండిన రామచంద్రుడు
సుమిత్ర సుతునితొ పలికెను అపుడు
సీతను ఒంటరి చేయుట తగదని-

''నిన్ను నమ్మి- నే వచ్చితి కాదా!
నీ రక్షణలో నుంచితి కాదా!
న్యాయమ నీకు? ఇటు వచ్చుటది
నిన్ను గాంచగా శంక ముదిరెను.

దూరము నుండే నిన్ను గంటిని
ఎడమ నేత్రము, ఎడమ భుజమును
అదరుచుండెను అశుభ సూచనగ
గుండియ పగిలెను-సోదర లక్ష్మణ!''

అన్న పలుకులకు శోక తప్తుడై
పలికె లక్ష్మణుడు :''అన్నా! వినుము
నేనా అరపులు విని రాలేదు
వినక పోతి-నా వదిన పలుకులు.

పొమ్ము పొమ్మని తొందర చేసెను
ఆపద నీకని అమ్మ తలచినది
నీ శక్తిని-నే తెలిపితి వదినకు
వినక పోయినది-నిలువ నీయదు

'రామచంద్రునికి ఆపదరాదు
సురల రక్షణము చేయగ చాలును
తన రక్షణకై అరచున అటుల-
తాళుము తల్లీ-నిజము తెలియును.

మాయ గొంతుతో అరచెను ఎవడో
అన్న గొంతు అదికాదు నమ్ముము
శాంతి వహింపుము-ధరణీ తనయా!
నీచ స్త్రీల వలె ధుఃఖము తగదు

పుట్టినవారిలొ-పుట్టెడివారిలొ
రాముని గెలిచే వీరులు లేరు
సురలొక టైనను చాలరు తల్లీ!
నీచ రాక్షసులు నిలువ రంటిని.'

నమ్మకపోయెను నా పలుకులను
నన్ను కోరి-నువు పలుకుచుంటివనె
నాతి మనసది భ్రమతో నిండెను
నన్నేమన్నదొ నే నెటు పలుకుట?

భరతుడు-నీవు నిర్ణయించుకొని
భక్తి నటించుచు అనుసరించితివి
భర్తకాపద కలగగ-నీవు
బయలుదేరవా తమ్ముడవైతే-

అని పలికినదయ- ఓ రఘురామా!
అదను కాచెడి విరోధి వన్నది
అదరెను పెదవులు-గుండియ పగిలెను
అన్నా! నిజము పలికితి నమ్ముము.''

తమ్ముని పలుకుల రాఘవు డనెను
శోక - మోహము - తాపమ్ములతో
''పాపరహితుడా! రక్షణ వదలి
ఇటు వచ్చుటది సరిగాదుసుమా!

కోపము నిండిన కటు భాషణము
విని-నీ విటుల బయలు దేరితివి
నా శౌర్యము నువు తెలిసియు కూడ
నీ వివేకమును వదలితివయ్యా!

అతివ పలికెనని-నా ఆనతిని
కాలదన్ని-నువు కదలుట న్యాయమ?
చెంగున-కోపము నిండిన నీవు
సీతను ఒంటరిచేసి వచ్చితివి.

ఒక్క బాణమున టక్కరి కూలెను
చక్కగ నేను వచ్చుచుంటిని-
అక్కడ-వాడు అరచిన అరపు
నిక్కముకాదని తెలియక పోయెను.''

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 60 సీతాదేవికై రాముడు దుఃఖించుట

వడివడి నడచెను రామచంద్రుడు
ఎడమకంటి దిగువదిరెను అపుడు
పదములు కదలక-మేను వణకెను
అపశకునములతొ వ్యాకులపడెను

కనగలనా-నే-లలనామణి నని
వ్యథతో రాముడు అడుగిడి-అచట
ఆశ్రమమందు సీత లేనిచే
ఆక్రందించెను ఒక్కమారుగా

పద్మరహితమగు కొలను రీతిగా
వాడిన మోముల పక్షులు గలిగి
వేదన తెలుపుచు వృక్షములుండి
బడలిన జింకలు కలిగిన వనము-

వనదేవతలు వదలిన వనము
చెదరిన కృష్ణాజినములు-దర్భలు-
వెదకెను-వెదకెను- ఆశ్రమమంతయు
రాముడు వెదకెను వేయి కన్నులతొ

ఆశ్రమలక్ష్మి-గృహదేవత యగు
సీతను గానక రామచంద్రుడు
మనసు కలతపడి-మగువ కోసమై
తలచి-తలచి-అట రోదించుచును

తలచెను అసురులు హరించి రేమో-
దుష్ట మృగములు కాంతను తినెనో-
ఎటకేగినదో-ఫలముల కేగెనొ
వినోదమ్ముకై దాగియున్నదో-

కాంతారమ్మున కేగినదేమో-
స్నానార్థము తానేగినదేమో
మంచి నీటికై ఏటికి పోయెనొ
సుమములు తేగా సాగినదేమో-

ఏమి చేయుదును- ఎక్కడ వెదకెద
ఎవరిని అడుగుదు- ఎట బోయెదను?''
అనుచు తలచుచు కుమిలిపోవుచు
కన్నులు పొంగగ రోదన నిండెను.

శోకము నిండిన ఎఱ్ఱని కన్నుల
పిచ్చి చూపులతొ అవివేకి వలె
శిరసును-చేతితొ కొట్టుకొనుచును
దిక్కెవ్వరని యేడ్చెను అపుడు.

చెట్టు-చెట్టునకు పరుగులెత్తును
గుట్ట-గుట్టకు వడిగా గెంతును
పుట్ట-పుట్టకు తిరుగును వడిగా
వాక-వాకకు వెదుక బోవును.

దఃఖ సంభ్రమున మునిగిపోవుచు
''ప్రియురాలా! ఇటు చేయుట తగునా?
పరిహాసమునకు తగునా ఈ పని?
అనుచు ఏడ్చుచు-కుమిలి పోయెను.

''దొండతీగ-నువు బింబాధరిని
చూచితివా-మరి పలుకవదేమి?
కడిమి వృక్షమా! నీ పూవులన
ప్రియము గలిగిన కాంతను గంటివ?

మద్ది వృక్షమా! మగువను గంటివ?
బిల్వ వృక్షమా! భూమిజ ఎచట?
చిలుకా! నీ వలె పలికెడు చిన్నది
కనబడలేదా-తెలుపవ నాకు?

మీతో సమమగు కన్నులు గలిగిన
కాంతను గంటిర జింకల్లారా?
కకుభమ! నీతో పోలెడి-తొడలు
గలిగిన కాంతను కనలేదా నువు?

నడకల-నీతో పోలిక గలిగిన
పడతిని గంటివ ఓ మత్తేభమ?
స్త్రీలలొ తిలకము వంటి పడతిని
కంటివ నీవు-తిలక వృక్షమా?

జాంబూ వృక్షమ! నీ ఫలముల వలె
మెరిసే మేను గలిగిన మగువను
ఈ వనసీమలొ కంటివ చెపుమా?
కనబడలేదా-చూచి చెప్పవా?

అశోక వృక్షమ! శోకము తీర్తువు
కావున నీకా పేరు గలిగినది
కాంత వివరము నాకు తెలుపుమా!
నీ పేరుతొ-నను సుఖపడ జేయుము.

తాళవృక్షమా! ఏల కోపము?
తెలుపవ-నా సతి ఎచ్చట నున్నదొ
మామిడి తరువా! క్రొంజిగురులతో
పోలెడి చేతుల సుందరి ఏది?

మంకెన తరువా! నీ పూవులతో
పోలెడి-నాసికగల స్త్రీ ఏది?
నిమ్మా! ఎంతటి దంభము నీకు?
ధరణీ నందిని ఎచటో తెలుపవ.

పాటలమా! నీ పూవులబోలు
ఎఱ్ఱని పెదవుల అతివను గంటివ?
క్రొత్త ఉసిరికా! కనబడలేదా
క్రొత్త వయసులో సొగసుకత్తె ఇట?

సరళమ! నీకిట కనబడలేదా
సరళహృదయ నా కుసుమ కోమలి?
మల్లెతీగ! నువు కనలేదా మరి
లతవలె దేహము గలిగిన కాంతను?

కరిణీ! నీదగు తొండము బోలు
తొడలు గలిగిన-లలనను గంటివ?
హరిణీ! నీతో పోలెడి కన్నులు
కలిగిన చిన్నది కనబడలేదా?

తుమ్మెద! నీవలె నల్లని రంగుతొ
మెరయు శిరోజను సీతను గంటివ?
సింగమ! నీదగు-నడుమును బోలు
నడుము గలిగిన అబలను గంటివ?

గజగమనను మరి గంటిర మీరు?
శార్దూలమ! నువు చెప్పవ-జాడ
కోకిల! నీవు తెలిసియుందువు
నీ కంఠముగల కోమలి ఏది?

హంసా! నీవలె నడయాడెడిది
మందగమనను-కనలేదా నువు?
దయతో మీరు-నా సతి వివరము
తెలుపుడు'' అనుచు దుఃఖము నిండెను.

''నిలు-నిలు నీవు-పరుగిడవలదు
నిర్దయ మానుము ఓవిరి శరమా!
అలుక ఏలనే-అన్నుల మిన్న
పరిహసించుచు పరుగిడు చుంటివ?

నే చూచితిలే-దొంగా నిన్ను-
నీ చీరదిగో-కనబడుచున్నది-
నల్లని నీ జడ తారాడెనదే
నాపై కోపమ? నను రక్షించుము.''

అడిగిన వాటినె తిరిగి అడుగుచు
తిరిగిన చోటనె తిరిగి తిరుగుచు
మూర్ఛిలి-లేచుచు-సోలిపోవుచు
దుఃఖము నిండి అతివను గానక.

మదిలో తలచెను రామచంద్రుడు:
''ముదిత మ్రింగబడె అసురుల చిక్కి
మరిగాకున్న కనబడదా ఇట
మాయమగుట ఎటు-ఇంతటి లోన

సంతోషముతో-అసురులు చంపి
అవయవమ్ములు అందరు కలిసి
పంచుకొనుచు-మరి భుజించినారో
ఎంతటి ఘోరము జరిగిపోయినది!

అందమైనది కమలము పోలెడి
సీత వదనము వాడి పోయెనో-
లలిత కుసుమలత సీత అరవగా
కోపము నిండిన అసురులు త్రుంచిరొ

కోమలమైన హస్తమ్ములను
విరిచి-చెరుకువలె నములుచుండిరో
ఒంటరి స్త్రీని-మృగములు-వనమున
భక్షించినటు-అసురులు మ్రింగిరొ

సోదర లక్ష్మణ! మతి చెదరినది
కావున నేను చూడగలేను
నీకైనా మరి కనవచ్చినదా?
సీతా! నిన్ను-నే మరి కాంతున?''

ఈ విధముగను రామచంద్రుడు
వనముల తిరుగుచు-వెర్రివానివలె
సీతా-సీతా అని విలపించుచు
భూమిజ కొరకై భూమిని తిరిగెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 61 మనసు వశము తప్పి రాముడు దుఃఖించుట

ఆశ్రమమందు-చెదరిన యట్టి
వస్తువులను గని-ఖేదము నొందెను
చేతులనెత్తి-ముఖము కప్పుకొని
రోదించెను తన సహధర్మిణికై.

''సోదర లక్ష్మణ! తిరిగి-సీతను
కాంతున-చెప్పుము-మృగములు తినెనా
కమల నేత్ర- ఓ సీతాసుందరి
కన్నులార నిను గాంతున తిరిగి?

తరువుల మాటున దాగితివా నువు?
దాగుడు మూతల కిదియే సమయమ?
నీవు పెంచిన ఈ జంతువులు
విలపించుటది వినబడలేదా?

నిను గనలేక-తనువును వదలి
స్వర్గమేగినచొ-నా జనకు డట
వనవాసమును-పూర్తి చేయక
విడచివచ్చుట-అధర్మమనడా?

చెడునడవడిగల పురుషుని కీర్తి
తొలగిపోయినటు-చక్కెర బొమ్మా!
దూరమైతివి నే నెటు పోదును?
ఏ విధి తనువును నిలిపెద నేను?

పంకమునందు పడిన కరివలె
అలికోసమై విలపించెడి- ఆ
రామచంద్రుని-అనునయముగను
ఊరడించెను సుమిత్ర సుతుడు :

''అన్నా! ఏల వంతనొందుట?
వదినను-వనిలో వెదకెదమయ్యా!
వంకల-వాగుల-గుహల-లోయల
కానల-కోనల-వెదకిన దొరకద?

నీకు తెలియని విషయము కాదిది
వన విహారము-వదినకు మక్కువ
ఎక్కడనో ఇట ఉండును వినుము
స్నానార్థముయి వెడలినదేమో?

కమలమ్ములకై సరస్సు కేగెనొ!
పరిహాసమునకు దాగినదేమో!
శోకము నిండి కృశించి పోకుము
వెదకెద మయ్యా-ధైర్యము పూనుము.''

తమ్ముని పలుకుల ధైర్యము వచ్చెను
వనిలో-తిరిగి వెదకసాగిరి
కొండలు-కోనలు-దండక వనిలో
వెదకి-గానక-రాముడు పలికెను :

''సోదర! వెదకితి మీ ప్రదేశము
దండక వనిలో కనబడలేదు
ఏమి చేయుదము- ఆ సుకుమారి
మనకు దొరకెడి మార్గము ఏది?''

లక్ష్మణమూర్తి పలికెను అన్నతొ :
''అన్నా! మున్ను వామనమూర్తి
బలిని అణచి-తను భూమినంది నటు
భూమీసుతను పొందగల వయా!''

లక్ష్మణ! వెదకితి మీ ప్రదేశము
రమ కనరాదు ఎక్కడ వెదకెద?''
అని మూర్ఛిల్లెను-నేలను బడెను
సీతా! సీతా! అని దుఃఖించెను.

తమ్ముడు-తనను ఊరడించగా
వినకపోయెను - శోకము పెరిగెను
మన్మథు బాణము మది కలంచగా
ధర్మమూర్తి విలపించెను సతికై.

॥శ్రీ రఘురామ

❉❉❉

## 6 2 మనసు చెదరి రాముడు దుఃఖించుట

కన్నులముందర కనరాకున్నను
ఉన్నది అనిన భావన నిండి
పలుకుచుండెను రామచంద్రుడు
కనబడినటుల పిలచుచుండెను

''క్రొత్త పూవుల కొమ్మల వెనుక
అశోక తరువు శాఖమాటున
దాగియుంటివి గాంచితినిన్ను
దొరికిపోతివి దరికి చేరుము.

అరటి బోదెల చాటున-నీవు
అందము లొలుకగ నిలిచితివా మరి!
అదిగో-నిన్ను కనలేనా మరి
అన్నులమిన్న-కన్నుల నీవే

విశాలమైన నయనము లున్న
నా సీతా! ఈ కొండ గోగులలో-
పూలను వెదకెడి ఓ సుకుమారీ
పరిహాసించుట ధర్మము కాదు.

నవ్వులాట-నీ కొక-యాటయని
తెలియును కానీ, అలసి పోతిని
సమయము కాదిది సుందరనయనా!
ఆపదలో - పరిహాసము తగదు

కనరాదయ్యా! అసురులు మ్రింగిరొ
పరులెవ్వరొ మరి అపహరించిరో-
జాలిగ నేడ్చెడి మృగము లన్నియు
సీతను-తినిరని చెప్పుచున్నవి.

కైక కోరిక తీరెను కాదా-
జానకి లేక - పురము జేరు టెటు?
సత్తువలేని శౌర్యహీను డని
పరిహాసించరా పురిలో జనులు

దయాదూరుడని అనరా నన్ను-
శూన్యముగాదా మనుగడ ఇంక
భార్యలేని మగవాని బ్రతుకది
అర్థరహిత మానంద మీయదు.

అరణ్యవాసము అయినదని విని
జనకుడు వచ్చి కుశల మడుగగ
సీతలేదని తెలిసినవాడై
మూర్ఛిలిపోడా సుమిత్ర తనయా!

అమ్మ వచ్చి-నను-కోడలు ఏదన
ఏమి పలికెదను నోరెటు వచ్చును
ముసిముసి నవ్వులు కైక నవ్వదా!
తమ్ముల కేది సమాధానము!

అసమర్థుడయి రాముడు- అడవిలో
సతిని గానక వచ్చె ననుచును
పలికెడి జనుల నిందల నెటుల
భరించనగును తెలుపుము తమ్ముడ!

భరతుని పురము రాకయె నేను
నాకము కేగెద అసువులు వీడి-
అచ్చట కూడ సీత లేనిచో
నాకము శూన్యము- రుద్రభూమియగు.

కావున లక్ష్మణ! అయోధ్య కేగుము
చల్లగ రాజ్యము నేలు మనుచును
భరతునితో నా మాటగ చెప్పుము
తల్లు లందరికి వందన మనుము.

నా సేవలో యిక తిరుగుట ఏల!
సీత లేక- నా తనువు నిలువదు
అని శోకించు అన్నను గాంచి
కలవరపడెను సుమిత్ర తనయుడు.

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 6 3 లక్ష్మణుడు శ్రీరాముని ఊరడించుట

స్నేహము -మోహము- శోకము నిండి
భార్యను తలచుచు పరితపించెడి
రాముడు పలికెను తమ్ముని తోను
మహాపాపిని నేనని నుడివెను.

''శోకముపైన శోకము కలిగెను
పూర్వజన్మలో విస్తార మగు
అఘములు చేసిన వాడను కావున
పెనుదుఃఖ మిటు సంప్రాప్తించెను

అసమానమగు రాజ్యము పోవుట
ఆప్తులు- హితులకు దూరమగుటది-
తండ్రి గతించుట- తల్లికి దూరము
తనువు దహించెడి ఇడుములన్నిటిని

వనవాసమున- సీత సపర్యలో
మరచితినయ్యా సుమిత్ర నందన!
సతి ఎడబాటుతొ అన్నీ ఒకటై
కాల్చుచున్నవవి- బాధల సమిధలు

బలాత్కారముగ అసురుడు గొనిపో-
లొంగకపోయిన కారణమ్ముగ
ఖండించి మరి ఆనందింతురు
పగతీర్చుకొన హతమార్తు రయా!

రాహువు కందిన చంద్రుని మాదిరి
చంద్రవదన- కళ దప్పియుండును-
ముత్తెపు హారము లమరిన మెడను
చిదిమి- నెత్తురు త్రాగిరొ అసురులు

గోదావరి నది సీతకు ప్రియము
కానీ- ఒంటిగ పోదు సోదరా!
ఈ శిలపైన నాతో కూర్చొని
హాస్య ప్రసంగము చేయుచుండెడిది.

పద్మముఖి యగు సీతా సుందరి
పద్మమ్ములకై గౌతమి నదికి
వచ్చినదేమో- కానీ- తమ్ముడ,
ఒంటరిగా నట అడుగిడదయ్యా!

కనబడుదైవమ కరుణామూర్తీ!
ఓ రవి బింబమ-నమస్సులయ్యా!
సత్యా సత్యము నెరుగుదు నీవు
ఎక్కడ సీత? ఎవరు హరించిరి?

వాయుదేవుడా! సర్వము నీవే
సీతజాడ మరి తెలియబరచవా!
దుష్టుడామెను హరించినాడా?
అసువులు బాసెన? త్రోవదప్పెనా''!

రాముడు అటుల దుఃఖించగను
సమయము నెరిగిన సుమిత్ర సుతుడు
ఊరడించెను మృదువచనముల
యోగ్యముగా నట పలికెను తమ్ముడు :

''శోకము వదలుము అన్నా రామా!
ధైర్యము తెచ్చుకు నిలబడవయ్యా!
మహాత్ములెన్నడు కష్టములందు
శోకించరు విను-వెదకెద మిపుడే.''

లక్ష్మణమూర్తి ఎన్నో విధముల
ఊరడించగా రామచంద్రుడు
మది కలవరమున సీతను తలచుచు
పలికెను అపుడు తమ్మునితోను.

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

# 6 4 మృగములు సీత అపహరింపబడిన దిశను సూచించుట

''గౌతమినదికి పొమ్ము లక్ష్మణా!
ఫల సుమములకై పోయినదేమో?''
అనగా తమ్ముడు ''వదినా! వదినా!''
పెద్దగ అరచెను గౌతమి ఒడ్డున.

జాడ తెలియక తిరిగి వచ్చెను
అన్నకు చెప్పెను-పిలచితి నన్నా
ఎంత పిలిచినా అలికిడి లేదు
అనగా, రాముడు నదినిచూచిఅట

''అమ్మా తల్లీ ఓ గోదావరి!
చిగురుల వంటి పదములు గలిగిన
సీత వచ్చెనా? తెలుపుము దయతో
దొంగలామెను అపహరించిరా?''

జాలిగ అడిగిన భూతకోటు లవి
బదులిడకుండెను అసురుని భయమున-
ఆశలేక- ఇక - అమ్మకు మరియు
జనకుని కేమి చెప్పెద ననుచు

''ఆహా-సీత ఇపుడు లభించగ
గోదావరినది ఒడ్డునందున
ప్రస్రవణాద్రి గిరియందున-నే
అతివతొ తిరిగి ఆనందింతును''

అంతట-మృగములు జాలిగ నేడ్చుచు
రాముని గాంచి పలుకు నట్టుగా
మరిమరి చూడగ-రామచంద్రుడు
అడిగెను వాటిని సీత జాడకై

అంతట అవ్వి చెంగున లేచి
దక్షిణదిశగా-శిరసు లెత్తుకొని
రామ-లక్ష్మణుల నిద్దరగాంచి
పరుగిడ సాగెను-మూగభాషతో-

తమ్ముడు పలికెను : అన్నా రామా!
మృగములు చూపిన దిశలో మనము
పోదము''-అనగా నైఋతి దిశలో
సాగిరి అంతట ఒక ప్రదేశమున

నేలమీదను రాలిన పూలను
గాంచిన రాముడు-డగ్గుత్తికతో
తమ్మునితో ననె : ''ఈ సుమములను
నే నివ్వగను సీత ముడుచుకొనె

గుర్తించుటకై నాపై దయగొని
వాయువు - భూమి-సూర్యదేవుడు
రక్షించిరయా! ఈ సుమములను''
అని పలుకుచు నొక గిరి నట గాంచి

''సర్వాంగసుందరి సీతాసాధ్వి
మోహనరాసిని ఓ పర్వతమా!
ఒంటిగ నామెను వదలితి నేను-
ఇట తిరుగుట-నువు కంటివ చెపుమా?''

రాముని పలుకులు పర్వత మందు
ప్రతిధ్వనించి వినబడె తిరిగి
అంతట రఘుపతి-కోపమునిండి
సింహము అల్పమృగమును గన్నటు

రామచంద్రుడా గిరితొ పలికెను :
''బంగరు కాంతుల వెలిగే సీతను
చూపక పోయిన-చూపెద శక్తి
నేలను త్రోసెద నీగిరి శిఖరము

మంచి మాటలతొపలుకుము సరిగా
సీతను-నాకు అర్పించుమయా!
అటుగాకున్న- ఓ గిరి రాజమ
వాడి శరమున నాశము చేతును.

సీత వివరము- ఈ నది ఇపుడే
చెప్పక పోయిన-నీరు ఇగిర్చెద''
అనుచు రాముడు పలుకుచు నచట
నేలమీదను గుర్తులు గాంచెను.

భయపడి పరుగిడు-చిన్న పాదములు
పదముల వెంబడి-పెద్ద పాదములు
విరిగిన ధనుసు-అమ్ముల పొదులు
కూలిన తేరు కన వచ్చెనట.

తమ్ముని కచ్చటి గుర్తులు చూపుచు
రాముడు పలికెను:''సోదర! చూడుము
జోమాలె పూసలు-బంగరు సొమ్ములు
పూలదండలు నేల రాలినవి.

బంగరు పూసల మాదిరి నెత్తురు
బొట్లుగ రాలెను-నేలను గనుము
అసురులు అతివను అంతముచేసి
ఆరగించిరని తోచుచున్నది.

విరిగిన రథము- విరిగిన చాపము
పోరు జరిగిన పోకడ తోచును
ఇద్దరు అసురులు - జానకి కొరకై
తలపడినారని - మదికి తోచును.

బంగరు శోభల- తళతళ మెరిసే
ముత్యపు- రత్నపు- తాపడమైన
చాపము - ఇచట విరిగి పడినది
ఎవరిదొ ఏమో- తెలియకున్నది

బాలసూర్యుని తేజము నిండి
బంగరు కవచము- వైడూర్యములు
పొందుగ అమరి- పడియున్న దిట
ఎవరిదొ నీవు ఆలోచించుము.

నూఱుకమ్ములతొ- పూలదండలతొ
ప్రకాశించు- ఈ గొడుగును గనుము
ధరణిని పడుటకు కారణమేమి!
ఎవరిదొ ఇది- మరి విరిగి పడినది

బంగరు కవచములున్నవి ఇచట
భయము గొలిపెడి పిశాచ ముఖముల
గార్ధభమ్ములిట- పడి- చచ్చినవి
ఎవరివొ ఇవ్వి- కారణమేదియొ?

టెక్కెము విరిగి పడియున్న దిట
చచ్చిన సారథి- అడుగో అచట
ఇరువురు నేలకు ఒరిగిరి గనుము
శరములు నిండిన అమ్ముల పొదులవి.

సోదర! నిశ్చయ మైనది ఇంక
అసురుడు అబలను హరించినాడు
అలుసు చూపితిని అసురులపైన
ఆగదు నా పగ- యావజ్జీవము.

హరించినారో భుజించినారో
ఏదో ఒకటి తప్పక జరిగెను
ధర్మము నిండుగ నడచుచున్నను
దుర్మార్గమునకు లొంగుట జరుగును.

అసురులు- అబలను తినుచుండగను
రక్షణ నిడర- ఈ దేవతలు?
అక్కరలో మరి ప్రక్క నిలువరా?
నా శత్రువులై సుఖపడగలరా?

సోదర! ఎంతటి శూరుడైనను-
సృజించగలిగిన సమర్థుడైనను
దయాపరునిగ ఉన్నటులైన
అసమర్థుడని- తలచెదరయ్యా!

లోకహితుడనై - దయాగుణముతో
అపకారమన్నది - మదిలో నెరుగని
నన్ను తలచిరి సామాన్యునిగా
బలహీనునిగా భావించి రయా!

నా సద్గుణములు ఈ సమయములో
దోషము లైనవి వీరందరికి-
నా పౌరుషము చూపెద నిపుడే
తెలియును వారికి- కలిగెడి బాధలు.

తూరుపు కొండల భానుడు నిలచి
చంద్ర కిరణముల హరించినట్లు
భిక్షుసు గుణములతొ తేజము నింది
ప్రకాశించెదను- జాలిని వీడి

అసురులు- యక్షులు- గంధర్వులలో
పిశాచములలో- పుడమి జనులలో
సుఖపడగలిగిన- ప్రాణియుండునా?
నా పరాక్రమము చూపెద నిపుడే-

వాడి శరముల- తేజముతోను
వాయువు- అగ్ని- సూర్యుని ప్రభలను
చెడగొట్టెదను- గిరులను చీల్చెద
గ్రహముల- తికమక చేయుదు నయ్యా!

శశిబంబమును- నేలకు రాల్చెద
సంద్రపు నీటిని ఎండగట్టెద
తరువుల- తీగలు- తెగిపడిపోవును
నాశము చేయగ నిలిచితి నిపుడే

నింగిని తిరుగు సురలనురాల్చెద
మూడు లోకముల వ్యాకులపరచెద
సీతను- వారు బాధించకను
చెంత చేర్చినచొ సరియగు సర్వము-

ఆకర్ణాంతము విల్లునులాగి
విడచిన శరము త్రిభువనములను
అల్లకల్లోలము చేయును తమ్ముడ!
ధ్వంసము చేయగ- నిలబడ గలరా?

ప్రియమగు సీతను మంచితనమున
నాకు- తిరిగి మరి సమర్పించనిచొ
ముల్లోకములను రూపుతొ నుంచను
నాశము చేతును వాడి శరముల.''

అనుచు పలుకుచు - చెక్కిళ్ళదరగ
నిలచె రాముడు- త్రినేత్రుడై అట
ఘన కోదండము నందుకు నిలచెను
సర్పసమమగు శరమును కూర్చెను

''ఏ విధి ముదిమి- మరణము- కాలము
అదృష్టమ్ములు వచ్చునొ- వాటిని
ఆపగలేము- అటులే నాకు
కోపము వచ్చిన ఆగదు నిజము!

పతివ్రతయగు సీతా సాధ్విని
వెంటనె- వారు చేర్చిన మంచిది
లేదా- నే నీ శరమును వదలి
కల్లోలమునే సృజియించెదను.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 6 5 లక్ష్మణుడు రాముని శాంత పరచుట

రాముని కోపము చూచిన తమ్ముడు
ప్రళయరుద్రునే- చూచిన అనుజుడు
వింటితొ నిలచిన వీరపుంగవుని
గాంచినంతనే పెదవులు ఎండెను

తమ్ముని ముఖము వెలవెల బోయెను-
అన్న- ప్రశాంతుడు అగుటకు- అనుజుడు
మృదువచనముల- భక్తితొ పలికెను :
''అన్నా! నీవు లోకహితుడవు-

కోపము నెరుగవు-సరళ హృదయుడవు
నీవీ విధముగ నీ గుణములను
సహజగుణములను-వదులుటధర్మమ?
జీవుల రక్షణ చేయువాడవే-

శాంతి మార్గమున దయాపూర్ణులై
యుక్త దండనము చేయుచు-రాజులు
యశము గడించి భువి నేలెదరు
దయాదూరులై శిక్ష విధించరు

చంద్రునిలో మరి లక్ష్మీ ప్రదము
రవిలో ప్రభయు-భువిలో క్షమయు
వాయువులో మరి సర్వము గనుటను
గొప్పగుణములవి నెలకొనియున్నవి

అఖిల భూతముల శరణాగతివి.
యజ్ఞకర్తకు ఋత్విజులందరు
మేలు కోరునటు-భూతకోటులు
నీ హితమునకై నిలిచియుందురు

అన్నా! నీలో అన్ని గుణములు
కలసి యున్నవి-కాపురమున్నవి
కరుణామూర్తివి-నీవిటు పలుకుచు
లోక వ్యాకులము చేయగ న్యాయమ!

కోదండముతో నీవు సాగగా
ప్రక్కన నేను-నడచుచుండగా
తపోవంతుల సహాయమ్ముతో
భూమిజ కొరకై భువి శోధింతము

అపరాధమ్మును ఒకడు చేసిన
శిక్ష అందరికి- ఎందుకు రామా?-
తేరు విరిగినది ఒక్కటె గలదు
వీరులెందరో వున్నటు తోచదు

గిరులయందున-అడవుల యందు
నదీ తీరముల వెదకెదమయ్యా!
దేవతలుండు స్థలములయందు
హెచ్చరికతొ మరి అన్వేషింతము

సైన్యసమూహము పోరినట్టుగా
కనబడదిచట-కావున దుష్టుడు
ఒక్కడేయని-నాకు తోచును
ఒక్కనికై మరి జగతిని కూల్తువ?

మనము చేయదగు పనిని చేతము
మంచిగ-సీతను నీదరి చేర్చక-
మిన్నకున్నచో-నీవు చేయదగు
మహిత కార్యమును చేతువు లెమ్ము!

మంచి మాటల వినయ వర్తనతో
వదిన నీకు మరి లభించకున్నచొ
వజ్రాయుధముకు సరిపడు శరముల
నీకు తోచినటు చేసిన యుక్తము.''

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 6 6 సుమిత్ర సుతునిఅనునయ వాక్కులు

సుమిత్ర సుతుడు హితమును చెప్పి
అన్న పదముల వ్రాలి పలికెను :
''తండ్రి- ఎన్నియో సత్కర్మలచే
యజ్ఞ యాగములు- వ్రత దీక్షలచే

సురలు-సుధనుమరి పొందగలిగినటు
పొందెను నిన్ను- ఓ దాశరథీ!
నీ ఎడబాటును సహించలేక
అసువులు వీడెను అని వింటిమిగద!

కకుత్థ్సవంశపు కీర్తి చంద్రికవు
నీవు శోకమున కృంగిపోయినచొ
సామాన్యులు మరి నిలువగచాలరు
దుఃఖములందు మునిగిపోదురు

జగద్రక్షణము చేసెడి నీవే
కినుకతొ-త్రుంచగ మదిలోనెంచిన
రక్షకు లెవరు కంచెయె - చేనును
మేయగ-రక్షణచేయుట ఎట్లు?

'యయాతి' జారెను నాకమునుండి
వశిష్ఠపుత్రులు నూర్గు రొక్కపరి
శాపము నంది-సమసిరి కాదా?
భూమి కూడ మరి వణకును బాధకు.

సూర్యచంద్రులు-రాహు కేతువుల
వాతబడి-మరి దుఃఖము నందర?
మహాత్ములైనను దైవ నిర్ణయము
కాదని నిలువగ చాలినవారా?

కష్టము నెరుగక ఎవ్వరేనియు
కాలము గడిపిర? ఆలోచించుము-
కావున-ప్రాణికి కీడు-మేళ్ళు మరి
కాలముతో నవి వచ్చుచుండును.

ధరణిజ తనువుతొ నుండకపోయిన
అసురులు మ్రింగగ హతమయినను-విను
ఆ నిమత్తమై - పామరుడవయి
శోకించుటది కార్యలాభమా?

దోషరహితుడా! నిన్ను బోలిన
సత్యదర్శనులు-సర్వము తెలిసి
మనసు కలతపడి క్రోధము నందరు
జ్ఞానము నిండి యోచన చేతురు.

నీచమైన ఈ హృదయ దుర్బలత
తగునా నీకు? ఆలోచించుము
పుణ్య-పాపముల-ఫలములు మనము
అనుభవించవలె- అనఘా! వినుము.

రామా! నీవే బోధించితివి
తిరిగి-నీవు ఇటు వ్యధతో నుంటివి
నీకు తెలుపగ సరి ఎవరయ్యా?
దేవగురుడు మరి సరిపడడయ్యా?

నిశ్చల మనసు గలిగిన వాడవు
సురలకైన - అది అసాధ్యమయ్యా!
నిదురించెడి-నీ జ్ఞానము - నేను
మేలుకొలుపగా నుడివితి నిటుల

అమాయకులగు నరులను గాని
కీడొనరింపని సురలను గాని
బాధించకయా! నిజముగ-నీకు
కష్టము తెచ్చిన వానిని కూల్చుము.''

||శ్రీ రఘురాముని||

❈❈❈

## 67 నేల కూలిన జటాయువును గాంచుట

నీతి వాక్యములు-మంచి మనుతో
తమ్ముడు నుడువగ-శాంతితో వినెను
సారము నెరిగి పలికె తమ్మునితో :
''సీతను - ఎచట వెదకుద మయ్యా''

అంతట-తమ్ముడు భక్తితో పలికెను :
''జనస్థానమిది రక్కసి నిలయము
పెద్ద చెట్లతో క్రూర మృగములతో
కిన్నెరలకును నివాసమైనది.

వదినను ఇందే వెదుకగ వలెను
నీవలె-గొప్ప మతిమంతులు-విను
చలించరయ్యా!- పెనుగాలులకు
కొండలు కదలవు-నిండుగ నిలుచును''

అని పలుకుచును తన సోదరుడు
అనుసరించగా పురుషోత్తముడు
అబలహర్తపై అమిత కోపమున
వింట శరముతో వెదుక మొదలిడె.

అంతట- ఆ గిరి యందున వారు
పెద్ద కొండవలె నుండిన వాడు
నెత్తుట దడసిన పుణ్యమూర్తిని
పులుగు శ్రేష్ఠుని - గాంచిరి అపుడు.

వెంటనె-రాముడు తమ్మునితో ననె:
''రాక్షసుడిటుల గ్రద్దయినాడు
సీతను మ్రింగిన అసురుడు-భయమున
పులుగు రూపమున ఉన్నాడిచట.

వీనిని-నా శరఘాతముచేత
చీల్చెద నిపుడే-సందియమేల?''
అనుచు పక్షికి ఎదురుగ పోయి
శరముతో నిలువగ వణకె భూతలము.

నెత్తురు-నురగలు గ్రక్కుచు నున్న
పక్షిరాజట పలికె రామునితో:
''ఆయుష్మంతుడ! ఓషధి కొరకై
దీక్షగ అడవిలో వెదకుచున్నటు

మీరు వెదకెడి సీతాదేవిని-
నా ప్రాణమును-రెంటిని కూడ
రావణాసురుడు హరించినాడు
ఒంటరి అబలను-అపహరించెను.

పావని సీతను పట్టుకు పోయెడి
పాపిని-నేను ఎదిరించితిని
తేరును విరిచి పడద్రోసితిని
చచ్చెను సారథి రెక్కల దెబ్బకు

అలసితి నేను- అసురుడు బలముగ
రెక్కలు నరికి- అబలతొ పరుగిడె
మగువ కోసమై అసురుడు చంపెను
మరల నన్ను నువు చంపుట ఏల?''

భరింపలేని ఈ దుఃఖముతో
జలధిని పడినను-వేడిమి చేత
సంద్రపు నీరు ఇంకిపోవును
అంతియె గాక నేల పగులును

గ్రక్కున రాముడు- చాపము విడచి
అక్కున జేర్చుకు పక్షిరాజును
''హా!'' యని గట్టిగ రోదించె నట
పుణ్యమూర్తిని ప్రేమగచూచి

ఎంత వెదకినను కానగరాడు
నన్ను బోలిన దౌర్భాగ్యుడిల
నాయనగారి సఖుడు జటాయువు
నా దురదృష్టము కొట్టగ-పడెను.''

''తమ్ముడ! చూడుము-నా నిర్భాగ్యము
రాజ్యము పోవుట-వనవాస మిట-
సీతాపహరణము- జటాయు వీవిధి
అగ్నిగ కాల్చెడి దుఃఖము లివ్వి!

పరమగుణాఢ్యుడు-పతిత పావనుడు
రెక్కలు తెగిన పక్షిరాజుకు
రక్తము తుడిచి-సేవ చేయుచు
సీత వివరము అడిగి-మూర్ఛిలె.

॥శ్రీ రఘురాముని॥

## 68 జటాయువు సీతాపహరణము చెప్పుట-జటాయు మోక్షము

రామచంద్రుడు తిరిగి తేరుకొని
తమ్మునితో నిటు పలికెను అపుడు :
''సోదర! ఇతడు-నాకై పోరెను
దుష్ట రక్కసుని వాతను బడెను.

అసురుడు హరింప- అబల పలుకులు
స్పష్టముగా నువు తెలుపుము రాజా!
అసురుడుండెడి పురము ఏది-మరి
ఎంతటి వీరుడు ఆ రాక్షసుడు?''

కొన ఊపిరితో నున్నాడయ్యా!
పక్షిరాజు మరి పలుకుట కష్టము''
అనుచు రాముడు అడిగెను మెల్లగ
''పలుక శక్తి నీకున్నచొ పలుకుము.

హీన స్వరముతో పలికె జటాయువు :
''రామా! అసురుడు-మాయలమారి
పెద్ద గాలిని-మబ్బుల సృజించి
మాయమయ్యెను సీతను హరించి

సీతాపహరణము వివరించు మయా!
నీవు నేలను బడిన విధమును
నాపై అసురుని కేల కోపము?
సీత వదన మెటులున్నది రాజా?

బలిమిని-సీతను హరించినాడు
అంబర వీథిని గొనిపోయెను విను
యుద్ధము నందు రెక్కలు త్రుంచి
దక్షిణ దిశగా సాగెను వాడు

రామా! కన్నులు తిరుగుచున్నవి
మనసు వశమును తప్పుచున్నది
ప్రాణవాయువులు లేచి నిలచినవి
బంగరు చెట్లవి కనబడుచున్నవి.

అసురుడు సీతను గొనిపోయిన- ఆ
ముహూర్తమ్మది-'విందు' యందురు
ఆ ముహూర్తమున-హరింపబడినవి
తిరిగి చేరును-తన యజమానిని

తొందరలో ఆ రక్కసుడది మరి
గమనించకనే పోయెను-పాపి
గాలము మ్రింగిన చేప తీరుగా
హరించుకొనునా? అసువులు బాయును

దుఃఖము నందకు ఓ దాశరథీ!
ఆలములో నువు అసురుని జంపి
అక్షయ కీర్తితొ-అమ్మతొ నీవు
అయోధ్య చేరుట సత్యము-సత్యము!''

అటుల పలికి ఆ పులుగు శ్రేష్టుడు
తిరిగి వివరము తెలుప బూనగా
నోటినుండి మరి నెత్తురు-మాంసము
వెడలెను-బాధను ఓర్చుకొనుచును

''విశ్రవసునికి తనయుడు వాడు
శంకరు సఖునకు తమ్ముడాతడు''
అనుచు తిరిగి మరి పలుక లేకను
కొన ఊపిరిని వదలెను-అనఘుడు.

''తండ్రీ! పలుకుము-పలుకుము తండ్రీ!''
అనుచు రాముడు కరములు ముడిచి
అడుగుచుండగా-రాముని గనుచు
పక్షిరాజు దివికేగెను అపుడు.

కన్నులు ఎఱ్ఱని రంగుకు మారగ
నోరును తెరచి-శిరసును వాల్చి
పదములు-దేహము-పొడుగున చాచి
మేను వణకగా - ఊపిరి విడచెను.

అసువులు వీడిన పుణ్యమూర్తిని
కీర్తించుచును-తమ్మునితో నవె
''రక్కసిమయమీ దండక వనిలో
పరాక్రమముతో బ్రతికెను ఈతడు.

వేలకొలదిగా సంవత్సరములు
వసించి- ఇచటే అసువులు వీడెను
విధిని దాటగా ఎవరికి శక్యము?
పరమ పూజ్యుడీ పులుగు శ్రేష్ఠుడు

దేవ విరోధిని ఎదిరి పోరెను
పక్షి రాజ్యము- ఆయుర్దాయము
నాకై- ఈతడు విడచెను తమ్ముడ!
చూతుమ ఇంతటి పుణ్యమూర్తిని!

పరోపకారులు-ధర్మవర్తనులు
సాధు మార్గమున చరించువారు
సకల ప్రాణులలొ గలరని తెలియును
భూమి నెల్లను గలరు సోదరా!

తండ్రి యంతటి పూజ్యుడు మనకు
సత్కీర్తి నిలయము- గౌరవ- యోగ్యుడు
ఈతని సేవకు కరగి పోతిని
సతి అపహరణ-మరచిపోతిని.

నాకొరకై తన అసువులు బాసెను
పక్షిరాజుకు- శాస్త్ర ప్రకారము
అంతిమ క్రియలను చేయగ-సోదర
చితి పేర్చుమయా!'' అని పలుకుచును

యజ్ఞశీలురకు ఏ గతి కలుగునొ
ఆహితాజ్ఞులకు ఏ గతి కలుగునొ
భూదాతలకు ఏ గతి కలుగునొ
తాపసులకు మరి ఏ గతి కలుగునొ

సోదర! అట్టి ఉత్తమగతియే
కలుగును-నాదగు ఆనతిచేతను''
అనుచు రాముడు పక్షిరాజుకు
అగ్ని సంస్కారము పూర్తి చేసెను.

బంధువు మాదిరి పక్షి రాజుకు
దహన కార్యమును రాముడు చేసెను
జింక మాంసముతొ పిండము లుంచి
తర్పణ క్రియను చేసెను రాముడు.

పైతృక మంత్రములప్పుడు రాముడు
పఠించి-చేసెను క్రియ నంతయును
పావన గౌతమి తోయమ్ములతో
జలతర్పణములు ఇచ్చిరి వారు.

పావనమూర్తి సీతాపతిచే
దహన సంస్కారమును పొంది- జటాయువు
మహఋషి అంతటి యశమును పొంది
పుణ్యలోకమున అడుగుబెట్టెను

పక్షిరాజుకు విధులను తీర్చి
మనసులొ ఆతని పలుకులు నిలపి
సీతను వెదుకగ ముందుకు సాగిరి
విష్ణు-వాసవుల- తీరుగ నడచిరి.

॥శ్రీ రఘురాముని॥

## 69 కబంధుడు రామలక్ష్మణులను పట్టుకొనుట

రామలక్ష్మణులు నైఋతి దిశలో
సాగుచుపోయి మూడు క్రోసులు-
క్రౌంచారణ్యము చేరిరి వారు
మృగములు-పక్షులు-సర్పములున్న

క్రౌంచారణ్యము నందు వెదకుచు-
అలసట తీర్చుకు తిరిగి వెదకుచు
వనమును- దాటి- తూర్పుగ నడచి
మతంగ వనమున మూడు క్రోసులలొ

పాతాళమువలె భీకరమైన
శాశ్వతమైన-చీకటి నిండిన
కోనను-వారు సమీపించగ
భయము గొలుపు నొక రాక్షసి నిలచెను.

వాడి కోరలు-వికృత రూపము
విరియ బోసిన కేశము లుండి
మృగముల తినుచు- బాన కడుపుతో
సోదర లిరువుర ముందర నిలచెను.

ముందుగ నడచు లక్ష్మణు గాంచెను
గట్టిగ నాతని పట్టుకు పలికెను
''నాథా! నీవు అందగాడవు
మనసు తీర్చుము-వనముల పోదము''

అంతట శూరుడు ఆగ్రహమంది
కత్తితో ముక్కు-చెవులను కోసెను
మొర్రోయనుచు- ఆ - 'అయోముఖి'
పారిపోయినది అడవి లోనికి

అంతట-వారు అడవిలో సాగగ
లక్ష్మణుడనెను రామచంద్రునితో
''అన్నా! అశుభము తోచుచున్నది
ఎడమ భుజమది అదరుచున్నది

గుండియ అదిరెను అన్నా! వినుము
ఆపద ఏదో రానున్నదయా!
యుద్ధము చేయగ సిద్ధము నుండుము
శుభ సూచన ఈ పక్షి కూయుట''

తమ్ముని మాటల జాగరూకులై
అడవిలో వెదకుచు నడచు చుండగా
పెనుగాలి యది వీచెను అపుడు
అడవి అదరునటు ధ్వని వినవచ్చెను.

సోదరు లిరువురు ఆశ్చర్యముతో
జాగరూకులై వెదకుచుండగా
చూచిరి-వారొక పర్వత కాయుని
పెద్ద బొమ్మది కలిగిన వానిని

మెడయు-తలయు లేదా ప్రాణికి
బిరుసు వెంట్రుకలు-కారుమేఘమన
ఉరుము వంటిదగు కంఠము గలిగి
బొమ్మున పెద్ద కన్నును గలిగి-

పెద్ద కోరలు భీతి గొలపగా
యోజన పొడవు-చేతులు గలిగి
జింకల-కరుల-క్రూర జంతువుల
పట్టుచు-విడుచుచు ఆటగ నాడెడి

తెరచిన నోటితొ త్రోవకడ్డముగ
కబంధునట ఆ ఇద్దరు గాంచిరి
అంతట వాడు తన భుజ బలముతొ
రామలక్ష్మణుల- ఒడుపుగ పట్టెను.

సూర్యతేజులు విండ్లు-కత్తులు
కలిగిన సోదరులిద్దరు అపుడు
శత్రువు చేతికి చిక్కిపోయిరి
ఆపదలో మరి జారిరి వారు.

శూరుడు-ధీరుడు-రాముడు కావున
ధైర్యము చెదరక నిలచెను అపుడు-
చిన్నవాడగు లక్ష్మణమూర్తి
ధైర్యము చెదరి అన్నతొ పలికెను :

''అన్నా! నీవు పరుగిడిపొమ్ము
నన్ను-అసురునికి ఎరగానిమ్ము
అమ్మ సీతను కలుసుకొందువు
సుఖముల - నన్ను తలుచు కోవయా!''

అంతట రాముడు ధైర్యము గొలిపెను
తమ్ముని ఎంతో ఊరడించెను
అపుడు రాక్షసుడు పలికె బిగ్గరగ :
''ఎవ్వరు మీరు ఇటుల వచ్చితిరి?

ధనుసులు - ఖడ్గములున్న మీరిటు
వనమున స్వేచ్ఛగ ఏల తిరుగుట?
నా నోటిలొబడ వచ్చితిరేల?
ఆయుర్దాయము తీరెను మీకు.''

గర్వము నిండిన అసురుని పలుకుల
రాముడు-తత్తర పడి పలికెనట :
''సోదర! మనకు కష్టములన్నీ
ఒక్కుమ్మడిగా వచ్చుచున్నవి.

కాలమెంతటి శక్తిగలదొ మరి
నిన్నూ-నన్నూ ఇడుమల త్రోసెను
పుడమిని పుట్టిన ప్రాణులన్నిటిని
వశమున నుంచును కాల మెప్పుడూ-

ధైర్యవంతులు-సత్య విక్రములు
లక్ష్యసిద్ధి గలవారైనా మరి
రిపుల గెలిచెడి ధీరులయి నను
కాలమ్మునకు లొంగక తప్పదు

ఇసుకతొ కట్టిన ఆనకట్టతో
కాలప్రవాహము ఆపగలేము
దైవము-చంపగ నెంచినచో యిక
బ్రతుకరు-విధికి అసాధ్యమేది?''

||శ్రీ రఘురాముని||

## 70 కబంధుని కరములు నరకుట

తమ్ముని మనసుకు ధైర్యము గొలుపు
రాముని చూచి-పలికె నసురుడు
''భయపడి ఫలితము ఏమియు లేదు
విధి నాకొసగెను ఆహారమును.''

దనుజుడు-అటుల పలుకుచుండగా
అనుజుడు పలికెను : ''అన్నా! వీడు
మనలను మ్రింగుట తథ్యము కావున
వీని బాహువులు నరకెదమయ్యా!

స్వకీయరక్షణ జీవుల ధర్మము
కావున-కరములు త్రుంచెదమిపుడే''
అనుచు తమ్ముడు పలుకుచుండగా
అసురుడు వారిని మ్రింగ నెంచగా

దేశకాలములు-సమయము నెరిగిన
సోదరులిరువురు వాని బాహువులు
నిశిత ఖడ్గముల నరికి వేసిరి
దనుజుడు అరచుచు నేలను బడెను.

కరములు తెగిన అసురుడు అడిగెను
''ఎవ్వరు మీరు? ఏల వచ్చి''రని
అంతట తమ్ముడు పలికెను అపుడు
''ఇక్ష్వాకు వంశమున పుట్టిన వారము

ఈ మహనీయుని రాముడందురు
నాకు సోదరుడు-పరమపూజ్యుడు
నన్ను లక్ష్మణుడు అందురు వినుము
సుర సమానుడగు ఈ పుణ్యాత్ముడు

సతితో వనమున వసించియుండగ
దండక వనిలో- అసురుడు-మాయతొ
రామపత్నిని అపహరించెను-
ఆమెను వెదకుచు వచ్చితి మిచటకు

ఎవ్వడ వీవు? తల- లేదేమి?
మొండెముతో మరి ఏలనుంటివి?''
అనగా నతడు ఇంద్రుని తలచుకు
శాపావసానము వచ్చె ననుకొని

సంతోషముతో దనుజుడు పలికెను :
సోదరులారా! వందనమయ్యా!
నా భాగ్యముచే గంటిని నేడు
కరములు పోవుట-నాకగు కలిమి

శ్రీరామా! నే- గర్వము నిండి
వినయము తప్పిన కారణమ్మున
ఇట్టి వికార రూపము నందితి
వివరించెద విను సర్వము నీకు.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 71 కబంధుడు శాప వృత్తాంతమును తెలుపుట

''రామా! నేను-పూర్వ కాలమున
సూర్య-చంద్ర-దేవేంద్రుల బోలు
సుందరమూర్తిని- గర్వమునిండి
వికృత రక్కసి రూపము దాల్చి

మునులను-పూజ్యుల హింసించగను
స్థూలశిరుడను-ముని కోపించి
నీచుడ-నీవీ రూపముతోను
నను బెదరించితివందుకు ఫలము

శాశ్వతముగ- నువు ఈ రూపముతో
బ్రతుకుచుందు వని శపించినాడు-
అంతట మహఋషి పదముల వ్రాలితి
శాపాంతమును కోరితి రామా!

శ్రీరఘురాముడు కరుణాధాముడు
వనమున- కరములు నరకును నీకు
అంతట - శాపము తీరిపోవును
సుందర రూపము నందెద వనెను.

మరి ఈ వికృత రూపమ్మునకు
సుర నాయకుడు కారణమయ్యా!
ఘోర తపస్సును చేసితి నేను
బ్రహ్మ వరమున దీర్ఘాయువునై

గర్వమునిండి అవివేకముతో
ఇంద్రుని-పోరుకు రమ్మని పిలువగ
కోపము నంది సుర నాయకుడు
వజ్రాయుధమున నన్ను మోదగా

తలయు-తొడలు- ఒమ్మున దిగబడి
వికృత రూపుడ నైతిని రామా!
అంతట వేడితి-సురనాయకుని
చంపుము-నాకీ బ్రతుకు వ్యర్థమని

వానవుడనెను- బ్రహ్మవరమది
ఆయువు గలదు-చచ్చుట ఎట్లు?
అంతట అడిగితి ఈ రూపముతో
బ్రతుకుట ఎట్లు? తినుటది ఎట్లు?

దయగొని- ఇంద్రుడుఆమడపొడవగు
కరములనిచ్చి మొండెమునందే
నోరును ఇచ్చి- కోరల నుంచెను
కావున తిందును గజ, సింగములను.

లక్ష్మణమూర్తితొ రామచంద్రుడు
అడవికి వచ్చి-నీ కరములను
నరకిన యంతట నాక లోకమును
తిరిగి చేరెదవు - అనెను వాసవుడు.

ఆ శాపముతో దుఃఖము నిండి
ప్రతి జీవిని మరి పట్టుకొనుచును
రాముని కొరకై నిరీక్షించుచు
తినుచుందును మరిఅసువులునిలుపగ

దేవా! నన్ను పోరున గెలువగ
సాధ్యముగాదు ఎవ్వరికైనను
ముని చెప్పిన ఆ రాముడ వీవు
నామది నిలచిన శ్రీరాముడవే.

రామా! నన్ను దహించుడయ్యా!
మదికి తెలిసిన యోచన నుడివెద.''
అంతట రాముడు పలికెను అపుడు
''జనస్థానమున సుఖముగ నుండగ

నా యిల్లాలిని రావణాసురుడు
దుర్మతి-వనమున అపహరించెను
వాని పేరు మరి తెలియును అంతే-
రూపము -శౌర్యము తెలియదు మాకు

వాని నిలయము తెలిసిన చెప్పుము
మతిచెడి-వనమున తిరుగుచుంటిమి
వీరుడ! వీవు దయగొని మాపై
వివరము చెప్పి సాయము చేయుము.

నీవు కోరినటు నిను దహింతుము
జానకి జాడ తెలియబరచుము
ఎక్కడ దాచెనొ-హర్త ఎవ్వడో
తెలియబరచుము దయగొని నీవు.''

''పాపకార్యములు చేయుట చేతను
జ్ఞాపక శక్తిని కోల్పోయితిని
తనువు కాల్చుడు సంధ్యలోపలే-
నాకు తెలిసినది తెలియబరతును.

సర్వము తెలిసిన వాడొక డుండెను
భూమి అంతయు తెలియును వానికి
వానితొ-నెయ్యము మీరు చేసిన
మీ కార్యమది నెరవేరునయా!''

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 7 2 సుగ్రీవునితో స్నేహము చేయమని కబంధుడు చెప్పుట

పల్లములోనికి దనుజుని త్రోసి
ఎండు కట్టెలు దండిగ వేసి
అగ్ని హోత్రమును ముట్టించగను
కాయము మెల్లగ కాలజొచ్చెను.

రామలక్ష్మణులు చూచుచుండగా
అగ్ని నుండి ఒక తేజోవంతుడు
హంసలు కట్టిన దివ్య విమానము
అధిరోహించి - పలికెను అపుడు

''రామా! వినుము-లోకమునందు
ఆరు ఉపాయములున్నవి-వాటితో
రాజులు-కార్యము చక్కబరతురు
అందులో ఒకటి మిత్రత్వమయా!

రామా! నీవు దుఃఖము నందకు
విధిని దాటగా వశముకాదు కద
నిర్మల హృదయా-శీఘ్రమె బొమ్ము
సుగ్రీవునితో నెయ్యము చేయుము.

ఆలి అపహరణతో కష్టము కలిగెను-
నిన్ను బట్టి-నీ సోదరు కష్టము
నీ దుఃఖముతో పోలు దుఃఖము
కలిగిన వానితో-స్నేహముచేయుము

వంచనలేక-చులకన చేయక
వీడొక కోతి-అని నువు తలచక
అగ్ని సాక్షిగా నెయ్యము చేయుము
కామరూపుడు అతి బలవంతుడు.

రామా! వినుము అట్టి మిత్రుడు
సూర్యతనూజుడు-కపి పుంగవుడు
సుగ్రీవుడను నామధేయుడు
అతనితో నెయ్యము నీకగు శుభము.

వానర ప్రభువు-సూర్యతనూజుడు
సాయముకొరకై వెదకుచుండెను
అతని కోరిక తీర్చుడు మీరు-
లేకున్నా మరి సాయము చేయును.

అటుల కాదని నీవు అనినచో
మరియొక యోచన తోచదు వినుము
వాలి-అతనిని తరిమి వేయగా
నలుగురు వీరులతో నట ఉండెను.

ఋక్షరజునికి జన్మించెను విను
లోకసాక్షికి తనయు డాతడు
పంపా సరస్సు-తావులయందు
అన్నకు భయపడి-తిరుగుచుండును.

పవిత్రమైన ఋష్యమూకగిరి
పంప ఒడ్డున వెలసియున్నది
అతడు- అచ్చట తిరుగుచుండును
ఋజువర్తనుడు-సత్యవర్తియు

ఆయుధములపై ప్రమాణముంచి
స్నేహము చేయుము ఆ వానరునితో
అతనికి-అవనిలో తెలియని యట్టి
ప్రదేశ మసలే లేదు రాఘవా!

ధైర్య వంతుడు - శౌర్య వంతుడు
నీవు అతనితో నెయ్యము చేసిన
సీత జాడగని తెలుపును నీకు
నీకు సాయము చేయగ చాలును.

సూర్య కిరణములు సాగునంతట
నదీ-నదములు-గిరులు-వనములు
నీ సతికొరకై అన్వేషించి
జాడ తెలుపును-నమ్ముము రామా!

రావణు గృహమున శోదనచేసి
పాతాళములో దాచినగాని
మేరువు కొసలో నుంచినగాని
దనుజుల జంపి సీతను తెచ్చును.''

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 73 శబరికి దర్శన మిడుమని–కబంధుడు శ్రీరాముని కోరుట

సీత లభించు వివరము తెలిపి
తిరిగి పలికెను కబంధుడంతట
''రామా! మీకు–పడమటి దిక్కున
ఫల–సుమ భరితపు వనములు కననగు.

మారేడు–నేరేడు–గన్నేరు–గోగులు
పనసలు–రేగులు–మామిడి తరువుల
నిండిన–పండిన ఫలములు గలవు
ముదముగ తినుచు ముందుకు సాగిన

ఆవల–పూవులు నిండిన వనము
నందనవనమై–తియ్యని రసముల
అన్ని ఋతువుల ఫల–సుమములతో
ఉత్తర కురు భూములతో సమమగు

మేఘమ్ములతో పర్వతాలతో
పండ్ల బరువుతో వంగిన తరువుల
వృక్ష సంపద శోభ లీనును–
దానిని దాటి ముందుకు సాగిన

రాజ హంసలు–చక్ర వాకములు
బెగ్గరు లుండిన నిర్మల జలములు
కలువలు–కమలములున్న తోయములు
మనసు హాయినిడు సుందరరామా!

సరస్సునందు గండు చేపలు
రొయ్యలు–కొఱ్ఱులు–బొమ్మిడాయిలు
ముండ్లు లేనివగు మీనములున్నవి
జలపక్షులట సొగసుగ నుండును.

కడుపు నిండుగా ఆహారము తిని
స్పటికముపోలు జలములు–తమ్ముడు
క్రొత్త తామర దొప్పలో తేగా
తృప్తిగ గ్రోలి – ముందుకు సాగుడు.

సాయం సమయము సుమ సౌరభము
నిండిన–చల్లని గాలులు–మనసుకు
హాయినిచ్చును – ఓ రఘురామా!
చల్లని జలములు సుఖము నిచ్చును.

దివ్య సుమములవి–మనుజులు దాల్చరు
తొడిమలూడవు– వాడిపోవవి
మహిమాన్వితుడగు మతంగమహర్షి
శిష్యగణమట ఫలములుతేగా

దేహమునుండి చెమటలు కారెను
ధరణిని బడిన–చెమట నుండి–అవి
ఉద్భవించిన మహిమాన్వితములు
మంగళకరములు – మౌని సేవలవి.

మతంగ మహాఋషి శిష్యులు వెడలిరి
కానీ రామా! ఒక స్త్రీ మూర్తి
గురు శుశ్రూషల పరమ ధర్మము
అనుష్టించిన పూజ్యురాలగు-

బోయవనిత- ఓ భగవత్సముడా!
నిన్నుగాంచగ వేచి యున్నది
సర్వభూతముల నమస్సులందే
నిన్నుగాంచి-తను దివి కేగునయా!

ఏనుగు గుంపులు వనమున చొరవు
పంప సరస్సుకు పడమటి దిక్కులొ
పవిత్రమైన ఆశ్రమమందు
దివ్యమూర్తి-తా తపమును నుండును.

రామా! ఆమెకు దర్వనమిచ్చి
పంపానదికి చేరుము స్వామీ!
మనోహరమగు ఋష్యమూకగిరి
ఎక్కుట కొంత కష్టము స్వామీ!

గజముల-యొరిపిడి చేతను-ఆ గిరి
నునుపుగ నుండును-ఎక్కుట కష్టము
గిరిపై - నిద్రలొ గాంచిన సొమ్ము
మేలుకొనగనే లభించ గలదు.

పాపాత్ములు అట నిద్రించినచో
అసురులు వారిని బాధించెదరు
ఆ విధముగను విధాత చేసెను
ఆ గిరి రమ్యము-మహిమాన్వితము.

అందలి కరులను-పులులు-ఎలుగులను
అందము లొలికే జింకల గాంచిన
తొలగును నీకు -శోకము - రామా!
అందొక గుహలో రవిసుతు గాంచుము.

గుహను చొరగను శక్యముగాదు
ఆ గుహ వాసము సూర్యసుతునకు
అతనితొ నున్న నలుగురు వీరులు
అనిశము అతని కొలుచుచుందురు.

అతడా గిరిపై నిలుచుట గాంచి
నెయ్యము చేయుము సుగ్రీవునితో.''
అనుచు పలికి- ఆ కబంధు డంతట
ఆనతి కొరకై నిలచియుండగా

రామచంద్రుడు ఆనతినిచ్చి
అనుజుడు-అడుగుల నడచుచుండగా
అందమైన ఆ వనము నందున
ముందుకు సాగెను భక్తురాలికై.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 74 శబరికి శ్రీరామ దర్శనము

శోభిలు తరువుల గాంచుచు నడచి
సోదరులిరువురు రాత్రి యందు నొక
గిరి చెంతను విశ్రాంతి తీసుకొని
సూర్యోదయమున సుఖముగ నడచి

పంపానదికి చేరుకు-అచట
పడమటి దిక్కున పవిత్రమైన
శబరి ఆశ్రమము గాంచిరి వారు
భక్తితొ శబరి నమస్కరించెను.

పాదములంటెను పావనమూర్తికి
పరుగిడి వచ్చెను వృద్ధ తపస్వి
పరమగుణాఢ్యుని రామదేవుని
పాదమంజరుల నమస్సులుంచెను.

నరుడై వచ్చిన నారాయణుడు
తనకై వచ్చిన సీతాపతికి
తమ్మునితో తన ఆశ్రమ మందు
అర్ఘ్య-పాద్యములు-ఫలముల నొసగెను.

రాముడు అడిగెను ''శబరీ! నీవు
తపోనిష్ఠలో బ్రతుకుచుంటివి
ధన్యురాలవు- ఆనందమగు
తపసు చక్కగా సాగుచున్నదా?

నీ గురుసేవలు సఫలమైనవా
వ్రతము లన్నిటిని ఆచరించితివ?
చెప్పుము శబరీ- దివ్యవాక్కుల''
అనగా శబరి పలికె భక్తితో

''గురు శుశ్రూషలు ఫలితమ్మును-నే
నీ దర్శనమున పొందితి రామా!
పూజల ఫలము-తపస్సు ఫలము
పురాణ పురుషా! నీ దర్శనమే.

కన్నులార నిను గాంచితి రామా
కరముల చరణము లంటితి రామా-
కారుణ్యానిధి-కారడవిని-నువు
నాకై వచ్చిన నాకము-రామా!

చిత్రకూట గిరి చేరినారని
దర్శన మివ్వగ వత్తురనియును
నా గురుదేవులు చెప్పిరి రామా!
నీ దర్శనము ఉత్తమ గతియని

పునర్జన్మ మరి లేదని చెప్పిరి
పుణ్యమూర్తి-నీ రాక కోసమై
పుడమిని-తనువు నిలిపి నిలచితి
ఫలములు-సుమము ఏరి తెచ్చితి.''

రామచంద్రుడు అడిగెను శబరిని
''అమ్మా! నీదగు గురువుల మహిమ
'దనువు' చెప్పగా వింటిమి తల్లీ
నీవు చూపగా చూతుము శబరీ!

''పురుషోత్తమ! ఇది మతంగ వనము
వర్షిత మేఘములుండెడి వనము
పులుగులు శోభగ తిరిగెడి వనము
మా గురుదేవుల తపస్సు ఫలము.

తపో బలముచే మా గురుదేవులు
పుణ్య తీర్థముల తీర్చిరి ఇచ్చట
పడమట వేదిని- మా గురు దేవులు
ముదుసలి - వణకుచు పూజలు చేసిరి

తపోఫలముచే-పవిత్ర వేదులు
గురువులు-నాకము చేరి యున్నను
దిక్కు లన్నిటిని ప్రకాశవంతము
చేయుచున్నవి దివ్య మహిమచే.

మా గురుదేవులు స్నానము చేసి
ఆరవేసిన - నార బట్టలవి
నేటికి కూడా - తడిగా నున్నవి-
పూజాసుమములు వాడక యున్నవి.

రామచంద్ర! నువు-వింటివిమహిమలు
గంటివి - దివ్య స్థలములు ఇచట
గురువుల సన్నిధి కేగెద రామా!
ఆనతి నిడుము ఆశ్రిత వత్సల.''

పుణ్య చరితయగు శబరి మాటలకు
పలికెను తిరిగి రామచంద్రుడు
''సాధు చరిత నీ సత్కారములు
గ్రహించినాను- సాగుము నీవు.''

అంతట శబరి యోగ శక్తిచే
అగ్ని రగిల్చి-దేహము చేర్చెను
అపుడొక దివ్యతేజము అగ్నిని
ఉద్భవించినది - మునికడ కేగెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 75 రామలక్ష్మణులు సుగ్రీవునికై బయలుదేరుట

పరమ పదమును శబరి చేరగా
పరమ గుణాఢ్యుడు రామచంద్రుడు
హితము గోరు తన తమ్ముని జూచి
మతంగ మునిని గూర్చి పలికెను

''ఆహా! సోదర - దివ్యమహిమగను
ముని లేకున్నను తేజము గనుము
హింస యనునది కనరాదిచట
స్నేహముతో యిట ప్రాణులు మెలగును.

ముని తన మహిమచె సృజించినట్టి
సంద్రపు జలముతో-పితృ తర్పణము
తృప్తినిండగా చేసితిమయ్యా!
మనకిక మేలు జరుగును సోదర!

లక్ష్మణమూర్తీ! మన కష్టము లిక
తొలగిపోయినవి-శాంతి లభించును
సూర్యతనూజుడు ఉండును ఇచటే
అనుచరులతొ ఇట గిరిపై నుండును.

సుగ్రీవుని గన పోదము రమ్మ
కాగల కార్యము చేయు నాతడు''
అనగా తమ్ముడు అడుగుల నడువగ
సోదరులిరువురు సాగిరి ముందుకు-

పంపా తీరము చేరిరి వారు
లతలతొ శోభిలు పంపా తటము
ఎఱ్ఱకలువలు-కమలములుండి
స్వచ్ఛమైన తోయమ్ములు నిండి

తెల్ల తామరలు-తెల్ల కలువలు
లెక్కకు మిక్కిలి నల్ల కలువలతొ
వివిధ వన్నెలతొ వెలయు తివాసిగ
నేత్ర పర్వము చేసెను ఆ నది.

పంపానదికి కొంత దవ్వులో
మతంగ కొలనులొ స్నానముచేసి
ఆనందముగా ఆ సోదరులు
వనసౌభాగ్యము చూచుచు నడచిరి.

బొట్టుగు చెట్లు-మాదీఫలములు
మొగలితోపులు-మొల్ల తీగలు
మామిడి తోపులు- గన్నేరులతో
ఏడాకులు గల అరటి చెట్లతో

అలంకారముల- అంగన అన్నటు
అందము లొలికెడి వనము నందున
చిలుకలు-హంసల కలకల రవములు
సీతనేత -తా ముదముగ వినుచు

తమ్మునితో నసె ''లక్ష్మణమూర్తీ!
దీనుడనైతిని రాజ్య హీనుడను
సీతలేక-నే బ్రతుకుట ఎట్లు!
సుగ్రీవుని గన సాగుము నీవు''

అనుచు పలుకుచు రామచంద్రుడు
అధిక దుఃఖమున తపించిపోయి
పంపానదికి ఒడ్డున వున్న
ఇంపగుస్థలము చూడగ సాగెను.

దుఃఖములన్న- అడవులు దాటి-
విఘ్నములన్నీ దాటుకొనుచును-
దూరము నడచి- ఆ రణధీరులు-
ఇంపగు పంపా తీరము చేరిరి.

కమలములున్న జలములు చూచి-
కమల బాంధవుని తనయుని జూడగ
కమల నేత్రులు రామలక్ష్మణులు
కలయ జూచుచు ముదముగ సాగిరి.

శ్రీ రఘురాముని రమ్యచరితము
మునిజనములకు అభయ ప్రదానము
సీతాపహరణము రాముని వేదన
జటాయు మోక్షము అరణ్యకాండము.

## సమాప్తం

శుభమస్తు

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు - సర్వేజనా సుఖినోభవన్తు

★ శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు!

శ్రీ మ ద్రా మా య ణ ము

# కిష్కింధా కాండము

(గేయ కవిత)

శ్రీరఘు రాముని రమ్యచరితము
మారుతి రాముని సందర్శనము
సీతాసతికై అన్వేషణము
కపుల సేవ కిష్కింధా కాండము.

శ్రీరామ

# శ్రీమద్రామాయణ కిష్కింధా కాండము

## (విషయ సూచిక)

❋❋❋

శ్రీ మ ద్రా మా య ణ ము

# కిష్కింధా కాండము

(గేయ కవిత)

శ్రీరఘు రాముని రమ్యచరితము
మారుతి రాముని సందర్శనము
సీతాసతికై అన్వేషణము
కపుల సేవ కిష్కింధా కాండము.

శ్రీరామ జయరామ – జయ జయ రామ

✲✲✲

శ్లో.. కూజంతం రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరుహ్యా కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్.

✲✲✲

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందర కర్తకు వందనముంచి
రామ భక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన జేసెద.

✲✲✲

ఏక దంతము శూర్ప కర్ణము
చలువ చూపుల చిన్నవాడా –
పార్వతమ్మకు ముద్దు కొమరుడ
విఘ్నరాజా – వందనమ్ము

✲✲✲

శ్రీరామచంద్రాయనమః

శ్రీమద్రామాయణము

# కిష్కింధా కాండము

## 1 వ సర్గము పంపసోయగము - సీతాదేవికై శ్రీరాముని ఆవేదన

శ్రీ రఘురాముని రమ్య చరితము
మారుతి రాముని సందర్శనము
సీతాసతికై అన్వేషణము
కపుల సేవ కిష్కింధా కాండము

సతితో-వనమున సాగెను రాముడు
పితృవాక్య పరిపాలన ధీరుడు
శీల సంపద కలిగిన జానకి
అపహరింపబడె ఆ వనమందు.

అన్వేషించుచు ఎంతో కుములుచు
ఆ వన సీమను రామచంద్రుడు
శాపము తీరిన కబంధు పలుకున
ఋష్య మూకము చేర వచ్చెను.

ఋష్య మూకమున సుగ్రీవునితో
మైత్రి చేసుకొనిఅతని సాయమున
సీతాన్వేషణ జరుపుటసరియని
చేరెను దశరథరాముడు అచటికి.

అడుగు జాడలో తమ్ముడు నడువగ
అడుగిడెపంపా తీరముచెంత
కమలము, కలువలు మీనములుండి
శోభించనవా పంప జలములు

మనోహరమ్మగు నదీ జలములు
మనసు హాయినిడు సుందర వనము
మరిమరి గాంచిన రామచంద్రుని
మనసున నిండెను సీత తలంపులు.

ప్రకృతి అంతా శోభామయమై
కలవర పరచగ దుఃఖతప్తుడై
ధరణీనందిని తలపుల నిండగ
తమ్మునితో దాశరథి పలికె నిటు :

''వికసిత కమలములవి గను లక్ష్మణ!
ఎర్రని కలువలు గనుము సరస్సున
వైడూర్యమ్ముల కాంతితొ జలము
ఒడ్డున నిలచెను పలు వృక్షమ్ములు.

శిఖరమ్ములతో శోభిలు గిరివలె
సరసు శోభిలె తరుసంపదతో
భరతుని భక్తి-సతి అపహరణ
తలచి తలచి నే కుములుచుంటిని.

తాప హరమ్ములు శీత జలమ్ములు
వేసట నణచెడి కాసారమ్మిది
అయినా కానీ వసంతశోభ
మనసు కలంచెడు మధన పెంచెడు.

చిక్కగ పరచిన పచ్చిక నేలను
చక్కని వన్నెల పూలు రాలగా
రత్న కంబళులు రచించినట్టుగ
శోభిలుచున్నది నేల యంతయు.

నిండుగ విరిసిన తరువులన్నిటిని
దండిగ పూసిన పూలత లెంతో
మురిసి పోవుచు కౌగలించినటు
పెనవేసినవి చూడుము సోదర!

సుమగంధముతో వీచెడి గాలుల
ఫల పుష్పముల శోభలు కలిగిన
మన్మథు సాయము పొందిన వాడగు
వసంతు డెంతో ప్రకాశించెను

మేఘము జలములు కురియునట్టుగా
తరువులు కురిసెను పూలవృష్టిని
పూచిన శాఖల నూపుచు పవనుడు
తుమ్మెదలోయన రాగము తీసెను.

నిండిన పూల శాఖలు కదలగ
పంచమ స్వరముల-కోయిల లన్నటు
పాడుచు - గుహలను వదిలినట్టుగా
తోచెను పవనుడు రమ్యముగాను.

శ్రీ గంధమువలె చల్లనివాడు
మందానిలుడు - సుమగంధముతో
సుఖమగు స్పర్శను కలుగజేయుచు
తిరుగుచుండెను సోయగమెగసెను

కొండ చరులలో పుట్టిన తరువులు
విరగబూసి- అవి కలసి పోవగా
పూలరాశి వలె గిరులన్నియును
తోచెను- కనులకు పండుగ చేసెను.

విరసిన పూల తరువులపైన
నిలచిన తుమ్మెదలన్నియు- గాలికి
పైకి లేచి-మరి ఎగురుచుండగా
నల్లనిముసుగై తోచెతరువులకు.

నిలువుగ పూచిన గోగులు- పూలతో
బంగరు, వెండి వల్లె వాటులు
ధరించి నిలిచిన తరుణీమణులన
శోభిల్లినవి ఈ వనసీమలో

ఈ వసంతపు శోభలన్నియు
క్రొత్త పులుగుల, రవములు నిండి
సతికి దూరమైనిలచిన నాకు
తీరని వేదన పెంచుచున్నవి.

భార్యకు దూరము నున్న బాధను
సుమశరుడెంతో పెంచుచుండెను
కోయిలలున్ను- నీటికోళ్ళును
మధుర స్వనములతో పెంచెను వేదన

పంచవటినిగల ఆశ్రమ మందు
మనోహరమ్మగు పక్షుల కిలకిల
వినుమని చెప్పుచు మురిసిపోయెడిది
జానకిప్రియముగ ఆలకించెడిది.

మక్కువనిండి మనసు పెంచుకొని
మన్మథువశమున చిక్కిన పులుగులు
జంటనుజేరి- తుమ్మెదగానము
వినుచు- ముదముతో కనబడుచున్నవి.

ఈ మగ నెమలి ప్రియతమ సతిని
ఏ రక్కసుడు- కానన మందు
అపహరించి, మరి దాచలేదు, అని
ఆనందముతో, ఆటల తేలెను.

అశోక తరువుల పూలు నిప్పులై
తుమ్మెద రవము చిటపట ధ్వనిగా
ఎఱ్ఱ చిగురులు జ్వాలల పోలి
వసంతాగ్నినను దహించుచున్నది.

వసంత శోభల ప్రభావమిది కద
పులుగులు జంటను చేరుచున్నవి
రావణాసురుడు అపహరించనిచొ
మైథిలి- నా జత బాయకుండెడిది.

మనోహరమ్మగు కోకిల స్వనములు
చక్కగ పూసిన వసంత శోభలు
జానకికెంతో సంతోషమునిడు
జానకిలేక నేమనదగునా.

విరసిన పూవులు- ఎగసిన తేనెలు
పులుగుల మనసగు- పిలుపులన్నియు
సుమశరు తీవ్రత పెంచుచున్నవి
దాటుట నేనెటు ఈ వసంతము?

విరివిగ పూసిన పూపొదలన్నీ
కనవచ్చినవి నే నెటు చూచిన
కానీ, జానకి- చకోర లోచన
కనరాకున్నది- మరునికి చిక్కితి

సీత కూడఈ వసంతశోభల
వికారమ్మును అనుభవించును
కానీ- అసురుల చేతికి చిక్కిన
కోమలి మనసున శాంతి నిలచునా?

రెపరెప లాడుచు గాలులు వీచెను
స్పటిక ద్వారములు తెరచిన యట్టుల
పురులు విప్పినవి నెమళ్ళు ముదముగ
పరవశించినదిప్రకృతి యంతయు.

అప్పటి రాముడ నేనే అయినా
ఆ మారుతమే నేడు వీచునది
అయినా, అప్పుడు చల్లని హాయి
జానకి లేక అదియే జ్వాల!

కోరిక పెరిగి మన్మథువశమై
ఆడు నెమలి తన భర్తను చేరి
నిండు మనసుతోమగని చూచుచు
పరిహసించునటు చూచెను నన్ను.

పంచవటిని మా కశుభసూచనగ
ఆకాశములో కాకి కూసెను
ఇప్పుడు శుభముతోచునట్టుగా
చెట్టుకొమ్మపై కూయుచున్నది.

మనసు నిండిన ప్రియురాలితో-తన
మగడు వెనుకబడి పోవునట్టుగ
గాలికి కదలెడు పూలగుత్తిని
చేరగ-తుమ్మెద సాగుచున్నది.

మన్మథు బాణము అశోక గుచ్ఛము
గాలికి కదలి మీదకు ఒరిగి
కొట్టునో ఏమోఅన్నటు తోచెను
కోమలి లేక సుఖమది లేదు.

కాంతులు నిండి ప్రకాశించెడు
నిండుగ పూసిన మామిడి చెట్లు
చందనాదులు చక్కగ నలదుకు
మనిషిగ తోచెను ముదము గొలిపెను.

చక్రవాకములు హంస బెగ్గురులు
లేత సూర్యుని కిరణములన్నటు
తుమ్మెదలెన్నో కమలమ్ములపై
ఱెక్కలతో ఈ నీటిని కదపగ.

మనోహరమ్మగు-వనమను వస్త్రము
కప్పుకున్నటు తోచుచుపంప-
లేళ్లగుంపులు దంతి గుంపులతో
నయనానందము కలిగించును కద!

సీతకు దూరము అయి బ్రతుకుటది
భూమికిభారము అగును లక్ష్మణా!
కుటిలబుద్ధితో సుమశరుడిపుడు
సీత తలంపులు నింపెను మదిలో

మన్మథుడొకడన భయమది లేదు
కానీ, తోడుగ వసంతుడుండగ
శత్రువుకెంతో బలము కలిగినది
నే నిలుచుటకు కష్టము కలిగెను.

తామర మొగ్గల రేకుల చూచి
ఆనందించగ మనసు కలుగగ
సీత నేత్రములు తోచె తామరలో
తీయని బాధ కలచెను మదిని.

చల్లని గాలి వీచెనుహాయిగ
కానీ, పవనుడు పద్మ సుగంధము
తీసుకువచ్చి నన్ను తాకగ
తోచును అది నా సీత శ్వాసయై.

పంపానదికి దక్షిణ దిశలో
ఇంపుగ పూచినగోగులు చూడుము
పర్వతరాజుకు అలంకారములు
విరియ బూసుకొనె కొండచరియలు.

మాలతి-మాధవి-మల్లిక-సోకులు
అశోక-సంపెగ-కేతకి-సొగసులు
చూత-శింశుప-దిరిశెన-శోభలు
వకుల-కురంట-వావిలి-శాబర

నాగరంగములు-నారంగములతో
పచ్చని పొదలు విచ్చిన పూలతో
సోయగ మొలకెను పంపతోయములు
శోభలీనినది-పంపాతటము.

గాలికి కదిలిన తరువుల శాఖలు
ముదముగ ముందుకు వచ్చుట తోచగ
మదవతు లన్నటు సుమలత లపుడు
మత్తుగ కౌగిట చేర్చె తరువులను

క్రొత్తగ విరిసిన పూవులపైన
పొంగిన వెచ్చని తేనెల రుచిని
చూచుచు సాగెడి తీరుగ తుమ్మెద
ఝుంకారముతో ఎగసెను సుమముల.

పోటీపడినటు తరువులు పూసెను
చీటికి మాటికి తగువాడినటు
తుమ్మెద ఝుంకారమ్ముల వంకతొ
సాటి తరువులలొ హేళన సాగెను.

సతితో కూడిన కారండవము
జలకాలాడెను పంప జలముల
మందాకినికీ పంప అందము
అందెను అందుకు ప్రసిద్ధి కెక్కెను.

కన్నులముందు సీతయుండిన
పంపకు చేరువ నుండుట కలవడి
స్వర్గ సుఖములు అయోధ్య నగరము
స్మరణకురావు సుమిత్ర తనయా!

లేత చిగురులు మొగ్గలు నిండి
నిండుగ పూసిన పూవులతోను
ఈ వన శోభ లలనామణిని
తలపుల నింపి మనసును కలచెను.

జంటగ తిరిగెడి జింక లన్నియు
ఒంటిగనున్న నా మదికెంతో
ఆనందముతో కలిపి దుఃఖమును
అందించినవి మెరసెడి కన్నుల.

పావన పంపా తోయములందు
పవనుని చల్లని గాలుల యందు
పావని సీతతొ కలిసి తిరిగిన
తనువున నిలుచును ప్రాణము నాకు.

ఆ కమలాక్షి–నవయౌవనవతి
ముఖము పోలును నిండు చంద్రుని
నా వియోగమున తను మనగలదా!
ఏ విధిప్రాణము నిలుపును తనువున?

నే వియోగమును సహించియున్నను
అవమానము–నను బ్రతుకనీయదు
అంతటి జనకుడు ధర్మశీలుడు
జానకి ఎచటని అడిగిన ఏమగు?

కన్నతండ్రికై కానకు రాగా
సహధర్మిణి నను అనుసరించెను
కానీ–నన్నే నమ్మిన సతిని
కావగ లేని కృతఘ్నుడను కద!

రాజ్యహీనుడను దైన్యము నిండి
నా నిర్భాగ్యము ముందునడువగా
వెనుక నడచితి వనవాసమునకు
సీత లేక నా ప్రాణము నిలచున.?

ముద్దులొలుకు నా సీత ముఖమును
సల్లాపములను, పలికెడి పలుకులు
తిరిగి నేనుమరి కాంతున సోదర?
నా కంతటి అదృష్టము అమరున?

అయోధ్య కేగగ- అమ్మ వచ్చి-నను
కోడలు ఏదన- ఏమని చెప్పను?
అడవిలొ అసురుడు అపహరించెనని
చెప్పుట తగునా? ప్రాణములుండున?

కావున లక్ష్మణ! పొమ్ము అయోధ్యకు
నే నట వచ్చుటజరగదు వినుము
భరతుడు-సోదర ప్రేమకు నిలయము
సోదర ప్రేమతొ మెలగుడు మీరు''

అనుచు పలికినఅన్నను గాంచి
సమయము నెరిగి సుమిత్ర తనయుడు
మంచి మాటలు ధైర్యోక్తులతో
రామచంద్రుని ఊరడించెను.

''ధైర్యము పూనుము ఓ దాశరథీ!
శోకము వదలుము అన్నా! రామా!
ధీర సత్తముడ వైన నీ విటు
దీనుడవై-మాటాడుట తగదు.

స్నేహము వలన దుఃఖము కలుగును
దానిని మరచిన శోకము తీరును
స్నేహము వలనే నీట తడిసినా
వత్తిమండును చమురు స్నేహమున

కానీ-వదిన తలపులు మరువగ
నుడువుట కాదు నా ఆలోచన
కర్తవ్యము-భూజాతను వెదకుట
దాచిన చోటు మనకు తెలిసెనన

చోరుడు భయమున-చేర్చును మాతను
లేదా పాతాళములో నున్నను
ఇంద్రుని తల్లి ఉరమున దాగిన
అంతము చేతును-వదలను చోరుని!

శోకించుటది మొదటి విషయము
శోధించుటది రెండవ విషయము
ప్రధానమైనది రెండవదయిన
దానికి కావలె ధైర్యము రామా!

ఉత్సాహమును వదలకుమయ్యా!
అదియే బలము మనకది శక్తి
ఉత్సాహముతో నిలచిన మనకు
ఏ విఘ్నములు ముందు నిలవవు.

మహాత్ముడవు నువు-కోవిదుడవు కద!
నిన్ను నువ్వు మరి తెలియక పోయిన
నే చాలుదునా నీకు చెప్పుటకు
శోకము వదలుము మాతను వెదకగ.''

తమ్ముని పలుకుల దైన్యము వీడెను
కర్తవ్యమది తోచెను మనసుకు
మత్తేభములై నిర్భయమ్ముగా
సాగిరి ముందుకు ఉత్సాహముతో.

||శ్రీ రఘురాముని||

## 2 రామ లక్ష్మణుల గాంచి సుగ్రీవుడు భయపడుట

ఋష్య మూకగిరి దాపులయందు
సుర విక్రములు సుందర రూపులు
రామ లక్ష్మణుల గాంచిన యంత
సుగ్రీవుని మది తల్లడిల్లెను

వాలి పంపగా చంపుట కొరకై
వచ్చినారు ఆ వీరులనుచును
వానరులందరు కలత జెందిరి
దాగిరి-మతంగ ఆశ్రమ తావున

సుగ్రీవుని మది కలవర మందెను
ధైర్యము చెదరెను-పదములు నిలువక
ఆపద తలచి-స్థిమితము తప్పి
పరుగిడ-దిక్కుల నరయ సాగెను.

తాపసులైనా శరము లున్నవి
మతంగ శాపమువీరికి లేదా?
వాలి పంపగావచ్చిర వీరు
వీరుల చూడగ ప్రాణములూడును.

పారి పోయినా వాలి చంపును
ఆగిపోయిన వీరు చంపెదరు
అసలు విషయము తెలుసుకురండని
సుగ్రీవుడుతన సచివుల కోరెను.

విల్లంబులతో దర్శన మిచ్చిన
వారిని చూచి వానరులందరు
భయపడిపోయి వడిగా గెంతుచు
చేరిరి సుగ్రీవుని సన్నిధికి.

వాయునందనుడు ముందుకు వచ్చి
వానర రాజుతొపలికె తీరుగా :
''ఋష్యమూకమును వాలి చేరునా?
తెలివిగ జూడుము-ఏడీ వాలి?

భయముతో నీవు కపి లక్షణము
కన బరచితివి- భీరువుగాకుము
ధైర్యము వీడి - ఆలోచించక-
ఏలుట ఎట్లు వానర రాజ్యము?

ఆలోచించక ఏ పనిచేయకు-
ఎదుటి వ్యక్తి మది గ్రహించ నేర్వుము''
అనుచు హితవును శుభమును పలికిన
వాయు పుత్రునితొ పలికె రవిసుతుడు :

''హనుమా! వినుమా, వీరులిద్దరు
కమలనేత్రులు ఆజానుబాహులు
ధనుర్బాణములు కలిగిన వారై
దేవకుమారులవలె వెలుగుచును.

వాలి పంపగా వచ్చియుందురు
రాజుకుమిత్రుల కొదవ కలుగునా?
శత్రుని మిత్రులు-అదను జూచుకొని
అంతము చేతురు-రాజధర్మ మది.

వాలి అనిన సామాన్యుడుగాడు
ఉపాయ మెరుగును-అపాయ మెరుగడు
విషయము తెలియగ నీవే పొమ్ము
సామాన్యునిగా వేషము దాల్చుము.

ఆకారములు ముఖ కవళికలు
మాటలు వాటితో మనసు తెలియుము
వంచన బుద్ధికలిగిన వారో
శుద్ధ మనస్కులొతెలియుము నీవు.

ముందుగ నీవు ముచ్చటలాడి
నమ్మకమన్నది కలిగించుకొని
ఆపై వారి వివరము లడుగుము
శరచాపముల సంగతి తెలియుము.

నిర్మలమైన మనసుతొ వారు
ఉన్నటు - నీవు గ్రహించినంతనె
సత్యాసత్యము తెలియుము మరల''
అనగా మారుతి సరియని పలికెను.

॥శ్రీ రఘురాముని॥

## 3 హనుమంతుడు రామలక్ష్మణులతో సంభాషించుట

వానర రూపము వీడెను మారుతి
తేజము నిండిన భిక్షు రూపమున
రామ లక్ష్మణుల చెంత చేరెను
అతి నమ్రతగా వందన మిడెను.

బంగరు సింహాసనమునందున
ఉండగ తగిన రాజవరేణ్యులు
ఇంద్రచాపముపోలిన ధనుసులు
కరి తొండముతోసరిపడు భుజములు.

వినయము నిండి పలికెను మారుతి
వివరములడిగెను వినసొంపుగను
''అయ్యా! మీరు దేవసమానులు
రాజ ఋషులుగా అగుపడుచుండిరి.

నడచి అలసియా నిట్టూర్పులవి!
జడలు ధరించితిరుగుట ఏల?
మీ యోగ్యతకు కనబడు స్థితికి
పొంతన కుదరదు ఎందుకు స్వామీ!

ఈ వనసీమలకేల వచ్చితిరి
మీరు తిరిగెడి స్థలములు కావు
మంచి వ్రతము చేపట్టినవారు
పులుగులు, మృగములు భయపడుచున్నవి.

విశాల వక్షస్థలముతొ మీరు
వనమున తేజము నింపినారయా!
నింగి విడచి ఈ నేలను చూడగ
దిగినయట్టి రవి చంద్రుల మీరు?

మేని కాంతితో పంప మెరసెను
మాన్యులు మీరు- ప్రాయము నుండిరి
కేసరి చూపులు కలిగిన వారు
మృగరాజంతటి బలమగు వారు.

పరిఘల పోలిన హస్తములుండి
గుండ్రగబలమును తెలుపుచున్నవి
ఆభరణమ్ములు ధరించ లేదు
కారణమేమో తెలియకున్నది.

అడవులు- జలధులు నిండిన భూమిని
వింధ్యా చలముతొ శోభిలు ధరణిని
పరిపాలించగ చాలినవీరులు
దీనత నుండగ కారణమేమి?

మీ ధనుస్సులు నిగనిగ మెరయుచు
గంధాదులతో- బంగరు పూలతొ
పూజలనంది- తేజము నిండెను
ఇంద్రుని వజ్రాయుధమును పోలును.

అమ్ముల పొదులవి పగ వారలకు
ప్రాణముతీయు సర్పములన్నటు
వాడి శరముల నిండియున్నవి
నాడె మైనవి శుభకరమైనవి.

మిక్కిలి నిడివి వెడల్పుగలిగి
భయము గొలుపుచు మెరసే కత్తులు
కుబుసము విడచిన సర్పము పోలి
ఉన్నవి- రిపులకు కలలో మెదలును

బదులిడ కుండిరి కారణ మేమి?
నా వృత్తాంతము తెలిపెదనార్యా!
ధర్మాత్ముడును- కపులకు ఱేడు
సుగ్రీవుడను కపి కలడిచట.

అన్నచె అతడు తరిమి వేయబడి
దేశము తిరుగుచు ప్రాణ భయమున
అతి బాధలొ అతడుండెను స్వామీ!
వచ్చితి నేను ఆతడు పంపగ

సుగ్రీవునికి సచివుడ నేను
హనుమంతుడను- వాయు పుత్రుడను
కోర్రిన రూపము దాల్చగనేర్తును
కోరిన స్థలముల తిరుగగ చాలుదు.

చెలిమిని కోరి మా సుగ్రీవుడు
పంపెను నన్ను'' అని పలుకగను
ముదమునంది శ్రీరామచంద్రుడు
తమ్మునితోను తీరుగ పలికెను :

''సోదర! సామాన్యుడుకాడితడు
ఘనమతి సుగ్రీవుని సచివుడయా!
వెదకెడివాడే ముందు నిలచెను
ఇతనిలొ అతనిని చూడగ తగును.

లక్ష్మణ! యిమ్ము ప్రత్యుత్తరము
శాస్త్రము లెరిగిన ప్రజ్ఞావంతుడు
అతనికి తగినటు తిరిగి పలుకనిచొ
తలచును మనలను- అపండితులుగ.

ఋగ్- యజు స్సామ వేదములు
శిక్షా వ్యాకరణమ్ము లన్నియు
త్రికరణ శుద్ధిగనేర్చినవాడే
పలుకగ నేర్చును యీ విధముగను.

స్వచ్ఛమైన ఉచ్చారణతోను
అప శబ్దమ్ములు అసలే లేక
ముఖమున కన్నుల లలాటంబున
కను బొమలందు దోషము లేదు.

వ్యర్థ పదములు వెదకిన దొరకవు
సందిగ్ధమునకు తావే లేదు
తొందరలేదు మాటలయందు
మాట పెగలని తీరులు లేవు.

మధ్యమస్వరమున వ్యాకరణముతో
శుద్ధమయిన వాక్చాతుర్యముతో
కత్తి నెత్తిన శత్రువయినను
కొట్టుకుపోగల వాక్ప్రవాహము.

ఏ రాజయినా యింతటి మంత్రిని
పొందకున్న మరి కీర్తి గడించున?
తలచిన కార్యము తీరుగ నడచున?
సఫలీ కృతుడగు  ఇట్టి దూతచే

ధరణి నేలగా తలచిన రాజు
ఈ విధమైన దూత కోసమై
తనుగా చూచుట యుక్తమైనది
సర్వము జరుగును నిర్విఘ్నముగా''

అన్న పలుకులు వినిన లక్ష్మణుడు
వాక్య కుశలుడు పలికె తీరుగా:
''పండిత శ్రేష్ఠా! వింటిమి మేము
మీ సుగ్రీవుని నామధేయము.

రవిసుతు గుణములు ప్రభావమ్మును
వింటిమి-మేము-నీవు నుడివినటు
చేయుటకొరకై సిద్ధము నుంటిమి
సిద్ధించును నీ కోరిక హనుమా!''

అనగా వినిన వాయునందనుడు
సుగ్రీవునికి జయమును కోరుచు
రామ సుగ్రీవుల చెలిమిని బలముగ.
కూర్చ నెంచెను సంతోషముతో.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 4 రామానుజుడు హనుమంతునితో తమ వృత్తాంతము తెలుపుట

సుగ్రీవుని గన వచ్చిన వీరుల
రామ లక్ష్మణుల కాంచిన మారుతి
తలచెను మదిలో రవిసుతు కార్యము
జరుగును తప్పక వీరి వలననే.

మారుతి పలికెను రాముని చూచుచు :
''అయ్యా! నీవు తమ్మునితోను
ఈ వన సీమలతిరుగుట ఏల?''
తమ్ముడు బదులిడెఅన్న ఆనతిని:

''ద్యుతిమంతుడును కీర్తివంతుడు
దశరథ భూపతి ధార్మిక శ్రేష్ఠుడు
ధనధాన్యములతొ యజ్ఞయాగముల
రెండవ బ్రహ్మన పురమునేలెను.

ఆయనజ్యేష్ఠ కుమారుడు రాముడు
పరాక్రమమున ప్రసిద్ధిగాంచి
సర్వభూతముల రక్షణ చేయగ
చాలిన యోగ్యుడు ఈతడు హనుమా!

పితృవాక్య పరిపాలన చేయగ
రాజ్యము వదలి కానల నడచెను
నడచెను భూసుత సీతాదేవి
భర్తతొ-సాయం సూర్యకిరణమన.

రామచంద్రునకు సోదరుడను-నే
అనుసరించితిని అన్న పదములు
సేవలుచేసి జన్మతరించగ
సేవించెద నా అన్నను హనుమా!

లక్ష్మణుడను-నా నామధేయమది
కృతజ్ఞుడు మరి సుఖపడ సిరిగల
జీవులరక్షణ చేసెడి రాముడు
రాజ్యము వదలి కానల కదలెను.

కానన మందు రామచంద్రుని
సతియగు సీతను-కామరూపియగు
రక్కసు డెత్తుకుపోయి దాచగా
వెదకుచు మేము తిరుగుచుంటిమి.

శాప వశముచే దానవు డయిన
'దను' వనువాడు-సీతను వెదుకగ
సాయము చేయును రవిసుతు డనుచు
సూటిగ జెప్పెను-నిజము కపీంద్రా!

జనుల పొగడ్తల నందినరాముడు
దాన గుణముచేశోభిలు రాముడు
అతనికి ఇపుడు మీ సుగ్రీవుడు
అండగ నిలచెడి దిక్కు కపీంద్రా!

దీన రక్షకుడు ధర్మరక్షకుడు
దశరథ భూపతి కుమారు డితడు
తండ్రికి తగిన తనయుడు-అయినా
సాయము వేడగవచ్చె రవి సుతుని.

భూతలమందలి జీవికి సుఖములు
అనుగ్రహించే ప్రభువగు రాముడు
వినయముగా మీ వానర రాజు
అనుగ్రహమ్మును కోరుచుండెను.

సద్గుణ సంపద కలిగిన వాడు
రాజ లోకమునపూజ్యుడు అయిన
ఉత్తమదాత-దశరథ తనయుడు
కపిరాజును తను శరణు కోరెను.

సత్కీర్తికి మా అన్నయె నెలవు
అంతటివాడు శోక వశుడయి
దిక్కని వేడెను మీ సుగ్రీవుని
దయతో నతడుచేర్చగ నగును.''

అని పలుకుచును కన్నుల నుండి
అశ్రుధారలు కురియులక్ష్మణుని
చూచి పలికెను వాయునందనుడు
ఊరడించెను మృదు వచనముల.

''విజితేంద్రియులు-విక్రమమూర్తులు
సదాచారులు సజ్జన పూజ్యులు
మిమ్ము గనుట-మా రాజు భాగ్యము
రవిసుతు వివరము తెలిపెద వినుడు.

అన్న వాలి మా రాజు భార్యను
అపహరించి మా తేనిని తరిమెను
అడవుల బట్టి తిరిగెడిరాజు
అండగ నిలచును తన కపి సేనతో''

అనుచు తియ్యగా పలికి మారుతి
సుగ్రీవుని కడ కేగగరమ్మని
లక్ష్మణమూర్తితొ పలుకగ నంత
పవన తనయుని పొగడెలక్ష్మణుడు :

''అన్నా! యీ కపిశ్రేష్ఠుడు-నిజమును
పలుకు చుండెను-సుగ్రీవునికి
నీతో కాగల కార్యమున్నది
నీ కార్యము నెరవేరిన దనుకొను.

ప్రసన్నమయిన ముఖ కవళికలు
ప్రియము గూర్చెడి హిత వచనమ్ములు
సాధుస్వభావము వినయ సంపద
మోసము లేదని తోచుచున్నది.

కావున మనము వాన రేంద్రుని
చూడగ పోదము'' అనగా రాముడు
సరియని పలుకగ వానర శ్రేష్ఠుడు
కపి రూపముతో నిలచె వినయముగ.

రవిసుతు కార్యము నెర వేరిన దని
సంతస మంది రామలక్ష్మణుల
నిరువుర చేర్చగ రవిసుతు ముందు
భుజముల నిడుకొని తృటిలో చేరెను.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 5 శ్రీరామ సుగ్రీవ మైత్రి

రామలక్ష్మణుల నిరువుర నపుడు
ఋష్యమూక గిరి సుఖముగ చేర్చి
సుగ్రీవునితో పలికెనుమారుతి
రాఘవు ఘనత తెలిపెను తీయగ.

''సూర్యతేజుడు రామభద్రుడు
మతిమంతుడు తన తమ్ముని తోను
నిన్ను చేరగ వచ్చెను ఘనుడు.
రవికుల తిలకుడు-సూర్యకుమారా!

ఇంద్రుని గెలువగ తేజోవంతుడు
దశరథ సూనుడు-ధర్మనిరతుడు
పితృవాక్య పరిపాలన దక్షుడు
సతితో వనమున గడుపుచుండగా.

రావణాసురుడు-రాముని సతిని
అపహరించెను విను-మహరాజా!
ధరణి నంతను కీర్తి గడించిన
దశరథ తనయుడు సాయము కోరెను.

పూజ్యులలోను ఉత్తములయ్యా!
భాగ్యము నీదని మదిలో తలచుము
నెయ్యము కోరి వచ్చిరి వినుము
పూజలుచేసి పుణ్యము నందుము.''

పావని పలుకుల ముదమును పొంది
మదిలో భయము తొలగి పోవగా
మనుజ రూపమున త్వరగా వచ్చెను
మనుజోత్తములను సందర్శించగ

ధర్మగుణముతో రాజిలు వారు
సర్వభూతముల వ్యాపకులనుచు
మారుతి పలికిన పలుకులు వినిన
రవి సుతుడనెను దాశరథులతో.

''మానవ లోకపాలకులారా!
మీరు నెయ్యము కపితో చేయగ
ముందుకు వచ్చుట నా భాగ్యమది
నే కృతకృత్యుడ- అయినా వినుడు.

నాతో చెలిమి చేయగ మీకు
నిండుగ సమ్మతి అయినచొ నిపుడు
నా చేతితొ –నీ చేయి కలుపుము
నే చాచితి నిదె కరము వినయముగ.''

రాముడు మదిలొ సత్యము నెరిగి
మనసు నిండుగా కరమును కలిపి
మానవోత్తముడు- కపి కులోత్తముని
కౌగలించుకొని గుండియ కలిపెను:

పవన తనయుని మది పులకించెను
చంద్రపుల్లలతొ అగ్ని రగిల్చెను.
అంతట మిత్రులు హుతవాహనునికి
పూజను చేసి ప్రదక్షిణించిరి.

రామ సుగ్రీవులు అగ్నిసాక్షిగా
స్నేహము నెరపి తమ కార్యములు
తీరినట్టుగా సంబరపడుచు
తృప్తిగ చూపులు పంచుకొని రట.

ఆనందముగా స్నేహితు లిరువురు
కలసిన శుభ సందర్భములోన
సుగ్రీవుడు శ్రీరాముని చూచి
మన, సుఖదుఃఖము లొకటనిపలుకుచు

నిండుగ పూసిన తరువు శాఖను
విరచి ఆసనము చేసె రామునికి
హనుమంతుడు ఒక చందన శాఖను
వేసి లక్ష్మణుని కూర్చొన చేసెను.

తరువు శాఖపై రామచంద్రునితొ
తను కూర్చొని – సుగ్రీవుడు పలికెను :
''రామా! వాలి, నాకు అన్నయగు
అంతులేని పరాక్రమ వంతుడు.

నాపై కోపము నిండిన వాలి
రాజ్యము నుండి తరిమి వేసెను
నా భార్యను చేపట్టెను అతడు
అడవుల బట్టి తిరుగు చుంటిని.

కరుణ నిండిన మనసుతొ నీవు
అనుగ్రహించుము ఓ నరపుంగవ!
వాలి భయమది తీర్చునట్టుగా
అభయము నిమ్ము దశరథనందన!''

రవిసుతు పలుకులు వినిన దాశరథి
శరణాగతులకు రక్షకుడై మరి
స్నేహ ధర్మము తెలిసినధీరుడు
మందహాసముతొ పలికె ప్రియముగా :

''మైత్రికి ఫలము ఉపకారము సుమ!
తీరుగ తెలియుము వానరోత్తమా!
అధర్మ పరుడగు వాలినిచంపెద
ధర్మము నెరపెద విక్రమ స్ఫురణతో.

పిడుగు పాటుకు పగిలిన గిరివలె
పడును వాలి- నా బాణ హతుడయి''
రాముని పలుకుల సంతస మందెను
రమయు, రాజ్యము పొందినట్టుగా

''వాలి మరణము తప్పదు కావున
వీరపుంగవా! అతి శీఘ్రముగా
వాడి బాణముల వాలిని కూల్చి
వాని భయము నువు తీర్చుము'' అనగా

ప్రసంగ మటుల సాగుచుండగా
సీతాదేవి- కమల లోచనకు
వాలికి- లంకాధీశున కపుడు
వామ నయనములు అదిరె నొక్కపరి.
॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 6 శ్రీరామ, సుగ్రీవ సంభాషణము

రామచంద్రునితొ సుగ్రీవు డట
పలికె తీరుగా-''సచివోత్తముడు
హనుమంతుడు- మీ వివరములన్నీ
తెలిపెను వనముకు మీరు వచ్చుటది.

మిథిలాధీశుని కూతురుసీతతొ
నీ తమ్ముడు యీ లక్ష్మణమూర్తితొ
వనమున నీవుతిరుగు చుండగా
క్రూర రక్కసుడు మిము వంచించి

నీ సతి సీతను అపహరించుట
త్రోవలొ జటాయు నంతము చేయుట
అంతయు వినిచెను ఆంజనేయుడు
నీ దుఃఖము-నే తొలగించె దను.

పతివ్రతయగు సీతాదేవిని
దుష్టరక్కసుడు ఎచట దాచినను
దనుజుని త్రుంచి-వేదశృతిని
తెచ్చిన రీతిగ- తెచ్చెద తల్లిని.

పాతాళములో నుంచిన గాని
ఆకాశములో దాచిన గాని
నే తేగలుగుదు సీతాదేవిని
చింతింపగను వలదునీవిక.

రామా! నేను సత్యము చెప్పెద
సీతను- దానవు లందగ లేరు
విష భక్ష్యమును తినిన వానివలె
మడయును గాని మనలేడుసుమా!

అంబర వీథిని అతి తొందరగా
రావణుండు గొనిపోవు అతివను
ఆడు పామువలె అల్లల్లాడగ
నాతో ఇట- యీ నల్వురు గాంచిరి.

ఆమెకూడ మము చూచిన దయ్యా!
అంబరమందు నగలను కట్టి
మూట విసరెను- మా హనుమంతుడు
భద్రపరచె నవి- చూపెద నీకు

# 8 సుగ్రీవుని దుఃఖము–శ్రీరాముని ధైర్యోక్తులు

సుగ్రీవుడు పలికెను వినయము నిండి
రామానుజుడు వినుచుండ గను
''నీ స్నేహముతో- కపి నయినా- నను
రామ నేస్తమని గౌరవింతురు.

నీ సాయముతో స్వర్గపుర మది
లభించగలదు మాన్యుడ నయితిని
నీ నెయ్యముతో నావారలకు
పూజనీయు డను అయితిని రాఘవ!

నా స్నేహము నువు తెలుసుకొందువు
నే నుడివిన అది ఆత్మ ప్రశంసయె
స్నేహితుడయినచొ లోపము లెంచక
ఉత్తమ గతిగా నెయ్యమెంచ వలె.

శరీరమునకు కరముల మాదిరి
కంటికి రెప్పల మాదిరి గానే
నిలచి- మిత్రుల కార్యము లన్నియు
ఆలోచించక నెరవేర్చవలె.''

సుగ్రీవుడటు పలుకగ- రాముడు
పలికెను తమ్ముడు వినుచుండ గను
'' నీవు నుడివినది నిక్క మే సుమా!
నే గ్రహించితి నెయ్యపు విలువ.''

సంభాషణమటు సాగుచుండగా
క్రొత్త చిగురులు పూలునిండిన
తరుశాఖలను క్రొత్తవివేసి
దాశరథులను కూర్చొన జేసిరి.

తిరిగి పలికెను రవిసుతు డపుడు
''అన్న వాలిచే తరుమబడితిని
ఋష్య మూకమున దాగియుంటిని
దుఃఖము తీర్చి నను రక్షించుము.''

పలికెను లీలగ నవ్వుచు రాముడు
''నా మిత్రుడవు మేలు చేసెదను
కీడు చేయుటది రిపు లక్షణము
చంపెద వాలిని - వ్యధ నీకేల?

నా శరములు అతి వేగము గలవి
మిరుమిట్లు గొలుపుచు భయంకరమవి
స్కంధ వనమున పుట్టినట్టివి
వజ్రాయుధముతొ సమానమైనవి.

భయంకర మయి కోపము నిండిన
సర్పమువంటి శరములు చూడుము
వజ్రాయుధపు పాటుకు గిరివలె
నీతిలేని- ఆ వాలి కూలును.''

''అగ్ని సాక్షిగ చెలిమి చేసితివి
చేయి కలిపి నా మనసు గెలిచితివి
దుఃఖానలము కాల్చగ తెలిపితి
చిన్న విషయము కాదు రాఘవా!''

అనుచు పలుకుచు దుఃఖము నిండి
కన్నులనీరు పారుచుండగా
డగ్గుత్తికతో మాటలు పెగలక
సూర్యనందనుడు శోకము నిండెను.

ధైర్యము తెచ్చుకు సుగ్రీవు డట
వాలి చేసిన దుష్కార్యము లను
నిర్దయుడై తన హితులందరిని
చెరలో నుంచుట తెలిపెను అపుడు.

''రాజుగ వాలి ఏలు చుండగా
యువరాజగు నను వెడలగొట్టెను
నా ఇల్లాలిని అపహరించెను
నను జంపుటకై యత్నము నుండెను.

నను జంపుటకొరకై వచ్చిన వారిని
తెలుసుకు - వారిని చంపుట నా పని
కావున, మొదట మిమ్ముల చూచి
భయము నందుటకు కారణ మదియే.

ఈ హనుమంతుడు ముందు నిలువగా
మిగిలిన ఈ కపులందరు-నన్ను
ప్రాణప్రదముగా కాపాడగను
బ్రతికి యుంటిని దశరథ నందన!''

అంతట రాముడు అడిగె రవిసుతుని:
''మీ వైరమునకు కారణమేమి?
కారణ మల్పము అయిన-మాటలతో
సమాధానము చేయగ చాలుదు.

వైర కారణము బలముయినచొ యిక
వాలిని కూల్చి కార్యము తీర్చెద
నదివలె నా మది పరుగిడు చున్నది
విశదపరచుము సర్వము యిపుడే.

వింటిని ఎక్కు పెట్టక మునుపే
సర్వము తెలుపుము ఓ సుగ్రీవా!
వింటినుండి మరి శరము వెడలెనా
వాలి చచ్చును నిశ్చయమ్ముగా.''

||శ్రీ రఘురాముని||

## 9 సుగ్రీవుడు వైర కారణము నివేదించుట

తీరుగ పలికెను రవిసుతుడంతట:
''ఇరువురు పుత్రులు మా జనకునకు
అందు జ్యేష్ఠుడు - వీరుడు వాలి
చిన్నవాడను నేను రాఘవా!

ప్రేమగ బరగెడి వాలి అంతట
తండ్రి గతించగ రాజై ఏలగ
వినయము నిండి హితమును గోరెడి
బంటుగ నాతని సేవలు చేసితి.

కాలము ఆ విధి జరుగుచుండగా
మయుని తనయుడు-బలవంతుడగు
''మాయావి'' రక్కసుడు స్త్రీనిమిత్తమై
వైరము వాలితో కలిగి యుండగా

మాటు మణిగిన నిశీధి లోన
మదించిపోయి పోరుకు వచ్చి
నగరి ముందర నిలబడి వాడు
అతి భీకరముగ అరచుచుండగా

రోషము నిండి పానుపునుండి
లేచిన వాలి-పోరుకు సాగెను
ఉదయము వరకు వేచియుండ మని
ముదితలు, నేనును, వేడిన వినకయె.

అన్న-పోరుకు సాగగ నంత
అనుసరించితిని సహాయ పడగ
ముందర వాలిని గాంచి అంతట
పరుగిడసాగెను ఆ మాయావి.

వెన్నెలతోడుగ నుండగ వాలి
వెంబడించెను ఆ మాయావిని
అంతట వాడొక బిలమును గాంచి
అందు దూరెను ప్రాణభీతితో.

నన్నుగాంచి నా అన్న పలికెను
నీ విచ్చటనే నిలబడి యుండుము
బిలము జొచ్చి- ఆ మాయావిని -నే
చంపి వచ్చెదను అనగా, నేను

అనుసరించెదను నిన్నే అనగ
వినకనె- అన్న-బిలమున జొచ్చెను
నే నచ్చటనే ఒక ఏడాది
వేచియుంటిని అన్న కొరకునై.

అంతట-నెత్తుటి ప్రవాహమ్మది
బిలమునుండి అట వెడలజొచ్చెను
నురగలు వెడలెను, రక్కసి అరుపులు
వాలి రోదనగ వినవచ్చినవి.

అన్న- అసువుల బాసెను అనుకొని
దుష్ట దనుజుని భీతి చేతను
కొండ నొక్కటి బిల ద్వారమున
అడ్డముగా పడవేసి-వగచుచు.

అన్నకు జలములు వదలితి నేను
దుఃఖము నిండి పురముజేరి, మరి
అన్న మరణము తెలియనివ్వక
రోజులంతట దొర్లించగను

విషయము మెల్లగ తెలిసిన సచివులు
వానర రాజ్యము నప్పగించిరి
వాలి అంతట ఆ మాయావిని
అంతముజేసి తిరిగి వచ్చెను.

రాజ్య కాంక్షతో అన్నను వదలి
పురము జేరితిని అనుకొని అతడు
క్రోధమునిండి-''కుమతీ-నువ్వు
తమ్మునివా! నా శత్రు వగుదువుర!

నమ్మిన నన్ను వదలివచ్చితివి
బిలమున కడ్డము కొండ నుంచితివి
కులుకు చుంటివి పట్టము కట్టుకు-''
పలికెను వాలి కోపము నిండి.

నా సచివులను మిత్రులందరిని
చెరలో నుంచెను ఆ కోపిష్టి
బలగమ్ములతో వాలిని నేను
నిగ్రహించగ చాలి యున్నను-

అన్న కావున తప్పుగ తలచిన-
శాంతము రాగా దయచూపు నని
గౌరవించుటకు ఫలమిది నాకు
ప్రాణము కొరకై పరుగులు తీయుట.

అసురుని చంపి పురము జొచ్చెడి
అన్నకు- ఎదురుగపోయి భక్తితో
నమస్కరించగ నను చూడకనే
ముఖము త్రిప్పెను కలవరపడితిని.
॥శ్రీ రఘురాముని

❖❖❖

## 10 సుగ్రీవుడు-తనను వాలి తరిమి వేయుటను చెప్పుట

''అన్న పాదముల వ్రాలిపోతిని
విన్న వించితిని సర్వము తీరుగ
నెత్తుటి వరదలు గాంచితి నయ్యా!
సంవత్సర మట వేచియుంటిని.

అలికిడిలేదు- దుఃఖించితిని
మనసంతయును వికలమయినది
అతి కష్టముతో కొండను నెట్టి
బిల ద్వారమును దాటివచ్చితి.

నీ కంఠధ్వని వినబడదయ్యా!
మదిలో శంక ముదిరిపోయెను
అసురుని భయమున బిల ద్వారమున
అడ్డముగా నే కొండ నుంచితిని.

చూడుడు వీడు! రాజ్యలక్ష్మికై
అగ్రజు-నన్ను ద్రోహ చింతనతొ
మృత్యుముఖమున త్రోయ జూచెనని
ఎన్నో విధముల పరుషము లాడెను.

దీనముగా నే పురము జొచ్చితి
వలదన-వినక సచివులందరు
పట్టము గట్టిరి దయచూపుమయా!
శత్రుడగానని కరములు ముడిచితి.

తమ్ముడ నేనటు చేయుదు నా యని
తలంపులేక కట్టుబట్టలతొ
తరిమెను- భార్యను అపహరించెను
తిరిగి తిరిగి – నే చేరితి నీ గిరి.

వాలి వినకనే దురుసుగ పలికెను
పేరోలగమున నిలపి- కథనము
వినిపించెను-తను అసురుని కొరకై
బిలమున వెదకుట సాగించితి ననె.

తెలిసి నేను అపరాధిని గాను
తెలియక చేసిన కా దపరాధము
దీనుని-నన్ను రక్షింపుమయా!
ధర్మాత్ముడవు- యశము గడించుము.''

''సంవత్సరమటు వెదకగ- దనుజుడు
కనబడినంతనె కలబడి చంపి-
కొండనెట్టగ సాధ్యము గాక
సుగ్రీవునికై అరచితి నపుడు.

రాఘవుడనెను అనునయించుచు
''దుఃఖించకుమో! మిత్రసత్తమా!
వాడి బాణముల కూల్తును వాలిని
కంటబడుటయె ఆలస్యమిక-

పరస్త్రీ భోగము అందును వాలి
నా కంటికి మరి కనబడువరకే-
సతికి దూరమగు దుఃఖము తెలియును
అర్కసుతా! నీవంత నెరుగుదును.''
॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 11 వాలి బలము – మతంగముని శాపము

రాముని పలుకుల ధైర్యము నిండి
రవిసుతుడనెను: ''పురుషోత్తమ! నువు
కోపము నిండి శరములు వదలిన
లయకాలములో రవికిరణములగు

అయినను వినుము-వాలి విక్రమము
కొండల నాతడు అవలీలగను
బంతులాడినటు ఎగుర వేయుచు
పేలగ జిమ్మగ చాలును రామా!

ప్రాతఃసంధ్యకు పూర్వమె లేచి
నాల్గు సంద్రముల తీరుగ తిరిగి
సంధ్య కృత్యములు ఆచరించుకొని
అలుపు నెరుగక- అడుగిడు పురమున.

భుజబల తేజుడు- భూరుహమ్ములను
విరచును- చిత్రము ఆతని బలము
దుందుభి అను మహిషాకృతి గలిగిన
అసురుడు - వరబల గర్వము నిండి

సాగరమును గని- పోరగ రమ్మన
వారిధి అంతట- ''హిమగిరీంద్రుడు
నీతో పోరగ చాలిన'' వాడన
రయమున బోయి గిరిని తాకగ

గిరిరాజంతట పలికె దుందుభితొ
''మునుల కాశ్రయము నిచ్చెడి నెలవును
ఏలకుమ్ముట-పోరగపొమ్ము
కిష్కింధలొ నీ కీడగువాడు-

వాలి-వానరుడు రాజైయుండెను
సరిచేయును నీ కండూతిని'' అన
భూమి వణకునటు భయంకరముగా
దుందుభి సాగెను కిష్కింధా పురి.

పురమును చేరి తరువులు కూల్చుచు
శృంగమ్ములతో తలుపులు జీల్చుచు
విజయ కాంక్షతో అసురుడు రాగా
వినబడె వాలికి- ఆ ధ్వనులన్నియు.

అంతట వాలి అంతఃపురమును
వదలి వచ్చెను స్త్రీలందరితో
తారల నడుమ చందమామలా
వెలిగెడి వాలి-పలికె దుందుభితొ:

''ఓ దనుజోత్తమ! దుందుభివని-నిను
తెలిసితి - ఏల ఈ విధ్వంసము?
ఊపిరి నిలువగ ఆశ కలిగిన
శీఘ్రమె పొమ్మన'' దుందుభి పలికెను:

''స్త్రీల ముందరా ప్రగల్భమ్ములు!
పరాక్రమముతో పోరగ రమ్ము
ఉదయము వరకు వేచియుందును
భోగము లంది దిగుము పోరుకు.

లోనికి బొమ్ము భార్యల జేరుము
దివి సుఖమందగ దానములిమ్ము
పురమునంతను తిరిగి చూచుకొని
తగినవాని యువరాజుగ చేయుము.

మత్తు నిండియో- అప్రమత్తుడో
నిద్రించుచునో నిరాయుధుడునో
నీవలె - కామము నిండిన వాడినొ
చంపిన- భ్రూణ హత్య దోషమగు.''

వినిన వాలి- తన సుందరాంగు లను
లోనికి బోమ్మని - పలికె దుందుభితొ
''అసురోత్తమ! నువు భీరువుగానిచొ
తలపకు నన్ను మత్తునిగాను.

నేద్రావినది వీరపానము
నేద్రావెద నీ ప్రాణమ్ముల''నని
తండ్రి యొసగిన కాంచనహారము
ధరించి-వాలి తాకె దుందుభిని.

లీలగ వాలి దుందుభి నెత్తి
శృంగములందుకు గిరగిర త్రిప్పి
నేలను మోదగ నెత్తురు పారెను
తిరిగి దుందుభి నిలచి పోరెను.

భీకరమ్ముగ పోరు సాగెను
వాలి బలమది ఇనుమడించెను
దుందుభి బలము సన్నగిల్లగా
ముష్టిఘాతములు అసువులు బాసెను.

పీచమడంచి దుందుభి కాయము
కరముల నెత్తి యోజన దూరము
లీలగ-వాలి విసరగనంతట
కాయము నుండి వెడలిన నెత్తురు.

గాలికి మతంగ ఆశ్రమ మందు
చిందిపడగ- ఆ ముని కోపముతో
వెలుపల కొచ్చి ఆశ్రమ సీమలొ
దుఃదుభి కాయము గాంచిన యంత

తపోబలముచే సర్వము తెలిసి
బలోన్మత్తుడగు వాలి పనియని-
ఆశ్రమ మందలి తరువుల గూల్చి
నెత్తురు మాంసము విరజిమ్ముచును.

అతి హేయమగు పనిని చేసిన
వాడుజచ్చు- ఈ వనము జొచ్చిన
నా ఆశ్రమమొక యోజనమున్నది
అందడుగిడిన వాలి కూలును.

రేపటి సూర్యోదయము లోపలే
వాలి పక్షపు కోతులన్నియు
నా ఆశ్రమము వదలిపోనిచో
వేల ఏండ్లిట శిల లగుదురనె.

శాపము వినిన వాలి-మతంగుని
శాంతపరచగా పోయెను అపుడు
ముని కోపముతో లోనికి పోవగ
భయముతొ వాలి మరలి వచ్చెను.

ఆశాపమె-నా పాలిటి వరముగ
తిరుగు చుంటిని అసువులతో నిట
చూడుము-అసురుని అస్థి పంజరము
పర్వతమంత ఉన్నది అదిగో!

రామా! అవిగో మద్దిచెట్లవి
సప్త సంఖ్యలో చిక్కగ నున్నవి
వాలి-పిడికిట వాటిని పొడిచి
ఆకులన్నియు రాలగ. చేయును.

బలోన్మత్తుడు ఆయుధ మందక
కేవలమాతని చేతులతోనే
అంతటి పనిని చేయగ చాలిన
వాలిని-నీవు చంపెదవెటు'' లన

రవిసుతు మనసు తెలిసినవాడై
రామానుజుడు అడిగె నంతట
''రాముడు వాలిని చంపగలుగు నని
నమ్ముట నీవెటు ఓ కపిరాజా!''

''ఓ గుణవంతా! వాలి బలముతో
ఛిద్రము లొనర్చు సప్తసాలముల
ఒక్కదానిని రాముడు త్రుంచిన
నమ్ముదు-వాలిని చంపగలుగు నని

లక్ష్మణమూర్తీ! పర్వత మంతటి
దుందుభి ఎముకల గూడును రాముడు
రెండువందల ధనుసుల దూరము
చిమ్మిన, నమ్ముదు రాముని శక్తిని

పరీక్ష పెడితిని రాముని బలముకు''
అనిన శంకయు భయముల తోను
తిరిగి పలికెను రవిసుతు డంతట-
''వాలిబలములో సురలను మించును

విక్రమమందు అజేయుడాతడు
తిరుగులేని అతి పౌరుషవంతుడు
తీవ్రకోపము-వేగము-బలము
తెలిసి-నేనిట దాగియుంటిని

దశరథ నందన! మిత్రుడ వీవు
దయగల ధీరసత్తముడవయా!
దొరికెను-హిమగిరి అశ్రయమంతటి
ఆశ్రయమ్ము-నా బ్రతుకు ఫలించెను

నీ ఆకారము, బుద్ధి బలములు
మాటలతీరు-పూర్తి ధైర్యమిడు
నివురుగప్పిన నిప్పువు నీవు
అయినా-ఆజిలొ నిన్నెరుగను కద!

వాలి భయముతో నిటుమాటాడితి''
అనుచు పలికిన సుగ్రీవుని గని
రాముడు పలికెను-''నీ సంశయము
తీర్చెద చూడుము కపికులోత్తమా!''

అనుచు పలుకుచు రామచంద్రుడు
దుందుభికాయము ననాయాసముగ
బొటన వ్రేలిచే పదియోజనములు
చిమ్మెను-విస్మయమందగ నందరు.

ఈ పరీక్షలో నా నమ్మకము
కుదురుకొనుటది అతి కష్టమయా!
కావున నీవు సప్త సాలముల
ఒక్క దానినికూల్చుము నమ్మెద.

అంతట పలికెను సుగ్రీవు డట
''రామా! యిపుడీ కళేబరమ్ము
ఎండిన మ్రోడై ఎముకల గూడయె
శ్రమ నెరుగని నువు-చిమ్మితి విటుల

వాలిని మించిన బలవంతుడవు
అయినా నేను స్వయముగ తెలియగ
కోరితి-అసువుల తీపిని వదలక
నిన్ను నమ్మి మరి-పోరుకు పోవలె.

యుద్ధముచేసి అలసిన వాలి
మాంసము నెత్తురు నిండిన కాయము
ఎత్తి విసరెను-అవలీలగను
కావున నిన్ను దయతో వేడెద.

కరితొండముతో సరిపడు చాపము-
శర సంధానము చేసి వదలిన
శరము తప్పక కూల్చును తరువును
సందేహము నాకెంతయు లేదు.

తేజమునందు సూర్యుని మాదిరి
గిరుల యందున హిమవంతునిగ
చతుష్పాదముల సింహము పగిది
నరులందున నువు శ్రేష్ఠుడవయ్యా!''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 12 సుగ్రీవునికి రాముని శక్తి తెలియుట-వాలితో సుగ్రీవుని యుద్ధము

అంతయు వినిన రామచంద్రుడు
నమ్మిక మొదవగ సుగ్రీవునకు
ఘన కోదండమునందుకు నిలిచి
బంగరు మొనగల శరమును తొడిగి

అంతట ఆగక-అవనిని జొచ్చి
పైకివచ్చి మరి విజయగర్వముతొ
వీరపుంగవుని అమ్ముల పొదిలో
పదిలమ్ముగను నిలచుట గాంచి.

విడిచెను గురితొ-సాలమ్ములపై
దిక్కులు ధ్వనిచే పిక్కటిల్లగా
రయమున శరము మద్దితరువులను
చీల్చుకుపోయి - గిరినే చీల్చి

ఆశ్చర్యముతో గగురుపాటుతో
రవిసుతుడంతట శిరసును వంచి
రామచంద్రుని పాదమ్ములపై
ప్రణామముంచి పలికె తీరుగా:

''దశరథ నందన! ఇంద్రుడు కూడిన
దేవగణములను-అసురు లందరిని
ఏక కాలమున గెలువ జాలుదువు
ఏల నేను మరి వాలిని చెప్పుట?

మద్దిచెట్లను కూల్చెను శరము
గిరినే చీల్చిన దివ్యశరమది-
పాతాళమునకు పంపి పొందగల
శర నైపుణ్యము నీకే తగును.

ఓ నరపుంగవ! నాకొరకై నువు
వాలిని చంపుము-వేదన తీర్చుము
కరములు ముడిచి ప్రార్థించితిని
మహాత్ముడవు నువు మైత్రికి నెలవు.''

వేడుకొనెడి ఆ సుగ్రీవుని గని
ప్రేమ మీరగా కౌగలించుకొని
''పోదము రమ్ము-పోరుకు రమ్మని
వాలిని పిలువుము-జాలము చేయకు''

అని పలుకుచును రామ లక్ష్మణులు
కపులందరును వెంట నడువగా
సాగి, తరువుల చాటున నిలిచిరి
ముందుకు సాగిన సుగ్రీవుడట

సింహనాదముతొ దిక్కుల వియగా
వాలిని పోరుకు రమ్మని బిలవగ
పశ్చిమాద్రిపై నిలచిన రవియై
కోపమునిండి వాలి నిలచెను.

భీకరమైన పోరు సాగినది
పిడుగుల సవ్వడి పిడికిటి పోట్లతొ
చరుపుల-అరుపుల సాగిన యుద్ధము
బుధు డంగారక పోరుగ తోచెను.

పోరు పెరుగగా రామచంద్రుడు
వింటిని ఎక్కుపెట్టి చూడగా
సోదరులిరువురు అశ్విని సురలన
ఒకే రూపము బలముతొ నిండి

గుర్తించుటకు వీలు తెలియని
సందేహములో రాముడు పడగ
ప్రాణము తీయు శరమును విడువగ
మనసురాక-మరి ఊరకుండెను.

వాలి దెబ్బలకు ఓర్వ జాలక
నెత్తుట దడిసిన ఆ సుగ్రీవుడు
రాముని జాడ తెలియకపోగా
పరుగిడె·తిరిగిఋష్యమూకము

తరిమినవాలి ఛీ! యని పలికి
బ్రతికి పోతివని హేళన చేసి
తిరిగి పోయెను-అంతట రాముడు
హనుమంతునితో చేరె సుగ్రీవుని.

ముందర నిలచినరాముని గాంచి
సిగ్గుతొతలను వంచిరవిసుతుడు
పలికెను-''రామా! ఇటు చేయుటకు
ఏమ పకారము-నే చేసితిని?

నమ్మక మొదవగ శక్తిని చూపి
పోరుకు పొమ్మని నను నమ్మించి
శత్రువాతను బడ జేయుటచే
నీకు కలిగెడియశస్సు ఏమి?

వాలిని చంపను అని నువు చెప్పిన
నేనీ గిరిపై బ్రతుకుచుందును
పోరుకు పొమ్మనిప్రోత్సహించినది
చావుదెబ్బలపాల్జేయుటకా?''

అనుచు పలుకుచు రోదించెడి- ఆ
సుగ్రీవుని గని రామభద్రుడు
''నాయన! నీవు కోపించకుమా
శరమువదలని వివరమువినుము

రూపమునందు వయస్సునందున
చూపునందు మరి వేషమునందు
మాటలయందు కంఠస్వరమున
ధైర్యమునందుఇరువురు సములే

మీలో-వాలిని తెలియగనైతిని
శరము వదలినచొ వ్యర్థముగాదు
నీ కా శరమేతగిలినచో మరి
సర్వము-నాశము అయినటులేకద!

ముందు వెనుకలు ఆలోంచిచక
విడచిన శరము- నిన్నే కూల్చిన
కార్యముకాక పోవుటకాగా
శాశ్వతమైన అపకీర్తికదా!

అభయము నిచ్చి తానే కూల్చుట
ఎంతటి పాపమొ ఆలోచించుము!
దానికి ప్రాయశ్చిత్తము లేదు
తీరుగ తెలియుముసూర్యనందనా!

నా వచనమ్ములు నమ్ముము నీవు
తిరిగి వాలితో పొరగపొమ్ము
నాకు తెలిసెడి గుర్తు ధరింపుము
వాలికూలు-నా వాడి బాణమున''

అనుచు పలుకుచు రామచంద్రుడు
గజపుష్పమ్ముల తీగనొకటి గని
లతను-హారముగ-కపికి వేయగా
లక్ష్మణమూర్తికి ఆదేశించెను.

సౌమిత్రపుడు లతాహారమును
రవిసుతు మెడలో వేయగ నతడు
తారాకాంతుల వెలిగెడి రవియై
తిరిగి పోరగా బయలు దేరెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 1 3 వాలితో పోరుకు సుగ్రీవుడు రెండవమారు వెడలుట

రామచంద్రుడు రవి కిరణములగు
శరములు - ఘనమగు వింటితొ నడువ
లక్ష్మణమూర్తి సుగ్రీవులు ముందై
నలుడు-నీలుడు-తారుడు-హనుమలు

అనుసరించగా-సుందరమయిన
పూపొదలను మరి పక్షిగుంపులను
పూల బరువచే వంగిన తరువుల
తటాకాలను గిరి ప్రదేశములు

వైడూర్యములన-మెరసెడి ఆకులు
సిగ్గునిండిన మొగ్గలుండినది
విరసిన కమలము లుండిన కొలను
శుభముగ కన్నుల కగపడె నచట

కారండవములు హంస బెగ్గురులు
నీటికోళ్ళు మరి చక్రవాకములు
మధురస్వనములు నింపెనుమడుగుల
పచ్చిక మేసెడి జింకల గాంచిరి

నడచుకొండలు-కారుమబ్బులన
తిరిగెడి గజములు-తటాకాలను
కలవర పెట్టుచునీటిని చిమ్ముచు
గట్లను త్రోయుచు-కనబడె నచట.

రామచంద్రుడట ఒక ప్రదేశమున
చిక్కగనున్న తరువులగాంచి
ఒప్పుమీరగ పెరిగిన వనము
వివరముచెప్పగ కోరె రవిసుతుని.

సాగుచు పలికెను సుగ్రీవుడట
''సప్త. జనులను-ఋషులేడుగురు
శిరసులు భువిపైనుంచి - తపసుతో
ఏడు దినములకు ఒక్క తడవనే.

వాయుభక్షణ చేయుతాపసులు
నీటియందునే నిద్రించుచును
ఏడువందల సంవత్సరములు
తపసుచేసి - రవి తేజులాయిరి.

తపసు ఫలించగ-తనువుతోడనే
నాకము చేరిరి ఆ మహాత్ములు
వారి మహిమచే-చెట్లుచుట్టిన
వనము-చొరగను శక్యముకాదు.

దేవాసురులకు భయము-దీనిగన
పక్షులు జంతువు లిందడుగిడవు
అడుగిడెనా మరి దారితోచక
వనమున తిరుగుచు-వెలువడలేవు.

ఆభరణమ్ముల సుందరనాదము
ఆనందమగు మంగళ వాద్యము
మృదుభాషణలు-సుర సంబంధపు
పరిమళ వాయువు వీచును ఇచట.

రామా! చూడుము త్రేతాగ్నులవి
వెలుగుచున్నవి- గాలికి ఆ పొగ
తరుశాఖలలో యెఱ్ఱని కాంతితొ
కపోత కంఠము రంగును పోలెను.

తరువులపైన ఆ పొగ నిండగ
కాననమందలి వృక్షములన్నీ
మేఘకాంతిచే- ఆకుల వన్నెచె
వైడూర్యముల కొండగ తోచును.

రామా! నీవు అనుజునితోను
ఇచ్చటనుండే మ్రొక్కుమునులకు
మునులకు మ్రొక్కిన-వ్యాధులంటవు''
అనగా మ్రొక్కిరి దాశరథులట.

మునులకు మ్రొక్కి తేజమునిండి
రిపుసంహరణకు సంసిద్ధుడయి
భద్రమూర్తిశ్రీరామచంద్రుడు
వాలియేలు కిష్కింధనుగాంచెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 14 సుగ్రీవుడు సింహనాదముతో వాలిని పోరుకు రమ్మనుట

రోషమునిండి సుగ్రీవుడట
మేఘగర్జనము చేసెను అపుడు
తేజోవంతుడు అయిన రామునితో
నగరము జూపుచు పలికెను అంత.

''కావలి కపులను వల- గలిగినది
యంత్ర రక్షణనున్న నగరమది-
నీ మాటలవి ఫలించు తరుణము
వచ్చెను రాఘవ- గను కిష్కింధను''

రాముడు పలికెను అనునయముగను
''అర్కసుతా! నువు పుష్పమాలతో
చుక్కలు చుట్టిన సూర్యుని మాదిరి
వెలుగుచుంటి వది - అశుభము వాలికి.

వాడి బాణమున భ్రాతృకంటకుని-
కూల్తును - వానిని కనబడనిమ్ము
కనబడి- వాలి బ్రతికిన అపుడు
నను నిందించిన సరియగునయ్యా!

భయమును వదలుము సూర్యనందనా!
నా ప్రతిజ్ఞ నెరవేర్చెద వినుము
వాలిని యుద్ధోన్మత్తుని చేసెడు
సింహనాదమును చేయుము ఇపుడే.

శూరుడు - శత్రువు ఘనతకు లొంగడు
అబలల ముందవమానము నందడు
ఓటమి శంక మదిలో కలిగిన
దురాగ్రహముతో ముందుకురుకును.''

దశరథనందను ధైర్యవాక్కులతో
రవిసుతుడంతట ఉఱుమై ఉఱిమి
దిక్కులవియగా నాదము చేసెను
సంద్రపు ఘోషగ ధ్వని వినిపించెను.

మేతకు పోయి వచ్చెడి గోవులు
భీతిలిపరుగిడు చందముగాను-
అరాచకములో- కులస్త్రీలందరు
దుష్టులకందక చెదరిపోయినటు.

యుద్ధభూమిలో దెబ్బలు తిని- మరి-
పరుగిడుఅశ్వము లన్నతీరుగా
పరుగిడె మృగములు- పక్షులన్నియు
నింగిని వదలి నేలకు రాలెను.

పక్షులు నేలకు రాలిన చందము
పుణ్యము తరిగి పుడమిని రాలిన
గ్రహముల తీరుగ నుండగ నపుడు
ఎగసిన ధ్వనిఅట వాలిని పిలచెను.

॥శ్రీ రఘురాముని॥

## 15 వాలిని యుద్ధ విముఖునిగా చేయుటకై తార ప్రయత్నించుట

సుగ్రీవుని కంఠము వినబడినంతనె
అంతఃపురమున వాలి లేచెను
మత్తు జారెను- కోపము హెచ్చెను
సంధ్యాసూర్యుని చందమాయెను.

గ్రహణము నాటి సూర్యుడాయెను
క్రూరమైన తన కోఱలు మెరయగ
మంటగ మండుచు, కలువలు లేని
మడుగురీతిగా కాంతులు తరిగెను.

పండ్లు పటపట కొరుకుచు నతడు
ధరణి పగులనటు త్రొక్కుచు నపుడు
యుద్ధము చేయగ బయలుదేరగా
తార- ప్రియముగ కౌగలించుకొని

శుభకర వాక్కులు పలుకగ నేర్పరి
భయముతొ- భర్తకు మేలు కలుగగా
పలికెను-''కోపము ఏటి నీటివలె
వచ్చిన దానిని వదలుట మేలు

రాత్రి ముడిచిన మురిపెపు సుమములు
తెల్లవారగనె తీసివేయునటు
వదలుము కోపము- ఉదయముకాగా
పోరిన- రాదు నీ కపకీర్తి

ఇపుడే పోరుకు పోయిన నీకు
అపకారమది ఏమని అనిన
ఇంతకుముందే నీచే ఓడిన
వైరి - ఇంతలో వచ్చున బలముతొ?

పరుగిడె ప్రాణము నిలుపుకొనుటకై
పోరగవచ్చి పిలచెధైర్యముతొ
సాహసమెటులవచ్చెనొ తెలియుము
నా మదికెంతోసందేహమది

మునుపటి మాదిరి సింహనాదము
కానేకాదు- కారణమేమొ?
బలము - ధైర్యము - గట్టి ప్రయత్నము
కనబడుచున్నది - కారణముండును

అతి బలమైన సాయము తోడై
అజికి పొమ్మనిధైర్యము నిడనిచొ
అంతటి గొప్ప సింహనాదమును
అర్కసుతుడు- మరి చేయడు నాథా!

నేర్పరి తనము తెలివి తేటలు
పుట్టుకతోనే నేర్చెరవిసుతుడు
బలము గ్రహించక సాయము నందడు
అల్పుల చేర్చుకు పోరగ రాడు

నా ప్రాణేశ్వర-నే నిటు పలుకుట
వట్టి ఊహయని మదిలో తలచకు-
అంగదు డింతకు ముందేతెలిపెను
వేగులవలన వినిన వార్తను

అయోధ్యాపతి తనయు లిద్దరు
రఘువంశమున పుట్టిన వీరులు
రామలక్ష్మణుల పేరున బరగెడు
అజేయులయిన సోదరులిరువురు

ఋష్యమూకమున సుగ్రీవునితో
చెలిమిచేసిరి-వారిలో రాముడు
వినుత కీర్తియై వెలయు విక్రముడు
ఉచితానుచితము లెరుగును బాగుగ

సాధు జనులకునీడ నిచ్చును
ఆర్తజనులకు మహాగతియగు
బాధితులందర కభయ ప్రదాత
విస్తారకీర్తికి నెలవగు రాముడు.

జ్ఞాన విజ్ఞానపు సంపన్నతతో
సకల ధాతువల నెలవు హిమగిరిగ
సకల శుభముల కల్యాణ గుణముల
స్థానము-రాముడు దశరథ తనయుడు

సత్యవాదిగా తండ్రిని చేయగ
కదలె కానలకు ఆ రఘురాముడు
అమిత విక్రముడు-అజేయుడతడు
మహాత్మునితొ మరి విరోధమేల.?

నీ దోసములను ఎంచుట కాదు
చులకనగా నిను చేయుటలేదు
నే నుడివినటు వానరేశ్వరా
చేయుట శ్రేయము కోపించకయా!

వీరులందు-నువు అగ్రగణ్యుడవు
కానీ,నీ సరి వీరుడుండును
రామునితో నువు కలహించకుము
తమ్ముని చేయుము యువరాజుగను

నా ఆలోచన చెప్పితినేను
నీకు తోచినటు చేయుము నీవు
బలమున నీకు ఈడగువాడు-
నీ తమ్మునితో వైరము వీడుము

రామచంద్రునితొ సఖ్యము చేయుము
సుగ్రీవునిపై వలదు మత్సరము
అటుల చేసిన-రాముడు నిన్ను
ద్వేషించకను దరి చేర్చుకొను

నాథా! నీకు సోదరు డొకడే
అన్నా! అని ఆప్యాయముగాను
పిలచెడివాడు-విధేయుడతడు
ఉత్తము గుణములు కలిగినవాడు

కపివీరులలో-సుగ్రీవునితో
సరిపడు బలము ఎవ్వరికున్నది?
దుష్టుడుగాడు-ధిక్కరించడు
సద్గుణయుతుడు-గురిగలవాడు

తండ్రివైపు నీ బంధువు అతడు
మిగిలిన బంధువు లందరు కూడ
తరుణులవంక వచ్చినవారే
కావున అసలగు బంధువు అతడే

అనుజుడు కాడా ఆ సుగ్రీవుడు?
ఏకగర్భ సంజాతులుకారా?
శత్రువుకాదు-బంధువునీకు
కావున -నీదరిచేర్చు ప్రియముగ

నీ మేలు కోరెడి దానను నేనని
నిండుగ నీవునమ్మిన ఎడల
నాపై ప్రేమ నిండిన భర్తవు-
ప్రియమగు కార్యము చేయగ నెంచిన

నీ తమ్మునితో స్నేహము చేయుము
సుగ్రీవునిపై క్రోధము వీడుము
తప్పు యోచనముకాదిది నాథా!
నీకు మరియొక మార్గములేదు.

ప్రాణేశ్వర! నా మాటలు వినుము
కరములు మోడ్చి ప్రార్థించితిని
కోపము వలన మేలు కలుగదు
కీర్తి కరము మరి కానే కాదు

అమిత విక్రముడు ఇంద్రతేజుడు
రామచంద్రునితో వైరము వలదు
వలదు వలదని''-తార పలికి నను
వాలి వినకనేతిరిగి పలికెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 16 వాలి సుగ్రీవుల యుద్ధము-రామబాణముచే వాలి కూలుట

బుద్ధిబలములో మిన్నగు తారతో
నక్షత్ర సమమగు నఖములు కలిగి
నీతి విద్యలో నేర్పరియైన
భార్యతో పలికెనుకోపమునిండి

''చంద్రముఖీ! ఇటు,పలుకుట,తగునా?
తమ్ముడు వాడు- అయినచో మరి
అతిశయించిన బలగర్వముతో
పోరుకు పిలచున సింహనాదముతో

ఇట్టివానినా-నే క్షమించుట
శూరుల కుండున ప్రాణపు తీపి
అపజయమెరుగని-వెనుకడు గిడని
శూరుని చావు-అవమానమె కద?

మీదకు వచ్చి-సింహనాదము
చేయువాడు మరి శూరుడగు నట
బలహీనుడనై ముందుకురాక
పడివుండెడి గతి-నే సహింతునా!

రామచంద్రుడు చంపును అనుచు
భయపడుచుంటివి కారణమేమి?
రాముడు-నా కపకారము చేయడు
ధర్మమూర్తి మరి చంపున నన్ను?

నీవు స్త్రీలతో అంతి పురమునకు
పొమ్ము-నేను మరి పోరుకు పోయెద
నాపై ప్రేమ నిండిన నీవు
పలికిన దంతయు వింటిని నేను

బలమున చాలడు-గొంతే లేదు
అట్టివాడు మరి సింహనాదమును
చేసిన - నేను భరించగలనా?
భుజ బల శౌర్యము చూపివత్తును

ముష్టి ఘాతముల కలబడి పోరి
సుగ్రీవుని బల గర్వము నణచెద
చంపను వానిని-నమ్ముము నన్ను-
నా ప్రాణముపై శపథము చేసితి

నా జయమును నువు కోరుకొనుచును
మరలిపొమ్ము మరి అంతి పురమునకు''
అనగా తార ప్రదక్షిణించి
మంత్ర పూతముగ మంగళ మనుచు

హీన స్వరముతో రోదించుచును
మిగిలిన స్త్రీలతొ లోనికి పోగా
ఇనుమడించిన కోపము తోను
పోరగపోయెను వాలిఅంతట

రోషము నిండి నిట్టూర్పులతో
వైరిని చూడగ నలువంకల గని
ఒకచో-మండెడి అగ్ని తీరుగా
నేలను తన్ని నిలబడినట్టి

బంగరు ఛాయతొ వెలుగు సుగ్రీవుని
గాంచిన వాలి - దట్టి బిగించి
ముష్టి బిగించి బంగరు మాలతొ
ముందుకు రాగా రవిసుతుడంతట

ఎదురు రాగను వాలి పలికెను:
''వజ్రము వంటిది ముష్టిఘాతము
నీపై బడును-పారిపోకుము''
అన సుగ్రీవుడు తిరిగి పలికెను:

''నీ తల-నా యీ ముష్టిచె నిపుడే
చితుక గొట్టెద-సందియమెందుకు?''
అనగా వాలి ఒక్కటి మోదగ
నెత్తురు కారెను రవిసుతునకును.

తిరిగి సుగ్రీవుడు తరువును బెరకి
గిరగిర త్రిప్పి వాలిని కొట్టగ
అతి బలశాలి వాలి అంతట
గడగడ వణకుచు విల విల లాడెను.

తమ్ముని దెబ్బకువాలి అచ్చట
బరువుతొ నిండిన పెద్ద ఓడ-అది
పెను తుఫానుకు ఊగి నట్టుగా
ఊగిపోయెను-కలవరపడెను.

వాయువేగము గరుడ వేగము
కలిగిన వీరులు వాలి సుగ్రీవులు
ఒకరిని ఒకరు జయింపగోరి
వెనుదీయక మరి పోరసాగిరి.

ఆకాశములో సూర్యచంద్రులన
వెలుగుచు వారు పోరగ నంత
వాలి బలమది క్రమముగ హెచ్చెను
రవిసుతు బలము తగ్గె క్రమముగ.

వాలి బలముచే విక్రమమంతయు
చెదరి-సుగ్రీవుడు రోషము నిండి
యుద్ధము చేయుట కొనసాగించెను
పట్టుదలతొ మరి పోరసాగెను.

ముష్టిఘాతముల-పెద్ద తరువులతొ
నఖముల గీరుచు-కాళ్ళతొ తన్నుచు
ఒకరిని మించిరి మరియొక రన్నటు
పోరసాగిరి సోదరు లిరువురు.

మీద దుముకుచు చెట్లచె కొట్టుచు
నేల నీడ్చిమరి పిడికిట గ్రుద్దుచు
ముఖాముఖిగను కలయబడుచును
వాసవ-వృత్ర సమరము చేసిరి.

కన్నుల గాంచెను రామభద్రుడు
భయంకరమగు తేజముతోను
వాలిని చంపగచాలిన బాణము
ప్రియదర్శనుడు విసురుగ తీసి

వాలి బలము మరి హెచ్చిపోయెను
రవిసుతు బలము క్షీణించగను
దెబ్బలు తినిన సుగ్రీవుడట
నలువంకలకు గలయజూచెను.

అల్లె త్రాటికి బిగించి నిలచెను
అల్లదె లేచెను- టంకారధ్వని
నింగిని పక్షులు నేలను మృగములు
నిలువ లేక మరి నేలను బడెను.

మిక్కిలి బాధలో నున్న మిత్రుడు
అభయమునందిన ఆంతరంగికుడు
కన్నుల ముందర రిపునికి లొంగి
ప్రాణాంతకమగు బాధను పడగా

వజ్రాయుధమన-వేగము గలిగి
పిడుగు పడినటు వచ్చినబాణము
రాఘవు చేత వదలబడినది
వాలి రొమ్మునసూటిగ తగిలెను.

రామ బాణమది రొమ్మున నాటగ
ఆశ్వయుజమున పున్నమినాడు
కూలినయట్టి ఇంద్రధ్వజమై
వాలి అంతటధరణిని బడెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 17 వాలి శ్రీరాముని నిందించుట

మొదలు నరికిన మ్రానై పడెను
నేలను కూలెను వాలి అంతట
చంద్రుడు లేని ఆకాశము వలె
ధరణి తేజము సన్న గిల్లెను.

వాసవు డొసగిన బంగరుదండ
మేలగుకాంచన హారము మెరయగ
సంధ్యా సమయము- ఎఱ్ఱని కాంతితో
వెలిగెడు మేఘము - అన్నటు తోచెను.

వీరుడు వాలి నేలబడి నను
పరాక్రమమ్ము-తేజము విడువక
ఇంద్రదత్తమగు హార మహిమచే
ప్రాణమ్ములను నిలుపగ చాలెను.

కాంచన హారము మెరయుచుండగా
ఘనమగు శరము రొమ్మున నుండగ
నిర్మలమయిన దేహము తోను
మూడు వన్నెల వెలిగెను వాలి

రిపుల కూల్చగా చాలిన వాలికి-
నాకలోకము పంపగ చాలిన
రాఘవు వింటిచె వెడలిన శరము
ఉత్తమ గతిని కలిగించినది.

జ్వాలలు తగ్గిన అనలము వోలె
ప్రళయములో మరి జారిన రవియై
పుణ్యము తరిగి పుడమిని బడిన
యయాతి తీరుగ నుండిన వాలిని

సురవతి వలె ధిక్కారము నెరుగని
మృగరాజంతటి ఠొమ్ము గలిగిన
దీర్ఘ బాహువుల వెలిగెడు వాలిని
తేజము నిండిన వదనము గలిగి

తననే కొట్టిన అతి బలశాలిని
మెచ్చుకొనుచు తా-చూడగ నెంచి
నలు దిక్కులకు చూచెడి అగ్నిని-
రాముడు చేరెను-అనుజునితోను

అక్ష్మణమూర్తితొ చెంతకు చేరిన
అతి పరాక్రముడు రామచంద్రుని
చూచిన వాలి-ధర్మము, వినయము
నిండిన కఠినోక్తులతో పలికెను:

''రామా! నీవు రాకుమారుడవు,
శాస్త్ర జ్ఞానము కలిగిన వాడవు
గొప్ప కులమున బుట్టిన వాడవు
కీర్తి-తేజము కలిగిన వాడవు

అంతటి వాడవు ఆహవభూమిలొ
నీపై దృష్టి నిలపని వాడిని
వీరునిగా-నే పోరుచుండగా
ఠొమ్మున గొట్టుట ఘనమగు పనియా?

రామచంద్ర! నిను హితునిగ తలచుచు
దయాలక్ష్మికి నెలవుగ నెంచుచు
ఉచితా నుచిత జ్ఞానమూర్తిగా
లోకులు పొగడుచు నుండిరి కాదా?

పోరగబోకుము సుగ్రీవునితో
అతనికి రాముడు తోడని-తార
చెప్పిన వినక -వచ్చితి పోరుకు
రాజ గుణములు కలవని తలచితి.

శమ దమాదులు- ఓర్పు - ధర్మము
ధైర్యము-సత్యము-పరాక్రమమ్ము
అపరాధులనే దండించుటవి
రాజులకుండెడి సద్గుణంబులు

అట్టి గుణములే నీలో కలవని
గట్టిగనమ్మి-వచ్చితి పోరుకు
మట్టుపెట్టితివి- ఎట్టి వీరుడవు!
ఇట్టి అకార్యము చేయుట తగునా?

గొప్ప గుణములతొ శోభిలువాడవు
హేయ కార్యమును ఏలచేతు వని
ఇతరులతో- నే పోరుచుండగా
నన్నే విధముగహతమార్తువని

నిన్ను మున్ను మరి చూడకుండుటచె
మోసపోతిని నేల కొరిగితి
ఏ విధి నాతో పోరును అనుకొని
వచ్చితి నేను- నిజము నెరుగక

పచ్చికకప్పిన బావివినీవు-
బూడిద కప్పిన చిచ్చువు నీవు
పాపపు నడవడి- రాజ వేషము
మాయల మారివి- తెలియగనైతిని.

నీ ముఖమును నే నెరుగను కాదా!
నీ నగరము నే నెరుగనుఅసలే
నీ కపకారముచేసి ఎరుగను
నాపై నీకు కలహము ఏల?

ఈ వనసీమల కాయల కొరుకు
శాఖామృగమును- విరోధిగాను
అట్టి నన్ను- నువు ఈవిధముగను
చంపుటకేమి కారణమయ్యా!

రాచకులమున పుట్టిన వాడవు
వేదాధ్యయనము చేసినవాడవు
తేజము గలిగి జ్ఞానము నందియు
ధర్మాత్మునిగా వేషము దాలిచి

లోకమునకు మరి కీడుచేయుటకు
ఏ విధినీకు మనసుగలిగినది
క్రూర కార్యములుచేసెడి నీవు
పెద్దమనిషిగ ఏల నటించుట?

సామ దానములు- శౌర్యము- సత్యము
క్షమా- ధర్మము- ధృతితో- దుష్టుల
దండించుటవి రాచగుణములని
బుద్ధిమంతులలొ శ్రేష్ఠులు చెప్పిరి.

ఫలమూలములు తిను వనచరులము
పురుషుడవీవు మనుజోత్తముడవు
మృగముల మైతిమి కానీ- రామా!
మనుజుడవై మరి - మసలుట ఇటులా?

భూమి గాని మరి బంగరుగాని
రజితముగాని కలహ కారణము
నే తిను ఫలములు- దుంపలు- నీకు
లేక పోవునని చంపితివా నను?

మంచిమాట మరి అనుగ్రహములు
మంచి రాజుల సొమ్ముయి వెలయును
దుర్వినయము మరి కీడొనరించుట
దుష్టభూపతుల పాలైయుండును.

కానీ రామా! నీలో రెండును
మేళవించి మరి యున్నవి కాదా?
స్వేచ్ఛగ- రాజులు చరింప జాలరు
ధర్మబద్ధులై యుండగ వలెను.

ఇంద్రియాలకు వశుడవు అయి నువు
కోరికలన్నీ తీర్చుకొనుటకై
మంచి చెడ్డల మిశ్రమ మయితివి
విల్లు చేతగొని విర్రవీగెదవు.

ధన మార్జించగ నియమము లేదు
ధర్మము నందభిమానము లేదు
కోరికలకు నువు-మన సందించి
మనసగు రీతిని చరించుచుంటివి

నిరపరాధిని- దోషిని గాను
నన్ను చంపితివి నీవీ శరమున
నిలబడి సజ్జనులందరి ముందర
నీవే జవాబు చెప్పెదవయ్యా?

జీవ హింసను చేసెడి వాడు
చోరుడు-నెపములు చెప్పెడివాడు
గురు భార్యను తను పొందినవాడు
రాజ హంతుకుడు-నాస్తికు డున్నూ

గోవధ చేసెడిదుర్మార్గుడును
అన్నకన్న-తను ముందుగ పెండ్లై
చరించు జనులు అందరు కూడ
నరకవాసులై పడియందురు కద!

సజ్జనులగు నీ వంటి జనులు మరి
నా మాంసమును తినరుకదయ్యా!
నా చర్మము మరి నా ఎముకలవి
నా రోమములు పనికే రావు.

ఐదుగోళ్లు కల జంతువులందు
అళువము-ఉడుము-తాబేలున్నూ
ఏదుపంది మరి చెవుల పిల్లియు
మాంస భక్షణకు నిర్ణయించినవి

మాంస భక్షణకు నే కొరగాను
చంపితివేల-తెలుపుము నీవు?
ఎముకలు-చర్మము ముట్టగ రానివి
మట్టు పెట్టుటకు కారణమేమి?

తార చెప్పిన హిత వచనమ్ములు
కాలదన్ని, నే బుద్ధి హీనతతొ
వచ్చిన దానికి-ఫలితము నేను
అనుభవించుచు నుంటిని కాదా?

ధరణీనాథుడవని నువు తలచకు-
నీచుడు-ధూర్తుడు భర్తగ నున్న
శుభ శీలియగు స్త్రీ ఇలనెపుడు
భర్తృహీనయని తలంచ వలెను.

అపకారమన్నది ప్రధానమైనది
నీచమయిన మనసున్నవాడివి
జితేంద్రియువలె నటించువాడవు.
పుట్టితి వెటుల దశరథు కడుపున?

అంకుశమ్మును లక్ష్యపెట్టక
వక్రమార్గమున చరించునట్టి
హస్తిమాదిరి - అధర్మవర్తివి
నాదు కర్మ-నీ పాల బడుటది

ధర్మము-జ్ఞానము నిండిన వృద్ధులు
ఛీఛీ! అను దుష్కార్యముగాదా?
ఏ ముఖముతొ వారందరి ముందు
నిర్భయమ్ముగా తిరిగెద వయ్యా!

ఎంతటి మగసిరి కలిగినవాడవు-
ఆలి అపహరణ చేసిన వానిని
ఏమి చేసితివి? నీ మగతనము
తటస్థుపైన చూపితివయ్యా!

రామా! ఎదిరి పోరిన పస అది
త్రుటిలో యమపురి కంపియుందును
మత్తుడు- నిద్రలో పాము వాతబడె-
అటులె చచ్చితి- కనబడకుంటివి.

రామా! నీ కథ తెలుపక పోతివి
సుగ్రీవునితో చెలిమి చేసి- మరి
నను చంపుటకు కారణమేదియొ
తెలిసిన- నేను నా శౌర్యముతో

కపట చిత్తుని ఆ దశకంఠుని
అజిని కొట్టి నిలబెట్టెదను
ఒక్కపూటలో నీ సతి సీతను
నిలుపజాలుదు నీ సమక్షమున.

'శ్వేతాశ్వతరి' - ఉపనిషత్తును
మధుకైటభులు అపహరించిరి
హయగ్రీవుడై శ్రీహరి - కడలిలో-
దాగిన వారిని సంహరించి- తను

వేదశృతిని తెచ్చెను- వింటివ
అటులే నేను సీతాదేవిని
తేగల చాలుదు- తెలియక పోతివి
తగని వానితో నెయ్యమేలయా?

నే మరణించిన లాభము కలుగును
కిష్కింధేలగ సమయము వచ్చును
కావున తమ్ముడు- నను చంపుటది
సమంజసముగా తోచును కాదా!

కానీ నీకు ఏమి లాభము?
రాజ్యమురాదు రమణీ రాదు
వక్ర మార్గము అధర్మమైనది-
న్యాయమైనది చెప్పగరానిది.

పుట్టినవాడు గిట్టుట తప్పదు
ధరణిని బ్రతుకు శాశ్వత మెవరికి?
చావుకొరకు- నే వ్యధ నొందనయా
శౌర్యము చూపక చచ్చితి నేను.

శూరుల మార్గము తప్పించితివి
శూర మర్యాదను దాటించితివి
సమాధానము ఏమి చెప్పెదవు?
వెదకుము యుక్తికి తగినదానిని''

అనుచు పలుకుచు శరవేదనతో
నోరంతయును ఎండిపోవగా
దేహమంతయు మంటలు మండగ
వాలి పలికెను తేజము తొలగి.

॥శ్రీ రఘురాముని॥

✤✤✤

# 18 శ్రీరాముని ధర్మసూక్ష్మ వివరణ

ధర్మార్థముతో- కఠినముగాను
వాలి పలికెను- అవివేకముగా
కాంతులులేని రవివలె నుండెను
జలములులేని మేఘమాయెను.

చల్లారిన అగ్నిని పోలియుండెను
అంతట రాముడుపలికె వాలితో-
శరము వదలుట ధర్మము యుక్తము-
అర్థ కామములు గలవని అనుచు.

''ధర్మార్థకామములు వానరరాజా!
పురుషార్థములు- మూటిని నీవు
శాస్త్ర ప్రకారము తెలియక పోయి
లోకాచారము కూడను తెలియక

తారుమారు మరి చేసిన వాడవు
తిరిగి నన్ను- నువు చపల బుద్ధితో
దూషించితివి- తెలిపెద తీరుగ
అడుగక పోతివి పెద్ద లెవ్వరిని.

గిరులు- తరువులు- తోటలు- తోపులు
నిండిన పుడమి- అంతయు వినుము
ఇక్ష్వాకుల నుండి మా వంశమున
మా మహారాజుల పాలన నున్నది.

సార్వభౌములు వారని తెలియుము
సామంతుడవు స్వతంత్ర తేది?
సర్వ జనులను- మృగముల- పక్షుల
రక్షించుటది సార్వభౌముడే!

పురుషార్థములు పూర్తిగ తెలిసి
దుష్ట శిక్షణ- శిష్ట రక్షణ
సత్యము- నీతి- వినయ శౌర్యములు
కలిగిన భరతుడు రాజై ఏలగ.

రాజ్యము నాకు లేకపోయినను
ధర్మపాలన సాగుచునున్న
భరతుని పాలన - ధర్మ వంతముగ
సాగుట కొరకై - కొందర మిటుల

భూమిని తిరుగుచు ధర్మరక్షణ
చేయుచుంటి మని తెలియుము నీవు
ధర్మహాని మరి చేసినవాడు
శిక్షనందుటే భరతుని పాలన.

పూర్వము- రాజులు ధర్మరక్షణకు
దేశము నందు నలు మూలలకు
అధికారులను పంపుట తెలియుము
సామంతుని- కర్తవ్యము- ధర్మము.

అధర్మమేమి చేసితి నందువ
చెప్పెద వినుము ఓ బలశాలీ!
ధర్మ మార్గము వదలి - కామముతొ
చరించు టిటులా? రాజ ధర్మమా?

ధర్మ వర్తనము నున్న వారికి
తండ్రితొ సమము- గురువు- అన్నయు-
తమ్ముడు- శిష్యుడు- కన్న కుమారుడు
సద్గుణవంతులు- అయినచొ కొడుకులు.

ఓ వానరుడా! ధర్మమన్నది
దేహేంద్రియముల కందని దయ్యా!
పండితులయిన వారలకైనా
ధర్మసూక్ష్మములు అందక పోవును.

ధర్మము వదలి- కామము నిండి
అడ్డగించెడి వాడే లేడని
నీతి తప్పాట- తమ్ముని భార్యను
పొందుట తప్పా- చంపితి నందుకు.

చరా చరములలొ ఆత్మగ నుండి
హృదయాంతరములొ వసించునట్టి
పరమేశ్వరునికిసంపూర్ణముగా
సర్వము తెలియును- నీ కెటు తెలియును?

జనహిత మెంచక- ధర్మము విడచి
దుష్ట గర్వమున చరించు వానికి
కట్టుబాటులు వదలిన వానికి
దండన మాత్రమె తగినది వినుము.

నాకు తెలియక పోవుట ఏలని
నీవు అడిగిన- నీతో నుండెడి
సహాయు లందరు వానరులే కద
మూఢులు మరియు చపలమతులయా!

క్షత్రియ కులమున పుట్టిన నేను
భూమి నేలు రాపట్టి సోదరుడ
రాచ లక్షణము- ధర్మ రక్షణము
నీతి నిలుపుట కీర్తి గడించుట.

పుట్టు గ్రుడ్డితో మరియొకడట్టి
పుట్టు గ్రుడ్డియే చేరి నట్టుగా
తెలియని వానితొ తెలియని యట్టి
తోడు చేరిన- తెలియుట శూన్యము.

ధర్మ దూరమగు పనులను చేయుచు
పాపము చేసెడి కాముకుడవగు
నిన్ను నేను మరి సహించు టెటుల?
దండించుట- సరి- రాచపట్టినై.

నే నుడివెదవిను స్పష్టముగాను
కోపము నిండి నను నిందించకు-
నిను జంపుటకు కారణ మిదియే
తమ్ముని భార్యను చేపట్టితివి!

కూతురు- సోదరి- మరదలు ముగ్గురు
ఒక్క వరసతో ఆదరించ నగు-
వారలతో మరి పొందు నందిన
శాస్త్ర ప్రకారము వధ్యుడు వాడు.

నీ సోదరుడు బ్రతికి యుండగా
కాముకుడవయి ఆతని భార్యను
కోడలు అగు- ఆ రుమను పొందుట
దుష్కార్యము- మరి అసత్యమా అది?

నిజమగు నెయ్యము నే చేసితిని
సౌమిత్రియు సుగ్రీవుడు నొకటే
నెయ్యము ఫలము రాజ్యము- లక్ష్మియు
ఆలిని పొందుట చాలు మిత్రునికి.

అట్టి మిత్రుని అండగ నుంటిని
ఆలిహర్తను కోలను కూల్చి
రాజ్యము-రమణిని ఇచ్చెద ననుచు
నే చేసితిని ప్రతిజ్ఞ వినుము.

అందరిముందు ప్రతిన చేసితి
మిత్రుని హితము కోరి చేసితి
ధర్మ రక్షణము నిలుప కోరితి
రాచవంశపు కీర్తి నిలిపితి.

కొండలు-కోనలు-వనములు-నీవని
పాలించెడివి- ఇక్ష్వాకులవి
కావున నీవు సామంతుడవు
దుష్టశిక్షణ సార్వభౌమునిది.

కట్టువస్త్రముల తమ్ముని తరిమి
తమ్ముని భార్యను చేపట్టితివి
తమ్ముని భార్యను పొందినవానికి
మరణదండనమె శాస్త్ర సమ్మతము.

సజ్జనులందరు మెచ్చగ తగిన
ధర్మకారణములున్నవి గనుకనె
కన్నుమిన్నును-కానక తిరిగెడు
నిన్ను నేను మరి చంపితినయ్యా!

ధర్మము నెరిగిన మిత్రుడెప్పుడూ
ధర్మచరితునికి సాయపడవలె
ధర్మము నీకు తెలిసిన నెంచుము
పాపకర్మ కిది ప్రాయశ్చిత్తము.

సదాచారులు ఆచరించునవి
పండితు లంగీకారము నందిన
ప్రమాణమైన మనుసూక్తులను
చెప్పెద వినుము-వానర రాజా!

పాపము చేసిన జనులందరును
రాజు చేతిలో శిక్షను పొందిన
నరకము కేగక-పాపము తొలగి
ఇంద్రలోకమున నుందురు వినుము.

చోరుని-రాజు, దండించుటయో
నిర్దోషిగను పరిగణించుటో
జరిగిన-చోరుని పాపము తొలగును
రాజ నిర్ణయము ధర్మ నిర్ణయము

పాపిని-రాజు దండించనిచో
పాపము-రాజుకు చుట్టుకొనునయా!
ఇంద్రకుమారా! వింటివ తీరుగ
ధర్మమన్నది శిరోధార్యము.

ధర్మాత్మునిగా కీర్తి గడించిన
మా పూర్వీకుడు-మాంధాత-మరి
అధర్మవర్తిని ఒక సన్యాసిని
నిర్దయగా దండించుట తెలియుము.

రాజులు-తొలుత ఏమరియుండగ
అధర్మపరులై కొందరు నడచిన
పిదప-వారిని గ్రహించి రాజు
దండించిన మరి పాపము తొలగును.

ధర్మభ్రష్టులై చరించువారిని
గ్రహించి- రాజు శిక్షించినచో
వారి పాపము తొలగుటె గాక
రాజు- స్వర్గము చేరగ నర్హుడు.

కావున నీవు వంత నొందకుము
ధర్మమార్గమున- ధర్మము కొరకు
దునిమితి నిన్ను- ధర్మ విషయమున
నేను కూడ మరి అస్వతంత్రుడను.

భరతుని పాలన సాగుచున్నది
ఇష్టాయిష్టము సాగ నియ్యము
కష్టమయినను ధర్మము నెరవుట
సామంతునిగా నీ కర్తవ్యము

మనుజుని కాను- మృగమునంటివ
ధర్మాధర్మము తెలియదంటివ
మృగమును చంపుట- వేటాడుటయు
రాజకులములో సదాచారము

మాంస భక్షణకు- జనులు ఎన్నియో
మాయలు పన్ని- జంతువులను మరి
హతమార్చినను- అట్టి జనులకు
పాపము అంటదు తెలియుము నీవు

వలలు పన్నుచు- ఉచ్చులు వేసి
పల్లముచేసి ఆకుల కప్పి
వివిధోపాయము లుపయోగించి
వేటాడెదరు జంతులనిలలో

వ్రణముచె బాధను పడెడి రోగికి
వైద్యుడు- శస్త్ర చికిత్స చేయును
రోగి యిష్టము అయిష్ట మన్నది
తలచడు వైద్యుడు- కర్తవ్యములో

రాజులు అటులే ప్రజల మంచికై
వారి ఇష్టము అయిష్టమెంచక
ధర్మ మార్గమున వారి రక్షణకు
తగినదానిని చేయుట ధర్మము

ప్రజలహితమునే రాజులు కోరుచు
ప్రజాహితముకై పనులను చేయగ
దోషులు కష్టము కలిగెనను కొని
రాజును చంపక- నిందించకను

రాజధిక్కారము నెంతయు సలుపక
రాజు చర్యలను పరిహాసింపక
ఉండుట యుక్తము- ఏలన- సురలు
ధర్మరక్షణకు రాజులగుదురు.

దేవతలే మరి దిగివచ్చెదరు
ధర్మము నిండిన పుడమిని- వారు
దయతో చల్లగ నేలుచుందురు
దుష్టశిక్షణ చేయుచుందురు

ధర్మ సూక్ష్మము మదిలో తలచక
శరము విడచితినన్న కోపముతో
ఇచ్చవచ్చిన రీతిని పలుకుట
పాడిగాదుకద కపికుంజరుడా!

నా తాత-తండ్రులు ఏ ధర్మమును
అనుసరించి మరి కీర్తి గడించిరొ
అట్టి ధర్మమునె అనుసరించితి
ధర్మదూరుడను కాకపోతిని

నే నల్పుడను తప్పులు బట్టితి
ధర్మ కార్యములు చేసి ఎరుగను
దాటిపోవు-నా తనువు ఇంకను
క్షమించినాను-అను-దయతో నువు

ధర్మరక్షణకు చంపితి నిన్ను
తెలియుము నీవు వానరోత్తమా!
చెప్పితి తీరుగ-తిట్టిన తిట్టుము
తప్పు కాదని తోచిన-మెచ్చుము.''

యుద్ధభూమిలో నీ బాణముతో
తనువును వదలి ఉత్తమ లోకము
చేరగ నుంటిని- ఓ రఘురామా!
ధన్యుడ నైతిని చింతింపనయా!

మెల్లగ రాముడు చెప్పిన ధర్మము
చల్లగ వాలి చెవికెక్కినది
రాముని దోషము లేదని తెలిసెను
దూషించితినని పరితపించెను

తమ్ముడు-తార-బంధువులెందరొ
అందరికొరకై నే చింతించను
కనకాంగదుడు ముద్దుకుమారుడు
వానిని తలచిన దుఃఖము కలుగును

''రామచంద్ర! నే నవివేకముతో
సత్యమూర్తివగు నిను నిందించితి
ధర్మ విషయమై నువు నుడివినది
సత్యము-సత్యము-సందియమేల-

రామచంద్ర! నాకొక్క కుమారుడు
గుణములయందు శ్రేష్ఠుడు వాడు
మురిపెముగా నే బెంచితి వానిని
నే నిట పుడమిని వ్రాలుట గాంచిన

అల్పులమగు మేమేవిధి నీతో
ధర్మ విషయమై బదులిడగలము
కఠినోక్తులను పలికితి రాఘవ!
నను కరుణించుము మన్నించుమయా!

జలములు లేని సరస్సు తీరుగ
తండ్రీ! నన్ను వదలిపోదువా
అని దుఃఖించును-కళదప్పనటు
రోదించును కద- ఓ రఘునందన!

రామచంద్ర! నువు సామాన్యుడవా?
ధర్మ విషయమున సుశిక్షితుడవు
యాథార్థమైన జ్ఞానము కలిగిన
పండితులలొ మరి శ్రేష్ఠుడవయ్యా!

పసివాడయ్యా! పసివాడునయా!
ఒక్క కుమారుడు మక్కువ నెలవు
మంచి చెడ్డలు వానికి జెప్పి
చక్కదిద్దుటకు ఎవరున్నారిక?

''నీ విటనున్న- అపాయము రాణీ
అలిదూరమై తిరిగెడి వీరులు
పరుల అలికై పరుగిడు కోతులు
అంతః పురమున అడుగిడగలరు

పాత వైరములు వెలికితీయుచు
పోరు పెంచెదరు సుందరవదనా!''
అనినవారితో నిర్లిప్తతతో
తార పలికె తన పెదవి విరచుచు.

''లోకోత్తరమగు మహిమాన్వితుడు
వానరసింహము పూజనీయుడు
నాకు దక్కనిచొ- రాజ్యము ఏల?
నిక్కము, వలదు- సుతుడు, దేహము

ఈ దేహము మరి నా కుమారుడు
నను రక్షించగ చాలినవారా?
రామబాణముచె నేలకూలిన
ప్రభువు పాదముల చెంత వ్రాలెద.''

రోదించుచు తల బాదుకొనుచును
గుండెలు పగులగ చరచు కొనుచును
రిపుల పాలిటి యముడైనట్టి
యుద్ధములందు వెనుకడుగిడని

వాయువు సరిపడు వేగముగలిగి
కొండల- లీలగ చిమ్మగ చాలిన
ఇంద్రుని పోలిన విక్రమమూర్తి
మేఘ గర్జనతొ సరిపడు కంఠము

సుందరమయిన రూపము గలిగి
శూరపుంగవుని కోలనుబడిన
వాలిని- దూరమునుండే గాంచిన
తారచేరె- తను నడువలేకనే

వానకురిసి మరి వెలసిన మబ్బుగ
శార్దూలముచే- భక్షించుటకై
కూలిన సింహము పోలిన వాలిని
వానరపతిని గాంచెను తార

పాముల పగతుర- గరుత్మంతుడు
నాగుల కొరకై కూలద్రోసిన
ప్రాసాదమువలె వాలి తోచెను
తారకాంచె- తనకాంతుని భక్తితొ

వాలిని కూల్చి ధనుసు నూతగొని
నిలచిన రాముని - లక్ష్మణుమూర్తిని
వాలి సోదరుడు సుగ్రీవుని అట
మంచి మనసుగల తారగాంచెను

కొంచెము సాగి శరఘాతముచే
కూలిన పతినిగాంచి- శోకమున
మూర్ఛనందినది- తిరిగి- తేరుకొని
నాథా- నాథా- ప్రియనాథాయని

నా ప్రాణేశ్వర- జీవితేశ్వరా!
ఓ మనోహరా! అనుచు ఏడ్చెడి
మృత్యు పాశముల బద్ధుడు అయిన
భర్తనుగాంచి శోకతప్తయగు

వదినను గాంచెను-వాలి తమ్ముడు
చెంతనె గాంచెను కనకాంగదుని
రవిసుతు మదిలో దుఃఖము పొంగెను
దుఃఖ సంద్రమది కన్నుల నిండెను.
॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 20 తార విలాపము

శరఘాతముచే నేలను బడిన
మత్తేభము వలె నున్న-వీరుని
సురపతి సముడగు భర్తను గాంచి
దుఃఖము పొంగి రోదన నిండెను.

వ్రేళ్ళతొ ఊడిన తరువై పడిన
పతి కాయముపై వ్రాలెను తార
హా నాథా! యని రోదించుచును
విలవిల లాడెను వివశురా లయి:

''రణమునఓటమి నెరుగని వాడవు
ధరణిని కూలగ ఏ విధి మనసయె
నిరపరాధిని-నాథా యని-నే
పిలుచుచుంటి మరి పలుకవేలనో!

నీ మాటకు-నే నెదురాడితినా?
నా దోసము మరి ఏమది స్వామీ!
కోపించితివా కోమలాంగిపై?
నను వదలితివా వీరపుంగవా!

కపిరాజువు నువు- కటిక నేలపై
పరుండు టేమి? మృదు తల్పమున
శయనించుము నువు- లే మహరాజా!
నే నిటు చూసి ఓర్చుట ఎట్లు?

భూకాంతన - నీ కంత మక్కువా?
అక్కున జేర్చుకు పరుంటివయ్యా!
నే నిటనుండగ-పరకాంతను నువు
చేర్చుట తగునా కపికులాగ్రణీ!

స్వర్గమార్గమున మన కిష్కింధను
మించిన సంపదలున్న నగరము
అందెన స్వామీ? అందుకొరకు నువు
వదలి పోదువా ఇందరి నిచట?

ఉద్యానమ్ములవిహరించు టెటు?
మధువు నిండిన సుమముల నింక
ఇచ్చెడి దెవ్వరు- ప్రాణేశ్వరి యని
మక్కువ నిండి పిలచెడి దెవ్వరు?

నాథుని కొరకై నిరీక్షించుట
నా తనువుకుఇక ఏదీ స్వామీ!
దిక్కులేక-నే దీనురాలనై
మూలజేరి మరిబ్రతుకుట ఎట్లు?

మురిపెపు పలుకులు మదిలో తలచి
సుందర మూర్తిని ముందర చూచుచు
సాటి కాంతలలొ మేటిగ పొంగెడి
నాకీ దుర్విధి కూర్చెను బ్రహ్మ.

వేయి తునకలై గుండియ పగలదు
ఎంతటి- బండరాయియో మరి!
ఇంతకు మించిన విపత్తు మరి యిక
కలుగున కాంతకు-వానర రాజా!

తమ్ముని తరిమి అతని భార్యను
చేర్చుకుంటివి ఫలమిది- ఇపుడు
అనుభవించగా వలసెను నాథా!
ఆలి అపహరణ ఎంతటిదో విను

మేలుకోరి-నే మరిమరి చెప్పితి
నా బోధన-నీ చెవి కెక్కినదా!
నోటిని నీవు మూయించి తివి
మాట వినుటచే మంచి కలుగదా!

పురుషుల మనసు దోచగ చాలిన
దేవకాంతలను వశపరచుకొని
ఏలగ చాలినచల్లని దొరవు
ఏలిన నన్ను- ఏల వదలితివి?

వలదు-వలదు నువు పోరగ వలదు
అని చెప్పినను-వినక-పోరుకు
పోవుట గాంచి తలచితి మదిలో
ప్రాణాంతక మగు సమయమగు నని

దుఃఖము నెరుగను-దీనత్వ మది
వినక పోతివి-ఇకపైనేను
దిక్కులేక మరి వైధవ్యముతో
ఏ విధితనువును నిలుపుట స్వామీ!

రమ్ము కుమారా! జనకుని చూడుము
రమ్య గుణములు ధర్మము నెరిగిన
రాజపుంగవుని కన్నుల గాంచుము
రాదు నీకు మరిచూచెడి భాగ్యము.

ఇకపై ఎవరిని నాయనా యని
పిలతువు రా నువు-నా పసికూన!
స్వామీ! యిడుగో కనకాంగదుడు
చూడవు ఏమి? కనులు తెరవవా!

ముద్దుగ పెరిగెను సుఖముల దేలి
నీ ఎదుటను మాటాడి ఎరుగడు
ఇక పినతండ్రి కోపము తీరగ
కొలచుట ఎట్లో? కొలవక ఏగతి?

వానరేశ్వరా! కన్నులు తెరువుము
కొడుకును కొంత ఊరడించుము
శిరసు మూర్కొని కడ సారిగను
హితము గొలుపుచు పలుకుము స్వామీ!''

అని పతి కాయముపైన బడినది
రోదించుచును పలికెను తిరిగి
''వానరేంద్ర! నినుచంపుట చేతను
రామభద్రుడు మాట నిలుపు కొనె

గొప్ప కార్యము రాముడు చేసెను
చేసిన ప్రతిన నిలబెట్టు కొనె
సుగ్రీవా! నువు సుఖపడవయ్యా!
రుమతో రాజ్యము ఏలుకోయిక!

వల్లభా! యని నీ ప్రియురాండ్రు
రోదించుటది వినబడ లేదా?
ఉలకవు, పలకవు వానర శ్రేష్ఠా!
ప్రజ్ఞానిధి-నువుఏ విధి నుంటివి!''

అంతట వానర స్త్రీ సమూహము
అంగదు నచట కౌగలించుకొని
హృదయేశునితో ననిరి దీనముగ
''కుమారు నొదిలి సాగుట తగునా?

ఆలోచించుము-అంగదు డితడు
ముద్దు కుమారుడు వదలకు మయ్యా!''
అనగా తార తిరిగి దీనముగ
''వీరుడ-నీకు తగదు వినుమయా!

పర లోకమునకు ఏగుట తగదు
మా తప్పులు మరిదోసములేవి?
దోసములున్నను మంచి మనసుతో
మము క్షమియించగ తగుదువు నీవు

కపిశ్రేష్ఠా! యిదె పాదము లంటితి
వదలను నేను'' అనుచు దీనముగ
తార పడగను స్త్రీ లందరును
వాలి పాదముల వ్రాలిరి అచట

దుఃఖించుచును దీన వదనయై
తారాకాంతుని పదముల వ్రాలిన
వాలిభార్య ఆ తారాసాధ్వి
ప్రాయోపవేశము చేయదలచెను.

॥శ్రీ రఘురాముని॥

## 21 మారుతి – తారను ఓదార్చుట

తారాపథమున నుండెడి తార
నేల వ్రాలినటు లున్నది తార
చంద్రుని పోలు ముఖము గలిగిన
తారతొ పలికెను ఆంజనేయుడు:

''శోకము నాపుము-దేవీ! వినుము
తెలిసియొ, తెలియకొ దేహధారులు
కర్మలు చేసిన-పాప పుణ్యములు
అనుభవించుట జరిగి తీరును.

పాప ఫలము మరి కీడు కలుగుట
పుణ్యఫలమది మేలు కలుగుట
పరలోకములో వారి వెంటను
ఫలితము చేరును అనుభ వించగ.

మగువా! వినుము దేహమన్నది
నీటి బుగ్గతో సమానమైనది
అశాశ్వతమ్ము-వగచుట ఏల?
నిన్ను నువ్వుమరి ఉద్ధరించుకో.

విషయము తెలిపెద విను మహారాణీ!
తనయుని నీవు రక్షించ వలె
కడుపున బుట్టిన నీ బాలునకు
నీవు తప్ప మరి రక్షకు లెవరు?

నీ కర్తవ్యము అంగదు రక్షణ
శుభములు వానికి సమకూర్చవలె
వివశురాలవై తనువు వదలగను
యోచించుటది సరిగాదు సుమా!

పవిత్రమైన మనసు గలిగిన
రాణీ! - లోకమునందలి జీవులు
పుట్టుట గిట్టుట రెండును కూడ
అనిత్యమయినవి- నీకు తెలియదా?

కావున హితులకు ఈ లోకములో
వలయు హితములుచేసినట్టుగ
ఊర్ధ్వలోకము వారు చేరగ
వలయు క్రియలను నిర్వహించ వలె.

ఊర్ధ్వలోకమున సుఖముల నందగ
వలయు కార్యములు చేయగవలెను
రోదనాదులు నిషిద్ధమైనవి
కాగల కార్యము నాలోచించుము.

లక్షలు- కోట్ల సంఖ్యలొ నున్న
వానరవీరులనేలెనువాలి
అశ్రితులందర జేర్చి-వారికి
బ్రతుకు ఆశను ఏర్పరచెను గద!

ధర్మాసక్తితొ శాస్త్రవిహిత మగు
తత్వము నెరిగి- సామదానములు
శాంతియు తెలిసి- ఈ లోకములో
చేయవలసినవి పూర్తిగ జేసెను.

అంగదు నకును కపిశ్రేష్ఠులకు
భల్లూకములకు నీవే దిక్కు-
రక్షణ భారము నీపై నున్నది
కపి రాజ్యము నీ చేత నున్నది.

శోకింపకుము నీ సాయముచే
అంగదుడెంతో సామర్థ్యముతో
రాజ్యము నేలగ సంతోషింతువు
గతమునకై విలపించుట తగదు.

ఏ ప్రయోజనము కోరుచు- తండ్రులు
పుడమిని- పుత్రుల బడయ గోరుదురొ
అట్టి సమయ మాసన్నమైనది
ఉత్తర క్రియలను చేయించనగు

తండ్రికి విధిగా సర్వము తీర్చగ
తనయుని నీవు అభిషేకించగ
దుఃఖము తీరును'' - అన హనుమంతుడు
తార పలికెనుఆంజనేయునితొ:

''విను హనుమంతా! అంగదు వంటి
పుత్రుల నూర్గుర పొందుట కన్నను
శౌర్యధనుడు మరి అజేయుడైన
భర్త సన్నిధే శ్రేష్ఠము నాకు.

వానర రాజుకు సంస్కారంబులు
చేయించ- నే నెవ్వతెనయ్యా!
అంగదుని మరి యువరాజు గను
పట్టము గట్టుట కెవ్వతి నేను!

సర్వము చూడగ చాలు సమర్థుడు
పినతండ్రియగు సుగ్రీవుడయా!
నా ప్రాణేశుడు స్వర్గమేగగా
నాకిక మమత దేనిపైనయా?

హనుమంతా! నే- నీ విషయములో
యోచింప గను ఏదియు లేదు
పుత్రుని కెపుడు కూరిమి బంధువు
శుభములు కూర్చగ చాలిన తండ్రియె

వానర శ్రేష్ఠా! ఇహ పరములలో
వాలి ఆశ్రయము ఉత్తమ ధర్మము
రిపుని కెదురుగా వీరశయనమున
ఉన్న- భర్తతో సాగెద నేను.''

॥శ్రీ రఘురాము

# 22 వాలి జాలి పలుకులు

కిష్కింధాపతి కొన ఊపిరితో
మెల్లగ శ్వాసను విడుచుచు నపుడు
చెంతనె ఉన్న అంగదు గాంచెను
ప్రాప్త విజయు సుగ్రీవుని గాంచెను

తమ్ముని గాంచి వాలి పలికెను
స్నేహపూరిత వాక్కుతొ పలికెను:
''పగ సాధించితి- నను దూషించకు
నీ దోసము యిసు మంతయు లేదు

విధికృతమును మరి దాట శక్యమా!
జ్ఞానహీనునిగ చేసెను నన్ను
అన్నదమ్ములము ఒకటిగ నుండి
సుఖించు యోగ్యత లిఖించ లేదు

కపిరాజ్యము నువు పరిపాలింపుము
ప్రాణము- రాజ్యము- సంపద- భువిపై
మూడులోకముల పొందిన యశము
వదలి- దివికి నే పోవుచుంటిని.

సుగ్రీవా- నువు కపిరాజు వయా!
మరణావస్థలొ నే కోరినటు
కష్టమైనను చేయుట ధర్మము-
బుద్ధిమంతుడు- సుఖపడ వలసిన

విలపించెడి- యీ అంగదు నిపుడు
ప్రాణముకన్నమిన్నగు వానిని
కన్న కుమారుని వలెరక్షింపుము
తండ్రివి- తాతవు- నీవే వానికి

భయపడు నెడల భయము దీర్చుము
విక్రమ మందు నీకు సమానము
అసురుల జంపు అమితోత్సాహుడు
నీ ముందటనే విజృంభించును

వాని వయసుకు- శక్తికి తగిన
కార్యదక్షుడు- సందేహించకు
దోష రహితుడా! తారను గనుము
సుషేణు తనయ- సుబుద్ధి ఆమె

సూక్ష్మ విషయములు నిశ్చయమ్ముగా
తెలియగ నేర్పరి- సమర్థురాలు
అపశకునములతొ రాగల కీడు
చెప్పగ చాలిన శక్తిగల దయా!

మంచిది చేయుము అని నంతటనే
ఆ కార్యము నువుచేయుము సోదర!
రాముని కార్యము ఎట్టిదైనను
సందేహింపక చేయుము తప్పక.

రాముని కార్యము చేయక పోయిన
అధర్మమగునది- అంతియెగాక
అవమానించితి వని చంపును- నిను-
భయభక్తులతో మెలగుము నీవు

వానరరాజా! వాసవు డొసగిన
బంగరు హారము ధరించు నీవు
మరణించగను దానిని తీసిన
మహిమ పోవును కావున దాల్చుము

మహిమాన్విత మగు కాంచనహారము
ధరించి నీవు- రిపుల హరించుము''
అన్నవాలి అటు పలుకుట వినగా
కాంతి హీనుడై నిలచె సుగ్రీవుడు

వాలి అంతట అంగదు బిలచి
ప్రియముగ నీతిని బోధించె నట
''తనయా! నీవు ఉచితా నుచితము
తెలుసుకు మసలుము- నీకది మేలు

ప్రియాప్రియములు- సుఖదుఃఖములు
సమముగనెంచి క్షమతో మెలగుము
సుగ్రీవునికి వశుడవు అయి నువు
నడచుట- కర్తవ్యముగా నెంచుము.

నా ఎడ చనువుతొ నడచి నట్టుగా
పినతండ్రితొ నువు నడచిన యెడల
ఒప్పుడు- నావలె లాలన చేయడు
తప్పుగాంచిన దండించు నయా!

సుగ్రీవుని పగతుర- స్నేహము చేయక
పగతుర- హితులతొ మాటాడ కను
శ్రద్ధాభక్తుల ప్రభు కార్యమును
ఆచరించుట నీ కర్తవ్యము

అతిగా స్నేహము చేయుట తగదు
విరోధమసలు పెంచుకోకయా!
తటస్థుడవై మసలుకొనుటచే
మంచి కలుగును- శుభములు కలుగును''

అనుచు పలుకుచు హితము చెప్పుచు
గ్రుడ్లను త్రిప్పుచు కోరలు కనబడ
వాడిబాణమున పీడితుడైన
వాలిప్రాణమును విడిచెను అపుడు.

జాలిగ నేడ్చెను కపి సమూహములు
కాంతి విహీనము అయె కిష్కింధ
కొండలు- గుహలు- తోటలు- వనములు
కళ దప్పినవి- విలపించినవి.

నిండుగ బూచిన తరువులన్నియు
వేగము కలిగిన వాలి వెంబడి
వచ్చును- అంతటి వీరుడు- పుడమిని
మరియొక డెవడని వగచిరి అచట

''గోలభుడను- గంధర్వ వీరునితో
పదునై దేండ్లు పోరి- దుష్టుని
అంతము చేసి భయము బాపెను
అంతటి వీరుని మరి గాంచము గద!''

ఆలమందకు రక్షగ యుండిన
ఆబోతు-అంతము అయినంత టను
భీకర సింగము లున్న అడవిలో
భీతిలిగోవులు ఘోషిల్లి నటు.

వానరు లందరు రోదించి రట
శోక సంద్రమున మునిగిన తార
కూలిన-మానై పడిన వాలిపై
చుట్టుకు పడినది శోకలత వలె.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 2 3 శోక సంద్రమున తార

భర్త ముఖమునకు ముఖము జేర్చినది
దుఃఖమునిండి-''అయ్యో నాథా!
కటిక నేలపై పవళించితివా
భూకాంతననీ కంత మక్కువా?

వానరేశ్వరా! నా యెదుటను నువు
శంకలేక ఈ ధరణీ కాంతను
కౌగలించి మరి సంతసపరచగ
ధరణి ఎంతటి ప్రియురాలైనది.

సుగ్రీవునికి విధి అనుకూలము
కావున ఈ విధి నీతో పోరి
వీరపుంగవుని ఎదిరించె కద!
లేదానీతో పోరి బ్రతుకు టెటు?

వానర వీరులు గోలున ఏడ్చుచు
కనకాంగదుడు కుమిలి పోవగా
దీనారవములు, రోదనలన్నీ
వినబడలేదా! తగునా మౌనము?

నీచే ఓడిన వీరపుంగవులు
అలంకరించిన వీర శయనమును
అలంకరించి వదలి పోతివి
అనాథగా నను చేసి పోతివి.

తెలిసినవారు తనయ నెన్నడు
శూరుని కొసగరుభార్యగ నెపుడు
చూచితివా మరి శూరుని భార్యను
వైధవ్యముతో-జీవచ్ఛవమును

మాన్యత నాకు చచ్చిపోయినది
ముత్తయిదువుగా చావక పోతిని
సద్గతి లేదు-దుఃఖ సంద్రమున
పూర్తిగ మునిగితి వానర పుంగవ!

మోహనరూపుడు పతిపయనించగ
నూరు వ్రక్కలై గుండియ పగలదు
హృదయముశిలగా మారిపోయినది
హృదయేశుని వదలి-బ్రతుకుట కొరకా?

దైవము, స్నేహితు డితడే నాకు
రక్షకుడై-నా మేలు కోరును
నా పెన్నిధి అసహాయ శూరుడు
స్వర్గము జేరెను అనాథ జేసి.

కొడుకు లుండినా సంపద లున్నను
ధనధాన్యములు దండిగ నున్నను
పెనిమిటి లేని భార్యనెప్పుడు
విధవని పిలుతురునిర్లక్ష్యముగ.

నెత్తుటి మడుగుమెత్తని శయ్యగ
శయనించెడి ఈ దుర్విధి నీకా!
రొమ్మున నాటిన బాణము వలన
కౌగలించుకొన వశపడకున్నది."

"పాపకర్మమున కలిగిన వైరము
కాయముతో నది సమసి పోయినది
చివరిచూపు యిది-మొక్కుము" అనగా
వాలి పాదముల వ్రాలె అంగదుడు

తార అట్టుల రోదించగను
గుహలోనున్ననాగుబామును
వెలికి లాగినటు-నీలుడు వచ్చి
రామ బాణమును వెలికి లాగగా

దీవించ వేల దీర్ఘాయుష్షని-
సింహముబారిని ఆబోతు పడ
దూడతొ నుండెడి గోవు రీతిగా
గుండెపగిలెడి దుఃఖము నుంటిని

పశ్చిమాద్రిలో రవిబింబమును
విడచి వచ్చెడు రవి కాంతివలె
వెలిగిన దచట రామబాణము
వెల్లువగా నట నెత్తురు పారెను

సంగ్రామమను యజ్ఞము చేసి
రామ బాణమను నీటియందు-నువు
అవబృథ స్నానము చేసితివయ్యా!
ఆలినైన నన్నొదలుగ తగునా?

రోదించుచును ప్రాణనాథుని
ధూళినంత-తన కంటి నీటితో
కడిగి వేసినది తార అంతట
అంగదు బిలచి-వాలిని చూపుచు

పోరుకు మెచ్చి వాసవుడిచ్చిన
కాంచన హారము కనబడదేమి?
చెప్పిన-వినకపోతివి నాథా!
నా మాంగల్యము దూరమ్మైనది.

అస్తమించి నను అర్కుని కాంతి
రత్న సానువగు మేరు పర్వతము
వీడదు-అట్లే మరణించినను
రాజ్యలక్ష్మి నిను వీడదు నాథా!"

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 24 సుగ్రీవుని దుఃఖము-వాలిని విడిచి తార బ్రతుక లేననుట

వదిన తార అటు విలపించుట గని
అంగదు డటుల కుములుట గాంచి
మరణించిన తన అన్నను గాంచి
కడు దుఃఖించెను అర్కసుతుండు

సర్పసమానము అగు బాణముతో
వింటితొ నిలచిన రామచంద్రుని
చెంత చేరెను తన అశ్రితులతొ
బాధగ పలికెను-రవిసుతు డంతట:

రాజోత్తమ! నువు శపథము తీర్చగ
కపిరాజ్యము నా చేతికి వచ్చెను
రాజ్య సుఖముపై కాంక్షపోయెను
అన్నను-నేను అనుస రింతును

రాణియు- కొమరుడు పట్టణ మంతయు
రాజుకోసమై రోదించగను
రాజ్య భోగములు మనసు కోరదు
రామచంద్ర-నే బ్రతుక లేనయా!

కఠినముగా నను తరిమి వేసెనని
తలచితి-నాతని చావు కోరితి
నే దొరికినను-నన్ను చంపక
స్వేచ్ఛగ-పోరా! అనగలిగెను కద!

సురాధిపత్యమునైనా కోరను-
ఋష్యమూకమున బ్రతుకుచుందును
అన్న అనినసామాన్యుడు గాడు
శూరులందున శ్రేష్ఠుడు రామా!

ఉత్తములందు ఉత్తముడాతడు
తెలియక పోతిని దుఃఖము నపుడు
కన్ను మిన్ను మరి కానక పోయి
కామముతో మాటాడితి నపుడు

తరుశాఖతొ నను చావ మోదగ
నేలనుబడి-నే తన్ను కొనగను
మంచి మాటలతొ నాతో చెప్పెను
'పోరగ రాకుర! బ్రతుకుము పోరా!''

సోదరధర్మము ఆర్య ధర్మము
రక్షించబడె- అన్న వాలిచే-
కామక్రోధముల నిండిన నేను
కోతి గుణమును కన బరచితిని

అపారమైన పాపము నందితి
సాధుజనులచే విడువగదగినది
ఇంతటి పాపము-పూర్వము ఇంద్రుడు
పొందెను- అతని సోదరు జంపి

విశ్వరూపుని ఇంద్రుడు జంపెను
బ్రహ్మహత్యతో పాపము నందెను
ఆతని పాపము- భూమియు- జలము
తరువులు-స్త్రీలు పంచు కొనిరట

కోతినైన నా పాపము నెవరు
పంచుకొందురు? నీచుడనేను
నింద్యుడ నేను- లోకమ్మునకు
అపకారములే చేయ వాడను

అధర్మ వర్తిని- అంగదు డిపుడు
అసువులు బాసెన వంశ నాశకుడ-
యువరాజు పదవికే తగనివాడను
రాజ్యమునకు మరి ఏ విధి తగుదును?

భ్రాతృవధయను వాలముగలిగి
సంతాపమను-శిరసు- దంతములు
తొండము-కన్నులు కలిగిన ఏనుగు-
పాప మనియెడి మహా గజమది

వృద్ధినందిన మత్తేభ మది
ఏటిగట్టును త్రోసిన రీతిగ
త్రోయుచున్నది- ఓ రఘునందన
పాపము-నాలో మంచిని - మ్రింగెను.

పుటము పెట్టగ బంగరు నందలి
మాలిన్యమది పోయినట్టుగద
నా పాపముతో సాధు స్వభావము
రోయుచు వదలెను- కలియ లేకను

కొనవూపిరితో అంగదు డుండెను
వాడు బ్రతుకనిచొ వానరులందరు
బ్రతుకరు నిజము- ఓ దాశరథీ!
ఇంతటి ఘోరము చేసితి నేను.

కొడుకులెందరో ఉందురు గాక
అంగదువంటి సుబుద్ధి గలుగున?
కలిగిన మంచి కొమరుడు కలుగును
కానీ అన్న ఎచట లభించును?

అంగదుడిపుడు బ్రతికియుండెనా
వానికొరకయి తార బ్రతుకును
అటుగాక మరి వాడు నిలవనిచొ
తార బ్రతుకదు నిజమిది రాఘవ!

అన్నతొ- కొడుకుతొ స్నేహము నిలపగ
అగ్నికి నేను ఆహుతి అయ్యెద
నీ కార్యముకై వానర వీరులు
తోడుగనుందురు సీతను వెదుకగ.

కోతులు నీకు సాయపడనిచో
కార్యము ఆగదు-నే నెరుగుదును
నీ సామర్థ్యము నాకు తెలియదా?
వంశ నాశకుడ-నేను తగనయా!

పాప కార్యములు చేయువాడను
ఘోర కర్మలను చేసెడి వాడను
అపరాధిని-నే-సీతాన్వేషణ
పుణ్యకార్యము చేయగ తగను

అనుజ్ఞ యిమ్ము మరిణించుటకు''
అని సుగ్రీవుడు రోదించగను
శత్రుహరణుడు రామచంద్రుడు
కనుల బాష్పముల దుఃఖితు డయ్యెను.

ముల్లోకములు ఏలగ చాలిన
రామచంద్రుడు ఓర్పుకు ధరణి-
తనతో పలుకగ తారా సాధ్వి
చూచుచున్నదని తెలిసినవాడై

శోకసంద్రమున మునిగిన తారను
ఊరడించగా ముందుకు నడచి
పతిపై వాలిన తారను గాంచెను
మంత్రులు తారను వేరుజేసిరి.

విశాలనేత్రుని సూర్యతేజుని
ఘనమగు విల్లు శరములు గలిగిన
రామచంద్రుని చూచెను తార
పద్మపత్ర నేత్రమ్ముల జూచెను.

సాధువర్తనుని- ముందెన్నడు గాంచని
పురుషోత్తముని- రాజలక్షణుని
పుణ్యశీల- ఆ తార గాంచెను
తలచెను- అతడే రామభద్రు డని

ఇంద్ర సమానుడు అజేయుడైన
రామభద్రుడు తనను చూడగా
వచ్చుట గాంచిన తారాసాధ్వి
అంతటి బాధలొ ముందుకు వచ్చెను

దుఃఖముతో మరి నిండినదైనను
నిర్మల సాత్త్విక మనస్సు గలిగి-
గురితప్పకను కొట్టగచాలిన
రామచంద్రునితొ పలికెను తార :

''అప్రమేయుడవు- విజితేంద్రియుడవు
ఘన ధార్మికుడవు అతి సమర్థుడవు
అక్షయ కీర్తికి నిలయము నీవు
సుందరమూర్తివి- శరచాపధరా!

మర్త్యలోకమున అభ్యుదయముకై
అవతరించిన మంగళమూర్తీ!
అసమానబలా- ఆశ్రితపోషా!
వాత్సల్యానిధి- క్షమలో భువివే

రామా! ఒకటే బాణముతో నువు
పతిని గూల్చగ చాలితివయ్యా!
నన్ను కూడ- నా పతితో పంపుము
నన్ను విడచి- నా నాథు డుండడు.

ఓ పురుషోత్తమ! స్వర్గము నందు
దేవకాంతలు అలంకరించుకు
సేవలు చేయగ ముందుకు రాగ
వాలి- వారిని లెక్కచేయడు

స్వర్గ సుఖములు భోగము లెన్నో
అమరి యున్నను నేను లేక మరి
నాథుడు- అచట సుఖపడ డయ్యా!
సీత లేక- నువు సుఖముగ నుంటివ?

ప్రాయమునందు ప్రియసతి లేనిచొ
కలిగెడి దుఃఖము నీకు తెలియదా?
ఆ బాణముతో చేర్చుము పతితో
ఎంతటి దుఃఖము నుండెనొ నాపతి

తాటకాంతకా! స్త్రీ వధ యనుచు
పాతకంబని తలచకు మదిలో
భార్య అనినచో భర్త ఆత్మయని
వేదశాస్త్రములు నుడువు చున్నవి

కూరిమి భార్యను- భర్తకు కూర్చిన
దానము- అన్నిట శ్రేష్ఠమైనదని
జ్ఞానులందురు- అఘము అంటదు
పతితో జేర్చుము జానకీ పతీ!

దీనురాలను దిక్కులేకను
దీనముగా నిను ప్రార్థించితిని
ఒక్క బాణమున వాలితొ జేర్చుము
నాథుని విడచి బ్రతుకలేనయా!

తార ఆ విధి విలపించ గను
అనునయించెను రామచంద్రుడు:
''వీరపత్నివి- దీనముగా యిటు
మాటాడుట మరి తగునా సాధ్వీ?

బ్రహ్మ విధించిన తీరుగ నన్నియు
జరుగు చుండును దాట శక్యమా?
వీరపత్ని విటు దుఃఖించగను
వలదు- భర్తది వీరమరణము.

సకల జగత్తును బ్రహ్మ సృజించెను
సుఖ- దుఃఖములు, కర్మలబట్టి
లిఖించబడును- విధాతచేత
విధి వ్రాతయని అందురు జనులు.

యువ రాజుగ తనయుని జూతువు నీవు
సంతసించెదవు తారా- విను'' మని
ప్రీతి కలుగునటు ఊరడించగా
తార దుఃఖము ఉపశమించెను.

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

## 2 5 శ్రీరాముడు తారను ఊరడించుట

తారయు- కొమరుడు- సుగ్రీవుడును
హోరున విలపించుట చూడగను
రాముడు సమముగ శోకమునిండి
సౌమిత్రితో కలసి ఊరడించెను

స్వతంత్రుడై తను ఏ కార్యమును
చేయలేడు- చేయించగ లేడు
దైవతంత్రమున సర్వము జరుగును
నిత్యము- లోకము నడచును అటులే

''చనినవారికై ఏడ్చిన వత్తురె-
పరలోకమున మేలు కలుగునా
జరగవలసిన కార్యము- శీఘ్రమె
తీర్చుట మీకు కర్తవ్యమిక.

విధి ఎన్నడునూ సమయము దాటదు
విధి- క్షీణతను ఎన్నడు పొందదు
కాలము నియమము నతిక్రమించదు
ప్రకాశించును తన స్వభావమున.

లోక సహజముగ శోకవశు లయి
చనినవానికై విలపించితిరి
కాల నియమమును కాదని మీరు
చేయగ చాలిన కార్యము ఏది?

కాలమునకు మరి బంధువులుండరు
పక్షపాతము అసలే లేదు
కాలము గెలిచెడి మార్గము లేదు
బలముకు భయపడి కాలము లొంగదు.

లోకము కంతయు ఆదికారణము
సర్వము చేయగ చాలిన దైవము
అస్వతంత్రులము- దైవము పరిధిలొ
నడచెడి వారము- వనచరులారా!

కర్మలబట్టి దైవము వారికి
ఫలితము నిచ్చును- కావున జీవుడు
ధర్మార్థ కామములు ఆ విధముగను
ఆచరించుట జరుగు జగమున.

ఆచరించిన పురుషార్థముల
కలుగు ఫలమును అనుభవించగ
నాకము చేరెను వానరరాజు
పాపము తీరెను వాసవ సుతునకు

ధర్మ గుణముచే నాకము గెలిచెను
స్వర్గము గైకొన వెడలెను వీరుడు
వగచుట తగునా- మిగిలిన కార్యము
శీఘ్రమె చేయుట కర్తవ్య'' మనె

రాముడు అటుల చెప్పినంతనే
దుఃఖ సంభ్రమున మునిగిపోయిన
సుగ్రీవునితో హితవచనమ్ముల
సుమిత్ర తనయుడు పలికె తీరుగా

''సుగ్రీవా! నువు వేగమె లెమ్ము
ప్రేతక్రియలను వాలికి చేయుము
దహనము చేయగ మంచి గంధము
ఎండు కట్టెలను తెప్పించ వయా!

అంగదు నీవు ఓదార్చుమయా!
వివిధ వస్త్రములు-మాలలు-నేయి
సుగంధ ద్రవ్యములన్నీ ఇపుడే
అంగదునంపి తెప్పించుమయా!

నీ ఆధీనము కిష్కింధాపురి
పామరబుద్ధిని మానుము నీవు-
తారుడ! నీవు జాగు చేయక
శిబికను తెమ్ము కార్యము తీర్చగ

ఇట్టి సమయమున కార్యమంతయు
త్వరగా చేయుట ఎంతయొ మేలు
శిబికను మోయగ తగు బలవంతులు
ముందు నిలువుడు వాలిసేవకై''

లక్ష్మణుడటుల త్వరపరచి అట
అన్నప్రక్కన నిలబడి యుండగ
తారుడు చెప్పగ శిబిక నచటికి
తెచ్చిరి-వాలికి కార్యము తీర్చగ-

విశ్వకర్మచే నిర్మించబడి
సిద్ధుల విమానమంతటి శిబిక
పక్షులు- లతలు- గవాక్షములతో
కొండలు- కోనలు చెక్కబడినది

పుష్ప మాలలతొ కూర్చియున్నది
రక్తచందనము పూసియున్నది
బాలసూర్యుని వర్ణము గలిగి
గుహవలె నున్న శిబికను తెచ్చిరి

రాముడు అంతట తమ్ముని జూచి
వాలికాయ మందుంచ మనుచును
వలయు కార్యము చేయించ మన-
అంగదుడున్ను సుగ్రీవుడును

దుఃఖము నిండి తూలుచు నంత
వాలికాయమును శిబికలొ నుంచి
పూలు-వస్త్రములు అలంకరించిరి
పూజలు చేసిరి పుణ్యమూర్తికి

రత్నములెన్నో వస్త్రములెన్నో
దానములివ్వగ వానరులకును
పల్లకిముందు నడువ-కొందరికి
ఆనతినిచ్చెను-అట సుగ్రీవుడు

అసమాన సంపద కలిగిన యట్టి
మహారాజుకు జరిగినట్టుగ
లోపములేక ప్రేతకార్యమును
తీర్చుడు మీరని ఆనతి నిడెను

తారుడు మొదలగు వానరులందరు
అంగదు తోడుగ నేడ్చుచు నడచిరి
తార మొదలగు స్త్రీ జనమంతయు
నేడ్చుచు సాగిరి శిబిక ప్రక్కల

ఆడకోతుల రోదన తోను
అడవులు-కొండలు ఏడ్చినట్టుగా
ప్రతిధ్వనించెను-నిర్జనమయిన
ఒక ప్రదేశమును చేరిరి వారు

యేటి ఒడ్డున యిసుక నిండిన
స్థలమునందున చితి నేర్పరచిరి
శిబిక నచ్చట దించిరి వారు
తొలగిరి దూరము-అంతట తార

వాలి శిరస్సును తొడపై నుంచుకు
ఏడ్చెను ''నాథా! ఓ మహరాజా!
నా హృదయేశ్వర! ఎంత గౌరవము
చూపెడివాడవు చూడవు ఏల?

అసువులు బాసిన కాంతి బాయదే
కళలు దేరెను నీముఖబింబము
మరల నిన్ను-నే నెప్పుడు చూతును
కరవుదీర-నే నెన్నడు కాంతును

కానన సీమలొ కాంతలందరి
మంగళకర ముత్తయిదు లక్ష్మిని
తుడిచి వేసెను-యముడు రాముడై
అబలలమయ్యా! నడచి వచ్చితిమి

నీ భార్యలను పలుకరించవా!
నీ తమ్ముని-నువు కనలేదా మరి
తారుడు మొదలగు సచివులు వీరు
మంత్రాలోచన చేయవ వీరితొ!

కిష్కింధాపురి కదలివచ్చినది
వారికి తగిన ఆజ్ఞలనిమ్ము
వారు వెడలగ ఏకాంతమున
ఈ వనసీమలొ చరించవచ్చును.''

తార అట్టుల రోదించ గను
స్త్రీలు బలముగా తారను లేపగ
సుగ్రీవుడంతట సాయపడగను
అంగదుడపుడు తండ్రి కాయమును

చితి పైనుంచి-కపిశ్రేష్ఠునకు-
పరలోకమునకు పోవుచునున్న
తండ్రి చితికిని అగ్నిని చేర్చి
అప్రదక్షిణము తిరిగె విధిగను

వాసవుసుతునకు సంస్కారమును
విధులతొ తీర్చి-శాస్త్ర విధిగను
భార్య-కొమరుడు-సోదరు డున్ను
విడచిరి చల్లని జలముల నచట

యుద్ధములో మరణించిన అన్నకు
క్రియ జరిపించి సూర్యతనూజుడు
వ్యగ్రమనస్కుడు రాముని జేరెను
స్త్రీలు జేరిరి కిష్కింధాపురి.

॥శ్రీ రఘురాము॥

## 2 6 సుగ్రీవ పట్టాభి షేకము

తడిసిన వలువల దుఃఖము నిండిన
సూర్యనందనుని కొలిచిరి సచివులు
వారందరు శ్రీరాముని కొలవగ
మునుల సేవలో బ్రహ్మగ వెలిగెను.

వారందరట కూర్చొనియుండగ
బంగరు కొండగ వెలిగెడువాడు
బాల సూర్యుని బింబమువంటి
ముఖము కలిగిన-హనుమంతుడట

రామచంద్రునితొ పలికె వినయముగ:
''రఘుకులదీపక! నీ దయవలన
వానర శ్రేష్ఠుడు-అసాధ్యమయిన
రాజ్యలక్ష్మిని పొందగలిగెను.

దేవా! నీవు అనుగ్రహించుము
సూర్యసుతుడు కిష్కింధకు వెడలి
దివ్యోషధులతొ దీక్షాస్నానము
ముగించి-వానర బలగము తోడను

అభిషేకమ్మగు ఇనకులతిలకా!
మీ సోదరులట అరుదేరగను
రత్నభూషల దివ్యాంబరముల
మిము సేవించును మిక్కిలి భక్తితొ.

అల్లదె గుహ! మీరచటకు రండు
సుగ్రీవునికి పట్టము గట్టుడు
వానర కోటికి పండుగ అగునది''
అన విని రాముడు పలికె తీరుగా:

''హనుమంతా! నా జనకుని ఆజ్ఞ
పదునాల్గేండ్లు వనమున నుండగ-
పట్నమందున పల్లెలొగాని
అడుగిడనయ్యా-అతిబలశాలీ!

శుభముగ పట్టము కట్టుకు నిపుడు
ఓ సుగ్రీవా! ఏలుము రాజ్యము
శాస్త్రవిధిగను అంగదునిపుడు
యువరాజుగను అభిషేకించుము.

బలమున నీతో సమమగు వాడు
కులదీపకుడగు వాలి తనయుడు
కావున నీవు కనకాంగదుని
అభిషేకించుము యువరాజు గను.

శ్రావణ మేఘము లడుగిడనున్నవి
వర్షాకాలము నాలుగు నెలలు
సీతను వెదకగసముయము కాదు
కావున పురమున కేగుము నీవు.

సౌమిత్రితో ఆ కనపడు గుహలో
ఉందును- చక్కని గాలి వీచగా
విశాలమై గుహ కనబడుచున్నది
కలువలు- కమలము లున్నవి జలముల

కార్తీకములో రావణ వధకు
వలయు యత్నము చేయుము నీవు
పురమునకేగి హితులు మెచ్చగ
రాజై ఏలుము రాజ్యము చల్లగ''

నిర్ణయ మటుల రాముడు తెలుపగ
రాముని ఆనతి నందిన వాడై
పురమును చేరి రవిసుతు డంతట
వానర పౌరుల వందన మందుకు

ముచ్చట పలుకుల కుశలము లడిగి
దుఃఖము నున్న తార మనసుకు
ఊరట గొలిపి- అభిషేకముతో
తేజము నిండెను వానరరాజు.

బంగరు పూల శ్వేతఛత్రము
బంగరు కాడల చామరమ్ములు
నవ రత్నములు ఓషధులన్నియు
నవధాన్యములు నవ్వుచు మెరయగ

పాలు నిండిన తరుల చిగుళ్ళు
నీటబుట్టిన ముచ్చట సుమములు
అగరు చందనము- అక్షత లున్ను
శ్వేత వస్త్రములు విరిసిన పూలు

అడవి పందిదగు చర్మము తెచ్చిరి
పులితోలున్నూ తీసుక వచ్చిరి
పాదరక్షలు- కాంచన మున్ను
పాలు- పెరుగు- మీగడ- తేనెయు

గసగస లున్ను- గోరోచనము
కుంకుమ పువ్వు- గంధా దులును
పచ్చకర్పూరము- మణిశిల మొదలగు
మంగళవస్తు సముదాయముతో

పదునారుగురు కన్నెపిల్లలు
పరమ హర్షమున రాగా- నచటకు
భక్ష్యమ్ములతో- మణులు- వస్త్రములు
భూసురోత్తములు తృప్తినిండగా

శాస్త్రము చెప్పిన రీతిగ నపుడు
దర్భలు పరచిన ధరణిమీదను
అగ్ని నుంచిరి- పవిత్రమైన
మంత్రోచ్చారణ జరుపుచుండగా

హోమవిధిని అట మంత్రవేదులు
తీరుగ జరిపి- చిత్రమాల్యముల
ప్రకాశించెడి సౌధమునందు
కనకపీఠిని- తూర్పు ముఖముగ

సూర్యకుమారుని కూర్చొనబెట్టి
నదీనదముల జలములు- మరియు
సాగర జలము కనక కలశముల
నింపిరి- అభిషేకించగ రాజుకు

ఎద్దుకొమ్ములతొ మంగళ జలములు
శాస్త్రము నుడివిన రీతిగ వీరులు
మైందుడు- ద్వివిదుడు- గంధ మాదనుడు
గజుడు- గవయుడు- గవాక్షుడున్ను

అనిలాత్మజుడు ఆంజనేయుడు
జాంబవంతుడు- నలుడు- శరభుడు-
ఇంద్రుని- వసువులు అభిషేకించుట
తలపించునటు అభిషేకించిరి.

ఆనందముగా- పరిమళ జలముల
అభిషేకించగ- అర్కసుతుడట
అమితానందము- రామాజ్ఞగను
యువరాజుగ నంగదు నభిషేకించెను.

వాలి తనయుని అభిషేకించగ
అందరు పొగడిరి ఆ సుగ్రీవుని
రామలక్ష్మణుల కీర్తించి రట
ధ్వజ పతాకలు వానరు లెత్తిరి

శోభలీనినది కిష్కింధాపురి
సోయగ మొలికెను వానరపురిలో
శుభకర మంగళవాద్య ఘోషలు
వినిపించినవా శుభ సమయములో

విష్ణు సముడగు రామచంద్రునికి
వినిపించెను అభిషేక వార్తను
రుమతో- తారతొ స్వేచ్ఛమీరగా
సురపతి విభవము- సుఖము లందెను.
॥శ్రీ రఘురాముని॥

## 27 ప్రస్రవణాద్రిని రామ లక్ష్మణులు విడిసి యుండుట

రాజ్యము నందిన రవిసుతుడంతట
రామదర్శనము చేసుకు వెడలెను
రాముడు- తమ్ముని వెంట నిడుకొని
రమ్యమైన ఆ పర్వత పంక్తుల

పులుల- సింహముల గర్జనమ్ముల
ఎలుగులు- కోతులు- అడవి పిల్లులు
స్వేచ్ఛగ తిరుగుచు- వివిధ లతలతో
మహా వృక్షములు – తేట నీటితో

గండ శిలలతో- లతాగుల్మముల
మేఘ సమూహము అన్నటు తోచు
ఋష్యమూక గిరి పంక్తులలో గల
ప్రస్రవణాద్రికి బయలుదేరెను.

విశాలమయిన గుహను చూచిరి
విడిది చేయగ నిశ్చయించు కొని
వినయ విధేయత నిండిన తమ్ముని
వినుమని పలికెను రామచంద్రుడు:

''ఓ సౌమిత్రీ! ఈ పర్వత గుహ
మనోహరమ్మై విశాలమ్ముగా
ఉన్నది- తగిన గాలి వీచును
వర్షాకాలము గడిపెద మిచట.

ఎత్తుగ ఎదిగిన ఈ శిఖరమున
ఎఱ్ఱగ, నల్లగ, తెల్లని రంగుల
ధగధగలాడుచు వెలిగెడి శిలల
ధాతువులన్నీ మెరయుచున్నవి

గిరిపై పారెడి సెలయేరు లవి
తళతళలాడుచు పరుగిడుచున్నవి
పలు వృక్షములు పొదరిండ్లున్నూ
నేత్రపర్వమై నిలచియున్నవి

జాజులు-మొల్లలు-విరగబూసెను
కదంబ-వావిలి-గోరింట లును
మద్దిచెట్లు మరి ఏరుమద్దులూ
పరిమళమ్ములను గుబాళించును

నెమళులు నిండి వివిధ రకముల
పక్షుల సందడి యింపుగ నున్నది
చేరువలోగల తామర కొలను
విచ్చిన తామర పూలతొ నిండెను

ఈశాన్యముగా పల్లమై-మరి
పడమటి దిక్కున మెరక యున్నది
వాకిలి-నైఋతి దిశలో నున్నది
నాయన! ఈ గుహ శ్రేష్ఠము విడిదికి.

గుహ వాకిటను కాటుక రంగుతొ
నిడుపగు చక్కని రాయి అందమై
ఉత్తర దిశలో కాటుక రంగుతొ
నిలచిన శిఖరము-దిగిన మేఘమగు

దక్షిణ దిశలో తెల్లని ఆ గిరి
రజతాద్రి వలె తేజము నిండెను
తూర్పున సంపెగ-బొట్టుగుచెట్లు
కానుగ-పూగురివింద వృక్షములు.

పొగడచెట్లు మరి ప్రబ్బలిచెట్లు
అశోక తరువులు-లొద్దుగుచెట్లు
రేలచెట్లును-చంద్ర వృక్షములు
మొగలి పొదలవి మనోహరమ్ములు

చిత్రకూటగిరి ప్రక్కన పారే
గంగకు దీటయి ఈ గిరిచెంత
తూర్పు ముఖముగా స్వచ్ఛ జలముతో
పారెను శుభముగ ఈ సెలయేరు

ఏటిగట్టున కనులపండువగు
వృక్షమ్ములలో-పక్షుల కిలకిల!
అనురాగమ్ము అన్యోన్యముగా
చక్రవాకములు తిరుగుచుండగా

హంసలు-సారసపక్షులు నిండి
ఇసుక తిన్నెలవి సొగసుగ తేలగ
శోభగ సాగెడి ఈ సెలయేరు
సారసాక్షులను తలపించునయా!

వస్త్రాభరణా లంకృతలై మరి
నవ్వులు-కేకలు-పాటలు పాడుచు
పరుగులెత్తెడి సుందరాంగనల
తీరుగ తోచుచు సాగెను యేరు

ఎఱ్ఱని-తెల్లని-నల్లని కలువలు
ఏటి నీటిలో శోభిల్లినవి
క్రౌంచుల-నెమళుల రవము లెగసెను
పక్షులు తీయగ పాడుచున్నవి.

నదీ తీరమున మునులు వసింతురు
చందన తరువులు తీచ్చి నిలచినవి
వరుసలొ వేసిన రీతిగ-మద్దులు
నిలబడి శోభను పెంచుచున్నవి

సోదర! మనము వర్షాకాలము
ఇచట వసింతము-కిష్కింధాపురి
దాపున నున్నది-మంగళ వాద్యపు
ధ్వనులన్నియును వినబడు చున్నవి

వానరరాజు సూర్యనందనుడు
సతితో-సకల వైభవమ్ముతో
బంధులగూడి సుఖసౌఖ్యములతొ
రాజ్యపాలనము చేయుచుండును.''

లతాగృహములు గుహలతొ నిండిన
ప్రస్రవణాద్రిని రామచంద్రుడు
విడిసి యుండెను లక్ష్మణమూర్తితొ
మనసున మాత్రము కలత నిండెను

సీతను మదిలో నిలిపిన రాముడు
సంతస మన్నది కరువై రాముడు
శశిబింబము నట-ఉదయా చలమున
చూచి-శోకమున నిండిపోయెను.

అన్న యెన్నడూ అంతటి దుఃఖము
ఉన్నటు కనబడనీయక పోయెను
కావున కలత చెందిన తమ్ముడు
అన్నతొ పలికెను ధైర్యోక్తులను:

''దుఃఖము వదలుము అన్నా రామా!
దుఃఖపడుటచే ఫలితము శూన్యము
నీకు తెలియని విషయము కాదిది
క్రియాశీలివి- ధార్మిక మూర్తివి

ఆస్తికుడవు నువు ప్రయత్నమందు
అంతులేని అతి ఓర్పు చూపెదవు
ఈ విధి నీవు వగచుట వలన
జయాభిలాష సన్నగిల్లును

దుఃఖము వదలక- కృంగి పోయినచొ
మాయ రక్కసుడు రావణాసురుని
జయించుటన్నది- అసాధ్య మగును
కావున వదలుము దుఃఖము నీవిక

వనములు- గిరులు-సముద్రాలతో
నిండిన ధరణిని తలక్రిందు గను
చేయగచాలిన శక్తిమంతుడవు
అసురుని చంపగ చాలుదు వీవే

నీకు ఒకరు మరి చెప్పగవలెనా
వర్షాకాలము వేచి యుండవలె
దుఃఖము వలన మేలు కలుగదు
శరదృతువుకై ఎదురు చూతము

రావణాసురుని- బంధుల- మిత్రుల
త్రుంచగ చాలుదు వీవేనయ్యా!
నివురుగప్పిన నిప్పుగ నుండిన
నీదు విక్రమము నిద్ర లేపెద

సమయము రాగా నీ విక్రమము
ఆజ్యాహుతులతొ జ్వలించునట్లు-
నిదురించెడి-నీ వీరత్వమును
మేలుకొలిపెదను-విజయము తథ్యము!''

శుభము-హితము నిండిన పలుకులు
వినిన రాముడు తమ్ముని చూచి
''మేలుకోరి-నువు అనురాగముతో
వీరుడవై బోధించితి వయ్యా!

సర్వకార్యముల నాశము చేసే
దుఃఖమునిపుడే వదలెద నయ్యా!
సమయము రాగా అప్రతిహత మగు
తేజము-నేను ప్రదర్శించెదను.

నీదు మాటల ధైర్యము చిక్కెను
తేట నీటితో నదులు పారగా
శరత్కాలము వచ్చెడి వరకు
వేచియుందము సుగ్రీవునికై.

మేలు మరచిన మెచ్చరు జనులు
సత్పురుషుల కది బాధాకరము''
అనగా తమ్ముడు కరములు ముడిచి
ప్రియదర్శనునితొ పలికె తీరుగా:

''వానర ప్రభువు తీర్చును శపథము
వేచియుందము నాలుగు నెలలు
ధైర్యము నుండుము-రిపుల గెలిచెదవు
కోపానలము నిగ్రహించుము.

ఓరిమితో మరి నాలుగు నెలలు
రిపు సంహారణకు సంసిద్ధులమై
సింహములున్న ఈ గిరియందే
వేచియుందము-కాచుకొందము.''

॥శ్రీ రఘురాముని॥

# 28 వర్షఋతు వర్ణన

వర్షా కాలము అడుగిడె శోభగ
తమ్ముని గాంచి రాముడు పలికెను:
''పర్వతాల వలె మేఘము లవిగో
ఆకాశమును ఆవరించినవి.

రవికిరణములతొ-సాగర జలమును
గ్రోలిన మేఘము కార్తీకముతో
అషాఢముగా నవమాసములు
మోసిన గర్భము-వెలువరించును.

నింగి వరకును సోపానములుగ
నిలచిన మేఘములన్నీ ఎక్కి
కొండమల్లెలు-మద్దిపూలతో
భానుని పూజలు చేయగ వీలగు.

సంధ్యారాగము అలుముకొన్నది
తెలుపు-ఎఱుపు కలిగిన మేఘము
నింగికి లేచిన వ్రణమున కపుడు
కట్టిన-తెల్లని కట్టుగ తోచెను.

మందమారుతము నిట్టూర్చినటు
సంధ్యారాగము చందన చర్చగ
తెల్లని మేఘము పాలిపోయినటు
కాంతలేని- కామార్తుడు నింగి-

ఎండకు బీటలు వేసిన భూమి
వర్షధారలతొ ఆవిరి విడువగ
దుఃఖమునిండి కన్నీరిడెడి
సీతగ తోచెనుఈ భూదేవి.

ఓ సౌమిత్రీ! మేఘమునుండి
బయలుదేరి- మరి మొగలి వాసనతొ
కలువల చల్లని స్పర్శను యిచ్చెడి.
మంద మారుతము మనకు హాయినిడు.

నిండుగ పూసిన మద్ది-మొగలుల
గుబాళింపులతొ-వాన జల్లులతొ
రిపునిగెలచి అభిషేకము నందిన
సుగ్రీవునివలె తోచును ఈ గిరి.

నల్లని మేఘము-తెల్లటి జల్లులు
హోరుగాలిలో నిలచిన గిరులు
కృష్ణ జినము- జందెముదాల్చి
వేదము చదివెడి వటువుగ తోచును.

మెరపు తీగయను- బంగరు కొరడా
దెబ్బతిన్నదై- నింగిని, మేఘము
వటువు- బాధతో అరచినట్టుగా
తోచును మేఘములందలి ఉరుములు.

లక్ష్మణమూర్తి! నల్లని మేఘము
మధ్య చలించే-మెరపును గాంచిన
అసురునితో తను పెనగు లాడెడి
సీతగ తోచును-మదిలో మెరయును.

మేఘమ్ములతో నిలచెను నింగి
చంద్రుడు- తారలు కనబడకుండగ-
చిమ్మచీకటిగ తోచెడి సమయము
కాముకులకది ఉత్సవ సమయము.

గిరి నెత్తాలలొ విరిసిన మల్లెలు
వర్షాకాలపు సంతోషముతో
ఆనందాశ్రుల ప్రియురాంద్రవలె
తోచెను- కామోద్దీపన కలుగును.

గాలి దుమారములుండక యిపుడు
చల్లనిగాలి వీచుటవలన
వేసవి చెమట ఆగిపోవగా
హాయిగనుండును అలసట తీరును.

రాజులు- యుద్ధోన్ముఖులై వుండరు
స్వదేశమ్మునకు పురుషులు చేరిరి
హంసలు మానస సరస్సు కేగెను
చక్రవాకములు జంటల చేరెను.

వర్షమువలన రహదారులలో
రాకపోకలు ఆగిపోయినవి
మేఘమ్ములతో కొంత కనబడు
నింగి కాననగు- ప్రశాంత కడలిగ.

కొండ వాగులు గిరిధాతువులతో
పరుగిడుచుండెను కొత్త నీళ్ళతో
రాలినపూలు సొగసుగ తేలుచు
వడిగా పరుగిడె కొండచరులలో.

లేత పచ్చికతో నిండిననేల
నడుమ నిలచిన ఆర్ద్ర పురుగులతో
ఎఱ్ఱని చుక్కలు దిద్దినయట్టి
శాలువ కప్పుకు యున్నటు తోచెను.

తుమ్మెదలన్నటు-నల్లగనున్న
జంబూ ఫలములు తీయగ తిందురు
రసాలమ్ములవి మిగల ముగ్గినవి
నేలరాలినవి-రుచి చెడియున్నవి.

పూసినపూలు ఎగసిన పులుగులు
కడలిని చేరే నదీ నదములు
కామోద్రేకము నిండెను దున్నలు-
ప్రకృతి-హరినిక నిద్ర పుచ్చును.

విద్యుల్లతలవి పతాకములయి
కొక్కెర పంక్తులు సుమహారములై
పర్వతాలవలె కదలు మేఘములు
పోరెడి కరులై గర్జించినవి.

మదపు టేనుగు వనమున సాగుచు
మేఘగర్జనము వినినంతటనే
పోరగ వచ్చెను మరియొక కరియని
వెనుకకు తిరిగెను-తిరిగి పోరగా.

వేడుకగాను నెమళ్లు ఆడెను
పచ్చికతోను నేల నిండెను
వాన వెలసిన అపరాహ్ణమది
రమణీయముగా తోచుచున్నది.

నెమళుల నృత్యము కరి-ఘీంకారము
తుమ్మెద ఝుమ్మని పాటలు పాడగ
మంకెన-కదంబ - ఎన్నో పూలతో
సోయగ మొలికెను ఈ వనమంతయు.

జలభారముతో మేఘములవ్వి
సాగలేక మరి - ఆగినట్టుగా
గిరిశిఖరముల నిలచియున్నవి-
సాగుచున్నవి అలసట తీర్చుకు.

అరపులు-చప్పుడు-కేకలు-రవములు
నాట్యము-పోరుకు తలపడు కరులు
పూలసొగసులతో-మత్తుల నిండిన
పానశాలవలె తోచెను వనము.

పొందుకోరి మరి సాగు కొక్కెరలు
బారులు తీర్చి సాగుచుండగా
ఆకాశమునకు కట్టినయట్టి
తెల్లని తామర లన్నటు ఊగెను.

చాతక పక్షులు దప్పికనిండి
రంగులు నిండిన రెక్కల ఎగిరి
సురనాయకుడు వర్షము నిడగా
నీటి ముత్తెముల త్రాగెను ముదముగ.

తంత్రీ స్వనము తుమ్మెద నాదము-
కప్పల బెకబెక కంఠ తాళములు-
మేఘ గర్జనలు మృదంగ ధ్వనులై-
సంగీతమునే పాడెను వనము.

కేకలు వేయుచు నాట్యమాడుచు
పురులు నిండుగా విప్పిన నెమళులు
పాటలు-నాట్యము నిండిన ఈ వని
గాన సభలనే నిర్వహించెను

గట్టులు త్రెంచుకు సాగే నదులు
కాయలు-పండ్లు-పూల బరువుతో
కడలిని చేరగ సందడి చేయుచు
సాగెడి మదవతి అన్నటు తోచును

ఆకాశములో వ్రేలాడునటు
నిలచిన మేఘము సంద్రపు ఘోషను
ధిక్కరించి-తను భూమిని నదులను
జలముతొ నింపెద నన్నటు కురిసెను

పూర్ణకుంభముల జనులందరును
అభిషేకించగ-రాజులవోలె
నిలచెను గిరులు-వాసపుడిచ్చిన
మేఘములనెడి జలకుంభములతొ

తడిసి నిండుగా నిలచిన గిరులు
నిలువుగ నిలబడి మెరిసి పోవగా
జలాభిషేకపు ఆనందముతో
ఐశ్వర్యమును చూపుచు నున్నవి.

మెరసి పోవగా కడిగిన గిరులకు
మీద పారెడి జల ప్రవాహములు
లలనామణుల ఉరమున జారిన
ముత్తెపు హారములన్నటు తోచెను

ఎత్తుగ గిరిపై పారెడి నీటికి
మధ్య మధ్యలో కొండ రాళ్ళవి
అడ్డు తగులగా చెల్లాచెదురై
నీటి ముత్యములు దొరలుచున్నవి

గూటికి చేరిన పక్షులబట్టి
ముకుళిత కమలములుండగ చూచి
సూర్యాస్తమయము అగునని తోచును
ప్రకృతి సుందరి నిదురలొ జారును

దండయాత్రలు ఆగిపోయినవి
దండు దారిలో నిలచిపోయినది
ధరణీసురులు సామగానములు
దండిగ చేసే-భాద్రపదమిది

కోసల భూపతి-భరతుడు ఇపుడు
సంబారములను సమకూర్చుకొని
గృహకృత్యములు-ప్రక్కకునెట్టి
నియమముతో తను గడుపుచుండును

బహుకాలమ్ము గడచిన పిదప
నన్ను గాంచిన కోసల ప్రజలు
చేసెడి కోలాహలముగ తోచుచు
సరయూ పారును అతి వేగముగా

సోదర! వానరరాజై మిత్రుడు
రాజ్యభోగము అనుభవించుచు
రాజ్యము నేలుచు సుఖముగ నుండెను
భార్య దూరమై బ్రతుకుచుంటిని.

గొప్ప రాజ్యము చేతికి రాక
ఛాయగ నుండెడి సుదతి లేకను
నీటికోతకు తెగిన గట్టువలె
దీనుడునై-నే నిలచియుంటిని.

వర్షాకాలము గడుపగ కష్టము
కష్టము కద్దరి కనబడకున్నది
రావణాసురుడు అసాధ్యుడయ్యెను
ఎటుల దొరుకును మనసుకు శాంతి?

వర్షాకాలము వెదుకుట కష్టము
త్రోవలు తిన్నగ సాగనీయవు
కావున నేనే- అర్కసుతునితో
ఆగుమంటి నీ నాల్లు మాసములు.

చాలాకాలము ఇడుములబడెను
అందెనువానర రాజ్యము యిపుడే
నా పని ముఖ్యముఅనగా తగదు-
మిత్రుని సుఖముతలచితి మదిలో

నా ఉపకారము మరువడు అతడు
సందేహము-నే పడగా తగదు
అదనుకోసమై వేచియుందము
అతని అనుగ్రహ మందగవలెను.

వీరుడు తిరగి ప్రత్యుపకారము
చేయగ చాలును-మరి కృతఘ్నుడు
మేలు మరచును మనసులేకను-
మంచి మనసులను వ్యధలో ముంచును''

అనిన రామునితొ వినయమునిండి
పలికెను అపుడు సుమిత్ర తనయుడు:
''అన్నా! మానవ నాథుడ వీవు
మహావీరుడవు-మంచికి నెలవు.

వానరరాజు మాట నిలుపుకొని
మంచిమనసుతో అండగ నిలచును
కోరిక తీరును-జయము తథ్యము
వేచియుండవలె శరదృతువుకై

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 29 మారుతి సుగ్రీవునికి కర్తవ్యము బోధించుట

మెరుపులు-మబ్బులు నింగిని వదలెను
వర్షాకాలము వెనుకకు మరలెను
చంద్రుని వెన్నెల- అతిరమణీయము
శారదరాత్రులు శోభగ విరిసెను.

సుగ్రీవుడు అతి సంతోషముతో
భోగలాలసుడుగా పడివుండెను
రాచకార్యములు మంత్రుల వేనని
అహోరాత్రములు సుఖముల మునిగెను.

కామకేళిలో కరగి పోవుచు
భామలందరిని చెంత చేర్చుకు
సురాపానమున సర్వము మరువగ-
హితముకోరి-హనుమంతుడు పలికెను.

మాటనేర్పరి-పనిలో మెలకువ
మంచి చెడ్డల వివరము తెలిసిన
మంచి నమ్మకము రాజుయందుగల
మంచి మంత్రి హనుమంతుడు పలికెను:

''వానర రాజా! రాజ్యభోగములు
కీర్తి ప్రతిష్ఠలు దొరకెను నీకు
మిత్రుని కార్యము మిగిలి యున్నది
సమయము మించక చేయగవలెను.

మిత్రులను, మరి సైన్యమ్ములను
ధనాగారము ప్రాణప్రదముగా
చూచుకు ఏలెడి- ఏలిక రాజ్యము
అమితముగా అభివృద్ధి నందును.

సకాలమ్ములో మిత్రుని కార్యము
చేయకపోయిన కలుగు నన‌ర్థము-
సదాచారుడవు-పుణ్యకార్యములు
చేయుటయందే గురికల వాడవు.

సమయము దాటగ -చేసిన మంచి
వ్యర్థమగునని తెలియుము నీవు
వీరుడ వీవు-వైదేహిని ఇక
వెదకుటన్నది మిత్రుని కార్యము.

కాలాతీతము అయిపోయినది
రాముడు సర్వము తెలిసినవాడు
ఎంత ఆత్రుత మనసున నున్నను
ఎదుటివాని మది ననుసరించును.

అప్పుడు రాముడు- ఆర్తరక్షకుడు
అప్రతిహతమగు పౌరుష వంతుడు
అనిన మాటకై ఎన్ని కష్టములొ
అన్నీ గెలుచును ఆ రఘురాముడు.

అడగకముందే రాముని కార్యము
అతిమెలకువగా ఆరంభించిన
అంటదు దోషము-అందుకు నీవు
ఆజ్ఞాపించుము వానరవీరుల.

అడగకముందే సాయము చేసే
అంతటి గొప్ప గుణవంతుడవు
నీవే సాయము ముందుగ పొందియు
ఆలసించితివి ఏల కపీంద్రా?

వానర సేనలు-భల్లూకములకు
నాథుడవీవు కిష్కింధాపతి!
రామకార్యమును నెరవేర్చగల
సామర్థ్యము నీకున్నది రాజా!

కోదండముతో శ్రీరఘురాముడు
సురాసురులను-మహోరగులను
ఎదిరి గెలువగా చాలినవాడు
అమిత శక్తిగల అతిసమర్థుడు.

నీ ప్రతినను నువు నెరవేర్చెదవని
నీకే వదలి చూచచుండెను
నీకొరకై తను వాలిని కూల్చి
నీ సుఖ సౌఖ్యము ముందుగ చూచెను.

వాలి- రామునికి శత్రువు కాడు
నీ సంతోషము కోరి చంపెను
భూమ్యాకాశములందున వెదకి
సీతాదేవి జాడ తెలియుము.

దేవాసురులకు మరుద్గణములకు
భయపడడయ్యా రామచంద్రుడు,
అంతటి వానికి అసురులు లెక్కా?
ఆదరించె నిను- అతి విక్రముడు.

రాముని నీవు సంతస పరచుము
ఆనతినిమ్ము- మాలో వీరులు
ఆకాశములో పాతాళములో
సంద్రములోనూ వెదుక సమర్థులు.

సాహస వంతులు వెనుకడుగిడరు
భయము నెరుగని అతి గుణవంతులు
కోట్లకు పైన నీ సేవలలో
వేచియుండిరి ఆనతి కొరకై

నీ విచ్చుటనే నిలబడి- వారిని
ఆజ్ఞాపించుము- నీ విధేయుల
శక్తికి తగినటు పురమాయించుము
పుణ్యపురుషుని కార్యము తీర్చుము.''

సందర్భముగా మంచి సమయమున
స్నేహితునిగ మరి సచివోత్తమునిగ
రాముని కార్యము శిరోధార్యమని
చేయగ చెప్పెను ఆంజనేయుడు

వానరరాజు సంతసమందెను
నీలుని అచటకు రావించుకొని
రామకార్యము నెరవేర్చుటకు
అమిత సైన్యమును సమకూర్చమనె.

''నా ఆనతిగా అన్ని దిక్కులలో
కపినాయకులను- వీరులందరిని
శీఘ్రముగా నువు రప్పించవలె
ఉత్సాహవంతుల సేకరించుము

సేనలు- కలిసి పోకుండగను
తికమక పడక- తెలివితొ నుండగ
వారందరు యిట వచ్చినంతనే
కాగల కార్యము నీపై నున్నది.

నేటినుండి ఒక పక్షము రోజులు-
గడువు లోపల వానరులందరు
సేనలొ చేరగ ప్రకటన చేయుము
సుగ్రీవాజ్ఞ మీరగ వలదను

ఆనతి మీరిన మరణ దండనే-
అందుకు తిరిగి విచారణ లేదు
ఇది నా నిర్ణయమన్నది తెలియుము
అదియే తెలుపుము వీరులందరికి.

అంగదునిపుడే వెంట నిడుకొని
జ్ఞానవృద్ధులు వయో వృద్ధులగు
కపివీరులకు వినయము నిండి
తెలియజెప్పుము ఈ విషయము'' అని

అర్కసుతుడు తానాజ్ఞాపించి
అంతఃపురమున అడుగుబెట్టెను-
ఆంజనేయుని- ఆనందముగా
అంగదాదులు పొగడిరి అపుడు.
||శ్రీ రఘురాముని||

❈❈❈

## 30 శరత్కాల వర్ణన-సుగ్రీవునిపై శ్రీరాముడు కోపించుట

వర్షాకాలము సాగిపోయెను
నిర్ణయించిన గడువు తీరెను
నింగినంతటను వెండి పూసినటు
వెన్నెల చల్లగ ఆవరించెను.

ఆ పద్మాక్షి-నా ప్రియురాలు
చక్ర వాకముల ధ్వని వినినంతనె
ముదముగ నన్ను చేరుచుండెను
నే దరిలేక ఏ విధి నున్నదొ?

హేమధాతువుల శోభగ వెలిగే
గిరి శిఖరముపై రాముడు కూర్చొనె-
తలపుల నిండెను ధరణీనందిని
దుఃఖము ఎగసెను రామచంద్రునికి.

ధరణీనందిని నా దరి లేనిచొ
ధరణి సోయగము ముదము నిడకను
ప్రకృతి శోభల మనసు నిలువక
సుఖసంతోషములన్నవి లేవు.

''నా ప్రియురాలు-బాలామణి తను
సారసపక్షుల స్వరముతొ పలుకును
ఆడుకొనును ఆ పక్షులతోను
ఏ విధినున్నదొ ఆ రమణీమణి?

కాముడు వదలడు ఆ సుకుమారిని
కాంతలేక మరి శాంతియె లేదు''
వర్షధారకై చాతక పక్షిగ
విలపించెను అట రామచంద్రుడు.

బంగరు రంగు పూలు పూసిన
వేగిస చెట్లను చూచి మురియును-
వేగిస పూలను చూచి వెదకును
నే కనబడక దుఃఖము నిండును.

గిరినెత్తాలలొ పండిన ఫలములు
అన్న సేవకై తేగా పోయిన
సుమిత్ర తనయుడు తిరిగి వచ్చెను
అన్న దుఃఖమును తాను గ్రహించెను.

కలహంసధ్వని మేలుకొలుపులై
కలభాషిణి తను నిద్రలేచును
కళకళలాడే సుందర వదన
కనులు విప్పి మరి ఏ ధ్వని వినునో?

''వీరుని ధైర్యము నిల బెట్టుటకై-
వినయముగా హితబోధ చేసెను:
అన్నా! నీవు కామవశుడవై
ధైర్యము విడచుట తగదిది వినుమా!

కార్యసిద్ధికై వలయు యత్నము
చేతము-మనసు చెదరనీయకు
జయము నందెడి మార్గము నరయుము
ధైర్యమునీవు అవలంభించుము.

సాయపడెడి సుగ్రీవుని శక్తిని
సామర్థ్యమును ఆలోచించుము
అతని పనికినువు చూపిన శక్తిని
స్వకార్యసిద్ధికి వినియోగించుము.

మానవ నాథుడవయ్యా రామా!
మాననీయుడవు మహావీరుడవు
మాతకు నీవేసర్వముగాదా
మరియొక వ్యక్తికి తాకగవశమా?

అగ్ని హోత్రము సీతామాత-
ఆమెను తాకిన నాశన మగుదురు
ఆలోచించుము అన్నా రామా!''
అని నిర్భయముగ పలికెను తమ్ముడు.

సమయోచితము సందర్భముగా
ధర్మార్థముతో-మనసు గ్రహించి
రాజనీతితోతమ్ముడు పలుకగ
రాముడు పలికెను లక్ష్మణమూర్తితొ:

''సోదర! నీవు నుడివిన యటుల
కార్యసిద్ధికై యోచన కావలె
ఉత్సాహాదులు అవసరమైనవి
ఫలమునెంచని క్రియ కావలయును''

అనుచు పలుకగా అవనిజ-మదిలో
మరి మరి మెదలి మాటలు పెగలక
ఎంతో వేదన నిండిన రాముడు
పలికెను తిరిగి లక్ష్మణమూర్తితొ:

''సురనాయకుడు వర్షధారలతొ
ఈ వసుంధరను సంతస పరచెను
సస్యసంపదకు ప్రాణము పోసెను
సకల శుభములు చేకూర్చెనయా!

నల్లని మేఘము గంభీరముగా
గిరి శిఖరముల-వృక్షాగ్రముల
సంచరించి మరి మురిసి కురిసి- ఇక
అలసి పోయినటు అగుపడుచున్నది.

మేఘ గర్జనలు కరిఘీంకారము
నెమళుల కేకారావము లన్నియు
జలముల జారే సెలయేరులయు
ధ్వనులన్నియును ఆగిపోయినవి.

జలముల కడిగిన ధగధగ మెరిసే
పర్వత సానువులన్నియు కూడ
కుంకుమ, సుగంధ ద్రవ్యములన్నియు
పూసుకొన్నటు శోభగ నున్నవి.

శరదృతువు తన విభవమునంతయు
ఏడాకులుగల అరటి చెట్లకు-
తారాచంద్రులు-కర్మసాక్షికి
మదకరీంద్రముల కందించెనయా!

ఏడాకులుగల కదళీ తరువులు
విరగపూయగా వెడలు సుగంధము
తుమ్మెదపాటకు శ్రుతిచేసినది
మదపు టేనుగులు పరవశించెను.

ఇసుక తిన్నెల- చక్రవాకములు
రెక్కల శోభగ పుప్పొడి నిండగ
మదనుని శరముల బారిపడినవి
హంసలు వాటితొ ముదముగ నాడెను.

మదించి తిరిగెడి కరీంద్రములపై
గర్వించెడి ఆబోతులపైనను
తేట నీటితో పారు నదులపై
శరల్లక్ష్మి తను శోభిలుచున్నవి.

నింగిని మేఘము లగపడకున్నవి
నెమళుల కోలాహలమది తగ్గెను
నిండుగ పూసి, వంగిన వేగిస
నయనానందము కూర్చుచున్నది.

అరటి పూవుల వాసన మత్తుతొ
మదజలమ్ములు కారె దంతులకు-
పెంటి ఏనుగుల చేరి- వనముల
తామర కొలనుల చేరగసాగెను.

వర్షములవ్వి వెనుకడుగిడగా
ఆకసమిపుడు తళతళలాడుచు
తోమిన ఆయుధమన్నటు మెరసెను
శుభ్ర జలములతొ నదులు నిండెను.

ఎఱ్ఱని కలువల చల్లని గాలులు-
దిక్కులు చక్కగ కనబడుచున్నవి
సూర్యకిరణముల ఎండిననేల
నెఱియలు విచ్చి కనబడుచున్నది.

రాజులు సేనతొ కదలుచుండిరి
కయ్యానికి మరి కాలుదువ్వుతూ-
ఆబోతు రంకెలు వినబడుచున్నవి
ఆలమందలో జొరబడుచున్నవి.

కేకి- పింఛమును వదలివేయగా
ఆభరణమ్ములు పోయినట్లయి
నదీతీరమున చేరగ వాటిని
హంసలు హేళన చేయుచున్నవి.

ఆవుల అంబారవములు ఎగసెను
మదపు టేనుగులు సాగె మందముగ
పెంటి ఏనుగులు వెదకుచు సాగెను
బెగ్గురు పక్షులు కూసె శ్రావ్యముగ.

సెలయేటి స్వనములు సన్నగిల్లినవి
ధ్వనితో వీచే గాలులు తగ్గెను
మహానదులకు ఉరవడి తగ్గెను
కప్పల బెకబెక వినబడకున్నది.

వర్షకాలమున బిలముల దాగిన
విషసర్పములవి బయట పడినవి
వివిధ వన్నెలతొ విహరించుటకై
వడివడిగానవి సాగుచున్నవి.

సాయం సంధ్యాసుందరి నెంతో
ఒడుపుగ-చంద్రుడు-తన కరములతో
పట్టుకొనగను-విరిసిన తారల
కనుపాపలతో - ఎఱ్ఱని కాంతితొ

ఇనుమడించిన అనురాగముతో
నింగి అనెడి-తన చీరను తానే
విప్పివేయుచు నున్నటు తోచగ-
నాయకి-నాయక భావన నింపెను

ఉదయ చంద్రుడు ముఖబింబమయి-
తారలు-తెరచిన కన్నులు కాగా
వెన్నెల వెలుగు, తెల్లని చీరగ-
నిశాకాంత-తను శోభిలుచున్నది

బెగ్గురు పక్షులు-పండిన గింజల
పొట్టనింపుకొని నింగికి ఎగరగ
పూలమాలలవి ఆకాశమునకు
విసరినట్టుగా శోభిలుచున్నవి

తెల్లని కలువలు-నిదురిడు హంసలు
నిండిన గొప్ప తటాకములన్నియు
మబ్బులులేక తారాచంద్రులు
నిండిన నింగిగ తేజరిల్లెను

మొలనూలన్నటు హంసలు మెరయగ
కలువలు-తామర పూలు-దండలై
చక్కని కోనేళ్ళన్నియు కూడ
అలంకారముల అంగనలాయెను

వెదురు పొదలలో విరిసిన నాదము
ఆవుల అంబారవములన్నియు
ఆబోతు రంకెలు కలసి అచ్చట
సహజమైన సంగీతము నింపెను

నదీతీరముల నిండుగ పూసిన
రెల్లు పొదలను-మంద మారుతము
కదుపగ-తెల్లని పట్టుచీరలను
కట్టిన స్త్రీ-జఘనమ్ముల పోలెను

మధుపానముతో మత్తు నిండిన
జంట కూడిన తుమ్మెదలన్నియు
పుప్పొడినిండి గౌరవర్ణముతొ
గాలిలొ తేలుచు పోవుచున్నవి

నదులు-చేపలను వడ్డాణముతో
స్త్రీలై-రాతిరి సుఖముల తేలి
ప్రాతఃకాలము కాగా-గృహముల
చేరుచున్నటు మెల్లగ సాగెను

విరగబూసినవి వివిధ తరువులు
పూవిలుకాడు స్వేచ్ఛగ తిరిగెను
పక్షులు ముదముగ విహరించగను
మధరమైన ధ్వని వినపడుచున్నది

సౌమ్యుడ వినుము! రాజపుత్రుడవు-
పాత వైరములు పైకి త్రవ్వుకొని
రాజులు-రణముకు సుముఖులు కాగా
యుద్ధ ప్రయత్నము చేయుచుండిరి

మిత్రుడు-యత్నము చేసెడి ఛాయలు
కనబడకున్నవి-వర్షాకాలము
నాలుగు నెలలవి నూరు ఏండ్లుగా
సీతను గానక కుములుచుంటిని.

చక్రవాకి తన జంట విడువనటు
సీతకూడ నా వెంట వచ్చినది
దుర్గమ దండక వనికి-జనకజ
వనవిహారముగ బయలుదేరెను.

లక్ష్మణమూర్తీ! రాజ్యములేకను
దేశమువదలి అడవులయందు
భార్యలేక-నే దుఃఖమునుండగ
దయరాకున్నది వానరపతికి.

శరణుజొచ్చితిని-అసహాయుడను
అని - అవమానము చేయగ తలచెనొ?
తన పని తీరగ-తానుగ చేసిన
ప్రతిన మరచెనో-దుర్మతి అతడు.

సోదర-నీవు కిష్కింధకు పో!
సుఖములతేలే అర్కసుతునిగని
చెప్పుము వానితొ-నా మాటలుగా
ప్రతిన తీర్చుటది కర్తవ్యము అను.

పుణ్యముగానీ పాపముగానీ
మాటకు నిలచినవాడే వీరుడు
పురుషోత్తముడగు ప్రతిన నిలిపిన
పురుషాధముడగు ప్రతిన మరచిన

తన పనితీరి ప్రత్యుపకారము
తలచనివాడు కృతఘ్నుడగును
అట్టి కృతఘ్నుడు మరణించినచో
కుక్కలు-నక్కలు ముట్టవు కట్టెను.

తమ్ముడ! చెప్పుము సుగ్రీవునితో
బంగరు తొడుగుతొ మెరపు తీగవలె
మెరిసే ధనుసును పోరాటములో
ఎక్కు పెట్టగా చూడగ తలచెనొ?

కోపముతో-నే నారి ధ్వనించగ
పిడుగుల సవ్వడి వినవలెననియా?
నా ప్రతాపము తీరుగ తెలిసియు
నీ సహాయము నాకు కలదని.

సర్వము తెలిసియు త్వరపడడేమి?
తన పని తీరిన దనుకొన్నాడా?
సీతాన్వేషణ సంకేతమును
చేసికొంటిమని గుర్తేలేదా?

వాలినిచంపి-వానర రాజ్యము
వానికిచ్చిన విషయము మరచెన?
అంతఃపురమున అందములందు
మత్తులొ మునిగి తేలుచుండెను.

నాలుగు నెలలు గడచిపోయినటు
తెలియక పోయెను-స్పృహ లేదతనికి
మధువు మత్తులో స్త్రీలోలుడయి
దైన్యమునున్న, నను మరచెనుగా!

ఓ బలవంతా! నా కోపమును
తెలియ జెప్పుము -మరియొక మాట
చెప్పుము వానితో-వాలి సాగిన
మార్గము తెరిచేవున్నది వినుమని,

వాలి సాగిన మార్గమునింకా
మూసివేయనేలేదని చెప్పుము-
ఆ దారిని మరి అడుగిడవద్దను
ఒక్క బాణమే వాలిని గొనెనను.

ప్రతిన తీర్చగా ముందుకు రమ్మను
ప్రత్యుపకారము ఛేయగ లెమ్మను
ప్రతిన తప్పినచొ సబాంధవముగా
వానిని-చంపుట-ప్రతినని తెలుపుము.

మన స్థితి నీకు తెలియును సోదర!
మనకు మేలు మరి కలిగెడి తీరుగ
మనమేవిధి మాటాడుట మేలో
మంచిచెడ్డలు తెలిసి పలుకుము.

కాలాతీతము జరుగుచున్నది
ఆలసించకు త్వరగా పోవలె
వానితొ చెప్పుము ఓ సౌమిత్రీ!
ప్రతినకు నిలబడి ధర్మము నెరపగ.

శాశ్వతమైన ధర్మము తెలిసి
సత్యమునకు మరి బద్ధుడవగుమను
అటుగాకున్నను వాడిబాణమున
అన్న వాలిని చూచెదవనుము.

యమసదనమునకు పోవలదనుము
సీతను వెదకుట కర్తవ్యమును''
అనుచు రాముడు కోపముతోను
దుఃఖమునిండి పలుకుట వినెను.

అన్ని మాటలూ వినిన సోదరుడు
అన్న వేదన తీరుగ తెలిసెను
అన్నను చూచుచు ఆ పరాక్రముడు
అన్నియు తిరిగి యోచన చేసెను.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 31 సౌమిత్రి కోపము

''రాముని స్నేహము భోగములిడెనని
అట-సుగ్రీవుడు తలచక యుండెను
రాజ్య సుఖములు నాశనమైనచొ
బుద్ధి స్మరించును రామనామము''

అనుచు లక్ష్మణుడు కోపమునిండి
''మేలుమరచి-మరి తుచ్ఛసుఖముల
మునిగియున్న ఆ కోతిరాజును
వాలి-పోయిన త్రోవలొ పంపెద.

అన్నా! నేనిక జాగుచేయను
అర్కసుతుని మరి చంపెదనిపుడే
అంగదుడుండెను వదినను వెదుకగ
ఆనతి నిడును తన కపిసేనకు.''

సామర్థ్యముగల వీరునిగాంచి
యుద్ధోన్ముఖుడై యుండుటగాంచి
రామచంద్రుడు శాంతవచనముల
''మిత్రుని వధ-మరి పాపము అగును.

కోపము నెవడు వివేకమ్ముతో
కాల్చగ చాలునొ- అతడుత్తముడు
ధన్యుడు ఆతడు- సద్గుణ యుతుడవు
కావున మిత్రుని చంపుట తగదు

నే కోపముతో నుడివినవన్నియు
పరమార్థముగా నెంచకుమయ్యా!
మెత్తని మాటల మెల్లగ చెప్పుము''
అనగా తమ్ముడు కొంత శాంతపడె

ఇంద్ర ధనుసుతో సరిపడు విల్లు
శిఖరములుండిన మందరమన్నటు-
ప్రళయ కాలమున యముని తీరుగ
భాసిలెనచట సుమిత్ర సుతుడు

అన్న మాటలు- అనెడి మాటలు
మదిలో తలచి- సురగురుసముడు
వడిగా నడచుచు- చెట్లను కూల్చుచు
రాళ్ళను పొడిపొడి చేయుచు సాగగ

మదకరీంద్రమును తలపించుచును
రామ కోపమను అగ్నిఆత్మడై
భయంకరమగు వడగాడుపుగా
వడిగా సాగెను లక్ష్మణమూర్తి

చిక్కని కొండల నడుమన ఉన్న
కిష్కింధాపురి గాంచినవాడై
సుగ్రీవునిపై కలిగిన కోపము
పెదవులపైన అదరుచుండగా

నడిచే గిరివలె వచ్చు మనిషిని
గాంచిన కపులు- తరుల గిరులను
ఎత్తుకురాగా కోపము హెచ్చి
చూపుల వారిని దహించుచుండగ

యముడే ఇటుగా వచ్చె ననుచును
భయపడి పరుగిడ- కొందరు వీరులు-
లక్ష్మణమూర్తిని తెలిసిన కొందరు
ఉగ్రమూర్తిగా వచ్చెను అనుచు

విషయము చెప్పగ వానరరాజుకు
మత్తులొ నుండగ తలకెక్కదయె-
సచివుల ఆనతినందిన వీరులు
గిరి–మేఘములు- కరిబలసములగు

పది ఏనుగులు వంద ఏనుగులు
పదివేల దంతుల బలము గలిగిన
పులులవంటి పరాక్రమవంతులు
శిలలు- తరులతో అగడ్త కాచిరి

అన్న బాధ- హృది కలచివేయగా
అర్కసుతునిపై అమిత కోపమున
అడుగులు వేసెను- వేడి నిట్టూర్పుల-
అతని కన్నులవి జ్యోతులాయెను.

పొగతో కూడిన అగ్ని హోత్రమన
శరము ములికికొన- కొరగ మెరయగ
ధనుసే శిరసై- తేజము విషమై
ఐదు తలలుగల పన్నగ మాయెను

ప్రళయ కాలమున అగ్ని యన్నటు
పన్నగమన్నటు బుసలను కొట్టుచు
ఆగ్రహించిన లక్ష్మణమూర్తిని
అంగదుడపుడు చేరగ భయపడ

లక్ష్మణమూర్తి- అంగదు గాంచి
మంచి మాటలతొ పలికె ప్రియముగా:
''నీ పినతండ్రికి తెలుపుము నీవు
లక్ష్మణుడిటకు వచ్చినాడని.

అన్న దుఃఖమును చూడలేకను
శత్రుభీకరుడు లక్ష్మణమూర్తి
వచ్చి నిలచెను ద్వారము వెలుపల
వీలగు రీతిని ఆచరించమను

ఏమి చెప్పనో నీ పినతండ్రి
నాకు చెప్పుము- త్వరగా రావలె''
అనిన మాటలకు శోకభయములతో
తారకు- రుమకు తీరుగ చెప్పెను.

స్పృహలోలేని సుగ్రీవునకు
వినబడకున్నది విషయమేమియు
లక్ష్మణమూర్తిని గాంచిన కపులు
భయముతొ కిచకిచ అరచి లేపగా.

మెల్లగ లేచెను కిష్కింధాపతి
ఎఱ్ఱని కన్నుల మత్తు నిండెను
మెడను హారములు చిక్కుపడినవి
అంగదు పలుకులు చెవికెక్కినవి.

ప్రభువుకు ఇష్టము అయిన మిత్రులు
ప్లక్ష- ప్రభావులు అను కపివీరులు
రాజుకు హితము, మేలు కోరుచు
పలికిరి: ''రాజా! దశరథ తనయులు

సోదరులిద్దరు నీకీ భోగము
అమరగ చేసిన- అరి భయంకరులు
భూమినెల్ల పాలించగ యోగ్యులు
సత్యవర్తులు పుణ్యాత్ములయా!

వారిలొ లక్ష్మణుడనెడి వీరుడు
విల్లు ధరించి వచ్చెను యిటకు
వానిని గాంచిన వానరులందరు
వణకిపోవుచు పరుగిడుచుండిరి.

ఒంటరిగా మరి వచ్చె నెట్టులన-
పగసాధించే దృఢనిశ్చయమను
రథమును ఎక్కి- తృటిలో చేరెను
రాముని వాక్యము సారథి ఆయెను.

చూపుల కాల్చుచునున్నాడీ పురి
చేవగలిగిన పురుషోత్తముడు
చేరుము- బంధుల హితులందరితో
క్షమించ వేడుము పదముల వ్రాలి.

ధర్మమూర్తి యగు రామచంద్రుని
మాట ప్రకారము నడువుము నీవు
మాట నిలుపుకొను సత్యవర్తి యని
మాట గెలుచుకో విను మహరాజా!''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 32 సుగ్రీవునికి మారుతి హితోపదేశము

మనసు కెక్కినది- మత్తు జారినది
వణకుచు నిలచి-''నేనెప్పుడును
వారికి కీడు తలంచలేదు
విరోధులెవరో కల్పించినదిది.

వాని మనసును తెలిసి మసలవలె
నేను భయపడను దాశరథులకు
వ్యాకుల మేమన- నా ప్రియమిత్రుడు
అకారణమ్ముగ కోపించెనని

మిత్రుల చేర్చుట సులభమైనది
మైత్రి నిలుపుటది కష్టమైనది
చంచలమైనది మనస్సు గనుక
చిన్న విషయముల మైత్రి చెడునుగద!

నాకీ సాయము రాముడు చేసెను
నేనే ప్రత్యుపకారము చేతును
తలచుకొన్నచో భయము కలుగును
నా రాముని దయ నేనెటు మరతును?''

మంత్రి సత్తముడు మారుతి అంతట
పలికెను-''రాజా! రాముని సాయము
మదిలో తలచి పొంగుటమేలు-
ఇంద్రసమానుని వాలిని చంపెను.

నీకు హితమును కూర్చుటకొరకై
నెయ్యము విడువని కోపము నిండి
పంపెను తమ్ముని- గుర్తు చేయుటకు
మత్తులొనున్న నిను మేల్కొలుపగ.

వర్షాకాలము సాగిపోయెను
శరదృతువు తను శోభిలుచున్నది
గడువు పూర్తిగా దాటిపోయినది
యుద్ధ ప్రయత్నము చేయు కాలమిది.

నీవు స్వయముగా పోకపోతివి
వారి మనసును తెలియకపోతివి
మత్తునిగా నిను వారు గ్రహించిరి
హెచ్చరించగా వచ్చె లక్ష్మణుడు.

సతి అపహరణతొ దుఃఖిలు రాముడు
అన్న భాధతో జ్వలించు తమ్ముడు
కఠినముగా మరి మాటాడినను
ఎదిరి- నీవు మరి పలుకుట తగదు.

దోషము నీవు చేసితివయ్యా!
దోషహరణకై కరుణ కలుగగా
చేతులు రెండును జోడించుమయా
అదియే చక్కని మార్గము రాజా!

కోపమునిండి నిలచిన రాముడు
కోదండముతో-సురాసురులతో
నిండి వెలుగు- ఈ జగతినంతను
నిలుపగ చాలును తన వశమ్మున.

మెత్తని మనసు రామచంద్రునిది
మ్రొక్కిన- నీపై మరి కోపించున?
పుత్రులు- మిత్రుల నందర జేర్చుకు
జేరుము రాముని పాదసన్నిధికి..

భర్త చెంతకు జేరు భార్యగను
భక్తి ప్రవత్తుల నిలువుము సన్నిధి
నీ ప్రమాణము నిలుపుము అచట
నీ హితమును-నే కోరి నుడివితిని

రామలక్ష్మణుల ఆజ్ఞను మీరగ
మదిలోనైనా తలచకు రాజా!
ఇంద్రసమానుడు తమ్ముని కూడిన
రాముని బలమది నీకు తెలియదా?''

॥శ్రీ రఘురావ

❖❖❖

## 3 3 లక్ష్మణుని ఆగ్రహము–తార సమాధానము

అంతఃపురమున ఆలోచనలు
సాగుచుండగా- అంగదునంపి
లక్ష్మణమూర్తిని గొని రమ్మనగా-
అడుగిడె- గుహలో- రామానుజుడు

దధివక్త్ర- సునేత్ర- సుపాటలుండెడి
గృహములన్నియు నిలచియుండెను
తెల్లని మబ్బులవలె తేజముతో
ధనధాన్యములు స్త్రీ జనములతో

విక్రములైన ద్వార పాలకులు
కరములు మోడ్చి నిలచి యుండిరి
రత్న శోభతో దివ్య సుమములు
ఉద్యానములతొ సౌధరాజముల

శోభిలుచుండెడి సౌధములన్నీ
కోపము నిండిన చూపులతోను
వేగముగా తను నడచుచు చూచెను
కపినాయకుని గృహమును గాంచెను

అగరు- చందన- పద్మ సుగంధము
మైరేయమ్ముల మధువాసనలు
తీర్చిన బాటలు- సెలయేరులతో
వెలయు నగరమున- వివిధ సౌధములు

తెల్లని ప్రాకారముతో చుట్టి
రమ్యమైనది- సురనాయకుని
సౌధముతో మరి సమానమైనది
కైలాసమువలె తెల్లగ మెరయుచు

అంగదు- మైంద- గజ- ద్వివిదుల
గవాక్ష శరభ సౌధమ్ములను
విద్యున్మాలి- సంపాతి నిలయములు-
ఆంజనేయుని హర్మ్యము గాంచెను.

వాసవుడొసగిన వృక్షమ్ములతో
కోరిన ఫలముల నిచ్చు తరువులు
సౌఖ్యము నింపి- తేజము గలిగిన
మేలిమి బంగరు తల వాకిలితో

వీరబాహు- సుబాహు సదనములు
సూర్యాక్ష- తార సుషేణు గృహముల
నలుడు- నీలుడు- కుముదుని గృహము
జాంబవంతుని సౌధము గాంచెను

సుర సంబంధపు సుమహారములతొ
ఆయుధ ధారుల రక్షణనున్న
అర్కసుతుని గృహమచ్చట గాంచెను-
రవి ఆకసమున సాగినట్టుగా-

ఏడు కక్ష్యలను దాటి నడచెను
బంగరు-వెండి పాన్పు వరుసలను
మేలు తివాసులు రత్న కంబళులు
పరచిన అంతఃపురమును గాంచెను

వయసు పొంగుతో సౌందర్యముతో
అలంకారముల ఉత్తమాంగనలు
వీణకు సరిపడు చక్కని స్వరములు
రత్నాంబరముల వెలుగగ గాంచెను

సుందరవదనల అందెల రవళులు
తరుణుల వడ్డాణపు సవ్వడులు
వినిన లక్ష్మణుడు-సిగ్గు-క్రోధముల
అల్లె త్రాటిని ధ్వనింపజేసెను

రామ తాపమును తాను పొందుచు
రమణులు లేని స్థలమున నిలచెను-
అల్లె త్రాటిధ్వని విని సుగ్రీవుడు
వణకెను-వచ్చెనులక్ష్మణుడనుకొని

అంగదుడంతట తెలుపగ-రాజుకు
తారతొ పలికెను కిష్కింధాపతి
''మెత్తని మనసు లక్ష్మణమూర్తిది
క్రోధ కారణము నరయుము నీవు

మన దోషమును తెలియుము నీవు
కారణమటుల తెలియకపోయిన
మంచి మాటలతొ కోపము తీర్చి
ఆదరమ్మును కలుగజేయుము

కపటమెరుగని శుద్ధమనస్కుడు
కోపించడు-నువు నిరపరాధివి
మహాత్ములెపుడును స్త్రీల విషయముల
క్రూరత్వమును చూపరు నిజము''-

పతి పలుకులు విని తారాసుందరి
పడకనుండి తను లేచి-భయముతో
సుఖముల తేలిన దేహముతోను
మెల్లగ నడచుచు లక్ష్మణు గాంచెను

వచ్చెడి వనితను గాంచె మహాత్ముడు
వంచెను శిరసును-కోపము జారెను
లక్ష్మణుడపుడు ప్రసన్నుడనుకొని
అనునయమ్ముగా పలికెను తార

''దశరథపుత్రా! ఏల కోపమిది?
మదమున- ఎవడు నిను కాదనెను
కారు చిచ్చువలె-మండు కోపమున
శలభము రీతిగ పడువాడెవ్వడు?''

కపటములేని పలుకుల తార
కారణమడుగగ-లక్ష్మణమూర్తి
పలికెను తారతొ-''పతి హితమతివి
నీవీ మాత్రము యోచన చేయవ!

మద్యవశుడయి మన్మథవశుడై
ధర్మ విచారము తలపులొ నుంచక
రాజ్య పాలనము చేయుట ఇటులా?
మేము చెప్పినది యిట్టి పాలనా?

గడువు గడచిన సంగతి ఎరుగడు
నీ పతి దోషము ఏమని అంటివి
నీవైనా మరి హితముగోరుచో
చెప్పకపోతివి ధర్మసూక్ష్మమును.

ధర్మార్థసిద్ధిని కోరెడువారు
పానము-మదిలో తలచరు తరుణీ!
పానము చెరచును ధర్మమునంతయు
అర్థకామముల భంగపరచును

అర్థకామముల కంటెను శ్రేష్ఠుడు
విమలచరిత్రుండైన మిత్రుడు-
సత్యధర్మములు నిండిన మూర్తిని
మరచిపోవుట ధర్మహానికద!

కార్యతత్త్వము తెలిసినదానవు
మేము చేయగల కార్యము తెలుపుము''
అనిన లక్ష్మణుని చూచిన తార
తియ్యగ పలికెను ధర్మమునిండి:

''మనుజోత్తమ! నువు నుడివిన యటుల
దోషి అతడు- అయినను నీవు
కోపించుటది అకారణమ్ము
కోపము తగునే బంధువులందు?

మీ పనియందు శ్రద్ధ కలిగిన
ఆత్మబంధువు- వానరరాజు
అట్టివానిపై కోపము తగునా?
క్షమించతగును పురుషోత్తములకు

బలవంతుడు- తను బలహీనులపై
కోపించడు విను- ఓ సుకుమారా!
రాముని కోపము నెరుగుదు నేను
గడవుదాటుట తెలియును నాకు

మీరు చేసిన మేలు తెలియును
మేము చేయనగు కార్యము తెలియును
అయినను వినుము- లక్ష్మణమూర్తీ!
కామబలమది తెలియదు నీకు.

నాయన! నీ మది కోపవశమయె
కామవశమన తెలియకపోయెను-
మన్మథువశమున చిక్కినవానికి
దేశకాలములు అర్థము తెలియవు.

నా వశముననే చిక్కినవాడై
లజ్జాహీనుడు అయ్యెను రాజు
కిష్కింధాపతి- సోదరసముడు
దయామయా- నువు క్షమించవయ్యా!

కృపాగుణముతో శోభిలువాడా!
తపోధనులగు ధర్మవర్తులే
కామసౌఖ్యముల కరగిపోవగా
చపలుడు- కోతి- చిక్కుట చిత్రమ?''

అర్థవంతముగ వనిత పలికెను
మహావీరుడు శాంతపడినటు
తెలుసుకొన్నది తిరిగి పలికెను
పతికి హితమును కూర్చగనెంచి

''కామవశుడయి కిష్కింధాపతి
కార్యము చెఱచెను అని కోపించకు
కాగల కార్యము తీర్చుటకొరకై
తన విధేయులకు ఆజ్ఞల నిడెను

బలయుతులున్ను- కామరూపులు
కోట్లకొలదిగా వానర వీరులు
పర్వత-వాసులు- జలముల తిరుగగ
చాలినవారిట వచ్చి యుండిరి

అంతఃపురమున స్త్రీలను చూచుట
దోషము అని-నువు తలచుట నిజమే-
కానీ-మిత్రుల భార్యల చూచుట
దోషముకాదు- అడుగిడు లోనికి''

అనుచు తార అట పిలువగ నపుడు
రామ కార్యమున తొందర గలిగి
అంతఃపురమున అడుగిడి అచట
భూషణయుతుడు ఇంద్ర సమానుని-

సులభముగా మరి జయించరాని-
దివ్య సుమములు-వలువలు-మాలల
వనితల నడుమ-మెత్తని శయ్యన
కీర్తిశాలి-సుగ్రీవుని గాంచెను

కనులు కోపమున ఎఱ్ఱగ వెలగగ
ప్రళయ కాలమున యమునిగ నున్న
విశాల నేత్రుని లక్ష్మణమూర్తిని
రుమ-సుగ్రీవులు చూచి వణకిరి.

॥శ్రీ రఘురాముని॥

## 3 4 లక్ష్మణుడు సుగ్రీవుని నిందించుట

పురుషసింహుని అమితతేజుని
ఇంద్ర ధ్వజముతో పోలెడి రాజు
గాంచి- భయమున దుమికె నేలకు
తారలవోలె తరుణులు దుమికిరి.

తారల మధ్యన చందమామలా
నిలచెను అతడు-కల్పవృక్షమన-
పద్మ నేత్రులతొ నిలచిన రాజును
కొరకొర చూచుచు పలికె లక్ష్మణుడు

''సద్వంశమున పుట్టియు-పుడమిని
పాలించగనే రాజు కాడయా-
సత్యవాదియు కృతజ్ఞుడున్నూ
విజితేంద్రియుడు కరుణామూర్తిగ-

నడచిన ఏలిక లోకపూజ్యుడు
మేలు పొందితివి-మేలు చేయగా
ప్రతినచేసి మరి పాలింపనిచో
అతనిని మించిన ఖలుడింకెవ్వడు?

అనృత దోషము పెరుగుచుండును
మనిషి విషయమున అసత్యమాడిన
తనను, తనవారందరి నతడే
చంపినంతటి పాపము కలుగును.

తిరిగి మేలు మరి చేయని కుమతి
కృతఘ్నుడాతడు- భూత జాలముల
వధ్యుడనుచును- బ్రహ్మయె పలికెను
మేలు మరచిన క్షమకు నర్హుడు.

బ్రహ్మ హత్యకు- సురాపానముకు
చోరత్వమునకు వ్రతభ్రష్టతకు
ప్రాయశ్చిత్తము భువిలో కలదు-
కృతఘ్నతకు మరి లేదు నిష్కృతి.

రాముని మేలు పొందినవాడవు
తిరిగి మేలు మరి తలచనివాడవు
కృతఘ్నుడవు మరి మానహీనుడవు
వంచకుడవు నువు అసత్యవాదివి.

మాతను వెదుకగ యత్నము చేయవు
సారసాక్షులతొ కులుకుచుంటివి
కప్పకుత్తుకతో- అరచు పామువని
పావనమూర్తి తెలియక పోయెను.

దీన వాక్యముల ఏడ్చిన నినుగని
జాలి కలిగి- శ్రీరామచంద్రుడు
రాజ్యము నేలగజేసెను- అతడే
కోపముతో నిను వాలిని జేర్చును.

పాపాత్ముడ! విను- వాలి నడచిన
మార్గము యింకా మూయలేదు- మరి
ఆ మార్గములో అడుగిడవద్దు
సత్యవర్తివై శపథము నిలుపుము.

వజ్రాయుధమును పోలిన శరములు
రాముడు విడువగ చూడకపోతివి
అందువలన- నువు ఆలసించితివి
తలచకపోతివి రాముని కార్యము.''

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 3 5 తార లక్ష్మణుని శాంతింపచేయుట

క్రోధముతో మరి కాల్చునట్టుగా
చూచెడి లక్ష్మణు గాంచిన తార
అనునయ వాక్యమ్ములతో పలికెను:
''లక్ష్మణ! నీ విటు పలుకగ తగదు.

వానరేంద్రుడు కటు భాషణము
వినగా తగడు- క్రూరుడుగాడు
కృతఘ్నుడితడు కాడు లక్ష్మణా!
కపటిగాడు మరి దోషియుగాడు.

అసాధ్యమయిన రాజ్యసంపదయు
రుమను నన్ను పొందగలుగుటది
రామునిచలవే అన్నది తెలియును
తలచితలచి మిము పొగడుచుండును.

కడు ఇడుమలబడి కుమిలిపోయెను
సుఖములు వడిగా వచ్చిపడగనే
గడువు మీరిన విషయము నితడు
తెలియకపోయెను- కౌశికమునివలె.

కౌశికముని ఆ ఘృతాచివశమున
కామపాశముల బంధింపబడి
పదివేలేండ్లు ఒక్క దినముగా
తలచెను గాదా! సర్వము వదలి

జనపాలక! విను- దేహ స్వభావము
జన్మగుణమది వదల నసాధ్యము
కామములో మరి అమరిన మనసు
కాలనియమము మరచును కాదా!

సజ్జన వినుతా! నాయన వినుము
దోషము నీవు క్షమించ తగును
విషయము తెలియక జడుని మాదిరి
పలుకుట మేలా? వివరించెద విను.

లంకలొ- లక్షల కోట్ల సంఖ్యలో
అసురులు గలరు రావణు బలగము-
ఒంటరి అగు సుగ్రీవుడు వారిని
చంపగ చాలడు- అనెను వాలియే

నిన్ను బోలిన సత్వవంతులకు
తొందరపాటుతొ- తగునా కినుక?
నన్నూ- రుమను- రాజ్య భోగములు
రామ కార్యమున వదలును వినుము.

మీ సాయముకై- తన సాయముగా
వానర సేనల పిలువనంపెను
గడుపు-నేటితో ముగియుచున్నది
చేరెదరిపుడే పురి నా వీరులు.

ఆహవ భూమిలొ దశముఖు ద్రుంచి
రోహిణి తోడుత చంద్రుని రీతిగ
అవనిజ నితడు రాముని జేర్చును
ఒక్కనితో నది చక్కబడదు కద!

ఇపుడే వీరులు విక్రము లెందరొ
ఋక్షవరులగు కపి సమూహములు
కోట్లకొలదిగా వచ్చి చేరెదరు
కోరి వచ్చెదరు సేవ చేయగ

కోపము- మానుము- జ్వాల నేత్రముల
కలిగిన భయము- తీరకున్నది
వానర నాథుని విశ్వసింపుము
సంతోషమునిడు సుమిత్ర తనయా!

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 36 సుగ్రీవుని భక్తి- లక్ష్మణుని ప్రశంస

మృదు భాషణముల తార పలుకగా
రామానుజుడు కోపము వదలెను
రవిసుతుడపుడు- భయమును నట్టి
తడి వస్త్రమును- వదలివేసెను.

అంతటి వీరుని వైరి బ్రతుకడు
రాముడు చాలును రావణు త్రుంచగ
సీతను చేకొని సుఖములందును
నిమిత్త మాత్రము నా సహాయము

మెడలోనున్న బంగరు సరములు
తీసివేసి అతి నమ్రత నిండి
అణకువతో నట పలికె రవిసుతుడు :
''రాముని దయ ఈ రాజ్యము, యశము.

సప్త సాలములు- ధరణిని- గిరిని
ఒక్క శరమున చీల్చిన ఘనుడు
అల్లె త్రాటి టంకారమెగసిన
గిరులు నిండిన భూమి వణకును.

సేనావాహిని వెంబడి నడచును
రామ సేవలో నడతును ముందు
చనవుచేతనో-విశ్వాసముననొ
దారి తప్పితిని-దాసుడ స్వామీ!

నీ సాయముతో రామచంద్రుడు
రావణుజంపి విజయము నందును
కృతజ్ఞుడవు నువు జయశీలివయా
యుక్తముగా మరి పలికితివయ్యా!

కొద్దియొ గొప్పో అపరాధమును
ఇలలో చేతురు జనులు-కావున
క్షమించవేడితి దయగొనుమయ్యా!''
అనిన రాజుతో పలికె లక్ష్మణుడు

ఘనసామర్థ్యము కలిగియుండియు
తన దోషమును తెలిసి వినయముగ
పలుకగ చాలుదు రిద్దరేనయా
అన్న రాముడు-అర్కసుతుడును

''వినయమూర్తివి దిక్కుగనుంటివి
కావున-రాముడు సనాథుడయ్యెను
వానర రాజ్య రమను పొందగ
తగుదువు నీవు మంచినడవడితొ

శౌర్య పరాక్రమమందున నీవు
రామభద్రునికి సరిపోదువయా!
దైవ వశమున మీ యిద్దరికీ
నెయ్యము కుదిరెను వానరరాజా!

భార్యలేక-తను దుఃఖిలు రాముని
ఊరడించుము-లెమ్ము నీవిక
మనసు వశమును దప్పి తిట్టితిని
హితుడవె-నీవు వేరుగ తలచకు.''

॥శ్రీ రఘురాముని॥

## 37 వానర సేనలను సమీకరించుట

వానర రాజు-చెంతనె వున్న
హనుమంతునితో పలికెను అపుడు:
''హిమవత్-మందర-వింధ్య మహేంద్ర
కైలాసాచల బాలసూర్యులన

అంజన పర్వత మందలి కపులు
మణిశిలగుహలలొ నుండెడి వీరులు
కరిబలసములగు వారందరిని-
మేరుగిరి మరి ధూమ్రగిరులలో

సాగరతీర గిరులయందున
పడమటి గిరుల-సంధ్య మేఘములు
ఉదయ పర్వత గిరులలొ తిరుగు
పద్మతాళవన-మేఘసములగు

మహారుణగిరి-మనోహరమ్మగు
అడవులయందు వానరనాథుల
మైరేయి గ్రోలెడి వేగవంతులను
మునుల ఆశ్రయములందు వసించెడి.

పుడమిని నిండిన వానరవీరుల
సామదానముల బిలిపించుమయా-
మంత్రీ! ముందే-వెడలిరి కొందరు
మరికొందరిని త్వరగా పంపుము.

కామాసక్తులు, సోమరులందర
రేపు అనుచు-మరి జాప్యము చేసెడి
వారందరినీ వాయునందనా!
రప్పించుమయా నా ఆజ్ఞగను.

పది దినములలో ఆనతి మేరకు
రాని కపులకు కఠిన దండన
తల త్రుంచెదరని తెలియబరచుము
దిక్కుదిక్కునకు దూతల నంపుము.

కోట్లకొలదిగా దూతల నంపుము
మేఘము-పర్వత సములాదూతలు
ఆకసమంతయు కప్పివేయుచు
కపుల తావులలొ వెదకి తెత్తురు.''

ఆనతి మేరకు ఆంజనేయుడు
వీరులందరికి ఆజ్ఞల నిడగా
మేఘసమానులు-తారాపథమున
వెడలి-వార్తను చెప్పిరి కపులకు.

రామ కార్యమును విననంతనే
ప్రళయ కాలమున మృత్యు సమమగు
సుగ్రీవాజ్ఞను వినినంతటనే
సమరోత్సాహులు విజయము చేసిరి.

కాటుకవంటి నలుపు వర్ణముతొ
అంజనగిరిగల మూడు కోట్లును
పడమటి కొండల పసిమివన్నెగల
కపివీరులు పది కోట్లు చేరిరి.

హరికేసరపు వన్నెతొ వెలుగు
కైలాసగిరి వేయి కోట్లును-
హిమవత్పర్వత ప్రాంతమందలి
లక్ష కోట్ల కపులటకు వచ్చిరి.

వింధ్యపర్వత వాసులు కపులు
నిప్పువంటి ఆకారము గలిగిన
కోటివేలగు కపులు చేరిరి
వినయ-విధేయత నిండివచ్చిరి.

పాలసముద్రము తీరమునుండి-
టెంకాయలను తినెడి కపులును
లెక్కలకందని కపిసేనలట
నేల యీనినటు వచ్చి చేరినవి.

కొండల-కోనల నదీతీరముల
గుహలలొ-వాసము చేసెడి కపులు
సూర్యమండలము మ్రింగునట్టుగా
రామకార్యమున వచ్చి కలిసిరి.

వీరుల బిలువగ పోయినవారు
హిమవత్పర్వత మందలి తరువు
శంకరుడచ్చట యజ్ఞము చేసిన
వృక్షము గాంచి సంతసపడిరి.

యజ్ఞమునందు-పాలు-నేయి
అన్నమువలన-నానిన నేలలో
ఉద్భవించిన కందమూలములు
అమృత తుల్యములైన ఫలములు

వాటిని తినినచొ నెలదినములు యిక
ఆకలిమాటను తలచని దినుసులు-
దివ్యసుమములు-కాన్కగ-రాజుకు
తెచ్చిరి-పిలచిరి వానరవీరుల

గడువు మేరలో-కాన్కలుగొని అట
వచ్చిచేరిరి రాజును చూచిరి
ప్రీతిగ కాన్కలనందుకు రాజు
గృహముల కేగగ ఆనతినిడెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 3 8 సుగ్రీవుడు రామసేవాంకితుడగుట

రామకార్యమున కృతార్థుడైనటు
తలచెను అపుడు-కిష్కింధాపతి
లక్ష్మణుడంతట రాముని చూడగ
పోదము రమ్మని ఆదేశించగ

మీ ఆనతి అది శిరోధార్యమని
వనితలకచ్చట శలవును యిచ్చి
వీరులందరిని వడిగా రమ్మని
దివ్యపల్లకీ తెమ్మని చెప్పెను.

లక్ష్మణమూర్తిని కూర్చొనజేసి
వెనుకనె-రాజు-పల్లకి నెక్కెను
వింజామరలు వేయుచుండగా
శ్వేతఛత్రము వెలుగుచుండగా

నగారధ్వనులు-శంఖారవములు-
వీరుల సింహనాదమ్ములతో
వానరరాజ్య విభవమ్ములతో
వానరేశ్వరుడు బయలుదేరెను

రాముని విడిదికి దూరముగానే
పల్లకిదిగెను భక్తిమీరగా
చేతులు రెండును మోడ్చి వినయముగ
నిలచెను-నిలచిరి వీరులందరు.

తామర మొగ్గల శోభిలు జలమన-
తామర కొలనుగ వెలిగెడి సేనను
రాముడు గాంచెను-పదముల వ్రాలిన
అర్కసుతునట కౌగలించుకొని

తీరుగ చెప్పెను : ''విను కపిరాజా!
ధర్మము-అర్థము-కామము వీటిని
సమయము మించక ఆచరించగ
కీర్తి కలుగునా ధరణీధవునకు

ధర్మార్థములను రెంటిని వదలి
కామమునందే మునిగినవాడు
చిటారు కొమ్మన నిద్రలొ మునిగి
నేలబడగ-మరి మేల్కొనినట్టగు.

సూర్యతనూజా! కార్యారంభము
చేయు సమయము వచ్చినదయ్యా!
మంత్రులు-వీరులు అందరితోను
యోచన చేతము సభను తీర్చుము.''

ఆ పలుకులకు ఆర్కసుతుడనె
''రామా! ఇది మీ సోదరులిద్దరి
దయాభిక్షయన సతతము నెరుగుదు
తరగని రీతిగ- అమరినవన్నియు

ఇట్టి నీకు మరి ప్రత్యుపకారము
చేయకపోయిన నింద్యుడు అగును
రామచంద్ర! యీ భూమిని నిండిన
కపివీరులును- భల్లూకములు

కామరూపులు- అతి బలవంతులు
అసాధారణులు- అడవుల తిరుగగ
దేవ, గంధర్వుల సుతులగువారు
వందలు- లక్షలు- ఆయతమ్ములు

శంకువు- లర్బుద- ఖర్వ- పద్మములు
ఆయతమ్ములుగ సాగరమ్ములుగ
ఓఘమ్ములుగా వచ్చెడివారు
ఇంద్ర సమానులు-మందరబలులు

దుష్టరావణుని దునిమి- బంధులతో-
సీతనుతెచ్చి- నీ కర్పింతురు.''
ముకుళిత హస్తములున్న రవిసుతుని
కౌగలించుకొనె రామచంద్రుడు.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 39 వానర సేనల ఆగమనము

రాఘవుడనెను సుగ్రీవునితో
''రవి ఆకసమున చీకటిబాపును
సురపతి వర్షము సుఖముగ నిచ్చును
చంద్రుడు చల్లని వెన్నెల నిడును.

అటులే నీవు సజ్జన పూజ్యా!
సత్పురుషులవలె- ప్రత్యుపకారము
చేయుట ఏమి విచిత్రము రాజా!
సహజగుణమది-వారికి వలెనే.

నీ సాయమున అసురుల జంపెద
నీ అండతొ-నే విజయము నందెద
మంచి మనసుగల మిత్రుడవీవు
సాయము చేయుము సూర్యనందనా!

'మనుహ్లాదు' ని-సురపతి జంపి
శచీదేవిని గొనివచ్చినటు
సీతను దెచ్చెద రావణు జంపి
కాల్చెద లంకను- అగ్నిశరముల.''

మాటలట్టుల సాగుచుండగా
దిక్కులు ధూళితొ మాసిపోయినవి
అడవులు-నదులతొ ధరణి వణకెను
వానర సేనావాహిని నిలచెను.

బాలసూర్యుని ఎఱ్ఱని వన్నెతొ-
చంద్రకాంతిలా తెల్లగ మెరయుచు-
పచ్చని వన్నెతొ పదివేల కోట్లగు
వీరులతోనట 'శతవలి' వచ్చెను.

శత్రుభీకరుడు- కోపి- ఆతడు
తారతండ్రి 'సుషేణు' డచటికి
పదివేలైన కోట్ల సేనతో
వచ్చి చేరెను వానరపతిని.

రుమకు తండ్రియగు, తారుడు, అచటికి
కోటి సహస్ర కోతుల నడిపెను-
బుద్ధి బలమును వేగము గలిగిన
బాల సూర్యుని బింబము వంటి-

ఆంజనేయుని తండ్రి 'కేసరి'
అనేక వేల సేనతొ నిలచెను
కోటి వేలతో వచ్చె 'గవాక్షుడు'
మూడు కోట్లతో 'పనసుడు' నిలచెను.

రెండు కోట్లగు భల్లూకములతో
శత్రుభంజనుడు 'ధూమ్రుడు' వచ్చెను
నల్లని కాయము గలిగిన వీరుడు
'నీలుని' సేన పది కోట్లున్నది.

ఐదు కోట్లతో 'గవయుడు' రాగా
వేయి కోట్లతో 'దరీముఖుండు'ను
వేయి కోట్లతో 'మైంద-ద్వివిదులు'
మూడు కోట్లతో 'గజుడు'ను చేరిరి.

పది కోట్లగు భల్లూక వీరులతొ
'జాంబవంతుడు' వచ్చి నిలచెను
'రుమణ్వంతు'డను కపినాయకుడు
నూరు కోట్లు మరి కొలవగ నిలచెను.

నూరు వేల కోట్లున్న సేనతో
'గంధమాదనుడు' వచ్చి చేరెను
తారాకాంతుల వెలిగే 'తారుడు'
ఐదు కోట్ల కపిసేనతొ చేరెను.

వాలి పరాక్రమ సము'డంగదుడు'
వేయి పద్మములు- నూరు శంకువుల-
'ఇంద్రజానుడు' పదునొక కోట్లతొ
రామచంద్రుని సేవలొ నిలచిరి.

సింహబలులు విశ్వాసపాత్రులు
నూరు కోట్లతో 'రంభుడు' వచ్చెను
ఉదయ సూర్యుని తేజము గలిగిన
రెండు కోట్లతో వచ్చె 'దుర్ముఖుడు'

వెండి కొండవలె ఉన్నతమై మరి
అతిబలవంతులు వేయికోట్లుగా
తన సేవలలో నిలువగ- వీరుడు
నిలచెను సేవకు అట 'హనుమంతుడు'

శతలక్ష కోట్లతో 'నలుడు' నిలచెను
పది కోట్ల సేనతో 'దధిముఖుడు'న్ను
అతివేగముగల 'వహ్నికుముదులు'
'రంహుడు'- 'ఉగ్ర'- 'శరభులు' వచ్చిరి.

వచ్చినవీరులు నమస్సులుంచిరి
నడచిరి కొందరు- నిలచిరి కొందరు
దిక్కులవియగా నాదము చేసిరి
దుముకుచు నచట నిలచిరి కొందరు.

వానర సేనావాహిని మధ్య
కరిబలసములగు వీరుల నడుమ
మబ్బుల మధ్యన సూర్యబింబమై
భాసిలెనచట సూర్య కుమారుడు

వినయ విధేయత చూపెడి వీరుల
రామచంద్రునికి- ఎరుక పరచెను
తమతమ సేనతొ అడవులయందు
విడిసి యుండమని ఆజ్ఞలనిడెను.

॥శ్రీ రఘురాము

✲✲✲

## 4 0 తూర్పు దిశకు సీతాన్వేషణకై వినతుని, వీరులతో పంపు

వినయముతో సుగ్రీవుడు పలికెను:
''రామా! వీరులు- గజబల సములు
కామరూపులు - అరిభయంకరులు
అతి విశ్వాసము కలిగినవారలు

నీ కింకరులు-సేవకు నిలచిరి
ఆనతినిమ్ము నీ సేనలవి
ఆలోచించి తగు విధముగను
ఆదేశించుము- అంజలి గొనుము''

అనగా రాముడు అర్కసుతునట
కౌగలించుకొని పలికెను తీరుగా :
''జానకి- అసువులు నిలిపి యున్నదను
విషయము -ముందుగ తెలియదగినది

ముందు కార్యము జరుప జాలుదువు-
మైత్రిలొ నీవు సోదరసముడవు
మేలుచేయు మనసున్నవాడవు
తగు ఆదేశములిమ్ము వారికి''

రాముని పలుకులు విని సుగ్రీవుడు
మేఘధ్వనిగల 'వినతుని' పిలచి
''వానరేంద్ర! నిను- లక్షల కపులు
సూర్యచంద్ర వంశమ్ముల వీరులు

కొలుచుచుండగా- తూర్పు దిక్కున
రావణుకొరకై- అడవులు- కొండలు
నదీనదములు-సరయూ - గంగను
సింధు- యమునలు- సరస్వతి వెదకుము

కొండల కోనల నిండిన 'మహినది'
కాల మహియును- బ్రహ్మమాలయు
విదేహమ్మును-మాళవమ్మును
కాశికాపురి- మగధ గ్రామములు

కోసలమ్మును వెదకుడు మీరు
సాగరగిరులు- బత్తనమ్ములను
మందర మందలి భూరి తరువుల
పెదవులంటుకొను చెవులు గలిగిన

లోహముఖులను- ఏకపాదులను
మనుజుల తిను బలవంతుల స్థలముల
వెదకుడు- రాముని ప్రియసతికొరకై
వెదకుడు దశరథు కోడలి కొరకై

సంద్రపు దీవుల యందు వెదకుడు
సంద్ర మధ్యమున- యవ ద్వీపము
స్వర్ణరూప్యమను దీవుల వెదకి
శిశిర పర్వతము- అడవుల వెదకుడు

అది దాటగను ఎఱ్ఱని నీటితో
సంద్రము కావలి తీరమునందున
శోణనదమున వెదకుడు శ్రద్ధగ
సాగర మందలి దీర్ఘ కాయులు

ఆకలిగొనిన-వర బలవంతులు
నీడలగని మరి మ్రింగ జాలుదురు
రేవు మార్గమున సాగుడుమీరు
దూరము అనుచు తలంచవలదు

ఎఱ్ఱనీళ్లగల సంద్రముగాంచి
కొండ బూరుగు తరులతొ నిండి
బంగరు, మణులతొ-విశ్వకర్మ-తను
గరుత్మంతుని సౌధము తీర్చెను

దానిని గాంచి-సాగిన-మీరు
కాంతురు అచట-'మందేహులని'
సూర్యుని పట్టగ వచ్చెడి అసురుల-
వేదవిదులు మరి విడుచు నర్ఘ్యముల

మంత్ర ప్రభావము అంతము చేయగ
గిట్టుచు-తిరిగి పుట్టుచుందురు-
అచ్చట తెల్లని పాలసముద్రము
అసాధ్యమయినది అందు వెదకుడు

క్షీరపయోనిధి నడుమ-ప్రసిద్ధము
ఋషభ పర్వతము తెల్లగ వెలుగును
దాటగబంగరు వన్నెల తరువుల
బడలిక తీర్చగ చాలిన కొలను.

'సుదర్శ' మను నొక సరస్సు గలదు
తెల్లని కమలమ్ములతో నిండగ
జలకేళికి అట వత్తురచ్చరలు
కిన్నర-చారణ-సురలు వత్తురు.

దాటగ-శుద్ధజలముల కడలిలొ
'ఔర్వ మహాఋషి'-క్రోధము వలన
పుట్టిన అగ్ని-బడబాగ్ని అది
ప్రళయ కాలమున కాల్చు లోకముల.

ఎంతటి బలము కలిగి యున్నను
బడబాగ్నిని గని అరచు జంతువులు
అరపులు వినబడు వానరులారా!
అశ్వ ముఖముతో నుండును అగ్ని.

సంద్రముదాటి ఆవలబోగా
పదమూడైన యోజన విస్తృతి.
బంగరు రాయి గిరిగలదయ్యా
చంద్రకాంతిలా చల్లగ నుండి

భూమిని మోయుచునున్న అనంతుడు
పద్మ నేత్రుడు-నీలి వర్ణమగు
వస్త్రము దాల్చి కనబడునయ్యా
అతని ధ్వజమది తాలవృక్షము.

మూడు తలలుగల బంగరు తాడి
అట శిఖరమున నుండును గనుడు-
దానిని-తూర్పుకు సరిహద్దుగను
నిలపిరి సురలు-తెలిసెన తీరుగ?

అవల- బంగరు తూర్పు కొండల
బంగరుమయమై- నూరామడల
విస్తీర్ణమగు వేదిక కలదు
అచ్చట గలదు-'సౌమనసమ్ము'

సౌమనసమ్మను గిరి శిఖరమది-
వామనుడచట ఒక పాదమును
రెండవ పాదము మేరుకూటమున
నిలపెను అని-నే తెలిసితినయ్యా!

సూర్యకాంతిగల వాలఖిల్యులు
వైఖానసులు గలరు అచ్చట
తూర్పుకొండల అడవుల యందు
ధరణిజకొరకై వెదకుడు మీరు.

విరించి- దానిని భూలోకమునకు-
మిగిలిన లోకములన్నిటికీను
ద్వారముగా మరి చేసెను-వినుడు
సూర్యుని పయనము మొదలగు నచట.

దానిని అందురు పూర్వదిశ యని
అందలి అడవుల-గుహలలొ- ఏరుల
వెదకుడు మీరు భూసుత కొరకై
ఆగిరి దాటిన దేవతలుందురు.

తూరుపు కొండల కద్దరి నింక
కాంతులులేని చీకటి కనుక
సాగ నశక్యము-కావున మీరు
అచ్చట మిగిలిన తావుల వెదకుడు.

ప్రతి స్థలమున మీరందరు వెదకుడు
నెలలోపల మరి తిరిగి రావలె
అటురాకున్న మరణదండనే
కార్యసిద్ధిగొని-సుఖముల నందుడు.
॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 41 హనుమంతుని, అంగదాదులను దక్షిణ దిశకు పంపుట

దక్షిణ దిశలో వెదకుటకొరకై
అగ్ని కుమారుడు-నీలుని మరియు
వాయుపుత్రుని- జాంబవంతుని
గజుని - సుహోత్రుని- గవయు-శరారిని

శరగుల్ముని మరి సుషేణు వీరుని
ఋషభు- గవాక్షుని-మైంద- ద్వివిదుల
గంధ మాదనుని-విజయుని మరియు
ఉల్కాముఖుని- అంగదు నెంచెను.

వారికి చెప్పెను వానరరాజు
దక్షిణ దిశలో వివరములివి యని
వింధ్య పర్వతము-వేయిశిఖరములు
పెనుబాములుగల నర్మదయున్నది.

విశాల గౌతమి తీరమందున
కృష్ణ -మహానది- వరద-మేఖల
ఉత్కల దశార్ణ- అశ్వవంతులలొ
అవంతి- విదర్భ-మహిష- ఋషికముల.

వంగ- కళింగలు- కాశీ రాజ్యము
అంగ దేశముల- కొండలు- గుహలలో
దండక వనిలో గోదావరి తటి
సుంతయు విడువక సీతను వెదకుడు

ఆవల- దివ్యము- కొత్త ముత్యముల
బంగరు రేకుతొ శోభిలునట్టి
పాండ్యనగరి తలవాకిలి చూడుడు
సంద్రము దాటెడి యోచన చేయుడు.

ఆంధ్రదేశము- చోళ- పాండ్యముల
పుండ్ర- కేరళ- ప్రదేశములలో
పూసినచందన తరువులు చూడుడు
లోహగనులుగల సహ్యాగిరినిగని-

సంద్రమునందు అగస్త్యమహాఋషి
మహేంద్రగిరిని నిలబెట్టగను
నీటిలొ మునిగీ మునగనట్టుగ
కనవచ్చును అది బంగరు మయము.

పుణ్యతీర్థమది కావేరీనది
సాగరమ్మునకు పట్టపురాణి
సురస్త్రీలందరు పూజలు చేతురు
జలము కూర్చును- విశేష సుఖము

వివిధలతలతో విలసిల్లునది
దేవఋషులు సేవింతురు దానిని
యక్షులు- సిద్ధులు- సుర స్త్రీలుందురు
పర్వస్నానమట సురపతి చేయును.

మలయ పర్వతమునందు విశేషము-
మహాతపస్వియు, దివ్యఋషియగు
అగస్త్యుడుండును- వందనమిడినచొ
కోరిక తీరును- దీవనలంది

కడలి మధ్యలో మనుజులకందని
నూరామడలు విస్తరించిన
ద్వీపముగలదు దానినిజేరి
సీతాదేవిని వెదకుడు శ్రద్ధగ.

ముందుకు నడచి- తామ్రపర్ణినది
తాబేళ్ళు- మొసళ్ళు- ఎండ్ర కాయలతొ-
చందన వనముల నిండినట్టిది
వివిధ ద్వీపములు కలిగియుండగా

ఆ ద్వీపమున వధ్యుండైన
దురాత్ముడైన రాక్షసరాజు
సురపతి తేజముతో విలసిల్లుచు
సీతను చెరలో వుంచెను దుష్టుడు.

లేత ప్రాయమున భర్తను కలియగ
చేరుచున్నటు తామ్ర పర్ణినది
కడలిని చేరును- దానిని గనుడు
వెదకుడు సర్వము భూమిజకొరకై

రావణు పట్టణ మచ్చట గలదు
వానరులారా జాగరూకులై
కొంచెమైనను వదలక మీరు
వెదకుడు రాముని ప్రియసతి కొరకై.

దక్షిణ జలధిని అంగారకయను-
రక్కసి కలదు- ఆకసమందున
ఎగిరెడివారి-నీడను బట్టును-
భక్షించును అది- శ్రద్ధగ వినుడు

ఆ ద్వీపములో అతి మెలకువతో
అవనిజ కొరకై వెదకుడు మీరు
నిశ్చయమ్ముగా లేదని తెలిసిన-
నూరామడల దూరము పోయిన

సిద్ధ-చారణులు వసించునట్టి
రవి చంద్రుల కిరణమ్ముల బోలు
అందమైన గిరి ''పుష్పిత'' మున్నది
దాని- బంగరు రజత శిఖరముల-

స్వర్ణ శిఖరమును భానుడు కొలుచును
రజత శిఖరమును చంద్రుడు కొలుచును
పరులమేలు మరి మరచిన వారికి
నాస్తికులకును-వంచకులకును-

దివ్య శిఖరమది కనబడదయ్యా!
మీరందరు ఆ శిఖరమ్మునకు
భక్తితొ మ్రొక్కి ముందుకుసాగి
పదునాల్గామడలున్నవి దాటగ

వైద్యుతమైన సూర్యవంతమను
గిరి కలదచట-సుఖముగ విడిసి
ఫలములు-తేనెలు-చల్లగ త్రావి
ఆవల కుంజర పర్వతమును గని

ఆ పర్వతమున విశ్వకర్మ-తను
దివ్యరత్నములు శోభిలునట్టి
శ్రేష్ఠమైన సదనమ్మును కట్టి
అగస్త్యమునికి అందజేసెను

గృహమును గాంచి-గిరియందుననే
గొప్పదియైన సర్పరక్షణలొ
శోభిలు నగరము- భోగవతి- యది
సర్పరాజగు వాసుకి నిలయము.

పాములనెలవు-పావని కొరకై
పరీక్షగానట రహస్య స్థలముల
పరిశీలించి-వృషభాకృతిగల
మణికాంతులతో వెలిగెడి గిరిని

'ఋషభ మనెడి ఆ గిరిని గాంచుడు
సుర సంబంధపు అగ్ని కాంతితో
గోరోచనపు దీప్తి కలిగినది
పద్మశ్యామల వర్ణ చందనము-

దొరకును గిరిపై దివ్యచందనము
తాక వద్దు ఆ తరువులనసలు
క్రూరులైన గంధర్వులు-మరియు
రోహితులున్ను రక్షణ చేతురు

ప్రభు-శైలూషులు-శుక్ర-శిగ్రులు
గ్రామణి అను గంధర్వులైదుగురు
రవి చంద్రాగ్ని సమానశరీరులు
పుణ్య మూర్తులు వసించియుందురు.

భూమికి అది పొలిమేర అగునయా!
అందు వసింతురు పాపరహితులు
దానిని దాటిన భయంకరమ్మగు
కాలుని లోకము- కనబడుచుండును.

యమపురికేగ నసాధ్యము- వినుడు!
భయంకరమ్మగు చీకటి నిండెను
వానరులారా! అంతవరకును
పోవచ్చును- ఇక పోవీలుండదు

నే చెప్పిన ఆ నెలవులందున
అట కనవచ్చిన స్థలములందున
ఏమరు పాటును వదలి-వెదకుడు
హెచ్చరికతొ మరి వెదకుడు సీతను

నెల దినములలో- సీతను గాంచితి
అనుచు చెప్పిన అతి ప్రియతముడు-
నాతో సమమగు కీర్తితొ వెలుగును
దోషములున్నను- బంధువు అగును.

వానరులారా! అతి బలవంతులు
సద్వంశమున పుట్టిన వీరులు
మంచి గుణములతొ శోభిలువారు
ఘన ప్రయత్నమున వెదకుడు సీతను.
॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 4 2 పశ్చిమ దిశకు సుషేణుని వీరులతో పంపుట

హనుమదాదులను దక్షిణదిశకు
నిర్ణయించి మరి పశ్చిమ దిశకై
తార తండ్రియు- తనకు మామ యగు
సుషేణు గాంచి మ్రొక్కి పలికెను.

అతి పరాక్రముడు- ఇంద్రతేజుడు
పర్వత కాయుడు శౌర్య ధనుడగు
మరీచి మహఋషి కుమారుడైన
మారీచుని- మరి మిగిలిన వీరుల

పిలచి- పలికెను సూర్యతనూజుడు
వానరులారా! సీతను వెదుకగ
వేగమె పోవలె- వెంట సహాయము
రెండు లక్షల కపులను గొనుడు.

పశ్చిమ దిశలో సురాష్ట్రమ్మును
బాహ్లీకమ్ము- శూరము- భీమము
గ్రామములున్న పల్లెలు వెదకుడు
పున్నాగమను అడవిని వెదకుడు.

పొగడ వనములు మొగిలి అడవుల
పడమరగా ప్రవహించు నదులకడ
మునులు వసించెడి అడవులు వెదకి
పశ్చిమ సాగర తీరము చేరుడు.

కడలి లోతయి- మకరులు నిండెను
తీరమందుగల మొగిలి వనముల
గానుగతోపుల కొబ్బరితోటల
సంతోషముగా సంచరించుడు.

తీరమునంతట శోధించి- మరి-
దానిని దాటి 'మురభి' పట్టణము
'జటీ' పురమును- 'అవంతి' నగరము
'అంగలోపను' చూడుడు శ్రద్ధగ.

తీరుగ వెదకి- 'సింధునది' అట
సంద్రము చేరెడి స్థలమును గాంచుడు-
పెనుమ్రాకులతో- పలు శిఖరమ్ముల
హేమగిరిని- మీరందరు గనుడు

ఆ గిరియందు- ఎగురు సింహములు
ఏనుగులను మరి ఎత్తుకుపోయి
భక్షించును- అట గూండ్లలో నుంచుకు-
అచట మదించిన గజములు కలవు-

పాపరహితులగు వానరులారా!
నూరామడలు ముందుకు సాగిన
చూడ నసాధ్యము అగు శిఖరమ్మును
పారియాత్రగిరి నచ్చట గనుడు.

ఆ గిరియందు అతి బలవంతులు
కామ రూపులు అనల సన్నిభులు
ఇరువదినాలుగు కోట్ల సంఖ్యలో
సింహబలులు - గంధర్వులు గలరు

ఆ గంధర్వులు గర్వాంధులయి
అచట ఫలములను రక్షణ చేతురు
వారి సమీపము పోవలదుసుమా!
శోధించుడు అట అవనిజ కొరకై

పోవలదంటిని వెదుకమంటినని-
ఆలోచించగ పనియేలేదు
కోతులు మీరు వనచరులైతిరి
కావున మిమ్ముల బాధించరయా!

దాటగ నచట 'వజ్రధర'మను
వజ్రమ్ములతో కూడినట్టిదగు
వైడూర్యముల కాంతితొ వెలుగు
లతలతొ శోభిలు గిరి కలదయ్యా!

అందు- చిత్రమగు నూరామడల
విశాలమైన చదరపు నేల-
దానికావల- గుహలు వెదకుడు
కడలికి- నాల్గవ- భాగమునందు

చక్రవంతమను గిరికలదయ్యా!
విశ్వకర్మచే నిర్మితమైన
'సహస్రార'మను చక్రము గలదు
దానిని రక్షణ చేయుచుండెడి

హయగ్రీవుని- పంచజనులను
శ్రీహరి చంపి- హయగ్రీవుని
చక్రముగొని- ఆ పంచజన్యుని
శంఖమువంటి-వెన్నెముకనుగొనె

గిరుల- చరులలో గుహల యందున
సీతాన్వేషణ చేయుడు శ్రద్ధగ
ఆవల- అరువది యోజనంబులలో
కడలిలొ వరాహ పర్వతమున్నది

ఆగిరి శిఖరము రజతమైనది-
విశాలమైన ఆ గిరియందున
'ప్రాగ్జ్యోతిష'మను పట్టణమందు
నరకుడనియెడి రక్కసుడుండెను.

అందలి గుహలలో, బంగరు,మయమగు
'సర్వసావర్ణ' గిరి కలదయ్యా!
అట సెలయేరుల పడెడి నీళ్ళతో
గజ-కేసరి-శార్దూల-సూకర-

అరవుల ప్రతిధ్వని నీటిలో వినబడు
సురలందరును ఇంద్రుని- ఎచట
అభిషేకించిరొ ఆ పర్వతమది
'మేఘవంతమ'ని పేరున బరగెను.

దానిని- దాటిన- అరువదివేల
కొండలు గలవు- అందు- రమ్యమై
రవికిరణముల కాంతులు గలిగిన
బంగరు మయమగు తరువులున్నవి.

'సావర్ణి మేరువు' గిరి కలదచట
గిరిని గాంచిన భాస్కర దేవుడు
వరము నొసగె- ఆ గిరిని కొలిచిన
పసిమి వన్నెగల దేహము కలుగగ.

గిరిని వసించు దేవసమూహము
గంధర్వులును-మనోహరమ్మగు
మేని కాంతితొ నుందురువారు
సూర్యదేవుని కొలుచుచుందురు.

విశ్వావసువులు- ఆదిత్యులును
మరుత్తులనబడు సుర సమూహములు
సూర్యుని కొలవగ వత్తురు-కొండకు
అస్తగిరికి నట సూర్యుడు వచ్చును.

అస్తగిరికి అట భానుడు చేరగ
లోకము చీకటిమయమై పోవును
ఒక్క ఘడియలో పదివేల ఆమడలు
సాగును భానుడు- ఆగిరి చేరును

గిరి శిఖరమున సూర్యకాంతితో
విశ్వకర్మచే నిర్మితమైన
దివ్య సౌధము-వరుణుని గృహము
వెలుగుచుండునట కన్నుల విందుగ.

అస్తగిరికిని-మేరువు గిరికిని
మధ్యన బంగరు వేదిక గలదు
పది తలలతో నొక తాలవృక్షమట
కనబడు-కన్నుల పండువుగాను

తీవ్రతపస్సును చేయు మునీంద్రుడు
బ్రహ్మ సమ్మానుడు 'మేరుసావర్ణి'
అందు గలడు-మీరందరు మ్రొక్కి
వినయముగా మీ కార్యము తెలుపుడు

ఆవలనున్నది తెలియదు మనకు
సూర్యరశ్మి అట కనుపించదయా-
కావున మీరు- అంతవరకును
శ్రద్ధగ వెదకుడు రామపత్నికై.

నెలలోపల మీరందరు రావలె
ఆవల వచ్చిన- అసువులుండవు
మామ 'సుషేణుని' ఆజ్ఞమీరక
మహాబలులు మీరందరు వెదకుడు

మామను పెద్దగ ఎంచుకు- మీరు
విజయవంతులై తిరిగివచ్చిన
రామ కార్యమును నిర్వహించిన
కీర్తికలుగును మనకందరకు.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 43 ఉత్తర దిశకు శతవలిని వీరులతో పంపుట

ఉత్తర దిక్కుకు 'శతవలి' నంపెను
తీరుగ వివరములిటు చెప్పుచును-
''యమతనూజులగు వానరవీరుల
వందవేలను సాయము గొనుము

టంకణ - ఉత్తర కురుభూములును
ఋషికము- చీనయు- పరమ చీనయు
విహార- దరద ప్రదేశమ్ముల
హిమవత్పర్వత ప్రాంతమునందలి

ఉత్తర దిక్కున హిమగిరి గలదు
సీతను వెదకిన కీర్తి కలుగును
ప్రత్యుపకారము చేసినట్టగు
జన్మనెత్తిన ఫలము దక్కును.

దేవదారులు- లొద్దుగ వనముల
పద్మ కాష్ఠవన ప్రదేశములలో
దుష్టుడు- రావణు నెలవును గాంచుడు
సీతాన్వేషణ చేయుడు శ్రద్ధగ.

నిర్మలహృదయులు- నాకు హితులయా!
నేర్పుగ మీరు రామకార్యమును
తీర్చుట ధర్మము- రామచంద్రుడు
జగతికంతయు పూజనీయుడు.

సోమాశ్రమము- కాళపర్వతము
దాటుడు- యేటి తటముల వెదకుడు
ఆవలగిరి యగు 'సుదర్శన'మ్మును
దాటిన- కననగు 'దేవసఖాద్రి'

పుణ్యపురుషుడు- పురాణమూర్తి
రిపులపాలిటి రుద్రుడె రాముడు
మిత్రులయందు దయగలవాడు-
మాతను వెదకుడు శక్తియుక్తుల

దానిని దాటిన- నూరామడలు
ప్రాణులుండని ప్రదేశమున్నది
దానిని త్వరగా దాటిన వెనుక
కనబడు మీకు కైలాసగిరి-

మ్లేచ్ఛ దేశము- శూరసేనము
పుళింద- ప్రస్థల- మద్రక- భరత
కాంభోజ- యవన- శకదేశంబుల
'ఆరట్టకయు' - బాహ్లిక- పౌరవ

గిరిని గాంచిన బడలిక తీరును
అందుగలదు బంగారు సౌధమది
కుబేరుడుండెడి దివ్య సౌధమును
విశ్వకర్మ నిర్మించి యిచ్చెను.

కల్హారములు-నల్లకలువలు
తెల్లకలువలు-కమలమ్ములతో
హంసలు నిండి-సుర స్త్రీలందరు
ప్రియముగ నెంచే-కొలను గలదట.

'వస్వౌకసారము' అనెడి కొలనులో
ధనపతి ముదముగ స్నానమాడును
ఆ ప్రదేశముల-మీరందరును
సీతాన్వేషణ జరుపుడు శ్రద్ధగ

ఆవల-క్రౌంచ పర్వతమున్నది
అందు-కుమార స్వామి మున్ను-తను
శక్తి ప్రయోగము చేయగ-వెలసిన
బిలము కలదట- ఆ మార్గమున

హంసలు-మానస సరస్సు చేరును-
సులభము కాదు బిలమున సాగగ
మెలకువగా నట సాగుడు మీరు
దేవ ఋషులు-మహఋషులు గలరట

కొండలు.-గుహలు-తీరుగ వెదకుడు
'అవృక్షము'-మరి 'కామశైలము'
'మానస'-మనియెడి గిరులు కలవట
అందు మానసము అను గిరిలోనికి

దేవ-దానవులు చొరనసాధ్యము
కావున దాని ప్రక్కల వెదకుడు
క్రౌంచ పర్వతము దాటిన వెనుక
మైనాకమను గిరి కలదయ్యా!

దానవ శ్రేష్ఠుడు-మయుడు స్వయముగా
తన నెలవుగను తీర్చిదిద్దిన
దివ్య సౌధము కలదాగిరిలో
అందలి నెలవులు వెదకుడు మీరు.

అశ్వముఖులను జాతి వారివగు
స్త్రీల గృహములు గలవు-వాటిని
వడిగా దాటిన-వాలఖిల్యులు
సిద్ధులు తపస్సు చేయుచుందురు

పుణ్యవర్తనులు-పాపరహితులు
వారలగాంచి వందన మిడుడు
సీతాదేవి వివరము-వారిని
వినయముగా మరి అడుగుడు మీరు

సిద్ధులుండు ఆ ప్రదేశమ్మున
బంగరు కమలమ్ములతో నిండిన
'వైఖానస' మను సరస్సు గలదు
బాల సూర్యుని తేజము గలిగిన

హంసలు-అచ్చటి జలముల గలవు
ఆ కొలనుకు మరి 'సార్వభౌమ' మను
ఏనుగు-ధనపతి ప్రియ వాహనము
ఆడు దంతులతొ వచ్చుచుండును.

సరస్సు కావల సూర్యచంద్రుల-
తారా కాంతులు కనబడవయ్యా!
నింగి శబ్దము లేక యుండును
అచటి మునులు మరి సూర్యతేజులు

ఆ ప్రదేశము దాటిన వెనుక
శైలోదమను-శిలా సరస్సు-
అందడుగిడిన శిలలై పోదురు
తెలివిగ దానిని దాటగ వలెను.

వెదురు పొదలట వెలసి యున్నవి
వాటి సాయమున దాటగ వలెను.
సిద్ధులకే మరి సాధ్యమయినది-
ఆవల ఉత్తర కురు భూములవి.

ఆ ప్రదేశములు-పుణ్య పురుషులకు
సుఖముల నెలవుగ నిలిచియున్నవి
అందు అనేక నదులు ఉన్నవి
దివ్య కమలములు గలవు అచ్చట.

అచటి సరస్సులు అతి రమ్యములు-
అచటి కలువలు బంగరు శోభలు-
ఆణిముత్యములు-రతనమ్ములతో
అందమైనవట ఇసుక తిన్నెలు

సర్వ కాలములు-ఫలముల, సుమముల
కోర్కెలు తీర్చుచు తరువులుండును
వేల కొలది శుక-సారణాదులు
వెలసియుందురు-దివ్యతరువులవి.

అచటి తరువులు కోరిన యట్టి
వస్త్రము లిచ్చును-స్త్రీ-పురుషులకు
అన్ని ఋతువులలో సేవింపదగు
యోగ్యములైనవి - ఆ ప్రదేశములు.

కోరిన ఫలముల నొసగుచుండును.
రత్నములున్న వెలగల సొమ్ములు
ఇచ్చును- ఉత్తర కురు భూములవి
అచటి గిరులు అతి చిత్రమైనవి.

ఆసనమ్ములు-మృదు తల్పములు
భక్ష్య-పానములు-పూల రసములు
ఇచ్చెడి గిరులు, తరువులు గలవు
సుగుణ రాసులగు స్త్రీల నొసగును

గంధర్వులు-సిద్ధులు-విద్యాధరులు
కిన్నర-నాగ సమూహమ్ములు
జంటలు-సుఖముల తేలియుందురు
పుణ్య కర్మలను చేయుచుందురు.

చిరునగవులు మరి సంగీత ధ్వని
చిత్త శాంతిని కలుగ జేయును
ఉత్తర కురు భూములు - అచ్చటను
మచ్చుకైనను దుఃఖము లేదు

విశ్వ స్వరూపుడగు విష్ణుదేవుడు
మదనాంతకుడా మహా దేవుడు
జగతి సృజించిన బ్రహ్మదేవుడు
కాపురముండెడి దివ్య ప్రదేశము

ఆ కురు భూముల కుత్తర దిక్కుగ
పోవలదయ్యా! - 'సోమ పర్వతము'
దూరము నుంచే-దానిని చూచి
మరలి రావలె మతి మంతులయి.

ఆవలి దేశపు కట్టు బాటులు
తెలియనివయ్యా! - సూర్యుని కాంతి-
కనబడదచట- అచ్చటి నుండి
మరలి రండు - ఇక ముందుకు పోక

నే చెప్పిన ప్రతి నెలవునందున
అటగాంచిన ప్రతి స్థలమునందున
అనల సన్నిభులు- అతి బలశాలులు
అవనిజ కొరకై అన్వేషించుడు.

సీతను గాంచి పుణ్యమూర్తులై
రామచంద్రునికి- నాకును- మిక్కిలి
ప్రీతి పాత్రులై బంధుల హితులతో
సుఖముల తేలుచు స్వేచ్ఛగ నుండుడు.''

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 44 హనుమంతుని రాజు ప్రశంసించుట- రాముడు మారుతికి అంగుళీయకము నిచ్చుట

వానర నాథుడు- ఆ విధినుడివి
వాయు పుత్రుని హనుమంతుని గని
కార్య సాధకుడు అని తలపోసి
పలికెను తీరుగ పావనితోను.

నీకు సరిపడు అమోఘ బలుడు
భూలోకములో కనబడడయ్యా!
బలమున- బుద్ధిని- పరాక్రమమున
గుణ దోషముల విచారణ యందు.

''ఓ హనుమంతా! అతి బలవంతా!
నింగీ-నేలను- నిప్పుల- నీటిలో
స్వర్గములో నీ గమనము సాధ్యము
నీ కాటంకము ఎందునలేదు

దేశ కాలములు తీరుగ తెలిసిన
ధీమంతుడవు- ఓ హనుమంతా!
సకల సుగుణముల- శౌర్య ధైర్యముల
నెలవు నీవు- విను వానర పుంగవ!

సురాసురులును గంధర్వులతో
సర్పమ్ములతో మనుజులతోను
గిరులు- తరులతో- సాగరమ్ములతో
నిండిన నేల నీకు తెలియును.

కావున హనుమా! వినుమా నీవు
రాఘవు రాణిని తేగల మార్గము
వెదకుము నీవు- నిన్ను మించిన
కార్య సాధకులు ఎందును లేరు''

వేగమునందు తేజమునందు
లాఘవమ్ముగా ఎగురుటయందు
బలాతిశయమున- వాయునందనా!
నీ జనకునితో సమమగు వాడవు

వానరపతి అటు పలుకుచుండగా
యోచన చేసెను జానకీపతి-
సర్వము తెలిసిన వానరరాజు
వాయు పుత్రుని సామర్థ్యముగని

కార్య భారమిదె- కావున ఇతడు
రాజు నమ్మినబంటు కావలె-
విశ్వాసముగల వీరుడు గావలె-
కావున కార్యము కావలె నితనితొ-

బలవిక్రమ సంపన్నుడ వీవు
విస్తరించి- అవి వృద్ధినొందినవి
రాజు- నిన్ను మరి నియోగించెను
అన్నియు చూడగ- తగుదువు నీవే

అనుకొని మదిలో సంతోషముతో
బంగరు ఉంగరమంతట తీసి
రామ నామముతొ శోభిలు దానిని
వాయు నందనుని చేతికి ఇచ్చి

అతి బలవంతా! అంజని నందన!
అల్ప కార్యమని అలుసు చూపక
ఏ ప్రయత్నమున సీతాదేవిని
చూడగలమొ- మరి అటు చేయుమయా!

''వానర శ్రేష్ఠా! ఈ యుంగరము
సీతకు జూపిన- నమ్మును నిన్ను
నీతో పలుకును భయమును వీడి
నా దూతవని తెలియును తీరుగ.

నీ బలమును నే నాశ్రయించితిని''
అనుచు రాఘవుడు పలుకుచు నపుడు
అనుగ్రహించిన ఆ యుంగరమును
పొంగిన భక్తితొ దోసిట గైకొనె

కార్యము తీర్చగ చాలినవాడవు
నీవేయని - నా మనసుకు తోచెను
కావున నిచ్చితి అంగుళీయకము
కాగల కార్యము తీర్చుము నీవు

ఆంజనేయుడు- అంగుళీయకము
అతి భక్తిగను శిరమున నుంచుకు
అంజలి నిడుకొని రామచంద్రుని
పాద పద్మముల నమస్సులుంచెను.
॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 45 వానర వీరుల ఉత్సాహము

వానర నాథుడు- సూర్య తనూజుడు
వానరులందర కావిధముగను
సీతాన్వేషణ జరుపుడు అనగా
వినయము- భక్తి నిండిన వీరులు.

వీరులనంపిన వానరేంద్రుడు
కార్యారంభ- సంతోషము గొనె
నెల దినములు మరి గడచుట ఎట్లని-
చింతలొ మునిగిరి దాశరథులట.

మిడుతలదండు అన్నటు వారు-
భూమిని నిండిన వీరులందరును
రాజు ఆనతిని- అవనిజ సీతను
వెదుకగ సాగిరి- వేగము నిండి.

సీతను తెచ్చెద నేనే అనుచు
రావణు త్రుంచెద నిపుడే అనుచు
అరపులు, బొబ్బలు, అట్టహాసముల
సాగిరి వీరులు అంబర వీధిని

సింహనాదములు చేయుచుండిరి
తోకతొ నేలను బాదుచుండిరి
పండ్లు పటపట కొరికిరి కొందరు
పరుగులు తీసిరి వానర యోధులు.

నే నొక్కడనే చాలుదు నసలు
ఆగుడు - అందరు మీరిచ్చటనే
అనుచు పలికె నొక వానర యోధుడు-
తరుల గిరుల నే త్రోసెద ననెను.

కొండల నూచెద- జలధియందలి
నీటిని నేను ఎండ గట్టెదను-
భూమిని నేను శోధించెదను
భూమిజ నిచటకు దెత్తును నేను

నూరామడలు నే దాటెదనన-
అదియొక లెక్కా-నన్నడుగుమనె
భూమియందున-పాతాళమున
కొండల-కోనల-సంద్రము నందు

అడ్డములేక-నే వేగముగ
పోగలవాడను- అని మరియొకడనె
ఆ విధముగను అతి బలవంతులు
బల గర్వముతో పలికిరి అచట.

॥శ్రీ రఘురాముని॥

## 46 సుగ్రీవుని భూప్రదక్షిణ వృత్తాంతము

రాముడు అడిగెను ఆశ్చర్యముగా
''వానరరాజా! భూచక్రమిటు
సర్వము నీకు తెలిసిన దెట్లు?-
అనగా బదులిడె వానరరాజు:

''పురము నుండి నను తరిమెను వాలి
ప్రాణము హరింప చూచు చుండెను
మంత్రులతో-నే-ప్రాణ భయమున
పరుగిడుచుండ వెంబడించెను.

కొరవికట్టెను త్రిప్పగనంత
చక్రము వలె అట అగ్ని తోచును
అటులే నేను అద్దము లోవలె
చూచితి సర్వము- భూమండలమును

తూర్పు దిక్కులో తరులు-సరస్సులు
కొండలు-నదులు-తూరుపు కొండలు
పాల సముద్రము జూచి మరలితి
వాలి తరుమగా ప్రాణ భయమున

దక్షిణ దిశలో వింధ్య గిరులలో
చందన తరువుల చూచితి రామా!
పశ్చిమ దిశలో అస్తగిరిని గని
పరుగులు తీయుచు నుండెడి వాడను

ఉత్తర దిశలో హిమాద్రిగాంచి
మేరుగిరియును-.సంద్రము జూచితి
అసువులు నిలుపగ తలదాచుకొను
స్థలము గానక- తిరిగితి తిరిగితి.

అంతట హనుమ-సచివోత్తముడు
మతంగ శాపము నాకు తెలుపుచు
ఋష్యమూకము వాలి చేరినచొ
వానితల అది వ్రక్కలు అగునని

అచ్చట చేరి సుఖముగ నుంటిని
వాలి అచ్చట అడుగిడ లేడు
ఆనాడటుల వాలి తరుమగా
భూమంతయును తిరిగితి రామా!''

॥శ్రీ రఘురాముని

✤✤✤

## 47 దక్షిణ దిశకు పోయిన వీరులు తప్ప మిగిలినవారు మరలి వచ్చుట

సుగ్రీవు నానతి నందిన కపులు
పగలంతయును దుర్గమమైన
కొండలు-కోనలు-నదులు-పట్నములు
వెదకి-తిరిగి-మరి రాత్రియందున

పడమట కేగిన సుషేణు డపుడు
వచ్చి చేరెను-తెలిపిరందరు:
''రాజా! మేము నెల దినములవి
పల్లెలు - ఊళ్లూ-కొండలన్నియు

అందరు ఒకచో కలుసు కొనుచును
ఫలములు తినుచు బడలిక తీర్చుకు
తిరిగి ఉదయమే ఉత్సాహముగా
నెల దినములు వారందరు వెదకిరి

వనములు-గుహలు-దుర్గమ స్థలముల
వెదకితిమయ్యా! భీకర మృగముల
చంపితి మచట- ఎందు వెదకినా
నిజమిది! - సీత కనరాలేదు.

భూమిని వెదకి నెల దినములలో
సీతను గానక కొందరు వచ్చిరి
తూరుపు దిశలో వినతుడు వచ్చెను-
ఉత్తర దిశలో శతవలి వచ్చెను.

ధీరుడు - పావని, కులదీపకుడు
అద్రిచరేంద్ర రత్నము మారుతి
దక్షిణ దిశలో రామపత్నికై
వెదుక బోయెను శూరులతోను.

రామపత్ని నా పుణ్యశీలుడే
గని వచ్చునను నమ్మకమ్ముతో
ఆశతొ నందరు వేచి యుండిరి
ఆంజనేయుని శక్తిని తలచుచు.

॥శ్రీ రఘురాముని॥

✤✤✤

## 48 దక్షిణ దిశలో సీతాన్వేషణ

అంగదాదులు-తారునితోను
వీరులందరితొ ఆంజనేయుడు
రాజు చెప్పిన రీతిగ శ్రద్ధగ
వింధ్య గిరులలో వెదుక మొదలిడి

నగాగ్రమ్ముల-కానన సీమల
భూరి వృక్షముల-భూమిజ కొరకై
ఘోర భయంకర దుర్గ దేశములు
ఓర్పుతొ వెదకి సీతను గానక

తిరిగి వారు అట ధైర్యము తెచ్చుకు
గుహలు నిండిన ప్రదేశములలో
అతికష్టములకు లోనై వెదకుచు
కీకారణ్యము లన్నియు వెదకిరి

పర్వత గుహలలో- నదులలో- అడవుల
వానర వీరులు వెదకి- గానక
తిరిగి వెదకుచునుండగ నచట
భయంకరముగ- తీగలు- లతలు

భయము నెరుగని అ వనచరులు
మోడులైన తరులున్న ప్రదేశము
ప్రాణికోటి అట మసలని నెలవు
నిర్జన వనమును గాంచిరచ్చట.

శరీర మంతయు చుట్టుకునున్న
భీతి గొలుపు నొక రాక్షసుడచట
కనబడినంతనె వానర వీరులు
యుద్ధము చేయగ సిద్ధముకాగా

సత్య సంధుడు తపస్వి యైన
'కండు'డను నొక మహాఋషి- తన
పదునారేండ్ల కొమరుడు- అడవిలొ
తప్పిపోవుట చేతను ఆ- ఋషి

'చచ్చిరి మీరు' అనుచు దానవుడు
పిడికిలిబట్టి పోరగరాగా
వాడే రావణుడనుచు తలచిరి
అంగదుడపుడు- తన అరచేతను

శాపము నిడుటచె- కాననమంతయు
మృగములు- పక్షులు- లేక పోయెను
శాప వశమున కాననమంతయు
శోభలు చెరిగి శూన్యమైనది-

ఒక్కటి వేసెను- పర్వతకాయుని
రక్తము గ్రక్కుచు నేలను వ్రాలెను-
అచ్చట సీత ఉండు ననుకొని
వెదకిరి శ్రద్ధగ వానర వీరులు.

వెదకిరి- వెదకిరి- మరియొక అడవిని
తిరిగి వెదకిరి- సీతను గానక
శోకతప్తులై దీనవదనముల
చేరిరి వారొక తరువు క్రిందకు.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 49 హనుమదాదులు వింధ్యగిరులలో సీతను వెదకుట

బుద్ధిమంతుడు- బడలినవాడు
వాలి తనూజుడు అంగదుడపుడు
తనవలె అలసిన వానర వీరుల
శ్రమను తీర్చగ పలికెను తీరుగ:

''దుర్గములందు కొండల గుహలలొ
పొదలు- నదులును- అడవుల వెదకిన
సురస్త్రీ సమమగు సీతను గానక
దుష్ట రావణుని జాడ తెలియక

సమయము చాలా గడచిపోయెను
.ఆనతి మీరిన బ్రతుకుట జరగదు
ఉత్సాహముతో జాగరూకులై
సోమరితనమును వదలి ఇంకను

తిరిగి వెదకవలె అవనిజ కొరకై
విసుగులేక మరి వెదక వలయును
త్రోవ మనకు మరి కనరాకున్నను
మనసుతోనె మరి త్రోవను గనవలె

పరి తపించితిమి ఫలితము ఏమి!
కనులు మూసినా కాలము గడుచును
తగదిక మనకు జాగుచేయగ
రాజదండన తీక్షణమయినది

రామ చంద్రునికి-సుగ్రీవునకు
భయపడవలెను-కోపించినచో
వారిద్దరును దండించెదరు
మీకు హితమును చెప్పితి నేను.

నే నుడివినది సరిగాదన్నచొ
వలయు కార్యము తెలుపుడు మీరు''
అనగా దాహము నిండినవాడై
గంధ మాదనుడు పలికెను అపుడు:

''అంగదు పలుకులు ఉచితమైనవి
అందుకు తిరిగి వెదకుద''మనగ
అర్కసుతుడు-తా చెప్పిన తావుల
అందరు వెదుకగ తిరిగి లేచిరి.

వెదకుచుపోయి శరత్కాలమున
మేఘములన్నటు ఉన్న గుహలను
శిఖరములున్న తెల్లని గుహలలొ
ఏడాకులుగల అరటి వనముల

జయాభిలాషులు ఆ కపివీరులు
తిరిగి తిరిగి ఆ గుహలలొ వెదకి
అలసి అచ్చటే బడలిక తీరగ
తిరిగి వింధ్యలో వెదక సాగిరి.

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

# 50 ఋక్ష బిల సందర్శనము

అంగదాదులు తారుడు రాగా
వెదక బోయిన అంజనేయుడు
పులులు-సింహములుగల ప్రదేశములు
ప్రవాహమ్ములు కొండలు నిండిన

వింధ్య నగమున నైఋతి దిశలో
కపులతొ నుండగ-గడువది ఒకనెల
గడచి పోయినది-కపులందరట
హనుమ చెంతకు అలసి చేరిరి

ఆకలి దప్పుల చిక్కినవారై
అంగద గజ-సుషేణ గవాక్ష
గవయు-శరభులు-గంధమాదన
వీరులందరును వచ్చి చేరిరి

దప్పికనిండి నీటిని వెదుకగ
ఒక ప్రదేశమున తీగల నిండిన-
బిలమును గాంచిరి ఆనందించిరి
ఆశలంతట చిగురించినవి.

బిలమునుండి అట తడిసిన రెక్కల
తామర పుప్పొడి నిండి- ఎఱ్ఱనగు
వన్నెతొనున్న చక్ర వాకములు
వచ్చుట గాంచిరి వానర వీరులు.

సుగంధ శోభలు విరసి యున్నను-
చొరగా శక్యముగాని బిలమది
భయంకరమగు బిలమును గాంచి
మనఃక్లేశమును బొందిరివారు

ఘన కోవిదుడు పావని పలికెను:
''దక్షిణదేశ వనముల వెదకిన
కనబడలేదు సీతామాత
బడలిక- దప్పిక కలిగిన మనము

జలముల కొరకు బిలమున వెదకిన
ఆశలు తీరును- చీకటి నిండిన
బిలమున సాగగ ధైర్యము తెచ్చుకు
నిలవగ మీరు ముందుకు పోదము.''

బిలము ముందర పులులు- సింహముల
గుంపుల గాంచిరి ఆశ్చర్యముగ
తేజము తగ్గిశౌర్యము చెదరి
కన్నుల చూపు కనబడనట్టి

చీకటి మార్గము- బిలము వెంబడి
వాయు వేగమది వ్యర్థముకాగా
చేతులు పుచ్చుకు వానరులందరు
సాగిరి అలసి- అంధుల మాదిరి

మనసు చెదరినది- బ్రతుకు ఆశ అది
సన్నగిల్లినది- నీటిని వెదకుచు
ఆమడ సాగిరి అతి కష్టముతో-
అంతట వారికి వెలుతురు నిండిన

కాంతులు గలిగిన ప్రదేశమొకటి
కన వచ్చినది- అగ్ని కాంతిగల
బంగరు వర్ణపు కర్ణికారములు
సాల- తాలములు- చంపక తరువులు

నాగ- వంజుళ- కకుభ- పున్నాగ
తరువులు కనబడె సంతస మొదవగ-
రజత కాంతితో పూలగుత్తులు
ఎఱ్ఱచిగుళ్లు- తీగలు- లతలు

బాల సూర్యుని ప్రభతో వెలిగెడు
బంగరు తరువులు- బంగరు పుప్పొడి
వింతగు పక్షులు- బంగరు చేపలు
కూర్మమ్ములతో నిండిన కొలనులు

ముత్యమ్ములతో నందగించిన
స్వర్ణ గవాక్షములున్న గృహములు
వెండి- బంగరు- మణి మయాదులచె
వెలుగుచున్నవట విచిత్రమ్ముగ

పగడము వన్నెతొ పూచిన చెట్లు
పసిడి తుమ్మెదలు- మణులచె నిండి
చిత్ర శోభలతొ పానుపులున్ను
పల్లకీలు మరి -మేనాలున్నవి

బంగరు-వెండి-కంచు పాత్రలు
అగరు-చందన-సుగంధ దినుసులు
భుజింప దగిన ఫల మూలములు
తియ్యని తేనెలు-దివ్య వస్త్రములు

కృష్ణ జినములు-దివ్యకంబళులు
అగ్ని హోత్రపు తేజము నిండిన
కాంచన రాసులు - కాంచిరి కపులు
అందు వెదకగా ఆశ్చర్యముగా

నార చీరలతొ కృష్ణ జినము-
వస్త్రముగా మరి ధరించి యుండి
తపసులో నున్న స్త్రీమూర్తి నట
గాంచిరి వారు-దూరము నిలచిరి.

॥శ్రీరఘురాముని॥

✤✤✤

## 51 స్వయంప్రభ కపులను ఆదరించుట

ముదుసలి వనితను గాంచిన మారుతి
ముడిచిన కరముల భక్తినిండగా
అడిగెను: ''అమ్మా! ఎవ్వర వీవు?
బంగరు బిలము - మణులు నిండిన

సుందర సదనము ఎవ్వరిదమ్మా!
మేమందరము ఆకలి దప్పితొ
అంధకారమున కన్నులు గానని
బిలమును గాంచి-సాగి-యిచ్చట

ఆశ్చర్యముతో గాంచితి మీస్థలి
మరలిపోవగా దిక్కు తెలియక
వ్యథతో నుంటిమి-దయామూర్తివి
ఎవరి మహిమతో-తపోయశముచే

సమకూరినవీ అసమానమగు
బంగరు తరువులు-భోజనాదులు
విమానమ్ములు-రజత గృహములు
నిర్మల జలములు-పరిమళ సుమములు!''

ఆంజనేయుడు అడగగ నంత
సర్వప్రాణుల హితమును కోరు
సాధునిష్ఠయగు ఆ స్త్రీమూర్తి
పలికెను వినుమని- ''ఈ ప్రదేశము

రాక్షస ప్రభువు మయుడను వాడు
అద్భుత శక్తితొ నిర్మించెనయా!
రమ్యమైన ఈ బంగరు గృహమును
దానవశిల్పి విశ్వకర్మ-తను

దనుజ శ్రేష్ఠుడు వేయి ఏండ్లుగా
తపసును చేసి విధాత వరమున
శుక్రుని సొత్తగు-శిల్ప విద్యను
నేర్చి-దీనిని-తీర్చి దిద్దుకొని

సుఖముగ నిందు వసించి యుండగ
దేవ స్త్రీయగు 'హేమ'తొ-మయుడు
దానవుడుండగ - సురపతి అంతట
కోపము నిండి చంపెను మయుని

అంతట మయుడు హేమకు ఈ వని
ఇచ్చెను - ఇందు సర్వసుఖములు
ఉండును -నేను హేమకు సఖిని
ప్రేమ పాత్రమగు స్నేహితురాలిని

హేమనుండి ఈ వనిని వరముగ
పొందితి దీని రక్షణ చేతును
మేరుసావర్ణి పుత్రిక నేను
'స్వయంప్రభ' యన పేరున బరగెద

వానరులారా! ఎవ్వరు మీరు?
ఎవరి నిమిత్తము తిరుగుచుండిరి?
ఎటుల గాంచిరీ వనమును మీరు?
మీరు వచ్చుటకు కారణమేమి?

ఫల మూలములు-పానీయములు
మహిత పదార్థము లన్నియు కూడ
తృప్తిగ తిని-మరి శ్రమ తీరగను
మీ వివరములు తెలుపుడు తీరుగ.''

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 5 2 మారుతి తమ వృత్తాంతము స్వయంప్రభకు తెలుపుట

తిరిగి పలికెను తపోరాసి అట
ఫలములు తిని-మరి బడలిక తీరి
నే-వినదగినచొ మీ వివరమును
తెలియ బరచుడు-అనగా మారుతి

ఉన్నదంతయు పూస గ్రుచ్చినటు
ప్రారంభించెను వినయము నిండి:
''ఇంద్ర-వరుణుల సమానమైన
దశరథరాజు కుమారుడైన

రామచంద్రుడు-తన తమ్మునితో
ప్రియసతి సీత-జనక నందినితొ
దండ కాటవిలొ తిరుగు సమయమున
సీతాపహరణము జరిగినదమ్మా!

రావణు డామెను బలవంతముగా
అపహరించుకొని పోయెను వినుము
రామచంద్రునికి స్నేహితుడైన
వానర నాథుడు మా సుగ్రీవుడు.

ఆనతి నిడగా మాతను వెదకుచు
దక్షిణ దిశకు దనుజుని కొరకై
బయలు దేరితిమి-అంతయు వెదకి
ఆకలి - దప్పుల నిండి అలసితిమి.

మేమందరము అలసి సొలసి అట
తరువు ఛాయలో పడిపోయితిమి
మెల్లగ వెదుకగ బిలము గాంచితిమి
హంస-బెగ్గురులు-లకుముకులున్న

బిలము వెలికి మరి వచ్చుట గాంచి
శుభమది అనుచు రమ్మని నుడివితి
అంతట కపులు సరియని పలికి
బిలము జొచ్చి ఆ కారు చీకటిలొ

చేతులు పట్టుకు ప్రాకుచు వచ్చి
నీ సమీపమున చేరితి మమ్మా!
ప్రాణములూడెడి సమయములో-నువు
బ్రతికించితివి పుణ్యమూర్తివి.

మేలు మరువము తెలుపుము తల్లీ!
మేము చేయదగు సాయము ఏది?''
అని హనుమంతుడు పలుకగ నపుడు
తిరిగి పలికెను ఆ స్వయంప్రభ:

''మీ పలుకులతో సంతస మొదవెను
ధర్మ చరితను-మీవల నాకు
కాగల సాయము ఏదియు లేదు''
అన -హనుమంతుడు తిరిగి పలికెను:

॥శ్రీరఘురాముని॥

❃❃❃

# 53 స్వయం ప్రభ హనుమదాదులను సాగర తీరమున చేర్చుట

''వానరరాజు పెట్టిన గడువది
బిలమున నుండగ గడచి పోయినది
బిలము నుండి మము భూమి మీదకు
చేర్చుము తల్లీ! కరుణామూర్తివి.

ధర్మచారిణీ! మా కర్తవ్యము
సీతను వెదకుట-జరగక పోయెను
బిలమున చిక్కడి పోయితిమమ్మా
నిజము నుడివితిని నమ్ముము తల్లీ!''

అనగా పలికెను ఆస్వయంప్రభ:
''బిలము నుండి మరి తనువుతొ మీరు
బయలు వెడలగా సాధ్యము కాదు
తపోబలముచే మిము కాపాడెద.

కన్నులు మీరు మూసి కొనినచో
బిలము దాటగా చేతును.'' అనగా
చేతులతో ఆ వానరులందరు
కన్నులు గట్టిగ మూసి కొనగను

ఆశ్చర్యముగా బిలము కావల
అలలు పొంగెడి కడలి తీరమున
వారిని నిలిపి- ఆ స్వయంప్రభ
శుభమని పలికి- అదృశ్యమైనది.

భయంకరమగు అలలతొనున్న
వరుణుని స్థావరమగు సంద్రము గని
ఒడ్డుకానని కడలిని గాంచి
భయసంభ్రమములు నిండిరి కపులు.

వింధ్య పర్వత ప్రదేశమందు
పూచిన తరువులు పూలత లన్నియు
గాంచిన కపులు-వసంత మాయెను-
గడువు తీరినది అనుచు వగచిరి.

సింహ-వృషభముల పోలు మూపుతో
బలసిన భుజముల అంగదుడపుడు
వృద్ధుల-మిత్రుల-వానర వీరుల
చేర్చి పలికెను అనునయమ్ముగా :

''గడువు గడచెను బిలములోపలే
రాజ శాసనము నంది వెడలితిమి
కాగల కార్యము ఆలోచించుడు
నీతి కోవిదులు మీరందరును.

విశ్వాసముగల వీరులు మీరు
కార్య సాధకులు అనుచు పలుకుచు
రాజు ఆనతిని తలను ధరించిరి
ముందు నన్ను మరి నిలబెట్టుకొని

బయలు దేరితిరి కార్యము కాదయె
తిరిగి వెడలగ-సుగ్రీవుడట
తలల దునుమును-సందియ మేల!
నియమిత కాలము దాటి పోయినది.

కావున బ్రతికి సుఖపడ మింక
ప్రాయోపవేశము చేయుద మనుచు
అర్కసుతుడు అతి కఠిన స్వభావుడు
రాజ్యము నేలెడి రాజు ఆతడు.

రాముని భార్య కనబడ లేదన
చంపును మనలను-మనమచ్చటకు
పోయిచచ్చుట- అవమానమగు
ఇచ్చట చచ్చుట-మేలగు మనకు

యువ రాజైతిని రాముని చలవతొ
భానుజు ప్రేమతొ కానేకాదు
పాత వైరమున చంపును నన్ను
పుణ్య జలనిధి ఒడ్డున చత్తును.''

వానర శ్రేష్ఠులు సరియనిరపుడు
అంగదు మాటలు ఆమోదించిరి
''రాముని ప్రీతి నందుట కొరకు
చంపుట తథ్యము వానర రాజు.

అపరాధులు మరి రాజ దర్శనము
చేయగ తగరు-కావున సీతను
వెదకి గాంచిన-పురము చేరుదుము
లేదా మరి యమపురిని చేరుదము''

వానరులచట భయముతొ పలుకగ
తారుడు పలికెను వారితొ నపుడు.
''తిరిగి బిలమున సుఖముగ నుందము
భయమను మాట వినబడదచట

సుగ్రీవుడును సుర నాయకుడు
అతనికి సమమగు రామచంద్రుడు
మనలను చేరగ చాలరు కనుక
బిలమున చేరి సుఖముగ నుందము.''

అంతట కపులు-అంగదు మాటలు-
తారుని మాటలు-వినిన వారయి
కీడు కలుగని వీలగు మార్గము
ఆలోచించుడు చేయుదమనిరి.

॥శ్రీరఘురాముని॥

❈❈❈

## 54 హనుమంతుడు అంగదుని ఇంగితము తెలిసి కర్తవ్యము బోధించుట

తారానందను పలుకుల కున్ను
తారుని పలుకుల కచ్చటి కపులు
సరియను మాట-విని-హనుమంతుడు
తలచెను మదిలో-అంగదుడిపుడు

వానర రాజ్యము నందగ తగిన
పదునాల్గు గుణములు- ఎనిమిదంగములు
నాల్గు విధముల-బలము కలిగిన
వీరుడు అగునని -మది తలపోసి

శుక్ల పక్షపు చంద్రునివోలె
వృద్ధి నొందెడి తేజమనుకొని
తండ్రికి తగిన బలవంతుడని
బుద్ధికాతడు బృహస్పతియని

శుక్రనీతి విను-వాసవు రీతిగ
'తారుని' మాటలు విన మనసున్న
సకల శాస్త్రముల నెరిగిన వానిని
స్వామి కార్యమున శ్రమపడినట్టి-

అంగదు విషయము తెలిసినవాడై
ఆంజనేయుడు పలికెను అచట-
భేదోపాయము కలిగించి అట
వారిలొ వారికి వాదము గొలిపెను.

అవునని- కాదని- పలుకుచుండగా
కోపము తెచ్చుకు నిలిచిన వాడై
పలికెను మారుతి- బుద్ధిమంతుడు
అంగదుగాంచి- అనెను తీవ్రముగ

''యుద్ధమునందు తండ్రికి తగుదువు
కపిరాజ్యము-నువు ఏలగ తగుదువు
అయినను వినుము- కపులగు వీరు
చపల చిత్తులు-తెలియుము తీరుగ

భార్యల- బంధుల వదలి-వీరిట
కలకాలము నిన్నేల కొలుతురు?
చెప్పెద వినుముస్పష్టముగాను
సుహోత్రుడు మరి జాంబవంతుడు

నేనును-నీలుడు-సూర్యపుత్రుని
వదలము మేము-నీ వెట్లైనా
సామ-దానము-భేద-దండముల
మమ్ముల-నీతో కలప నసాధ్యము.

బలహీనుడు-తను బలవంతులతో
విరోధించి మరి బ్రదుక శక్యమా?
బిలములొ క్షేమము అనగా వింటిని
లక్ష్మణు శరముల కదియొక లెక్కా?

సురనాయకుడు -వజ్రాయుధమున
కూల్చెను అసురుని- అనగా వింటిమి
లక్ష్మణు శరములు చుట్టిన బిలమున
బ్రతుక శక్యమా ఎవరికైనను?

సుమిత్ర తనయుని శరములు- వినుము
వజ్రా యుధమును-పిడుగుల బోలి
కుల పర్వతముల చీల్చగ చాలును-
నిన్నీ కపులు వీడుట తథ్యము.

బిలమున దాగిన వారందరును
వెడలిన- ఒంటరి వాడవగుదువు
భార్యా బిడ్డల వదలి- ఇచ్చట
ఇడుముల బడెడి వారెవరయ్యా?

వీరులు వీడగ- ఒంటరివైనువు
తృణహీనముగా బ్రతుకు చుందువా?
బ్రతుకుట యెట్లు? లక్ష్మణు శరములు
బలిగొనవా నిను? తెలియద నీకు?

ఓ యువరాజా! - కిష్కింధాపతి
నీ యెడ - మిక్కిలి ప్రియతముడయ్యా!
నీపై పగ - ఆ రాజుకు లేదు
నాతో రమ్ము కిష్కింధాపురి

అంతియెగాక నీ తల్లి యెడ
అతి అనురాగము కలిగియుండెను
ఆమె కొరకు- తను సర్వము నిడును
నీవు తప్ప మరి సంతతి యెవరు?''
॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 5 5 అంగదుని ప్రాయోపవేశ నిర్ణయము

ఆంజనేయుడు అణకువతోను
రాజ గౌరవము- ధర్మము నిండి
అర్కసుతునట ప్రశంసించగా
అంగదుడనెను రాజుగురించి:

సీతను వెదుకగ వీరులనంపుట
సుమిత్రతనయుని భయము వల్లనే
ధర్మభయమున - ఆ కపిరాజు
వెదుకనంపగ లేదని తెలియుము.

''స్థైర్యము- ధైర్యము- దయ- దాక్షిణ్యము
ఋజుత్వమున్ను- ఆత్మ వికాసము
లేక పోవుటది- వింత కాదయా
అర్కసుతుడన- నీకు తెలియదా?

చపలచిత్తుడు- స్మృతి హీనుడును
కలుషాత్ముడు మరి కృతఘ్నుడతడు
అట్టి వానిని కలలోనైనా
నమ్మడు- సత్కుల వంశజు డెవడును.

మాతృతుల్యయగు అగ్రజు భార్యను
అన్నయుండగా- ఆలిగ గైకొనె
అంతటివాడు ఎంతటి నీచుడొ
ఆలోచించుము అంజనినందన.

గుణ వంతుడును- గుణ రహితుడును
తన పుత్రునకే ధరనీయును కద
వైరి పుత్రుడను- నన్నారాజు
బ్రతుక నిచ్చునా ప్రాణమ్ములతో?

వెలుపలినుండి కావలి కాయుము
అని పలికి- తను- పోరుకు పోగా
బిలద్వారమును మూసిన తమ్ముడు
ధర్మమార్గము తెలిసిన వాడా?

మదిలో నున్నది తెలియబరచితి
నేనపరాధము చేసినట్లగు
దీనుడ నేను అసహాయుడను
పురము నందు నే బ్రతుకుట ఎట్లు?

చేయి కలిపెను చేసె ప్రమాణము
తనపని తీరిన తదుపరి అతడు
రామచంద్రునే మరచిపోయెను
కృతఘ్నతకిది నిదర్శనమ్ము.

క్రూరుడాతడు వంచకు డతడు
దయా దూరుడు ఆ సుగ్రీవుడు
రాజ్య కాంక్షతో బ్రతుక నీయడు
చెరలో నుంచుటొ? చంపుటొ తథ్యము

బంధింపబడి మడయుట కంటె
ప్రాయోపవేశము చేయుట మేలు
వానరులారా! ఆనతి నిడితిని
మీరిక పొండు కిష్కింధాపురి

నేనిక రాను వానరపురికి
దాశరథులకిదె నా వందనము
వానర రాజుకు అంజలి నిడినటు
వారల కుశలము అడిగితి ననుడు

జనని- రుమాంబా దేవిని మీరు
సేమమాయని- ప్రశ్నించుడయా!
తల్లి తారను - అనునయమ్ముగ
ఊరడించుడు- దుఃఖము తీర్చుడు.

నన్ను గన్న నా తల్లి- తార- అట
పతి వియోగమున కృంగి పోయెను-
ఆపై నేను మడయుట వినినచొ
మాత బ్రతుకుటది అసాధ్యమైనది.''

పెద్దలందరకు అటుల చెప్పచు
దర్భల పరచుకు- దుఃఖతప్తుడై
నేల బరుండెను తారాసుతుడు
వానరులందరు చింతలొ మునిగిరి.

వానరులందరు ఆచమించిరి
జలధికి ఉత్తర దిశలో వారు
దక్షిణ దిశలో కొసలుండునటు
దర్భల పరచుకు మరణోన్ముఖులై

రామచంద్రుని వనవాసమ్ము-
దశరథరాజు మరణించుటయు
జనస్థానమున ఖరాది అసురుల
రామచంద్రుడు అంతము చేయుట

సీతాపహరణము- జటాయు మరణము
వాలి మడయుట- రాముని కోపము
వానరులందరు వ్యాకులమందుట
తలచి తలచి- అట ఏడ్చిరి కపులు.

పెద్దగ రోదన కపులు చేయగా
మేఘము లురిమిన ధ్వని కలిగినది
కొండ గుహలలో వారి పలుకులు-
రోదనలన్నీ ప్రతి ధ్వనించెను.

॥శ్రీరఘురాముని॥

✽✽✽

## 5 6 సంపాతి దర్శనము

ఎట- వానరులు- మడయ నెంచిరో
అట- జటాయువు కన్నగారగు
సంపాతియను- పులుగు శ్రేష్ఠుడు
వారల గాంచి సంబరపడెను.

''ప్రాణులందరికి ఆహారమును
ఇచ్చి- కాచును పరమేశ్వరుడు
వలయునట్టి ఆహారమంతయు
ముందుకు వచ్చి- నిలిచె- విచిత్రము!

రోజున కొక్క- కపిని తిందు'' నని
అనిన మాటలు విని అంగదుడు
ఆంజనేయునితొ పలికె దిగులుతో
''పక్షి రూపమగు యముడే అనెను

రామ పత్నిని వెదకుట ధర్మము
వనముల వెదకి అలసి పోతిమి
మరణ సమయ మాసన్నమైనది
పక్షి చంపునని వంత ఏల యిక?

రాముని కార్యము చేయగలేదు
రాజాజ్ఞను పాలించక పోతిమి.
సీతాదేవికి మేలు చేయగ
నిలచి జటాయువు అంతమొందెను.

రావణు నెదిరి సీత రక్షణకు
జటాయు వచ్చుట అసువుల బాసెను
ధన్యుడాతడు- మన మిచ్చటను
తేని భయమున చావదలచితిమి.

ఎవరికి వారే ముందుగ నిలచి
తోడు కోసమై అన్వేషించక
రామచంద్రుని కార్యము తీర్చుట
ధర్మము- అటుల జటాయువు నిలచెను.

దశరథు మృతియు- సీతాపహరణము
జటాయు మరణము వలననె మనకు
ప్రాణాపాయము సంభవించినది
కైక వరములవిప్రాణాంతకమయె.''

॥శ్రీరఘురాముని॥

❇❇❇

# 57 సంపాతియు, వానరులు- ఒకరి వివరములొకరు తెలుసుకొనుట

వాలి కుమారుని పలుకులన్నియు
నేల బరుండిన కపులు వినుటది-
పులుగు శ్రేష్ఠుడు విని- అట కరుణతొ
పలికెను తిరిగి: ''మీ పలుకులలో

రవి కిరణముల వేడిమి చేతను
రెక్కలు నావి కాలిపోయినవి
నేలకు దింపుడు- వివరము తెలుపుడు
తమ్ముడు దశరథు సఖుడెట్లాయెను?''

జటాయు మరణము వింటిని నేను
నా హృదియంతయు జ్వలించు చుండెను
దండ కాటవిని- దశకంఠునితో
ఏల పోరు? మరి ఎటుల మడసెను?

దుఃఖము ఎగయగ పక్షిపలికెను
విని- వానరులు నమ్మక పోయిరి
తీరా తెచ్చి- దింపిన వెనుక
వంతుగ తినును- అని తలపోసిరి.

వానర శ్రేష్ఠా! నీవెవ్వరవు
వివరములన్నీ తెలుపుడు మీరు
మంచి మనసుతో గిరిపై నుండి
భూమి మీదకు దింపుడు నన్ను.

కొందరు పలికిరి- చచ్చుటకే మరి
సిద్ధ పడితి మిక- భయమది ఏల?
అనుచు పలుకుచు కొందరు పోయి
పక్షిని నేలకు దింపిరి అచట.

అంగదుడపుడు పలికె పులుగుతో:
"బ్రహ్మ సమానుడు ఋక్షరజుడను
వానర శ్రేష్ఠుడు- అతని కిద్దరు
కుమారులుండిరి అతి బలవంతులు.

వాలి-సుగ్రీవులు వారి పేరులవి
అందు-వాలి నా ప్రియ జనకుడయా!
అద్భుత కార్యము లెన్నోచేసి
కీర్తి గడించెను వానర రాజు.

దశరథ తనయుడు- రామచంద్రుడు
రఘువంశమున ప్రసిద్ధి గాంచెను
తండ్రి ఆనతిని- తన సతి సీతతొ
తమ్ముడు లక్ష్మణు మూర్తితొ నంత-

న్యాయ మార్గమున నడచు రాముడు
కానన సీమల నడచుచునంత
దండక వనిలో చేరినయంత
పాప కర్ముడు రావణాసురుడు

రాముని సతిని-వంచనతోను
జన స్థానమున అపహరించగా
దశరథరాజుకు సఖుడు జటాయువు
జానకి దేవిని రక్షించుటకై

వానితొ పోరి- రథమును విరచి
ధరణి మీద నిలబెట్టెను వానిని
పోరు సాగెను-వృద్ధుడగుటచే
బడలి యుండగా-రెక్కలు తెగెను

రెక్కలు తెగిన పక్షిరాజట
మరణించగను-రామచంద్రుడు
ఉత్తమగతిని కలిగించెను-విను.
సుగ్రీవునితో నెయ్యము నెరపెను.

సుగ్రీవునికి శత్రువు అయిన
వాలిని చంపి-రామచంద్రుడు
వానర రాజ్యము రవిసుతుకిచ్చెను
సీతను వెదకగ రాజు పంపగా

వెదకితి మెంతో మెలకువతోను
నిశిలో-సూర్యుడు కనబడనట్లే
కనబడలేదు సీతాదేవి-
తిరిగి వెదకుచు నుండగ మేము

తెలియకపోయి ఓ ధర్మజ్ఞా!
మయునిర్మితమగు బిలమునందున
చిక్కు కుంటిమి- గడువు తీరినది
ఏని ఆజ్ఞకు బద్ధులమయ్యా!

గడువు గడచెను కార్యము కాదయె
తిరిగి మేము మరి పురము చేరుటెటు?
మా ప్రాణములు దక్కవు కావున
ఇచ్చట చావగ నిర్ణయమైనది

రామచంద్రునికి సుగ్రీవునకు
లక్ష్మణమూర్తికి కోపము వచ్చిన
మా దేహమున అసువులుండవు
నిజమిది నమ్ముము-పక్షికులోత్తమ!"

॥శ్రీరఘురాముని॥

❀❀❀

## 5 8 సీతాదేవి వివరము సంపాతి చెప్పుట

బ్రతుకు ఆశను వదలిన కపులు
దుఃఖించుచును చెప్పగ వినిన
సంపాతపుడుపలికెను వారితో :
''జటాయువాతడు నా సోదరుడు

అతని మరణము వింటిని నేను
రెక్కలు లేక పడియుంటినిట
లేదా-నే పగ సాధించెదను
వృత్రాసురుడు సురనాయకులకు

పోరుజరిగెడి సమయములోను
సోదరులము-మా వేగము తెలియగ
పోటీపడి-మరి నింగికి ఎగిరి
సూర్య మండలము చేరదలచితిమి

సుడులు తిరుగుచు గగన వీధిలో
సాగుచుండగా- అపరాహ్ణమున
సూర్యుని వేడిమి నా సోదరుడు
భరించ లేక బాధపడగను

ప్రేమగ-అతనికి వేడి సోకనటు
రెక్కల -నేను కప్పితినంత-
ఆ వేడికి నా రెక్కలు కాలి
వింధ్యగిరిని-నే పడిపోయితిని.

కావున తమ్ముని వివరము తెలియదు''
అనగ నంగదుడు పలికెను అపుడు:
''నే నుడివినది వింటివిగనుక
రావణు నెలవు తెలిసిన తెలుపుము.''

సంపాతపుడు సంతోషముతో
పలికెను వారితో: ''గ్రద్ధను నేను
రెక్కలు లేక - శౌర్యహీనుడను
అయినను నుడివెద-వినుడందరును.

రాముని కార్యము మొదటిది వినుడు
మాట సాయము చేయగ చాలుదు
రావణు విషయము తెలియును నాకు
వితలాదిలోకముల నెరుగుదు నేను

త్రివిక్రముడయి విష్ణుమూర్తి-తను
భూమిని కొలుచుట తెలియును నాకు
దేవాసురుల పోరు తెలియును
అమృత మథనము తెలియును నాకు.

రావణాసురుడు గొని పోచుండగ
నిడుపగు కన్నులు గలిగిన యువతి
యౌవనవతియు భూషణ యుతయు
శోకము నిండిన కోమలి అపుడు

ఆభరణమ్ములు తీసి వేయుచు
ఆక్రందించెడి త్రిలోకపూజ్యను
స్త్రీని గాంచితిని గిరిశిఖరమున-
సూర్య కాంతియో మేఘము నందలి-

మెరుపు తీగయో-అన- ఆ జవ్వని
అసురుడు గొనిపోచుండు సమయమున
రామా! లక్ష్మణా ! అనుచు ఏడ్చెను
ఆ మానిని యగురాముని సుందరి.

రావణు వివరము చెప్పెద వినుడు
విశ్రవసునికి ఔరసపుత్రుడు
కుబేరునకును తమ్ముడాతడు
లంకానగరము నేలును వాడు.

సంద్రము నుండి నూరామడలలో
విశ్వకర్మ నిర్మించిన ద్వీపము
అదియే- అసురుడు వసించుపురము
బంగరు సౌధములుండును శోభగ.

రక్కసి వనితల కావలి నడుమ
రక్కసు నంతఃపురము నందున
దుఃఖమునున్నది సీతాదేవి
ఫల సిద్ధిని మరి పొందుడు మీరు.

త్వరగా సాగుడు జాగు చేయక
జ్ఞాన దృష్టితో గాంచితి నేను
కార్యము తప్పక తీర్తురు మీరు
విజయ వంతులై మరలగలరయా!

దివ్య దృష్టి- మాకున్నది వినుడు-
ఆకసంబున ఏడుస్కంధములు
వాటిలో ఏడవ స్కంధము వారము
వైన తేయుని సంతతిమాది.

ఒకటవస్కంధము- గింజలతినుచు
భూమి నుండెడి పక్షి సంతతి-
రెండవ స్కంధము ఫలములు తినుచు
తరువుల తిరుగును- ఇక మూడవది.

క్రౌంచములున్ను, నీటి కాకులు
నాల్గవ స్కంధము డేగలు అగును
అయిదవ స్కంధము గ్రద్ధలగునవి
హంసలు చేరును ఆరవ స్కంధము.

ఏడవగతి ఇక- వైనతేయునిది
అందు జేరిన వారము మేము
నూరామడల దూరమైనను
తేలికగా మరి చూడగలమయా!

దూరమునున్న ఆహారమును
వెదకి తినగను- విధాత అంతటి
దృష్టి నిచ్చెను- అంతటి పుష్టి
కలిగిన తిండి- తిందుము మేము.

లోక నింద్యమగు కార్యము నసురుడు
చేసెను- తగినటు బుద్ధి చెప్పిన
తమ్ముని చంపినదానికి మీరు
ప్రతి క్రియచేసిన వారలగుదురు

సంద్రము దాటగ యోచన చేయుడు
లంకను జేరి సీతనుగాంచి
శుభముగ కిష్కింధాపురి జేరి
మిగిలిన కార్యము తీర్చుడు భక్తిగ

తమ్మునికిపుడు జలతర్పణము
చేసెద- సంద్రపు తీరము చేర్చుడు''
అనిన- వారలు అటుల చేసిరి
సీతాదేవి వివరము తెలిసిరి.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 5 9 జాంబవంతుడు అడుగగా–సంపాతి, మరింత వివరముగా సీతాపహరణము చెప్పుట

సంపాతి పలుకులు ప్రాణము పోయగ
వానరులందరు పొంగి పోయిరి
జాంబవంతుడు సంపాతినిగని
వివరములడిగెను వినయముగాను

''ఏచ్చట నున్నది ఆ సీతమ్మ?
ఎవరు చూచిరా రామపత్నిని?
హరించినట్టి అసురుడెవ్వడు?
వివరము తెలిపి మము రక్షించుము

రామచంద్రుని వజ్ర శరముల
బారి పడెడి ఆ మూఢు డెవ్వడు?''
అనగా పలికెనుఅట సంపాతి
వివరములన్నీ వినుడని తెలిపెను:

''రెక్కలు పోయి నే పడియుంటిని
సుపార్శ్వడనియెడి నా కుమారుడు
పితృభక్తిచే నిరతము అతడు
ఆహారమును తెచ్చియిచ్చును.

గంధర్వులకు కామము మెండు
కోపము మెండు పాము జాతికి
భయము మెండు మరి మృగములన్నిటికి
ఆకలి మెండు పక్షులన్నిటికి

ఒక దినమున మరి చాలా సమయము
వేచియుంటిని- ఆకలి నిండి
ఆహారమది లేకనె తనయుడు
చేరెను- అతనిని నిందించితిని

శాంత వచనముల తనయుడు పలికెను :
''మహేంద్ర పర్వత ప్రాంతము నందు
జల జంతువులను అడ్డగించి- అట
వేచియుండగా- ఆకాశమున

కాటుక కొండగు దేహముతోను
సూర్య సమాన తేజోవంతుడు
స్త్రీ నొక్కతెను గొని పోచుండగ
అడ్డగించితిని- ఆహారముకై.

అంతట వాడు వినయము నిండి
ప్రార్థన చేసెను త్రోవ యిమ్మని
సరియని –పొమ్మని నే పలికితిని
శరణనగా మరి చంపుట తగదని.

తన తేజముచే ఆకసమ్మునే
గొనిపోచున్నటు–వాడు సాగెను
అంబర వీధిని సంచరించెడి
పెద్దలు పలికిరి- బ్రతికితివీవని.

వాడు నిన్ను మరి ఎదిరించకను
సాగెను గావున- బ్రతికి పోతివి
అనగా నడిగితి వారినప్పుడు
అసురుని వివరము వారు తెలిపిరి.

వాడు రావణుడు- రాక్షస నాథుడు
రామపత్నిని అపహరించుకొని
భయముచె- త్వరగా పోవుచుండెను
విలపించు వనితయె సీతాదేవి

అనుచు సమస్తము తెలిపెను తనయుడు
వినియును నేను అసహాయుడను
రెక్కలు విరిగిన పక్షిని నేను
వాక్కు- బుద్ధియు చక్కగ నున్నవి.

వానరులారా! రామ కార్యమది
నా కార్యముగా తలతును నేను
బలవంతులును బుద్ధిమంతులు
సుగ్రీవునిచే పంపబడితిరి.

సురలకైన మీరసాధ్యులయ్యా!
రాముని శరములు మూడు లోకముల
పొడిపొడి చేయగ శక్తి మంతములు
రావణుడాతడు బలయుతుడయ్యును-

మీరు సమర్థులు- అసాధ్యమెరుగరు
రామ సేవకై జాగు చేయక
వడిగా సాగుడు వెనుకకు చూడక
స్వామి కార్యమది తీర్చుకురండు.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 60 నిశాకరమహర్షి వృత్తాంతము సంపాతి తెలుపుట

వానర వీరులు వినుచుండగను
తిరిగి పలికెను సంపాతపుడు:
''సద్దుచేయక వినుడు శ్రద్ధగా
నేనిట నుండుట వివరించెదను.

రెక్కలు కాలి రాలిపడితిని
తెలివి తప్పినది- తిరిగి తేరుకొని
దక్షిణ సంద్రపు తీరమందుగల
వింధ్యయందు-నే నున్నటు తెలిసితి.

పూర్వము యిచట 'నిశాకరు' డను
ఋషి పుంగవుడు తపమున నుండెను
స్వర్గము చేరెను- ఆ ఋషి శ్రేష్ఠుడు
ఎనుబదివేల ఏండ్ల క్రిందట.

మా సోదరులను- ఆ ఋషి ప్రీతిగ
ఆదరించుచు నుండెడి వాడు
అందు కొరకు - నే ఋషిని చూడగా
చేరితి- గాంచితి తపోవంతుని.

జలనిధి స్నానము తీర్చిన మౌని
ముందు నడువగా పులులు- సింహములు
పన్నగమ్ములు- చమర మృగమ్ములు
బ్రహ్మ వెంబడి ప్రాణి కోటులన

వెంబడి వచ్చి సాగనంపిరి-
ముని - ఆశ్రమమున అడుగుబెట్టి- మరి
తిరిగి వచ్చెను నన్నుగాంచి అట
పలికెను- ''రెక్కలు లేకపోవగా

దేహమంత గాయమ్ములు నిండగ
గుర్తించకను పోతిని నేను
పూర్వమిచ్చట రెండు పులుగులు
అతి వేగముగల పక్షులుండెను.

పులుగులు రెండు సోదరులగుదురు
కోరిన రూపము దాల్చగలిగిన-
వారిలో నీవు సంపాతివి కద!
నీ అనుజుడు మరి జటాయువేనా?

మానవ రూపము దాల్చుము నీవు
పాద సేవలు నాకు చేయుము
నీ రెక్కలవి ఎటుల కాలినవి
నీకీ హానిని చేసిన దెవ్వరు?''

॥శ్రీరఘురాముని॥

✲✲✲

## 6 1 సంపాతితన రెక్కలు కాలిన వివరము మహర్షికి తెలుపుట

ఆయాసముతో మాటలు రాకయె
''మునితో సర్వము చెప్పితినపుడు
స్వామీ! వినుము-పొగరున మేము
కైలాసగిరి శిఖరముచేరి.

అచ్చటి మునుల సన్నిధిలోను
సోదరులము-మా బలము తెలియగ
రవిఅస్తాద్రిని చేరులోపల
రవిని చేరగా పందెము వేసుకు

నింగి కెగిరితిమి- ఎంతో సాగి
వేద స్వరములతొ-సంగీతముతో
ఎట్టని వలువల శోభిలు స్త్రీలతొ
నిండిన తావును-దాటి ఎగిరితిమి.

ఎత్తునుండి మరి నేలను గాంచిన
చిన్ని చక్రముల పోలె నగరములు
అడవులు-పచ్చికపట్టుల పోలెను
గిరులు తోచెను గులకరాలవలె.

హిమవత్ వింధ్య-మేరుగిరులవి
మడుగునపాములవలె కనబడగ
కన్నులు తిరిగెను చెమటలు పోసెను
దిక్కులు తెలియక-శూన్యమయ్యెను.

ప్రళయ కాలమున అగ్ని శిఖలచే
లయమగునట్టు లోకము కనబడె
బలవంతముగా చూడగనపుడు
ధరణియంత విస్తార దేహముతో

కనబడెనచట సూర్య దేవుడు
మాట రాక నా తమ్ముడు -నేలకు
రాలుచుండ-నే నతనికి రక్షగ
రెక్కల నతనికి కప్పితి స్వామీ!

నా రెక్కలవి కాలిపోయినవి
జనస్థానమున తమ్ముడు పడినటు
ఊహించితిని-రెక్కలు కాలి
రాలితి నిచట మొద్దు మాదిరి.

తోడు పోయెను రెక్కలు కాలెను
రాజ్యము పోయెను-శక్తి తరిగెను
అసహాయుడను అసువులు నిలపను
కొండనుండి ఇక నేల బడుదును.''

॥శ్రీరఘురాముని॥

✲✲✲

## 6 2 సంపాతి రెక్కలు వచ్చు వివరము

''మహర్షి వినెను-నే విలపించుట
తపోబలమున చూచి చెప్పెను
నాకు రెక్కలు-బలము వచ్చునని
వినుడు-మహర్షి వాక్కులు నిజమగు

ఇక్ష్వాకు వంశమున దశరథ రాజుకు
రామచంద్రుడు దయించును- ఆతడు
తండ్రి యానతిని సతి సోదరులతొ
వనమున నుండగ వన వాసముగా

జన స్థానమున రాముని భార్యను
రాక్షసరాజు అపహరించును
ఆమె అచ్చటనిరాహారయై
ఆశకు లొంగదు పతినే తలచును.

సురలకు కూడ దుర్లభమయిన
అమృతమును దేవేంద్రుడు యివ్వగ
వాస్తవమ్మును తెలిసిన వనిత
పతివ్రతయగు పావన చరిత.

అమృతమందు మొదటి భాగముగ
రామ లక్ష్మణుల తలచి-వార్కై
భక్తితొ భాగము భూమిని ఉంచును
ఆమెను వెదుకగ వత్తురు కపులు.

సీతాన్వేషణ చేసెడి కపులకు
ధరణిజ వివరము తెలుపుము నీవు
మేలుకలుగును-కావున నీవు
వేచియుండుము-వానరులను గన.

దేశ కాలముల కెదురు చూచుచు
రామ సేవకై నిలిచి యుండుము
వివరము తెలిపిన వచ్చును రెక్కలు
నేను-నీకు మరి రెక్కలు ఇచ్చిన

ఎగురు చుండు నువు కపులను గాంతువ?
ఒకచో నిలచినజరుగును కార్యము
జగతికి మేలగు కార్యము-వినుము
నీ నిమిత్తముగ జరుగ వలయును.

సురాధిపతికి భూసురవరులకు
మునులకు-సురలకు-రామచంద్రునికి
ప్రీతి గొలిపెడి కార్యము నీవు
చేయగ వలెనని ముని పలుకుచును.

మహిత మూర్తులను రామలక్ష్మణుల
దర్శించగ నా మదిలో కలదు
అంతవరకు - ఈ భువిలో తనువును
మోయగ లేను పోయెద నేనని.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 6 3 సంపాతికి రెక్కలు వచ్చుట

''కాగల కార్యము తెలిపి మునీంద్రుడు
ఊరడించె నను-అంతట నేను
అతి ప్రయాసతో ఈ గిరినెక్కితి
అహోరాత్రములు చూచుచుంటిని.

ఎనిమిదివేల ఏండ్లు గడిచినవి
ముని మాటలు-నే మదిలో నిలపి
వేచి యుంటిని ధైర్యముతోను
మునిపుంగవుడు నాకము జేరెను.

## 62 సంపాతి రెక్కలు వచ్చు వివరము

''మహర్షి వినెను-నే విలపించుట
తపోబలమున చూచి చెప్పెను
నాకు రెక్కలు-బలము వచ్చునని
వినుడు-మహర్షి వాక్కులు నిజమగు

ఇక్ష్వాకు వంశమున దశరథ రాజుకు
రామచంద్రుడు దయించును- ఆతడు
తండ్రి యానతిని సతి సోదరులతొ
వనమున నుండగ వన వాసముగా

జన స్థానమున రాముని భార్యను
రాక్షసరాజు అపహరించును
ఆమె అచ్చటనిరాహారయై
ఆశకు లొంగదు పతినే తలచును.

సురలకు కూడ దుర్లభమయిన
అమృతమును దేవేంద్రుడు యివ్వగ
వాస్తవమ్మను తెలిసిన వనిత
పతివ్రతయగు పావన చరిత.

అమృతమందు మొదటి భాగముగ
రామ లక్ష్మణుల తలచి-వార్కై
భక్తితొ భాగము భూమిని ఉంచును
ఆమెను వెదుకగ వత్తురు కపులు.

సీతాన్వేషణ చేసెడి కపులకు
ధరణిజ వివరము తెలుపుము నీవు
మేలుకలుగును-కావున నీవు
వేచియుండుము-వానరులను గన.

దేశ కాలముల కెదురు చూచుచు
రామ సేవకై నిలిచి యుండుము
వివరము తెలిపిన వచ్చును రెక్కలు
నేను-నీకు మరి రెక్కలు ఇచ్చిన

ఎగురు చుండు నువు కపులను గాంతువ?
ఒకచో నిలచినజరుగును కార్యము
జగతికి మేలగు కార్యము-వినుము
నీ నిమిత్తముగ జరుగ వలయును.

సురాధిపతికి భూసురవరులకు
మునులకు-సురలకు-రామచంద్రునికి
ప్రీతి గొలిపెడి కార్యము నీవు
చేయగ వలెనని ముని పలుకుచును.

మహిత మూర్తులను రామలక్ష్మణుల
దర్శించగ నా మదిలో కలదు
అంతవరకు - ఈ భువిలో తనువును
మోయగ లేను పోయెద నేనని.''

॥శ్రీరఘురాముని॥

❋❋❋

## 63 సంపాతికి రెక్కలు వచ్చుట

''కాగల కార్యము తెలిపి మునీంద్రుడు
ఊరడించె నను-అంతట నేను
అతి ప్రయాసతో ఈ గిరినెక్కితి
అహోరాత్రములు చూచుచుంటిని.

ఎనిమిదివేల ఏండ్లు గడిచినవి
ముని మాటలు-నే మదిలో నిలపి
వేచి యుంటిని ధైర్యముతోను
మునిపుంగవుడు నాకము జేరెను.

వానరులందరి ఉత్సాహమును
వెలికి నెట్టగా యోచన చేసి
పలికెను అపుడు తారాసుతుడు
"సంద్రము దాటెడి వీరుడెవ్వడో!

రాజు మాటను నిలుప సమర్థుడు
రామ కార్యమును చేయుధీరుడు
కపులకు ప్రాణ దానము చేయును
అలు బిడ్డలతొ సుఖమును కూర్చును.

ఎవ్వని మహిమచె పురమును చేరి
దాశరథులను వానర రాజును
చూచెడి భాగ్యము కలుగ నున్నదో!"
అనుచు అంగదుడు ప్రేరేపించగ

వానరు లెవ్వరు ముందుకురాక
మెదలక యుండుట గాంచినవాడై
యువరాజపుడు తిరిగి పలికెను.
"అతి బలవంతులు అర్థము నెరుగరు

గొప్ప వంశమున బుట్టిన మీరు
అసాధ్యమన్నది ఎరుగరు అసలు
అందర మొకటై పోగలుగుదుమా?
మీమీ శక్తిని తెలుపుడు ఇపుడు

ఎంత దూరము దాటగలరొ మరి
తెలియబరచుడు మీ రందరును
అది తెలిసినచో ఆవల కార్యము
ఆలోచింతము" - అనెను అంగదుడు.

॥శ్రీరఘురాముని॥

## 6 5 కపులు వారి వారి శక్తిని తెలుపుట–జాంబవంతుడు అంగదునికి ధైర్యము గొలిపి–సమర్థుని ప్రోత్సహించెద ననుట

కిచకిచలాడుచు కపులు లేచిరి
తమతమ శక్తిని తెలియబరచిరి
పది ఆమడలు- గజుడు చెప్పెను
గవాక్షుడిరువది ఆమడలనెను

గవయుడు ముప్పది- శరభుడు నలువది
గంధ మాదనుడు యేబది అనెను-
మైందుడు అరువది ఆమడలనెను
ద్వివిదుడు డెబ్బది యోజనంబులనె.

సుషేణుడెనుబది యోజనంబులు
నిస్సంశయముగ దాటెదననెను
అంతట వృద్ధుడు జాంబవంతుడు
పలికెను వారితొ శక్తిని తెలుపుచు

"పూర్వము- కొంత శక్తి యుండెడిది
వృద్ధుడ నైతిని- పూర్వము శక్తిని
తలచిన ఏమగు? రామ కార్యమును
ఉపేక్షింపగ తగదు మనకిక.

తొంబది ఆమడ లవలీలగను
దాటగలిగిన భుజ బలమున్నది.
పూర్వము- బలి- తను యజ్ఞము చేయగ
విష్ణువు వెలసెను త్రివిక్రమునిగ.

ఆ మూర్తికి- నే ప్రదక్షిణించితి
ఆ బలమప్పుడు కలిగియుంటిని
దానిని తలచిన ఫలితము ఏమి?
తొంబదామడల శక్తి కలదుమరి."

అంతట అంగదు డనెను వీరునితో
జాంబవంతుని పొగడుచు పలికెను
''నూరు వరకు నే దాట గలుగుదును
తిరిగి వచ్చుటది-సందేహము మరి.''

ఈ కార్యమునకు మూలము నీవు
వేరు గట్టిగా నుండగ-తరువు
వలయు ఫలములు-పూలను ఇచ్చున
కావున నీవు పోవలదయ్యా!

జాంబవంతుడు పలికెను అపుడు
''ఓ యువరాజా! దాట సమర్థత
కలిగి యుంటివి- తిరిగి వత్తువు-
అయినను నీవు పోరాదయ్యా!

దోషరహితుడా! సుబుద్ధి వీవు
ప్రభు తనయుడవు-మాకు ప్రభువవే-
కావున -నిన్ను ముందు నిడుకొని
కార్యము తీర్చగ యత్నము చేతుము.'

రాజు-సర్వదా సేవించబడు
భృత్యులు-రాజును పంపగ తగదు
వానర కోటికి స్వామివి నీవు
నీ రక్షణ మరి భృత్యుల విధియగు.

అంగదుడనెను జాంబవంతునితో
''సమర్థుడెవరు కనబడలేదు
కావున- తిరిగి మనకందరకు
తప్పదింక ప్రాయోపవేశము.

సేవకులచె-మరి రాజు సర్వదా
రక్షింపబడి- సేవలందవలె
లోక మర్యాద-కావున అంగద!
నిను పంపుటది మాకు తగదయా!

చావక-తిరిగి పోయిన-చచ్చుట''
అన విని- అపుడు జాంబవంతుడనె
''రాజ కుమారా! నీ కార్యమునకు
కొరత కలుగదు- ఇపుడే నేను

కార్య సాధకుని ప్రోత్సహింతును''
అనుచు- ఒంటరిగ కూర్చొనియున్న
వారిధి దాటగ చాలిన ఘనుని
వాయు పుత్రుని చెంత చేరెను.

॥శ్రీరఘురాముని॥

❉❉❉

# 66 సముద్రలంఘనమునకు జాంబవంతుడు ఆంజనేయుని ప్రోత్సహించుట

బుద్ధి శాలియగు జాంబవంతుడు
దీన వదనులగు కపులను గాంచెను
హనుమంతుని గని పలికెను తీరుగ:
''వానర వీరవరేణ్యుడ! హనుమా!

సకల శాస్త్రముల పారంగతుడవు
పవననందనా! ఉలుకక-పలుకక
ఒంటరివై-నువు- ఉంటివి ఏల?
రామ లక్ష్మణ సుగ్రీవుల వలె

శక్తిమంతుడవు వినుమా హనుమా!
వినతాసూనుడు గరుత్మంతుని
రెక్కల సరియగు బలము నీదయా!
తేజము-బుద్ధి-ధైర్యము లందున

నిన్ను మించి మరి ఎవ్వరు హనుమా?
నిర్మల మనసు కలిగిన వాడవు
నీ శక్తి మరి నీకు తెలియదు
నే నుడివెద-విను వివరముగాను.

అప్సరసలలో శ్రేష్ఠురాలగు
పుంజకస్థల, ప్రసిద్ధి సుందరి
శాప వశమున-వానర స్త్రీయై
'కుంజరు' డను నొక వానర ప్రభువుకు

అంజనదేవి అన్న పేరుతో
ఉదయించినది-కూతురైనది
కామ రూపమున తిరుగ జాలినది
'కేసరి' యను నొక కపి కుంజరునకు

అంజన దేవి ఇల్లాలైనది
సౌందర్యవతి-మనుజ రూపమున
సన్నని వలువల శోభగ వెలుగుచు
గిరి ప్రదేశమున విహరించగను.

కొండగాలికా తొయ్యలి పయ్యెద
జరిగెను అంతట ఆసుకుమారిని
మన్మథు వశమున చిక్కిన యట్టి
వాయు దేవుడు కౌగలించుకొన

పతి వ్రతనగు-నాకు కీడును
చేయగ నెంచెను- ఎవ్వరు అనగ
వాయు దేవుడు వివరము తెలిపి
కీర్తిమంతుడగు సుతుడు కలుగుననె.

'ఈదుట యందు ఎగురుట యందు
నాతో ఈడగు తనయుడు కలుగును
వేగవంతుడు, విక్రమ వంతుడు
బుద్ధిబలమది నిండిన వీరుడు.

ఉదయించునని'-చెప్పి-వెడలెను
అంజన దేవి కన్నుల పంటగ
ఉదయించితివి పర్వత గుహలో
ఆంజనేయ! నువు అసమాన్యుడవు

అడవిలొ సూర్యోదయమును గాంచి
సూర్యుని ఫలముగ మదిలో ఎంచి
మూడు వందల యోజనమ్ములు
ఎగిరితి వయ్యా! రవినే మ్రింగగ

ఎండ వేడి అది బాధించినను
వదలవాయెను నీ ప్రయత్నము
అంతట సురపతి వజ్రాయుధమును
కోపము నిండి విసరెను నీపై

వజ్రాయుధము తగిలెను నీకు
ఎడమ చెంప అది గాయపడగను
హనుమంతుడను నామము కలిగెను
నీ బాధను గని వాయుదేవుడు

కోపము నిండి-కదలక నిలచెను
లోకములన్నీ గడగడలాడెను
సురలందరును కలత చెందిరి
త్వరగా వచ్చిరి కోపము తీర్చగ

శస్త్రమ్ములచే మరణము లేదని
వరము యిచ్చెనువిరించి నీకు
వాసవు వరము విను హనుమంతా!
స్వేచ్ఛామరణము ఓ మతిమంతా!

కేసరికీవు క్షేత్రజ్ఞుడవు
వాయుదేవుని ఔరస పుత్రుడ
తండ్రికి తగిన తనయుడ వీవు
నమ్మము నాయన!-సత్యము నుడివితి.

మా ప్రాణములు పోవుచున్నవి
పుణ్యమతీ! మము దయగనుమయ్యా!
వైనతేయునికి సాటి వత్తువు
పుణ్యమూర్తి! నువు నిలబడవయ్యా!

గిరులు వనములతొ నిండిన భూమిని
త్రివిక్రముడట అవతరించగ
ఇరువది ఒక్కమార్లు ప్రదక్షిణ
చేసితినయ్యా! అప్పటి మాటది.

సంద్రము చిలికెడి సందర్భములో
సురలు కోరగా-దివ్యోషధులను
లతలను తెచ్చితి-వాటి యందున
అమృత మప్పుడు ఉద్భవించినది

ముదుసలి నైతిని-అది అటులుంచుము-
సద్గుణ యుతుడవు-బలమున మేటివి
ప్రాణి కోటిలో నీతో సమముగ
సాగెడి వారు మరి యింకెవ్వరు?

విజృంభించుము వీర వరేణ్యా!
లేచి నిలువుము పవననందనా!
మాట నిలుపుము కేసరితనయా!
అసువులు నిలుపుము అంజనినందన!

నీ మహిత శక్తి- ఓ! మంగళమూర్తి!
ప్రత్యక్షముగా చూచెదమయ్యా!
వానరోత్తమా! వేగమె లెమ్ము
వారిధి దాటగ చూతము లెమ్ము.

మిత్రులు-నీదగు విక్రమమ్ము గన
వేచి యుండిరి వాయునందనా!
విష్ణుమూర్తి-అట తివిక్రమునిగా
వెలసినట్టుగా నిలబడవయ్యా!

రోమ రోమమున రామనామమ్మై
నామ జపముతో రామబాణమ్మై
భీమబలుడవై స్వామి కార్యమున-
రామదూత! నువు రయమున బొమ్ము.

నింగి తగులునటు నిలబడవయ్యా
పొంగిపోవు మా గుండెలన్నియు
అంగదాదుల వేదన తీర్చుము
ముంగిట నుండును లంకాపురము''

జాంబవంతుడట ప్రోత్సహించగా
ఆంజనేయుడు విజృంబించెను-
సంతోషముతో వానర వీరులు
ముదమున చూడగ- ఎదిగెను హనుమ.

॥శ్రీరఘురాముని॥

❋❋❋

# 6 7 రామకార్య నిర్వహణకై సమర్థుడై నిలచిన ఆంజనేయుని సందర్శనము

నూరు యోజనములున్న వారిధి
దాటగ-పావని ఎదుగుచుండగా
శోకము వదలి ఆ కపులందరు
ముదముగ-స్తోత్రము చేసిరి హనుమను.

త్రివిక్రమునిగా నిలచిన దేవుని
విష్ణుమూర్తిని-లోకము లెల్ల
దర్శించునటు- ఆంజనేయుని
దర్శించిరి-అట- ఆ కపివీరులు.

కొండ గుహలలో కేసరి మాదిరి
కేసరి తనయుడు నిండుగ ఎదుగగ
మేలు మేలు యని కపులు పొగడగా
దివ్యాకృతిని దాల్చెను పావని.

నిప్పులకుప్పగ ముఖము ఒప్పెను
మేన వెంట్రుకలు లేచి నిలచెను
పెద్దలందరికి వందనమ్ముంచెను
కొండల చిమ్మగ చాలగ నిలచెను.

సంతోషముతో పలికెను మారుతి
''నాతో దాటగ సములే లేరు
తండ్రికి తగిన తనయుడ నేను
మేరుగిరికి-నే ప్రదక్షిణించెద.

వేయిమార్లు-నే ప్రదక్షిణించెద
సంద్రపు నీటిని చేతుల చిమ్ముచు
అడవులు-భూమిని నీటితొ ముంచన!
వేగముగా నే సాగు సమయమున.

పిక్కల వలన కలుగు వేగమున
కడలిని నింగికి-చిమ్మగ చాలుదు
వినతాసూనుడు గరుత్మంతునికి
వేయిమార్లు-నే ప్రదక్షిణింతున-

సూర్యుని మించిన వేగము కలిగి
అస్తగిరికి-రవి చేరులోపలే
ఆ గిరి చేరి-అపరాహ్ణమునకు
ఎదురు వత్తును సూర్యదేవునికి.

అంతటి పయనము- ఆగకుండగనె
అలుపు లేక-నే చేయ చాలుదును
వేగముగా నే సాగు సమయమున
కడలి నడుచు-నా తొడల వేగమున.

తునకలుకాగా భూమిని జీల్తున!
సంద్రపు నీటిని ఎండ గట్టనా-
గిరులను-పొడిపొడి చేతున-చేతుల-
సాగగ నిలచితి రామ కార్యమున.

ఆంజనేయుడన- ఏమనుకొంటిరి
రివ్వున నింగికి ఎగరగ నేను
నాతో ఎగిరి సాగెడి పూలతో
మార్గము-తారల నింగిగ తోచును.

నింగి తాకునటు నేను నిలచిన
ప్రాణికోటి-నను గాంచు ముదమున
పెద్ద మేఘమై నింగిని మ్రింగుచు
సాగుచున్నటు చూతురు నన్ను.

గిరులు వణకగా జలధి పొంగగా
నింగి మేఘముల త్రోయుచు నేను
మహా వేగమున పయనించెదను
గరుత్మంతుడే నా సరి యగును.

సీతాదేవిని చూడలేదను
దుఃఖము వదలుడు సోదరులారా!
బుద్ధి బలముచే-నే దర్శించెద
మాతకు వందనమిడి-నే వచ్చెద.

వాయు వేగము-గరుడ వేగముల
వేయి యోజనములున్నా దాటెద
నూరు యోజన సంద్రము లెక్కా-
నా భుజబలమున సుధ తేగలుగుదు.

ఇంద్రుని చేతిలో నున్నదైనను
బ్రహ్మ దేవుని హస్తమునున్నను
అమృతమును-నే తేగలుగుదును
పునాదితో ఆ లంకను తెత్తును''

ఆంజనేయుని పలుకులు వినిరి
ఆనందముతో పొంగిరి కపులు
జాంబవంతుడు మేలు మేలు యని
శుభములు దీవనలట కురిపించుచు

''కడలిని దాటి మాతను గాంచిన
ఘన కీర్తిని నువు పొందుము హనుమా!
తాపసులందరి-వానర వృద్ధుల
అనుగ్రహము- ఆశీస్సులు నీవే.

ఏక పాదమున ఓ హనుమంతా!
నిలచి యుందుమిట-వేగమొరమ్మా
అసువులు మావి-నీ యధీనము''
అనుచు పలుకగా మారుతి పలికెను

''నిండుగ నిలచి సాగు వేగమును
భూమి-సహింపగ చాలక పోవును-
ఆ మహేంద్రగిరి అమరియున్నది
అనువుగ నుండును బయలు దేరుటకు

సకల ధాతువులు పలు వృక్షమ్ముల
కఠినమైన శిలలున్న గిరి యది
నూరామడలు నే దాటుటకు
పదముల త్రొక్కిన-కదలక నిలుచును.''

మదించినట్టి గజములు నిండిన
పక్షుల కోలాహలములు నిండిన
స్థలములందున పవననందనుడు
స్వేచ్ఛ మీరగా సంచరించెను

ఆంజనేయుని పదఘట్టనతో
సింహము చేతికి చిక్కిన కరివలె
కదలెను-మహేంద్రగిరి అచ్చటను
నీటి ధారను గ్రక్కెను శిలలు

మృగములు భీతిలె-పక్షులు ఎగిరెను
తరువులు కదలెను-ఫణులు దాగెను
సగము విప్పిన పాము పడగలతో
ధ్వజముతొ నున్నటు- ఆ గిరి తోచెను.

భయ వ్యాకులులై మునులా గిరిని
వడిగా వదలగ- ఆ పర్వతమట
భయంకరమ్మగు అడవి యందున
తోడు లేని- ఒక ఒంటరియైనది.

శత్రు హరణుడు- దృఢ నిశ్చయుడు
మహిమాన్వితుడు వానర శ్రేష్ఠుడు
రామ కార్యమున లగ్నమయ్యెను
మనసెగిరినది - లంకా నగరికి.

ఆ బలవంతుడు - శ్రీ హనుమంతుడు
అతి గుణవంతుడు ఆంజనేయుడు
బుద్ధి బలముల శ్రేష్ఠుడు వినుడు!
బ్రోచు జగతిని వందన మనిన.

శ్రీరఘురాముని రమ్యచరితము
మారుతి రాముని సందర్శనము
సీతాసతికై అన్వేషణము
కపుల సేవ కిష్కింధా కాండము.

శుభమస్తు

**లోకాస్సమస్తాస్సుఖి నోభవస్తు.**

❋❋❋

**సర్వేజనా స్సుఖినో భవస్తు**

❋❋❋

**సర్వం శ్రీసీతారామచంద్రపాదార్పణమస్తు**

శ్రీ మ ద్రా మా య ణ ము

# సుందర కాండము

(గేయ కవిత)

**మకుటం**

సుందరమైనది సుందర కాండము
అందరు పాడుడు ఆనందముగా
మృదు మధురముమరి రసవత్తరము
మారుతిసీతను గాంచిన వివరము.

శ్రీరామ

# శ్రీమద్రామాయణ సుందర కాండము

సర్గము పేజీ

శ్రీరామ జయరామ – జయ జయ రామ

✤✤✤

శ్లో.. కూజంతం రామ రామేతి
మధురం మధు రాక్షరమ్
ఆరుహ్యా కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్.

✤✤✤

శ్రీ వాల్మీకికి ముందుగ మ్రొక్కి
మందర కర్తకు వందనముంచి
రామ భక్తుల ఆశీస్సులతో
రామచంద్రుని కీర్తన జేసెద.

✤✤✤

ఏక దంతము శూర్ప కర్ణము
చలువ చూపుల చిన్నవాడా –
పార్వతమ్మకు ముద్దు కొమరుడ
విఘ్నరాజా – వందనమ్ము

శ్రీరామచంద్రాయనమః

శ్రీమద్రామాయణము

# సుందర కాండము

## 1 వ సర్గము సముద్ర లంఘనము

సుందరమైనది సుందరకాండము
అందరు పాడుడు ఆనందముగా
మృదు మధురము మరి రసవత్తరము
మారుతి సీతను గాంచిన వివరము.

శ్రీ హనుమంతుడు-కేసరి సుతుడు
పవన తనయుడు పావన చరితుడు
రామనామమను మధువును గ్రోలుచు
రామభక్తుడని రాజిలు జగతిని

సీతామాత త్రిలోక పూజిత
రామచంద్రుని హృదయ చంద్రిక
అపహరింపబడె దశకంఠునిచే
లంకకు తేబడె లలిత కుసుమలత.

మాతను వెదుకగ వాతాత్మజుని
అందరు చేరి ముందు నిలువమని
లంకకు పోయి చూచి రమ్మని
''జంకుట నీకు తగదు సుమా'' యని

ఉత్సాహముగా ప్రోత్సహించగా
ఉల్లాసముగా బయలు దేరెను
ఇష్టదైవముల ప్రార్థన చేసెను
వాయు దేవునికి వందనమిడెను

రాముని రూపము మనసున నిలపెను
రాఘవు నామ మమోఘము నిజము
జపియించుచు-పులకించిపోయెను
వశము తప్పినటు పరవశమందెను.

ఎంతో దూరము లంకాపురము
అంతా వారిధి దాటి పోవలె
కొండంతగ తను ఎదిగిపోయెను
శత యోజనముల సంద్రము దాటగ

కపివీరులట చూచుచుండగా
పర్వసమయమున పొంగిన కడలిగ
రాముని వృద్ధిని కోరుచున్నటు
గిరివలె కాయము పెంచెను మారుతి.

ఖగపతి-ఘనమగు పన్నగమ్మును
విదిల్చినట్టుగ ప్రియమగు తోకను
ఆవుతోకవలె రోమాంచితమగు
లాంగూలమ్మును విదిల్చె పావని.

అంతట పర్వతమంతా కదలెను
అందలి శిలలు పగిలెను ధ్వనితో
ధాతువులన్నీ వెలికి వచ్చెను
వెలుగులు చిమ్మెను మారుతి మేన.

గిరిపై తరువుల పూలజల్లులు
జలజల రాలి ఆ పర్వతము
పుష్పగిరివలె తోచినదపుడు
మంగళకరమై అగుపించినది.

రంగుల పూలు-మొగ్గలు-రాలి
మేఘముపోలు ఆంజనేయుడు
మిణుగురులతో మరి మెరయుచునున్న
గిరివలె తోచెను ఆ సమయమున.

ఘనమగు పడగల సర్పములన్నీ
నిప్పులు గ్రక్కుచు బుసలను కొట్టెను
విషసర్పములు కరచిన శిలలు
మంటల మండెను ఘోర విషముచే.

భూతములన్నీ భయపడిపోయెను
గుహలను వదలి పారిపోయెను
దిశలు వెలిగెను-మారుతి రూపము
జగమంతటికి దర్శన మొసగెను.

తికమక పడిరి విద్యాధరులు
తపోధనులకు తోచలేదు మరి
తప్పుకొనగ ఆ వచ్చెడి ముప్పును
జంటగ సతులతొ మింటి కెగసిరి

ఆకాశమున సిద్ధ చారణులు
అనుకొనుచున్న మాటలు వినిరి
జయ హనుమంతుడు విజయము చేయును
జానకి ఉనికి తెలియుట తథ్యము.

రాలినపూలతో సంద్రము నిండి
తారలు నిండిన ఆకస మాయెను
మేనున రంగుల పూలతొ మారుతి
మెరుపులు నిండిన మేఘ మాయెను.

అయిదు తలలుగల పాముల రీతిగ
బాహువులున్నవి మారుతి కపుడు
కన్నులు రెండు సూర్యచంద్రులన
వెలిగెను కాంతితొ నగశరీరమున

బాహువులను స్తంభింపచేసెను
పాదములను ముకుళించి వంగెను
ఊర్ధ్వముఖమున దృష్టి నిలుపుకొని
ఊపిరిగుండెలొ నింపి ఎగసెను.

''ఏదో విధముగ తలచిన కార్యము
నెరవేర్చెదను వాయుపుత్రుడ-
లేదా లంకనురావణుతోడ
పెల్లగించెద-మీ-ముందుంచెద

రామబాణమై సూటిగ పోయి
లంకలొ-మాత-కంటబడనిచొ
నాకలోకము వెదకి-కాననిచొ
లంకేశుని బంధించి తెచ్చెద.''

దేవతలందరు ముదము చెందిరి
మారుతి పలుకుల కపులు మురిసిరి
ప్రతి తరువు తను పయనము చేయగ
పవన కుమారుని తోడ ఎగసెను.

ఎగసిన తరువుల పూవుల జల్లులు
వారిధి తేలెను వారధి కట్టగ
మహేంద్రగిరి- ఆపర్వత రాజము
పదఘట్టనతో కదిలిపోయెను.

సాగరమందలి పన్నగమ్ములు
కపికుంజరుని - ఖగపతి అనుకొనె
రెక్కలు కలిగిన - ఘనశైలమన
నింగిన సాగెను - వాతాత్మజుడు

సాగెను తరువులు నగమున ఎగసి
సేనానాయకు ననుసరించునటు
సాగనంపి మరి మరలెడు హితులై
సాగరమందున రాలిపడినవి.

పది ఆమడల అడ్డము కలిగి
మూడింతలుగ నిడుపును కలిగి
ఘనమగు మేఘము అనునట్టుగను
సాగెను మారుతినీడ నీటిలో.

మారుతి సాగెడు వేగమునకు - ఆ
సంద్రము నీరు శరన్మేఘమ్మై
నింగికెగయగ - జలచరములవి
వలువలూడినటు వెలికి వచ్చెను.

వాయువేగమున సాగుమారుతి
బాహుమూలముల చేరిన గాలి
గర్జించెనట గంభీరముగా
సాగరమాయెను దొన్నె రీతిగా

మబ్బుల సాగెడి మారుతి మేన
సుర గంధర్వులు - పూలవానలు
కురిపించగను- ఋషిపుంగవులు
స్తోత్రము చేసిరి మారుతినెంతో

ఆకసమంటి మారుతి సాగగ
రవి- తన తాపము తక్కువ చేసెను
చల్లగ వీచెను వాయుదేవుడు
రామకార్యము ఫలియించుటకై.

సాగరుడంతట తలచెను మదిలో
సగరుల వలన వృద్ధినొందితిని
కావున నిక్ష్వాకుల సేవకు - నే
ముందుకు రానిచొ నింద పొందెదను.

అనువగు సమయము ఆంజనేయుని
అతిథిగ పిలిచి సత్కరించమని
అనిలాత్మజునకు విశ్రాంతిడుమని
మైనాకునితో పలికె సాగరుడు.

"పూజ్యులు మనకు యిక్ష్వాకులు-మరి
వారి సేవలో సాగు మారుతిని
ఆదర మొలుకగ పిలిచి నిలుపుము
అతిథిగ నాతని గౌరవింపుము.

రాఘవు దూత ఆంజనేయుడు
రామునిబంటు అంజని సుతుడు
గుండెలొ రాముని గురుతుగ నిలపిన
గొప్ప భక్తుడు తప్పక పిలువుము.

చేయగ తగిన సత్కార్యమ్మును
ఉపేక్ష చేసిన - ధర్మదూరమగు
సజ్జనులెంతయు ఒల్లరు దానిని
వారి క్రోధమున - కది కారణమగు

సామాన్యుండే అతిథిగ వచ్చిన
పూజనీయుడు - పండితున కిల
మహాత్ముడే - మరి - అతిథిగ దొరకిన
ఆనందానికి అవధులుండవు''.

అంతట పర్వతరాజు నిలిచెను
సాగర మందున ఎదిగిపోయెను
కాంతులీను ఆ శిఖరము వెలిగెను
శత సూర్యులు అట ఉన్న రీతిగా.

ఆంజనేయునికి ఆతిథ్యమునిడ
ఆనందముతో ఆ మైనాకుడు
ఎదురుతెన్నులు కాంచి నిలచెను
ఎత్తగు కాంచన శిఖరముతోను.

ఆంజనేయుడు శిఖరము కాంచెను
అడ్డమది యని రామకార్యమున
అనుమానించెను-రాముని తలచెను
అంతులేని బలవంతు డాయెను.

ఒక్కపోటుతో పర్వతరాజును
నెట్టివేసెను ఉరము తోడను
ఉక్కిరిబిక్కిరి అయి - మైనాకుడు
అతని బలమునకు పొంగిపోయెను.

''పవనకుమారా! పావన చరితా!
నా శిఖరముపై కాలు నిలుపుమా''
నరుని రూపమున నిలిచిపిలచెను
వానరుమంత్రితొ పొందు నెరపగా

రఘుకుల రాజు సాయముచేత
సాగరుడెంతో వృద్ధి నొందెను
ప్రతిగా నిన్ను పూజించుటకై
పాదము లొసగుము పవన కుమారా!

శతయోజనముల సాగరమన్న
అతి తేలికగా దాటిపోగల
నీదు చెలిమి -నే కోరుచుంటిని
నీదు తండ్రినే కొలుచుచుంటిని.

రెక్కలు కలిగి గిరు లెగిరెడివి
లోకములన్నీ కలత చెందెను
నాకాధీశుడు లోకుల కావగ
గిరుల రెక్కలను నరకుచుండగా.

నీదు జనకుడు జాలిగా నాపై
కృతయుగంబున కృపను జూపెను
సాగరమందున వేగమె జేర్చెను
ఆగెను రెక్కలు - సాగెను రోజులు''

''అంతా వింటిని సంతసించితిని
నీదు అతిథిగా సేవలనందగ
లేదు వ్యవధి - నా రామకార్యమున''
చల్లగ నగమును తాకి పలికెను.

మారుతి సేవకు నిలచిన నగమును
మైనాకుని గని - సురపతి ఎంతో
ఆనందించెను - అభయమునిచ్చెను
భయమదిలేక మనుమని చెప్పెను.

మైనాకుడును, సాగరుండును
పూజ్యభావమున - హనుమను గాంచిరి
కార్యము సఫలము - అగునట్టుగను
శుభాకాంక్షలూ - దీవనలిడిరి

రవిచంద్రులు పాలించెడి జగము
వనజభవుడు నిర్మించిన మర్మము
కన్నుల గాంచుచు మారుతి సాగెను
ఆకసమును తా మ్రింగునట్టుగా.

దేవతలందరు జయముకోరగా
రామకార్యమున రాక్షసు గెలువగ
ఆంజనేయుని బలమెంతో యని
కొంత తెలుసుకొన చింత కలిగిరి.

నాగమాతను సురసను కోరిరి
రామభక్తుని శక్తి చూడగ
ఆమె జన్మము ధన్యత గాంచగ
అందుకు సరియని ఆమోదించెను.

అక్కడ నిలచి - ఆంజనేయుని
అందుకొనుటకై - అంత నోరును
ఒక్కసారిగా తెరచి నిలచెను.
రక్కసి రూపును గ్రక్కున దాల్చెను.

కోరలు మెరసెను బుసలను కొట్టెను
కొండంతగ తను ఎదిగి నిలచెను
ఆకలి తీరుట కిది సరి యగునని
ఆంజనేయుని - నోట బడమనె.

''సురసా! నీకిది సరి గాదు సుమా!
సగము దారిలో ఆపబోకుమా
రాముని సేవకు అంకితమైతిని
రామ కార్యమున సాగుచుంటిని.

జానకి ఉనికి ప్రభువుకు తెలిపి
నిజముగ నేను తిరిగి వత్తును
రామబంటును నమ్ముము నన్ను
రామకార్యమున సాగగనిమ్ము''.

ఒప్పక సురస నోటిని తెరచె
అనిలాత్మజుడు ఎంతో ఎదిగెను
అంతకు మించి సురస ఎదిగెను
శత యోజనములు నిండిపోయిరి.

ఎవరు గెలుతురో ఏమగునోయని
సురలెల్లరును చూచుచుండిరి
బుద్ధిబలముచే మారుతి గెలిచెను
అంగుష్ఠమంతై జయము గాంచెను.

తెరచిన నోటితొ సురస చూడగా
ఆమె నోటపడి వచ్చి నిలువగా
నిజరూపమున సురస నిలచెను
వాతాత్మజునకు శుభము పలికెను.

సురలెల్లరును సంతోషించిరి
''సాగుము నీకు జయము కలుగును.
రామకార్యమును నెరవేర్చెదవని''
శుభము పలికిరి దీవనలిడిరి.

విడువనిధైర్యము-ముందుచూపుయు
నిశితబుద్ధి-మరి-ఘన సామర్థ్యము
అనునవి -నాలుగు - కలిగినవారు
విజయము నందుట తథ్యము అనిరి.

వేగమె లంకకు చేరగ తలచి
వేగము పెంచి సాగగ మారుతి
అంతట వేగము సన్నగిల్లగా!
యోచన చేసెను ఆగ్రహించెను.

ఛాయాగ్రాహి సింహిక ఉనికిని
సుగ్రీవుడు-తా-ముందే తెలిపెను
అందుకు సిద్ధముగాను బెదరక
పోరగ నిలచెను ఆంజనేయుడు

పెద్దగ నోటిని తెరచె సింహిక
పవన తనయుతో కడుపు నింపుకొన
సూక్ష్మరూపమును మారుతి దాలిచి
దాని నోటబడె -దాని మాట బడ

ప్రేగులు తెంపిగుండెను చీల్చి
ప్రాణాంతకమై బయటకు రాగా
బ్రతకలేక అది బండరీతిగా
నీటబడగనే ప్రాణము లూడెను.

గగనమునున్న భూతములన్నియు
మారుతినెంతో పొగడిరి ఘనముగ
''సాహసవంతుడు ధైర్యవంతుడు
కార్యసిద్ధికి మారు పేరు'' యని.

సంద్రము దాటెను సాహసవంతుడు
లంక చేరెను పవన తనయుడు
గిరిశిఖరము నట గాంచిన యంత
పాదముమోపెను ముందుకు సాగగ.

అమరావతితో సమమగు లంక
సొగసులు చూచెను మారుతి అంత
నారికేళముల కదళీ తరువుల
కన్నుల పండుగ చేసె శిఖరము

ఎదిగిన వటుడు-బలిని త్రొక్కి మరి
తిరిగి వామనుని-రూపునందిన
హరివలె తోచెను- అట -హనుమంతుడు
కాయము చిన్నది చేసి నిలచెను.

కోర్కెను వీడిన జీవుడు- తాను
ప్రకృతి వశమై నట్టి తీరుగా
కురుచరూపుతో కపికుంజరుడు
కార్యసాధనకు యోచన చేసెను.

రాముని తలచి కార్య శూరుడు
విశ్వకర్మచే నిర్మితమైన
త్రికూటగిరిపై నున్న లంకలో
ముందుకు సాగెనుమాతను వెదుకగ.

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

## 2 లంకావలోకనము

''వేల యోజనము లన్న లీలగా
దాటగలను- నా రాముని తలచుకు
నూరు యోజనములున్న వారిధిని
దాటుట ఎంతని'' తలచెను మారుతి.

చిక్కని పచ్చిక నిండిన నేలలు
నగములు కలిగిన వనములు దాటి
త్రికూట గిరిపై నున్న లంకను
తీరుగ చూచెను ఆంజనేయుడు.

లంకాపురమది సొంపగు నగరము
ఏలిక దానికి రావణాసురుడు
రక్షణ పెంచుకు నున్నటులున్నది
జనకజ నచటకు తెచ్చిన భీతిచె

పూలవానలు తరువుల కురిసెను
మారుతి మేను పూలతొ నిండెను
గిరిశిఖరములు తరువులు నిండి
సుమసౌరభములు నింపె నగమున.

ఖర్జూరములు-కరవీరములు
కర్ణికారములు గిరిమల్లికలు
నాగ కేసర నారికేళములు
కోవిదారములు పారిజాతములు.

లతా కుంజములు ఉద్యానములు
దిగుడు బావులు సొగసు అగడ్తలు
హంసలు కారండవములు నిండి
చక్రవాక మయూరము లుండెను.

పుష్పతరువులు ఫలవృక్షములు
ఫలించి నిలచెను రమణీయముగా
కలువలు నిండిన కొలనులు ఉండి
సుందరవనములు ఎన్నో కలవు.

బంగారముచే సింగారించిన
ప్రాకారములు తీర్చిన గృహములు
తిన్నని వీథులు- ఎన్నిక మేడలు
ఏడంతస్తులు ఎదిగి నిలచెను.

కనక తోరణము లందము లొలకగ
శుభకరమయిన భవనములుండి
ఉన్నతమై - కైలాస గిరివలె
అమరావతిలా ఉన్నది లంక.

విశ్వకర్మచే నిర్మితమైనది
ఆకాశమున ఉన్నటులున్నది
రావణు రక్షణ నున్న లంక యది
స్త్రీ రూపమున రూపుదిద్దినది.

సుందరి కటి- ఆ కోటగోడయై
అందగడ్తలో నీరు చీరయై
కోటబురుజులవి చెవులకు సొమ్ములు
కేశ సంపదయె శతఘ్ని శూలములు.

''సాగరమున్నది రక్షణ చేయుచు
రావణుడెంతో బలమగు శత్రువు
సురలకు గెలువగ సాధ్యము కానిది
ఏ విధి రాముడు లంక గెలుచుట?''

మారుతి మదిలో చింత కలిగెను
''సీతను చూచి- తదుపరి కార్యము
యోచన చేయుట యుక్తము నాకు
సీతను వెదకెద చీకటి పడగ''

రాత్రించరులు రాక్షసవీరులు
ఘాతకాలకు లెక్కచేయరు
మాయలు నేర్చిన కామ రూపులు
ఆయుధములతో తిరుగుచుండిరి.

సొంపగు లంక సొగసుల వంక
చూచుచు సాగెను పిల్లిపిల్లలా
వరుసలొ నిలచి సౌధములున్నవి
స్ఫటిక మణులతో స్వర్ణపు పనులతొ.

సామోపాయము కడు అపాయము
దానము కోరగ లేమి లేదుగా
భేదము పారగ తావది లేదు
దండోపాయము తేలిక కాదు.

క్షీరము శంఖము తామరతూండ్లతొ
సరిపడు తెల్లని కాంతులు నిండి
సరోవరము నుదయించు హంసలా
భాసిలు చంద్రుని చూచె మారుతి.
॥సుందరమైనది సుందరకాండము॥

# 3 లంకా రాక్షసి పరాజయము

రావణు రక్షిత పురమది లంక
భోగవతికి సరిపోయెను శోభల
చీకటివేళల వాతాత్మజుడు
కలయచూచెను సవ్వడి చేయక.

లంకారాక్షసి లంకకు కావలి
రంకె వేసెను రక్కసి - అరచెను
నగర ద్వారము చేరిన మారుతి
దానవి అరపుల ఆగి చూచెను.

మంచి ముత్యములు వజ్రములెన్నో
స్ఫటికపు బంగరు నేలలుండెను
ద్వారబంధములు వజ్రమయములు
వైడూర్యములతొ వెలిగె నరుగులు

''కోతివి నీవు కోరిక ఏమిటి?
నగరము నందు నీ వెందులకు?
కొండల కోనల నుండు వనచరుడ
నిజము పలుకు- నీ ప్రాణము నిలుచును''

క్రౌంచపక్షులు -నెమళుల గుంపులు
రాజహంసల సొగసులు నిండగ
మలయమారుతము మెల్లగ వీచుచు
చిరుగంటల మ్రోయించె పతాకల.

''లంకాపురమట సొంపగు నగరము
అందము లొలికే నందనవనముల
కన్నుల విందుగ చూడవచ్చితిని
తిరిగి చూచి - నే తిరిగి పోదులే.

అంతకు మించిన కోరిక లేదు
వ్యర్థముగ నువ్వాగ్రహించకు''
అని నెమ్మదిగా పలికె మారుతి
అంతట దానవి రెచ్చిపోయెను.

''కోతికి ఎంతటి తెగువ కలిగెను!
నాతో పలుకగ భయము లేదుగా''
ఆంజనేయుని హేళన చేసి
గట్టిగ అరచి-చేత చరచెను

పవనకుమారుడు ఎదిగిపోయెను
సింహగర్జన చేసి నిలచెను
వామహస్తమున బిగిసిన పిడికిట
ఒక్కపోటుతో రక్కసి రాలెను.

పర్వతమంతటి రక్కసి కూలెను
గ్రుడ్లు తెరచుకొని నాలిక చాచి
గుండె గొంతులో గంతులేసెను
ఆడది కనుక చంపక విడచెను.

లంక పలికెను నమ్రత నిండగ
''నేనోడుట యన లంక కూలుటే
ఆ విధాత- ఆ విధముగ వరమిడె
నందికేశ్వరుల శాపము గలదు.

లంకాపతి గతి మారిపోయినది
లంకకు చేటది చేరువైనది
సీతాదేవి ఉసురు తగిలినది
రాతలు మార్చగ ఎవరి తరమగు?

నీకు జయమగు నిజమిది నమ్ముము
శోకమూర్తియై సీత యున్నది
ఆమెను చూచి ఊరడించుమని''
పాదములంటెను ప్రోత్సహించెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

# 4 లంకా సంచారము

కోట గోడది ప్రాకెను మారుతి
చెంగున దూకెను సవ్వడి చేయక
ఎడమపాదమును ముందుగ వేసెను
శత్రువు తలపై మోపిన రీతిగ

ధవళకాంతుల తళతళ లాడెడి
పెద్ద మేడలవి మబ్బుల కెదిగెను
సుందరాంగుల అందెల సవ్వడి
నడకల వొలికెను సందడి ఎంతో.

రాజవీథుల సోయగాలవి
మంచిముత్యముల తోరణాలవి
సొంపగు లంక సొగసుల వంక
వెన్నెల వెలుగుల చూచె మారుతి

స్వర్ణమయములు సౌధములన్నీ
ధగధగ మెరయుచు గృహములున్నవి
గానశోభలతొ మంగళ కరములు
మగువల మధుర మంద్ర స్వరములు.

సామగానములు శ్రవణానందము
నిత్య పఠనములు వేదములన్నీ
రావణబ్రహ్మ స్తోత్ర పాఠములు
గర్జించినటు చదువుచుండిరి.

మణిహారములు దాల్చినవారలు
మేలగు చందన మలదిన వారలు
వివిధ వేషముల వెలుగు దానవుల
తీరుగ చూచెను లంకలొ మారుతి.

జడలు పెరిగిన తాపసోత్తములు
యజ్ఞదీక్షలో రాక్షసులుండిరి
అగ్నికుండములు-మంత్ర తంత్రములు
ముండితులుండిరి పండితులెందరొ.

రాక్షసతేని గృహమును చూచెను
అచ్చెరువందెను మారుతి అంత
గిరిశిఖరముపై నిలచి యున్నది
బంగరు తోరణ శోభలు నిండి.

రాక్షసులందరు రకరకములుగ
కొందరు పొట్టి - తగు పొడగరులు
ఏక కర్ణులు ఏకాక్షులుగ
లంబోదరులు కామరూపులు.

చుట్టిన ప్రాకారమ్ము చుట్టున
అగడ్త యున్నది రక్షణ చేయుచు
తెల్లని కలువలు తామరలుండి
కన్నుల పండుగ చేయుచున్నవి.

కవచధారులు వికృతరూపులు
కూటముద్గరము లాయుధములతో
ధనుసులు ఖడ్గము లందినవారు
ధ్వజ పతాకలు కలిగినవారు.

స్వర్గతుల్యమై మందిరమున్నది
దివ్యనాద సంభరితమైనది
బంగరు ఆభరణమ్ముల సందడి
మందిర విభవము చాటుచున్నది.

విమానమ్ములు రథములు వుండి
మేలగు గజములు హయములు కలిగి
నాల్గు దంతముల దంతులు నిండి
సకల సేనల రక్షణ నున్నది.

॥సుందరమైనది సుందరకాండము॥

## 5 చంద్రోదయము

వాడి శృంగముల వృషభమువోలె
వెండి పంజరము నున్న హంసలా
మందర నగమున మృగరాజువలె
మత్తేభముపై నున్న యోధుడన.

రణరంగమున గజరాజువలె
రాజ్యమునందిన భూపాలునివలె
షోడశ కళలలతొ వెలిగె చంద్రుడు
కళానిలయమై కాంతుల కాంతకు.

చల్లని జల్లులు - చందమామట
చల్లెను- మన్మధ వశులై రచట
స్వర్గము పోలిన శోభలు నిండెను
వెన్నెల వెలుగుల లంకాపురము

మధువు గ్రోలి అట మేనులుమరచి
మత్తుగ నిద్రలో మునిగినవారు
కామరూపులు కోరిక నెలవులు
అందము లొలికెడి మందయానలు.

యుద్ధము కోరెడి వీరులు కలిగి
ఘీంకారము లిడు మదగజములతో
నిండిన రావణు భవన ప్రాంతము
బుసల సర్పముల మడుగనిపించెను.

మన్మధ వశులై మగువలుండిరి
వలువలు చెదిరిన కొందరు వనితలు
ప్రియుని తలపుతో తీయని కలలతో
కిలకిలలాడుచు కోమలులుండిరి.

నిదుర లేని ఆ సొగసుకత్తెలు
మధువు త్రాగిన మందయానలు
సుందరాంగుని గురి చేయగను
కుసుమ బాణుని కోరి పిలిచిరి.

సీతను వెదకుచు ఆంజనేయుడు
ఎందరొ సుందర వదనల చూచెను
వివిధ భూషణములున్న అతివలు
మెరపుల తీరుగ నుండగ చూచెను.

వాతాత్మజు డా సుందరులందు
సౌందర్యాంబుధి సీతామాతను
ఉన్నత కులమున పుట్టిన అతివను
వెదకెను కన్నులు ఎన్నో చేసుకు.

రాముని చూడగ ఆత్రమునున్న
పాతివ్రత్యమున బ్రతుకుచునున్న
పుణ్య చరిత యగు సీతాదేవిని
ఎందు వెదకినా కానకపోయెను.

కాంతులు తరిగిన చంద్రరేఖను
శోకమునిండిన గద్గద కంఠిని
కాంతుని కొరకై కుములు కాంతను
వెదకి- కానక- చింతిలె మారుతి

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

## 6 సీతాన్వేషణము

సింహములెన్నో రక్షణ చేసెడి
మహావనము అనిపించునట్టుగా
ఘోర రాక్షసుల కావలి యుండిన
రావణు భవనము తోచెనచ్చట.

రావణు భవనము రమ్యమైనది
రత్న శోభితము స్వర్ణమయమది
భేరీనాద మృదంగ ధ్వనులు మరి
శంఖ ఘోషల శోభతొ నిండెను.

మణులమరిన ఆ సింహద్వారము
వెలుగులు చిమ్మెడి హారమాయెను
మంద యానలతొ మధుర గానముల
హేమ మందిరము అతి సుందరము.

శైవ పూజలు నైవేద్యములు
గరళకంఠుని భక్తులందరు
పూజలు భజనలు హోమమ్ములతో
లంకేశ్వరుని మందిరమున్నది.

లంకకు ఆభరణమ్మయి భవనము
తోచగ మారుతి తలచెను మదిలో
''కాయము చిన్నది చేసి వెదకుట
యుక్తము- వెదకెద భవనములన్నీ''.

సుగంధ పరిమళ శోభలు నిండి
శోభించిన వట జలకములన్నీ
చందన-పునుగు కస్తూరి మొదలగు
సుగంధ ద్రవ్యములెన్నో కలవు.

మంత్రి ప్రహస్తుని మందిరమందు
మహాపార్శ్వ, మహోదరాదుల
విద్యున్మాలి, విద్యుజ్జిహ్వల
వజ్రదంష్ట్ర శుక సారణ గృహముల.

ఘీంకరించుచు ఏనుగులుండి
అజేయులయిన రక్షకభటుల
వివిధ ఆయుధము లందిన స్త్రీల
రక్షణనున్న భవనము గాంచెను.

రావణు తనయుడు మేఘనాథుని
రశ్మికేతుని సూర్యకేతుని
వజ్రకాయుని బ్రహ్మకర్ణుని
కుంభకర్ణుని నెలవులు వెదకెను.

చిత్రశాలలు పూపొదరిండ్లు
క్రీడా గృహములు లీలాగృహములు
చూచుచు సాగిన మారుతి కన్నుల
కనబడె నచటొక దివ్య మందిరము.

శోణితాక్ష పిశాచ కరాళుల
విరూపాక్షుని భవనములన్నీ
సంపద నిలయములగు నిలయముల
మారుతి వెదకెను సీతను కాంచగ.

రత్నకాంతులు రావణు తేజము
నిండిన భవనము భానుడాయెను
కుబేర భవనము పోలియున్నది
దివ్య ధూపముల నిండియున్నది.

కాంతానూపుర కాంచీరవములు
కర్ణపేయమగు మృదంగనాదము
సుందరాంగుల అందెల సందడి
నిండిన భవనము లెన్నో చూచెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

## 7 పుష్పకావ లోకనము

వైడూర్యములతొ బంగారముతో
నిండిన రావణు మందిర మచట
మెరపులు నిండిన మేఘము రీతి
కాంతుల వెలుగగ చూచె మారుతి.

వాసయోగ్యమై చక్కగ అమరి
ఆయుధములను శంఖములుంచెడి
అతి సుందరమగు చంద్రశాలలు
ఎన్నో చూచెను సీతను వెదకుచు.

పుష్పకమున్నది దివ్య విమానము
రత్నకాంతులతొ వెలుగుచుండెను
చిత్రములయిన చిత్తరువులతో
వైడూర్యములు పగడపు పనులతొ.

మేఘము పోలిన రూపము కలిగి
దనుజనాథ బల ప్రకటితమగుచు
ధరణికి దిగిన నాకమువోలె
ఉన్నది అచట దివ్య విమానము.

మెరుపులు నిండిన మేఘమన్నటు
చంచలాంగులతొ సొంపుగనున్నది
కాంతులీనుచు గృహములున్నవి
వివిధ ధాతువులు నిండిన నగమై.

అందొక మందిరమున్నది రాజుది
కాంచన చారు మనోహరమైనది
లంకకు దిగిన నాకముపోలిక
ఉన్నది సుమములు సుందర స్త్రీలతొ.

వైడూర్యములతొ విహగములుండి
వెండి బంగరు పనులతొ వెలుగుచు
వివిధ రత్నముల సర్పములుండి
జీవకళలతో తురగములుండెను.

కొలనుల సుందర గజములు కలిగి
లక్ష్మీదేవి కరములయందు
కలువలు కలిగిన రీతిగ వేసిన
చిత్రములెన్నో మారుతి గాంచెను.

సుందర మందిరమందు వెదకెను
సీతను గానక చింతిలె మారుతి
రాముని తలపుతొ నుండెడి మాతను
కానక దుఃఖమునిండె మారుతి.

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

## 8 పుష్పక వర్ణన

భవన మధ్యమున నున్న విమానము
మణులు వజ్రములు పొదిగియున్నది
స్వర్ణమయమది ఊహలకందక
శోభల వెలుగగ చూచె మారుతి

మనసగు రీతిని పొగలిగినది
ఆ శోభకు మధుమాసమె తగదు
శరత్కాలపు చంద్రబింబమై
గిరి శిఖరము అది అనుటులునుది

విశ్వకర్మ తన చతురతనంతా
ఒలకపోసి నిర్మించెను దానిని
ఆకాశములో పుట్టినట్టుగా
వాయుమార్గమున నిలబడి యున్నది.

అతివిలువయిన రత్నములుండి
అతిశ్రమ నిండిన పనితన మొలుకుచు
దేవలోకమున లేనటువంటి
అద్భుతమైన విమానము గాంచెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❇❇❇

## 9 రావణాంతఃపుర శోధన

అర్థ యోజనము విస్తరించినది
ఏక యోజనము పొడవు కలిగినది
పంక్తి కంధరుని కాంతుల నిలయము
కాంతివంతుడు మారుతి చూచెను.

మూడునాల్గు దంతాలు కలిగిన
ఐరావతమును పోలిన దంతులు
అస్త్రశస్త్రముల యోధులు కలరు
రక్షణ చేయుచు మందిర మందు.

అలకాపతికి నలువ యిచ్చినది
విశ్వకర్మ- ఆ బ్రహ్మకిచ్చినది
రావణ బ్రహ్మ కుబేరుని గెలచి
లంకకు తెచ్చిన పుష్పక మదియే

దనుజనాథుని మందిరమున్నది
ఇంద్రనీలమణు లమరి యున్నది
స్వర్ణ మయమది శోభలీనునది
కమ్మని తావుల కది నెలవైనది.

ఆత్మబలము గల వీరుడు అతడు
రావణ బ్రహ్మ అతి పరాక్రముడు
అతని మందిరము ఉన్న తీరది
అతని బలమును తెలుపుచున్నది.

తిమింగలమ్ములు-మకరులు నిండి
మహామీనముల-నుదరమునుంచుకు
పెను సర్పములతో-నిండిన కడలిగ
తోచుచున్నదా దివ్య భవనము

మణిస్తంభములు ఆణిముత్యములు
స్ఫటికపు పగడపు స్వర్ణపు పనులు
పానభక్ష్యముల పరిమళములతో
నిండిన మందిర విభవము చూచెను.

ఉల్లాసము మది కలిగించునది
మేనుకు వన్నెలు పూయునట్టిది
దుఃఖము దూరము చేయు మందిరము
లక్ష్మికి నిలయము అనిపించినది

దేవతలుండు స్వర్గలోకమో!
బ్రహ్మదేవుని సత్యలోకమో!
లేనిచొ తప్పక అమరావతి యగు
అన్నటులున్నది మందిర మచట.

విలువగు ఆభరణమ్ముల వెలుగులు
కాంచన దీపపు స్తంభపు కాంతులు
రావణు తేజము కలసి యుండగా
నిప్పుల మండెడి తేజమునుండెను.

ఎన్నో ఉన్నవి తియ్యని రసములు
కల్లు మొదలగు వివిధ మధువులు
కాంతులీను బంగారుపాత్రల
కాంచెను మారుతి-సీతను వెదకుచు

ఆటల పాటల ఆనందముతో
ఆలింగనముల అనుభూతులతో
అంగన లందరు చురుకు కోరికలు
తలచుకు- మదనుని వశులై రచట.

బంధువు, మరియొక బంధువునెంతో
అప్యాయముగా - పిలిచినట్టుగా
మధువాసనలు- రావణుడితడే
అనుచు- చూపగా- ఎగసెనొక్కపరి

సుందరాంగులు అందములన్నీ
ఒలకపోసుకుని వేచి యుండిరి
సాటి కాంతనే సుందరాంగుడని
బాహుబంధముల నందగించిరి.

అలసిన యువతులు నిద్రలో మునిగిరి
సవ్వడిలేక మందిర మున్నది
హంసలు భ్రమరములున్న ఘనమగు
పద్మవనమయె పద్మముఖులతో

కోరిక లున్నవివేచి యున్నవి
మగువల సొగసులు రగిలించినవి
మగడే ముందర ఉన్నటు తోచగ
కమ్మని ఊహల కరిగిపోయిరి.

శేషించిన తమ పుణ్యము నంతా
అనుభవించగా నేలకు రాలిన,
తారలు- మగువల రూపుల నందెనొ
అనిపించిరి ఆ రమణీమణులు

కోకలు జరిగి కోమలు లుండిరి
చెదరిన కురులతొ చెలియ లుండిరి
లీలాకేళిలొ కాంతలు అలసి
లతలవోలె అటపడకల నుండిరి.

మధువు త్రాగిన మగువలు- సొగసుగ
మూసిన కన్నులు కమలము లనుకొని
భ్రమరము లెంతో ప్రీతిగ చేరెను
వన్నెల నెలవు - కులీనలాసతులు

పూలమాలల వన్నెలు తరిగెను
రాలిపడినవి హారము లెన్నో
చిందర వందర అయినవి సొగసులు
దంతిమెదలిన పూల వనమయె.

ఆ సతులందు రసిక శేఖరుడు
పొందు సుఖములు అందు భోగములు
చుక్క కన్నియల వెలిగెడి చంద్రుని
చందము నుండెను అసురభూపతి

మత్తుగ నిద్రిడు కాంతల సొమ్ములు
ఆభరణమ్ములు మణిహారములు
చెదరిపోయి - అవి కలిసిపోయినవి
ఎవరివి ఏవో తెలియనట్టుగా.

కాంతల ఉరమున మెరయుచునున్న
చంద్రకాంతిలా వెలుగులు చిమ్మే
మంచి ముత్యపు హారములవ్వి
హంసల తీరుగ భాసిల్లినవి

మగసిరి గలిగిన దానవరాజు
మగువలందరిని ఏలును సమముగ
మలయానిలముల సుమ సుందరులతొ
మందిర మెంతో సుందర నిలయము.

యక్షరాజ గంధర్వ్వుల - నాగుల
కన్నియలందరు సొగసుల నెలవులు
దనుజనాథుని కోరి వలచిరి
మధువాసనలు ఎగసిన వచట

దనుజనాథుని సిరులకు మురిసెను
అతని భార్యల సుఖములు తలచి-
సీతను రాముని చెంత చేర్చిన
పంక్తి కంధరుడు బుద్ధిశాలియగు.

పంక్తి కంధరుని బలపరాక్రమము
ధనపతి సముడగు అతని సంపదలు
సొగసు లొలికెడి సుందరాంగులను
ఉన్నత కులీన లెందరొ జేర్చెను.

"ఉత్తమురాలు సీతామాత -
రావణుడెంతో దుర్మార్గముతో
దుఃఖము నింపెను జానకిదేవికి
పాపాత్ముడుగా! పంక్తి కంధరుడు."

పావని సీతను అసురుడు మరచిన
లంకాపురము మనగలదనుకొని
వాయునందనుడు సీతను వెదకి
ఉనికి తెలియక వగచెను ఎంతో!

||సుందరమైనది సుందరకాండము||

❊❊❊

## 10 మండోదరిని చూచి మాతయని భ్రమించుట

రత్నభూషితము స్ఫటిక నిర్మితము
దివ్య శయనమది రావణు శయనము
దంత కనక శిల్పంబుల నిండి
వైడూర్యములతొ మణి ఖచితమది.

స్వర్ణమయమది అతి మృదువైనది
రవి కాంతులతో వెలుగుచున్నది
చల్లని చంద్రుని పోలు ఛత్రము
పూల మాలలతొ కూర్చియున్నది.

రత్నకాంతితో మణిశోభలతో
శోభించినది రావణు శయనము
సుగంధ పరిమళ సుమములు నిండి
స్వర్గ సమముగా నున్నది శయ్య.

కొలనున-వెలిగెడి కరిరాజు వలె
పద్మనేత్రులను దరిజేర్చుకొని
పవళించెను ఆ ప్రతిభావంతుడు
పరాక్రమమున విక్రముడతడు.

చక్రాయుధము చేసిన గురుతులు
వజ్రాయుధము వేసిన ముద్రలు
విజయచిహ్నములు, వెలుగుచుండెను
దేవదానవుల పోరు తెలుపుచు.

దేవ దానవుల హడలెత్తించిన
మహా బాహువుల గాంచెను మారుతి
మందరగిరిలో పెనుసర్పములవి
అన్నటు లున్నవి బలము తెలుపుచు

మినుములు రాసిగ పోసిన రీతిగ
నల్లని దేహము తేజోవంతము-
రక్త చందనము మేన నలదుకొని
మధువు త్రాగి మత్తిల్లిన వాడు.

కాంతల చేరి వసంతుని రీతి
లీలాకేళిలొ కలసి సొలసెను
విశాలవక్షుడు లక్షణాంగుడు
లోహితాక్షుడు రావణాసురుడు.

కనక హారములు వజ్ర భూషలు
మణి కుండలములు స్వర్ణకిరీటము
పట్టు వస్త్రములు మేన ధరించిన
మృష్ట భోజనుడు పంక్తి కంధరుడు.

దశ కంఠుడు తన సుందరాగులతొ
శయనించెను అట నల్లత్రాచు వలె
నిశ్వాసములతొ బుసలను గొట్టెను
మత్తేభములా తోచెను తేడు.

కామరూపుడు భుజ బలతేజుడు
కాంతల పాలి వసంతుడాతడు
ఆలింగనముల ఆ సుందరుని
అంగాంగముల సుగంధము లెగసెను.

అయిదు తలలు గల పన్నగమ్ములన
అంతగ పెరిగెను అతని బాహువులు
నల్లని మేఘము అతని దేహము
చందమామలా సుందరాంగులు.

ఆటల పాటల ఆనందముతో
అలసి పోయిరి అంగన లందరు
అందు-వీణనే అందగాడని
ముద్దులిడినదొక బింబాధరి అట.

తన వంపులనే చూసుకు మురిసి
తీయని ఊహల ఊగిపోవుచు
కిలకిల నవ్వులు చిలకరించుకొని
కలయని తెలుసుకు తెల్లపోయెను.

ప్రియుని పొందును పొందగ సుందరి
పణవము చేకొని హాయి పొందెను
మృదంగము నట ముద్దిడి మగువ
మగడే అనుకొని మురిసిపోయెను.

అందొక శయ్యలో అందములొలికే
సుందరి ఉన్నది నిదురపోవుచు
కనక కాంతులతొ కాంతులకాంత
కనుపించెనట కను విందుగను.

మణి భూషణములు నవరత్నములు
అమరినవెన్నో ఆభరణమ్ములు
మండోదరి ఆ సుందరవదన
దానవరాజుకు ప్రియతమభార్య.

ఆమెను గాంచిన ఆంజనేయుడు
ఆనందముతో చిందులు వేసెను
జనకజ అనుకొని సంతోషముతో
ఎంతో చిలిపిగ గంతులేసెను.

స్తంభములెక్కెను క్రిందికి దూకెను
పట్టికొట్టెను పరవశమందెను
తోకను ముద్దిడి మురిసిపోయెను
వానర చేష్టలుమారుతి చేసెను.

॥సుందరమైనది సుందరకాండము॥

✣✣✣

# 11 అంతఃపుర శోధన

తీరుగ మారుతి యోచన చేసెను
''రాఘవురాణి యీ తీరుండదు
రావణుచేరి బ్రతికే యుండదు
అన్నపానముల వంక చూడదు.

మారుతి ఎంతో చింతిలె మదిలో
బుద్ధిమంతుడు యోచన చేసెను
''పావని జానకి పడతుల కలసి
అంతఃపురమున నుండుననుకొని.

రామచంద్రుని జీవితేశ్వరి
పరమసాధ్వియగు సీతామాత
ఇంద్రభోగముల లెక్కచేయదు
చాలరు సురలు విభునికెందున''

సద్దుమణిగిన సమయములోన
అంతఃపురముల వెదకుట మేలని
స్వామి సేవలో చూచితి గాని
మనసున ఎట్టి వికారము నెరుగను.''

శ్యామల కాంతితొ కొందరు కాంతలు
తెల్లని నల్లని కాంతులవారు
మన్మథవశులై పడియుండగను
మారుతి గాంచెను అట విమానమున.

అనుకొని హనుమ ఊరట చెంది
మాతను ఎచట చూతును నేను
ఏ తీరుగ నా మాట నిలచుట
నే వెదకుట ఎట అని చింతించెను!

''లీలాకేళిలొ సోలిన కాంతల
జరిగిన వలువల పడతులెందరినొ
అంతఃపురమున చూచితి నేను
ఒడిగట్టితిని పాపము నెంతో.''

ఎన్నో తీరుల అతివలుండిరి
అలసి సొలసి వారందరుండిరి
ఆలమందలో వృషభ రాజువలె
పంక్తికంధరుడు ఉండె నడుమలో.

సాగెడు మారుతి కాంచెను అచ్చట
పాన భక్ష్య పదార్థములున్న
సుందర శాల బంగరు పాత్రల
ఎన్నో రకముల వంటకాలతో.

గంధవాహుడగు మారుతి జనకుడు
తనయుని గాంచి సంబరపడుచు
కౌగిలించుకొన వచ్చినట్లుగా
అచటి పరిమళము లెగసెనప్పుడు.

దున్నలు జింకలు సూకరములట
మయూర చకోరము రుచులుగ వండి
కొక్కెర మాంసము కోడి మాంసము
ఉన్నవి తినగా మిగిలినవెన్నో.

మధుర రసములు మదిర రకములు
పరిమళ శోభతొ పానీయములు
బంగరు స్ఫటికపు పాత్రల యందు
తాగగ మిగిలియుండెను అచట.

పాన భూమిని వదిలి మారుతి
తిరిగి వెదకెను వెదకిన తావుల
ఆశను పెంచుకు ఆంజనేయుడు
అంతట వెదకెను జనకజ కొరకు
॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

## 12 మారుతి ఆవేదన

''మేడలు మిద్దెలు వాడలు వీధులు
అంతఃపురములు ఆరామములు
పూపొదరిళ్లు మరి కోనేళ్లు
నిశాగృహములు-నే వెదకితిని.

దుఃఖము-మదిలో చేరకపోవుట
సర్వసంపదలు-సమకూర్చుటయే
దుఃఖము దూరము అగుట వల్లను
సకల కార్యములు-సులువుగ జరుగును.

బావులు దోవలు రాజవీధులు
తోటలు తోపులు శయ్యాగృహములు
ప్రతి సందున నే పరిశీలించితి
జనక రాజ సుత నే కననైతి.

కార్యము సఫలము చేయక నేను
తిరిగి వానరుల చేరుట ఎట్లు
రాజు సుగ్రీవుడు- అతిబలశాలి
కోప తాపముల దండన లిడును.

''అసలా మాత బ్రతికి యున్నదా?
అసురుడామెను అంతము చేసెన?''
వెదకిన తావుల వెదకుచు వగచెను
మదిలో ఎన్నో శంకలు మెదలెను
॥సుందరమైనది సుందరకాండము॥

# 13 మారుతి పరితాపము

''పులుగుఱేడు సంపాతి పలికిన
పలుకులు విని నే వెదకుచుంటిని
దానవరాజు - రావణులంకలో
జానకి కలదని పక్షి పలికెను.

దనుజనాథునీ భవనములన్నీ
దానవు నగరము నాల్గుమూలలా
నే వెదకితిని నూరు కళ్లతో
మిగులలేదు నే వెదకని తావు.

పాపాత్ముడు యీ పంక్తి కంథరుని
త్రుంచి వేతునా- రాముని తలచుకు
లేదా రాముని చెంతకు వానిని
మోసుకుపోదున ఆకసమంటి

రామబాణముల గురి కెరగాక
వేగమె సీతను లంకకు చేర్చగ
ఆకసమంటి అసురుడు గొని రా
జానకి సాగరమందు జారెనో?

ఆకాశములో సిద్ధుల కంటను
పడినందుకు తా సిగ్గుతో మాత
మరణించినదో? లేదా మానిని
అసురులచేబడి మ్రింగబడినదో!

శోక భారమును భరించలేక
కృశించిపోయిన ఆ కుసుమలత
ఆశను వీడి ఆత్మహత్యతో
అంతమొందెనో కాంతునికెడమై.

చిలుక-పంజరము చిక్కినరీతి
జానకి లంకలో చిక్కడిపోయెను
అని తలపోయుచు మారుతి నడచెను
ప్రాకారముపై చింతతొ నిలచెను.

''జానకి జాడ తెలియకపోతిని
అది తెలుపుట అతి బాధాకరము
నిజము దాచుట స్వామిద్రోహము
విషయము వినిన రాఘవుడేమగు?

అన్న సుఖములే మిన్న అనుకొను
లక్ష్మణుడాపై మనగలడా యని
కలత చెందిన మనసది ఆయెను
మారుతి కన్నుల నీరు నిలచెను.

సోదరులిరువురు మరియిక లేరన
భరత శతృఘ్నులు బ్రతుకరు నిజము
తల్లులు ముగ్గురు తనయుల బాసిన
తనువులు నిలపుట కలలో జరగదు.

అంత ఘోరము జరిగినంతనే
జాంబవ దంగద వానరరాజు
జీవించరుగా రామభక్తులు''
మారుతి కన్నుల నీరు నిలచెను.

కాంతుల బాసిన కాంతలు బ్రతకరు
పుణ్యమూర్తులు- రుమా తారలు
ఎందరు కలరో ఉత్తమ చరితలు
చేరుదు రుత్తమ లోకము లందరు.

''నా వల్లనెగద యీ విషమస్థితి
నేనిక పోను కిష్కంధాపురి
సీతను చూచిన బ్రతికియుండుట
మాతను చూడక మరణించుటయే

రాక కోసమై నిరీక్షించుట
ఆశతొ వారు జీవించుటయే -
అందులకొరకై- కనబడ లేదను
వార్తను చెప్పగతొందర ఏల-

అసువులు వీడుట అవివేకమగు
బ్రతికియున్నచో మేలు కలుగును
కావున నేను రామ సేవకై
బ్రతికి యుందును శుభఘడియలకై''

అనుకొని మారుతి స్థిరనిశ్చయుడై
వాన ప్రస్థమున నియమ నిష్ఠతో
రోజులు గడుపుచు సీతను వెదకుచు
రామ సేవలో తరించ నెంచెను.

అంతట మారుతి కన్నుల ముందర
కనుపించిన దొక సుందరవనము
ఇష్ట దైవముల నిష్ఠగ తలచి
సొంపగు వనమును చేరెను మారుతి

లక్ష్మణ సహితుడు రామప్రభువునకు
జనకరాజసుత జానకిదేవికి
రుద్ర ఇంద్ర యమ వాయుదేవులకు
సుగ్రీవునికీ వందన మిడెను

''తపోవంతునికి సిద్ధి కలిగినటు
రాక్షసులందర జయించి నేను
భూసుత-సీతను-రామ ప్రభువుకు
సమర్పించెద-జన్మ తరించగ''

కార్యసిద్ధికై బ్రహ్మను తలచి
దేవతలందర మరి మరి తలచెను
సూర్య చంద్రులను వరుణదేవుని
ఎందరు సురలో అందర తలచెను.

మలయానిలముల నిలయమది
సుమగంధమును పూయునది
దానవ వీరుల కావలి యుందురు
అశోకవనమది సుందరవనము.

స్వామి కార్యమును నెరవేర్చుటకై
కార్య దీక్షతో- కురుచ రూపుతో
దానవ వీరుల కనుల బడకను
మారుతి ముందుకు సాగెను వనమున

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

## 14 అశోక వన పరిశీలన

చంపక చందన దేవకాంచన
అశోక కపిముఖ నారికేళములు
తియ్యమామిడి తాళవృక్షములు
చీకటిమ్రాకులు తక్కోలములు.

చిక్కగనున్న వృక్షసంపదతొ
చక్కగనున్న పరిమళ సుమముల
కమ్మని తావుల కిమ్మయి వనము
కోయిల పాటల కది నిలయమ్ము.

విరి కన్నియలు వెచ్చ తేనియలు
పూల కంచముల పొందుపరచుకొని
భృంగరాజుకై రంగుల విరిసి
రమణీయమ్ముగ నుండును వనము.

ఆమనిశోభలు సంతరించుకొని
అంతులేని సొగసెంతొ పూసుకొని
పులుగు గుంపులు - పురివిడి నెమళులు
పాటలు నాట్యము నయనానందము.

దూకెను మారుతి తరువులపైన
పులుగు-లెగరగా రెక్కలు తగిలి
పూవులు రాలెను హనుమంతునిపై
అతడు తోచెను పుష్పనగమువలె.

సీతను వెదకుచు మారుతి- వనమున
నిద్ర లేపెను పక్షుల గుంపుల
కల కల రవముల వనము లేచెను
చివురులు మెరసెను ఉదయ శోభతో.

పూవులు రాలిన నేలట సొగసుగ
సింగారించిన స్త్రీవలె నుండెను
పూవిలుకాడై భాసిలె మారుతి
అందము లొలికె అశోకవనమున.

రాలెను ఫలములు- రాసిగ ఆకులు
పూవులు విడివడి నేల రాలగా
ఆ తరువులట సొమ్ముల నోడిన
చెడు-జూదరివలె కనులకు తోచెను.

పక్షుల గుంపులు ఎగిరిపోయెను
మిగిలెను చెట్లు నామమాత్రమై
బంధువు లందరు వీడిననరులన
తోచెను ఆ తరు సముదాయములు.

మణిమయ శోభిత సోపానమ్ములు
మంచినీటితో బావులున్నవి
మంచి ముత్యములు మేలు పగడముల
కూర్చి యున్నవట యిసుక తిన్నెలు

విశ్రమించుటకు స్ఫటికపు టరుగులు
ఒడ్డున బంగరు వన్నెల తరువులు
తామర పూవులు కలువలు కలిగి
చక్రవాకములు హంసలు గలవు.

చక్కని గదులు చిక్కని చెట్లు
ఇంపగు శిఖరము సొంపు లెగయగా
రాతిగృహముతో రమ్యముగాను
క్రీడాచలము ఉన్నది వనమున.

శిఖరాగ్రమున జారెడి ఏరు
పతిపై అలిగిన సతివలె నుండెను
అందు వ్రాలిన తరువుల శాఖలు
అడ్డుగ నిలచెను ఆత్మబంధువన.

హితము గొలపగా-పతిని-తిరిగి,సతి
చేరెడి తీరుగ-వనమున నీరు
వెనుకకు మరలి నడువగతోచెను
అలుక తీరిన అతివ చందమై

ఎఱ్ఱని పూలు చిగురులు మెరసి
అగ్నిచెట్లవలె- తోచు- తరువులను
స్వర్ణ శోభతో వెలుగు- అరుగులను
సంతోషముతో గాంచెను మారుతి

బంగరు వన్నెల తరువుల నడుమ
వెలిగెను మారుతిభానుని రీతిగ
బంగరు గజ్జెల చిరు మ్రోతలతో
శోభిలు శింశుప తరువును చూచెను.

శింశుప తరువున చేరెను మారుతి
మాతను చూచుట కనువైనది యని
రాఘవు కొరకు ఎదురు చూచెడి
పావనమూర్తిని సీతను తలచుచు

''రాఘవురాణి పరమ పతివ్రత
వనమున వెలుగును వనదేవతగ
నిరతము పతినే ధ్యానించుచును
రాగలదీ వన శోభను చూచి

ఈ వనమందలి మృగముల సేమము
పావని జానకి తెలియ గోరుచు
కరుణామయి యిట వచ్చుట నిజమని'
కొమ్మల కూర్చొని మారుతి చూచెను.

రాముని తలచుచు ప్రార్థన సలుపుచు
సంధ్యా సమయ నియమ నిష్ఠకై
అనువుగనున్న ఈ నది చెంతకు
జనకజ నిజముగ వచ్చి తీరును

ఈ వన శోభ అపురూపము గద !
కోమల మూర్తికి తగి యున్నదిగా
సుందర వనమున సుమసుకుమారి
ఉండుట తథ్యము - అని తలపోసెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

## 15 సీతా సందర్శనము

అశోకవనము- నందనవనమది
అన్ని ఋతువుల ఫలసుమములతో
మృగములు-పక్షులు-మయూరములతో
కలువలు బంగరు కమలము లుండెను.

శింశుప తరువున కూర్చొని మారుతి
తిలకించెను ఆ వనమును తిరిగి
సుర లోకములో నుండు సుమతరు
శోభిత మైనది సుందరవనము.

అశోక తరువులు విరిసె నిండుగ
ఎఱ్ఱనిపూలు మంటగ తోచెను
పక్షులు రెక్కల- పూవులు ఆకులు
రాల్చెను వింతగ - రెపరెపలాడుచు.

పూచిన గోగులు కొత్త మోదుగులు
ఏడాకులు గల అరటి తరువులు
పొన్నలు, సంపెగ, ఎన్నో పూలు
ఉన్నవి సోయగ మొలుకుచు వనమున.

ఇంద్రుని వనమగు నందనవనము
ధనపతి వనము చైత్రరథమును
అధిగమించి కడు అందముగాను
అశోకవనము ఉన్నది లంకలో.

తారల పోలిన పూలతొ తరువులు
రెండవ అంబర మన్నటు తోచెను
గంధమాదనగిరి మరియొకటని
ఆ వనమందలి భవనము తోచెను

ఆ భవనము అట ఆకసమంటుచు
ఎత్తుగ నున్నది వేయి స్తంభముల
ధవళకాంతితో అతి సుందరమై
కనుపించినది అనిలాత్మజునకు.

మాసిన చీరతొ చెదిరిన మనసుతొ
చిక్కిన తనువుతొ తినకోరకను
నిట్టూర్పులతో గుర్తే తెలియక
రక్కసి మూకల చిక్కిన వనిత.

హోమధూమముచె కప్పిన అనలము
కొత్త చంద్రుని పోలిన దేహము
వ్యధతో కుమిలెడి మనసు కలిగిన
కోమల మూర్తిని మగువను గాంచెను.

మలిన వస్త్రమున దీనవదనయగు
సుమ రహితమగు సుమలత పోలి
పద్మరహితమగు పద్మాకరమన
ధ్యానమగ్నయై యున్నది అతివ.

వేటకుక్కల చిక్కిన హరిణిగ
నల్ల త్రాచువలె జారిన వేణితొ
రక్కసి రూపులు ముఖములు కనుచు
శోక తప్తయగు మూర్తిని గాంచెను.

పున్నమ చంద్రుని పోలిన ముఖముతొ
రతీదేవి వలెనున్న అతివ అట
చీకటి చీల్చెడి వెలుగు రూపుతో
ఉన్నది- గాంచెను మారుతి నిండుగ.

తపోరాసియై కటికనేలపై
బుసలు నిండిన ఆడుపాము వలె
విభుని తలచుకొని మదిని కలతపడి
ఉన్నది కోమలి-మారుతి గాంచెను.

లేడికన్నుల బెదరు చూపుల
అశ్రులు నిండెను అతివ కన్నుల
శోకమూర్తియై చిక్కిన మూర్తితొ
మలిన దేహయై మగువ యున్నది.

నియమ నిష్ఠల తాపసి పోలెను
సుమ లావణ్యము-మేన కలిసెను
భయ కంపితయై నిశ్వాసములతొ
నాగ కన్యవలె తోచుచుండెను

సందిగ్ధార్థము కలిగిన స్మృతియన
తరిగిపోయిన సంపదవోలె
క్షీణితమైన శ్రద్ధతీరుగా
నిష్ఫలమైన ఆశగ నున్నది.

విఘ్నము నందిన కార్యము తీరుగ
కలుషితమైన బుద్ధి రీతిగా
నిరాధారమగు అపవాదు వలె
గత యశస్సువలె నున్నది అతివ.

మబ్బుల మాటున చంద్రుని రీతి
కాంతులు తరిగి కాంత యున్నది
ఆభరణమ్ములు ఆమె ధరించిన
వెలుగును అవి అట వేయికాంతులతో.

పునశ్చరణ యదిలేని చదువుగా
సంశయమ్మది కలుగుచున్నది
సీతయొ-కాదో-అను సందేహము
మెదలసాగినది మదిలో నపుడు.

ఆ పుణ్యవతి- జనకజ యగునని
మది తలపోసెను మారుతి అంత
పరిశీలించి మరిమరి చూచి
తెలిసిన గురుతుల పోల్చగ నెంచెను

వేరొక అర్థము కలిగిన పదముకు
సరియగు నర్థము పండితుండు తా
కష్టముతో మరి తెలియునట్లుగా
శ్రమతో మారుతి గ్రహించె- సీతగ

రామచంద్రుడు చూపిన నగలు
తరుశాఖలలో ఆభరణమ్ములు
ఒక్క పోలికగ నుండుట గాంచి
తప్పక సీతని తలచెను మదిలో.

దీర్ఘకాలము ధరించినట్టుగ
ఆభరణమ్ములు అగబడుచున్నవి
వాటి గురుతులవి శరీరమ్మున
స్పష్టముగా మరి కనబడుచున్నవి

''ఋష్య మూకమున చూచిన నగలవి
ఇచ్చట మాత్రము కనబడకున్నవి
వాటికి సరిపడు ఆభరణమ్ములు
తీరుగ ఇచట కనబడుచున్నవి.

''ఋష్యమూకమున చూచిన నగలు
ఇట తరులశాఖల వెలిగెడి సొమ్ములు
ఆభరణమ్ములు అటుయిటు చూడగ
అతివ సొమ్ములు అమరును సరిగ

అంబర వీధిని అసురుడు గొని పో
అంబర మందు నగలను కట్టి
ఋష్యమూకమున జారవిడిచెను
అట తరుశాఖల నిలచిన వవియే.

ఆ వస్త్రముతో కలిసెను వలువ
ఆభరణమ్ముల పోలిక లొకటే
తరుణి సోయగము ప్రభువుకు తగినది
కావున కోమలి జనకజ యగును.

పావని సీతను-నే కనుగొంటిని
పరమ పతివ్రత నిట చూచితిని
రామలక్ష్మణుల కార్యము తీర్చితి
వానరు లందరు బ్రతికి యుందురు

స్త్రీయని- దయతో వేదన పడును
ఆశ్రితురాలు అను ఆవేదన
ఆలి అపహరణ అమిత దుఃఖము
ప్రియసతి దూరము- అన్నీ బాధలె

సౌందర్యాంబుధి సీతామాతకు
ఎంతటి ఘనుడో రాముడు విభుడవ
అతి సమర్థుడు విజితేంద్రియుడు
కావున బ్రతికెను ఈమెకు ఎడమై.'

అంత దుఃఖమున రాముని మనసు
అనిశము లగ్నము ప్రియసతి ఎడల
అటులే- అమ్మకు రామధ్యానము-
తలపుల- తనువులు నిలుపసాగిరి

సీతామాతను చూచిన మారుతి
మనసెగిరినది ప్రస్రవణాద్రికి
భక్తితో రాముని- మనమున తలచెను
పురుషోత్తమునికి వందనమిడెను

॥సుందరమైనది సుందరకాండము॥

❇❇❇

## 16 దేవి దైన్యము మారుతి దుఃఖము

శుభముల రాసి సుందరి సీత
మేఘశ్యాముని హృదయరాణి గని
కోమల మూర్తికి కాని కష్టమని
ఆంజనేయుడు కడు దుఃఖించెను.

శ్రీ రఘురాముని చరణ సన్నిధియె
సుఖమని ఎంచి ధ్యానించును గద
లక్ష్మణమూర్తి- విక్రమమూర్తికి
వదినగ- మాన్యత నందిన మగువ.

''జనకరాజు తన కంటిపాపలా
పెంచెను- జానకి సర్వమనుకొని
దశరథ నృపునకు పెద్ద కోడలు
రఘువంశాంబుధి చేరిన లక్ష్మి.

ప్రభువు తలపుతో నిరతము గడపును
పతి సేవలకై పరితపించును
ఫలములు తినుచు వనముననున్నను
భవనము నున్నటు సంతసపడును.

రాముని మనసును దోచిన మగువ
మంగళమూర్తికి మంగళకరమై
లక్ష్మీప్రదమీ ధర్మచరితకు
విధివ్రాత గదా! యీ విధి బాధలు

ప్రాణేశ్వరునెడ గాఢ స్నేహమది
ప్రాణప్రదమది అతి పవిత్రము
కావున మాత సర్వభోగములు
వదలి- వనమును చేరెను పతితో.''

పావని జానకి ఆవని ఆవిధి
అసురుల చిక్కి బాధలు పడగ
మారుతి కన్నుల నీరుపొంగెను
మనసున ఎంతో కలత చెందెను.

''దశరథరాముడు అతివను వెదకుచు
అతి బలశాలిని వాలిని చంపెను
రావణుసాటి పరాక్రమశాలిని
కబంధు త్రుంచెను శ్రీ రఘురాముడు

జన స్థానమున వేల కొలదిగా
అసురులు మడసిరి రాఘవుచేబడి
ఖరుడు త్రిశిర విరాధులు సమసిరి
సతిని వెదకెడు రాముని చేబడి.

జనకజ కళలలొ ఏవొక్కటికీ
మూడు లోకములు సరిగావు కదా
రామభద్రుడు సీతభద్రతకు
ఎంతటి పనినీ చేయుట తగును.

తామర పుప్పొడి తీరుగ నిండిన
నేలను దున్నెడి నాగటి కొనచే
వెలుగులు చిమ్ముచు వెలికి వచ్చెను
మిథిలలొ వెలసెను జనకుని భాగ్యము

బంధువులందరి కెంతో దూరము
భర్తకు దూరము- బ్రతుకు భారము
భోగభాగ్యముల కసలే దూరము
బ్రతుకుచుండె నిట రాముని తలపుతొ

సూర్యతాపమును భరించలేక
పందిరి నీడను చేరెడి రీతి
అతి సహజమ్ము జనకజ కొరకు
రాముడు వెదకుట సుఖములు వదలుట

జానకి- ప్రభువును చేరినంతనే
రాజ్య భ్రష్టునికి రాజ్య సంపదగ
ప్రభువుకు కలుగును ఎంతో సుఖము
చాలవుసంపద లామె ముందర.

కాంతకుకాంతుడె ఆభరణమ్ము
అన్ని సొమ్ములకుమించిన సొమ్ము
ఆనగ లేక- అవనిజ యిచట
వెలవెలబోయెను కాంతులు లేక.

పెనిమిటి బాసిన చక్రవాకి వలె
మంచు కమ్మిన తమ్మిచందమున
పెను దుఃఖములో కాంతులు తరిగి
ఆశాకిరణము చూచుచు బ్రతికెను.

వాలి రాజ్యమును తమ్ముడు పొందుట
రమణి కారణము రఘుపతి వచ్చుట
నేనీ లంకను కలయజూచుట
జనకజ కొరకై అంబుధి దాటుట.

అమ్మను గాంచితిజన్మ తరించెను
ఇనకుల తిలకుని కష్టము తీరును
మా సుగ్రీవుని మాట నిలచును.''
ఆనందించెను మారుతి ఎంతో.

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 17 మాత దర్శనము- మారుతి ఆనందము

''చల్లని చంద్రుడు చూపెను మార్గము
సుదతి సీతను చూచితి నిచ్చట
చంద్రకాంతిలా మనసుకు శాంతి
కలిగెను నాకు మాతను చూడగ.''

బరువుతొ మునిగెడి పడవరీతిగా
సీత యున్నది కడు దుఃఖముతో
ఆమె చెంత కలరెందరొ స్త్రీలు
అసుర కాంతలు వికృత రూపులు.

ఒంటి కన్నుతో వొక్క కర్ణముతొ
చెవులు లేనిది ఎగసిన ముక్కుల
పొట్టి వెంట్రుకలు బోడి తలలతో
గడ్డము తాకెడి పెద్ద పెదవులతొ.

గుంపుగ నుండిరి రాక్షస స్త్రీలు
కురుచదేహులు పెద్ద కుచములు
లంబోదరములు ఏనుగు చెవులు
అశ్వ ముఖముతో భీకర రూపులు.

పొడుగు నాలుకలు కోరలు కలిగి
నిడుపగు నఖములు-వికృతముఖములు
రక్తమాంసములు- మత్తుగ కల్లు
నిండిన కడుపులు- అరుపులు కేకలు

కోలాహలముతొ భయము గొలుపుచు
రక్తము పూసుకు రక్కసులుండిరి
ఆంజనేయుడు ఒడలు గగుర్పుతొ
గాంచెను వారినితరువున కూర్చొని.

కాంతి తరిగినది-సొమ్ములు లేనిది
కాంతుని కొరకై శాంతి లేనిది
పుణ్యము తరిగి పుడమిని రాలిన
తారను పోలి జనకజ యున్నది.

సింగము కనపడ- దంతి గుంపులో
తోటి ఏనుగులు పారిపోవగా
ఒంటిగ దొరకిన ఆడుదంతి వలె
చిక్కెను జానకి- రావణు పురమున.

తీగలు మీటక దాచిన వీణయి
తంత్రులు వదులయి ధూళి నిండినటు
ఉన్నది జానకిరాఘువు స్మరణతొ
రక్కసి స్త్రీలనులెక్క చేయక.

శరత్కాలమున మేఘము చేత
చిక్కినపాడ్యమి చంద్రుని రీతి
బుధు డంగారకు లిద్దరి చేత
బాధలు పడెడి రోహిణి రీతి

బురద నిండిన తామర పూవయి
పూవులు రాలిన పూల తీగయి
లేడి కన్నుల కాంతను చూచి
కడు దుఃఖించెను మారుతి మనమున.

దుఃఖము నిండగకళ తగ్గినది
భర్తపరాక్రముడని ఎరిగినది
పాతివ్రత్యపు రక్షణనున్న
పడతిని చూచుట మహా భాగ్యమని.

కన్నుల పొంగె ఆనంద భాష్పములు
పొంగెను హనుమ కృతార్థుడైతినని
రామ లక్ష్మణుల మనమున తలచి
అట తరుశాఖల వేచి యుండెను.

॥సుందరమైనది సుందరకాండము॥

## 18 రావణాగమనము

ప్రాతఃకాలపు శోభల వెలిగె
లేత చిగురులు విరిసిన పూలు
తీరుగ మాతను తిరిగి చూడగా
వేచి యుండెను మారుతి-వనమున.

శిక్షా-వ్యాకరణమ్ము వేదము
ఆరంగమ్ముల నెరిగిన వారు
క్రతువుల మనసు నిలిపిన వారు
బ్రహ్మరాక్షసులు సుస్వరములతో

బ్రహ్మ ముహూర్తపు శుభఘడియలలో
శుచిగా చేసెడి వేదఘోషలు
మంగళ వాద్యములెన్నో అచట
వీనుల విందుగ వినెను మారుతి

మంగళ ధ్వనులకు నిద్ర మేలుకొని
విలువగు వలువలు విరి దండలను
మేన ధరించి సీతను తలచి
పరవశుడయ్యెను పంక్తికంధరుడు

కామాతురుడు రావణాసురుడు
కాంతను తలచి తాపము నిండి
మనసున సుందరి రూపు మలచుకొని
సీతను చూడగ వని కేతెంచెను.

పక్షుల కూతలు-పూలతొ తరువులు
మృగములు-జలముల కమలములుండి
బంగరు తోరణ సోయగాలతో
వెలిగెడి వనమును-చేరెను ఏలిక.

మణి భూషణములు రత్నహారములు
సంపదలింపుగ వెలిగె మేనున
శతసంఖ్యలో ఆ రాజు వెంబడి
నడచిరి తోడు అతని భార్యలు

సురపతి వెంట సురస్త్రీలన్నటు
సతులు నడచిరి రావణు వెంట
దివ్వెలు కలిగి చామరములతో
రాక్షస కాంతలు నడచిరి వనికి

బంగరు పాత్రల జలకము నింపి
ముందర నడచిరి కొందరు మగువలు
మణి శోభితమగు ఆసనమ్ములు
కత్తులు తీసుకు సుదతు లుండిరి

బంగరు దండము కలిగిన ఛత్రము
పున్నమ చంద్రుని పోలి యున్నది
రాజహంసలా రమణీయము అది
రమణి ధరించి నడచెను వెంట

రత్నపాత్రలో మధువును నింపి
తన కుడిచేతను దాల్చిన మగువ
నిద్ర లేమిచే కనులు మూతబడు
కాంతలు-మబ్బుల మెరుపుల తీవలు

పంక్తి కంధరుని వెంట నడువగా
రమణీ మణిని చూచుటకొరకై
రావణాసురుడు అశోక వనమును
ఠీవిగ చేరెను సతులందరితో

జారిన కొప్పులు- రాలిన గంధము
తొలగిన సరములు నిద్దుర కన్నులు
మద్యపు వాసన మత్తు జారని
ముద్దుగుమ్మలు కోరిక నెలవులు

ముఖముల చెమట మేనికాంతులు
నలిగిన దండల ముడివడె కురులు
ఎఱ్ఱని కన్నుల సుదతుల చేర్చుకు
అతివను చూడగ వచ్చెను తేడు

చక్కని కన్నులు చిక్కని సొగసులు
అందము లెగసెడి మేని కాంతితో
నల్లని కురులతొ నున్న అతివను
సీతను చూడగ వచ్చెను అసురుడు.

దనుజనాథుని రమణుల బంగరు
వడ్డాణమ్ముల గజ్జెల ధ్వనులు
కాలియందియల సందడి యింపుగ
వినవచ్చినది మారుతి కపుడు.

పరిమళ తైలము వెలిగె దివ్వెల
ఆ దివ్వెలను వెలదులందిరి
విశాలనేత్రుడు- కామాతురుడు
ఎఱ్ఱని కన్నులు కలిగియుండెను.

వింటిని మరచిన మన్మథుడాతడు
అతి సుందరుడు పంక్తికంధరుడు
అతిశయించిన కామతాపమున
కాంతను చూడగ వనికేతెంచెను.

భుజకీర్తులపై జారిన వలువ
పాలనురుగులా ధవళకాంతితో
వెలిగెడి దానిని ఎగయలాగుచూ
సొగసుగ ఠీవిగ వచ్చెను అసురుడు.

విశ్రవసునికి తనయుడు తేడు
అతిబలశాలి భూషణయుతుడు
శంకువు వంటి కర్ణము లుండి
రావణుడుండెను మత్తు నిండుగా

తారలనడుమ చందమామలా
తేజోవంతుడు అసురభూపతి
రాక్షస యువతుల మధ్య నుండగా
మారుతి తలచెను రావణుడే యని.

వాయుపుత్రుడు తేజోవంతుడు
ఆంజనేయుడు - రావణు చూడగ
క్రింది కొమ్మలకు మెల్లగ జారెను
ఆకుల ఒదిగి బాగుగ చూచెను.

॥సుందరమైనది సుందరకాండము॥

# 19 సీత భీతిల్లుట

రూప యౌవనుడు భూషణయుతుడు
రాక్షస ప్రభువు రావణు చూచి
రాముని సతి- ఆ పావన చరిత
మదిలో ఎంతో వ్యథ నొందినది.

మణి మంత్రాదుల బంధింపబడి
మెదలకయున్న నాగు పామువలె
కేతు గ్రహముచే బాధల నందిన
రోహిణి వలె అట జానకి యున్నది.

పెనుగాలెగసిన వనము నందున
కదళీ తరువై కంపించినది
రాక్షస స్త్రీల కావలి నడుమ
దుఃఖపీడితను చూచెను అసురుడు

తపో రాశియై ఉపవాసములతో
ధ్యాన మగ్నయై దుఃఖభాజయై
భయభ్రాంతయైచిక్కిన తనువుతో
దీన వదనమున సీత యున్నది.

కటికనేలపై కూర్చొని-సీత
వారిధి మునిగెడి నావ రీతిగా
నరకిన తరుశాఖైన తీరుగా
పాతివ్రత్యపు నియమము నున్నది.

దశరథరాముడు ప్రాణేశ్వరుడు-
దశకంఠుని పరిమార్చవలెనని
దేవతలందర కోరుచున్నటు
మైథిలియున్నది ధ్యానించుచును.

సంకల్పంబను అరదము నెక్కి
మనమున- రాముని రాజశ్రేష్ఠుని
తలచుకు నాథుని చేరెడి రీతిగ
ఉన్నది జానకి తరువు క్రిందున

నాయకుడంతము అయిన సేనయై
నిశికి లొంగిన వెలుగు రీతిగా
ప్రవహించని- నది అనిపించగను
జానకి ఉన్నది తరువు క్రిందున.

పూజా ద్రవ్యము లేని పూజగా
నిష్ఫలమయిన ఆశరీతిగా
క్షీణితమయిన కీర్తితీరుగా
వ్యర్థము అయిన శ్రద్ధ మాదిరి.

నిరతము పతినే ధ్యానించుచును
శోకభారమున ఉన్న అతివను
మధుర భాషణల-ముదితను మార్చగ
రావణాసురుడు సంకల్పించెను.

॥సుందరమైనది సుందరకాండము॥

# 20 రావణ ప్రలాపము

''కడుపు మూసుకొని ఉరమును దాచి
కన్నుల సొగసులు కనబడకుండగ
దాచకు- దాగవు నీ అందాలు
బంధించినవి నను మోహముతో.

జగన్మోహినీ! నీ జవ్వనము
వ్యర్థముగా నువు పోనీయకుమా!
రాదది తిరిగి- పారిన నీరది
పాటలగంధీ విను నామాటను.

కలువ కన్నులు కలిగిన కాంతా!
కడు సుందరివి సర్వలోకముల
సద్గుణ రాశివి- సరసుడ నేను
కాదనవలదు కరము గ్రహించుము

వాణీ నాథుడు నిన్ను సృజించెను
లోకోత్తరమగు సౌందర్యముతో
ఇంతటి నిన్ను చేసిన నలువ
చేయుట మానెను సుందర స్త్రీలను.

పరకాంతలను చెరపట్టుట- మరి
అపహరించుట- బలాత్కరించుట
మా కులధర్మము- మైథిలి వినుము
కావున నిన్ను తెచ్చుట ధర్మము.

ఆబ్రహ్మయినా చూచిన నిన్ను
మోహించుట యది అతి సహజమ్ము
చంద్రముఖీ! నీ సొగసుల నుండి
దృష్టి మరలదది నీకు తెలియదు.

అది సరియైనను నను కాదన్న
నిను తాకను- నే తాపము నిండియు
సీతా సుందరి నన్ను నమ్ముము
నావల నీకు భయమెపుడుండదు.

రత్నరాసులు పోసెద నీకై
నా సతివైనచొ నీకు శుభమగు
నా రాణులకే రాణి వగుదువు
రమణీ రమ్ము కాదనవలదు-

మలిన వస్త్రముతొ ధ్యానమూర్తివై
కటికనేలపై ఏల పరుండుట?
ఉప వాసముల వాడిపోవుట
నీ కసలెందుకు నేనుండగను?

సురలు అసురులు ఆలమునందు
నా ముందసలు సరిపోరు సుమా!
నీ జనకునికి జనక రాజుకు
జయించి యిచ్చెద ఈ భువినంత

వివిధ వస్త్రములు విరి దండలతో
అగరు ధూపముల చందన మలదుకు
మధుర పానముల మెత్తని శయ్యల
సుఖముగ నుండుము మంగళ కరముగ.

సొగసుగ నీవు సొమ్ముల నుంచుకు
మధుపానమ్ముతొ మనసు పెంచుకు
కాంతారమ్ము- విహరించగను
కాంతారమ్ముల పూపొదరిండ్ల

నార చీరలతొ వనమున తిరుగు
రాముని- మనమును తలపోయకుమా!
వాన ప్రస్థమున భూశయనమున
రాముడు యింకా బ్రతికి యుండునా?

నా సతులందు నాకసలెంతయు
మనసే లేదు నిన్ను చూడగా
సొమ్ములు లేక సింగారించక
ఉన్నా నిన్నే మరువకుంటిని

నాకాధీశుడు గెలిచిన కీర్తిని
హిరణ్య కశిపుడు తిరిగి పొందినటు!
నన్ను గెలిచినిను తిరిగి పొందగ
శక్తి లేదునీ రామచంద్రునికి!

తపోబలమున పరాక్రమమున
కీర్తియందునా తేజమునందు
సంపదలందు సొగసులయందు
సాటిరాడు నీ రాముడు నాకు-

బెదరెడి సీతా! చిరునవ్వొసగుము
నన్నాకట్టే కన్నులు నీవి
నా మనసును నువ్వప హరించితివి
ఫణిని చూచిన ఖగరాజువలె

ఓ లలనా! నీవెల్ల సౌఖ్యములు
పొందుము మధువును స్వేచ్ఛగ(త్రాగుము
సంపదలన్నీ నీ కందించెద
సుఖముల తేలుము శుభముల రాశీ!

భోగములందు తేలగ రమ్మ
ఆభరణమ్ముల సింగారమ్ముల
సుందరి -నీకై తొందరపడుట
సరసుడ నాకు సరియగును సుమా!

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

## 21 జానకి హితవు

భయంకరమగు అసురుని పలుకులు
వినిన జానకి పరితాపముతో
దీన స్వరమున దుఃఖపీడిత
మారు పలికెను ములుకుల పలుకుల

''ఓ రావణుడా! నీ రాణులతో
సర్వ భోగములు అనుభవించుము
పాపకర్ముడు మోక్షము కోరెడి
రీతిగ నున్నది- నను తెచ్చుటది.''

తృణమును తీసి నడుమను నిలిపి
పాతివ్రత్యము భంగపడకను
మనమున విభుని ధ్యానము చేసి
పలికెను జానకి- అసురుడు వినగ

అసురుని ముఖమే చూడక జానకి
వెనుకకు తిరిగి వీపటుత్రిప్పి
మరల పలికెను- ''పరుని భార్యను
సతిగా కోరుట తగదు- పాపము

రాక్షసరాజా! ధర్మము తెలియుము
ఉత్తమ పురుషుల నియమము లెరుగుము
నీ సతి రక్షణ నీకు ముఖ్యము
ఆ విధి పురుషుడు ఆలిని గాచును.

పర పురుషుడు- నీ పడతిని కోరిన
నీ మది కలవర మందిన యటుల
పరకాంతను నీవాశించిన ఎడ
ఆ విధి ఆ మగడెంతో కుందును

దురహంకారుడ! బుద్ధి మారదా!
వినాశ కాలము వచ్చె నసురలకు
వినయము చూపెడి నటనతొ నీవు
హిత వాక్యమ్ములు వినకున్నావు.

బుద్ధిహీనుడు చెడు నడవడకల
దుష్టుడు- రాజై యుండినచోట
ఎంతటి చక్కని రాజ్యము కూడ
నాశన మగుట విదితమే కదా!

రవితో నుండెడి తేజము రీతిగ
రాముని తోడు వీడని దానిని
భోగభాగ్యముల ఆశచూపి నను
ఆశించుట నీ అవివేకమ్ము.

లంకను పాలించగమనసున్న
ఘోర మరణమునుకోరకున్నచో!
పురుష శ్రేష్ఠుడగురాముని మైత్రి
కోరుము- రాముడు శరణ మొసగును!

వజ్రాయుధము వధించకున్నను
యమరాజెంతో కరుణ కలిగినను
కోపోద్దీప్తుడు కోదండముతో
విడువడు నిన్ను- నీతిహీనులను

సర్పమువంటి రాముని శరములు
మంటలు గ్రక్కుచు లంక దహించును
ఖగరాజై శ్రీ రామచంద్రుడు
రక్కసి సర్పములన్నిటి చంపును.

శునకమువాసన పసి కట్టినటు
పురుషసింహులగు రామలక్ష్మణుల
జాడ తెలిసి- అట లేని సమయమున
అపహరించితివి- శూరుడవా నువు?

మూడడుగులతో అసుర రాజ్యము
హరియించిన హరి- రామచంద్రుడు
ఆ సంపదవలె నను తన దరికి
తీసుకు పోగల శక్తివంతుడు

ఇనకుల తిలకుడు కరుణామయుడు
శరణు కోరిన రక్షించును నిను-
చేరుము రాముని పాద సన్నిధి
నా పతి చెంతకు జేర్చుము నన్ను

పులులను గాంచి శునకము పరుగిడు
అటులే నీవు రామలక్ష్మణుల
వాసన తగిలిన నిలబడలేవు
తిరిగి చూచెడి మాట తలచవు

పురుష సింహముల గాలికి బెదరి
లేని సమయమున- పిరికివాడవై
అపహరించితివి ఆడుదానిని!
చోరుడ వీవు! శూరుడ గావు.

అలకా పురమున దాగినగాని
వరుణుని శరణు కోరిన గాని
పిడుగు పాటునకు గురియగు తరువన
పుడమిని నీవు కూలుట నిజము''
॥సుందరమైన సుందరకాండమ

❉❉❉

## 22 రావణు పరుషోక్తి- జానకి హెచ్చరిక

సీత పలికిన పలుకులు వినిన
రావణుడంత పలికె కోపమున
''నీ వాడిన యీ పరుష భాషణ
తిరస్కారము లోక సహజము

అదను తప్పిన అశ్వరాజముల
సారథి ఒడుపుగ ఆపిన రీతి
నీపై పెరిగిన క్రోధము నంతయు
నీపై పెంచిన మోహము అణచెను

నీ కొసగిన గడువింకను- రెండు
మాస ములున్నది మైథిలి వినుము!
ఆపై నీవు నా శయనమునకు
రావల నుండునుఓ కుసుమలతా!

ఆ తీరుగ నువు నా దరి రానిచొ
మరు నాడుదయపువిందు భోజనము
నిను ఖండించిసిద్ధము చేతురు
సిద్ధముగానువ్వుండుము సుదతీ!''

రావణు ధోరణి వినిన అతివలు
అతని భార్యలు అతి సుందరులు
సుర సుందరులు- అసురాంగనలు
మదిలో ఎంతో కలవర మందిరి.

సుర గంధర్వ సుదతులు ఎన్నో
ముఖ సంజ్ఞలతో కనుసన్నలతో
బెదిరిన సీతను ఊరడించిరి
భయములేదని- మూగభాషతో.

తోటి పడచుల తోడు చూచుకొని
పాతివ్రత్యపు బలము చేతను
తిరిగి రావణుని తోడ నుడివెను
హిత వాక్యమ్ముల సీత పలికెను.

''దానవ రాజా! నీ వీ రీతిగ
పరకాంతను బంధించి వుంచుట
నీకు తగదని హితము తెలుపగ
హితులే లేరని తోచుచున్నది.

దేవ ప్రభువునకు శచీదేవి వలె
ధర్మ ప్రభువు శ్రీరామ విభునకు
సతినై యున్న- నను- తెచ్చితివి
నీతి మంతులు ఛీయని- అనరా!

మదగజమును కుందేలు ఢీకొను
రీతిగ నున్నది నీ సాహసమది
రాముని ముందు నిలువగ లేవు
రాక్షసుడా! నీవెంత అల్పుడవు!

భయము గొలిపెడి కన్నులు నీవి
పింగళ వర్ణముతోను వికృతము
పతి వ్రతనగు ననుకామముతో
చూచిన-నేలకు రాలవదేమి!

దశరథ విభునకు కోడల నేను
రామచంద్రునికి ప్రియసతి నేను
నను దుర్భాషలు పలికన నాలుక
చీలక యున్నది ఏలనొకో!

ఓ దశకంఠుడ! నీ దెస చూచిన
భస్మ మగుదువు నా తేజముతో
నా విభు నానతి తపో నియమము
అడ్డుపడగ-నువు బ్రతికిపోతివి.

అతి బలశాలిని- ఓటమి లేదని
మాటలు చెప్పెడి మోసగాడవు
చోరుడవీవు- కాంతుడు లేని
సమయము చూచి నను తెచ్చితివి''

సీత పలికిన మాటలు వినిన
రాక్షస విభునకు కోపము హెచ్చెను
కన్నులు పెద్దగ చేసి నిలచెను
భయము గొలిపెడి రూపము వచ్చెను.

ఘనమగు మేఘము, నల్లని మేను,
పొడవగు భుజములు, పెద్ద శిరసుతో
భీమబలుడు గంభీరపు టడుగులు
కన్నుల నిప్పులు కురియుచుండెను.

రత్నకిరీటపు టంచులు కదిలెను
మదిలో రగిలినకోపముతోను
రక్త మాల్యములుఎఱ్ఱని వలువలు
రక్త చందనము కన్నులు ఎఱుపు.

ఎఱ్ఱని కాంతుల భుజకీర్తులతో
నల్లని వస్త్రము చుట్టిన అసురుడు
అమృత మథనము చేయునప్పటి
వాసుకి చుట్టిన మందరమాయెను.

రాక్షస రాజు- రావణబ్రహ్మ
విశాల వక్షము ఎత్తగు భుజములు
శిఖరము కలిగిన మందర నగమై
ఉజ్వల కాంతితొ వెలిగిపోవుచు

వెలుగులు చిమ్మే కుండలములతో
విరిదండలతోవసంత శోభతొ
కల్పవృక్షముగతోచు అసురుడు
రుద్రభూమిలోమంటప మాయెను.

నిశ్వాసముల బుసలను కొట్టుచు
సీతను చూచి తిరిగి పలికెను
''ప్రాతః సంధ్యను హరించు రవివలె
రాముని నమ్మిన- నిను కడ తేర్చెద.''

పంక్తి కంధరుడు రాక్షస రాజు
శక్తిమంతుడు వీరుడు అతడు
ఆవిధి మైథిలితోను పలికి- తన
అసురాంగనలకు ఆజ్ఞల నిడెను.

అసురకాంతలు వికృతరూపులు
ఒంటికన్నుతో- ఒక్కకాలుతో
కాళ్ళు లేనిది గజపాదములతొ
పెద్ద కుచములు బానకడుపుతో.

అశ్వముఖముతో పెద్ద నాలుకతొ
నాసికలేనిది- సింగపు ముఖముతో
సూకర ముఖము- పెద్దతలలతో
వింతగు వికృత రూపుల పలికెను.

''రాక్షస యువతులు మీరందరును
తొందరగా యీ సీత నాదవగ
అనురాగముతో నుండు రీతిగా
తెలివిగ మీరు చేయుడు కలిసి.''

సీతకు హితమగు పనులను చేయుడు
సామము దానము భేద దండనలు
అనువగు రీతిగ ఆచరించుడని.
ఆనతి నొసెగెను క్రోధము నిండి.

విభుని క్రోధమును అతని ఆనతి
వినిన భార్యయగు ధాన్యమాలిని
పతికి కౌగిలిడి ప్రేమ మీరగా
పలికెను- తనతో సుఖము లందుమని.

''అందము లేదా నంద మియ్యదు
ఎందుకు సీత? నేనుండగను
ఆమెనుదుటఆ విరించి నిజముగ
లిఖించ లేదుగ భోగము లందగ.

నిను కోరని ఏ అతివను కోరిన
సుఖమేమిటి! నీ వది తెలుసుకొను
కోరిన దానిని చేరిన వానికి
కోటి సుఖములు కలుగు నిజముగ.''

ప్రియ సతి పలుకులు ప్రియ వచనమ్ములు
అతి బలశాలి దశకంఠుడు విని
మందహాసమున సతులందరితో
వెలుగులు చిమ్మెడి భవనము చేరెను.

భయకంపితయై దృఢ చిత్తముతో
వణకెడి సీతను మరువగ తలచి
మదనుని వశమున చిక్కిన అసురుడు
చేరెను భవనము చేరి మదవతుల.

॥సుందరమైనది సుందరకాండము॥

# 23. రావణు నౌన్నత్య వర్ణన

రావణు డంతట భవనము చేరగ
రాక్షస వనితలు సీతతొ పలికిరి
కోపము నిండిన పరుష భాషణల
జనకజ మది నొప్పించ దలచిరి.

''మా దశకంఠుడు ఉత్తమోత్తముడు
పులస్త్య ప్రజాపతి వంశోద్భవుడు
అతడు మహాత్ముడు అతి విక్రముడు
అతని భార్యవై సుఖముల నందుము.''

అంతట రక్కసిఏకజట
పలికెను సీతతొ క్రోధముతో
బ్రహ్మకు మానసపుత్రులు ఆర్గురు
అందు పులస్త్యుడు నాల్గవవాడు.

విశ్రవసునికి మానసపుత్రుడు
తేజోవంతుడు ఋషి పుంగవుడు
అతి విక్రముడు అరి భయంకరుడు
రావణుడాతని తనయుడు తెలుసా!

పిల్లికన్నుల రక్కసి హరిజట
గ్రుడ్లు త్రిప్పుచు పలికెను అంత
సురప్రభువగు ఆ ఇంద్రుని గెలచిన
మా ప్రభు చేరుము నీకు శుభమగు.

ప్రఘస పలికెను కోపముతోను
అతి బలవంతుడు శూరుడు వీరుడు
యుద్ధమునందు వెనుకకు తిరుగడు
రావణు భార్యగ ఎందుకు చేరవు?

భార్యలనెంతో ప్రేమించును గద
మండోదరి- మా ఏలిక హృదయము
ఆమెను మరచి నిను చేరుకొని
నీతోనుండును సర్వము వదలి.

అంతట వికటపలికెను సీతతొ
ఓ సీతా! నువు మూర్ఖత వదలుము
పలు మారులు మా ప్రభువు- దేవతల
గంధర్వులను నాగుల గెలచెను.

దుర్ముఖి పలికెను అనునయముగను
ఓ సీతా! విశాలనేత్ర! విను
అతని భయమున పూలవానలు
తరువులు కురియును అన్ని ఋతువుల.

రావణు భయమున రవి తీక్షణముగ
కిరణములను తను వెలుగనీయడు
వాయుదేవుడు వీచును సరిపడ
అంతటి రావణు కాంతవు కావలె.

అతను కోరిన తీరున శైలము
జలముల నిచ్చును-మేఘము కురియును
నే తెలిపితిని విశదముగాను
వివేకమ్ముతో అతని వరించుము.''

॥సుందరమైనది సుందరకాండము॥

# 24. రాక్షస తర్జనము

వికృతమయిన ముఖములు గలిగిన
రాక్షస స్త్రీలు పలికిరి కటువుగ
అందమయినది అతని శయనము
అతి విలువయినది స్వర్గ సమమది.

నరకాంతవు నీ వగుటచేతను
నరుని భార్య యన గొప్పను కొంటివి
దనుజ నాథునితొ ముల్లోకముల
భోగము లందుము భాగ్యశాలివై.

రాజ్యములేదు అడవుల తిరుగును
కోరిక సఫలము చేయగలేడు.
మానవు డాతడు మహిమలు లేవు
కావున- రాముని మరచుట మేలు

అంతట జానకి జాలి గొలుపు నటు
కలువల బోలిన కనుల నీటితో
దానవ కాంతల పలికె దీనముగ
''మానవకాంతను కోరుట తగదు.

మానవకాంత దానవకాంతగ
ఉండగ తగదు ఒంటరినైతిని
పాపపు మాటలు లోక విరుద్ధపు
విషయములన్నీ పలుకుట తగదు.

రాముడు నాకు దేవుడే సుమా!
రాజ్యము భోగము లేకపోయినను
పురుష పుంగవుడు నామది ఏలిక
ఏల పలుకుట వ్యర్థపు మాటలు

సురపతి సతి ఆ శచీదేవి వలె
రోహిణి చంద్రుని వీడని రీతి
సుఖదుఃఖముల రాముని దానను-
అరుంధతికి వశిష్ఠుడు దైవము-

అగస్త్యమునితో లోపాముద్ర
చ్యవనుని వదలని సుకన్య రీతి
సత్యవంతునికి సావిత్రి వలె
శ్రీమతితో ఆ కపిల మహాఋషి

ఎందరు కలరో పుణ్యచరితలు
పరమ పతివ్రత అల దమయంతి
నిషధరాజు నలు ననుసరించినటు
ఇనకుల తిలకుని నామది మరువను.''

జనకజ-పలుకులు వినిన రక్కసులు
కోపము పెరిగి సీతను చూచిరి
వారందరట పరుషము లాడుచు
బెదరింపుల ఒప్పించ నెంచిరి

శింశుప తరుపున సుందరమూర్తి
వాతాత్మజుడు అంతయు చూచుచు
రక్కసి పలుకులు ఆ బెదరింపులు
విని మదినెంతో వ్యథ నొందెనట.

పెదవుల నాలుక నాకుచు వారు
వికృతమయిన రూపుల వారు
ఆయుధములను చేత ధరించి
రాజుకు తగదీ సీతని పలికిరి.

రక్కసి వనితల బెదరింపులతో
దుఃఖము పొంగెను సీతాదేవికి
మదిలో విభుని తలచుకొనుచును
శోకము నిండెను శుభముల రాశి.

భయము గొలిపెడి రూపుతొ నున్న
వినత రక్కసి బాన కడుపుతో
సీతను చూచి పలికెను అంత
''సంతోషించితి నీ పతిభక్తికి!

ఓ సీతా! నీ మేలు కోరితిని
సురపతి ఇంద్రుని మించిన అందము
చతురుడు రూపుల అతి సుందరుడు
పంక్తికంధరుని పతిగానెంచుము.

మానవమాత్రుడు- రాముని విడచి
రావణు నాశ్రయమందు సుఖములు
విలువగు భూషలు-మేలగు వలువలు
కలిగియుండుము భోగములందుము.

స్వాహాదేవీ-శచీదేవి
అగ్ని - ఇంద్రుని తోడు వీడనటు
రావణు తోడునీడగ నుండుము
కాదన-నిన్ను కబళించెదను.

వికట పలికెను పిడికిలి ముడిచి
సీతా! నువ్వీ సంద్రము నిద్దరి
సంద్రము దాటగ ఎవ్వరితరము?
దేవరాజు తను దిగినా శూన్యము-

యౌవనమన్నది స్థిరమదికాదు
యువతులు దానిని అనుభవించవలె
భర్తగ రావణు స్వీకరించుము
స్వర్గ సౌఖ్యములు బడయుట నిజము.

కాదనబోకుము- గుండియ చీల్చి
భక్షించెద - నువు తెలివిగ బ్రతుకు''
చండోదరి యను మరియొక రక్కసి
శూలము త్రిప్పుచు పలికె కోపమున.

సుందరి - రావణు చేత బడగనే
చూచిన నా మది కోరిక కలిగెను
గుండియ- ప్రేగులు చవి చూడాలని
వేచి యుంటిని సమయము కొఱకు.

ప్రఘస పలికెను క్రూరముగాను
''చంపెద నిన్ను పీక పిసకి మరి-
రాజుకు చెప్పిన నిన్ను చంపినటు-
ఆరగించుటకు ఆనతిచ్చును.''

అజాముఖి యను క్రూర రక్కసి
పలికెను తనతో నున్నవారితో
సీతను చంపి మాంస ఖండములు
సమముగ భాగము లేసి పంచుడు.

భాగము లందు తగవులు వద్దు
మద్యము-లేహ్యము మరి కొంతెక్కువ
తీసుకు వచ్చిన- మాంస ఖండములు
మనసగు రీతిని ఆరగించెదము.

అజాముఖితో సరియని పలికి
మరియొక దానవి శూర్పణఖనెను
నరమాంసమును ప్రీతిగ మెక్కి
మనసుగ దేవి నృత్యము చేతము.

సురకన్య వలె శోభిలు సీత
భయము గొలుపు ఆ రక్కసి మూకల
బెదరింపబడి మది కలతబడి
శోకము నిండెను శోభన దేవత.

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

## 25 జానకి విలాపము

జనకరాజ సుత జానకి అంత
రాక్షస వనితల మాటలు విని- తను
గద్గద కంఠముతోను పలికెను
''మానవస్త్రీని మానిని నేను.

మీరందరు నను మనసగు రీతిని
బాధించుచును ముక్కలు చేయుడు
ఆపై ఆకలి- తీరగ నన్ను
భక్షించుడు మీ కుక్షి నిండును.

సీత శరీరము కృంగిపోయెను
గుంపున వీడిన ఆడు లేడియై
క్రూరమృగముల చిక్కిన చందము
వణకెను మిక్కిలి భయముతోడను.

రామప్రభువును మరి మరి తలచుకు
పూచిన ఆ తరుశాఖ నూతగొని
నిలచెను- కన్నుల నీరు నిలచెను
ఏక ధారగా జారెను అతివకు.

విసురగు గాలికి విరిగిపోయిన
అరటి చెట్టువలె నేలను బడెను
పొడవై నలుపగు అవనిజ వేణి
కదలుచు ప్రాకెడి ఫణివలె నుండెను.

గుండెల పొంగిన శోఖము నాపగ
శక్తిలేని- వైదేహి తలచెను
రామచంద్రుని - లక్ష్మణ మూర్తిని
కౌసల్యాది అత్తగార్లను.

మార్గమధ్యమున అంబుధి నడుమ
పెనుగాలుల పాడైన నౌక వలె
పాపకర్మను పతికి దూరమై
దిక్కులేక యిట కుములుచుంటిని.

నీటికోతకు తరిగిన గట్టును
రక్కసి కోతకు చిక్కితి నేను
చక్కని కన్నులు సింగపు నడక
కలిగిన రాముడు - పాపుల కందడు.

పూర్వజన్మమున చేసిన పాపము
ఈ విధినేను అనుభవించవలె
రక్కసి మూకల చిక్కితి నిచట
నేనిక రాముని చేరుట కల్ల.

స్వేచ్ఛగ ప్రాణము విడుచుటకైనా
ఈ నరజన్మకు సాధ్యము కాదు
పరులకు లొంగి పడియుండగను
ఈ నరజన్మము నెత్తితి నేను.''

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

# 2 6 దేవి నిశ్చయము

జానకి ఎంతో విలపించినది
వివిధ ఊహలతొ బ్రతుకు భారమన
రాక్షస స్త్రీల నడుమ చిక్కితి
రాముని చూడక బ్రతుకజాలనని.

''గుండియకాదిది బండరాయి యగు
పగులకున్నది పతికి దూరమై
ప్రాణ విభుడు శ్రీరామ ప్రభువునకు
దూర మయిన నే బ్రతుకుట తగదు.

మంచి మనసుతొ మరపే రాడు
దయా గుణముతో శోభిలువాడు
దాశరథే - నా జీవిత సారథి
నా దురదృష్టము కావున మరచెనొ!

జనస్థానమున వేల కొలదిగా
రక్కసులను దునుమాడిన రాముడు
దండకాటవిని విరాధు కూల్చిన
రాముడు రాడయె నను రక్షింపగ.

వారిధి నడుమ నున్న లంక యిది
వైరుల కందని రీతిగ నున్నది
అయినా రాముని దివ్య శరములను
ఆప శక్యమా? సురలు అసురులకు!

ప్రియసతి నగుదు- ప్రాణవిభుడు నను
రావణు లంకలొ చిక్కినదానిని
పరాక్రమముతో చెర విడిపించడు
కారణ మేమొ తెలియ కున్నది?

వృద్ధుడు జటాయువెంతో వీరుడు
రావణు నెదిరి పోరెను నాకై
రఘుపతి నా ఉని కెరిగి నంతనే
ఊదివేయు నీ లంకాపురమును

ఇంకును అంబుధి రాముని చేబడి
కీర్తి నశించి దనుజుడు మడయును
పతులను బాసిన పడతులందరూ
విలపించెదరీ లంకలొ త్వరలో.

రుద్ర భూమిగా మారును లంక-
రుద్ర మూర్తియై రాముడు రాగా-
అశుభము లంకకు కలుగునట్టుగా
శకునము లపుడే అగపడుచున్నవి.

నే వినవలెగాయీ పురమందు
పడతుల రోదన శబ్దము లెన్నో
కాంతుని బాసిన కాంతరీతిగా
కాంతి విహీనము అగునీ లంక.

క్రూరుడు రావణు డిడిన గడువది
ముగియు చున్నది- రక్కసు డంత
నను సంహారము చేయుట నిజము
ప్రాతఃకాలపు భోజనమునకై.

వీరుడు- సౌమిత్రికి సోదరుడు
శ్రీ రఘురాముడు నే దరిలేక
దేహము వదలి దేవలోకము
చేరుట నిజమని తోచుచున్నది.

కమల నేత్రుడు కరుణామూర్తి
సుందర రాముని సురలోకములో
దేవ-గంధర్వులు సిద్ధులు మునులు
తనివి తీరగా చూతురు ధన్యులు.

లేదా- ప్రభువు బ్రతికియుండిన
వైరాగ్యముతో రాజర్షి అయి
మోక్ష పరాయణుడై యుండినచో
భార్యను మరచుట అతి సహజమ్ము

స్నేహము అన్నది పెరుగునుగా అది
తరచుగ చూచుట చేతను- గాని
దూరము కాగా తగ్గిపోవుటది
కనవచ్చునుగా కృతఘ్నులందు.

రాముడు మాత్రము ఆ తీరుండడు
పరిచయమన్నది మరచుట ఎరుగడు
ఉత్తమ శీలుడు పురుషోత్తమునకు
నే దూరమయి బ్రతుకుట తగదు.

రావణాసురుడు దుర్మార్గముతో
ఎదిరి గెలువగ చాలగ లేక
కపట మార్గమున ఆ సోదరులను
చంపెనొ ఏమో? తోచకున్నది

నా పతిదేవుడు పురుషోత్తముడు
శ్రీ రఘురాముడు నను మరచెనుగా-
పాపాత్ముడు యీ పంక్తికంధరుని
లంకలొ ప్రాణము నిలుపను యింక.''

॥సుందరమైనది సుందరకాండము॥

❉❉❉

## 27 త్రిజట స్వప్నము

సీత పలికిన మాటలు వినిరి
వికృత రూపులు రక్కసు లందరు
అందున కొందరు పరుగున పోయిరి
రాజుకు విషయము తెలుపుట కొరకై.

వెనుకటి మాదిరి పరుష భాషణతొ
కొందరు చంపెదమని బెదరించిరి.
అంతట త్రిజట నిద్రమేలుకొని
రక్కసి వనితల పిలచి పలికెను.

''ఈ సీతెవరని? పరమ పతివ్రత!
జనకరాజునకు ప్రియపుత్రిక గద!
దశరథ విభునకు కోడలు సీత
తినవలెనన్న నను తినివేయుడు.

నేనొక కలలో సర్వము తెలిసితి
దారుణమైనది నిజమగునేమో!
మేను వణకును దాని తలంచిన
రాక్షస నాశము- రామ విజయము''

దనుజాంగనలు కలవరపడిరి
దగ్గర చేరి వణుకుచు నంత
త్రిజటను కోరిరి కల చెప్పమని
వారికి బదులుగ పలికెను త్రిజట.

''దంతి దంతముల నిర్మితమైన
దివ్యమయిన ఒక పల్లకి- దానిని
వేయి హంసలు మోయుచున్నవి
తెల్లని వలువల రామలక్ష్మణుల

సీతాదేవి శుభ్ర వస్త్రముల
తెల్లని నురుగుల వలువలు వెలుగ
అంబుధి నడుమతెల్లని గిరిపై
తల్లిని చూచితి నా కలయందు.

రవితేజము తా రవిచేరినటు
సీత చేరెను రామమూర్తిని
గిరివలె తెల్లని కరిపై రాముడు
సోదరు చేరి శోభతొ వెలిగెను.

పురుష పుంగవులు సోదరు లిరువురు
ప్రకాశించిరి దివ్య తేజముల
తెల్లని సుమముల మాలలు దాల్చిరి
తెల్లని వలువలు వారు ధరించిరి.

సీతకు చేరువ యైనది దంతి
ఆకాశములో అది నిలచినది
అంతట రాముడు రమణిని చేకొనె
ఆ కరి వెలిగెను సీత సొగసుతో

కలువ కన్నులు కలిగిన జానకి
కాంతుని తొడపై నున్నది చేరి
రవిచంద్రులను తాకుట చూచితి
ఆ కరి- లంక దరి కొచ్చినది.

తెల్లని వృషభము లెనిమిది పూన్చిన
రథమును ఎక్కి రాముడు వచ్చెను
తెల్లని విరుల దండలు దాల్చి
తమ్మునితో తను ఎన్నో చోటుల.

పాల సముద్రపు మధ్య నిలచెను
పాల నురుగులా నగమొకటుండి
తెల్లని నగమున నాల్గు దంతముల
వెల్ల ఏనుగొక టగుపించినది.

కమల నేత్రుడు అతి శ్రీమంతుడు
ఆకరి వీపున ఆసీనుడయి
శ్రీరఘురాముడు సుందర రూపుడు
కన్నుల విందుగ నాకగు పించెను.

రాజీవాక్షుడు రామచంద్రుడు
తూరుపు ముఖుడై- ఉన్నతాసనుడు
బ్రహ్మఋషులు మరి సురగణములతో
కూడియుండి నాకగపడినాడు.

ఆ ఋషిగణము ఆ దేవతలు
సకల తీర్థముల తెచ్చిన జలము
కాకుత్థ్సున కభిషేకము చేయగ
నే కల గాంచుట నాపుణ్యముగ.

జనకరాజసుత జానకి అంత
తెల్లని సుమములు తెల్లని వలువలు
చందనాదులు చక్కగ పూసుకు
శోభించిన దట శుభముల రాశి.

నియమవంతుడు ఉత్తమోత్తముడు
ఉత్తమమయిన ఆసనమందు
అందెనుపూజలు అందరిచేత
తీరుగ.మారెను విష్ణుదేవునిగ.

పరబ్రహ్మమును పరతత్వమును
జ్ఞానము అతడే- బీజము అతడే
గొప్ప తపస్సు ఉత్తమ క్షేత్రము
కారణజన్ముడు కార్యకారణుడు.

లక్ష్మీసహితుడు శ్రీ వత్సాంకుడు
అరవిందాక్షుడు సిరి శోభితుడు
శంఖచక్రములు గదతో వెలిగెడు
లోక రక్షకుడు స్థిరుడా రాముడు.

రఘుపతి- శ్రీపతి అయి కనుపించ
దేవత లందరు మరి గంధర్వులు
నాగులు-మునులు కొలుచుచుండగ
సర్వలోకముల ప్రభువైయుండెను.

మరి యొకచోట ప్రతాపవంతుడు
అతి పరాక్రముడు రాముడు వెలిగె
భార్య సీతతో సంతోషముతో
తమ్ముడు లక్ష్మణుడుండె ప్రక్కన.

పురుష పుంగవుడు- రవితేజముతో
దివ్య పుష్పకము నెక్కెను సతితో
సుమిత్ర పుత్రుడు తోడుగనుండెను
ఉత్తరదిశగా సాగె విమానము.

రావణుడంతట ఎఱ్ఱ గన్నేరుల
పూలమాలలతొ ఎఱుపు వస్త్రముతొ
నూనెబూసికొని మత్తుగ త్రాగి
నేలను బడగ చూచితి కలలో.

దివ్య విమానము నుండిన తేడు
నేలను బడెను- బోడితల మరి
నల్లని గుడ్డలు అతడు ధరించెను
స్త్రీచే అతడు లాగబడెనట.

ఎఱ్ఱని మాలలు రక్త చందనము-
ఖరములు పూన్చిన రథమును ఎక్కి
తైలము త్రాగుచు వెర్రిగ నవ్వుచు
నాట్యము చేయుచు నాకగుపించెను.

దక్షిణదిశగా వెళ్ళెను రాజు
ఆ దిశకే తన శిరసుండునటు
భయభ్రాంతుడై నేలను బడెను
వేగమె లేచి పరుగిడె తిరిగి.

పిచ్చి వానివలె దుర్భాషలతో
దుర్గంధమగు నరకకూపమున
అంధకారమగు పంకకూపమున
దిగంబరుడుగా దిగబడినాడు.

రక్త వర్ణమగు వలువలు దాల్చి
దేహము నంతయు బురదపూసుకొని
నల్లని స్త్రీ దశకంఠు కంఠమున
తాడు బిగించి లాగె బలముగా.

కుంభ కర్ణుడును రావణువలెనే
ఉన్నటుకలలో నేకాంచితిని
రావణు సుతులు తైలము పూతతొ
కనబడి రచట- కీడది మనకు.

సూకర మెక్కెను- రావణాసురుడు
మకరి నెక్కెను- మేఘనాథుడు
కుంభకర్ణుడు ఒంటె నెక్కెను
దక్షిణదిశ వారందరి పయనము.

రాక్షస స్త్రీలు తైలము త్రాగిరి
కేకలు- అరుపులు- నవ్వేచు వారు
నాట్యముచేయుచు భీకరరూపులు
శాపగ్రస్తమగు లంకనుండిరి.

తెల్లని పూవుల మాలలుదాల్చి
శ్వేతాంబరములు తాను ధరించి
చక్కని గంధపు పూతలనిండి
అట వీభీషణుడు నాకగుపించెను.

దూరముగా మీరందరు పొండు
దివ్య సుందరి రాముని కందును
కోపము నిండిన ప్రచండ రాముడు
చంప గలడు మిము సమూలముగ.

నృత్య గీతములు శంఖదుందుభులు
మ్రోగుచు మంగళ వాద్యము లుండగ
నాల్గు దంతముల దివ్యదంతి అది
గిరివలె ఉన్నతమైన ఏనుగును.

రాముని ప్రాణము యీ అవనీసుత
వన వాసమునకు వెంబడి వచ్చెను
కావున సీతను బెదరింపకుడు
రాముడు వీడడు- పరుషము మానుడు.

అధిరోహించగ అతని సచివులు
నలుగురాతనితొ ఏనుగునెక్కగ
ఆ కరి ఎగిరెను ఆకాశమున
నాకల నిజమని తోచుచున్నది.

అభయమీయమని సీతను వేడుట
భయము లేదని మాటను పొందుట
మన కర్తవ్యము- సందేహింపక
రాముని సతిని వేడగ రండు.

రమణీయంబగు లంకాపురము
వారిధి పడెను శిధిలావస్థలొ
రావణు పాలిత నగరము లంక
రాముని దూత వాతబడినది.

మిథిలానాధుని ముద్దులపట్టి
మైథిలి రాముని వలపులగుమ్మ
మనసు నిండుగా ప్రార్ధన చేయుడు
మాటయిచ్చును భయము లేదని.

రాముని దూత వానరుచేత
రావణులంక కాల్చబడినది
వానరుడతడు వాయుదేవుడే
అంతా కంటిని నాకలయందు.

సీతాదేవి కోరిక తీరును
రామచంద్రుని విజయము తథ్యము
రాక్షసరాజ నాశము తప్పదు-
అని నామనసుకు తోచుచున్నది.

పద్మనేత్ర యీ సీతాదేవికి
ఎడమ కన్నట అదరుట చూడుడు
ఎడమ భుజము అట గగురుపాటుచే
అదరుట చూడుడు అందము గాను.

అందములొలికెడి అవనిజ కదిగో-
ఎడమతొడ అదె అదరుట గాంచుడు
శ్రీ రఘురాముడు శీఘ్రమె యిచటకు
రాగల డనియెడి సూచన- అదరుట.

తరువు శాఖన కూర్చొనియున్న
పక్షి- మధురముగ మాటి మాటికి
హితులు వచ్చెడి శుభసూచనను
చేయునట్టుగా కూయుచున్నది.''

॥సుందరమైనది సుందరకాండము॥

❉❉❉

## 28 జానకి పరితాపము

రాక్షస వనితల నడుమ జానకి
జను లెవ్వరు లేనట్టి అడవిలో
ఒంటరి బాలిక రీతిగ నున్నది-
దుఃఖమునిండి తలచెను మదిలో.

హా రామా! ఓ లక్ష్మణమూర్తీ!
రాఘవుమాతా కౌసల్యమ్మా!!
ఓ- భూమాతా- సుమిత్రతల్లీ
నేనయితిని పెనుగాలుల నౌక.

''కాఠిన్యముతో నాహృది నిలచెను
లేనిచొ అది యీ పరుష వాక్యముల
పగలకుండునా- వజ్రాయుధపు
పాటుకు- గిరి తా పగిలిన రీతి.

పిడుగుపాటుకు గురియై రెండు
కొదమ సింగములు కూలినయటుల
మృగరూపముతో నున్న అసురుడు
చంపెనొ ఏమో ఆ సోదరులను.

దశకంఠునిచే చంపబడకను
స్వయముగ ప్రాణము విడచెద నేను
అర్హత లేనిచొ మంత్రము అందదు
మనసు అసురుని మాటతలచదు.

యమ రాజే ఆ మృగ రూపముతో
తెలివిలేని నా కాశ చూపెనో
మూర్ఖతతో- నే- నాపతిదేవుని
లక్ష్మణమూర్తిని పంపితి నటకు.

రావణుడిడిన గడువది మిగిలి
రెండు మాసములు మాత్రము ఉన్నది
మరణదండనకు గురి యగు చోరుని
మనసున్నటుల నా మనసున్నది.

నా నియమములు పాతివ్రత్యము
రక్కసి బాధల నోర్వగ నుండుట
కృతఘ్నునెడల ఉపకారమువలె
వ్యర్థముగా నవి హరించిపోయెను.

జనకుని మాటను తలనుధరించి
నియమము తీరి రాజ్యమేలెదవు
నాహృది నిన్నే పదిలపరచుకొని
యీవిధి నేను అంతమొందెదను.''

మైథిలి ఆవిధి పరితపించినది
యమపురి కేగగ తలచి నిలచి- ఆ
శింశుప తరువు శాఖను చేరెను
జడతో మెడకురి పోసుకొనుటకై.

తిన్నగ తరువు కొమ్మను చేకొని
మదిలో రాముని మరిమరి తలచగ
శుభ శకునములు తోచెను సీతకు
మనసు కుదుటపడె శుభముల రాశికి.

ధనవంతుని దరి ఆశ్రితులందరు
చేరినట్లుగా శుభ శకునములు
జనకనందినికి తోచినవపుడు
మదిలో వేదన కొంత తీరెను.
॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

## 29 సీతకు శుభ శకునోదయము

సుందరి కన్నులు కడు సుందరములు
ఎడమ కన్నపుడు అదిరె అందముగ
కమలము కదలిక చేప తగలగా
కనుపించినదా వామ నయనమున.

శుభ లక్షణముల శోభగనున్న
పొందుగ అమరిన అవయవములుగల
ఎడమ పార్శ్వమది అతిగా అదిరెను
రఘుపతి ముందర ఉన్నటు తోచగ

రామ విభునకు చిరకాలమున
అంకితమయిన ఎడమభుజము అది
మేలగు చందన మలదగ దగినది
అదిరెను వేగమె అతివకందమై.

పలువరసందము కన్నులు చారెడు
తీర్చి దిద్దినట్టున్న రూపము
మంగళ కరమగు తొయ్యలి పయ్యెద
కదలెను కొంచెము అన్నటు తోచెను

సౌందర్యాంబుధి మైథిలి అపుడు
రాహువు విడచిన చంద్రబింబమై
శుక్ల పక్షపు వెలుగు శోభతో
కనుపించినది కన్నులనిండుగ.
॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 3 0 మారుతి కార్యాలోచనము

త్రిజట స్వప్నమును రక్కసి పలుకులు
మహాబాహుడు హనుమంతుడు విని-
మాత పరిస్థితి కన్నుల గాంచెను
ఆలోచించెను పరిపరి విధముల.

"సంగతులన్ని తెలిసితి తీరుగ
లంకను చూచితి అన్ని చోటులా
రాముని చేరగ కోరెడి మాతకు
మనసుకు ఊరట కలిగించవలె."

మనసు కలతపడి శోకమునిండిన
సీతామాతను ఊరడించనిచొ
దోషము తప్పక కలుగుననుకొని
మారుతి-మదిలో యోచనచేసెను.

"మాతతొ పలికి ఊరడించి మరి
సందేశము నే నందివ్వనిచో
రామచంద్రుడు తీక్షణ దృక్కుల
కాల్చివేయుట జరిగి తీరును.

అవనిజ మనసుకు శాంతి కూర్చనిదె
నిరాశతో తను బ్రతుకదు నిజము
మోహన రూపుని రాముని నేను
ఊరడించుట నాకర్తవ్యము.

రక్కసులెదుట ఎటులపలుకుట
తెల్లవారిన మాత బ్రతుకదు
రాముడు నన్ను సంగతి అడుగగ
ఏమని చెప్పెద ప్రత్యుత్తరము-

మాతతొ పలుకక-సుగ్రీవుని గొని
లంక చేరగా యోధులందరితొ
సీత- ప్రాణములు నిలుపకున్నచో
నిష్ఫలమగును వారి రాకయుట.

కావున నేను అదను చూచుకొని
శోకమూర్తిని పలుకరింతును
సూక్ష్మ రూపుడను- వానరుడను-నను
రక్కసులెవ్వరు గమనించరుగా.

అందరు పలికెడి సంస్కృత భాషలొ
పలుకుట మేలది- రక్కసు లెరుగరు
మేలగు సంస్కృత భాషను పలికిన
కామ రూపుడగు రావణుడనుకొను.

వానరుడను- నే- మానవ భాషలొ
పలికిన- సీత సందేహించును
భయపడి యున్నది యింకా భయపడు
వేరొక మార్గము తోచకున్నది.

కామరూపుడగు రావణుడను కొని
అరచిన- రక్కసు లందరు లేచి
నను బంధించగ బయలు దేరుదురు
వారల దొరకక నే బాధించగ.

భయపడిపోయి భవనముచేరి
సేనల నిచటకు పిలచుకువత్తురు
ఆయుధములుగల వారితొ పోరి
అలసిపోయి- నే కడలెటు దాటుదు?

అటుల జరిగిన రామ కార్యము
చెడును పూర్తిగా- చిక్కెద నిక్కడ
యుద్ధము నందు నే మరణించిన
సరియగు వీరుడు ఏడీ ప్రభువుకు?

సంద్రముదాటిన శ్రమ నిలబడవలె
రామచంద్రుని కార్యము కావలె
సీతామాతకు శాంతి కూర్చవలె''
ఎన్నో తలపులు మదిలో నిండెను.

సందేహముతో పోరగరాదు
రామకార్యమును సాధించగల
అంబుధినంతను లంఘించగల
వీరుడు మరియొక డున్నటు తోచదు.

బుద్ధిమంతుడు హనుమంతుడు అట
చక్కగ తాను విమర్శ చేసుకు
సీతామాతకు పతియగు రాముని
రఘుపతిరాముని కీర్తన చేసెను.

అపజయమన్నది- ఏమో- ఉన్నది
కావున తొందర నే పడకూడదు
అవివేకముతో దూతనడచిన
అపకారములే జరుగు జగమున.

''రఘువంశాంబుధి చెప్పినమాటలు-
మధురములగు ఆ పలుకులు అగును
మనసున రాముని నిలపిన మాతకు
తొలకరి చినుకులు అమృతమయములు

సుందరమూర్తి ఆంజనేయుడు
గుండెలొ కొలువగు రామచంద్రుని
మధురములైన పలుకుల పొగడె
వినబడ పృథివీ తనయకు నంత.

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

## 31 హనుమ చేసిన ఇక్ష్వాకు వంశ వర్ణన

ఎన్నో రీతుల యోచన చేసి
జనక రాజసుత సీతకు వినబడ
కపిపుంగవుడు శ్రీ హనుమంతుడు
పలికెను అపుడు అతి మధురముగా.

నాల్గు సంద్రముల భూతలమంతా
పరిపాలించే రాజశ్రేష్ఠుడు
పుణ్యచరితుడు సద్గుణయుతుడు
సంపదలందు కుబేరుని సముడు.

''ఇనవంశమున ఎన్నిక అతడు
దశరథ భూపతి పుణ్యశీలుడు
రాజ ఋషులలో అగ్రగణ్యుడు
పరాక్రమమున గణనీయుడుగా

కపట మెరుగని కరుణామయుడు
మహర్షులతో సమానుడాతడు
గజ తురగములు రథముల సంపద
అపారమ్ముగా కలిగినవాడు.

ఇక్ష్వాకు వంశమున ముఖ్యుడాతడు
దృఢ పరాక్రమము కలిగినవాడు
పూజ్య గుణముల దయాపూర్ణుడు
ఇతరుల సుఖమును ముందుగ నెంచును.

దశరథవిభుని పెద్ద కుమారుడు
చంద్రుని అందము మించినవాడు
తండ్రికి ఇష్టుడు- ధర్మ నిరతుడు
రాముడు శ్రేష్టుడు ధనుర్విద్యలో.

క్షాత్రధర్మము రక్షణచేయును
తనవారలకు అండగ నిలచును
శత్రువులందరి తాపము పెంచును
సకల ప్రాణులను సంరక్షించును.

సత్యసంధుడు, వృద్ధుడు- తండ్రి
దశరథు నానతి తలను ధరించి
తన సతి సీతను వెంట నిడుకొని
వెడలెను వనముకు తమ్మునితోను.

రాక్షసరాజు రావణు బలగము-
జనస్థానమున ఉన్న రాక్షసుల
ఖరదూషణుల చంపెను రాముడు
రావణు డంత ఆగ్రహమ్ముతో

మాయ మృగమును పంపి వనముకు
పురుషోత్తముడు రామచంద్రుని
కంట బడకను అతని కాంతను
వంచనతోను అపహరించెను.

సీతను వనమున వెదకుచు రాముడు
వానరశ్రేష్ఠుడు సుగ్రీవునితో
చేయి కలిపెను వాలిని చంపెను
సుగ్రీవునికి రాజ్యము నిచ్చెను.

వానరరాజు సుగ్రీవుడంతట
ఆనతిచ్చెను- కామరూపులగు
వారందరికీ- తన వానరులకు
సీతను వెదుకగ వేగమె పొమ్మని

వేలకొలదిగా వానరులందరు
వెదకుచుండిరి అన్ని దిక్కులా
సీతామాతను లంకలొ వెదుకగ
దాటితి నేను యింత సముద్రము.

రాముడు తెలిపిన రూపమున్నది
రాముని కమరిన అందచందములు
కాంతులతీరు ఆకాంతగును''
అంతే పలికిఆపెను మారుతి.

ఆంజనేయుని తీయని పలుకులు
వినిఆనందము ఆశ్చర్యముతో
ఎంతో సంతోషించెను జానకి
కొంత భయముతో పైకి చూచెను.

తూరుపు కొండల బాలభానుడై
ఊహలకందని బుద్ధిశాలియగు
వానరరాజుసుగ్రీవు సచివుని
అనిలాత్మజుని హనుమను చూచెను

॥సుందరమైనది సుందరకాండము॥

# 32 పావనిని చూసిన సీత భయభ్రాంత యగుట

శింశుప తరువున వికసిత పుష్పము
తెల్లని వస్త్రము మెఱుపుల కాంతి
పసిమి బంగరు వన్నెతొ కన్నులు
వానర శ్రేష్ఠుడు సీతకు కనబడె

మనసు చెదరినది భయము నిండినది
భర్తను తలచి లక్ష్మణు తలచి
మంద్రస్వరముతొ సీతాదేవి
విలపించుట అట మారుతి వినెను

కపిపుంగవుని దివ్యరూపము
కన్నుల చూడగ శక్యముగానిది
భీకరమైనది ఎదురులేనిది
జానకి గాంచి మూర్ఛ నొందెను

రామలక్ష్మణుల మదిలో తలచి
మెల్లగ తేరుకు తిరిగి చూచెను
వినయమూర్తి ఆ వానర శ్రేష్ఠుని
కాంచెను- కలయని తలపోసినది

జలజనేత్ర ఆ జనక రాజసుత
తిరిగి గాఢముగ మూర్ఛనొందెను
తెలివిగలిగినది కొంతసేపటికి
ఎన్నో ఊహలు మదిలో మెదిలెను.

''కపి నా కలలో కనబడినాడు
కీడు కలుగునని పెద్దల నానుడి
లక్ష్మణ సహితుడు రామచంద్రునికి
నా జనకునికి శుభము కలుగవలె.

ఎల్లవేళలా రాముని స్మరణతొ
మదిలో భావన నిండిపోయి అది
కనులకు తోచిన కనబడ వచ్చును
మలయమారుతము ఆ కథ- పాడును.

మనోరథమే రూపు దిద్దుకొని
కన్నుల కనబడినట్టు తోచిన-
కోరికకెక్కడ రూపమున్నది?
కపిరూపము నా కగపడుచున్నది.''

దేవగురువుకూ వాణీపతికీ
అగ్నిదేవునికి వందనమిడెను-
అంతయు సత్యము కావలెననుకొని
సీత ఆశతో ఎదురుచూచెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

# 33 జానకి తన వృత్తాంతము తెలుపుట

పగడపు కాంతితొ ముఖము భాసిలె
తేజము నిండిన సూర్యు డాతడన
పవన తనయుడు తరువు నుండి దిగి
శిరసును వంచి వందనమిడెను.

వేషభాషలు వినయసంపదకు
ఆల వాలమై పలికె మధురముగ
''మదిలో కలత - కన్నులు తెలిపెను.
ఉత్తమురాలివి నీవెవరమ్మా!

తామరపూవుల రేకుల వంటి
కన్నులతో -మరి నలిగిన యట్టి
పట్టుచీరతో చెట్టు కొమ్మను
పట్టుకు నిలచిన ఓ పుణ్యవతీ!

మంగళమూర్తీ దేవతవా నువు!
యక్షులు కిన్నర రాక్షసు లందు
నాగులు గంధర్వుల సుందరుల
నీవే జాతికి చెందిన దానవొ.

రుద్ర గణములో మరుద్గణములో
వసువులలోనో చేరినదానవొ-
సుందరమైన రూప సంపదల
నీవొక దేవత వనిపించును కద-

చంద్రుని కెడమగు రోహిణి తారవొ!
నేలకు దిగిన పుణ్యమూర్తివో
కల్యాణీ- నువుకోపతాపముల
కాంతుని విడచి వచ్చిన దానవొ.

మంగళ మూర్తి! నువు కోపముతో
వశిష్ఠు కెడమగు సతి అరుంధతివొ-
చెప్పుము నీసుతుడెవరు-సోదరుడు
జనకు డెవ్వడు- జీవితేశ్వరుడు.

బాసిన బంధువు కొరకా దుఃఖము
నీ నిట్టూర్పులు శోకము చూడగ
నేలను తాకుచు నిలబడియుండగ
దేవత కావని తోచుచున్నది.

శుభలక్షణములు సుందర రూపము
పొందుగ అమరిన అంద చందముల
రాజపుత్రివి రాణివి నీవు
భువి పాలించే విభునకు భార్యవు!

రావణాసురుడు జనస్థానమున
మారురూపమున అపహరించిన
అవనీ సుతవగు సీతామాతవొ
నీకగు శుభము తెలుపుము తల్లీ !

లోకోత్తరమగు సౌందర్యముతో
వనవాసమునకు వచ్చితివీవు
మనసున కలత కలిగియుంటివి
కావున రాముని భార్యవు నీవు''.

ఆంజనేయుని తీయని పలుకుల
రాముని వివరము వినినంతటనే
ఆనందముతో పొంగిన సీత
హనుమంతునితో పలికె తీరుగా

''రాజశ్రేష్ఠులలో ఉత్తముడయిన
శత్రుసైన్యముల తాపము పెంచెడి
దశరథ ధరణీధవునకు కోడల
జనకరాజునకు పుత్రిక నేను.

బుద్ధిశాలి శ్రీరామచంద్రునికి
భార్యను నేను- సీతని పిలతురు
పది రెండేడులు భోగ భాగ్యములు
బడసితి నేను దశరథు నింట.

పది రెండేడులు, గడచిన యంత
దశరథ రాజు-హితులందరితో
ఆలోచించి నిర్ణయించెను
రామచంద్రునికి- పట్టము కట్టగ

సందడి ఎంతో సాగుచుండగా
మంథర మాటలు వినిన కైక-తన
భర్తతొ పలికెను- రాముడు రాజవ
నీరూ తిండీ ముట్టను బ్రతుకను.

రాజచంద్రమా దశరథనాథా!
నీ విచ్చిన ఆ వరములు తీర్చుము
రాముడు వనముల పోవలెను సుమా!
భరతుడు రాజై భువి నేలవలె!

వెనుకటి వరములు తలచి దశరథుడు
మూర్ఛనొందెను అప్రియములు విని
శోకమూర్తియై- రాముని కోరెను
రాజ్యము తిరిగి తనకు యిమ్మని.

రాజ్యభోగమును మించిన ప్రియము
తండ్రి మాటను తలను ధరించుట
సంతోషముతో సమ్మతించెను
కాదనడెవరికి రామచంద్రుడు.

కీర్తిమంతుడు అతి విక్రముడు
రామచంద్రుడు నిరాడంబరుడు
సంతోషముతో రాజ్యము వదలుచు
మాత రక్షణలొ నన్నుండ మనె.

అంతట నేను ఆమోదించక
వన వాసముకే బయలుదేరితిని
రాముని విడచి నాకమునైనా
ఉండను నేనని నుడివితి నపుడు.

మిత్రుల ప్రియుడు సుమిత్ర పుత్రుడు
భాగ్యశాలియగు లక్ష్మణమూర్తి
అన్నకుతోడై బయలుదేరగా
ఘోరారణ్యము చేరితిమంత.

పితృవాక్య పరిపాలనదక్షుని
శ్రీరఘురాముని సతినగునేను
దురాత్ముడగు యీ రావణుచేత
అపహరింపబడి చిక్కితి లంకలొ.

రావణాసురుడు రెండు నెలలుయిక
జీవిత పరిధిని నిర్ణయించెను
కావున నేను రక్కసు చిక్కక
తనువు వదలెదను శాశ్వతముగను.''

॥సుందరమైనది సుందరకాండము॥

# 34. హనుమ శ్రీరామలక్ష్మణులు కుశల వార్త తెలుపుట

వాతాత్మజుడు అంతట పలికెను
సీతామాత దుఃఖము తీర్చగ
ఊరడించెను మృదుభాషణముల
విభుని వివరము తెలిపెను అంత.

''విదేహభూపతి పుత్రికవినుము-
రాముని దూతగ వచ్చి యుంటిని
రాముడు క్షేమము-కుశలమడిగెను
సందేశము-నే కొని తెచ్చితిని.

దశరథ తనయుడు రామచంద్రుడు
వేదశాస్త్రముల కోవిదుడతడు
బ్రహ్మాస్త్రమును తెలిసినవాడు
నీ క్షేమమును అడిగెను అతివా!

తేజోవంతుడు నీ పతికిష్టుడు
అడుగుల వెంబడి నడచునాతడు
లక్ష్మణమూర్తి దుఃఖము నిండి
శిరసును వంచి వందన మనెను.''

పురుష సింహముల కుశలము తెలిసి
ఆనందాంబుధి తేలెను జానకి
''నిండుగ మనిషి నూరేళ్లుంటే
ముదమునందునను, నానుడిగలదు.

పెద్దలు చెప్పిన నానుడి యిపుడు
నిజమయినదిగా వానర శ్రేష్ఠా!''
ఎంతో చనువుగ సందేహించక
సంభాషించిరి కుశలము తెలిసిరి.

కొంత ముందుకు మారుతి జరిగెను
అంత జానకి- రావణుడా విధి
కామరూపుడై వచ్చెనేమొ యని
సందేహముతో నిండిపోయెను.

మారురూపుతో వచ్చిన వానికి
కపిరూపముతొ నున్న అసురునకు
''అరమరికుంచక తెలిపితినంతయు''
దిగులుతొ ఎంతో కుమిలెను సీత.

భయ కంపితయగు సీతను చూచి
మహాబాహుడు హనుమంతుడు అట
వందనమిడగ అటుచూడకనే
దీనస్వరమున పలికెను జానకి.

''పరితాపము నా మది కలిగించిన
మాయ రావణా! మేలు కలుగదు
జన స్థానమున మారు రూపున
వచ్చిన దశకంఠుడవే నీవు!

కపి రూపమున నున్న రావణా-
కృశించిపోయిన నను బాధించకు
నీ కది తగదు-అయినా నిన్ను
చూడగ నీపై కలిగె ఆదరము.

రాముని దూతవు నీవై- యున్నచొ
శుభములు మేలు కలుగును నీకు
వానర శ్రేష్ఠా శ్రీరఘురాముని
గుణగణములు నే వినకోరితిని.

స్వప్నమునందు రాముని దూతను
చూచిన నాకు శాంతిగ నున్నది
శ్రీరఘురాముడు లక్ష్మణు కూడి
స్వప్నము నైనా దర్శనమిడునని.

ఎంతో ఆశతో ఎదురు చూచితిని
ఆ స్వప్నముకే కోపమో ఏమో?
నాకది రాదు - శాంతి కలుగదు
నేటికి కొంత శాంతి కలిగెను.

కలకాదని నామనసు చెప్పెను
మతిలేకిటుల తోచెనొ ఏమో
లేనిది కలదను నా భ్రాంతి యది
ఎండ మావుల తీరుగనున్నది.

ఇది ఉన్మాదము ఎంతయు కాదు
నా ఉనికిని-నే తెలియు చుంటిని
కంటి ముందర వానరు డుండెను
చక్కగ నాకు కనబడు చుండెను.''

ఎన్నో రీతుల తరచి తరచి మది
నిర్ణయించుకొనె రావణుడే యని
కామ రూపమున వచ్చె ననుకొని
మారు పలుకక మిన్నకుండెను.

అనిల కుమారుడు అంతయు చూచి
సీతామాత మనసు తెలుసుకొని
మధురములైన పలుకుల-రాముని-
మంగళమూర్తిని కీర్తన చేసెను.

''రవితో చాలిన తేజముగలిగి
చంద్రుని మించిన మోహనరూపుడు
ధనపతి యంతటి సిరిగలవాడు
రాజులందున రారాజతడు.

కీర్తిమంతుడు రామచంద్రుడు
విష్ణుమూర్తివలె విక్రముడతడు
సత్యసంధుడు సుందరరూపుడు
మధురభాషణల బృహస్పతియగు.

రూపుదిద్దిన మన్మథుడతడు
మహారథులలో శ్రేష్ఠుడు రాముడు
సమయము మించి కోపమురాదు
వచ్చిన కోపము వ్యర్థము కాదు.

అంతటి రాముడు మాయలేడికై
ఆశ్రమమును తా విడచినంతనే
అపహరించిన రావణాసురుడు
ఫలితము పొందును నీ ముందరనే.

అతి విక్రముడు శ్రీరఘురాముడు
క్రోధము నిండిన ప్రచండమూర్తి
శీఘ్రముగా తన అగ్ని శరముల
కాల్చివేయును పంక్తికంధరుని.

రఘుపతి రాముడు నీపతిదేవుడు
నను దూతగ యిట పంపెను తల్లీ!
నీదు క్షేమమును అడిగెను మాతా!
లక్ష్మణమూర్తి వందనమనెను.

కపులకు ఱేడు మా సుగ్రీవుడు
కిష్కింధేలును రాముని చలవతొ
అతడు అడిగెను నీ కుశలమును
అందరమాశతో బ్రతుకుచుంటిమి.

మనసగు రాముని - జీవితేశ్వరుని
మహాబలుడు ఆ లక్ష్మణమూర్తిని
వానరపతి సుగ్రీవుని నీవు
బల సంపన్నుల శీఘ్రమె చూతువు.

లక్ష్మణసహితుడు రామచంద్రుడు
సుగ్రీవునితో కూడినవాడు
నిరతము నిన్నే స్మరణచేయును-
చూచితి నిన్ను పెన్నిధి వోలె.

సుగ్రీవునికి సచివుడ నేను
హనుమంతుడ- నను నమ్ముము-కపిని
వారిధి దాటి లంక జొచ్చితి
రావణుతలపై పాదము మోపితి

సందేహించకు జానకిమాతా!
నేనా రావణుడను కానుసుమా!
మాయలునేర్చిన వాడనుకాను
రాముని బంటును- దూతను.'

॥సుందరమైనది సుందరకాండము॥

✼✼✼

# 35. హనుమ చేసిన శ్రీరామ కీర్తన

అవనిజ పలికెను అతి మధురముగ
''తెలుపుము విభుని వివరము హనుమ!
సోదరు లిరువురి రూపుల తెలుపుము
నరులకు కపులకు నెయ్యము ఏ విధి?''

తేజమునందు రవితో తూగును
ఓర్పున కాతడు పుడమి దేవత
బుద్ధికి రాముడు బృహస్పతియగు
కీర్తియందున సురపతి సముడు

వాతాత్మజుడు ఆంజనేయుడు
పలికెను సీతతొ కడు వినయముగా
''సందేహముతో అడిగిన గానీ
రాముని పొగడగ భాగ్యము కలిగెను.

స్వజన రక్షణ- జీవుల బ్రోచుట
క్షత్రియధర్మము పరిపాలించుట
కర్మాచరణము లెరిగియుండుట
పూజల కర్హుడు పెద్దలచేత.

జనక నందినీ! విను పలికెదను
సర్వాంగముల సుందరమూర్తి
కమలమువంటి కన్నులవాడు
దయదాక్షిణ్యము కలిగినవాడు.

ఉత్తమశీలుడు రిపు భయంకరుడు
సాధు సేవలో సద్గుణుడతడు
యజుర్వేదము చక్కగ తెలిసెను
మిగిలిన వేదములన్నీ ఎరుగును.

ఆజానుబాహుడు అతి సుందరుడు
అరవిందాక్షుడు మోహనరూపుడు
పూజనీయుడు పుణ్యపురుషుడు
పుడమికి దిగిన దేవుడు రాముడు.

శంఖము వంటి కంఠము గలదు
నడకల సింహపు పోలిక కలదు
సమమగు రూపము సుందరమైనది
శ్యామల వర్ణము సమ్మోహనము.

అంగుష్ఠ మూలము అరచేతులలో
నుదుటను పాదములందు ప్రభువుకు
నాలుగురేఖలు తీరుగనుండి
నాలుగుమూరల పొడవతడుండును.

ముఖము, కన్నులు, జిహ్వా, పెదవులు
నఖములు-పదములు-హస్తములవ్వి
పద్మములన్న తీరుగనుండును.
గమనము గజము-వృషభము పోలును.

సత్యసంధుడు ధర్మమునేలును
అతి శ్రీమంతుడు దానశోభితుడు
దేశకాలముల పాత్రము లెరిగి
ప్రియముగ భాషణ చేసెడివాడు.

అలకలు అల్లన ఆడెడి నుదురు
కన్నులు బంగరు కమలములేయవి
కన్నులు చాలవు రాముని చూడగ
ఎన్నగ లేము సద్గుణములను.

చక్కని నాసిక కేశములందము
కనుకొలకులవి వెలుగును ఎఱ్ఱగ
కర్ణము లున్నవి కడు సుందరములు
నీ పతి దేవుడు సుందరరాముడు.

దివ్యపాయస భాగమె తమ్ముడు-
సుమిత్రసుతుడు- అన్నకు తోడగు
లక్ష్మణమూర్తి- అన్నిటి యందు
అన్నకు సరిపడు సుందరమూర్తి.

పురుష పుంగవులు సోదరు లిరువురు
నిన్ను వెదకుచు బయలుదేరిరి
భూమినంతయు తిరుగుచు వారు
మమ్ముకలిసిరి మా భాగ్యముచే.

వాలి తమ్ముడగు సుగ్రీవుని ఎడ
భక్తి ప్రపత్తులు కలిగియుందుము
సోదరుచేత తరిమివేయబడి
సుగ్రీవుడు కడు దుఃఖము నుండెను.

నార చీరలు ధనసులు కలిగి
రమ్యమైనా ఆ ఋష్యమూకము
వచ్చిన సోదరులిద్దరి గాంచి
భయపడి శిఖరమునెక్కెను అపుడు.

నను పంపెను సుగ్రీవుడంతట
విషయము తెలిసి వివరించుటకు
సుందరమగు ఆ శుభలక్షణుల
చూచితి- చేతులు జోడించితిని.

నన్నెరిగిన నా దేవుడు రాముని
నా గుండెయలో కొలువగు రాముని
తమ్ముని తోడ భుజముల నిడుకొని
తెచ్చితి సుగ్రీవుని సన్నిధికి.

సుగ్రీవునితో ముచ్చటలాడిరి
ముచ్చటగా అట స్నేహము నెఱపిరి
నర నాయకుడు- వానర రాజు
తెలిసిరి తమ తమ వివరము లంత.

అన్న వాలిచే యిడుములలో బడి
అడవుల బట్టిన సుగ్రీవుని గని
ఊరడించెను రామచంద్రుడు
తమ్ముడు తెలిపెను సోదరు దుఃఖము.

జరిగినదంతా తిరిగెను మదిలో
రాముని తేజము సన్నగిల్లెను
రాహువు మ్రింగిన రవి వలె ఆయెను.
రమణీ వినుమా రామకథ!

అంతట కపులు కొందరు వచ్చి
ఆభరణమ్ములు నువు విసరినవి
ఆనందముతో చూపిరి వారు
నీ ఉనికిని వారెరుగరు అసలు.

రాముడు సొమ్ముల చూచినంతనే
మూర్ఛిల్లెను- మది నిన్ను తలచుకొని
సొమ్ముల నేను భద్రము చేసితి
రాముని దుఃఖము ఇనుమడించెను.

రాముని మేము ఊరడించితిమి
సుగ్రీవుడు ఆ నగలను దాచెను
నీకై పరితాపముతో రాముడు
అగ్నిపర్వతమువలె నున్నాడు.

కన్నుల నిద్దుర ఎరుగడు రాముడు
చింతతొ ఎంతో కుమిలిపోవుచు
భూ కంపముచే కదలిన - నగమై
మది పరితాపము నిండియుండెను.

మనసగు వనములు కాంతారములు
సుందర స్థలముల విహరించినను
సుందరి! నీవు లేని కారణము
ఆనందించడు రామచంద్రుడు.

రామసుగ్రీవులు శపథము లందిరి
కిష్కింధకు శ్రీరాముడు వచ్చెను
వాలిని కూల్చెను రాజ్యము నిచ్చెను
కిష్కింధేలగ చల్లగ చూచెను.

నినువెదకించగ శపథము చేసిన
సుగ్రీవుడు తన వారల పంపెను
రాముడు లంకకు వేగమె వచ్చును
రావణు చంపి నీ వ్యథ తీర్చును.

పర్వతరాజుల పోలిన కపులు
రాజు పంపగా పది దిక్కులలో
వెదకుచు భూమిని తిరుగుచుండిరి
వినుమా మధురము రామకథ.

వాలిపుత్రుడు అంగదుడుండెను
వింధ్య నగములో చిక్కడిపోయి
దిక్కు తెలియక దుఃఖమునిండి
అహోరాత్రములు గడిపితి మచట.

మా రాజిడిన గడువు తీరినది
మా ప్రాణములు నిలచుట కష్టము
అందుకు మేము సిద్ధ పడితిమి
మాకై మేమే మరణించుటకు.

కొండల కోనల నీ జాడరయక
ప్రాణత్యాగము చేయదలచుకొన
మా నాయకుడు అంగదుడెంతో
దుఃఖము నిండి పరితపించెను.

నీవా కన్నుల కనబడవైతివి!
తండ్రి వాలియా మరణించెను కద!
జటాయువేమో కూలెను ముందే
ప్రాణత్యాగము తప్పదొ ఏమో!

సంపాతనెడు పులుగు శ్రేష్ఠుడు
చూపెను లంక- తన సోదరుడగు
జటాయుమరణము విని దుఃఖించెను
రావణుపైన ఆగ్రహమందెను.

సంపాతిడిన ఆశతొ మేము
సంద్రపు తీరము చేరితి మంత
అంత సముద్రము దాటుట ఎట్లో-
చింతలొ మునిగిరి మా కపులందరు.

అంతట నేను ధైర్యము గొలిపి
రాముని తలచి లంఘించితిని
నూరు యోజనములున్న వారిధి
సులువుగ దాటి చేరితి లంక.

రక్కసిమయమగు లంకాపురము
రాత్రివేళలో చేరియుంటిని
దుఃఖము నిండిన నిన్ను చూచితి
రావణుగాంచితి సర్వము తెలిసితి.

విశదముగా-నే వివరించితిని
రామదూత- సుగ్రీవు సచివుడ
రాముడు క్షేమము-కుశలము తమ్ముడు
నేనొక్కడనే లంకచేరితి.

నిను గనలేక వానర సైన్యము
దుఃఖము నిండి తిరుగు చుండిరి
నీ ఉనికిని- నే- వారందరికి
తెలియ బరచెదను సంతోషముతో.

నినుగాంచుట నా భాగ్యవశము గద
నాకే దక్కెనుఆ ఘనకీర్తి -
నా శ్రమఫలితము వ్యర్థము కాదు
వినుమా మధురమురామకథ!

మాల్యవంతమను నగ మొకటున్నది
నగము లన్నిట ఉత్తమమైనది
కేసరి యను నొక వానర శ్రేష్ఠుడు
నగము విడచి గోకర్ణమేగెను.

నా జనకుడు - ఆ కేసరి వీరుడు
దేవ ఋషులు వారానతివ్వగా
సాగర తీర తీర్థము నందు
శంబసాదమని- అసురుని చంపెను.

మైథిలి వినుము! కేసరి భార్యకు
పవనుని వరమున జన్మించితిని
నే చేసిన పని గుఱుతు ఉండగా
హనుమంతునిగా ఖ్యాతిగాంచితి.

నాపై నీకు గురి కుదురుటకు
నీపతి గుణముల గానము చేసితి
శీఘ్రమె రాముడు రాగలడమ్మా
దుఃఖము నీకు - తొలగును తల్లీ''!

వాయునందనుని పలుకులు వినిన
జానకి నమ్మెను రామదూతయని
సంతోషముతో పొంగిపోయెను
ఆనందాశ్రులు కన్నుల నిండెను.

''తల్లీ తెలిపితి సర్వము నీకు
ఊరట పొందుమునీవింతటితో -
కాగల కార్యము తెలుపుము నాకు
రాముని చెంతకు శీఘ్రమెపోవలె.

జనకరాజసుత - జనని జానకీ
అతి బలవంతుడ వాయుపుత్రుడ
తండ్రి పవనునికి తగినవాడను
వానరుడనుచును సందేహించకు.''

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 3 6 అంగుళీయక ప్రదానము

''అమ్మా సీతా! నమ్ముము నన్ను
రామచంద్రుని దూతను నేను
ప్రభువు పంపినఉంగర మిదిగో
రాఘవు నామము చూడుము తల్లీ!

నీకు శుభమగు ఊరడిల్లుము''
అని వినయముగా మారుతి పలుక
ఉంగర మందుకు చూచిన జానకి
కన్నులు నిండెను - విభుని రూపుతో.

కమల లోచన కనులు మెరసెను
సిగ్గు వలువతో మేను కప్పుకొనె
మారుతి నెంతో పొగిడెను జానకి
ధీరుడ నీవు బుద్ధిశాలి వని.

''శత యోజనముల వారిధి దాటిన
నీదు విక్రమము ఎన్నగలేము
గోవు పాదమును వేసిన రీతి
అవలీలగ నువు దాటితి వయ్యా!

వానర శ్రేష్ఠ! సామాన్యుడవా!
రావణుడన్న భయమే లేదుగ
స్వామి పంపడు సర్వము తెలియక
నను వెదకుటకు యింత దూరము.

నా భాగ్యమిది సోదరులిరువురు
కుశలము నుంటయు వినుటయు నేను
శౌర్యము నిండిన రామచంద్రుడు
ఏల దహింపడు యీ భువినంతయు?

నా కొరకెంతో కలత చెందును
రాముడు గెలుచును సురలందరినీ
నా పరితాపము కంతము లేదు
అందుకు వారు ముందుకు రారు.

పురుషోత్తముడు పుణ్యశీలుడు
తాపము నొందక నుండెకదయ్యా!
మనసు దిటవుతో దుఃఖము మరచి
కార్యములన్నీ చక్కగ చేయున?

మంచి మనసుగల రామచంద్రుడు
మిత్రుల ఎడల సామదానములు
శత్రులఎడల భేద దండనల
సమయస్ఫూర్తితొ సంచరించునా!

మిత్రుల చేర్చగ నేర్పరి రాముడు
దేవతలన్న గురి కలవాడు
దైవ బలముచే కార్యములన్నీ
చక్కగ చేయుచు రాముడుండెనా!

నే దూరమయి ఉండుట వలన
నాపై ప్రేమ సన్నగిల్లెనా!
ఓ హనుమంతా! తెలుపుము నీవు
రాముడు నాకీ శోకము తీర్చున!

సుఖముల తేలగ సిరిగలవాడు
దుఃఖములసలే మోయగలేడు
నాకై రాముడు దుఃఖము నిండి
కృంగి కృశించి యుండలేదు కద!

కౌసల్యమ్మ - సుమిత్ర - భరతుల
క్షేమము తరచుగ వినబడుచున్నద!
భక్తితత్పరుడు భరతుడు నాకై
శత్రు భయంకర సేనలు పంపున!

వానర రాజు సుగ్రీవుడు - యోధుల
ఆయుధములతో యిటవచ్చును కద!
శూరుడు లక్ష్మణుడిటకు వచ్చి - తన
అస్త్రశస్త్రముల లంక కూల్చునా!

కోమలమూర్తి ! వికసిత పద్మము
నను గాంచక తను సొగసులుతరిగెన-
అడవికి నేను వెంటనడువగా
రామచంద్రుడు ధైర్యము నుండెను.

నే- దరిలేనిచొ ధైర్యము విడువక
దుఃఖము లేక ఉండెన హనుమా!
తల్లిదండ్రులను మించిన ప్రేమ
నాపై హనుమా! రామచంద్రునకు.''

మృదుమధురముగ సీతపలికి అట
వాయుపుత్రుని పలుకులు వినగ
ఆత్రమునుండగ రామునిదూత
అంజలి తలనిడి పలికె తీరుగా.

''తల్లీ నీ ఉనికెరుగక ప్రభువు
వేచియుండెను - వేగిరపడుచు
వెదకుచు నిచటకు వచ్చితి నేను
వేగమెచేరును రామచంద్రుడు.

మాతా! నేను నీ స్థితి తెలిపిన
వానర సేన భల్లూకములతో
శీఘ్రమె లంకకు రాముడు వచ్చి
రక్కసి మూకల రూపు మాపును.

కోదండముతో రాముడు నిలచిన
మృత్యుదేవత - దేవతలందరు
అసురులెల్లరును అడ్డమువచ్చిన
అంతము చేయును వారందరినీ.

పృథ్వీసుత! నీ ఉనికి తెలియక
హరికి చిక్కిన కరి మాదిరిగ
దుఃఖము నిండి సుఖమదిలేక
కాలము గడుపుచు రాముడుండెను.

రవి తేజముతో వెలిగెడు రాముని
సుందర రాముని అతి సుకుమారుని
చూతువు నీవు ఒట్టు పెట్టితి
సకల గిరులపై - నే తిను ఫలముల.

ఐరావతమున సురపతి రీతిగ
రామచంద్రుడు ప్రస్రవణాద్రిని
చల్లగ దర్శనమిచ్చును జగతికి
నినుదరి చేర్చుకు అతి తొందరలో.

నువుదరి లేక తిన కోరడుగా -
మన్మథ వశుడై నినుధ్యానించును
శ్రద్ధలేదు తన తనువు మీదనే -
తోలడు - దోమల పాములనైనా.

పురుషోత్తముడు రామచంద్రునకు
కంటికి నిదురేరాదు ఎన్నడూ -
అలసిన కన్నులు మూసిన అంత
మధురముగా నిను తలచి తెరచును.

సుందర వనములు సుమసౌరభములు
మధురఫలములు మంగళకరములు
కాంచిన యంతనె - మాతా నిన్నే
తలచుకొనుచును పరితపించును.

రామగానమున మనసుకుదుటపడి
శరత్కాలపు చిరుమేఘముచే
చిక్కిన - చంద్రుని రీతిగ జానకి
చిరు కాంతులతో వెలగినదచట.

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 37. సీతారాములను కలుపుటకై హనుమ ఆత్రుత

పున్నమచంద్రుని పోలిన సీత
హనుమంతునితో పలికె మధురముగ
''నను తలంచుటది అమృతసేచన
ప్రభు పరితాపము విషతుల్యమ్మది.

రామచంద్రుని స్థితి తెలుపగను
సుఖ దుఃఖములు కలిగెను నాకు
విధివ్రాతలను మార్చగ తరమా!
ముగ్గుర మీ విధి యిడుముల నుంటిమి

పయనిడు నావ భగ్నము కాగా
సంద్రము నీదెడి జీవుని మాదిరి
దుఃఖ సముద్రము నంతయు నెపుడు
రాముడు దాటునొ - జీవితేశ్వరుడు.

ఓ హనుమంతా! రావణుడిచ్చిన
గడు వది వొక ఏడన్నది వినుమా!
పదియవ నెలలో పడిపోయినది
విభునికి అంతయు వివరించుమయా!

''రాముని చేర్చుము ఉచితము నీకని''
విభీషణాఖ్యుడు అన్నకు తెలిపెను
హిత వచనమ్ములు వినకున్నాడు
మృత్యుదేవతనె కోరి పిలచెను.

విభీషణాఖ్యుని పెద్దకూతురు
అనలను చిన్నది నాకు తెలిపెను
తల్లి పసుపున తానిట వచ్చి
తండ్రి మాటను వివరించినది.

సూర్యకిరణముల జలము యింకినటు
వీరుడు రాముని అస్త్రశస్త్రముల
రాక్షసమూక మిగలదు యింక
రాముని విక్రమ మెరుగుదు నేను.''

ఎంతో బాధతొ పలికెను జానకి
కన్నుల నీరు పొంగెను మగువకు
అంతట మారుతి - వానర శ్రేష్ఠుడు
అవనిజతోను పలికెను తిరిగి.

''రాముడు వచ్చును కపిసేనలతో
శీఘ్రమె నిన్ను తనదరి చేర్చును
కానీ తల్లీ! నే గొనిపోదును
ఇపుడే నీకీ చెఱ విడిపించెద.

కుదురుగ నీవు నా యీ వీపున
కూర్చొనవమ్మా! సందేహించకు
దశకంఠునితో కలిపి - లంకను
మోయగలను - నా రాముని తలచుకు.

హుతవాహనుడు నాకాధీశుకు
హవ్యము చేర్చిన తీరుగ - నిన్ను
ప్రస్రవణాద్రిని నిలచిన భానుని
రాముని చేర్చెద మరు నిముషములో.

రోహిణి చంద్రుని చేరినరీతి
రాముని చేరుము - కూర్చొను తల్లీ!
సూర్య చంద్రులను పలుకరించునటు
నభోమండలము నా ప్రయాణము.

ఆకసమంటి నే పయనించగ
ఆప శక్యమా ఎవరికి నైనా!
సందేహించకు- వచ్చిన త్రోవనె
తిన్నగ సాగరమంతా దాటెద.''

ఎంతో సంతోషించెను సీత
ఆనందముతో పొంగి హనుమతో
''నను గొనిపోయెడి నీ ఆలోచన
కపి యోచన అనిపించును హనుమా!

సూక్ష్మరూపము - కపివగు నీవు
నను మోయుచు ఎటు వారిధి దాటుట?'
అంతట మారుతి - మాత సంశయము
తీర్చగ -మనసున యోచన చేసి.

భీమ రూపమును చూపగ తలచి
కామ రూపుడైపెంచె శరీరము
మందర నగము - మేరు పర్వతము
తీరుగ భాసిలె ఆంజనేయుడు.

మండెడి నిప్పుల కాంతుల వెలిగెను
ఎఱ్ఱని ముఖము వజ్ర దంతములు
దృఢమగు నఖములు పర్వత కాయము
భయము గొలుపునటు పలికె సీతతో.

''తల్లీ! నే నీ లంకా పురమును
గిరుల-తరులతో భవనమ్ములతో
ప్రాకారమ్ముల- రావణు కలిపి
పెల్లగించుకొని కొనిపోగలను.

సందేహించకు రాముని చేర్చెద''
అని పలుకగను జానకి అంత
వాయుపుత్రుని ఆంజనేయుని
భీకర రూపుని వినుమని పలికె.

''ఓ హనుమంతా! తెలిసితి నిన్ను
వాయు దేవుని గమనము నీది
హుత వాహనుని తేజము గలదు
నీదు బలము - నే తెలిసితి నయ్యా.

అతి భీకరమగు శతయోజనముల
సంద్రము దాటుట తేలికగాదు
గగన మార్గమున నను గొనిపోగల
శక్తిమంతుడవు నిజముగ నమ్మితి.

పురుషోత్తముడగు రాముని కార్యము
ఫలవంతమగు యోచన చేయుము
వాయువేగమున నేగు సమయమున
భయపడి నేను మూర్ఛనొందిన.

నీ వేగమునకు ఆగలేకను
సంద్రము నందు జారి పడినను
చప్పున మ్రింగును తిమింగలములు-
భోజన మగుదును జలచరములకు.

నీతో వచ్చుట సరి గాదుసుమా!
రక్కసి మూకల నెదిరి పోరుచు
నీ రక్షణతో నను రక్షించుట
తేలిక కాదు యోచన చేయుము.

యుద్ధము నందు జయము పొందగా
నిండుగ నీవు పోరుచుండగా
నిలువలేక నే జారిపడినచో
రక్కసు లెత్తుకు పోదురు తిరిగి.

విజయము ఓటమి యుద్ధము నందు
నిర్ణయించుట సులభముకాదు
ఓటమి నీకే కలిగినచో- నను
దానవు లెత్తుకు పోయి చంపెదరు.

ఆ విధముగను అసువులుబాసిన
నీ ప్రయత్నము పూర్తిగ చెడును
వారల నీవే గెలిచియుద్ధమున
నను రఘురాముని చేర్చిన యెడల.

రాముని కీర్తికి కళంక మేర్పడు
అటు గాకున్ననుఈ దానవులు
నిన్ను గెలిచినను జాడ తెలియక
బంధించినచో చెడును సర్వము.

అందరి ప్రాణము లున్నవి నాపై-
కావున రాముడు వచ్చుట మేలు
తొందరపడిన కార్యము చెడును
తీరుగ నీవు యోచన చేయుము.

కపికులోత్తమా అనిల కుమారా!
పర పురుషుని - నే తాకను వినుమా-
అపుడు రావణుడు నను తాకెనన-
దిక్కులేక నే నబల నయితిని.

అతి విక్రముడు కోదండముతో
ఇంద్రుని పోలిన పరాక్రమమున
తీరుగ వింటిని త్రిప్పుచు నిలచిన
వాయువు కలసిన అగ్నేయగును.

ప్రళయ కాలమున సూర్యుడాత్తడై
శరపరంపరలు ప్రచండ మూర్తి
సంధించినచో రాముని ఎదుట
నిలచుట తరమా ఎవరికినైన.

కావున నీవు నా రఘురాముని
లక్ష్మణ మూర్తిని వానర యోధుల
తీసుకురమ్ము శోకము తీర్చుము
నా కానందము కలుగ చేయుము''

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 3 8. కాకాసుర వృత్తాంతము–చూడామణి ప్రదానము

అంతట మారుతి పలికె వినయముగ
''తల్లీ నీవు తెలిపిన విషయము
యుక్త మయినది - అంతియె గాక
అవిధి యానము సాధ్యము కానిది

పర పురుషుని నువు తాక ననుటది
పరమ సత్యము ఉచితము కూడ
పురాణ పురుషుని భార్యవు నీవు
తీరుగ నాకు తెలిపితి వమ్మా!

తల్లీ! నీవు రాముని తలచుచు
నిరతము గడపుట శోకించుటయు
ఉరి పోసుకొన సిద్ధపడుటయు
విశద పరచెదను రఘురామునికి.

తల్లీ! నేను రాముని దూతను
రాముని సేవకు అంకితమైతిని
ఆ విషయమునే- తెలుపుట కొరకు
అటుల పలికితిని కారణమదియే!

సంద్రము దాటగ శక్తి కలదని
రాముని చేర్చగ తొందర కలిగి
నీ దుఃఖమును తీర్చుట కొరకై
అటుల పలికితిని కారణ మదియే!

సీతామాతా! రాముని మనసుకు
ఉప శాంతిని - నే కలుగచేయవలె
కావున ఏదో గురుతు తెలుపుము
రామ ప్రభువుకు తెలిపెద నేను''

అంతట అవనిజ ప్రియముగ పలికెను
వానరోత్తముని వినుమని తెలిపెను
''మేలగు గురుతు తెలిపెద వినుము
నా పతి దేవునికే వివరించుము.

సిద్ధాశ్రమమదిచిత్ర కూటమున
గంగవొడ్డున సొంపుగ నున్నది
వివిధ ఫలములు విరుల తరులతో
విహారమునకు సరిపడియున్నది.

కాంతుడు నేను సుందరమయిన
వనమున తిరిగి అలసట చెంది
నా పతి తొడపై నే కూర్చుంటిని
ఆది శేషుడై అతడు తోచెను.

అంతట వాయస మొక్కటి చేరి
ముక్కుతో నను గాయ పరచినది
నే నా కాకిని కొట్టగరాయిని
విసరితి - కానీ కాకి కదలదు.

విభుడు నవ్వుచు శాంత పరచె నను
వాయస మేమో వదల దాయెను
అంతట కాంతుడు నా తొడ తలనిడి
నిదురించెను అట అలసట నిండి.

బలులను మ్రింగెడి వాయస మపుడు
ఉర మధ్యమున పొడిచె ముక్కుతో
తిరిగి తిరిగి ఆ కాకి అచ్చటే
పొడిచె - నెత్తుట రాముడు తడిసె.

మేల్కొని రాముడు రక్తము చూచె
నెత్తుటి గురుతుల వాయసమును గని
ఇంద్ర కుమారుడు అని తెలుసుకొని
కోపము నిండిన చూపులు విసరి.

విసరెను దర్భను అభిమంత్రించి-
బ్రహ్మాస్త్రముతో ప్రాణము పోసి
తరిమెను కాకిని ఎగసిన మంటల
లోకము లన్నీ త్రిప్పెను అస్త్రము.

తండ్రి ఇంద్రుడు తనయుని చూచెను
సురలూ ఋషులూ రక్షణ లేదన
ముల్లోకములు తిరిగిన కాకి
రామ పాదముల శరణనిపడెను

అంతట రఘుపతి - వదలిన అస్త్రము
వ్యర్థము కాదని పలికె కాకితో
తన కుడి కన్నును గొని పొమ్మనుచు
దర్భకు చెప్పగ కాకి వేడెను.

రాముడు అటులే ఆదేశించగ
దుష్టకాకికి కుడి కన్నూడెను-
నా కొఱకంతటి బ్రహాస్త్రమును
హీన కాకిపై వదిలెను విభుడు

ఆ దయ ప్రేమ అనురాగములు
ఏవీ స్వామీ- నను మరచితివా!
బలవంతుడవు శక్తిమంతుడవు
గంభీరమున సాగర సముడవు

ఎందుకు తొందర పడకున్నావు
ముందు నిలువరు నీకెవ్వరును
నీ ఆనతి గొని లక్ష్మణ మూర్తి
నన్నెందుకు తా రక్షణ చేయడు

సమర్థుడైన నా పతి దేవుడు
తను రక్షించడు - తమ్ముని పంపడు
నా దురదృష్టము వదల కున్నది
నాపతి దృష్టిని త్రిప్పదు నాపై

పురుషోత్తముడు రామ చంద్రునికి
పుడమికి దేవుడు రఘు రామునికి
సతినగు నేను తోడు లేకను
ఉంటిని లంకలో అనాథవోలె''

అంతట మారుతి పలికె సీతతో
''తల్లీ నువు యిక చింత వదలుము
పురుష సింహములు నీకైవచ్చి
లంకను భస్మము చేతురు నిజము.

పంక్తి కంధరుని తలలను నరకి
అతని బంధువుల నిర్మూలించి
లంకను జలధిని ముంచివేయును
నిను దరిజేర్చుకు సుఖము లందును.''

తిరిగి జానకి పలికె ప్రియముగ
''లోకపూజ్యుడగు రఘురామునికి
నా దగు వందన మందించుమును
అడుగుము క్షేమము నా మాటగను.

అన్న సుఖములే మిన్న అనుకొని
అన్ని సుఖములు కాలత్రోసి కొని
అన్నకు తోడు వనముకు వచ్చిన
లక్ష్మణమూర్తి ఎంచు మాతగ.

ప్రియ భాషణుడు తేజోవంతుడు
రాముని రక్షణ చేయును అతడు
నాదగు మాటల నీ వాతనిని
క్షేమము అడుగుము అంజనిపుత్రా!

ఓ హనుమంతా! నీదే అంతా
భారము-నన్ను కాంతుని చేర్చగ
తెలుపుము పతితో పలుమారులు నువు
సీత ప్రాణముతొ నెలమనగలదని.

నెల రోజులు అవి తిరిగి నంతనే
సీత బ్రతుకదు సత్యము -నమ్ముము!
పాపాత్ముడు యీ పంక్తి కంధరుని
బారి నుండినను రక్షించమను.''

అటుల పలికిఅట సీతామాత
కొంగున నున్నచూడామణిని
దివ్య కాంతితో వెలిగెడినగను
హనుమకు ఇచ్చెను ఆనవాలుగా-

చూడామణిని కనుల కద్దుకొని
ఆనందముతో నిలచిన మారుతి
మన సెగిరినది ప్రస్రవణాద్రికి
రామపాదముల చెంత నిలచినది.

సీతామాతకు ప్రదక్షిణించి
వినయముతోను వందనముంచి
అందమయిన ఆ చూడామణిని
పొందికగా తను భద్రము చేసి.

వాతాత్మజుడు పలికెను అంత
సెల వొసగుమని తిరిగి పోవగా-
పెను గాలులచే వూగిన నగమై
మనసున్నది అది బయలు దేరుటకు.

॥సుందరమైనది సుందరకాండము॥

❇❇❇

## 39. హనుమ ధైర్యోక్తులు

''ఓ హనుమంతా! చూడామణిని
కాంతుడు చూచిన - నన్ను తలచును
నాతో పాటు నా తలిదండ్రుల
మామను తలచును-మణి నా ప్రాణము'

ముందు కార్యము సఫలము చేయుము
అందు సమర్థుడ వీవేనయ్యా''
అనిన - మారుతి సరియని పలికి
శపథము చేసెను ధైర్యము గొలిపెను.

అనిల కుమారుడు బయలుదేరగా
అవనిజ కన్నులనీరు నిలచెను
గద్గద స్వరమున పలికెను తిరిగి
సోదరులిద్దరి క్షేమమడుగమని.

''వానర శ్రేష్ఠా! కిష్కింధను గల
కపులందరినీ అడిగితిననుము
మహాబాహుడు రఘురాముడు-నను
నీ సాయముతో తన దరిజేర్చును.

నే బ్రతికుండగ ప్రభువే వచ్చి
ఆదరించి-నను చేర్చుకొనమని
నువు చెప్పుము ఓ అంజనిపుత్రా!
నీకు కలుగును ఎంతో పుణ్యము.

తిరిగి తిరిగి నువు ఉత్సాహముతో
చెప్పిన మాటలపౌరుష మొచ్చును
నా సందేశము అందిన పిదప
రామచంద్రుడు నా చెఱ తీర్చును.''

అంతట పలికెను ఆంజనేయుడు
వంచిన శిరసుమోడ్చిన కరముల
''శీఘ్రమె రాముడు కపివీరులతో
భల్లూకములతొ లంకచేరును.

రాముడు నిలబడి పోరగ - అతని
ఎదిరి నిలువగ-సూర్యుడు చాలడు-
అసురులు సురలు ఆ యముడైనా
ఆగలేరు శ్రీ రామబాణముల.''

అంతట సీత వాత్సల్యముతో
పయనము చేసెడి హనుమను చూచి
''నీవిచ్చటనే రహస్యమైన
స్థలమునందు విశ్రాంతి నొందుమా!

రేపటి రోజున పోవచ్చునులే
నీ ఉండుట - నామదికి ఊరట
మనసుకు శాంతి కొంత కలిగినది
మందభాగ్యను పొందితి పెన్నిధి.

తిరిగి నీవు యిట వచ్చుట ఎపుడో?''
అంత వరకు నా ప్రాణములుండున
నీ కొరకై నే నెదురు చూడగా
ఇనుమడించు-నా దుఃఖము యిచట.

వారిధి దాటగ వాయుదేవుడు
నీవూ - ఖగపతి చాలిన వారు
భల్లూకములు వానరసైన్యము
రామలక్ష్మణులు ఎటుల దాటెదరు.?

ధీరుడ నీవు బుద్ధిశాలివి
కార్యసాధనకు తగుదువు నీవే!
యోచన చేసి - నా చెఱ తీరిచి
ఘనకీర్తిని నువు పొందుము హనుమా!

తన బలగముతో తన వారలతో
కోదండముతో రాముడు వచ్చి
రావణు త్రుంచి విజయలక్ష్మితో
నను గొనిపోయిన కీర్తినిలచును.''

అర్థవంతమైయుక్తి యుక్తమగు
హేతు వాదమున నిలబడ గలవగు
అవనిజ పలుకులు వినిన మారుతి
తీరుగ పలికెను కరములు మోడ్చి.

''సుగ్రీవుడు మా కపులకు ఱేడు
అతిబలవంతుడు-భల్లూకములతొ
లెక్కకు చిక్కని ఎన్నిక వీరుల
తప్పక లంకకు వచ్చుట నిజము.

వాయు వేగమున మనో వేగమున
పోగలిగిన మా వానరులందరు
అతి బలవంతులు ఆంజనేయులే -
అడ్డ మెరుగరు నేలను నింగిని.

రాజులు ఎన్నడు మేలగు వారిని
పంపరు శత్రువు స్థావరమునకు
తక్కువ వారిని పంపుదు రెపుడు
అట్టి నేనె - మరి సంద్రము దాటితి.

అందు వీరులు నను మించెదరు.
నాతో సములు- నాకు తగ్గరు
నగములు నిండిన పుడమిని వారు
ప్రదక్షిణించిరి ఎన్నో మారులు.

కావున తల్లీ! పరితపించకు
ఒక్కసారిగా వానరబలగము
వచ్చి చేరెదరు - లంక ముంచెదరు
రామ లక్ష్మణుల నే గొని వచ్చెద.

రవి చంద్రుల వలె సోదరు లిరువురు
వెలుగులు చిమ్ముచు శరములు వదలగ
నిలువదు లంక నమ్ముము తల్లీ!
అయోధ్య చేరెద వతి తొందరలో.

శాంతి నొందుమురోజులు ఎంచుము
రావణాసురుడు - సచివుల పుత్రుల
బంధుల కూడి నాశన మగును
రాముని చేరుట తథ్యము నీవు.''

అటుల పలికి తను పయనము చేయగ
సాగుచు తిరిగిపలికెను హనుమ
''రామ లక్ష్మణులు ధనుసులు పట్టి
శీఘ్రమె లంకకు వత్తురు నమ్ముము.

మంచి రోజుమరి ఎంతో దూరము
లేదు తల్లి-నా మాటలు నమ్ముము!
కోరలు నఖములు పరాక్రమమున
సింహము-పులులు-గజేంద్రులే కపులు.

మేఘములగు ఆ వీరులందరు
రాగల రిచటకు గర్జన చేయుచు
శోకించుట యది అశుభము తల్లీ!
శుభములె నీకిక నమ్ముము నన్ను.

ఎంతో కాలము యిడుము లుండవు
ఓరిమి కొంత కలిగి యుండుము
అగ్ని-వాయువు సములు సోదరులు
వారలకంతా విశదపరచెదను.

॥సుందరమైనది సుందరకాండము॥

❇❇❇

# 40. జానకి సందేశము

జనకరాజసుత జానకి పలికెను
''ఓ, హనుమంతా హాయి పొందితిని
నీ పలుకులవి మొలక పైరునకు
వర్షము మాదిరి ప్రాణము పోసెను

క్రృంగి కృశించి - నా పతికెడమై
ఉన్న నేను - శ్రీరామ పాదములు
తాకెడి ఘడియ రావలె హనుమా!
నీవల జరుగును శుభములు నాకు.

వానరోత్తమా - వాయస గాథను
గురుతుగ నీకు తెలియజేసితి
గుండెల నిండిన శోకము నంతా
మరచితి- నీతో పలికిన క్షణము.

తిలకము చెదరిన నా నుదుటపుడు
మణిశిల అద్దెనునా ప్రాణేశుడు
చూడామణిని దుఃఖ సమయమున
చూతును-కాంతుడు కన్నుల నిలచును.

దివ్యజలముల పుట్టిన దామణి
చూడామణిని పంపితి రామా!
ఇకపై దుఃఖము తీర్చు సాధనము
లేకపోయి నే జీవించుట ఎటు

మరియొక మాసము మది నిను తలచుచు
జీవింతునుయీ రక్కసి బాధల
అటుపై నేనుబ్రతికి యుండుట
నా వశమవ్వదు నా ప్రాణేశ్వర''!

కరుణ నిండిన జానకి పలుకులు
విని-హనుమంతుడు తిరిగి పలికెను
''అమ్మా! వినుము! రాముడు నీవలె
దుఃఖము నిండి సుఖము లెరుగడు.

లక్ష్మణమూర్తి అన్న దుఃఖమును
తాను పొందుచు సేవ చేయును
తల్లీ! నిన్ను చూచుట శుభము
శోకించుటకిది సమయము కాదు.

సీతా మాతా! ఓ కుసుమలతా!
శీఘ్రమె నీవు అయోధ్య నుందువు
రాముని కివ్వగ మరియొక గురుతు
ఉన్నచొ యిమ్ము నే కొనిపోదును''

వాయు నందనా! అందమయిన
నా కేశభూషణము-చూడామణిని
ఇచ్చితి నీకు- గురుతది చాలును
నా నాథునకది నమ్మిక నిచ్చును.''

అంతట హనుమ సాగగ నెంచి
శిరమును వంచి వందన మిడగ
తిరిగి దీనముగ కనుల భాష్పముల
మైథిలి పలికెను వాతాత్మజునితొ

''ఓ హనుమంతా! రామ లక్ష్మణుల
వానర రాజు సుగ్రీవుని- మిగిలిన
కపి వీరులను క్షేమ మడిగినటు
నాదు మాటగా తెలియ బరచుము.

రామచంద్రునికి నా స్థితి తెలిపి
నను రక్షించగ మార్గము తెలుపుము
మార్గము నందు నీకు క్షేమమగు
వాయునందనా వేగమె రమ్ము."

అంతట మారుతి ఆనందముతో
తన పని ఎంతో నెరవేరిన దని
సంతోషముతో - ఎంతో ఎదిగి
ఎగరగ తలచెను ఉత్తరదిశకు.
॥సుందరమైనది సుందరకాండము॥

## 41. అశోకవన విధ్వంసము

సీత పలికిన పలుకుల మారుతి
వినయము నిండగ పలికి - అంతట
రాముని చేరగ బయలు దేరుచు
తనలో తలచెను యీ విధముగను.

"స్వామి కార్యము సుంత మిగిలెను
కావలె నావల శేషము పూర్తి
కలిమి - గర్వము కలిగిన అసురుల
దండించెదను సరిచేసెదను.

అసురుల బలము నే తెలుసుకొని
నాబల మిది యని వారికి తెలిపి
కిష్కింధేగిన కార్యము సఫలము
అందుకు యుద్ధము చేసెద నిచట.

పంక్తికంధరుని సేనల బలము
సచివు లందరి మదిలో ఊహలు
నే తెలుసుకొని మరలి పోదును
అశోకవనమున కార్యారంభము.

సామ దానములు భేదము కుదరవు
దండోపాయమె తగిన దిచ్చట
చేసిన పనిని భగ్నము చేయక
ఎక్కువ పనులను చేయుట ఘనత

నందన వనమీ అశోకవనము
వివిధ తరులతో లతా శోభితము
ధ్వంసము చేసెద సుందర వనమును
అగ్ని దేవుడు అడవి కాల్చినటు.

అసురభూపతి ఆగ్రహ మంది
అంతులేని తన సేనల పంపును
గజములు తురగము లాయుధ ధారుల
వీరులతో నే పోరగ వచ్చును.

నా శౌర్యముతో వారల చెండి
కిష్కింధకు - నే పోదును నేరుగ"
అని తలపోసెను అనిలాత్మజుడు
వాయుదేవుడై విజృంభించెను.

వృక్షము లెన్నో కూల్చివేసెను-
పక్షులు తరువులు పూతీవలతో
నిండిన ఆ వనమంతయు-మారుతి
పాడొనరించెను-శోభలు చెరిపెను.

జలాశయముల తీరులు మారెను-
నగ శిఖరములు నేల కొరిగెను-
లతా గృహములు చెదరి పోయెను-
చిత్ర శాలలు చెరిగి పోయెను.

శిలా గృహములు బ్రద్దలు చేసెను-
గృహములన్నియు నేల పరుండెను-
క్ర్రూర మృగములు పెనుసర్పములు
హద్దులు లేక స్వేచ్ఛ నొందినవి.

కూలిన ప్రాకారమ్ముల గోడలు
నేల రాలిన తరువుల శాఖలు
ఆ వన శోభ తరిగి పోయెను
అల్లకల్లోలము ఆవన మాయెను.

పూతీవలతో పూల సొగసులతొ
లతాకుంజముల శోభల వెలుగుచు
నయనా నందము-హృద్యంగమమగు
సుందర వనమును దుమ్ము చేసెను.

అశోకవనము ధ్వంసము చేసి
రావణు సేనతొ పోరగతలచి
తేజోవంతుడు అట హనుమంతుడు
వన ద్వారమున ఎదురు చూచెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❉❉❉

## 42. మారుతి జయఘోష

లంకలొ రక్కసు లందరు లేచిరి
మృగముల,పులుగుల, ఆక్రందనలు
దిక్కులు తెలియక పరుగిడు ప్రాణులు
భయముతొ నిండెను ఆ వనమంతయు.

''రాక్షస మాయలు నే నెరుగను కద
రాక్షసుడేమొ అనుకొను చుంటిని
పాముజాడ మరి పాముకు తెలియును
రక్కసి మాయలు మీకే తెలియును.''

నిద్ర లేచిరి వికృత రూపులు
గుండెలు పగిలెను వనము చూడగ
అతి బలశాలి మహాకాయుడై
మహాబాహుడు దర్శన మిడెను.

సీత పలుకుల రక్కసి వనితలు
భయభ్రాంతలై - పరుగిడి రటునిటు
కొందరు పోయిరి - రాజుకు తెలుపగ
మిగిలిన కొందరు ధైర్యము నుండిరి

పర్వతకాయుడు భయంకరుడగు
ఆంజనేయుని అందరు చూచిరి
సీతను అడిగిరి వివరము లేమని
ఎక్కడి వాడు? ఏమి నుడివె నని?

''రాక్షసరాజా! వినుము ఏలికా!
పెద్ద శరీరము- భయంకరమది
హద్దు లేని అతి విక్రముడతడు
వానరు డొకడు సీతతొ పలికెను.

''నీతో వాడు పలికిన పలుకులు
మాతో చెప్పుము సుందర నయనా!
భయ పడవలదు విషయము తెలుపుము'
అనిన-వారితొ జానకి పలికెను.

సురపతి దూతయొ - ధనపతి దూతో
లేదారాముడు నమ్మిన బంటో-
సీతను వెదకుచు వచ్చియుండును
వివరము తెలుపదు ఎంత అడిగినా.

ఆ వనమందు ఆ కపి రూపుడు
ధ్వంసము చేయని స్థలమది లేదు
సీత ఆశ్రయము శింశుపతరువు
దరికి చేరనిచె - చెదరలేదు అది.

అపురూపము అగు అశోకవనమును
రూపుమాపిన ఆ కపి రూపును
సీతతొ పలికిన ఆ వానరమును
దండించెదము ఆనతి నిమ్ము!

రాక్షసరాజు ఉగ్రుడయ్యెను,
కన్నులు మండెను అగ్ని గుండమై
జ్యోతుల వెంబడి రాలెనువేడి
భాష్పము లవ్విగుండెల పొంగి.

తనతో సమమగు శూరుల నెంచి
ఎనుబది వేల సంఖ్యలొ నున్న
కింకరు లనెడి రాక్షసులను
ఆ కపిని తెమ్మని పంపె రావణుడు.

పెద్ద కడుపులు కోరలు కలిగి
భీకర రూపులు రక్కసు లందరు
ఆయుధములతో అతి వేగముతో
అరపుల చేరిరి ఆనతి మేరకు.

యుద్ధము చేయగ సిద్ధము నున్న
హనుమంతునిపై - మిడతలు పోయి
అగ్నిని పడునటు పడగ - వారిని
ఆంజనేయుడు ఎదిరిపోరెను.

వానరోత్తముని వారందరును
ఆయుధములతో కొట్టిరి కసిగా
సూటిగ నాటగ శరములు ఎన్నో
శక్తి మీరగా వేసిరి వారు.

అంతట మారుతి పెద్దగ ఎదిగెను
నగమని పించెను నిలచి అరచెను
భుజములు తట్టెను లంక హడలెను
పక్షులు రాలెను నింగిని వదలి.

## (జయమంత్రము)

''జయము రామునకు - అతి బలశాలికి
జయము విజయము లక్ష్మణ మూర్తికి
రాముని ఆనతి మేర నడచు - మా
సుగ్రీవునికీ జయము కలుగును.

శ్రమ నే నెరుగను ఘన కార్యముల
కోసలభూపతి రాముని దాసుడ
వాయుపుత్రుడ శత్రుల కాలుడ
నే హనుమంతుడ పీచమడంచెద.

శిలలు తరువులే ఆయుధమ్ములై
వేయిరీతుల యుద్ధము చేతును
రామ బంటును! దాసుడ నేను
కార్యసిద్ధికి మారు పేరును.

నాముందరమీ రావణు లెందరు
వేయిమందినా సమముకారుగా
లంకను కూల్చిరావణు త్రుంచి
రామపత్నికివందన మిడెదను.''

గుండెలు పగిలెను ఆ కింకరులకు
ఆంజనేయుని అరపులు వినగ -
ఘనమగు సంధ్యా మేఘము మాదిరి
రక్తవర్ణుడై మారుతి నిలచెను.

ప్రభువు ఆనతి పాలించగను
భయము నిండినా తప్పదు కనుక
దూరము నుండే ఆయుధములను
వారందరును విసరిరి అంత.

అతిబలవంతుడు అట హనుమంతుడు
ద్వారమునున్న యినుపపరిఘతో
ఖగపతి - పాముల పీచమడచినటు
రాక్షసులను అట చావమోదెను.

కింకర వీరుల చంపి మారుతి
తీరక యుద్ధము చేయుకోరిక
తిరిగి చేరెను తోరణమునకు
పారిపోయిరి మిగిలిన అసురులు.

పారిపోయిన కింకరులంతట
రాక్షసజేనికి ఎరుకపరచిరి
కింకరవీరులు చంపబడుటయు
మారుతి తిరిగి కవ్వించుటయు.

వార్తను వినిన రాక్షస రాజు
పండ్లు పటపట కొరికె క్రోధమున
జంబుమాలిని - వీరుని రమ్మని
పోరగ పొమ్మనె వానరుపైకి.

॥సుందరమైనది సుందరకాండము॥

❋❋❋

## 43. చైత్య ప్రాసాద నాశము- భవన పాలకుల వధ

కింకర రక్కసు లందర చంపి
మదిలో మారుతి తలచెను అంత
''వనమును నేను ధ్వంసము చేసితి
భవనము మాత్రము ఏల వదలుట.''

భవనము నెక్కి నిలచె మారుతి
భానుని మాదిరి వెలుగులు చిమ్మెను
పెద్దగ అరచి భుజములు చరచెను
చచ్చెను పులుగులు నేలరాలెను.

మూర్ఛపోయిరా కావలివారు
లంకలొ వారికి వినబడు నట్టుల
గట్టిగ అరచెను రామ విజయమని
కోసలరాజుకు దాసుడ నేనని.

ఈటెల కత్తులు ఆయుధములతో
నూర్గురు యోధులు తలపడి రంత
శరములు వేసిరి చుట్టు ముట్టిరి
గంగానదిలో సుడిగాలి వలె.

పవనతనయుడు అతి బలశాలి
బంగరు స్థంభము నూడపెరికి- అట
త్రిప్పగ వేగమె- అగ్ని జనించెను
ఆహుతి చేసెను భవనము నంతయు.

అంతట మారుతి నూరు మందిని
అంతము చేసెను అతి సులువుగను
పలికెను తిరిగి భీకరముగను
మబ్బుల మారుతి గొంతు పలికెను.

''నాతో సములు వేల వానరులు
సీతను వెదకుచు నేలను నిండిరి
సుగ్రీవుడు వారందర పంపెను
యోధులు వారుఆగరు మీరు.

వాయువు తోటి సరిపడు వీరులు
వేయి ఏనుగుల బలమగువారు
అతి బలవంతులు లక్షలు కోట్లు
మా సుగ్రీవుని కొలువున నుందురు.

ఆ సుగ్రీవుడు - వారందరితో
నాశము చేయగమీపై కొచ్చును
పురుషోత్తముఁడు - రాముని తోనా
వైరము మీకు రాక్షసులారా!

మీ రాజుండడు - మీ రసలుండరు
ఉండదు లంక జంకుట ఎరుగము
జీవిత సమరము పూర్తగు మీకు''!
అని హనుమంతుడు హెచ్చరించెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❃❃❃

# 44. జంబుమాలి వధ

మంత్రి ప్రహస్తుని తనయు డాతడు
జంబుమాలి అతి విక్రమశాలి
పెద్ద దేహము చెవి కుండలములు
వేగవంతు డుత్సాహవంతుడు.

ఎఱ్ఱని వలువలు ఎఱ్ఱని మాలలు
పర్వతమంత వున్నాడతడు
ఇంద్రచాపము పోలిన ధనుసు
నారి ధ్వనించెను నాల్గు దిక్కులా.

ఖరము లాతని రథము లాగగా
తూరుపు కొండకు భానునిరీతి
దానవ వీరుడు క్రోధము నిండి
రావణు వనుపున వచ్చె రణముకు.

గట్టిగ అరచెను ఆంజనేయుడు
శరములు వేసెను ఆ రాక్షసుడు
పది బాణములు బాహువు లందు
కర్ణిబాణము - తలపై వేసెను

ముఖమున వేసిన బాణము వున్నది
అర్ధ చంద్రుని రూపము కలిగి
శరములు తగిలిన ఆంజనేయుడు
ఎఱ్ఱని కమలము అనిపించెనట.

అంతట మారుతి పెద్దబండను
విసురుగ విసరెను అసురిని పైకి
పది బాణములతొ- రాతిని- అసురుడు
ముక్కలు చేసి ఎదిరి నిలచెను.

మారుతి కోపము ఎగసిపోయెను
మద్ది తరువు నొక దానిని పెరకి
గిర గిర త్రిప్పి విసరి వేయగా
నాల్గు బాణముల అసురుడు త్రుంచెను.

జంబుమాలి తన శర విన్యాసము
హనుమంతునిపై చూపుచు నపుడు
భుజమున అయిదు ఱొమ్మున నొకటి
పదిబాణములు ఱొమ్ముల నడుమ.

విసురుగ వేసి గాయపరచగా
కోపము పెరిగెను వాతాత్మజునకు
ఇనుపపరిఘ నొక దానిని త్రిప్పి
ఢొమ్మున విసరెను జంబుమాలిపై.

పరిఘ పాటుతో జంబుమాలి- తల
కాళ్లూ చేతులు చెదిరి పోయెను
ఖరములు - రథము - బాణము లన్నీ
పిండైపోయి అసురుడు మడసెను.

వీరుడు- కాకలు తీరినవాడు
జంబుమాలి అటు మరణించుట విని
క్రోధమునిండి అగ్ని పర్వతము
తీరుగ రావణుడుడికి పోయెను.

వానరమెంతో బల వంతుడట
వానిని వేగమె పట్టుకు రండని
మంత్రి సుతులకు ఆనతిచ్చెను
అసురభూపతి గంభీరముగా
||సుందరమైనది సుందరకాండము||

✲✲✲

# 45. మంత్రి సుతుల మరణము

అస్త్ర శస్త్రముల యోధులు వారు
రవి తేజముతో వెలిగెడివారు
రావణు నానతి తలను ధరించి
ఉత్సాహముతో వెడలిరి పోరుకు.

మేలగు అశ్వము లున్న రథములు
బంగరు పనులతొ తీర్చిన తేరులు
ధ్వజములతో విలసిల్లు పతాకలు
విలువగు బంగరు ఆభరణమ్ములు.

మంత్రి సుతులు వారేడుగురుండిరి
మేలిమిబంగరు ధనుసులు చేకొని
మెరుపులు నిండిన మేఘము లన్నటు
ఉరుకుల పరుగుల చేరిరి ద్వారము

కింకరు లందరు మన్నున కలిసిరి
వానరుడేమో అతి విక్రముడు
వీరందరి గతి ఏమగునో యని
తల్లులు- తమ వారందరు వగచిరి.

మంత్రిసుతులు తమ చతురత చూపి
శరవర్షము కురిపించిరి అంతట
వర్షధారలతో వొప్పు నగము వలె
భాసిలె మారుతి యుద్ధము నందు.

శరముల గురి తా తప్పుకొనుచును
విచ్చలవిడిగా ఆకసమంతా
తిరుగుచు వాతాత్మజు డంతటను
అరచెను, సేనల గుండెలవిసెను.

అర చేతులతో చరిచె కొందరిని
పిడికిలి పట్టి పొడిచె కొందరిని
గోళ్ళతొ చీల్చెను మరి కొందరిని
అరుపుకు కొందరు నేల కరచిరి.

ఢొమ్ము పోటుతో కొందరు మడసిరి
తొడల మధ్యన నలిగిపోయిరి.
మంత్రిసుతులు వారందరు చావగ
మిగిలిన అసురులు పారిపోయిరి.

ధ్వజములు- ఛత్రము లన్నీ విరిగెను
ఏనుగు లరచెను అతి భీకరముగ
కూలిన అశ్వములున్నవి ఎన్నో
రక్తపు టేరది పారెను అచట.

రక్కసులందర నేలనురాసి
వీరుడు మారుతి తిరిగి చూచెను
యుద్ధము చేయుట కింకెవరైనా
రావణు పనుపున రాగల రనుకొని.

॥సుందరమైనది సుందరకాండము॥

# 46. పంచసేనా నాయక పంచత్వము

మంత్రి సుతులు వారందరు యోధులు
ఆవిధి మడయుట కచ్చెరు వంది
మదిలో దిగులు కనబడ నీయక
మరియొక యోచన చేసెను రాజు

సేనాపతులు అతి బలశాలులు
యుద్ధ నీతిలో ఆరి తేరిరి
దుర్ధర - ప్రఘస - భాస కర్ణుడు
విరూ పాక్షుడు - యూపాక్షుడును

లెక్కకు అయిదుగురుండిరి వారు
లెక్కలేని పరాక్రమ వంతులు
వేగమునందు వాయువు సములు
వారల గాంచి రావణు డనెను

''సేనా నాయకు లందరు మీరు
సేవా భాగ్యము లందితి నేను
సురలను నాగుల గెలిచితి నాడు-
ఋషులు - యక్షులు ఓడిరి నాకు

పగతో నిండిన వారందరును
తిరిగి గెలువగ అదనుకు వేచి
పంపిరి ఏమో? ఈ కపి వీరుని
లేదా ఇంద్రుని పనుపున వచ్చెనొ?

ఆ కపి చేసిన పనులు చూడుడు!
వాడొక కోతిగ తోచదు నాకు
అతి బలవంతుడు కపి కాదేమో?
మహా భూతమే కపిగా వచ్చెనొ!

అతి బలశాలులు- కపు లెందరినో
వాలి సుగ్రీవులు నీలుడు ద్వివిధుడు
మొదలగు వారిని చూచితి నేను
జాంబవంతుడు తెలుసును నాకు

వారికి యింతటి తేజము లేదు
పరాక్రమమున వారిని మించెను
బలము- గమనము- పోకడ వేరు
కపి కాదసలు భూతమె యగును-

యుద్ధము నందు మీకు ఎదురుగా
నిలువగ లేరు సురలు - సురపతి
అసురులు - నరులు ముల్లోకములు
వచ్చిన గెలువరు మీతో పోరి

గొప్ప నేర్పుతో ఆ కపి వీరుని
తప్పక మీరు ఎదిరి పోరుడు
గెలుపు - ఓటమి చెప్పగ లేము
అయినా తెలివిగ పోరుడు మీరు.''

[illegible] – అనతి విసిరి
సేనాపతులు అగ్ని తేజముతో
వివిధాస్త్రములు గజ తురగములు
రథములు పూన్చుకు బయలుదేరిరి

తోరణ ద్వారము పైన మారుతి
వెలుగులు చిమ్మెను ఉదయ భానుడై
మండెడి సూర్యుని తేజము కలిగి
అతి బలవంతుడు ఎదురు చూచెను.

నగముగ రూపము మహా వేగము
బుద్ధి బలము మరి భుజ బలములలో
వాతాత్మజుడు ఎన్నిక గన్నడు
వీరుని చుట్టిరి వారందరును.

అయిదు బాణములు దుర్ధరుడేసెను
శిరమున నాటెను- శరములు హనుమకు
అంతట మారుతి పెద్దగ అరచి
ఆకాశములో ఎగిరి నిలచెను

దుర్ధరు డంతట అనిలాత్మజుపై
శత సంఖ్యలలో శరములు విసరెను
మారుతి – శరముల నష్టగించెను
వర్షిత మేఘము నాపు వాయువై.

దుర్ధరు శరములు బాధించగను
ఆకాశములో ఎత్తుగ ఎగిరి
నగమున పడిన పిడుగు రీతిగా
దూకెనుఅసురుని రథ మధ్యమున.

రథము విరిగెను సారథి చచ్చెను
ఎనిమిది గుఱ్ఱము లందు కూలెను
అసురుడు క్రింద నలిగి పోయెను
అసువులు గాలిలో తేలి పోయెను.

దుర్ధరు మరణము గాంచిన వారు
విరూపాక్ష యూపాక్షు లిద్దరూ
ఆకాశమునకు ఎగిరి మారుతిని
తొమ్ముపై కొట్టిరి ఘనమగు గదలతో

మారుతి వేగమె భూమికి దిగెను
మద్ది తరువు నొక దానిని పెరకి
గిర గిర త్రిప్పి విసరి కొట్టగా
యిరువురు వీరులు యమపురికేగిరి-

అయిదుగు రందు ముగ్గురు మడసిరి
మిగిలిన యిద్దరు ముందుకు వచ్చిరి
భాసకర్ణు డొక శూలము నంది
ప్రఘసుడు పదునగు కత్తిని పట్టి.

అతి బలశాలి ఆంజనేయునితో
తలపడి రంత తనువు తెగించి
పొడచిరి అసురులు ఆయుధములతో
రక్తము చిందెను మారుతి మేన.

రక్తము చిందిన ఆంజనేయుడు
బాలభానుడై ఎఱ్ఱగ తోచెను
వానరోత్తముడు క్రోధము నిండి
నగ శిఖరము నొక దానిని గైకొనె

ఆ గిరిశిఖరము మృగములు నిండి
తరువులు పాములు వివిధ ప్రాణులతో
ఉన్నది - దానిని మారుతి విసరెను
వారిద్దరి నది మన్నున కలిపెను

రథముల కొట్టెను రథములు ఎత్తి
శూరుల చంపెను శూరుల విసరి
మార్గము కానక కప్పడి పోయెను
కుప్పగ కూలిన విగత జీవులతో.

సేనాపతులు అంత మొందగా
అట హనుమంతుడు అతి చిత్రముగ
గజముల విసరి - గజముల చంపెను.
అశ్వము లన్నిటి కొట్టె నశ్వముల.

సేనా పతులను వారి బలములను
చతురతతో అట అంతము చేసి
నిలచిన మారుతి తోచెను అచట
ప్రళయ కాలమునయముని తీరుగా.

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

# 47. అక్షకుమారుని అసువులు తీయుట

సేనాపతులు వారి సైన్యము
నేల కొరిగిరను వార్తను వినిన
ఏలిక - అక్ష కుమారుని చూచెను
సమరోత్సాహుడు ఎదుట నిలచెను.

ఆ రథ మెక్కెను అక్షకుమారుడు
ఆంజనేయునితొ పోరగ వెడలెను
సకల సేనలు గజ తురగములు
సాగి నడువగా పోరుకు సాగెను.

అక్షకుమారుడు రావణు తనయుడు
తండ్రి మాట జవ దాటని వీరుడు
తండ్రి చూపుల పెరిగె కోపము
హవిసులు వ్రేల్చిన హోమగుండమై.

హరిత వర్ణమా అక్షుని కన్నులు
ఆ కన్నులకు మారుతి తోచెను
ప్రళయ కాలమున కాలాగ్ని వలె
విస్మయమంది వినయము పెరిగెను.

తేరును ఎక్కెనుపోరగ కపితో-
బంగరు కాంతుల తేరు వెలిగెను
బాల భానుడై కాంతులు చిమ్మెను
దేవా సురులకు అందని రథమది.

రాజ కుమారుడు బలముల నెంచెను
ఇంచుక సేపు నిలచి చూచెను
ఆగదు యుద్ధముకావున వీరుడు
వాడి బాణములు మూడు విసరెను.

ఆ రథమెంతో అపు రూప మది
అశ్వములున్నవి ఎనిమిది దానికి
ఆకాశమున సంచరించునది
మనో వేగముతొ తురగము లెగురును.

అందము లొలికెడి చెవికుండలములు
భుజ కీర్తులవి వెలుగు చుండగా
వేగమె హనుమను తాకెను శూరుడు
దేవాసురులకు భయము కలిగెను.

పుడమి అదిరెను వీరుల పోరుకు
సంభ్రమము గట్టిగ ఘోషించినది
నగములు కదలెను-వాయువు నిలచెను
సూర్యుని తేజము సన్నగిల్లెను.

శరములు తీరుగ వేయగ నేర్పరి
విష తుల్యమగు మూడు బాణములు
సర్పములన్న తీరుగ విడచెను
తిన్నగ హనుమకు తగలగ వాటిని.

మూడు బాణములు శిరమున తాకగ
తల నుండెగసిన రక్తపుధారలు
తెరచిన కన్నుల ముంచివేయగా
శరకిరణముల భాస్కరుడాయెను.

రాజ కుమారుడు - అక్షుడు విసురుగ
అతి చిత్రముగా ధనుస్సు త్రిప్పి
విసరెను శరములు వాతాత్మజుపై
మదిలో మారుతి సంతోషించెను.

అంతట మారుతి పోరగ ఎదిగెను
మందర నగమున సూర్యుడాయెను
రక్త వర్ణుడై ప్రకాశించెను
కన్నుల చూచెను కాల్చు నట్లుగా

ఇంద్ర ధనుసుగా ధనుసు ఒప్పగా
శర వర్షమును నగశరీరుపై
కురిపించెను అట రాజ కుమారుడు-
ఆంజనేయుడా అమ్ముల తడిసెను.

తేజోవంతుడు అతి విక్రముడు
యోధుడు- బాలుడు- ఎన్నిక వీరుడు
అక్షుని శరముల చతురత చూచి
సంతోషించెను మారుతి ఎంతో.

వాతాత్మజు డా బాణము లందు
గాలి తీరుగా తప్పుకు తిరుగుచు
ఆకాశములో సంచరించెను
అక్షుడు-శరముల నింపె నింగిని

అంతట ఆలోచించెను మారుతి
''బాలుడు వీడు భుజ బలశాలి
బాల భానుడు తేజము నందు
సమరోపాయము లెరిగినవాడు.

అరితేరెను యుద్ధము నందు
ఆగరు ముందుఎంతటి వారలు
యక్షులు - నాగులు పూజలు చేతురు
ఏ విధి చంపెదయీ పసి కందును.

పెరుగును వీని విక్రమ మెంతో
ఈ విధి పోరు సాగిన నింక
రగిలెడి అగ్నిని ఆర్పుట మేలు
యుక్తము, రిపుని త్రుంచెద నేను.''

మారుతసూనుడు మహావీరుడు
అంబర వీధిని చరచె హయముల-
రాలెను రథమునింగిని వదలి
బంగరు తేరు మన్నున కలిసెను.

వీరుడు అక్షుడు విల్లు ఖడ్గము
చేత ధరించి నింగి కెగరగా
తపో బలముచే తనువును వీడి
నాకము చేరెడి ముని అనిపించెను.

ఖగపతి-పామును పట్టిన రీతి
అక్షుని పాదము లందుకు గిరగిర
వేలసార్లు అట త్రిప్పి వేగముగ
నేలను కొట్టెను, అసురుడు మడసెను.

ఎముకలు విరిగెను రక్తము పారెను
మాంసపు ముద్దయి పోయెను అక్షుడు
తండ్రి రావణుడు భయపడి పోయెను
విస్మయ మందెను నాక లోకము.

మన్మథ మూర్తి-సురపతి సుతుడన
ఎఱ్ఱని కలువల కన్నుల వాని-
అక్ష కుమారుని చంపి మారుతి
ద్వారము చేరెను యమరాజువలె.

॥సుందరమైనది సుందరకాండము॥

## 48. ఇంద్రజిత్తు యుద్ధము-మారుతి నిర్బంధము

తనయుని, అక్ష కుమారుని మరణము
వినిన రావణుడు విస్మయ మందెను
దుఃఖ సంభ్రమున మునిగి పోయెను
తిరిగి తేరుకొని నిగ్రహించు కొని

సురపతి సముడగు ఇంద్రజిత్తుతో
పలికె తీరుగా పంక్తి కంధరుడు
''తనయుడ! నాకు - కీర్తికారకుడ!
అస్త్ర శస్త్రముల నేర్పరి వీవు.

ఉత్తమ గుణముల ఎన్నిక వాడ!
యుద్ధము నందు సురల అసురుల
ఇంద్రుని కూడ గెలచిన వాడవు!
దేవ గణంబులు చాలరు నీతో.

బ్రహ్మ దేవుని అనుగ్రహముతో
దివ్యాస్త్రములను పొందిన వాడవు
ముల్లోకముల గెలువ గలవు - నీ
తపో బలము నీ కగును రక్షణ.

బుద్ధి కుశలుడవు నేర్పరి వీవు
యుద్ధమునందు అపజయ మెరుగవు
నీ తలపుతొ - నే ధైర్యము నుందును
నా కెపుడయినాకష్టము కలిగిన

తనయుడ వింటివ! యుద్ధము నందు
కింకర వీరులు! ప్రహస్తు సుతుడు
మంత్రి పుత్రులు సేనాపతులు
ఎందరొ వీరులు యమపురి కేగిరి.

రాలెను ఎన్నో జాతి అశ్వములు
ఎంతో సేన అంత మొందెను
గజములు రథములు మన్నున కలిసెను
ప్రియ సోదరుడుఅక్షుడుకూలెను.

నీపై ఎంతో ఆశతొ నుంటిని
వానరుడెంతో బలమగువాడు
అంతులేని నీ యుద్ధ కుశలత
ప్రయోగించి - ఆ రిపుని జయించుము.

సేనలు బలములు నిలువగ లేవు
వానరుడేమో అతి బలవంతుడు
వాయువు చాలడువేగమునందు
అగ్నిహోత్రుడే ఆలోచించుము.

దివ్యాస్త్రములను మనమున తలచుకు
తెలివిగ స్వకీయ రక్షణతోను
యుద్ధముచేయుము - రాజధర్మము
తప్పదు - తనయుల పోరుకు పంపుట.

తండ్రి పలుకుల బలము పెరిగెను
ప్రభువుకు తాను ప్రదక్షణ చేసెను
తన వారందరు బల మింతివ్వగ
ఉత్సాహముతో పోరుకు సాగెను.

కలువకన్నుల - కాంతి వంతుడు
తేజోవంతుడు రాజకుమారుడు
పర్వములందు పొంగుకడలివలె
పోరగ వెడలెను వాతాత్మజుతో.

ఖగపతి వేగము కలిగిన రథమును
అధిరోహించెను అసుర వీరుడు
అస్త్రశస్త్రముల మేటి ఆతడు
ఆంజనేయునితొ పోరగ వెడలెను.

యుద్ధము చేయుట కింకెవరో అట
వచ్చుచుండిరని హనుమ గ్రహించెను
రథము నడచిన ధ్వని వినిపించగ
సంతోషముతో ఎదురుచూచెను.

సిద్ధులు నాగులు ఋషులు యక్షులు
యుద్ధము చూడగ వేచి యుండిరి
పులుగుల గుంపులు అరచె భీతిలి
దిక్కు తోచక దిక్కుల తిరిగెను.

మేఘనాధుని చూచిన మారుతి
వేగమె కాయము పెంచి అరచెను
దివ్య రథముపై ఇంద్రజిత్తు - తన
వింటితొ చేసెను పిడుగుల సవ్వడి.

ఆకాశములో తిరుగుచు మారుతి
శరముల తప్పుకు గాలిలొ తేలుచు
ఎంతో నేర్పుగ పోరగ నంత
ఇంద్రజిత్తు బహు విస్మయ మందెను.

మేఘనాధుడు వీరుడు నేర్పుగ
మేలగు బాణము లెన్నో రకములు
బంగరు శరములు వజ్ర పాతములు
అన్నీ వాడెను హనుమంతునిపై

సూటిగ శరములు వేయగ నేర్పరి
రాజకుమారుడు శరములు వదలెను
శరముల నడుమ తిరిగెను మారుతి
తప్పుకొనుచును తిప్పలు పెట్టెను.

పోరు సాగెడి తీరు చూడగా
మనసు కలిగెనుసర్వజగతికి
ఒకరిని మించినవారొకరైరి
ఒకరికి లొంగక మరియొక రుండిరి.

ఎన్నో శరములు దివ్యవరములు
అన్నీ అంతట నేలబడగను
దిక్కు తోచక - దిక్కుల చూచెను
ఆలోచించెను వీరుడు ఎంతో.

వీరుని చంపుట వశము కాదని
యోచన చేసిన మేఘనాథుడు
బ్రహ్మాస్త్రము సంధించి విడచెను
బంధించగ నా అతి బలవంతుని

''అస్త్రము లెవ్వీ నిను బంధించవు
అందవు వాటికి వరమిది నీకు''
అనిన - విరించి వరము చలవతో
మారుతి వీరుడు అపజయ మెరుగడు

అంతటి బ్రహ్మకు చెందిన అస్త్రము
ఇంచుకతాను గౌరవించగా
లొంగి పోయెను అట కపివీరుడు
అస్త్రము హనుమను బంధించినది.

''బ్రహ్మాస్త్రమునకు బద్ధుడ నైతిని
వాయు దేవుడు - బ్రహ్మదేవుడు
సురపతి ఇంద్రుడు శ్రద్ధవహింతురు
నా కపకారము జరుగనీయరు

ఈ విధి లొంగుట మేలగు నాకు
పట్టుకుపోయి రాజుకు చూపిన
రాజుతొ నేను ముచ్చటించుటకు
ముచ్చట అయిన సమయము దొరకును.''

అంతయు బాగుగ యోచన చేసి
ఆ కపి వీరుడు మిన్న కుండగా
రాక్షసు లందరు నారలు - త్రాళ్ళతొ
బంధించిరి అట ఆంజనేయుని.

అస్త్ర బంధము విడిపోయినది-
వేరొక బంధము వుండగ అస్త్రము
వుండదు - అది ఆ రాక్షసు లెరుగరు
మరి యొక అస్త్రము యిక పనిచేయదు.

ఇంద్ర జిత్తు మది కలవర మందెను
తలచెను ఆ కపి చంపును తమనని
తన పని వ్యర్థము అనిపించినది
కానీ మారుతి కదలక యుండగ

రాక్షసు లంతట ఆ కపివీరుని
కఱ్ఱల బాదిరి పిడికిట గ్రుద్దిరి.
ఎన్నో హింసలు పెట్టుచు వారు
రావణు చెంతకు తీసుకు పోయిరి.

ఏలిక కొలువు తీర్చి యుండగా
వానర శ్రేష్ఠుని రాజుకు చూపిరి
మత్తేభములా వున్నాడీ కపి
ఎక్కడి వాడు ఎందుకు వచ్చెనొ!

ఎవ్వరి వాడు - ఎవరికోసమో!
పని అసలేమిటొ ఎవరికి తెలుసు
అనుకొని సభికులుగుస గుస లాడిరి
చంపుడు-మ్రింగుడు-అరచిరి కపిగా.

మహాత్ముడగు వీరాంజనేయుడు
రత్న శోభితము అగు భవనమును
సుందరమగు ఆ సభా భవనమున
రాజ సేవకుల నందర చూచెను.

తేజోవంతుడు రావణాసురుడు
వానరోత్తముని కన్నుల గాంచెను
కపి కులోత్తముడు పంక్తికంధరుని
సూర్యతేజుని - అట వీక్షించెను.

రోషము నిండి కన్నులు ఎఱుపై
గ్రుడ్లు త్రిప్పుచు రాక్షసరాజు
క్రోధము నిండి వృద్ధమంత్రులకు
ఆనతిచ్చెను వివరము లడుగగ.

ఆనతి మేరకు సచివులు- కపిని
రాక ఎందుకు కార్యమేమిటన-
వానర రాజు సుగ్రీవుని దూతను
అతని పనుపున వచ్చితి ననెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 49. రావణు సభా సందర్శనము

లంకా ధీశుడు రావణా సురుడు
కొలువున నుండెను కన్నుల నిండుగ
స్వర్ణ కిరీటము రత్న మయమది
విలువగు వజ్రము లున్నవి ఎన్నో.

వెలుగులు చిమ్మెను వెలగల నగలు
విలువగు ఆభరణమ్ములె అన్నీ
మేలగు వలువలు పట్టు వస్త్రములు
విలువల కందని చందనాదులు.

మంచి గంధముల మేన నలదుకొని
వీరుడు తేడు - భుజబల తేజుడు
పది తలలందు తెరచిన నోళ్ళతొ
అన్ని కన్నులు ఎఱ్ఱగ మండగ.

వాడి కోరలతొ పెద్ద పెదవులతొ
భయము గొలుపుచు రాక్షసరాజు
క్రూర మృగములు నిండిన వనము
మందర నగము అన్నటు భాసిలె.

నల్లని ఱొమ్మున మంచి ముత్యములు
ఉన్నవి - హారము లందు మెరయుచు
మబ్బులు నిండిన ఆకాశమున
తెల్లని కొంగలు హారములయినవి.

బలసిన భుజములు తోచిన వచ్చుట
అయిదు తలలు గల సర్పము లన్నటు
కూర్చొను పీఠము స్పటిక నిర్మితము
రత్న కంబళము తీరుగ పరచిరి.

సుందరాంగులగు మందయానలు
అందము లొలుకుచు సొగసు లెగయగ
ఇరు ప్రక్కల- ఆ తేనికి నిలచి
వీచుచుండిరి వింజామరలు.

రాజ్య తంత్రముల నెరిగిన వారు
ప్రహస్త- దుర్ధర- మహా పార్శ్వుడు
నికుంభునితో కలిపి నలుగురు
సచివులు సభలో భాసిలు చుండిరి.

నాల్గు సంద్రములు అన్నటు సచివుల
నడుమభూమిలాతేడు తోచెను
ఎందరొ రాక్షస శ్రేష్ఠుల మంత్రుల
కూడి యుండెను సురపతి పోలి.

ఇంతటి వీరుడు ప్రతిభావంతుడు
ధర్మ మార్గము వదలక యుండిన
సురలోకమునకు ఏలిక అగును
సురపతి ఇంద్రుని ప్రభువు కాదగును.

నీరు నిండిన మేఘము - మేరువు
శిఖరము నున్నటు సింహాసనమున
ఆశీనుడు అగు పంక్తి కంధరుని
మారుతి చూచి తలచెను మదిలో.

లోక సంకటము లెన్నో తెచ్చెను
ఘోర కార్యముల నెన్నో చేసెను
కావున సురలు అసురులు కూడా
భయపడుచుండిరి వీని నామమున.

ధైర్యవంతుడు కాంతి వంతుడు
రూపము మిక్కిలి రాజసమైనది
సర్వ లక్షణములున్న అసురుడు
లోకములన్నీ ఏల గలడుగా!

కోపించినచో పంక్తికంధరుడు
కడలి కడుపులో ముంచులోకమును-
పరి పరి విధముల మారుతి తలచెను
రావణు తేజము చూచిన యంత.

||సుందరమైనది సుందరకాండము||

❈❈❈

## 50. ఆంజనేయుని స్వస్వరూప విభవము-రావణు విస్మయము

వానర శ్రేష్ఠుని వాతాత్మజుని
అమిత విక్రముని అనిలాత్మజుని
కోపము నిండిన కన్నుల తేడు
చూచెను తిన్నగ - తికమక పడెను.

''దురాత్ముడగు యీ వానర మిచటకు
ఏమి కార్యమున వచ్చెనొ అడుగుము!
ఎచ్చట నుండి వచ్చెనొ యీ కపి
ఎందుకువనము ధ్వంసము చేసెను.

''ఈ కపి పూజ్యుడు నందీశ్వరుడా!
నేరుగ నేలకు దిగలేదు కదా!
కైలాసమున ఆ సమయమున
కోపము నిండి శాపము నిడెకద.

పరులకు చొరగ శక్యము గాని
నా లంకకురా పని ఏమున్నది!
నా యోధులతోతలపడి పోరగ
కారణ మరయుము మంత్రిసత్తమా!''

రాక్షస రాజు బాణాసురుడే
ఈ కపిరూపున వచ్చెనొ ఏమో!
కోపము భయము కలిగిన రాజు
మంత్రి ప్రహస్తుని చూచి పలికెను.

అంతట మంత్రి పలికె మారుతితో
''ఓ వానరుడా! శ్రమ తీరుము నువు
భయపడవలదు - నిజము పలుకుము
ఇంద్రుడు పంపగ లంకకు దిగితివ?

ధనపతి - వరుణ - యమరాజులలో
ఎవరికి నీవు చారుడవయ్యా!
లంకా పతిని గెలువగ - విష్ణువు -
దూతగ నిన్ను పంపలేదు కద!

రూపుకు నీవు కోతివి - నిజము
తేజము చూడగ కోతివి కాదు
కోతికి ఇంతటి తేజము వుండదు
నిజము పలుకుము మేలు కలుగును.

ఎవరో నిన్ను పంపకపోయిన
స్వయముగ నీవు ఏల వచ్చితివి?
మంత్రి పలుకులు వినిన మారుతి
నేరుగరావణు చూచి పలికెను.

''సురపతి- ధనపతి- యమరాజులకు
దూతగనేను రాలేదిచటకు
విష్ణుదేవుని పనుపున నేను
లంకకు రాలేదన్నది నిజము.

సత్యము వినుము! వానరుడను నే!
నాకై నేనే చేరితి లంక
నిను చూడగ నే నింతచేసితి
నీ దర్శనము దొరకుట కష్టము.

నా రక్షణకై యుద్ధము చేసితి
నే లొంగను - ఏ అస్త్రశస్త్రముల
ఆ వర మిడెను లోగడ బ్రహ్మ-
బ్రహ్మాస్త్రమునకు లొంగితి నీకై

నిను చూడగ నేనింత చేసితి
రాచ కార్యమున వచ్చినాడను
తేజోవంతుడు రాముని దూతను
హితము పలికెదను ఆలకించుము.

॥సుందరమైనది సుందరకాండము॥

❊❊❊

## 51. మారుతి హితోపదేశము

''లంక ఏలికా! విను-సందేశము
తెచ్చితి నీకై మా రాజంపగ
కపిశ్రేష్ఠుడుసుగ్రీవుడు తేడు
సోదర సముడవునీకు కుశలమనె.

ప్రభువు పంపిన సందేశము విను
ఇహ పరములకుశుభము కలుగును
ధర్మార్థములు కలిగించునది
ధర యేలగ నీ కగును సాధనము!

దశరథ నృపతి సురపతి సాటిగ
సకల సంపదల భోగ భాగ్యముల
లోకుల నేలెడి ప్రభు వుండెను-
శ్రీ రాముడు ఆ ప్రభు జ్యేష్ఠ కుమారుడు.

మహాబాహుడు పురుషోత్తముడు
తండ్రి దశరథుని ఆనతి మేరకు
రాజ్యము వదలి- సతియగు సీతతొ
దండ కాటవికి వచ్చె తమ్మునితొ.

రాముని సతియగు సీతామాత
పరమ పతివ్రత జనక రాజ సుత
అపహరింపబడె ఆ వనమందు-
వచ్చిరి వెదకుచు సోదరు లిరువురు.

ఋష్యమూకమున గల సుగ్రీవుడు
సీతాన్వేషణ చేయించెదనని-
కపిరాజుగ ఆ కపిని చేతునన
ప్రతినల నందిరి వారిద్దరును.

వాలి సంగతి నీ వెరుగుదువు!
అంతటి వానిని రామచంద్రుడు
ఒక్క బాణముతొ నేల కూల్చెను
సుగ్రీవునికి పట్టము కట్టెను

మాట నిలుపుకొని మా సుగ్రీవుడు
వేలు లక్షలు వానర వీరుల
సీతను వెదుకగ నాల్గుదిక్కుల
భూమ్యా కాశము లందు నింపెను.

గరుడుని పోలిన వేగము వారు
వాయు వేగము కలిగిన వారు
అతి బలశాలులు - నేలను తాకక
తిరుగ గలిగిన వీరులు వారు.

వాయుదేవుని తనయుడనేను
హనుమంతుడను సీతను వెదకుచు
శత యోజనముల సంద్రము దాటితి
లంకలొ నేను చూచితి మాతను.

రావణ వినుము! ధర్మము తెలుసును
తపోవంతుడవు- ప్రాజ్ఞుడ వీవు
పర పురుషుని యిల్లాలి నీ విధి
చెర పట్టుట - మరి నీకు తగనిది!

ధర్మ విరుద్ధము - మొదటికి మోసము
కడు అపాయము కలిగెడి పనులు
బుద్ధి మంతులగు నీ సరి వారు
చేయుట కెప్పుడు తల పడరయ్యా!

రాముని ముందు అపరాధమ్మును
చేయుట కెవరూ సాహసించరు-
అటుల చేసియు సుఖపడువాడు
మూడు లోకముల వెదకిన దొరకడు

రాముని కోపము తెలిసిన తమ్ముని
లక్ష్మణు శరముల నెదిరి నిలువగ
దేవాసురులకు శక్యము కాదు
రాముని వైరికి సుఖ మసలుండదు.

ధర్మ యుక్తమగు హితమును వినుము
మూడు కాలముల మేలు కలుగును
పుడమికి దేవుడు రఘురామునితో
పుడమీసుతను సీతను చేర్చుము!

రాముడు! దేవుడు నిస్సందేహము
దైవాపచారము కాల్చివేయును-
కావున అమ్మను- రామునికిచ్చి
పాప క్షాళన చేసుకోవయా!

విష తుల్యమగు ఆహారమును
తిని - జీర్ణించగ చాలగ లేనటు
రాఘవు రాణి తన దనుకొనెడి
దేవా సురులు - దక్కరు నిజము.

అమ్మను గాంచితి లంకలొ నేను
అసాధ్యమైన కార్యమ్మదియగు
ఇకపై- జరిగెడి కార్యమంతయు
రామ చంద్రుని చేత నున్నది

తపోబలమున ఆయువు పెరిగి
దేవా సురులచె మరణము లేదని
విఱ్ఱవీగకు! రాముడు - నరుడు
వానరులముసుగ్రీవుడు మేము.

దేవగణములో చేరని వారము
అసురుల యందు అసలే రాము
నరులు వానరు లనగా వినుము !
నీ ప్రాణములను తీసెడివారు.

నాశము లేనిదిధర్మమొక్కటే
ఖర దూషణులు కూలుట మరువకు
అతి బలశాలి వాలిని చంపిన
రాముడు - మిత్రుడు సుగ్రీవునికి.

యశోవంతుడు! రామచంద్రుడు
సర్వజగతిని నశింపజేసియు
తిరిగి సృజించగ శక్తిమంతుడు
కావున వీడుము! రామునితో పగ-

ధర్మ ఫలమును అనుభవించితివి
అధర్మ వర్తన! నీకడ మిగిలిన-
ధర్మమునంతయు మ్రింగి వేయగా -
అధర్మఫలమును అనుభవించవలె.

రామ సుగ్రీవుల మైత్రిని తలచి
కీడు మేళ్ళు మరి! ఆలోచించకు
తగు నిర్ణయము చేసుకోవయా
బంధునాశనము ఆపుకోవయా!

నే నీ లంకను సర్వసైన్యమును
నాశము చేయగ శక్తివంతుడను
కానీ రాముని నిశ్చయ మిది విను!
శత్రువు నతడే త్రుంచవలెనని.

సీత కాదు సాధారణ అతివ
లంకను కాల్చెడి కాళ రాత్రియే!
కాల పాశము మెడ దాల్చకుమా!
నే పలికితిని సత్యము రావణ!

దుఃఖమునందు మునిగిన తల్లిని
కన్నుల నిండుగ గాంచితి నేను-
కానీ ఆమె - అయిదు తలలుగల
పన్నగమ్మని గ్రహింప కుంటివి-

సుతులు-సుదతులు-మిత్రులు-హితులు
సచివులు - నీవు -సొంపగు లంక
తెలిసినాశము చేయకు రాజా!
విష్ణుమూర్తితో సముడా రాముడు.

జగతికి ప్రభువు రాజసింహుడు
అంతటి రాముని కెంతటి కష్టము
మదిలో కలత కలిగెను నీవల
నీవిక బ్రతుకవు నమ్ముము నన్ను!

ఆ బ్రహ్మయినా - మహేంద్రు డయినా-
త్రినేత్రు డయినా - మరెవ్వ రయినా-
రాముని గెలువగ చాలరు వినుము
నిను రక్షించగ లేరిది నిజము''

గుండె దిటవుతో కడు నిబ్బరముగ
మారుతి పలుకగ రావణు డంత
క్రోధము నిండి కన్నులు త్రిప్పుచు
కపిని చంపుడని ఆనతిచ్చెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

## 5 2. రావణు రోషము–విభీషణుని హితవు

''ఈ కపి పలుకులు ములుకులు నాకు
ఈ కపి కెందుకు యీ వాచాలత
చంపుడు కపిని'' అని తన భటులకు
ఆన తిచ్చెను అసుర భూపతి.

అంతట రావణు తమ్ముడాతడు
హిత వాక్యములు చెప్పగ నేర్పరి
అర్థవంతముగ పలుకగ చతురుడు
అట విభీషణుడు అన్నతొ పలికెను

''సోదర! వినుము–నను క్షమియించుము
కోపము విడచి శాంతివహించుము-
మంచి పెద్దలు తెలిసిన వారు
ఎన్నిక రాజులు - దూతల చంపరు.

అతి బలశాలివి - దూతను నీవు
చంపుట ఒప్పదు రాజధర్మము-
నీకది తగదు - లోక నిందయగు
నీతులు నీకు నేర్పగ వలెనా!

సర్వ శాస్త్రముల పారంగతుడవు
భక్త వశంకరు శంకరు భక్తుడ
విద్వాంసుడవు పండిత శ్రేష్ఠుడ
యుక్తా యుక్తము లాలోచించుము.

మంచి మాటలు వినుట మంచిది
వ్యక్తులు ఎవరని, మదిలో తలచక
కావున నీవు దూతకు తగిన
శిక్షను వేయుట యుక్తము రాజా!''

''శతృ భయంకర ఓ విభీషణా!
పాపుల త్రుంచుట పాపము కాదు
ఈ వానరము దుష్టుడు - వీనిని
దండించుట యన ప్రాణము తీయుట.''

అన్న మాటలు వినిన తమ్ముడు
తిరిగి పలికెను మనసు మార్చగా
''రాక్షసరాజా! ఓ లంకేశ్వర!
దూతను చంపుట ధర్మనిషిద్ధము.

ఈతడు శత్రువు - కాదనలేదు
అప్రియములు మన కెన్నో చేసెను-
కానీ దూతగ వచ్చెను గనుక
చంపుట విడచి వేరొక శిక్షిడు!

దుష్ట దూతకు - శిక్షలు ఎన్నో-
తల గొరిగించుట - కర్రల కొట్టుట
అంగవికారము కలుగజేయుట
వాతలు వేయుట- చేయుము ఏదో.

సురాసురులలో అత్యుత్తముడవు
ధర్మార్థములు తెలిసిన వాడవు
దూతను చంపిన లాభము లేదు
వానిని పంపిన వానిచంపవలె.

దూత సాధువో - దుష్టుడొ - పోనీ!
తనకై తాను రాలే దిచటకు
తోచిన మాటలు కావు చెప్పినవి
పంపిన వాని పలుకులు వినిచె.

ఈ కపి లేనిచొ రామ లక్ష్మణుల
లంకకు తేగల వీరుడుండడు
యుద్ధము చేయుట జరగక పోయిన
నీ యభీష్టము నెఱవేరదు కద.

ఈతని చంపిన నీ కపకీర్తి
శాశ్వతముగను నిలచి పోవును
కావున-పంపిన తెలివి హీనులను
చంపగ యత్నము చేయుము రాజా!

యుద్ధములన్న సంతోషింతువు
అపజయమన్నది అసలే ఎరుగవు
కావున నీవు వీనిని విడచిన
యుద్ధము చేసెడి వీలు కలుగును.

యోధులు కలరు కోట్ల సంఖ్యలో
సేన లున్నవి నీ సేవలలో
రామ లక్ష్మణుల పైకి పంపుము
అసురుల బలము నరులకు తెలియగ''

రాక్షస ఱేడు సురలకు వైరి
తమ్ముని పలుకుల సమ్మతించెను
తలచెను మదిలో - సభలో నున్న
కపి పుంగవుని తిలకించుచును.

''విష్ణుతేజము పరబ్రహ్మము
కపి రూపముతో నిలచినదేమో!
నేలకు నడచి వచ్చినదేమో-
కావున ఈ కపి లొంగకపోయెను.

నాపై పగ గల విష్ణుదేవుడే
నను చంపగ ఈ కపిగా వచ్చెనొ-
తప్పక వీడు అగును శ్రీపతి''
కోపము తిరిగి పెరిగె రాజుకు.

మదిలో రగిలిన కోప మణచుకొని
హితవు పలికిన మితభాషణుడు
శస్త్రము పట్టగ నేర్పరియైన
తమ్మునితో ఆ రాజు పలికెను.

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 53. శ్రీరామదూత దండన-మాత ప్రార్థన

నీ పలుకులలో ధర్మబోధలో
నిజము ఉన్నది- దూతను చంపక
మరియెక శిక్షను వేయుట యుక్తము
కావున వీని వాలము కాల్చుడు

కోతుల కెంతో అందము తోకలు
వాలము లందే ప్రీతి ఉండును
వాలము కాల్చిన దానితొ వీడు-
తన వారందర చేరగ సిగ్గగు.

మండెడి తోకతొ కోతిని లంకలొ
నాల్గు మూలలా త్రిప్పుడు - మీరు.''
అని పలికెను అట పంక్తికంధరుడు
పట్టరాని కడు ఆగ్రహమ్ముతో.

కోపము నిండి రాక్షసులందరు
నారలు - గుడ్డలు తెచ్చిరి ఎన్నో
తోకకు చుట్టి నూనెతొ తడిపి
నిప్పంటించిరి - మురిసిపోయిరి.

కోపము నిండిన ఆంజనేయుడు
బాల సూర్యుడై భాసిలెనచట
వాలము విసరెను వారి మీదకు
ఆ విసురుకు వారందరు పడిరి.

రాక్షసులెల్లరు - స్త్రీలు బాలురు
వృద్ధులు వచ్చి చూసి మురిసిరి
అందరు చేరి - అట హనుమంతుని
తిరిగి త్రాళ్ళతో బంధించగను.

ఆంజనేయుడు మదిలో తలచెను
''మూర్ఖులు వీరు నన్ను ఎరుగరు
చంపెద లంకలొ ప్రతి రక్కసుని
రాముని ఆనతి లేక పడుంటిని.

ఈ బంధముతో నను త్రిప్పగను
పగటివేళలో లంకను చూతును
దుర్భేద్యమగు దుర్గము చూతును
రాముని కొరకీ క్లేశము నోర్తును.''

శంఖము లూదిరి భేరులు మ్రోచిరి
అరపుల సందడి నిండుగ చేయుచు
ఆంజనేయుని - లంకలొ త్రిప్పగ
ఆనందముతో లంకను చూచెను.

విమానమ్ములు రాజవీధులు
నాల్గు వీధులు కలసిన స్థలములు
చిన్న గృహములు ఎత్తగు మేడలు
సుందర స్థలములు ఎన్నో చూచెను.

ఆ రాక్షసులట - ఆంజనేయుని
''చారుడు'' చూడుడు - అని చెప్పగను
వాకిలి ముందర చేరి - వృద్ధులు
స్త్రీలు - బాలురు వేడుక చూచిరి.

మండెడి తోకతొ మారుతి ఉండగ
వికృత రూపులు రాక్షస స్త్రీలు
సీతకు చెప్పిరి జరిగిన దంతా-
నీతో పలికిన - కపియని చెప్పిరి.

# 53. శ్రీరామదూత దండన-మాత ప్రార్థన

నీ పలుకులలో ధర్మబోధలో
నిజము ఉన్నది- దూతను చంపక
మరియెక శిక్షను వేయుట యుక్తము
కావున వీని వాలము కాల్చుడు

కోతుల కెంతో అందము తోకలు
వాలము లందే ప్రీతి ఉండును
వాలము కాల్చిన దానితొ వీడు-
తన వారందర చేరగ సిగ్గగు.

మండెడి తోకతొ కోతిని లంకలొ
నాల్గు మూలలా త్రిప్పుడు - మీరు.''
అని పలికెను అట పంక్తికంధరుడు
పట్టరాని కడు ఆగ్రహమ్ముతో.

కోపము నిండి రాక్షసులందరు
నారలు - గుడ్డలు తెచ్చిరి ఎన్నో
తోకకు చుట్టి నూనెతొ తడిపి
నిప్పంటించిరి - మురిసిపోయిరి.

కోపము నిండిన ఆంజనేయుడు
బాల సూర్యుడై భాసిలెనచట
వాలము విసరెను వారి మీదకు
ఆ విసురుకు వారందరు పడిరి.

రాక్షసులెల్లరు - స్త్రీలు బాలురు
వృద్ధులు వచ్చి చూసి మురిసిరి
అందరు చేరి - అట హనుమంతుని
తిరిగి త్రాళ్ళతో బంధించగను.

ఆంజనేయుడు మదిలో తలచెను
''మూర్ఖులు వీరు నన్ను ఎరుగరు
చంపెద లంకలొ ప్రతి రక్కసుని
రాముని ఆనతి లేక పడుంటిని.

ఈ బంధముతో నను త్రిప్పగను
పగటివేళలో లంకను చూతును
దుర్భేద్యమగు దుర్గము చూతును
రాముని కొరకీ క్లేశము నోర్తును.''

శంఖము లూదిరి భేరులు మ్రోచిరి
అరపుల సందడి నిండుగ చేయుచు
ఆంజనేయుని - లంకలొ త్రిప్పగ
ఆనందముతో లంకను చూచెను.

విమానమ్ములు రాజవీధులు
నాల్గు వీధులు కలసిన స్థలములు
చిన్న గృహములు ఎత్తగు మేడలు
సుందర స్థలములు ఎన్నో చూచెను.

ఆ రాక్షసులట - అంజనేయుని
''చారుడు'' చూడుడు - అని చెప్పగను
వాకిలి ముందర చేరి - వృద్ధులు
స్త్రీలు - బాలురు వేడుక చూచిరి.

మండెడి తోకతొ మారుతి ఉండగ
వికృత రూపులు రాక్షస స్త్రీలు
సీతకు చెప్పిరి జరిగిన దంతా-
నీతో పలికిన - కపియని చెప్పిరి.

# 54. లంకా దహనము-రాక్షస రోదనము

వాతాత్మజుడు యోచన చేసెను
"అశోకవనము ధ్వంసము చేసితి
పేరు మోసిన వీరుల చంపితి
లెక్కకు చిక్కని వీరుల త్రుంచితి.

చాలదు అంత - చేసెద నింత
దుర్గము నాశము కావలె నింక
నా శ్రమ ఫలితము దక్కుటె గాక
మిక్కిలి తాపము లంకలొ కలుగును"

వానరోత్తముడు మండెడి తోకతొ
మెరుపులు నిండిన మేఘ మాయెను
హుత వాహనునికి సంతర్పణగ
లంకా దహనము ఆరంభించెను

సాగెను మారుతి మేడల చూచుచు
నేల దిగకనే దూకెను వాటిని
వానరు మంత్రి వాయుదేవుడై
ప్రహస్తు మేడకు తోకను విసరెను.

మహాపార్శ్వుని భవనము కెగసి
నిప్పును రాల్చి-నేరుగ ఎగిరి
వజ్ర దంష్ట్ర శుక సారణ గృహములు
మంటల ముంచి గెంతెను మారుతి.

మేఘనాథుని హేమ మందిరము
జంబు మాలి సుమాలి భవనములు
భయ మదిలేక వానర శ్రేష్ఠుడు
అగ్ని దేవునికి ఆహుతి చేసెను.

రశ్మికేతుని గృహము కాల్చెను
సూర్యశత్రుని నిలయము కాల్చెను
దంష్ట్ర రక్కసుని మందిరమందు
హ్రస్వకర్ణుని భవనము నందు.

జ్వాలలు రేపి ముందుకు సాగి
రోమసుమేడకు తోకను విసరి
ధ్వజగ్రీవుని-మత్తుని నెలవులు
యుద్ధోన్మత్తుని సదనము కాల్చెను.

విద్యుజ్జిహ్వు నివేశన మందు
హస్తిముఖుడు ఆ రాక్షసు భవనము
కళాసు నిలయము పిశాచునిల్లు
కుంభకర్ణుని భవనము కాల్చెను.

బ్రహ్మశత్రుని సదనముకాల్చి
కుంభ నికుంభుల గృహములుకాల్చి
నరాంతక నిలయము మంటల రేపి
హుతవాహనునికి నిలయము చేసెను.

విభీషణాఖ్యుని భవనము వదలి
లంకలొ మేలగు యిండ్లను కాల్చి
తేజో వంతుడు ఆ హనుమంతుడు
రావణు భవనము చెంత చేరెను.

భవనము లన్నిట తలమానికమది
మణులు రత్నములు అద్దిరి సొంపుగ
మంగళకరమై శోభలీనుచు
మేరువు-మందర నగమై యున్నది.

లాంగులాగ్రము మందిర మందు
విసరి అగ్నిని రగులు కొలిపెను
ప్రళయ భయంకర మేఘము మాదిరి
గర్జన చేసెను- లంక హడలెను.

మండెడి మంటల వాయువు తోడై
స్వర్ణము- మణులు- ముక్తామణులు
రత్న మయములగు భవనములన్నీ
నేల కొరిగెను- కరిగి పారెను.

ఇండ్లకు రక్షణ చేయగ లేక
అరచుచు పరుగిడు దానవు లందరు
''కపి కాదసలు అగ్ని దేవుడే
అరచిరి స్త్రీలు బాలురుఅచట''

పరుగిడు స్త్రీల కురులు జారినవి
జారిన వలువల పరుగిడ లేక
నేల బడిన ఆ స్త్రీ లనిపించిరి
మేఘము రాల్చిన మెరపుతునకలని.

వైడూర్యములు వజ్రములన్నీ
మణులు ముత్యములు పగడములన్నీ
హేమ మందిరము లన్నీ కరిగి
పారెను- చిత్రము మారుతి చూచెను.

బూరుగు పూవు కాంతితొ మంటలు-
కుంకుమపూవు కాంతితొ కీలలు-
మోదుగు పూవు వన్నెతొ జ్వాలలు-
ఎన్నో రంగుల వెలిగెను అగ్ని.

రుద్రుని మంటల కాలె త్రిపురములు
మారుతి కాల్చెను లంకా పురము
మంటలు మండెనుపొగలే దచట
మింటి కెగయగ జ్వాలలు లేచెను.

అసుర దేహములు ఆజ్యమైనవి
మంటల నెంతో చురుకు చేసినవి
కొందరు - అస్త్రము లందుకు వచ్చిరి
మారుతి వారిని చావమోదెను.

లంకా నగరము సొంపులు తరిగి
శోభలు చెరిగి జ్వాలలు నిండి
ఫాల నేత్రుని క్రోధాగ్ని కది
ఆహుతి అయినటు తోచిన దచట.

కోటి సూర్యులు వున్నటు వెలుగులు
అగ్ని దేవుడు వెలిగించెనట
పిడుగులు పడినటు ధ్వనులెగసినవి
భీభత్సముగా లంక మిగిలెను.

''వజ్రా యుధము పట్టినవాడు
సురలకు ఏలిక సురపతి ఏమో!
లేదా యముడో-వాయు దేవుడో,
రుద్రుడొ- సూర్యుడొ- అగ్ని దేవుడో,

ధనపతి అగును చంద్రుడు అగును
నేలకు దిగిన మృత్యువు అగును
చతురాననుడు బ్రహ్మదేవుడే
కపి రూపమున వచ్చి యుండును.

కానిచో - అంతము లేనట్టిదియు
అద్వితీయమగు విష్ణు తేజము
రక్కసు లందరచంపగ - మాయతొ
కపి రూపమున లంక చేరినది.''

హుత వాహనునికి ఆహుతి అయిన
లంకను చూచి రాక్షసులందరు
పరి పరి విధముల భీతిలి పలికిరి
ప్రాణము లుంచిరి అరచేతులలో.

మృగములు, పక్షులు, గజములు కాలి
హయములు, రథములు మంటలమండి
వృక్షము లిండ్లు తగుల బడగను
రోదించినది లంక- దీనముగ.

''ఓ నా కాంతుడ - నా ప్రియమిత్రుడ!
కడుపు పంట - నా కన్నుల వెన్నెల
జన్మ నిచ్చిన జనకుడ పూజ్యుడ''
ఎన్నో వరసల నేడ్చిరి లంకలొ.

శాపగ్రస్తమై పోయెను లంక
హర నేత్రాగ్నికి గురి యైనటుల
మారుతి కోరిక నెరవేరినది
కాల్చి వచ్చిన ఘనత దక్కెను

లాంగులాగ్రము మండు జ్వాలతో
ఉండెను మారుతి త్రికూట నగమున
వాడి కిరణముల భాస్కరుడాయను
వెలుగులు చిమ్మెను వాలము వెలుగగ.

లంకా దహనము పూర్తి చేసి అట
మారుతి తలచెను రామచంద్రుని
ముల్లోకముల ప్రభువగు రాముని
పాద పద్మములు ధ్యానము చేసెను.

సుర లందరును ఆంజనేయుని
వాయువు సముడగు వాతాత్మజుని
బుద్ధిమంతుని, ఉత్తమోత్తముని
మనసులు నిండుగ ప్రార్థన చేసిరి.

సిద్ధులు, ఋషులు, దేవతలందరు
అచ్చెరువందిరి లంక కాలగా
సర్వభూతములు బెదరిపోయెను
కాలాగ్నే యని హనుమను తలచిరి.

నాగులు, యక్షులు, ముని పుంగవులు,
విద్యాధరులు, గంధర్వులును
దేవతలందరు మరి మరి చూచిరి
ముదము నందరి పొగడిరి హనుమను

రావణు గర్వము దహించినట్లు
లంకా దహనము పూర్తి చేసెను-
అగ్ని దేవునికి అతిథ్యమిడి
తోక నార్పుకొనె సంద్రమునందు.

॥సుందరమైనది సుందరకాండము॥

❉❉❉

# 55. మారుతి ఆవేదన–మాత పునర్దర్శనము

శక్తిమంతుడు వాతాత్మజుడు
లంకను అగ్నికి ఆహుతి చేసి
సంభ్రమము నందు తోకను ముంచి
మంటలారగా చూచెను లంకను

కాలిన లంక కాంతులు లేక
కన్నుల నీరు తిరుగునట్టుగా
కళా విహీనము దైన్యము నుండగ
పశ్చాత్తాపము - వేదన కలిగి

లంకను కాల్చిన ఫలమేమిటి యని
తనసే తాను నిందించుకొనె-
''ఉత్తము డెవడు కోపము నసలు
ఎదగ నీయడు బుద్ధిమంతుడై.

కోపమ్మును మరి గెలిచిన ధన్యులు
కోపము నిండిన పరుషము లాడును
గురువుల నైనా చంపునువాడు
సాధు జనులను పరిహసించును.

మంచి పెద్దలు తెలియగ లేడు
ఎంతటి పనికీ సిద్ధము వాడు
సర్పము కుబుసము విడిచినట్టుగా
క్షమతో కోపము అంతము కావలె.

సీతా మాత సంగతి మరచితి
లంకను కాల్చితి ఆవేశముతో
పాపాత్ముడను - ద్రోహిని నేను
సిగ్గు మాలిన వాడనైతిని.

లంక పూర్తిగా కాలిపోవగా
అవనిజ - లంకలో మిగులున యింక
స్వామి కార్యము భగ్నము చేసితి
ఘాతు కానికీ కారణ ముయితిని.

లంకను చేరి మాతను గాంచితి
చేసితి కొంత కార్యము సఫలము
ఆవేశమున ఆలోచించక
నాశము చేసితి రామకార్యము.

లంక పూర్తిగా కాలిన పిదప
మాత భద్రముగ నుండుట ఎట్లు
మంటల చిక్కి అసువులు బాసిన
ప్రాణ త్యాగమె నాకు శరణ్యము.

వారిధిబడి - నే మరణించుటయా-
జలచరములకు భోజనమగుచు-
అగ్ని దూకి - నే ప్రాణము విడతున
బ్రతికి యుండి నే నెటు తిరుగుదును.

కపిరాజగు సుగ్రీవుని చూతున
పురుష శ్రేష్ఠులు రామలక్ష్మణుల
ఎటు చూచెదను సిగ్గును విడచి
కోతి చేష్టయని లోకులాడగా.

శక్తి కలిగియు మాతకు రక్షణ
కల్పించక - నా కోపతాపముల
కాల్చితి లంకను - చేసితి ఘోరము
రామలక్ష్మణులు జీవించుట ఎటు?

వానరపతి తన వారందరితో
ప్రాణ త్యాగము చేయుట నిజము
సోదరు లిరువురు ప్రాణములనుకొను
భరత శతృఘ్నులు బ్రతుకుట కల్ల.

ఇనకుల వంశము ధర్మశ్రేష్ఠము
అందు మిగలరు రాజపుత్రులు
అంతట - బాధతొ ప్రజ లందరును
గుండెలు పగులగ వ్యధ నొందెదరు.

ఇంతటి నాశము జరుగును కనుక
దోషము రోషము నిండిన నేను
పాపాత్ముడను బ్రతుకుట తగదు''
ఎంతో చింతలొ మారుతి ఉండగ.

శుభ శకునములు సూచనగా అట
గోచరించెను వాతాత్మజునకు
ఆలోచించగ తోచెను అపుడు
అవనిజ తేజము ఆమె రక్షయని.

''అగ్నిహోత్రమగు సీతా మాతను
హుతవాహనుడు దహింప గలడా?
అగ్నిని- అగ్ని కాల్చుట ఎట్లు
కావున మాతకు - ఆపద రాదు.

ధర్మాత్ముడు అతి తేజోవంతుడు
రఘుపతి రాముని సతి యగు సీతను
పాతివ్రత్యము కాపాడును గద
అగ్నిహోత్రునికి తాకగ వశమా?

లక్ష్మణమూర్తి - భరత శతృఘ్నుల
ముగ్గురు కామె మాతృ సమానము
రామచంద్రుని సతి దేవత కద
ఆమెను తాకగ అగ్నికి తరమా!

తపోరాసి యగు సీతామాత
అగ్నిని తాను - దహింప కలదుగ!
దయామూర్తి యగు అగ్ని దేవుడు
తోకను కాల్చక వదలెను కాదా.

అంతటి అగ్ని నాశ రహితుడు
ఆమెను ఏ విధి కాల్చగ మనసగు''
అని తలపోసెను మారుతి మదిలో
అవనిజ ఎంతో పుణ్యశీలయని.

అంతట మారుతి అంబరమందు
చారణు లనుకొను మాటలు వినెను
''హనుమంతుడు ఆ లంకావాసుల
గృహములు కాల్చెను నిర్భయముగను.

రాక్షస కోలాహలములంకలొ
ప్రతి ధ్వనించెను పర్వత పంక్తిలొ
కోట బురుజులు- ప్రాకారములు
కాలెను-మంటల నేల కూలెను.

కానీ వింత - వింటిర మీరు
సీత మాత్రము క్షేమమునున్నది
అద్భుతమైనది అచ్చెరువైనది
జనక రాజ సుత కుశలము నుండుట''

అమృత తుల్యము లగు పలుకులకు
పరమానందము నందెను మారుతి
మంగళ కరమగు వారి మాటలకు
మదిలో ఎంతో సంతోషించెను

కోరిక సఫలము అయిన మారుతి
సీతామాతను కన్నుల నిండుగ
తిరిగిచూచి- తన తిరుగు యానము
చేయదలచెను శీఘ్రము గాను.

॥సుందరమైనది సుందరకాండము

❃❃❃

## 56. మారుతి మరలివచ్చి కపివీరులను కలసికొనుట

అశోక వనమున శింశుప తరువు
ఛాయలొ నున్న మాతను గాంచి
''తల్లీ! నీదు క్షేమము తెలియగ
తిరిగి వచ్చితిని కుశలమే కదా!''

వాయుపుత్రుని పలుకరింపుతో
ప్రాణములెంతో హాయి పొందగ
జానకి పలికెను - రాఘవు చేరెడి
రామ దూతకు కుశలము తెలిపి.

''నాయన హనుమా! నీ విచ్చటనే
పరులకు ఉనికి తెలియ నీయక
కొంత తడవు విశ్రాంతి నొందుము
దుఃఖము నాకు ఉపశమించును.

తిరిగి నీవు యీ లంక చేరుటకు
ఎన్ని దినములు పట్టునొ తెలియదు
అంతవరకు నే జీవించెదనా!
నిను గాంచుట నామది కుపశమనము.

సంద్రము దాటగ నీతోపాటు
వాయు దేవుడు గరుత్మంతుడు
చాలిన వారలు - కానీ కపులు
ఎటుల దాటెదరొ అంబుధి నంతను.

దనుజుల నంతము చేయ గలిగిన
యోధుడ నీవు నాకు తెలియును
అయినా రాముడు అసురుల త్రుంచి
నను రక్షించుట ఉచితము కావున.

లంకకు రాముని చేర్చుము నీవు
నీపై ఆశతొ బ్రతుకు చుందును''
ఆ మాటలకు మారుతి పలికెను
ఎంతో వినయము హేతుబద్ధముగ.

''అమ్మా! నీవు సందేహించకు
బలముల చాలరు మాతో సురలు
అసురులు అసలే లెక్కకు రారు
రావణుడన్న భయమే లేదు.

రామ.లక్ష్మణులు శర వర్షమును
కురిపించెద రీ లంకాపురమున
రావణు చంపి అసురుల త్రుంచి
చేరును నిన్ను రామచంద్రుడు.

ఎంతో కాలము యీ చెర ఉండదు
అంతవరకు నువు ధైర్యము నుండుము
రామ చంద్రుని - వానర వీరుల
లంకకు తెచ్చెడి భారము నాది.''

ఎన్నో రీతుల మైథిలి మనసుకు
ధైర్యము గొలిపి ఆశను నిలపి
రాఘవు చేరగ ఉత్సాహముతో
అరిష్టమను నొక నగమున కెగిరెను.

శిఖరము లెన్నో గుహలవి ఎన్నో
మద్ది చెట్లు మరి తాళవృక్షములు
అశ్వకర్ణములు వెదురు పొదలతో
వెలిగెను శోభల నగము అచ్చట.

నగమది పద్మక వృక్షములుండి
వనములు వస్త్రము లన్నటులుండి
శిఖరమునందు మేఘము లవ్వి
ఉత్తరీయము అన్నటు లున్నవి.

పూతీవలతో లతలసోకుతో
వివిధ మృగములు మూలిక లుండి
గైరిక ధాతువు లున్న నగమది
సకల శోభల నిలచి యున్నది.

ధాతువు లాగిరి లోచనములుగా
తెరచి చూచునటు లున్నవి అచట
భానుని హస్తము లన్న కిరణముల
నిద్ర లేచినటు లున్నది నగము.

నాగులు యక్షులు గంధర్వులతో
ఋషులు కిన్నరలుండిరి నగమున
సింహములున్నవి-వ్యాఘ్రములెన్నో
సెలయేరులతో సుందరమయినది.

గల గల పారెడి నీళ్ళు - నగమున
గాన సుధనట నింపి వేయుగా
ఎత్తుగ పెరిగిన తరువు లున్నవి
ఎత్తిన చేతుల తపోధనుల వలె.

మారుతి - రాముని మనసున నిలచి
బయలు దేరగా నగమున కెగిరెను
శిలలు చూర్ణమై జారెను ధ్వనితో
గిరిపై కాయము పెంచెను మారుతి.

శ్యామల కాంతితొ మలయ పవనము
శర ద్రుతువులో పలుకరించెను
వెదురు పొదలలో తిరిగిన గాలి
మధుర గానమును నింపెను గిరిపై.

గిరిపై నుండి చూచెను వారిధి
భయము గొలుపునటు ఘోషతొ నున్నది
అంతట ఎగరగ ఉత్తరదిశకు-
వాయు దేవుడై హనుమ నిలిచెను.

బుసలు కొట్టు విష సర్పము లున్నవి
నగమును తాకుచు మేఘములున్నవి
గుహలు మంచుతో నిండియుండగ
ధ్యానము నున్నటు తోచిన వచట

పర్వత మెక్కిపాదము త్రొక్కెను
ఎత్తుగ ఎగరగ మారుతి అంత-
ఆ పర్వతము సకల ప్రాణులతొ
తరుల గిరులతో నేల క్రుంగినది.

విద్యాధరులు భయము చెందిరి
వారి స్త్రీలట జారిన వలువల
చెదిరిన సొమ్ముల ఆకసమంటి
ఎగిరి పోయిరి నగమును వదలి

భయము గొలుపు విషసర్పములన్నీ
జారిపోయినవి నగమును వదలి
కిన్నర నాగులు యక్షులు ఋషులు
తొందరగా ఆ నగమును వీడిరి.

పది యోజనముల వైశాల్యముతో
అంతకు మూడు రెట్లు ఎత్తుగల
అరిష్ట పర్వత మట హనుమంతుని
పదముల పోటుకు పుడమిని కృంగెను.

ఘోష పెట్టుచు భయంకరమ్మగు
అలలు తీరము తాకుచు నున్న
సంద్రమునెంతో సులువుగ దాటుచు
మారుతి సాగెను ఆకసమందు.

||సుందరమైనది సుందరకాండము||

# 57. రామ కార్యసిద్ధి నివేదనము

అంబరమనెడి అంబుధి లోన
సాగెను మారుతి - నౌక రీతిగా
రెక్కలు కలిగినగిరి మాదిరిగా
నభో వీధిలో సాగెను హనుమ.

గ్రహములు తారలు అంతరిక్షమున
తీరుగ నిలచి శోభ లీనగా
ఆకసమును - తా మ్రింగు నట్టుగా
మారుతి దూసుకు ముందుకు సాగెను

మేఘము లందు మారుతి సాగగ
వెంట వాటిని తెచ్చు నట్టుగా
తోచెను-వన్నెల మేఘము లెన్నో
ఆకస మందు చెదరి పోయినవి.

మబ్బుల చాటుగ ఒకచోట
వాటిని దాటి వేరొక చోట
చంద్రుని తీరుగ ఆంజనేయుడు
ఆడెను మబ్బుల ఆకస మందు.

వీరుడు ధీరుడు కార్యశూరుడు
లంకాపురమున శోకము నింపి
అశోకవనము ధ్వంసము చేసి
రావణు మదిలో వ్యథ రగిలించెను.

సీతను గాంచిన కీర్తిమంతుడు
అట హనుమంతుడు గర్జన చేసెను
యానము ఆపెను - పర్వత రాజును
మైనాకుని అట ప్రేమగ తాకెను.

కొంత ముందుకు సాగిన మారుతి
మహేంద్రగిరిని చూచి నంతనే
సింహనాదమును చేసెను అంత
ఆ గిరి కన్నుల విందు చేయగా.

గంభీరముగా మారుతి చేసిన
ధ్వనితో దిక్కులు నిండి పోయెను
మనసు పొంగెను మిత్రులకొరకై
గర్జన చేసెను సంతోషముతో.

వారిధి నద్దరి కూడి యుండిన
వాన రోత్తములు-అంగదాదులు
వాయు పుత్రుని గర్జన వినిరి
ఏమి విందుమో- అని చింతించిరి.

ఉత్తముడతడు జాంబవంతుడు
సంతోషముతో పొంగిపోయెను
వానరు లందర పిలచి పలికెను
తన వారలకు ధైర్యము గొలిపెను.

''మారుతి చేయడు ఇంతటి గర్జన
సీతనులంకలొ చూడకపోయిన
సందేహమ్ము లేదిక మనకు
మాతను, హనుమ చూచెను లంకలొ.''

వానరులందరు ఆనందముతో
గెంతిరి తరువుల గిరి శిఖరముల
కొమ్మల ప్రాకి వృక్షాగ్రములకు
చేరిరి-శాఖల నూపిరి ముదమున.

క్రిందకు దిగెడి వాయు కుమారుడు
గిరివలె, మేఘమువలె నుండెనట
వానరులందరు కరములు మోడ్చి
పులకరింతతో వీరుని చూచిరి.

పర్వతమంత ఉన్న మారుతి
మహావేగము కలిగిన హనుమ
వృక్షసంపదలు తీరుగ నున్న
మహేంద్ర పర్వత శిఖరము చేరెను.

రెక్కలు వీడిన గిరి తీరుగను
గిరిపై దిగెను శ్రీ హనుమంతుడు
మిత్రుల గాంచి సంబరపడెను
వానరు లందరు చెంతకు చేరిరి.

చిక్కక స్రొక్కక-చిక్కుల నొందక
సురక్షితముగను మారుతి రాగా
ఆనందముతో వానరవీరులు
ఫలములు దుంపలు ప్రీతిగ నొసగిరి.

అవధులు దాటిన ఆనందముతో
కిచ కిచ అరచిరి కొందరు కపులు
కొమ్మల నట్టుకు ఊయల లూగిరి
తనివి తీరగా హనుమను చూచిరి.

వృద్ధులు, గురువులు-మన్నన కర్హులు
జాంబవదాది పెద్దలందరకు
పూజ్యుడు అంగద వానరమూర్తికి
మనసు నిండుగా వందన మిడెను.

''చూచితి సీతను'' అను పలుకులను
మాత క్షేమమను చల్లని మాటను
చల్లని జల్లుగ గుండెల చల్లి
గుండెల నంగదు హత్తుకొనెనట.

మహేంద్రగిరిపై సుందరమయిన
వనము నందున వానర శ్రేష్ఠుడు
తీరుగ కూర్చొని చేరిన కపులకు
వివరించెను తన సాహస కార్యము.

''పృధ్వీ సుతను సీతను గాంచితి
లంకలొ రక్కసి కావలి మధ్య
ఏకవేణితో ఉపవాసముతో
రాముని చూడగ ఆత్రము నున్నది.

కృశించిపోయెను ఆ కుసుమలత
కాంతునికెడమై - మెరుగులు తరిగి,
పతినే నిరతము తలచుకొనుచును
ధ్యానమునున్న మాతను గాంచితి.''

''చూచితి సీతను'' అని పలికిన ఆ
ఆంజనేయుని తీయని పలుకుల
సంతోషముతో గంతులేసిరి
అంగదు డంతట హనుమతొ పలికెను.

''వానరోత్తమా! అంజని పుత్రా!
పరాక్రమములో నీ సరి లేరు
ఎంతో విస్తీర్ణము గల వారిధి
దాటి- తిరిగి- యీ దరికి చేరితివి.

అసువులు మావి నిలిపితివయ్యా!
అనిల కుమారా సామాన్యుడవా!
పతివ్రతయగు సీతామాతను
చూచిన నీవు భాగ్యశాలివి.

రాముడు యికపై కలత వీడును
నీ దయవల్ల బ్రతికితి మెల్ల-''
అంగదు డెంతో ప్రీతిగ పలికెను
వానరులందరు ఆనందించిరి.

చేతులు మోడ్చి కూర్చొని యుండిరి
వీరుని సాహస కార్యము వినగ
మారుతి అచ్చట సురల మధ్యన
సురపతి రీతిగ శోభతొ నుండెను.

॥సుందరమైనది సుందరకాండము॥

# 5 8 . లంకాయాన వివరణము

వృద్ధుడు తెలివి పండినవాడు
జాంబవంతుడు - హనుమంతునితో
పలికెను తీరుగ విశదపరచమని
సాహసకార్యము విడువక సుంతయు.

''ఎటు చూచితివి సీతాదేవిని
ఏవిధి నున్నది - రావణు డేమనె
వివరములన్నీ నీవు తెలిపిన -
అవల కార్యము యోచన చేతము.

రాముని చూచుట కచటకు పోగా
ఎంతవరకు మాటాడగ వలెనో -
ఏ పలుకులను నుడువగరాదో -
బుద్ధిమంతుడవు వివరించుమయా.''

అంతట మారుతి మధురముగాను
పలికెను - మాతను మనమున తలచి
శిరసును వంచి - వందనముంచి
వానరవీరుల ప్రేమగ చూచి.

''మహేంద్రగిరిపై నిలబడి నేను
ఎగిరితి - ఆకసమంటి సాగితి
అంతవరకు మీరుందరు చూచిరి
దక్షిణముగ -నే సాగితి మబ్బుల.

మార్గమధ్యమున కాంతుల వెలుగు
కాంతివంతుడు మైనాకుడు అట
ఎత్తుగ ఎదిగి మార్గము నడ్డెను
వాలము త్రిప్పి మోదితి నగమును.

భంగపడి అట నరుని రూపమున
మైనాకుడు నను పలుకరించెను
ఎంతో ఆదరమొలుకగ తీరుగ
వివరించెను తన కథ నా కచ్చట.

''కృత యుగంబున గిరుల రెక్కలను
సురపతి నరుకగ వజ్రాయుధముతొ
వాయుదేవుడు నీ జనకుడు నను
వారిధి జేర్చెను జాలి కలుగగా''

కావున అతిథిగ రమ్మని కోరగ
రాముని కార్యము శిరోధార్యము
పూర్తి చేసి విశ్రాంతి నందవలె
తిరుగు యానమున తిరిగి వత్తునన.

ఆనందించెను - ఆ మైనాకుడు -
సాగితి తిరిగి అంబర వీధిని
ఆపెను మధ్యలొ నాగుల మాత
సురస అను నొకరక్కసి రూపము.

నిన్ను మ్రింగగ వరము పొందితి
వేచియుంటిని నోటపడుమనె
రామకార్యమునఅడ్డము రాకు
స్వామికార్యమున విఘ్నము వలదు.

జానకి ఉనికి ప్రభువుకు తెలిపి
తిరిగి వచ్చినీ నోట బడుదును
రామకార్యమును నెరవేర్చుటలో
సహకరించుటనీ ధర్మము కద.

నా పలుకులను సురస వినదయె
అంతట ఎత్తు పదియోజనములు
వైశాల్యము పదిహేను వుండునటు
ఎదిగితి- సురస ఎదిగెను నావలె.

అంతట నేనుఅంగుష్టమంతై
ఆమె నోటబడి తిరిగి వచ్చితి
నిజరూపముతో సురస నిలచి- నను
దీవించినది జయము కలుగునని-

సాగెడినా నీడది కదలకను
ఉండెను- కారణమది తెలియదయె
వెదకగ- సింహిక కనబడె నాకు
ఆకలి తీరగ మ్రింగెద ననెను.

పెద్దగ ఎదిగెను ఛాయాగ్రాహి
అదేపనిగను నోరు తెరచెను
తిరిగి నేను అతి సూక్ష్మరూపుతో
నోటబడితిని గుండెలు చీల్చితి.

సూర్యాస్తమయము అయినదనుకనే
త్రికూట గిరిపై నున్న లంకను
చేరితి- సీతను వెదుకగ నెంచి-
అంతట రక్కసి - లంక నిలచెను

నాతో తలపడి నిలిపి వేయగా
పిడికిట పొడిచితి నా దానవిని
ఓటమి తెలిపి జయమని పలికెను
చంపక - స్త్రీ యని విడచితి నేను

రాత్రి పూర్తిగా లంక గృహములు
ఎన్నో వెదకితి మాతను కనుగొన
సీత మాత్రము కనబడదాయెను
నామది కలత చెందిన దచట.

రాముని కృపతో కన్నుల ముందర
కనుపించిన దొక సుందర వనము
అందు వెదకితి అమ్మను గాంచితి
అశోకవనమది జానకి యున్నది.

శింశుపతరువు క్రిందను సీత
తపోరాశియై రాముని తలచుచు
మలిన వస్త్రముతొ ఏక వేణియై
దుఃఖము నున్నది - చూచితి నేను.

రక్కసి మూకల కావలి నడుమ
జీవించుట యన కోరిక లేక
ఉన్నది జానకి - చూచితి నచ్చట
అంతలొ వినబడె అందెల సవ్వడి.

రావణాసురుడు సతులతొ వచ్చెను
సీతనుచూచి పలికెను అచట
రెండు నెలలు గడువున్నది నీకు
ఆపై కాదన చంపెద ననెను.

సీత పలికెను కోపము నిండి
రాక్షసాధమా! నాలుక తెగదే -
రాముని దాసుడ వగుటకు తగవు
సీతారాముని పదముల వ్రాలుము.

రావణుడంతట కోపము నిండి
చంపెద ననెను సీత నచ్చటే
ముద్దుల భార్య మరపించినది
కోపము తీర్చ భవనము చేర్చెను -

రాక్షస వనితలు కఠినోక్తులను
పలికిరి - సీతను వొప్పించగను
అలసిరి - నిద్రలో జారిరి వారు
అంతట త్రిజటను రక్కసి మేల్కొని.

పలికెను తీరుగ - స్వప్నము చెప్పి
సీతకు శుభములు చేరువయినవి
ఆమె పాదముల వ్రాలగ రండు
అభయ మీయమని కోరగ రండు-

సీత పరిస్థితి-మనసును తెలిసిన
నే నట ఎంతో కలత చెందితిని
ఏ విధి పలుకుట అని తలచితిని
అంతట పాడితి ఇనకుల చరితము.

కన్నుల నీరు నిండిన జానకి
పలికెను నాతో వివరము లడిగెను
పలికితి నేను- రామ దూతనని
హనుమంతుడను రాముడంపెనని.

తెలిపితి నేను సుగ్రీవు మైత్రిని
రాముడంపిన ఆనవాలని
అంగుళీయకము జానకి కిచ్చి
అడిగితి మాతను కాగల కార్యము.

రాముడు వచ్చి అసురుల చంపి
చేకొనిపోయిన కీర్తి నిలుచుననె-
అంతట మాతను ఏదో గురుతు
రాముని కివ్వగ అడిగితి నేను.

చూడామణిని గురుతుగ యిచ్చెను
రెండు నెలలు తను బ్రతుకుట అనెను
ఆ మాటలకు ఉడికిపోతిని
అశోకవనము ధ్వంసము చేసితి

రావణు డంతట కింకరులనెడి
రాక్షసులను - నాకెదురు నిలపెను
చంపితి వారిని- జంబుమాలిని
సేనాపతులను - మంత్రిసుతులను.

అంతట అక్షుడు రావణు పనుపున
నాతో పోరుకు వచ్చెను - వీరుడు
చంపితి వానిని - సర్వసైన్యమును
వచ్చెను వీరుడు - మేఘనాథుడు.

ఎంతోసేపు పోరెను అతడు
బ్రహ్మాస్త్రమును విడచెను నాపై
దానికి నేను బద్ధుడనైతిని
రావణు చూడగ మనసు కలిగినది.

పేరోలగమున నను నిలబెట్టిరి
ప్రభువు పలుకుల హితము పలికితి
నన్ను చంపగా- రాజు అంతట
ఆనతిచ్చెను తన వారలకు

ధర్మము నెరుగును విభీషణాఖ్యుడు
రావణు తమ్ముడు- దూతను చంపుట
తగదని పలికిమనసు మార్చగా-
వాలము కాల్చగ ఆనతిచ్చెను.

వాలము కాల్చి వాడల త్రిప్పిరి
లంకను వెలుగున చూచితి నేను-
కావలి వారల చంపితి నచట
లంకను దగ్ధము చేసితి నపుడు

మంటల కాలెను లంకా పురము
భయమది కలిగెను మాత గురించి
దుఃఖము నిండి నేనుండగను
మంగళ కరమగు మాటలు వింటిని.

శుభ శకునములు కాంచితి నేను
తిరిగి చూచితి జానకి దేవిని
ధైర్యము గొలిపిఆశీస్సులు గొని
మాతకువందన మిడి నే వచ్చితి.

అరిష్టమను నొక నగమున కెగిరి
అంబరవీధిని సంద్రము దాటితి
రాముని కృపతో మీ ఆశీస్సుల
నెరవేర్చితి సుగ్రీవు నానతి.

శక్తికి తగిన తీరుగ నేను
చేసినదంతయు తెలిపితి మీకు
ఆపై కార్యము ఆలోచించుడు
శేషించినది చేయుట తగును.''

॥సుందరమైనది సుందరకాండము॥

## 59. జనని వృత్తాంత నివేదనము

తిరిగి మారుతి పలికె మధురముగ
''రాముని కార్యము సఫలము అగును
మన సుగ్రీవుని మాట నిలుచును
పుణ్యశీలకు కష్టము తొలగును

లోకములన్నీ కాల్చగలిగిన
రావణు డెంతో తపోవంతుడు
కావున బ్రతికెను తపోబలముచే
మాతను తాకిన వాడైనాను.

సీత దహించును రాక్షసతేని
వీరపత్ని ఆమాత ధ్యేయమది
రాఘవు చేబడి రాక్షసరాజు
శరములు తాకి చావగ వలెనని.

నే నొక్కడనే సరిపోదునట
రక్కసులందర లంకలొ కూల్చగ-
వీరులు మీరు - బుద్ధిశాలురు
మీతోడున్నది విజయము మనదే.

శైల వర్షము నే కురిపించి
లంకను మట్టము చేయగలనుగా -
ఆనతిచ్చిన అంతయు చేతును
సీతామాతను తెచ్చుట ఉచితము.

మందర నగము కదలి వచ్చిన
సంద్రము తీరము దాటి వచ్చిన
యుద్ధమునందు ఎంతటి రిపులు
జాంబవంతుని కదపగ లేరు.

వాలి కుమారుడు అంగదుడితడు
ఎల్ల రక్కసుల ఉక్కడగించును
నీలుడు, పనసుడు కదలి రాగను
మందర నగము ముక్కలు అగును.

మైందుని ముందు ద్వివిదుని పోరున
గెలచి నిలువగ ఎవ్వరి తరము!
బ్రహ్మవరమును పొందినవారు
అమృతపానము చేసినవారు.

లంకలొ నేను చాటి చెప్పితి
కోసల రాజుకు దాసుడ నేనని-
మా సుగ్రీవుడు జయము పొందును
లంక నిలువదని సూటిగ చెప్పితి.

రక్కసి మూకల చిక్కిన జానకి
మనసు నిండుగా రాముని తలచుచు
గడుపుచున్నది రోజులు లెక్కతొ
రాముని రాకకు వేచియున్నది.

ధ్యానమూర్తియై సీత యున్నది
ఏకవేణితో కాంతులు తరిగి
మరణముకామె భయపడకున్నది
రావణు చేతికి లొంగక మాత.

రావణుడెంతో దుర్మార్గముతో
అపరాధమును చేసిన కానీ
జానకి మాత్రము కోపము నింది
కాల్చకున్నది - క్షమతో నుండి.

పంక్తి కంధరుని మరణము తథ్యము
కృంగి కృశించి మాత యున్నది
ఉత్తమురాలి దుఃఖము తీర్చగ
కాగల కార్యము యోచన చేయుడు.
॥సుందరమైనది సుందరకాండము॥

❊❊❊

# 6 0. హనుమదంగద నిర్ణయము-జాంబవంతుని సూచన

హనుమంతుని ఆ పలుకులు వినిన
అంగదు డంత ఆవేశముతో
"అతి బలశాలిని - రావణు త్రుంచగ
నే నొక్కడనే చాలుదు నసలు.

నాతో మీరు యోధులు తోడన
విజయము గూర్చి వేరుగ నుడువన?
సీతను - రాముని చేర్చక మనము
రామచంద్రుని చూచుట యుక్తమ?

మనతో చాలరు సురలు, అసురులు
కావున లంకకు వేగమెపోయి
రావణు త్రుంచి - మాతతొ మనము
సంతోషముతో రాముని చూతము.

మన హనుమంతుడు రక్కసి మూకల
లంకలొ చంపి సులువు చేసెను
మిగిలిన కార్యము మనచే జరుగును
కావున లంకకు పోదము మనము."

జాంబవంతుడు అంగదు చూచి
ప్రీతిగ పలికెను సందర్భముగా
''నీ ఆలోచన సరిగాదేమో!
వెదకుటె గాని తెమ్మనలేదు.

కనుక రామునికి యిష్టము కాదు
మనము లంకకు పోవుట యిపుడు
మన పని నిష్ఫలమగును కావున
వ్యర్థము మనకు బలముల గెలచుట

కావున సీతను తెచ్చుట మనకు
ఆనతి లేదు అంతియె గాక
రాముని ప్రతిన - రక్కసు త్రుంచి
సీతామాత చెరవిడిపించుట.

నా పలుకులు మీరందరు వినుడు
నేరుగ రాఘవు దర్శనమునకు
పోదము రండని'' పలుక - సరియని
పలికిరి కపులు వినయముతోను.

ఓ యువరాజా! నీ పలుకులకు
సిద్ధము మేము యుద్ధము చేయగ
కానీ రాముని ఆనతి లేదు
కార్యసిద్ధికై యోచన చేతము.''

॥సుందరమైనది సుందరకాండము॥

❈❈❈

## 61. మధువన విహారము

జాంబవంతుని పలుకులు వినిన
వానరులందరు - అంగదమూర్తి
ఆంజనేయుడు సరియని పలికిరి
తిరుగు యానము చేయనెంచిరి.

మేనమామ- ఆ సుగ్రీవునికి
దధిముఖుడను కపి పుంగవు డుండి
రక్షణ చేసెడి మధువన మెంతో
శోభకు నిలయము తరులగిరులతో.

వాతాత్మజుని ముందు నిడుకొని
అతని రూపును ముదమున గాంచుచు
మత్తేభమ్ములా వానరవీరులు
నభో వీధిలో నిండుగ ఎగిరిరి.

యువరాజయిన అంగదునందరు
అనుమతి కోరిరి మధువనమందు
మధువు త్రాగుటకు - మనసు లాగగా-
పెద్దలనడిగి సరియని పలికెను.

రామచంద్రునికి ప్రియమగు వార్త
చెప్పగ తహ తహ కలిగిన కపులు
మార్గమధ్యమున - సుందరమైన
మధువనమును వారందరుచేరిరి.

ఆనతి దొరికిన ఆ కపులందరు
మధురఫలములు ఎన్నో తినిరి
మధువును త్రాగుచు - ఆనందముగ
నాట్యము చేసిరి - పాటల పాడిరి.

కుప్పిగంతులు వేసిరి వారు
నవ్వులు విసరిరి సంతోషముతో
గెంతిరితరువుల శాఖలయందు
తల క్రిందుగ వారందరు ఊగిరి.

పాటలు పాడిరి ఆనందముతో
గేలిగ పలికిరి వారిలొ వారు
నవ్వులు రువ్వుచు గంతులు వేయుచు
మధువు త్రాగిమత్తిల్లిరి వారు.

తరువులు కూల్చుచు పూలను రాల్చుచు
మధువు త్రాగుచు ఉనికి మరచిరి
వనమును ధ్వంసము చేసెడివారల
వారించెను అట దధిముఖుడెంతో

ఆగక రేగెడి వానరవీరుల
పరుషము లాడి కొట్టెను ఆపగ
అంతట ఆ కపులందరు - వృద్ధుని
హింసలు పెట్టిరి వనమును విరచిరి.

॥సుందరమైనది సుందరకాండము॥

## 6 2. అంగదుడు దధిముఖుని బాధించుట

మారుతి వారిని చూచి పలికెను
''అడ్డములేక మధువును గ్రోలుడు
అడ్డము వచ్చిన వారందరినీ
ఎదిరి పోరెదను భయము వీడుడు.''

ఆంజనేయుని పలుకులు వినిన
అంగదు డనెను వారిని చూచి
''అనిలాత్మజుని ఆజ్ఞలనన్నీ
ఆమోదింతును మోదముతోను

కావున మీరు స్వేచ్ఛగ నుండుడు
రామ సేవకుల కడ్డము లేదు''
ఆ మాటలకు కపులందరును
సంతోషముతో గెంతిరి తిరిగి.

తరువుల నుంచి తేనెలు దించి
త్రాగిరి - ఆటల పాటల తేలి
వారించిన ఆ వనపాలకులను
కొట్టిరి వారు ఉనికి మరచిరి.

మధు పానముతో మత్తు నిండిరి
ఉన్మత్తముగా పలికిరి వారు
వెకిలి చేష్టలు చిలిపిచేతలు
ఆ కపులందరు చేసిరి వనమున.

దెబ్బలు తినిన తన వీరులకు
ధైర్యము గొలిపెను దధిముఖ డచ్చట
బలమును చూపి వారించెదమన
వీరులుతిరిగి తలపడిరంత.

తరువును పెరకి దధిముఖు డంతట
ఎదురు తిరిగెను ఆ వానరులకు
అతని సేవకులు శిలలు-తరువుల
వానర వీరుల నెదిరి నిలచిరి.

అంగదు డంత-వృద్ధుడు, తాత
దధిముఖునితొ-తను తలపడినాడు
మధువు మత్తులో మితిలేకుండా
కొట్టెను, గీరెను-నేలకు త్రోసెను.

రక్తము కారెను దధిముఖుమేన
దేవ మార్గము కనబడె నతనికి-
వెంటనె వారికి దూరము పోయి
తన సేవకులను పిలచి పలికెను.

''సుగ్రీవునికి ప్రియమీవనము
దివ్యమయినది సురలకు అందదు
తాతల నుండి వచ్చుచున్నది
రక్షణతో యిది నిలచియున్నది.

మన మందరము రాజును చేరి
విన్నవించెదము జరిగిన దంతయు
శిక్షించును ఆ కపులందరిని
రాజ సేవకుల మంతే చేతము.''

మహావీరుడా దధిముఖుడటుల
వన పాలకులతొ పలికి తీరుగా
వారందరితో ఆకసమంటి
ఎగిరెను- రాజుకు వార్త చెప్పగా.

సాగెను అతడు తన వీరులతో
ఏలిక ముందర నిలచి - దీనముగ
పాదము తాకుచు - ప్రభువున కతడు
శిరమున - చేతులనిడి ప్రణమిడెను.

॥సుందరమైనది సుందరకాండము॥

## 6 3. సుగ్రీవుని సంతోషము–కపులకు వర్తమానము

పాదములంటిన కపిశ్రేష్ఠుని గని
ఆదర మొలుక సుగ్రీవుడు పలికె
''అభయము నీకు- భయపడవలదు
జరిగిన దేమది తెలుపుము నాకు.''

రాజు పలుకులకు దధిముఖుడంత
లేచి నిలచి ఆ తేనితొ పలికెను
''ఋక్షరజుడు నీ తండ్రి పాలనలొ
చెక్కుచెదరక వనము నిలచినది.

వాలి పాలన నీ పరిపాలన
వనముకు రక్షణ కల్పించగను
పరులకు చొరగ శక్యముగాని
వనమిపుడెంతో ధ్వంసమైనది.

అంగదాదులు వానరులందరు
చొరవగ వనమున మధువును త్రాగి
తరువుల కూల్చి-శాఖలు విరచిరి
అడ్డగించిన మా గతి చూడు-

శిలలు విసరుచు చిందర వందర
చేసిరి- కావలి వారలనందర
స్వేచ్ఛగ మధువును గ్రోలుచువారు
వనమును ధ్వంసము చేసిరి రాజా!''

సుగ్రీవునితో దధిముఖుడపుడు
ఏదో పలుకుట వినిన లక్ష్మణుడు
కపిరాజును ఆ వివరము లడిగెను
అంతట రాజు బదులు పలికెను.

"లక్ష్మణమూర్తీ! దధిముఖుడిపుడు-
అంగదాదులు మధువనమున బడి
మధువు గ్రోలుచు అల్లరిచేయుచు
ఉన్నారని- నా కెరుక పరచెను.

దివ్య వనమది దేవ వరమది
దానిని ధ్వంసము చేయుట అనిన
మాతను చూచిన సంతోషమును
కపు లందరట పంచు కొనుటయే."

మధువనమందున ఉన్న వీరులు
సీతను వెదుకగ దక్షిణదిశకు
అంగదు వెంబడి సాగిన వారు
ఆనందముతో నుండిరి వనమున.

మధురములగు ఆ పలుకులకెంతో
ముదము నొందిరి రామలక్ష్మణులు
అంతట ఆ కపిరాజు పలికెను
దధిముఖునెంతో ఆదరించెను.

కార్యము సఫలము అయిన సూచన
సంతోషముతో మధువును గ్రోలుట-
సందేహమునకు తావే లేదు
హనుమ చూచెను జానకి మాతను.

అంగదాదులు కార్యము తీర్చి
సఫలీకృతులై వచ్చుచుండిరి
కావున మధువును గ్రోలిరి వారు
ఫలముల కొరకై చేరిరి వనము

ఎంతటి కార్యము అంగదు డుండి-
జాంబవంతుడు తోడుగ నుండి-
హనుమంతుడు మరి ముందు నిలువగా
సఫల మగుటది తథ్యము కాదా.

క్షమియించితిని - కపులందరినీ
వేగమె పోయి వారిని పంపుము -
శుభవార్తను వినిపించగ చెప్పుము
తదుపరి కార్యము చేతము రమ్మను."

సుగ్రీవుడు మది సంతోషించెను
కార్యము సఫలము అయినటు వినిన
రామలక్ష్మణుల వికసిత వదనుల
నిండుగ గాంచి సంబర పడెను.

॥సుందరమైనది సుందరకాండము॥

## 64. సీతా క్షేమ నివేదన

రాజు పలుకులు వినిన దధిముఖుడు
వేగమె చేరెను తిరిగి వనమును
ఆనందముతో అంగదు గాంచి
మధురములైన పలుకులు పలికె

"వనపాలకులు అడ్డగించిరని
కోపమువలదు- స్వేచ్ఛగ నుండుడు
అజ్ఞానముతో ఆపిరి వారు
ఫలములు గొనుడు సందేహించక

మూర్ఛత నిండి తెలివది లేక
అడ్డగించితిమి-మము క్షమియించుము
వనముకు రాజువు- యువరాజువు నువు
వాలి సుగ్రీవుల వలె- మా జేడువు.

వానరోత్తమా! అంగద రాజా
నీ విట నున్న విషయము తెలుపగ
వానరపతి సుగ్రీవుడు మీపై
కోపించకను సంతోషించెను

మీతో పలుకగ ఆత్రమునుండెను
వేగమె రమ్మని కబురిడె నాతో''
అంతట అంగదు డా వానరులతొ
పలికెను తీరుగ వినుమని వారిని.

''విషయము- రాజుకు- రామచంద్రునికి
తెలిసి యుండునని తోచుచున్నది
దధిముఖుడెంతో సంతోషముతో
పలుకుట కదియేకారణమగును.

మధువు గ్రోలి విశ్రాంతి నొందితిమి
మనకిచ్చట ఏపని యిక లేదు
రాజు చెంతకు చేరుట మంచిది
మీరు చెప్పినటు చేసెద నేను.''

అంతట ఆ కపులందరు - వారి
నాయకు నెంతో పొగిడి - పలికిరి
''వినయముగాను పలుకుట నీకు
భూషణమయినది ఓ యువరాజా!

నీ వినయమది కలుగు శుభమును
సూచనచేయుచు నున్నది అంగద!
మేమందరము రాజు వద్దకే
పోవుట కాత్రత పడుచుంటిమయా.

నీ ఆనతి అది లేకను మేము
అడుగు కదపము నిజమిది నమ్ముము''
అనగ- అంగదుడు సంతసమంది
ఎగిరెను వారితొ ఆకసమంటి.

వారందరట ఆకస మెగిరిరి
విసరిన - గిరి శిఖరమ్ముల మాదిరి
మేఘములన్నటు గర్జన చేయుచు
హనుమ దంగదుల ననుసరించిరి.

అంగదాదులు వచ్చెడి లోపల
సీతను తలచి రామచంద్రుడు
చింతలొ నుండగ ఆ కపిరాజు
ఎన్నో రీతుల ధైర్యము గొలిపెను.

'దుఃఖము నీ కిక వలదు రాఘవా!
సీతను చూచి ఉండుట నిజము
గడువుదాటి - వారిట వచ్చుట అన
కార్యము సఫలము అనిపించును కద.

కార్యము విజయము చేయక రాడు
అంగదుడెంతో వీరుడు వినుము
జాంబవంతుడు వారికి అండ
హనుమంతుడును వారితోనె కద.

తాతలనాటి వరమది వనము
ఊరక ధ్వంసము చేయరు వినుము
సంతోషముతో తిరిగి వచ్చుచు
వనము విరచిరి – మధువును గ్రోలిరి.

రఘుపతి రాఘవ! అంజని పుత్రుడు
బుద్ధిమంతులలొ ఉత్తముడతడు
కార్యసిద్ధికి మారుపేరు తను
సీతను చూచి యుండుట తథ్యము.''

అంతట ఆకాశములో కపులు
చేసెడి కోలాహలమును వినగా
కపిరాజంతట వాలము నూపెను
ఆనందమును తెలియబరచెను.

రాముని చూడగ ఆత్రము నున్న
కపులందరట చేరిరి అంత
ఆంజనేయుడు అంగదు డుండిరి
వారు ముందుగ నడచుచు వచ్చిరి.

మహాబాహుడు- రాముని పదముల
సాష్టాంగముగా ప్రణామముంచి
పాతివ్రత్యపు దీక్షలొ నున్న
దేవిని గాంచితి స్వామీ అనెను.

విజయమూర్తి శ్రీ ఆంజనేయుడు
వీరపుంగవుని పదములనంటి
''చూచితి సీతను'' అని పలికి తను-
పదముల వ్రాలెను గుండెలు పొంగగ.

''ప్రాతివ్రత్యపు నియమము నున్నది
పరమసాధ్వి అట సీతామాత
క్షేమము నున్నది చూచితి నే–ప్రభు
కన్నులలోనే దాచి తెచ్చితి.''

కన్నులలోనే దాచి తెచ్చితిని
అనుచు మారుతి గుండె పొంగగా
కనుల బాష్పముల రామపాదములు
కడిగివేసి- తా పునీతు డయ్యెను.

కార్యశూరుడు విజయమూర్తి యగు
హనుమంతుని శ్రీరామచంద్రుడు
ఆనందముతో అభిమానముతో
కాంచెను కన్నుల నిండుగ భక్తుని.

లక్ష్మణమూర్తి – సుగ్రీవుడును
మిగిలిన కపులు జాంబవంతుడు
ఎంతో ప్రీతిగ ఆంజనేయుని
చూచిరి చూపుల – గౌరవముంచి.

॥సుందరమైనది సుందరకాండము॥

✽✽✽

# 6 5. జానకి సందేశ వివరణము : చూడామణి సమర్ప

అంతట ఆ కపిశ్రేష్ఠులు అంగదు
ముందు నిడుకొని - ప్రస్రవణాద్రిని
వెలిగెడు భానుడు రామచంద్రునికి
లక్ష్మణమూర్తికి వందన మిడిరి.

ఆ కపులందరు సంతోషముతో
జనకజ కుశలము ప్రభువుకు తెలిపి
''నీకై జానకి వేచియున్నది
నిన్నే కన్నుల, గుండెల నిలిపి.''

రావణు గడువు చెప్పిరి వారు
రాక్షసస్త్రీల మాటలు చెప్పిరి
అంత - రాఘవుడు అడిగెను వారిని
వివరము లింకా వినిపించమని.

''ఎచ్చట నున్నది నా సీత
మనసెటు లున్నది అసలేమన్నది''
అంతట ఆ కపులందరు హనుమను
కోరిరి - పూర్తిగ విశదపరచమని

వాయుపుత్రుడు వారి మాటలకు
జానకియున్న దిక్కుకు తిరిగి-
వందనముంచి పలికె తీరుగా
రాఘవు కన్నుల చూపులు నిలిపి.

పలికెను తీరుగ అందరు వినగ
''నూరు యోజనములున్న సముద్రము
దాటితి నేను - లంక చేరితి
వెదకితి మాతను - గాంచితి నచ్చట.

దశరథ రామా! మాత మనసది
నిండెను నీపై - మనుటది నీదై
రాక్షస స్త్రీల కావలి నడుమ
బెదరింపులలో బ్రతుకుట నీకై.-

దుఃఖము కామె తగదు రాఘవా!
నిర్బంధములో దుఃఖము నిండి
ఏక వేణితో ఉపవాసముతో
నిను ధ్యానించును ఆమె ఊపిరది.

ఉపవాసముతో నేలపరుండును
శుష్కించినది శోకమూర్తియై
రావణు మాట తలచదు మాత
మరణించుటకై భయపడదామె.

ఎంతో శ్రమతో వెదకితి మాతను
ఇనకుల రాజుల చరితము పలికితి-
నను నమ్మగను సీతామాత
పూర్తిగ - యిచ్చటి వివరము తెలిపితి

సుగ్రీవునితో మైత్రిని విన్నది
సంతోషించెను మదిలో ఎంతో
రోజురోజుకూ పెరిగెడి భక్తితో
రామా! నిన్నే తలచి బ్రతుకును.

రఘువంశాంబుధి నా ప్రభు రామా!
చిత్ర కూటమున కాకాసురుని
వృత్తాంతమును గురుతుగ తెలిపెను
నే కాంచిన దట నీకు చెప్పమనె.

సుగ్రీవుడు తను వినుచుండగను
తన పలుకులను నీతో చెప్పి
ప్రాణప్రదమగు చూడామణిని
నీకు యిమ్మని చెప్పెను మాత.

దివ్యమణిని ఆ చూడామణిని
బంగరుకాంతుల వెలిగెడినగను
కన్నుల కద్దుకు రాఘువు చేతికి
అందించి తను కరములు మోడ్చి.

''జలముల పుట్టిన చూడామణిని
చూచుచు నిన్నే చూచినట్టుగా
బ్రతుకుచున్నది జానకి అచట
మణిశిల తిలకము నుంచుట తలచెను.''

నెల దినములు తను జీవించెదనని
నీతో గట్టిగ చెప్పమన్నది-
ఆపై బ్రతుకుటజరగదన్నది
నీకై రోజులులెక్కిడుచున్నది.

దశరథాత్మజా! తెలిపితి నీతో-
దాశరథీ! నేనంత నుడివితి
సంద్రము దాటెడి సాధనమేది-
ఆలోచించుము పురుషపుంగవా.''

రామలక్ష్మణులు తన పలుకులకు
ఊరట చెందుట మారుతి గాంచి
సంతోషించెను మదిలో ఎంతో
వివరములన్నీ తెలిపెను తీరుగ.

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

# 66. శ్రీరాముని వ్యథ

ఆంజనేయుడు అందించిన - ఆ
చూడామణిని జానకి గురుతును
గుండెల నుంచగ కన్నుల నీరు
తిరిగినదంత గుండెల ఎగసి.

చెంతనె వున్న సుగ్రీవునితో
రాఘువు డనెను మణి చూపించి
''గోమాతకు తన కడుపు పంటను
చూచినరీతిగ నా మనసున్నది.

కన్యాదానము చేసిన జనకుడు
కన్యకు తాను యిచ్చెను మణిని
మణి తలదాల్చిన కన్యారత్నము
ఎంతో శోభతొ వెలుగుచుండెను.

జనకరాజుకు- సురపతి ఇంద్రుడు
సంతోషముతో యిచ్చెను మణిని
ప్రీతిగ యజ్ఞము చేయగ నంత
ఇంద్రుని కానుక అతనికి యీమణి.

వానర రాజా! యీమణి గాంచగ
జనకుడు నాకు - దశరథరాజు
జానకి జనకుడు- జనకభూపతి
కన్నుల ముందర ఉన్నటులున్నది

మణి నా కన్నుల సీత రూపును
ముద్రించినది- ముందు నిలపినది.
వాయునందనా! ఆమె పలుకులు
మరి మరి వినగ మనసగుచున్నది.

సోదర లక్ష్మణ! సీతను చూడక
మణి చూచితి - నా దుస్థితి గనుము
మణి నా దుఃఖము పెంచినదయ్యా!
జానకి ఎంతటి దుఃఖము నున్నదొ.

రాక్షస స్త్రీల కావలి నడుమ
ఏ విధి నున్నది నా హృదయేశ్వరి
ఆమె పలుకులు ఔషధ మగును
నను బ్రతికించగ సంజీవగును.

లక్ష్మణమూర్తీ! నే బ్రతుకను యిక
సీతను చూడక క్షణమిచటుండను
వాయునందనా! నను గొనిపొమ్ము
నా జానకితో నను జేర్చుమయా!!

మధుర భాషణల బింబాధరి అట
నా ప్రాణేశ్వరి నే దరి లేక
దుఃఖము నిండి ఏమి పలికినది?
దుఃఖముతో ఎటు జీవించినది?''

॥సుందరమైనది సుందరకాండము॥

✲✲✲

## 67. హనుమ, మాతనూరడించిన విధము - శ్రీరామునికి విన్నవించుట

మారుతి పలికెను రామచంద్రునితొ
సీత పలుకులు చెప్పెను తీయగ
చిత్రకూటమున వాయస గాథను
వివరించెను అట వివరముగాను.

తిరిగి తిరిగి అది రామపాదముల
వ్రాలిన దంత శరణాగతుడవు
దయతో దానిని రక్షించితివట
బ్రహ్మాస్త్రముతో కన్ను ఊడెనట.

''అలసిన విభుడు-సతితొడ తలనిడి
పడుకొని యుండగ వాయస మొకటి
ఇంద్రకుమారుడు ఆ రూపముతో
వచ్చి గాయమును చేసెను మాతకు

కాకి అంతట వందన మిడెనట
నీకూ - దశరథ రాజును తలచుకు
నీదు ఆనతి గొని ఆ కాకి
ఎగిరిపోయినది దాని గూటికి.

రక్తము కారెను విభుడు లేచెను
దుష్ట కాకిపై - దృష్టి నిలపెను
శిక్షింపగను దర్భను విసరెను
బ్రహ్మాస్త్రముతో అభిమంత్రించి.

అంతటి రాముడు- అస్త్రములందు
సాటిలేని అతి విక్రముడయినా
రాడిటకేల రక్కసు త్రుంచగ
అని పలికినదయ ఓ రఘురామా!

విసరిన దర్భ -మంటలు మండుచు
వెంట బడగను-వాయసమంత
మూడులోకముల రక్షణ లేక
తండ్రి ఇంద్రునికి శక్తిలేకను.

నాగులు-సురలు- అసురులు ఎవ్వరు
యక్షులు గంధర్వులలో వీరులు
రాముని ముందు నిలువగలేరు
ఆ రఘురాముడు-రావలెనన్నది.

వాడి బాణములు రాముడు వేసి
రాక్షసులందర త్రుంచ వలెనని
లేదా - సోదరు లక్ష్మణు నంపి
రక్కసి మూకల రాల్చమన్నది.

పురుషోత్తముడు దశరథ రాముడు
లక్ష్మణమూర్తి - తేజోవంతుడు
అగ్నివాయువు సములు ఇద్దరు
ఎందుకు రక్షణ నొసగరొ నాకు.''

కారణమన్నది - పూర్వజన్మలో
చేసిన పాపము తీరకున్నదని
కన్నుల నీరు నిండగ మాత
పలుకగ - నేను తిరిగి పలికితి

''సీతామాతా! నమ్ము ప్రమాణము
రాముడు దుఃఖము నున్నాడమ్మా!
నీ తలపులతో నిరతము ఉండును
తమ్ముడు పరితాపముతో నిండెను.

ఎంతో శ్రమతో భాగ్యవశమున
నే గాంచితి నిను - ధన్యుడనైతిని
సమయము కాదిది దుఃఖించగను
కష్టము తొలగి శుభములు కలుగును.

నిన్ను గాంచగా సోదరు లిరువురు
ఎంతో ఆత్రము నున్నారమ్మా
లంకను భస్మము చేతురు తల్లీ!
రావణు నాశము జరుగును నిజము.

ఉత్తమురాలివి దేవతవమ్మా!
గుర్తుగ ఏదో రాముని కిమ్మా-
అనగా మాత - అతి రహస్యముగ
ఇచ్చెను మణిని- తెచ్చితి నీకై

తల్లికి వందనమిడి నే నచ్చట
బయలుదేరగా కాయము పెంచగ
కన్నుల నీరు నింపెను జానకి
నిన్నూ తమ్ముని తలచుకొనుచును

అంతట నేను మాతను చూచి
కూర్చొనవమ్మా వీపున నీవు
రామలక్ష్మణ సుగ్రీవులను
తృటిలో చూడగ చేతునంటిని

అపుడు పలికెను జనకరాజసుత
పరపురుషుని - తను తాకనన్నది
రావణు డామెను తాకుట అనిన
అబలయి - మార్గము లేక పోవుటని

కావున నీవే పోయి - సోదరుల
కలిసి - విషయము తెలుపమన్నది
నీకూ లక్ష్మణమూర్తికి మిగిలిన
వానరు లందర- కుశల మన్నది.

బాహు పరాక్రముడగు రఘురాముడు
దుఃఖజలధిని దాటించగను
వలయు యత్నము చేయమన్నది.
వింటివ రామా! మాత పలుకులు.

రాక్షసస్త్రీల పరుషవాక్యములు
వారివల్లను కలుగు బాధలు
తెలుపమన్నది వివరముగాను
తిరుగు యానము క్షేమమన్నది.

మాత పలుకులు ఆమె పరిస్థితి
తెలిపితినయ్యా - నా ప్రభురామా!
క్షేమము నున్నది మాత అచ్చట
నే వచ్చుటకు ఎంతో నొచ్చితి.''

॥సుందరమైనది సుందరకాండము॥

❖❖❖

## 68. తల్లి దైన్యము తొలగించితినని చెప్పి శ్రీరాముని కార్యోన్ముఖుని చేయుట

''నాపై నున్న నీ ఆదరము
అటుపై నన్ను నమ్మిన మాత
తిరుగుయానము చేసెడి నాతో
తిరిగి పలికినది వినుమిది రామా!

దశరథపుత్రుడు శ్రీ రఘురాముడు
యుద్ధమునందు రావణు త్రుంచి
శీఘ్రముగా తన చెఱ విడిపించగ
మరి మరి చెప్పగ - చెప్పెను మాత.

హనుమా! నువ్వు మరియొక దినము
లంకలొ వుండిన హృదయభారము
తీరును అన్నది సీతామాత
తిరిగి వచ్చుట చూతున? అన్నది.

''అంతటి సంద్రము దాటుట ఎట్లు
నీవూ! ఖగపతి వాయుదేవుడు
సరియగువారు - దాశరథులు మరి
వానరవీరులు వచ్చుట ఎట్లు.

కార్యసాధకుడ! ఓ- హనుమంతా!
సాటిలేని ఆ కార్యము తలచి
ఏదో సాధన చేయుము నీవు
ఆలోచించుము సరియగు మార్గము.

''సర్వ సైన్యముతొ రాముడు వచ్చి
రావణు త్రుంచి - నను గొనిపోవుట
వీరునిగా - నా చెఱ విడిపించుట
విభుని విక్రమము జగతికి తెలియుట.''

అంతట మాతతొ పలికితి నచ్చట
వినయము భక్తి నిండిన మాటల
''వానరరాజు సుగ్రీవుడు వీరుడు
కాగల కార్యము నిశ్చయించెను.

విక్రము లెందరొ బలసంపన్నులు
వాయు వేగమున పోగలవారు
నాతో సములు - నన్ను మించిన
యోధులు - సేనలొ కలరని పలికితి.

భూప్రదక్షణము చేసిన వీరులు
వానరులెందరొ వేలు లక్షలు
కోట్ల సంఖ్యలో రామ సేవలో
ఉన్నారన్నా దశరథరామా!

రాజులు ఎన్నడు మేలగువారిని
పంపరు శత్రువు స్థావరమునకు
తక్కువ వారిని పంపుదు రెపుడు
అట్టివాడనే - సంద్రము దాటితి.

లెక్కకు చిక్కని వానరయోధులు
లంకను ముంచెద రంబుధిలోన
రామ లక్ష్మణుల సూర్యతేజులను
నే గొని వచ్చెద లంకకు తల్లీ!

కోదండముతో ఆ రఘురాముడు
విల్లుధరించిన లక్ష్మణమూర్తి
శర వర్షమును కురియు మేఘములు
వచ్చును లంకకు - అతి తొందరలో.

నఖములు దంతము లాయుధములతో
కూడిన యోధులు వానరవీరుల
చూతువు- నమ్ముము-రామలక్ష్మణుల
సేవలొ వారు - తరించనుండిరి.

శత్రుకర్శనుడు అతిపరాక్రముడు
రఘువంశాంబుధి రామచంద్రుడు
వనవాసము - తా పూర్తి చేసుకొని
అయోధ్య చేరును నిన్ను చేర్చుకొని.

జగదభి రాముడు - శ్యామ సుందరుడు
మాతా నీతో రాజ్యము చేరి
పట్టాభిషేకము చేసికొనును - అది
చూతుము మేము జన్మతరించగ.

నీ దుఃఖమును మాతకు తెలిపితి
నీ పలుకులతో - ధైర్యము గొలిపితి
దుఃఖము తీరెను కొంతవరకును
ఉపశమించెను ఊరట చెందెను.

నా హృదయమున కొలువు తీరిన
రామచంద్ర ఓ - దశరథరామా!
నీ బంటును - నే నిరతము నిన్నే
కొలుచు చుండునటు-వరమొసగుమయా.

జీవితేశ్వరిని సీతను తలచి
ఆమె కష్టము-కుశలము తెలిపిన
మారుతి పలుకుల-రాముని హృదయము
పొంగెను - కన్నుల నీరు నిండెను.

అంతట హనుమను గండెకు చేర్చి
జానకి రాముడు – మాటలు రాక
హత్తుకు పోయెను మారుతి నంత
భక్తుని గుండెలో నిలచిపోయెను.

సుందరమైనది సుందరకాండము
అందరు పాడుడు ఆనందముగా
మృదుమధురము మరి రసవత్తరము
మారుతి సీతను గాంచిన వివరము.

లోకాస్సమస్తా స్సుఖినో భవస్తు

సర్వేజనా స్సుఖినో భవస్తు

సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు

**శ్రీమద్రామాయణ మందలి సుందరకాండము సమాప్తము.**

శ్రీ మ ద్రా మా య ణ ము

# యుద్ధ కాండము

(గేయ కవిత)

శ్రీరఘు రాముని - రమ్యచరితము
శ్రీపతి- నరుడై వెలసిన చరితము
శ్రీరాముడు- దశకంఠుని దునిమి
శ్రీని గ్రహించుట- యుద్ధ కాండము.

శ్రీరామ

# శ్రీమద్రామాయణ యుద్ధ కాండము

## (విషయ సూచిక)

❖❖❖

శ్రీ మ ద్రా మా య ణ ము

# యుద్ధ కాండము

(గేయ కవిత)

శ్రీరఘు రాముని - రమ్యచరితము
శ్రీపతి- నరుడై వెలసిన చరితము
శ్రీరాముడు- దశకంఠుని దునిమి
శ్రీని గ్రహించుట- యుద్ధ కాండము.

శ్రీ రా మ

శ్రీమద్రామాయణము

# యుద్ధ కాండము

# శ్రీ కారము

బాల- అయోధ్యా- అరణ్య కాండలు
మణిహారములో మధ్య కిష్కింధ
సుందర- యుద్ధ- ఉత్తర కాండలు
రామాయణ మొక మహా మంత్రము.

రామాయణ రథసారధి పావని
పావని సీతకు ధైర్యము గొలిపి
పురుషోత్తముడు సుర్వైరినిక
దక్కనీయడని నొక్కి పలికెను.

రామచంద్రునికి సర్వము తెలిపి
లంక గుట్టును బయట పెట్టుచు
రావణు బలముల వివరము చెప్పి
శేషించినది చేయగ కోరెను.

శ్రీకరంబుగ వారధి కట్టి
శ్రీయుతమూర్తి వారిధి దాటి
దుష్టశిక్షణ చేసిన చరితము
శ్రీలొసగును మీరందరు పాడుడు.

సీతాచరితము రసవత్తరము
పౌలస్త్యవధ యను పేరును గలదు
గాయత్రి మంత్రము నిక్షిప్తంబై
రక్షణ చేసే దివ్య మంత్రమిది.

✲✲✲

శ్రీరామచంద్రాయనమః

శ్రీమద్రామాయణము

# యుద్ధ కాండము

## 1 వ సర్గము శ్రీరాముడు హనుమంతుని ప్రశంసిం

శ్రీరఘురాముని రమ్య చరితము
శ్రీపతి నరుడై వెలసిన చరితము
శ్రీరాముడు దశకంఠుని దునిమి
శ్రీని గ్రహించుట యుద్ధకాండము.

"సంద్రము దాటుట గురుతర కార్యము
గరుడుడు- అనిలుడు- వాయు పుత్రుడు
దాట సమర్థులు సూర్యనందనా!
వాయునందనుడు విజయము నందెను.

మైథిలి మనసుకు శాంతిని గొలిపి
ఆమెకు బ్రతికెడి ఆశను నిలిపి
లంక యింక మరి నిలువదు అనుచు
నమ్మిక మొదవగ పావని పలికి.

జీవితేశ్వరి కుశలము తెలుపగ
ఉపశమనము నా మదికి కలిగెను
అంతటి సాయము మారుతి చేసెను
మరి ప్రతిఫలము ఏదీ యివ్వగ?

నా అసువులను నిలపిన బంటు
నా బ్రతుకునకే అంకితమయ్యెను
నా ప్రాణేశ్వరి ప్రాణము నిలపిన
నా మారుతికిదె నా కౌగిలి యని."

పురుషోత్తముడు వానరోత్తముని
కౌగలించెను కలిమి కడలిగా
పొంగిన గుండెలో మారుతి భక్తిగ
స్వామి పాదములు ప్రతిష్ఠించెను.

ఏలిక కార్యము చాకచక్యముగ
నెరవేర్చి మరి దానితొ పాటుగ
అనుకూలమగు ఇతర కార్యములు
చేసిన ఉత్తమ భృత్యుడు మారుతి.

జానకీపతి పలికెను అపుడు
రవిసుతుడచ్చట వినుచుండగను
"సీతాన్వేషణ జరిగెను చక్కగ
చక్కబడవలె మిగిలిన కార్యము.

వారిధి తలచిన మది కలవరమగు
కపివీరులతో దాటుట ఎట్లు?
సీత జాడ మరి తెలిసెను గాని
ముందా సంద్రము దాటుట ఎటుల?

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 2 శ్రీరామునికి సుగ్రీవుని ధైర్యోక్తులు

మదిలో దిగులు నిండిన వీరుని
రాముని గాంచి పలికె రవిసుతుడు
''స్వామీ! నీవు సాధారణమగు
నరుని మాదిరి చింతింపకుము.

కృతఘ్నుడెటుల నెయ్యము విడచునో
అటులే నీవు దుఃఖము వదలుము
వైరి జాడ మరి తెలిసెను కాదా!
ఊరకుందురా వీరులిందరు.

సంద్రముదాటి ఈ బలవంతులు
త్రికూటగిరిపై లంకను గాంచిన-
రావణుడింక చచ్చెను అనుకో-
వీరులు అగ్నిలొ దూక సమర్థులు.

సేతువు కట్టక దాట నసాధ్యము
కట్టకట్టి ఈ కడలి దాటిన
పునాదితో ఆ లంకను తేగల
వీర పుంగవులు వానర యోధులు.

ధైర్యము నింది పరాక్రమముతో
నీవు నిలచిన-వీరులు నిలతురు
వానర యోధుల శక్తి నెరుగుదును
వారిని మనము ప్రోత్సహించవలె.

శాస్త్రము నెరిగిన సూక్ష్మ బుద్ధివి
జగతి జయించగ చాలిన శక్తివి
యుక్తమైన యీ సచివులగూడి
సరియగు యోచన చేయుము స్వామీ!

వైరినిత్రుంచి అమ్మను చూతువు-
వానర వీరులు శిలావర్షము
తరుల వర్షమున లంకనుముంచి
దనుజులందరిని రూపుమాపెదరు.

ఏదో విధముగ వారిధి దాటుట
జరిగి తీరునని నా నమ్మకము
శుభ సూచనలు అగపడుచున్నవి.''
అని వినయముగ రవిసుతుడనెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 3 లంకలోగల సైనిక రక్షణ వివరములు హనుమంతుడు తెలుపుట

యుక్తియుక్తముగ రవిసుతుడచట
పలికిన పలుకుల ధైర్యము గలిగెను
పావనితోను పలికెను రాముడు
లంక వివరములు అడిగెను ప్రేమగ.

''వారిధి దాటెడి శక్తిమంతులము
లంకలొ సమరము జరుగుట తథ్యము
నాలుగువంకల లంక జూచితివి
నే వినకోరితి వివరములన్నీ.

దుర్గ రక్షణము ఎటుల జరుగును
కోటలు ఎన్ని? సేనలు ఎన్ని?
ప్రాకారములు ఎటుల కట్టిరి?''
అనగా పలికెను వాక్య కుశలుడు.

''లంక నిలయము సంతోషమునకు
మదపు టేనుగులు-రథ-తురగములు
పుష్కలమ్ముగానున్నవి అచట
లెక్కకు చిక్కని అసురులు గలరు.

నాలుగు దిశలలో నాల్గు ద్వారముల
బలిష్ఠమైన తలుపులుగలవు
బాణ విమోచ-శిలా విమోచక
యంత్రములచట తలుపుల కాయును.

శతఘ్నులెన్నో అమరియున్నవి
వందలకొలదీ వీరుల జంపును
స్వర్ణమయమగు ప్రాకారమ్ము
ఎంతో ఎత్తుగ నిలచియున్నది.

ప్రాకారమునకు ముక్తామణులు
వైడూర్యములు-పద్మరాగములు
అక్కడక్కడ అమరి యున్నవి
దుర్భేద్యముగా తీర్చి యున్నది.

ప్రాకారమును అగడ్తకాయును
అగడ్త-నీటితొ భీకరమైనది
అగడ్త మీదుగ ద్వారమ్ములకు
విశాలమైన వంతెనలున్నవి.

ఆ వంతెనలను ఎత్తిదింపుటకు
యంత్రములచట అమరి యున్నవి
యంత్ర రక్షకుల గృహములు అచటే
యుద్ధ సమయమున వంతెనలుండవు.

ఎత్తిదింపుటకు వీలుకానిదగు
బలిష్ఠమైన మరియొక వంతెన
శోభలీనెడి అరుగులునిండి
నిలిచియున్నది శ్రీరఘురామా!

రావణుడెంతో జాగరూకుడు
అప్రమత్తుడై యుద్ధకాంక్షతో
స్వయముగ సేనల చూచుచుండును
చలించనట్టి నైజము వానిది.

త్రికూటగిరిపై నున్నదిలంక
సురలకు సైతము చేరనసాధ్యము
నాలుగు విధముల రక్షణ మధ్య
దుర్భేద్యముగా నిలిచి యున్నది.

జల దుర్గముమరి పర్వత దుర్గము
దాటగ చక్కని వనదుర్గమది
దానిని దాటగ ప్రాకారమునకు
రక్షగ అగడ్త అగాధమైనది.

సంద్రపు నద్దరి నున్నది లంక
సంద్రము దాట నసాధ్యమైనది
ఇతర దేశముల వార్తలు అచటికి
చేరెడి మార్గము లేనేలేదు.

తూరుపు వాకిట పదివేల సైన్యము
దక్షిణమున మరి లక్ష సేనలు
పది లక్షలు పశ్చిమ ద్వారమునందు
నూరు కోట్లు మరి ఉత్తరమందు.

రథ-గజాశ్వముల అస్త్ర వేత్తలు
ఉన్నత కులముల పుట్టిన వీరులు
రావణు గౌరవ మందిన యోధులు
కోటికి పైగా మధ్యలొ రక్షణ.

స్వామీ! అచ్చటి అగడ్తలన్నీ
పగులగొట్టి ఆ లంకలో వీరుల
రావణు సేనలో యోధులెందరినో
కూల్చితి నేను లంక కాల్చితి.

ఏదో విధముగ వారిధి దాటి
కపులు లంకను కూల్తురు నమ్మము
వాలి కుమారుడు- ద్వివిదుడు- మైందుడు
జాంబవంతుడు- పనసుడు- నలుడు.

సేనా నాయకుడైన నీలుడు
ప్రాకారములతో పెల్లగించుకొని
లంకను తేగా చాలుదురయ్యా!
అంగదాదులకు ఆనతి నిమ్ము.

జైత్రయాత్రకై అనువగునట్టి
ముహూర్తమ్మును నిర్ణయించుము''
అనుచు భక్తిగ అంజని పుత్రుడు
అంజలియొగ్గి విన్నవించెను.

॥శ్రీ రఘురాముని

❇❇❇

## 4 శ్రీరాముని ఆదేశముతో సేనలు కదలుట

మారుతి చెప్పిన లంక వివరములు
ఆకళించుకొని రామచంద్రుడు
పలికెను అపుడు '' ఓ హనుమంతా!
లంకను త్వరలో మట్టము చేతును.

ఓ సుగ్రీవా! సూర్యదేవుడు
దివామధ్యకు రానున్నాడు
దివ్యమైనది ఈ ముహూర్తము
అభిజిత్తనెడి విజయ ముహూర్తము.

నిరాశ నిండి- విషము త్రాగెడి
జీవికి అమృత మందినట్టుగా
జీవితేశ్వరికి నేను వత్తునను
వర్తమానమది అసువులు నిలపును.

ఉత్తర ఫల్గుణి నక్షత్రమిది
పునర్వసులో మరి పుట్టిన నాకు
సాధనతార- కావున నేడే
బయలు దేరుటకు శుభకరమైనది.

రేపటి రోజున హస్త తారలో
నైధనతార నప్పుదు కనుక
బయలు దేరుదము ఇపుడే మనము
శుభసూచనలు తోచుచున్నవి.

దశముఖుడింక మిగలడనునటు
మైథిలినంది ముదము నందుకొని
మనోరథము సిద్ధించునన్నటు
అదరుచున్నది నా కుడికన్ను.''

రాముడు అటుల రవిసుతుగాంచి
పలుకుట వినిన లక్ష్మణ మూర్తియు-
కపినాయకుడు సంతస పడిరి
రామచంద్రుని అభినందించిరి.

కార్య కోవిదుడు రాముడు పలికెను
సేనలు సాగెడి విధము తెలిపెను
''ఓ సుగ్రీవా! లక్షసేనతో
నీలుడు త్రోవలో ముందు సాగవలె.

నీలుడ! నీవు మన సేనలను
ఫలములు-జలములు దొరుకు త్రోవలో
చల్లని అడవులు చిక్కగ నున్న
చక్కని త్రోవలొ నడిపించవలె.

అసురులు-వార్తలు తెలిసినవారై
ఫల-జలములలో విషము కలిపెదరు
ఏమరుపాటు లేకను నీవు
వానర సేనల నడిపించవలె.

జలములందున-పల్లములందు
సేనలు సాగు సమయము కాచి
శత్రు సేనలు హటాత్తుగా మరి
మన సేనలపై విరుచుకు పడుదురు.

కావున కొందరు కపివీరులను
నింగి మార్గమున సాగగ నిమ్ము
శత్రు సైన్యముల ఉనికిని వారు
తెలియగలరు-మనకది ముఖ్యమయా!

సుగ్రీవా! ఈ దుష్కర కార్యము
పరాక్రమముతో జరుగవలెనుగద
బలహీనులను స్వయముగ తెలిసి
వదలివేతము ఇట రక్షణగ.

అతి బలవంతులు-కేసరితుల్యులు
వందలు-వేలు, కడలి పొంగినటు
ముందర నడతురు అగ్ర భాగమున
అందరు ఒకటై సాగుచుండవలె.

పర్వతకాయుడు గజుడు వీరుడు
అతి బలవంతులు గవయు-గవాక్షులు
ఆలమందకు ముందుగబోవు
ఆబోతులవలె సాగుచుందురు.

ఎగిరెడి వారిలొ శ్రేష్ఠుడు అయిన
ఋషభుడు సేనకు కుడిప్రక్కలను-
మదకరి తుల్యుడు గంధమాదనుడు
ఎడమ ప్రక్కలో రక్షణ చేతురు.

ఐరావతమున సురపతి తీరుగ
పావనిపైన అధిరోహించి
సేనలన్నిటిని వీక్షించుచును
సేన మధ్యలో సాగెద నేను.

సార్వభౌమమున ధనపతి తీరుగ
యమునితొ సరిపడు లక్ష్మణమూర్తి
అతి బలవంతుడు-అంగదుపైన
అధిరోహించి సాగును సేనలొ.

భల్లూకములకు నాథుడు అయిన
మహాబలుడగు జాంబవంతుడు
సుషేణుడున్నూ-వేగదర్శియు
సేన మధ్యలో రక్షగ నడతురు.''

రాముని ఆనతి విని వానరపతి
సేనలన్నిటిని రమ్మని చెప్పగ
సమరోత్సాహము నిండిన వీరులు
గిరుల - గుహలను దూకుచు వచ్చిరి.

ధర్మాత్ముడగు రామచంద్రుని
లక్ష్మణమూర్తిని- సూర్యనందనుని
వీరులందరూ పూజించిరట-
వానర సేనావాహిని కదలెను.

రామచంద్రునికి ఇరుప్రక్కలను
ముందు-వెనుకల మదకరితుల్యులు
రవిసుతుపాలననున్న వీరులు
బలగర్వములతొ ముదముగ సాగిరి.

గంతులు వేయుచు- గర్జన చేయుచు
సంతోషముగా ఫలములు తినుచు
తేనెలు త్రాగుచు పూలకొమ్మలతొ
దక్షిణ దిశగా నడచిరి ముందుకు.

కొందరు బలముగ వీరుల నెత్తిరి
ఎత్తిన వారిని నేలకు విడిచిరి
పడిన వారిని గేలి చేసిరి
దశముఖు చంపెదమనుచు సాగిరి.

నీలుడు, ఋషభ, కుముద వీరులు
ముందుగ నడచిరి సేనలన్నిటికి
సేన మధ్యలో రామలక్ష్మణులు
సుగ్రీవుడును కదలిరి శుభముగ.

పదివేల వీరులతొ శతవలి రక్షణ-
కేసరి- పనసుడు- గజుడు- అర్కులు
నూరు కోట్లు కపి వీరులతోను
సేనకు ప్రక్కన రక్షగ నుండిరి.

వానర సేనానాయకుడైన
ఋషభునిసముడు శ్రేష్ఠుడు నీలుడు
అన్నివైపులా సేనల గనుచు
జాగరూకుడై సాగుచుండెను.

దధిముఖుండును- ప్రజంఘుడున్నూ
రంభుడు- రభసుడు సేనలొ తిరుగుచు
త్వరత్వరగా మరి నడవండనుచు
ప్రోత్సాహముగా పలుకుచుండిరి.

రాముని ఆనతి తలను ధరించి
పల్లెల- గ్రామమ్ముల నడుగిడక
ప్రక్కకు సాగక ఒక్క త్రోవలో
సంద్రపు ఘోషగ నడచిరి వీరులు.

వాయుపుత్రుని- వాలిపుత్రుని
అధిరోహించిన రామలక్ష్మణులు
రాహు కేతువులనుండి వెలువడు
సూర్య- చంద్రులుగ అగపడిరపుడు.

వడిగా సాగెడి- వానర సేనతొ
ఎగసిన దుమ్ము వెలుగులు మాపెను
మహానదులును- పర్వతమ్ములు
వెనుకకు పరుగిడుచున్నటు తోచెను.

నిర్మల జలముల సరస్సులున్నచొ
వాటి ప్రక్కగా సేనలు సాగెను
తరులు- గిరులవి అడ్డమురాగా
క్రింది భాగమున సాగిరి మెల్లగ.

సమ ప్రదేశముల పూర్తిగ నడచుచు
ఫలవంతములగు వనములు రాగా
మధ్యలొ నడచుచు వానర యోధులు
రామకార్యమున భక్తిగ సాగిరి.

ఎగసిన ఉత్సాహముతో నడచిరి
మగసిరినిండి పలుకుచు నడచిరి
పరుగిడునట్టు నడచిరి కొందరు
కొందరు నింగిని ఎగిరి సాగిరి.

వనవాసులగు కపులు కొందరు
కిచకిచ అరచుచు వడిగా సాగిరి
ప్రభంజనముగా ధ్వనులెగయునటు
తోకలు నేలకు బాదిరి కొందరు.

తరువుల విరచిరి కొందరు కపులు
వడిగా గిరులను ఎక్కిరి కొందరు
శిలలు-తరులతో ఆటలాడిరి
సింహనాదమును చేసిరి కొందరు.

వందలు-వేలు-లక్షలుగాను
గుంపులు-గుంపులు వీరులు నడువగ
భూమి అనునది కనపడలేదు
అహోరాత్రములు నడచిరి వీరులు.

సీతామాత చెరవిడిపించగ
లంకాపతితో సమరము చేయగ
ఉత్సాహముతొ నిండిన వీరులు
ముహూర్తమైనను నిలువక సాగిరి.

సాగిన సేనలు సహ్యా పర్వతము
మలయ మహీధర ప్రాంతము చేరిరి
అచ్చట వెలసిన వివిధ వనములు
నదులను-ముదముగ చూచెను రాముడ

గిరుల నిలచిన సుమ తరువులట
చల్లని గాలికి సంతోషముతో
వానర సేనావాహినిపైన
పూలజల్లులను చల్లెను శుభముగ.

చందన చర్చగ వీచెనుగాలి
తుమ్మెదపాటల నిండెనుగాలులు
పుష్పసుగంధము మోసితెచ్చెడి
మనోహరములా మలయ పవనములు.

గిరి సానువుల విరగబూసిన
మొగలి పొదలును-తెల్లవావిలి
గురివింద తరువులు-మాధవి లతలు
కానుగుచెట్లు-పొగడ వృక్షములు.

వేగిస చెట్లు-తమ్మికిచెట్లు
బొట్టుగ చెట్లు-మామిడి తరువులు
కాంచన తరువులు-ఖర్జూరములు
ఏరుమద్దులు- ఇరుగుడుచెట్లు.

నేమిచెట్లును-కడిమివృక్షములు
అడవి మల్లెలు- ఈత చెట్లును
పద్మక వృక్షములన్నియుకూడ
కపులధాటికి కదలిపోయినవి.

గిరిశిఖరముపై నిర్మల జలములు
చక్రవాకములు- కారండవములు
పులులు- సింహముల గాంచిరివారు
విష నాగులను గాంచిరి కపులు.

వివిధ పక్షులు వీనుల విందుగ
కోలాహలముగ కూయుచుండెను
జలాశయములలో కపులుగెంతిరి
ఆటలనాడుచు స్నానముచేసిరి.

ఫలములు తినిరి తేనెలు త్రాగిరి
సంతోషముతో గెంతిరివారు
లతలను త్రెంపిరి తరువుల విరచిరి
మత్తునిండి మరి అరచిరికొందరు.

ఎత్తగు తరువులనుండి దుమికిరి
పచ్చిక బయలుల స్వేచ్ఛగ తిరిగిరి
పండిశోభిలు వరిపైరువలె
వానర వీరులు నేలను నిండిరి.

రాజీవాక్షుడు రామచంద్రుడు
వానర సేనావాహిని నడువగ
అలంకారముగ వెలయు తరులతో
నిలిచిన మహేంద్రగిరిని చేరెను.

గిరిశిఖరముపై రాముడు నిలచి
కనబడునట్టి సంద్రము గాంచెను
అనుజుని-సూర్యతనూజుల తోడ్కొని
నడచెను సంద్రము తీరము దరికి.

అమిత వేగముగ ఎత్తుగ ఎగసే
అలలతొ రాళ్ళను కడిగివేసెడి
అంబుధితీరము చేరెను రాముడు
అర్కతనూజుని గాంచి పలికెను.

''నదులకు పెనిమిటి ఈ సాగరము
దీనిని దాటెడి యోచన చేసి
ఉపాయమ్ముగా దాటగవలెను
సేనల నిచటకు రప్పించుమయా!

సుగ్రీవా! మన సేనలన్నియు
సంద్రతీరమున విడిసియుండవలె
సేనను వదలి తిరుగగరాదు
సేనాపతులకు ఆనతినిమ్ము.

శత్రు సేనలు మనవార్తలను
తెలియగ వత్తురు-వారిని ఎంతో
మెలకువతో మన సేనాపతులు
చూచుచుండవలె అహర్నిశమును.

రామాజ్ఞను విని వీరులందరిని
అచటకు రమ్మని చెప్పెను తేడు
నేలను దిగిన ఆ కపిసేన
మరియొక సంద్రము అన్నటుతోచెను.

వానర సేనా కోలాహలముతొ
వినపడకున్నది వారిధి ఘోష
వానర వీరులు- భల్లూకములు
గోలాంగూల వీరులు విడిగా-

మూడు తావులలొ విడిది చేసిరి
ముచ్చట పడిరి సంద్రముగాంచి
వరుణ నివాసము ఆ-సాగరము
ఆవలిగట్టు కనపడకున్నది.

అసురులు దానిని సేవించెదరు
భీకర మృగముల మ్రింగు జీవులతొ
నిండిన వారిధి-రాత్రి పూటలో
అతి భీకరముగ తోచుచుండును.

తెల్లని నురుగుతొ నిశీధియందు
నవ్వుచున్నటు జలనిధి కనబడు
ఎత్తుగ లేచే తరంగములతో
నృత్యము చేయుచునున్నటుతోచును.

చంద్రోదయముతొ పొంగిపోవును
చంద్రబింబములు తేలుచు కనబడు
నక్రగ్రాహములు-తిమింగలములు
పైకివచ్చును పెనుగాలులకు.

పడగలమీద మణులు వెలుగుచు
మహాసర్పములు మిరుమిట్లు గొలుపుచు
మంటలన్నటు కనబడుచుండును
అగాధమై ఆ జలనిధియున్నది.

నౌకామార్గము లేదా జలధికి
జలజంతువులతొ పర్వతాలతో
చొర నసాధ్యమగు రాక్షస నిలయము
వరుణాలయమును గాంచిరి కపులు.

మహాసర్పములు-మకరుల నిండి
ఎగిరి పడినవి ఎత్తగు అలలు
జలబిందువులవి అగ్నికణములై
ఎగిరిన తారలు అన్నటు తోచెను.

నింగియందునా సంద్రములోనూ
అసురాలయములు-మహోరగములు
నిలచియుండగా రెంటికినపుడు
భేదము కనపడకున్నది వారికి.

నింగీ-కడలి తేడాలేక
ఒక్కమాదిరిగ నున్నటు తోచెను
పర్వతాలవలె మేఘము లచట
ఎగసినఅలలు కడలినిఇచట.

అలల ఒరిపిడి యుద్ధ రంగమున
భేరుల ధ్వనివలె విన వచ్చినది
తరంగజలముల ఎగిరిన మకరుల
కోపించినటు కడలి తోచెను.

పెనుగాలులతో నింగి కెగురుచు
ఎగసెడి అలలతొ వారిధి అచ్చట
నింగికి పల్టీ కొట్టుచున్నటు
మహాఘోషతో నుండుట గాంచిరి.

భయంకరమగు కడలిని గాంచిరి.
భీతిగొలిపెడి సంద్రము గాంచిరి
ఎటుల దాటుటని దిగులు చెందిరి
కపులందరును నేలకు దిగిరి.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

# 5 శ్రీరాముని ఆవేదన-తమ్ముని అనునయ వాక్కులు

వారిధి నుత్తర దిశలో సేనలు
నిండుగ దిగినవి- నీలుడంతట
రక్షకులను ఆ సేనకు నిలపెను
మైంద- ద్వివిదులు పర్యవేక్షకులు.

సమరోత్సాహులు విడిసియుండిరి
సమర పండితుడు రామచంద్రుని
తలపుల నిలచెను జీవితేశ్వరి
తలచి తలచి మరి వంతనొందెను.

''సోదర! సీతను చూడక పోతిని
రోజురోజుకు పెరిగెను వంత
ఈ ఎడబాటును మించిన దుఃఖము
అతివ అసువులను నిలుపునాయని.

ఓ మారుతమా- కాంతను తాకి
నన్ను స్పృసించిన మనసుకు హాయి
చంద్రబింబమా! నీవదనమున
ముదిత ముఖమును గాంతును నిత్యము.

భోగభాగ్యములు వలదని వదలి
వెంటవచ్చిన ఆ సుకుమారి
హానాధా! యని ఆక్రందించుట
తలచిన- హృదిలో శూలము దిగును.

వియోగమే మరి కట్టెలు కాగా
అతివ తలంపులు మంటగ తోచి
మదనాగ్ని నను కాల్చుచున్నది
అతివ బాధ విషతుల్యము నాకు.

తమ్ముడ! నేనీ నీట పరుండెద
మదనాగ్ని మరి దూరము అగును
భూదేవత ఒడి నుంటి మిరువురము
బ్రతికి యుంటిమి కారణమదియే.

నీరు దూరముగ నున్నను- పైరు
బ్రతికి యుండును తేమను గాంచి
ఆమె అసువులతో వున్నటు విన్నా-
బ్రతుకుచు ఉన్నాతలపుతో నున్నా!

రిపుని గెలిచి నా లక్ష్మీప్రదను
ఎపుడు గాంతునో లక్ష్మణమూర్తీ!
పద్మముఖిని నే మనసు నిండుగా
చేరదీయుటది ఎన్నటికో మరి.

నాథుడ నేనిట నుంటినిగాని
అనాథగా నట అతివ యున్నది
దశరథ విభుని పెద్దకోడలు
జనక నందినట ఎటు నిద్రించును.

కారు మబ్బులను చీల్చుకువచ్చే
శరశ్చంద్రికగ సీతాదేవి
అసురుల అంతము గాంచినంతనే
ఎప్పుడునాకు కనబడనున్నదో.

పలుచని మేని చిన్నది సోదర!
అన్న- పానములు అన్నీ వదలి
ఉప వాసముతో ఉన్నది కనుక
కన్నుల కందని సన్నము అగును.

గుండియనిండిన ఆనందముతో
కనులనిండుగా కమలలోచన
నాకగబడెడి రోజు ఎన్నడో-
నాకీదుఃఖము తీరుట ఎపుడో.''

రామచంద్రుడు వ్యథలోనుండెను
అంతట సంధ్య అడుగుబెట్టగా
సీతను మదిలో తలచుకొనుచునే
సాయం సంధ్యను ఉపాసించెను.

సంధ్య తీర్చుకొని తమ్ముడు పలికెను-
''శుభనిమిత్తములు ఎన్నో- అన్నా
అగపడుచున్నవి- నిశ్చయమిది విను
విజయలక్ష్మి నిను చేరును నిజము.

లంకాపతిని కూల్చెదవయ్యా!
కోరిక తీరును విను రఘురామా!
అచిరకాలమున వదినను చూతువు
అయోధ్య నేలెద వతి తొందరలో.

నింగీ-నేలను శుభసూచనలు-
వాయువుమెల్లగ వీచుచుండెను
దిశలుప్రసన్నత నిండి యున్నవి
పులుగులుశుభముగ కూయుచున్నవి.

ప్రసన్నముగా శుక్రుడు వెలుగుట
సప్తఋషులు మరి కాంతుల వెలుగుచు
ధృవునకుప్రదక్షిణించు చుండిరి
ఇక్ష్వాకు వంశజుడు రాజర్షియగు

త్రిశంకు రాజు గురుదేవునితో
నిర్మలమ్ముగా భాసిలుచుండెను
ఇక్ష్వాకు వంశపు తార విశాఖ
తేజముతో మరి వెలుగుచున్నది.

అసురులదైన మూలా తార
దానికి ప్రక్కల ధూమ కేతువుతొ
అసుర వినాశము ఆసన్న మను
సూచనగా మరి పొగలతొ నిండెను.

ఫలసమృద్ధమగు వనములున్నవి
స్వచ్ఛ జలములు రుచ్యములైనవి
పద్మసుగంధము నిండె మారుతము
మదిలో కలతను తీర్చును నీకు.

తారకాసుర సంహారమునకు
బయలుదేరిన దేవసేనలన
వానర సేనలు వ్యూహము తీరెను-
దిగులు వదలుము దివ్యస్వరూపా.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 6 రావణుడు హితులతో సమాలోచనము

ఇంద్రుని పోలిన పరాక్రమముతో
లంక హడలగ చేసెను మారుతి
పావని చేసిన పనిని తలచుకొని
సిగ్గుపడెను ఆ లంకాధీశుడు.

శిరసును వంచి పలికెను రాజు
రాక్షస వీరుల చూచి పలికెను
''గాలికి చొరగా శక్యముగాదు-
కపి నగరములో అడుగిడినాడు.

వీరులెవ్వరిని లక్ష్యపెట్టక
నేరుగపోయి సీతను చూచి
ప్రాసాదమును విరుగగొట్టెను
వీరులెందరినొ చంపెను వాడు.

లంకను వ్యాకులపరచెను ఆకపి
ముందు చేయదగు కార్యము తెలుపుడు
మంచియోచన మంత్ర సమానము
జయము నిచ్చునని పెద్దల నానుడి.

మూడు విధముల పురుషులుందురు
ఉత్తములనుచు-మధ్యములనుచు
మూడవవారు అధములనుచును
గుణదోషములు తెలిపెద వినుడు.

మిత్రులు హితులతొ యోచనచేసి
అదృష్టమును నమ్ముకొనుచును
కార్యారంభము చేయునుత్తముడు
ఆలోచనల సాయమునందును.

ఒక్కడె యోచనచేసుకు నిలచి
అదృష్టమ్ముపై భారమువేసి
సాగును ముందుకు-మధ్యముడతడు
కొంతవరకు పని సాగును అతనికి.

అధముడు-వినడు- ఆలోచించడు
అదృష్టమ్మును లెక్కచేయడు-
తానొక పనిని చేయగ తలచి
చేయడు దానిని ఉపేక్షనిండి.

అదే విధముగా మంత్రాంగములో
మూడు విధములు ఉన్నవి వినుడు
సశాస్త్రమైన ఒకే యోచన
మంత్రుల ఉత్తమ మంత్రాంగమది.

తలకొక యోచన మంత్రులు గలిగి
కార్యదృష్టితో అందరు ఒకటై
చేయునట్టిదగు నిర్ణయమ్మది
మధ్యమ మంత్రాంగముగా నిలచెను.

ఎవరికివారే మంత్రుల యోచన-
పరస్పరము మరి ఏకముగారు-
సచివుల యోచన త్రోవకురాదు-
అధమమైన మంత్రాంగము అదియే.

సచివులార మీరందరు చక్కగ
యోచన చేసి కర్తవ్యమును
నిర్ణయించుడు-రాముడు వీరుడు
మనతో పోరగవచ్చును తప్పక.

అతిబలవంతుడు పరాక్రమముతో
జలధిని ఇగిర్చి రాగల ధీరుడు.
తమ్మునితోను అనుచరులతొ మరి
ఏదో విధముగ వారిధి దాటును.

రాముడు వచ్చుట నిస్సందేహము
కపివీరులతో వచ్చుట తథ్యము
కావున లంకను-వీరులందరిని
రక్షణ చేసెడి యోచన చేయుడు.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 7 రావణునికి రాక్షసయోధులు ధైర్యము చెప్పుట

రావణు పలుకులు వినిన వీరులు
బుద్ధిహీనులై నీతిదూరులై
శత్రుపక్షవు బలము తెలియకనె
ప్రగల్భమ్ముగా పలికిరి అపుడు.

''వివిధాయుధముల నందిన సేన
అపారమ్ముగా నున్నది మనకు
భోగవతిని మరి జయించినట్టి
అజేయుడవు నువు అసమానుడవు.

శంకరు సఖ్యము చేసిన యట్టి
యక్షుల మన్ననలందిన వాడగు
ధనపతి నెదిరి ఓడించితివి
యక్షులనిడుమల బెట్టిన ఘనుడవు.

దానవేంద్రుడగు మయుడు స్వయముగా
చెలిమిచేయగ- తన తనయయగు
మండోదరిని భార్యగ నిచ్చెను-
పుష్పకమున్నభాగ్యశాలివి.

'మధువను' - దానవ శ్రేష్ఠుని గెలిచి
ఆతని చెల్లెలు కుంభీనసిని
అందుకొంటివి- సామాన్యుడవా!
రిపులపాలిటి రుద్రుడవగుదువు.

రసాతలమునకు నేరుగబోయి
నాగరాజగు తక్షకుని మరి
శంఖు- జటిలను జయించి, వారిని
వశమున నుంచిన వీరుడవయ్యా!

బ్రహ్మవరమున మరణములేని
కాలకేయులతొ ఒక ఏడాది
పోరి గెలిచిన అమోఘబలుడవు
వారి మాయలు తెలిసినవాడవు.

లోక పాలకుల పాలకుడవు నువు
దేవరాజును గెలిచిన ఘనుడవు
వరుణుని, తనయుల, వారిసేనలను
గెలిచి విజయము నందినవాడవు.

యమపాశమను మహాతరంగము-
యమకింకరులను సర్పములున్న
యమలోకమునకు పోయిపోరితివి
యముని జయించియశము గాంచితివి.

సురపతి సములగు రాజులెందరినొ
క్షత్రియవీరుల జయించినావు
రాముడు అంతటి వీరుడుగాడు
మనలో భీరువు లెవ్వరు లేరు.

వీరబాహువు నీ తనయుడగు
ఇంద్రజిత్తు తను ఒక్కడెచాలును
యజ్ఞముచేసి మహేశుదయతో
వరమునందిన అరిభయంకరుడు.

శక్త్యాయుధములు తోమరమ్ములు
మీనమ్ములను పోలియుండగా-
సురసేనలప్రేగులు, నాచుగ తోచగ
ఏనుగులనెడి తాబేళ్ళుండి.

అశ్వములన్న కప్పలునిండి
ద్వాదశాదిత్యులు కూడియుండగా
మహాగ్రాహములు అన్నటునాడు
పోరగవచ్చిన దేవ సేనలను.

అష్టవసువులు సర్పములగుచు
కరి- తురగములు- రథములన్నియు
జల సమూహముగ ఎగసిపడుచును
వడిగావచ్చిన వాసవు సేనలు.

కాల్బలమ్ములను- ఇసుక దిబ్బలతో
కదనమ్మునకు వచ్చిన సేనను
మేఘనాధుడు జయించినాడు
లంకకుఇంద్రుని తెచ్చెను ఘనుడు.

బ్రహ్మమాటను మన్నించితివి
వాసవుపైన దయచూపితివి
అందుకె వృత్ర-శంబరాసురుల
చంపినట్టి ఆ ఇంద్రుడు బ్రతికెను.

ఇంద్రజిత్తుకు ఆనతినిమ్ము
రాముని-వాని కపిసేనలను
అంతము చేయును చింత వదలుము
హనుమంతు డతి అల్పుడురాజా!''

ఆవిధముగను రాక్షస యోధులు
లంకాపతికి ధైర్యముచెప్పి
యోచనచెప్పి మురిసిపోయిరి
ముదము గొలుపగా పలికిరి వారు.

||శ్రీ రఘురాముని||

❇❇❇

## 8 రాక్షస వీరులు తమ పరాక్రమము తెలుపుట

నీలమేఘము వన్నెతో భాసిలు-
రాక్షస సేనకు అధిపతియైన
ప్రహస్తుడపుడు వినయము నిండి
పలికెను ప్రియముగ రాక్షస రాజుతో.

''దేవ- దానవ- గంధర్వులకు
పిశాచ- పతంగ- మహోరగులకు
నిన్నెదిరించే శక్తి లేదుగద
మరి వానరులా నిన్ను గెలుచుట.

లంకలో ఉంటిమి అనిన ధైర్యమున
అడుగిడ శక్యముగానిది అనుకొని
భోగవశులయి- పానవశ్యులై
ఉండగ- వచ్చెను ఆంజనేయుడు.

మోసముగా ఆ కపి ఇట వచ్చెను
నేనే ఎదిరి వానితో పోరిన
అసువులతో మరి పోనిచ్చెదనా!
అంతము చేయన! ఆ కపి నిచటే.

రాజా! నీవు ఆనతినిమ్ము
భూమియందుగల వనముల- గిరుల
కపులందరినీ అంతము చేతును
చింత వదలుము- నిను రక్షింతును.

''దుర్ముఖు డనెడి అసురుడు పలికెను
కోపము నిండి పలికె రాజుతో
హనుమంతుడు మరి అవమానించెను
ఆనతి నిమ్ము కపులను చంపెద.''

అతి బలవంతుడు వజ్రదంష్ట్రుడు-
నెత్తురు-మాంసము నిండినట్టిదగు
భీకరమైన పరిఘను పట్టుకు
రాక్షస రాజుతొ పలికెను అపుడు.

సేనలు సర్వము నాశనమవగా
సాయములేని రామలక్ష్మణులు
నిరాశతో మరి చింతలొమునిగి
సమసిపోదురు స్వయముగ రాజా!''

''రాజా! నీచుడు- ఆ హనుమంతుడు
అతి విక్రములు రామలక్ష్మణుల
రాముని మిత్రుని ఆ సుగ్రీవుని
చంపి- కపులను వ్యాకుల పరచెద

కుంభకర్ణుని తనయుడు అయిన
నికుంభుడనెడి వీరుడు పలికెను
''రాజా! నీవు లోకమ్ములను
కలత పెట్టగల వీరుడవయ్యా!

రాజా! వినుము ఉపాయశీలుడు
జాగరూకుడు రిపుల జయించును
చక్కని యోచన చెప్పెద వినుము
కామరూపులగు శూరులు- అసురులు.

అసురులతో నువు ఇచటే వుండుము
నేనొక్కడనే రామలక్ష్మణుల
ఆ హనుమంతుని- కోతుల రాజును
కపులందరితో చంపి వచ్చెద.''

వేయిమంది మరి మనుజ రూపమున
భరతుని పనుపున వచ్చితి మనుచు
మిగిలిన సేనలు వెనుక నున్నవని
మోసగించి ఆ కపులతొ కలువగ.

అంతట పర్వతమంతటి అసురుడు
వజ్రహస్తుడు తన నాలుకతో
పెదవులు నాకుచు పలికెను సభలో
''మీరందరిట సుఖముగ నుండుడు.

కొందరు వీరుల మప్పుడు నింగిని
గుంపుగచేరి ఆయుధమ్ములను-
రాళ్ళవానను కురిపించెదము
కపిసేనలవి యమపురి కరుగును.

మద్యపానముతొ క్రీడలతేలుచు
స్వంతపనులలో సుఖముగ నుండును
నే ఒక్కడనే రామలక్ష్మణుల-
వీరులందరిని ఆరగింతును.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 9 అసురవీరుల వీరోచిత వాక్కులు–విభీషణుని హితవు

నికుంభుడు- రభసుడు- సూర్యశత్రువు
సుప్తఘ్నుడును- యజ్ఞహుండును
మహాపార్శ్వుడు- మహోదరుండు
దుర్ధర్షుడును- అగ్ని కేతువు-

రశ్మికేతువు- మహావీరుడు
రావణుతనయుడు ఇంద్రజిత్తును
వివిధాయుధములు అందినవారై
పోరగ పోదుము అనుచు నిలచిరి.

అంతట రావణు సోదరుడైన
విభీషణుడు ఆ వీరులందరిని
కూర్చొనబెట్టి వినయము నిండి
కరములు ముడిచి ప్రభువుతొ పలికెను.

''సామ- దానము- భేదము దాటిన
దండన అన్నది వచ్చునుగాదా-
సామాదులను దాటగలేదు
దండోపాయము సమయముగాదు.

విరక్తులను మరి విషయాసక్తుల
అంతఃకలహములున్న రాజులను
దైవము ప్రతికూలించిన వారల
బాలుర- వృద్ధుల- దీర్ఘ రోగులను-

రాజనీతిని ప్రయోగించి మరి
చక్కగ యోచనచేసిన తదుపరి
దండోపాయము ప్రయోగించిన
కార్యసిద్ధియగు అన్నా! వినుము.

రాక్షసులారా! రాముడు వీరుడు
అప్రమత్తుడు- అరిభయంకరుడు
అంతటివానిని ఎటుల జయించుట
సంద్రము దాటెనుఆ కపిశ్రేష్ఠుడు.

సంద్రముదాటెడి వీరుడు గలడని
కలలో నైనా తలంచలేదు
శత్రువుబలము పూర్తిగ తెలియదు
ముందు వెనుకలు తెలియవు మనకు.

చులకనగా మరి పలుకుట తగదు
రాముని సతిని ఆ వనవాసిని
ఏలిక యెత్తుకు వచ్చెను గాదా
రాముడెట్టి కీడొనరించెనయా.!

ఖరుని చంపెనన- ఖరుడే ముందుగ
రామునిపైకి పోరగబోయెను-
ఆత్మరక్షణము జీవి స్వభావము
కావున రాముడుకూల్చెను వానిని.

రాముడు మరి అపకారముచేసిన
అపుడేరాముని ఎదిరించవలె
పరుని ఆలినిఅపహరించుట
ఘోరకృత్యము పరమపాపము.

అన్యుని ఆలిని చెరపట్టుటది
ఆయుక్షీణము- అపకీర్తియది
ధనక్షయమ్మగు- మనకందరకు
భయము కలిగినది ఆమెవల్లనే.

రామునితో మరి కలహమున్నచో
ఆతని ఆలినితెచ్చుట ఏల?
రాముడు వీరుడు- అంతియెగాదు
ధర్మమార్గమున నిరతము నడచును.

అంతటి వానితొ వైరము తగదు
అకారణమ్ముగ పోరగ తగదు
అపారమైన అ కపిసేనలు
అజేయమైన లంకను కూల్చును.

స్వయముగ సీతను రామచంద్రునికి
సమర్పించక పోయినచో మరి
సర్వనాశనము లంకలొ జరుగును
సబాంధవముగా హరించిపోదుము.

అమోఘమై మరి క్రొత్తవియైన
శరత్కాలపు రవి కిరణములగు
శరములు- రాముడు వదలకముందే
మైథిలి నాతని చెంత చేర్చుము.

రాజా! నిన్ను వేడుచుంటిని
బంధుత్వముచే బ్రతిమాలితిని
మేలుకోరి నే నిజము నుడివితిని
రాముని సతిని రామునికిమ్ము.

కోపము చెరచును ధర్మ- సుఖములను
ధర్మము వలన కీర్తి పెరుగును
దాశరథికి ఆ మైథిలినిమ్ము-
ధరణిని బ్రతుకగ సబాంధవముగా."

విభీషణుడటు పలుకుట వినెను
రాక్షసరాజు సభ చాలించెను
వీరులందరిని వెడలగజెప్పి
అంతఃపురమున అడుగుబెట్టెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 10 విభీషణుడు రావణునకు హితము జెప్పుట

రాత్రి గడచి ప్రాభాతముకాగా
ధర్మార్థములు నిశ్చయించుకొని
దుష్కరకార్యము- రావణు మేలు
చేయగనెంచెను విభీషణుండు.

మదపుటేనుగుల నిట్టూర్పులవి
సుడిగాలులన వీచుచుండెను
ఆభరణమ్ముల- అలంకారముల
గంధర్వ నివాసము అన్నటు తోచును.

తీర్చిన కక్ష్యల గిరి శిఖరమువలె
శోభిలు గృహము రాక్షస తేనిది
మంత్రులు-వేదాధ్యయను లెందరో
గృహావరణలో వసించుచుందురు

రత్నమ్ములతో నిండిన భవనము
సర్పరాజు సదనమ్మును పోలగ
మేఘమునందు సాగు సూర్యుడై
వీభీషణుడు ఆ భవనము జొచ్చెను.

సమర్థులున్ను- ఆప్తులు- వీరులు
కావలి యుందురు ఆ గృహమునకు
శంఖఘోషతో-మంగళ ధ్వనులతొ
స్త్రీలతొనిండి శోభగనున్నది.

వేదవిదుల మంత్రమ్ములు వినుచు
పూజించబడి వారు అందిన
దధి-ఘృతపాత్రలు-మాలలు గాంచెను.
పూజా దినుసులు గనుచుసాగి- అట.

రాక్షసవీరుల స్తుతులనందుకు
నేరుగపోయిన విభీషణాఖ్యుడు
సింహాసనమున విరాజిల్లెడు
కుబేరుతమ్ముని తన అగ్రజుని-

రావణ ప్రభువును లంకేశ్వరుని
దర్శించి అట నమస్కరించెను-
సమయ మర్యాదను పాటించుచును
జయజయ ధ్వనులను పలికెను తేనికి.

కనుసన్నతొ ఆ ప్రభువు చూపిన
బంగరు ఆసనమందు కూర్చొనె-
మంత్రులు తప్ప ఇతరులు లేరు
అదే సమయమని మదిలో నెంచి.

దేశకాలములు తెలిసిన యోగ్యుడు
మంచి చెడ్డలు తెలిసిన వీరుడు
విభీషణుండట స్తోత్రముచేసి
ప్రసన్నునిగా ప్రభువును చేసుకు.

పలికెను ''అన్నా! వైదేహి నిట
తెచ్చినదాదిగ అశుభ సూచనలు
అగపడుచున్నవి- అగ్ని హోత్రములు
ప్రజ్వలించక మెల్లగ మండును.

వేదాధ్యయనపు తావులందున
వంటశాలలు- యజ్ఞశాలలలొ
అగ్నిహోత్రముల నెలవులందున
పాములు కనబడుచున్నవి అశుభము.

హవిస్సులందు చీమలు చేరెను
ఆవుల క్షీరము తగ్గిపోయెను
మదపు టేనుగులు నీరసించినవి
మదించి యుండుట మరచిపోయినవి.

దైన్యమ్ముగను తోచు నశ్వములు
ఒంటెలు- కంచరగాడిదలన్నియు
నిలచిన యట్టి రోమమ్ములతో
కంటి నీటితో కనబడుచున్నవి.

కాకుల మూకలు వచ్చి చేరినవి
మూల మూలలా లంకలొ జేరి
అరచుచు- గృహముల, విమానమ్ముల
శిఖరమ్ములపై మూగుచున్నవి.

గుంపులు గుంపులు గ్రద్దలు వచ్చి
గృహములపైన వ్రాలుచున్నవి
తొలి మలి సందెలొ నక్కలు వచ్చి
అమంగళముగా అరచుచున్నవి.

కుక్కలు మొదలగు మాంసముతినెడి
జంతువులెన్నో పురద్వారమును
చేరుచున్నవి అశుభసూచనగ
అరచుచున్నవి చెవులు చీలునటు.

ఇంతియెగాక అన్నా! రావణ
లంకాదహనము జరిగెను కాదా!
కావునరాజా! ప్రాయశ్చిత్తము
సీతను రాముని కిచ్చివేయుట.

బ్రతుకుపైన మరి తీపిచేతనో
అజ్ఞానమది నిండుటచేతనొ
చెప్పితినిటుల ఓ మహరాజా!
దోషము అని నువు మదిలోతలచకు.

అనుజుని గావున అన్న సౌఖ్యము
అనిశముతలచే హితునిగ నేను
అంతరంగమున నున్నది తెలిపితి
ఆలోచించి ఆమోదించుము.''

అంతఃపురమున నున్నవారికి
లంక పౌరులకు ఈ విషయములు
అన్నీ తెలుసునుకానీ భయమున
నీతోచెప్పగ సాహసించరు.

రాక్షస ప్రభువు కోపమెగయగ
తమ్మునితోనని ''సీతాదేవిని
రాముడు తిరిగి గైకొనజాలడు
సురలొకటైనను నన్ను గెలువరు.''

దేవసేనలను అంతముచేసిన
అతిబలవంతుడు-రణభీకరుడు
రావణాసురుడు తమ్మునితోనటు
అరచి పంపెను-మంచి వినకను
॥శ్రీ రఘురాముని॥

## 11 రావణుడు మంత్రాలోచనకు కొలువుతీరుట

సీతాపహరణ యను పాపకృత్యమున
హితుల అనాదర ఫలితముగాను-
తేజముతగ్గిన రాక్షసరాజు
హితుల అమాత్యుల చూడగనెంచెను.

వికృతరూపులు-కొందరు అసురులు
అలంకారముల కొందరు యోధులు
తేరుకు ప్రక్కల-వెనుకలొ సాగిరి
కరి-తురగములు-రథములుసాగె.

బంగరు కిటికీలున్న రథమును
రత్నపు-పగడపు అలంకారముల
శోభిలు తేరుకు ప్రదక్షిణించి
అధిరోహించి సాగెను సభకు.

గదలూ-గుదియలు-గండ్రగొడ్డళులు
వివిధాయుధములు-వాహనమ్ములతొ
వెనుక నడచిరి రాక్షసరాజుకు
ధ్వనితో దిక్కులు మారుమ్రోగినవి.

మహారథమది మేఘగర్జనతొ
సభాభవనపు త్రోవలొసాగెను
ఆయుధములతో రాక్షసయోధులు
కొందరు తేరుకు ముందుగ నడచిరి.

సభాభవనమును తేరు జేరెను
శంఖ-వాద్యపుఘోష లెగసెను
వెల్లగొడుగు-వింజామరలతొ
వెలిగెడి రాజును స్తోత్రము చేసిరి.

జయజయ ధ్వనులు పలుకుచుండగా
ఠీవిగ రాజు తేరును దిగెను
మనోహరమ్మగు సభా భవనమును
చేరెను-మంత్రులు అనుసరించిరి.

వెండి-బంగరు స్తంభమ్ములతో
స్ఫటికమ్ములతో వెలిగెడి భవనము
విశ్వకర్మ నిర్మించెను-దానికి
ఆరువందల పిశాచుల రక్షణ.

వైడూర్యములు పొదిగినయట్టి
ఉత్తమమైన ఆసనమ్మున
రావణప్రభువు నిండుగ కూర్చొనె
వేగ వంతులగు దూతలగాంచెను.

రాజు పలికెను ''వేగమె పొండు
మహత్కార్యమువచ్చెను వినుడు
అసుర నాయకుల నందరనిపుడే
వెంటబెట్టుకొని త్వరగారండు.''

వార్తను వినిన రాక్షస ముఖ్యులు
ఉన్నపాటున వచ్చిచేరిరి
సింహములన్నీ గుహలోజొచ్చిన
చందముతోచగ లోనికి నడచిరి.

లంకేశ్వరునికి వందన మొంచిరి
యోగ్యతనెరిగి తగు ఆసనములు
రాజు చూపగా అలంకరించిరి
విజ్ఞులు-సచివులు-వందలు చేరిరి.

బంగరుతేరును అధిరోహించి
విభీషణాఖ్యుడు భవనము చేరెను
శుకుడు-ప్రహస్తుడు వచ్చిచేరిరి
తగు ఆసనముల నలంకరించిరి.

స్వామి భక్తులై అసురులుండిరి
అలంకారముల పూలమాలల
గంధాదులతో గుబాళించెను
ఏలికవంక చూచుచుండిరి.

వీరులు- ఆయుధధారులమధ్య
ధీరులు-రాక్షస యోధుల నడుమ
వసువులమధ్య వాసవు రీతిగ
వెలిగెను అపుడు రాక్షసరాజు.

॥శ్రీ రఘురాముని॥

## 1 2 రావణు ప్రసంగము-కుంభకర్ణుని హితవు

కొలువు తీరిన రాక్షసరాజు
ప్రహస్తు మంత్రిని చూచి పలికెను
''ఆయుధ విద్యలొ ఆరితేరిన
చతుర్విధములగు సేనలన్నిటితొ.

నగర రక్షణము పెంచుము వేగమె
హెచ్చరికతొ వారుండగవలెను''
అనతినందిన ప్రహస్తుడపుడు
కార్యము తీర్చి తిరిగివచ్చెను.

''భవనరక్షణ జరిగెను రాజా!
నగర రక్షణ పటిష్ట పరచితి
జరగవలసినది నిర్భయమ్ముగా
జరుపుడు'' అనుచు పలికినంతనే.

రాక్షసరాజు పలికెను అపుడు
సభాసదులతో తీరుగ చెప్పెను
''ధర్మార్థకామముల సంకట స్థితిలో
ప్రియాప్రియములు తెలియగనేర్తురు.

శుభాశుభములు-కీడు-మేళ్ళను
తీరుగ తెలిసిన మీరందరును
అండ నిలువగ కార్యములన్నీ
సఫలమైనవి విజయములందితి.

సూర్య-చంద్రులు-గ్రహములు-తారలు
తోడైయుండగ దేవేంద్రుడు తను
విజయలక్ష్మినిఅందినట్టుగ
మీసాయముతో జయములందితిని.

నేచెప్పెడి ఈ విషయము-ముందే
చెప్పగతలచితి-కానీ తమ్ముడు
కుంభకర్ణుడు నిద్రలోనుండెను
కావున చెప్పుట జరగకపోయెను.

ఆరు మాసములు నిద్రపోయిన
అనుజుడు ఇపుడు నిద్రలేచెను
అతని సమక్షమునందు విషయమును
అంతయు జెప్పెద వినుడు తీరుగా.

స్నేహితులారా! దనుజులు తిరిగే
దండకవనిలో నున్న సీతను
రాముని పత్నిని ఎత్తుకు వచ్చితి
ఆమెకు సరిపడు-సుందరిలేదు.

ఇంతవరకు ఆ సుందరి నాపై
మనసు నిలుపక విముఖత నున్నది
ఆమె అందము ఎందునలేదు
మదనాగ్ని నను దహించుచున్నది.

సుందర వదనముఅందని తేజము
సుకుమారమున సురస్త్రీ చాలదు
అన్నులమిన్న పెనిమిటి కొరకై
కన్నులు మూయక చూచుచున్నది.

ఆ కమలాక్షి ఒక ఏడాది
గడువు అడిగినది సమ్మతించితిని
దూరము నడచిన అశ్వము రీతిగ
అలసిపోతిని కామవశుడనై.

తిమింగలములు-జలజంతువులతొ
నిండిన జలధిని వానర వీరులు-
రామలక్ష్మణులు ఎటుల దాటెదరు?-
దాటరుఅని మరిఅలుసు తగదయా.

ఒక్క వానరుడు వారిధి దాటెను
కావున తీరుగ యోచన కావలె
మీ సాయముతో దేవాసురులను
జయించినాను ధైర్యమునిండి.

రామలక్ష్మణులు- సుగ్రీవుడును
సీత ఉనికిని తెలిసినవారై
వారిధి నద్దరి చేరిరి సేనతో
వారిధి దాటగలేరని తోచును.

సీతను ఇవ్వక రామలక్ష్మణుల
చంపెడియోచన తీరుగ చెప్పడు
చక్కని యోచన చేయుడుమీరు
నే జయింతునని తలంచుచుంటిని.''

రావణుడటుల పలుకుట వినిన
కుంభకర్ణుడు పలికెను సభలో
''సీతనుతెచ్చిన తదుపరి నీవు
యోచన చేయుట సరిగాదుసుమా!

ముందుగ యోచన చేసిన నీకు
అందునుచక్కని ఆలోచనలు
తొందరపడితివి- ప్రాణముపైకి
వచ్చిన తదుపరియోచన తగునా?

కార్యనీతిని తెలియనివాడు
ముందుపనులను వెనుక చేయుచు
వెనుక పనులను ముందు చేయుచు
విఘ్నమ్ములతో చెడును సోదరా!

బలవంతుడును- అజేయుడైనను
బుద్ధిస్థిమితము- నియమము తప్పి
చరించినంతనె అదనునుగాచి
సులభముగా మరి రిపులుగెలుతురు.

క్రౌంచపర్వతము దాటనశక్యము
అయినను హంసలు- క్రౌంచ పక్షులు
అందలి బిలములు నేర్పుగ తెలిసి
అటు- ఇటు తిరుగుట తెలియద నీకు.

అన్నా! నీవు ఆలోచించక
దోషయుక్తమగు పని జేసితివి
విష మాంసమును మ్రింగినట్టి పని
నీవు చేసితివి తెలియక పోతివి.

దైవవశమున రాముడు నిన్ను
చంపలేదు- మరి బ్రతికి యుంటివి
దుష్కర కార్యము తలపెట్టితివి
తప్పదు- తమ్ముడ- తోడుగనుందును.

జరిగినదానికి చింత ఏల యిక
నిను కాపాడగ చాలుదు నేనే-
రిపులను త్రుంచి నీ తప్పులను
దిద్దగ చాలుదు- శ్రద్ధ వహింతును.

నీ శత్రువులు సూర్య- చంద్రులు
అగ్ని- కుబేర- వరుణులైనను
పోరున వారిని త్రుంచెద నేను
దేవరాజు మరి పరుగిడు ననుగని.

రెండవ శరము తీయు లోపలే
అంతము చేతును రాముని నేను
రామలక్ష్మణుల నంతము చేసి
మిగిలిన సేనను నమిలివేతును.

సుఖముగ నీవు పురమున నుండుము
రాముని యమపురి కంపి వత్తును
చాలాకాలము సీతాదేవి
నీ యధీనమున నుండును వినుము''

||శ్రీ రఘురాముని||

❊❊❊

## 13 రావణుడు తనకుగల శాపము తెలుపుట

కుంభకర్ణుడు తెలియజెప్పిన
నీతిని తెలియక రాక్షసరాజు
కోపించుటది తెలిసినవాడై
మహాపార్శ్వుడు పలికెను సభలో.

''పులులు, సింహములు, క్రూరమృగములు
వశించు వనిలో జొరబడువాడు
అచ్చటి తేనెను త్రాగక వచ్చుట
మూర్ఖుడనునది తెలియజెప్పుటే.

సర్వ నియంతవు-శత్రుహరణుడవు
స్వేచ్ఛగ సీతను అందుకో యిక
బలవంతముగా లొంగదీసుకో
ఆపై కార్యము ఆలోచింతము.

సామ- దాన- బేధమ్ములన్నవి
యుద్ధ భీతిగల వారికి మాత్రమె
కుంభకర్ణుడు- ఇంద్రజిత్తుయు
మాతో నున్నచొ మాకీదెవ్వరు.

వజ్రాయుధముతొ సురపతి వచ్చి
రాముని అండగ నిలచిన గానీ
మాముందర మరి నిలువగలేరు
ముందుకు సాగుము సీతను గైకొను.''

అంతట రాజు మెచ్చుకొనుచును
మహా పార్శ్వుని గాంచి పలికెను
''నాకు చెందిన రహస్యమిది విను
పూర్వము జరిగిన సంగతి వినుము.

'పుంజికస్థల' అనెడు అచ్చరను
బలవంతముగా అందుకొంటిని
బ్రహ్మనుజేరి ఏడ్చెను సుందరి
విధాతశాపము నిడెనుకోపమున.

''అంగీకారము నివ్వని అతివను
అహంకారమున మద గర్వమున-
అందుకొంటివా శిరము వెంటనే
నూరు వ్రక్కలై పోవును'' అనెను.

అందువలననే నీ ఆలోచన
అమలు పరుచుటకు అడ్డము వచ్చును
అందుకు దిగులుతొ నుంటినిగానీ
ఆగుదునా మరిసీతను తెచ్చుకు.

సంద్రపు వేగము వాయు గమనము
నాకున్నవని తెలియదు రిపునికి
బలము తెలియక కోపిష్ఠినగు
నాపైకొచ్చి రెచ్చగొట్టును.

రెండు నాలుకల సర్పములన్నటు
విసురుగ పోవు నా శరములను
రాముడు ఎన్నడు చూడకపోయెను
కావున నాతో పోరగ తలచెను.

ప్రాతఃకాలపు రవి కిరణములు
తారల కాంతుల హరించినటుల
రాముని బలము లాగివేతును
సహస్రాక్షుడే నిలువగలేడు.

వరుణుడు వణకును- చాలడు నాతో
లంక నేలిన ఆ కుబేరునే
బాహుబలముతో జయించినాను
అంతటి నాకు రాముడు ఎంత.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 14 విభీషణుని హితవు

కుంభకర్ణుని ఆవేశమును
రావణాసురుని ఆలోచనలను
గ్రహించినట్టి విభీషణాఖ్యుడు
మంచి కోరి తన అన్నతొ పలికెను.

''వక్షస్థలమే పడగగ నుండి
చింతయె చిందెడి విషముగ తోచగ
చిరునగవులను కోరలు గలిగి
అయిదు వ్రేళ్లవిఅయిదు పడగలై.

మైథిలి అనెడిమహా సర్పమును
నీ మెడకు చుట్టిన మూర్ఖుడెవ్వడు?
పర్వత కాయులు ఆ కపివీరులు
లంక చేరకయె ఆపద నాపుము.

రాముని శరముల ధాటి నెరుగవు
అందుకు పలికితి వటుల ప్రహస్తా!
కుంభకర్ణుడు- ఇంద్రజిత్తును
మహాపార్శ్వ-మహోదరాదులు-

కుంభ- నికుంభులు- అతికాయుడును
అంత ఎందుకు మన ప్రభువైనను
రాముని ముందు నిలువగలేరు
నిను రక్షించగచాలగలేరు.

సర్వదేవతలు- సూర్యదేవుడు
నిన్ను దాచినను రాముడు వదలడు
ఇంద్రుని రక్షలొనున్నను విడువడు
మృత్యువు రక్షగనున్నను మిగలవు.

ఆకాశమునకు ఎగిరిదాగినా
పాతాళమునకు పరుగిడి దాగిన
సీతాపతి మరి వదలడు నిన్ను
రాముని శరముల కడ్డములేదు.''

ప్రహస్తుడంతట పలికెను అపుడు
''దేవ- దానవులు- యక్ష- గంధర్వులు
మహోరగులచే మరణము లేదు
మానవ మాత్రుడు చంపుట యెట్లు?''

విభీషణుండా పలుకులు వినెను
రాజు మేలునే మదిలో తలచి
పలికెను సభలో ప్రహస్తుగాంచి
పురుషార్థములను పలుకుల నింపి.

రామ వైరమను వేయి తలలతో
అంతులేనిదగు శరీరమ్ముతో
భయంకరమగు సర్పము-రాజును
పెనవేసినది వదలించవలె.

''తెప్పకొయ్యయే లేక-వారిధిని
దాటశక్యమా? అటులే రాముని
రాక్షసయోధులు గెలువగలేరు
ధార్మికుడాతడు అతి సమర్థుడు.

భూతావిష్టుని కేశము లందుకు
గాలి దించినటు సచివులు మీరు
దుర్మార్గములో సాగు ఏలికను
సన్మార్గమునకు బలిమిని లాగుడు.

రాముడు ఆజిలొ సురవిభుసాటి
సాటిరారు మన లంకాధీశులు
కుంభకర్ణుడు-త్రిశీర్షుడున్నూ
అకంపనుడును ఆగలేరు విను.

లక్ష్మణుడనెడి అగాధ జలధిని
రాముడనెడి బడబాగ్ని యుండగా
ఆ సంద్రమున లంకాధీశుడు
మునగకుండ కాపాడుడు మీరు.

ప్రహస్తుడా! విను తొందరపడకు
అన్న ఉగ్రుడు-స్త్రీలోలుడయి
ముందు వెనుకలు ఆలోచించక
అతివను తెచ్చెను లంకకు చేటు.

సీతను రాముని చెంతకు జేర్చిన
పురముకు-ప్రభువుకు-క్షేమంబగును
శత్రు బలమును సచివులు తెలిసి
వృద్ధి-క్షయములు యోచన జేసి.

చక్కని యోచన స్వామికి చెప్పి
ఏలిక క్షేమము కోరగవలెను.''
అని సద్గుణుడు-వాక్యకుశలుడు
విభీషణాఖ్యుడు పలికెను సభలో.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 15 ఇంద్రజిత్తు ప్రగల్భము-విభీషణు హితవు

లంకాపతి సుతుడంతట పలికెను
విభీషణాఖ్యుని హేళన జేసెను-
''మన వంశమున- ఇతర వంశముల
ఇంత భీరువుగ పలుక రెవ్వరును

ఇంద్రుని గెలిచి నేలకు దించి
చెరలోనుంచిన వీరుడ నేను
ఐరావతము అరచుచుండగా
రెండు దంతములు విరచిన ధీరుడ.

సురలందరనూ పరుగిడజేసితి
దైత్యనాయకుల మదమణగించితి
అంతటి నేను అతి సామాన్యుని
రాచ పట్టెనుజయించలేనా?''

ఇంద్రతుల్యుని తేజోవంతుని
ఇంద్రజిత్తును గాంచి అంతట
ఆయుధధారుల శ్రేష్ఠుడు అయిన
విభీషణాఖ్యుడు పలికెను తిరిగి.

''యోచనచేసే శక్తిలేదు మరి
నాయన! నీవిటు పలుకుట తగదు
బుద్ధి ఇంకను పరిణతనొందని
పిల్లవాడవు దురుసు వదలుము.

అన్న క్షేమము కోరి పలికితి
ఉన్న విషయము తిన్నగ చెప్పితి
అడ్డమువచ్చే అజ్ఞానివి నువు
తండ్రి నాశమునీకు సమ్మతము.

దుర్మతివీవుఅతిసాహసివి
బాలుడవీవు జ్ఞానహీనుడవు
పుత్రాకృతితోపుట్టిన వైరివి
నిన్ను చంపుటఉచితమైనది.

అణకువనెరుగవు మూర్ఖుడ వీవు
గర్వము నిండినఅల్పబుద్ధివి
మంత్రాంగమునకునిను రానిచ్చిన
వానిని కూడాచంపగవలెను.

యమదండములను పోలు శరములను
సూటిగ పోయే రామబాణముల
అడ్డు పెట్టగల సాహసియెవ్వడు?''
అనుచు రావణునిచూచి పలికెను-

''రాజా! వినుము వివిధ రత్నములు
ఆభరణమ్ములు వస్త్రమ్ములతో
సీతనురామునిచెంత జేర్చుము
భయమును వదలి సుఖముగ నుందము.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 16 రావణు తిరస్కారము-విభీషణుడు అన్నను వదలుట

తమ్ముని హితము వినక రావణుడు
తొందరపడి అట తూలనాడెను-
తరుముకువచ్చే కాలముగెలచెను
తమ్ముని వైరిగ చేయగచాలెను.'

''ఓ విభీషణా! దుష్టబుద్ధివి
జ్ఞాతులతీరు తెలియునునాకు
విషసర్పములతొ మెలగవచ్చును
వైరితొ స్నేహము చేయవచ్చును.

కానీవినుము నెయ్యము చేయుచు
రిపుని కొలిచెడి వారిని మాత్రము
దరిరానీయక చూచుకొనవలె
జ్ఞాతులుఅదనుకు వేచియుందురు.

తియ్యగ పలుకుచు ద్రోహముచేతురు
కార్యసాధకుని- ప్రధానవ్యక్తిని
ధార్మికుని మరి శూరుని వారు
అవమానింతురు కీడుకోరుచు

ఓ విభీషణా! పద్మకవనమున
తమను పట్టగా మనుజులురాగా
అచటి ఏనుగులు తమలోతాము
పలికిన పలుకులు వినిపించెదను.

అగ్నిహోత్రము ఆపదనిడదు
పాశమ్ములతో భయమేలేదు-
మనుజుల వెంటవచ్చు గజములతో
జ్ఞాతులవల్లనె కీడుమూడును.

మనలనుపట్టగ తగుమార్గమును
ఆ ఏనుగులే చెప్పును వారికి
అన్ని భయములను మించిన భయము
జ్ఞాతిభయమని అన్నవి కరులు.

సంపద ఉన్నది గోవులందున
ఇంద్రియ నిగ్రహమున్నది ద్విజులలో
చాపల్యమది స్త్రీలనున్నది
అపకారమ్ము జ్ఞాతులనున్నది

నా సంపద నీ కసూయయ్యైనది
తామరాకులో నీటి బిందువులు
కలవనట్టుగా- దుష్టుడు జ్ఞాతి-
ఆదరించినను కలవడు నిజము.

పూవులతేనె త్రాగిన మధుపము
వదలిపోవును అపువ్వులను
అదేవిధముగా సుఖములందితివి
తుమ్మెదరీతిగ నడచుచుంటివి.

ఏనుగు జలములో స్నానముచేసి
తిరిగిదుమ్మునే చిమ్ముకొనునయా-
అటులే దుష్టుడు నెయ్యము చేసియు
తానే స్వయముగ విరోధించును.

శరత్కాలమున మేఘములవ్వి
గర్జించినను నేల తడవదు
దుష్ట స్నేహితుని పలుకులు-నటనే
సాయము అన్నది చేయడెన్నడూ.

తమ్ముడవైతివి బ్రతికిపోతివి
అన్యుడయినచో అంతము చేతును
కులపాంశుడవు ఛీఛీ పోయిక''
అనుచు కటువుగ పలికె రావణుడు.

పరుషవాక్యములు వినిన తమ్ముడు
సచివులు నలుగురు తోడురాగను
గదతో నింగికి ఎగిరెను అపుడు
రాజునుచూచి పలికెను తిరిగి.

''అన్నా! మదిలోనున్నది అనుము
జ్యేష్టుడవీవు తండ్రితొ సముడవు
బదులుపలుకను-మాన్యుడవీవు
ధర్మము తప్పిన వాడవు ఇపుడు.

నీవు పలికినది సత్యదూరము
పరుషవాక్యములు సహించలేను
మేలుకోరి నే పలికితిగాని
మృత్యువు చేరగ మంచిపట్టదు.

సామాన్యముగా సుఖమగు మాటలు
చెప్పెడి-వినెడి వారుందురయా
కటువుగ నుండెడి హితవచనమ్ములు
చెప్పెడి వారు దొరకరు రాజా!

మండెడి గృహమును చూచినయంత
ఊరకుండుట ఎటుల జరగదో
అటులే-కాలము కాటువేయుట
చూడలేకనే హితము నుడివితి.

అస్త్రవేత్తలు, శూరులైనను
కాలము మీదకు వచ్చినంతనే
ఇసుకతొ కట్టిన ఆనకట్టవలె
కూలిపోదురు ప్రవాహమ్మున.

వాడి శరములు రామచంద్రుడు
నీపై విడచుట చూడకూడదని
వినయమునిండి హితవు నుడివితి
వీడనుంటినీ లంకనందుకు

స్వస్తినీకు మరిఅన్నా-నీవు
సుఖముగ నుండుము నను మన్నించుము
ఓ నిశాచరా! నీదుమేలు నే
కోరినుడివితి కాలదన్నితివి.

ఆయువు తీరిన వారందరును
సమసిపోదురు అటులే యింక
మడసినవారికి హితులు చెప్పెడి
మంచి మాటలు మరణించినటే.''

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

# 17 విభీషణుడు శరణుగోరుట-వానర యోధుల మదిలో యోచన

విభీషణుండటు అన్నతొ పలికి
హితము వినని ఆ రాజుకు స్వస్తితొ-
లంకను వదలెను తన సచివులతో
రాముని చేరగ బయలుదేరెను.

కన్నులు చెదరే మెరపువోలెను
మేరు పర్వత శిఖరమువోలె
సచివులతో మరి చేరగ వచ్చెడి
విభీషణాఖ్యుని చూచిరి కపులు.

వానరరాజు పలికెను అపుడు
ఆయుధములతో వచ్చుచుండెను
అసురుడు మనలను చంపగవచ్చును
అన విని కపులు వీరోచితముగ

తరులు-గిరులతో నిండుగ నిలచి
అనతి యిచ్చిన అల్పతేజులగు
అసురుల నిపుడే హతమార్తుమని-
నేల రాల్చెదముఅనుచు పలికిరి.

అటులా వీరులు పలుకుచుండగా
జలధికి ఉత్తర తీరము దరికి
విభీషణాఖ్యుడు చేరి పలికెను
వానర వీరులు వినగా పలికెను

''లంక నేలెడి రాక్షసరాజు
దురాచారుడు రావణుడాతడు
అతని తమ్ముడగు విభీషణుడను-
రాముని సతిని అన్న హరించెను.

జనస్థానమున పులుగుతొ పోరి
జానకి దేవిని అపహరించెను
దనుజాంగనలను కావలి యుంచెను
అతివను నిర్భంధములో నుంచెను.

సీతను రామునికిచ్చి వేయమని
వేయి విధముల చెప్పితి నేను
వినకపోయెను బ్రతిమాలినను
వాని కాలము ముగిసిపోవును.

హితము వినకను హీనవాక్యముల
అవమానించెను బానిస మాదిరి
భార్యా బిడ్డల వదిలి వచ్చితిని
రామచంద్రుని శరణు వేడగ.

సర్వలోకముల శరణ్యుడగును
మహాత్ముడాతడు- రఘుకుల తిలకుడు
శరణు కోరితిని పురుష పుంగవుని-
తెలియజెప్పుడు వేగమె పోయి''

సూర్యకుమారుడు రామ ప్రభునకు
తెలియబరచెను ఈ విధముగను
''రావణు తమ్ముడు విభీషణుండు
నలుగురు సచివులతోడ వచ్చెను.

శరణు వేడగ వచ్చెను నిన్ను
సావధానముగ ఆలోచించుము
రాజనీతిలో ఉపాయములలో
సేనా వ్యూహము తీర్చి దిద్దుటలో.

గూఢచారులను నియోగించుటలో
జాగరూకుడవు- నీ వారమగు
కపి వీరులకు రిపుల వల్లను
హాని కలుగక మెళకువ గావలె.

శుభమగు నీకు శ్రీరఘురామా!
అసురులు మాయతొ తిరుగజాలుదురు
ఎంతమాత్రము నమ్మగ తగదు
వచ్చినవాడు గూఢచారి యగు.

మనలో కలసి మనలో మనకు
భేదము పెంచి సఖ్యము త్రెంచును
మన లోపాలనుసర్వము తెలిసి
సమయము చూచి హాని చేయును.

మిత్రులు పంపిన సైనిక బలమును
అడవుల నుండి వచ్చిన సేనల
జీతమ్మునకై వచ్చెడి వారిని
నిర్భయమ్ముగా చేర్చగ వచ్చును.

శత్రు పక్షపు వ్యక్తిని మాత్రము
నమ్మగ తగదు- రామా! వీడు
నీ శత్రువునకు తమ్ముడు అగును
నమ్ముట ఎట్లు? నమ్మకూడదు.

క్షమాభిక్ష నిడు దయాపూర్ణుడవు
అందువల్లనే చెప్పుచుంటిని
రావణు వేగులవాడగు నీతడు
శరణు కోరుటది మాయయే సుమా!

నమ్మిక మొదవగ సంచరించును
సమయముకాచి దెబ్బతీయును
శరణాగతునిగ వేషము వేసుకు
వచ్చెను-వీనిని నమ్మగ తగదు.

ప్రాజ్ఞుడైనను శత్రువు ఇటులే
శత్రు సైన్యముల గుట్టు తెలుసుకు
గుడ్లగూబ మరి వాయసమ్ములను
చంపిన రీతిగ చంపును స్వామీ!

క్రూర రావణుని తమ్ముడాతడు
కావున వానిని, వాని సచివులను
కనికరించక దండించుటది
కర్తవ్యమని కపిరాజనెను.

రాముడు పలికెను వీరుల గాంచి
''సంకట సమయము వచ్చినప్పుడు
ఒక్కడు చెప్పెను గాదా అనుచు
మిన్నకుండుట ఉచితముగాదు.

మిత్రులు మాత్రము తమకు తోచినది
తప్పక చెప్పుట సమయోచితము
కావున మీరు మీ యోచనలను
చెప్పుట ధర్మము'' అనగా వీరులు.

''ముల్లోకములలో సర్వము తెలిసిన
సత్యవ్రతుడవు- ధార్మిక శీలివి
మంచి యోచన చేయగ చాలిన
వీర విక్రమ సంపన్నుడవు.

మిత్రాధీనుడ వన్నది తెలుపగ
అడిగితివంతే మమ్మందరినీ
బుద్ధిమంతులు నీ ఈ సచివులు
విశదపరచెదరు వారి యోచనలు.

అంగదుడంతట పలికె ప్రభువుతో
''శత్రు పక్షపు వాడితడగుటచె
సందేహమునకు తావుగలదయా!
మనలో చేర్చుకు పరీక్షింతము.''

శరభుడు పలికెను వినయము నిండి
''పరీక్షకొరకై చేర్చినఆపద
వివేకమ్ముగల గూఢచారిని
నియోగించిన నిజము తెలియును.''

వృద్ధుడు- జ్ఞాని- జాంబవంతుడు
నీతి శాస్త్రముతో యోచన చేయును
ఆతడు పలికెను యుక్తియుక్తముగ
''రామా! ఈతడు రిపునికి తమ్ముడు.

అన్న తిట్టెనని నుడివెను మనతో
అదికారణమా! లంకవదలుటకు
అసురుడు మున్ను ఎరుగడు నిన్ను
అండకోరి మరి వచ్చెను దూరము.

ఆపదలో తన అన్నను వదలి
రిపునిచేరుటది నమ్మశక్యమా?
ప్రదేశమ్ము- మరి సమయము కూడ
ఈతడు రాదగునట్టివి కావు.

అన్నను వదలి నిన్ను చేరుటది
అన్నిటికన్నా సందేహమది
వీనిని మనము నమ్మగలేము
వీడుము వీనిని- వీడు నపాయము.''

మైందుడు పలికెను సమయోచితముగ
''గూఢచారి అట నేర్పుగ పలికి
మాటలతో మరి మనసును తెలిసిన
ముందుకార్యము చేయగ వీలగు.''

సకల శాస్త్రములు తెలిసినవాడు
జ్ఞాన నిధియగు వాయు పుత్రుడు
ఉత్తమ సచివుడు అయిన పావని
పలికెను ప్రభువుతొ వందనముంచి.

''మతి మంతులలో మణిపూసవయా-
కార్య నిర్ణయమునందు దిట్టవు-
నీ నిర్ణయమును నచ్చ చెప్పుటలొ
నిన్ను మించిన నేర్పరి ఎవరు?

దేవగురువు మరి చాలడు నీకు
దేవా! నేను చెప్పగ తగను
ఘనత చాటగ చెప్పుట లేదు
విబుధుల చులకన కొరకై చెప్పను.

రావణు తమ్ముడు లంకలొ అపుడు
నాకనుకూలము పలికెను గనుక
అదిమది నుంచి పలుకుట లేదు
నీపై గౌరవముంచి పలికెద.

యదార్థమని నామదికి తోచినది
నుడువు చుంటిని విను శ్రీరామా!
గుణదోషములను పరీక్షచేసి
నిర్ణయించుట యుక్తము అనిరి.

చేర్చుకొనక మరి పరీక్షించుటెటు?
గుణము తెలియక చేర్చుకొనుటెటు?
కావున అట్టి యోచన స్వామీ
అన్యోన్యాశ్రయ దోషమైనది.

మరియొక యోచన-వేగును పంపుట
ముందరనున్న వాని వద్దకు
వేగును పంపిన విషయము తెలియున?
అప్రమత్తుడై వాడు ఉండడా?

మరియొక మంత్రి చెప్పిన యోచన
స్థలము-సమయము రాదగ నట్టివి
అదియును కూడ యోచన చేసిన
తగదని చెప్పను నామది స్వామీ!

పురుషోత్తముడవు నీవని తోచి
పురుషాధముడు అన్న అనుచును
ఈ విభీషణుడు తన విమర్శతో
మదిలోతెలిసి యుండవచ్చును.

అన్న దుష్కృతము తెలియును స్వయముగ
మంచి చెప్పగా వాడు వినడయె
ఖర- దూషణులను కూల్చితి వీవు
కోలతొ వాలిని రాల్చితి వీవు.

నీ పరాక్రమము తెలిసియుండును
సంద్రము దాటగ నుంటివి నీవు
కావున నిన్ను చేరగ వచ్చెను
సమయము-స్థలము యోగ్యమైనవి.

మరియొక యోచన-ముచ్చటలాడి
మనసు తెలియుట అని చెప్పిరిగద
బుద్ధిమంతుడు రావణు తమ్ముడు
బదులు పలుకునా ముఖము తెలియక.

ప్రశ్నకు తిరిగి సమాధానము
అర్థము కానటు ఇచ్చిన ఏమగు?
దోషి యనుచును నిర్ణయమగును
వివరముగా మరికొందరు పలుకరు

శత్రుసేనలో భేదము గొలిపి
చీలదీసి మరి చేర్చుకొనవలె-
వారిలోవారే కుమ్ములాడుకొని
వచ్చిన వానికి పరీక్ష ఏమిటి?

అట్టివానిని ప్రశ్నించుటది
తెలివి లేమిగా తోచునుగాదా
మిత్రలాభము పూర్తిగ చెడును-
నీతి శాస్త్రమున సమ్మతిగాదది.

మనసువిప్పి మాటాడినచో మరి
ఎదుటివాడునుఅటు మాటాడును
కపటమున్నచో కపటము ఎదురగు
లోక సహజము నీకు తెలియదా!

తమంత తెలివి ఎదుటి వ్యక్తికి
లేదని తలచుట అవివేక మది
కుటిల ప్రశ్నకు ప్రాజ్ఞుడు తప్పక
కుటిలోత్తరములు ఇచ్చునుగాదా!

కావున రామా! ఈ ప్రయత్నములు
నిరర్థకమ్మని తోచునుమరియు
ఇంగితమ్మును ఆకారమ్ము
చేష్టలు-భాష- ఈ నాలుగుతో-

ఎదుటివ్యక్తి మది పరిశుద్ధతను
తెలియగ నగును-పై నాల్గిటిలో
దుష్టభావము మాటల లేదు
దుష్టుడుగాడని తలంచనగును.

ఎట్టి వికారము ముఖమున లేక
ప్రసన్నమైన ఆకారమది
చేష్టలు చూడగ నిర్భయమ్ముగా
తనుగావచ్చి పలుకుచుండెను.

నాల్గవ విషయము భాషను వినిన
సందిగ్ధమును తొందరపాటు
కనబడకున్నవి- కావున వీనిలొ
లోపము తోచదుఅనిపించునుగద!

మోసము చేయగ వచ్చినచో మరి
దాగదు మోసము ఎంత దాచినను
కార్యవిదులలో శ్రేష్ఠుడ నీవు
నేను చెప్పగా తగుదున స్వామీ!

నీ విక్రమము - శౌర్య ప్రతాపము
తెలిసెను- నీవు వాలిని చంపి
తమ్ముని రాజుగ చేయుట తెలియును
లంకా రాజ్యముకోరగ వచ్చెను.

శరణాగతి యని దరికి చేరెను
నిర్దోషియని తలచెద నేను
ముందు కార్యము తెలిసినవాడవు
చేరదీయుము రావణు తమ్ముని.''

మధురముగాను అర్ధవంతముగ
మారుతి పలికెను రామచంద్రునితొ
''మదిలో రాజ్యము కోరి వచ్చెను
ముదముగ జేర్చుము విభీషణాఖ్యుని''
॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 18 విభీషణునికి శ్రీరామ పాదముల సేవా భాగ్యము

మారుతి పలుకులు విని రఘురాముడు
సంతుష్టుడయి పలికెను కపులతొ
''దోషములున్నను విభీషణుండు
మిత్రభావనతొ చేరెను ఇటకు.

సత్యసంధుడగు రాముడంతట
కపులందరినీ కలయజూచెను
పుణ్యశీలుడగు లక్ష్మణుగాంచెను
మందహాసమున పలికె తీయగా.

నెయ్యముకోరి వచ్చినవానిని
దరికిచేర్చమని పెద్దలహితవు
ఆచరించదగు ధర్మము అదియే
కావున వానిని చేర్చెదనేను.''

''వానరులారా! మన సుగ్రీవుడు
శాస్త్ర జ్ఞానియు స్నేహశీలియు
పెద్దల మన్నన చేయునాతడు
కావున అటుల పలుకుచుండెను.

రవిసుతుడంతట పలికె రామునితో
''వాడుదుష్టుడో- కాదో వదలుము
ఆపదలో తన అన్నను వదలెను
అట్టి తమ్ముని ఏమని అందుము?

లౌకికమయిన ధర్మసూక్ష్మము-
జ్ఞాతులు మరియు పొరుగురాజులు
కష్టకాలమున అదనుచూచుకొని
ఎదిరించుటకై వేచియుందురు.

ఎట్టివాడొ ఆ అన్న వదలుము
అన్న ఆపదలొ ఉన్నది నిజము
అట్టి సమయమున అన్నను వదలి
తమ్ముడు వచ్చుట తగదు రాఘవా.!''

జ్ఞాతియైన ఆ లంకాధీశుని
పతనముకోరెను విభీషణుండని-
రాక్షసరాజు తలచెను మదిలో
విరోధమునకు కారణమదియగు.

శత్రుబలమును స్వీకరించునెడ
యోచించదగు విషయములివ్వి-
అసురులగాము- జ్ఞాతులగాము
లంకను మనము కోరుటలేదు.-

విభీషణుడు మరి తెలివిమంతుడు
మనము కోరినది లంక కాదని
పూర్తిగ తెలియునుకావున చేరెను
కలహములన్నవి జ్ఞాతులకుండును.

భరతుని మాదిరి సోదరులున్నా
రాముని పోలు తనయులుండరు
నీతో సరిపడు మిత్రులు దొరకరు
మనవలె అందరు వుండరు వినుము.''

వానరరాజు వినయము నిండి
పలికెను ''రామా! క్షమాధీరుడవు
కుటిలుడైన ఆ లంకాధీశుడు
రహస్యమ్ముగా తమ్ముని పంపెను.

మనలో తిరుగుచు నమ్మకమ్ముతో
మనలను వాడు సంహరించును
రావణాసురుడు పరమ క్రూరుడు
వాని తమ్మునిచంపుట యుక్తము.''

రవిసుతుగాంచి పలికెను రాముడు
''వానరరాజా - రావణు తమ్ముడు
క్రూరుడైనను జంకను వినుము
అసురులందరిని అణచగ చాలుదు.

బోయ ఒకడు ఒక పావురాయిని
శరణు కోరెను- ఆకలిబాధతొ
ఆలిని చంపిన బోయవానికే
ఆహుతియైనది - ఆ- మగపులుగు.

నన్ను బోలినవారు సర్వదా
శరణాగతులను కాపాడవలె
కణ్వమహర్షి తనయుడు 'కండుని'
ధర్మబోధను వినిపించెద విను.

శరణు కోరిన శత్రువునైనను-
శత్రు సేనలో సైనికునైనను
తనప్రాణమునిడి కాపాడవలె
లేనిచొపాపము కలుగునందురు.

శరణాగతునికి రక్షణనిడనిచో
వాడుచేసిన పాపములన్నీ
వీనినిచేరును వీని పుణ్యమున
వాడు చల్లగా స్వర్గమేగును.

ఋషి వాక్కులను గౌరవించెద
ధర్మమార్గము అనుసరించెద
యశముకలుగును అందువలననే
పుణ్యలోకములు లభించగలవు.

ఓ సుగ్రీవా! ఎవ్వరైనను
ననుశరణన్నచొ కాపాడెదను
భయమనునట్టిది శరణాగతునికి
తీర్చుటన్నది నా వ్రతమయ్యా.

శరణు కోరునది విభీషణుండో
వచ్చి చేరునది దశకంధరుడో
అభయము నిచ్చితి వానరరాజా!
వానిని ఇచటకు గొనిరావలెను.''

రాముని పలుకులు విని సుగ్రీవుడు
ప్రేమాదరణలు పొంగిపొరలగా
''ధర్మస్వరూపా! సత్యధచరితా!
నీవిటు పలుకుట అతి సహజమ్ము.

మదిలో సందియ మంతరించుటకు
నీమది తెలియగ పలికితి నటుల
విభీషణుని నే గొనివత్తు నిట
మా మిత్రులలో అతడొకడగును.''

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 19 సముద్రతీరమునందే విభీషణుని అభిషేకించుట

రామచంద్రుని అభయము నంది
ధన్యుడాయెను విభీషణుండు
సచివులు నలుగురు అనుసరించగా
రామ చరణముల సాష్టాంగపడె.

విభీషణుండు తెలిపెను భక్తిగ
''రామప్రభో! ఆ లంకాధీశుడు
బ్రహ్మ దేవుని అనుగ్రహమ్మున
అమోఘమైన వరమును పొందెను.

ధర్మయుక్తము యోగ్యముగాను
విభీషణుండు పలికెను భక్తిగ
''రామభద్ర! నే రావణు తమ్ముడ
అన్ననన్ను మరిఅవమానించెను.

సురగంధర్వులు అసురల చేతను
మహాభూతముల చేతనైనను
మరణము లేని వరమది రామా!
మదించిపోయెను వరబలమ్ముచే.

సర్వభూతముల శరణాగతుడవు
నిన్ను చేరితి నిజము రాఘవా!
నా సర్వస్వము వదలి చేరితి
నీ అధీనమున నుంటిని నేను.''

నాకు అన్నయు రావణానుజుడు
కుంభకర్ణుడు అతి పరాక్రముడు
తేజోవంతుడు- యుద్ధమునందు
ఇంద్రుని పోలెడి బలమగువాడు.

ప్రసన్న దృష్టితొ రాముడు చూచెను
చూపుల ఆతని వేదన గ్రోలెను
అసుర బలమ్ములు యదార్థమ్ముగా
తెలియబరచమని అడిగెను రాముడు.

రావణు సేనల కధిపతి యైన
ప్రహస్తుడాతడు కైలాసమున
ధనపతి సేనానాయకుడైన
మణిభద్రుని తా జయించినాడు.

రావణు తనయుడు ఇంద్రజిత్తు తను
అబేధ్యమైన కవచము దాల్చి
గోధాంగూళీత్రాణము దాల్చి
ఘన చాపముతొ పోరుకు దిగును.

అగ్నిదేవుని తృప్తి పరచును
అనలుని కృపకు పాత్రుడగుటచే
ఆలములో మరి అదృశ్యముగా
మాయ యుద్ధమున రిపుల కూల్చును.

మహోధరుండు, మహోపార్శ్యుడు
అకంపనుండు అను ముగ్గురును
మహావీరులు- ఆలమునందు
దిక్పాలురతో సమమగువారు.

మాంస భక్షకులు కామరూపులు
రాక్షస యోధులు లంకాపురిలో
పదివేల కోట్లగు సంఖ్యలొ నుందురు
సురల జయించెను రావణరాజు.''

విభీషణునితో రాముడు పలికెను-
''రావణాసురుని బలపరాక్రమము
సేనల విషయములన్నియు నేను-
నీవు చెప్పినవి వింటిని లోగడ.

ప్రహస్తునితో కలిపి రావణుని
సబాంధవముగా కూల్చివేసెద
లంకకు నిన్ను రాజును చేసెద
సత్యవచనము చెప్పితి నేను.

చతురంగ బలములు నిండిన సేనను
పుత్రుల బంధుల కూడిన అసురుని
అంతము చేసెద ఇది నా ప్రతిన
తమ్ముల ఆనగప్రతిన చేసితి.''

అటుల రాముడు పలుకుట వినన
విభీషణుండు తరించె ననుకొని
పలికెను వినయము నిండగ నపుడు
''యుద్ధమునందు సాయము చేతును.

లంకా పట్నము ముట్టడించుట
రక్కసి సేనలొ జొరబడి-వారిని
అంతము చేయుట అన్నిటియందు
శక్తికి తగినటు సాయపడుదును.''

అంతట రాముడు సంతసమంది
విభీషణుని తా గుండెకు చేర్చెను
లక్ష్మణమూర్తిని గాంచి పలికెను
సముద్ర జలము తెమ్మని చెప్పెను.

విభీషణాఖ్యుని అసుర ప్రభువుగా
అభిషేకించగ చెప్పెను అపుడు
అంతట తమ్ముడు అన్న ఆనతిని
అభిషేకించెనుఅసుర వీరుని.

రామానుగ్రహమందిన వీరుని
విభీషణాఖ్యుని రాక్షస రాజుగ
చూచిన వానరులందరు ముదముగ
అభినందించిరి రామభక్తుని.

వానరనాథుడు వాయుపుత్రుడును
ఏకాంతముగా విభీషణుని గని
అగాధమైన కడలిని దాటెడి
ఉపాయమ్మును అడిగిరి వారు.

వారితొ పలికెను విభీషణుండు
''సాగరమ్మును- రామచంద్రుడు
శరణువేడినసరియగు సర్వము
సగర పుత్రులు త్రవ్విరి కడలిని.

మతిమంతుడు ఈ సాగరుడిపుడు
రామకార్యమున సాయము చేయును.''
ఆ మాటలు విని, సూర్యకుమారుడు
రామచంద్రునికి తెలిపెను యోచన.

సాగరమ్మును ఉపాసించుమని
విభీషణుండు తనతో నుడివిన
మంగళ వాక్కులు రామ ప్రభువుకు
తెలిపెను భక్తిగ వానరరాజు.

సత్యవర్తియు, ధర్మమూర్తియగు
రాముడు మెచ్చెను, ఆ మాటలకు
లక్ష్మణుగాంచి ఆ ఉపాయము
తిరిగి, యోచన చేయగ చెప్పెను.

సౌమిత్రియును సుగ్రీవుడును
యోచనచేసి పలికిరి తిరిగి
''ఈ సమయములో విభీషణుండు
తెలిపెను మనకు చక్కని యోచన.

సురాసురులును దేవేంద్రుడును
కదలి వచ్చినను కడలి పైనను
సేతువు కట్టక దాట నశక్యము
కావున కడలిని శరణు కోరుము.''

ఆ మాటలకు రామచంద్రుడు
అంగీకారము తెలిపినవాడై
దర్భశయ్యపై సంద్ర తీరమున
అగ్నిహోత్రుని పోలి పరుండెను.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 20 రావణు పనుపున–శుకుడను అసురుడు వచ్చుట

సంద్రపు ఒడ్డున విడిసిన యట్టి
వానర సేనావాహిని గాంచిన
శార్దూలుడను వేగులవాడు
రావణు ప్రభువుకు చెప్పెను యిటుల.

''రాజా వినుము, లెక్కకు చిక్కని-
చక్షుల చూడగ శక్యముగాని
వానరసేన సంద్ర తీరమున
విడిసి యున్నదొక సంద్రము మాదిరి.

రామ లక్ష్మణులు ఆయుధములతో
వానర సేనా బలగమ్ములతో
సీతాదేవి వున్న తావునకు
వచ్చెదరయ్యా విను మహారాజా

ఎటు చూచినను పది యోజనములు
నిండియున్నదా వానర బలము
సామ దానములొ భేదమె తగును
దండోపాయము సాధ్యముగాదు.''

విషయము వినిన రావణ ప్రభువు
కలవరపడక- కార్యదక్షుడగు
''శుకుని'' పిలచి ఆ సుగ్రీవుని గని
మెత్తగ నిటుల మాటాడమనె-

''ఓ వానరుడా మహారాజువు
సత్కులమందు జన్మించితివి
బ్రహ్మ కుమారుడు ఋక్షరజునికి
తనయుడ వీవు సోదర సముడవు.

రాముని భార్యను నే గొనితెచ్చితి
దానివల్ల నీకేమి నష్టము
రాముని చేరిన ఏమి లాభము,
రాముని కాదన నీకేకష్టము?

బుద్ధిమంతుడవు యోచన చేయుము
తెలివిగ నీవు కిష్కింధకు పో
సురగంధర్వులు చేరని లంక
నర వానరులా తనువుతొ చేరుట.''

పక్షి రూపమున శుకుడను అసురుడు
సంద్రముదాటి ఆకసమందున
నిలచి-సుగ్రీవుని గాంచి అంతట
రావణు పలుకులు తిన్నగ వినిచెను.

పక్షి అట్టుల పలుకుచుండగా
నింగికి ఎగిరి వానర వీరులు
అసురుని పట్టుకు నేలకు త్రోసి
చేతుల బాది మర్ధించగను.

విలపించుచు ఆ శుకుడంతటను
రామ ప్రభువును రక్షణ కోరెను
''దూతగ-స్వామి పలుకులు వినిచితి
స్వంత పలుకులు పలికిన చంపుడు.''

సూర్యకుమారుడు రాక్షస దూతతొ
పలికెను ఇటుల ప్రత్యుత్తరముగ
''ఓ రావణుడా అబల హర్తవు,
సఖుడవుగావు ఇష్టుడగావు.

నా మిత్రుడగు రామచంద్రునికి
నీ బంధువులతొ వైరివైతివి
నాకు శత్రువగు వాలి మిత్రుడవు
కావున నీవు పరమ విరోధివి.

ఓ రావణుడా నీ బంధులతో
నీ సచివులతో జ్ఞాతులతోను
సమూలమ్ముగా నిన్ను చంపెద
అచిరకాలమున లంక కూల్తును.

రాక్షస రాజా! మూర్ఖుడ వీవు
సురలందరును సురపతి యైనను
సూర్యలోకమున నిన్ను దాచినను
పాతాళములో దాగిన గాని.

రాముడు నిన్నుచంపక వదలడు
ముల్లోకములు రక్షణ నిడవు
ముసలి పక్షిని కూల్చితివీవు
రాగల కష్టము తెలియక పోయెను.

రామలక్ష్మణులు లేని సమయమున
రాముని సతిని అపహరించితివి
సురలకు సైతము అజేయుడైన
రఘుకుల తిలకుడు కూల్చును నిన్ను.''

ఆ విధముగ నువు లంకాపతికి
తెలియ చెప్పుము అనె సుగ్రీవుడు
వానర రాజటు పలుకుచుండగా
అంగదుడంతట పలికె రాజుతో.

''ఓ మహరాజా ఈ రాక్షసుడు
దూతకాడని నా నమ్మకము
నింగిని నిలబడి మన సేనలను
పరిశీలనగా చూచుచుండెను.

లంకకు వీనిని వదలకూడదు
ఇపుడే వీనిని పట్టుకొందము''
అంతట, రాజు సరియనగానే
నింగి కెగరిఆ అసురుని పట్టిరి.

విలపించెడి ఆ రక్కసునంతట
బంధించిరి ఆ వానర వీరులు
అసురుడు దెబ్బల కోర్వలేకను
రాముని ప్రార్థన చేసెనుజాలిగ.

''రామా! వీరులు చంపుచుండిరి
రెక్కలు విరచి పారవేతురు
నన్ను చంపినచొ నా పాపమది
నిన్ను చేరును- రక్షణ నిడుము.''

శుకుడు అట్టుల ఆక్రోశించుట
వినిన రాముడుతన వీరులకు
దూతను చంపగ వలదని అపుడు
ఆదేశించెను- ఆగిరి వారు

॥శ్రీ రఘురాముని॥

## 21 సముద్రుని ఉపాసించుట–శ్రీరాముని ఆగ్రహము

ప్రాజ్ఞుడైన శ్రీరామచంద్రుడు
కడలికి భక్తిగ నమస్కరించెను
సర్పసమముగా మృదువుగ నున్న
దక్షిణబాహువు తలక్రిందిడుకొని.

దర్భశయనమున రామచంద్రుడు
కడలిగట్టున శయనించగను
రత్నకాంచన మణిమయ శోభిత
ఆభరణమ్ముల వెలిగెడి చేయి-

ఉత్తమాంగనలు అలంకరించగ
అగరుచందనము నలుగు పెట్టగా
బాలసూర్య ప్రభ- ధగధగ లాడుచు
ధరణీసుతకు అమరిన తలగడ.

గంగాజలముల సర్పరాజును
పోలెడి రాముని దక్షిణ హస్తము
రిపుల కలంచిన దక్షిణ హస్తము
భక్తులపాలిటి భద్రహస్తము-

వేలగోవులను దానము చేసిన
ఇనుప గుదియనుపోలు హస్తము
భూమికి పూర్తిగప్రదక్షిణించగ
శక్తిగలిగిన శరములు వేయును.

పుడమికంతకు ఆధారమయి
కోదండముతో శరములు వదలగ
అల్లె త్రాటితో అదరిఅచ్చట
చర్మము బిరుసైకాయలు కాసిన-

అయోధ్యరాముని అభయ హస్తము
అయోనిజను తా నందిన హస్తము
తలగడవోలె అమరియుండగా
మహాబాహుడట పడుకొనియుండెను.

సంద్ర తరణమో లేక మరణమో
తప్పదనుచును నిశ్చయించుకొని
శాస్త్రోక్తముగా ధర్భశయ్యపై
నియమ, నిష్ఠగా, రాముడుండెను.

సాగరమ్మును ఉపాసించుటకు
మూడు రాత్రులు గడిపెను రాముడు
అంత నియమముగ వేడుకొన్నను
ఆ సాగరుడు ముందుకు రానిచె-

దశరథరాముడు కోపగించెను
కన్నులెఱ్ఱబడ తమ్మునితోనసె
సోదర లక్ష్మణ! ఈ సముద్రుడు
కనబడకుండెను- ఓరిమిపోయెను.

గర్వాంధుడయా ఈ సాగరుడు
శాంతము ఓర్పు నిష్కపటమ్ము
ప్రియభాషణము అసమర్థతగా
గుణహీనుడుతా నెంచుట జరుగును.

తన్నుతాను మరి పొగుడుకొనుచును
వంచనచేసే దుష్టుని, మరియు
నిర్దయనిండిన వారిని లోకము
గౌరవించుట జరుగదు వినుము.

శమ దమాదులు కలిగినయట్టి
సద్గుణయుతుని లక్ష్మణమూర్తీ!
గౌరవించదు ఈ లోకము విను
మంచితన మది మరుగున పడును.

సామోపాయము ననుసరించిన
యుద్ధమునందు జయము లభించదు
దండన తగిన సాధనమగును
కడలిని ఇపుడు కలంచివేసెద.

నిశిత శరములు నే వదలగను
మకరాలయమున నున్న మకరులు
తునకలు కాగాపైకి తేలును
సముద్ర జలము స్తంభించునయా.

మహాసర్పములు-మత్స్యములన్నియు
ముక్కలుగా మరి తెగి-తేలునయా
తీక్షణముగ నే విడచిన శరముల
సంద్రపు జలము ఇగిరిపోవును.

ఓరిమి నుంటిని- నన్ను సముద్రుడు
అసమర్థునిగా నెంచెనువినుము
సామోపాయము సరిపడదింక
శరచాపములు తీసుకురమ్ము.

క్రూర నాగులను పోలు శరములను
విడిచి- కడలిని యిగిర్చివేసెద
వానరులందరు నడచునట్టుగా
నీరు మిగల్చక నేల మిగిల్చెద.

చెలియలికట్టను దాటని కడలిని,
ఎగసిపడే ఆ సంద్రపుటలలను
నేలమీదనే పరుగిడ చేసెద
సంద్రము నిపుడే క్షోభపెట్టెద.

అనుచు రాముడు చెక్కిళ్ళదరగ
కరమున చాపము దాల్చి నిలచెను
సంద్రము వంక సూటిగ చూచెను
ప్రళయాగ్నివలె కనబడినాడు.

భయంకరమగు చాపము నపుడు
పిడికిట మధ్యలొ బిగించి నిలచి
అల్లెత్రాటిని బిగించి లాగెను
టంకారధ్వని దిక్కుల నిండెను.

జీవకోటి విని గజగజ లాడెను
జగత్ప్రళయమా? అన్నటు తోచెను
వజ్రాయుధమును పోలు శరములు
కడలిపైన శ్రీరాముడు వదలెను.

అగ్నిశిఖలను పోలు శరములు
సంద్రగర్భమును కలంచివేసెను
జల జంతువులు చెదరిపోయినవి.
భీకర ధ్వనితో గాలి వీచెను.

పెద్ద అలలవి నింగి కెగిరెను
నక్ర- మకరములు క్షోభపడినవి
శంఖమ్ములును ముత్తెపు చిప్పలు
అలలతొ ఎగిరి కడలిని పడెను.

అగ్ని శిఖలను పోలు శరములవి
కడలిని పడగా పొగలెగసినవి
పాతాళమునే తాకెను శరములు
అచటి దానవులు దుఃఖితులైరి.

మెరసే ముఖముల పన్నగులందరు
విషము గ్రక్కుచు బాధను పడిరి
వింధ్యపర్వతము పోలు అలలవి
జలజంతువులతొ నింగి కెగసెను.

తిరిగి రాముడు కోపము నిండి
మహోగ్రమైన శరమును తీసి
ఎక్కుపెట్టగ- సుమిత్రసుతుడు
వలదు, వలదనిఅన్నను ఆపెను.

॥శ్రీ రఘురాముని॥

✠✠✠

# 2 2 సేతుబంధనము – లంక జేరుట

కోపము నిండి రాముడు పలికెను
వారిధి నుద్దేశించి పలికెను
''పాతాళమునకు పంపెద నిన్ను
నీలో దాగిన ప్రాణులు మిగలరు.

నా శరములతో సేతువు కట్టెద
నీ గుండెలనే చీల్చి కట్టెద
నీలో దాగిన దుష్టుల స్నేహము
నిన్నీవిధముగ మార్చివేసెను.''

అనుచు రాఘవుడు ప్రళయమూర్తియై
బ్రహ్మాస్త్రమును తీసి అంతట
అభిమంత్రించి వింటికి కూర్చి
ఆకర్ణాంతము లాగి నిలచెను

అల్లెత్రాటి ధ్వని నింగి కెగసెను
భూమ్యాకాశము లదరిపోయెను
లోకమంతయు చీకటి నిండెను
గిరులూ నదులూ క్షోభించినవి.

మహావృక్షములు నేల కొరిగినవి
మెరుపులుపిడుగులు మేఘగర్జనలు
మహాభయంకర ఘోష వినగనే
ప్రాణికోటి భీతిల్లి ఏడ్చెను.

ముందే వేసిన శరముల ధాటికి
చెలియలికట్టను దాటెను వారిధి.
వెనుకకు పరుగిడు జలధినిగాంచి
శరము వదలక నిలచె రాముడు.

మేరుగిరిని రవి ఉదయించునటు
సంద్ర మధ్యమున సముద్రుడంతట
పైకి లేచెను-దివ్యశరీరము
కాంతులీనుచు వెలుగుచుండెను.

తామర రేకుల కన్నులతోను
ఎర్రని వలువల రత్నాకరుడు
స్వర్ణాభరణములెన్నో మాలలు
ఉత్తమమైన రత్నహారములు.

వక్షస్తలమున హారములందు
దివ్యమణి యది వెలుగుచుండగా
మంటలు మండే పాములుండగ
రాముని చెంతనునిలచె సముద్రుడు.

శరముతొ నిలచిన రాముని గాంచెను
చేతులు రెండును జోడించి అట
అణుకువ నిండి పలికె సాగరుడు
అమిత భక్తిగా ప్రణామ మిడెను.

''పుణ్యపురుషుడా! పృథివీ, వాయువు
ఆకాశమును, జలము, అగ్నియు
పంచభూతములు కట్టుబాట్లను
విడువక నిలచును-వాటి ధర్మమది.

అగాధమ్ముగా నుండుటన్నది
సహజమైన నా స్వభావమగును
మెరకగ నుండుట జరగదు నేను
అగ్నిహోత్రముచల్లగ నుండున?

రామభద్ర–నే నిజము నుడివెద
నేను యిప్పుడు ఘనీభవించిన
నాలో జీవులు హరించిపోవును
కావున నేను ఘనీభవించను.

స్వామీ! నేను తగిన విధముగా
రామ కార్యమున, సాయపడుదును
నాలోనున్న జల జంతువులు
నీ సేనలను, బాధించవయా.

వారిధి నద్దరి చేరుట కొరకై
వారధి కట్టుము వానర బలముతొ
అందులకొరకు కొంతభాగము
మెరక చేతును మంగళమూర్తీ!

అంతట రాముడు అడిగె, సాగరుని
''సంధించిన ఈ బ్రహ్మాస్త్రమును
వదలకుండుట జరుగదు గావున
ఎచ్చట దీనిని విడువగ వలెను.''

తేజోవంతము అయిన శరమును
చూచి పలికెను సముద్రుడపుడు
''రామా! ఇచటకు దగ్గరలోనే
'ద్రుమకుల్య'మను ప్రదేశమున్నది.

మనోహరమ్మగు ద్రుమకుల్యమున
చోరులు, పాపులు, వశించి యుండిరి
ఆ దుర్మార్గుల ఉనికిని నేను
సహించలేనువారిని త్రుంచుము.''

రామచంద్రుడు బ్రహ్మాస్త్రమును
మంటలు మండెడి దివ్య శరమును
ద్రుమకుల్యముపై ప్రయోగించెను
పిడుగై పడినది రామ బాణము.

ఘనమగు శరము భూమిని చీల్చుకు
పాతాళములో జొరబడి అచ్చట–
జలము ఏర్పడె–వ్రణకూపమది
నిరతము జలముల నిచ్చుచుండును.

రామబాణము దుష్టుల త్రుంచెను
నిత్యమునిలచే జలముల నిడెను
''మరు కాంతారము'' అనెడి పేరుతో
ఆ ద్రుమకుల్యము ప్రసిద్ధికెక్కెను.

మరు కాంతారము నందలి జనులు
రోగములుండక సుఖముగ నుందురు
మధు క్షీరములు సమృద్ధ మచ్చట
దివ్యౌషధులు వెలసెనచ్చట.

మంగళకరమగు ప్రదేశమగునటు
రామునిచేత వరమును పొందెను
కుక్షిలో నున్న ద్రుమకుల్యమ్మది
దగ్ధము కాగా పలికె సముద్రుడు.

'' ఓ రఘురామా! నీ సైన్యములో
విశ్వకర్మకు తనయుడు అయిన
నలుడు కలడు అతిధైర్యవంతుడు
అమితోత్సాహము కలిగినవాడు.

సేతువు నాతడు కట్టసమర్థుడు
నలుడుకట్టెడి ఘనమగు సేతువు
కదలకుండగా నిలబెట్టెదను''
అనుచు సాగరుడు అదృశ్యుడయ్యెను.

సముద్రుడటుల పలుకుట వినిన
నలుడు భక్తిగా కరములుమోడ్చి
రామా! సర్వము యదార్థమైనది
వారిధిలో నే వారధి కట్టెద.

కృతజ్ఞతను మరి చూపని వానికి
సామదానములు క్షమయూదగవు
దండోపాయము సాధనమగును
తనపుట్టుకనే సముద్రుడెరుగడు.

సగరుల ఉపకారమ్మును మరచెను
రామబాణముల భయముచేతను
సేతువుకట్టగ మెరకచేతునని-
చెప్పి తప్పుకొనె- కృతఘ్నుడతడు.

మందరనగమున విశ్వకర్మ తను
తనతో చాలిన తనయుడు పుట్టగ
నా తల్లికి మరి వరమునిచ్చెను
విశ్వకర్మకు ఔరసపుత్రుడ.

శిల్పవిద్యలో తండ్రికి సముడను
సంద్రముపై నే సేతువు కట్టెద
గుర్తుకుతెచ్చెను ఈ సాగరుడు
ఆనతినిడుము పురుష పుంగవా!

రాముడు వెంటనె వారధికట్టగ
ఆనతినిచ్చెను నలునికచ్చట-
ఆనందముతో ఆ కపివీరులు
లక్షలాదిగా గెంతుచుసాగిరి.

వానర వీరులు వనములందలి
మహావృక్షములు ఏరుమద్దులు
చంద్రవృక్షములు మద్దితరువులు
తాళవృక్షములు తిమిశ తరువులు.

మామిడి తరువులు అశోకచెట్లు
బొట్టుగు-మొదలగు వృక్షములెన్నో
ధ్వజములమాదిరి చేతులనెత్తి
సాగర గర్భమునందు వేసిరి.

మహాకాయులగు వానరులెందరొ
మహాశిలలను- కొండరాళ్ళను
గిరులను చీల్చి తీసుక వచ్చిరి
సంద్రజలముల విసరసాగిరి.

ఘనశైలములటు వారిధిబడగనె
నింగికెగసినది సాగరజలము
వానర యోధులు కొందరప్పుడు
నూలు దారముతొహద్దులు తీర్చిరి.

కొలతబద్దలతొ కొందరు నిలచిరి
మట్టము చూచుచు సరియను చుండగ
కొందరు- తొందర తొందర అనుచు
వడిగా శిలలను తెమ్మనుచుండిరి.

పది యోజనముల వెడల్పుగాను
నూరుయోజనము లుండునట్టుగా
సాగరమందు వానరయోధులు
సేతువు కట్టుట సురలుచూచిరి.

నలుడుకట్టెడి సేతువుపైన
పూచిన శాఖలు- ఒత్తుగ పచ్చిక
పర్వత శిఖరమునుండెడి శిలలు
కొయ్యలు వేసి చదునుచేసిరి.

కరిబలసములు మహావీరులు
కపికులనాథులు మహాదీక్షగా
పదునాల్గు యోజనములుండునట్టుగా
మొదటిరోజు నిర్మాణము చేసిరి.

రెండవరోజు ఇర్వై నడచిరి
మూడవ దినమున మహావీరులు
ఇర్వై ఒక్క యోజనమ్ములుగ
సేతువు నచ్చట తీర్చి కట్టిరి.

నాల్గవనాడు ఇరువదిరెండు
అయిదవరోజున ఇరువదిమూడుతొ
శతయోజనములు లాఘవమ్ముగా
అమిత వేగమున పూర్తిచేసిరి.

అతి బలశాలి ధైర్యవంతుడగు
నలుడు కట్టిన సేతువు అపుడు
ఆకాశములో స్వాతీపథముగ
రమణీయంబుగ వెలుగుచుండెను.

అద్భుత సేతువు జలముల నిలువగ
నింగిని నిలచి సురగంధర్వులు
సిద్ధులు ఋషులు అచ్చెరువందిరి
మదిలో తలచని మహిత కార్యమది.

అతికష్టమగు ఘనకార్యమది-
అత్యద్భుతము సేతువు కట్టుట
అగాధ జలధిని ఆ విధముగను
అడుగిడి నడచుట అమోఘమైనది.

గగుర్పాటునకు లోనుచేసెడి
సేతువు నచ్చట- జీవరాసులు
దర్శించినవి పులకించినవి
రామపాదములు మదిలో నిలచెను.

ఎత్తుపల్లములు లేకుండగను
వంకరటింకర లేక సాగిన
సేతువు అచ్చటి వారిధిలోన
కడలి-పాపటగ శోభించినది.

సేతువు నటుల కట్టుచు యోధులు
కోట్లకొలదిగా వారిధి దాటిరి
వారిధి నద్దరి విభీషణాఖ్యుడు
గదతో కావలి కాయుచు నిలచెను.

సూర్యకుమారుడు రాముని గాంచి
వినయము నిండి పలికెనప్పుడు
ఓ దాశరథీ! నీవు ఇప్పుడే
వాయుపుత్రుని అధిరోహించుము.

సుమిత్ర తనయుడు అంగదుపైన
అధిరోహించి సాగును నీతో
మీరిద్దరును నడువగ వలదు
మకరుల నిలయము ఈ సాగరము.

చాలాదూరము సాగవలయును
ఈ వానరులు వేగవంతులు
వాయు మార్గమున సాగ సమర్థులు
కావున మిమ్ముల తీసుకుపోదురు.

సరియని రాముడు, లక్ష్మణమూర్తి
ఆ సేనలకు అగ్రభాగమున
విజయ కాంక్షతో సాగుచుండిరి
అజేయులెందరొ ప్రక్కల నడచిరి.

దారి విశాలము చాలనందున
కొందరు అచ్చట వేచియుండిరి
వేగవంతు లుత్సాహవంతులు
కొందరు నింగిని ఎగిరి సాగిరి.

కొందరు యోధులు జలముల పడుచు
ఆనందముతో తిరిగి గెంతుచు
సింహ నాదములు చేయుచు సాగిరి
సంద్రపు ఘోష వినబడకుండెను.

వానర వాహిని ఉత్సాహముగా
సేతువుపైన నడచిరి ముదముగ
వారిధి నద్దరి ఫల జలములుగల
చక్కని చోట విడిది చేసిరి.

అద్భుత కార్యము అతి సులువుగను
చేయించిన శ్రీరాముని చూడగ
సురలూ-సిద్ధులు చారణులున్నూ
నాగ గంధర్వ ఋషులు వచ్చిరి.

మంగళ జలముల వారందరునూ
రామభద్రుని అభిషేకించిరి
మనసు నిండుగా పూజలు చేసిరి
మంగళవాక్కుల నందరు పలికిరి.

''నరులందరికి దైవము నీవు
రిపులందరినీ జయించి నీవు-
బహుకాలమ్ము భూమి నేలుము
దుష్టుల దునిమి శిష్టులు బ్రోవుము.''

ముదముగ మునులు సురలందరునూ
స్తోత్రము చేసిరి రామచంద్రుని
శత్రు హరణుడు శ్రీరఘురాముడు
చల్లగనేలును అనుచు పొగడిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 23 శ్రీరామునికి శుభశకునము లగుపడుట

రామపాదములు సోకిననేల
అధర్మమింక సాగదు లంకలొ
అనుచు మురిసినది- ధర్మరక్షణకు
నిలిచిన అల్లునిచూసి మురిసినది.

లంకలొ కనబడె దుర్నిమిత్తములు
భీకర పోరును, తెలుపు సూచనలు
రాముడు తమ్ముని కౌగిలించుకొని
తెలియబరచెను శకున ఫలితము.

గరుడ వ్యూహము ఏర్పరచెదము
అతిభీకరమగు పోరాటములో
రక్తమాంసముల- రణభూమి ఇట
బురద బురదగా మారిపోవును.

గిరి శిఖరములు ఊగుచున్నవి
హోరుగాలి అది వీచుచున్నది
మహావృక్షములు కూలుచున్నవి
మేఘగర్జనల దిక్కులవిసెను.

రక్తబిందువుల వాన కురిసినది
సూర్యమండలము మంటలుమండెను
రవికెదురుగను దీనస్వరముతో
పక్షులు-మృగములు అరచుచున్నవి.

ధూళినిండి అట నింగిని తారలు
యుగాంతమ్మనే సూచనచేసెను
దుర్బలమైన పక్షులన్నియు
బలమగు పులుగుల చంపుచున్నవి.

చంద్రునికాంతి క్షీణించినది
ప్రళయ కాలమును సూచించునది
నక్కలు భీకర ధ్వనితో కూయుచు
అమంగళమ్మిట తెలుపుచున్నవి.

ఓ సౌమిత్రీ! వానరరాజుతో-
హనుమ, అంగదులు కపివీరులతో
దుర్భేద్యమగు లంకనుచూతము
రాక్షస నిలయము పరిశీలింతము.

రామచంద్రుడు రణోత్సాహుడై
అందరిముందుగ నడువసాగెను
సాగిరి వీరులు రామునివెంట
అమితోత్సాహము, విజయకాంక్షతో.

వానర వీరులు రామప్రభువుకు
ఆనందమును కూర్చగనెంచి
సింహనాదములు చేయుచు నడచిరి
తోకలతో నట బాదిరి నేలను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 2 4 రావణునకు వేగులవాని హితవు

శరత్కాలమున తారలనడుమ
వెలిగెడి చంద్రుని తీరుగనపుడు
కపిసేనయను తారల నడుమ
రామచంద్రుడు తేజము నింపెను.

వానరవీరుల బల సంపన్నుల
పదఘట్టనకుభూమి వణకెను
సద్దుమణగిన సమయములోన
లంకలో, భేరుల ధ్వని వినవచ్చెను.

అసురుల కోలాహలము వినబడె
భేరీమృదంగ ధ్వను లెగసినవి
అదివిని వానరయోధులు తిరిగి
అంతకు మించిన సవ్వడిచేసిరి.

చిత్ర విచిత్రములగు పతాకల
శోభలీనెడి లంకానగరము
రాముడు చూచెను, వెంటనె మదిలో
హృదయరాణి తన జానకి మెదలెను.

దుఃఖతప్తుడై – కార్యదక్షుడై
తన సోదరుని చూచి పలికెను
''విశ్వకర్మ తన చతురతనంతా
ఒలకపోసి నిర్మించెను లంకను.

ఎంతో ఎత్తుగ నింగితాకునటు
గిరి శిఖరముపై నిలచెను లంక
వివిధ తరువులు పక్షుల గుంపులు-
చైత్రరథమువలె నయనానందము.

పూసిన పూవుల ఎగసిన తేనెలు
గ్రోలిన తుమ్మెద మత్తునిండెను
లేత చిగుళ్ళు తినిన కోయిలలు
కర్ణపేయముగ కూయుచున్నవి.''

నింగి మబ్బులతో శోభించినటు
వానరసేనతో గరుడవ్యూహమది
నిండుగ నిలిచిన ఆ రణభూమి
శోభించినది రిపులువణకగా.

బందీకృతుడైయున్న అసురుని
శుకుని- అప్పుడు వదలివేయమని
రామచంద్రుడు ఆనతినిడగనె
ఆ రాక్షసుని వదలివేసిరి.

ప్రభువు పాదముల వ్రాలిన భటుని
విరిగిన రెక్కలు గాంచిన రాజు
''కపులకు నీవు చిక్కితివా'' యని
నవ్వుచు పలికెను హేళనగాను.

అసమర్ధునిగా రాజు తలచెనను
శంక భయములతొపలికెను అసురుడు
''రాజా! నేను వానరరాజుతో
నీ పలుకులను తీరుగ చెప్పితి.

నన్ను గాంచిన వానరవీరులు
నింగికెగిరి నను ఒడిసిపట్టిరి
నేలకు త్రోసి పిడికిట పొడిచిరి
ఎముకలు పొడిపొడి చేసిరి స్వామీ!

కోపిష్టులుఆ వానరులందరు
సేతువుకట్టి లంక చేరిరి
ఖర, విరాధుల, కబంధు వీరుల
కూల్చిన- రాముడు సతికై వచ్చెను.

వానర వీరుల భల్లూకములను
నేల ఈనినది- లెక్కతెలియదు
పర్వతకాయులు మేఘతుల్యులు
మనకూ వారికిపొత్తు కుదరదు.

రాక్షసరాజా! సీతను యిత్తువొ-
భీకర యుద్ధము చేసెదవో మరి-
త్వరగా నీవు నిర్ణయించుకో!
ఆలస్యమునకు తావే లేదు.''

హితమును వినని రాక్షసపతేనికి
కోపము హెచ్చి కన్ను లెఱ్ఱబడె-
నిప్పురవ్వలు రాల్చునట్లుగా
పలికెను అపుడు ప్రభంజనముగా.

''సురాసురులును గంధర్వులును
లోకములన్నీ ఏకమగుచును
నాతో పోరుకు వచ్చిన రానీ!
సీతనురాముని కిచ్చుట జరుగదు.

సంద్రపు వేగము నాకున్నదని
వాయు గమనము నా సొమ్మనుచు
రాము డెరుగడు-పోరగవచ్చెను
మానవుడెరుగడు నా పోరాటము.

వసంతమందు పూతేనెలకై
ముసిరెడి తుమ్మెదలన్న తీరుగా
నా శరములవి రాముని తాకి
గజము నాపినటురాముని నిలపును.

రణ భూమియను నాట్యరంగమున
వీణాతంత్రులు మ్రోగించినటు
వింట బాణములు సంధించుచును
నారితొసవ్వడి చేయుచు నిలచి

ఉదయభానుడు తన కాంతులతో
తారాగ్రహముల కాంతి మ్రింగునటు
నా సేనలతో వానర వీరుల
రామచంద్రుని రూపు మాపెద.

శరపరంపరలు వదలుచుండగా
సర్వనాశనము జరుగుచుండగా
సంతోషించెద నాహవభూమిలో
వరుణ, ఇంద్ర, యమ రాజులు ఆగరు.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 2 5 శుక-సారణులను వేగులు-పట్టుబడుట

సేతువు కట్టి లంకజేరుట
మహితకార్య మా రాముడు చేసెను
మదిలో కలవరపడిన రావణుడు
శుక సారణులను సచివుల పిలచెను.

వానర సేనల సంఖ్య తెలియుడు
వారిలొ ముఖ్యులు-నాయకులెవరో
వీరులెవ్వరో-వానరనాథుని
మంత్రులెవ్వరో తెలియుడు మీరు.

''మంత్రులార! ఇది నమ్మలేనిది
వారిధిపైన సేతువు కట్టుట-
నా సందేహము వదలకున్నది
ఒరులు లంకలో అడుగిడలేరు.

రాముని మంత్రులు ఎవరో తెలియుడు
సేతువు నెటుల కట్టిరొ వారు
ఏ ఆయుధములు వారు ధరింతురొ
ఎచ్చటి కపులో తెలియుడు మీరు.

సేతువు దాటి వచ్చిన బలముల
వివరములన్నీ తెలియగోరితి
మీరిరువురును సేనలొ జొరబడి
రహస్యమ్ముగా సంచరించుచు.

రాముని పథకము ఏమిటొ తెలియుడు
వాని తమ్ముడు ఎంతటివాడో
వానర సేనల నాయకుడెవడో
గ్రహించి త్వరగా తెలియబరచుడు''

రాజు ఆనతిని శుక సారణులు
వానర రూపులు ధరించినారు
వానర సేనలొ జొరబడి-వారు
ప్రచ్ఛన్నముగా తిరుగసాగిరి.

కపి సేనలను గాంచిరి వారు
మేను గగుర్పుతొ వణకిపోయిరి
ఎంతనివారు లెక్కవేతురు
అంతులేనిదా వానర వాహిని.

గిరిశిఖరముల అరణ్యాలగల
సేనావాహిని సేతువు దాటెను
దాటుచునున్న ధీరులెందరో!
దాటగ నున్నదిలెక్కల కందదు.

సింహనాదములు నింగి కెగయగా
సమరోత్సాహుల సమూహమ్ములో
రహస్యమ్ముగ శుక సారణులు
తిరుగుచుండగా విభీషుణుడు గనె.

శుకసారణులను-విభీషణుండు
గుర్తించెను ఆ అసురుల నపుడు
రామచంద్రుని ముందు నిలపెను
గూఢచారులని తెలియబరచెను.

అసువులుపైన ఆశ వీడిన
శుక సారణులు రాముని గాంచిరి
''మీ బలములను తెలియగ నిటకు
ఏలిక పనుపున వచ్చితి మనిరి.''

శుక సారణులకు వణకు తగ్గదు
వారితో పలికెను రామభద్రుడు
''పూర్తిగ మీరు మా సేనలను
చూచితిరా మరి బలము తెలిసెనా!

మీ నాయకుడు కోరిన యట్టి
సమాచారము దొరికిన పొందు-
లేదామీరు మా సేనలను
తిరిగి చూచియే లంకకు మరలుడు.

పట్టుబడితిరని భయము వీడుడు
దూతల చంపుట నిషిద్ధమైనది
ఈ విభీషణుడు మా బలములను
చూపును మీకుశ్రద్ధగ చూడుడు.

ఓ విభీషణా! ఈ రాక్షసులు
మనతో జేరి ఉపాయములతో
సేనను తమలో కలుపగ నెంచిరి
శరణు వేడుచూ పదముల పడిరి.

వీరిని వదలుడు బ్రతికిపోదురు
అనుచు రాముడు వారితొ పలికి
లంకేశునకు చెప్పమనుచును
పదునగు పలుకులు వారికి చెప్పెను.

''రావణరాజా! ఏ బలములతో
నా సతి సీతనుహరించినావో
ఆ బలములను చూపించదగు
సమయ మిప్పుడాసన్నమైనది.

రేపటిరోజు ప్రాతః సంధ్యలో
బహిర్ద్వారములు ప్రాకారములు
బ్రద్దలు కొట్టి లంకలో అడుగిడి
అసుర నాశము చేసెద వినుము.

వజ్రాయుధమును పోలు శరములు
వదలెద- నీవు సిద్ధపడుమయా!
నా కోపమును తీర్చుకొందును
కొడుకులు బంధులతోడ నిలువుము.''

పొమ్మని వదలగశుక సారణులు
జయము పలుకుచు ఎగిరిపోయిరి
రావణ ప్రభువును దర్శించుకొని
విషయములన్నీ విశద పరచిరి.

''రాక్షసరాజా! వానరబలము
సర్వముమేము తెలిసితిమయ్యా!
విభీషణుడు మా ఉనికి తెలిసెను
ధర్మమూర్తి ఆ రాముడు వదలెను.

ఓ మహరాజా! రామచంద్రుడు
లక్ష్మణమూర్తి- విభీషణుండు
ఇంద్ర తుల్యుడగు వానరరాజు
దిక్పాలురతో సమానులయ్యా!

వీర పుంగవులు అస్త్రవేత్తలు
వారు నలుగురే చాలుదురయ్యా
వారి చేతిలో లంక మిగలదు
మిగిలిన వానర సేనలు ఎందుకు.!

లంకాధీశా! రాముని గంటిమి
వీర పుంగవునిదర్శించితిమి
అతని ఆయుధము చూచితిమయ్యా
ఒక్క రాముడే సర్వసమర్థుడు.

సుగ్రీవుడును విభీషణుండు
లక్ష్మణమూర్తులు రక్షగ నున్న
వానర సేనను ఎదిరి నిలువగ
సురాసురులకు సాధ్యముగాదు.

పది యోజనముల వెడల్పుగాను
నూరు యోజనములున్న వారధిని
మా కన్నులతో చూచితిమయ్యా
సేతువు దాటుచు వచ్చుచుండిరి.

అంతు కనపడని అపారసేన
అమితోత్సాహులు వారందరును
అతి బలవంతులు ఆ రణధీరులు
ఆలోచించుము కోపము వదలుము.

ఏ క్షణమైనా వారిటవత్తురు
వారితొ నీవు తలపడవద్దు
సీతాదేవిని రామునికిమ్ము''
అని ఆ సచివులుహితవు పలికిరి.

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

# 26 యోధుల వివరములు రావణుడు తెలియుట

శుకసారణులు చెప్పినహితవు
నచ్చకపోయెను దశకంధరునకు
''సకలలోకములు ఒకటైపోరిన
సీతనురామునికిచ్చుట జరుగదు.

ఓ సారణుడా! దుర్బలుడవయి
వారిదెబ్బలకు భయపడిపోతివి
యుద్ధభూమిలో నన్నుగెల్చెడి
వీరుడెవ్వడో తెలియబరచుము.''

అనుచు రావణుడు గర్వాంధుడయి
వానరసేనల చూడగనెంచి
తెల్లగమెరసే ఎత్తగు భవనపు
ప్రాసాదముపైనిలబడి అడిగెను.

''వానర సేనల అధిపతి ఎవరు?
వానర నాథుని హితులు ఎవ్వరు?
విజయకాంక్షతో దూకెడిదెవ్వరు?
వివరించమని మంత్రుల నడిగెను.''

సారణుడపుడు కరమును చాచి
''అడుగో! నీలుడు అరిభయంకరుడు
సింహనాదముతొ ప్రాకారముల
గిరుల వనముల వణకునింపెను.

వానర సేనానాయకు డతడే
వీరపుంగవుని నీలుని గంటివ!
సేనాముఖమున నిలచిన వీరుడు
అతిబలశాలి సూర్యతనూజుడు.

అతిపరాక్రముడు అంగదుడతడే-
చేతులనెత్తి లంకవైపుగా
అమితకోపమును అడుగులువేయుచు
గుండెలదరగా కదలుటలేదా.

పర్వతమంత వున్నాడతడు
తోకతొ నేలనుబాదుచుండెను
వాలిపుత్రుడు యువరాజతడు
వాలికి సరిపడు తనయుడాతడు.

సుగ్రీవునికి అతి ప్రియతముడు
ఇంద్రుని పనులకు వరుణుడున్నటు
రామకార్యమున ముందర నిలచి
పోరుకు నిన్ను పిలచుచుండెను.

అడుగో- అడుగో- ఆంజనేయుడు
అంతసాహసి మరి యింకెవ్వడు
సీత జాడగనివీరులతెచ్చెను
దశరథరాముని నమ్మినబంటు.

వీరుడాతడు విజయకాంక్షియై
వానరయోధుల ప్రోత్సహించుచు
నీతో తలపడ నడుముకట్టెను
వాయుదేవుని తనయుడాతడు.

అంగదువెనుక నలుడునిలచెను
కడలికి సేతువు వాడేకట్టెను
చందన వనముల వసించునట్టి
మహావీరులు వానిసైన్యము.

వెయ్యికోట్లకు పైబడి వీరులు
అతి విక్రములు నలుని కొలుతురు
వారందరతో లంకను చుట్టి
వాడొక్కడె ఈ లంక కూల్తునసె.

నూటముప్పది లక్షల వీరులు
రంభుని సేనలో నిలిచిరి పోరుకు
వింధ్యపర్వత, సహ్యాపర్వతపు
కృష్ణగిరులలో వాడిపాలన.

వెండి కొండవలె వెలిగెడువాడు
శ్వేతుడందురు యుద్ధచతురుడు
అమిత విక్రముడు సుగ్రీవుని గని
ఏదో పలుకుట గను మహరాజా!

అక్కడుచూడు - వాడే శరభుడు
వానర యూథపు అధిపతివాడు
చెవులు పొడుచుకొని నిలచియున్నవి
ఆవలించుచు నుండెను గంటివ!

సేనల విభజన చేయుచుండెను
వీరులనాతడు ప్రోత్సహించుచు
తిరిగి ఎచటకో పోవుచుండెను
ముల్లోకములలో మేటివీరుడు.

మరణభయము ఆ శరభు డెరుగడు
యుద్ధమునందు వెన్ను చూపడు
భయము నెరుగడు అతి భీకరుడు
తోక త్రిప్పుచూ అరచుట వినుము.

అక్కడచూడు-వాడే కుముదుడు
గోమతి ఒడ్డున నిలచినయట్టి
సంకోచ మనుసుందర శైలము
కుముదుని నిలయము, అతడొకరాజు.

మనోహరమ్మగు సాల్వేయగిరి
శరభు నివాసము-వాడట రాజై
నలుబది లక్షల విహారులనెడి
సేనా బలమునుకలిగియుండెను.

కోటివీరులతొ కుముదుడు వచ్చెను
వాడితోక అది ఎర్రగ పచ్చగ
తెల్లని రంగుతొ మెరయుట చూడుము
లంకను కూల్చగ కదలెనువాడు.

పర్వతమంతటి కపినట చూడుము
పనసుడు వాడు- ఉరుముచుండెను
వీనిని మించిన వీరుడులేడు
వీనిని గెలువగ సాధ్యముకాదు.

లంకాధీశా! రంభుడు వాడు
సింహతుల్యమగు వీరుడు వాడు
కపిలవర్ణము దీర్ఘనయనముల
చూపుల కాల్చుచు నున్నాడీపురి.

పారియాత్రగిరి రాజ్యమునేలును
యాభై లక్షల వానర వీరులు
వీనిమాటపై పోరగ నిలుతురు
పోరుట సరదా ఆ పనసునకు.

అచ్చట చూడుము! వాడే వినతుడు
రెండవ సంద్రము అన్నటు సేనతో
వీరపుంగవుడు వెలుగుచుండెను
అర్వై లక్షలు వాడిసేనలు.

క్రోధనుడనెడి కపివీరుని గను
పోరుకు నిన్ను పిలుచుచుండెను
గవయుడువాడు- అతికోపిష్టి
దేహము పెంచుచు నుండెను పోరుకు.

నీపై పడగ నున్నాడతడు
డెబ్బది లక్షల వీరుల కధిపతి
లంకనాశనము చేయుట కొరకై
నిశ్చయించుకొని నిలచెను వాడు.

లంకాధీశా! అతిబలవంతులు
కామరూపులు అజేయులయ్యా!
అఖండ సేనల కధిపతులందరు
అందరు ఒకటై నిలచిరి చూడుము.''

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 27 శ్రీరాముని సేనల వివరములు రావణుడు తెలియుట

''అసువులపైన తీపినెరుగని
అతి సాహసులు యూథపతులను
చూపెద గనుము లంకాధీశా!
వాడే హరుడు- అతిభయంకరుడు.

రంగుల వెలిగే పొడుగు వాలము
పైకి ఎత్తిఅటనిలచెను చూడు
సూర్యకిరణములు అన్నటు వెలిగే
వాలముగనుము-వెయ్యికోట్లతో

వీరుడు హరుడు వచ్చెను వింటివ!
సుగ్రీవునికి కింకరుడతడు
నిన్ను గెలువగ తలంచుచుండెను
వాడే నీకు సరియను చుండెను.

భల్లూకములవి అక్కడచూడు
కాటుక కొండలు- నీల మేఘములు
దిగి నడచునటు కనబడలేదా
వారిని లెక్కిడ ఎవ్వరి తరము.

మేఘములందు ఉరుముతీరుగా
ధూమ్రుడువాడు ఎలుగుల కధిపతి
వానితమ్ముడు వానిప్రక్కనే
అన్నను మించిన ఘనుడతడయ్యా!

వానిని గంటివజాంబవంతుడు
దేవాసుర సంగ్రామ మందున
ఇంద్రునికెంతో సాయముజేసి
అనేక వరములుపొందిన వీరుడు.

అగ్ని హోత్రునికి సరియగు వీరులు
అసురుల మించిన బలమగు వీరులు
చావు అన్నచో భయము నెరుగరు
కొండరాళ్ళను త్రోయుచుండిరి.

ఎగిరే వీరుడు- దంభుడు రాజా!
ఇంద్రుని మన్నన పొందెనువాడు
బలవంతులలో మేటి ఆతడు
ఉత్సాహముతో పోరగ నిలచెను.

సన్నాధుడను వానర యోధుడు
కపులకు వాడు పితామహుడయా!
అడుగునకొక్క యోజనమ్ముగా
ఎత్తగుగిరులను దాటునువాడు.

వినిని మించిన పెద్దశరీరము-
మరియే జీవికి లేనేలేదు-
ఒక యోజనము ఎత్తువరకును
అవలీలగను ఎగుర సమర్థుడు.

దేవాసుర సంగ్రామమందున
సురలకుతోడై పోరుట కొరకు
అగ్ని దేవునికి పుట్టెను వాడు
ఇంద్రునితోనే పోరెనువాడు.

క్రోధనుడనెడి కపివీరుని గను!
అపజయమెరుగని కపికిశోరము-
వెయ్యికోట్ల బలగమ్ముతొ వచ్చెను-
వాడే నీతో పోరగనుండెను-

అడుగో- అక్కడ- ప్రమాధి వీరుడు
గంగాతటమున గిరిప్రదేశమున
దేవేంద్రునివలె తిరుగుచుండును
వెయ్యి లక్షల సైన్యమువానిది.

శంబసాదనుడు అను రక్కసుడు
పూర్వకాలమున- గజరూపమున
మునులను ఇడుముల బెట్టగ నంత
కేసరికపి ఆ అసురుని జంపెను.

అప్పటి నుండి గజ వానరులకు
వైరము మొదలై యుండుటచేత
కనబడు కరులను ప్రమాధి వీరుడు
కొండకు బాదుచు చంపుచుండును.

సేతువుపైన కోటి వీరులతొ
గోలాంగుల సేనలకధిపతి
గవాక్షుడనెడి వీరపుంగవుడు
గంతులు వేయుచు వచ్చుటగనుము.

లంకా పట్నము సమూలమ్ముగా
తానొక్కడనే కూల్చెదననుచు
గవాక్షుడనుట నేనువింటిని-
గంటిని స్వామీ! బలవిక్రములను.

తియ్యని తేనెల నిచ్చేసుమములు
కోరిన ఫలముల నొసగే తరువులు
బంగరు కాంతిని రవికే ఒసగే
కాంచన పర్వత రాజము తెలియున.!

ఆగిరి జీవులు బంగరు వెలుగులు
ఆగిరి నెలవు మహాఋషులకు
అసురుల మధ్యలొ నీవువెలుగునటు
ఆగిరి వెలుగును బంగరు గిరులలొ.

ఆకాంచనగిరి సంచారియగు
కేసరియనెడి వానరోత్తముడు
వచ్చెను వాడే తీరుగ గనుము
వాడొక భీకర కపిరాజుసుమా!

కపిల ముఖములు శ్వేత ముఖములు
పింగళ తామ్ర ముఖములు గలిగి
కోరలు నఖములు గలిగిన కోతులు
సింహము పులులను మించిపోదురు.

అగ్ని హోత్రముతొ విషనాగులతొ
సమానులయ్యా వానర వీరులు
గుండ్రని ఎర్రని కన్నులు గలిగిన
కరి గిరి సములగు బలవంతులయా!

అక్కడు చూడు కపుల మధ్యలో
ఖ్యాతి గాంచిన 'శతవలి' వీరుడు
జయము కలుగగ నిరతము వాడు
సూర్య దేవుని ఉపాసించును.

రాముని సంతస పెట్టుట కొరకై
అసువులనైనా వీడును వాడు
లంకను తానే కూల్చెద ననుచు
పలుకుట స్వయముగ వింటిని నేను.

గజుడు, గవాక్షుడు, గవయుడు, నలుడు
నీలుడు అనెడి వానర వీరులు
పదికోట్ల వీరులతొ ఒక్కొక్కరుండిరి
అమిత విక్రములు అజేయులందరు.

ఓ మహరాజా! వానర వీరులు
ప్రతిభావంతులు ధైర్యవంతులు
గిరులను ముక్కలు చేసి, వాటిని
నాల్గు మూలలకు చల్లెదరయ్యా!.''
॥శ్రీ రఘురాముని॥

❉❉❉

# 2 8 హనుమదాది వీరుల వివరములు రావణుడు తెలియుట

సారణుడటుల చెప్పిన వెనుక
శుకుడు తిరిగి ఇటు చెప్పదొడంగెను
''లంకాధీశా! తిరిగి చూడుము
మదపు టేనుగుల పోలు కపులను

బలమున సురలతొ సరిపడు కపులు
వేల శంకువులు, బృందము లెన్నో
దేవగంధర్వుల వలన జనించిరి
కామరూపులు అతి బలవంతులు.

అక్కడ చూడు ఇద్దరు యువకులు
అందమునందు చక్కనివారు
మైంద ద్వివిదులు అతి బలవంతులు
అమృత పానము చేసిన వీరులు.

మృత్యుదేవుని కుమారులైన
సుముఖ దుర్ముఖులు తండ్రికి సములు
లంక వంకనే చూచుచుండిరి
సేనతొ వచ్చిరి వీరపుంగవులు.

అక్కడ- అక్కడ- ఆ ప్రక్కను గను
మదపు టేనుగును మించిన కాయము
లంకలొ అడుగిడి సీతను గాంచి
నీతో పలికెను నిర్భయమ్ముగా.

అప్పుడు వచ్చిన ఆ కపివీరుడు
తిరిగి వచ్చెను వానర సేనతొ
కేసరి కాతడు తనయుడు అగును
వాయుదేవుని నందనుడాతడు.

కడలిని దాటిన కీర్తిమంతుడు
వాయుదేవునికి సరిపడు గమనము
కోపించినచో కడలి నంతను
క్షోభపెట్టగల బలవంతుడయా!

కోరిన రూపము ధరించగలడు
హనుమంతునిగా ప్రసిద్ధిగాంచెను
వాని వివరము- నాకొక మిత్రుడు
తెలియ జెప్పెను విను మహరాజా!

పుట్టుకతోనే ఆ బలవంతుడు
సూర్యబింబము ఉదయించుట గని
రవినే ఫలమని మదిలో తలచి
ఆకలి నిండి ఎగిరెను అతడు.

మూడు వేలగు యోజనమ్ములు
ఎగిరెను వాడు పట్టు విడువక
సురలు ఋషులు చేరగలేని
సూర్యుని చేరగ తలచెను వాడు.

అక్కడ నుండే ఆ హనుమంతుడు
ఉదయగిరిని తా పడిపోయెనట
అతని పాటుకు కొండ పగిలెను
వీని చెంపకు దెబ్బ తగిలెను.

బలములో వానికి సాటి లేరయా!
మాటలలో మరి గెలువ నసాధ్యుడు
ఒరుల సాయము లేకనె వాడు
లంకను జయించ యోచన నుండెను.

ఆ హనుమంతుని ప్రక్కన గనుము
శ్యామల కాంతితొ వెలిగే మేను
పద్మపత్ర నేత్రమ్ములు గలిగిన
అతిరథు డాతడు రామచంద్రుడు.

పరాక్రమమున లోక ప్రసిద్ధుడు
ఇక్ష్వాకు వంశమున కీర్తి నింపెను
అన్ని అస్త్రములు తెలిసినవాడు
నింగినిశరముల చీల్చగ నేర్పరి.

గిరులనుశరముల చీల్చగ ఘనుడు
కోపము వచ్చిన మృత్యుదేవుడే-
పరాక్రమమ్మున సురపతి సముడు
సతికై పోరగ వచ్చె నాతడు.

రామచంద్రునికి కుడి ప్రక్కన గను
బంగరు ఛాయతొ వన్నె లీనెడి
విశాల వక్షము ఎర్రని కన్నులు
రాముని తమ్ముడు లక్ష్మణుడతడు.

రాముని కాతడు ప్రాణసమానుడు
అస్త్రములన్నీ తెలిసినవాడు
నీతి కోవిదుడు- అతి కోపిష్టి
రాముని కొరకై అసువుల నిచ్చును.

రాముని కాతడు అతి ప్రియతముడు
రామచంద్రుని కుడి భుజమాతడు
యుద్ధ భూమిలో అసురులందరిని
తానే చంపగయోచన నుండెను.

రామచంద్రుని ఎడమ ప్రక్కన
విభీషణాఖ్యుని- సచివులతో గను
శ్రీమంతుడు, శ్రీరామచంద్రుడు
లంకను అపుడే ఒసగెను వానికి.

రాముని ముందు గిరివలె నిలచెను
కపివీరులకు నాథుడు వాడు
సూర్య తనూజుడు-సుగ్రీవుడయా!
గిరులలో, హిమగిరి అన్నటు లుండెను.

గుహవలెనున్న కిష్కింధేలును
నూరు కమలముల కాంచనమాల
లక్ష్మీప్రదమగు దివ్యమాల యది
వాని వక్షమున వెలుగుట గనుము.

రాముని కోలను వాలి కూలగా
లంకానాథా! ఆ సుగ్రీవుడు
కాంచన హారము, కాంతను పొందెను
హార మహిమచే అజేయుడాతడు.

నూరు లక్షలు- కోటి యగునయా!
నూరు వేలగు కోట్లు-శంఖమగు
నూరు వేలగునట్టి శంఖములు
మహాశంఖమని అందురు రాజా!

నూరు వేలగు మహాశంఖములు
ఒక్క బృందమనిలెక్కిడుచుందురు
నూరు వేలగునట్టి బృందములు
మహాబృందమై పిలవబడునయా!

మహాబృందములు నూరువేలను
ఒక్క పద్మముగ లెక్కింతురయా!
అట్టి పద్మములు నూరు వేలను
మహాపద్మమని పిలుచుచుందురు.

నూరు వేలగు మహా పద్మములు
ఒక్క ఖర్వమై లెక్కించబడు
నూరు వేలగు ఖర్వమ్ములను
మహాఖర్వమని చెప్పుచుందురు.

మహాఖర్వములు నూరువేలను
సముద్రమనుచు పిలుచుచుందురు
నూరు వేలగు సముద్రములను
ఓఘము అనుచు పిలతురు రాజా.

నూరు వేలు అగు నట్టి ఓఘములు
మహౌఘమనుచు చెప్పుచుందురు
కోటి మహౌఘములున్న సేనతో
పోరుకు రాముడు వచ్చుచుండెను.

వానర సేనావాహిని ఇప్పుడు
మండెడి గ్రహములతీరుగ నున్నది
రిపుల జయించెడి ఘన ప్రయత్నము
శీఘ్రమె చేయుము లంకాధీశా!"

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 2 9 రావణుడు మరొకసారి వేగుల నంపుట

రామచంద్రుని లక్ష్మణమూర్తిని
వాయునందనుని వానర రాజును
విభీషణుని మరి మిగిలిన యోధుల
చూచిన రాజు కలవరపడెను.

కరములు మోడ్చి వినయము నిండి
నేలను జూచెడి శుక సారణులతొ
కోపము నిండి గద్గద స్వరముతొ
కఠినముగా లంకేశుడు పలికెను.

''అప్రియమ్మును ప్రభువుకు చెప్పుట
తగదని మీకు తెలియక పోయెను
యుద్ధారంభమునందే రిపులను
స్తోత్రము చేసెడి నీచులు మీరు.

రాజనీతిలో ముఖ్యమైనదగు
భృత్యధర్మము తెలియకపోయెను
గురువులు, వృద్ధుల సేవలన్నియు
వ్యర్థమైనవిమీ విషయములో.

నీతి శాస్త్రము చదవకపోతిరి
చదివినచోమరి అర్థము నెరుగరు
అర్థమెరిగినచొ ఆచరించక
జ్ఞాన భారమమోసెడి మూర్ఖులు.

నా సచివులు మీరగుట అపాయము
మీ వల్లనునే ఇంతకుముందే
రిపుల చేతిలో చావగవలెను
దైవ వశమున బ్రతికి యుంటిని

ఘటనాఘటన సమర్థుడ నేను
మరణ భయము మీకున్నదొ-లేదో
నా కోపమునకు గురియైనచొ మరి
బ్రతుకుటన్నది జరుగదు యింక.

మీరు లోగడ చేసిన మేలు
మదిలో మెదలి మెత్తబడితిని
మిమ్ముల చంపక వదలితి నందుకు
పదవులు వదలి పరుగిడిపొండు.

సిగ్గునిండిన శుక సారణులు
జయము పలుకుచు వెడలిపోవగా
నీతికోవిదుల వేగుల పిలువగ
మహోదరునితో రాజు చెప్పెను.

అతి శీఘ్రముగా వేగులవారు
జయము పలుకుచు నిలచిరి ముందర
విశ్వాస పాత్రులు-వచ్చిన వేగులు
రాజభక్తిగల సమర్థులందరు.

రావణరాజు వారికి చెప్పెను
వానర సైన్యములోన తిరుగుచు
యుద్ధప్రయత్నము తెలియగ వలెను
రాముని మంత్రులు ఎవరో తెలియుడు.

అంతరంగికులు ఎవరో తెలియుడు
ఎవరితొ రాముడు చనువుగ నుండునొ
ఎటు నిద్రించునొ ఏ అలవాట్లో
నిశితముగా మరి పరిశీలించుడు.''

రావణు నానతినందిన వేగులు
ప్రదక్షిణించి బయలుదేరిరి
కపి సేనలలో కలిసిపోయిరి
మారు వేషముల తిరుగ జొచ్చిరి.

ప్రచ్ఛన్నముగా సేనలో తిరుగు
వేగుల వునికివిభీషణుండు
గ్రహించినాడు వారిలొ దుష్టుని
శార్దూలునిగనికపులకు చెప్పెను.

వేగులవారు చూచిరి సేనలు
రామ లక్ష్మణుల చూచిరి వారు
విభీషణుని, సుగ్రీవుని గాంచిరి
అదిరిపోయిరి రావణు వేగులు.

మిగిలిన వేగుల నందర నపుడు
వానర వీరులు ఏరి వేసిరి
వారిని చంపగ వానరులుండగ
వారించెను శ్రీరామచంద్రుడు.

బాది వదలిరి వేగులందరిని
విలపించుచు ఆ అసురులు పరిగిడి
పురము చేరిరి అసువులు నిలుపగ
ప్రభువును చేరి సర్వము తెలిపిరి.

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

# 30 రావణుడు వేగులద్వారా శ్రీరామ విక్రమము వినుట

వేగులవారు లంకేశ్వరునకు
వివరములన్నీ తెలియబరచిరి
కలవరపడెను లంకాధీశుడు
శార్దూలుని గని అడిగెను అపుడు.

వారందరు అతి బలవంతులయా!
వారందరికీ రక్షణ రాముడు
వారితొ పలుకుట అసాధ్యమైనది
పరీక్షించుటిక అసంభవమ్మ్మ.

''నీ ముఖమటుల నీరసించినది
వెనుకటి శక్తి కనబడదేమి
దీనుడవై నువు నిలబడి యుంటివి
రిపుల చేతికి దొరికిపోతివా?

వానర సేనలొ జొరబడిపోతిమి
పూర్తిగ మేము తిరుగకముందే
విభీషణాఖ్యుని సచివులు గాంచిరి
కపుల చేతికి అందించిరయా.!

భయముతొ పలికెను ఆ శార్దూలుడు
సేనలొ జొచ్చి–రాక్షసరాజా!
వారి రహస్యము తెలియుటన్నది
వేగులకే మరి అసాధ్యమయ్యా.

పొర్లించిరి నను నేలమీదను
పిడికిళ్ళతొ మరి పొడిచిరి రాజా!
కోరలతో నను కొరికిరి చరచిరి
గుద్దిరి, తన్నిరి, సేనలో త్రిప్పిరి.

కీళ్ళు జారెనునెత్తురు కారెను
చేతులు రెండు జోడించితిని
రాముడు నన్ను కరుణించగను
చచ్చి బ్రతికితి ఓ మహరాజా!

రాళ్ళతొసేతువు కట్టిరి వారు
కదలి వచ్చిరికోట్ల సంఖ్యలో
సువేలాచల గిరి ప్రదేశమున
సాయుధులై వారందరుండిరి.

గరుడాకారపు వ్యూహము తీర్చెను
లంకను కూల్చగ రాముడుండెను.
సీతను యిత్తువొ-పోరెదవో మరి
శీఘ్రముగా నువు నిర్ణయించవలె''

రావణుడంతట పలికెనచ్చట
''సకల లోకములు ఒకటై నిలచిన
సురగంధర్వులు పోరగ వచ్చిన
సీతను రాముని కిచ్చుట జరగదు.

ఓ శార్దూలుడ! వానర సేనలొ
తిరిగితివీవు ఆ వీరులలో
సమర్థు లెవ్వరువారి ప్రభావము
తండ్రి తాతలువివరో చెప్పుము.

నీవు చెప్పగ వారి బలములు
తెలిసి-నేను మరి చేయవలసినది
నిర్ణయింతును''-అనగా నపుడు
వేగుల శ్రేష్ఠుడు పలికెను రాజుతొ.

''ఓ మహరాజా ఆ సుగ్రీవుడు
ఋక్షరజునికి తనయుడు అగును
వానిని పోరున గెలువ నసాధ్యము-
గద్గని తనయుడు జాంబవంతుడు.

రాజా! ధూమ్రుడు భల్లూకమయా!
జాంబవంతుని సోదరుడగును
అసురులెందరినొ చంపిన వీరుడు
ఆంజనేయుడు-కేసరి తనయుడు.

బృహస్పతికి ఆ కేసరి కొడుకు
విక్రమ వంతుడు ధార్మికుడైన-
సుషేణు తండ్రి వరుణ దేవుడు
చంద్రుని తనయుడు దధిముఖుడయ్యా.

సుముఖ, దుర్ముఖ, వేగదర్శి యను
ముగ్గురు వీరులు అతి ముఖ్యులయా
కపి రూపముగల మృత్యువు సములుగ
స్వయముగ వారిని బ్రహ్మ సృజించెను.

వానర సేనల కధిపతి-నీలుడు
అగ్నిహోత్రుని తనయుడువాడు
కేసరి తనయుడు ఆంజనేయుడు
వాయుదేవునికి తనూజుడయ్యా.

అంగదు డాతడు వాలితనయుడు
దేవేంద్రునికి మనుమడు అగును
మైంద, ద్వివిదులు ఇద్దరు వీరులు
అశ్వినిసురలకు పుట్టినవారు.

గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు
యమునికి పుట్టిన కాలాంతకులు
జోతిర్ముఖుడు శ్వేతుడు ఇద్దరు
సూర్యదేవునికి పుట్టినవారు.

హేమకూటుడను మరియొక కోతి
వరుణుని రెండవ కుమారుడగును
మహావీరుడగు నలుడనువాడు
విశ్వకర్మకు పుట్టెనురాజా!

వసువు తనయుడు దుర్ధరుడగును
పదికోట్లకు పైగా వానర వీరులు
సురలకు పుట్టిన అతి విక్రములు
వారిపేర్లు మరి తెలియదురాజా!

ఖర దూషణుల త్రిశరుని చంపిన
అతి సుందరుడు రాముడు రాజా!
యువకు డాతడు వానితొ సరిపడు
వీరుడు భువిలో లేనేలేడు.

విరాధ కబంధు లిద్దరినీ మరి
ఒక్కరాముడే చంపెను వినుము!
రాముని శరముల సురపతి ఆగడు
చచ్చును, వచ్చిన - ఆ నాకపతి.

రాముని పోలిన సుగుణవంతుని
మానవులందు కనలేమయ్యా
మత్తేభములలొ శ్రేష్టము అయిన
మత్తేభమునే పోలు లక్ష్మణుడు.

ఓ మహరాజా! లంకాపతిగా
విభీషణుని మరి అభిషేకించెను
నీ తమ్ముడు అట ముందు నిలచెను
తెలిపితి వివరముకార్యము, నెరపుము.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 31 రావణుడు మాయతో శ్రీరాముని శిరస్సు ధనుస్సు చేయించి సీతాదేవికి చూపించుట

గూఢచారులు చెప్పిన వివరము
రాముని సేనల బలాబలములు
విని- రావణుడు భయపడినాడు
మంత్రులందరితొ యోచన చేసెను.

చేయదగిన పని నిర్ణయించుకొని
మాయలమారి రావణరాజు
మాయలయందు ఆరితేరిన
విద్యుజ్జిహ్వుని రమ్మని పిలచెను.

సీతాదేవిని మోసగించుటకు
మాయతొ రాముని శిరమును చేసి
కోదండమును-శరములు-మాయవి
అశోక వనికితెమ్మని చెప్పెను.

అశోక వనమును చేరెను రాజు
దీన వదనమున సీతాదేవి
రామధ్యానమున కూర్చొని యున్నది
రాక్షసాంగనలు కావలి యుండిరి.

## యుద్ధ కాండము

విజయ వార్తను చెప్పెడి రీతిలో
సీతతొ పలికెను లంకాధీశుడు
''మంగళమూర్తీ! నిన్ను వేడితిని
వినకపోతివి నా మాటలను.

ఖరాది శూరుల త్రుంచిన రాముడు
యుద్ధమునందు నేలకొరిగెను
మూర్ఖత్వముతో పలికితివెన్నో
నన్ను చేరుము నా భార్యగను.

రాముని కాదని చేరనంటివి
రాముడు లేడని తెలియుము నీవు
వృత్రాసురుని త్రుంచినట్టుగా
రాముని చంపిరి- వివరము వినుము.

నాపై పోరుకు సుగ్రీవునితో
కపిసేనలతో రాముడు వచ్చెను
కడలికి ఉత్తర దిశలోవారు
అలసిసొలసిరి- చీకటి పడినది.

రామునిరాక తెలియునుమాకు
మా ప్రహస్తుడు సేనతొ జేరెను
నిద్రలొమునిగిన సేనలపైన
అసురులుపడిరి ఆయుధములతో.

ఖడ్గ ప్రహారమునందున వీరుడు
ప్రహస్తుడపుడు రామునిగాంచెను
ఒక్క వ్రేటుతో రాముని శిరమును
మొండెము నుండి వేరుచేసెను.

విభీషణుండు నింగి కెగిరెను
వానిని అసురులు ఒడిసి పట్టిరి
లక్ష్మణుండును వానర సేనలు
నలువంకలకు పరుగులు తీసిరి.

గ్రీవముతెగిసుగ్రీవుడు పడెను
అసువులు వీడెనుఅంజనేయుడు
జాంబవంతుడు ఎగురుచుండగా
వానిచరణములు నరికి వేసిరి.

మైందద్వివిదులు యిద్దరుకూడ
నడుములు తెగగా రక్తపు మడుగుల
పొరలి పొరలి- ఓలలనా వినుము!
ప్రాణమ్ములను వదలిరి బాధగ.

పనసుడు పగిలెను నడిమికి రెండుగ
ధరీముఖుడు తా శరములు తగలగ
గుహలో పడెను జీవచ్ఛవమై
కుముదుడు చచ్చెను సవ్వడిలేక.

తెగిన బాహువుల అంగదుడచట
నెత్తురు గ్రక్కి అసువులు వీడెను
గజముల హయముల రథముల క్రింద
కపులెందరొ అట నలిగి చచ్చిరి.

మాయోపాయము చేతను అసురులు
మరికొందరిని చంపివేయగా
పారిపోయెడి కపుల కొందరిని
వెంబడించి మా అసురులు చంపిరి.

నెత్తుట తడిసి దుమ్ము పారిన
నీదు పెనిమిటి శిరసు దెచ్చిరి
అనుచు రావణుడు సీత వినునటు
విద్యుజ్జిహ్వుని పిలువ నంపెను.

మాయలమారి విద్యుజ్జిహ్వుడు
రాముని శిరముకోదండమును
లంకాధీశుని ముందరవుంచి
సాష్టాంగముగ ప్రణామ మిడెను.

రావణుడప్పుడు కటువుగ పలికెను
''మూర్ఖుడ! శిరమును నా ముందెందుకు
సీతముందర వుంచుమునీవు
అభాగ్యురాలు చూచును చక్కగ.''

విద్యుజ్జిహ్వుడు మాయశిరస్సును
సీత ముందర వుంచి వెడలెను
ముల్లోకముల పేరుగాంచిన
రామధనుసును పోలుధనుసును

సీతకుచూపి- ఇదిగో ధనుసు
మానవ మాత్రుడు నీ హృదయేశుని
నిశిరాత్రిలో మా అసురుడు చంపెను
శిరసూ ధనుసూతెచ్చిరి గనుము

శిరసూ ధనసూ నేలమీదను
పడవేయించి రాక్షసరాజు
తన వశమవ్వగ సీతకు చెప్పెను
తనశిరస్సులు తెగుట ఎరుగడు.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 3 2 మాయ శిరసునుగాంచి నిజము తెలియక సీత దుంఖించుట

ఖండిత శిరసును గాంచెను సీత
పోలికలన్నీ పతివని తోచెను
రామ, సుగ్రీవుల మైత్రిని తాను
హనుమ చెప్పగా విన్నది లోగడ

భర్త శిరస్సని- భయకంపితయై
లేడిపిల్లవలె కెవ్వున అరచెను
గజగజ వణకెను ధరణీ తనయ
నరకిన కదళీ తరువన కూలెను.

కైకను తలచి కోర్కెలు తలచి
వనవాసమునకు వచ్చుట తలచెను
తెలివితప్పినది తిరిగి తేరుకొని
శిరసును చూచుచు రోదించినది.

''రిపుని జయించగ వ్రతమును బూని
ఇట్టి ఆపదకు లోనైపోతివి
విధివ్రాతకదా విధవనైతిని
ముందుగ ఎందుకు పోతివి నాథా!

గుణహీన యగు స్త్రీకి మాత్రమే
వైధవ్యమది లిఖించబడును
సదాచారమును ఆచరించితిని
నను రక్షించగ వచ్చి కూలితివి.

వత్సను చూచుకుబ్రతుకు గోవుగా
బ్రతికియున్న ఆ కౌసల్యమ్మ
దూడలేని గోమాత రీతిగా
కృంగిపోవదా- ఈ దుర్వార్తకు.

దీర్ఘాయువు నీకున్నది అనుచు
జోస్యులు చెప్పుట అనృతమేనా
ఇంతటివాడవు నీవిట్లైనచో
జోస్యుల బుద్ధి సన్నగిల్లెనా!

నీతి శాస్త్రము తెలిసినవాడవు
ఆపద గెలిచెడి శక్తి వున్నది
నన్ను వదలి ఈ ధరణీకాంతను
కౌగలించుకొని ఒరిగితివా నువు.

నీకై నిరతము పూజలు చేతును
నీకైకాదా నా తపస్సులు
వెలుగులు చిమ్మే ఈ కోదండము
ప్రియతమమైనది నిరతము నాకు.

మనచే పూజల నందిన ధనుసు
ఈ విధముగను వ్యర్థమైనదా
దశరథ ప్రభువును-పితృదేవతల
చేరుకుంటివా నాకము చేరి.

తారగ నీవు వెలుగుచుందువు
ఇక్ష్వాకు వంశమున యశము గాంచిన
దివ్యపురుషులను చూచుచుందువు
భార్యను నన్ను చూడవ స్వామీ!

పాణి గ్రహణము చేయునప్పుడు
నన్ను వదలనని మాట యిచ్చితివి
మాట నిలుపుకో మంగళమూర్తీ!
తోడుగ నన్ను గొనిపో రామా!

మంగళ వస్తు సముదాయములు
చందనాదులు నిండిన మేను
కుక్కల నక్కల కెరయైపోయెను
సంస్కారములు లేకపోయెనా

వనవాసమునకు వచ్చినవారిలో
మిగిలిన లక్ష్మణమూర్తిని గాంచి
నీదు జనని-విషయమ్ము అడుగగా
సర్వము తెలిసి తనువు వీడదా.

నా దౌర్భాగ్యము యిటుల చేసెను
కడలిని దాటి ఘనత వహించి-
నీటి గుంటలో జారినట్టుగా
నీచుని చేతికి లొంగిపోతివి.

వంశనాశము నావలనే నని
తెలియక-నన్ను చేపడితివయా!
పూజ్యుడ! నీకు నీ యిల్లాలే
మృత్యు దేవతగ దాపురించెను.

పూర్వజన్మలో కన్యాదానము
చెడగొట్టితినో ఏమో స్వామీ!
రాముని భార్యను అయినా నేను
ఇంతటి దుఃఖము నందితి నిపుడు-

ఓ రావణుడా! నను గొనిపోయి
నా పతి కాయముపై పడ వేయుము
ఈ సత్కార్యమునైనా చేయుము
పతి శిరముతొ నా శిరము జేర్చెద-

నా పతి నడచిన త్రోవలొ పోదును
పతిని వీడి నే మనలేనింక''
అనుచు జానకి శిరస్సు ధనుసులు
మరిమరి చూచి రోదించినది.

దుఃఖించుచును జానకి యుండగ
ద్వారపాలకుడు వనమును చేరి
రావణ ప్రభువుకు జయము పలుకుచు
సాష్టాంగముగా ప్రణామముంచి.

భక్తిగ పలికెను '' ఓ మహరాజా!
సేనానాయకుడైన ప్రహస్తుడు
మంత్రులందరితొ వచ్చెను నిను గన
వేచియుండెను- రాచకార్యమది.

కష్టమైన కార్యమ్ము వచ్చినది
మీ ఆనతికై వేచియుండిరి''
అనగా నసురుడు వనమును వదలెను
శిరసూ ధనుసులు మాయమైనవి.

సభాభవనమును చేరెను రాజు
రాముని శక్తిని పూర్తిగ తెలిసెను
తన సచివులతో యోచన చేసెను
జరగ వలసినది నిర్ణయించెను.

మేలుకోరెడి సేనాపతులకు
మృత్యువు సములగు తన వీరులకు
యుద్ధభేరిని మ్రోగించగను
ఆనతి నిడెను లంకాధీశుడు.

ఆనతి మేరకు అతని విధేయులు
మహాసైన్యమును సిద్ధపరచిరి
యుద్ధకాంక్షి తమ రావణ ప్రభువుకు
విషయములన్నీ ఎరుకపరచిరి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 33 సరమ–సీతాదేవికి యదార్థముచెప్పి ఊరడించుట

దుఃఖ జలధిలో మునిగిన సీతను
విభీషణుని సతి- సరమ చూచెను
సీత యన్న కడు స్నేహము నెరపే
సరమ సీతకు ప్రియతమురాలు.

అసురుని మోసము సరమ గాంచెను.
మెల్లగ సీతను సమీపించెను
ఊరడిల్లుమని చల్లగ చెప్పెను
చాటుగ సర్వము వింటిని అనెను.

''ఓ సీతా నువు భీరువు గాకుము
అతి తొందరగా సాగెను రాజు
అందుకు కారణ మరసి వచ్చితి-
రాముడు బ్రతికే యున్నాడమ్మా!

సర్వము తెలియును శ్రీరామునికి
మేను మరచి నిద్రించడు రాముడు
పోనీ రాముడు నిద్రించినచో
లక్ష్మణు డసలే నిద్ర పోడుగద.

నిదురించెడి శ్రీరాముని వధ-కథ
నర వ్యాఘ్రమును చంపగ శక్యమ?
సురలను ఇంద్రుడు కాపాడునటు
రక్షణ నొసగే రాముడు కుశలము.

అజానుబాహుని- విశాలవక్షుని
అమిత విక్రముని- ధార్మిక శ్రేష్టుని
నీతి కోవిదుని చంపెడివాడు
జగత్తులోనే లేడు నమ్ముము.

సర్వ జగత్తుకు విరోధియైన
రావణాసురుని మాయాజాలము
శిరసూ ధనుసూ సర్వము మాయ
నీ పతి దేవుడు క్షేమము తల్లీ!

సీతా! నీకు ప్రియము నుడివెద
ఇకపై నీకు శుభములు కలుగును
కపి సేనలతో తమ్మునితోను
కడలిని దాటెను రామభద్రుడు.

దక్షిణ దిశలో తన సేనలతో
విడిసి యుండెను రామచంద్రుడు
స్వయముగ నేను చూచితి తల్లీ!
రాముని విషయము తెలిపిరి వేగులు.

వేగులు చెప్పిన విషయము వినగనె
పరుగున పోయెను రావణరాజు
కాగల కార్యము యోచన చేయగ
మంత్రులతో పరివేష్టితు డయ్యెను.''

సరమ అట్టుల చెప్పుచుండగా
భేరీధ్వనులు వినవచ్చినవి
అధ్వని వినిన సరమ పలికెను
''యుద్ధ ప్రయత్నము నారంభించిరి.

మేఘ గర్జనగ భేరులు మ్రోగెను
గజముల నిపుడు సిద్ధపరతురు
తేరుల హయములు పూన్చుచుండిరి
అశ్వారోహక సేనలు కదలును.

రాజ వీధులలొ సాగెడి సేనలు
కడలిని కలిసే ప్రవాహములుగ
వివిధాయుధములు తళతళ లాడగ
ఆభరణములతొ కదలుచున్నవి.

అడవి దహించెడి కార్చిచ్చువలె
ఆభరణమ్ముల కాంతులు మెరయ
అమితమైన బలగమ్ములు సాగెను
అదిగో వినుము గంటల గణ గణ.

తేరులు కదిలెడి సవ్వడి వినుము
తురగమ్ములవే సకిలించుట విను
అసురులకిపుడు భయము కలిగెను
సీతా! నీకు జయము లభించును.

కమలపత్ర నేత్రమ్ముల రాముడు
కోదండముతో నిలచిన రాముడు
ఇంద్రుడు దైత్యుల త్రుంచినట్టుగా
అసుర వినాశము చేయుట తథ్యము.

విష్ణుమూర్తివలె తన తమ్మునితో
రావణు చంపి నీ పతి దేవుడు
నిన్ను చేరును- కౌగిలి నిడును
ఆనందముతో పులకరింతువు.

ఉదయ భానుని పోలెడి వదనము
నీపతి వదనము కాంతువు త్వరలో-
వర్షధారలతొ పొంగు పైరువలె
పతి విక్రమమున సంతస పడెదవు.

ఏక వేణిగా చిక్కులు పడిన
శిరోజములకు చిక్కు వీడును-
పాము కుబుసమును వదలినట్టుగా
దుఃఖము నింక వదలి వేతువు.

మేరు గిరికి తా ప్రదక్షిణిచెడి
సూర్య దేవుని ప్రార్థన చేయుము
ప్రజలందరకూ కాంతిని నిరతము
దినకరు డొసగును-దైన్యము వీడుము.
॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 3 4 సరమ–సీతాదేవికి రావణుని నిశ్చయము తెలుపుట

సరమ చెప్పిన చల్లని మాటల
మనసు కుదుటబడె సీతాదేవికి
ఎండిన భూమిని వర్షధారలు
చల్లబరచినటు లున్నది మనసు.

సరమ పలికెను సీతాదేవితొ
''ఆకాశములో చరించగలను
గరుడుని మించిన శక్తితొ సాగెద
వాయు దేవునే మించి పోయెద-

ఇపుడే నేను రాముని చేరి
నీదు కుశలము చెప్పి వచ్చెద''
అనగా సీత ఆనందముతో
సరమ శక్తిని పొగిడి పలికెను.

''అమ్మా సరమా! రావణు చర్యలు
తెలియ బరచుము విశదముగాను
వాడు మాటలతొ చేష్టలతోను
మతి చెడగొట్టుచు నున్నాడమ్మా.

ఎపుడే విధముగ ప్రవర్తించునో-
మదిలో భయముతో కృంగిపోతిని
బ్రతుక నివ్వడని శంక ముదిరెను''
కావున నాకీ సాయము చేయుము''

సీత కన్నులను తుడిచెనుసరమ
ఇపుడే విషయము తెలిపెద ననుచు
రావణుడున్న తావున కేగెను
చాటుగ విషయములన్ని గ్రహించెను.

తిరిగి సరమతా సీతను చేరెను
సీత ప్రియముగ అక్కున జేర్చుకు
కూర్చొనబెట్టి సరమను అపుడు
ఉన్నది దాచక చెప్పగ కోరెను.

వణకెడి సీతతొ పలికెను సరమ
''రావణరాజుకు ఆతని తల్లియు
'అవిద్ధుడనెడి' వృద్ధమంత్రియు
నిన్ను వదలమని చెప్పుట వింటిని.

మనుజోత్తముని గౌరవించమని
మైథిలి నాతని కందించమని
కాదన్నచొ మరి సర్వనాశనము
జరిగి తీరునని హితవు చెప్పిరి.

జనస్థానము కూలుట చెప్పిరి
హనుమంతుడు ఆ కడలిని దాటి
లంకలో అడుగిడి సీతతొ పలుకుట
అసాధ్యమైనది కాదా! అనిరి.

పిసినారి తను ధనము వదలనటు-
నిన్ను వదలనని రాక్షసరాజు
ఖండితమ్ముగా చెప్పుట వింటిని
హితవచనమ్ములు కాలదన్నెను.''

సీతాదేవీ! ఆ రావణుడు
బ్రతికియుండగా వదలడు నిన్ను
మంత్రులు అటులే నిశ్చయించిరి
వాడు చచ్చినచొ వచ్చు విముక్తి.

భయపడవలదు ఓ వైదేహీ!
నల్లని నీ కనుబొమలు శుభముతొ
వాడి శరముల రాముడు- లంకను
కూల్చివేయునని చెప్పుచున్నవి.''

సరమ సీతతో- పలుకుచుండగా
వానరవీరుల భేరుల మ్రోతలు
శంఖఘోషలు- సింహనాదములు
విన వచ్చినవి నింగి చీలునటు.

వానర వీరుల సందడి వినగా
గుండె లవిసెను అసుర వీరులకు
తేని తప్పులకు పరిహారముగ
చావు తప్పదని తలచిరి వారు.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 35 మాల్యవంతుడను అసురశ్రేష్ఠుని హితబోధ

శంఖఘోషలు భేరుల మ్రోతల
లంకలో అసురుల గుండెలవియగా
రఘువంశాంబుధి అంబుధిదాటి
లంకపైబడ బయలుదేరెను.

లంకేశ్వరుడు సవ్వడి వినెను
మంత్రుల చులకన చేసి పలికెను
''కడలినిదాటి రాముడు వచ్చుట-
వాని విక్రమము వింటిని నేను.

రాముని సేనల బలముతెలిసియు
వీరవిక్రములు మీరందరును
ఒకరినొకరుగా చూచు- కొనుచును
మిన్నకుండుట చూచితి నేను''

మహారాజటుల మంత్రులనెంతో
ఈసడింపుగా పలుకుట వినిన
మాల్యవంతుడను తెలివిమంతుడు
రావణరాజుతొ పలికెను అపుడు.

''నాల్గు విధముల రాజనీతిలో
సుశిక్షుతుడయి రాజ్యము నేలిన
వైభవమ్ముతో సుఖములనంది
శత్రుల నాతడు గెలుచుచుండును.

అట్టిరాజు తా సమయము నెరిగి
రిపునితొ నైనా సంధి నెరపును.
శత్రుబలమును మించిన బలము
ఉన్నచొ మాత్రమె పోరు సలుపును.

ఓ రావణుడా! నా ఆలోచన-
సంధికొరకు నువు ముందుకు వచ్చుట
మీ విరోధము సీతవల్లనే
ఆమెను రామునికిచ్చి వేయుము

సీతనిచ్చినచొ పోరుజరగదు
నీ విరోధము సమసి పోవును
జగము రామునికి జయము కోరును
జగడమువలదు రామచంద్రునితో.

లంకాధీశా! విరించి తొలుత
ధర్మాధర్మము -సురాసురులను
సృజించినాడు- అందులో ధర్మము
సురలను జేరెను తెలియుము నీవు.

అధర్మమ్మును ధర్మము మ్రింగిన
ధర్మము గెలిచి కృతయుగమగును
ధర్మమే మరి మ్రింగ బడినచో
కలియుగ మగునది రాక్షస రాజా!

విజయాకాంక్షివై విర్రవీగుచు
నీవు ధర్మమును త్రెంచితివయ్యా!
అధర్మమ్మును పెంచితి వీవు
అందుకె ధర్మము సురలను జేరెను

విషయాసక్తుడ వైతివినీవు-
అగ్ని సమానులు అగుమహఋషులకు
మనస్తాపము కలిగించితివి
వారి అగ్రహము నీపరమైనది.

అనల సన్నిభులు- అగ్నిహోత్రముల
వేదమంత్రముల హవిసులు వ్రేల్చగ
వేసవిలోమరి మేఘము లన్నటు
పరుగిడు చుండిరి అసురులందరు.

ఋషులు చేసెడి తపస్సు లన్నియు
సురలకు తేజము పెంచినవయ్యా!
రక్కసులందరి తేజముతగ్గెను
నా పలుకులను శ్రద్ధగ వినుము

దేవదానవులు యక్షులవలన
చావులేనటు వరమునందితివి
వచ్చినవారు నర వానరులు
భల్లూకములు వీరపుంగవులు.

సింహ నాదములు రిపులుచేయగ
అపశకునములు అగపడుచున్నవి
అసుర నాశనము జరుగును అనుచు
నమ్మకమ్ముగా తోచుచున్నది.

భయము గొలుపునటు మేఘగర్జనలు-
రక్తవర్షము కురియు చుండుట
గజ హయములకు కన్నుల నీరు
ధ్వజములవన్నెలు మాసిపోవుట.

వృకములు, నక్కలు, గ్రద్దలు ఎన్నో
లంకలొ స్వేచ్ఛగ సంచరించుచు
అపశకునముగ అరచుచున్నవి
భయము గొలుపునటు కూయుచున్నవి.

నల్లటి స్త్రీలు భయపెట్టుచును
తెల్లని దంతము లగుపడునటుల
నవ్వుచున్నటు కలలోమనకు
కనబడుచుండిరి అపశకునమది.

హవిసులు కుక్కలు తినుచున్నవయా!
ఆలమందలకు ఖరములు పుట్టెను
ముంగిస లకును ఎలుకలు పుట్టెను
పెద్దపులులతో చేరెనుపిల్లులు.

ఊరపందులతొ కుక్కలు చేరెను
తెలుపూ ఎరుపూ పాదమ్ములతో
పావురమ్ములవి- అసుర క్షయమ్మును
సూచించునటు తిరుగుచున్నవి.

గోరువంకలు పెంపుడు పక్షులు
క్రూరముగా మరి కూయుచున్నవి
పక్షులు మృగములు పోరు సలుపగా
పక్షులు ఓడెను అశుభ సూచన.

రవి కెదురుగను పక్షులు ఏడ్చెను
పురుష రూపము దాల్చిమృత్యువు
ముండనమ్ముతో భయంకరమ్ముగ
అందరి ఇండ్లను చూచుచున్నది.

ఇంకా ఎన్నో దుర్నిమిత్తములు
అగపడుచున్నవి లంకాధీశా!
ఆపదరాని ఆలోచనను
ముందు చూపుతో చేయుము నీవు.''

తన హితబోధ రావణరాజుకు
నచ్చలేదని తెలిసిన వెంటనె
మాల్యవంతుడు మిన్నకుండెను
రాక్షసరాజుకు కోపము పెరిగెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 36 లంక రక్షణకు- ఏర్పాటులు చేయుట

మృత్యువాత బడనున్న అసురునకు
హిత వాక్యములు నచ్చక పోయెను
కటుభాషణతో మాల్యవంతుని
కించపరచెను మూర్ఖత నిండి.

''శత్రు పక్షమున చేరిన వృద్ధుడ!
హితము వంకతో పలికితి వీవు
మోసము చేయగ తలపెట్టితివి
నీ మాటలు నే లక్ష్య పెట్టను.

మాల్యవంతుడా! మానవు డాతడు
నీచుడు, ఒంటరి కోతుల చేరెను
వానిని తండ్రి తరిమి వేయగా
కోతుల పంచన అడవుల చేరెను.

సురలు వణకెదరు నను తలంచిన
ఏ విధముగ నే వానికి తక్కువ
రాక్షస కులమున కీర్తి గడించిన
నాపైమత్సరమూని పలికితివి

శత్రువు నిన్ను ప్రోత్సహించెను
కానిచొ జ్ఞానివి నీవిటు పలుకవు
రాజ్యము నేలెడి ప్రభువుతొ నీవు
మాటలాడు విధమిది కాదుసుమా!

కమలాసనమున లేని లక్ష్మియగు
కమల లోచనను సీతను నాడు
కాంతారములో నుండి తెచ్చితి
కరుణతొ తిరిగి రామని కిత్తున?

భయమను నట్టిది ఎరుగను నేను
రామలక్ష్మణుల వానర రాజును
నేల కూల్చెద సేనల త్రుంచెద
నీ కన్నులతోచూతువు నీవు.

ద్వంద్వ యుద్ధమున నైనను నాతో
సుర లెవ్వరును తలపడలేరు
శిరసులు తెగినను లొంగను నేను
నా స్వభావము నీకు తెలియదా!

నా స్వభావము చెడ్డది గానీ-
సహజముగా నది వచ్చెను- గావున
మారుట జరుగదు మార్చగలేరు-
నే భయపడను సురాసురులకు.

అప్రయత్నముగ సేతువు గట్టిరి-
అసువులతో మరి కడలి దాటిరి
తిరిగి అసువులతొ తిరిగి పోరని-
ప్రమాణమ్ముగా చెప్పుచుంటిని.''

మాల్యవంతుడు మదిలో కృంగెను
తను మాటాడుట తగదని తలచి
రావణ రాజుకు జయమని పలికి
అనుమతి నంది సదనము కేగెను.

లంకాపతి తన సచివులందరితో
యోచన చేసి లంకకు తగిన
రక్షణలన్నీ గట్టిగ చేసెను
తూర్పు ద్వారమున ప్రహస్తునుంచెను.

మహోదరుని మరి మహాపార్శ్వుని
దక్షణద్వారము వద్ద నుంచెను
మాయావి యగు ఇంద్రజిత్తును
సేనతొ పశ్చిమద్వారమునుంచెను.

శుక సారణులను ఉత్తరద్వారము
కావలికాయుగ గట్టిగచెప్పి-
స్వయముగ తాను ఉత్తర ద్వారము
రక్షించగను నిలుతును అనెను.

పురమధ్యమున విరూపాక్షుడను
మహాబలాఢ్యుని అఖండ సేనతొ
రక్షించగను ఆనతినిచ్చి
సఫల మనోరధుడైనటు తలచెను.

మంత్రులందరు వినయము నిండి
రావణ ప్రభువుకు పూజలు చేసిరి
సచివుల ఆశీస్సులను గ్రహించి
అంతఃపురమును చేరెనురాజు.

॥శ్రీ రఘురామ

❈❈❈

## 37 శ్రీరాముడు తన వీరులకు ఆదేశములిడుట

రామలక్ష్మణ సుగ్రీవులును
వాయు పుత్రుడు- జాంబవంతుడు
విభీషణుడును అంగదుడున్ను
శరభ, సుషేణ, మైందద్వివిదులు.

వేయిమంది గజసేనా బలముతొ
పదివేలైన రధికులతోను
ఇర్వై వేల అశ్వదళముతో
కోటిమంది కాల్బలములతోను.

గజుడు, గవాక్షుడు, కుముదుడు, నలుడు
పనసుడు వీరులు అందరు కలిసి
లంకాపురమును సమీపించిరి
కాగలకార్యము యోచనచేసిరి.

స్వయముగ నాతడు ఉత్తరద్వారపు
రక్షణభారము స్వీకరించెను-
వేలకువేలు రాక్షసయోధులు
రావణుసేనలొ నిలచియుండిరి.

''రావణుడేలెడి లంకాపురమది
కనబడుచున్నది అజేయమైనది
కార్యసిద్ధికి యోచనచేతము''
అనుచు రాముడు పలికెనచ్చట.

రావణు వీరులు క్రూరకర్ములు
ఆతని సేవలొనుందురు నిరతము
వారిలొ ఒక్కొక వీరయోధునకు
ఒక్కొక లక్ష పరివారమ్ము.''

విభీషణుండు పలికె వినయముగ
''రామా! నాదు నలుగురు సచివులు
అనల, శరభ, సంపాతి, ప్రఘసులు
పక్షుల రూపుతొ లంకలొ తిరిగిరి

అనుచు పలుకుచు విభీషణుండు
తన సచివులను చూపె రామునకు
మంత్రులు భక్తిగ వందనముంచి
తెలియబరచిరి రామచంద్రునకు.

విషయములన్నీ వారు గ్రహించిరి
వివరించెద విను విశదముగాను
రావణరాజు-నాల్గుద్వారముల
మహావీరులను కావలియుంచెను.

విభీషణాఖ్యుడు తిరిగి పలికెను
''రామా! వినుము ఆ రావణుడు
ధనపతిపైకి పోరగవెడలి
పదిలక్షల సేనతొ పోరుసలిపెను.

రావణువీరులు అతిబలవంతులు
ధైర్యమునందు ఆలమునందు
ప్రభువుకు వారు తీసిపోరయా!
భయపెట్టుటకై చెప్పుటలేదు.

అధర్మవర్తి ఆ దశకంఠుడు
విరించి వరబల గర్వితుడతడు
వానిని నేనే స్వయముగ త్రుంచెద
రావణుకూల్చగ నిశ్చయించితి.

క్రోధముతో నువు రిపునికూల్చగా
చెప్పితి రామా! అసమాన్యుడవు
మన సేనలను నీవు చక్కగా
నాల్గుభాగములు చేయుము స్వామీ!''

ఉత్తర ద్వారము వద్దనెవుండి
నా తమ్ముడును నేనును ఒకటై
ముల్లోకములకు కంటకుడైన
దుష్టరావణుని దునుమాడెదను.

అంతట రాముడు యోచనచేసి
వానర వీరుల చూచిపలికెను
''నీలుడు-సేనతొ తూర్పుద్వారమున
ప్రహస్తు సేనతొ పోరాడవలె.

సుగ్రీవుడును జాంబవంతుడు
విభీషణుడును నింగి మార్గమున
లంక మధ్యలో జొరబడిపోయి
పోరుచేతురు అచటి సేనలతొ.

దక్షిణద్వారపు కావలివీరులు
మహోదరుడు మరి మహా పార్శ్వులతొ
మన అంగదుడు తనసేనలతో
ఎదిరిపోరును లంక కూల్చును.

ఈ యుద్ధమున వానర వీరులు
ఇప్పటి మాదిరి మనుజ రూపములు
ధరించరాదు- కపులుగ నుండుడు
అదియే గుర్తు మనసేనలని.

అప్రతిహతమగు అనిలాత్మజుడు
హనుమంతుడు తన వానర సేనతొ
పశ్చిమద్వారము పడగొట్టవలె
పురమును కాల్చినఘనుడా వీరుడు.

విభీషణుండు-అతని సచివులు
మనుజ రూపముల మాతో నుందురు
మేము ఇద్దరము-వారైదుగురు
ఏడుమందిమే-మనుజుల ముందుము.''

కార్యసిద్ధికై మనుజోత్తముడు
ఆవిధముగను ఆనతినిచ్చి
సువేలాచల ప్రాంతము నందున
కపిసేనల గని త్రుప్తినందెను.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 3 8 పోరుకు సిద్ధముగా నున్న కపియోధుల ఉత్సాహము

సువేలాచల గిరిపై కెక్కి
లంకను సూటిగ చూడగనెంచి
వివిధ ధాతువుల వెలిగే గిరిపై
రాత్రి గడుపగ నెంచెను రాముడు.

సువేలాచల గిరికి ఎదురుగా
త్రికూట గిరిపై నిలచిన లంక
నింగి నుండి అది వ్రేలాడునటు
అతి సుందరముగ అగుపించినది.

''రావణాసురుడు మృత్యువు కోరి
నా సతి సీతను అపహరించెను
ధర్మాధర్మము లెంచక దుష్టుడు
పులస్త్య వంశపు కీర్తిని చెరిపెను.

అందమైన ఆ బహిర్ద్వారములు
ఎత్తుగ నిలచిన ప్రాకారములు
రాక్షస సేనతొ శోభగ వెలిగే
లంకను గాంచిరి వీర వరేణ్యులు.

వాని దుష్కృతము వల్లను లంకలొ
రక్కసు లందరు కూలి పోదురు
వంశ నాశనము జరుగుట తథ్యము''
అనుచు రాముడు పలికె కోపమున

సమరోత్సాహము నిండిరి కపులు
సంధ్యా సమయము చల్లగ జరిగెను
నింగిని నిండుగ చంద్రుడు వెలుగగ
రామచంద్రుడా గిరిపై విడిసెను.

రాముడు గిరిపై నడచు చుండగా
లక్ష్మణమూర్తి మిగిలిన యోధులు
అనుసరించిరి అతి తొందరలో
వారందరును గిరిపై కెక్కిరి.

రిపుని చేతికి అందకుండునటు
వానర సేనల విభజన గాంచిన
విభీషణుండు హర్షము నిండి
రామచంద్రునికి పూజ చేసెను.

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 3 9 శ్రీరాముడు లంక సొగసులుగనుట

సువేలాచల గిరి శిఖరముపై
రాత్రి సుఖముగ గడిపిరి కపులు
వన దుర్గముగా నున్న వనములను
సూర్యోదయమున చూచిరి వీరులు.

కడిమి చెట్లును, కొండ గోగులు
ఎదిగిన లతలు చుట్టిన తరువులు
నయనానందము కలిగించగను
రంగుల పూవులు మురిసి విరిసినవి.

ఆ వనములలో సంపగి పొదలు
మద్ది, గానుగ, సురపొన్నలును
అశోక, కేసర, తాళవృక్షములు
ఏడాకులు గల అరటి చెట్లును.

చిత్రములైన వనములతోను
చక్కని పచ్చిక నేలల తోను
జలాశయములతొ వెలుగులు చిమ్మే
లంకాపురి అమరావతి కేసరి.

పూలతొ పండ్లతొ పూతీవలతో
సుగంధ పరిమళ శోభతొ తరువులు
చందన చర్చతొ అలంకారముల
సురల తీరుగా తోచిన వచట.

ధనపతి వనము చైత్ర రథమువలె
ఇంద్రుని వనము నందన మన్నటు-
శోభగ నిలచెను ఆ వనమంతయు
పక్షులు తీయని రాగము నింపెను.

వాతావరణము ప్రకృతి శోభ
మది పులకించగ వానర వీరులు
ముందుకు సాగి లంక వనముల
విహరించిరి వారానందముతో.

కొందరు వీరులు రాజు ఆనతిని
ముందుగ లంకను చూచుట కొరకై
బయలు దేరిరి పదఘట్టనకు
అదరిపోయినది అచ్చటి ధరణి.

కపులు చేసెడి సింహ నాదముల
కలత చెందినవి జీవరాసులు
సింహము, లెలుగులు, దున్నలు, హడలెను
లంకానగరపు-పునాది కదిలెను.

లంకను చుట్టి కడలి యున్నది
జలదుర్గము అది లంకాపురికి-
దాటిన వెనుక పర్వత దుర్గము-
సువేలాచల పర్వతమ్ము అది.-

పర్వత దుర్గము దాటిన వెనుక
వనదుర్గమది అగపడుచున్నది-
దాటగ నింగిని తాకుచు నిలచి
త్రికూట గిరిపైనున్నది లంక.

అంత ఎత్తులో నున్న లంకకు
పక్షులు సైతము చేరగ లేవు
మనసుతొనైనా పోలేరచటకు
నడచిపోవుటది ఊహకుఅందదు.

త్రికూట గిరిపై నిలచిన లంక
నూరు యోజనములున్నది పొడవు
ముప్పది యోజన విస్తీర్ణమయి
అజేయమైనది అన్నటులున్నది.

తెల్లని మేఘములున్న రీతిగా
ఎత్తుగ నున్నవి ద్వారము లన్నీ
ప్రాకారములవి వెండి బంగరు
కాంతు లీనుచు తళ తళ లాడెను.

నింగి మధ్యలో వర్షాకాలపు
మేఘములన్నటు ప్రాసాదములు
విమానములను ఉంచెడి గృహములు
రమణీయముగా వెలుగులు చిమ్మెను.

కైలాసగిరి సమానమైనటు
వేయి స్థంబముల ప్రాసాదమ్ము
నింగిలోనికి దూసుకుపోయి
నిలచినట్టుగా అగుపించినది.

రాక్షస వీరులు వేలకు వేలు
కావలి యుందురు ఆయుధములతో
లంకలొ రాక్షస తేని భవనము
లంకాపురికే ఆభరణమ్ము.

అందమైన ఆ లంకాపురిని
సుందరమైన వన భూములను
కనువిందైన భవనమ్ములను
చూచిన రాముడు అచ్చెరు వందెను.
॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 4 0 యుద్ధమునకు ముందే రావణునితో సుగ్రీవుని పోరు

త్రికూట గిరిపై నిలచిన యట్టి
మనోహరమ్మగు లంక శోభను
సువేలాచల గిరిపై నుండి
రాముడు గాంచెను తన సేనలతో.

విశ్వకర్మ నిర్మించిన లంకలొ
ఉన్నత సౌధపు శిఖరాగ్రమున
రావణుడుండెను విభవము నిండగ-
రామచంద్రునికి కనబడినాడు.

ఛత్ర చామరము లలంకారములు
రక్త చందనము మేన నలదు కొని
మెరపులవోలె మెరయు హారముల
నీల మేఘమై కనబడినాడు.

ఐరావతపు దంతపు గాటులు
వక్షస్థలమున అగపడుచున్నవి
సంధ్యా రాగము నలదిన మేఘము
అన్నటు- ఎరుపు, పసిమి వలువలు

రామ లక్ష్మణులు వానర యోధులు
చూచుచుండిరి రావణ రాజును
అసురుని చూచెను సూర్యకుమారుడు
పట్టరాని కోపమ్మునఎగిరెను.

ఒకే దూకులో ఎగిరెను వీరుడు
త్రికూటగిరిపై సౌధాగ్రమున
రావణు ముందర నిలచి సుగ్రీవుడు
అతనిని తృణముగ నెంచి పలికెను.

''ఓ రావణుడా! జగతికి ప్రభువగు
రామచంద్రుని దాసుడ నేను
నన్ను మిత్రునిగ చెప్పెనురాముడు
రాముని తేజము నాలోనున్నది.

నన్ను దాటుకొని పోగలవాడవ?''
అనుచు బలముగ రావణు పైబడి
మణి ఖచితమగు స్వర్ణ కిరీటము
లాగి నేలపై విసరి కొట్టెను.

తనపై బడెడి సుగ్రీవుని గని
బలముగ అసురుడు నేలకు త్రోయుచు
''నా కగుపించిన నీ మెడ నిలువదు
నష్ట గ్రీవుడ వగుదువు అనెను.''

నేలబడిన ఆ వానర రాజు
బంతి మాదిరి పైకి లేచెను
దశకంఠునిపై కలబడినాడు
ఇరువురు అచ్చట పోరు సలిపిరి.

స్వేద జలమ్ము-నెత్తుటి చారలు
నిండిన మేనితొ పోరుచుండిరి
పూచిన బూరుగు, మోదుగు తరువుల
తీరుగ తోచిరి వారిద్దరును.

బాదుకొనుచును, గ్రుద్దుకొనుచును
గీరుకొనుచును కుమ్ముకొనుచును
అమిత బాధకు లోనైనను మరి
వదలరు పోరు-వీరులు వారు.

ఒకరిని ఒకరు పైకెగరేసిరి
నేలకు త్రోసుకు పైబడి పోరుచు
ప్రాకారమ్ము అగడ్త మధ్యలొ
నేలమీద వారిద్దరు పడిరి.

తిరిగి ఎగిరిరి బుసల శ్వాసలతొ
గజముల మాదిరి పులుల మాదిరి
సింహము లన్నటు పోరిరి వారు
వివిధ తీరుల కలబడి పోరిరి.

బలము గలిగిన వీరులు వారు
వ్యాయామములో ఆరి తేరిరి
ఎంతోసేపు పోరిరి వారు
అలుపు నెరుగని అతి బలవంతులు

ముందుకు సాగి-గుండ్రము తిరిగి
ప్రక్కల పొంచి-ద్వంద్వ యుద్ధమున
మెళకువలన్నీ తెలిసినవారు
వీలు చూచుకొని పోరిరి వీరులు.

రావణుడంతట మాయలు చూపగ
యత్నము నున్నటు తెలిసి సుగ్రీవుడు
పోరగబలము కలిగి యున్నను
నింగి కెగిరెనుచూచు చుండగా

రావణుడది తా తెలియకపోయి
వెర్రివానివలె చూచుచుండగా
విజయ గర్వమున సూర్యకుమారుడు
వాయు వేగమున రాముని జేరెను.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 41 అంగద రాయబారము

మేన గాయముల వచ్చి వ్రాలిన
రవిసుతు గాంచిరి రామలక్ష్మణులు.
రాముడు పలికెను సుగ్రీవుని గని
''అనాలోచితపు పని చేసితివి.

ఇంతటి సాహస కార్యము నెన్నడు
రాజులు చేయరు-తెలియద నీకు?
వీరుడ వీవు-సాహసివే మరి-
ముప్పు తెచ్చెడి సాహస మిది యగు.

నేనును-సేనలు విభీషణుడును-
నీకేమగునో అని భయపడితిమి
ఇకపై నీవు ఇట్టి కార్యములు
నాతో చెప్పక చేయగ వలదు.

మిత్ర సత్తమా! ఓ సుగ్రీవా!
రిపుని కూల్చగా చాలుదువయ్యా
కానీ నీకే ఆపద కలిగిన
నాకింకెవరితొ పనిగలదయ్యా.

నీకే ఆపద కలిగినచో - విను
కృంగిపోదును వానర రాజా!
సతి సోదరులను తలంచనింక
అసువులపైన ఆశపడనయా!

ఇంద్రుని పోలు పరాక్రమమ్ము
వరుణుని పోలు సాహస మున్నది-
నీకే ఆపదకలుగునొ అనుచు
భయపడితిమయా మేమందరము.

సబాంధవముగా రావణు జంపి
విభీషణునికి లంకను యిచ్చి
అయోధ్య రాజ్యము భరతుని కిచ్చి
తనువు వీడగా తలంచు చుంటిని.''

రాముని పలుకులు విని సుగ్రీవుడు
భక్తినిండగా పలికె ప్రభవుతో
''రామా! నీవు వీరోత్తముడవు
నీకు చెప్పెడిది ఏమి వున్నది?

నీ సతి నాతడు హరించినాడు
నా కగపడెను ఉడికి పోతిని
నేరుగపోతిని వానిని త్రుంచగ
నీచే హతుడగు ననుచు వదలితి.''

రామచంద్రుడా మాటలకెంతో
పులకరించెను-వానరరాజును
కౌగలించుకొని అభినందించెను
గుండెలు పొంగెను కపులందరకు.

రాముడు పలికెను లక్ష్మణమూర్తితొ
''సేనలన్నిటిని వనము నందున
వ్యూహమ్ములుగ తీర్చగ వలెను
భీకరమైన పోరు జరుగును.

ఘన సంగ్రామమునందు సోదర!
తప్పక వానర- రాక్షస హరణము
జరుగునట్టుగా సూచనలవిగో
అగపడుచున్నవి'' అనుచు పలుకుచు

''ధరణి వణకుట గిరులు కదలుట
భయంకరమ్మగు మేఘగర్జన
రక్త బిందువులు వర్షించుటది
మేనును చీల్చెడిహోరుగాలులు

రక్తవర్ణముగ సంధ్య మారుట
సూర్యగోళము అగ్నిని రాల్చుట
సూర్యుని కెదురై పక్షులు, మృగములు
ఏడ్చుచున్నవి భయంకరముగా

కాంతిని బాసిన చంద్రబింబము
చల్లగ నుండక- తాపము పెంచెను.
రవి బింబములో మచ్చ గాంచితిని
తారలు వెనుకటి మాదిరి లేవు.

అమంగళముగా నక్కలు అరచెను
మనము వెంటనే కపివీరులతో
లంకకు పోయి ముట్టడింతము''
అనుచు తమ్మునితొ పలికె రాఘవుడు.

అటుల పలుకుచు రామభద్రుడు
గిరిశిఖరమ్మును దిగి, కపిసేనను
వానరరాజు సాయపడగను
యుద్ధోన్ముఖులను చేయసాగెను.

ఘన కోదండము నందిన రాముడు
శరములు విడువగ నేర్పరి రాముడు
అఖండ సేనతొ ప్రాతఃకాలము
లంక కెదురుగా సాగె వీరులతొ.

రాముని వెనుక విభీషణుండు
వానరరాజు, లక్ష్మణమూర్తి
వాయునందనుడు, జాంబవంతుడు
సుషేణుడున్నూ సాగుచుండిరి.

భల్లూకములు వానర వీరులు
ఘనమగు శిలలు మహావృక్షములు
చేత ధరించి వెనుక నడచిరి
భూమి అచ్చట కనబడకున్నది.

సురలకు సైతము అజేయమైన
లంకా నగరము దరికి చేరిరి
లంకా నగరపు ఉత్తర ద్వారము
ఎత్తుగ పర్వత మంత ఉన్నది.

ఆ ద్వారమును రావణాసురుడు
స్వయముగ రక్షణ చేయుచుండెను
అమిత సంఖ్యలో ఆయుధాలతో
యుద్ధ కాంక్షులై అసురులుండిరి.

వరుణుని పాలన నున్న కడలివలె
దానవ పాలిత పాతాళము వలె
మహోన్నతంబగు ఉత్తర ద్వారము
చూచిన గుండెలు దడదడలాడును.

అంతటి ద్వారము ముట్టడించుట
ఆ రావణుని ఎదిరించుటది-
అతి విక్రముడు రాముడు గావున
సాధ్యమగునది ఆ ఒక్కనికే.

ఉత్తర ద్వారము కావలి కాయు
రాక్షసయోధుల ఆయుధమ్ములను
వారు ధరించు కవచమ్ములను
పరిశీలనగా చూచెను రాముడు.

మైంద ద్వివిదుల వీరులతోను
నీలుడు తూరుపు ద్వారము వద్ద-
ఋషభ గవాక్ష గజ గవయులతో
దక్షిణ ద్వారము వద్ద అంగదుడు

ప్రమాధి ప్రఘస మహావీరులతొ
పశ్చిమ ద్వారము దగ్గర మారుతి
ఉత్తర పశ్చిమ ద్వారమ్ములకు
మధ్య భాగమున సూర్యకుమారుడు

వాయుదేవునికి గరుత్మంతునికి
సరి వీరులతో వానరరాజు
ముప్పది ఆరు కోట్ల సేనతో
సేనల మధ్యలొ రక్షగ నిలచెను.

రాముని ఆనతి మేరకు నపుడు
విభీషణుండు లక్ష్మణమూర్తి-
కోటి మంది నొక్కొక్క ద్వారమున
రక్షగ నుంచిరి లంక కూల్చగా.

నింగిని కపులు నేలను కపులు
లంకలొ గాలి జొర నశక్యమై
కడలి యంతటి కపిసేన లవి
కట్ట దాటుకొని లంకను ముంచిరి.

అమిత సేనతో జాంబవంతుడు
సుగ్రీవునికి దాపున నిలచెను
వానర యోధులు కోరలు నఖముల
చీల్చగ చాలిన పులుల సమానులు

అంతటి సేనను గాంచిన అసురులు
విస్మయ పడిరి- లంక చలించెను.
దేవా సురులకు అజేయమైన
సేన నిలిచెను దాశరథులతో.

వానర యోధులు వాలము లెత్తి
క్రోధ మంతయు కన్నుల నిండగ
మహావృక్షముల గిరి శిఖరములతొ
లంక ముట్టడికి వేచి యుండిరి.

లంక ముట్టడికి సంసిద్ధులయి
కపి సేనలట వున్న సమయమున
రాజ ధర్మము తెలిసిన రాముడు
విభీషణునితో ఆలోచించి-

పది ఏనుగుల బలము కొందరిది
వంద ఏనుగుల బలముతొ కొందరు
వేయి ఏనుగుల బలము కొందరిది
ఓఘపు గజబలు లెందరొ కలరు.

దశగ్రీవునికి హితము చెప్పగా
మరి యొకమారవకాశ మివ్వగా
అంగదు బిలచి- దశకంఠునితో
ఈ విధముగను నుడువగ చెప్పెను.

నేల నిండిన కపి యోధులతో
నింగిని ఏగిరే కోట్ల కపులతో
నింగీ నేల కనబడలేదు
అమోఘమైన దృశ్యమ్మదియగు.

''అసురుడ! నీ ఐశ్వర్యముడిగెను
అంతమైనదిక రాజ్య పాలనము
బ్రహ్మ వరమున గర్వము నిండిన
నీకుచావు అతి చేరువైనది.

అంతలోనె ప్రతి ద్వారము దరికి
ఒక్కొక్క కోటి భల్లూకములు
కపి యోధులును వచ్చి చేరిరి
నలువంకల కపి సేనలు నిలచెను.

సజ్జన శాత్రవ! అఘముల ఫలితము
నేటితొ నీ దశ అంతమగుటయే
దశగ్రీవములు నిలబడ వింక
దండధరుడనై నిలచితి నిచ్చట.

నీ అసువులను నే తీయగనే
నీ పాపములుఅంతము అగును
మహా ఋషులును రాజఋషులును
చేరెడి లోకము చేరెద వీవు.

నే దరిలేని సమయము గాంచి
అపహరించితివి అవనీసుతను
నే నిలచితి నిట బలము చూపుము
లేదా మైథిలినప్పగించుము.

సతిని ఒసగి నువు శరణు కోరుము
లేదా శరములత్రుంచెద నిన్ను
అరాక్షసంబగు పుడమి యంతయు.
మూర్ఖులునీకు హితులై వుండిరి.

అసురోత్తముడు ధర్మాత్ముడగు
విభీషణుడు నను శరణు కోరెను
అకంటకంబగు లంకాపురిని
ఆ శ్రీమంతుడు ఇక పాలించును.

పక్షి రూపమున ముల్లోకములు
తిరుగనెంచినను, నా శరములవి
ముల్లోకమ్ముల వీడవు నిన్ను
కంట బడినచో కూలుట తథ్యము.

లంకను ఇంక చూడవు నీవు
ఇపుడేచక్కగ అన్నీ చూచుకు
ఔర్ధ్వదైహిక క్రియలు చేసుకో
అవకాశమ్మును ఇచ్చితి నీకు-''

అనుచు అంగదుని చూచి పలికెను
''నీవీ పలుకులు తిన్నగ చెప్పి
రావణుడేమి పలుకునొ తిరిగి
తెలియ బరచుము'' అనుచు పంపెను.

రాముని ఆనతి శిరమున దాల్చి
రూపు ధరించిన అగ్ని హోత్రుడన
ముహూర్త కాలములోన అంగదుడు
రావణు మందిరమందు వ్రాలెను.

ఏమరు. పాటు లేక సచివులతొ
కూర్చుని యున్నరావణు గాంచెను
భగభగ మండెడి అగ్ని హోత్రుడన
కనకాంగదుడు ముందుకు నడచి

''రాక్షస రాజా! కోసల ప్రభువగు
రామచంద్రుడు నన్ను పంపెను
అంగదుడందురు-వాలి తనయుడ
నా గురించి నువు వినియే యుందువు.

రఘువంశ వర్ధనుడు నీకై చెప్పిన
పలుకులు వినుము లంకాధీశా!
''క్రూరుడ! నీకు రోషమున్నచో
బయటకువచ్చి పోరుము నాతో.

సబాంధవముగా నిన్ను చంపగా
వచ్చితి- ఇకపై ముల్లోకములకు
రావణు భయముతీర్చి వేసెద
తలల త్రుంచికడతేర్చెద నిన్ను.

అసువులపైన ఆశవున్నచో
పదముల వ్రాలి నమస్కరించి
అవనిజ నొసగి అఘముబాపుకో
అటులగానిచో మిగలవు నీవు.

నిన్ను కూల్చెద లంకాపురమున
నీ తమ్ముని నే అభిషేకించెద''
అనుచు అంగదుడు రాముని పలుకులు
సూటిగచెప్పెను రాక్షసరాజుకు.

కటువుగనున్న రాముని హితవు
అంగదుమాటల వినిన రావణుడు
క్రోధపూరిత నయనమ్ములతో
అరచెను అచట కపిని చంపమని.

''పట్టుడు వానిని చంపుడు మీరు''
అనుచు రావణుడు అరచుచుండగా
అతి బలవంతులు నలుగురు అసురులు
బంధించగను ముందుకు వచ్చిరి

బలము చూపగ ఆ బలవంతుడు
అంగదుడంతట లొంగిపోయెను
తనబాహువులను నల్గురు పట్టగ
వారిని చక్కగ ఇరికించుకొని

పర్వతమంతటి ఎత్తుగనున్న
భవనశిఖరము పైకి ఎగిరెను
రావణ రాజుయు అతని సచివులు
చూచుచుండగా వదలె అసురులను.

నేలరాలిరి నలుగురు వీరులు
అంగదుడంతట తనపదములతో
ప్రాసాదమునకు ఉన్న శిఖరమును
పగులగొట్టెను అతితేలికగా

అసురులందరకు బలమును తెలిపి
సింహనాదముతొ విజయగర్వమున
వానరులందర మధ్యలొనున్న
రామభద్రుని చెంతనిలచెను.

కపి, ప్రాసాదము పగుల గొట్టుటను
చూచినరాజు క్రోధము నిండెను
రాగలకీడు లీలగ తోచెను
నిట్టూర్పులను విడచెను అతడు.

వెంటవున్న తన వానర వీరులు
సింహనాదములు చేయుచుండగా
రామచంద్రుడు సమరముచేయగ
సంసిద్ధుడయి నిండుగ నిలచెను.

సుషేణుడంతట సుగ్రీవాజ్ఞతొ
వానర వీరలు వెంటనడువగా
నాల్గుద్వారములు తిరిగిచూచెను
వానర వీరుల నందరజూచెను.

పోరగ ముందుకువచ్చు అసురులే-
వానర సేనలు లంకానగరపు
వానర ప్రాకారమ్ముగతోచగ
భయముతొ హహాకారము చేసిరి.

లంకలో సాయుధులైన అసురులు
కోలాహలముతొ తిరుగుచుండిరి
ప్రళయకాలమున వాయువు అన్నటు
తిరిగిరి అసురులు పట్టణమంతయు.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 4 2 రామ రావణ సేనల యుద్ధారంభము

లంక ముట్టడిని అసుర వీరులు
తెలియబరచిరి రావణరాజుకు
కోపము నిండి రక్షణకొరకై
అదనపు సేనలు పంపెనురాజు.

తన సేనలతో తిరుగుచు రాముడు
లంకా విభవము చూచెను తిరిగి
అంతట రాముని మనసంతయును
అవనిజ తలపులు నిండిపోయెను.

నిద్రహారములు లేక దుఃఖమున
రాక్షస బాధల కోర్వలేకను
కృశించిపోయిన కుసుమకోమలి
దీనావస్థ మెదలెను మదిలో.

అంతట రాముడు కొంచెము సేపు
యోచనచేసి తన సేనలకు
లంకాపట్నము ముట్టడించమని
ఆజ్ఞలనిచ్చెను ఆవేశముతో.

రాముని ఆనతి కొరకై నిలిచిన
అఖండ సేన అతిబలవంతులు
కొనలు తేలిన కొండరాళ్ళతో
బండలు తరువులు చేతధరించిరి.

రావణాసురుడు ప్రాకారమ్మున
నిలచి చూచెను వానర సేనను
అంతటి సేనను గెలుచుట ఎట్లని
శంకముదిరెను ఆలోచించెను.

అంతటిలోనే ధైర్యము తెచ్చుకు
కన్నులు తెరచి తిన్నగ చూచెను
వానర సేనలు గుంపులు గుంపులు
ప్రాకారముపై కెక్కుట గాంచెను.

పసిమివన్నె దేహమ్ముల కపులు
ఎఱ్ఱని ముఖముల వెలిగేకపులు
మద్ది తాళవృక్షమ్ములతో
పెద్దరాళ్లతో అతిధైర్యముతో.

రామ కార్యమే ధ్యేయ మనుకొని
అసు..ల నసలే లెక్క చేయక
ప్రాకారమ్ముల అగ్ర భాగములు
బహిర్ద్వారముల కూల్చగ నెంచి

పగులగొట్టగా యత్నము చేయుచు
ఉద్యానవనముల రూపుమాపిరి
స్వచ్ఛ జలమ్ములు వున్న అగడ్తను
పూడ్చివేసి ప్రాకారము నెక్కిరి.

మత్తేభములను పోలు కపీంద్రులు
ప్రాకారమునకు అమర్చినట్టి
బహిర్ద్వారములు బంగరుమయములు
పగులగొట్టుచు కేకలు పెట్టిరి.

కపిసేనలు అతి సంతోషముతో
ప్రాకారముపై చేరి బిగ్గరగ
''జయము జయము శ్రీరామచంద్రునికి
అతి బలశాలికి జయము కలుగును

లక్ష్మణమూర్తికి జయము విజయము
కిష్కింధాపతి సుగ్రీవునికి
జయము తథ్యమను'' సింహ నాదముల
జయఘోషను ఆ లంకలొ నింపిరి.

వీర బాహువు సుబాహువున్నూ
తోడుగ నుండగ నలుడంతటను
ప్రాకారమును నేలకు రాల్చి
విడిదికి వీలగు వసతి చేసెను.

జయోత్సాహమున కుముదుడంతట
పది కోట్ల వీరులతొ దూసుకుపోయి
లంకా నగరపు తూర్పు ద్వారము
ముట్టడించెను- అతనికి తోడుగ

ప్రఘసుడు, పనసుడు అఖండ సేనతొ
తూర్పు ద్వారము వచ్చి చేరిరి
ఇరువది కోట్ల కపి వీరులతో
శతవలి దక్షిణ ద్వారము తాకెను.

అరవై కోట్ల వానర సేనతొ
తార తండ్రి సుషేణు డంతట
లంకా నగరపు పశ్చిమ ద్వారము
ముట్టడించెను ఉత్సాహముతో.

రామ లక్ష్మణులు వానర రాజుతొ
ఉత్తర ద్వారము ముట్టడించిరి-
గోలాంగూలుడు గవాక్షుడపుడు
కోటి వీరులతొ రాముని చేరిరి.

శత్రు భంజనుడు ధూమ్రుడు-
కోటి భల్లూకములతొ రాముని జేరెను
గదలతొ నలుగురు సచివులతోను
విభీషణుడు శ్రీరాముని చేరెను.

గజుడు గవాక్షుడు గవయుడు శరభుడు
గంధ మాదనుడు సేనలొ తిరుగుచు
సేనల రక్షణ చూచుచుండిరి
క్రమశిక్షణతో నున్నవి సేనలు.

వానర సేనల వ్యూహ రచనను
చూచి రావణుడు రోషము నిండి
అసుర సేనలను బయటకు పొమ్మని
ఆవేశముగా ఆనతి నిడెను.

ప్రభువు ఆనతి విని నంతటనే
సింహ నాదముతొ అసుర వీరులు
భేరులు మ్రోచిరి ఉత్సాహముగా
బారులు తీరి శంఖము లూదిరి.

నీలపు-నల్లని దేహచ్ఛాయలతొ
తెల్లని శంఖము లూదుచుండగా
నింగిని కొంగల బారులన్నటు
ఉరిమే మేఘము లన్నటు తోచిరి.

పర్వ సమయమున పొంగు కడలివలె
అసుర సేనలు బయలుదేరెను
గిరి నెత్తాలు లంకా నగరము
సింహ నాదముల మారు మ్రోగెను.

సింహ నాదములు రథముల సవ్వడి
ఘీంకారములు శంఖ ఘోషలు
బలసిన గుఱ్ఱపు సకిలింపులతో
భేరీరవములు దిక్కుల కెగయగ.

దేవాసుర సంగ్రమము అన్నటు
కపియోధులకు అసుర వీరులకు
మొదలైనది ఘన సంగ్రామంబు
భీకర యుద్ధము లంకలొ మొదలయె.

గదలు శూలములు శక్త్యాయుధముల
గండ్ర గొడ్డళులు ఆయుధములతో
ప్రతాపమ్మును చూపుచు అసురులు
వానర వీరులకొట్టిరి అపుడు.

వానర యోధులు ఘనమగు తరువుల
కొనలు తేలిన కొండ రాళ్ళతో
అసురుల బాది ఆగక సాగిరి-
గోళ్ళతొ చీరికోరల కొరికిరి.

తమతమ పేర్లను చెప్పుచు కపులు
ఘనమగు శిలలను విసరుచు కపులు
''జయము విజయము ఓ సుగ్రీవా!
వానర రాజా! జయ''మని అరచిరి.

ప్రాకారముపై నున్న అసురులు
వారికి తోడుగ నున్న అసురులతొ
ఆయుధములతో ఖడ్గమ్ములతో
వానర వీరుల నరక సాగిరి.

అంతట నేలను నిలచిన కపులు
క్రోధము రెచ్చిన కపి కిశోరములు
ప్రాకారము పైకెగిరి అసురులను
నేలకు త్రోసిరి-సమరోత్సాహులు.

వానరులకును అసుర వీరులకు
ఆ విధముగను జరిగిన పోరున
నేలంతయును నెత్తుట తడిసెను
మాంస ఖండముల బురదగ మారెను.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 43 ఇరుపక్షముల మహావీరుల పోరు-

వానరయోధుల నెదిరించుటకై
రావణరాజుకు విజయము కూర్చగ
వీరవరేణ్యులు రాక్షసయోధులు
ఆయుధాలతో ముందుకు వచ్చిరి.

ద్వంద్వ యుద్ధము జరిగెనప్పుడు
మహావీరుడగు మేఘనాధుడు
యముడు- త్రినేత్రుని ఎదిరించినటు
అంగదునెదుట నిలచెను పోరుకు.

విభీషణాఖ్యుని సచివుడు అయిన
సంపాతి నెదిరెను ప్రజంఘుడసురుడు
మిత్రుఘ్నుడను రాక్షస యోధుడు
విభీషణునితో తలపడినాడు.

రక్కసి తపనుడు- గజునితోడను
నికుంభు డసురుడు- నీలునితోను
ప్రఘస రక్కసుడు- సుగ్రీవునితో
విరూపాక్షుడు- లక్ష్మణమూర్తితొ

సప్తఘ్నుడును అగ్ని కేతువు
రస్మికేతువుఅను రాక్షసులు
రామచంద్రునితొ పోరగవచ్చిరి
వజ్రముష్టి మరి తాకెను మైందుని.

అశనిప్రభుడు ద్వివిదుని తాకెను
ప్రతపనుడసురుడు నీలుని తాకెను
రాక్షస యోధుడు విద్యున్మాలి
కపియోధుడగు సుషేణు తాకెను.

ఎందరొ అసురులు కపియోధులతో
తలపడి పోరిరి-నెత్తుటి కాల్వలు
దేహఖండములు తెగిపడె కుప్పలు
అతిభీకరముగ పోరుసాగెను.

ఇంద్రజిత్తు తన గదతోనపుడు
కొట్టెనంగదుని- అపుడావీరుడు
అసురునిబంగరు రథమును గూల్చెను
చచ్చెను సారథి తురగమ్ములతో.

ప్రజంఘుడంతట మూడు బాణములు
సంపాతిపైన వేయగనంత
శరముల తప్పుకు మద్దితరువుతో
సంపాతి కూల్చెనుఆ ప్రజంఘుని.

జంబుమాలి అతి కోపమునిండి
మారుతి వక్షస్థలమున కొట్టెను
వీరుడు హనుమ రథమునకెగిరి
అసురుని చంపెను అరచేతులతో.

వాడి బాణముల తెరిచిన నోటితొ
తలపడు ప్రఘసుని- వానరరాజు
తరువుతొ కొట్టి నేలకు రాల్చెను
ప్రతపుని కండ్లను పెరికె నీలుడు.

అగ్ని కేతువు- రశ్మికేతువు
సుప్తఘ్నుడును యజ్ఞకోపుడు
రామునిపైకి శరములు వదలిరి
తెగిరా అసురులు రాముని శరముల.

మైందుని గ్రుద్దుకు వజ్రముష్టియను
అసురుడు- రథము- సారథి ఒరిగిరి
నీలాకాశము మీద కిరణములు
సూర్యదేవుడు ప్రసరించినటు

నూరు బాణములు నికుంభుడసురుడు
నీలునిపైన నవ్వుచు విడచెను
కాటుక కొండగ నిలిచిన నీలుడు
విష్ణుమూర్తివలె విజృంభించెను.

నిశిత ఖడ్గమున నికుంభుశిరమును
ఒక్క వ్రేటుతో తృంచి- ఆగక
రథచక్రమును గిరగిర త్రిప్పి
రథసారథిని మన్నున కలిపెను.

విద్యున్మాలి ఘనమగు గదతో
సుషేణుపైన కలియబడగనే
ఘనమగుశిలతో సుషేణుడంతట
ఎదురుతిరిగెనా అసుర వీరునికి.

ద్వివిదుడు ఘనముగు శిలలు విసరుచు
అశనిప్రభుని కొట్టగ-నసురుడు
శరముల ద్వివిదుని గాయపరచగా
తరువుతొ అసురుని కూల్చెను ద్వివిదుడు.

విద్యున్మాలి ఒడుపుగ తప్పుకు
వక్షమునందు కొట్టెను వీరుని
లక్ష్యపెట్టక సుషేణుడపుడు
గిరిని విసరగా చచ్చెను అసురుడు.

బంగరుములుకుల శరముల నప్పుడు
తేరునుండి ఆ విద్యున్మాలి
విసరగ నంత సుషేణు వీరుడు
తేరును ముక్కలు చేసివేయగా

వానర వీరులు అసురుల చంపిరి
భీతావహమై పోయినదచట
మాంసము కొరకై నక్కలు చేరెను
విగతజీవుల కుప్పలు కుప్పలు

రక్తము కారెడి శరీరమ్ములతొ
చీల్చబడిన ఆ రాక్షసులందరు
తిరిగి యుద్ధము చేయుటకొరకై
సూర్యాస్తమయము కొరకు వేచిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 4 4 ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశముల బంధించుట

రాత్రిఅచ్చట విరుచుకుపడినది
వైరముబూనిన వీరులప్పుడు
ఒకరిని ఒకరు జయించగోరి
భీకరమైన పోరు సలిపిరి.

"చంపుము, చీల్చుము, ఎటుపోయెదవు"
అన్న అరపులవి మింటికెగసినవి
బంగరు కవచమ్ములతో వెలుగుచు
ఓషధులున్న గిరులని పించిరి.

చీకటిలో మరి గుర్తుతెలియక
ఆవేశముతో తమనే మరచి
రక్కసులను మరి వానరుడనుకొని
చంపిరి- అట్లే కపులలో జరిగెను.

క్రోధమునిండిన రాక్షసులపుడు
కపులనుపట్టి నమలసాగిరి
వానరులంతట వాడికోరలతొ
అసురుల అశ్వమ్ములను చీల్చిరి.

ధ్వజములు విరచిరి వానర వీరులు
గజముల కొరికి ముక్కలు చేసిరి
రామలక్ష్మణులు సర్పసమమగు
శరములువేసి అసురుల కూల్చిరి.

భేరీమ్రోతలు రక్తపు టేరులు
అరపులు, మూల్గులు, అక్రందనలు
అతి భీకరమగు కాళరాత్రివలె
తెల్లవారునా- అనిపించినది.

గుట్టలు గుట్టలు ఆయుధమ్ములు
తరువులు శిలలతొ నేలనిండగా
అవి అన్నియును ధరణిపూజలో
పుష్పములన్నటు తోచెనచ్చట.

నిశిలో అసురులు రాముని పైకి
శరములు విడచుచు వచ్చిపడగనే
నిశత శరములు రాముడు వదలగ
ఆయువుపట్లలొ తగిలె నసురలకు.

మహోదరుండు మహాపార్శ్వుడు
యమశత్రువునూ వజ్రదంష్ట్రుడు
శుకసారణులు ప్రాణాంతకమై
పారిపోయిరి అసువులు నిలువగ.

మహాబలుడు శ్రీరామచంద్రుడు
బంగరుములుకుల శరములు విడువగ
అగ్నిబడిన మిడతలవోలె
రాలిపోయిరట రాక్షస యోధులు.

భయంకరముగ రాత్రి అచ్చట
అరపులు ఘోషలు అక్రందనలతొ
త్రికూటగిరి యది ప్రతిధ్వనించగ
పర్వతమ్ము తానరచినట్లయె.

మహాకాయులు గోలాంగూలులు
అసురుల నొడిసి పట్టుకుతినిరి
ఇంద్రజిత్తును వధించవలెనని
అంగదుడంతట తాకెను వానిని.

తురగమ్ములను రథ సారథిని
కూల్చివేసెను కనకాంగదుడు
రామలక్ష్మణులు వానరులందరు
అభినందించిరి అంగదునపుడు.

ఇంద్రజిత్తు తన రథమును వదిలి
అంతర్ధానము అయిపోవగను
వానర యోధులు ఆనందముతో
అంగదునెంతో పొగడిరి ప్రియముగ.

అంగదు దెబ్బకు పారిపోయిన
ఇంద్రజిత్తు అతి క్రోధవశుడయి
అంతర్ధానము అగుట- రాముడు
గ్రహించి- కపులను హెచ్చరించెను

''వానరులారా! మీరందరును
ఏమరకుండుడు సుగ్రీవునికడ
బ్రహ్మ వరముతో గర్వాంధుడగు
ఇంద్రజిత్తు - ఇక మాయలు చేయును.

కంటికి కనబడకుండగ వాడు
శరములు వదులును - కావున మీరు
నాకొరకై మరి ఓర్చుకోవలె
కాలము వాడికి చేరువైనది''

అనుచు రాముడు చెప్పుచుండగనె
మాయలమారి-సర్పసమమగు
శరములు వదలెను దాశరథులపై
నాగ పాశముల బంధమొనర్చెను.

ఎదిరిపోరగా శక్యముగాక
అదృశ్యముగా పోరుచు అసురుడు
రామలక్ష్మణుల నిద్దరినీ తన
నాగపాశముల కట్టివేసెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 4 5 నాగపాశబద్ధులై రామలక్ష్మణులు బాధపడుట

మేఘనాథుని జాడ తెలుసుకొన
రాముడు వానరయోధుల నంపగ
కపియోధులు పదిమంది అప్పుడు
ఆకాశమునకు రివ్వున ఎగిరిరి.

రామలక్ష్మణులు బంధింపబడి
దేహము నుండి నెత్తురు కారుచు
పూచిన మోదుగు తరువుల మాదిరి
కనుపించిరి ఆ యుద్ధభూమిలో.

నింగికెగిరిన వీరులగాంచెను
అస్త్రవేత్తయగు మేఘనాథుడు
వేగముగలిగిన శరములువేసి
వీరుల వేగము నడ్డగించెను.

కనుకొలకులవి ఎర్రగ నుండగ
నల్లని మేనితొ నున్న అసురుడు
ఇంద్రజిత్తు- అతి గర్వము నిండి
పలికెను మబ్బుల చాటు నుండియే-

మేఘనాథుని శరములంతట
వానరవీరుల గాయపరచినవి
అదే అదనుగా ఇంద్రజిత్తు తను
నింగి మేఘముల చాటున దాగెను.

వానరులారా! అదృశ్యముగ
పోరెడి నన్ను సురపతియైనను
తెలియగ లేడు అంతటివాడిని
మనుజులు- కపులు నాకొక లెక్కా?

వీరుడయిన ఆ మేఘనాథుడు
రామలక్ష్మణుల పైనంతటను
నాగపాశముల శరములు వేయుచు
దేహమంతయు నింపివేసెను.

ఇపుడే మిమ్ము యమపురి కంపెద''
అనుచు శరములతొ బాధపెట్టుచు
నవ్వుచు అరచుచు దాశరథులపై
తిరిగి శరములు విడువ సాగెను.

నిశితాస్త్రములు తాకినయంత
దృష్టి కానక పోయెను అపుడు
వంటినిండ బాణమ్ములు నిండి
నెత్తుట తడిసిరి వీరులిద్దరు.

నాగపాశములు శరములు వేసి
బద్ధుల చేసి మేఘనాథుడు
వాడి ములుకులు కలిగిన అమ్ములు
ఎన్నో రకముల వేసెను తిరిగి.

ప్రస్రవణాద్రిని జలధారవలె
నెత్తురు కారెను తనువుల నుండి
మేను పూర్తిగా నిండెను శరముల
నిలువ లేక ఆ వీరులు అలసిరి.

శర తల్పముపై నున్నటు లున్న
అన్నను గాంచెను సుమిత్ర సుతుడు
అతి కష్టముతో చూపు ఆనెను
అన్న- ప్రక్కనే నేల నుండెను.

ఇంద్రుని గెలిచిన వీరుని శరములు
రాముని ఆయువు పట్లలో తగలగ
నిలువగ లేక రాముడు ముందుగ
నేలను బడెను- కదలక పోయెను.

బ్రతుకుట జరగదు అనెడి దిగులుతో
నిరాశపడెను లక్ష్మణమూర్తి
వాయు పుత్రుడును వానరోత్తములు
అమిత దుఃఖమున చింతలో మునిగిరి.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 4 6 ఇంద్రజిత్తు విజయగర్వముతో లంకలోని కేగుట

ఇంద్రజిత్తుకై నింగిని వెదకెడి
వానరోత్తములు శరములు తగిలిన
రామ లక్ష్మణుల గాంచిరి అపుడు
వారందరును నేలకు దిగిరి.

సందు లేకను శరీరమంతయు
శరములు నిండి నెత్తురు కారుచు
శరతల్పముపై చేష్టలు ఉడిగి
రామ లక్ష్మణులు పడియుండుట గని

వానకురిసి మరి వెలిసినట్టుగా
శరములు వదలి ఆగెను అసురుడు
వానర రాజును విభీషణుండును
హనుమంతుడును మైంద ద్వివిదులు

వానర వీరులు కంటికి మంటికి
ఏకధారగా నేడ్చిరి అపుడు
మేఘనాథుడు దొరికినచో మరి
అంతుచూడగల వీరులె వారు.

నీలుడు కుముదుడు సుషేణుడున్ను
అంగదుడున్నూ వచ్చి చేరిరి
రామలక్ష్మణుల స్థితిని గాంచిరి
వ్యాకుల పడిరి- దిగులు నందిరి.

అదృశ్యమ్ముగా పోరెడి వానిని
నింగిని నిలచిన రావణు తనయుని.
వాని మాయలుతెలిసిన యట్టి-
విభీషణాఖ్యుడు గాంచెను అపుడు

ఘనకార్యమును సాధించితినని
విజయ గర్వమున మేఘనాథుడు
తోటి అసురులతొ చెప్పసాగెను
''నాగపాశములు విడువ నసాధ్యము

రామలక్ష్మణుల నాశము చేసితి
తండ్రి సర్వదా వారిని తలచి
దుఃఖము నిండి యుండుట తెలియును
నిద్ర మరచెను లంకాధీశుడు

వర్షాకాలపు బురద నీటివలె
లంకలొ ఎల్లరి మనసులన్నియు
కలత పడినవి రాముని తలచి
వారల కూల్చితి భయము తీర్చితి''

అనుచు అసురుడు తొమ్మిది శరములు
నీలుని పైన విడచి అంతట
మూడు బాణములు మైందుని పైన
మరి మూడమ్ములు ద్వివిదుని పైన

జాంబవంతునిపై నొక శరము
హనుమంతునిపై పది బాణములు
శరభ గవాక్షుల జంటపైనట
రెండు రెండు బాణమ్ములు వేసెను.

గవాక్షుపైన అంగదుపైన
అగ్ని శిఖలను పోలు శరములు
ఎన్నో విడచెను మేఘనాథుడు
సింహనాదమును చేసెను అపుడు.

ప్రక్కన వున్న అసుర వీరులతొ
నవ్వుచు పలికెను మేఘనాథుడు
''రామలక్ష్మణులు నా శరములబడి
అసువులు బాసిరి చూడుడు'' అనెను.

నిజమని నమ్మిఆ రక్కసులు
ఇంద్రజిత్తును స్తోత్రము చేసి
జయ జయ ధ్వనులతొ పూజించగను
నమ్మిరందరు వారు సమసిరని.

శ్వాస ఆడక నేలను బడిన
వీరుల గాంచి మేఘనాథుడు
నిజముగ వారు మరి లేరనుకొని
మరలి పోయెను నగరము లోనికి.

కన్నీరిడుచు దుఃఖము నున్న
వానర రాజును-విభీషణుండు
ఓదార్చుచును ధైర్యము గొలిపెను
భయపడ వలదని మరిమరి చెప్పెను.

''యుద్ధము నందు ఇటులే జరుగును
తాత్కాలిక మగు జయము కలిగినను
అంతిమ విజయము అసలు విజయము
అది మాత్రము మరి ముందుగ తెలియదు

భోగ భాగ్యములు అనుభవించెడి
యోగ్యత మనకు ఉన్నచో మరి
రామ లక్ష్మణులు ఇద్దరు తప్పక
మూర్ఛ తేరుకొని నిలబడగలరు.

సత్య ధర్మముల నడచే వీరులు
వీరికి ఉండదు మృత్యు భయ''మని
చల్లని జలముల వానర రాజుకు
కనులు తుడిచెనువిభీషణాఖ్యుడు.

శోక నివారణ మంత్ర పఠనమున
తిరిగి కన్నులను తుడిచి పలికెను
''వానర రాజా! దుఃఖము వదలుము
ధైర్యము పూనుము కపులను గనుము.

ఆపత్కాలము అతిస్నేహమునకు
అదను కాదని తెలియుము నీవు
అతిగా స్నేహము దుఃఖ హేతువగు
అందుకు నీవు ఊరడిల్లవలె.

మూర్ఛ నొందిరి ఈ సోదరులు
మహా సేనలరక్షణ ముఖ్యము
ముఖ కాంతులవి మాయలేదు విను
వీరు బ్రతికెదరు భయము తీర్చెదరు.

ఓ సుగ్రీవా! నీ కపి సేనలు
నన్నేరావణు తనయుడనుకొని
గుసగుస లాడుచు చూచుచుండిరి
వారల భయమును తీర్చుము ముందర.

వడలి పోయిన మాల వదలినటు
వారి భయమది తొలగించుమయా!''
అని విభీషణుడు వానర రాజుకు
సమయోచితముగ ధైర్యము గొలిపెను.

మాయలమారి మేఘనాథుడు
వడివడిగా తన తండ్రిని జేరి
సంతోషముతో రామ లక్ష్మణుల-
శుభ వార్తను తను తెలియబరచెను.

సభా మధ్యమున నున్న రావణుడు
పొంగిపోయెను- ఆనందముతో
పీఠము నుండి ముదముగ లేచి
కౌగలించుకొని మురిసిపోయెను.

తనయుని శిరము మూర్కొని ప్రేమగ
వివరములన్నీ వినిపించమని
తండ్రి అడుగగా మేఘనాథుడు
సర్వము తెలిపెను విపులముగాను.

స్వకీయ రక్షణ చేసుకొనుచును
పది నొకవేల విలు వీరులతో
పోరగ శక్తి గలిగిన తనయుని
చూచిమురిసెను లంకాధీశుడు.

॥శ్రీ రఘురాముని॥

## 47 నాగపాశ బద్ధులను సీతకు చూపించుట

యుద్ధ భూమిలో వాయునందనుడు
అంగద, సుషేణ, కుముదుడు, నలుడు
గజుడు, గవయుడు, గవాక్ష, నీలుడు
శతవలి, శరభుడు, గంధమాదనుడు.

రంభుడు వీరులు దుఃఖము నిండి
రామ లక్ష్మణుల చెంత నుండిరి
గిరుల తరులతో సంసిద్ధులయి
అసురుల అలికిడి కాచి యుండిరి.

సంతోషముతో రావణుడచట
అశోక వనిలో అసుర కాంతలను
రమ్మని పిలచి పలికె వారితో
''తనయుడు కూల్చెను రామ లక్ష్మణుల

పుష్పకమ్ముపై సీతను తీసుకు
యుద్ధ భూమిలో నేల కొరిగిన
వీరుల చూడగ గొనిపొండిపుడే
గర్వము దిగును, లొంగుట జరుగును.

ఆశ వదలిన ఆ రమణీమణి
ఆభరణమ్ముల అలంకారముతొ
అందును నాకు, అందుకె సాగుడు
అంతము కోరితి అయినది అటులే.''

ఆనతి విని ఆ అసురాంగనలు
అవనిజ నపుడు పుష్పకమ్ముపై
అనియగు చోటికి తీసుకపోయిరి
అతివ దుఃఖమున మునిగి యున్నది.

''రామ లక్ష్మణుల కూల్చి వేసెను
ఇంద్రజిత్తు ఘనకార్యము చేసెను''
అనుచు చాటిరి లంకా పురిలొ
ధ్వజ పతాకలు ఎత్తిరి నగరిని.

త్రిజటతొ కూడిన పుష్పకమ్మున
యుద్ధ భూమికి సీతను తెచ్చిరి
ఆనందముగా రాక్షస వీరులు
తిరుగుట గాంచెను సీతాదేవి.

తెగిపడియున్న కపివీరులను
దుఃఖసంద్రమున మునిగిన కపులను
వారి మధ్యలో శరఘాతములతొ
స్పృహ లేకుండిన వీరుల గాంచెను.

రామలక్ష్మణులు కవచమ్ములు తెగి
ధనుసులు జారి పడియుండుట గనె
స్కంధ విశాఖుల పోలియుండెడి
శరములు నిండిన వీరులగాంచెను

ఒక్కసారిగా దుఃఖము ఎగసెను
వెక్కివెక్కి రోదించెను సీత
మహావీరులు మరణించిరని
మరిమరి తలచుకు విలపించినది.

మనుజోత్తములు మరి లేరనుకొని
మదిలో నమ్మెను మానిని అపుడు
మనసుచెదరినది-మాయలంకలో
మాయలు తెలిసియు మరచుట విధియగు.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 48 సీత దుఃఖము త్రిజట అనునయించుట

చూచిన దంతయు నిజమని నమ్మి
దుఃఖించినది సీతాదేవి
''పుత్రవతినని చెప్పిరి జోశ్యులు
వైధవ్యమ్ము లేదని నుడివిరి.

అశ్వమేధము క్రతువులు ఎన్నొ
విభుడు చేయునని-వీరుడాతడని
శుభములు పలికిరి పండితు లెందరొ
అన్నియు అయినవి అనృతమ్ములు.

పద్మ రేఖలు పాదము నున్న
పట్టపు రాణి అగునని అందురు
పద్మ రేఖలు నా పాదమున
ఫలించలేదు-పరమ పాపిని.

నిర్భాగ్యముతో-వైధవ్యమును
సూచన చేసే అవలక్షణములు
వెదకిన-నాలో దొరకవు మాతా!
పెద్దల వాక్కులు వమ్మయి పోయెను.

సరిపడు కురులు కలిగియున్నవి
కనుబొమ్మలవి కలిసిపోవక
రోమరహితమై పిక్కలున్నవి
సందులేక నా పలువర సున్నది.

కన్నులు, కణతలు, చేతులు, తొడలు
శీలమండలు పాదములున్ను
తీరుగ నున్నవి-శుభలక్షణములు-
విజ్ఞుల పలుకులు-జోశ్యము తప్పెన?

గుండ్రని నఖముల నున్నవి వ్రేళ్ళు
చేతికి తగిన కొలతకు తగినవి
నిగనిగలాడే దేహకాంతితో
తీరిన అందము శుభ లక్షణము.

లోతగు నాభి శుభకరమందురు
పాదమ్ములును కాలివ్రేళ్ళును
నేలకు తాకుచు నుండుటన్నది
మంచి లక్షణము అందురు విజ్ఞులు.

అరికాళ్ళలొ నా అరచేతులలో
శుభకరమైన రేఖలున్నవి-
సందు లుండక వ్రేళ్ళు ఉన్నవి
చిరునగవొలికే వదనము నాది

శుభలక్షణములు కలవని అనుచు
భర్తతొ కలసి పట్టాభిషేకము
జరుగును అనుచు విజ్ఞులు చెప్పిరి
అనృతమ్ములుగ అయినవన్నియు.

రణధీరులు ఆ సోదరు లిరువురు
నన్ను వెదకి నా ఉనికి తెలిసిరి
అతిభీకరమగు అంబుధి దాటిరి
కానీగోష్పద మంతటి మాయలొ

ఇంద్రజిత్తుని మాయలొ పడిరి-
వారు పొందిన వారుణాస్త్రము
ఆగ్నేయాస్త్రము ఐంద్రాస్త్రములు
బ్రహ్మశిరోనామ కాస్త్రములు.

దివ్యాస్త్రములు-వీరవిక్రమము
అనిలో పనికే రాకపోయెనా-
అనాథనైతిని-నా రక్షకులు
మాయకు లొంగి మాయమయ్యిరి.

మనోవేగముతొ పోరెడిరిపుని
కంటబడినచో కూల్చ సమర్థులు
దాశరథులకు కనబడకుండ
పోరెను-బ్రతికెను మేఘనాథుడు.

అంతటి రాముడు అనుజునితోను
అనిలో నేలను బడియుండుటది
అసాధ్యమైనది సాధ్యమైనది
అహా! కాలము గెలువ నసాధ్యము.

వనవాసమును పూర్తి చేసుకొని
తన బ్రతుకునకు వెన్నెల నిచ్చే
తనయుని చూడగ నిలచిన తల్లి
మనునా ఇంక మనుజపుంగవా!''

అని విలపించెడి సీతను గాంచి
అనునయమ్ముగా త్రిజట పలికెను
''అమ్మా! నీపతి బ్రతికే యుండెను
అన్నదమ్ములు-నమ్మ్మి-సజీవులు

అందుకు తగిన కారణమ్ము లివి
రాజు కూలినచొ సైన్యము నందు
యుద్ధోత్సాహము-కోపము గాని
కనబడదమ్మా మైథిలి! వినుము.

ఓ వైదేహీ! మరియొక విషయము
మనము ఎక్కిన పుష్పకమ్మిది
దేవలోకమున నుండునట్టిది
దేవుడు లేనిచొ నినుగొనిరాదిది

నాయకు డంతము అయిన సేనలు
చెల్లా చెదురై పారిపోదురు
కానీ యిచ్చట కపిసేనలలో
అట్టి అలజడి కనబడలేదు.

కలవర పడక భయమది లేక
జాగరూకులై వానర యోధులు
రామలక్ష్మణుల రక్షణ నుండిరి
కావున వీరులు బ్రతికి యుండిరి.

సత్యవచనములు నావి నమ్ముము
అనృతమ్ములు పలుకను వినుము
సురాసురులు మరి సురనాయకుడే
వచ్చిన రాముని జయించలేరు.

సీతా! వినుము, వీరవరేణ్యుల
ముఖకాంతులవి మాయకున్నవి
ప్రేతకళ యది లేనేలేదు
బ్రతికే యుండిరి దుఃఖము వదలుము.''

త్రిజట పలుకుల ఊరట కలిగెను
పలుకులు సత్యము కావలెననుకొని
మదిలో కోరెను పుష్పకమ్మున-
సీతను చేర్చిరి అశోకవనము-

చూచిన దృశ్యము మదిలో చెరగక
వ్యథతో సీత అశోకవనమున
రామ ధ్యానమున ఉన్నది నిరతము
దుఃఖశమనము రామనామము.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 49 నాగపాశ బద్ధుడైన రాముని వంత

నాగపాశముల బంధమ్ములతో
బుసల మాదిరి నిట్టూర్పులతో
మేన గాయముల నెత్తుట తడిసి
నేల నుండిరి రామలక్ష్మణులు.

వానర యోధులు చెంతనె వుండిరి
బలవంతుడును ధైర్యవంతుడగు
రామచంద్రుడు శరములున్నను
మూర్ఛ తేరెను కనులు తెరచెను.

దీన వదనమున నేలను బడిన
లక్ష్మణమూర్తిని గాంచెను రాముడు
దుఃఖము ఎగసెను తమ్ముని గాంచి
విలపించెను శ్రీరామచంద్రుడు.

''నమ్మిన తమ్ముడు నేల నుండెను
నే బ్రతికుండియు ఏమి లాభము?
సీతను పోలు భార్య దొరకును
కానీ యింతటి తమ్ముడు దొరకున?

సుమిత్ర తనయుడు నన్ను వదలిన
నేనీ కపులు చూచుచుండగనె
అసువులు వదలెద- ఇకపై నేను
బ్రతికి- తల్లులకు ఏమి చెప్పెద?

పుత్రుని కొరకై ఎదురు చూచెడి
సుమిత్రదేవిని ఏ విధముగను
ఊరడించుట జరుగును నేను
వత్సలేని గోమాతగునామె.

భరత శత్రుఘ్నులు విషయము అడిగిన
ఏమి చెప్పెదను- ఇకపై నేను
వెంట వచ్చిన తమ్ముని వదలి
వెడలిన- మాత నను నిందించును.

శరములు తగిలి లక్ష్మణమూర్తి
శర తల్పముపై- మరణించినటు
పడియుండగను నే గాంచితిని
ఎంతటిపాపము చేసినాడనో!

సోదర లక్ష్మణ! నా దుఃఖములో
ఊరడించుచు హితము చెప్పుచు
సతతము నన్ను ఏ మరకుంటివి
నా దుఃఖమును తీర్చవ నీవు?

చూపుల వల్లనె బాధ తెలియును
అస్తగిరిని మరి ఉన్న రవివలె
అతి బాధలొ నువ్వుంటివి సోదర!
మాట లేకను పడియుంటి విట?

నాతో నీవు నడచి వచ్చినటు
నీతో నే యమపురికి నడచెద
బంధు లందరికి ఇష్టుడ వీవు
నోరు విప్పిమాటాడి ఎరుగవు.

అయిదు వందల శరముల నొదిలే
కార్తవీర్యుని మించిన వాడవు
వేయి చేతులతొ అతడు వేయును
రెండు చేతులతొ నీవు వేతువు.

ఇంద్రుని శరముల నయినను నీవు
అస్త్ర బలముతో కూల్చ గలుగుదువు
అసురుని శరముల నేలను బడితివి
అమోఘ బలునికి దుస్థితి కలిగెను.

లంకాపతిగా విభీణాఖ్యుని
చేసెద నన్న ప్రతిన తీరదా?
అనృత మగునది- అది నా వేదన
నే మనలేను తమ్ముని వదలి.

ఓ సుగ్రీవా! కిష్కింధకు పో,
బలవంతుడు ఆ దశకంధరుని
ఎదిరించగను ఉండను గనుక
నిన్ను ఆతడు ఇడుమల బెట్టును.

వానర వీరుల చేర్చుకు నీవు
వారిధి దాటికిష్కింధకు పో
వాయునందనుడు యుద్ధమునందు
అసాధ్యమైన పనిని చేసెను.

జాంబవంతుడు గవాక్షుడున్నూ
సామర్థ్యముతో పోరు సలిపిరి
మైంద ద్వివిదులు సమరము చేసిరి
సంపాతి, కేసరులు పోరిరి ఘనముగ.

గజుడు, గవయుడు గవాక్ష శరభులు
నాకొరకై తమ అసువులనైనా
అర్పణ చేయగ సిద్ధపడుచును
సమరాంగణమున ముందు కురికిరి.

ఓ సుగ్రీవా! ఎంత చేసినను
విధిని దాటగ ఎవ్వరి తరము
ధర్మము నెంచి శక్తికి తగినటు
చేసితి వంతయు సహృదయుడవు.

వానరులారా! మీరందరును
మిత్రుని కార్యము చేసితిరయ్యా!
మీరిక పొండు ఆనతి నిడితిని''
అనుచు రాముడు తిరిగి మూర్ఛిలె.

దుఃఖము నిండిన రాముని పలుకులు
వినిరా కపులు మూర్ఛిల్లుట గని
అమిత దుఃఖమున ఏడ్వసాగిరి
కన్ను లెఱ్ఱబడ నేడ్చిరి బాధతొ

పారిపోవుటకు యత్నము నున్న
కొందరు కపులను విభీషణుండు
గదతో తిరిగి మళ్ళించుకొని
వచ్చుట గాంచిరి కొందరు యోధులు

రామునివద్ద నున్న వీరులు
విభీషణుని గని ఇంద్రజిత్తని
మదిలో తలచి కలవర పడిరి
పారిపోవుటకు యత్నము చేసిరి.

॥శ్రీ రఘురాముని॥

✽✽✽

# 5 0 గరుత్మంతుని రాక–నాగపాశ బంధవిముక్తి

కపిరాజంతట వీరులగాంచి
జల మధ్యమున ఎదురుగాలిలో
తిరుగుముఖముతో సాగుచునున్న
తీరుగనుంటిరి కారణమేమన

అంగదుడనెను '' ఓ మహరాజా!
మేనశరములతొ రామలక్ష్మణులు
కనబలేదా?'' అనగా రాజు
కారణ మదియేకాదని పలికెను.

''వానర యోధులు భయముతొనున్నటు
తోచుచున్నది–వారందరును
తరులు శిలలను వదిలివేసిరి
ఒకేవిధముగా దిగులుగ నుండిరి.

దిక్కుల నరయుచు వెనుదిరగకనే
ఒకరిని ఒకరు బలముగ గెంటుచు
సిగ్గును వదలి–నేలను బడిన
వీరుల దాటుకు పరుగిడుచుండిరి.''

ఆ సమయమున విభీషణాఖ్యుడు
గదతోవచ్చి వానరరాజుకు
ఆశీస్సులనిడి, రామలక్ష్మణుల
భక్తిగ చూచి నిలచెనచ్చట.

వానరయోధులు విభీషణుని గని
ఇంద్రజిత్తని భయపడుచున్నటు
తెలుసుకున్న ఆ వానరరాజు
జాంబవంతుని పిలిచి పలికెను.

విభీషణుని గని ఇంద్రజిత్తని
భయమున పరుగిడు వీరులందరకు
ధైర్యముగొలిపి గొనిరమ్మనుచు
ఆనతినిడెను వీరుడు వెడలెను.

జాంబవంతుడు తెలియజెప్పగా
నమ్మిరి వీరులు- తిరిగివచ్చిరి
భయమువదలినది వారందరును
పొరగ తిరిగి నిలచిరచ్చట.

ధర్మాత్ముడు ఆ విభీషణాఖ్యుడు
దుఃఖించెనట దాశరథులగని
చల్లని జలముల రామలక్ష్మణుల
కన్నుల తుడిచెను అమిత భక్తితో.

మూర్ఛతేరక సోదరులుండిరి
విభీషణాఖ్యుడు శోకవశుడయి
మదిలో ఎంతో వంతనొందెను
ఇంద్రజిత్తును తిట్టెను అపుడు.

''మాయ యుద్ధముతొ దుఃఖమునింపెను
వీరవరేణ్యులు కష్టమునుండిరి
తల్లికడుపు చెడబుట్టెను టక్కరి
కూట యుద్ధము చేసెను కుటిలుడు

దాశరథులను నమ్మితి నేను
వారి విక్రమము నాశ్రయించితి
గౌరవమ్ముకై ఎదురుచూచితి
రాజ్యకాంక్ష ఇకపోయెను నాకు.

బ్రతికి యున్నచో ఆపదలేయిక
నా శత్రువగు రావణాసురుని
ప్రతిన తీరును- కోరిక తీరును.''
కుమిలి కుమిలి అటు దుఃఖించగను

విభీషణుని గని వానరరాజు
కౌగలించుకొని '' ఓ ధర్మజ్ఞా!
రావణుకోరిక నెరవేరదయ్యా,
లంకా రాజ్యము నేలెదవీవు.

రామలక్ష్మణులు మూర్ఛతేరుకొని
దశకంధరుని శిరములు తరుగగ
లంకనేలెదవు సందియమేల.''
అనుచు ధైర్యమును హితునకు చెప్పెను.

సుగ్రీవుడంతట సుషేణుగాంచి
పలికెనప్పుడు ధైర్యమునిండి
''రామలక్ష్మణులు మూర్ఛతేరగనె
వారిని గొనిపో వానరపురికి.

సబాంధవముగా రావణుజంపి
వామనమూర్తి రాజ్యలక్ష్మిని
సురపతికిడినటు అతిశీఘ్రముగా
సీతను రాముని చెంతజేర్చెద.''

ఆ మాటలు విని సుషేణుడపుడు
సుగ్రీవునితో పలికె వినయముగ
''రాజా! పూర్వము అతిభీకరముగ
దేవాసుర సంగ్రామము జరిగెను.

ఆ యుద్ధములో దానవవీరులు
ఆయుధములతో సురలను బాధగ
కొందరు అపుడు మూర్ఛనొందిరి
హతులైపోయిరి కొందరు సురలు.

దేవగురుడగు బృహస్పతి- తను
మంత్ర విద్యతో దివ్యౌషధులతొ
చికిత్స చేసెను- ఆ మూలికలు
పాల సముద్రపు ఒడ్డున దొరుకును.

వాటిని తెమ్మని వానరవీరుల
నిపుడేపంపుము- మన వానరులు
గిరులలోనున్న ఆ మూలికలు
గుర్తుపట్టి ఇట తేగలరయ్యా!

సంజీవకరణి- విశల్యకరణి
రెండు మూలికలు దేవతలప్పుడు
సృజించినారు వాటిని తేవలె
అందుకునీవు సమర్థులనంపుము.

అమృతమ్ముకై పాలసముద్రము
చిలికిరిఅచ్చటి సంద్రపుదాపున
ద్రోణపర్వతము చంద్రపర్వతము
అనెడు గిరులు రెండున్నవి రాజా!

సంజీవకరణి- విశల్యకరణి
ఆ గిరులందు సురలునాటిరి
వాయునందనుని వేగమె పంపుము
దివ్యౌషధులను తెచ్చునాతడు.''

సుషేణుడటుల చెప్పుచుండగా
ప్రభంజనముగా గాలివీచెను
సంద్రజలమును చెదరగొట్టుచు
భూమికదలునటు గాలివీచెను.

లంకాద్వీపము నందలి తరువులు
విరిగిపడినవి సంద్రమునందు
సంద్రమునందలి జలజంతువులు
మహాసర్పములు పరుగిడి దాగెను.

అంతలోనె అతి బలవంతుడగు
వినతాసూనుడు గరుత్మంతుడు
జ్వలించునట్టి అగ్ని హోత్రమై
వారందరకు అగపడినాడు.

గరుత్మంతుని గాంచినంతనే
శరరూపమున రామలక్ష్మణుల
బంధించిన ఆ పాములన్నియు
పారిపోయినవి- ఆశ్చర్యమది!

బుసల నాగులు అసువులు నిలుపగ
గరుత్మంతుని గాంచి పరుగిడె
అంతట ఖగపతి అప్యాయముగా
రామలక్ష్మణుల వంక జూచుచు

గాయములున్న శరీరమ్ములను
చంద్రకాంతితో చల్లగ వెలిగే
చేతులతో ఆ ఖగపతి తడిమెను
గాయములన్నీ మాయమయ్యెను.

మిలమిలమెరిసే శరీరమ్ములు
తేజము బలము ఉత్సాహమ్ములు
బుద్ధికుశలత జ్ఞాపక శక్తి
రెట్టింపైనవి దాశరథులకు.

ఆనందముతో వినతాసూనుడు
వీరవరేణ్యులు రామలక్ష్మణుల
లేవనెత్తెను మనసు నిండుగా-
గుండెకు చేర్చుకు సంబరపడెను.

రాముడు అడిగెను మహితమూర్తివి
ఆపదలో మమ్మాదుకొంటివి
తండ్రిని చూచిన ఆనంద మది
కలుగుచున్నది ఎవ్వరవీవు!

రాముని ప్రశ్నను వినిఖగరాజు
ఆనందముతో గుండె పొంగగా
కనులు చెమర్చగ పలికె భక్తిగా
''రామా! నేను నీకు హితుడను

నీకు ప్రియమును గూర్చుట నాపని
బహిః ప్రాణము అనుకో-నన్ను
గరుత్మంతుడను నామధేయుడ
నీకు సాయపడ వచ్చినానయా.!

మేఘనాథుడు క్రూర రక్కసుడు
మాయతొ వదలిన నాగపాశముల
సుర గంధర్వులు సురపతి అయినను
విడిపించగను శక్యముగాదు.

మహావిషముతో కరకుకోరలతొ
కద్రువ సంతతి విషనాగులను
మాయతొ శరములుగాను చేసెను
ఇంద్రజిత్తు అతి మాయలమారి.

రామా! నీవు ధర్మజ్ఞుడవు
నీ విక్రమము వ్యర్థముగాదు
తమ్మునితో నువురిపుని కూల్చెదవు
విజయము తప్పదు విజయరాఘవా!

మీ ఆపద విని వచ్చితి రామా!
మాయ యుద్ధమున అసురులు ఘనులు
మీరు శూరులు- ఋజువర్తనులు
అందువల్ల అతి మెళకువ ముఖ్యము.

శత్రవునైనను ప్రేమించెదవు
కానీ ఆజిని అసురుల నమ్మకు-''
అనుచుతిరిగి ఆ గరుత్మంతుడు
రామచంద్రుని కౌగలించుకొని

''అనతినిమ్ము పోయివత్తును
నా స్నేహమది ఎటుల అనుచును
ఆలోచించకు- వీరుడవీవు
విజయమునందగ తెలియును సర్వము.

లంకలొ స్త్రీలను- బాలుర, వృద్ధుల
రక్షించిమరి మిగిలిన అసురల
రావణుకలిపి కడతేర్చుమయా!
అమ్మసీతను గ్రహించు తండ్రీ!''

అనుచు ఖగపతి దాశరథులకు
ప్రదక్షిణించి కౌగిలించుకొని
అతివేగముగా నింగి మార్గమున
రివ్వున ఎగిరెను సుడిగాలివలె.

దాశరథుల ఆనందము గాంచి
అమితోత్సాహము నిండిరి కపులు
సింహనాదముతొ శంఖములూదిరి
భేరీమ్మ్రోగ ఘోషనింపిరి.

వాలములూపిరి ఆనందముగా
భుజములు చరిచి అరచిరి ముదముగ
భూరితరువులను పెరకిరి బలముగ
యుద్ధము చేయగ ముందునిలిచిరి.

లంకానగరపు ద్వారమ్ములను
ముట్టడించిరి మహావీరులు
తొలకరిమేఘపు ఉరుములవలెను
కపులగొంతుక ఉరిమెను నింగిని.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 51 ధూమ్రాక్షుడు పోరుకు వచ్చుట

సింహనాదములు కోలాహలము
సభలోనున్న రాజు వినగనే
మంత్రుల గాంచి పలికెనప్పుడు
''కపులు ముదముగ నరచుట వినుడు

ఆనందమునకు కారణముండును
శరబంధములు విడివడిపోయెన?
వివరము తెలియుడు'' అని, యోధులకు
ఆనతి నిడెను అసుర భూపతి.

ప్రాకారముపై నిలబడి అసురులు
తిన్నగ చూచిరి వానర సేనను
హాయిగ ముదముగ తిరుగు సోదరుల
రామలక్ష్మణుల గాంచిరి వారు

హడలిపోయిరా అసుర వీరులు
వడిగా పోయి రాజుకు చెప్పిరి
వెలవెల బోయెనురాజు వదనము
దిగులతొ గుండియ బరువైపోయెను.

వరప్రసాదమగు భీకర శరములు
రవి తేజముతో సరిపడునట్టివి
వాసుకి వంటి విషసర్పములు
నిష్ఫలమెన్నడు కాలేదవ్వి.

అంతటి శరములు వ్యర్థమైనవి
రోషము తిరిగి పెరిగె రాజుకు
అఖండ సేనతొ యుద్ధము చేయగ
ఆనతి నిచ్చెను ధూమ్రాక్షునకు.

రాజుకు వందన మిడిధూమ్రాక్షుడు
సైన్యాధ్యక్షుడు సిద్ధము చేసిన
అసుర సేనలతొ అతి భీకరులతొ
పోరుసలుపగా బయలు దేరెను.

నడుముకు గంటలు కట్టిరి అసురులు
శూల ముద్గర పట్టసమ్ములతొ
గండ్రగొడ్డళులు ఘనమగు గదలతొ
ఇనుప గుదియలు బల్లెములీటెలు

ఆయుధధారులు రాక్షస యోధులు
రణోత్సాహమున గజతురగముల
నాలుగు దిక్కుల నుండి నడచిరి
బంగరు తేరులు నడచెను వడిగా

వృకముఖమ్ములు, సింగపు ముఖముల
కంచరగాడిదలుండిన రథము
ఘనమగు నరదము నధిరోహించి
పోరుకు వచ్చెను ఆ ధూమ్రాక్షుడు.

పోరుకు సాగే ధూమ్రాక్షుడు తా
పశ్చిమ ద్వారము చేరు సమయమున
అపశకునములు- ఉత్పాతములు
కనబడి మదిలో కలవర పడెను.

రథ శీర్షమున గ్రద్ద వ్రాలెను
నెత్తుటి వాన కురిసె మేఘము
భూమి చలించి చీకటి కమ్మెను
అతి భీకరముగ గాలి వీచెను.

రాక్షస యోధులు భయపడిపోయిరి
కొందరు వీరులు మూర్ఛపోయిరి
అయినను ఆ బలవంతుడు అసురుడు
దుశ్శకునములను లెక్కిడ లేదు.

ముందుకు సాగెను అఖండ సేనతొ
ముందర చూచెను వానర సేనను
మరియొక సంద్రము పోలిన సేన
రాముని ఆజ్ఞతొ నడచే సేన.

॥శ్రీ రఘురాముని॥

# 5 2 హనుమంతుడు ధూమ్రాక్షుని హతము చేయుట

పోరగ సేనతొ వచ్చెడి అసురుని
వానర సేనావాహిని చూచెను
సింహ నాదములు చేసిరి వీరులు
ఘోరయుద్ధము జరిగిన దపుడు.

సేనలు చెదురుట గని ధూమ్రాక్షుడు
క్రోధము నిండి కపులను కూల్చగ
విజృంభించెను, కొందరు అసురులు
అతని వెంటబడి వచ్చిరిపోరగ.

వివిధాయుధముల అసుర వీరులు
కొట్టుచుండిరి కపియోధులను
భూరి తరువులతొ పెద్ద శిలలతో
కపులు కొట్టిరి అసుర సేనను.

ఈటెల పొడిచి- చంపిరి కపులను
పట్టసాలతో ఇనుప గుదియల
ముద్గరాలతో మోదిరి కపులను
కపులెందరొ అట నేల కొరిగిరి

శరములు వేసి అసురుల చంపిరి
శిలలను విసరి కపులు చంపిరి
గదలతొ కూల్చిరి అసురులనప్పుడు
గోళ్ళతొ చీల్చిరి కపులుఅసురులను

కర చరణములు తెగి పడిపోయెను
గుండెలు బయటకు ఊడి వచ్చెను
ప్రేగులు తెగిపడి వ్రేలాడినవి
బీభత్సమట తాండవించెను.

ఎందరొ కపులు నేలకొరిగిరి
అసురులెందరో అసువులు బాసిరి
నెత్తురు త్రాగే రక్కసి మూకను
నెత్తురు గ్రక్కగ మోదిరి కపులు.

అల్లె త్రాటి ధ్వని వీణాస్వనమై
యోధుల ఎక్కిళ్లన్న తాళముల
మూల్గులు మంద్ర స్వర నాదమయి
యుద్ధ భూమిలోసంగీతమ్మది.

తరుల దెబ్బలకు శిలల తాకిడికి
కుప్పలు కుప్పలు కూలిరి అసురులు
రథములు విరిగి అశ్వము లుడిగి
బీభత్సముగా గజములు ఒరిగెను.

పకపక నవ్వుచు ఘనమగు వింటితొ
కపులను చిందర వందర చేసే
ధూమ్రాక్షుని గనె ఆంజనేయుడు
క్రోధము నిండి కన్నులు ఎఱుపై

గోళ్ళతొ చీల్చి- కోరల కొరికి
కాళ్ళతొ తన్నిరి అసుర వీరులను
కపుల దెబ్బలకు నిబడలేక
పరుగిడ జొచ్చెను రాక్షసమూక

కొనలు తేరిన ఘనమగు శిలను
విసరెను అసురుని రథము మీదకు
ధూమ్రాక్షుడు గని అదిరిపోయెను
నేలకు దూకెను దక్కుట కొరకై

మారుతి విసరిన ఘనమగు శిలతో
రథము కూలెను ముక్కలాయెను
అంతట పావని భూరి వృక్షమున
తలలు పగులునటు బాదె నసురులను.

అసురుల కూల్చి ఆంజనేయుడు
మరియొక శిలను-కొనలు తేరినది
లీలగ నెత్తి ధూమ్రాక్షునిపై
దూకగ నసురుడు గదతో నిలచెను.

తనపై బడెడు హనుమంతునిపై
శిరమున విసరెను ఘనమగు గదను
నెత్తిని బడిన-మేకులు నిండిన
గదను మారుతి లక్ష్యపెట్టక

చేతిలో నున్న శిలనంతటను
సూటిగ విసరెను అసురుని నెత్తిన
తల పగిలినది చెదిరిపోయినది
నేల కొరిగి ఆ అసురుడు మడసెను.

ధూమ్రాక్షు నంతము చూచెను సేనలు
మిగిలిన కొందరు పారిపోయిరి
పవన తనయునికి వానర వీరులు
ముదము నిండగా పూజలు చేసిరి

||శ్రీ రఘురాముని||

❈❈❈

## 53 వజ్రదంష్ట్రుడు పోరుకు వచ్చుట

'హనుమంతుడు ధూమ్రాక్షుని చంపెను'
వార్తపిడుగువలె వినెను రావణుడు
విష సర్పము వలె నిట్టూర్పులతో
వజ్రదంష్ట్రుని పిలిచి పలికెను.

''రాముని-వాని తమ్మునితోను
సుగ్రీవుని ఆ కపివీరులతో
కూల్చి రమ్ము'' అన, ఆ మాయావి
వజ్రదంష్ట్రుడు కదలె పోరుకు.

గజములతోను గుఱ్ఱమ్ములతో
ఒంటెలు, కంచర గాడిద బలముల
ధ్వజ పతాకల నిలచిన రథములు
వివిధాయుధములు దాల్చిన సేన

ఘనమగు నరదము నెగురు పతాకలు
బంగరు పనులతొ వెలిగే తేరుకు
ప్రదక్షిణించి వజ్రదంష్ట్రుడు
అధిరోహించి సాగెను సేనతొ.

కొండలవంటి గజములున్నవి
ఆయుధాలతో రాక్షస యోధులు
వర్షాకాలపు మేఘము లన్నటు
కోలాహలముగ బయలుదేరిరి

రాక్షస సేనల ఆయుధాలతో-
తళతళలాడి-సింహ నాదముల
దిక్కులన్నియు పిక్కటిల్లెను
రక్షణ ద్వారము చేరెను సేనలు.

రాక్షస సేనలు బయలుదేరగా
అశుభములెన్నో అగపడె నచట
నింగినుండి మరి నిప్పులు రాలెను
నక్కలు భీకర రోదన చేసెను.

రాక్షస వీరులు కలవర పడిరి
వజ్రదంష్ట్రుడును గాంచెను వాటిని
ధైర్యము చెదరక నిలబెట్టుకొని
పోరగ సాగెను తన వీరులతో.

అసుర సేనలను గాంచిరి కపులు
సింహనాదముల వానర వీరులు
కలియబడగనుఘన సంగ్రామము
జరిగెనప్పుడు అతిభీకరముగ.

ఇరు ప్రక్కలలో వీరులు ఒరిగిరి
అంతట కపులు ఘనమగు తరువులు
శిలలను విసరి కూల్చిరి అసురుల
అరపుల సవ్వడి నింగి కెగసినది

అరచేతులతో చరచుచు కపులు
అంతము చేసిరి అసురు లెందరినో
వానర యోధులచేబడి అసురులు
అసంఖ్యాకముగ మన్నున కలిసిరి.

వాడి శరములతో వజ్రదంష్ట్రుడు
యముని మాదిరిగ సంచరించెను
ఆయుధ విద్యలో ఆరితేరిన
అసుర వీరులు చంపిరి కపుల్ను.

కపులు కూలుట గాంచె నంగదుడు
ప్రళయాగ్ని వలె విజృంభించెను
మహా వృక్షమును పెళ్ళగించెను
మారణ హోమము ప్రారంభించెను.

పరాక్రమమ్మున ఇంద్ర తుల్యుడగు
అంగదుడపుడు అతి భీకరముగ
పోరు సలిపెనుకూల్చె-నసురులను
రథములు తురగము లెన్నో కూలెను.

విరిగిన ధ్వజములు-రక్త ధారలు
ఒరిగిన గజములు-దేహ ఖండములు
ఆభరణమ్ములు రంగుల దుస్తుల
తారల నింగిగ తోచెనునేల.

భీకర యుద్ధము చేయుచు నున్న
అంగదు గాంచి అదిరిపోయిరి
పెనుగాలులకు కొట్టుకు పోయెడి
మేఘము లన్నటు అసురులు చెదరిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 54 అంగదుడు వజ్రదంష్ట్రుని కూల్చుట

అంగదుడటుల విజృంభించగ
అసుర సేనలు వెన్నుచూపుట
వజ్రదంష్ట్రుడు చూచెనప్పుడు
అతిక్రోధమున రెచ్చిపోయెను.

వజ్రాయుధమును పోలు సవ్వడితో
వింటిని త్రిప్పుచు కపిసేనలపై
వజ్రదంష్ట్రుడు విడచెను శరములు
మడసిరి ఎందరొ వానర వీరులు.

వానర యోధులు తరుల శిలలతో
చిదుకబాదిరి అసురులెందరినొ
తెగిన శిరములు కర చరణమ్ములు
కళేబరమ్ముల నిండెను నేల.

మృతదేహమ్ముల తినుటకొరకునై
గుంపులు గుంపులు పక్షులు వచ్చెను
వానరసేన అసురసేనలు-
అతిభీకరముగ పోరుసలిపెను.

వజ్రదంష్ట్రుని కంటిముందరే
వానర సేనలు అసురులజంపిరి
భయపడి పరుగిడు అసురలగాంచి
ప్రళయభయంకర యుద్ధము చేసెను.

సూటిగనాటే శరము విడచెను
ఆరు ఏడుగురు ఎనిమిదిమంది
తొమ్మండుగురును ఒక్క అమ్ముకే
నేల కొరుగుట జరిగెనప్పుడు.

వానర యోధులు భయపడిపోయి
సురలు విధాతను చేరినట్టుగా
అంగదమూర్తి చెంతచేరిరి
అంతయుగాంచెను కపికిశోరము.

అంగదుడపుడు ఎదురుగబోయి
వజ్రదంష్ట్రునితొ కలియబడగను
సింగము, కరుల తీరుగ యోధులు
అతిభీకరముగ పోరుసలిపిరి.

మదకరిపైన తోమరమ్ములన
వజ్రదంష్ట్రుడు అంగదుపైన
ఆయవుపట్లలో వేయి బాణములు
విడచి వీరుని బాధించగను.

సర్వాంగముల శరములు తగిలి
నెత్తుటతడిసెను దేహమంతయు
వీరుడంగదుడు జంకక తిరిగి
విసరెనొక్క ఘన వృక్షము నపుడు.

వచ్చెడితరువును వజ్రదంష్ట్రుడు
అనేక శరముల తునకలు చేసెను
తిరిగి అంగదుడు గిరిశిఖరమును
విసరి- చేసెను సింహానాదము

అంతట అసురుడు తన రక్షణకై
గదతో నేలకు ఉరికినంతనే
గిరిశిఖరమది రథమునపడెను
విరిగెను రథము చచ్చెనశ్వములు.

దానిని గాంచిన అంగదుడపుడు
మరియొక కొండనువృక్షమ్ములతో
పెళ్ళగించెను విసరివేసెను
సూటిగపడినది అసురునిపైన.

ఆ దెబ్బకు మరి వజ్రదంష్ట్రుడు
నెత్తురు కక్కుచు మూర్ఛిలిపడెను
మూర్ఛ తేరుకొని క్రోధము పెరిగి
గదతో అంగదు రొమ్మున కొట్టెను.

తృప్తితీరక వజ్రదంష్ట్రుడు
ద్వంద్వయుద్ధము చేయగ దూకెను
వీరులిద్దరు నెత్తురు గ్రక్కుచు
బుధుడంగారకు లన్నటు పోరిరి.

అంగదుడంతట ఘనుమగు తరువుతొ
పోరగరాగా-వజ్రదంష్టుడు
మరియొక తరువును పెరకి ఉరికెను
పోరిరి వీరులు-జయాభిలాషులు.

తిరిగి ఖడ్గముల పోరుసలిపిరి
తనువునిండ గాయమ్ములునిండి
నెత్తుట తడిసి పూచినయట్టి
మోదుగు తరువుల పోలియుండిరి.

మోకాళ్ళపైన నిలబడి పోరిరి
అంతలోనె కపియోధుడు లేచెను
దెబ్బతిన్న సర్పమ్ముగ లేచి
పదునుగ నున్న ఖడ్గముదూసి.

ఒక్క వ్రేటులో వజ్రదంష్ట్రుని
శిరసుత్రుంచెను- అసురుడు కూలెను
అదిగాంచిన ఆ రాక్షసవీరులు.
ప్రాణ భయమున పారిపోయిరి.

వాలిపుత్రుడు వీరయోధుడు
వజ్రదంష్ట్రుని రణమునగూల్చి
పూజలనందుచు సురల మధ్యలో
సురనాయకుడన తేజమునిండెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 5 5 అకంపనుడు పోరుకు వచ్చుట

''వజ్రదుంష్ట్రుని కూల్చె నంగదుడు''
వార్తను వినెను లంకాధీశుడు
ప్రక్కన నిలచిన సేనాపతితో
పలికెనప్పుడు సంక్తికంధరుడు.

''అస్త్రకోవిదుడు అకంపనుండు
అహర్నిశము నా మేలు కోరును
అతడు సమర్థుడు రిపుల గూల్చగ''
అనుచు అకంపను నంపెను పోరుకు.

భయంకరమ్మగు ఆకారమ్ముల
మేఘవర్ణముతొ కుండలాలతో
మహాధ్వనులవి ఎగయుచుండగా
రాక్షససేన కదలెను పోరుకు.

సురలకు సైతము కంపించడని
అకంపనునిగా ఖ్యాతి గాంచిన
అసురుడు రవివలె తేజము నిండి
అని చేయుటకై బయలుదేరెను.

పోరుకు సాగెడి తేరుకు పూన్చిన
గుఱ్ఱములవ్వి ఆగెను- అలసెను
అకంపనునికి వామ నయనము
కంపించినది అశుభముతోచగ.

వెలవెల బోయెను అసురుని వదనము
మాటలు తడబడె, మబ్బులు క్రమ్మెను
పక్షులు, మృగములు-చెవులు చిల్లుపడ
విపరీతముగా అరచిన వపుడు

దుశ్శకునములను లెక్కచేయక
ముందు కురికెను అకంపనుండు
అతని సేనలు నడచిన ధ్వనికి
భయము నందినవి వానరసేనలు.

శిలలు తరువుల నిలచిరి కపులు
రాముని కోసము వానర వీరులు-
రావణు కోసము అసుర సేనలు-
అసువుల నిడుటకు సిద్ధము నుండిరి.

ప్రచండ యుద్ధము సాగెనప్పుడు
జయాభిలాషులు పోరసాగిరి
ధ్వనులతొ దిక్కులు పిక్కటిల్లెను
పర్వత కాయులు వీరులందరు.

వీరుల పదముల త్రొక్కిడి కచట
లేచిన దుమ్ము దృష్టినాపగ
అసురులు అసురుల చంపసాగిరి
కపులు కపులనే కూల్చిరచ్చట.

నెత్తుటితో ఆ నేలంతయును
చిత్తడి చిత్తడి అయిపోవగను
విగత జీవుల కుప్పలు కుప్పలు
బీభత్సమ్మట తాండవించెను.

పరిఘలతోను తోమరాలతో
గదలతొ అసురులు పోరుచుండగా
పర్వతకాయులు బాహుబలముతో
చరచి చంపిరి అసురవీరులను.

కోపము హెచ్చి అసుర సేనలు
తిరిగి చంపిరి కొందరు కపులను
అంతట కపులు ఆయుధమ్ములను
ఊడబెరకి- ఘన తరువుల బాదిరి.

వానరవీరులు మైందద్వివిదులు
కుముదుడు, యోధుడు ముందుకు వచ్చి
లీలగ తరువుల నెత్తి బాదుచు
కూల్చిరి గుంపులు గుంపుల అసురుల.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 5 6 ఆంజనేయుడు అకంపనుని అంతము జేయుట

రాక్షస వీరులు కూలుట గాంచి
క్రోధవశుడయి అకంపనుండు
వానర సేనలు దండిగ నున్న
తావుకు తేరును పోనిమ్మనుచు

''పోరున వానర వీరుల కూల్చెద
వారి శౌర్యము భంగపరచెద''
అనుచు సారథిని ఆజ్ఞాపించగ
అమిత వేగమున తేరు సాగెను.

అకంపనుండు శర వర్షమును
కురిపించగను వానర వీరులు
పోరగలేక భయముతొ నపుడు
నలుదిక్కులకు పరుగిడసాగిరి.

అకంపనుని ఆ శరముల ధాటికి
కూలెడి కపులను సోదర వీరుల
చూచెను మారుతి- ఆ బలవంతుడు
హనుమంతుడట చేరెను వేగమె.

వాయు నందనుడు వచ్చుట గాంచి
దిగులు వదలిరి వానర వీరులు
అకంపనుండు వాతాత్మజుపై
శరవర్షము కురిపించ సాగెను.

సురపతి చేత కురిపించబడు
తెరిపి లేనిదగు వర్షమన్నటు
వదలెను శరములు అకంపనుండు
హనుమంతుడవి లక్ష్యపెట్టక

అకంపనుని మర్దించగ నెంచి
పరుగిడె మారుతి అసురునివైపు
వాయు తనయుని పద ఘట్టనకు
భూమి వణకెనుగిరులు కదలెను.

అంతట పావని తన చేతులలో
ఆయుధ మేదియు లేదని తెలిసి
త్రోవలో నున్న ఘనమగు గిరిని
అవలీలగను చేత గ్రహించెను.

గిరిని చేతులలొ త్రిప్పుచు మారుతి
అకంపనునిపై విసరగ నంత
అర్ధ చంద్ర రూపమ్ము గలిగిన
శరమును వదలెను అకంపనుండు.

అసురుని శరముతొ ఆ పర్వతము
అంతరిక్షమున ముక్కలైనది
అంతట మారుతి అమిత కోపమున
అవలీలగ ఘనతరువును బెరకెను.

కొండవంటి ఇనుమద్ది తరువును
హేలగ త్రిప్పుచు వీర వరేణ్యుడు
అకంపనునిపై విసరగ నడచుచు
త్రోవలొ గజముల సేనల బాదెను.

వడిగా సాగే వాతాత్మజునికి
అడ్డు తగిలిన తరువులు కూలెను
పదముల పోటుకు పుడమి వణకెను
హడలిపోయిరా అసుర వీరులు.

యముడై వచ్చెడి వాయునందనుని
వీక్షించిరి ఆ రాక్షస వీరులు
కలవరపడిరి–కొందరు చచ్చిరి
మిగిలిన కొందరు పారిపోయిరి.

అటులాదనుజుల దునుముచునున్న
హనుమను గాంచెను అకంపనుండు
అమిత కోపమున సింహనాదమున
శర సంధానము చేసి విడచెను.

వాడి కలిగిన పదునాల్గమ్ములు
విడచెను, మారుతి చలించలేదు
వృక్షములున్న గిరివలె చెదరక
నిలచెను పావని శరముల నెదిరి.

శరములు తగిలిన వాయునందనుడు
పూచిన అశోక తరువుగ తోచెను
పొగలేనట్టి అగ్నిహోత్రమై
నిలచెను వీరుడు ఆ రణభూమిని.

అంతట మారుతి చెంతనె వున్న
భూరివృక్ష మవలీలగ పెరికి
అసురుని నెత్తిని వేసెను ఒకటి
అకంపనుడు కంపించి ఒరిగెను.

అకంపనుండు కూలుట గాంచిరి
గజగజ వణకిరి అసురయోధులు
తరుముచు వచ్చెడి కపుల కందక
వడిగా పరుగిడసాగిరి భయమున.

అసురులందరూ పారిపోయిరి
ఆ రణధీరుని మారుతినపుడు
పూజించగను పావని తిరిగి
వానర యోధుల నభినందించెను.

ఆంజనేయుని పూజించుచును
ఆనందముగా సింహనాదమును
ఆ కపులందరు చేయగ నపుడు
అదిరిపోయిరి అసురులు లంకలో.

అమిత బలాఢ్యుని కైటభాసురుని
అంతముచేసిన శ్రీహరివోలె
ఆంజనేయుడు అసురునికూల్చి
ఆనందమును అనిలోనిడెను.

పూజలనందిన హనుమంతుని గని
రామలక్ష్మణులు వానరరాజు
మహావీరులు విభీషణుండు
గౌరవించిరి ప్రశంసించిరి.

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

# 57 ప్రహస్తుడు పోరుకు కదలుట

''అకంపనుని హనుమంతుడు కూల్చెను''
వార్తను వినిన లంకేశ్వరుడు
అది నిజమా! అను సందేహమ్మున
అదరిపాటునకు లోనైనాడు.

చిన్నబోయినది రాజువదనము
చెంతనెవున్న సచివుల చూచెను
ముహూర్త మాత్రము యోచనచేసుకు
అప్పటికప్పుడు బయలుదేరెను.

లంకాపట్నపు రక్షణచూడగ
బయలుదేరెను రాక్షసరాజు
అప్రమత్తులై సేనలుండుట
రాజుగాంచెను తృప్తినందెను.

వానర సేనలు ముట్టడించుటది
గాంచి కలవరము నందినరాజు
సభాభవనము- చేరి- అచ్చట
ప్రహస్తుగాంచి పలికెనప్పుడు.

''ప్రహస్తుడా! నువు రణకోవిదుడవు
నేనో, తమ్ముడు కుంభకర్ణుడో,
నీవో, తనయుడు మేఘనాధుడో,
నికుంభుడో, మరి తగిన వారము.

సేనాపతివి- నీవు సేనతో
సింహనాదము చేసినంతనే
సుశిక్షితులు మరి కాని వానరులు
స్థైర్యము చెదరి పారిపోదురు.

సేనలు చెదరగ రామలక్ష్మణులు
అసహాయులయి దొరికిపోదురు-
అటుగాకున్న సంకటసమయము
ఇప్పుడుపోరుట తప్పనిసరియగు.

జయమెవ్వరిదో చెప్పగలేము
పోరుచేయక ఊరకున్నచో
పగతుర మనలను చంపితీరును
కావున యుద్ధము చేయకతప్పదు.

యోచన చెప్పితి నాకుతోచినది
కీడుగలుగునో-మేలుకలుగునో
ఆలోచించి మదిలోమాట
సందియముంచక తెలియబరచుము.''

రాక్షసగురువు అసురరాజుతో
పలుకునట్టుగా ప్రహస్తుడపుడు
''ఓ మహరాజా! ఈ విషయమును
మంత్రులతో నువు చర్చించితివి.

సీతాదేవిని ఇవ్వకపోయిన
పోరుతప్పదని నిర్ణయమైనది
యుద్ధముతప్పదు అనెడి విషయము
మాకందరకు తెలిసెను స్వామీ!

రాజా! నీచే గౌరవమందితి
ఎంతో సంతోషమ్ము నిడితివి
అక్కరలో నీ ప్రక్కన నిలతును
ఆలుబిడ్డలను అసువుల విడచెద''

అనుచు ప్రహస్తుడు ఎదుటనె వున్న
సేనాధ్యక్షుని చూచి పలికెను
''పిడుగుల బోలు శరములు తగిలి
చచ్చిన రిపులను తినును పక్షులు.

సేనల సిద్ధము చేయుము'' అనగా
అఖండ సేన వివిధాయుధముల
ఆలస్యమ్ము చేయక నిలచెను
మదకరి తుల్యులు వీరులందరు.

విజయము కోరుచురాక్షస వీరులు
జప హోమముల వేదవిదులను
గంధాక్షతలతొ పూజించగను
సుగంధ పరిమళ మంతయు నిండెను.

విజయము కోరి మంత్ర పూతముగ
విరి దండలను దాల్చిరి వీరులు
కవచమ్ములును ధనుసులు దాల్చిరి
రావణ ప్రభువుకు వందన మిడిరి.

లంకేశునికడ వీడ్కోలు గొని
ప్రహస్తుడపుడు సాగెను సేనతొ
అద్భుతమైన సర్ప ధ్వజముతో
అమరిన తేరును అధిరోహించెను

అసురుని కొరకై అమరిన తేరు
సృష్టినె హేళన చేయుచున్నటు
మనోహరమ్ముగ కనబడె నచట
అతి సమర్థుడా తేరుకు సారథి.

ఉరుముల బోలి మ్రోగె దుందుభులు
వివిధ వాద్యముల శంఖ ఘోషలు
పొంగిన కడలి పుడమి ముంచునటు-
మహా కాయులతొ సాగెను సేనలు.

ప్రహస్తు వెంబడి అతని సచివులు
నరాంత, కుంభ, మహానాథులు
సమున్నతుడను అతిబలవంతులు
సేనతో నడచిరి ఉత్సాహముతో.

ప్రళయకాలమున యమునిగ అసురుడు-
పొంగెడి కడలిగ అసురసేనలు-
చేసెడి ఘోష సింహనాదములు
దిక్కుల కెగయగ జంతువు లడలెను.

అపశకునములు అగపడె నప్పుడు
మాంసభక్షణచేయు పక్షులు
భయంకరముగ వలయమ్ములుగ
అరదముపైన ప్రదక్షిణించెను.

అంతరిక్షము నిప్పులు రాల్చెను
ఈదరగాలి వీచెనప్పుడు
గ్రహముల కాంతి మాసిపోయెను
మేఘ గర్జనలు భీతి గొలిపెను.

ప్రహస్తు నరదముపైన వ్రాలిన
గ్రద్ధ, ముక్కుతో రెక్కలు పొడుచుకు
అశుభసూచన అన్నటులున్నది
నెత్తుటివాన కురిసెనప్పుడు.

రథసారధి అతి సామర్థ్యముతో
అనేక రణముల రథము తోలెను
అంతటి సారథి చేతనుండిన
కొరడా జారెను అశుభసూచనగ.

సమ ప్రదేశమున జారె నశ్వములు
అష్టవసువులను మించిన యట్టి
దేహకాంతితో వెలుగు ప్రహస్తుని
మేనికాంతి అపుడంతరించెను.

వానర వీరులు సేనను గాంచిరి
ఎదిరి నిలువగ వారందరును
ఘనమగు శిలలు తరువులు బెరకగ
అతిభీకరమగు ధ్వని వెలువడెను.

ఉభయ సేనలలొ వీరులందరు
సింహగర్జనలు చేయసాగిరి
అరపులు, సవ్వడి అట్టహాసముల
నింగీ, నేల పగులునట్లయె.

జయింతునన్న ఆశ పెంచుకొని-
ఆ కపిసేనలు బలహీనులని-
అగ్ని హోత్రమున పడు మిడుతవలె
అసురుడు దూకెను ఆ రణభూమిని.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 5 8 నీలుడు ప్రహస్తు నంతము జేయుట

వచ్చెడి వీరుని గాంచెను రాముడు
వివరములడిగెను విభీషణాఖ్యుని
చిరునగవుతొ శ్రీరాముడు వినగ
తెలిపెను అతడు ప్రహస్తుడనుచు.

''రావణ సేనానాయకుడతడు
మూడవ వంతు సేనకు అధిపతి
ప్రసిద్ధిగాంచిన పరాక్రముండు
అస్త్రము లెరిగిన అతి బలవంతుడు.''

శక్త్యాయుధము అష్టులు అనెడి
తళతళడాడెడి ఆయుధములతో
శూల ముసలములు ఇనుప గుదియల
ఈటెలు, గదలు, గండ్రగొడ్డళుల

అసుర వీరులు తాకిరి కపులను
మహాకపులు తమ ఆయుధాలుగా
పూచిన తరువులు పెద్ద శిలలతో
ఎదిరి నిలచిరి రాక్షస సేనకు.

శరవర్షము కురిపించిరి అసురులు
శిలలు, తరువులు విసరిరి కపులు
ఘనసంగ్రామము జరిగినదప్పుడు
ఇరు సేనలలో వీరులు ఒరిగిరి.

నరకిరి పొడిచిరి వానర వీరుల
చరచిరి చీల్చిరి అసురవీరుల
చిదుకకొట్టిరి నిశాచరులను
శరముల కూల్చిరి వానరవీరుల.

ప్రహస్తు సచివులు విజృంభించిరి
అతిఘోరముగా కూల్చిరి కపులను
అంతట ద్వివిదుడు కొండను విసరి
నరాంతకుని తలఛిద్రమొనర్చెను.

ఘనమగు తరువుతొ దుర్ముఖుడపుడు
సమున్నతుని అవలీలగ కూల్చెను
జాంబవంతుడొక బండరాతితో
మహానాథుని మన్నున కలిపెను.

తారుడు అంతట భూరితరువుతో
కుంభవహుని అట హతముచేయగ
నలుగురు సచివులు కూలుటగాంచి
ఘనసంగ్రామము చేసె ప్రహస్తుడు.

శరపరంపరతొ కపిసేనలను
కలవర పరచెను ప్రహస్తుడపుడు
కూలిన వానర అసురుల గుట్టలు
పర్వతాలవలె అగుపించినవి.

నెత్తుట తడిసిన ఆ రణభూమి
వైశాఖములో విరగ బూసిన
మోదుగ చెట్లతొ నిండిన నేలగ
అగుపించినది పారెను రక్తము

కళేబరమ్ములు తీరమ్ములయి
ఆయుధమ్ములు భూరితరువులయి
రక్త ప్రవాహము మహాజలముగా
గుండె ప్రక్కగల మాంసము బురదగ

జారిన ప్రేగులు నాచుగ తోచగ
దేహఖండములు మీనమ్ములుగ
మొండెమ్ములవి పచ్చికబైళ్ళగ
గ్రద్ధలు హంసల పోలిక చెప్పగ.

రాబంధులవి సారస పక్షులు
మేధస్సుమరి నురగతొ పోల్చగ
ఆర్తుల మూల్గులు భీకర ధ్వనిగా
పిరికి వాళ్ళకు గుండెలవియగా.

యముడు అనెడి ఘన సంద్రమునందు
కలియుచునున్న ప్రవాహమన్నటు
కనుపించినది ఆ రణభూమి
అతి బీభత్సము తాండవించెను.

హంసలు, సారస పక్షులు, నదిని
శరత్కాలమున దాటినట్టుగా
అశక్యమైన రణమను నదియది
దాటిరి అసురులు కపులవలీలగ.

పుష్పాడి నిండిన కాసారమ్మున
మునుగుచు తేలెడి గజముల మాదిరి
రక్తముతోనట వీరులతనువులు
తడిసి కనబడె అతిభీకరముగ.

రథమునుండి అతినేర్పుగ శరములు
ప్రహస్తుడచట విడచుచుండగా
వానరులెందరొ కూలుచుండగా
నీలుడు చూచెనువిజృంభించెను.

ముందుకురికిన నీలునిగాంచి
ప్రహస్తుడెన్నొ శరములువిడచెను
శరత్కాలమున చినుకులకోర్చే
ఆబోతువలె నిలచెను వీరుడు

శరవర్షమ్మును చూచిన నీలుడు
శరముల నసలే లెక్కపెట్టక
పట్టరాని క్రోధమ్ముతొ నచటి
సాలవృక్ష మవలీలగ పెరకి

రథాశ్వములను మోదెను నీలుడు
వేగము గలిగిన తురగములపుడు
నేలకొరిగెను-నీలుడు ఎగిరి
ప్రహస్తు ధనుసును లాగి విరచెను.

ధనుసుత్రుంచిన వీరకిశోరము
సింహనాదము చేయగ నంత
భయంకరమ్మగు ముసలాయుధము
చేతధరించి దూకె నసురుడు.

నీలుని నొసట ముసలాయుధమున
కొట్టె ప్రహస్తుడు నెత్తురుపారెను
అంతట నీలుడు పరమకృద్ధుడై
తరువుతొ రొమ్మున కొట్టెనసురుని.

ఇరువీరులు అతి బలవంతులును
వేగవంతు లుత్సాహవంతులు
నెత్తురు కారుచు వైరమునిండి
పోరెడి మదకరు లన్నటులుండిరి.

యుద్ధములందు వెనుకకు జంకరు
ఎన్నో సంగ్రామమ్ముల పోరిరి
సింహము పులులను పోలినవారు
అపజయమెరుగని అతిసాహసులు.

ఒకరిని ఒకరు జయింపగోరి
సేనా నాయకు లిద్దరు అపుడు
తీక్షణమైన తమకోరలతో
ఒకరిని ఒకరు బాధించుచును

పోరుచుండగా ప్రహస్తుడపుడు
ముసలాయుధమును చేత ధరించి
అతివేగముగా ఎదుర్కొనగనే
ఘనశిలతో అట నీలుడు నిలచెను.

ముసలాయుధమును ఎత్తు లోపలే
విసరెను శిలను నీలుడు- లీలగ
శిల తలపైబడి ప్రహస్తుడంతట
చితికిన తలతో నేలకొరిగెను.

వేరు నరికిన తరువై అసురుడు
నేలవ్రాలెను శిరస్సునుండియు
దేహమునుండియు రక్తప్రవాహము
సెల యేరులుగా పారెనచ్చట.

ఆనకట్టను జలముదాటదు
అటులే అసురులు నిర్వీర్యులయి
ప్రహస్తువీరుడు కూలుటగాంచి
బెదిరిపోయిరి పరుగిడిపోయిరి.

ప్రభువుకు విషయము చెప్పలేకను
మూగవాండ్రుగా నిలచిపోయిరి
వీరుని కూల్చిన నీలుడు అపుడు
రామలక్ష్మణుల మన్ననలందెను.
॥శ్రీ రఘురాముని॥

## 5 9 రావణాసురుడు మొదటిసారి పోరుకువచ్చి పరాజితుడగుట

అగ్ని తనయుడగు నీలుడు వీరుడు
ప్రహస్తు నెదిరి పోరున చంపిన
వార్తను వినిన లంకేశ్వరుడు
ఎంతో బాధతొ దుఃఖితుడయ్యెను.

రాక్షస యోధుల చూచి పలికెను
''దేవ సేనలను పరుగెత్తించిన
ప్రహస్తు నంతము చేసిరి కపులు
కావునకపులు తక్కువ కాదు.

వానరులనుచు వారెంతయని
తలచుట తగదు- యుద్ధ భూమికి
స్వయముగ నేనే ముందు నడచెద
దాశరథులను కపులతొ కూల్చెద.''

అగ్నిహోత్రమై జ్వలించుచున్నటు
అలంకరించిన అరదము నెక్కెను
శంఖము లూదిరి భేరులు మ్రోచిరి
భుజములు చరచి మురిసిరి అసురులు

స్తోత్ర పాఠములు చదివిరి కొందరు
జయము పలికిరి వీరులు కొందరు
సింహ నాదములు మింటి కెగయగా
లంకేశ్వరుని తేరు నడచెను.

పర్వత కాయులు జ్వాల నేత్రముల
బయలుదేరగా రాక్షసరాజు
భూతగణముతో సాగుచు నున్న
రుద్రుని తీరుగ భాసిలె నచట.

లంకాపట్నపు వెలుపల గాంచెను
మహా ఘోషతో గిరుల తరులతో
యుద్ధోత్సాహము నిండిన కపులను
అమిత సంఖ్యలో చూచెను రాజు.

అసుర సైన్యము ప్రభంజనముగా
వచ్చుచుండగా వారి మధ్యలో
దివ్యాయుధముల వెలిగెడి వీరుల
వివరములడిగెను రామచంద్రుడు.

విభీషణాఖ్యుడు తెలిపెను ఇటుల
"రామా! అదిగో మదకరిపైన
ఉదయ సూర్యుడై ఎఱ్ఱటి ముఖముతొ
అకంపనుడు లంకేశుని తనయుడు.

సింహ ధ్వజమది ఎగురుచుండగా
మత్తేభములా కోరలు మెరయగ
ఇంధ్ర ధనుసులా విల్లు వెలువగా
అరదము పైన వచ్చెడి వాడు.

వాడేరావణు కుమారుడైన
ఇంద్రజిత్తుబహు మాయలమారి
అంతర్ధానము కాగల శక్తి
బ్రహ్మ వరమున పొందినవాడు.

వింధ్య, మహేంద్ర అస్త గిరులవలె
ధనుసు మీటుచు అరదము పైన
వచ్చెడివాడు అమోఘబలుడు
అతికాయుడు అతి ధీరుడు రామా!

గణగణ గంటలు మ్రోగుచుండగా
అరుచుచు కరిపై వచ్చెడి వాడు
ఎర్రని కన్నులు మంటగ తోచును
వాడినందురు మహోదరుండని.

గిరివలె ఉన్నత కాయుడు వాడు
బంగరు సొమ్ముల వెలిగెడి వాడు
ఈటెతొ తురగము నధిరోహించెను
వాడే రామా! పిశాచు డసురుడు.

పర్వత మంతటి ఎద్దు నెక్కెను
మెరపుల మాదిరి మెరిసే వీరుడు
వజ్రాయుధముతొ సరిపడు శూలము
అతడే త్రిశరుడు యుద్ధ చతురుడు.

సర్ప ధ్వజము ఘనమగు నరదము
ధనుసు మ్రోతతో ఉత్సాహముతో
విశాల వక్షము-మేఘ సమానుడు
కుంభుడు రామా! వీర పుంగవుడు.

బంగరు కాంతులు మంటగ తోచగ
వజ్రములవ్వి పొగ రగులునటు
మెరసే పరిఘతొ నికుంభుడుండెను
రాక్షస సేనకు ధ్వజమును పోలును.

ఘోర కృత్యములు చేయుట యందు
సిద్ధ హస్తుడు నికుంభుడయ్యా!
అదుగో అక్కడఘన పతాకము
రెపరెప లాడుచు వచ్చెడి రథము.

అగ్ని కాంతితో మెరసే రథము
అయుధాలతో వచ్చెడి రథము
అందలి వీరుడు నరాంతకుండు
అద్రి శిఖరముల విసర సమర్థుడు.

రామా! చూడుము వ్యాఘ్ర ముఖములు
ఒంటె ముఖములు గజ ముఖములతో
మృగ తురగముల ముఖములు కలిగిన
భయంకరులతో వచ్చెడి వాడు.

ఎఱ్ఱని గ్రుడ్లను త్రిప్పుచుండెను
నిండు చంద్రునితొ పోలెడి ఛత్రము
దేహ కాంతులతొ వెలుగులు నింపుచు
భూతనాథుడగు రుద్రుని పోలి

వింధ్య, హిమగిరి సమ కాయముతో
రత్న ఖచితమగు కిరీటమ్ముతో
ధగధగలాడే కుండలమ్ములతొ
రవివలెతేజము గలిగిన వీరుడు

సురల దర్పము ఇంద్రుని దర్పము
యముని ఘనతను అణగద్రొక్కిన
అసురేంద్రుడు ఆ లంకేశ్వరుడు
రావణరాజు రాక్షస ఏలిక.''

అంతట రాముడు రావణు గాంచి
పలికెనప్పుడు విభీణునితో
''ఆహా! ఎంతటి తేజోవంతుడు
చూడ శక్యమే కాకున్నాడు.

వీడి రూపమును చూచుచుండగ
వీని ప్రతాపము తెలియగ నగును
వీనితొ సరిపడు కాయము తేజము
సురాసురులలో లేదెవ్వరికి.

యమకింకరులతొ వచ్చు కాలుడై
వచ్చుచుండెను రాక్షసరాజు
ఓ విభీషణా! ఈ పాపాత్ముడు
కనబడె నాకు ఇన్ని దినములకు.

సీతాపహరణము జరిగిన నుండి
రగిలిన నా పగ నేటికి తీరును
నా అదృష్టము కావున అసురుడు
నేటికి కనబడె ఈ రణభూమిని''

అనుచు రాముడు అనుజునితోను
కోదండముతో మేలగు శరముల
రణోత్సాహమున నిండుగ నిలచెను
అమితోత్సాహమునుండిరి కపులు.

రావణుడపుడు తన వీరులతో
''లంక గృహముల కూడలులందు
కావలి కాయుడు, నే నొక్కడినే
పోరు సలిపి ఆ రిపుల కూల్తును.

అందరమిచట పోరులొనున్న
సరియగు బలము లంకలొ లేదని
కపులు తెలిసి ఆ లంకలొ చేరి
సర్వనాశనము చేయ సమర్థులు''

అనుచు పలుకుచు రాక్షసరాజు
వానరసేనా కడలి నీదుట
తనకు సాధ్యమని మదిలో నమ్మెను
రథము సాగెను సేనలవైపు.

మెరిసే ధనుసు శరములు దాల్చి
అమిత వేగముగ కపిసేనలను
రావణాసురుడు తాకుట గాంచెను
కృద్ధుడయ్యెను వానరరాజు.

కపిరాజంతట అవలీలగను
కొండ శిఖరమును పెళ్ళగించుకొని
రావణరాజుకు ఎదురు పరుగిడి
విసరివేసెను అసురరాజుపై.

తనపై పడెడి గిరిశిఖరము గని
బంగరు ములుకుల శరములు వదలి
తరులు చరియులు నిండిన గిరిని
లీలగ చీల్చెను లంకేశ్వరుడు.

రావణుడంతట నిశిత శరమును
వజ్రాయుధమును పోలెడి అమ్మును
మంటలమండే అమోఘ శరమును
వానరరాజుకు తగలగ విడచెను.

కుమారస్వామి వదలిన యట్టి
శక్త్యాయుధమున క్రౌంచ పర్వతము
చీలినట్టుగా రావణు శరము
దూసుకుపోయెను వానరరాజును.

శరము తగిలిన వానరరాజు
బాధకు గురియై చేష్టలుడిగెను
అరచుచు నేలను కూలబడగనే
రాక్షసయోధులు సంతసపడిరి.

అది గాంచిన ఆ గవయు, గవాక్షులు
సుదంష్ట్ర జ్యోతిర్ముఖులు నభుడను
వానర వీరులు తనువులు పెంచి
పర్వతాలతో బయలుదేరిరి.

రావణాసురుడు గాంచెను వారిని
వాడి శరములు వదిలి గిరులను
ముక్కలుచేసి నిశిత శరముల
పడగొట్టెను ఆ కపి కుంజరులను.

ఆ కపి వీరులు నేలపడగనే
రావణాసురుడు విజృంభించెను
శరవర్షమును కురిపించుచును
వానరవీరుల కూల్చసాగెను.

కలవర పడిరి కపులందరును
శరముల ధాటికి భయపడిపోయిరి
అరపులు కేకలు భయభ్రాంతులై
రామచంద్రుని శరణు వేడిరి.

ధనుర్ధరుడు శ్రీరామచంద్రుడు
అసురుని త్రుంచి ఆదుకొనుటకై
అప్పటికప్పుడు బయలుదేరెను
అంతట తమ్ముడు కరములు మోడ్చి

''అన్నా! అసురుని కూల్చుటన్నది
నీకొక లెక్కా? నీచుడు వాడు
ఘన సామర్థ్యము కలిగిన నీవు
నీచుని త్రుంచుట ఎందుకు స్వామీ!

ఆ నీచుని-నే- అనిలో చీల్చెద
అనుగ్రహించి ఆనతి నిమ్మో''
అనుచు లక్ష్మణుడు అడిగినంతనే
అనుజుని గాంచి అన్న పలికెను.

''ఓ సౌమిత్రీ! పోరాటములో
అతి మెలకువగా పోరగ వలెను
రావణాసురుడు అమిత విక్రముడు
రణ కోవిదుడుయుద్ధ చతురుడు.

కోపమునంది విజృంభించిన
ముల్లోకములు చాలవు గెలువగ
కానీ పోరున వాడి లోపము
ఎక్కడున్నదో వెదకి పోరుము.

హెచ్చరిక మరి కావలసినది
స్వకీయ రక్షణ చేసుకొనుచును
ఏమరు పాటు దరి రానీయక
ఎదిరి పోరు''మని రాముడు పలికెను.

అన్నమాటను వినిన లక్ష్మణుడు
ప్రదక్షిణించి కౌగలించుకొని
అన్న ఆనతిని ఆ రణధీరుడు
ఆజికి నడచెను అసురుని గెలువగ.

చెదరిపోయిన కపులందరిపై
శరములు వదలెడి రావణ రాజును
ఘనమగు శరము దాల్చిన వీరుడు
లక్ష్మణమూర్తి తిన్నగ జూచెను.

రావణు నెదిరి పోరగ నున్న
లక్ష్మణు గాంచెను వాయు నందనుడు
ప్రభువుకు శ్రమ తానుండగ తగదని
తానే సాగెను పోరగ నంత.

రావణు శరముల లెక్కించకను
శరవేగముతో ముందుకు దూకి
రావణు రథమున గెంతెను మారుతి
రావణుపైన చేతి నెత్తెను.

అదిరిపోయెను రాక్షసరాజు
చెదిరిపోయిరి అసుర వీరులు
అంతట మారుతి అరచెనచ్చట
'' ఓ రాక్షసుడా! సురల గెలచితివి.

దేవతలన్న భయపడవీవు
ఆ విషయమ నే నెరుగుదునయ్యా!
ఇప్పుడు నీవు మా వానరులకు
భయపడవలెను తప్పదు వినుము.

కరము నెత్తితి కనులు మూసుకో!
ఎంతో కాలమునుండి భక్తిగా
నీలో దాగి ఆత్మగ నున్న
అసువుల నిపుడే విడిపించెదను.''

అంతట పలికెను లంకేశ్వరుడు
''ఓ వానరుడా! కొట్టుము నన్ను
లంక ఏలికను కోతి కొట్టిన
ఘనత దక్కును కీర్తి నిలచును.

నీ పరాక్రమము తెలిసికొందును
అటుపైనే నిను అంతము చేసెద.''
అంతట మారుతిఅసురునితోను
అక్ష కుమారుని తలంచుకోమనె.

అక్ష కుమారుని మాట వినగనే
ఆవేశమ్మున రావణరాజు
అతి బలశాలి తన అరచేతితొ
ఆంజనేయుని రొమ్మున చరచెను.

దెబ్బతినిన ఆ వాతాత్మజుడు
వణకెనుఅంతట తెప్పరిల్లెను
తిరిగి బలముగ వాయు నందనుడు
చరచెను, అరచెను రాక్షసరాజు.

భూకంపములో గిరి వణకినటు
కంపించెను అట అసురేశ్వరుడు
వణకెడి రావణరాజును గాంచి
కిచకిచలాడుచు మురిసిరి కపులు.

దేవ ఋషులును సిద్ధులు సురలు
హనుమంతుని ఆ ఘనకార్యము గని
ముదము నందిరి పొగడిరి హనుమను
రావణుడంతట తెప్పరిల్లెను.

భేషు భేషని రావణాసురుడు
ఆంజనేయుని చూచి పలికెను
''శత్రువువే నువు- అయిననుకానీ
నీ శక్తిని-నే-మెచ్చుకొంటిని.''

అంతట మారుతి తిరిగి పలికెను
మదిలో సిగ్గును తెలియబరచెను
''ఇంకా నువ్వు బ్రతికి, పలుకుటది
కాదా అది నాకవమానమ్ము?

నా దెబ్బను నువు పొగడుచుంటివి
అసలగు గ్రుద్దు అందించినచో
అది యమసదనము చూపును నీకు
ఆ పని ఇపుడే చేతును'' అనెను.

ఆ మాటలకు రావణరాజు
అమిత కృద్ధుడై హనుమ వక్షమున
గ్రుద్దెను, దెబ్బకు మారుతి అదిరెను
రథమునుండి తా నేలను బడెను.

హనుమను అచ్చట వదలి అసురుడు
అతి బలవంతుడు రావణరాజు
అమిత వేగమున ముందుకు సాగి
అనేక శరముల నీలుని కొట్టెను.

అంతలోనె హనుమంతుడు లేచెను
వేరొక్కరితో పోరుచుండగా
అడ్డగించుట ధర్మముగాదని
అసురునితోనని ఆగెను మారుతి.

అసువులు తీసే భీకర శరము
అసురుడు వదలెను నీలునిపైకి
సర్ప సమమగు శరఘాతమును
ఓర్చినీలుడొక గిరిని విసరెను.

ఏడు బాణముల రావణాసురుడు
నీలుడు విసరిన గిరిని చీల్చెను
అంతట నీలుడు అనేక తరువులు
వరసగ విసరెను అసురునిపైకి.

రావణాసురుడు శర పరంపరతో
భూరి తరువులను తునకలుచేసెను
అంతట ఆగక రావణరాజు
శర వర్షము కురిపించెనచ్చట.

శరముల తడిసెను వీరుడు నీలుడు
వెంటనె రూపము చిన్నది చేసి
రావణు రథపు టెక్కెము నెక్కెను
అసురుని కెంతో కోపము వచ్చెను.

అంతట నీలుడు సింహనాదముతొ
అసురుని ధనుస్సుపైన కురికెను
ధనుసునుండి ఆ కపి కిశోరుడు
కిరీటమ్ముపై కెగిరెను యుక్తిగ.

అటులా నీలుడు దూకుచుండగా
రామలక్ష్మణులు హనుమంతుడును
ఆశ్చర్యముతో చూచుచుండిరి
రావణుడున్ను చకితుడయ్యెను.

అంతలోనె ఆ లంకాధీశుడు
వ్యాకుల పడుట గాంచిరి కపులు
ఆనందముతో పకపక నవ్విరి
సింహనాదములు చేసిరి కొందరు.

తోచక-స్థబ్ధుడు అయ్యెను రాజు
అంతట మదిలో యోచన చేసి
ఆగ్నేయాస్త్రము అభిమంత్రించి
నీలునిపైన సూటిగ వదలెను.

ఆగ్నేయాస్త్రము తాకిన వక్షము
మండగ-నీలుడు నిలబడలేక
ధ్వజాగ్రమ్మును వదలి నేలబడె
అగ్నిహోత్రునికి తనయుడు నీలుడు.

తండ్రి దీవన కలిగిన నీలుడు
రావణు నెదిరి పోరిన వీరుడు
ఆగ్నేయాస్త్రము తగలగనంత
మూర్ఛనొందెను, అసువులు నిలచెను.

నీలుడు నేలను బడుట గాంచెను
విజయ గర్వమున రాక్షసరాజు
మేఘధ్వనిగా తేరునడవగా
నారిధ్వనించెను నేల వణకునటు.

లక్ష్మణమూర్తి రావణు గాంచెను
''ఓ నిశాచరా! నాతో తలపడ
పోరుకు వచ్చి కపులతొ పోరుట
నీకేమాత్రము ఘనత కాదయా!''

అనుచు లక్ష్మణుడు అమితకోపమున
దిశలు మ్రోగునటు ధనుసుతొ నపుడు
సవ్వడిచేయగ హడలిరి అసురులు
అంతట రాక్షసరాజు పలికెను.

''వినాశకాలము వచ్చెను లక్ష్మణ!
వచ్చితి విటకు యుద్ధము చేయగ
నా అదృష్టము-కంటబడితివి
శరముతొ నంపెద యమసదనమునకు.''

లక్ష్మణుడనెను రావణు గాంచి
''పాపకృత్యములు చేయుటయందు
ఆరితేరినవాడవు నీవు
వీరుడవైతే పొగడుకొందువా?

నీ పరాక్రమము తెలియును నాకు
శరచాపములతొ నిలచితి నెదురు
నిన్ను నీవు మరి పొగడుకోకయా!
నన్ను నువ్వు ఎదిరించిన ఘనత!''

లక్ష్మణుడటుల పలుకుచుండగా
కృద్ధుడయ్యెను రాక్షసరాజు
వెంటనె రాజు ఏడుశరములు
సుమిత్ర తనయుని పైన విడచెను.

బంగరు మొనలు కొనలుదేరిన
కరకుటమ్ములతొ లక్ష్మణమూర్తి
అసురుని శరముల త్రుంచివేయగా
క్రోధము పెరిగెను రాక్షసరాజుకు.

అమోఘ శరములు వదలి రావణుడు
వచ్చెడి శరముల నెదిరి నిలచెను
ధనుసు త్రిప్పుచు దివ్యశరములతొ
అసురుని అమ్ముల త్రుంచె లక్ష్మణుడు.

దివ్యశరములవి వ్యర్థము కాగా
దేవవిరోధి కలవరపడెను
రామానుజుని శరవిన్యాసము
అమోఘమని ఆ అసురుడు తెలిసెను.

అంతకుమించిన అమోఘ శరములు
అసుర నాయకుడు వదలగ నంత
అన్ని అమ్ములను త్రుంచి లక్ష్మణుడు
అనేక శరములు వదలెను తిరిగి.

వజ్రాయుధమును పోలు శరములు
లక్ష్మణమూర్తి వదలగ నంత
వీరసింహము లంకానాథుడు
వాటిని త్రుంచెను మధ్యత్రోవలో.

రావణుడంతట విరించి ఒసగిన
దివ్యశరమును గురితో వదలెను
లక్ష్మణమూర్తికి నొసట తగిలెను
చలించిపోయెను చాపము జారెను.

నిగ్రహించుకొని రామానుజుడు
నిశిత శరము నొకదానిని వదలి
రావణాసురుని వింటిని త్రుంచెను
ఆపై వదలెను మరి మూడమ్ములు.

లక్ష్మణమూర్తి వదలిన శరములు
సూటిగతగిలి అసురయోధుడు
గజగజ వణకెను అరదముపైన
నిగ్రహించుకొనె అతికష్టముతో.

కొంతసేపటికి కోల్కొనె నసురుడు
కరములయందు చాపములేదు
రక్తసిక్తమై శరీరమున్నది
దిక్కుతెలియక తికమకపడెను.

అంతట అసురుడు బ్రహ్మ ఒసగిన
అమితశక్తిగల శక్త్యాయుధమును
అదియే శరణని ఆలోచించి
అనిలో విసరెను అతి కోపముతో.

వానర వీరులు భయమునందిరి
లక్ష్మణమూర్తి ఆయుధమును గనె
పొగ లేకుండా అగ్ని కురియుచు
శక్త్యాయుధము వచ్చుట గాంచెను.

అగ్ని హోత్రముతో సమమగు శరములు
విడచెను అపుడు సుమిత్ర సుతుడు
శక్త్యాయుధమా అమ్ముల లొంగక
తాకెను లక్ష్మణమూర్తి వక్షమును.

మంటలు మండెను వక్షస్థలము
శక్త్యాయుధపు బాధకంతట
మూర్ఛిలిపడెను లక్ష్మణమూర్తి
అంతట అసురుడు యోచన చేసెను.

లక్ష్మణమూర్తిని అపహరించుకొని
కొనిపోనెంచి తన చేతులతో
లేవనెత్తగా ప్రయత్నించెను-
అన్నిచేతులూ అలసిపోయినవి.

అసురుని ఎత్తు తెలిసెను మారుతి
అమితవేగమున అసురుని తాకెను
అతిలాఘవముగ వక్షస్థలమున
అమోఘమైన గ్రుద్దు గ్రుద్దెను.

ఆ దెబ్బకు ఆ దేవవిరోధి
గజగజ వణకి నిలబడలేక
ముందుకుతూలి నేలకూలెను
నెత్తురు గ్రక్కెను ఆ రణభూమిని.

కన్నులు, చెవులు, నాశికనుండి
రక్తము కారెను అసురేశ్వరునకు
ఒడలు తిరుగగ, అతి కష్టముతో
కూలబడెను తన అరదముపైన.

ఎటులో రథమును చేరెను కానీ
నిలుచుట కింక వశము గాకను
మూర్ఛిలిపడెను లంకేశ్వరుడు
ఆనందించిరి కపు లదిగాంచి.

సింహనాదము చేసిరి కపులు
అంతట మారుతి రామభక్తుడు
అవలీలగను లక్ష్మణు నెత్తుకు
రామభద్రుని ముందు నిలచెను.

రాముని చెంతకు చేరిన వెంటనె
శక్త్యాయుధము తొలగిపోయెను
తిరిగి రావణుని చేరె నాయుధము
లక్ష్మణమూర్తికి స్వస్థత కలిగెను.

మూర్ఛ తేరెను అసుర నాయకుడు
మహా చాపమొకదానిని గైకొని
మరల శరములు వదలుచునంత
ముంచి వేసెను ఆ రణభూమిని.

రావణు శరముల ధాటికి నపుడు
అతి బలశాలులు కపి పుంగవులు
పరుగులు తీయుట గాంచి రాముడు
ఆలసించక పోరుకు సాగెను.

వెంటనె మారుతి రాముని గాంచి
''స్వామీ! ఖగపతి హరి వాహనము
ఇప్పుడు నేను నీ వాహనము
కావున నన్ను అధిరోహించుము.''

అంజలి నొగ్గి నిలచిన హనుమను
ఆనందముతో గాంచెను రఘుపతి
అధిరోహించెను ఆంజనేయుని
అంజని నందను డెంతో పొంగెను.

ఆంజనేయుని అధిరోహించి
అనికి వచ్చెను రామచంద్రుడు
అసుర రాజగు బలిని హరిగని
అగ్రహించినటు క్రోధము నిండెను.

కోదండమును ఎత్తెను రాముడు
అల్లెత్రాటి ధ్వని మింటి కెగసెను
పిడుగులు పడినటు ధ్వని చేసినది
అంతట రాముడు పలికె నసురునితో.

''వదలను నిన్ను, కంటబడితివి
నా కప్రియములు చేసితివెన్నో
ఇంద్ర, సూర్యులను యమ, విరించిలను
హవ్య వాహనుని హరుని శరణని.

దాగిన వదలను కూల్తును నిన్ను
దిక్కుదిక్కులలొదాగిన గాని
నిన్ను వదలను-నేడు నేరుగా
అగపడినావు ఆయువు తీరును.

శక్త్యాయుధమున నీవు కొట్టిన
నా అనుజుడు నిను సబాంధవముగా
వధించి వేయును వేగమె వచ్చును
జనస్థానమును కూల్చితినేనే.''

రాముని మాటలు విని రావణుడు
క్రోధము నిండి నిశిత శరములు
హనుమంతునిపై వేయగ నంత
మరింత తేజము నిండెను మారుతి.

అసురుని శరములు హనుమకు తగిలి
నెత్తురు కారుట గాంచెను రాముడు
వీర వరేణ్యుడుఅమిత కోపమున
శరములు వదలెను అరదముపైన.

రామ బాణములు తగిలి-వెంటనే
రథచక్రములు ఊడి పడినవి
తురగము లుడిగెను సారథి ఒరిగెను
ధ్వజ పతాకలు ఛత్రము కూలెను.

రథము నందుగల ఆయుధమ్ములు
తునకలైనవి నేలనుబడెను
మేరుగిరీంద్రము పైన సురపతి
వజ్రాయుధము వేసినట్టుగా.

పిడుగులు పోలిన అమోఘశరములు
వజ్రాయుధమును పోలిన శరములు
సురవైరి యగు రావణాసురుని
వక్షస్థలమున విడచెను రాముడు.

వజ్రాయుధము తగిలినగాని
కంపించని ఆ రావణాసురుడు
రామబాణము తగిలినంతనే
వణకిపోయెను బాధనందెను.

వశము తప్పెను ధనుసు జారెను
మూర్ఛిలి పడెను లంకాధీశుడు
నేలనుబడిన అసురునిగాంచి
ధగధగలాడే శరమును తీసి

అర్ధచంద్రుని రూపముకలిగిన
అమ్మును తీసి రామచంద్రుడు
అసురుని పైన వదలగ శరము
రత్నఖచిత మకుటమ్మునుచీల్చెను.

మూర్ఛతేరెను లంకేశ్వరుడు
కిరీటమ్మది ముక్కలైనది
కళకాంతులవి మాసిపోయెను
విషము తీసిన ఫణినిపోలెను

జ్వాలలులేని అగ్నిహోత్రమన
మాసిపోయిన రవిబింబమయి
సంపద పోయిన శ్రీమంతుని వలె
నిలచిన రావణరాజును గాంచి

రాముడు పలికెను ఆ రణభూమిని
''ఓ రావణుడా! యుద్ధమునందు
భయంకరముగా పోరితివీవు
మేటి వీరులను కూల్చితివీవు.

అలసిపోతివి మూర్ఛపోతివి
ధనుసు గ్రహించే శక్తిలేదిక
నిన్నీ స్థితిలో చంపివేయుట
ధర్మయుద్ధము కాదది రావణ!

అశక్తుడవగు నిన్ను యిప్పుడే
చంపిన వచ్చును నాకపకీర్తి
ధర్మము మాత్రము తప్పను నేను
కావున శరములు వదలి చంపను.

యుద్ధమునందు దెబ్బలు తగిలి
ఎంతో బాధకు లోనైతివి నువు
అనుమతించితి యిక పో లంకకు
అలసట తీర్చుకు అజికి రమ్ము.

మేలగు రథము శరచాపములు
తీసుకు-పోరుకు వచ్చినప్పుడే
నా బలమెంతో తెలియును నీకు''
అనుచు రాముడు అసురునితో నని.

రథము విరిగెను మకుటము తెగెను
దర్పము హతమై గాయములయ్యెను
దిక్కుతోచక దశకంధరుడు
దీనముగా చనె లంకలోనికి.

అసురుడట్టుల లంకకుపోగా
రామలక్ష్మణులు-వారి యోధులకు
తగిలిన శరములు తీయించుచును
వారిబాధను తీర్చిరి అపుడు.

దేవవిరోధి రావణాసురుడు
ఓడిపోయెను దానిని గాంచి
దిక్పాలకులు సురలు మహాఋషులు
సకలజగత్తు ముదమునందెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 60 కుంభకర్ణుని నిద్ర లేపుట

రామబాణముల బాధనోర్చుకొని
హరినిగాంచి పరుగెత్తిన కరివలె
రావణాసురుడు లంకను జేరెను
దర్పము నాశనమైనదిపూర్తిగ.

గరుత్మంతునిగాంచి పరుగిడు
ఫణిమాదిరిగా లంకానాథుడు
సీతాపతిని వీరవరేణ్యుని
రామునిగాంచి భయపడివచ్చెను.

పొగలేకుండా నిప్పులుగ్రక్కుచు
దిక్కులమెరసే మెరపుతీగలై
బ్రహ్మదండమును పోలుశరములు
రామునిశరముల దిగులుపుట్టెను.

వ్యథతో కృంగెను లంకాధీశుడు
స్వర్ణమయమగు దివ్యాసనమున
మెరసే సింహాసనమున కూర్చొని
అసుర యోధులును గాంచి పలికెను.

''దేవనాథునే గెలిచిన వీరుడ
బలవిక్రమ సంపన్నుడ నేను
అట్టినన్నుఒక నరుడు జయించెను
నాతపస్సు వ్యర్థమైనది.

దేవదానవ గంధర్వులచే
యక్ష, పన్నగ పిశాచములచే
మరణములేని వరమది నాకు
బ్రహ్మదేవుడు అనుగ్రహించెను.

మనుజలచేబడి మరణములేనటు
బ్రహ్మదేవుని అడుగకపోతిని
మనుజుని వల్లనె మరణభయమని
విరించి చెప్పెను, బ్రహ్మవాక్యమది.

పూర్వము, నేను విజయయాత్రకై
సాగునప్పుడు అనరణ్యుడను
ఇక్ష్వాకు వంశపు రాజునుచంపితి
అసువులుబాయుచు రాజు పలికెనిటు-

"రాక్షసాధమా! కులాధముడవు
నా వంశములో ఉద్భవించెడి
పుణ్యమూర్తి నిను సంబాధవముగా
ససైన్యమ్ముగా చంపివేయును."

అనరణ్యుండు ఆనాడటుల
నొక్కిచెప్పెను-శాపమైనది
ఆ పుణ్యాత్ముడు ఈ రాముడని
దశరథాత్మజుడుఅని నే నమ్మెద.

పూర్వకాలమున వేదవతియను
పవిత్రమూర్తిని భంగపరచితి
తపోమూర్తి నను శపించెనప్పుడు
నా వినాశము చూచెద ననెను.

ఆ వేదవతి పవిత్రమూర్తి
సీతాదేవిగ పుట్టియుండును
హిమగిరి నెత్తెడి సమయములోన
శాంభవి నన్ను శపియించినది.

స్త్రీమూలముగా నాదు మరణమని
శంభునిరాణి శాపము నిడెను
నందిశాపము అతనినిపోలిన
వానరమూకతొ నాశనమగుట.

రంభను నాడు మోహించితిని
కామాంధుడనై బలాత్కరించగ
ఆమె భర్త ఇడె శాపమునాడు
అన్నీ ఒకటై నిలచెను నేడు.

వరుణకన్యక పుంజికస్థల
పుణ్యవతికి నే కీడుచేయగ
బ్రహ్మదేవుడే కోపమునిండి
శపించెనన్ను తప్పదు శాపము.

నాచేబాధలనందిన ఋషులు
వేదమూర్తులు నను శపియించిరి
బ్రహ్మఋషులు మరి విజితేంద్రియులు
వారి మాటలు వ్యర్థముగావు.

రాక్షసవీరులు మీరందరును
విషయము పూర్తిగ తెలిసిన మీరు
జయము లభించే యత్నమంతయు
ఆలసింపక చేయగ వలెను.

పుర ద్వారముల ముఖ్యస్థలముల
జాగరూకులై కావలి కాయుడు
దేవాదానవుల కజేయుడైన
కుంభకర్ణుడు అతిభీకరుడు.

అప్రతిహతమగు కుంభకర్ణుడు
నిద్రలొ నుండెను ఈ సమయమున
బ్రహ్మ శాపమున మహావీరుడు
ఎల్లవేళలా నిద్రలొ నుండును.

కుంభకర్ణుని లేపండింక
నేను ఇంతటి దిగులుతొ నుంటిని
వాడు చల్లగా నిద్రలొ నుండెను
కాలవశమున అతి నిద్రితుడు.

కుంభకర్ణుడు నిద్రలొ పడినచొ
ఆరు, ఏడు, మరి ఎనిమిది, తొమ్మిది
మాసమ్ములు ఇక మెళకువ లేక
హాయిగ నిద్రలొ మునుగును అతడు.

తొమ్మిది రోజుల క్రిందట మనతో
యుద్ధాలోచన సభలో నాతడు
జరగవలసినది నిర్ణయించెను
నిద్రలొ జారెను, మరి యిక లేపుడు.

నా సోదరుడు అతి బలవంతుడు
శాపము లేవీ లేవు వానికి
నర వానరులు చంపెదరన్న
భయములేదు ఆ భయంకరునకు.

రాక్షసవీరుల ప్రధాన వ్యక్తి
అసుర సేనలకు ధ్వజమును పోలును
పోరాటములో రామలక్ష్మణుల
వానరులందర నాతడు చంపును.

సుఖముగ నాతడు నిదురలొ నుండెను
రాముడు నన్ను అవమానించెను
ఈ సమయములో తమ్ముడు లేచిన
నా మదికెంతో ఊరట కలుగును.

కష్టకాలమున ఆదుకొననిచో
ఇంద్రుని గెలిచెడి వీరుడైనను
వాని శక్తితో పని ఏమున్నది?
కావున వానిని నిద్ర లేపుడు.''

ప్రభువు చెప్పినది వీరులు వినిరి
పూలదండలు సుగంధ దినుసులు
పిండి వంటలు దండిగ తీసుకు
కుంభకర్ణుని గృహమున కేగిరి.

విశాల ద్వారము అతి రమణీయము
ఒకటిన్నర గల యోజనమ్ముల
వైశాల్యముగల గృహములోనికి
అసుర వీరులు అడుగిడినారు.

రాక్షస యోధుడు కుంభకర్ణుడు
హయిగ నిద్రలొ మునిగి యుండెను
సుగంధ పరిమళ శోభల నిలయము
అసురుని గృహము అతి రమణీయము.

నిద్ర లేపగా ముందుకు పోయి
శయ్యా గృహమును చేరిరి వారు
ముందుకు నడువగ శక్యముగాక
నిలచిపోయిరి వాని శ్వాసలకు.

అతి ప్రయత్నమున రాక్షస వీరులు
అడుగిడి రెటులో శయ్యా గృహమున
గుహాకారముగ నున్న గృహమది
బంగరు, మంగళ మనోహరమ్ము.

శయనించెను అట కుంభకర్ణుడు
శయ్యమీద అతిభీకర కాయము
నేల కూలిన పర్వతమ్ము వలె
కరచరణములు చాచుకు నుండెను.

ఘనమగు మకుటము శిరమున నుండెను
బంగరునగలు మేననిండెను
నిలచియున్నవి రోమములన్నీ
మేను మరచిన నిద్రలో నుండెను.

పాతాళమువలె నోరు వున్నది
నాసిక నుండి నోటినుండి మరి
వెడలిన శ్వాసకు ఎగురుచుండిరి
మద్య మాంసముల వాసన లెగసెను.

ప్రయత్నమెంతో చేసిరి అసురులు
కుంభకర్ణుడు నిద్రలేవడు
నిద్ర లేవగనె ఆరగించుటకు
ఆహారమును ఉంచిరి అసురులు.

జింక మాంసమది మేరు గిరివలె-
ఎనుబోతు మాంసము మరియొక కొండ
అడవి పందుల మాంసము ఉన్నది
అన్నపు రాసులు ఎన్నో వున్నవి.

నెత్తురు నిండిన బానలున్నవి
మద్యము నిండిన కడవలున్నవి
చందన మెంతో అసుర వీరులు
మహాకాయమున కలది రప్పాడు.

సుమహారముల మాలలు వేసిరి
సుగంధ ధూపములేసిరి అచట
స్తోత్రము చేసిరి శంఖములూదిరి
అరచిరి చరచిరి విసిగిపోయిరి.

మహాధ్వనులు ఆ అసురులు చేసిరి
నిద్ర లేవడా మహారాక్షసుడు
దుంధుభి పణవము శంఖ ఘోషలు
దిక్కుల కెగసెను కానీ లేవడు.

మహాధ్వనులకు పక్షులు హడలి
నింగిని ఎగిరి భయము వీడక
తిరిగి నేలకు గిర్రున పడెను.
కానీ లేవడు కుంభకర్ణుడు.

గుద్దిరి చరచిరి అరచిరి కసిగా
నిద్రలేవడు పైగా నతడు
విడచెను శ్వాసలు మరింత గట్టిగ
మరి ఇంకెవ్వడు ముందు నిలచును!

అదికాదని ఆ రాక్షసవీరులు
ఇనుప గుదియల గదలకొట్టిరి
ముసలమ్ములతో ముద్గరమ్ములతొ
కొట్టిరి అలసిరి చెమటలు గ్రక్కిరి.

గిరిశిఖరములు భూరితరువులు
పెళ్లగించుకొని విసరిరి కసిగా
వాడు లేవడు- వారికి తోచదు
విడువడు రాక్షసరాజు వారిని.

పదివేల సంఖ్యలొ అసురవీరులు
భీకర శంఖము లూదిరి- అరచిరి
వారందరును పర్వతకాయులు
అయినా వారికి శక్యముగాదు.

అంతకుమించి యత్నము చేయగ
కరి తురగమ్ముల గార్ధభములను
తోలిరి- భీకర సవ్వడి చేసిరి
లంకలొ గిరులు వనములు కదలెను.

అంత జరిగినా లంక హడలినా
కుంభకర్ణుడు నిద్ర లేవడు
ఏకకాలమున భేరులు మ్రోగెను
శాపగ్రస్తునికి మెళకువ రాదు.

జుట్టుపీకిరి చెవులు కొరికిరి
సింహనాదములు చేసిరి వారు
వందల కడవల నిండిన జలము
వాని చెవులలో పోసిరి అసురులు.

అంతచేసినా నిద్రలొ నున్న
కుంభకర్ణుడు కదలడు మెదలడు
కూటముద్గరము లాయుధమ్ములతొ
తలపై బాదిరి మోదిరి కాయము.

వేయి ఏనుగులు తోలిరి అప్పుడు
త్రొక్కెను గజములు మహాకాయుని
అప్పుడు మెల్లగ తెరచెను కనులు
క్రిమికీటకములు ప్రాకినట్లయె.

గిరుల తరులతో కొట్టిన విషయము
తెలియదు-ఘనముగ ఆవులించెను
గిరి శిఖరములగు కఠిన బాహువులు
మహాసర్పముల పోలు కరములను-

మత్తు వదలుటకు విదిలించుకొని
కొండ గుహవలెనున్న నోటిని
ఆవలించుటకు తెరచెను అసురుడు
వికృతమ్ముగా వక్త్రము కనబడె.

పాతాళమువలె ఉన్నది నోరు
ఒడలు విరచుకొని వదలిన శ్వాసలు
ఝంఝామారుత మన్నటులున్నవి
అసురులకే మరి హడలు పుట్టెను.

మహామేఘమై వక్షము తోచెను
కొంగల బారులు హారములైనవి
అగ్నికణములు, గ్రహముల వలెను
అసురుని కన్నులు వెలుగుచున్నవి.

దేహము నట్టుల విదిలించుకొని
మత్తుజారిన కుంభకర్ణుడు
ఆకలి, ఆకలి అనుచు అరచెను
ఆహారమ్మును చూపిరి అసురులు.

అన్నపురాసులు మాంసపుకొండలు
అవలీలగను ఊదివేయుచు
బానలు నిండిన నెత్తురు త్రాగి
తృప్తిగ త్రేన్చెను కుంభకర్ణుడు.

అతి భీకరుడు కుంభకర్ణుడు
ఆహారము తిని తృప్తినందెనని
పూర్తిగ తెలిసి అసుర వీరులు
సాష్టాంగముగా ప్రణామమిడిరి.

వందనమిడుచు నిలచిన వీరుల
చూచెను అపుడు కుంభకర్ణుడు
నిద్రలేపిరి కారణమేమని
రాజు కుశలమును అడిగెను వారిని.

''లంకేశ్వరుడు కుశలమే కదా?
భయపడుచుండెన నా అగ్రజుడు?
శత్రులవలన భయము కలిగెను-
అందుకె నన్ను నిద్రలేపిరి.

రిపు సంహారము చేసెద నిపుడే
ఇంద్రుని కూల్చెద, అగ్నినార్పెద
భయము తీర్చెద- కావున మీరు
అసలు విషయము తెలియబరచుడు''

కుంభకర్ణుడటు వివరము లడుగగ
యూపాక్షుడను మంత్రి పలికెను
''సురలచె భయమేలేదు లంకకు-
వచ్చెను భయము మనుజుని వల్లనె.

పర్వత కాయులు వానర వీరులు
లంకాపట్నము ముట్టడించిరి
సీతాపహరణము చేసినందున
కోపించిన ఆ రాముడు వచ్చెను.

ఇంతకు ముందే ఒక వానరుడు
బలముల కూల్చి అక్షయు జంపి
లంకను కాల్చెను హడలగొట్టెను
కావున భయము నర వానరులచె

రవికాంతులతో వెలిగే రాముడు
సురలను గెల్చిన రావణ ప్రభువును
జయించినాడు ప్రభువు చచ్చెనని
తలంచి వదలెను, అన్న బ్రతికెను.''

అన్న రావణుని ఓటమి వినెను
ఆగ్రహించెను కుంభకర్ణుడు
గ్రుడ్లను త్రిప్పుచు పలికె గర్జనగ
''రిపుల కూల్చెద నిస్సంశయముగ.

రామలక్ష్మణుల కపిసేనలతో
కూల్చి తదుపరి అన్నను చూతును
వానర వీరుల రక్తమాంసముల
తృప్తిపరిచెదను అసుర వీరులను.

రామలక్ష్మణుల నెత్తురు నేను
స్వయముగ గ్రోలెద ఆనందముగా.''
ఘనముగ నరచెడి కుంభకర్ణునితొ
మహోదరుండు పలికె వినయముగ.

''అతిబలశాలీ! ముందుగ నీవు
ప్రభువు చెప్పెడి మాటలు వినుము
గుణదోషములను విమర్శించుకొని
ఆపై రిపులను జయించుమయ్యా!''

అలంకరించుకు- బడలికతీరి
బలమునిచ్చెడి మద్యమునపుడు
రెండువేల భాండమ్ములు త్రాగి
మత్తుతొ మెల్లగ ముదముగ నడచుచు.

కుంభకర్ణుడు నిద్రలేచినటు
తెలియబరచిరి- అడిగిరి రాజును
''యుద్ధభూమికే పొమ్మని అందువ?
లేదా నిన్ను చూడమందువా?''

రాక్షసయోధులు అనుసరించగా
కింకరులతొ ఆ కాలుడు కదలుట
తలపుకుతెచ్చుచు ధరణి వణకునటు
అడుగులు వేయుచు నడచెను వీరుడు.

వారితొ చెప్పెను రావణరాజు
తమ్ముని చూడగ కోరిక అనెను
ఘన మర్యాదల తన తమ్మునట
తీసుకురమ్మని ఆనతినిచ్చెను.

దేహకాంతితో రాజ వీధినే
ప్రకాశింపగ చేయుచు నడచెను.
బ్రహ్మనుచూడగ ఇంద్రుడేగినటు
రావణుచూడగ సాగెను తమ్ముడు.

ఏలికపలుకులు తెలియబరచిరి
అన్న ఆనతిని వినెను తమ్ముడు
శయ్యనుండి మరి దిగెను మెల్లగా
స్నానాదులను పూర్తిచేసుకొని

లంకవెలుపల నున్న వానరులు
రాజవీధిలో సాగుచునున్న
మహాకాయమును శత్రుభీకరుని
గాంచిరి కన్నుల- హడలిపోయిరి.

మహామేఘముల పలుకరించునటు
మహాపర్వతము నడచుట గాంచిరి
భయపడిపోయి నేలను పడిరి
కొందరు రాముని శరణువేడిరి.

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

## 61 విభీషణుడు-శ్రీరామునికి కుంభకర్ణుని వృత్తాంతము చెప్పుట

త్రివిక్రమునివలె నింగిని తాకిన
పర్వతకాయము, మెరయు కిరీటము
బంగరుసొమ్ముల వెలగెడి మేను
మెరపులు నిండిన మేఘమ్మైనది.

రాముడు అడిగెను విభీషణాఖ్యుని
''ఇంతటి భూతము నే గనలేదు
ఇంతటికాయము లేదెవ్వరికి
ఎవ్వడువీడు తెలియబరచుము.''

విభీషణాఖ్యుడు తెలిపెను వివరము
''విశ్రవసునికి తనయుడు రామా!
కుంభకర్ణుడను నామధేయుడు
ఇంద్రుని, కాలుని జయించినాడు.

అంతటిదేహము ఉన్న రాక్షసుడు
మరి ఇంకొకడు లేడు రాఘవా!
దేవదానవ గంధర్వులను
కిన్నరోరగుల జయించినాడు.

వరబలవంతులు అసురులుందురు
కానీ వీడు పుట్టిన నుండియె
బలపరాక్రమము కలిగినవాడు
వరబలముతొ మరి పనిలేదతనికి.

పుట్టిన వెంటనె కుంభకర్ణుడు
ఆకలి యనుచు ప్రాణికోటిని
అవలీలగ భక్షించుచుండగా
సురలు ఇంద్రుని శరణుజొచ్చిరి.

క్రోధమునిండి సురపతియంత
విసరెను ఘనమగు వజ్రాయుధము
దెబ్బకు కొంత చలించి- తిరిగి
సింహనాదమును చేసెనువాడు.

సింహనాదమున వణకెను ప్రాణులు
ఐరావతపు దంతము నంతట
విరచి విసరెను దేవేంద్రునిపై
దెబ్బకు ఇంద్రుడు చలించిపోయెను.

దేవఋషులును బ్రహ్మఋషులును
దుఃఖమునందిరి ఇంద్రుని గాంచి
అంతట సురపతి- సురలందరును
బ్రహ్మదేవుని ప్రార్థన జేసిరి

కుంభకర్ణుని దుర్మార్గమును
ఋష్యాశ్రమముల నాశమొనర్చుట
పరసతులను మరి అపహరించుట
విన్నవించిరి- రక్షణ కోరిరి.

కుంభకర్ణుడు తినుప్రాణులను
ఎన్నగతరమా అటులా దనుజుడు
తినుట జరిగినచొ సృష్టియందున
జీవరాసులుమిగలవు అనిరి.

విరించి చూచెను కుంభకర్ణుని
విధాత భయపడె వానిని గాంచి
''లోకవినాశము కొరకై నీవు
విశ్రవసునికి పుట్టితి వనెను.''

''ఘోర కృత్యములు చేయుచుంటివి
సహించనింక- ఇటుపై నీవు
అసువులులేని జీవి మాదిరి
అహర్నిశము నిద్రించుచుందువు.''

విధాత శాపము నిడిన వెంటనే
నిద్రించెనువాడప్పటి కప్పుడు
అంతట బ్రహ్మనుచేరి రావణుడు
ప్రార్థించెను-''ఓ వాణీనాథా!

కుంభకర్ణుడు నీ మునిమనుమడు
ఫలముల నిడెడితరువు నరికినటు
శాపము నిడితివి- కావున వీనికి
నిద్ర మెళకువుల కట్టడి చేయుము.''

భయపడుచున్నవి మన కపిసేనలు
కావున- వారితొ- అదియొక యంత్రము
అసురుడు కాడని నువ్వు చెప్పుము
అంతట వారు నమ్మెదరయ్యా!''

విరించి అపుడు శాపము మార్చెను
ఆరు మాసముల కొక్కరోజునే
మెళకువ వచ్చి- మ్రింగును నాడు
ఆపై తిరిగి నిద్రలొ మునుగును.

కపుల భయమునుతీర్చగ నపుడు
విభీషణుని ఆలోచనసరియని
యుక్తి యుక్తమని మదిలో తలచెను
నీలుని పిలచెను ఆనతి నిడెను.

మెళకువ వచ్చిన ఒకటే రోజు
తెరచిన నోటితొ ఆకలి యనుచు
కనబడు సర్వము భక్షించునయా!
అంతటివాడు కుంభకర్ణుడు.

''వానరోత్తమా! నీ సేనలతో
వ్యూహము పన్ని అన్ని తావుల
ముట్టడించుము- శిలలు తరువులు
సిద్ధపరచుకొని నిలచి యుండుడు.''

రామచంద్ర! నీ పరాక్రమము గని
భయపడిపోయెను లంకేశ్వరుడు
కుంభకర్ణుని నిద్ర లేపెను
వానరులను భక్షించునువాడు.

రామాజ్ఞను తన శిరసున దాల్చి
వ్యూహము పన్నెను నీలుడప్పుడు
హనుమ దంగద గవాక్ష శరభులు
గిరి శిఖరములతొ ద్వారము చేరిరి.

మహాపర్వతము నావరించిన
మేఘములన్నటు వానర సేనలు
గిరులు తరువులు చేత ధరించి
లంకా పట్టణ ద్వారము చేరిరి.

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

# 62 రావణుడు కుంభకర్ణుని సాయము కోరుట

వేల అసురులు వెంట నడువగా
మేనకాంతులను వెదజల్లుచును
మత్తుగ తూలుచు కదలుచుండగా
పూలజల్లు కురిపించిరి అసురులు.

సూర్యమండలము అన్నటు వెలిగే
రాజ భవనములోనికి అసురుడు
మేఘమునందుజొరబడు రవివలె
కుంభకర్ణుడు దూసుకుపోయెను.

కమలాసనమున బ్రహ్మ ఉన్నటు
సింహాసనమున ఉన్న అన్నను
ఇంద్రుడు బ్రహ్మను దర్శించినటు
దర్శించగను లోనికి పోయెను.

నడిచే అసురుని కుంభకర్ణుని
పదముల ధాటికి ధరణి వణకెను
ఎదురు వచ్చెను లంకేశ్వరుడు
కూర్చొన బెట్టెను ఆదర మొలుకగ.

కుంభకర్ణుడు వినయమునిండి
అన్న పాదముల నమస్కరించి
విషయము అడిగెను వినయమునిండి
లంక ఏలిక కౌగిలి నిడెను.

ఎఱ్ఱని కన్నుల పలికెను తమ్ముడు
"రాజా! ఎవరికి భయపడుచుంటివి?
నన్ను లేపినది ఎందుకొ తెలుపుము
అంతము చేసెద ఎవడైనాసరె"

అన్న పలికెను ధైర్యము కలిగి
"తొమ్మిది దినముల క్రిందట నీవు
నిద్రలొ జారి తెలియకుంటివి
వచ్చెను ఆపద రాముని వలనసె-

దశరథ తనయుడు వీర వరేణ్యుడు-
వానరరాజు కపి సేనలతో
కడలిని దాటెను సేతువు కట్టి
లంకను వాడు ముట్టడించెను.

కూకటి వ్రేళ్ళతొ చెట్లు కూలినటు
కూలుచుండిరి రాక్షస యోధులు
లంకలొ వనములు ఉప వనములును
వానర మూకతొ నిండిపోయెను.

రాక్షస ముఖ్యులు ఎందరొ మడసిరి
కపులు మాత్రము కూలుట లేదు
అసుర వీరులు అందరు కలిసి
ఒక్క కోతిని జయించలేదు.

ఇంతటి ఆపద- లంకకు చేటు
దాపురించినది కాపాడవలె-
నిద్ర లేపినది అందుకోసమే
అంతము చేయుము కపి వీరులను.

రాక్షస యోధులు మన్నున కలసిరి
బాలురు వృద్ధులు మిగిలి యుండిరి
నా ఆనందము అడుగంటినది
ఆదుకోయిక- కాపాడుమయా!

అన్నకోసమై ముందుకురమ్ము
లోగడ ఏమియు కోరి ఎరుగను
సురలను సైతము గెలచినవాడవు
నీదు శక్తిని చూపించుమయా!

యుద్ధకాంక్షివి బంధుప్రియుడవు
శరత్కాల మేఘమ్ములు- గాలికి
చెదరినట్టుగా పరుగిడు సేనలు-
నీ పరాక్రమము చవిచూడవలె."

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 63 కుంభకర్ణుని హితవు

దిగులు వదలిన లంకేశ్వరుడు
మదిలో కోరిక తెలియబరచగా
మందహాసముతొ వినిన తమ్ముడు
కుంభకర్ణుడు పలికెను అపుడు.

''అన్నా! ముందే యోచించితిమి
ఇట్టి ఆపద తలంచినాము
సీతను రాముని కిచ్చివేయమని
మేలుకోరియే నాడు కోరితిమి.

దుష్టకార్యములు చేసినవారు
దేహాంతమున నరకమునుందురు
సీతాపహరణము పాపకృత్యము
ప్రతిఫలమును నువు అనుభవించవలె.

రాజా! నీవు బలగర్వములతొ
సీతాదేవిని అపహరించితివి
ఆపై వచ్చెడి ఆపదలెవ్వియు
ఆలోచించక చేసితివా పని.

నీతిమంతులగు రాజులెన్నడు
ముందు కార్యము వెనుకచేయరు
వెనుక కార్యము ముందుగ చేయక
ముందుచూపుతో వ్యవహరింతురు.

నియమనిష్టతో వేదము చదువక-
చేసిన యజ్ఞము వ్యర్థమైనటు
దేశకాలముల విరుద్ధచేష్టలు
నిష్ఫలమగునుదోషము నిడును.

లంకాధీశా! బలహీనుడగు
శత్రువుతోనే పోరగవలెను
సమవిక్రమునితొ సంధి ముఖ్యము
బలవంతునికి లొంగకతప్పదు

సచివులందరితొ యోచనచేసి
పోరాటమ్మో-సంధియొ-లేక
సామంతుసగ లొంగిపోవుటో-
నిర్ణయించుకొని ఆచరించవలె.

ఉపాయమ్మును-సాధన సంపద
దేశకాలములు-విఘ్న ఘటనలు
ప్రతీకారము-మొదలగు అయిదును
యోచన చేయును నీతిమంతుడు.

మంత్రుల యోచన ముందుగ తెలిసి
హితులతొ తదుపరి యోచనచేసి
నీతివిరుద్ధము కాదాపని యని
పూర్తిగ తెలిసి ఆచరించవలె.

ప్రాతఃకాలము ధర్మము నెరప
మధ్యాహ్నమున అర్థము నెంచి
సాయం సమయము కామముకోరి
మనుగడ నేర్చిన మంచి కలుగును.

అటుగాకున్నచొ రెండు రెండుగా
ధర్మార్థములు ప్రాతఃకాలము
అర్థకామములు మధ్యాహ్నమున
కామార్థములు సాయంకాలము.

అటుగాకున్నచొ మూటిని ఒకపరి
ధర్మార్థకామములు సాయంకాలము
సేవించనగు - కానీ కామము
ఎల్లవేళలా అనర్థమగును.

ధర్మార్థకామముల శ్రేష్టము ధర్మము
దానిని వదలిన జ్ఞానము వ్యర్థము
సామదానములు భేద దండనము
తీరుగ తెలిసి ఆచరించనగు.

నీతిశాస్త్రము తెలియని మంత్రులు
పలికెడి కూతలకీడు గ్రహించి
అట్టి సచివులను రాజు గ్రహించి
మంత్రాంగమునకు దూరముంచవలె.

సచివులు - రిపులతొ చేయి కలుపుచు
మిత్రులవలె మరి నటన చేతురు
రాజు చేతనే దుష్కార్యములను
చేయించుచును ముంచివేతురు.

క్రౌంచపర్వతమునందు బిలమును
వెదకి - క్రౌంచములు గిరిని దాటును
అటులే రిపులు దుష్టమంత్రులను
వెదకి పట్టుకొని జయము నందెదరు.

అన్నా! ముందుగ విభీషణుండు
నీకు చెప్పినటు చేసియుండవలె
ఇప్పటికైనను మేలగు నాపని
కాదంటివ మరి నీ యభీష్టమే.''

కుంభకర్ణుడటు పలుకుట వినిన
లంకేశునికి క్రోధము పెరిగెను.
''సోదర! నీవుపూజ్యునివలెను
ఆచార్యునివలెబోధ చేసితివి.

నీతి పాఠములు వ్యర్థము ఇంక
సమయము నెరిగి పనిచేయవలె
అవివేకమొ మరి ఆశవల్లనో
ఏదో చేసితి - జరిగిపోయినది

జరిగిన దానిని విమర్శించుకొని
వృథాప్రయాస ఎందులకయ్యా!
గతముకు వంత తగదు తమ్ముడా!
బుద్ధిమంతులు గతము తోడరు.

నాపై నీకు ప్రీతియున్నచో
నీ బలమున మరి నమ్మకమున్నచొ
నాకు సాయపడ నిజముగ నెంచిన
నా దోషము నీ బలముతొ దిద్దుము.

ఆపదలందు అందెడి సాయము
నిజమగు సాయము తెలియుము సోదర
నీతిని కాదని సాయముచేసే
బంధువు నిజమగు బంధువు అగును.''

అన్న కటువుగ పలుకుట వినెను
తమ్ముడు తెలిసెను అన్న ఆగ్రహము
తిరిగి మృదువుగ - కుంభకర్ణుడు
లంకేశునితో పలికెను అపుడు.

''రాజా! దుఃఖము వదలి వేయుము
కోపము వదలి శాంతి వహించుము
నే బ్రతికుండగ దుఃఖము తగదు
నీ శత్రువును నాశమొనర్తును.

ఆయుధమ్మును చేతదాల్చక
బాహుబలముతో రిపుల కూల్చెద
కరములతో-నే నలుపుట మొదలిడ
బ్రతికెడివాడు ముందు నిలవడు.

సోదర ప్రేమ గౌరవమ్ములతొ
హితము చెప్పుటది నా విధి సోదర
అందుకు చెప్పితి హితునిగ నీకు
చేయవలసినది చేసి చూపెద.

శక్త్యాయుధము నిశితాస్త్రములు
గదయు ఖడ్గములు అక్కరలేదు
నా దెబ్బకు ఆ రాముడు నిలచిన
ఆపై విడుచును శరములు నాపై.

లంకాధీశా! రామలక్ష్మణుల
త్రుంచి-శిరములు నీ కర్పించెద
శిరములు చూచి సీత దుఃఖపడు
కపిసేనలను కలవరపరచెద.

నే బ్రతికుంటిని భయము వదలుము
రామలక్ష్మణ సుగ్రీవులను
ఆపై లంకను కాల్చిన కపితో
కపులను కూల్చెద యశము తెచ్చెద.

నీ సంతోషము నాకు ప్రధానము
హితులను బాసిన రాక్షస వీరులు
సంతస పడునటు రామలక్ష్మణుల
సంహరించి నే తిరిగి పోదును.

నీకాపదను కలిగించినచో
విరించి, వాసవ సురలను కూల్చెద
యముని పంపెద దీర్ఘనిద్రకు
అగ్ని దేవునే భక్షించెదను.

నన్ను చంపిన తదుపరి మాత్రమె
నిన్ను చంపునా రామచంద్రుడు
కావున నేను బ్రతికి యుండగా
నీకు రాముని భయమే లేదు.

తారల కూడిన రవి బింబమును
నేలకు రాల్చెద కడలిని త్రాగెద
గిరులను పొడిపొడి చేతును నేను
భూమిని చీల్చగ చాలుదు నేను.

నీ శత్రువుమరి ఇంద్రుడొ యముడో
నేను వానిని త్రుంచుట తథ్యము
నా యీ రూపము సింహనాదమున
అమరనాథునే హడలగొట్టెద.

ముల్లోకములు చాలవు నాకు
ఆకలి తీరగ మ్రింగెద సర్వము
నిద్రించెడి ఈ కుంభకర్ణుని
శక్తి గ్రహించును సర్వజగత్తు.

అన్నా! నీవు సుఖపడవలెను
అందుకు పోదును రాముని చంపగ
మద్యము త్రాగుచు సుఖముగ నుండుము
సీత నీకు ఇక వశమగు తప్పక.

అమిత కాలము సుఖములందుము
అమర సుఖములవి అందును నీకు''
అతి తొందరలో అందును నీకు''
అనుచు తమ్ముడు అన్నతొ పలికెను.
॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 64 మహోదరుడు కుంభకర్ణుని నిందించుట- అవివేకముతో రాజుకు యోచన చెప్పుట

కుంభకర్ణుని మాటలు వినిన
మహోదరుడను మంత్రి పలికెను
''కుంభకర్ణుడా! సత్కుల యుతుడవు
మొరటుగ నీవు పలికితి వయ్యా!

సత్కార్యములకు దుఃఖము కలిగి
దుష్కార్యములకు సత్ఫలప్రాప్తి
చూచుచుంటిమి- అందువల్లనే
పనులను బట్టి ఫలము లభించును.

వివరము తెలియక పలికితి వీవు
రాజుకునీతులు తెలియకపోవు
దేశ కాలములు తెలియును రాజు
అధిక ప్రసంగము చేసితి వీవు.

న్యాయార్జితమగు ధనము సుఖమిడు
అపహరించిన విత్తము ఏమగు?
సుఖము నొసగుట ధన స్వభావము
కావున దానిని పొందుట ముఖ్యము.

తన సామర్థ్యము-శత్రు బలమును
లంకేశునకు తెలియును పూర్తిగ
వృద్ధి క్షయముల నెఱిగినవాడు
ఆలోచించకఏపని చేయడు.

తన ఇల్లాలితొ సుఖము గలుగును
పరకాంతతొ మరి సుఖము కలుగదా?
కావున మనకు సుఖమిడు నట్టిది
ఏదో తెలిసిఆచరించనగు.

ధర్మార్థ కామములు ఫలము నిడునని
తెలిపితి వీవు వాని స్వభావము
ఎటుల తెలిసితివి ప్రమాణమేది?
సీతాపహరణము ఆపద యంటివి.

శాస్త్ర నిషిద్ధపు పనులను చేసియు
ఈ లోకముల సుఖపడుచుండిరి
కావున శాస్త్రము చెప్పిన పనులే
సుఖము లిచ్చునని చెప్పగరాదు.

సత్కార్యములు సత్ఫల మిడునని
దుష్కార్యములు దుఃఖ హేతువని
నీ ఆలోచన కావచ్చును విను-
తారుమారులు జరుగుట లేదా?

కామమ్మునకు ఫల నియమమ్ము
లేనేలేదు- ప్రతి పనికిలలో
ఒక సమయమున సుఖము కలుగును
మరో సమయమున దుఃఖము కలుగును.

జనస్థానమున చేసిన పనితో
రాముడు రాజుకు శత్రువయ్యెను
శత్రువు భార్యను సాహసమ్ముతో
ఎత్తుక వచ్చెను - దోషము లేదు.

మంత్రులమందుకు సమ్మతించితిమి
మంత్రాంగమునకు యోగ్యులమయ్యా!
ఒంటరిగా నువు పోరెదనంటివి
అమోఘ బలుడను అంటివి నీవు.

నీవు చెప్పినది సరికాదు సుమా!
జనస్థానమున బలవంతులను
వేల మంది నొక రాముడె చంపెను
వానిని ఒక్కడ వీవుజయింతువ?

జనస్థానమున ఘనకార్యముతో
అసురులు రాముని చూచి హడలిరి
వాని పేరు విని కలవర పడెదరు
తెలియక ఒకడివె పోర నెంచితివి.

కృద్ధ సింహమా రామచంద్రుడు
పడుకొని యున్న మహా సర్పము
జ్వలించునట్టి అగ్ని హోత్రము
మృత్యు దేవతను ఎదిరి పోరుటెటు?

కోపించిన ఆ రాముని గెలువగ!
అసంభవమ్మ తెలియుము నీవు!
అసుర సేనలు ఏకమైనను!
ఎదిరించుటది సందేహమ్ము.

ఒంటరిగా నువు పోరెదనంటివి
శత్రువు అల్పుడు అనుకొనునట్టి
బలహీనుడు తా నాతని నెదిరి
అసువులు సైతము కోల్పోగలడు.

ఓ ఘటకర్ణా! అసురుల యందు
మేటి వీరుడవు - కాదనలేదు
కానీ మానవులందరిలోను
రాముని మించినవాడే లేడు.

నేను చెప్పినది తెలియుము నీవు
రవివలె తేజోవంతుడు రాముడు
పరాక్రమమ్మున ఇంద్ర సమానుడు
నీ వొక్కడవే పోయి గెలుతువా?''

కుంభకర్ణునితొ అటుల పలికెను
తిరిగి రావణుని చూచి పలికెను
''రాజా! నీవు సీతను తెస్తివి
నీ ఆధీనమున ఉన్నది ఆమె.

నీవు కోరినచొ నీ వశమగును
నాకు ఇప్పుడొక యోచన వచ్చెను
నీకు చెప్పెద ఆలోచించుము''
అనుచు పలికెను మహోదరుండు.

''నేనును తమ్ముడు- కుంభకర్ణుడు
ద్విజిహ్వుడు - సంహ్రాది, వితర్దన
వీరులురాముని సంహరించుటకు
అనికి పోయినటుచాటింపించుము.

పోరుసలిపి విజయమ్ము నందిన
కావలిసినది - మరి ఇంకేమి?
కానీ అటుల జరుగకపోయిన
సరిపడు ఇప్పుడు చెప్పెడి యోచన.

అసురయోధులు రామలక్ష్మణుల
అంతము చేసిరి - అనెడి వార్తయది
అందరికీ మరి తెలియగవలెను
ఆపై సీతను ఊరడించుము.

మా దేహములను గాయము చేసుకు
రక్తసిక్తమై చేరెద మిచటకు
రామనామము చెక్కిన శరములు
మేన గుచ్చుకొని చేరెదమిటకు.

ఏకాంతముగా ఆ కాంతనుగని
మృదువచనముల ఊరడించుము
భోగభాగ్యముల ఆశచూపుము
ఆమె మనసులో చోటు చేసుకో.

రామలక్ష్మణుల భక్షించితి మని
నీతో చెప్పి పదములంటెదము
అంతట నీవు అందరి ముందు
మమ్ము పొగడుచు సత్కరించవలె.

భర్తలేదని నమ్మును కాంత
నీ ఎడ గలిగిన భయమువల్లను
నీపై మమత లేకపోయినను
మరిగతిలేక నిన్ను చేరును.

ఆనందముతో నీవున్నట్లును
అయిదుగు రసురులు-రామలక్ష్మణుల
ఆరగించిరని నగరమంతయు
చాటుము, భటులను సత్కరించుము.

పుట్టినసుండి సుఖముల నందెను
సుఖపడవలసిన జాతక మామెది
దుఃఖము వలన కృంగి కృశించెను
సుఖముల కొరకై చేరును నిన్ను.

మద్యము నిడుము తృప్తినిండుగా
నీవు గ్రోలుము సుఖముగ మధువు
పూలహారములు విలువగు వలువలు
వీరులకిమ్ము ఆనందముగా.

ఎంతో యోచనచేసిన తదుపరి
నా మదికిదియే తోచినదయ్యా!
రాముని ఎదుటకు పోవలదయ్యా!
నీవు పోరుకు పోనేవద్దు.

పోరు సలుపక సేనలు చావక
జయము లభించు మార్గము చెప్పితి
ప్రాణభయము ఇందేమియు లేదు
ఎంతోకాలము సుఖపడగలవు.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 6 5 కుంభకర్ణుడు యుద్ధమునకు పోవుట

మహోదరుని మతిలేని యోచన
కుంభకర్ణుడు వినికోపించెను
అట్టి ఉపాయము చెప్పవద్దని
మహోదరుని బెదరించె నాతడు.

అన్నను గాంచి పలికెను తిరిగి
అన్నా! నీవు దిగులు వదలుము
నీ శత్రువును సంహరించెద
నా ప్రతాపము చూపించెదను.

వాన కురవని మేఘగర్జనను
పోలునట్టుగా వీరులు పలుకరు
అవమానమ్ము సహించలేరు
తమనే తాము పొగడుకొనరయా!

ఘనకార్యములను చేసిచూపెదరు
ఓ మహోదరా! బుద్ధిహీనులు
పిరికివాండ్లును సర్వముతెలుసని
అహంకారమున పలికిన మాటలు.

నమ్మెను అన్న ఆపద కలిగెను
యుద్ధభయముతో ఇచ్చకాలతో
చచ్చుయోచనతొ ప్రగల్భాలతో
ప్రాణాంతకమగు పోరుతెచ్చిరి.

హితులు అనుచును మిమ్ముల నమ్మెను
శత్రువులై మీరందరు ఇపుడు
పైకి హితమును కనబరచుచును
క్రిందుమీదుగా చేసిరి సర్వము.

సైన్యముపోయెను ధనము హరించెను
రాజుమిగిలెను లంకమిగిలెను
దుష్టనిర్ణయము మీరు చేసిరి
దిద్దుటకొరకై పోరుకు పోదును.''

కుంభకర్ణుడటు పలుకుట వినిన
లంకేశ్వరుడు ఆనందించెను
''సోదర! నీవు రణకోవిదుడవు
మహోదరునికే రామునిభయము

యుద్ధము వద్దని చెప్పెను అతడు
రాముడన్నచో భయపడినాడు
నిన్ను పోలిన బలవంతుండు
మరియొకడెవ్వడు లేనేలేడు.

నా భయమును నువు తీర్చెద వనుకొని
నిద్రలేపితి ముందు కురుకుము
శూలమునందుకు, పాశముదాల్చిన
యమునిమాదిరిగ కపులనుకూల్చుము.

దాశరథులను ఆరగించుము
నీవుపోరెడి పనియేయుండదు
నిన్ను చూచిన గుండెలు పగులును
పారిపోవునా కోతులన్నియూ!

కుంభకర్ణుని బలవిక్రమములు
బాగుగతెలియునుకనుక చెప్పెను-
తిరిగిజన్మమును ఎత్తినట్లుగా-
ఆనందించెను రావణాసురుడు.

సంతోషముతో ఏలికయుండెను
కుంభకర్ణుడు బయలుదేరెను
రిపులకూల్చెడి శూలముగైకొని
పోరుకుసాగెను అతిబలశాలి.

ఉక్కుతొ చేసిన మహాశూలము
బంగారముతో అలంకరించిరి
ధగధగలాడుచు నున్నది శూలము
ఇంద్రుడు వదిలే పిడుగువంటిది.

వజ్రాయుధమును పోలి కఠనమై
అలంకరించిన పూలదండలతొ
నిప్పునుగ్రక్కుచు నున్నటులున్నది
మంటలపోలుచు నెత్తురున్నది.

దేవ గంధర్వ యక్ష కిన్నరుల
మహావీరులను కుంభకర్ణుడు
ఆ శూలముతో వధించినాడు
అట్టి శూలము చేతధరించెను.

''అన్నా! నేను ఒకడినె పోదును
నా సేనలను యిచటేవుంచుము
నా కోపమ్ము రూపము చూపెద
వానరవీరుల భక్షించెదను.''

అనుచుపలికిన అనుజుని గాంచి
అన్న పలికెను ''ఓ సోదరుడా!
ససైన్యముగ నువు పోవుటమంచిది
ఆయుధధారులు అనుసరింతురు.

అమిత పరాక్రమవంతులు కపులు
యుద్ధయత్నము తీరుగచేతురు
ఒంటరివానిని-ఏమరువానిని
కోరల కొరికి చంపివేతురు.

కావున నీవు అసురసేనలను
వెంటనుంచుకొని ఆజికిపోయి
రూపుమాపుము కపులందరినీ''
అనుచురావణుడు పీఠముదిగెను.

బంగరుమయమగు రత్నహారము
కుంభకర్ణుని మెడలో వేసెను
కుండలమ్ములు అంగదమ్ములు
ఉంగరమ్ములు సుమహారము లిడె.

బాహుపురులతో కుండలాలతో
అనేక స్వర్ణాభరణమ్ములతో
వ్రేల్చినయట్టి అగ్ని హోత్రమై
భాసిలెనచట కుంభకర్ణుడు.

అమృతమథనమునందు వాసుకితొ
అగపడునట్టి మందరనగమై
నల్లగమెరసే వస్త్రముతోనట
అగపడెనప్పుడు కుంభకర్ణుడు.

బంగరుకవచము బరువగునట్టిది
ధరించినాడు-ధగధగమెరసే
దివ్య కవచమది గిరులతొ కొట్టిన
పగలదు-లోనికి గాలి దూరదు.

మంటల పోలిన కవచము దాల్చి
సంధ్యామేఘము లలముకునున్న
హిమవ త్పర్వత మన్నటులుండెను
స్వర్ణాభరణము లలంకరించిరి.

చేత శూలము ఘన శరీరమున
మూడడుగులను వేయుటకొర్కై
ఎదిగిన హరివలె కనబడినాడు
అన్నను గట్టిగ కౌగిలించుకొనె.

పోరుకు సాగుచు లంకేశ్వరునికి
ప్రదక్షిణించి సాష్టాంగపడె
రావణాసురుడు ఆ సోదరునికి
ఆశీస్సుల నిడె అభిమానముగా.

మేఘగర్జనగ దుందుభినాదము
ఘనముగ మ్రోగగ ఆ ఘనకాయుడు
కుంభకర్ణుడు పోరుకు సాగెను
అమోఘరథమును అధిరోహించెను.

సింహగర్జనతొ సరిపడు నాదము
చేయుచు-సేనలు బయలుదేరెను
కరితురగములు అరదములెన్నో
కుంభకర్ణుని వెంట సాగెను.

రక్తచందనము నలదిన యట్టి
మహాకాయము-చేత శూలము
ఛత్రముక్రింద ఠీవిగనున్న
వీరునిపైన పూలు జల్లిరి.

ముసలాయుధములు గండ్రగొడ్డళులు
ఇనుప గుదియలు ఘనమగు గదలు
ఖడ్గమ్ములతో ఆయుధాలతో
అమోఘ బలురు సాగిరి వెంట.

రక్తనేత్రులు భీకరరూపులు
బలవంతులగు అసురవీరులు
కాటుకకొండల పోలెడివారు
సింహనాదముల బయలుదేరిరి.

భీకరరూపము పోరుకు సాగగ
అతి భీకరముగ మారెనప్పుడు
ఒడలు గగుర్పుకు లోనగునట్టి
మహారూపము దాల్చె నసురుడు.

బండిచక్రముల పోలిన కన్నులు
నూరు ధనువుల వెడల్పు గలిగి
ఆరు వందల ధనువుల ఎత్తుతొ
చెట్లతొ నిండిన గిరివలె తోచెను.

వెంటవున్న తనఅసురుల గాంచి
నవ్వుచు పలికెను అతిభీకరముగ
''మిడుతల కాల్చే అగ్ని హోత్రమన
కాల్చివేతునా వానరసేనను.

అడవుల తిరిగే కపులేమాత్రము
అపకారమ్ము చేయగలేరు
అలంకారముగ ఉద్యానముల
కోతులుండుట సరియగు విషయము.

కానీ ఇప్పుడు వచ్చిన కపులు
లంకాపట్నము ముట్టడించిరి
అందుకు కారణమా సోదరులు
అందుకె వారిని చంపివేసెద

వారితొ వచ్చిరి ఆ కపులందరు
వారిని వదలక భక్షించెదను.''
అనగా వినిన అసురులు ముదమున
కడలి అదరునటు గర్జన చేసిరి.

కుంభకర్ణుడటు పలికి వేగముగ
పోరాటమునకు పోవుచుండగా
అపశకునమ్ములు అగపడె నెన్నో
మేఘము నుండి కొరవులు రాలెను.

కంచరగాడిద రంగును పోలి
ఎఱ్ఱగ నగపడె మేఘములప్పుడు
సంద్రము, వనములు నిండిన భూమి
కంపించినది అశుభసూచనగ.

భయంకరముగా మంటలు గ్రక్కుచు
నక్కలు అరచెను ఆ సమయమున
బారులు కట్టి నింగిని పక్షులు
అపసవ్యముగా తిరుగజొచ్చెను.

గ్రద్దల బారులు నేల వ్రాలెను.
కుంభకర్ణుని వామ నయనము
వామ భుజమ్ము అదిరెనప్పుడు
సూర్యుని కాంతి మాసిపోయెను.

భయంకరమ్మగు అశుభ సూచనలు
లెక్కచేయక సాగెను అసురుడు
యముడే వెనుక తరుముచుండగా
ఆయువు తీరెడి ఘడియలు రావా!

వడిగా సాగి కుంభకర్ణుడు
ప్రాకారమ్మును దాటి, అచ్చట
మేఘసమూహము పోలిన కపులను
వానరసేనల గాంచె తీరుగా.

పర్వతకాయుని కపులు గాంచిరి
గాలికి చెదరే మేఘము లన్నటు
దిక్కుతోచక చెల్లాచెదరై
పరుగిడసాగిరి భయపడిపోయిరి.

తనను గాంచిన వానరసేన
హడలిపోయినటు అసురుడు తెలిసి
అమితానందము నందినవాడై
మహామేఘమన గర్జన చేసెను.

అంతటి గర్జన వినిన వానరులు
వేలకొలదిగా వానరయోధులు
మూలము నరకిన యేపె చెట్లవలె
వణికిపోయిరి నేలను బడిరి.

ప్రళయకాలమున తన కింకరులతో
దండము దాల్చిన యముని తీరుగా
శూలమునందుకు కుంభకర్ణుడు
వానరసేనల మీదకు పోయెను.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 66 కుంభకర్ణునితో కపియోధులు పోరుట

శ్రీరామునితో పోరుసలుపుటకు
కుంభకర్ణుడు సింహనాదమున
ప్రాకారమ్మును దాటివచ్చెను
చలింపజేసెను ప్రకృతినంతయు.

ఇంద్ర వరుణ, యమ, రాజులు, సైతము
వధించలేక వదలిన అసురుడు
భయంకరముగా పోరగరాగా
వానరులందరు కలవరపడిరి.

పరుగులుతీయుచున్న కపులను
నలుని, నీలుని, గవాక్షువీరుల
పిలిచి, అంగదుడుధైర్యము గొలిపెను
''అతిబలవంతులు భీరువులగుదుర?

ఉత్తమకులముల పుట్టినవారు
దైవాంశతొ జన్మించినవారు
సాధారణమగు కపులమాదిరి
పరుగులెత్తుటది ఎక్కడకయ్యా!

శూరులకెపుడును ప్రాణముకన్న
యశస్సుమిన్న పోరుకుపొందు
ప్రాణముదాచుకు ఏమిచేయుదురు?
వచ్చెడివాడు అసురుడుకాడు

కదలుచు వచ్చే ఆకారమ్ము
మనలను భయపడచేయుట కొర్కై
అసురులు తెచ్చిరి- యంత్రమువంటిది
బొమ్మ అగునది ఛిద్రము చేతము.''

అతికష్టముతో ఆ కపులందరు
అంగీకారము కనబరచుచును
అందలి తరువులు గిరులను తీసుకు
అందరొక్కటై తాకిరి అసురుని.

మత్తేభములై ఆ కపివీరులు
ఘనమగు శిలలతొ భూరితరువులతొ
కుంభకర్ణుని కొట్టిరి గాని
చలించలేదు భీకరకాయుడు.

వారు విసరిన తరువులు శిలలు
వానికి తాకి ముక్కలైనవి
వానరులను ఇక వదలకూడదని
విరుచుకుపడి ఆ కపులను చంపెను.

రక్తముకారి కపియోధులట
నేలనుబడిరి నిలబడలేక
ఎర్రనిపూవుల తరువులపోలిరి
మిగిలిన కొందరు పరుగిడసాగిరి.

ఒకరిని ఒకరు దాటుకుపోయిరి
దెబ్బలకోర్వగ శక్యముగాక
కొందరు సంద్రమునందు దూకిరి
నింగి కెగిరిరి సేతువునెక్కిరి

కొండల, కోనల పరుగులెత్తిరి
భల్లూకములు తరువుల నెక్కెను
గుహలలొదాగిరి- జలమున మునిగిరి
కూలబడిరి మరికొందరు భయమున.

మూర్ఛనందిరి కపులుకొందరు
పరుగిడు కపులనుగాంచి అంగదుడు
తిరిగి ధైర్యమును నూరిపోసెను
''నిలబడి పోరుడు, వెన్ను చూపకుడు

వీరవరేణ్యులు వినుడు తీరుగా
కుంభకర్ణుని చేబడి చావము
అగ్నిని బడిన శలభముమాదిరి
వాడొరుగును శ్రీరామునిగాంచిన.''

భయపడువానికి భువిలో బ్రతుకగ
స్థలము దొరకదని తెలియుడు మీరు
మీ పరాక్రమము అమోఘమైనది
అడ్డగించగ ఎవ్వరితరము?

వానర వీరులు అంగదుగాంచి
''ఓ యువరాజా! వాని దెబ్బలకు
నిలబడలేకనె పరుగిడుచుంటిమి
బ్రతికియుందుము ఏదోవిధముగ.''

అసువులుదాచిన లాభము ఏమి?
ఆజిలొ అసువులుబాసిన ఘనత-
ఆత్మస్తుతితో అన్ని పలికిరి
అవియన్నియును సున్నయైనవా?

వానరులటుల చెప్పుచుండగా
కనబడెనచట కుంభకర్ణుడు
వానినిగాంచి పరుగిడిపోయిరి
తిరిగి అంగదుడు ధైర్యము గొలిపెను.

అల్పాయుష్కులమైనచొ అనిలో
మడసిన కలుగును బ్రహ్మలోకము
పిరికిని- భార్యలు పరిహసింతురు
అంతకుమించిన మరణముగలదా?

అంతలోనె హనుమంతుడు వచ్చెను
వారికి తోడుగ వచ్చెను పోరుకు
వానర యోధులు ఆనందముతో
రాజు ఆనతిని పోరగనిలచిరి.

ఋషభుడు, శరభుడు, మైందద్వివిదులు
నీలుడు, తారుడు, కుముద సుషేణులు
గవాక్ష, రంభుడు పనసుడు యోధులు
ఆంజనేయుని వెంటనుండిరి.

||శ్రీ రఘురాముని||

❋❋❋

## 67 శ్రీరామ బాణములకు కుంభకర్ణుడు కూలుట

అంగదు మాటలు వినిరి వీరులు
ఆంజనేయుని అండ చూచుకొని
గిరి శిఖరములు వృక్షమ్ములతో
పరుగిడ జేసిరి కుంభకర్ణుని.

భీకర కాయుడు క్రుద్ధుడయ్యెను
గదతో కపులను కొట్టసాగెను
వందలు వేల కపి యోధులట
చల్లినట్లుగా ఒరిగిపోయిరి.

మరింత క్రుద్ధుడు అయ్యెను అసురుడు
మ్రింగగ సాగెను కపి వీరులను
గరుత్మంతుడు ఫణులను తినునటు
కపులను మ్రింగుచు తిరుగసాగెను.

ధైర్యము తెచ్చుకు వానర యోధులు
నిలచిరి గిరి శిఖరమ్ముల నందుకు
ద్వివిదుడు విసరెను ఘనమగు శిఖరము
గురితప్పి అది సేనల బడెను.

శిఖరము క్రింద అసుర సేనలు
గజతురగములు రథములు నలిగెను
తిరిగి మరియొక పర్వతమ్మును
విసరెను ద్వివిదుడు ఘటకర్ణునిపై.

ఆ శిఖరమ్మది గురి తప్పినది
సేనలపైబడి పిండి చేసెను
రక్తము పారెను, అంతట అసురులు
శరములు వదలి కూల్చిరి కపులను.

కపులు గిరులను తరులను విసరుచు
రాక్షస బలముల కూల్చసాగిరి
ఆ సమయములో ఆంజనేయుడు
అసురుని శిరమున విసరె గిరులను.

ఆంజనేయుడు తరుల గిరులను
వర్షము మాదిరి అసురుని శిరమున
కురిపించగను కుంభకర్ణుడు
శూలముతో ఖండించెను వాటిని.

శూలము నందుకు కుంభకర్ణుడు
కపిసేనలపై పడెను ఘోరముగ
అంతట మారుతి కోపముపెరిగి
విసరెనొక్క ఘన శైలము బలముగ.

కొండ తగిలెను కుంభకర్ణునకు
మెదడు పగిలి మరి నెత్తురు కారి
శరీరమంతయు తడిసిపోయెను
కలవరపడెను కుంభకర్ణుడు

కుమారస్వామి శక్త్యాయుధమున
క్రౌంచ పర్వతము ఛేదించినటు
ఘనమగు శూలము విసరె నసురుడు
ఆంజనేయుని రొమ్మున తగిలెను.

ఆంజనేయుడా దెబ్బ తగులగ
నెత్తురు గ్రక్కెను గర్జన చేసెను
ఒడలు తిరిగెడు బాధ కలిగెను
అసురులు సంతోషముతో అరచిరి.

కపులు పరుగిడజొచ్చిరి అపుడు
నీలుడు వారికి ధైర్యము జెప్పి
గిరి శిఖరము నొకదాని నందుకొని
విసరెను బలముగ అసురునిపైకి.

పిడికిటితో ఆ వచ్చెడి గిరిని
అడ్డగించెను కుంభకర్ణుడు
అంతట ఆ గిరిశిఖర మచ్చట
ముక్కలైనది అగ్ని పుట్టెను.

ఋషభుడు, శరభుడు, గంధమాదనుడు
గవాక్షుడున్ను, నీలుని అండగ
కుంభకర్ణుని ఎదిరించుచును
గిరుల, తరులను బలముగ విసరిరి.

చరచిరి, గ్రుద్దిరి, తన్నిరి, అసురుని-
మేను నిమిరిన చందముగాను
కదలక మెదలక నిలచె నసురుడు-
తిరిగి అసురుడు విజృంభించెను.

వేగవంతుడగు, ఋషభుని అదిమెను
ఆ కపి యోధుడు నెత్తురు గ్రక్కెను
పిడికిట శరభుని గ్రుద్దెను అసురుడు
నీలుని క్రుమ్మెను తన మోకాలున.

గవాక్షునంతట చేత చరచెను
గంధమాదనుని తన్నెను బలముగ
దెబ్బలు తగిలిన యోధులైదుగురు
నిలబడలేక మూర్ఛ నందిరి.

తమ నాయకులు నేల పడుటగని
దూకిరి కపులు అసురుని పైకి
అంద రొక్కటై దేహముపై బడి
కరచిరి, రక్కిరి, పీకిరి కసిగా.

గ్రుద్దిరి, పొడిచిరి, తన్నిరి వీరులు
గిరివలె నిలచెను- కదలడు మెదలడు
తిరిగి క్రుద్ధుడై కుంభకర్ణుడు
కపులను మ్రింగుట ఆరంభించెను.

గుహవలె నున్న నోటిలో విసరుచు
మ్రింగసాగెను కపి వీరులను
ముక్కునుండి మరి చెవుల వెంబడి
తిరిగి వానరులు బయట పడుట గని

కుంభకర్ణు డతి కోపముతోను
కపులను విరచి మ్రింగ సాగెను
నెత్తురు మాంసము నిండిన భూమిని
తిరుగ జొచ్చెను ప్రళయాగ్నివలె.

వజ్రాయుధముతొ సురపతి పోలి
కాలపాశమున యమునికి సరిపడి
యుద్ధ భూమిలో కుంభకర్ణుడు
సంచరించగ భయపడిపోయిరి.

అరచుచు ఏడ్చుచు వానర యోధులు
రామచంద్రుని శరణు జొచ్చిరి
వానర వీరులు వెనుకడుగిడుట
గాంచి అంగదుడు విజృంభించెను.

ఘనమగు పర్వత శిఖరము నందుకు
పరుగున తాకెను కుంభకర్ణుని
నెత్తిన పడెను ఘనమగు కొండ
మరింత కోపము నందెను అసురుడు.

మండెడి కండ్లతొ కుంభకర్ణుడు
ఘనమగు శూలము విసరె బలముగ
అది తప్పుకొని సింహనాదముతొ
వీరుడంగదుడు చరచెను ఱొమ్మున.

అమిత కోపమున వాలి కుమారుడు
అరిచి, చరచిన దెబ్బకు అసురుడు
వివశుడయ్యెను మూర్ఛ నందెను
తిరిగి తేరుకొనె ఆ బలవంతుడు.

ఆలసించక అంగదు గాంచి
కుడి పిడికిలితో గ్రుద్దు గుద్దెను
అదిరిపోయెను చేష్టలుడిగెను
నేలను బడెను కపి కుంజరుడు.

శూలము నందుకు కుంభకర్ణుడు
సుగ్రీవునిపై పడగ బోయెను
యుద్ధోత్సాహము నంది రవిసుతుడు
గంతులు వేయుచు గిరినందుకొని

రక్త మాంసముల తడసిన మేనితొ
నిలచిన అసురుని గాంచి పలికెను
''నా వీరులను భక్షించితివి
వీరులెందరినొ పడవేసితివి

అల్పు లెందరినొ కూల్చిన నీవు
అధికుడవనుచు విర్ర వీగకు
ఇదిగో ఇపుడే గిరిని విసరెద
ఓర్చుకొనుము మరి శక్తి గలిగిన.''

కుంభకర్ణుడు తిరిగి పలికెను
''ఓ వానరుడా! బ్రహ్మ మనుమడా!
ఋక్షరజునికి తనయుడ నీవు
శక్తి నెరుగుదును, అరచుట చాలు.''

ఆ మాటలకు ఉడికిపోయెను
వానర రాజు విసరెను కొండను
వక్షముపైకి విసరిన కొండ
ముక్కలు అయినది నేల పడినది.

చలించకుండా గిరివలె నిలచిన
కుంభకర్ణుని చూచిన అసురులు
సింహనాదములు చేసి మురిసిరి
క్రోధము పెరిగెను కుంభకర్ణునకు

భయంకరముగా నరచెను అసురుడు
మెరపు తీగవలె మెరిసే శూలము
గిరగిర త్రిప్పి సుగ్రీవునిపై
విసరెను బలముగ- అంతట మారుతి.

లీలగ నింగికి ఎగిరెను వీరుడు
అవలీలగ నా శూలము నందుకు
నడిమికి రెండుగ విరచి వేసెను
వానర వీరులు స్తోత్రము చేసిరి.

శూలము విరుగుట గాంచిన అసురుడు
అమిత కోపము నందినవాడై
లంకా ద్వీపము నందున వున్న
మలయ పర్వతము పెళ్ళగించెను.

పెరకిన గిరిని కుంభకర్ణుడు
వానర రాజుకు తగులగ విసరెను
దెబ్బ తగిలిన వానర రాజు
చేష్టలుడిగి- అట-నేలను బడెను.

సంతోషముతో నరచిరి అసురులు
కుంభకర్ణుడు ముందుకు సాగి
నేలను బడిన వానర రాజును
లేవనెత్తి తన భుజమున వేసుకు

పురము లోనికి పెనుగాలివలె
దూసుకుపోయెను వానర రాజుతొ
మహోన్నతమగు మేరు పర్వతము
పరుగెత్తినటు తోచెనప్పుడు.

ఇంద్ర తుల్యునే హరించ గలిగితి
రామలక్ష్మణులు- కపులిక లెక్కా-
అనుచు అసురుడు ఆనందించెను
అచ్చెరు వాయెను సురలందరికీ.

''కుంభకర్ణుడటు వానరరాజును
ఎత్తుకుపోవుట గాంచినకపులు
పరుగులెత్తిరి దిక్కు తోచక
ఆంజనేయుడది గాంచి తలంచెను

కుంభకర్ణుని చీల్చి ఇప్పుడే
వానర రాజును విడిపించినచో
వానరసేన సంతస పడును
కానీ రాజుకు అవమానమగు.

మూర్ఛ నందెను కిష్కంధాపతి
తెలియక పోయెను అసలు విషయము
తెలివి వచ్చినచొ వీర వరేణ్యుడు
ఘన సంగ్రామము చేయ సమర్థుడు.

సమయోచితముగ యోచనచేసి
మేలగు విధమును ఆచరించును
కావున ఇప్పుడు కపులందరినీ
ఊరడించుట నా కర్తవ్యము.''

అంజని నందనుడటుల తలంచి
కపులను నిలపెను ఆ రణభూమిని-
కపినాయకుని భుజమున నిడుకొని
కుంభకర్ణుడు కదలుచుండగా

ముదముగ పూవులు జల్లిరి అసురులు
సుగంధద్రవ్యము లెన్నోకలిపి
పన్నీరు చల్లిరి వర్షము మాదిరి
తేరుకొనెను ఆ-వానరరాజు.

విషయము తెలిసెను సూర్యకుమారుడు
ప్రతీకారము యోచన చేసెను
చిటికెలోన ఆ అసురవీరుని
చెవులు, ముక్కును కొరికి వేసెను.

అంతట ఆగక ఇంకా కొరికెను
కుంభకర్ణుని చెవులు తెగినవి
ముక్కముక్కలై మాంసము కనబడి
నెత్తుటి వరదతొ తడిసిపోయెను.

బాధతొ నంత కుంభకర్ణుడు
నలిపి-నేలకు విసరెను రాజును
అసురులు కొట్టిరి వానరపతిని
లక్ష్యపెట్టక ఎగిరిపోయెను.

నెత్తురు కారే కుంభకర్ణుడు
సెలయేళ్ళు పారెడి గిరివలె తోచెను
నల్లని మేన ఎఱ్ఱని నెత్తురు
సంధ్యామేఘము అన్నటులుండెను.

జారిపోయెను వానరరాజు
పరాభవించెను కిష్కింధాపతి
తలంచుకొనుచు అమిత కోపమున
తిరిగి పరుగిడె యుద్ధభూమికి.

ప్రళయాగ్నివలె విజృంభించి
వానరసేనల త్రుంచసాగెను
అంతట వానికి ఆకలి వేసెను
గుహవలెనున్న నోరు తెరచెను.

కనబడు కపులను అసుర వీరులను
వాడని వీడనితెలియకుండనే
చేతికందిన ప్రాణుల మ్రింగుచు
వందలు వేలను మ్రింగె నొక్కపరి.

నోటిలోవేసి నమలుచుండగా
రక్తమాంసములు నోట జారగా
అతిభీకరముగ అసురుడుండగా
హడలిపోయిరి ఆ కపులందరు.

పరుగులెత్తిన వానరయోధులు
రామచంద్రుని శరణు వేడిరి
అంతట లేచెను సుమిత్రసుతుడు
శత్రుహరణుడు రివ్వున లేచి

ఏడు బాణములు విడచెను సూటిగ
అంతట ఆగక లక్ష్మణమూర్తి
శరవర్షము కురిపించసాగెను
అసురుడు మాత్రము చలించలేదు.

ధరణి పగులునటు అడుగులేయుచు
రామునిపై బడవచ్చె నసురుడు-
అంతట రాముడు- రుద్రదేవతను
ఆహ్వానించి విడచె నస్త్రము

రాముడు వదలిన దివ్యశరముతో
అనేక శరములు ఉద్భవించినవి
అవి అన్నియును కుంభకర్ణుని
వక్షస్థలమున సూటిగ తగిలెను.

రామ బాణముల చలించె నసురుడు
వశము తప్పెను జారె నాయుధము
దేహమంత గాయమ్ములు నిండెను
రక్తధారలు ఎగసిన వచట.

కొంతసేపటికి తెలివివచ్చెను
చేత నాయుధము లేదని తెలిసెను
కోపోద్రిక్తుడు అయ్యె నసురుడు
అగ్నిజ్వాలలు ఎగసె నోటిలో.

అమితకోపమున వశము తప్పెను
కపి వీరులపై విరచుకుపడెను
తన్నుచు పొడచుచు నలుపుచుండెను
అసురులొ కపులో చూచుటలేదు.

అంతట అసురుడు ఘనశైలమును
గురితో విసరెను రాముని పైకి
రామచంద్రుడా గిరిశిఖరమును
ఏడు శరముల చీల్చివేసెను.

రాముని శరముల ఆ ఘనశైలము
రెండు వందల ముక్కలైనది
మండుచు రాలెడి శిలాఖండముల
రాముని శరములు దూరము విసరెను.

రామునిగాంచి పలికె లక్ష్మణుడు
''అన్నా! అసురుడు రక్తపానమున
మత్తులో నుండెను ఒడలుతెలియక
కావున కపులు చుట్టుముట్టవలె.

కపియోధులలో బలమగువీరులు
కాయముపైకి ఎక్కిత్రొక్కిన
వారల బరువును మోయగ లేక
నేలను బడును కదలడు ఇంక.''

ఆ మాటలు విని వానరయోధులు
వేలకొలదిగా గెంతిరివెంటనె
కుంభకర్ణుని మేన వ్రాలిరి
విదిలించెను ఆ కపులను లీలగ.

అంతయుగాంచెను రామచంద్రుడు
కోపమునిండిన నయనమ్ములలో
నిప్పులుకురియును అన్నటులుండి
కుంభకర్ణుని త్రుంచనెంచెను.

మహాసర్పమా అల్లెత్రాడయి
మహాధనుస్సును అందుకు నిలచెను
ధైర్యము గొలిపెను తనవీరులకు
విజయరాముడు ముందుకు సాగెను.

వానర వీరుల కబళించుచును
నోటకారిన నెత్తుట తడిసి
వింధ్య, మందర గిరులనుపోలి
ధగధగలాడు కిరీటమ్ముతో

సర్వనాశనము చేయుచునున్న
కుంభకర్ణుని గాంచెను రాముడు
ధనుసుమీటెను రామచంద్రుడు
టంకారమునకు చలించె నసురుడు.

రామునిపైబడ ముందుకువచ్చెను
గాలికివచ్చెడి మేఘమురీతిగ
తనపైదూకెడి అసురునిగాంచి
పలికెను అపుడు రామచంద్రుడు.

''రాక్షసుడా! నువు ఇంద్ర విజేతవు
తెలియును నాకు నీ విక్రమము
నేను రాముడను-నిన్ను ఇప్పుడే
అచేతనునిగా చేసివేసెద.''

తనతో పలికిన వీరపుంగవుడు
రాముడనుచును తెలిసె నసురుడు
తిరిగి పలికెను భయంకరముగా
''ఓరీ! నేను-కాను విరాధుడ.

ఖర మారీచులు కబంధుగాను
కుంభకర్ణుడను-చూడు ముద్గరము
ఈ ముద్గరమున దేవదానవుల
కూల్చితి-తెలియుము నాదగు శక్తి.

ముక్కుచెవులును పోయిన వసుచు
విక్రమమ్మున చులకన చేయకు
బాధనెరుగను చూపుము శక్తి
విక్రమమ్ముతో నిన్ను మ్రింగెద.''

మాట ముగించెను కుంభకర్ణుడు
మీదపడినవి రామ బాణములు
సప్త తాళముల చీల్చిన అమ్ము
వాలిని చంపగ చాలిన శరము

అంతటి శరములు మీదబడినను
అసురుడు మాత్రము చలించలేదు
అట్టి శరములను-నీటి బొట్లని
అడ్డగించెను ముద్గరమ్ముతో.

అంతట రాముడు వాయవ్యాస్త్రము
విడచెను అది ఆ కుంభకర్ణుని
కరమును త్రెంచెను-తెగిన బాహువది
ముద్గరమ్ముతో నేలనుబడెను.

ముద్గరమ్ముతో కలిసి కూలిన
బాహువు క్రింద ఎందరొ కపులు
నలిగిపోయిరిఅసువులు బాసిరి
గజ గజ వణకుచు నిలచిరి కొందరు.

రెండవ చేతితొ ఘన తరువును గొని
రామునిపైబడ ముందుకు రాగా
ఇంద్రాస్త్రముతో రామచంద్రుడు
త్రెంచెను కరమును, నేల బడినదది.

వృక్షముతో ఆ బాహువు పడగనె
గిరులు, తరువులు అణగిపోయెను
అసుర వీరులు అడుగునబడిరి
అనేకమంది అసువులు వీడిరి.

రెండు చేతులు ఊడిపోయినను
అరచుచు ఘనమగు నోటిని తెరచి
కుంభకర్ణుడు అతి భీకరముగ
రామునిపైబడ ముందుకు దూకెను.

సర్వము తెలిసిన రామచంద్రుడు
అర్ధచంద్ర బాణమ్ములు రెండు
ఒకే మారుగా ప్రయోగించెను
రెండు పాదములు తెగిపోయినవి.

మహాధ్వని యది ఉద్భవించినది
పర్వత గుహలలొఘన సంద్రములో
లంకలొ-అచ్చటి సేనల మధ్య
మారు మ్రోగినది ఆ ఘన శబ్దము.

కర చరణములు తెగినను గాని
తెరచిన నోటితొ అరచుచు అసురుడు
చంద్రునిపై బడు రాహువు తీరుగ
రామచంద్రుని మీదకు వచ్చెను.

రామచంద్రుడు నిశిత శరములు
బంగరు రెక్కలు కలిగిన అమ్ములు
కుంభకర్ణుని నోటి నిండుగా
విడచెను, శరములు దూరె వక్త్రమున.

నోట మాట మరి పెగలక నసురుడు.
పెద్ద కేకతో మూర్ఛిలి పడెను
అంతట రాముడు రవి కిరణమ్మన
మెరసే ఘనమగు శరమును తీసెను.

బ్రహ్మ దండమును పోలిన శరము
ఇంద్ర నిర్మిత దివ్య శరమును
వజ్రాయుధము-పిడుగుల సరియగు
అమ్మును తీసెను రామచంద్రుడు.

తిన్నగ అమ్మును కుంభకర్ణుని
కంఠముపైకి విడచెను గురితో
భగభగ మండుచు దిశలు వెలుగగ
దివ్య శరమది తగిలె కంఠమున.

వజ్రాయుధముతొ విరించి-నాడు
వధించినాడు వృత్రాసురుని
అటులే రామునిదివ్య శరమది
త్రుంచెను తలను మొండెము నుండి.

వంకర తిరిగిన కోరలతోను
తళతళ మెరసే కుండలమ్ములతొ
కుంభకర్ణుని శిరము ఎగిరెను
నింగిలోన ఆ శిరసు మెరసెను

నిశిలో నింగిని ఉదయించిన ఆ
పునర్వసు తారల రెంటి మధ్యలో
చంద్రబింబమై శిరసు తోచెను
ఎగిరిన శిరసు పడినది పురమున.

మొండెము ఎచ్చట పడునో యనుచు
పరుగిడు కపులను నేలకు త్రోసి
ఎగిరెను మొండెము కడలిలొ పడెను
చూర్ణము చేసెను జల జంతువులను.

కుంభకర్ణుడటు తెగుట గాంచిన
సురలు ముదమున పొంగిపోయిరి
నేల చలించెను గిరులు వణకెను
భూభారమది తగ్గెను కొంత.

నింగిని నిలచిన దేవ ఋషులును
మహా ఋషులును దేవగణంబులు
యక్ష గంధర్వ గుహ్యకులున్ను
ఖగపతి సంతతి వారు పొంగిరి.

రామచంద్రుని పరాక్రమము గని
ఆనందించిరి దేవతలందరు
దేవాసుర సంగ్రామము నందు
హరిని గాంచి భయమందిరి అసురులు.

అటులే రాముని గాంచిన అసురులు
భీతిలి ఏడ్చిరిదిక్కుతోచక
రాహువు వక్త్రమునుండి వెలువడు
రవివలె వెలిగెనురామచంద్రుడు.

అతి బలశాలిని కుంభకర్ణుని
రాముడు కూల్చగ కపి సమూహముల
ముఖ కమలములు మురిసి విరసినవి
పూజలు చేసిరి రామచంద్రునికి.

వృత్రాసురుని వధించి సురపతి
సంతస పడినటు రామచంద్రుడు
కుంభకర్ణుని కూల్చివేయగా
ముదమునందె రణభూమి నప్పుడు.

॥శ్రీ రఘురావ

❖❖❖

## 6 8 కుంభకర్ణుడు కూలుట విని రావణుడు దుఃఖించుట

''రాజా! రాముడు అమోఘ బలుడు
కుంభకర్ణుని త్రుంచెను శరముల
శిరము ఎగిరి మన పురమున పడినది
మొండెము పడినది సంద్రమునందు

కార్చిచ్చునకు గురియగు తరువై
చితికిపోయిన కొండ చిలువలా
వికృతమ్ముగా అగపడినాడు''
అనుచు అసురులు రాజుకు చెప్పిరి.

వార్తను వినిన లంకేశ్వరుడు
దుఃఖ సంద్రమున మునిగిపోయెను
మూర్ఛ నందెను నేలను బడెను
రావణు తనయులుతమ్ములు ఏడ్చిరి

దేవాంతకుడు నరాంతకుండు
త్రిశిరాతి కాయులు తనయులు మరియు
మహోదరుండు మహాపార్శ్వుడు
తమ్ములు మునిగిరి దుఃఖ జలధిని.

మూర్ఛతేరెను లంకేశ్వరుడు
దీనముగా విలపించసాగెను
''నన్ను వదలి నువు పోతివి సోదర!
నిన్ను తలచి నే ధైర్యము నుంటిని.

దేవదానవుల గర్వము నణచిన
నిన్ను చూచుకొని లంక ఏలితి
వజ్రాయుధమును లెక్క పెట్టని
వీరుడ! నిన్నా శరము కూల్చుట?

ఆకాశములో దేవగణములు
నీ మరణమునకు సంతసించిరి
నీవు లేవు ఇక వానరులందరు
లంకలొ జొరబడు సమయము సోదర!

సోదర! ఇంక లంక ఎందుకు?
సీత తలంపులు నాకిక ఎందుకు?
నీవులేకనే జీవించనయా!
నిన్ను చంపిన రిపుని కూల్చవలె.

రాముని కూల్చక బ్రతికియుండుట
నిరర్థకమ్ము-చావు మేలగు
సోదర! నిన్ను అనుసరింతును
నిన్ను వదలి నే మనుట జరుగదు.

నాకు ఓడిన సురలందరును
నాచే బాధలనందిన సురలు
నన్ను చూచిఇక పరిహసింతురు
తిరిగి ఇంద్రుని జయించగలనా?

మేలుకోరిన విభీషణాఖ్యుని
హితము వినినచో శుభము కలిగెడిది
ప్రహస్తుడున్ను కుంభకర్ణులు
సమసిన నుండి నిజము తెలిసెను.

ధార్మికుడైన తమ్ముని తరిమితి
దానిని మించిన పాపము లేదు''
అని విలపించెను లంకాధిపతి
దుఃఖము నిండి మూర్ఛిలె తిరిగి.

॥శ్రీ రఘురాముని॥

***

## 6 9 అంగదుడు నరాంతకుని కూల్చుట

లంకేశ్వరునకు ధైర్యము గొలుపుచు
పలికెను త్రిశిరుడు '' ఓ మహరాజా!
పినతండ్రి యగు కుంభకర్ణుడు
వీరోత్తముడు నిస్సందేహము.

శంబరాసురుని ఇంద్రుడు గూల్చెను
వరబల అసురుల శ్రీహరి రాల్చెను
ఖగపతి నాగుల చీల్చినట్లుగా
రాముని కూల్చెద నీ విట నుండుము.''

తండ్రీ! అంతటి విక్రమవంతుడు
హతుడైపోయెనుదైవ వశమున
అందులకై మరి నిన్ను బోలిన
ధీరులు ఇటుల విలపించరయా!

పునర్జన్మతా నెత్తితి ననుచు
తలచెను రాజు త్రిశిరుని పలుకుల
దేవాంత, నరాంతక అతికాయులును
ఘనముగ పలికిరి- ఆజికి నడచిరి.

త్రిభువనమ్ములను నీ వొక్కడివే
జయించగలిగిన మహా వీరుడవు
అల్పునివలె దుఃఖించుట తగదు
విరించి ఒసగెను శక్త్యాయుధము.

రావణాసురుని నల్గురు పుత్రులు
ఇంద్రతుల్య పరాక్రమ వంతులు
అజేయులందరు సురలను గెలిచిరి
వరముల నందిన అతి బలవంతులు.

శక్త్యాయుధము ధనుర్బాణములు
కవచము ఘనమగు నరదము గలవు
మేఘ ధ్వనితో-వేయి ఖరములు
పూన్చినయట్టి స్యందనమ్మది.

సూర్య తేజముతొ వెలిగెడి వారు
అట్టి తనయులతొ రాక్షసరాజు
అసురుల గర్వము నణచివేసిన
దేవేంద్రునివలె భాసిలినాడు.

నిరాయుధుడవై సురాసురులను
నాడు జయించిన మేటి యోధుడవు
నేడు గలవు దివ్యాస్త్రములెన్నో
రాముని గెలుచుట నీకొక లెక్కా

కౌగలించుకొనె ఆ వీరులను
ఆశీస్సులనిడె ప్రోత్సాహమునిడె
తనయులవెంట మహోదరుని-మరి
మహా పార్శ్వులను తమ్ముల నంపెను.

కవచధారణము చేసిరివారు
తండ్రికి భక్తిగ ప్రదక్షిణించిరి
ఆయుధ బాధ కలుగకుండునటు
ఓషధి గంధము మేన నలదిరి.

ఐరావతపు జాతి ఏనుగును
సుదర్శనమ్మును అధిరోహించిన
మహోదరుడు తన ఆయుధాలతో
అస్తగిరిని గల రవివలె తోచెను.

అరదము నెక్కిన అమోఘబలుడు
గిరి శిఖరముపై ఇంద్రధనుసుతో
తేజము నిండిన మేఘము పోలి
మూడు తలలుగల త్రిశిరుడు తోచెను.

మూడు తలలకు కిరీటమ్ములతొ
బంగరు శృంగమ్ములతో వెలిగే
హిమగిరి అన్నటు తోచెను త్రిశిరుడు
యుద్ధ చతురుడుపోరుకు సాగెను.

అతికాయుడు అతిసాహసవంతుడు
మేటి విలుకాడు-ఆయుధములతో
ఘనమగు నరదము నెక్కి సాగెను
మేరుగిరివలె తోచెను వీరుడు.

శ్వేతాశ్వమును అధిరోహించి
ఈటె ధరించిన నరాంతకుండు
శక్త్యాయుధముతొ నెమలి నెక్కిన
కుమారస్వామిని పోలియుండెను.

గదాయుధముతో మహా పార్శ్వుడు
కుబేరుని వలె అగపడెనపుడు
అమరపతితొ ఆ అమరావతిలో
బయలుదేరినటు లున్నవి సేనలు.

సూర్య తేజముతొ వెలిగే వీరులు
మకుట కుండలము లలంకారముల
నింగిని గ్రహముల పోలియుండిరి
ఆయుధములవి హంసల పోలెను.

విజయమొ లేక వీర స్వర్గమో
నిశ్చయించుకొన సాగిరి వీరులు
ధనుసులు మ్రోగెను భేరులు మ్రోచిరి
సంతోషముతో సేనలు కదిలెను.

తరులు శిలలతో నిలచిన కపులను
గాంచిరి అసురులు- అంతట కపులును
ఆయుధములతో వాహనాలపై
వచ్చెడి రాక్షస వీరులగాంచిరి.

అగ్నిహోత్రమును పోలెడి అసురుల
గాంచిన వానర వీరులందరు
తమపరాక్రమము చూపు సమయము-
అవకాశమ్మని తలచి మురిసిరి.

ఘనమగు తరువులు గిరిశిఖరముల
నింగిని నేలను నిండిరి కపులు
నేల ఈనినటు లుండిరి కపులు
ఘనసంగ్రామము మొదలుపెట్టిరి.

శరవర్షము కురిపించిరి అసురులు
శిలలు తరువులను విసరిరి కపులు
సింహనాదములు చేసిరి వీరులు
ఇరుసేనలవి పోరెను బలముగ.

పారెడి నెత్తురు-మాంసపు ముద్దలు
విరిగిన కరచరణమ్ములు తలలు
కపులావిధముగ అసురుల చంపగ
సురగంధర్వులు ఆనందించిరి.

గిరులతొ కూల్చిరి అసురవీరులను
గ్రుద్దిచంపిరి మరికొందరిని
కపుల దెబ్బలకు గ్రుడ్లు వూడినవి
అరచిరి అసురులు నేల కొరిగిరి.

అసురవీరులు కూలుట గాంచి
నరాంతకుడు కడు క్రోధము నిండి
వాయువేగముతొ సాగు తురగమున
కడలిలొ పడిన మీనము తీరుగ.

శరముల చీల్చిరి ఈటెల కూల్చిరి
శక్త్యాయుధములు విసరిరి అసురులు
కత్తులతో మరి ఖండించుచును
కపులను కూల్చిరి రాక్షసయోధులు

వానరసేనా వాహినిలో బడి
ఈటెతొపొడిచి లాఘవమ్ముగా
ఏడువందల కపివీరులను
చీల్చివేసెను రెప్పపాటులో.

కపులు విసరిన ఘనశైలములకు
గిరిశిఖరములకు అసురులు ఒరిగిరి
మహాకాయముతొ నున్న రాక్షసులు
మహాపర్వతము లన్నటు పడిరి.

తురగమునెక్కి తిరిగేవీరుని
సురగంధర్వులు చూచుచుండిరి
తిరిగి వానరులు లేవకముందే
కూల్చివేసెను కపులెందరినో.

వానరయోధులు చేతికి దొరకిన
అసురవీరులను గిర్రునత్రిప్పుచు
నేలకు బాది కూల్చివేసిరి
అటులే అసురులు కపులను కొట్టిరి.

ఎగిరే కపులను-నిలచిన కపులను
పరుగిడు కపులను వెంబడించుచు
చీల్చుచున్న ఆ నరాంతకుని గని
భయపడిపోయిరి వానర వీరులు

చిత్రచిత్రముగ వానర వీరులు
రథముల తోనే రథములకొట్టిరి
గజములతోనే గజముల బాదిరి
తురగమ్ములతో కూల్చిరి వాటిని.

కదలలేక అట నేలనుబడిరి
భయవిహ్వాలులై అరవసాగిరి
వజ్రాయుధపు వ్రేటు తగిలిన
గిరుల పోలి అట కపులు ఒరిగిరి

అటులా పోరు జరుగుచుండగా
దెబ్బల కోరిగి- అసువులుండిన
కపులలో కొందరు మూర్ఛతేరుకొని
వానర రాజును చేరిరిపరుగున

రవి వలె వెలుగుచు గుఱ్ఱము పైన
వీర విహారము చేయుచు నున్న
నరాంతకుని ఆ యుద్ధభూమిలో
సుగ్రీవుడు గని ఆగ్రహమందెను.

పరాక్రమమ్మున ఇంద్రుని పోలిన
అతి బలవంతుని అంగదు గాంచి
''వెంటనే పోయి అసురుని కూల్చుము''
అని ఆనతి నిడె కపులను కావగ.

అప్పటి కప్పుడు అంగద వీరుడు
నింగి కెగిరెను కపులలోనుండి
మేఘ సమూహము నుండి వెలువడు
మార్తాండునివలె అగపడినాడు.

రత్నఖచితమగు భుజకీర్తులతో
పర్వత మంతటి వాలి తనూజుడు
గైరిక ధాతువులున్న గిరివలె
భాసిల్లెను ఆ రణరంగమున

నఖములు, కోరలు, కరచరణముల
అసురుని కూల్చగ నెంచి అంగదుడు
ఆయుధమేదియు చేత ధరించక
నరాంతకుని ఎదిరించి పలికెను

''ఓ రాక్షసుడా! అల్పులతోనువు
పోరినఘనమగు పనికాదు సుమా!
యువరాజును నే అంగదుడనువిను
శక్తి గలిగినచొ కొట్టువక్షమున.''

అటుల పలుకుచు ఎదురునిలచెను
విశాల వక్షము చూపినిలచెను
ఆ కపియోధుని గాంచిన అసురుడు
పళ్ళతొ పెదవిని నొక్కిపట్టెను.

మహాసర్పము బుసలు విడచినటు
శ్వాస లెగయగ అమిత కోపమున
బలముగ విసరెను ఘనమగు ఈటెను
సూటిగ వక్షము మీదకు విసరెను.

వజ్రతుల్యమగు వక్షమ్మునకు
తగిలిన ఈటె ముక్కలైనది
ఖగపతి కొరికిన ఫణివలె తెగిన
శూలము గాంచి మురిసె నంగదుడు.

అంగదుడంతట అతి లాఘవముగ
నరాంతకుని తురగమ్ము శిరమున
చరచెను- గుఱ్ఱపు కళ్ళు వూడెను
దౌడలు పగిలి నాలిక చాచెను.

నేల కూలిన హయమును గాంచి
ఆవేశముతో క్రోధవశుడయి
బలముగ నంగదు శిరస్సుపైన
పిడికిట గ్రుద్దెను నరాంతకుండు.

అంగదు శిరస్సు చిట్లినదపుడు
వేడినెత్తురు ఎగజిమ్మినది
మూర్ఛపోయెను వాలి కుమారుడు
తిరిగి తేరుకొని అతి శీఘ్రముగా.

అంగదు దెబ్బకు ఆ నరాంతకుని
వక్షస్థలము ముక్కలైనది
అగ్నిజ్వాలవలె నెత్తురు పారెను
గిరివలె కూలెను యుద్ధభూమిలో.

అసురుని బలమును చవిచూచిన ఆ
అంగదుడెంతో ఆశ్చర్యపడి
వజ్రము పోలు పిడికిటితోను
అసురుని వక్షము నందు పొడిచెను.

వజ్రాయుధపు దెబ్బకు పడిన
పర్వతమ్మువలె అసురుడు కూలగ
ఆనందించిరి వానరయోధులు
దేవగణములు పరవశించిరి.

ఎదిరించుటకు అసాధ్యుడైన
అసురునికూల్చి పోరగనిలచిన
అంగదుగాంచి రామచంద్రుడు
ఆనందించెను మదిలో పొంగెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 70 త్రిశిర, మహోదర, దేవాంతక, మహాపార్శ్వాలు కూలిపోవుట

నరాంతకుడు ఆ రణరంగమున
అంగదుచేత వధింపబడుటను
దేవాంతకుడు త్రిశిరి మహోదర
వీరులుగాంచి దుఃఖమునందిరి.

త్రిశిరుడు ఒడుపుగ ఆ ఘనతరువును
శరముల త్రుంచెను- దానినిగాంచి
నింగికెగిరెను అంగదుడపుడు
తరువులవాన కురిపించెనట.

గజముతొ సాగెను మహోదరుండు
ఇను పగుదియతో దేవాంతకుడు
రథమునెక్కి ఆ త్రిశిరుడు సాగి
తాకిరి అంగదు నందరొక్కపరి.

వచ్చెడి తరువుల నన్నిటి నొడుపుగ
త్రుంచెను త్రిశిరుడునిశితశరముల
దేవాంతకుడు ఇనుప గుదియతో
తరువులు చీల్చగ నారంభించెను.

అసురులగాంచిన అంగదుడపుడు
భూరితరువు నొకదానిని పెరకి
పూచిన ఘనమగు తరువు నంతట
దేవాంతకునిపై విసరె బలముగ.

శరములువదలి త్రిశిరుడంతట
వీరుడంగదుని అడ్డగించెను
తోమరమ్ముతో మహోదరుండు
వక్షస్థలమున కొట్టె నంగదుని.

ఇనుపగుదియతో అదే అదనని
దేవాంతకుడు వచ్చెను పోరుకు
అటులాముగ్గురు ఒకపరి పోరగ
జంకక నిలచెను వాలికుమారుడు.

అంగదుడంతట ఒక్క ఎగురుతో
ఏనుగు శిరమున చరచెను చేతితో
కరి చక్షువులు వూడిపడినవి
భీకరమ్ముగా అరచెను ఏనుగు.

కరిదంతములను విరచి అంగదుడు
చరచెనొక్కటి- దెబ్బకు అసురుడు
వశముదప్పెను రక్తము క్రక్కెను
గాలికిపడిన మ్రానైకూలెను.

కొంత సేపటికి దేవాంతకుడు
మూర్ఛతేరెను- ఇనుపగుదియతో
కొట్టెనంగదుని కపికిశోరము
నేలను బడెను వశముదప్పెను.

మెల్లగతేరుకు నిలచెనంగదుడు
అటుల లేచెడి అంగదుగాంచి
త్రిశిరుడు విడచెను-వాడిశరములు
ముగ్గురొక్కటై ముట్టడించిరి.

విషయము తెలిసిన ఆంజనేయుడు
నీలుడు- అండగవచ్చిచేరిరి
ఘనశిఖరము నొకదానిని పెరకి
త్రిశిరునిపైన విసరెనునీలుడు.

త్రిశిరుడు, శరములత్రుంచె శిఖరమును
దానినిగాంచి ఆనందముతో
దేవాంతకుడు ఇనుపగుదియతో
ఎదిరించెను ఆ వాయునందనుని.

తననేకొట్టగ ముందుకువచ్చిన
దేవాంతకుని తలపై మారుతి
వజ్రమువంటి ముష్టితొ కొట్టెను
ముక్కలైనది అసురుని శిరసు.

పళ్ళూకళ్ళూ వెలికి వచ్చినవి
నాలుక ముందుకు తోసుకువచ్చి
అతిభీకరముగ అరచిఅసురుడు
అహవభూమిని నేలకొరిగెను.

అంతట త్రిశిరుడు కృద్ధుడాయెను
నిశిత శరములు నీలునిపైకి
విడచుచుండెను అదేఅదనుగా
మహోదరుండు ముందుకురికెను.

వక్షస్థలమున తగిలి అమ్ములు
బాధించగను నీలుడంతట
శరశర్షమునకు అచేతనుండయి
నిలచిపోయెను దిక్కుతోచక.

తిరిగి నీలుడు తేరుకునిలచి
గిరిశిఖరములు భూరితరువులు
శిరమున విసరెను- ఆదెబ్బలకు
మహోదరుండునేల కొరిగెను.

పినతండ్రి యగు మహోదరుండు
మరణించుటగని త్రిశిరుడంతట
క్రోధమునిండి నిశితశరములు
నీల, హనుమల పైన విడచెను.

ఆవేశముతో ఆంజనేయుడు
ఘనశైలమును పెరికి విసరగా
త్రిశిరుడు శరముల దానిని చీల్చెను
మారుతి తరువులు విసరసాగెను.

తరువుల నొడుపుగ శరముల త్రుంచి
సింహనాదమును త్రిశిరుడు చేయగ
కపికిశోరుడు వానరయోధుడు
ఆంజేయుడు ఆగ్రహించెను.

వీరాంజనేయుడు పైకి ఎగిరెను
హరితన గోళ్ళతొ కరిని చీల్చినటు
త్రిశిరుని హయముల చీల్చివేసెను
అసురుడు బుసలనువిడచె క్రోధమున.

కాళరాత్రియను ఆయుధమ్ముతో
కాలుడుసాగుట తలపించుచును
అతిబలమైన శక్త్యాయుధము
హనుమంతునిపై విడచె త్రిశిరుడు.

అతినేర్పుగను ఆంజనేయుడు
ఘనమగు ఆయుధ మతి తేలికగా
ఆకాశములో ఒడుపుగపట్టి
అవలీలగను విరచివేసెను.

శక్త్యాయుధమును విరచి మారుతి
సింహనాదమును చేసెను తిరిగి
దానినిగాంచి వానర యోధులు
ముదముగ గర్జన చేసిరి అచట.

అంతట త్రిశిరుడు నిశిత ఖడ్గమున
ఆంజనేయుని వక్షముపైన
బలముగ కొట్టగ కత్తివ్రేటుకు
కృద్ధుడయ్యెను వాయునందనుడు.

అతిలాఘవముగ అంజని తనయుడు
త్రిశిరుని వక్షముపైన చరచెను
అసురుడు చేష్టలు తప్పినవాడై
ఖడ్గము జారి నేలను బడెను.

వీరుడు మారుతి త్రిశిరుని ఖడ్గము
గైకొని-చేసెను సింహనాదము
అదిరిపోయిరి రాక్షసులందరు
అంతట లేచెను వీరుడు త్రిశిరుడు.

తన పిడికిటతో త్రిశిరుడంతట
పొడిచెను హనుమను-అంతట మారుతి
త్రిశిరుని శిరమును ఒడుపుగబట్టి
ఖండించెను ఆ కరవాలముతో.

త్వష్టతనయుడగు విశ్వరూపుని
శిరము- ఇంద్రుడు ఖండించినటు
మకుటకుండల కాంతుల మెరిసే
త్రిశిరుని శిరమును త్రుంచెను హనుమ.

సురపతి నెదిరిన త్రిశిరుని అటుల
అతిబలవంతుడు ఆంజనేయుడు
రణమున కూల్చగ- ఆ కపి యోధులు
ఆనందముతో గెంతిరి- అరచిరి.

త్రిశిర మహోదర దేవాంతకులు
నరాంతకుడును మడయుట గాంచి
మహాపార్శ్వుడు క్రోధము నిండి
ఘనమగు గదతో ముందుకు దూకెను.

మాంసఖండములు మిగిలియున్నవి
రక్త లేపనము ఆరనిదాగద
పూలమాలలు అలంకరించిన
ఆ గద నందుకు అసురుడు వచ్చెను.

ఆ గదతోనే సురలెందరినో
మర్దించెను ఆ మహాపార్శ్వుడు
ఐరావతము మహాపద్మము
సార్వభౌమము అనెడి గజములు-

ఆ గద గాంచి భయపడిపోయెను
మహాపార్శ్వుడా గదను గైకొని
ప్రళయాగ్నివలె భయంకరమ్ముగ
వానరవీరుల మీదకు దూకెను.

అసురుని గాంచి ఋషభుడు ఎగిరి
ముందు నిలచెను- అంతట అసురుడు
గిరివలెనున్న వృషభుని తాకి
వక్షస్థలమున కొట్టెను గదతో.

గదాప్రహారము గాయపరచెను
రక్తము కారెను ఋషభుడంతట
మూర్ఛపోయెను వశముదప్పెను
కొంత సేపటికి లేచెను వీరుడు.

అమితకోపమున ఋషభుడు ఎగిరి
మహాపార్శ్వుని కరముననున్న
ఘనమగు గదను లాగివైచెను
ఆ గదతోనే అసురుని కొట్టెను.

గదతో ఋషభుడు అసురుని కొట్టెను
చక్షువులూడెను దంతములూడెను
వజ్రాయుధపు దెబ్బకు గిరివలె
అసురుడు కూలి అసువులు వీడెను.

రావణు తమ్ముడు మహాపార్శ్వుడు
రణమున కూలుట గాంచిన దనుజులు
మహాసముద్రము వంటి అసురులు
పరుగిడిపోయిరి కడలిపొంగువలె.

॥శ్రీ రఘురాముని॥

## 71 లక్ష్మణుడు అతికాయుని కూల్చుట

తన సోదరులు పినతండ్రులును
మహారణమున కూలుట గాంచిన
'అతికాయుడు' మది క్రోధము నిండి
పోరగ నడచెను సమరభూమికి.

సురల గర్వమును దించివేసిన
పర్వతకాయుడు ఆ అతికాయుడు
బ్రహ్మదేవుని అనుగ్రహమున
అనేక వరములు పొందిన యోధుడు.

వేయి సూర్యులై తేజమునింపే
ఘనమగు నరదము నధిరోహించెను
మకుటకుండలము లమరియుండగా
పేరు చెప్పుకొని ధనుసు మీటుచూ

సింహనాదమున దిక్కులవియగా
వానర సేనతొ పోరగవచ్చెను
టంకారధ్వని- అతని స్వరూపము
గాంచి వానరులు కలత చెందిరి.

కుంభకర్ణుడే బ్రతికివచ్చెనా
అన్నటులున్న అతికాయుని గని
త్రివిక్రమునిగా ఎదిగిన హరివలె
ముందు నిలచిన దనుజునిగాంచి

వానరవీరులు భయపడిపోయిరి
ఒకరిని ఒకరు పట్టుకు నిలచిరి
కలవరపడిరి లక్ష్మణు దాటుకు
నేరుగ రాముని శరణు కోరిరి.

లయకాలములో మేఘము తీరుగ
గర్జన చేయుచు రథమున వచ్చెడి
దనుజుని గాంచెను రామచంద్రుడు
కపుల భయమును తెలిసెను రఘుపతి.

ధైర్యము గొలిపెనురామచంద్రుడు
చెంతనె వున్న విభీషణుని గని
వివరములడిగెను '' ఓ! విభీషణా!
వచ్చెడి యోధుడు ఎవ్వడొ తెలుపుము.

విశాలమైన స్యందనమ్మున
వేయి గుఱ్ఱముల అరదము పైన
ధనుర్ధారియై కేసరి చూపుల
పర్వత మంతటి దేహము కలిగి

భూత గణముతో తేజరిల్లెడి
రుద్రుని పోలి వచ్చెడి వాడు
మెరసే శరములు- తోమరమ్ములు
మెరపులు నిండిన మేఘము పోలి

నాలిక చాచిన మృత్యు దేవతగ
శక్త్యాయుధముతొ రథమున నుండెను
ధనుసులు, శరములు, అల్లె త్రాళ్ళతో
బంగరు పూతతొ రథము ఉన్నది.

ఆకాశములో ఇంద్ర ధనుసులా
అరదముపైన భాసిల్లుచును
వ్యాఘ్రము మాదిరి రథముననున్న
అసురుడు ఎవ్వడొ తెలుపుము నాకు.

శరములు రవికిరణమ్ముల పోలెను
రథ ధ్వజముపై రాహు గ్రహముతొ
మూడు వంకరలు కలిగిన విల్లు
మేఘ గర్జన కలుగును మ్రోచిన.

ఘన కరవాలములున్నవి రథమున
అమ్ములపొదులు అమర్చియున్నవి
మృత్యువు వంటి పెద్ద నోటితో
ఎఱ్ఱని మాలలు మేన ధరించి.

మేఘము చాటున సూర్యుని మాదిరి
తేజము నింపుచు హిమవన్నగమై
ఎత్తగు భుజము భుజకీర్తులతో
శోభించెడి ఆ వీరుడెవ్వడు?

ఓ విభీషణా! కుండలమ్ములతో
మంగళకరముగ కనపడు వీరుడు
పునర్వసు తారల నడుమనయున్న
చంద్రుని మాదిరి శోభిలుచుండెను.''

తేజోవంతుడు రామచంద్రుడు
అడిగిన వెంటనె విభీషణుండు
''రామా! వాడు రావణు తనయుడు
రణమున తండ్రికి సరిపడు వీరుడు

అస్త్రవేత్తలలొ శ్రేష్ఠుడు వాడు
పెద్దల సేవలు చేసినవాడు
వేదవిదుడును మహారథుండు
విలువిద్యలొ వాడారి తేరెను.

ఖడ్గ పాశములు నేర్పుగ త్రిప్పును
చతురోపాయము లెరిగిన వాడు
ధ్యాన్యమాలిని వానికి జనని
అతి కాయుడని వాని నందురు.

అతికాయుడు తన బాహుబలముతో
లంకలొ భయమే లేనటు చేసెను
తపమొనరించి బ్రహ్మవల్లను
అనేక అస్త్రము లందిన ఘనుడు.

సురాసురులచే మరణ భయమది
కలుగ కుండగ దివ్యకవచము-
అమోఘ రథము బ్రహ్మ ఇచ్చెను
సుర గంధర్వుల గెలచెను వరుసగ.

శరములు వదలి వజ్రాయుధమును
కదలక నిలపెను శక్తిమంతుడు
వరుణ దేవుని పాశాయుధమును
త్రెంచిన రాక్షస శ్రేష్ఠుడు రామా!

రామా! నీవు తగు ప్రయత్నము
చేయగవలెను లేనిచొ అతడు
అవలీలగ మన వానర సేనను
అంతము చేయును ఆలసింపక.''

విభీషణుండటు చెప్పుచుండగా
ధనుసు మీటుచు సింహనాదమున
అతికాయుడు అటపోరుకురికెను
వానర వీరులు తలపడినారు.

మైంద ద్వివిదులు కుముదుడు నీలుడు
శరభుడు- అందరు ఒకే సమయమున
ఎదిరించిరి ఆ అతికాయునట
గిరుల తరువులను విసరిరి బలముగ.

శరముల వాటిని ఛిద్రము చేసి
ఉక్కు బాణములు విడచె నసురుడు
శరవర్షమునకు అవయవములు తెగి
పోరగలేక కలవర మందిరి.

సింహము-వనమున జీవులన్నిటిని
కలవర పరచుట తలపించునటు
వీర సింహము ఆ అతికాయుడు
వానర వీరుల నడలగొట్టెను.

వానర సేనావాహిని నడుమ
వింటితొ శరములు విడువక నిలచిన
వీరుని రాముని గాంచిన అసురుడు
విజయ గర్వమున పలికె నప్పుడు.

''ధనుర్బాణముల నిలచితి నేను
అసమర్థులతో పోరను నేను
ఆజిని నిలబడ శక్తి గలిగిన
అడ్డగించుడు నన్నీ రణమున.''

అతికాయుని ఆ సవాలు వినిన
లక్ష్మణమూర్తి ఉడికిపోయెను
విసురుగ నడచి అసురవీరుని
ముందు నిలచెను మందహాసమున.

దిక్కులవియగా రామానుజుడు
దివ్యచాపమును మ్రోగించగను
అసురులందరూ కలవరపడిరి
అతికాయుడును అదిరిపోయెను.

క్రోధవశుడయి అసురవీరుడు
నిశిత శరమును కరమున దాల్చి
''ఓ లక్ష్మణుడా! నాతో తలపడ
ప్రాయము-శక్తి-లేనివాడవు.

హిమగిరి ఆగదు నా శరములకు
ధరణి నిలువదు నా అమ్ములకు
నిదురలోనున్న కాలాగ్నిని నువు
మేలుకొలుపకు-పొమ్మిక నీవు.

పరాక్రమమ్మును తెలియగ చాలవు
వివేక మెరుగవు-చిన్నవాడవు
అసువులు నిలువగ మరలుట మేలు
లేదా యమసదనమ్ము చూపెద.

అమ్ములు చూడుము-రిపుల కూల్చితిని
సింహము ఏనుగు రక్తము గ్రోలును
అటులే నేనీ నిశిత శరముల
నీ నెత్తురును పీల్చివేసెద.''

అటుల పలికిన అసురుని గాంచి
లక్ష్మణమూర్తి పలికెను తిరిగి
''దురాత్ముడా! నువు పొగడుకొంటివి
అధికుడవగుదువ? ఆత్మప్రశంసతో.

పరాక్రమమ్ము చూపిన ఘనత
వీరుడవనుకొని పొగడుకోకయా!
పసివాడనని పలికితి వీవు
ప్రాణము తీసెడి యముడను నేను.

రథము, ఆయుధములున్నవి నీకు
శక్తి కలిగిన ఎదిరిపోరుము
బాలుడైన శ్రీవిష్ణువు జగమును
ఆక్రమించెను త్రివిక్రమునిగా.

తొడిమనుండి మరి రాలిన యట్టి
తాటిపండువలె నీ శిరస్సును
బంగరు శరమున రాల్చెద నేను
చీల్చెద నిన్ను నా అమ్ములతో.''

కోపము నిండి ఆ అతికాయుడు
ఉత్తమ శరమును వింటికి కూర్చెను
భూతగణములు సురగంధర్వులు
పోరుచూడగా చేరిరి నింగిని.

వింటికి కూర్చిన అమోఘ శరము
నింగి పగులునటు శబ్దము చేయుచు
వచ్చెను- దానిని లక్ష్మణమూర్తి
దివ్యశరమున త్రుంచివేసెను

అతికాయుడు అతికోపమునందెను
అయిదు శరములు వదలె వేగముగ
రామానుజుడా శరముల త్రుంచి
విడచెను మండెడి శరము నప్పుడు.

లక్ష్మణమూర్తి వదలిన శరము
లలాటమ్మున తగిలె నసురునకు
నెత్తుట తడిసి దివ్యశరమది
గుహను వదలిన ఫణి యనిపించెను.

సుమిత్రసుతుని శరము తగులగ
కంపించెను ఆ అతికాయుండు
కొంతసేపటికి తెప్పరిల్లెను
వీరుని గాంచి, పలికెనప్పుడు.

''లక్ష్మణా! నువు అతినేర్పుగను
శరము వదలితివి- రిపునినైనను
మెచ్చుకొంటిని'' అనుచు అసురుడు
చిత్రచిత్రముగ రథము త్రిప్పుచు

ఒక బాణమును ముందుగ విడచి
ఆపై మూడు మరి ఒక ఐదు
దానికి వెనుక ఏడమ్ములను
గురితో లక్ష్మణుపైన విడచెను.

రామానుజుడా వచ్చెడి శరముల
త్రుంచెను మధ్యలో తన శరములతో
సురపతి నెదిరిన అమ్ములు కూలగ
కుపితుడయ్యెను ఆ అతికాయుడు.

అంతట అసురుడు అమోఘ శరమును
విడచెను లక్ష్మణమూర్తికి తగులగ
అమిత వేగమున బాణము వచ్చి
వక్షస్థలమున తాకెను బలముగ.

రక్తము కారెను లక్ష్మణమూర్తికి
అంతట వీరుడు అతిసమర్థుడు
అతికాయుని ఆ బలమగు అమ్మును
వక్షమునుండి పెరకివేసెను.

లక్ష్మణమూర్తి క్రోధమునిండి
అగ్నిదేవతను అభిమంత్రించి
విడచెను శరమును- మంటలు గ్రక్కుచు
సాగెను శరము అసురునిపైబడ.

దానినిగాంచి అతికాయుండు
సూర్యాస్త్రమును, తిరిగివదలెను
ఆగ్నేయాస్త్రము సూర్యాస్త్రములు
పోరసాగినవి అతిభీకరముగ.

మహాసర్పములు పోరుచున్నటు
మంటలుమండుచు పోరెను శరములు
శక్తిగలిగిన దివ్యాస్త్రములు
కాల్చుకొన్నవి భస్మమైనవి.

అతికాయుండతి క్రోధమునిండి
ఐషీకమ్మును వదలగనంతట
ఐంద్రాస్త్రముతో లక్ష్మణమూర్తి
కూల్చివేసెను దివ్యాస్త్రమును.

యమాస్త్రమ్మును వదలె నసురుడు
వాయవ్యాస్త్రము విడచె లక్ష్మణుడు
అంతట ఆగక సుమిత్రసుతుడు
శరవర్షము కురిపించెనప్పుడు.

లక్ష్మణు శరములు తగిలెనుగాని
వరకవచమగు వజ్రకవచము
ధరించియుండగ దానికి తగిలి
ములుకులువిరిగి శరములు రాలెను.

ఎన్నిబాణములు తగిలినగాని
చలించకుండా నిలచె నసురుడు
అభేద్యమైన వరకవచమ్ము
రక్షగ నిలచెనుఅతికాయునకు.

వాయుదేవుడు అంతయుగాంచి
లక్ష్మణమూర్తితొ పలికెనప్పుడు
"అభేద్యమైన కవచము లక్ష్మణ!
బ్రహ్మాస్త్రమునకు చీలును వినుము."

వాయుదేవునికి భక్తిగమ్రొక్కి
బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి
లక్ష్మణమూర్తి విడచెను ఘనముగ
నింగీ నేలా కంపించినవి.

దివ్యమైన బ్రహ్మాస్త్రమువదలగ
గ్రహములు దిక్కులుచలించెనొకపరి
భగభగ మంటల- కాలునిపోలి
వచ్చెడి అస్త్రము గాంచెనసురుడు.

నిశితశరములు అసంఖ్యాకముగ
అతికాయుండు విడచె నప్పుడు
వాటినికూల్చి బ్రహ్మాస్త్రమ్ము
ముందుకుసాగగ అసురవీరుడు.

అతినిర్భయముగ శక్త్యాయుధముతొ
శూలాయుధము- అష్టి ఆయుధము
గదలు, మొదలగు ఆయుధములతో
ఎదిరి కొట్టెను బ్రహ్మాస్త్రమును.

మంటలమండుచు బ్రహ్మాస్త్రమ్ము
ఆయుధమ్ములను లెక్కించకను
మకుటకుండలము లమరినయట్టి
అతికాయుని తల త్రుంచివేసెను.

హిమగిరి శిఖరము అన్నటులున్న
అతికాయుని తల నేలబడినది
ఆభరణమ్ములు చెదరిపోయెను
అసురులందరు భీతిలిపోయిరి.

వానర వీరులు కొట్టెడిదెబ్బలు
భరించలేక ఏడ్చుచు అసురులు
పరుగులెత్తిరి లంకచేరగా
తరిమిరి వానరవీరులు వారిని

అభేద్యమైన కవచముగలిగిన
అతికాయుని తల లక్ష్మణమూర్తి
త్రుంచివేయగా కపులు ముదమున
కీర్తించిరట రామానుజుని.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 72 రావణాసురుని ఆవేదన

అమితవిక్రముడు లక్ష్మణమూర్తి
ఆ అతికాయుని కూల్చిన సంగతి
అసురనాయకుడు విని భీతిల్లెను
అంతట వీరుల చూచి పలికెను.

దివ్యశరములతొ నా కుమారుడు
బంధించెను ఆ రామలక్ష్మణుల
వ్యర్థముగాని బాణములవ్వి
వరముగ పొందిన నారాచములు.

''మహావీరులు-రణకోవిదులు
ధూమ్రాక్షుడును అకంపనుండు
ప్రహస్తుడున్ను కుంభకర్ణుడు
యుద్ధభూమిలో నేలకొరిగిరి.

ఆ శరబంధము తప్పించుకొన
సురాసురులకు శక్యముగాదు
ఆ సోదరులు విముక్తినందిరి
మాయో-మంత్రమొ- ఔషధబలమో!

అపజయమెరుగని ఎంతో సేన
అంతమొందెను రణరంగమున
అస్త్రశస్త్రముల నెరిగినయోధులు
అసువులుబాసిరి రాముని శరముల.

అసురయోధులను వానరవీరులు
అవలీలగను చంపివేసిరి
రామలక్ష్మణ, సుగ్రీవ, విభీషణ
వీరుల గెలిచే వాడేలేడు.

ఘనకార్యములను అవలీలగను
చేయగలడు ఆ రాముడు-వీరుడు
ప్రతిభావంతులు వీరులెందరినొ
రణమునకూల్చెను అలుపులేకనే.

ఎంతటివీరుడు ఆ రఘురాముడు!
ఎదిరిన వీరులు అంద రొరిగిరి
ఎటుచూచినను దశరథరాముడు
నారాయణుడని తోచుచున్నది.

రామ భయమున లంకలొ వారు
తలుపులు మూసుకు దిగులుతొ నుండిరి
రాక్షసులారా! మీరందరును
ఏమరుపాటు లేక వుండుడు.

స్వకీయ రక్షణ చేసుకొనుచును
లంక రక్షణ శ్రద్ధగ చేయుడు
ఆజ్ఞ లేకను అశోక వనికి
ఎవ్వరినీ మీరనుమతించకుడు.

సేనల నిలయములన్నీ చక్కగ
పరిశీలించుకు రక్షణ చేయుడు
దిక్కు దిక్కులలొ స్వయముగ తిరుగుచు
లంక రక్షణము చేయుడు శ్రద్ధగ.

అహర్నిశము ఆ వానర వీరుల
యత్నములన్నియు గ్రహించవలెను
కపులు తక్కువని తలంచవద్దు
వారి రాకడ తెలియుడు తెలివిగ.''

ఏలిక ఆనతి శిరసున దాల్చి
రక్షణ పెంచగ సాగిరి వీరులు
దుఃఖ సంద్రమున మునిగిన రాజు
అంతఃపురమున అడుగు బెట్టెను.

క్రోధాగ్ని యది జ్వలించుచున్నది
ఆపై తనయులు కూలుట జరిగెను
మనసు వశమును తప్పెను రాజుకు
మదిలో ఎంతో కలత చెందెను.

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 7 3 ఇంద్రజిత్తుతో యుద్ధము

అతికాయుండే కూలె ననుకొని
దుఃఖితుడైన లంకేశ్వరునకు
అతనితోబాటు తనయులు-తమ్ములు
అసువులు బాయుట తెలిసెను అపుడు.

దిక్కుతోచక దుఃఖము నున్న
తండ్రిని గాంచెను ఇంద్ర విజేత
ఇంద్రజిత్తు లంకేశుని తనయుడు
వీరోచితముగ ధైర్యము గొలిపెను.

''తండ్రీ! నీవు చింత వదలుము
ఇంద్రజిత్తు జీవించి యుండగా
దుఃఖించుటది తగదిక నీకు
అసురులందరకు నాథుడు వీవు.

ఇంద్రజిత్తు బాణమ్ములు తగిలి
బ్రతికి యుండుట అసంభవమ్ము
నీ ముందరనే ఆ సోదరులను
నా శరములతో చీల్చివేతును.

నా భుజబలముతొ దైవ బలముతో
ప్రతిన చేసి-నే పలుకుచుంటిని
అమోఘ శరముల, రామ లక్ష్మణుల,
భయము తీర్తు నీ లంకాపురికి.

పూర్వము బలి ఒనరించిన క్రతువున
హరి చూపెను తన విక్రమమ్మును
అటులే సురపతి, విష్ణువు, వరుణుడు
సురలు చూతురు నా ప్రతాపము.

సుర్య చంద్రులు అగ్నిహోత్రుడు
కాలుడు, అశ్వని దేవతలున్నూ
సిద్ధ సాధ్యులు ఇంతని చెప్పగ
సాధ్యము కాని ప్రతిభను చూపెద.''

తండ్రికి ధైర్యము చెప్పి కదలెను
వాయు వేగమున పోగల తేరు
సూర్యుని రథమును పోలు నరదము
కంచర గాడిదలున్న స్యందనము.

ముందు నిలచిన రథము నెక్కెను
వివిధాయుధముల వీరులు సాగిరి
శంఖము లూదిరి భేరులు మ్రోచిరి
స్తోత్ర పాఠములు చదివిరి అసురులు.

చంద్రుని పోలు శ్వేత ఛత్రము-
క్రింద కూర్చొనినఇంద్రజిత్తుతో
నింగిగ తోచి- దివ్య రథమున
పూర్ణచంద్రుడా వీరుడాయెను.

బంగరు పిడుల చామరమ్ములతో
వీచిరి- అపుడుఆ రణధీరుడు
మాయ రథముగా చేయగతేరును
దివ్య హోమముచేయగ తలచెను.

అరదము చుట్టు కావలి యుంచెను
శాస్త్రోక్తముగా మంత్ర పూతముగ
ముందుగ అగ్నికి పూజను చేసి
హోమము చేయుట ఆరంభించెను.

సంస్కరించిన హవిస్సుతోను
లాజలతోను హోమము చేసెను
ఎఱ్ఱని వలువతొ నల్లని తెడ్డుతొ
అగ్నిలొ హోమము చేయసాగెను.

దర్భలవోలె ఆయుధాలను
తోమరమ్ములను చుట్టూ పరచెను
సమిధల కలిపి నల్లని మేకను
ఆహుతి చేసెను- జ్వాల లేచెను.

జయ సూచనగా జ్వాల లేచెను
ఇంద్రజిత్తు అట ప్రదక్షిణించగ
స్వయముగ అనలుడు పైకి వచ్చెను
హవిస్సునందుకు తృప్తినందెను.

ఇంద్రజిత్తు అట నిష్ఠగ కూర్చుని
బ్రహ్మాస్త్ర మంత్రము జపియించుకొని
రథమును- తనను ఆయుధాలను
మంత్రించుకొని రక్షణ పొందెను.

ఆవిధముగను రావణుతనయుడు
హోమముచేసి బ్రహ్మాస్త్రమును
జపియించగను గ్రహములు, నింగియు
తారలన్నియు చలించిపోయెను.

అగ్నిని పోలిన తేజోవంతుడు
రావణుతనయుడు వరబలయుతుడు
అరదముతోను అంతర్హితుడై
నింగికెగిరెను సేనలు నడిచెను.

నింగిని నిలచిన రావణుతనయుడు
తనసేనలకు ధైర్యముగొలిపెను
వానరవీరుల త్రుంచగ చెప్పెను
రాక్షస సేనావాహిని కదలెను.

గదలు పరిఘలతో అసురులుకొట్టిరి
నింగినుండి మరి శరములుకురిసెను
కపియోధులు ఆ దెబ్బలకోర్చి
తిరిగికొట్టిరి తరుల గిరులతో.

ఇంద్రజిత్తును అందుకొనుటకై
నింగికెగిరిరి కొందరు వీరులు
వారలనచటే శరములు విడచి
నేలకురాల్చెను రావణుతనయుడు.

ఒక్కొక అమ్ముతో అయిదులు పదులు
వానరయోధుల ఛేదించగను
రాక్షసవీరులు సంతసపడిరి
కలవరపడిరి కపులందరును.

ఆవేశముతో శిలలను తరులను
విసరిరి వానరయోధులు తిరిగి
వాటినుండి తనసేనకు రక్షణ
శరములతో కల్పించెను అసురుడు.

అంతట అసురుడు కణికుశరములు
పదునెనిమిది సంధించివిడువగా
ఆ శరములకు గంధమాదనుడు
మూర్ఛపోయెను దిక్కుతెలియక.

తొమ్మిదిశరములు నలునిమీదను
ఏడుశరములు మైందునిమీద
అయిదు బాణములు గజునిమీదను
పదిబాణములతొ జాంబవంతుని

ముప్పదిశరముల నీలునికొట్టి
నిశితశరములు ఎన్నోవదలి
వానరరాజును ఋషభుఅంగదుల
ద్వివిదుల మూర్ఛిలజేసెను అపుడు.

వందలు వేల శరములు వదలి
వానరవీరుల గాయపరచెను
మేటివీరులను గాయపరచెను
ఆనందించెను రావణు తనయుడు.

కంటికి కనబడడా మాయావి
నిశిత శరములు తగులుచుండెను
క్రింద అసురులు పొడుచుచుండిరి
తెగిపడుచుండిరి వానర వీరులు.

ఖడ్గ ముద్గరము శూలములున్ను
గండ్రగొడ్డళులు-వర్షముమాదిరి
మీదపడగను వాటి తాకిడికి
తెగిపడిపోయెను వానరసేనలు.

వికృతమైన శరీరములతో
భీతిలి అరుచుచు నేలనుకూలుచు
నింగిని చూడగ నిశితశరములు
కండ్లలొ పడగ చక్షువులూడెను.

వానర వీరులనటు బాధించి
రామలక్ష్మణులపై గురిచేసి
శరములువదలగ ఆ సోదరులు
చలించకుండా నిలచిరి అపుడు.

అంతట రాముడు తమ్మునితోననె
"బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి
శరములు వదలుచు పోరుసలిపెను
మనపై నిపుడు దాడి మొదలిడె.

బ్రహ్మ వరమున తేజోవంతుడు
అదృశ్యమయి మరి పోరుచుండెను
బ్రహ్మాస్త్రమును వదలుచుండెను
సమయము గాదిది ఎదిరించుటకు.

సృష్టికర్తవగు అస్త్రములివ్వి
మహిమాన్వితమగు అస్త్రము సోదర!
శరముల బాధను ఓర్చుకోవలె
మనమిపుడేమియు చేయగరాదు.

అమోఘ శరముల వానర సేనను
పడగొట్టెను ఆ వీరవరేణ్యుడు
మనమిపు డిచట మూర్ఛ నందినచొ
తలచును తనను అతి సమర్థునిగ.

విజయము తనను వరించెననుకొని
ఆనందముగా లంకకు పోవును"
అనుచు యుక్తిగా రామ లక్ష్మణులు
మూర్ఛ నందిరి యుద్ధభూమిలో.

రామ లక్ష్మణులు నేల పడుట గని
సింహనాదమును చేసెను గట్టిగ
ఆనందముతో రావణు తనయుడు
లంకా నగరము లోనికి బోయెను.

॥శ్రీ రఘురాముని॥

## 74 హనుమంతుడు ఓషధిపర్వతము తెచ్చుట

రామలక్ష్మణులు వానరయోధులు
మూర్ఛనందిరి ఆ రణభూమిని
సుగ్రీవుడు, నీలుడు, జాంబవంతుడు
అంగదుడున్ను తెలివి దప్పిరి.

బుద్ధిమంతుడగు విభీషణుండు
అంతయుగాంచి సమరభూమిలో
కొన వూపిరితోనున్న కపులకు
ధైర్యము గొలిపెను ఈ విధముగను :

"భయపడవలదు విషయము వినుడు
బ్రహ్మదేవుని గౌరవించుటకు
బ్రహ్మాస్త్రమునకు రామలక్ష్మణులు
బంధింపబడి మూర్ఛిలిపడిరి."

బ్రహ్మాస్త్రమును గౌరవించిన
మారుతి పలికెనువిభీషణునితో
"గాయమ్ములతో కొనవూపిరితో
బ్రతికిన వీరుల స్థితిని తెలియవలె

స్వయముగ తిరిగిఈ రణభూమిని
యోధులందరిని ఊరడించెదము''
అంతట వీరులు వారిద్దరును
కాగడాలతో కదలిరి మెల్లగ.

తోకలు తెగిన చేతులు తెగిన
కంఠములెన్నో తెగిన వీరులు
నెత్తురు కారుచు నేలను పొర్లుచు
మరణ బాధలోనున్న యోధులను.

ఆయుధాలును, శిలలు, తరులతో
దెబ్బతగిలి అట స్పృహలేనట్టి
సుగ్రీవాంగద, నీల, శరభులను
గంధమాదన, గవాక్షులను మరి

సుషేణు వీరుని మైంద ద్వివిదుల
పనసుని నలుని జ్యోతిర్ముఖుని
వేగదర్శియగు ఆహూకుని అట
ఎంతోమందిని చూచిరి వారు.

అరువది ఏడు కోట్ల వీరులను
పడగొట్టెను ఆ రావణు తనయుడు
అంతు తెలియకపోయిన దపుడు
అంతమందిని అసురుడు కూల్చెను.

స్పృహతప్పిన ఆ వీరవరులలో
జాంబవంతునికొరకై వెదకిరి
అంతట శరములు తగిలిన యట్టి
ఆరిపోయెడి అగ్నిని పోలి

నేలనుబడిన జాంబవంతుని
జ్ఞానవృద్ధుని, వయోవృద్ధుని
బ్రహ్మకుమారుని, భల్లూకేశుని
విభీషణుండు గుర్తుపట్టెను.

విభీషణాఖ్యుడు అడిగెను అపుడు
''పూజ్యుడవీవు జాంబవంతుడా!
నీ ప్రాణములు నిలచియున్నవా?''
అనగా పలికెనుజాంబవంతుడు!

''నీ కంఠము విని విభీషణునిగా
గుర్తించితిని అసురకులోత్తమ!
శరములు తగిలి బాధలొ నుంటిని
కంటిని తెరవగ వశపడకున్నది.

ఓ విభీషణా! దగ్గర రమ్ము
మదిలో దిగులు తీర్చుము నీవు
అంజనమ్మ ఆనందవర్ధనుడు
ఆంజనేయుడు కుశలమేగదా!''

అంతట అడిగెను విభీషణుండు
''అయ్యా! నీవు రామలక్ష్మణుల
వానరరాజుల కుశల మడుగక
అడిగితి విపుడు హనుమ క్షేమము.

అంతమందిని వదలి నీ విపుడు
ఆంజనేయుని కుశల మడిగితివి
ఆ మహనీయులపైన నీకు మరి
అభిమానమ్ములేదా ఏమి?''

ఆమాటలకు జాంబవంతుడు
హీనస్వరముతొ పలికెనప్పుడు
''ఓ విభీషణా! వాయునందనుని
కుశలమడుగుటకు హేతువుగలదు.

ఆంజనేయుడు ఒక్కడున్నచో
అందరమింకను బ్రతికియున్నటే
అంజని నందను డిక లేడన్నచొ
అందరుండియు ఆఖరయినటే.

వేగమునందు వాయువు సముడు
పరాక్రమమున అగ్నికి సముడు
ఆతడుఅసువుల నిలపియున్నచో
అందరి అసువుల నాతడు నిలపును.''

ఆ మాటలకు ఆంజనేయుడు
పులకరించెను- ఆనందముతో
జాంబవంతుని పాదమ్ములకు
సజలనయనముల ప్రణామమిడెను.

ఆంజనేయుని కంఠధ్వని విని
శరఘాతముచే బాధయున్నను
పునర్జన్మము ఎత్తినట్లుగా
తలంచెనపుడు జాంబవంతుడు.

తనకు దగ్గఱగ హనుమనుపిలచి
పలికెనప్పుడు జాంబవంతుడు
''నాయనహనుమ! మనవీరులను
కాపాడవలె సమర్థుడవు నువు.

అందరి అసువులు ఉన్నవి నీపై
అప్పుడవీవు ఆదుకోవయా!
అదనువచ్చె- నీ విక్రమమ్మున
అందరమిపుడు కోలుకొందుము.

రామలక్ష్మణుల మిగిలినవీరుల
గాయమ్ములను నయము చేయవలె
ఇపుడే నీవు జలధిని దాటి
ఘనకార్యమ్మును చేయగవలెను.

హిమగిరి ప్రాంతమునందున ఎత్తగు
వృషభమనియెడి కాంచన శిఖరము
కైలాసమ్మను మరియొక శిఖరము
రెండువెలసినవి- వాటికి నడుమ

ఓషధి పర్వతమున్నది వెలుగుచు
కాంతులీనెడి గిరిపై హనుమా!
నాలుగు ఓషధులున్నవి వినుమా
నిరతము వెలుగును ఆ ఓషధులు.

సంజీవకరణి ప్రాణముపోయును
విశల్యకరణితొ వ్రణములుపోవును
సౌవర్ణకరణితొ తొలగుగాయములు
సంధానకరణి- తెగినచొ కలుపును.

ఓ హనుమంతా! వేగమెపోయి
ఆ ఓషధులను తీసుకువచ్చిన
జీవించెదరు మృతవానరులు
గాయమ్ములవి నయమైపోవును.''

వెంటనె హనుమ వందనమనుచు
త్రికూట శిఖరము పైకి ఎగిరెను
మరియొక గిరివలె ఎదిగెను మారుతి
పదఘట్టన కా శైలము కృంగెను.

చిందరవందర శిఖరములైనవి
తరువులు ఎగిరి నేల కూలినవి
ఎండినచెట్లు మండిపోయినవి
గజగజ వణకెను పర్వతరాజము.

ఆంజనేయుని పదఘట్టనకు
పుడమివణకగా లంకాపురమున
ప్రాకారములు గోపురమ్ములు
కూలగ- లంక డోలలూగెను.

ఆంజనేయుని పదముల పోటుకు
సంద్రము భూమి వణకిన వపుడు
త్రికూటగిరిపై నిలచినమారుతి
మలయపర్వతముపైకి ఎగిరెను.

మేరు మందర నగముల సరియగు
మలయపర్వతము వృక్షసంపదతొ
వివిధ మృగములు సెలయేరులతో
లతలతొ శోభగ నిలచియున్నది.

ఎత్తు అరువదియోజనమ్ములై
నిలచెను ఆగిరి నింగి తాకునటు
గిరిపైనున్న యక్షకిన్నెర
గంధర్వులును భయపడునట్లుగ

ఆంజనేయుడా మలయశిఖరమున
పెంచెనుకాయుము కార్యోన్ముఖుడై
అసురుల గుండెలు అవిసిపోవగా
భీకరగర్జన చేసెనొక్కపరి.

గర్జన లంకలొ ప్రతిధ్వనించెను
హడలిపోయిరి రాక్షసయోధులు
దిక్కుతెలియకపోయిరి కొందరు
నిశ్చేష్టులయి నిలచి పోయిరి.

భీమబలుడు శ్రీ ఆంజనేయుడు
మదిలో వందనమిడెను ప్రభువుకు
రామచంద్రుని పాదపద్మములు
తలచి వందనముచేసి నిలచెను.

సర్పమువంటి వాలమునెత్తెను
పాదములను ముకుళించి వంగెను
గుహవలె నోటిని తెరచి ఎగిరెను
రామబాణమై నింగి కెగిరెను.

తొడలవేగము బాహువేగముల
కదలి ఎగిరినవి గిరిపై తరువులు
కొంతసాగి అట కడలిని పడినవి
గిరిపై కోతులు ఎగిరె నొక్కపరి.

చేతులు చాచి ఖగపతి యంతటి
విక్రమమ్ముతో వాయునందనుడు
ఉత్తరదిశగా హిమగిరిత్రోవలొ
సాగెను నింగిని అవలీలగను.

కడలిలో ఎగిరిన జల జంతువులు
గిర్రున తిరిగెను గాలి విసురుకు
అటులవి తిరుగగ శ్రీహరి వదలిన
చక్రము అన్నటు తోచెను మారుతి.

శ్రమ నెరుగని ఆ పవనకుమారుడు
గిరులు వనములు జలాశయములను
పట్టణాలను చూచుచు సాగెను
దిక్కులవిసెను హిమగిరి కనపడె.

సెలయేరులతో తరుల గిరులతో
తెల్లని మేఘములున్న గుహలతో
శోభగ నిలచిన హిమవన్నగమును
చేరెను మారుతి శోధన చేయగ.

ఉన్నత శృంగములున్న నగమున
దేవఋషులును పుణ్యమూర్తులు
వశించి యుండెడి దివ్యాశ్రమములు
చూచెను పావని పరవశించెను.

బ్రహ్మకోశమును, కైలాసమును
ఇంద్రుని ఆశ్రమ స్థావరమ్మును
రుద్రుడు ముదముగ శరములు వదలే
దివ్యస్థలమును చూచెను మారుతి.

హయగ్రీవుని క్షేత్రము గాంచెను
బ్రహ్మకపాలము గాంచె నచ్చట
యమ కింకరుల విశ్రమస్థలము
హిమగిరినందు గాంచెను మారుతి.

వజ్రాయుధమును వాసవునకును
విరించి ఇచ్చినస్థలమును చూచెను
కుబేర స్థానము- సూర్యదేవుని
స్థానములచ్చట గాంచెను పావని.

బ్రహ్మాసనస్థానమ్మును చూచెను
శివధనుః స్థానమ్మును చూచెను
భూమినుండి మరి పాతాళమునకు
చేర్చెడి బిలమును గాంచెను మారుతి.

కైలాస ఋషభ గిరుల నచ్చట
మారుతి గాంచెను ఆనందముగ
వాటి మధ్యలో దివ్య కాంతితో
ఓషధి గిరియది వెలుగుచున్నది.

ఓషధి పర్వతమట కనుపించగ
అగ్ని జ్వాలవలె ధగధగ మెరిసే
గిరిని గాంచిన పవననందనుడు
ఆశ్చర్యము ఆనందము లందెను.

జాంబవంతుడు తెలియబరచిన
ఓషధులను గన ఆంజనేయుడు
వేల యోజనములున్న శైలమును
వెదుక సాగెను నిశితమ్ముగను.

మారుతి- తమను గొనిపోవునని
తెలిసిన ఓషధులన్నియు నపుడు
అంతర్థానము అయిపోయినవి
హనుమకు క్రోధము ఎగసె నొక్కపరి.

నిప్పులు రాలే కన్నులతోను
అరచెను హనుమ శైలమ్మును గని
''ఓషధి పర్వతరాజమ! నీవు
రామునిపైన దయ చూపించక

ఓషధులను నువు దాచి వుంచిన
మొత్తము గిరినే కదలించెదను
పొడిపొడి చేతునునా భుజబలమున
రామ బంటుననితెలియుము నీవు''

అనుచు పలుకుచు ఆంజనేయుడు
అవలీలగనా గిరిని ఎత్తెను
ఎత్తిన గిరిని చేత బట్టుకొని
నింగి కెగిరెను రాముని చేరగ.

ఖగపతి, వాయు సమాన బలుడగు
హనుమ–చేతిలో ఓషధి గిరితో
సాగుట గాంచి సురగంధర్వులు
స్తోత్రము చేసిరి పరవశించిరి.

రవికాంతులతో వెలిగే గిరితో
రవి దగ్గఱగా నింగిని సాగే
ఆంజనేయుడా సమయములోన
నింగిని రెండవ రవిగాతోచెను.

వేయి అంచులతొ అగ్ని జ్వాలలతొ
వెలుగులు చిమ్మే చక్రాయుధమును
చేత ధరించిన చక్రపాణియగు
విష్ణుమూర్తివలె తోచెను మారుతి

ఓషధి గిరితో వాయు నందనుని
కపులు చూచిరి పరవశించిరి
ఓషధి వాసన సోకినంతనే
బ్రతికిరి కపులు అరచిరి ముదముగ.

వారి అరుపులకు ఆనందించి
తిరిగి మారుతి గర్జన చేసెను
అంతటి అరపులు వినిన అసురులు
అరచిరి వెర్రిగ వళ్ళు తెలియక.

వాయు నందనుడు ఓషధి గిరితో
త్రికూట చలమున సేనల మధ్యలో
దిగుచు పెద్దలకు వందన మిడెను
కపి యోధులు ఆనందము నందిరి.

పెద్దలందరకు శిరస్సువంచి
వందనమిడి ఆశీస్సుల నంది
విభీషణాఖ్యుని కౌగిలించుకొన
పరవశించిరి రామభక్తులు.

ఓషధి గంధము నాఘ్రాణించిన
రామ లక్ష్మణులు ఆరోగ్యముతో
గాయములన్ని మాయము కాగా
ముదముగ లేచిరి, కపులు బ్రతికిరి.

యుద్ధారంభము నుండి రావణుడు
ఆజిని సమసినఅసురులందరిని
సంద్రమునందు పడవేయమని
ఆనతి నిడెను భయము బాపుటకు.

రావణు నానతినందిన భృత్యులు
చచ్చిన అసురుల నందరనపుడు
కడలిలొ వేసిరి వారందరినీ
జలచరములు భక్షించివేసెను.

ఓషధిగంధము ఆ సంజీవిని
వచ్చినగాని బ్రతికివచ్చుటకు
చచ్చిన అసురులు లేకపోయిరి
బ్రతకని కపిఅట లేనేలేడు

వాయునందనుడు అతి భక్తిగను
ఓషధిగిరిని హిమగిరిపైన
భద్రపరచి తా తిరిగి వచ్చెను
రామ పాదముల చెంత నిలచెను.
॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 7 5 కుంభకర్ణుని తనయులు కుంభ, నికుంభులు పోరుకు వచ్చుట

సూర్యకుమారుడు శ్రీరామునితో
కార్యాలోచనచేసి-మారుతితొ
పలికెను అపుడు '' ఓ హనుమంతా!
లంకేశ్వరుడిక హతాశుడగును

తనయులు తమ్ములు కూలిపోయిరి
దుఃఖభారమున రాజు కృంగెను
ఇదే అదనుగా మన యోధులతో
లంకాపట్నము ముట్టడించుము.

సుగ్రీవాజ్ఞను తలను ధరించి
కాగడాలను చేత ధరించి
నాలుగు దిక్కుల క్రమ్ముకొనుచును
కపులు లంకను ముట్టడించిరి.

పరుగులెత్తిరి అసురులు భయముతొ
అంతట కపులు ముందుకు సాగి
ప్రాకారములు బురుజులు కూల్చిరి
చిన్న గృహములను దగ్ధము చేసిరి.

గృహముల కాల్చెను అగ్నిహోత్రుడు
అగరు చందనము పరిమళించెను
ఆభరణమ్ములు కరిగి పారెను
ఆయుధాలవి భస్మమైనవి.

విలువగు వలువలు రూపుమాసెను
నిద్రలొ మునిగినవారు అరచిరి
మత్తు వదలి మరి పరుగిడ సాగిరి
పసిపిల్లలతో పరుగిడి పోయిరి.

బీభత్సముగా అరపులు కేకలు
ఆక్రందనలు లంకావాసులు
చేయుచుండగా అదే ఆజ్యమై
అగ్ని హోత్రుడు నింగి కెగసెను.

అలంకారముల మేటి గృహములవి-
లంకానగరపు శోభ తెలుపునవి-
సిరి నిండిన ఆ గృహ సముదాయము
మెరపుల తీరుగ నున్నవి కాలెను.

వజ్రాయుధపు పాటుకు గిరులు
చెదిరిపోవుట తలపించుచును
పేలిపోయినవి లంకలో గృహములు
పెద్ద శబ్దములు నింగి కెగసెను.

ఆభరణమ్ములువిసరి పరుగిడి
ఆలుబిడ్డలనువదలి పరుగిడి
ఆక్రందనలతొ పరుగిడ లేక
భీతిలి అరచిరి అసురులందరు.

గజతురగములను వదలివేసిరి
ప్రళయకాలమున సంభ్రమునందు
దిక్కుతెలియక తిరుగుజీవులన
పరుగిడసాగెను గజ తురగములు.

వీణావేణు మృదంగ నాదములు
సుందర వదనల అందెల రవళులు
చక్రవాకములు నెమళుల రవములు
నిండిన గృహములు భస్మమైనవి.

రామచంద్రుడా సమయములోన
వింటినారితో సవ్వడి చేసెను
రుద్రదేవుని వేద నాదముగ
టంకారధ్వని ఎగసెను నింగికి.

వింటిసవ్వడి వినిరి అసురులు
గజగజ వణకిరి-వ్యాకులపడిరి
వారి అరపులు ఆక్రందనలు
వినబడకుండా పోయిన వపుడు.

రామచంద్రుడొక నిశిత శరమున
కైలాసగిరి శిఖరము పోలిన
లంకాపట్టణ ద్వారము కూల్చెను
వరుసగ అమ్ములు విడువ సాగెను.

ఆనతిమీరిన మరణదండనే
అను ఆనతి సుగ్రీవుడిచ్చెను
అది విని కపులు ముందుకు నడచిరి
అసురభూపతికి కోపము పెరిగెను.

గృహములనుండి అసురులు అరచుచు
పోరుకువచ్చుచు నుండగ నపుడు
ప్రళయకాలమున కాళరాత్రివలె
తోచెనప్పుడా రాత్రి-లంకలో.

పండ్లు పటపట కొరికెను రాజు
సింహనాదము చేయగ నంత
దిక్కులవిసెను-వెంటనెరాజు
ప్రళయరుద్రుడై నిలబడినాడు.

కుంభ నికుంభులు అనెడి వీరులు
కుంభకర్ణుని తనయులువారు
వానరవీరుల నెదిరి పోరగా
వారికి ఆజ్ఞలనిచ్చెను అపుడు.

శోణితాక్ష, ప్రజంఘ, కంపనుడు
యూపాక్షుడును వారితొ కలిసిరి
రాజు ఆనతిని శిరమునదాల్చి
సింహనాదముల కదలిరి వారు.

ఆయుధాలతో ఆభరణాలతొ
అసురుల కరముల దివ్విటీలతో
వెలుగులు నింగికి ఎగసి నిలచినవి
చంద్రుని వెన్నెల మరింత వెలిగెను.

గజతురగములు అరదమ్ములతో
గధలు శూలములు తోమరమ్ములతొ
సానపట్టిన గండ్రగొడ్డళులు
ధనుర్బాణములు నిశిత ఖడ్గములు

ఆయుధాలతో అసుర వీరులు
అగ్నిని బడెడి మిడుతలవోలె
కపిసేనలపై కలియబడగను
భీకరమైన పోరు జరిగెను.

గిరి శిఖరములు భూరి తరువులతొ
వానర వీరులు ఎదిరి నిలచిరి
పిడికిటి పోట్లతొ వానర యోధులు
అసురుల తలలను చితుకకొట్టిరి.

అసుర వీరులు తీసిపోనటు
నిశిత ఖడ్గముల తలలు నరికిరి
కోరల కొరికి నఖముల పీకి
అసురుల కూల్చిరి కపి కిశోరములు.

కట్టు పుట్టములు జారుట ఎరుగరు
కవచమ్ములవి ఊడుట ఎరుగరు
ఆయుధాలవి నేలను బడినను
పట్టు విడువక పోరిరి అసురులు.

ఒక్కొక దెబ్బకు పది తలకాయలు
పగులగొట్టిరి వానర యోధులు
అటులే కపులను రాక్షస వీరులు
కూల్చిరి రణమున సమ ఉజ్జీలై.

॥శ్రీ రఘురాముని॥

✣✣✣

# 76 సుగ్రీవుడు–కుంభుని కూల్చుట

ఘన సంగ్రామము జరుగుచుండగా
ఇరు సేనలలో వీరులు కూలిరి
తిరిగి బలముగ తాకిరి వీరులు
అంగదుడపుడు తాకెకంపనుని.

కోపము నిండి కంపనుడపుడు
అంగదు శిరమున మోదెను గదతో
మూర్ఛపోయెను అంగదుడపుడు
కొంతసేపటికి తెప్పిరిల్లెను.

చెంతనెవున్న గిరి నొకదానిని
విసురుగ తీసి విసరె నంగదుడు
ఘనమగు శైలము తగిలి కంపనుడు
నేల కూలెను అసువులు బాసెను.

శోణితాక్షుడది చూచినవాడై
రథము తోలెను అంగదు వైపు
నిశిత శరములు విడువసాగెను
కత్తులపోలిన శరముల విడచెను.

గన్నేరాకుల పోలు శరములు
అర్ధ చంద్రుని పోలు అమ్ములు
మొనలు తేలిన వాడి బాణములు
బంగరు ములుకుల శరములు వదలెను.

మైంద ద్వివిదులు ముందుకురికిరి
ముగ్గురు వానరయోధులు అపుడు
ముగ్గురు రాక్షస యోధులు నెదిరి
భీకరమ్మైన పోరు సలిపిరి.

వచ్చెడి శరముల లక్ష్యపెట్టక
అంగదుడంతట అసురుని తాకి
ధనుర్బాణములు పెరకివిరచెను
రథమును విరచెడి యత్నము చేసెను.

తరులు శిలలను ప్రజంఘుడంతట
కరవాలముతో అడ్డగించెను
యూపాక్షుడు తను శరములు విడచి
హయముల రక్షణ చేసెను అపుడు.

శోణితాక్షుడు ఖడ్గము డాలును
చేత ధరించి నింగి కెగిరెను
అంగదుడంతట రివ్వున ఎగిరి
అసురుని ఖడ్గము లాగివేసెను.

వచ్చెడి తరులను శిలలను బలముగ
గదతో కొట్టెను శోణితాక్షుడు
అంతట విసురుగ ఖడ్గమునందుకు
ముందుకు దూకెను ఆ ప్రజంఘుడు.

అంతట వీరుడు వాలి కుమారుడు
నిశిత ఖడ్గమున ఏటవాలుగా
జందెము అన్నటుశోణితాక్షుని
నరకి-దూకెను అసురులపైకి

కత్తితొ వచ్చెడి ప్రజంఘు గాంచి
మద్ది తరువుతో నిలచె నంగదుడు
పిడికిటి పోటుతొ ఆ కపియోధుడు
అసురుని కుడి భుజమందు పొడిచెను.

దెబ్బ తగిలిన శోణితాక్షుడు
ఇనుప గుదియతో ముందుకురికెను
అంతటిలోన యూపాక్షుండు
ప్రజంఘునితో వచ్చి కలిసెను.

పిడికిటి పోటుకు ఖడ్గము జారెను
అంతట అసురుడు ఆ ప్రజంఘుడు
ముష్టి బిగించి అతి లాఘవముగ
అంగదు లలాటమందున గ్రుద్దెను.

శోణితాక్ష ప్రజంఘులిద్దరూ
ఒకే సమయమున తాకిరి అపుడు
నింగి విశాఖ తారల నడుమ
శశివలె తోచెనుఅంగదవీరుడు.

వజ్ర సమమగు ముష్టి ఘాతమున
చేష్టలుడిగిన అంగదుడపుడు
నిలచిపోయెను కదలక మెదలక
ముహూర్త కాలము వివశుడయ్యెను.

తిరిగి తేరుకొని నేలను బడిన
ఖడ్గము నందుకు ప్రజంఘు శిరమును
ఒక్కవ్రేటుతో నరికివేసెను
యూపాక్షుడది గాంచి వణకెను.

శరములు ఆఖరుకాగా నంతట
యూపాక్షుండొక ఖడ్గము బట్టి
ముందుకు దూకెను అది గమనించి
ద్వివిదుడు అసురుని ఱొమ్మున గ్రుద్దెను.

ద్వివిదుడు తమ్ముని గ్రుద్దుట గాంచి
శోణితాక్షుడు ముందుకు దూకి
ద్వివిదుని గదతో మోదగ నంత
చలించిపోయెను వానరవీరుడు.

తిరిగి మోదుటకు గదను ఎత్తగా
ద్వివిదుడు దానిని లాగివేసెను
అంతట మైందుడు తన అరచేతితొ
యూపాక్షు వక్షమున చరచె గట్టిగా.

శోణితాక్ష యూపాక్షు లిద్దరూ
మైంద ద్వివిదుల నెదిరి పోరిరి
చీల్చిరి, రక్కిరి, నేలకు త్రోసిరి
భీకరమైన పోరు సలిపిరి.

ద్వివిదుడంతట శోణితాక్షుని
నేలకు త్రోసి ముద్దగ నలిపెను
మైందుడు కరముల బలముగ మోది
యూపాక్షు నసురుని నేల కూల్చెను.

ఆ యుద్ధములో అసుర సేనలు
అనేకమ్ముగా ఒరిగిపోయినవి
చావగ మిగిలిన వీరులు కొందరు
కుంభుని వద్దకు పరుగులెత్తిరి.

కుంభకర్ణుని తనయుడు కుంభుడు
వీరులు కూలుట తెలిసినవాడై
సింహనాదమున ఘనమగు శరమును
సంధించి అట నిలచెను పోరుకు.

ఆకర్ణాంతము విల్లును లాగి
బంగరు మొనగల శరము నందుకొని
సర్పసమమగు నిశిత శరమును
మైందునిపైకి విడచెను బలముగ.

రివ్వున వచ్చి అమ్ము తగలగా
పర్వతమంతటి మైందుడు అపుడు
నిలబడలేక నేలను బడెను
పదములు వణకెను శరఘాతమునకు.

మైందుడు వివశుడు అగుట గాంచిన
ద్వివిదుడు ఘనశైలమ్ము నందుకొని
కుంభునిపైకి సూటిగ విసరెను
శరముల రాతిని చీల్చె నసురుడు.

విషసర్పమ్మును పోలిన అమ్మును
కుంభుడు విడచెను ద్వివిదునిపైకి
మర్మస్థానమునందది తగులగ
మూర్ఛపోయెను కపికిశోరుడు.

మేనమామలగు మైంద ద్వివిదులు
నేలను బడుట గాంచె నంగదుడు
అతిశయించిన క్రోధముతోను
కుంభునిపైకి దూకె నంగదుడు.

అంగదు డటుల వచ్చుట గాంచి
అయిదు శరములు వేసెను కుంభుడు
తృప్తిచెందక మరి మూడమ్ములు
విడచెను అసురుడు కపివీరునిపై.

వచ్చెడి శరముల లక్ష్యపెట్టక
శిలలు తరులను వర్షము తీరుగ
విసరుచుండెను వాలికుమారుడు
వాటిని ఛిద్రము చేసె నసురుడు.

మీదకు వచ్చెడి అంగదు గాంచి
కుంభుడంతట నిశిత శరములు
వాలికుమారుని కనుబొమ్మలలో
సూటిగ నాటెను రక్తము చిమ్మెను.

కన్నులు తెరవగ సాధ్యముగాక
కారెడి నెత్తురు చేతితొ తుడుచుచు
రెండవ చేతితొ దగ్గరలో గల
సాలవృక్ష మొకదానిని గాంచి

బలముగ తరువును పెల్లగించెను
ఇంద్రధ్వజము-మందర నగములు
పోలిన ఆ ఘనతరువు నంతట
విసరెను సూటిగ కుంభునిపైకి.

అంతట కుంభుడు ఏడు శరములు
సూటిగ విడచెను కపియోధునిపై
శరములు తగిలి బాధగ నరచి
మూర్ఛపోయెను కనకాంగదుడు.

విలవిలలాడుచు నేలను బడిన
అంగదు గాంచి వానరవీరులు
రామచంద్రుని చెంతకు జేరిరి
విన్నవించిరి విషయమంతయు.

జాంబవంతుని- కపివీరులను
అంగదుకొరకై పంపెను రాముడు
రామానతితో వీరవరేణ్యులు
కుంభునితోనట పోరగసాగిరి

జాంబవంతుడు సుషేణుడున్ను
వేగదర్శియను ముగ్గురు వీరులు
ధనుర్విద్యలో ఆరితేరిన
కుంభు నసురుని ఎదిరి నిలచిరి

వచ్చెడి వీరుల నందరినపుడు
శరములువేసి ఆపివేసెను
చెలియలికట్ట కడలి నాపినటు
శరములు వారిని నిలిపివేసినవి.

వానరవీరులు నిలిచిపోవుట
వానరరాజు చూచెను అపుడు
కరిపైధూకెడె హరి మాదిరిగా
వానరరాజు తాకె నసురుని.

చంద్రతరువులు ఇనుమద్దులను
ఎన్నో ఘనమగు వృక్షమ్ములను
గిరిశిఖరములు బండరాళ్ళను
వానరరాజు విసరెబలముగ.

వచ్చెడి వాటిని వాడిశరముల
త్రుంచివేసెను అసుర వీరుడు
అంతట ఆగక కుంభుడు నేర్పుగ
విడచెను శరములు సుగ్రీవునిపై

శరములు తగిలియు లక్ష్యపెట్టక
బాధ నోర్చుకొని సూర్యకుమారుడు
దూకెను కుంభుని అరదముపైకి
రెప్పపాటులో విరచెను ధనువును

అంతటి సాహస కార్యముచేసి
పలికె నసురునితొ వానరరాజు
''అసురాగ్రేసర! శరవిన్యాసము
అమోఘమైనది మెచ్చుకొంటిని.

లంకేశ్వరునితొ సరితూగగల
శర నైపుణ్యము నీకు గలదయా!
బలి, ప్రహ్లాదుల వరుణ కుబేరుల
సరిపడు వీరుడవయ్యా నీవు.

తండ్రికి తగిన తనయుడ వీవు
మనోవ్యాకులము జితేంద్రియుని ఎడ
వ్యర్థమైనటు సురలు సైతము
నిన్నెదిరించి నిలబడలేరు.

నీ పెదనాన్న వరముల వలన
దేవదానవుల లొంగదీసెను
నీ జనకుడు తన భుజబలమ్ముతో
సురాసురులను లొంగదీసెను.

ధనుర్విద్యలో ఇంద్రజిత్తుకు
సరిపోయెదవు-పరాక్రమమ్మున
లంకేశ్వరునితొ తూగెదవయ్యా
నిన్ను పోలిన అసురుడు లేడు.

అస్త్ర కౌశలము చూపించుచును
వీరుల కూల్చి అలసిపోతివి
అలసిన నిన్ను అంతము చేసిన
అపఖ్యాతి యని తలంచుచుంటిని.

నీతో పోరక నిలచితినందుకు
సేద తీరినచొ పోరెదమింక
శంబరాసురుని ఇంద్రుడు కూల్చెను
అటులే నిన్ను కూల్చెద నేను.''

పోటు మాటలతొ ఉక్రోషమును
రెచ్చగొట్టుచు గౌరవించగ
ఆజ్యము పడిన అగ్నిహోత్రమై
మండెను వీరుడు పండ్లు కొరికెను.

బరువుగ కుంభుడు తన కరములతో
వానర రాజును గట్టిగ కొట్టెను
తప్పించుకొని సూర్యకుమారుడు
తిరిగి కుంభుని ఒడిసి పట్టెను.

అటులా వీరులు మత్తేభలములన
నిప్పులు గ్రక్కుచు జ్వాలలెగయునటు
పోరగసాగిరి రొప్పుకొనుచును
ఒకరికి ఒకరులొంగకపోయిరి.

ఎముకలు మాత్రము చెదరక నిలచెను
వజ్రాయుధపు దెబ్బపాటుకు
మేరుగిరిని మరి ఎగసిన జ్వాలగ
నెత్తుటిజ్వాల చిమ్మెను అపుడు.

పదముల పోటుకు భూమి కృంగెను
కడలిలొ జలము కల్లోలమయె
కడలి అడుగును చూపునట్లుగా
కుంభుని విసరెను కడలిలోనికి.

కుంభుని దెబ్బకు కోపము పెరిగెను
వజ్రసమమగు పిడికిలి బిగించి
సూర్యమండలము అన్నటు వెలిగే
పిడికిట-వక్షమునందు గ్రుద్దెను.

జలములందు ఆ కుంభుడు పడగనె
మహా సంద్రము నింగి కెగిరినటు
ఎగిరిపడినది-వెంటనె కుంభుడు
లేచివచ్చెను పోరుట కొరకై.

వానరరాజు ముష్టిఘాతమును
విసరగ నసురుడు వివశుడయ్యెను
అవయవమ్ముల పట్లు సడలెను
నేల కూలెను అసువులు వీడెను.

పిడికిలి బిగించి కుంభుడంతట
వజ్రాయుధసమ వేగముతోను
వానర రాజును వక్షమునందు
గ్రుద్దెను-చర్మము చిట్లిపోయెను.

నేలరాలు అంగారకగ్రహమై
ఆరిపోయిన అగ్నితీరుగా
రుద్రదేవుడు త్రోసిన రవివలె
కుంభుని కాయము నేలను బడెను.

కపిరాజటుల కుంభుని కూల్చగ
గిరులు, వనములతొ నిండిన భూమి
వణకిపోయెను, రాక్షసులందరు
భయముతొ వణకిరి భీతితొ నరచిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 77 హనుమంతుడు నికుంభుని కూల్చుట

కుంభుని తమ్ముడు నికుంభుడపుడు
అన్న కూలుట గాంచి క్రోధమును
చూపులతోనే కాల్చివేయునటు
సుగ్రీవునిపై దూకెను రణమున

యమదండమువలె తోచు నాయుధము
పరిఘాయుధమును చేత ధరించెను
బంగరు కట్లతొ వ్రేలి గురుతులతొ
వజ్రశోభలతొ వెలుగు ఆయుధము.

పూలమాలలు అలంకారముల
హిమవన్నగమ్మై తోచు ఆయుధము
అపజయమెరుగని ఆయుధమ్మును
త్రిప్పుచు నరచుచు వచ్చె నసురుడు.

వక్షస్థలమున మెరయు హారములు
చెవులకు వెలిగే కుండలమ్ములతొ
ఇంద్రధనుస్సుగ తోచుచునసురుడు
మేఘమునందలి మెరపుగ తోచెను.

పరిఘ త్రిప్పగా భూమి వణకెను
ధనపతి నగరము కంపించినది
అమరావతిలో అలజడి లేచెను
తారలు గ్రహములు తల్లడిల్లెను.

లోకములన్నీ తిరుగుచున్నటు
నింగిని చంద్రుడు సుడి తిరుగునటు
ప్రళయాగ్నివలె అసురుడు తోచెను
భయపడిపోయిరి వీరులందరూ

వానరవీరులు రాక్షసవీరులు
అచేతనమ్ముగ నిలబడిపోయిరి
అంతట మారుతి అతిబలవంతుడు
వక్షముచూపి ఎదురునిలచెను.

నికుంభుడపుడు పరిఘాయుధముతొ
మారుతి వక్షమునందు కొట్టెను
చిత్రము- అంతటి బలమగుపరిఘ
ముక్కలైనది ముచ్చటగాను.

పరిఘపగులగ విరిగినముక్కలు
నిప్పులు మాదిరి నింగి కెగిరెను
భూకంపములో కదలిన నగమ్మై
ముహూర్తకాలము చలించె మారుతి.

అంతట మారుతి అతిలాఘవముగ
వజ్రముపోలు ముష్టిబిగించి
అసురుని వక్షమునందు గ్రుద్దెను
చర్మము చెదిరి రక్తము కారెను.

దెబ్బకు వణకెను ఆ నికుంభుడు
తిరిగి అసురుడు అతిబలవంతుని
హనుమంతుని తన చేతులనెత్తెను
అరచిరి అసురులు ఆనందముతో.

అంతట మారుతి తనపిడికిలితో
గ్రుద్దెనొక్కటి- అంతటి దెబ్బకు
ఆగలేక ఆ అసురుడు-హనుమను
వదలివేసెను బాధగ నరచెను.

బలముగ గ్రుద్దెను వాతాత్మజుడు
తిరిగి నికుంభుని నేలకుత్రోసెను
వక్షస్థలమున గెంతెను మారుతి
అసురుని గొంతు నలిపివేసెను.

భయంకరముగా నికుంభుడపుడు
అరచుచుండగా జయహనుమంతుడు
విజయకాంక్షియై విరచెను మెడను
వానరవీరులు ముదముగ నరచిరి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 7 8 మకరాక్షుడు పోరుకు వచ్చుట

కుంభ నికుంభులు కూలిపోయిరను
వార్తను వినిన లంకేశ్వరుడు
అగ్నిహోత్రసముడాయె క్రోధమున
దుఃఖ, భయములతొ నిండిపోయెను.

విశాలమైన కన్నుల వానిని
ఖరుని కుమారుని మకరాక్షుని గని
పోరుకు పొమ్మని ఆదేశించెను
నమస్కరించి అసురుడు సాగెను.

సేనాధ్యక్షుడు రథము నిలపెను
తేరుకు వీరుడు ప్రదక్షిణించెను
వీరుల నతడు ప్రోత్సహించుచు
పోరుకు సాగెను ఆ మకరాక్షుడు.

''రామలక్ష్మణ సుగ్రీవులను
కూల్చెద శరముల-మీరందరును
అగ్నిహోత్రము అడవి కాల్చినటు
కపులను కూల్చుడు శూలమ్ములతో.

పెద్ద కోరలతొ మహాకాయులు
తేనెరంగు దేహమ్ముల అసురులు
మత్తేభములన ఘీంకరించుచు
దిక్కులవియగా సాగిరి పోరుకు

అకస్మాత్తుగా ఆ మకరాక్షుని
సారథి చేతిలొ-కోల జారెను
రథ ధ్వజమది నేలకూలెను
తడబడి అశ్రులు కార్చెనశ్వములు.

గాలి దుమారము బలముగ వీచెను
దుశ్శకునములను లక్ష్యపెట్టక
సేనతొ సాగెను ఆ మకరాక్షుడు
ఉత్సాహముతో అరచిరి అసురులు

యుద్ధకుశలత తెలుపుచు నసురులు
బలగర్వమున పలుకుచు నసురులు
నే ముందనుచు నే ముందనుచు
ముందుకురికిరి యుద్ధభూమికి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 7 9 శ్రీరాముడు మకరాక్షుని వధించుట

సేనతో వచ్చెడి మకరాక్షుని గని
సమరోత్సాహులు వానర వీరులు
సింహనాదములు చేసి నిలచిరి
ఘన సంగ్రామము జరిగె నప్పుడు.

శూలాయుధములు శక్త్యాయుధములు
పరిఘలు గదలు తోమరమ్ములు
ముద్గరములతో పాశాయుధముల
నిశిత ఖడ్గములు పట్టసాలతో

వివిధ రకముల ఆయుధాలతో
రాక్షస వీరులు పోరు సలిపిరి
ఘనశైలమ్ములు భూరితరువులు
వానర వీరులు విసరుచుండిరి.

నిశిత శరముల ఆ మకరాక్షుడు
శిలలు తరువులను ఛిద్రము చేయుచు
తిరిగి శరములు సూటిగ వదలుచు
వానర వీరుల కలవరపరచెను.

ఆయుధాలతో అసురులు కొట్టగ
శరములతో మకరాక్షుడు కొట్టగ
భయపడిపోయి వానరవీరులు
పరుగులెత్తిరి- అసురులు మురిసిరి.

పరుగులెత్తెడి కపులను గాంచి
రామచంద్రుడు నిశిత శరములను
వర్షము తీరుగ కురిపించగను
అసురులు కదలకపోయిరి సుంతయు.

రాముని శరవిన్యాసము గాంచి
కోపముతో మకరాక్షుడు పలికెను
''రామా! నేటికి నా కగపడితివి
ద్వంద్వయుద్ధమున తలపడ రమ్ము.

దండకాటవిని నా జనకుడగు
ఖరుని కూల్చితివి కావున నీకై
అప్పటినుండి వేచియుంటిని
నిన్ను చూడగ పెరిగె కోపము.

నిలునిలు రామా! నిలువున చీల్చెద
దైవ వశమున నాకగపడితివి
మృగముకోసమై సింగము రీతిగ
వేచియుంటిని కాచియుంటిని.

అస్త్రయుద్ధమో, గదాయుద్ధమో
ద్వంద్వయుద్ధమో నీవే చెప్పుము
నీవు దేనిలో సుశిక్షుతుడవో
ఆ యుద్ధమునే చేసెద రమ్ము''

రాముడు నవ్వుచు తిరిగి పలికెను
''వ్యర్థపుమాటలు వదరకు పాపీ!
నీ మాంసమును కాకులు, గ్రద్దలు
నక్కలు తినును నిలబడు ముందు.''

అటుల రాముడు పలుకుచుండగా
అసురుడు శరములు వదలసాగెను
రామచంద్రుడా శరములన్నిటిని
త్రుంచెను నడుమలొ తన శరములతో.

ఇరువురు వీరులు విడచిన శరములు
నింగిని పోరి నేల కూలినవి
ధనుసు మ్రొతతో ఉరుముల సవ్వడి
చేసిరి వీరులు జయాభిలాషులు.

పోరు చూచుటకు సురగంధర్వులు
మహోరగులును నింగిని నిలచిరి
ఒక గాయము మరి ఒకరికి తగిలిన
రెండవవానికి రెండు తగిలెను.

రామచంద్రుడును మకరాక్షుడును
ఒకరి శరములను ఒకరు త్రుంచిరి
విరిగిన శరములు ధనుసు మ్రోతల
దిక్కులవిసెను రణరంగమున.

మహాబాహుడు రామచంద్రుడు
మహోగ్రుడయ్యెను-ఘనమగు శరమున
మకరాక్షు చాపము త్రుంచివేసెను
మరి ఎనిమిదితో కూల్చె సారథిని.

వదలక శరములు వేయుచు రాముడు
రథ తురగమ్ముల నేల కూల్చెను
విరథుడయ్యెను అసురవీరుడు
నేల కురికెను అతి భీకరముగ.

నింగిని నిలచి పోరు చూచెడి
భూతజాలములు పొగడిరి రాముని
అంతట అసురుడు పిడికిలి బిగించి
నిలునిలు మనుచు ముందు కురికెను.

యుగాంతమ్మున అగ్నిని పోలెడి
ప్రళయభయంకరమైన శూలమును
అసురుడు తీసి రామునిపైకి
విసరెను- శూలము మండుచు వచ్చెను.

వచ్చెడి అసురుని రాముడు గాంచి
నవ్వుచు విసరెను ఆగ్నేయాస్త్రము
కోదండములో నుండి సాగిన
అస్త్రము అసురుని గుండెను చీల్చెను.

శూలమ్మును గని రామచంద్రుడు
నిశిత శరములు వదలెను : నింగిని
రామబాణములు శూలాయుధమును
ముక్కలు చేసెను రాలెను తునకలు.

రామబాణమున గుండియ చీలి
మకరాక్షుడట నేలకొరిగెను
వచ్చెడి శరముల బారి పడకను
తప్పుకొనగను పరుగిడి రసురులు.

వజ్రఘాతమున గిరి పగిలినటు
రామబాణమున అసురుడు కూలగ
ఆనందించిరి దేవతలందరు
రామపూజతో కపులు మురిసిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 8 0 అదృశ్యముగా నుండి ఇంద్రజిత్తు యుద్ధము చేయుట

రామచంద్రుడు రణకోవిదుడు
మకరాక్షు నంతముచేసిన విషయము
తెలిసి- రావణుడు ఆగ్రహించెను
పండ్లు పటపట కొరికె కోపమున.

కనబడియో మరి కనబడకుండనొ
పోరి కూల్చుము రామలక్ష్మణుల
అమరేశ్వరునే గెలిచినవాడవు
నిన్ను చూడగనె చత్తురువారు.''

యోచించుకొని లంకేశ్వరుడు
ఇంద్రజిత్తును చూచి పలికెను
''తనయుడ! నీవు బలవంతుడవు
తగినవాడవని నమ్ముచుంటిని.

తండ్రి మాటలు వినిన తనయుడు
యథావిధిగను హోమము చేసెను
అగ్నిని వ్రేల్చి తృప్తిపరచెను
హవిసులతో సంతృప్తినొనర్చెను.

అదృశ్యముగా చరించగలిగిన
అరదము వచ్చెను బంగరు మయమది
అశ్వములున్నవి నాలుగు దానికి
అమ్ములు చాపములున్నవి ఎన్నో.

బంగరు కట్లతొ వైడూర్యములతొ
వెలిగే ధ్వజము అగ్నిగ తోచెను
బ్రహ్మాస్త్రమ్మును పొందుటవలన
ఇంద్రుని గెలిచెను రావణు తనయుడు.

అరదమునెక్కి బయలుదేరెను
అసురులందరిని చూచి పలికెను
''కపట వేషమున నున్న తాపసుల
రామలక్ష్మణుల కూల్చివేసెద.

కోతుల నింక మిగలనీయను
లంకేశ్వరుని సంతస పరచెద
జయము తప్పదు ఇంద్రుని గెలిచితి''
అనుచు సాగెను రణము చేయగ.

వానర సేనలొ మధ్య నిలచిన
మూడు తలలుగల పన్నగమ్ములన
శరములు వదలెడి రామలక్ష్మణుల
పరిశీలించి చూచెను అసురుడు.

అల్లె త్రాటిని బిగించి నిలచి
వర్షము మాదిరి శరములు వదలుచు
అంతర్ధానము అయ్యెను అంతలొ
నింగి నుండి అట విడిచెను శరములు.

అంబర వీధిని తను కనబడక
తిరుగుచు శరములు విడుచుచుండెను
తగిలెడి శరములు దిక్కు గ్రహించి
నింగిలోనికి వదలిరి శరములు.

రామలక్ష్మణులు విడచిన శరములు
ఆకాశమును కప్పివేసినను
ఇంద్రజిత్తుకు తగలక పోయెను
మాయలమారి యోచన చేసెను.

మంచు కమ్మిన రీతిగ పొగతో
ఆకాశమును నింపివేసెను
చీకటి క్రమ్మెను అదే అదనుగా
శరవర్షము కురిపించసాగెను.

వర బలవంతుడు రావణు తనయుడు
రామలక్ష్మణుల నొప్పించగను
సోదర లిరువురు శరములు వదలిరి
ఇంద్రజిత్తునకు తగిలి పడినవవి.

మనుజోత్తములు రామ లక్ష్మణులు
శరములు తమకు తగులుచున్నను
శరములు వచ్చెడి దిక్కు గ్రహించి
వచ్చెడి శరముల త్రుంచ సాగిరి.

నింగిలోనికి దివ్యాస్త్రములను
రామలక్ష్మణులు విడచి రప్పుడు
ఇంద్రజిత్తు ఆ శరముల తప్పుకు
తిరిగి వదలెను నిశిత శరములు.

రూపము తెలియదు దిక్కు తెలియదు
ధనుర్బాణములు కనబడవసలు
అటులా అసురుడు విడచిన శరముల
వందల కపులు అసువులు బాసిరి.

బుసలను కొట్టుచు లక్ష్మణమూర్తి
బ్రహ్మాస్త్రమును వదలనున్నటు
అన్నగారికి తెలియబరచగా
శాంతపరచెను రామచంద్రుడు.

''ఓ సౌమిత్రీ! ఒక్కనికోసము
అసురులందరిని కూల్చివేయుట
న్యాయము కాదు-పుడమిని నిండిన
అసురులందరిట పోరుట లేదు.

పోరుకు భయపడి రానివారిని-
శరణాగతులను-పరుగిడు వారిని
మత్తులోనున్న అసురుల మనము
చంపుట తగదు తెలియును కాదా!

బ్రహ్మాస్త్రములతో అందరొరిగిన
అది మనకెంతో క్లేశముగాదా!
ఇంద్రజిత్తును మాత్రమె మనము
కూల్చెడి యత్నము చేతము సోదర

కంటి కగపడిన- ఆ మాయావిని
మన వానరులే మర్దించెదరు
ఇప్పుడు నేనొకదివ్యాస్త్రమును
వాని మీదకు వదలెద చూడుము.

నేను వదలు ఈ దివ్యాస్త్రమ్ము
పాతాళములో వాడు దాగినను
ఊర్ధ్వలోకముల దాగినకాని
వానిని త్రుంచి నేలకు రాల్చును.''

అనుచు పలుకుచు రామచంద్రుడు
రఘుకుల తిలకుడు రాక్షస హరణుడు
ఇంద్రజిత్తును అంతము చేయగ
నిశ్చయించుకొని ధనుసును మీటెను.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 81 మాయసీతను ఇంద్రజిత్తు వధించుట

రాముని యత్నము గ్రహించినాడు
పురుషోత్తముని శక్తి తెలిసెను
యుద్ధరంగమును వదలి మెల్లగా
జారుకొనెను లంకేశుని తనయుడు.

మరలిపోయిన ఇంద్రజిత్తుకు
మనసు ఉడికి పోతున్నది అపుడు
కుంభకర్ణుడు ఆదిగాగల
మహావీరులను కూల్చెను రాముడు.

క్రోధవశుడయి తిరిగి పోరుకు
బయలుదేరెను అఖండసేనతో
రామలక్ష్మణుల వానరయోధుల
మోసగించగ యోచన చేసెను.

యుద్ధవిముఖులను చేయుటకొరకై
దిగులుతొ వారు కృంగిపోవుటకు
మాయతొసీతను సృజించినాడు
తేరున నుంచెను మోసగించగా.

తేరుననున్న మాయరూపును
రణరంగమున వధించివేసి
వానర వీరుల మోసగించగ
యోచనచేసి తేరుతొ కదిలెను.

ఎదురువచ్చెడి అరదముగాంచి
వానర వీరులు శిలలు తరులతో
ఎదిరించుటకై ముందుకురికిరి
ఘనశైలముతో మారుతిదూకెను.

స్యందనమందున పావనమూర్తిని
కృంగి కృశించిన శోకమూర్తిని
ఉపవాసముతో రామధ్యానముతొ
అశోకవనిలో దర్శనమిడిన

ఏకవేణిగా కురులుచిక్కుపడి
దుమ్ముపారిన వలువదాల్చిన
దీనవదనముననున్న సుందరిని
రామచంద్రుని హృదయచంద్రికను

రామబంటుహనుమంతుడు చూచెను
అశోకవనిలో అమ్మగ తలచెను
శోకవశుడయి కంటనీటితో
కర్తవ్యమ్ము తోచకపోయెను.

హనుమను గాంచి రావణుతనయుడు
రథముననున్న మాయరూపును
శిరోజములను చేతబట్టుకొని
కరవాలమును దూసి నిలచెను.

'రామా, రామా'! అను ఆక్రందన
వినబడి మారుతి చలించిపోయెను
అసురునితోను పరుష వచనముల
పలికెను మారుతి- రామభక్తుడు

''దురాత్ముడా! నువు పుట్టినవంశము
బ్రహ్మఋషులు జన్మించిన వంశము
అయినా నీవు అసురకాంతకు
జన్మించితివి పాపివైతివి.

నీవుచేయునది అకార్యము సుమా!
పరమపతివ్రత సీతాదేవి
శిరోజములను చేతబట్టితివి
దుష్టకార్యమును చేసితివీవు.

రామచంద్రునికి దూరమైనది
దిక్కులేకను వంతనందినది
నీకేహానిని చేసెను మాత?
నిర్దయతో నువు నడచుచుంటివి.

సీతాదేవిని హతముచేసిన
నిన్ను చంపుట తథ్యము వినుము
స్త్రీహత్యతొ నువు దుర్గతినంది
పాపఫలమును అనుభవించెదవు''

అనుచు పలుకుచు పవననందనుడు
కపివీరులతో ముందుకురికెను
భయంకరమగు అసురసేనలు
అడ్డగించినవి వచ్చెడి కపులను.

అసురుడంతట నిశితశరములు
వానర సేనలపైన విడచెను
హనుమంతునిగని పలికెనప్పుడు
రథమున సీతను చూపుచుపలికెను.

''ఓరీ! నీవును- కోతులరాజును
నువ్వునమ్మిన నరుడగు రాముడు
ఎవరికోసమై ఇటకువచ్చిరో
ఆమెను చంపెద నీముందరనే.

ఓ వానరుడా! సీతను చంపి
ఆపై వదలక రామలక్ష్మణుల
నిన్నును నీ మహరాజు సుగ్రీవుని
విభీషణాదుల వధించివేసెద.

స్త్రీవధ వలదని చెప్పితివీవు
వైరిదుఃఖమే నాకు సమ్మతి
అందుకొరకు నేనెంతటి కార్యము
ఆలోచించక చేతును వినుము''

అనుచుపలుకుచు పదునుఖడ్గమున
నరికివేసెను ఆ స్త్రీమూర్తిని
యజ్ఞోపవీతము అన్నటు వాలుగ
కత్తివేటుదిగి అసువులుతీసెను.

ఆ స్త్రీమూర్తిని అంతముచేసి
మీశ్రమ వ్యర్థముఅయినది అనుచు
ఆంజనేయునితొ పలికి క్రూరముగ
సింహనాదమును చేసెను అసురుడు.

సింహనాదము వినిరి అసురులు
ముదమునందిరి రాక్షసులందరు
దుఃఖితులైరి కపులందరును
కన్నులనీరు కురిసెనచ్చట

॥శ్రీ రఘురాముని॥

## 82 ఇంద్రజిత్తు నికుంభలాదేవి హోమము చేయుట

పిడుగులు పడినటు రావణు తనయుడు
సింహనాదమును చేయగ వినిన
వానరవీరులు భయము నందిరి
పరుగిడి పోవగ యత్నమునుండరి.

వానర సేనల కలవరమునుగని
ధైర్యము చెప్పెను ఆంజనేయుడు
ముందు నిలచెదను అనుచు పలుకుచు
పోరుకు రమ్మని ప్రోత్సహించెను.

మారుతి మాటల ధైర్యము కలిగెను
శిలలు తరులతో వీరులు కదలిరి
ప్రళయకాలమున యముని తీరుగా
విజృంభించెను వాయు నందనుడు.

అసుర వీరులను కూల్చివేసెను
అగ్నిహోత్రమై కాల్చివేసెను
అమ్మను చంపెను అనిన క్రోధమున
అసురుని రథమున కొండను విసరెను.

హనుమంతుడు అవలీలగ విసరిన
ఘనశైలమ్మును సారథి చూచెను
ఒడుపుగ రథమును తప్పించగను
ఆపద తప్పెను ఇంద్రజిత్తునకు.

నేలను బడి ఆ శిల పగిలినది
దాని క్రిందపడి అసురులు నలిగిరి
అంతట వానర వీరులు తరువుల
శిలలతొ తాకిరి ఇంద్రజిత్తును.

వానర వీరులు రణోత్సాహమున
అరచుచు విసరిరి తరులు శిలలను
వాటిక్రిందపడి అసుర వీరులు
చితికిపోయిరి బాధగ నేడ్చిరి.

అసురులు కూలుట ఇంద్రజిత్తుగని
అమిత క్రోధమున ముందుకురికెను
ఘన చాపముతో శరములు వదలెను
అసురులు కొట్టిరి ఆయుధములతో.

అతి బలవంతుడు ఆ హనుమంతుడు
గిరి శిఖరములు ఘన తరువులతో
ఎదురు తిరిగి అవి విసరుచు వీరుడు
అసుర సేనలను కలవరపరచెను.

అంతట మారుతి యోచన చేసి
పోరు ఆపమని కపులకు చెప్పెను
''యోధులార! మీరందరు వినుడు
కంటి పాపను చిదిమెను అసురుడు.

అసురులతో మరి పోరుటెందుకు?
రామ పత్నికై వచ్చితి మిటకు
కన్నులముందే అమ్మను కూల్చెను
కన్నులుండియు కావగపోతిమి.

రామసేవలో అసువులు సైతము
అర్పించుకొన సిద్ధపడితిమి
అసలు విషయము రామచంద్రునకు
సుగ్రీవునికి తెలియబరచెదము''

మారుతి అటుల కపులతొ పలికి
ఆపై కార్యము అట యోచింతము
అనుచు తలచి ఆ వానర సేనను
వెనుకకు త్రిప్పెను రాముని చేరగ.

వానర వీరులు మరలిపోవుట
ఇంద్రజిత్తు గని ఆనందపడి
నికుంభలాంబ హోమము చేయగ
నిశ్చయించుకొని వెనుకకు మరలెను.

నికుంభలాంబ ఆలయమందు
హోమము చేయుట ఆరంభించెను
మాంసము, నెత్తురు, హోమము చేయగ
భగభగ మండెను అగ్నిహోత్రము.

రక్త హోమమున అగ్ని తృప్తిపడి
సంధ్యా సూర్యుని తీరుగ మండెను
ఆగమ విధులు శాస్త్ర విధానము
తెలిసిన అసురుని హోమము సాగెను.

అసుర జయమును ఆకాంక్షించి
హవిసును హోమము చేయుచుండగా
విధి లోపములు జరుగకుండగా
శ్రద్ధగ చూచిరి బ్రహ్మ రాక్షసులు.

॥శ్రీ రఘురాముని॥

❉❉❉

# 8 3 శ్రీరాముని దుఃఖము లక్ష్మణమూర్తి ఊరడింపు

యుద్ధ ఘోషను రాముడు వినెను
జాంబవంతుని చూచి పలికెను
''భల్లూకేశ్వర! ఆయుధాల ధ్వని
వినబడుచున్నది స్పష్టముగాను.

ఘనకార్యము మన మారుతి చేసెను
అని సమ్మోదను- నీవు సేనతో
హనుమంతునికి సాయపడుమయా!''
విని ఆ వీరుడు కదలెను సేనతొ.

పశ్చిమ ద్వారపు దిశలో సాగుచు
త్రోవలొ గాంచెను వచ్చెడి సేనను
అలసిన వీరులు-హనుమంతుడును
జాంబవంతుని చూచిరి సేనతొ.

వీరులందరిని వెనుకకు మరల్చి
రామచంద్రుని చెంతకు చేరి
గద్గద స్వరముతొ దుఃఖము నిండి
మారుతి పలికెను రామచంద్రునితొ.

''స్వామీ! మేమట పోరుచుండగా
రణరంగమున మాముందరనే
విలపించెడి ఆ సీతాదేవిని
వధించినాడు రావణుతనయుడు.''

పలుకుచు హనుమ కంటినీటితో
ఎగసిన దుఃఖము భరించలేక
పరమపాపినని రోదించుచును
రామపాదముల చెంత వ్రాలెను.

''అరదముపైన అతివను గాంచితి
అసురుడు చంపుట చూచితిస్వామీ!
అసహాయుడనై నిలచిపోతిని
అమ్మలేని మా అసువులెందుకు?''

దుఃఖించుచును హనుమచెప్పిన
విషయముతెలిసి రామచంద్రుడు
నరకివేసిన తరువువైపడెను
శోకవశుడయి మూర్ఛనందెను.

దేవసమానుడు రామచంద్రుని
గాంచిన కపులు పరుగిడివచ్చిరి
అగ్నిహోత్ర సమతేజమునిండిన
ముఖమున చల్లని నీరు జల్లిరి.

శోకవశుడయి కృంగిపోయిన
అన్నను అక్కున జేర్చెను తమ్ముడు
దుఃఖమునిండి యుక్తియుక్తముగ
పలికెనప్పుడు రామభద్రునితొ.

''అన్నా! నీవు పూజ్యుడవయ్యా!
ధర్మమార్గమున చరించువాడవు
జితేంద్రియుడవు నువు నమ్మినధర్మము
నీ దుఃఖమును తీర్చకపోయెను.

నిజముగ ధర్మము వున్నటులైనచొ
నీకు దుఃఖము తగదురాఘవా!
అధర్మవర్తి రావణాసురుడు
సుఖముగనుండుట చూచుచుంటిమి

శాస్త్ర ప్రకారము జరుగుటలేదు
విరుద్ధమైనవి జరుగుచున్నవి
ధర్మా ధర్మములున్నచొ-వాటిని
అనుష్ఠించి మరి ఫలితము లేదు.

పాపకర్ములు అధర్మవర్తులు
శిక్షనొందుటనవారిని చంపుట
అట్టి కార్యము ధర్మముఅగును
అధర్మవర్తులు సుఖపడుచుండిరి.

పరుని అధర్మము నినుబాధించెను
నీ ధర్మమ్ము అదేదుష్టునికి
సుఖమిడినట్లు తెలియుటలేదా!
నీ ధర్మమ్మే నీకుకష్టమిడె.

చంపుట- అది దైవేచ్ఛ అన్నచో
ఆపాపము దైవమ్మదిగావలె
చంపినవానికి పాపములేదని
దైవముమీదకు త్రోయగలేము.

ధర్మస్వరూపా! ధర్మమన్నది
ఊహకు అందక ఉండుట చేత
ఉన్నను అది మరిలేనటులున్నది
అసమర్థతతో కూడియున్నది.

సత్తువలేనిది ధర్మముస్వామీ!
పురుష ప్రయత్నము నాశ్రయించెను
కావున ధర్మము మాటతలంచక
పురుష ప్రయత్నము నాచరించవలె.

పురుష ప్రయత్నము ధర్మముపైన
ఆధారపడి యుండుటలేదు
కావున ధర్మము వదలివేసి మరి
పురుష ప్రయత్నము చేయదగినది.

ఓ పరంతపా! సత్యము పలుకుట
ధర్మము అని నువు తెలిసినవాడవు
మరి మన జనకుడు అసత్యమాడిన
వానిని నీవు ఎదిరించితివా?

ధర్మాచరణము ముఖ్యమైనచో
నాకాధీశుడు- విశ్వరూపుడను
మునిని చంపకయె- యజ్ఞము మాత్రము
చేసియుండెడి వాడని తలచెద.

అధర్మమ్మును అనుష్ఠించినచొ
మునినిమాత్రమే చంపి- అంతట
యజ్ఞము చేయుట వదలెడివాడు-
సమయము తెలిసి చేయగవలెను.

కావున కర్త ఒక్కదానినే
ఆచరించెదను అనుటకన్నను
సమయమునెరిగి ఆ రెండింటిని
ఆచరించవలె ఆలోచించి.

ధర్మాధర్మములెంచక- అన్నా!
మంచిని ఎంచి స్వీకరించునగు
వచ్చెడి రాజ్యము వదలుకొంటివి
ధర్మమూలమగు అర్థముపోయెను.

అర్థమువలదని వదలగరాదు
రాజ్యమువలన అర్థమునంది
అర్థార్జనతో రాజ్యము పెంచి
యజ్ఞయాగ ధర్మమ్ము పెంచవలె.

అర్థములేనిచొ అసమర్థుడగు
వేసవిలోన ఏటినీటివలె
ఇగిరిపోవున అతని చేతలు-
అర్థమనెడి ధన మంతటిదయ్యా!

అర్థమువదలి సుఖపడవలెనన
అధర్మమ్ములు చేయక తప్పదు
అర్థమువదలిన ధర్మలోపమగు
అంతియెగాక దోషముకలుగును.

అర్థవంతుడే అధికుడు స్వామీ!
అందరు అతనికి మిత్రులగుదురు
అతడే మగసిరి కలిగినవాడు
పండితుడతడే- బుద్ధిమంతుడగు.

ధనవంతుడు ఇల గుణవంతుడగు
అర్థమువదలిన ఇడుములు కలుగును
అప్పుడు రాజ్యము వదలుకొంటివి
ఎందుకు నీకా యోచన వచ్చెను?

అర్థవంతునికి ధర్మకామములు
అరచేత నుండుట జరుగుచున్నది
శమదమాదులు, దర్పము, కోపము
సంతోషము రాణించు వానికడ.

అర్థమునిచ్చే రాజ్యమువదలి
పితృవాక్య పరిపాలన ధర్మము
తలను ధరించి అడవుల పడితివి
అసురులు ఆలిని అపహరించిరి.

గొప్ప ఆపద వచ్చిపడినది
మేల్కొనవయ్యా, మంగళమూర్తీ!
నా శౌర్యముతో నీ దుఃఖమును
అవలీలగను తొలగించెదను.

ఓ నరవ్యాఘ్రమ! నిలబడుమయ్యా!
నిన్ను నువ్వుమరి తెలియకపోతివి
నీ మహత్మ్యమును తెలియుమునీవు
నీతో సరిపడు వీరుడు లేడు.

దుఃఖవశుడనై పలికితినటుల-
క్రోధవశమున పలికితినయ్యా!
ఉత్సాహమునిడ పలికితినన్నా!
కావున నన్ను క్షమించవేడెద.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 8 4 ఇంద్రజిత్తు చేయు హోమము భంగపరచమని విభీషణుని హి

శ్రీరఘురాముని రమ్యచరితము
శ్రీపతినరుడై వెలిసిన చరితము
శ్రీరాముడు దశకంఠునిదునిమి
శ్రీనిగ్రహించుట యుద్ధకాండము.

అడుగుజాడలో నడచిన తమ్ముడు
రామానుజుడటు అన్నగారిని
ఊరడించుట గాంచిరి కపులు
విభీషణుండా విషయము నెరుగడు.

గజములు-వెనుక అనుసరించగా
ముందరసాగు గజరాజువలె
తన సచివులతో వీభీషణాఖ్యుడు
వచ్చి చేరెను కపిసమూహమును.

కంటనీరిడు కపులను గాంచెను
దుఃఖమునున్న లక్ష్మణు గాంచెను
తమ్ముని ఒడిలో దుఃఖవశుడయి
సోలిపడిన శ్రీరాముని గాంచెను.

మదిలో దుఃఖము కనబడనీయక
దిగులుపడుచు ఆ విభీషణుండు
విషయము అడిగెను, అంతట తమ్ముడు
జరిగిన విషయము తెలిపె దుఃఖమున.

''మారుతి ఎదుటనె సీతాదేవిని
ఇంద్రజిత్తు వధియించినాడట
వార్తను వినిన అన్నఈగతి
మిగిలిన మాకు దిక్కు తోచదు.''

అనుచు లక్ష్మణుడు చెప్పుచుండగా
వెంటనె పలికెను విభీషణుండు
కడలి ఎండుటది ఎంతటి నిజమో
సీతను చంపుట అంతటి నిజము.

ఇంద్రజిత్తు అటు సీతాదేవిని
వధించెనన్నది సత్యముకాదు
రావణాసురుని ఎన్నో మారులు
వేడుకొంటని హితము నుడివితి.

సీతను రామునికిచ్చి వేయుమని
చెప్పిన-నాదు హితవచనమ్ములు
కాలదన్ని ఆ కాలుని ఏలచెను
కాలచోదితుడు లంకేశ్వరుడు.

చతురోపాయము లుపయోగించియు
సీతాదర్శన భాగ్యము కలుగదు
అంతటికావలి నుంచెను అన్న
ఆమె కోసమై అసువుల నిడును.

కావున అమ్మనుచంపుట మాయ-
అంతటిపని ఆ మాయల మారిది
కపివీరులను మోసము చేసి
హోమము చేయగ సాగెను వాడు.

నికుంభలాంబ హోమము చేయును
ఆ హోమము మరి పూర్తిచేసినచొ
ఇంద్రజిత్తును జయించలేము
అంతటి అజేయు డతడగునుసుమా!

మాయాకల్పిత సీతాదేవిని
వధించి-మనలను దుఃఖపరచెను
హోమము విఘ్నము కాకుండుటకై
వాడుపన్నిన పన్నాగమిది.

యజ్ఞధ్వంసము జరిగినంతనే
నిశితరములతొ లక్ష్మణమూర్తి
ఇంద్రజిత్తును వధించివేయును
కావున పంపుము శుభలక్షణుని.

రామా! మనము ఇపుడేపోయి
నికుంభలాంబ దేవాలయమున
హోమము విఘ్నము గావించవలె
నీవు దుఃఖమును వదలివేయుము.

తారకాసుర సంహారమునకు
కుమారస్వామిని సురపతిపంపెను
అటులే ఇపుడు అదను గావున
అనుజుని పంపుము-ఆజ్ఞాపించుము.

రామా! నీవు ఇచటనె వుండుము
లక్ష్మణమూర్తిని కపియోధులతో
పంపుము మాతో ఆ నరవ్యాఘ్రము
వానియజ్ఞము నాశము చేయును.

హోమసమాప్తి అయినచొనింక
అదృశ్యముగా వాడు పోరును
మనకు సైతము అజేయుడగును
అంతవరకు నువు రానీయకయా!''

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 8 5 లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో పోరగ బయలుదేరుట

వీభీషణుండు చెప్పినదంతయు
బాధలొనున్న రామచంద్రుడు
తెలియకపోయి తిరిగి అడిగెను
వివరముగా విషయమ్ముతెలుపుమని.

జరిగినదంతా మాయని తెలియుము
నిన్నుచూచి ఈ కపులందరును
మరింత దుఃఖమునందుచుండిరి
అదియే కోరిరి మన శాత్రవులు.

వాక్యకోవిదుడు విభీషణుండు
పలికె వినయము భక్తినిండగా
''స్వామీ! నీవు చెప్పినట్లుగా
సైన్యవిభాగము చేసివచ్చితి.

దుష్టుని దునిమి సీతాదేవిని
గ్రహించనెంచిన నేను చెప్పినటు
విను రఘురామా! నీ శ్రేయమును
నిరతముకోరెడి భృత్యుడనయ్యా!

నాలుగు ప్రక్కల సేనల నుంచి
యూథపతులను ఏర్పరచితిని
నీ సన్నిధికి బయలుదేరితిని
ఇచ్చటచూచితి నిన్నీ స్థితిలో.

తమ్ముని పంపుము ఆ మహనీయుడు
నికుంభలాంబ ఆలయమందున
పోరునుసలిపి ఇంద్రజిత్తును
అంతముచేయును ఇదియే అదను.

విషసర్పములతో సమమగు శరములు
వింటిని త్రిప్పుచు వీర వరేణ్యుడు
లక్ష్మణమూర్తి వదలుచుండగా
నిలువలేక ఆ అసురుడు కూలును.

తపస్సుచేసి విరించివలన
బ్రహ్మ శిరమను అస్త్రమునందెను
కోరినట్లుగా పోగల రథమది
నాల్గు అశ్వముల రథమును పొందెను.

యజ్ఞ సమాప్తి వాడు చేసినచొ
మనలను సైతము కూల్చును వాడు
యజ్ఞ విఘ్నము చేసిన వీరుడె-
వానిని చంపగ చాలిన వాడగు.

వాని మరణ మా విధముగ బ్రహ్మ
విధించినాడు కావున-తమ్ముని
యజ్ఞ విఘ్నము చేయుట కొరకు
అసురుని చంపుట కొరకై పంపుము.

ఇంద్రజిత్తు మరి లేడన్నచొ యిక
బంధుమిత్రులతొ రావణరాజు
కూలిపోయినటు తలంచవలెను
ఆలసించక త్వరపడవలెను.''

విశదముగా విని రామచంద్రుడు
వాని మాయలు తెలిసెను అనుచు
అసురుని వధించఅనతి నిడెను
సుమిత్ర సుతునికి చెప్పెను ఇటుల :

''సోదర! నీవు వానర రాజుతొ
మారుతి అంగద జాంబవంతులను
మిగిలిన యోధుల వెంట నిడుకొని
విభీషణునితో సాగుము ఇపుడే.

మాయ యుద్ధమున ఆరితేరిన
ఇంద్రజిత్తును అంతము చేయుము''
అనుచు రాముడు ఆవేశముగా
ఆనతినిడెను లక్ష్మణమూర్తికి.

కవచము దాల్చెను వీర వరేణ్యుడు
బంగరు ధనుసుఅమ్ముల పొదులు
నిశిత ఖడ్గము సిద్ధపరచుకొని
రామపాదముల నమస్కరించి

''స్వామీ! నేను వదలెడి శరములు
అసురుని తనువును చీల్చివేయుచు
కొలనులొ సాగే హంసల తీరుగ
లంకాపురమున నిండిపోవును.''

వీరోచితముగ పలుకుచు తమ్ముడు
అన్నగారి ఆశీస్సులనంది
నికుంభలాచైత్యమ్ము త్రోవలో
సాగెను-యోధులు వెంట నడచిరి.

వానర సేనతొ మారుతి కదలెను
భల్లూకములతొ జాంబవంతుడు
అఖండ సేనతొ సుగ్రీవుడును
అంగదుడున్ను అనుసరించిరి.

నల్గురు సచివులు వెంట నడువగా
విభీషణుండు వెంట నడచెను
దూరమునుండే అసుర సేనలను
చూచి- లక్ష్మణుడు వడిగా సాగెను.

ఆయుధమ్ములు రథముల వెలుగున
అంతులేని ఆ రాక్షస సేనలో
ఆలయ మెచ్చట నున్నదో అపుడు
అగపడలేదు ఆ వీరులకు.

॥శ్రీ రఘురాముని॥

✽✽✽

## 86 ఇంద్రజిత్తు హోమ విఘ్నము- అతనితో పోరు

లక్ష్మణమూర్తికి చేయవలసినది
తెలియబరచెను విభీషణుండు :
"నల్లని మేఘములన్నటులున్న
అసురులపైన విరచుకు పడవలె.

వానరులటుల శిలల తరులతో
అసుర సేనలను ఎదుర్కొనగనే
నిశిత శరముల రాక్షస మూకను
చిందర వందర చేసి వేయవలె.

అటులా అసురులు కలవరపడగ
కనబడు నీకు రావణు తనయుడు
యజ్ఞ సమాప్తి జరుగు లోపలే
మాయల మారిని త్రుంచగ వలెను."

వెంటనె వానర యోధులు కదలిరి
అసుర సేనలను ముట్టడించిరి
గోళ్ళతో పీకిరి కోరల కొరికిరి
రక్కసి వీరుల చీల్చసాగిరి.

అదే అదనుగ రామానుజుడు
శరవర్షము కురిపించసాగెను
రాక్షస వీరులు నిశితశరముల
కపి యోధులను కొట్టసాగిరి.

ఖడ్గమ్ములతో తోమరమ్ముల
శాక్త్యాయుధముల పరిఘలతోను
రాక్షసయోధులు కపులను కొట్టిరి
తిరుగు దెబ్బను కపులు కొట్టిరి.

ఘనసంగ్రామము జరిగినదప్పుడు
శరముల కుప్పలు ఆయుధ గుట్టలు
రణరంగమున రాలిపడినవి
అమిత సంఖ్యలో అసురులు కూలిరి.

కోలాహలము అలజడి అరపులు
అసురుల ఆక్రందనము లెగయగా
అసురవీరులు నేల కొరుగుట
అసుర నాయకుని తనయుడు గాంచెను.

ఆవేశమ్ముతొ ఆగ్రహమ్ముతో
యజ్ఞకర్మ పరిపూర్తి కాకనే
మధ్యలొ లేచెను ఆ మాయావి
అనుచరులతొ అటవచ్చి చూచెను.

గుట్టలు గుట్టలు శిలలు తరువులు
నేలకొరిన అసుర వీరులు
అమిత కోపమున అచ్చటనున్న
దివ్యరథమును అధిరోహించెను.

జ్వాలనేత్రముల కాలయమునివలె
కార్ముకమ్మును చేత ధరించి
సర్వనాశమును చేయగనిలచిన
ఇంద్రజిత్తును రథమునగాంచి.

సింహనాదమును చేసిరి అసురులు
ఇంద్రజిత్తును అనుసరించిరి
అంతట మారుతి విజృంభించెను
ప్రళయాగ్నివలె నిలబడినాడు.

భూరి తరువులతొ అసురులనెదిరి
వేలసంఖ్యలో కూల్చెను వారిని
అంతలోనె ఆ అసురలందరు
కమ్ముకొనిరి వీరాంజనేయుని.

పరిఘలకొట్టిరి చేతుల గ్రుద్దిరి
ఈటెలు శూలము లాయుధములతో
గదలు గొడ్డళుల ఇనుపగుదియల
అందరొక్కటై పోరిరి హనుమతొ.

చక్రాయుధముగ మెరసే కత్తుల
మారుతసూనుని కొట్టి రసురులు
అంతమందితో ఒక్కడె పోరెను
చెక్కు చెదరక నిలచెను మారుతి.

వాయునందనుని క్రోధము పెరిగెను
గిరివలె ఎదిగి అసుర వీరులను
వధించసాగెను ఆ విక్రముని
ఇంద్రజిత్తుగని విస్మయపడెను.

రావణతనయుడు పలికె సారథితొ :
''ఉపేక్షించగా తగదు నేనిక
హనుమంతుడు అతిసాహసవంతుడు
అందరినొకడే చంప సమర్థుడు.

రథమునుతోలుము ఆ కపివైపు''
అనుచుచెప్పగా రథము అప్పుడు
సాగెను మారుతి ఉన్నదిక్కునకు
అసురుడు శరములు వదలసాగెను.

గొడ్డళ్ళను మరి పట్టసాలను
ఖడ్గమ్ములను ఆయుధాలను
తీవ్ర శరములను అసురుడు విడువగ
మారుతి భీకర ధ్వనితో పలికెను :

''రావణ తనయుడ! వినుము తీరుగా
వాయుపుత్రుడను హనుమంతుడను
శూరుడవనుకొని వచ్చితి వీవు
నాతోపోరి బ్రతుకడెవ్వడూ!''

అదిగాంచిన ఆ విభీషణుండు
లక్ష్మణమూర్తితొ పలికెనప్పుడు :
''ఓ సౌమిత్రీ! రావణుతనయుడు
మన హనుమంతుని చంప నెంచెను.

ఇంద్రుని గెలచిన గర్వముతోను
వాయునందనుని చంపనెంచెను
ఇదే అదను–నువు అమోఘమైన
శరమును వదలి త్రుంచుము వానిని.''

రామానుజుడా మాటలు వినెను
ముందర గాంచెను మేఘనాథుని
హనుమతొ పోరగనిలచిన వానిని
జిత్తులమారిని ఇంద్రజిత్తును.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 87 ఇంద్రజిత్తు విభీషణుని పరుషము లాడుట– విభీషణుడు బుద్ధి గరపుట

ధనుర్ధారి యగు లక్ష్మణమూర్తిని
వెంటబెట్టుకొని విభీషణాఖ్యుడు
దగ్గరలో గల వనమున చేరెను
హోమ స్థలమును చూపెను స్వామికి.

నీల మేఘమును పోలిన యట్టి
భయంకరమగు మఱ్ఱి వృక్షమును
అచ్చట గాంచెను రామానుజుడు
అంతట తెలిపెను రావణుతమ్ముడు :

''లక్ష్మణమూర్తీ! రావణు తనయుడు
ఇచ్చట నున్న మఱ్ఱి తరువు కడ
భూత బలిని తా ముందుగ నిచ్చి
ఆపై పోరుకు సాగును వీరుడు.

మఱ్ఱి కడకు ఆ వీరుడు వచ్చిన
వానిని మనము జయించలేము
అదృశ్యముగా పోరు సలుపును
నిశిత శరములతొ విజయము నందును.

మఱ్ఱితరువును చేరులోపలే
త్రుంచవలెను ఆ ఇద్రజిత్తును.''
సరియనిపలికి రామానుజుడు
వింటిని మీటుచు నిలచెనచ్చట.

అగ్నిహోత్రసమ తేజము నిండి
జ్వాలగనున్న అరదముపైన
కవచము దాల్చి ధనుర్ధారియై
ఇంద్రజిత్తు అట వచ్చి నిలచెను.

పులస్త్య వంశమునందు పుట్టిన
పరాక్రమునితో లక్ష్మణుడనెను :
''మాయలమారీ! నిలబడి పోరుము
పోరుకు నిన్ను పిలచుచుంటిని.

లక్ష్మణమూర్తికి ప్రక్కన వున్న
విభీషణుని గని పలికె నసురుడు :
''రాక్షసుడా! నీ బుద్ధి తెలిసినది
లంకలొపుట్టి పెరిగితి విచ్చట.

నా జనకునికి తమ్ముడ వీవు
నా పినతండ్రివి! నీకు తనయుడ
ద్రోహము ఎందుకు తలపెట్టితివి?
బంధుత్వమ్మును స్నేహము లేదు.

కులాభిమానము వదలిన కుమతీ!
స్వజనుల వదలి పరులెవ్వరికో
భృత్యుడవైతివి- నిన్ను గాంచిన
బాధ కలుగును పాపివైతివి.

మతిమంతులు నిను ఛీ! యనుపనిగద
నీ మతి చెడెను-నీచాశ్రయమా
గుణహీనుండును స్వజనుల వదలి
పరుల జేరుడు తెలియద నీకు?

దొడ్డ గుణములు కలిగి యున్నను
పరుడెన్నటికి పరుడే గాదా!
స్వజనుల వదలి చేరిన వానిని
చేరదీతురు స్వలాభమ్ముకై.

స్వజనుల కాదనిచేరినవానిని
వినియోగించుకు వాని స్వజనులను-
అంతముచేసి- ఆపై వానిని
నాశము చేతురు-లోకధర్మమది.

నిర్దయుడవయి నీచబుద్ధితో
నా కపకారము చేయగ నెంచి
నా హోమమ్మును పాడుచేయుటకు
నీవీ లక్ష్మణునిటకు తెచ్చితివి.

రావణాసురుని సోదరుడవు నువ్వు
ఇట్టి అకార్యము చేయగరాదు''
అని కటువుగను అతడు పలుకగ
తిరిగి పలికెను అన్న కొడుకుతో :

``ఓ దుర్మార్గుడ! తెలియనట్లుగా
వదరుచుంటివి! నన్ను ఎరుగవా
నా స్వభావము తెలియద నీకు
పినతండ్రినని మరచిపోతివా?

రాక్షసవంశము నందున బుట్టియు
రాక్షస చేష్టల నెరుగనివాడను
అధర్మమ్మును దరిరానీయను
గుణము ముఖ్యము కులముకన్నను.

చేతికి చుట్టిన పామును మనము
విదిల్చినట్టు అధర్మవర్తిని
వదలిపోవలె అతి శీఘ్రముగా
నీతి చెప్పిన-నను కాదనెను.

పరుని ద్రవ్యము-పరుని భార్యను
హరించువానిని, దురాచారుని
జీవహింసను చేయువానిని
వదలిపోవలెను అతి తొందరగా.

కాలెడి గృహమును వదలిపోయినటు
వానిని వదలిదూరము పోవలె
హితులను నమ్మకపోయినవాడు
నాశనమగునని నీకు తెలియదా?

మహాఋషులను చంపివేయుట
సురలందరితో వైరము పూనుట
గర్వము, కోపము, బద్ధవైరము
ఇతరుల మంచిని ఓర్వకపోవుట

అట్టి దోషములుశ్రీని హరించును
ఆయుర్దాయము నంతము చేయును
గిరిని మేఘములు ఆవరించినటు
అన్నను చేరెనుదోషములన్నీ.

అందువలననే అన్నను వదలితి
లంక నిలవదని నమ్మితి నేను
అన్న ఉండడని గట్టిగ నమ్మితి
నీవు వుండవని తలచితి నాడే!

దుష్టబుద్ధివి- అహంకారుడవు
ఏమియు తెలియని మూర్ఖుడవీవు
కాలుని దరికి చేరనుంటివి
నీకుతోచినటు వదరుము వినెదను

దుఃఖసమయ మాసన్నమైనది
రామలక్ష్మణుల కాదని బ్రతుకవు
లక్ష్మణు శరముల యమునిచేరుకొని
యమదూతలకు సేవలు చేయుము.

శస్త్రాస్త్రములతొ బలము చూపుము
లక్ష్మణమూర్తి విడచు శరములతొ
నీ బలములతోకూలెద వీవు''
అని విభీషణుడు పలికె పరుషముగ.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 8 8 లక్ష్మణ- ఇంద్రజిత్తుల పోరు

క్రోధవశుడయి రావణుతనయుడు
ఒరలో నుండి ఖడ్గము దూసి
విభీషణునిపై దూకనెంచెను
అంతలోనె అట లక్ష్మణుగాంచెను.

ఉదయగిరిని ఉదయించుభానుడై
హనుమ మూపుపై లక్ష్మణమూర్తిని
ఇంద్రజిత్తుగని - ఖడ్గమునొదిలి
ఘనమగు విల్లును చేతధరించెను.

లక్ష్మణమూర్తిని- విభీషణాఖ్యుని
ఇద్దర చూచి పలికె గర్వమున
''నేను వదలెడి శరముల గురిని
శక్తి కలిగినచొ తప్పుకోండిక.

దూదిని అగ్నికాల్చివేసినటు
నా శరములు మీ తనువులకాల్చును
యమసదనమునకు మిముగొనిపోవును
నాతోనిలచి పోరెడి దెవ్వడు?

రాముని తమ్ముడ! లోగడనేను
వదలిన శరముల మీ సోదరులు
మిమ్ము నమ్మిన సేనలన్నియు
నేలనుబడుట జ్ఞప్తియున్నదా?

క్రుద్ధపన్నగము పోలెడి నాతో
విషసర్పమును పోలెడి నాతో
పోరగనిలచితి వీ రణభూమిని
యమునిచూడగా తలంచుచుంటివి''

అనుచు గర్వమున పలుకుచునున్న
ఇంద్రజిత్తుతో ననెను లక్ష్మణుడు
అసాధ్యమ్మును సాధ్యమనుకొని
పలుకుచుంటివి నిజము నెరుగక.

గెలిచినట్టుగా పలుకుచుంటివి
దొంగమాదిరి పరుగిడిపోతివి
విజయకాంక్షి మరి నీవలె వదరడు
నీ పరాక్రమము చూపుము ఇపుడు''

అటుల లక్ష్మణుడు పలుకుచుండగా
కరకుటమ్ములు వదలె నసురుడు
బుసల సర్పముల తీరుగ పడినవి-
తిరిగి శరములు వదలెను అసురుడు.

అనుచు పలుకుచు సుమిత్రతనయుడు
అతివేగముగల అయిదు బాణములు
అసురుని రొమ్మున సూటిగ నాటెను
అమ్ములు భాసిలె! రవికిరణములన.

శరములు తగిలి నెత్తురు చిమ్మి
పొగలేనట్టి అగ్నిహోత్రమై
తేజమునిండెను లక్ష్మణమూర్తి
చలించలేదు రామానుజుడు.

అంతట అసురుడు అమిత కోపమున
వాడి శరములు మూడు విడచెను
ఇటు లక్ష్మణుడును అటు రాక్షసుడు
ఇరువురు పోరిరి- జయాభిలాషులు.

సింహనాదమును చేసెను అసురుడు
తిరిగి పలికెను లక్ష్మణమూర్తితొ :
''నా శరములు నీ దేహము చీల్చును
నక్కల పులుగుల కాహారమగు.

ఒకరికి ఒకరు లొంగని వీరులు
అస్త్ర శస్త్రముల నెరిగినవారు
అమిత బలమున విరాజిల్లుచు
నింగినిగ్రహముల తీరుగ పోరిరి.

క్షత్రియాధమ! రామ భక్తుడా!
నిన్నుత్రుంచి నీ శిరసుగ్రహించెద
మిగిలిన మొండెము రాముడుచూచును
తెగిన కవచముతొ మొండెముగనును.''

దేవేంద్రుడును వృత్రాసురులను
పోలిరివారు- పోరెడివారు
రెండు సింహములు అన్నటులుండిరి
శరవర్షము కురిపించుకొనిరట.

రోష పూరిత నయనమ్ములతో
పలికెనప్పుడు రామనుజుడు
''క్రూరుడవని నే నెరుగుదు నిన్ను
మాటల రోషము- చేతల చూపుము.

ఒక్కొకసారి ఒక్కొక వీరుడు
విజృంభించి విజయకాంక్షతో
సురనాయకుడు శంబరాసురుల
తలపించునటు పోరు సలిపిరి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 8 9 లక్ష్మణ, ఇంద్రజిత్తుల మధ్య ఘన సంగ్రామము

ఫణివలె బుసలను విడచుచు నప్పుడు
ధనుసు మీటెను లక్ష్మణమూర్తి
అల్లె త్రాటిధ్వని నింగి కెగసెను
ఇంద్రజిత్తు ముఖమంతయు మారెను.

వెలవెలబోయెడి ముఖముతొ నున్న
అసురుని గాంచి విభీషణుండు
''లక్ష్మణ! గనుము వాని ముఖమును
దక్కడు వాడనితోచుచున్నది.

అపశకునములు అగపడుచున్నవి
నీ చేతిలో వాడంతము అగును
తొందరపడవలె'' అన్న మాట విని
లక్ష్మణమూర్తి ఆలసించక

అగ్నిహోత్రమును పోలు శరములు
అసురునిపైన విడువగ నవ్వి
వజ్రాయుధము అన్నటు తాకెను
కంపించెను ఆ రావణు తనయుడు.

తిరిగి తేరుకొని అమిత క్రోధమున
ఏడు శరములు లక్ష్మణుపైన
పది శరములను మారుతిపైన-
వదలెనువంద విభీషణునిపై.

అసురుని శరముల లెక్కచేయక
నవ్వుచు పలికెను లక్ష్మణమూర్తి :
''చేవలేని నీ శరములు లెక్కా
వీరులు వదలరు ఈ బాణములు''

అనుచు పలుకుచు రామానుజుడు
అమోఘ శరములు సూటిగ వదలి
ఇంద్రజిత్తు కవచమ్మును త్రుంచెను
తారల తీరుగ తునకలు రాలెను.

శరములు తగిలి ఇంద్రజిత్తునకు
దేహమంత గాయమ్ములైనవి
అయినను అసురుడు లక్ష్యపెట్టక
వేయి బాణములు విడచెను సూటిగ.

ఇంద్రజిత్తు అటువదలిన శరముల
రామానుజుని కవచము తెగెను
శరములు తగిలి రక్తము కారెను
అసురుని బలము తెలిసెనప్పుడు.

మేన కవచములు లేకపోయినను
రక్తసిక్తమై తనువులున్నను
జయాభిలాషులు పోరసాగిరి
శరవర్షము కురిపించసాగిరి.

సమయము తెలియక-విసుగులేకను
వీరవరేణ్యులు పోరుచుండిరి
అలుపు నెరుగని ఆ రణధీరులు
దివ్యాకృతిగల శరముల పోరిరి.

ధనుసు మ్రోతలు పిడుగుల పోలెను
వ్యర్థముకాక శరములు తగిలెను
ఇరుపక్షముల సేనలన్నియు
భయభ్రాంతులై నిలచిపోయిరి.

నెత్తుటి ఏరు ప్రవహించినది
నెత్తుట తడిసిన శరములు రాలెను
కొన్ని శరములు నింగి కెగిరెను
శరముల విరిగెను కొన్ని శరములు.

గార్హపత్య-మరి- ఆహవనీయ
యజ్ఞాగ్నులలో చేరు దర్భలన
రణమను యజ్ఞమునందు శరములు
గుట్టలు గుట్టలు నేలబడినవి.

రక్తసిక్తమై దేహములుండగ
ఆకులురాలి పూలతొనిండిన
బూరుగు-మోదుగు తరువులపోలి
రణరంగమున నిలచిరి వీరులు.

మేన దిగబడిన అమ్ములతోనట
చెట్లు మొలచిన పర్వతాలవలె
రక్తసిక్తమై తనువులుండగ
అగ్నిహోత్రముల తీరుగతోచిరి.

ఒకరిని ఒకరు వధించనెంచి
వీరోచితముగ పోరుసలిపిరి
దెబ్బలు ఎన్నో తగిలినగాని
అలుపునెరుగక పోరిరి వీరులు.

వీరుడు విభీషణాఖ్యుడప్పుడు
లక్ష్మణమూర్తికి అలుపుతీర్చగ
యుద్ధరంగమున వచ్చినిలచెను
ఇంద్రజిత్తుతో పోరగవచ్చెను.

॥శ్రీ రఘురాముని॥

***

## 90 విభీషణుడు కపుల నుత్తేజపరచుట– లక్ష్మణ ఇంద్రజిత్తుల భీకర పోరాటము

విభీషణుండు ఘనచాపముతో
రణరంగమున అడుగుబెట్టెను
అల్లెత్రాటి ధ్వని ఉరుముచుండగా
కరకు శరములు విడువసాగెను.

''వానరయోధులు మీరందరును
విరోచితముగ పోరుసలిపిరి
రావణుసేనలొ మిగిలినవాడు
ఇంద్రజిత్తు-వీడొక్కడె వీరుడు

పిడుగుపాటుకు గిరులు పగిలినటు
అగ్ని హోత్రమగు శరముల నపుడు
విభీషణుడు నలువంకల విడచెను
అసురులెందరో నేలకూలిరి.

వీనిని నమ్మెను రాక్షసరాజు
వీనిపైననే ఆశ నిలపెను
వీనిని మీరు త్రుంచి వేసిన
వానిపని ఇక ఆఖరయినటే.

విభీషణుండు శరములు వదలగ
శూల పట్టస ఖడ్గమ్ములతో
అతని సచివులు పోరుసలిపిరి
అసురు లెందరినొ నేల కూల్చిరి.

బలవంతులతో పోరి- చంపిరి
ప్రహస్తునెదిరి పోరునచంపిరి
కుంభనికుంభులు కూలిపోయిరి
కుంభకర్ణునే చంపిరి మీరు.

అటుల పోరుచు విభీషణుండు
అదునుగాంచి- ఆ కపియోధులను
ఆహవభూమిలొ ప్రోత్సహించెను
అమితోత్సాహము కలుగజేసెను.

ధూమ్రాక్షుడును జంబుమాలియు
వజ్రదంష్ట్ర సంహాద్రి వికటుడు
జంఘు ప్రజలంఘులు మన్నున కలిసిరి
ప్రఘసుడు తపనుడు రణమున ఒరిగిరి.

రశ్మికేతువు, విద్యుజ్జిహ్వుడు
సూర్యశత్రువు, అకంపనుండు
సుపార్శ్వుడున్ను, చక్రమాలియు
దేవాంత నరాంతకు లొరిగిపోయిరి.

వానరులారా! ఎంతోమందిని
అసురుల కూల్చిన అతిబలవంతులు
కడలికి వారధి కట్టిన యోధులు
కోసలభూపతి నమ్మినవీరులు.

ఇంద్రజిత్తును ససైన్యమ్ముతో
కూల్చుట మీకు లెక్కలోనిదా?
గోష్పదమ్మును దాటుట వంటిది
వీడొక్కడినిక జయించవలెను.

అన్నకొడుకు మరి చంపగరాదని
ఆహవభూమిలో నే తలంచను
రామకార్యము శిరోధార్యము
అందుకు సిద్ధము వీనిని చంపగ.

నేనే స్వయముగ చంపుటకై మరి
యోచించినచో- కన్నుల నీరు
గిర్రున తిరిగి చూపుల నాపును
మమతాబంధము ఆపును నన్ను.

లక్ష్మణమూర్తి చంపును వానిని
మీరందరును విజయకాంక్షతో
అసురసేనలను అంతము చేయుడు''
అన విని కపులు నిండుగ నిలిచిరి.

వర్షితమేఘము గాంచిన యంతనె
ఆనందించే నెమళ్ళ తీరుగ
కోలాహలముతొ లేచిరి కపులు
వాలము లూపిరి నేలకు బాదిరి.

జాంబవంతుడు ముందుకు దూకెను
వానరవీరులు భల్లూకములు
అనుసరించిరి అసురుల చీల్చిరి
గోళ్ళతొ చీరి కోరల కొరికిరి.

అసుర వీరులు ఆయుధాలతో
తిరిగి కొట్టిరి జాంబవంతుని
భీకర యుద్ధము జరిగెనప్పుడు
వీరులెందరో నేల కొరిగిరి.

వీరవరేణ్యుడు ఆంజనేయుడు
లక్ష్మణమూర్తిని నేలకు దింపి
సాల వృక్షమొక దానిని పెరకి
వేలకు వేల అసురుల కూల్చెను.

ఘనముగ తనతో పోరుచు నున్న
పినతండ్రిని వదలి రావణు తనయుడు
తిరిగి లక్ష్మణుని పైకి సాగెను
శర వర్షము కురిపించ సాగెను.

వరుసగ వదలు శరములతో నట
ఒకరికి ఒకరు కనబడకుండిరి
వర్షిత మేఘము చాటున నున్న
రవి చంద్రులుగ తోచిరి వీరులు.

వీరవరేణ్యులు వింటిని పట్టుట
అమ్ములు తీయుట, వింటికి కూర్చుట
విడచుటగురితో, తిరిగి తీయుట
కంటికి కనబడకున్నది నేర్పు.

నింగి శరములతొ నిండిపోయెను
దిశల చీకటులు క్రమ్ముకొన్నవి
సూర్యాస్తమయము అన్నటులున్నది
నెత్తురు పారెను ప్రవాహమ్ముగా.

క్రూర జంతువులు భీతిలి అరచెను
వీచుట ఆగి- వాయువు చూచెను
అగ్ని జ్వలించక నిలచిపోయెను
గంధర్వ చారణులు పరుగులెత్తిరి.

'లోకాస్స్వమస్తొ స్సుభినోభవన్తు'ని
లోక శాంతిని కోరుకొనుచును
మహాఋషులు అటశుభములుపలికిరి
ఘన సంగ్రామము జరిగెనప్పుడు.

ఇంద్రజిత్తు బంగారు రథమునకు
బంగరు ఆభరణమ్ములు గలిగిన
వడిగా పోయే నాల్గు తురగముల
నాల్గు శరములతొ కొట్టె లక్ష్మణుడు.

తళతళలాడుచు మెరిసే అమ్మును
రథ సారథిపై వదలె లక్ష్మణుడు
దివ్య శరమది అవలీలగను
త్రుంచివేసినది సారథి తలను.

సారథి కూలగ- యోధుడు అపుడు
తానే స్వయముగ రథము నడుపుచు
వింటి నందుకొనిరావణు తనయుడు
పోరుకు నిలచెను లక్ష్మణమూర్తితొ.

రథము నడుపుచు పోరగ నిలచిన
రావణు తనయుని ధైర్యమ్మునకు
ఆశ్చర్యపడి లక్ష్మణమూర్తి
తిరిగి శరముల కొట్టె నశ్వముల.

నిర్భయమ్ముగా రథమున తిరుగుచు
నిలిచిన రావణు తనయునిపైన
శరవర్షము కురిపించె లక్ష్మణుడు
ఇంద్రజిత్తు గర్వమ్ము దిగినది.

ఇంద్రజిత్తు వదనమ్ము దీనమై
అగపడినంతనె వానర వీరులు
ఆనందముతో లక్ష్మణమూర్తిని
అభినందించిరి ఆ రణభూమిని.

ప్రమాధి, శరభ, రభసుడు మరియు
గంధమాదన నల్గురు కపులు
ఎగిరి దూకిరి రథాశ్వములపై
రక్తము గ్రక్కి గుఱ్ఱము లుడిగెను.

గుఱ్ఱము లటుల నేల కూలగ
ఆనందముతో ఆ కపివీరులు
మహారథమును ముక్కలు చేసి
ముదముగ నిలచిరి లక్ష్మణు చెంత.

రావణు తనయుడు క్రిందకు దూకి
శరములు వదలెడి లక్ష్మణువైపు
పరుగెత్తెను- ఆ వీర వరేణ్యుడు
నిశిత శరముల నిలపె నసురుని.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 9 1 లక్ష్మణమూర్తి విడచిన శ్రీరామనామబాణమున ఇంద్రజిత్తు కూలుట

మహావీరుడగు ఇంద్రజిత్తు తన
రథము పోయెనని దిగులునందక
పరాక్రమముతో జ్వాలమాదిరి
ఎదిరిపోరెను లక్ష్మణమూర్తితొ.

లక్ష్మణమూర్తి నిశితశరములతొ
భీకరమైన పోరుసలిపెను
కపులు రాక్షసులు కలబడిపోరిరి
బీభత్సమట తాండవించెను.

ఇంద్రజిత్తు తనవీరులగాంచి
పొగడి పలికెను సందర్భముగా
''అసురవీరులు! అటులే పోరుడు
చీకటిక్రమ్మి కనబడకున్నది.

వానరయోధుల మోసగించవలె
పోరు ఉధృతము చేయగవలెను
చిటికెలోన-నే లంకకుచేరి
రథముతో వచ్చెద అతితొందరలో

మీరు ధైర్యముగ పోరుటగాంచి
నేనుంటినని కపులు తలతురు
అదే అదనుగా అరదముకొరకై
లంకకేగి నే రథముతొ వత్తును''

అనుచు పలుకుచు రావణుతనయుడు
లంకాపట్నములోనికి పోయి
ఉత్తమాశ్వముల అలంకారముల
నిలచిన బంగరు తేరును ఎక్కెను.

ఈటెలు కత్తులు చాపమ్ములతో
అశ్వహృదయము తెలిసిన సారథి
రథముసిద్ధముగ నుంచగ దానిని
అధిరోహించెను-పోరుకు వచ్చెను.

అంతటిలోనే రథముతొ వచ్చెను
ఇంతవరకు ఇట పోరుచుండెను
వాడెప్పుడు మరి పోయివచ్చెనో-
చకితులైరి ఆ అసురునిగాంచి.

శరవర్షమును కురిపించుచును
వానరవీరుల కూల్చె నసురుడు
వలయాకారము తిరిగెను విల్లు
విడచిన శరములు కంటికగపడవు.

అద్భుతయుద్ధము అసురుడు చేయగ
శరఘాతములకు నిలువలేకను
బ్రహ్మచెంతకు సురలు చేరినటు
కపులు చేరిరి లక్ష్మణమూర్తిని.

క్రోధానలము భగ్గున ఎగసెను
నిశితశరమును తీసి లక్ష్మణుడు
ఇంద్రజిత్తుని ధనుసు త్రుంచెను
మరియొక విల్లును తీసె నసురుడు.

అంతటిలోనే లక్ష్మణమూర్తి
కత్తిని పోలిన కరకుటమ్మును
వదలెను సారథిపైకి సూటిగా
శరముతగిలి ఆ సారథి ఒరిగెను.

తీసిన వింటిని ఎక్కుపెట్టగా
నిలచినంతలో లక్ష్మణమూర్తి
మరి మూడమ్ముల దానిని త్రుంచెను
అయిదు బాణములు విడచెవక్షమున.

సారథి ఒరిగిన సంగతి తెలిసి
నేర్పుగలిగిన ఆ తురగములు
సుడులు తిరుగుచు రథమును త్రిప్పుచు
వచ్చెడి శరముల తప్పించినవి.

లక్ష్మణమూర్తి వదలిన శరములు
విల్లులేని ఆ ఇంద్రజిత్తుకు
తగిలి రక్తమున తడిసిపడినవి
కవచము తెగినది రక్తముగ్రక్కెను.

అశ్వములంతటి చాకచక్యముగ
శరములతాకిడి తప్పించగను
లక్ష్మణమూర్తి విస్మయపడెను
శరములు వదలెను తురగమ్ములపై.

వెంటనె అసురుడు ఘనమగుచాపము
చేతధరించి నిశిత శరములను
రామానుజుని పైకి విడచెను
గిరివలెనిలచెను లక్ష్మణమూర్తి.

అమితకోపమున రావణుతనయుడు
వజ్రతుల్యమగు పది బాణములు
లక్ష్మణమూర్తి పైకి విడచెను
కవచమ్మునకు తగిలిపడినవి.

అనేక శరములు వదలుచు నపుడు
శరవిన్యాసము చూపెనసురుడు
లక్ష్మణమూర్తి అసురులత్రుంచుచు
శరనైపుణ్యము చూపెనసురులకు.

రామానుజుడు ధరించినట్టి
కాంచనకవచము అభేద్యమ్మని
అసురుడు తెలిసి మూడు బాణములు
రామానుజుని నొసట విడచెను.

శరములు తగిలి బాధపడుచును
తిరిగి శరములను విడచెనసురుడు
వచ్చెడి శరముల మధ్యత్రోవలో
త్రుంచెను నేర్పుగ రామానుజుడు

మూడు బాణములు నొసట తగలగా
మూడు శృంగముల గిరివలె నపుడు
లక్ష్మణమూర్తి నిలచె నచ్చట
బాధ నోర్చుకొని తిరిగి నేర్పుగా

ఆకర్ణాంతము విల్లును లాగి
అయిదు శరములు అమోఘమైనవి
కుండలాలతో మెరయుచునున్న
అసురునిపైకి విడచె లక్ష్మణుడు.

విభీషణుడు అదియంతయు గాంచి
అగ్నిజ్వాలవలె కోపము ఎగయగ
ఘనమగు చాపము నందుకు నిలచి
అయిదు శరములను విడచెను సూటిగ.

వీరు లిద్దరూ శరములు తగులగ
నెత్తురుకారే దేహమ్ములతో
విరగబూసిన మోదుగుచెట్లను
తలపించిరి ఆ రణరంగమున.

వక్షస్థలమున తగిలిన శరములు
చీల్చి-నెత్తుట తడిసి పడినవి
ఇంద్రజిత్తునకు కోప మెగసెను
చంపగ నెంచెను విభీషణాఖ్యుని.

ఒకరిని ఒకరు జయింపగోరి
విడచుకొన్న ఆ నిశిత శరములు
ప్రతి అవయవమును గాయపరచెను
సడలిపోక అట పోరుచుండిరి

యముడు ఒసగిన దివ్యశరమును
వింటికికూర్చెను- ఆ విషయమును
లక్ష్మణమూర్తి గ్రహించినాడు
గ్రహించె నొక్క అమోఘ శరమును

కోపము పెరిగి రావణుతనయుడు
విభీషణుని ముఖమందున అపుడు
మూడు శరములు విడచి- ఆగక
ఒక్కొక అమ్మున కొట్టెను కపులను.

సురాసురులు ఎదిరించలేనిదగు-
ధనపతి స్వయముగ లక్ష్మణుకిచ్చిన
శరమును తీసి లక్ష్మణమూర్తి
నిలచెను-విడచెను ఘనముగ ఖుసలను

విభీషణుండు కోప వశుడయి
ఘనమగు గదతో రథముకు పూన్చిన
తురగమ్ములను మోదగ నవ్వి
నేల కొరిగినవి రథము కూలెను

ఇద్దరు వీరులు అమోఘ శరములు
సంధించిరి-తమ బలమగు భుజముల
ఆకర్ణాంతము లాగి విడచిరి
దిక్కుల కెగసెను దివ్యనాదము.

నేలకు దూకి రావణుతనయుడు
రథశక్తిని గొని విభీషణునిపై
ప్రయోగించగా - నిశిత శరమున
శక్తిని త్రుంచెను లక్ష్మణమూర్తి.

బయలుదేరిన దివ్యశరముల
వెలుగుతొ నింగి తేజరిల్లెను
మంటలు పొగలతొ రెండు శరములు
నింగిని పోరి నేల కూలినవి.

దివ్యశరములు నేల కూలగా
వీరులిద్దరూ సిగ్గునందిరి
తీవ్ర కోపమున లక్ష్మణమూర్తి
వారుణాస్త్రమును విడచెనప్పుడు.

ఇంద్రుని గెలిచిన వీరవరేణ్యుడు
రుద్రదేవతాస్త్రమ్ము వదలగా
వారుణాస్త్రమును నేల కూల్చెను
తిరిగి రోషములు రాజుకున్నవి.

విజయకాంక్షియై రావణుతనయుడు
లోకములన్నీ కాల్చివేయుటకు
వదలెనో ఏమో? అన్నటులపుడు
ఆగ్నేయాస్త్రము విడచె సూటిగా.

సౌరాస్త్రముతో ఆ సౌమిత్రి
ఆగ్నేయాస్త్రము నడ్డగించెను
అంతట అసురుడు అమిత కోపమున
అసురాస్త్రము సంధించి విడచెను.

అసురాస్త్రమ్ము- ఆయుధాలను
గదలు, శూలములు, గండ్రగొడ్డళులు
శరములు, కత్తులు, ముద్గరమ్ములను
సృజించి ముందుకు పోరున కంపెను.

అసురాస్త్రమును అంతటివరకు
అడ్డగించిన వీరులు లేరు
నిశ్శేషముగా రిపులను కూల్చగ
శక్తివంతమగు అస్త్రము అది యగు.

అసురాస్త్రమును గాంచి లక్ష్మణుడు
మహేశ్వరాస్త్రము వదలెను అపుడు
రామనుజుని దివ్యాస్త్రమ్ము
అసురాస్త్రమును నేలకు రాల్చెను.

లక్ష్మణమూర్తి ఇంద్రజిత్తులు
ప్రచండ యుద్ధము చేయుచుండిరి
నింగిని ఉన్న సర్వ భూతములు
లక్ష్మణమూర్తిని చూచుచున్నవి.

అరపులు కేకలు సింహ నాదముల
అసురులు కపులు పోరుచుండిరి
సుర గంధర్వులు పితృ దేవతలు
లక్ష్మణమూర్తికి రక్షణ నిడిరి.

రాముని అడుగుల నడచే తమ్ముడు
రామానుజుడు- అమోఘ శరమును
తాకిన కాల్చెడి అగ్ని గోళమును
బంగారముతో చేసిన శరమును

అంతటి వరకు ఆ బాణమును
వింటకూర్చక నిలచి యున్నది
ప్రళయ భయంకరమైన బాణమది
సురల పూజలను అందిన శరమది

దేవేంద్రుడు ఆ దివ్య శరమున
అసురుల గెలిచెను మహారణమున
అపజయ మెరుగని నారాచమ్మది-
రాచపట్టి సంధించె నప్పుడు

ఇంద్రాస్త్రముతో అమోఘ శరమును
అభిమంత్రించెను రామానుజుడు
మనుజ శ్రేష్ఠుడు ఉత్తమ శరమును
శ్రేష్ఠమైన చాపమ్మున కూర్చి

జయాభిలాషి రామునితమ్ముడు
కర్తవ్యము బోధించెను శరముకు
శరముతొ పలికెనుపొంగిన గుండెతొ
పొంగిపోయినది అమోఘ శరము

''ఓ నారాచమ! దశరథ తనయుని
జ్యేష్ఠకుమారుడు రామచంద్రుడు
ధర్మాత్ముడును సత్యసంధుడు
అవక్ర విక్రమ పరాక్రముడయి

అవనిలొకీర్తిని గడించియున్న
అనిలో నీవు అసురుని కూల్చుము
అన్నను నమ్మిన అమ్మువైనచో
ఇంద్రజిత్తును త్రుంచుము ఇపుడే.''

అనుచు పలుకుచు రామానుజుడు
అమ్మును వదలెను ఇంద్రజిత్తుపై
సూటిగ తగిలెను అమోఘ శరము
నామ బాణమది తిరుగులేనిది.

శిరస్త్రాణముతొ కుండలాలతో
వెలుగులు చిమ్మే వీరుని శిరమును
రావణుతనయుని శిరమును త్రుంచెను
తల వేరైనది మొండెము నుండి

రక్తధారలు ఎగసినవపుడు
నేల కూలెను అసుర వీరుడు
ఇంద్రుని గెలచిన వీరవరేణ్యుడు
సరియగు వీరుని ఎదిరి ఒరిగెను.

వృత్రాసురుని వధ వినినంతనె
ఆనందించిన సురల తీరుగా
విభీషణుండు వానర వీరులు
సింహనాదములు చేసిరి ముదమున

సుర గంధర్వులు మహాఋషులును
సంతోషముతో సవ్వడి చేసిరి
రాముని ఘనతను చాటిన అమ్ము
విజయ గర్వమున జగతిని చూచెను.

వానర యోధులు విజృంభించిరి
అసురులు భయపడి పరుగులెత్తిరి
ఆయుధాలను వదలి పరుగిడిరి
సముద్రమ్ములో దూకిరి కొందరు.

సూర్యాస్తమయము అయినచొ నింక
సూర్య కిరణములు కనబడనటుల-
ఇంద్రజిత్తు రణమందున కూలగ
ఒక్క అసురుడును అగపడలేదు.

నేలను బడిన అసురుని మొండెము
కొంచెపు సేవు కొట్టుకు ఆగెను.
ఆరిపోయిన అగ్నిగ తోచెను
కాంతులు లేని రవివలె తోచెను.

ఇంద్రజిత్తు మరణమ్ము మోదమ్మై
లోకమ్ములకు పీడలు తొలగి
ప్రశాంతి కలిగి సుఖపడుననుచు
సురలు, సురపతి ఆనందించిరి.

దేవ దుందుభులు మ్రోగినవపుడు
అచ్చర కన్యలు నాట్యము చేసిరి
పూల వానలు కురిసెను నింగి
సురలు లక్ష్మణుని ప్రశంసించిరి.

సురగంధర్వులు అచటకువచ్చి
మహర్షులకిక భయము తీరెనని
మదిలో మోదము లక్ష్మణమూర్తికి
తెలియబరచి అభినందించిరి.

జాంబవంతుడు విభీషణుడును
మనసునిండుగా అభినందించిరి
సింహనాదమును చేసిరికపులు
రామానుజుని దగ్గర చేరిరి.

పట్టరాని ఆనందము పొంగి
కపులు తోకలతొ శిలలను కొట్టిరి
చెట్లనుపీకిరి గంతులేసిరి
ఒకరిని ఒకరు కౌగలించిరి.

త్రోసుకొనుచును నేలనుబడుచు
నింగిచీలు జయఘోషను చేసిరి
లక్ష్మణమూర్తికి జయము జయమని
విజయగర్జనతొ అరచిరి వీరులు.

ఇంద్రజిత్తు రణమందుకూలెనని
వినిన దేవతలు వచ్చి చూచిరి
లక్ష్మణమూర్తిని చూచిరివారు
ఆనందముతో పరవశించిరి.

॥శ్రీ రఘురాముని॥

## 92 శ్రీరాముడు సౌమిత్రిని అభినందించుట

రాముని ఘనత తెలిపిన అమ్ముతొ
ఇంద్రజిత్తును అంతము చేసి
మేనగాయముల రక్తధారలతొ
రామచంద్రుని చేరెను తమ్ముడు.

విభీషణుని మరి వాయునందనుల
ఇరుప్రక్కలను ఊతగా గొని
అలసిపోయిన లక్ష్మణమూర్తి
అడుగులొ అడుగై అన్నను చేరెను.

ఇంద్రుని ముందర దేవగురునివలె
అన్నను చేరి ఆనందముతో
ఇంద్రజిత్తు హతుడైన విషయము
తెలియబరచెను వినయముగాను.

''వీరపుంగవుడు లక్ష్మణమూర్తిచె
రావణుతనయుని శిరముతెగినది''
అనుచు రామునికి విభీషణాఖ్యుడు
ఆనందముగా తెలియబరచెను.

అఖండ విజయము అనుజుడు పొందెను
ఆనందముతో పొంగిన గుండెతొ
ఆలింగనమున రాముడు మురిసి
అభినందించి శిరసును మూర్కొని

ఇంద్రజిత్తును కూల్చితి వీవు
సీతను పొందుట తేలికయింక''
అనుచు ప్రేమగ రామచంద్రుడు
అనుజుని మేను నిమిరెను చల్లగ.

''ఓ సౌమిత్రీ! ఘనకార్యమ్మును
నేర్పుగ చేసితివీవు లంకలో
రావణాసురుని జయించినట్లే
విజయము మనది నిస్సందేహము

అంతట రాముడు సుషేణుగాంచి
''వానరోత్తమా! మిత్ర వత్సలా!
విభీషణునికి లక్ష్మణమూర్తికి
వీరులెందరికొ శరములు తగిలెను.

రావణాసురుని కుడి భుజమ్మును
కూల్చితివయ్యా! మూడు రాత్రులు
ఏకధాటి నువు పోరి గెలిచితివి
హనుమ విభీషణు సాయమున్నది.

గాయమ్ములతో రక్తధారలతొ
బాధలొనున్న వారందరికీ
చికిత్సచేసి స్వస్థత గూర్చుము
బాధతీర్చి వారందరకావుము.''

రావణుధైర్యము ఇంద్రజిత్తుయగు
రావణుప్రాణము ఆతడేయగును
రావణుడింక మిగలడు సోదర!
నేటితొ శత్రువు కూలినట్లగు.

రాముని ఆనతి తలనుధరించి
దివ్యౌషధమగు మూలికతీసి
లక్ష్మణమూర్తికి వాసనచూపెను
చిత్రము-శరముల ములుకులురాలెను

తనయుడు కూలుట వినిన రావణుడు
రణముకు వచ్చును అఖండసేనతొ
అంతటి సేనను-లంకానాథుని
అవలీలగ నే తృంచివేసెద.

బాధహరించి స్వస్థతకూడెను
గాయమ్ములవి మాయమయ్యెను
అటులే అచ్చటి వీరులందరికి
వైద్యము చేసెను సుషేణుడచ్చట.

బాధలుతీరి స్వస్థతకూడి
వీరులులేవగ ఆనందించిరి
రామచంద్రుడును మిగిలిన వీరులు
లక్ష్మణమూర్తిని అభినందించిరి.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 9 3 దశకంఠుడు సీతాదేవిని చంపనెంచుట–సుపార్శ్వుని హితము

ఇంద్రజిత్తు రణమందు కూలెనని
సచివులు విని విభ్రాంతినందిరి
నిజము తెలుసుకొని చింతలొ మునిగి
రావణరాజుకు విన్నవించిరి :

''రాజా! దుర్విధి-వీరుడు ఒరిగెను
మేము అసువులతొ వుంటిమిగానీ
ఇంద్రుని గెలిచిన వీరుడు కూలెను
భీకరయుద్ధము చేసెను తనయుడు.

నిశిత శరముల లక్ష్మణమూర్తిని
కలవరపరచిన వీరవరేణ్యుడు
వీరశయ్యను అలంకరించెను
ఉత్తమలోకము చేరెను వీరుడు.''

ఘోరవార్తవిని లంకేశ్వరుడు
వ్యాకులమతియై మూర్ఛనందెను
పుత్రశోకమున కృంగిపోయెను
దైన్యముతో విలపించెను రాజు.

''రాక్షససేనకు ముఖ్యుడ వీవు
ఇంద్రుని గెలచిన వీరుడ వీవు
కోపము వచ్చిన యమునే త్రుంచెడి
శక్తి గలిగిన యోధుడ వీవు.

మందరగిరి శిఖరమ్మును శరముల
కూల్చగ చాలిన శక్తిమంతుడా!
మనుజుడు వాడు లక్ష్మణుడెంత-
వాని చేతిలో త్రుంచబడితివి.

స్వామికార్యమున అసువుల వీడిన
సమరాంగణమున తనువు వీడిన
తప్పక స్వర్గము చేరును అతడు
ఉత్తమలోకము అందెను నీకు

నీకొరకై నే వంతనొందను
నీవులేని ఈ మనుగడ నాకు
శూన్యమైనదిగ తోచుచున్నది
అతివల రోదన వినవలె నింక

దిక్పాలకులు సురనాయకుడు
సురలందరును సుఖముగ తిరిగే-
శుభఘడియ యని ఆనందింతురు
ఇందరి నొదిలి ఎచటకు పోతివి?

తనయుని చేతిలొ తండ్రి పోవుట
సమ్మతమైనది- కానీ నాయన!
తారుమారు నువు చేసితి విపుడు
తనువు నిలచునా తనయుని వదలి?

రామలక్ష్మణులు వానరరాజు
నాకు దుఃఖము కలుగజేసిరి
వారిని కూల్చక వదలిపోతివి''
అనుచు రావణుడు కుమిలిపోయెను.

కట్టలు తెగిన శోకమునిండి
పట్టరాని కోపమ్ము వచ్చెను
ఎఱ్ఱని కన్నులు మరింత ఎఱుపై
అగ్నికణములను రాల్చునట్లయె.

అంతటి కన్నుల పైకనుబొమ్మలు
ప్రళయకాలమున సంద్రమునందు
ఎగసెడి అలలతో పైకి లేచిన
మకరుల పోలి భయము గొలిపెను.

వృత్రాసురుని వక్త్రమునుండి
నాడు వెడలెను అగ్నిజ్వాలలు
అటులే రావణు నోటివెంబడి
పొగలు, జ్వాలలు ఎగసిపడినవి.

క్రోధవశుడయి కక్ష తీర్చుకొన
సీతను చంపగ నిర్ణయించెను
క్రోధానలము మూర్తిగ నిలచి
ప్రళయభయంకర రూపమైనది.

ప్రళయకాలమున రుద్రుని పోలెను
రక్తబిందువులు రాల్చెను కన్నులు
పండ్లు పటపట కొరుకుచుండగా
యంత్రము తిరిగిన చప్పుడు ఎగసెను.

అసురవీరులు కలవరపడిరి
చాటుమాటున దాగిరి హడలి
ప్రళయకాలమున సర్వము మ్రింగే
కాలునివలె ఆ రాజు కనబడె.

క్రోధము నిండిన రావణరాజు
యుద్ధము నంతము చేయగ నెంచి
తన యోధులతో పలికెనప్పుడు :
''అసురయోధులు వినుడు శ్రద్ధగా

వేల ఏండ్లుగా తపస్సుచేసి
విధాతనే నే మెప్పించితిని
తపోబలమున బ్రహ్మవరమున
సురాసురులచే మరణము లేదు.

బ్రహ్మ యిచ్చిన దివ్యకవచము
వజ్రాయుధమే తగిలిన చెదరదు-
అంతటి కవచము ధరించి పోరిన
నన్నెదిరించెడివాడే లేడు.

దేవాసుర సంగ్రామమునందు
విధాతమెచ్చి అమోఘచాపము
దివ్యశరమును ఒసగెను నాకు
వాటితొకూల్చెద రామలక్ష్మణుల.

మంగళస్వనముల- దివ్యచాపమును
తీసుకురండి పోరుకు పోదును''
అనుచుపలికెను అంతటిలోనే
పుత్రశోకము ఎగసిపడినది.

వెంటనె-సీతను చంపగ నెంచెను
మంత్రులగాంచి పలికెనప్పుడు
''నాకుమారుడు మాయసీతను
చంపెను నాడు- యుద్ధభూమిలో

నేడు-నేను ఆ నిజసీతనట
చంపెద-తనయుడు శాంతినందును
నీచక్షత్రియుని నమ్మిన అతివను
అంతముచేసెద'' - అనుచు లేచెను.

ఖడ్గముదాల్చి అమితకోపమున
సచివులు, భార్యలు, అనుసరించగా
అశోకవనమున శోకలత యగు
సీతను త్రుంచగ శీఘ్రమె సాగెను.

కదిలే గిరివలె- క్రోధమునిండి
రాజునడువగ రాక్షసులందరు
జయము పలికిరి లంకేశునకు
సింహనాదములు చేసిరి ముదముగ.

''ముల్లోకములను జయించినాడు
దిక్పాలకులను తరిమినవాడు
శౌర్యముతో తను కోరినవన్నీ
అంది-పొందెడి యోధుడురాజు

రాజునుగాంచిన-రామలక్ష్మణులు
భయపడిపోదురు-రాజుకుసరిపడు
వీరుడు భువిలో లేనేలేడు''
అనుచు అసురులు పలికిరి ముదముగ.

అశోకవనమున సీతనుగాంచెను
అంగారకుడు రోహిణి పైబడు
చందము తోచెను- ఎందరొహితులు
వారించినను అసురుడువినక

కరవాలముతో ముందుకుసాగెను-
అసురాంగనల కావలిమధ్యలొ
పతివ్రత తా నసురునిగాంచెను
కలవరపడినది- కంపించినది.

అసురుడు అంతముచేయుననుకొని
భీతినందినది దిగులుతొక్రుంగెను
''తిరస్కారము చేసితినన్న
కోపముతో ఈ అసురుడు చంపును

నిరాశతో ఈ అసురుడునిండి
అంతముచేయగ నెంచెను ఇపుడు
నా మూలముగా పురుషోత్తములను
చంపెనొ! ఏమో! ఈ రాక్షసుడు

దాశరథులతో పోరగలేక
పుత్రశోకమును భరించలేక
కసితీర్చుకొన చంపునొ ఏమో!
ఘాతుకాలకు నిలయము వీడు

వినకపోతిని మారుతి పలుకులు
వీపుమీద నే కూర్చొనియున్న
రాముని సన్నిధి చేరి యుందును
మూర్ఖురాలను దుఃఖమునుంటిని

రాముడు రణమున కూలిపోయినటు
కౌసల్యమ్మ విని విలపించును
తలచి తలచి రోదించును ఆమె
ఆశలువదలి మూర్ఛిలిపడును

మూర్ఛతేరిన ఆ పుణ్యవతి
జలముల- అగ్నిలొ పడిపోనెంచును
గూనిమంథరే కారణమింతకు
గూనిది అంతముకావలె నింతకు

నే బ్రతుకను ఇక'' అనుచు తలచెను
దిగులుతొ కృంగెను రాముని పత్ని
చంద్రుని కెడమై- అంగారకుని
బాధనందిన రోహిణి పోలిన

సీతనుగాంచి రావణుమంత్రి
సుపార్శ్వుడనునొక ధర్మచరితుడు
సచివులమాటలు లక్ష్యపెట్టక
దూకెడిరాజును చూచి పలికెను :

''ఓ రావణుడా! యోచనచేయుము
సద్వంశమున జన్మించితివి
ధనపతికీవు అనుజుడవయ్యా!
ధర్మదూరుడవు కావలదయ్యా!

వీరుడవీవు రాక్షసనాధుడ!
వేదవిద్యలు తెలిసినవాడవు
వ్రతదీక్షలలో అధికుడవీవు
ఆడదానిని చంపనెంచితివి

నిండుజవ్వని నీవశమయ్యెడి
యోచనచేయుము- రాముని తాకుము
నేటితిథియది కృష్ణచతుర్థి
సేనలతోనువు పోరుకుసాగుము.

రేపటిరోజు అమావాశ్యయగు
రాముని పోరున జయించవలెను
నీ ఖడ్గముతో వీరునిగెలచి
రమణినందుకో రావణరాజా!''

ధర్మవచనములు వినెను రావణుడు
స్త్రీవధ తగదని తలంచినాడు
వెనుకకు మరలి సచివులకూడి
సభామంటపములోనికి చేరెను.

॥శ్రీ రఘురాముని॥

❃❃❃

## 94 శ్రీరాముడు గాంధర్వాస్త్రమున చతురంగబలముల కూల్చుట

సచివులమధ్య సింహాసనమున
దిగులుతొ నుండెను లంకేశ్వరుడు
ముకుళిత హస్తమ్ములతో నపుడు
సేనాధ్యక్షుల చూచి పలికెను :

''మీరందరును మిగిలిన సేనతొ
రథగజాశ్వముల వెంట నిడుకొని
పోరుడు - రాముని అంతము కోరితి
ఒక్క రామునే ఎదిరించండి.

వర్షిత మేఘములన్న తీరుగా
శర వర్షముతో రాముని ముంచుడు
చావకపోయిన- తనువు తూట్లుపడు
రేపటి రోజున చంపెద నేను.''

ఇనుప గుదియలు నిశిత ఖడ్గములు
తోమరమ్ములు గండ్ర గొడ్డళుల
రాజు ఆనతిని వీరులందరూ
రణోత్సాహులై పోరుకు సాగిరి.

అసుర సేనలు సూర్యోదయమున
వానర వీరుల పైకి దూకిరి
కపులు వృక్షములు కొండరాళ్ళతో
ఎదిరించిరి ఆ రాక్షస సేనను.

రాక్షసులటుల విరుచుకుపడగ
దిక్కుతోచక నిలచిరి కపులు
వారందరును వడిగాపోయి
రామచంద్రుని పదములవ్రాలిరి

భీకరమైన పోరు సాగెను
మేను వణకెడి సమరము జరిగెను
రక్త ధారలతొ నేల తడిసెను
లేచిన దుమ్ము అణగిపోయెను.

తేజోవంతుడు లోకరక్షకుడు
ఘనచాపముతో ముందుకురికెను
అసురులపైన అమోఘ శరములు
అగ్నివర్షముగ విడువసాగెను.

రథ గజమ్ములు ఏటిగట్టుగ-
తెగిన గుఱ్ఱములు చేపలు కాగా-
రథ ధ్వజములవి వృక్షమ్ములయి
విగతజీవులు తెప్పలుకాగా.

గ్రీష్మ ఋతువులో సూర్యుని దరికి
మేఘములెటుల చేరగలేవో-
అటులే రాముని చెంతకు అసురులు
చేరలేక నట ఆహుతియైరి.

రక్త ప్రవాహము నదిలా పారెను
రక్త ప్రవాహమునందు తడియుచు
ఎగురుచు కపులు పోరుచుండిరి
అసురుల నంతము చేయుచుండిరి.

గాలి మనకు మరి కనబడకున్నను
గాలికి తరువులు కూలుచున్నటు
రాముడు మాత్రము కనబడకున్నను
శరములు మాత్రము తగులుచుండెను.

రక్కసి ముఖములు రక్కుచుండిరి
కోరలకొరికి జుట్టుపీకిరి
పండ్లతరువుపై పక్షులన్నటు
అసురుల పైకెగబాకిరి కపులు.

మహారథములు విరిగి కూలెను
మహారథులు అట తెగిపడుచుండిరి
మహావేగముగ శరములు తగిలెను
మహాత్ముడా రాముడు ఎచటో?

అసురులంతట విజృంభించిరి
ఘనమగు గదలతొ కొట్టసాగిరి
ఖడ్గమ్ములతో గండ్రగొడ్డళుల
శరముల- కపులను కూల్చసాగరి.

మరిమరి చూడగ వ్యవధేలేదు
గురితో శరములు చీల్చుచుండెను
తిరిగిపోరెడి సమస్యలేదు
శరములువచ్చెడి దిక్కుతెలియదు.

అడుగో వాడే రథములకూల్చెను
వాడే-వాడే-సేననుకూల్చెను
అనుచు అరచుచు వళ్ళుతెలియక
అసురులుకనబడు అసురుల చంపిరి.

కనబడునట్టి అసురుని వారు
రాముడు అనుకొని చంపసాగిరి
రామమయముగా తోచెను రణము
గాంధర్వాస్త్రము రాముడు విడచెను.

ఒక్కరాముడే వేల రాములుగ
ఉక్కడగించెను గాంధర్వాస్త్రము
వలయముతిరిగెడి బంగరు విల్లు
కనులకుకనబడి కూల్చెనసురులను.

తనువే నాభిగ వెలుగుచుండగ
బలమేజ్వాలగ ఎగసిపడగను
శరములు పత్రమ్ములుగ తోచగ
చాపము ఘనమగు అంచుగ నగపడ.

వింటి సవ్వడి మహాఘోషయై
పరాక్రమమ్మే వక్షస్థలమై
దేహకాంతి యది వెలుతురు కాగా
దివ్యాస్త్రములు ధారలు కాగా.

యుద్ధమునందు విజృంభించిన
''రామ చక్రము'' అసురుల పాలిటి
కాల చక్రముగ తోచి-రక్కసుల
త్రుంచివేసెను అవలీలగను.

వాయువేగమున పోగల రథములు
ఏడు-కోట్లను- ఇరువది తొమ్మిది
లక్షలు కూలెను-మహారణమున
రామ బాణముల కెదురే లేదు.

పదమూడు కోట్లపై ఇరువది లక్షలు
ఆపై అరువది వేల సంఖ్యలో
మదపు టేనుగులు మన్నున కలిసెను.
రామ కిరణములు దహించి వేసెను.

పదికోట్లపై ఇరువది లక్షలు
ఆపై అరువది వేల సంఖ్యలో
అశ్వికులున్న అశ్వము లచట
అంతమైనవి రామ బాణముల.

నూట నలుబది ఐదు కోట్లపై
ఎనుబది లక్షల కాల్బలమ్ములు
గడియలొ మూడే వంతుల వ్యవధిలో
కూల్చెను రాముడు అగ్ని శరములతొ.

కామరూపులు అతి బలవంతులు
చతురంగ బలముల సేనలయందు
చావగ మిగిలిన అసురులు కొందరు
పరుగిడిపోయిరి లంకలోనికి.

కూలిన గజములు అశ్వమ్ములతో
అసువులు బాసిన అసుర వీరులతొ
రుద్ర దేవుని క్రీడాభూమిగ
తోచెను అచ్చటి సమరాంగణము.

ప్రక్కన నిలచిన వానర రాజును
విభీషణాఖ్యుని- వాయునందనుని
జాంబవంతుని మైంద ద్వివిదుల
ధర్మాత్ముడు శ్రీరాముడు గాంచి

పలికెను రాముడు వీరవరేణ్యుడు
''ఇంతటి శక్తి- అస్త్ర బలమ్ము
త్రినేత్రునకును- నాకేగలదు
మరి యింకొకరికి లేనేలేదు.''

రాముని మాటలు వినిన భక్తులు
ముకుళిత హస్తములన్న కమలములు
రామచంద్రుని పదముల నుంచిరి
పొంగిపోయిరి రాముని గాంచి.

పరాక్రమమ్మున ఇంద్రుని మించి
అస్త్ర శస్త్రముల అమోఘమ్ముగా
అసురుల త్రుంచి అలుపు నెరుగని
రాముని పొగడిరి దేవతలందరు.

॥శ్రీ రఘురాముని॥

✤✤✤

## 95 లంకలో రాక్షస స్త్రీల విలాపము

రామ బాణములు రణ రంగములో
చతురంగ బలములను కూల్చివేసినటు
వార్తను వినిరి లంకలొ స్త్రీలు
వెన్నుచూపిన వీరుల గాంచిరి.

బంగరు ములుకుల శరముల తప్పుకు
పరుగిడి వచ్చిన వారిని గాంచిరి
భర్తలు, పిల్లలు, తోబుట్టువులు
మడయగ- స్త్రీలు లంకలొ నేడ్చిరి.

''బాన కడుపుతో, ఊగెడి పొట్టతొ
కురూపి, ముసలి, రోత ముఖముతో
అందగత్తెనని ఆ శూర్పణఖ
మన్మథమూర్తిని మోహించినదట.

నెరసిన జుట్టు ముడుతల మేను
ముసలిది ముచ్చటపడినది- ఖర్మ
దుర్ముఖి మిక్కిలి పాపచరిత్ర
ధర్మాత్ముని శ్రీరాముని వలచెను.

మన దౌర్భాగ్యము ముసిలిదానిచే
అంతటి పనిని చేయించినది
ఖరదూషణులను అసుర వీరులను
పొట్ట పెట్టుకొనె ఆ పాపిష్ఠి.

చెల్లెలికొరకు మన మహరాజు
ఆ యిల్లాలిని అపహరించెను
మహాపురుషునితొ వైరము తెచ్చెను
జానకి మాత్రము లొంగనెలేదు.

సీతను కోరిన విరాధు డసురుడు
రాముని కోలతొ కూలిపోయెను
అది చాలద? శ్రీరాముని తెలియగ
అసురులు మిగలరు అని తెలియుటకు.

ఖర దూషణులు త్రిశిర యోధులను-
జనస్థానమున వీరులందరిని
ఒక్క రాముడే ఉక్కడగించెను
అది చాలద శ్రీరాముని తెలియగ!

యోజనవిస్తృతి కరములు జాచి
అరచుచు ప్రాణుల కబళించేటి
కబంధు నతడు కూల్చెను కాదా?
అది చాలద శ్రీరాముని తెలియగ!

ఇంద్రకుమారుని అతిబలశాలిని
మేరుగిరితొ సరిపోలెడి వాలిని
ఒక్క బాణమున కూల్చెను రాముడు
అది చాలద శ్రీరాముని తెలియగ!

ఋష్యమూకమున దిక్కుతోచక
దిగులుతొనున్న వానరవీరుని
ఆదరించెను రాజ్యము నిచ్చెను
అది చాలద శ్రీరాముని తెలియగ!

ధర్మమార్గమును తెలిపెను తమ్ముడు
విభీషణాఖ్యుని హితము వినినచో
అసురులందరికి శుభము కలిగెడిది
కాలదన్నెను మన మహరాజు.

ధనపతి సోదరుడైనను కానీ
మంచికి దూరము మన మహరాజు
విభీషణుని హితవాక్యము వినినచొ
రుద్రభూమిగా మారదు లంక.

కుంభకర్ణుడు- ఎంతటివాడు!
ఇట్టే కూలెను రామబాణమున
అతికాయుడును ప్రియపుత్రుడును
కూలిపోయిరి లక్ష్మణు శరముల.

ఇంత జరిగినా రాజుకు తెలియద!
ప్రియబాంధవులు పోయిరి గాదా-
నాయన-నాథా! ఓ సోదరుడా!''
అనుచు అతివలు ఏడ్చిరి లంకలొ.

''అంతమందిని కూల్చెను రాముడు
రుద్రుడొ యముడో తెలియదుగానీ
మనిషిమాత్రము కానేకాడు
బ్రతుకుపైన ఇక కోరిక లేదు.

దశకంఠునికి యుద్ధము సరదా-
దశతిరిగినదని తెలియకపోయెను
రాముడు నిలచిన సురలే చాలరు
అసురులు, వరములు లెక్కలోనివా?

మనుజునివలన మరణము లేనటు
మన మహరాజు అడగకపోయెను
మరిబ్రహ్మయినా ఇవ్వకపోయెను
మనుజునివల్లనె ముప్పు వచ్చెను.

బ్రహ్మవరమున గర్వాంధుడయి
సురలను హింసకు గురిచేయగను
ఉగ్రతపస్సును చేసి-దేవతలు
బ్రహ్మదేవుని-మెప్పించగను

క్రూర రాక్షసులవలన వారికి
భయము లేనటు చెప్పెను బ్రహ్మ
అయినా ఆగక దేవతలందరు
శివుని చేరిరి-అభయము కోరిరి.

ప్రసన్నుడైన పార్వతినాథుడు
అసుర వినాశముకొరకై ఒక స్త్రీ
అవతరించును- ఆమెవల్లనే
అంతమగుదురు రాక్షసులనెను.

అదిగో- అది ఈ సీతగ వచ్చెను
అసురవినాశము జరుగుచున్నది
ఆకలితో ఆనాడు చచ్చిరి
ఆడుదానితో నేడు చచ్చిరి.

ధర్మదూరుడగు రాజు చేసిన
దుష్కార్యమునకు మనమందరము
ఆహుతి అయ్యెడి రోజు వచ్చెను
కాలయమునిగ రాముడు వచ్చెను.

మనల నింక రక్షించరెవ్వరును
కార్చిచ్చునందున కాననమందలి
ఆడుదంతుల తీరుగ నుంటిమి
ఆదుకొనెడి వాడింకెవ్వడు మరి.

సర్వము నెరిగి సమయము గాచి
విభీషణాఖ్యుడు శరణు కోరెను.''
అనుచు ఏడ్చుచు కౌగలించుకొని
మరిమరి ఏడ్చిరి మగువలు లంకలో.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 96 రావణాసురుడు రణరంగమునకు వచ్చుట

ప్రతి గృహమందు రాక్షస స్త్రీలు
విలపించుట విని రాక్షసరాజు
ముహూర్తకాలము యోచన చేసెను
ఉగ్రరూపము దాల్చెను రాజు

పంటితొ పెదవిని కొరికెను కసిగా
కన్ను లెఱ్ఱబడి కాలాగ్నివలె
బుసలను విడచెడి రాజును గాంచి
అతని సేవకులు హడలిపోయిరి

క్రోధవశుడయి మాటలు తడబడ
చెంతనెవున్న మహావీరులను
మహాపార్శ్వుని మహోదరులను
విరూపాక్షుని చూచి పలికెను :

''ఆజ్ఞను వినుడు! వీరులందరు
పోరుకు సిద్ధము కావలె నిపుడే''
భయపడి వణకిరి రాజును గాంచి
బయలుదేరిరి ఉత్సాహముతో.

ఆశీర్వాదమునందుకు యోధులు
రణోత్సాహులై నిలబడిరపుడు
ఏలిక జయమును ఆకాంక్షించుచు
ఆశీస్సులను ఒసగిరి వీరులు.

అసురయోధులతొ పలికెనురాజు :
అట్టహాసముగ నవ్వుచు పలికెను :
''లయకాలములో రవి కిరణములగు
శరముల కూల్చెద దాశరథులను.

ఖరాది యోధుల కుంభకర్ణుని
ఇంద్రజిత్తును ప్రహస్త వీరుల
చంపిన రిపుని యమసదనమునకు
పంపుట అగును ప్రతీకారము.

మేఘములన్నటు శరములువదలగ
నింగీ, నదులు కడలియు దిక్కులు
కనబడవింక-వానరవీరుల
కూల్చెద -నాపగ తీరును అపుడు.

వాయువేగమున పోగలరథమున
చాపముఅనెడి సంద్రమునుండి
శరములుఅనెడి అలలు లేచును
వానరవీరుల ముంచివేయును.

నేలను కూలిన వానరయోధులు
వాలములున్న కపులందరును
తూండ్లతోనున్న తామరపూలై
ధరణికి శోభను చేకూర్చెదరు

ఒక్కొక శరమున వందలు కూలగ
పెనిమిటి, తనయుని, తోబుట్టువులను
కోల్పోయిన ఈ అసురాంగనల
కంటినీరది ఆగుట జరుగును.

కూలిన కపులతొనింపెద నేలను
నక్కలు, గ్రద్దలు తిను నా మాంసము
యోధులార! నారథమును ఇపుడే
అలంకరించి తీసుకురండు.

నా ఘనచాపము తీసుకురండు
మిగిలిన వీరులు బయలుదేరుడు.''
మహాపార్శ్వుడు ఆనతివినెను
సేనాధ్యక్షుల కాదేశములిడె.

సేనాధ్యక్షులు ప్రతిగృహమందలి
మిగిలినయోధుల ప్రోత్సహించిరి
ముహూర్తకాలమునందే అసురులు
ఆయుధాలతో నిలచిరిపోరుకు.

పరిఘ పట్టస ముద్గరమ్ములతొ
ఖడ్గ ముసలములు గంద్రగొడ్డళులు,
శక్త్యాయుధములు చక్రాయుధములు,
భిండివాలములు, బడితలు తీసుకు

అసురయోధులు సిద్ధముకాగా
ఘనమగు నరదము సిద్ధపరచగా
తేజోవంతుడు రావణప్రభువు
వెలుగులుచిమ్మెడి రథమునెక్కెను.

రాక్షసయోధులు వెంబడిరాగా
భీకరరూపుడు లంకేశ్వరుడు
బలముతొ భూమిని చీల్చునట్లుగా
వడిగాసాగెను రణరంగమునకు.

రావణునానతి తలనుధరించి
మహాపార్శుడు-మహోదరుండు
విరూపాక్షుడు సేనతొ కదలిరి
జయకాంక్షులు ఆ వీరులుసాగిరి.

పైకి ఎత్తిన ఘనచాపముతో
ప్రళయకాలమున సర్వజగతిని
నాశముచేసే యమునితీరుగా
మహారథుడు తన తేరుతొ సాగెను.

రామలక్ష్మణులు ఉన్నదిక్కునకు
జవనాశ్వములు పూన్చినరథమున
రావణరాజు సాగుచుండగా
అపశకునమ్ములు అగుపించినవి.

సూర్యునికాంతి తరిగిపోయినది
దిశలచీకటులు క్రమ్ముకొన్నవి
అమంగళముగా నరచెను పక్షులు
ధరణి వణకెను అశుభ సూచనగ.

నెత్తుటివాన కురిసెనప్పుడు
రథాశ్వమ్ముల కాలుజారెను
రథధ్వజముపై గ్రద్ధవ్రాలెను
నక్కలు భీకరఘోష చేసినవి.

వామభుజమ్ము-వామనేత్రము
అదరెను రాజుకు అశుభసూచనగ
ముఖకాంతులవి మారిపోయెను
గొంతులొ దైన్యము తొంగిచూచెను.

పిడుగుపడినటు ఉల్కరాలెను
కాకులు, గ్రద్దలు అమంగళమ్ముగ
ఎదురుగవచ్చి అరవసాగెను
కాలచోదితుడు కాలదన్నెను.

రావణాసురుని రథసవ్వడిని
వినిరి వానరులు-అసురులగాంచిరి
కపిసేనలవి సిద్ధమయినవి
ఉభయసేనలు దూకెనుముందుకు.

ఇరుపక్షములలొ వీరవరేణ్యులు
ఘనసంగ్రామము చేయసాగిరి
క్రుద్ధుడైన ఆ లంకేశ్వరుడు
బంగరుములుకుల శరములు వదలెను.

రావణు శరములు తగిలిన వీరుల
తలలు తెగినవి గుండెలు చీలెను
కన్నులూడెను తెగెను కర్ణములు
శ్వాసలేక మరి కొందరు ఒరిగిరి.

గ్రుడ్లను త్రిప్పుచు లంకేశ్వరుడు
ఉగ్రరూపుడై ఏదిశలో తను
శరములు వేయుట ఆరంభించెనొ
ఆ దిశలోని కపులు కూలిరి.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 97 సుగ్రీవుడు విరూపాక్షుని కూల్చుట

రావణాసురుడు వదలిన శరముల
వానర యోధుల తనువులు తెగెను
రణరంగమున విసరివేసినటు
మృత వానరులు కనబడిరచ్చట.

అగ్నిహోత్రమున మిడుతల మాదిరి
మంటల చిక్కిన మత్తేభములన
శరముల తాకిడి కోర్వగలేక
అరవుల పరుగిడిరా కపి వీరులు

గాలి–మేఘమును చెదరగొట్టినటు
చిందరవందర చేయుచు కపులను
వానరసేనను నేల కూల్చుచూ
రాముని తాకగ ముందుకురికెను

పోరాటములో వానర వీరులు
పరుగులెత్తుట సుగ్రీవుడు గని
అసుర వీరులతో పోరగ నెంచెను
పరాక్రమమ్ము చూపగ నెంచెను

వానర సేనకు సుషేణ యోధుని
రక్షగ నుంచి ఘనమగు తరువుతో
రాక్షస వీరులపైకి దూకెను
శిలలు, తరువులుతో కపులు నిలచిరి

భీకర గర్జనతో సుగ్రీవుడు
ఘన వృక్షముతోఅసురుల కూల్చి
రాక్షస ముఖ్యులపైకి దూకెను
ప్రళయ కాలమున అగ్నిగ మారెను.

పులుగు గుంపుపై రాళ్ళ వానను
కురిపించెడి ఘన మేఘము రీతి
శిలా వర్షమును సూర్యతనూజుడు
అసుర సేనపై కురియజేసెను.

వజ్రాయుధపు దెబ్బకు గిరులు
చిందర వందర అయిపోయినటు
తలలు, తనువులు చితికిన అసురులు
నేలకూలిరి రణరంగమున.

చావక మిగిలిన అసురులు కొందరు
పరుగులెత్తిరి నాల్గు దిక్కులకు
అసుర సేనలు పరుగులు తీయుట
విరూపాక్షుని కంట పడినది.

ఆ విలువీరుడు విరూపాక్షుడు
పేరు చాటుకొని అరదము నుండి
ఎగిరి– ఏనుగును అధిరోహించి
సింహగర్జన ఘనముగ చేసి

సుగ్రీవునిపై శరములు వదలెను
భయము తీర్చెను అసుర వీరులకు
నిశిత శరములు బాధించగను
అసురుని కూల్చగ అట సుగ్రీవుడు

మహాతరువు నొకదాని నందుకొని
మహాతరంగము పైకిలేచినటు
ముందుకు దూకి– కరిని మోదగా
కరి ఎగిరనదొక ధనువు ఎత్తునకు.

ఎగిరిపడిన ఆ మత్తేభమ్ము
రక్తము గ్రక్కెను అసువులు వీడెను
అసువులు నిలువగ విరూపాక్షుడు
దూకెను క్రిందకు ఏనుగు నుండి.

నిండుగ నిలచిన సుగ్రీవునిగని
కరవాలముతో ముందుకురికెను
ఘనమగు శిలను వానర రాజు
అసురునిపైకి బలముగ విసరెను.

నేర్పుగ అసురుడుదెబ్బ తప్పుకొని
కత్తితొ కొట్టెను వానర రాజును
అంతటి దెబ్బకు ఆసుగ్రీవుడు
చలించిపోయెను- తిరిగి తేరుకొని.

కోపము పెరిగెను సుగ్రీవునికి
వజ్రాయుధముతొ కొట్టినట్టుగా
గ్రుద్దెను- అసురుని ముఖముమీదను
ముక్కునుండి రుధిరమ్ము కారెను.

వజ్రము పోలెడి ఒక్క గ్రుద్దును
అసురుని వక్షమునందు గ్రుద్దెను
దానితొ అసురుడు క్రోధము పెరిగి
కత్తితొ కొట్టెను కవచముపైన.

గిరిపై పారెడి సెలయేరువలె
నాసికనుండి రక్తము కారెను
నెత్తుట తడిసి విరూపాక్షుడు
నేలకొరిగెను అసువులు వీడెను.

వానరరాజు- దెబ్బకు ఊగెను
వెంటనె బలముగ చరచె సుగ్రీవుడు
నేర్పుగ దెబ్బను కాచి అసురుడు
గుండెల గ్రుద్దెను వానరరాజును.

అసురవీరులు, వానరయోధులు
తనువులు మరచి పోరిరి ఘనముగ
ఆనందముతో కపులు పోరిరి
ఆవేశముతో అసురులు పోరిరి.

విరూపాక్షుడు కూలుట గాంచి
దుఃఖమువలన ఎగసిన కసితో
గంగానదివలె పొంగిన వీరులు
పోరిరి అచ్చట కపిసేనలతో.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 98 వానరరాజు మహోదరుని త్రుంచుట

వేసవిలోన నదీ జలములు
తగ్గిపోయినటు-పోరెడి వీరులు
నేలకొరుగుచు అంతముకాగా
రావణరాజుకు విషయము తెలిసెను.

ప్రభువుపైన విశ్వాసము కలిగిన
మహోదరుండు సరియని పలికి
వానరసేనలొ జొరబడి పోరెను
నిశితశరములతొ కపులను కూల్చెను.

విరూపాక్షుడు కూలుట గాంచెను
దుఃఖమునందెను క్రోధము పెరిగెను
మహోదరుని ఉత్సాహపరచెను
ప్రభువు ఋణమును తీర్చగ కోరెను.

కరచరణములు తెగిపడుచున్న
కపులను గాంచి ఉత్సాహముతో
అసురులు ముందుకు దూకిరి అనిలో
వానరవీరులు కలవరపడిరి.

వానర యోధులు కొందరుపోయి
వానరరాజు చెంత జేరిరి
అంతయు గాంచిన ఆ సుగ్రీవుడు
మహోదరుని అట కూల్చగ నెంచెను.

పర్వతమంతటి బండను విసరెను
అసురుడు వచ్చెడి గిరిని గాంచెను
ఒడుపుగ శరములు వదలి-వచ్చెడి
రాతిని త్రుంచెను తునకలుగాను.

బండముక్కలై పడుట గాంచిన
సుగ్రీవుడు ఒక సాలవృక్షమును
మహోదరునిపై విసరగ నంత
శరముల త్రుంచెను దానిని అసురుడు.

సుగ్రీవునికి క్రోధము హెచ్చెను
అచ్చటనున్న పరిఘను చేకొని
గిర్రున త్రిప్పి తురగమ్ములపై
విసరెను-చచ్చెను రథతురగములు.

రథమునుండి ఆ అసురుడు దూకి
ఘనమగు గదతో పోరుకు వచ్చెను
ఆయుధాలతో వీరులిద్దరు
పోరసాగిరి ప్రళయముగాను.

రవితేజముతో వెలిగే గదను
విసరెను అసురుడు సుగ్రీవునిపై
పరిఘను విసరెను వానరరాజు
గదయు-పరిఘయు విరిగిపడినవి.

వానరరాజు నేలనుబడిన
ముసలాయుధమును తీసి విసరగా
అసురుడు మరియొక గదను విసరగా
గదయు-ముసలము విరిగిపడినవి.

అంతట వీరులు ద్వంద్వ యుద్ధమున
తలపడిపిడికిట పొడుచుకొనుచును
అరచేతులతో చరచుకొనుచును
తన్నుకొనుచును నేలనుబడిరి.

రివ్వునలేచిరి ఇద్దరు వీరులు
ఒకరిని ఒకరు విసరుకొనుచును
గ్రుద్దుకొనుచును అలసిపోయిరి
అమోఘబలముతొ పోరిరి వారు.

మహోదరుండొక ఖడ్గము-డాలు
చేతధరించి ముందుకురికెను
సుగ్రీవుడును నేలనుబడిన
ఖడ్గము-డాలు అందుకు నిలచెను.

వీరులిద్దరూ కరవాలములతొ
అనేక ఒడుపులు తెలిసి పోరిరి
గిఱ్ఱున తిరుగుచు-ముందుకు దూకి
ప్రక్కకు తిరుగుచు పోరు సలిపిరి.

అంతట అసురుడు అమిత బలముగా
ఖడ్గముతో సుగ్రీవుని పొడవగ
గురితప్పిన ఆ నిశితఖడ్గము
డాలులొ దూరెనుబయటకు రాదు.

కత్తిని బయటకు లాగుచుండగా
కుండలాలలతో శిరస్త్రాణముతో
వెలుగుచునున్న అసురుని శిరమును
వానరరాజు నరికెను బడుపుగ.

మహోదరుని అట రణమునకూల్చి
మహానందముగ కపులతొ కలసి
సింహనాదమును చేసెనురాజు
సంతోషముతో గాంచెను రాముడు.

తలతెగి అసురుడు నేలకూలెను
మిగిలిన సేనలు భయపడిపోయి
ప్రాణమ్ములు అరచేత నుంచుకొని
నలువంకలకు పరుగులెత్తిరి.

దశగ్రీవునకు కోపము పెరిగెను
రాక్షసవీరులు భీతిలిపోయిరి
సూర్యతేజముతొ సూర్యకుమారుడు
విజయలక్ష్మితో వెలుగులుచిమ్మెను.

మహావీరుని సుగ్రీవుని గని
నింగిని సురలు- సిద్ధులు- యక్షులు
నేలను జీవులు ఆనందించిరి
వానరరాజుకు దీవనలిడిరి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 99 అంగదుడు మహాపార్శ్వుని అంతముచేయుట

సుగ్రీవునిచే మహావీరుడగు
మహోదరుండు కూలిపోవుట
మహాపార్శ్వుడు కన్నులగాంచి
క్రోధవశుడయి కన్నులెఱ్ఱబడి

వానరయోధుల బాధనుచూచి
పర్వసమయమున పొంగుకడలివలె
అంగదుడపుడు ముందుకుదూకెను
రవివలె వెలిగెడి పరిఘను విసరెను.

అతివేగముగ నిశితశరములను
అంగదు సేనలపైకి విడచెను
తొడిమనుండి మరి పండ్లురాలినటు
రాలిపడినవి కపుల శిరస్సులు.

పరిఘపాటుకు కన్నులుతిరిగి
నిలబడలేక మహాపార్శ్వుడు
తన సారథితో నేలనుబడెను
తెలివిదప్పెను ఆ నిమిషములో.

కర, చరణములు తెగెనుకపులకు
చీల్చివేసెను శరములు కపులను
వానరయోధులు నిలబడలేక
అమితదుఃఖమున మునిగిపోయిరి.

కాటుక కొండగతోచు వీరుడు
అమిత విక్రముడు గవాక్షుడపుడు
ఘనశైలమ్మును చేతధరించి
కూల్చివేసెను రథాశ్వములను.

కొంతసేపటికి మహాపార్శ్వునికి
తెలివికలిగినది-వెంటనె వీరుడు
అమోఘశరముల గవాక్షుపైన
అతిలాఘవముగ విడువసాగెను.

జాంబవంతుని వక్షస్థలమును
మూడమ్ములతో గాయపరచెను
బాధనుపడెడి జాంబవంతుని
గవాక్షులను గనె అంగదవీరుడు.

ఆవేశమ్మున వాలికుమారుడు
అమోఘమైన పరిఘనుగైకొని
గిరగిర త్రిప్పి విసరివేయగా
అసురుని ధనుసు విరిగిపోయెను.

అంతటితో ఆ పరిఘ ఆగక
అసురుని మకుటము నేలకురాల్చెను
అంగదుడంతట అమితవేగముగ
అసురుని చరచెను తన అరచేతితొ.

దెబ్బగట్టిగా తగిలె నసురునకు
కృద్ధుడయ్యెను రాక్షసవీరుడు
గండ్రగొడ్డలిని రివ్వున తీసెను
అతి పదునుగ ఆ గొడ్డలి యున్నది.

అంగదుమెడపై గండ్రగొడ్డలితొ
కొట్టెడియత్నము చేసెనసురుడు
ఒడుపుగతప్పుకు అంగదుడపుడు
ఘనమగు గ్రుద్దును ప్రసాదించెను.

మల్లయుద్ధమున పండితుడైన
అంగదుడపుడు ఎదురుగపోయి
అసురుని గుండియపైన పొడిచెను
అసురుని గుండియ చితికిపోయెను.

రక్తము గ్రక్కి అతిభీకరముగ
అరచుచు - వీరుడు మహాపార్శ్వుడు
నేలనుబడగ చూచిన అసురులు
కలవరపడిరి భీతిలిపోయిరి.

సంతోషముతో ఆ కపియోధులు
లంక పగులునటు సింహనాదములు
చేయుచుండగా నింగిని సురలు
విజయఘోషను ముందుగ చేసిరి.

నింగీ, నేల సింహనాదముల
నిండిపోవగా ఇంద్రునివైరి
అమితాగ్రహమున బుసలను విడచుచు
పోరగనిలచెను మనుజోత్తమునితొ.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 100 రామ రావణ యుద్ధము

మహావీరులగు విరూపాక్షుడు
మహాపార్శ్వ మహోదరాదులు
రణమున కూలుట గాంచి రావణుడు
కోపానలమున జ్వాలగ నిలచెను.

సారథి వంక చూచి పలికెను
''రామ లక్ష్మణుల చంపివేయవలె
నావారిని ఆ వీరులు చంపిరి
లంకాపట్నము ముట్టడించిరి.

అసువులు బాసిన వారి బంధువుల
దుఃఖము నేనే తీర్చగ వలెను
రామ తరువును నరికి వేయవలె
అపుడే సీతా పుష్పము దక్కును

వానర రాజు జాంబవంతుడు
అంగద హనుమ కుముదుడు నీలుడు
గంధ మాదన మైంద ద్వివిదులు
రామ తరువుకు శాఖలగుదురు

శాఖలతో ఆ రామ తరువును
నేలకు త్రోసెద నా శౌర్యముతో
అపుడే సీతాపుష్పము దక్కును
రథముతోలుము కోరికతీరగ''

మహావీరుడటు చెప్పిన వెంటనె
మహారథమది ముందుకు సాగెను
ఆ రథ ఘోష దిశల మ్రోగెను
ధరణిమీద గిరులన్నియు వణకెను

అడవులు, నదులు, గజములు, గిరులు
చరాచరములు చలించిపోయెను
లంకేశ్వరుడు భీకరమైన
తామసాస్త్రమును ప్రయోగించెను.

తామసాస్త్రము అగ్నిహోత్రమై
వానర యోధులమీద పడినది
కాలిరి కొందరు-పరుగులెత్తిరి
ధూళినింగికి ఎగసి పడినది.

వందలకొద్ది వానర యోధులు
భయపడి పరుగులు తీయుట గాంచి
రామభద్రుడు ఘన చాపమ్మును
చేత ధరించి నిలచెను నిండుగ.

నింగికి తగులుచు నున్నటులున్న
దివ్య చాపముతో రామచంద్రుడు
అనుజుడు లక్ష్మణమూర్తితో నపుడు
ఉపేంద్రుతోడుత ఇంద్రుడాయెను.

పద్మపత్ర విశాల నేత్రుని
రవి వలె వెలిగెడి రామచంద్రుని
రావణాసురుడు కన్నుల గాంచెను
సోదరు లిరువురు గాంచిరి అసురుని.

ఉత్సాహముగా రామచంద్రుడు
వింటితొ చేసెను ఘనమగు సవ్వడి
భూమి చీలినటు ధ్వని ఎగసినది
భయముతొ వణకెను ఆ రణభూమి.

రాముడు చేసిన వింటి సవ్వడికి
భయపడినేలను పడిరి అసురులు-
రావణు శరములు తగిలిన కపులు
అసువులు బాసి నేల కొరిగిరి.

రామలక్ష్మణుల ముందు నిలచిన
లంకేశ్వరుడు- రావణ రాజు
సూర్య చంద్రులను అమావాస్యలో
తాకెడి రాహువు పోలియుండెను.

లక్ష్మణమూర్తి రావణాసురుని
ముందుగ తాకగ నుత్సహించగా
రాముడు సరియని ఆనతి నిడగా
శరముల వదలెను రామానుజుడు

చాపము వంచి శ్రీకరమూర్తి
అగ్నినిబోలు శరములు వదలెను
అస్త్రవేత్తయగు రావణాసురుడు
వచ్చెడి శరముల త్రుంచెను నింగిని.

లక్ష్మణమూర్తి వదలిన శరములు
ఒడుపుగ త్రుంచెను లంకేశ్వరుడు
ఒక శరముతొ ఒక అమ్మును కొట్టెను
పది శరములతో పదిని త్రుంచెను.

వరబల గర్వితుడగు రావణుడు
లక్ష్మణమూర్తిని దాటుకుపోయి
గిరివలె చెదరక నిలచిన రాముని
గుండె దిటవుతో శరముల తాకెను.

క్రోధానలముతొ కన్ను లెఱ్ఱబడ
శరవర్షము కురిపించె రావణుడు
జలధారవలె శరములప్పుడు
రావణు చాపమునుండి వెడలెను.

కోదండముతో రామచంద్రుడు
కత్తుల పోలు శరములు వదలి
అసురుని అమ్ములు త్రుంచివేసెను
శరముల పోరిరి ఆ రణధీరులు.

రామ రావణులు శస్త్రకోవిదులు
అమితవేగమున నిశితశరములు
విడచుచు-వాటిని తప్పుకొనుచును
విజయకాంక్షతో పోరు సలిపిరి.

అతిచిత్రముగ ధనుసు త్రిప్పుచు
వచ్చెడి శరముల తప్పుకొనుచును
నాశము చేసెడి రుద్ర, యములవలె
రామ రావణులు పోరు సలిపిరి.

రామ రావణ సంగ్రామము గని
సర్వజగత్తు వణకిపోయెను
ప్రాణికోటులవి తల్లడిల్లినవి
నింగి శరములతొ నిండిపోయినది.

తళతళలాడే నిశిత శరములతొ
నింగి పూర్తిగా నిండిపోవగా
శరముల మధ్యలొ నిలచిన సందులు
నింగికి కూర్చిన కిటికీలయినవి.

సూర్యాస్తమయము అయినదంతట
చిమ్మచీకటిని కలుగచేసెడి
మేఘములన్నటు రామ-రావణులు
భీకరయుద్ధము చేయుచుండిరి.

రాముని చంపగ రావణు యత్నము
రావణు కూల్చగ రాముని కోరిక
వృత్రాసుర దేవేంద్రుల పోలి
యుద్ధభూమిలో పోరిరి వీరులు.

ఇరుసేనలవి దూరము నిలచెను
వారిని చూడగ వశపడకున్నది
అస్త్రశస్త్రముల అతిసమర్థులు
ధనుర్విద్యలో సమ ఉజ్జీలు.

ఏ దిశలో ఆ ఇద్దరు వీరులు
శరములు వదలిన- ఆ దిక్కులలో
రెండు సంద్రములు ఏకమైనటు
నింగికి లేచే అలల పోలెను.

లోక కంటకుడు రావణాసురుడు
శరవిన్యాసము చూపుచు నంత
రామచంద్రుని నొసట-శరములతొ
కొట్టినిలచెను అట్టహాసముగ.

నల్ల కలువల రేకుల పోలు
శరములు నొసటకు తాకుచున్నను
లక్ష్యపెట్టక రామచంద్రుడు
నిలచి పోరెనుకోపము హెచ్చెను.

ఉగ్రమహోజ్వల బాణపరంపర
మంత్ర జపముతో రామచంద్రుడు
రావణాసురుని పైకి వదలెను
ఘనకవచమ్మునకు తగిలెను అమ్ములు.

మేఘ సమమగు ఆ కవచమ్ము
అభేద్యమైన దివ్య కవచము
శరములబాధ కలుగనీయక
రక్షణ నొసగెను లంకేశ్వరునకు.

అంతట రాముడు మంత్ర జపముతో
నొసట కొట్టెను నిశిత శరముల
వచ్చెడి శరముల అసురుడు రాల్చెను
బుసలతొ రాలెను రాముని శరములు.

రావణాసురుడు ఉగ్రుడాయెను
బుసల సర్పమై నిట్టూర్పులతో
మహాభయంకరమైన అస్త్రము
అసురాస్త్రము సంధించి విడచెను.

అనేక శరముల నా అసురాస్త్రము
సృజించిముందుకు వదలెనప్పుడు
సింహ, వ్యాఘ్ర ముఖముల పోలి
గ్రద్ధ తలలను పోలెను అమ్ములు

కాకి తలలవలె కోడి తలలవలె
వృకము, నక్కల ముఖముల పోలి
ఖరవరాహ వదనంబుల పోలి
శునక ముఖములను పోలెనుకొన్ని.

నోటిని తెరచిన మొసలి తలవలె
బుసలు విడచు విష సర్పమ్ములన
అనేక శరముల నా అసురాస్త్రము
సృజించి ముందుకు పంపెను రణమున.

భీకర శరముల గాంచెను రాముడు
అగ్నిహోత్రుడన-సమరోత్సాహుడు
ఆగ్నేయాస్త్రము విడచెనప్పుడు
అమోఘాస్త్రము శరములనంపెను.

మండెడి జ్వాలతొ నుండెడి శరములు
రవి వదనంబుల పోలెడి శరములు
తారాగ్రహముల ముఖముల శరములు
మెరపు తీగలై కొన్ని శరములు

అర్ధ చంద్రుని రూపపు టమ్ములు
ధూమకేతు వదనంపు టమ్ములు
పెద్ద కొరవులను పోలు శరములు
ఆగ్నేయాస్త్రము సృజించి వదలెను.

అసురాస్త్ర శరములను ఆకాశములో
ఆగ్నేయాస్త్రపు టమ్ములు కాల్చెను
అది గాంచిన ఆ వానర వీరులు
సింహనాదముల దిక్కుల నింపిరి.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 101 యుద్ధ భూమినుండి రావణాసురుడు పరాజితుడై లంక కేగుట

అసురాస్త్రమ్మది వ్యర్థము కాగా
క్రోధము పెరిగెను లంకేశ్వరునకు
మయునిర్మితమగు రౌద్రాస్త్రమును
రామచంద్రుని పైకి వదలెను.

వెలుగులు చిమ్మే చక్రాయుధములు
సూర్యచంద్రగ్రహ సముదాయములన
దిశల వెలుగుతో నింపివేసెను
ఉత్తమ శరములు రాముడు వేసెను.

వజ్రాయుధమును పోలు శూలములు
ముసలాయుధములు గదలు ముద్గర
వివిధాయుధములు చాపము నుండి
ప్రళయ ప్రభంజన మన్నటు వెడలెను.

రామబాణములు చక్రాయుధముల
త్రుంచివేసెను ఆకాశములో
కోపము పెరిగి లంకేశ్వరుడు
ఎంతో కసిగా శరములు వదలెను.

అస్త్రవేత్త శ్రీరామచంద్రుడు
గాంధర్వాస్త్రము నంతట తీసి
సంధించగను దివ్యాస్త్రమది
రౌద్రాస్త్రము నంతమ్ము చేసెను.

రాముని ఆయువుపట్లలో- అసురుడు
పది బాణములు సూటిగ వేసెను
శరములు వచ్చి తగిలియు రాముడు
చెదరక నిలచెను వీరవరేణ్యుడు.

కోపము పెరిగిన రావణాసురుడు
సౌరాస్త్రము సంధించె విడచెను
చక్రాయుధములు- మంటల మండుచు
బయలుదేరినవి చాపము నుండి.

శత్రుమూకను చీల్చెడి రాముడు
రావణాసురుని అవయవమ్ములలో
నిశిత శరములను విడచెను సూటిగ
శరనైపుణ్యము చూపుచు విడిచెను.

అసురులతో తన అన్న పోరుట
అనుజుడు చూచి- అన్నగారికి
అలుపు తీర్చగ ముందుకు వచ్చెను
ఏడు శరములతొ కొట్టె నసురుని.

లక్ష్మణు శరములు దూసుకుపోయి
మనుజుని తల చిత్రించిన యట్టి
రావణాసురుని రథధ్వజమును
త్రుంచి- ముక్కలుగ నేలకూల్చెను.

తిరిగి లక్ష్మణుడు అతి బలవంతుడు
అమ్ములకొట్టెను రథసారథిని
కుండలాలతో మెరసే సారథి
శిరసును త్రుంచెను లక్ష్మణు బాణము.

విక్రమమూర్తి అంతట ఆగక
అయిదు శరములతొ లంకేశ్వరుని
ధనుసు త్రుంచెను- ఘనమగు చాపము
విరిగిపడినది అసురుడు బెదరెను.

లక్ష్మణమూర్తికి అలుపుతీర్చగ
విభీషణాఖ్యుడు యోచనచేసి
ఘనమగు గదతో ముందుకు దూకి
రావణు రథ తురగమ్ముల కొట్టెను.

పర్వతమంతటి గుర్రములవ్వి
నీలమేఘముల పోలు గుఱ్ఱములు
నేల కూలినవి- రావణాసురుడు
అతివేగముగా క్రిందికి దూకెను.

తమ్మునిపైన క్రోధము పెరిగి
శక్తిమంతుడు రావణాసురుడు
శక్త్యాయుధము విసురుగతీసి
సూటిగ విసరెను తమ్ముని కూల్చగ.

శక్త్యాయుధమును గాంచి లక్ష్మణుడు
మూడు శరములతొ కొట్టగ నపుడు
మూడు ముక్కలై బలమగు శక్తి
ఉల్కాలమాదిరినేలకు రాలెను.

రావణాసురుడు కృద్ధుడాయెను
నిత్యము తాను పూజచేసెడి-
కాలుడుభయపడునట్టి ఆయుధము
మరియొక శక్త్యాయుధమును తీసెను

వజ్రాయుధమును పోలు ఆయుధము
కాంతివంతమగు శక్త్యాయుధమును
బలముగ త్రిప్పెను రావణరాజు
మంట లెగసెను అతిభీకరముగ.

శక్త్యాయుధముతొ విభీషణునికి
ప్రాణాంతకమగు ఆపద అనుచు
రామానుజుడు గ్రహించినాడు
విభీషణాఖ్యుని రక్షగ నిలచెను.

చాపము వంచి లక్ష్మణమూర్తి
రావణు కరముల శరములు విడువగ
శరపరంపర వచ్చుచుండగా
శక్తిని విడువగ అసాధ్యమయ్యెను.

శక్త్యాయుధపు విపత్తునుండి
తమ్ముని రక్షణ చేయగలిగిన
రాముని యొక్క తమ్ముని గాంచి
గంభీరముగా పలికె రావణుడు :

''ఓయీ లక్ష్మణ! నీ బలమునకు
మెచ్చితి నేను, వాడు బ్రతికెను
వీడను నిన్ను శక్తిని విసరిన
చచ్చెదవీవు గుండెలు పగులును

నీ ప్రాణములను హరించిశక్తి
నెత్తుట తడసి నన్ను చేరును''
అనుచు రావణుడు మయునిర్మితమగు
మహాశక్తిని బలముగ విసరెను.

శత్రుంజయమా శక్త్యాయుధము
మంటలు, మండుచు, గంటలు, మ్రోగుచు
భీకర ధ్వనితో బయలుదేరెను
వజ్రాయుధమన కాంతులు వెలిగెను.

అమోఘమైన శక్త్యాయుధమును
రాముడుగాంచి శక్తితొపలికెను :
''శక్త్యాయుధమా! వ్యర్థమునీవై
లక్ష్మణమూర్తికి ఆపదనిడకుము.''

శక్త్యాయుధము క్రూర ఫణివలె
విసురుగలక్ష్మణు వక్షము తాకెను
మంటలమండుచు మెరయుచుశక్తి
వాసుకి నాలుక అన్నటుతోచెను.

రామానుజుని వక్షస్థలమున
బలముగ తగిలెను శక్త్యాయుధము
ఘనమగు దెబ్బకు గాయమయ్యెను
మూర్ఛిలి పడెను లక్ష్మణమూర్తి

మనుజోత్తముడు రామచంద్రుడు
తమ్ముని దుస్థితిగాంచి కుమిలెను
కన్నులనీరు ప్రవహించినది
ముహూర్తకాలము ఆలోచించెను.

దుఃఖించుటకది సమయముగాదని
ధైర్యముతెచ్చుకు నిలచెను రాముడు
ప్రళయాగ్నివలె విజృంభించెను
అసురుల చంపగ నిశ్చయించెను.

శక్త్యాయుధమున రక్తముకారుచు
నేలనున్న ఆ లక్ష్మణమూర్తి
ఫణిజొచ్చిన గిరి అన్నటుతోచెను
కపులకు లొంగక పోయెను శక్తి.

రామభద్రుడు బలముగ శక్తిని
వెలికిలాగెను విరచివేసెను
రావణాసురుని నిశితశరములను
లెక్కచేయక రాముడు నిలచెను.

శరములు వచ్చి తగులుచున్నను
లక్ష్మణమూర్తిని కౌగలించుకొని
హనుమ సుగ్రీవుల వానరవీరుల
చూచి పలికెను రామచంద్రుడు :

''వీరులార! మీరందరు ఇచట
లక్ష్మణమూర్తికి రక్షగనుండుడు
నేటికిదొరకెను రావణాసురుడు
ఇపుడే వీనిని వధించివేతును.

వేచియుండిన చాతకపక్షికి
వేసవి తదుపరి మబ్బుదొరికినటు
బహుకాలమునకు రావణాసురుడు
దొరకెను- వీనిని వధించివేతును.

ఎంతో సమయము పట్టదునాకు
ప్రమాణమ్ముగా చెప్పుచుంటిని
ఒక్కముహూర్తపు వ్యవధిలోపలే
రామ రావణుల ఒకరే ఉందురు.

మిత్రులార! అట లక్ష్మిహరించెను
వనవాసమునకు వచ్చితినేను
దండకాటవిని తిరుచుచుంటిని
ఆలిని అసురుడు అపహరించెను

ఆ బాధలను మించినబాధ
నా తమ్ముడు యిట నేలనుబడుట
నా దుఃఖములు తీరుటకొఱకై
దశముఖునిపుడే త్రుంచివేసెద.

వాలినిఎందుకు త్రుంచినాడనో-
సుగ్రీవుని రాజుగ చేసినాడనో-
కపులను చేర్చుకు వచ్చినాడనో-
కడలికి సేతువు కట్టినాడనో-

ఇందుకోసమే - ఈ సమయమ్ముకై
ఈ దశకంధరు దునుముటకొఱకై
అబలహర్తను చంపుటకొరకే
అధర్మమ్మును త్రుంచుటకొరకే.

విషఫణి కంటికి కనపడువాడు
బ్రతుకడు- అటులే ఈ దుర్మార్గుడు
నాకగుపడెను బ్రతుకనీయను
త్రుంచెదనేను విడువను నేడు.

మీరందరును మహాయోధులే
ఎదురేలేని వీరవిక్రములు
ఇచ్చటవుండి జరిగెడిపోరును-
రామ రావణ యుద్ధము గనుడు.

ముల్లోకములు దేవఋషులును
రాముని శక్తిని తెలిసెదరిపుడే
ధరణియుండువరకీ యుద్ధమును-
రామశౌర్యమును చెప్పుకొందురు.''

రాముడు అటుల కపులకు చెప్పి
లక్ష్మణమూర్తికి రక్షగనిలచి
స్వర్ణభూషిత నిశితశరములు
విడచెను ఘనముగ దశకంఠునిపై.

అంతట అసురుడు రామునిపైన-
మండెడిశరములు ముసలాయుధములు-
వర్షిత మేఘములన్నటు విడచెను-
ఘనసంగ్రామము జరిగెనప్పుడు-

రామ రావణుల శరములు నింగిని
మహాధ్వనులతో నింపివేసెను
విరిగిన శరములు మంటల మండుచు
చల్లినట్లుగా నేలను పడెను.

మహావీరుల వింటి సవ్వడుల
సర్వజగత్తు చలించిపోయెను
ప్రాణికోటి అట భయపడిపోయెను
ఆశ్చర్యములో మునిగిపోయిరి.

అమిత విక్రముడు రామచంద్రుడు
ఘనకోదండము త్రిప్పుచు నచ్చట
విజృంభించి శరములు వదలగ
సూటిగ తగిలెను రాక్షస రాజుకు

రామబాణములు బాధించగను
దిక్కుతోచక దీనవదనుడై
గాలికి చెదిరిన మేఘము రీతిగ
పరుగిడె లంకకు లంక ఏలిక.

॥శ్రీ రఘురాముని॥

✤✤✤

## 102 హనుమంతుడు రెండవసారి ఓషధి పర్వతము తెచ్చి లక్ష్మణునికి స్వస్థత చేకూర్చుట

శక్త్యాయుధముతొ నెత్తురు కారుచు
నేలను బడిన తమ్ముని గాంచి
అమిత కోపముతొ పోరెను రాముడు
పోరుచు పలికెను సుషేణుగాంచి :

''ఓ సుషేణుడా! నా తమ్ముడిట
సర్పము రీతిగ పొరలుచుండెను
ప్రాణముకన్న మిన్న లక్ష్మణుడు
నేనీ దుఃఖము భరించలేను.

పోరెడి శక్తి పోవుచున్నది
సుగుణరాశి నా తమ్ముడు లేనిచొ
నే సుఖపడుట ఎందుకోసము!
నేనిక ఎందుకు జీవించుటయా!

నా ముందరనే ఆ దుర్మార్గుడు
నా సోదరుని రణమున కొట్టెను
నా శౌర్యంబది వ్యర్థమైనది
ననుగన నాకే సిగ్గగుచున్నది.

నా పరాక్రమము కుంటువడ్డది
ధనుసు నిలువక జారుచున్నది
శరములు విడువగ వశపడకున్నది
కంటతడితొ నా దృష్టి నిలవదు.

తూలుచు నడిచెడి మనుజుని మాదిరి
నిలబడలేక తడబడుచుంటిని
అంతకంతకు దుఃఖము పెరిగి
అసువులపైన మమత తగ్గెను.''

అనుచు రాముడు యుద్ధభూమిలో
నరక యాతన అనుభవించుచు
నేలను పొర్లెడి లక్ష్మణు గాంచి
దుఃఖతప్తుడై-కంటనీరిడె

''యోధులార! నా తమ్ముని గనుడు
దుమ్ములొ పొర్లుచు యిట పడియుండెను
అనితో, అసువులతో పనిలేదు
సీత తలంపులు ఇక నాకేల!

తమ్ముడు లేనిచో రాజ్యమదేల
అసురునితో యిక ఆలము ఏల!
ఇల్లాలు, బంధువులు, హితులు దొరకెదరు
తమ్ముడు ఎచ్చట లభించగలడు!''

అనుచు రాముడు విలవిలలాడెను
ఇంద్రియమ్ముల పట్టు తప్పెను
నిట్టూర్పులతో చతికిలబడెను
శోకతప్తుడై కన్నీరిడెను.

నేలను బడిన లక్ష్మణుగాంచి
సుషేణు డపుడు పలికె రామునితొ :
''మనుజోత్తమ, ఓ జగదభిరామా!
లక్ష్మణమూర్తి చనిపోలేదు

ముఖ కాంతులవి మాయలేదు గను
ప్రసన్నవదనము చూడుము రామా!
అరచేతులవి ఎర్రగనున్నవి
ఎర్ర తామరల పోలియున్నవి.

మూసిన కన్నులు ప్రసన్నమ్ముగా
ఉన్నవి రామా! నువు గనుమయ్యా!
అసువులు లేనిచో రూపము యిటుల
ఉండదు – అది ఆరూపమె వేరు.

మహావీరుడా! నరపుంగవుడు
అసువులతోనే ఉన్నాడయ్యా!
దుఃఖము–వలదు మూర్ఛనందెను
నాడి గలదు నిట్టూర్పులు గలవు.''

అనుచు సుషేణుడు రామచంద్రుని
ఊరడించి అట హనుమంతుని గని
''పవననందనా! పరాక్రముడవు
మంచి కార్యములు చేసెడి ధీరుడ

మంగళకరమగు ఓషధిగిరియన
జాంబవంతుడు తెలిపెను నీకు
శీఘ్రమె దక్షిణ శిఖరము చేరి
అచటి ఓషధులు గొని రావలెను.

లక్ష్మణమూర్తిని బ్రతికించుమయా!
విశల్య, సువర్ణ, సంజీవి కరణి
సంధాన కరణిని గొని రావలెను''
అన విని అపుడే సాగెను మారుతి

త్రుటిలో పావని ఓషధి గిరిపై
మహిత మూలికల కొరకై వెదకెను
దివ్యౌషధుల గుర్తు తెలియక
తికమక పడెను మారుతి అచట.

''గుర్తు తెలుసుకొని తిరిగి వచ్చి ఈ
గిరిపై వెదకిన కాలయాపన
అందువల్ల మరి హాని జరుగును
కావున గిరినే గొని పోయెదను''

అనుకొని మారుతి అతి బలశాలి
ఓషధి గిరిని పెకలించుటకై
మూడుమార్లుగా కదిపెను గిరిని
అవలీలగను గిరి ఊడినది.

విరగబూసిన సుమ తరువులతో
నిండుగనున్న ఓషధిగిరిని
రెండు చేతులతొ పైకి ఎత్తెను
నింగిమార్గమున ప్రయాణమయ్యెను.

జలముతొ నిండిన ఘనమేఘమువలె
పర్వతశిఖరము శోభిలుచుండగ
మహావేగముగ మారుతి సాగి
యుద్ధరంగమున దించెను గిరిని.

అలసట తీర్చుకు వాయునందనుడు
సుషేణు గాంచి పలికె వినయముగ
''వానరపుంగవ! గిరినే తెచ్చితి
ఆ మూలికలు తెలియవు నాకు.''

అంతటి ఘనకార్యంబును చేసిన
హనుమను పొగడెను సుషేణుడపుడు
అసాధ్యమగుపని హనుమ చేయగా
అసురులు, కపులు విస్మయులైరి.

ఓషధిగిరిపై వనమూలికలను
సుషేణు డపుడు, వెలికితీసెను
అందొక మూలిక లక్ష్మణమూర్తికి
వాసనచూపెను ఆ కపిశ్రేష్ఠుడు.

మూలిక వాసన తగిలిన వెంటనె
లక్ష్మణు దేహమునందు జొచ్చిన
శరముల ములుకులు రాలిపడినవి
హాయిగలేచెను రామానుజుడు.

ఆనందముతో ఆ సౌమిత్రి
నిలువగ- కపులు సంబరపడిరి
వానరయోధులు- సుషేణు,హనుమల
పొగడిరి గుండెలు నిండిన భక్తితో.

ఆనందముతో కనులు చెమర్చగ
రమ్ముసోదరా! అనుచు ప్రేమతో
తమ్ముని పిలచి కౌగలించుకొని
మురిసిపోయెను రామభద్రుడు.

''సోదర! నీవు నా భాగ్యమున
జీవించితివి- అటుగాకున్నచొ
నే బ్రతికుండుట అర్థరహితమగు
సీతతొ నాకిక పనియే లేదు

నీవు లేనిచో నే జయించుట
వ్యర్థము సోదర!'' అనుచు రాముడు
పలుకుట వినిన,లక్ష్మణమూర్తి
గుండియపొంగి పలికె అన్నతో :

''అన్నా రామా! రఘుకులసోమా!
సత్యధర్మముల మూర్తివి నీవు
విభీషణునికి లంకాపట్నము
ఒసగెద ననుచు ప్రతిన చేసితివి.

దుర్బలునివలె- పలుకుట తగదు
పాపరహితుడా! సత్పురుషు లిల
ప్రతిన తప్పరు- ప్రతిన పాలనము
మహితలక్షణము మనుజపుంగవా!

నాకొరకై నువు వంతనొందితివి
బ్రతికితినయ్యా శుభము జరిగెను
దశకంఠుని దశశిరములు దునిమి
నీ ప్రతిజ్ఞను పరిపాలించుము.

కరకు కోరలతొ గర్జించుచును
వనమున తిరిగెడి కేసరి కనులకు
కనబడునట్టి మహాగజమది
చావకతప్పదు- అదేవిధముగా

నీకు శత్రువై నీకంటనుబడి
నిలువలేడు ఆ దశకంధరుడు
సూర్యాస్తమయము అగులోపలనే
అసురుని కూల్చుము అది నాకోరిక

పోరగవలెను విజయరాఘవా!
విభీషణాఖ్యుని అభిషేకించగ
భూసుత సీతను పొందగోరినచొ
పోరున కూల్చుము పంక్తికంధరుని.''

॥శ్రీ రఘురాముని॥

✤✤✤

# 103 రామ రావణ భీకర యుద్ధము

తమ్ముని పలుకులు వినెను రాముడు
కర్తవ్యమ్మది తోచెను అపుడు
ఘన కోదండమునందుకు నిలచెను
అమోఘ శరమును వింటికి కూర్చెను.

అంతటిలోనే అసురనాధుడు
మరియొక తేరును అధిరోహించి
రవిని పట్టుటకు వచ్చురాహువై
రాముని కెదురుగ వచ్చెను పోరుకు.

భయంకరమ్మగు శరముల నపుడు
అసురునిపైకి విడచెను రాముడు
అగ్ని శిఖలను పోలు శరములు
బంగరు శరముల గాయములైనవి.

నేలను నిలబడి రాముడు పోరగ
రథమునుండి ఆ అసురుడు పోరగ
సమమగు యుద్ధము కాదని- నింగిని
సురగంధర్వులు తమలో తలచి

దేవేంద్రునికి తెలియబరచగా
తన రథమునుశ్రీరాముని కొరకై
తీసుకుపొమ్మని తన సారథియగు
మాతలితో దేవేంద్రుడు చెప్పెను.

నాకమునుండి రాముని కొరకై
మాతలి- ఇంద్రుని రథమును తెచ్చెను
బంగరు రథమది కాంతుల వెలిగెను
మంగళకరముగ గంటలు మ్రోగెను.

రవికాంతులతో వెలిగెడి ఛత్రము
బంగరు దండము కలిగియున్నది
బంగరు ఆభరణమ్ములు నిండి
ఆకుపచ్చని గుఱ్ఱములున్నవి.

రథాశ్వమ్ముల మేని కాంతియది
మధ్యాహ్నములో రవిని పోలెను
రథసారథియగు మాతలి అపుడు
ముకుళిత హస్తమ్ములతో పలికెను :

''విజయరాఘవా! వందనమయ్యా!
నీ విజయముకై సురనాయకుడు
రథమును నాతో పంపెను స్వామీ!
నీ రథసారథినైతిని ధన్యుడ!

ఇదిగో రామా! ఇంద్రుని ధనుసు
అగ్నినిపోలెడి దివ్యకవచము
సూర్యునిపోలెడు శరములు గొనుము
శక్త్యాయుధమును ఒసగెను సురపతి.

రథమునెక్కుముఓ రణధీరా!
స్యందనమెక్కుము జానకిరమణా!
ఇంద్రుడు అసురులద్రుంచినట్లుగా
కూల్చుము రామా! లంకేశ్వరుని.''

దేవరథమునకు ప్రదక్షిణించి
నమస్కరించి రాముడు ముదముగ
అధిరోహించెను- రాముడు అపుడు
పూర్వగిరినిగల రవియనిపించెను.

మహాబాహుడగు పురుషోత్తమునికి
లంకాపతియగు రావణరాజుకు
భీకరయుద్ధము జరిగినదపుడు
బలములో వారు సమ ఉజ్జీలు.

రావణరాజు విడచినయట్టి
గాంధర్వాస్త్రము వచ్చుచుండగ
తిరిగి రాముడు గాంధర్వాస్త్రము
విడిచి- అసురుని అస్త్రము కూల్చెను.

దైవాస్త్రమును దైవాస్త్రముతో
రామచంద్రుడు నేలకురాల్చెను
అదిగని అసురుడు అమితకోపమున
రాక్షసాస్త్రమును విడచెను అపుడు.

విషసర్పమ్ముల రూపముదాల్చి
బంగరుశరములు బయలుదేరెను
నిప్పులు గ్రక్కుచు తెరిచిన నోటితొ
రామునిపైబడ వచ్చెను శరములు.

వాసుకిపోలిన సర్పములవ్వి
పడగలు విప్పి అన్నిదిక్కులకు
బుసలువిడచుచు బయలుదేరినవి
రామునిపైకి వచ్చెను ఫణులు.

అదిగాంచిన శ్రీరామచంద్రుడు
గరుడాస్త్రము సంధించివిడచెను
శరములు గరుడుని రూపమునంది
వెడలెను రాముని చాపమునుండి.

గరుడరూపమును వచ్చినశరములు
సర్పరూపమున నున్న శరములను
నేలకూల్చెను- అదిగని అసురుడు
మరింతరోషము పెరిగినవాడై

భయంకరమగు శరములుతీసి
శరవర్షము కురిపించుచునంత
రథసారథిని రామచంద్రుని
బాధపెట్టెను లంకానాథుడు.

దేవేంద్రుని రథధ్వజమును కూల్చెను
ఇంద్రునిరథ తురగమ్ముల కొట్టెను
అటులా అసురుడు శరములువదలి
బాధించెను శ్రీరామచంద్రుని.

అన్నిదిక్కులలో మంటలుమండుచు
పొగలుకమ్ముకొని కడలి అలలవి
సూర్యుని పట్టుట కెగసిపడినవి
సూర్యునికాంతి క్షీణించినది.

సాహసకార్యము చేసెను అసురుడు
అది గని సురలు వంతనొందిరి
రాముని స్థితిని గాంచిన కపులు
విభీషణుడును కలతచెందిరి.

ధూమకేతువుతొ చేరిన సూర్యుడు
వికృతమ్ముగా కనబడినాడు
ఇక్ష్వాకుల శుభతార విశాఖను
అంగారకుడు ఆక్రమించెను

రావణాసురుడు అనెడి రాహువు-
రామచంద్రుడను చంద్రుని పట్టగ
బుధుడు- జనులకు అమంగళమ్మును
చేయగ నెంచెనొ అనిపించినది.

కడలినుండి మైనాకుడెగసినటు
పదితలకాయలు ఇరువదిచేతుల
ధనుర్ధరుడయి రణరంగమున
రావణాసురుడు పోరగనిలచెను.

రామచంద్రుని- రావణరాహువు
పట్టుకొనగను- బుధుడు అశుభముగ
ప్రజాపత్యము చంద్రప్రియమగు
రోహిణితారను ఆక్రమించెను.

అంతటిరూపము ఆగ్రహమ్ముతో
నింగి తాకునటు నిలబడగానే
రామచంద్రుడే కలవరపడెను
శరములుకూర్చుట అశక్యమయ్యెను.

వెంటనె రాముని కోపము ఎగసెను
కనుబొమలవ్వి ముడుతపడినవి
కన్నులెఱ్రబడ కాలయముడయి
దహించు చూపుల చూసెనసురుని.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 1 0 4 ఘన శరములతో రాముడు రావణుని బాధించుట

క్రుద్ధుడైన లంకేశ్వరు గాంచి
సర్వ జగత్తు కలవరపడెను
గిరులు, వనములు భూమియు వణకెను
భయపడి అరచెను క్రూర జంతువులు.

మహానదులును సముద్రమ్ములు
కల్లోలముతో కదిలిపోయెను
నింగిని పక్షులు భయముగ కూసెను
సర్వ భూతములు భయపడిపోయెను.

ఉరుముచు పరుగిడె ఘన మేఘములు
మహోత్పాతములు కనబడుచుండెను
మహోగ్రుడై శ్రీరాముడుండెను
రాక్షసరాజే భయపడినాడు.

రామ రావణులు మహావీరులు
భీకర యుద్ధము నారంభించిరి
ప్రళయము వచ్చున! అన్నటులపుడు
భయంకరమగు పోరు జరిగెను.

దేవగంధర్వులు మహోరగులును
దైత్యులు సురలు మహాఋషులును
గరుత్మంతులూ ఖేచరుఖున్నూ
నింగిని నిలచి రణముచూచిరి.

రాముని కొరకై సురలందరును
రావణు కొరకై అసురులందరు
అభిమానముతో జయమును కోరుచు
పోరు చూచుచు వణకుచుండిరి.

రావణుడంతట భయంకరమ్మగు
శూలాయుధమును చేత ధరించెను
రిపు సంహారము చేసెడి శూలము
నింగి కెగరగల శక్తిమంతము

గిరి శిఖరములను పోలు శిరముతో
చూడ భయంకరమగు శూలమ్మది
పొగలు రాజుకొని పెను సవ్వడితో
ప్రళయాగ్నివలె తోచెడి శూలము.

సర్వ భూతముల-చీల్చగ చాలెడి
శూలము గనిన యముడే భయపడు
చీల్చగ చాలును-నరక సమర్థము
అమోఘ శూలము అతి భయంకరము.

అంతటి శూలము అసురుడు తీసి
అమిత కోపమున నిప్పులు రాల్చుచు
నడిమికి పట్టుకు గాలిలో ఊపుచు
సింహనాదమును ఘనముగ చేసెను.

రావణాసురుని సింహనాదమున
భూవ్యాకాశము దిక్కులదలెను
సర్వభూతములు హడలిపోయెను
కడలి కలతపడికల్లోలమయె.

రావణాసురుడు రాముని గాంచి
అట్టహాసముగ పలికెనప్పుడు :
''రామా! ఇదిగో శూలము నెత్తితి
వజ్రము పోలు కఠినమైనది.

ఇపుడే శూలము నిన్ను కూల్చును
అంతట ఆగదు-తమ్ముని కూల్చును
నీవు చంపిన వీరులకడకు
నేను పంపెద నిన్నీ క్షణమున.

నిలునిలు రామా! ఇదిగో శూలము''
అనుచు రావణుడు రామునిపైకి
ఘనమగు శూలము విసరెను బలముగ
గంటలు మ్రోగగ సాగెను శూలము

మంటలు మండుచు మెరపులు నిండి
గణగణ భీకరధ్వని చేయుచును
వచ్చుచునున్న ఘనశూలమును
రాముడు గాంచి ధనుసును వంచి

దానవరాజు వదలిన శూలము
శక్త్యాయుధమును తాకగ నింగిని
మహాశూలము ముక్కలైనది
కాంతులుమాసి రాలెను ముక్కలు.

ప్రళయాగ్నిని మరి చల్లబరచుటకు
జలధారలను సురపతి పంపును-
అటులే రాముడు శరపరంపర
వదలెను వచ్చెడి శూలముపైకి.

అంతట రాముడు ధ్వనితో సాగే
నిశిత శరములు వడిగల అమ్ములు
వడిగా పరుగిడు అశ్వమ్ములపై
విడచి- గుఱ్ఱముల కూలద్రోసెను.

అగ్నితొ మిడుతలు కాలినట్లుగా
రాముని శరములు కాలిపోయెను
రాముడు గాంచి ఉగ్రుడయ్యెను
అంతట- మాతలి తెచ్చిన శక్తి.

అటులే అమ్ములు రామచంద్రుడు
రావణు వక్షస్థలమున నాటెను
లలాటమ్మున మూడు శరములు
సూటిగ నాటెను రామచంద్రుడు.

శక్త్యాయుధమును గ్రహించి రాముడు
బలముగ త్రిప్పి విసరివేసెను
శక్త్యాయుధపు గంటలు మ్రోగెను
అగ్నిహోత్రమై ముందుకు సాగెను.

రామబాణములు మేన తగిలినవి
రక్తసిక్తమై పోయెను అసురుడు
అమితబాధకు లోనైనాడు
విరగబూసిన అశోకమాయెను.

ఆగ్రహమ్మది పొంగివచ్చెను
అటులే దిగులు దిగలాగినది
అంతటి ఘనునికి- రాముడు ఘనుడని
అనిలో- బాధలొ తెలియవచ్చెను.

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 1 0 5 అలసిపోయిన రావణుని–సారథి లంకలోనికి గొనిపోవుట

పోరున పేరుగడించిన యోధుడు
ఆ రణభూమిని రామబాణముల
అమితబాధకు లోనైనాడు
ఆగ్రహమ్ముతో ఉడికిపోయెను.

జ్యోతులపోలెను రావణుకన్నులు
శరవర్షము కురిపించె నసురుడు
వచ్చెడిశరముల చెక్కుచెదరక
మహాగిరివలె నిలచెను రాముడు.

సూర్యకిరణముల నీరు ఇంకినటు
రామబాణముల రావణుశరములు
వ్యర్థముకాగా లంకేశ్వరుడు
వేయిశరములను విడచెనొక్కపరి.

ఆ శరములవి నేరుగపోయి
రామచంద్రుని మేనతాకినవి
రక్తసిక్తమై రామచంద్రుడు
పూచిన మోదుగు తరువుగ తోచెను.

తేజోవంతుని కోపము పెరిగెను
కోదండముతో శరములువిడచెను
రావణాసురుడు పోరెను శరముల
పోరగసాగిరి జయాభిలాషులు.

ఇరువీరులు అట వదిలిన శరముల
నింగిచీకటై అంధకారమై
ఒకరికి నొకరు కనబడలేదు
అంతట రాముడు నవ్వుచు పలికెను :

''ఓ రావణుడా! అసురకులాధమ!
నే దరిలేని సమయము చూచి
నా యిల్లాలిని- వివశురాలను
అపహరించిన నీచుడ వీవు.

వీరుడవని నువు పొంగిపోకుమా!
పురుషుడు దగ్గరలేని సమయమున
భయవిహ్వలయగు బాలను నాడు
హరించినావు- కాపురుషుడవు.

సదాచారములు మంటగలిపితివి
సిగ్గువదలి నువు చరించుచుంటివి
కాముకుడవు నువు శూరుడగావు
ఛీయను పనులు నీ సొమ్మైనవి.

ధనపతికెటుల తమ్ముడవైతివి?
యశముత్రుంచగ పుట్టినాడవో!
అబలహర్తవు అఘముల పుట్టవు
బలవంతుడనని గర్వము నీకు.

శూరుడననుచు చాటుకొంటివి
చోరునితీరుగ హరించినావు
నా ఎదుటనె నువు హరించనెంచిన
ఖరునికడకు నినుజేర్చి యుందును.

దుర్మార్గుడవు పాపకర్ముడా!
దైవవశమున నేటికి గంటిని
వాడిశరములివి యమసదనమునకు
నినుగొనిపోవును అతిత్వొందరలో

కుండలాలతో జ్వలించుచున్న
నీ శిరస్సును శరమున త్రుంచెద
నేలనుబడు నీ ఘనమగు తలను
కుక్కలు, నక్కలు ఈడ్చుకుపోవును.

సమరభూమిలో నీ మొండెముపై
కాకులు గ్రద్దలు వ్రాలును అధమా!
శరములు చేసిన రంధ్రమ్ములలో
రక్తము త్రాగును ఆ పక్షులువిను.

గరుడపక్షులు పాముల గొనినటు
రాబందులు నీ ప్రేగులు లాగి
నేలనీడ్చును ఇనుప ముక్కులతో''
అనుచు రాముడు శరములువదలెను.

ఉత్సాహమ్ము బలము పెరిగెను
సమరపండితుడు రామచంద్రుడు
శరవర్షము కురిపించసాగెను
అస్త్రములపుడు ఉద్భవించినవి.

శరవిన్యాసము చూపుచు రాముడు
వదలెను శరములు అతిలాఘవముగ
శుభసూచనలు అగపడెనపుడు
ఆగక వదలెను అమోఘశరములు.

వీరపుంగవుడు రామచంద్రుడు
శరములనటుల విడచుచుండగా
వానరవీరులు విజృంభించి
శిలలు వరుసగా విసరుచుండిరి.

శరవర్షమ్ము శిలావర్షములు
ఒకే సమయమున వచ్చిపడగనే
చిత్తభ్రమణము కలిగెను రాజుకు
దిక్కుతోచక నిలచె నసురుడు.

మనసుకలతపడి నీరసపడెను
చాపముపట్టగ వశపడలేదు
ఆయుధమ్ముగొన శక్తి ఉడిగెను
రాముడు రణమున విజృంభించెను.

రామబాణములు తగులుచుండగా
నిర్వీర్యుడయి నిలిచిపోయెను
మరణకాల మాసన్నమైనటు
మెదలక నిలచెను దశకంధరుడు.

లంకానాథుని అవస్థగాంచి
రణమున అతనికి సమయముగాదని
నమ్మిన సారథి కలవరపడక
తోలెను రథమును పురములోనికి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 1 0 6 రావణాసురుడు తిరిగి యుద్ధమునకు వచ్చుట

కాలచోదితుడు రావణాసురుని
మృత్యుదేవత ముందుకు త్రోసెను
కోపవశుడయి కన్ను లెఱ్రబడి
కటువుగ పలికెను తన సారథితో :

''ఓయీ సారథి, బుద్ధిహీనుడా!
బలహీనునిగా, శక్తిహీనునిగ
పౌరుషముడిగిన పిరికి పందగా
తలంచి-రథమును మరలించితివి.

పరాక్రమించుట తెలియదనుకొని
మాయలు తెలియని మూర్ఖుడ ననుకొని
అస్త్ర బలమునా కసలే లేదని
నీవు తలంచి కించపరచితివి.

అటుగాకున్నచొ ఆ రణభూమిని
నా మది తెలియక రిపుని ముందరే
తేరు మరల్చిగొనితెచ్చితివి
దుర్బుద్ధితొ నువుచేసిన పని యిది.

బలవంతుడనని పేరుగాంచితి
పరాక్రముడనని యశము గడించితి
అచిరకీర్తిని అంతము చేస్తివి
వెన్ను చూపినటు వెల్లడించితివి.

శత్రువు బలమున పేరు గడించెను
పరాక్రమమున యశము నందెను
యుద్ధ ప్రియుని నను అతని ముందరే
అల్లునిగా నువు చేసినాడవు.

రిపుని కెదురుగ రథమును నీవు
తోలలేదు–నువు శత్రువు వద్ద
లబ్ధి పొందిన దుర్మతి వగుదువు
రిపునికి వీలగుపని చేసితివి.

ఎన్ని సాయములు నీకు చేసితిని
చిరకాలముగా సారథి వైతివి
నేను చేసిన మేలు తలచుకొని
తేరు తోలుము రణరంగమునకు.''

నిష్ఠూరముగా రాజు పలుకగా
మేలుకోరెడిఆ రథ సారథి
వినియము నిండి పలికెను రాజుతో :
''రాజా! రిపునికి లొంగలేదయా!

మూర్ఖుడగాను భయపడలేదు
మేలు మరచెడి దుర్మతిగాను
మేలుకోరి నే తెచ్చితి నరదము
నీ హితమును నే కాంక్షించితిని.

రథమును వెనుకకు మరలించుటకు
హేతువు వినుము ఓ మహరాజా!
చంద్రోదయమున కడలి పొంగగా
నదీ జలములు వెనుకకు తగ్గును.

నీ ఉత్సాహము నే గమనించితి
కానీతురగము లలిసిపోయినవి
వానదెబ్బ తిను వృషభములన్నటు
లాగి అలసినవి మన గుఱ్ఱములు.

అంతియెకాదు ఓ లంకేశ్వర!
అపశకునములవి అగపడుచున్నవి
రథ చోదకుడు శుభ శకునమ్ములు
దేశకాలములు గమనించవలె.

రథికుని శక్తి గ్రహించవలెను
ఎదుటి బలమును చూచుచుండవలె
ఎదుటి లోపములు పరిశీలించి
తగినట్టుగనే రథము తోలవలె.

రిపుని బలమును పరిశీలించుచు
ముందుకొ ప్రక్కకొ లేదా వెనుకకొ
రథమునునడిపి సందర్భముగా
రథికుని రక్షణ చేయగవలెను.

సేద తీరుముఓ మహరాజా!
తురగమ్ములవి తేరుకున్నవి
రాజీవు మరియు మిత్రుడ వీవు
నీ హితమునునే కోరితి రాజా!

నీయందుగల అభిమానముచే
ప్రేమాస్పందిత హృదమముతోనే
తేరునువెనుకకు తోలితి రాజా!
వీరుడవీవు ఆజ్ఞాపించుము.

అమోఘబలుడవు లంకాపతివి
నీ ఆనతి నే పాలించెదను
నీ ఋణమును నే తీర్చుకొందును
నే సేవలొ నే తరించనెంచితి''

సారథి మాటల సంతుష్టుడయి
రాముని కెదురుగ తేరు తోలమని
లంకకు మరలనురిపుని జయించక
అనుచు పలుకుచు లంకానాథుడు

రత్నఖచితమగు హస్తాభరణము
సూతునకిచ్చి ప్రోత్సహించగా
రావణు రథము రాముని కెదురుగ
శీఘ్రమె నిలబడె రణరంగమున.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 107 అగస్త్యమహర్షి శ్రీరామునికి ఉపదేశించిన–ఆదిత్య హృదయము

రామ రావణ యుద్ధము చూడగ
సురలతొబాటు పుణ్యమూర్తి యగు
అగస్త్యమహర్షి మహిమాన్వితుడు
వచ్చెను–గాంచెను రామచంద్రుని

అలసటతీరిన రావణాసురుడు
ఆలము చేయగ తిరిగివచ్చెను
ఆజిలొ అసురుని త్రుంచుట ఎటులో–
ఆలోచనలో రాముడుండగా

అగస్త్యమహర్షి రామచంద్రునికి
ఆదిత్యహృదయము–దివ్యమంత్రము
అమోఘ ఫలితమునిచ్చెడిస్తుతిని
అఖండ విజయముకోరి చెప్పెను.

''రామా! నీవు రిపుల గెలచుటకు
ఉత్తమోత్తమము అతిరహస్యమగు
సనాతనమ్మగు పవిత్ర మంత్రము
ఉపదేశించెద''ననుచు తెలిపెను.

''మంత్రజపమున మంగళమూర్తీ!
రిపులు మిగలరు మహిమాన్వితమిది
నాశరహితమగు శాశ్వత ఫలమును
మంత్రము ఒసగును జయము తథ్యము.

సర్వమంగళ శ్రేయోదాయిని
ఆధివ్యాధులను హరించు మంత్రము
ఆయుర్భాగ్యము పెంచును మంత్రము''
అనుచు రామునికి ముదముగ చెప్పెను.

''సురాసురులచే వందనమందెడి
అఖిలలోకముల వల్లభుడైన
రశ్మిమంతుని, భాస్కరదేవుని
ఉపాసించుము భక్తినిండుగా

తేజోవంతుడు, వివస్వంతుడు
బ్రహ్మ–విష్ణు–శివ స్కంధులు అతడే
సర్వదేవతా స్వరూపమతడే
ప్రజాపతియు మరి మహేంద్రుడతడే.

యమ కుబేరులు భాస్కరుడగును
జగత్పతియు పరమేశ్వరుడగును
రశ్మిభావనుడు రఘుకులకర్త
పితరులు వసువులు అతడె రామా!

మరుత్ సాధ్యులు అశ్వులు అతడే
అగ్ని, వాయువులు, జీవుల ప్రాణము
ఆ ఋతుకర్త ప్రభాకరుండు
భద్రతనిడెడి భద్రమూర్తియే.

* * *

విశ్వకర్తా! లోకమిత్రా
సవితృపూషా కాంతిమంతా!
సూర్యదేవాఖగుడవీవు
శుభములొసగే దివాకరుడవు.

తపనత్వష్ఠ స్వర్ణరేతా!
హరిదశ్వ సహస్రార్చీ
మరీచిమంతా అంశుమంతుడ
భువనపోషక భానుమూర్తీ!

సప్తసప్తివి తిమిరహారీ!
అగ్నిగర్భుడ శంభుదేవా!
శంఖుడవు నువు భాస్కరుండవు
దేవతలచే వందితుడవు.

శిశిరనాశన-తపనుడవు నువు
నిగమపారగ కవియు నీవై
వింధ్యవీథిని పరుగులెత్తే
నభోమండల నాయకుండవు.

ఆతపీమండలేశ్వర
పింగళుండవు మృత్యువీవు
భూరితేజుడ ద్వాదశాత్మా
గరుత్మంతుని నాథుడవు నువు.

జయుడవీవు జయభద్రుడ!
హర్యశ్వా సహస్రార్చివి
గభస్తిహస్తా వందనమ్ము
సర్వతాపన రక్తుడవు నువు.

సర్వభక్షక భావనుడవు
రమణిపద్మిని నాయకుడవు
భక్తహృదిలో వెలుగు తేజము
మంచు త్రుంచే మహితమూర్తివి.

కనకగర్భుడ లోకసాక్షీ!
సూర్యదేవా కర్మసాక్షీ
సకల జ్యోతిశ్చక్రమీవు
గణములను పాలించువాడవు.

విరించి విష్ణు శంభుదేవుడ
సారంగా సూర్యదేవా!
భాస్వంతా భువన పోషక
మార్తాండా వందనమ్ము.

రౌద్రరూపా విశ్వకర్మా!
తమోనిఘ్నా తప్తవర్ణా!
విశ్వసాక్షీ అమితాత్మా!
ఋతుకర్తా వందనమ్ము.

కృతఘ్నుహారీ! కాంతిమంతా
కృపతో నేలెడి రవివి నీవు
సృష్టి లయములు చేయగల్గిన
అచ్యుతా ఆదిత్యమూర్తీ!

జలమిత్రా! ఘనవృష్టివి
భూతకోటికి శ్వాస వీవు
భువనములు నిద్రించునపుడు
నిద్ర నెరుగక రక్ష నిడెదవు.

శృతులు నీవే వేదమూర్తీ
క్రతుల ఫలితము నీవెస్వామీ!
ఋగ్ యజుస్సామ మూర్తివి
అఘము బాపే అమిత తేజుడ

పూర్వ పశ్చిమ గిరులమ్రొక్కి
ఉగ్ర మూర్తికి మ్రొక్కుచుంటిని
మంగళమ్ముల నొసగునట్టి
భానుమూర్తికి మంగళమ్ము.

* * *

నాయన రామా! ఏకాగ్రతతో
మూడుమార్లు జపించుము నీవు
విజయము కలుగును ఓమనుజోత్తమ!
రావణు కూల్తువు ఈ దినముననే''

అనుచు రామునికి అగస్త్య మహాఋషి
ఆదిత్య హృదయము నుపదేశించి
అంతర్థానము కాగనెరాముడు
దిగులు వదలి సంతుష్టుడయ్యెను

నిశ్చల మనసుతొ సూర్యదేవుని
ఉపాసించెను రామచంద్రుడు
మూడు మార్లుగ ఆచమించుచు
మూడు మార్లు ఆ జప మొనర్చెను.

ఇనుమడించిన ఉత్సాహముతో
కోదండమును చేత ధరించెను
సంతుష్టుడయి మనుజోత్తముడు
రావణు త్రుంచగ నిశ్చయించెను.

రాముడు తన స్తుతి చేసినంతనే
సూర్య మండలమునున్న మహాత్ముడు
మనసు నిండుగా సంతసపడెను
ఆతని తనువు పులకించినది

దేవ గణంబుల వెలిగే దేవుడు
భాస్కర దేవుడు రాముని గాంచి
''రామా! అసురుడు అంతము అగును
ఆలసించక త్వరపడ'' మనెను.

॥శ్రీ రఘురాముని॥

***

# 108 రావణాసురునికి అపశకునములగుపడుట

రావణు సారథి సంతోషముతో
యుద్ధ భూమికి రథము తోలెను
రావణు రథము రిపు సైన్యములను
చెదరగొట్టునటు కనుపించినది.

ఎత్తుగ ఎగిరే రథ పతాకములు
అలంకారముల ఉత్తమాశ్వములు
రథము నిండుగా ఆయుధమ్ములు
నింగిని తాకుచు ధ్వజము వున్నది.

రథము నడచిన సవ్వడి అచ్చట
భూమంతయును వ్యాపించినది
అసుర సైన్యముల ముదము గూర్చుచు
కపుల కలంచగ రథము సాగెను.

మహా ధ్వనులతో అమిత వేగమున
వచ్చెడి రాక్షస తేని రథమును
రాముడు చూచెను-మెరపులవోలె
మహా రథమదివచ్చుట గాంచెను.

నల్లని గుఱ్ఱములున్నవి తేరుకు
ధగధగ మెరసే ఆయుధాలతో
కాంతుల మెరసే పతాకాలతో
వచ్చెడి రథమును రాముడు గాంచెను.

చాపము వంచి సవ్వడిచేసి
రథ సారథి యగు మాతలితో నసె
''గనుమో మాతలి! శత్రు రథమది
అమిత వేగమున వచ్చుచున్నది.

అప్రదక్షిణము తిరుగుచు తేరు
వచ్చుట గనుము-హతుడగు నాతడు
ఏమరకుండుము- యోగ్యుడ వీవు
రిపుని కెదురుగ- రథము తోలుము.

నింగి మేఘముల- గాలి త్రోసినటు
అరదము పైన వచ్చెడి రిపుని
ఎగుర గొట్టెద భయపడవలదు
గుండె నిబ్బరము కలిగి యుండుము.

కలవరపడక తెలివితొనుండి
దృష్టిచెదరక తిన్నగ చూడుము
పగ్గమ్ములను ఒడుపుగ పట్టుకు
వడిగాతోలుము అసురునికెదురుగ.

ఇంద్రునికే నువు సారథివైతివి
వేరుగ నేను చెప్పగవలెనా!
ఏకాగ్రతతో సమరముచేయగ
నిలచితి నందుకు నీకు చెప్పుట.''

ఆ మాటలకు మాతలి పొంగి
సంతోషముతో దేవరథమును
రావణుతేరుకు అపసవ్యముగ
నడపెనప్పుడు రణరంగమున.

రథచక్రములతొ లేచిన దుమ్ము
రావణాసురుని కమ్ముకొన్నది
కుపితుడయ్యెను, ఉరిమిచూచెను
ఎదురుగ రథమున రాముని గాంచెను.

దశకంధరుడు చాపము తీసి
శరములు వదలెను రామునిపైకి
తేజోవంతుడు రామచంద్రుడు
చెదరక నిలచెను ధైర్యముగాను.

సురనాయకుని చాపము నందుకు
సూర్యకిరణముల పోలు శరములను
గురితో వదలెను రావణుపైకి
రావణాసురుడు వదలెను శరములు.

ఒకరిని ఒకరు త్రుంచగనెంచి
విజయకాంక్షతో ఎదురుగనిలచి
పోరెడి సింహములన్నతీరుగా
రామరావణులు పోరుచుండిరి.

సురగంధర్వులు సిద్ధులు ఋషులు
రామ రావణ యుద్ధముచూడగ
నింగిని నిలచిరి ఆ సమయములో
నింగీ నేల కనబడలేదు.

రామ విజయము- రావణునాశము
జరిగితీరునను సూచన చేసే
శకునములపుడు అగపడెనచట
మేన గగుర్పుకలిగె సూచనల

రావణాసురుని అరదముపైన
కురిసెనప్పుడు నెత్తుటివాన
అప్రదక్షిణగ సుడిగాలెగసెను
అసుర రథముపై గ్రద్ధలుతిరిగెను.

పట్టపగలు ఆ లంకలోపల
సంధ్యారాగము అలముకొన్నది
ధరణి మండునటు అగుపడెనప్పుడు
ఉల్కలు నింగిని ధ్వనితో తిరిగెను.

రావణరాజుకు అశుభము అనుచు
రాక్షసయోధులు భీతినందిరి
రావణురథము తిరిగినవైపున
ధరణివణకుట ఆరంభించెను.

పోరెడి అసురుల కరములనెవరో
పట్టి నిలిపినటు తోచినదపుడు
రవికిరణములు రంగు రంగులుగ
రావణుదేహముపైన పడినవి.

గైరికధాతువులున్న నగమువలె
రావణాసురుడు తోచెనప్పుడు
నిప్పులు గ్రక్కుచు నక్కలు ఎదురై
అమంగళమ్ముగ కూయసాగినవి.

గ్రద్దలప్పుడు రావణుగాంచి
భయంకరముగ కూయసాగెను
ప్రతికూలముగా వాయువు వీచెను
రావణు ముఖమున దుమ్ముకమ్మెను.

నింగినుండి ఘనశబ్దము చేయుచు
కొరవులు అసురులపైన రాలినవి
వర్షముమాదిరి దుమ్ము కురిసెను
కంటికేమియు కనబడలేదు.

దిశల చీకటులు కమ్ముకొన్నవి
గోరువంకలు నింగిని పోరి
భీతిగ నరచుచు వందలు చచ్చెను-
రాలిపడినవి అరదము మీద.

రథాశ్వమ్ముల పిరుదులనుండి
అగ్నిరాలెను- ఆ హయములకు
కన్నులధారగ నీరు కారెను
భయానకంబగు సూచనలగుపడె.

జయసూచనలు రామునికగపడ
ఆనందించెను జానకిరమణుడు
రావణాసురుని చంపివేసినటు
తలంచినాడు - తథాస్తు అనిరి.

॥శ్రీ రఘురాముని॥

## 1 0 9 రామ రావణుల ప్రచండ యుద్ధము

రథములపైన రామ రావణులు
అతిభీకరముగ పోరుసలిపిరి
లోకములన్నియు భయపడునటుల
రణధీరులు అట పోరుచుండిరి.

ఇరుసైన్యములు పోరు మరచిరి
పోరుచూడగా నిలచిపోయిరి
ఆశ్చర్యముతో యోధులందరు
చూచుచుండిరి ఘన సంగ్రామము.

జరుగు యుద్ధము ముగియుచున్నదని
తెలియుచున్నది వీరులందరకు
సేనలు తమతమ నాయకులను అట
చూచుచు నిలచిరి చిత్తరువులయి.

రణరంగమున తమకుతోచిన
శుభాశుభముల శకునమ్ములతో
మనసు నిశ్చలమునుంచుకు వీరులు
రామ రావణులు పోరుచుండిరి.

రావణుడంతట ఘనమగు శరమున
రాముని అరదపు ధ్వజమును కొట్టెను
ఇంద్రుని రథ ధ్వజమగుట చేతను
ఆ శరములవి వ్యర్థమాయెను.

రథ ధ్వజముపై అమ్ములు గాంచి
రాముడు ప్రతిక్రియ చేయగనెంచి
ధనుసును వంచి దివ్య శరమున
రావణు నరదపు ధ్వజమును కొట్టెను.

రామ బాణము మంటలు మండుచు
మహా సర్పమై దూసుకుపోయి
రావణాసురుని రథ ధ్వజమును
నేల కూల్చి భువి దూరెను అమ్ము.

రథ ధ్వజమటు కూలుట గాంచి
ఉగ్రుడయ్యెను రావణాసురుడు
అగ్నిహోత్రమన జ్వలించినాడు
శర వర్షము కురిపించె నప్పుడు.

నిశిత శరములను రామచంద్రుని
రథాశ్వములపై విడచె రావణుడు
అసురుని శరములు తామరతూండ్లన
మెత్తగ తగిలెను దివ్యాశ్వములకు

అశ్వములసతే చలించలేదు
కలవరపడక నిలచి యున్నవి
దానితొ రావణు కోపము పెరిగెను
మహోగ్రుడై మరి శరములు వదలెను.

గదలు పరిఘలు చక్రాయుధములు
ముసలాయుధములు శూలాయుధములు
గండ్రగొడ్డళులు వివిధాయుధములు
మాయతొ అసురుడు వదలసాగెను.

రాక్షస మాయతొ రావణు ధనుసు
మహా ధ్వనులతో ఆయుధాలను
వర్షించగ నవి గురి తప్పినవి
రాముని ప్రక్కల కపులకు తగిలెను.

అమితోత్సాహము తెచ్చుకు అసురుడు
వేల కొలదిగా శరములు వదలెను
అంతట రాముడు నవ్వుచు-వింటితొ
లక్షల సంఖ్యలొ శరములు వదలెను.

రామ రావణులు రణమున వదలిన
దివ్య శరములవి నింగిని నిండి
ఆకాశమది కనబడకుండెను
అమ్ముల-రెండవ నింగిగ తోచెను.

రామ రావణులు వదలు బాణములు
గురి తప్పకను వ్యర్థము గాక
ఒకరి అమ్మును ఎదుటి బాణము
త్రుంచి రెండును నేలకు బడెను.

సవ్యాప సవ్యమువీరులు తిరుగుచు
తరగని శరముల పోరిరి ఘనముగ
గాలి దూరెడి సందులేక నట
నాల్గు దిక్కులలొ శరములు నిండెను.

వారి గుఱ్ఱముల వీరు కొట్టిరి
వీరి అశ్వముల వారు కొట్టిరి
క్రియకు ప్రతిక్రియ చేయుచు వీరులు
రామ రావణులు పోరసాగిరి.

అటులా వీరులు అత్యద్భుతముగ
మేను గగుర్పుకు లోను చేసెడి
భీకరమైన పోరు సలిపిరి
విజయకాంక్షతో పోరిరి వీరులు.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 110 రామ రావణ ఘనసంగ్రామము

రామరావణుల యుద్ధము గాంచి
సర్వ భూతములు విస్మయ పడినవి
చాకచక్యముగ రథ సారథులు
రథములు నడిపిరి రణరంగమున.

వెనుకకు ముందుకు రథములుకదలగ
ఒకరిని ఒకరు నొప్పించుకొని
వదలెడి శరములు-రథమను మేఘము
కురియు వర్షము అన్నటు తోచెను.

ఢీకొనునట్లు రథములు నడిపిరి
వలయాకారము త్రిప్పిరి రథములు
వివిధ గతులలో స్యందనమ్ములను
నడపిరిరథికుల విజయము కోరి.

వివిధ గతులలో తిరిగెడు రథములు
ఎదురెదురుగను వచ్చి నిలచెను
రథాశ్వమ్ముల ముఖములప్పుడు
తాకు నంతటి దగ్గర నిలచెను.

రామచంద్రుడు నాల్గు బాణముల
మంటలు చిమ్మే దివ్య శరముల
రావణు నరదపుటశ్వమ్ములను
వెనుకకు కొట్టెను, అసురుడు గాంచెను

దశకంధరుడు కోప వశుడయి
నిశిత శరములను గురితో విడచెను
శరములు వచ్చి తగులుచున్నను
చలించలేదు రామభద్రుడు.

కోపము పెరిగిపంక్తికంథరుడు
మాతలిపైన శరములు విడచెను
పిడుగులు పడినటు శరములుపడినను
బాధ కలుగక మాతలి యుండెను.

రథ సారథి యగు మాతలిపైన
శరములు పడుట గాంచిన రాముడు
పట్టరాని కోపమ్ముతొ నంత
వడిగా శరములు వదలసాగెను.

రామచంద్రుడు విజృంభించగ
అసురుడు నిలబడలేకపోయెను
రావణురథమున అతి పరాక్రముడు
ఇరువది శరములు సూటిగవదలెను-

అతివేగముగ వ్యవధి నివ్వక-
ముప్పది, అరువది, నూరు శరములు
వేయి అమ్ములు వేసెను రాముడు
అసురభూపతి ఆగ్రహమందెను.

క్రియకు ప్రతిక్రియ చేయగనెంచి
రామునిపైన రాక్షసరాజు
గదాయుధమ్ములు ముసలాయుధములు
వర్షముతీరుగ వదలసాగెను.

ఆయుధమ్ములటు లంకేశ్వరుని
చాపమునుండి బయలుదేరగ
భీకరమైన ధ్వనులెగసినవి
సప్తసంద్రములు క్షోభించినవి.

ఆ సమయములో పాతాళములో
వసించు పన్నగ దానవులందరు
బాధకు గురియై కలవరపడిరి
భూమి వణకెను గిరులూగినవి.

మహావృక్షములు కూలిపోయెను
సూర్యుని కాంతి మాసిపోయెను
గాలి వీచక నిలచిపోయెను
సురగంధర్వులు భయపడిపోయిరి.

యుద్ధమునందు రామ విజయమును
సర్వలోకముల సుఖమునుకోరి
గోబ్రాహ్మణులకు హితమునుకోరి
సురలును ఋషులు జపము చేసిరి.

నింగిని పూజ్యులు జపము చేయగ
నేలను వీరులు పోరుచుండిరి
నిరుపమానమగు యుద్ధము చూడగ
సుర గంధర్వులు విస్మయపడిరి.

''నింగికి సరి మరి నింగియె అగును
సంద్రమునకు సరి సంద్రమె అగును
రామ రావణుల సరిపడు వీరులు
రామ రావణులు కాకమరెవ్వరు?

రామ రావణ యుద్ధము వంటిది
రామ రావణ యుద్ధమె యగును''
అని గంధర్వులు అప్సరసలును
అనుకొనిరచ్చటి రణమునుగాంచి.

మహాబాహుడు రామచంద్రుడు
అక్షయకీర్తికి నెలవగు రాముడు
రఘువంశవర్ధనుడు శ్రీరఘురాముడు
క్రోధమునిండి జ్వాలగ నిలచెను.

క్రూరమైన విష సర్పమువంటి
శరమును వింటికి గురిగ నమర్చి
రావణాసురుని కంఠభాగమున
సూటిగ నాటగ విడచె నప్పుడు.

జ్వలిత కుండలములున్న శిరస్సు-
రావణాసురుని ఘనమగు శిరము
శరము తాకిడికి – తెగిధరణినిపడె
ముల్లోకములు చూచి మురిసినవి.

అందరు అటులే చూచుచుండగనె
మరియొక శిరము మొలిచెనచ్చట
తెగిన శిరస్సున మొలిచిన శిరమును
తిరిగి త్రుంచెను రామచంద్రుడు.

తెగిన మొండెమున తిరిగి శిరస్సు
మొలిచి నిలచెను ఆశ్చర్యమది!
వజ్రాయుధము పోలుశరముతో
ఆ ఘన శిరమును త్రుంచెను రాముడు

ఆ విధముగను రాక్షసరాజుకు
శిరములు పుట్టుట-శరముల త్రుంచుట
నూట ఒక్క పర్యాయమ్ములు
జరిగెను-అసురుని అసువులూడవు.

వివిధాస్త్రములు తెలిసిన రాముడు
రణకోవిదుడు రామచంద్రుడు
అమోఘ శరములు కలిగిన వీరుడు
ఆశ్చర్యముతో ఆలోచించెను.

''మారీచుడు ఏ శరమున కూలెనొ
ఖరదూషణు లే అమ్ముల కూలిరొ
విరాధు డే బాణమ్ముతొ ఒరిగెనొ
ఏ నారాచము కబంధు త్రుంచెనొ.

అన్ని అమోఘ శరములు తగిలియు
చావడేమి ఈ రాక్షసరాజు
నమ్మినయట్టి కార్ముకమ్ములవి
వమ్మైపోయెన-శక్తి ఉడిగెనా''

అనుచు రాముడు యోచనచేయుచు
ఏమరకుండగ అమితక్రోధమున
రావణాసురుని వక్షస్థలమున
శరవర్షము కురిపించసాగెను.

అదే సమయమున రాక్షసరాజు
ప్రతిగా రామునిపై గురిచేసి
ముసలాయుధములు కురియజేసెను
ఆగ్రహమ్ముతో పోరిరి వీరులు.

రథముల ఎగిరి నింగిని పోరిరి
తిరిగి నేలపై వీరులు పోరిరి
రథములసాగి త్రికూటగిరిపై
రామ రావణులు పోరు సలిపిరి.

మేన గగుర్పు పుట్టునట్టుగా
ప్రళయభయంకర యుద్ధము చేసిరి
దివారాత్రముల భేదము లేక
ఏడు రాత్రులాపోరు జరిగెను.

దేవ దానవ యక్ష రాక్షస
పిశాచ ఉరగులు చూచుచుండగా
ముహూర్తమైనను విరామ మెరుగక
రామ రావణులు పోరు సలిపిరి.

॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 111 రావణ వధ

అవక్రవిక్రమ పరాక్రముడగు
రాముడు రణమున పోరుచున్నను
జయము లభించకపోవుట గాంచి
ఉత్తమ సారథి మాతలి పలికెను :

''ఓ రఘురామా! వీరుడ వీవు
అస్త్ర శస్త్రములు తెలిసినవాడవు
ఏమియు తెలియని సామాన్యునివలె
ఏల శరములు వదలుచుంటివి?

ప్రతిక్రియగా నువు శరములు వేయుచు
ఇంకను ఏల పోరుచుంటివి
సురలు చెప్పిన వినాశకాలము
లంకాపతికి వచ్చెను యిపుడు.

రామా! నీవు రావణుపైన
బ్రహ్మాస్త్రము సంధించి వదలుము
దానికి ఒరుగును రావణరాజు''
అనుచు మాతలి గుర్తుచేసెను.

అంతట రాముడు శౌర్యలలాముడు
దివ్యతేజముల వెలుగులు చిమ్మే
మహోగ్రఫణివలె బుసలు విడచెడి
దివ్యశరమును వెలికితీసెను

ముల్లోకములను జయించకోరిన
దేవేంద్రునికై- బ్రహ్మదేవుడు
తన ప్రభావమున సృజించినాడు
ఆ శరమును శ్రీరాముడు తీసెను.

ఆ కార్ముకమున సురనాయకుడు
ముల్లోకములను జయించినాడు
అదే శరమును దేవనాధుడు
అగస్త్యమహర్షి కందజేసెను.

అగస్త్యమహర్షి అమోఘ శరమును
దండకాటవిని దర్శనమిడిన
రామచంద్రునికి ప్రియముగ నిచ్చెను
దివ్యశరమది- దేవ వరమది.

వాయువేగమున పోగల శరము
సూర్యగోళమై కాల్చును శరము
వాయు సూర్యుల అంశలు గలది
తాకినకాల్చెడి కార్ముకమ్మది

నింగివంటి నిర్మాణము అమ్మది
ఆకాశమువలె వ్యాప్తిచెందును
మేరు మందర పర్వతమ్ములతొ
సరిపడు గౌరవమందు శరమది.

మేరు మందర గిరుల బరువది
ముల్లోకములలొ సర్వభూతముల
తేజము తీసుకు బ్రహ్మదేవుడు
బ్రహ్మాండముగాసృజించె నమ్మును.

ఆ నారాచము సూర్యతేజముతొ
పొగలుక్రమ్మి ప్రళయాగ్ని శిఖవలె
కరుణచూపక- జ్వలించు రూపము
కాలసర్పమై అమిత వేగమున

రిపుతురగములను గజముల చీల్చును
లీలగరథముల నేలకు త్రోయును
పురద్వారముల కూలద్రోయును
అగడ్తలన్నియు త్రెంచివేయును.

వజ్రమువంటిది- త్రుంచబడనిది
గిరులను సైతము చీల్చగలిగినది
రక్తమాంసముల రుచి చూచినది
క్రొవ్వు పులుముకొని యున్నశరమది.

భీకర ధ్వనితో రణరంగమున
మహావ్యూహమును చండాడునది
బుసలుకొట్టు ఘనసర్పము రీతిగ
భూతకోటిని భయపెట్టునది.

మాంసభక్షణము చేయు పక్షులకు
నక్కల గుంపుకు, రాక్షస మూకకు
సరిపడు తిండిని పంచిపెట్టగల
శరము- యమునివలె తిరుగు రణమున

ఖగపతి రెక్కలవంటి రెక్కలతొ
మనసగు రీతిని పొగలిగినది
దానినిమించిన ఉత్తమ శరము
ముల్లోకముల లేనే లేదు

కపులకు ముదము- రాక్షస నాశము
రిపుని కీర్తిని రూపుమాపుటకు
ఆనందము తా ననుభవించుటకు
ఆ శరమును తా కూర్చెను వింటికి

అతిబలవంతుడు రామచంద్రుడు
శరము నప్పుడు వేదవిధిగను
బ్రహ్మాస్త్రముతో అభిమంత్రించి
ఆకర్ణాంతము లాగెను విల్లు.

ప్రళయోగ్రానల సన్నిభమైన
మహాబాణమును రామచంద్రుడు
రావణాసురునిపై గురిచేసి
వదలెను ఘనమగు శబ్దమెగసెను.

మహాశబ్దము నింగి కెగయగ
సర్వభూతములు చలించిపోయెను
ధర్మము నిలపగ చాలిన అమ్మును
ధర్మమూర్తి సంధించి విడచెను.

ఇంద్రుడు వదలిన వజ్రాయుధమన
ఎదురులేని ఆ యమరాజువలె
అడ్డములేక అమితవేగముగ
సాగెను శరము కర్తవ్యముకై.

అమోఘ శరము అమోఘ బలుని
చాపమునుండి ముందుకు సాగి
అమోఘబలుడు రావణాసురుని
వక్షస్థలమును ఛేదించినది.

వక్షము చీల్చుకు దూసుకుపోవుచు
రావణు ప్రాణము హరించె నమ్ము
నెత్తుట తడిసి దేహము చీల్చి
ధరణిలోనికి పోయెను శరము.

మహితకార్యమును బాణముచేసి
విజయగర్వమున జగతిని చూచి
వినయవిధేయత లుట్టిపడగను
రాముని అమ్ముల పొదిలో నిలచెను.

రామబాణమది ఛేదించగను
దేహమునున్న అసువు లూడినటు
రావణాసురుని హస్తమునున్న
ధనుసు జారినది- ధరణి కొరిగెను.

ఇంద్రుని వజ్రాయుధపు పాటుకు
కూలిన యట్టి వృత్రాసురుడన
లంక ఏలిక- రావణాసురుడు
అరదమునుండి జారెను ధరణికి.

అంతటి వీరుడు ఆజిని కూలగ
గాంచిన మిగిలిన అసురసేనలు
దిక్కుతెలియక పరుగులెత్తిరి
ప్రాణభీతితో చెదరిపోయిరి.

పరుగిడు అసురుల గాంచి వానరులు
శిలలు- తరులతో సింహనాదముల
అసుర వీరులను తరిమికొట్టిరి
ఏడ్చుచు అసురులు లంకను జేరిరి.

ఉత్సాహముతో వానరవీరులు
రాముని విజయము మరిమరి తలచుచు
రావణాసురుడు కూలుట తలచుచు
గంతులేసిరి- పొంగిపోయిరి.

దేవదుందుభులు మంగళకరముగ
నింగిని మ్రోగెను ఆ సమయములో
సుగంధ పరిమళ వాయువు వీచెను
పూలవానలు కురిసె నప్పుడు.

నింగిని సురలునేలను కపులు
విజయరాఘవుని స్తోత్రము చేయగ
ప్రతిధ్వనించెను జగతియంతయు
పరమానందము నందిరి సురలు.

రాక్షసరాజును అంతము చేసిన
రాముడు మదిలో సంతోషించెను
నాకవాసుల కష్టము తీరెను
లోక కంటకుడు రావణు డుడిగెను.

దిశల ప్రశాంతత అలముకొన్నది
నింగి భాసిలె నిర్మలమ్ముగా
ఆనందముగా గాలి వీచెను
నిశ్చలకాంతితొ వెలిగెను జగము.

ప్రసన్నమ్ముగా నిలచెను అవని
వానరరాజును విభీషణుండు
యోధులందరు లక్ష్మణసహితుడు
రామచంద్రునికి పూజలు చేసిరి.

దేవ సైన్యమున దేవేంద్రునివలె
రిపు సంహరణము చేసిన రాముడు
ప్రతిన నిలపిన వీరపుంగవుడు
వెలిగె కాంతులతొ విజయలక్ష్మితో.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

## 112 విభీషణుని దుఃఖము–శ్రీరాముని ఊరడింపు

యుద్ధభూమిలో అసువులబాసిన
అన్నను గాంచిన విభీషణుండు
దుఃఖసంద్రము హృదిలో పొంగగ
వెక్కివెక్కి తా నేడ్వసాగెను :

''అన్నా! నీవు వీరోత్తముడవు
పరాక్రమమున గణనీయుడవు
నీతిశాస్త్రము తెలిసినవాడవు
బంగరు లంకను పాలించితివి.

దివ్యశయనమున శయనించదగు
మహారాజువు- కటికనేలపై
వాలిపోతివి- మణిమయశోభిత
మకుటము తొలగి ఒరిగిపోతివి.

బాహుపురులవి అమరిన యట్టి
మహాబాహువులు చాచుకు నిచట
నేలను బడితివి- ఇంతటి ఘోరము
జురుగుననుచు నే ముందే చెప్పితి.

కామ వశుడవై ఉంటివి నాడు
కనుక రుచించక నాదు మాటలను
కాలదన్నితివి కోరితెచ్చితివి
కడకీ దుస్థితి పాలైతివి కద!

ఇంద్రజిత్తుయు ప్రహస్తుడున్ను
మహాకాలుడు కుంభకర్ణుడు
నరాంతకుడును మదమున పలికిరి
ఇంతటి ఘోరము తలంచలేదు.

సీతాపహరణము మహా పాపము
ఇంతటి దుస్థితి కలుగ చేయునని
నేను చెప్పితిని వినకపోతివి
పాప ఫలితము ప్రాప్తించినది.

రాజనీతికి సేతువు నీవు
అగ్నిహోత్రముల జపతపమ్ములు
ఆశ్రమ ధర్మములన్నీ తెలుసును
అంతులేని బలవంతుడ వీవు.

ఆయుధ ధారుల శ్రేష్టుడ వీవు
ఆజిలొ అపజయ మెరుగని వాడవు
నీవు కూలుటది- సూర్య చంద్రులే
కూలినట్లుగా తోచుచున్నది.

అగ్నిహోత్రము చల్లారినటు
అతి నిరాశగా కనపడుచున్నది
దుమ్ముతొ నీవిట నేల నుండగా
జగతి శూన్యమై కనబడుచున్నది.

చిగురుటాకులవి- ధైర్యము కాగా
సహనము అనెడి పుష్పములుండి
తపస్సు అనెడి మూలము గలిగి
శౌర్యము అనెడి వేరులు పారిన

రావణుండు అను భూరి వృక్షమది
రాముడు అనెడి విసురగు గాలికి
రణరంగములో కూలిపోయినది
ప్రచండ మారుత మటుల వీచెను.

పరాక్రమమ్మను దంతములుండి
పిత్రు పితామహ పూజ్యుల అండ
వెన్నెముకగను వెలుగుచుండగా
అమిత కోపమే దేహము కాగా

అనుగ్రహమ్మను తొండము గలిగి
మనసగు రీతిని సంచరించిన
రావణు డనెడి మదపుటేనుగు
రామ సింహపు బారి పడినది.

పరాక్రమంబు ఉత్సాహములు
మండెడి జ్వాలను బోలి యుండగా
నిట్టూర్పులను పొగతో నిండి
దేహబలమను ఉష్ణము గలిగి

ప్రతాపమనెడి తేజముతోను
ప్రజ్వరిల్లిన రావణాగ్నిని
రామచంద్రుడను మేఘము ఇపుడు
దండిగ కురిసి ఆర్పివేసినది.

అసుర వీరులను వాలము గలిగి
రాక్షస యోధులు మూపురమ్ముగా
బలమగు కొమ్ముల రావణు వృషభము
రామ పులికి తా మేతయైనది''

విభీషణుండటు విలపించగను
చెంతకు చేరెను రామచంద్రుడు
అనునయించెను కరములనిమిరి
మెల్లగ చెప్పెను చల్లని మాటలు :

''ఓ విభీషణా! లంకేశ్వరుడు
పిరికి వానివలె చావలేదు విను
లోకభయంకరమైన పోరులో
వీర కిశోరము ఒరిగెను పోరి.

ఉత్సాహముతో నిర్భయంబుగా
రణమున పోరి మరణించెను విను
వీర స్వర్గము అలంకరించును
శూరుని కొరకై విలపించరుకద!

ముల్లోకములు-సురనాయకుడు
రావణుగాంచి భయపడిపోయిరి
అంతటి వీరుని కాలము చెల్లెను
కావున దుఃఖిలు సమయముకాదిది.

యుద్ధమునందు జయాపజయములు
తెలియగరావు-కానీ నిజమిది
ఒరిగిన వీరుడు స్వర్గముచేరును
పెద్దలు నమ్మిరి నీకు తెలియదా?

పుట్టినచో మరి గిట్టుట తథ్యము
పుడమిని బ్రతుకు శాశ్వతమెవరికి!
అజిని ఒరిగిన శూరునికొరకై
వంతనొందుట తగదు నీకిక.

దుఃఖము వలదు ఓ విభీషణా!
ముందుకార్యము ఆలోచించుము''
అనుచు రాముడు పలుకుట వినిన
విభీషణుడు తా పలెకె దుఃఖమున :

''ఓరఘురామా! ఇంద్రుడుకూడిన
సర్వదేవతలు పోరుకువచ్చిన
పరాజయంబును పొందకపోరెను
విజయలక్ష్మిని అందినవీరుడు.

చెలియలికట్టను తాకిన సంద్రము
వెనుకకు పరుగిడునట్లుగ నేడు
నిన్నుతాకి ఈ వీర సింహము
పరాజితుండై నేలకూలెను.

దానమునందు మిన్నయె అన్న
గురు దేవతల పూజలుచేసెను
సర్వభోగములు అనుభవించెను
ఆశ్రితులందర చల్లగ చూచెను.

హితులకు సరిపడు ధనమునిచ్చెను
రిపులందరిని రూపుమాపెను
ఆహితాగ్ని-నా అన్నరావణుడు
మహాతపస్సును చేసెను రామా!

వేదాధ్యయనము చేసెను అన్న
పుణ్యకర్మలను చేసెను శ్రద్ధగ
అన్నకు ఇపుడే ఉత్తరక్రియులను
నీ ఆనతితో చేయగనెంచితి.''

అనుచు జాలిగ విభీషణుండు
పలుకుచుండగ అచ్చటివీరుల
మనసు కరిగినది కనులు పొంగినవి
అంతట రాముడు పలికెను అపుడు :

''ఓ విభీషణా! తనువు వల్లను
కలిగిన వైరము నేటితొ పోయెను
ఉత్తమగతిని కలిగించెడి వగు
ఉత్తర క్రియలను చేయుము నీవు.

విగతజీవి ఈ రావణాసురుడు
వైరము గతించె-ఇంతటితోను
నీకు స్నేహితుడుఅటులే నాకును
మిత్రుడు-కావున కార్యము తీర్చుము.''

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 1 1 3 యుద్ధభూమిలో రావణు భార్యలు విలపించుట

లంక ఏలికను రామచంద్రుడు
త్రుంచివేసెనను వార్త పిడుగులా
వచ్చిపడినది- రావణుభార్యలు
గుండెలు పగులగ రోదించిరట.

దుఃఖభారమున నేలను బడిరి
వశముతప్పి అట పొర్లుచు ఏడ్చిరి
కొప్పుల ముడివిడి కురులు జారినవి
విలవిలనేడ్చిరి వీరుని తలచుచు.

వత్సలుపోయిన గోమాతలన
అంతఃపుర స్త్రీలందరు ఏడ్చిరి
వలదని ఎందరొ వారించినను
వినకసాగిరి ఏడ్చుచు నడచిరి.

ఉత్తరద్వారము దాటివచ్చిరి
భీకరమైన యుద్ధభూమిలో
పెనిమిటి కొరకై వెదకసాగిరి
కూలిన యోధుల వెదకుచు సాగిరి.

రాజకుమారా! అనుచు రాముని
నాథా! నాథా! అనుచు రావణుని
సంబోధించుచు కేకలు పెట్టుచు
పగిలిన గుండెతొ వెదకజొచ్చిరి

కంటినీటితో చూపు ఆనదు
నెత్తుటి మాంసపు బురద నిండెను
మదకరి కొరకై విలవిలలాడెడి
అడుదంతులై ఏడ్చిరి అచట

కాటుగ రాశిగ నేలను బడిన
నల్లని దేహము గాంచిరి వారు
లంక ఏలికని తెలిసిరి వారు
జీవితేశ్వరుని గాంచిరి వారు.

నరికివేసిన సుమలత లన్నటు
పతికాయముపై వ్రాలిరి వారు
కళేబరమ్మును కౌగలించుకొని
ఏడ్చెను ఒక స్త్రీ గుండియ పగులగ

పదములనందుకు ఏడ్చెను ఒక స్త్రీ
కంఠము నిమురుచు ఏడ్చెను కాంత
భుజముల తాకి నేలను పొర్లుచు
గుండె పగులగ ఏడ్చెను ఒకతె.

పెనిమిటి ముఖమును గాంచిన ఒక స్త్రీ
వశముతప్పి మూర్ఛిల్లిపడినది
భర్త శిరస్సును ఒడిలో నుంచుకు
విలవిలనేడ్చెను ఒక సుకుమారి.

భర్త ముఖమును కంటి నీటితో
తడిపివేసినది ఒక భార్యామణి
అసువులుబాసి నేలను బడిన
పతిని గాంచి వారందరు ఏడ్చిరి.

"ఓ ప్రాణేశ్వర! సురపతి, యములను
నిరతము భయపడజేసెడివాడవు
ధనపతి నెదిరి జయించినావు
దివ్యపుష్పకము తెచ్చుకొంటివి.

సురగంధర్వులు వణకెడివారు
అంతటి నీవు రణరంగమున
మనుజునిచేబడి మరణించితివి
నీ వరములవి ఏమైపోయెను?

సురాసురులును పన్నగులున్ను
వధించలేని నిన్నొక మనుజుడు
అవలీలగను అంతముచేసెను
ఇంతటి దుస్థితి నీకెటు వచ్చెను?

నీదు మేలును కోరెడి పలుకులు
నీవు ఎన్నడును వినలేదు కదా!
మరణము కోరి సీతాదేవిని
అపహరించి ఇట నేల కొరిగితివి.

నీవేగాక లంకలో వీరులు
ఎందరొ కూలిరి విధవలమైతిమి
అభిమానముతో విభీషణాఖ్యుడు
చెప్పిన హితము వినకపోతివి.

అజ్ఞానముతో ఆ ధర్మాత్ముని
పరుషములాడి అవమానించి
కాలపాశమును తగుల్చుకొంటివి
కూలిపోతివి రణరంగమున.

స్వయముగ నీవే సీతాదేవిని
రామునికిచ్చిన మేలు కలిగెడిది
సమూలమ్ముగా నాశనమగుట
జరుగకపోయి సుఖపడి యుందువు.

సీత నిచ్చినచొ రాముడు హితుడగు
దేవేంద్రాదుల కోరిక తీరదు
మా మాంగల్యము నిలబడియుండి
మేము సుఖపడియుందుము కాదా.

నాథా! నీవు బలవంతముగ
సీతను తెచ్చి చెర నుంచితివి
ఆ కారణమున నీవు సేనతో
అకాలమృత్యువు వాతబడితివి.

ఓ మహరాజా! దీనికంతటికి
స్వేచ్ఛగ నీవు నడచుటె కాదు
దానికి మించిన దైవ వశమది
బలమయినది నిను అంతము చేసెను.

నిన్ను దైవమే చంపెను నాథా!
దైవయోగమే నాశము చేసెను
దైవగతిని మరి అర్థబలముతో
అడ్డగించుటది జరుగదు ఇలలో

పరాక్రమముతో రాజాజ్ఞలతో
విధి వశమును మరి మార్చగలేము
దైవము తలచినదంతయు జరుగును
దైవాధీనము జగత్సర్వము.''

ఆ విధముగను రావణు భార్యలు
కనుల నీటితో రోదించి రట
క్రౌంచపక్షులన ఏడ్చిరి వారు
గుండెలు పగులగ ఏడ్చిరి వారు.
॥శ్రీ రఘురాముని॥

❈❈❈

# 114 మండోదరి విలాపము–విభీషణుడు రావణాసురునికి సంస్కారము చేయుట

పతినిబాసిన కాంతలందరు
లంకాపతికై ఏడ్చుచుండగా
రావణాసురుని పుట్టపురాణి
నడువలేక తా వచ్చిచేరినది.

అతిసమర్థుడు అమితబలాఢ్యుడు
రాముని కోలను నేలకొరుగుట
కన్నులగాంచి కంపించినది
వెక్కివెక్కి రోదించె దీనముగ :

''నాథా! నీవు అజేయుడవుగద
నిన్నుగాంచి ఆ ఇంద్రుడు పరుగిడు
గగనచారులు ఋషులు వణకెదరు
ధనపతి అంతటివాని సోదరుడ!

యుద్ధభూమిలో నరునిచేతబడి
నరికిన మ్రానై నేలబడితివా?
సురగంధర్వుల నడలగొట్టితివి
మడసితివెటుల నరునికి లొంగి!

అడవులతిరిగే మానవమాత్రుడు
ఆజిలో నిన్ను నేలకూల్చెనా!
సేనలు, బలము కలిగిన నిన్ను
రాముడు కూల్చుట, నమ్ముట ఎట్లు?

సాటిలేని బలవంతుడవీవు
మేటివీరునిగ ముల్లోకములలో
విహరించిన ఓ అరిభయంకరా!
నేటికిటుల నినుగాంచి బ్రతుకుటెటు?

జనస్థానమున ఒక్కడె నిలబడి
ఉక్కడగించెను ఖరాది వీరుల-
రాముడు మనుజుడు కాదని తోచెను
నాడేచెప్పితి వినకపోతివి

అడుగుపెట్టగ సురలకు లొంగని
లంకలొ అడుగిడె ఆ హనుమంతుడు
ఆ పరాక్రముడు హడలగొట్టెను
అపుడైనామరి తెలియకపోతివి.

కడలికి సేతువు కట్టగ వింటిని
రాముడు మనుజుడుకాడని నమ్మితి
యముడే మాయతొ సీతను సృజించి
స్వయముగ రాముని రూపుతొ వచ్చెను.

మానవమాత్రుడు రాముడుకాడు
లోకరక్షకుడు జగదభిరాముడు
ఆత్మలన్నిటికి ఆత్మయె రాముడు
అక్షయుడాతడు అయోధ్యరాముడు.

శాశ్వతుడాతడు స్థిరుడారాముడు
బ్రహ్మేంద్రాదుల మించినవాడు
జగద్రక్షకుడు పోషకుడతడు
శంఖచక్రముల వెలుగు త్రిధాముడు.

శ్రీవత్సముతో శోభిలువాడు
శ్రీలక్ష్మిని ఎడబాయనివాడు
శ్రీరాముడు శ్రీవిష్ణువు అగును
శ్రీపతికెదురై పోర నశక్యము.

లోకహితమ్ముకై హరియే నరుడై
కపి రూపులగు సురలను చేర్చుకు
నిన్నును-లంకలొ అసురులందరిని
వధించినాడు ఓ మహరాజా!

సతిఅరుంధతి రోహిణి మాతల
మించిన పాతివ్రత్యము కలిగిన
పూజ్యురాలగు సీతాదేవిని
అవమానించి చెరబట్టితివి.

దేహేంద్రియముల నిగ్రహించుకొని
త్రిభువనమ్ముల జయించినావు
వైరముపూనిన ఆ ఇంద్రియములు
పగతో నిన్ను నేడు జయించెను.

కోరి చేరిన కాంతలందరు
సుందరాంగులు కారనుకొంటివి
క్షమలో భూమిని మించినదానిని
సంపదనిలయము లక్ష్మీదేవిని

ఇంద్రియాలకు లోబడితివి నువు
కామవశుడవై కాంతను తెస్తివి
త్రిభువనమ్ముల విజేత వీవు
ఆడుదానికై కూలితి విటుల.

మంగళకారిణి సుందరమూర్తిని
వనములఒంటరి అతివను నీవు
మాయతొ హరించి తెచ్చినాడవు
నీ యభీష్టమది తీరకపోయెను

అబల చంపెనొక అతిబలవంతుని
అంతేకాని సర్వేశ్వరుడు
చంపలేదు నిను ఓ మహరాజా!
రామునితో పగ వలదని చెప్పితి

పతివ్రతయగు సీతాదేవిని
హరించనెంచి తగులబడితివి
నాడేనిజముగ భస్మము కావలె
నిన్నుగాచె నీతపస్సు నాడు.

ఎంతచెప్పినా వినకపోతివి
ప్రతిఫలమిటుల నేలకూలుట
సీత మూలమున నీవేకాక
బంధుమిత్రులు సమసిరి కాదా!

అగ్ని దేవుడు అదిగాగల
దేవతలందరు విస్మయపడిరి
సమయము వచ్చిన పాపఫలమది
అనుభవించక తప్పదు రాజా!

భోగభాగ్యములు అడుగంటినవి
అంతటి దుష్కృత మొనరించితివి
మతిచెడి నీవటు చరించినావు
గతి చెడిపోయెను బంగరులంకకు.

శుభకర్మలతో శుభమగు ఫలము
పాపకర్మలతొ పాపఫలమది
అనుభవింపక తప్పదు రాజా!
విధిని దాటగా ఎవ్వరితరము?

రాముని చేరెను విభీషణాఖ్యుడు
మంచి కార్యమది సుఖములందెను
భవితలొ సుఖములు దొరకును వానికి
పాపఫలము నువు నేలకొరుగుటిది

సౌందర్యములో సీతను మించిన
అందకత్తెలు ఎందరొ కలరు
వంశగౌరవము రూపసంపదల
జనకుని కూతురు నన్ను మించదు.

ఏదో వంకతొ మృత్యువు వచ్చును
సీత వంకతో నిన్ను చేరినది
సీతారాములు సుఖములందెదరు
శోకసంద్రమున మునిగితి నేను.

మేరు మందర కైలాసాచల
విహారమ్మది మరువగలేను
చైత్రరథమున నీతో కలసి
విహరించితిని వీరాగ్రేసర.

విలువగు వలువలు విరిదండలతో
దివ్యవిమానము నెక్కి తిరిగితి
రాజులయొక్క భోగభాగ్యములు
నిలకడ కావని తెలిసితి నేడు.

ఓ మహరాజా! నీ ముఖబింబము
శశిబింబమువలె ప్రసన్నమైనది
పద్మము పోలును- రవితో తూగును
కనుబొమలు నాసికకోమలమైనవి.

మణిఖచితమగు మకుటము వెలుగుచు
ధగధగలాడే కుండలాలతో
వస్త్రభూషలు విరిదండలతో
లంకావిభవము నీతో వెలుగగ

మధుర భాషణలు చిరునగవులతో
మంగళకరమగు నీదు వదనము
రామబాణమున నెత్తుట తడిసి
అమంగళముగా మారినదయ్యా!

దానవరాజుకు తనయను నేనని
రాక్షసరాజుకు భార్యను నేనని
ఇంద్రవిజేతకుతల్లిని నేనని
విర్రవీగితిని విధవనైతిని!

దేవదానవుల గెలిచిన వీరుడ!
మనుజునిచేబడి ఒరిగితివిటుల
నల్లనికాయము శోభకు నిలయము
తేజోవంతము అతిలావణ్యము.

బాహుపురులతో మణిహారములతో
ధగధగమెరిసే దివ్యహారముల
మేఘము నీవైమెరపులు అవియై
మిరుమిట్లుగొలిపెను రణరంగమున.

తనువున శరములు నిండిపోయినవి
కౌగలించుకొన వశపడకున్నది
నరములుతెగినవి నెత్తురుపారెను
ఇది నిజమాయని భ్రాంతి కలిగెను.

స్వప్నమేమొ యని మదికి తోచెను
మృత్యుదేవతకు మృత్యువగుదువు
వజ్రఘాతమున గిరివలె పడితివి
రాముడు నిన్నెటు చంపగలిగెను!

ఓ మహారాజా! ముల్లోకముల
ఎన్నిక భోగము లనుభవించితివి!
ముల్లోకములను వణకించితివి
లోకపాలకుల జయించితీవు.

సాంబశివుని ఆ కైలాసముతో
కదలించితివి అమోఘబలుడవు
సర్వలోకములు హడలగొట్టితివి
భూతకోటిని బెదరగొట్టితివి.

బంధుమిత్రులను చల్లగనేలి
రక్షించితివి రిపులకూల్చితివి
యక్షులెందరినొ హతము చేసితివి
నివాతకవచుల నెయ్యముచేస్తివి.

యజ్ఞయాగముల చెడగొట్టితివి
ధర్మవ్యవస్థను త్రుంచితివీవు
రణమున మాయలు నేర్చినవాడవు
అబలల హరణము వదలకపోతివి.

రిపులభార్యలను దుఃఖపెట్టితివి
స్వజనుల రక్షణ చేయుచునీవు
లంకను చల్లగ రక్షించితివి
భీకరకృత్యము లెన్నోచేస్తివి.

పతితోసుఖములు బడసితినేను
పతితో వెడలక మిగిలియుంటిని
గుండియగాదిది బండరాయియగు
పగులకనిలచెను పాపకర్మను.

దివ్యశయనమున నిదురించెడి నువు
ధూళినిండిన నేలనుంటివి
ఇంద్రజిత్తు రణమందుకూలెనను
మాటవింటిని సగము చచ్చితి.

నీవే కూలితివనుచు వింటిని
నేడు పూర్తిగా మరణించితిని
నీవుదక్కినచొ దక్కునుసర్వము
తక్కినబంధుల సాయము ఏల!

ఉలుకవు పలుకవు ఓ మహారాజా!
నన్నువదలి నువు పోవలదయ్యా!
నీతోవత్తును నా ప్రాణేశ్వర!
ననుకాదనకుము కనికరించుము

అంతఃపురమున నుండెడికాంతను
అందరి ఎదుటకు వచ్చితినిపుడు
మందలించవు- లంకారాణిని
కాలినడకతో వచ్చితిరాజా!

నాతోబాటు మిగిలిన భార్యలు
సిగ్గువదలి ఇటవచ్చిరి చూడుము
వస్త్రాలంకారమ్ములు వదలిరి
నడచివచ్చిరి కోపమురాదా?

అనాథలై ఇట ఏడ్చుచుంటిమి
హృదయముకరగద ఓ హృదయేశా!
ఊరడించవు ఆదరించవు
మాదోసములను మన్నించుమయా!

నీ వొక్కనిచే ఇంతటి విపత్తు
వచ్చిపడినది లంకాధీశా!
రాక్షసవంశము అంతయు నేడు
దిక్కుమాలి ఇట విలపించుట విను.

పతివ్రతలను కులాంగనలను
ఎంతమందినో విధవలజేసిన
పాపఫలమిది వారిశాపమిది
వారిరోదనలు వృథా పోవుగద!

బలపరాక్రమము కలిగినవాడవు
సమరాంగణమున సమసిపోతివి.
నీ కొరకై విలపించుట తగదు
కానీ స్త్రీని- వికలమనస్కను.

ముల్లోకములను జయించినావు
శూరుడననుచు విర్రవీగితివి
కానీ నీవు పరమనీచమగు
అబలహరణమును చేసితివయ్యా!

జీవితేశ్వరా! నీవు చేసిన
పాపపుణ్యములు వెంట తీసుకొని
నీ దారినినువుసాగుచుంటివి
నీ ఎడబాటును సహించలేను.

మాయమృగముతో వంచనచేసి
రామచంద్రుని దూరము పంపి
సీతను తెచ్చుట పిరికితనమది
అబలహరణము ఎటుల అబ్బినది?

హితముకోరిన పూజ్యుడు తమ్ముడు
విభీషణుని నువు కాదంటివికద
మారీచుడును కుంభకర్ణుడు
నా జనకుడును చెప్పిరి- వింటివ?

చేటు కాలమున కలిగిన బుద్ధిని
వదలగ తమ్ముడు మరి మరి చెప్పెను
భూత భవితయు వర్తమానములు
తెలిసిన తమ్ముడు వలదని చెప్పెను.

బలగర్వముతో విర్రవీగితివి
జీవితమే ఇల స్థిరమనుకొంటివి
కలకాలము మనముందు మనుకొను
నిలకడలేని యోచన ఫలమిది

పూజ్యుడైన ఆ విభీషణాఖ్యుని
హితము వినక నువు సమూలమ్ముగ
కూలిపోతివి- నీతోబాటుగ
సర్వనాశనము జరిగిపోయినది.

నెత్తుట తడిసిన కటికనేలను
నిద్రించునటు పడియుంటివిట
దుఃఖజలధిలో మునిగిన నాతో
మాట్లాడవ నువు ఓ మహరాజా!

అపరాజితుడు అమితవిక్రముడు
మాల్యవంతుని మనుమరాలను
నీ మదినిండిన! హృదయరాణిని
పలుకరించవా కనులు విప్పవా!

లే మాహరాజా! సూర్యుడు నేడు
అమిత ధైర్యమున లంకాపురమున
కిరణమ్ములను విసరుచుండెను
భయము తీరినటు కనబడుచుండెను.

రవికాంతులతో వెలిగే పరిఘ
రామబాణమున ముక్కలైనది
వజ్రాయుధము పూజలందినటు
పరిఘను నిరతము పూజించితివే!

యుద్ధభూమిలో ధరణీకాంతను
ప్రియురాలైనటు కౌగలించుకొని
పడియుండుటది నే గనలేను
నాథా! నాతో పలుకుము దయతో.

నీవు గతించుట నా గతి చెదరుట
నాదు గుండియ ముక్కలైనది!''
అనుచు బాధతో రోదించినది
చెమ్మగిల్లని కనులటలేవు.

ఏడ్చి ఏడ్చి తా వశము తప్పినది
పతికాయముపై పడి మూర్ఛిల్లెను
సంధ్యారాగపు మేఘముపైన
మెరపు తీగలా తోచెను అతివ.

దుఃఖ జలధిలో మునిగిన అతివలు
సవతులు ఆమెను లేవదీసిరి
ఊరడించిరి అనునయించిరి
పుట్టిన గిట్టుట తప్పదు అనిరి.

''ఓ మహరాణీ! ప్రతి జీవియును
బాల్య, యౌవ్వన కౌమారమ్ములు
వార్ధక్యమ్ముల వాతనుబడును
చివరకు మృత్యువు ఒడి చేరెదరు.

రాజభోగములు వైభవమ్ములు
నిలకడకావు- స్థిరమవికావు
నీకు తెలియదా దుఃఖము వదలుము''
అనుచు పలుకగా అతివ ఏడ్చినది.

రావణు భార్యలు ఏడ్చుచుండిరి
అంతట రాముడు విభీషణుని గని
''మిత్రుడ! నీవులంకాపతికి
దహన క్రియలను చేయగవలెను.

స్త్రీలందరినీ లంకకు పంపుము''
అనుచు రాముడు ధర్మ విహితముగ
నుడువగ నపుడు విభీషణాఖ్యుడు
కాదనలేక పలికెను అపుడు.

''రామా! ఇతడు సోదరుడైనను
పరమక్రూరుడు ధర్మదూరుడు
వ్రతనియమాదులు ఉల్లంఘించెను
పరదారలను హరించినాడు.

భ్రాతృరూపమగు శత్రువువీడు
దహనక్రియలను చేయను నేను
లోకులు ముందుగ నిందించినను
నిలకడ మీద తెలిసెద రంతయు.''

విభీషణాఖ్యుని పలుకులు వినిన
ధర్మమూర్తి శ్రీరాముడు పలికెను :
''అసుర నాయకా! నీవు నాకిపుడు
ముదమును గూర్చెడి మిత్రుడవయ్యా!

నీ సాయముతో విజయము నందితి
నీకు మేలగు మాట చెప్పవలె
అధర్మపరుడై అన్న చరించెను
అయినను అతడొక వీరపుంగవుడు.

అమిత బలాఢ్యుడు అతి పరాక్రముడు
సురనాయకునికి లొంగనివాడు
లోకమ్ములనే కలవరపరచెను
నాకము వణకెను వాని భయమున.

వైరము మాత్రము మరణమువరకే
ఆపై వైరముఉండకూడదు
స్నేహ విషయమున నీతో సరిపడు
స్నేహితుడిపుడు రావణాసురుడు.

జ్యేష్ఠుడీతడు తమ్ముడవీవు
ఉత్తరక్రియలను నీవు చేయవలె
సర్వధర్మములు తెలిసినవాడవు
కర్మచేయుము కీర్తికలుగును.''

ఆ విధముగను రాముడు చెప్పగ
లంకాపతికి యోగ్యము అయిన
విధిగా క్రియను నేరవేర్చుటకై
రావణు తమ్ముడు అనతి నిచ్చెను.

సుగంధద్రవ్యములు చందనాదులతో
వట్టివేళ్ళతో వేదోక్తముగా
చితిని పేర్చి ఆ చితిపై నపుడు
తెల్లజింక చర్మమ్మును కప్పిరి.

వేదవిహితముగ రావణప్రభువుకు
అంత్యేష్టిని అట విధిగాచేసి
యథాక్రమముగా ఆ మహరాజుకు
పితృమేధ సంస్కారము చేసిరి.

పేర్చిన చితికి ఆగ్నేయములో
అగ్నివేదిని అమర్చినారు
ఆ వేదిని త్రేతాగ్నుల నిలపి
దధి అజ్యముల అగ్నిని వ్రేల్చిరి.

రావణాసురుని పాదమువద్ద
సోమలతలను తెచ్చు శకటమును
యజ్ఞధాన్యము దంచు రోటిని
రోకలు లుంచిరి తొడల నడుమన.

మిగిలిన యట్టి ప్రదేశములలో
దారుపాత్రలు స్థాలిని మొదలగు
అరణి ఉత్తర మొదలగు సమిధలు
శాస్త్ర ప్రకారము నెలకొనజేసిరి.

చితి సమీపమున పవిత్రమైన
యజ్ఞపశువును వ్రేల్చిరి అగ్నిని
నేతిలొ తడిపిన దర్భల నపుడు
అన్నివైపుల పరచిరి క్రమమున.

విభీషణాఖ్యుడు స్నానముచేసి
తడిసిన వలువలు ధరించి అపుడు
దర్భలు కలసిన తిలోదకములు
ధరణిపైనను విడచెను శ్రద్ధగ.

విభీషణునికి సహాయపడుచూ
ఋత్విజులందరు సుమగంధములు
వివిధ వస్త్రముల కళేబరమ్మును
అలంకరించిరి వందనమించిరి

ప్రేతావాహనముచేసి తమ్ముడు
ఉదకదానముచేసి శ్రద్ధగ
శిరసును వంచి నమస్కరించెను
రావణు భార్యల ఊరడించెను.

ఋత్విజులందరు హితులందరును
దుఃఖతప్తులై కంటిధారలతొ
లాజలు చల్లిరి- రావణు తమ్ముడు
మంత్రయుక్తముగ చితి నంటించెను.

అనేక విధముల అన్నభార్యలను
అనునయించి అట లంకకు పంపి
విభీషణాఖ్యుడు వినయము నిండి
రామపాదముల చెంత నిలచెను.

వృత్రాసుర సంహారము చేసిన
దేవేంద్రునివలె శత్రుహరణుడు
సుగ్రీవ లక్ష్మణ ససైన్యములతో
హనుమతొ వెలిగెను విజయరాఘవుడు.
॥శ్రీ రఘురాముని॥

❊❊❊

## 115 విభీషణ పట్టాభిషేకము

సురగంధర్వులు భీకర రణమున
రావణాసురుడు కూలుట గాంచి
రాముని ఘనతను కీర్తన చేసిరి
అమితవిక్రముని స్తుతించినారు.

అంతటి యశోవిశాలుర గనిన
అమితవిక్రముల కొడుకుల గనిన
కౌసల్య, సుమిత్రలు చరితార్థులని
మంగళకరముగ పలికి వెడలిరి.

కపియోధులను ప్రశంసించిరి
వానరనాథుని వ్యూహరచనము
లక్ష్మణమూర్తి భుజబలమ్ములను
అనేక విధముల పొగడిరి పొంగిరి.

ఆనందముతో నిలచిన మాతలి
విజయరామునిచె ప్రశంసలంది
విజయసారథిగ సంబరపడుచు
రథముతొ చేరెను దేవలోకము.

చెంతనిలచిన వానరరాజును
అండనిలచిన సూర్యకుమారుని
ఆనందముతో రామచంద్రుడు
కౌగలించుకొని సంబరపడెను.

రామలక్ష్మణులు వీరులందరూ
శిబిరమ్మునకు చేరినయంత
విభీషణాఖ్యుని రాజును చేయగ
లక్ష్మణమూర్తితొ చెప్పెను రాముడు.

''సోదర! నాకు హితుడు భక్తుడు
మనకు సాయము చేసినవాడు
లంకలొ ఇతనిని అభిషేకించుము
అది నా కోరిక అనుచు పలికెను''

రామాజ్ఞను విని రామానుజుడు
పట్టణమేగి వలయువస్తువులు
సమకూర్చగను ఆనతినిడెను
మంగళవస్తువులన్నియు అమరెను.

కనక కలశముల సప్తసంద్రముల
మంగళతోయము లచటికితెచ్చిరి
బంగరుసింహాసనము నందున
విభీషణాఖ్యుని కూర్చొనజేసిరి

విభీషణాఖ్యుని, మిత్రులు హితుల
రాక్షసముఖ్యుల నడుమ రాజును
ఆశీస్సులవి, కురియుచుండగా
అభిషేకించెను రామానుజుడు.

ముదమునందిన లంకావాసులు
మంగళకరముగ పూలు మొదలగు
సుగంధపరిమళ ద్రవ్యమ్ములను
కాన్కగనిడిరి లంక ఏలికకు.

రాముని శరణు కోరినందుకు
రాముని పదములు కొలిచినందుకు
రాముని మదిలో నిలపినందుకు
రాజ్యపదవి లభియించె నతనికి.

రాజ్యప్రజలకు శుభములుపలికి
పట్టముగట్టుకు విభీషణాఖ్యుడు
రామపాదముల చెంతచేరెను
తన కాన్కలను వారల కొసగెను

కోరిక తీరి సంతస మంది
పౌరులొసగిన మంగళదినుసులు
రాముని కొసగెను విభీషణాఖ్యుడు
భక్తుని కోర్కై గ్రహించె రాముడు

అంతట రాముడు చెంతనె నిలచిన
భక్తిప్రపత్తుల నిలచినబంటును
వాయునందనుని చూచిపలికెను
''లంకానాధుని గను హనుమంతా!

విభీషణాఖ్యుని అనుమతినంది
లంకకుపోయి సీతనుగాంచి
విజయవార్తను ఆమెకుతెలిపి
ఆనందమును కలుగజేయుము.

సుగ్రీవరాజును లక్ష్మణమూర్తియు
కపులు నేనును కుశలము అనుచు
రావణాసురుని త్రుంచినాడనని
తెలియబరచుము జనకనందినికి.

ఓ హనుమంతా! మైథిలిమనసుకు
ముదముకలుగునటు పలికి అంతట
ఆమెపలుకులు ఆలకించుము
తెలుపుము నాకు అంజనితనయా!''

॥శ్రీ రఘురాముని

❈❈❈

# 116 శ్రీరామ విజయము హనుమంతుడు సీతాదేవికి తెలుపుట

రాముని ఆనతి శిరమునదాల్చి
నమ్మినబంటు ఆంజనేయుడు
లంకాపట్నములోనికి సాగెను
రక్కసులందరు గౌరవించిరి

రాక్షసాంగనల నడుమ జానకి
గ్రహబాధనుపడు రోహిణివలెను
శుష్కశరీరము దుమ్ముధూళితో
వనమున నున్నది గాంచెను మారుతి.

భక్తి ప్రపత్తుల వందనమిడెను
పేరుచెప్పుకొని నిలచె నమ్రతగ
యోచనచేసెను సీతాదేవి
స్ఫురించెనంతట- గుర్తుపట్టెను.

అంగుళీయకము అందచేసిన-
ప్రభువు క్షేమమును తెలియపరచిన
రామభక్తుడీ హనుమంతుడని
తెలిసి వదనము వికసించినది.

అదిగమనించి వాయునందనుడు-
''మాతా! రాముడు వైరినికూల్చెను
రావణుత్రుంచి ప్రతిన నిలపెను
తన కుశలమును చెప్పిపంపెను.

అనుజుడు, సూర్యతనూజుడు, మరియు
విభీషణాఖ్యుడు వానరసేనలు
అందరితో శ్రీ రామచంద్రుడు
కుశలము తల్లీ!- ధరణీతనయా!

వానరసేనలు ఘనముగ పోరిరి
విభీణాఖ్యుడు సాయముచేసెను
లక్ష్మణమూర్తి విజృంభించెను
విజయరాఘవుడు రావణుత్రుంచెను.

ఇనకుల తిలకుడు జయించినాడు
నీ క్షేమము విన నన్నుపంపెను
నీతో చెప్పెను ఈ విధముగను
నాభాగ్యమది నేనుచెప్పుట :

''దేవీ! ఇదిగో శుభవార్త విను
పాతివ్రత్య ధర్మమ్ము నెరుగుదువు
సౌభాగ్యముచే బ్రతికియుంటివి
నే జయించితిని యుద్ధము నందు.

శత్రువు కూలెను దిగులు వదలుము
నీ చెర తీర్చగ ప్రతిన బూనితి
నిద్రహారములు మరచిపోతిని
మహాకడలిలో సేతువు నిలచెను.

రావణాసురుని సంహరింతునని
చేసిన ప్రతిన తీరెను నాకు
లంకారాజ్యము విభీషణునిది
స్వగృహ మన్నటు తలంచవచ్చును.

దుఃఖము వదలుము నిను దర్శించగ
విభీషణాఖ్యుడు అరుగుదెంచును,
అనుచు రాముడు చెప్పెను తల్లీ!''
అని హనుమంతుడు చల్లగ తెలిపెను.

ఆనందించెను అవనీ నందిని
సంతోషముతో పొంగిపోయెను
మాటలురాని ఆనందముతో
విరిసిన కన్నుల నిలచి చూచెను.

''మారు పలుకవు మంగళమూర్తి!''
అనుచు మారుతి పలికిన యంత
రామచంద్రుని జీవితేశ్వరి
పవననందనుని చూచి పలికెను :

''నాయన హనుమా! రామవిజయమను
నను బ్రతికించెడి దివ్యవార్తను
నీవు నుడివితివి, మా అసువులను
నిలపిన ఘనుడవు నీవేనయ్యా'

ఆనందముతో మాటలు రాక
ఎటు మాటాడగ తెలియగ లేక
మదిలో ముదము తెలుపుట రాక
మూగబోయినటు నిలచితినయ్యా!

ఇంతటి శుభమగు వార్త నుడివితివి
ప్రతిగా బహుమతి ఇవ్వదలచిన
ముల్లోకములలొ తగిన వస్తువు
కనరాకున్నది కపికులాగ్రణీ!

వెండి బంగరు రత్నరాసులు
మూడులోకముల ఆధిపత్యము
సరిపడవయ్యా! జగత్తులోన
సరియగు వస్తువు లేనేలేదు.''

జనకనందిని పలుకులు వినిన
మారుతి కరములు ముడిచి పలికెను :
''మాతా! నీ మది కోరిక తీరెను
భర్త విజయమును కోరుకొంటివి.

నాపై నున్న వాత్సల్యముతో
పలికితివమ్మా! నాకానందము
నీ మాటలతో ధన్యుడనైతిని
అంతకు మించిన బహుమతి ఏల?

రత్నరాసులు సురరాజ్యమునకు
మిన్న అగును నీవన్న మాటది
రిపు సంహారము చేసిన ప్రభువు
కుశలము తల్లీ! గంటిని నేను.

భోగభాగ్యముల మించిన సంపద
మీ యిరువురును సుఖముగ నుండుట
అది అమరినది జన్మ తరించెను
అంతకు మించిన సంపద లేదు.

విజయకాంతితో వెలుగు సూర్యుడగు
రామభద్రుని దర్శన భాగ్యము
లభించెనమ్మా! అంతకు మించిన
భాగ్యము లేదు జన్మ తరించెను.

భక్తి వినయముల మారుతి పలుకగ
వినిన సీతఅట పలికెను తిరిగి :
''ఓ హనుమంతా! వాక్య కుశలుడవు
విజయవార్తను తెలిపితి వీవు.

కర్ణపేయముగ విజయవార్తను
వినిపించితివి బుద్ధిమంతుడవు
తండ్రికి తగిన తనయుడ వీవు
తండ్రిని మించిన కీర్తిమంతుడవు.

రణోత్సాహము బలపరాక్రమము
వినయశీలత వివేకజ్ఞానము
క్షమాగుణములు ధర్మవర్తనము
శుభకర గుణముల నెలవు పావనీ!

మంగళకరమగు గుణము లన్నియు
మూర్తిగ నిలచెను నీలో హనుమా!
ముఖ ప్రీతికై పొగుడుట కాదు
నిజముగ నున్నవి అన్నది నిజము.

తల్లి మాటలకు ముదమునందెను
వినయము నిండి అమ్మతొ పలికెను :
''తల్లీ! నీవు అనుమతి నిమ్మ
రాక్షసాంగనల హతమార్చెదను.

భర్తకు ఎడమై దుఃఖమునున్న
నిన్నారక్కసి వనితలు నాడు
పరుషములాడి బెదరించుటది
మరువకుంటిని మర్దించెదను.

వికృతరూపుల చితుకబాదెదను
కరచరణమ్ముల విరచివేసెద
గోళ్ళతో చీల్చి కొరికివేతును
నా కోరిక నువు మన్నించవలె.''

పావని కోరిక వినిన జనకజ
పావనమూర్తి పలికెను అపుడు :
''హనుమా! వారు రాజసేవకులు
రాజు ఆనతిని పలికిరి అటుల.

వారిపైన కోపించుట తగదు
నా దౌర్భాగ్యము హేతువైనది
పాపకర్మమున జరిగినదంతయు
కర్మఫలము మరి అనుభవించవలె

రక్కసివనితల దోషములేదు
వారందరినీ మన్నించితిని
రావణు నానతి పరిపాలించిరి
కావున అటుల పలికిరి నాడు.

ఓ హనుమంతా! రాక్షస స్త్రీలు
వారే స్వయముగ బాధపెట్టినను
అట్టివారిని క్షమించగలను
అపకారమ్ము జరుగనీయను.

క్షమాగుణమును తెలిపెడిగాథను
వినిపించెద విను వానరాగ్రణీ
అడవిలొ ఒక పులి వేటగానిని
వెంబడించెను కబళించుటకై.

ఆ నిషాదుడు భయపడి పరుగిడి
కనబడినట్టి తరువు నెక్కెను
తరువుపైన ఒక ఎలుగు ఉన్నది
హడలిపోయెను ఆ మానవుడు.

ఎలుగును గాంచి పులి పలికినది :
'ఈ కిరాతకుడు మనకు శత్రువు
క్రిందకు త్రోయుము కబళించెదను
మనలను చంపెడి వ్యసనము వానిది'

ఆ మాటలకు ఎలుగు పలికెను :
'శత్రువు అయినను ఆశ్రయించెగద
కాపాడుటది ఉత్తమ ధర్మము
కావున వీనిని క్రిందకు త్రోయను'

ఎలుగు నిద్రలో మునిగియుండగా
పులి పలికినది వేటగానితో :
'నీవా ఎలుగును క్రిందకు త్రోయుము
నిన్ను వదలి ఆ ఎలుగును చంపెద.'

పులి మాటలు విని కఠినమనస్కుడు
ఎలుగును క్రిందకు త్రోసివేసెను.
విషయము తెలిసిన ఎలుగంతటను
ఒడుపుగ మరియొక కొమ్మనందుకొనె.

నేలనుబడక కొమ్మనందుకొని
తరువుననున్న ఎలుగును గాంచి
పులి పలికినది : 'ఓ భల్లూకము!
కృతఘ్నుడైన బోయను గనుము.

నీ ఉపకారము మరచెను నీచుడు
ఇపుడైనా మరి నేలకు త్రోయుము'
అనవిని అపుడు భల్లూకము అనె :
'నేను వీనినినేలకు త్రోయను.

వివేకవంతుడు తన అపకారికి
తిరిగి తాను అపకారము చేయడు
అపకారికైనను ఉపకారమ్మును
సదాచేయును సత్పురుషుడు విను'

అని ఆ ఎలుగు ఆనాడన్నది
సజ్జనుల మది విశాలమైనది
అపరాధమ్ములు వారు గణించరు
ప్రతిగా అపకారమ్ముతలంచరు.

లోకకంటకులు రాక్షసులందరు
జీవహింసయే వారి ప్రవృత్తి
వారి స్వభావము కీడొనరించుట
అట్టివారిపై కక్ష తగదయా!''

ఆ మాటలకు మారుతి పొంగెను
అమ్మ మనసులో తీపి గ్రహించెను
''అమ్మా! నీవు రామచంద్రునికి
అనువుగ అమరినసహధర్మిణివి.

పవిత్రమూర్తీ! ఇపుడే నేను
పావనమూర్తిని దర్శించెదను
బదులుగ నీవు పలుకుము తల్లీ!
పతిదేవునికి విన్నవింతును''

అంతట సీత హనుమతొ పలికెను :
''ఓ హనుమంతా! నా ప్రాణేశుని
దర్శించుటది నాదు కోరిక''
అనగా పావని తల్లితొ పలికెను :

''మంగళమూర్తీ! నీ పతిదేవుడు
దుష్టుల దునిమి శిష్టుల బ్రోచెను
తమ్మునిగూడిన రఘుకులతిలకుని
దర్శించెదవు అతి తొందరలో.

ఇంద్రుని గాంచిన శచీదేవివలె
రామచంద్రుని గాంతువు తల్లీ!''
అనుచు లక్ష్మివలె వెలిగెడి తల్లికి
వందనముంచి సాగెను పావని.

||శ్రీ రఘురాముని||

❈❈❈

# 117 సీతాదేవికి శ్రీరామ దర్శనము

వాక్యకుశలుడు కార్యసాధకుడు
వాయునందనుడు రాముని గాంచి
భక్తిప్రపత్తుల పలికెను అపుడు :
''స్వామీ! అమ్మను దర్శించితిని.

సేతువుకట్టి రావణుకూల్చి
మహితకార్యముల చేసినవాడవు
ఆ యిల్లాలిని శోకతప్తను
నీవు చూడవలె అతిశీఘ్రముగ.

విజయవార్త విని పరవశించినది
పలుకులురాక పొంగిపోయినది
రామబంటునని గుర్తుపట్టినది
మదిలో కోరిక తెలిపెను ఇటుల :

''ఓ హనుమంతా! కోరికతీరి
విజయచంద్రుని జీవితేశ్వరుని
రామచంద్రుని దర్శించుటది
మదిలోకోరికజన్మకుసఫలత.

అడుగుల వెంబడి నడచిన వాడు
అనుజుడు అన్నను కొలిచేవాడు
లక్ష్మణమూర్తిని చూడగ గోరెను
అదియే కోరిక అన్నదిమాత.''

హృదిలో అగ్నిని - చెమర్చు కన్నుల
చల్లబరచెను రామచంద్రుడు
ధర్మమూర్తి మది విశాలమైనను
అగాధమైనది లోతు తెలియదు.

అభ్యంజనము అలంకారముల
అతిశీఘ్రముగ సీతాదేవిని
తన సన్నిధికి తీసుకురమ్మని
విభీషణునికి చెప్పెను ప్రభువు.

రామాదేశము విని విభీషణుడు
రామపత్నికి తెలియబచమని
రాక్షసస్త్రీలకు ఆదేశించెను
రమకు చెప్పిరి మంగళవార్తను.

అలంకారములు అటుపై జరుగును
అంతవరకును ఆలసింపక
రామదర్శనముచేయించ''మని
విభీషణునికి వార్తనంపెను.

విషయముతెలిసిన విభీషణాఖ్యుడు
రాముడురాజు, ఆయన ఆనతి
తలదాల్చుటది ధర్మము అనుచు
సీతాదేవికి తెలియబరచెను.

పతిహితమతి ఆ పరమ పతివ్రత
సమ్మతినివ్వగ రాక్షసాంగనలు
స్నానాదులతో అలంకారములు
అతితొందరగా శ్రద్ధగచేసిరి.

మంగళకారిణి జగన్మోహిని
శ్రేష్ఠమైన ఒక పల్లకి నెక్కెను
రామునిచెంతకు సీతాదేవిని
తీసుకువచ్చిరి ఆనందముగ.

జానకి వచ్చిన వార్తను వినిన
రాముని మనసు సంతసపడెను
అంతటిలోన కలత నిండెను
సంక్షోభమ్ము కలిగెను మదిలో.

అతిసామాన్యము అయినతీరుగా
విభీషణునితో పలికె రాఘవుడు :
''ఓ విభీషణా: మిత్రుడవీవు
సీతను రమ్మను నా సన్నిధికి.

నిరతము ఆమె నా విజయముకై
నిరీక్షించినది- పంపుము ఇపుడే''
ఆ మాటలు విని విభీషణాఖ్యుడు
తగు ఏర్పాటులు చేసెను అపుడు.

కపియోధులును భల్లూకములు
అవనిజనపుడు చూడగనెంచి
త్రోసుకువచ్చిరి, వారందరిని
దూరము తరిమిరి రాక్షసభటులు.

చెదరగొట్టబడి పరుగిడు గుంపుల
మహాసవ్వడి సంద్రఘోషగా
ఎగసిపడినది రాముడు వినెను
మదిలో జాలి పొంగి పొరలెను

వారందరి నటు తరిమివేయుట
సహించలేక రామచంద్రుడు
విభీషణునితో పలికె కఠినముగ
వారందరు తన స్వజనులు అనెను.

''ఓ విభీషణా! వారందరినీ
నిలబడనీయక తరిమివేయుట
సీతను చూడక దూరము తరుముట
నా మదికెంతో బాధగ నున్నది.

గోడలు తెరలు పరదాలున్నూ
ఇండ్లు వాకిలులు స్త్రీల కెన్నడు
అంక్షలు కావు- రాజమర్యాదల
కట్టుబాట్లలో పెట్టుట జరగదు.

శీల సంపదకు-మనసే రక్షణ
బాహ్య రక్షణ నిలబడదయ్యా!
వివాహములలో యజ్ఞయాగముల
పురుషుని కగపడ దోషముకాదు.

యుద్ధభూమిలో-కష్టకాలమున
దుఃఖజలధిని మునిగినప్పుడు
స్త్రీలు-పురుషులకు అగపడవచ్చును
సీత వచ్చినది యుద్ధభూమికి.

సీతవచ్చుటది నా సన్నిధికి
వీరందరు నా సన్నిహితులయా!
వీరందరితో నేనుండగనే
సీతను ఇటకే పంపుము'' అనెను.

రాముని మాటకు విభీషణాఖ్యుడు
చిన్నబోయెను-అంతియెగాక
హనుమ లక్ష్మణ సుగ్రీవులును
చలించినారు-వ్యాకులపడిరి.

సతిపై మమత లేనిపతివలె
అతి కఠినమగు మనస్సునపుడు
రాముని మాటల గ్రహించినారు
విషయము తెలియక తికమకపడిరి.

వంటి నిండుగా వలువ కప్పుకొని
ముఖము సైతము కనబడకుండా
ముడుచుకుపోయిన మొగ్గ మాదిరిగ
మానిని నిలచెను రాముని ఎదుట.

జనసమూహమున సిగ్గుతొ సోలి
''ఆర్యపుత్రా''! అనగలిగినది
ఆపై- ఎగసిన శోకము నాపగ
వశము గాక-వైదేహి ఏడ్చెను.

పతియే గతియని నమ్మిన తల్లి
ఆనందముతో అనురాగముతో
ప్రసన్నవదనుని రామచంద్రుని
దర్శించినది-పులకించినది

ఉదయచంద్రుసిగ తన కన్నులలో
ఉదయించిన శ్రీరామచంద్రుని
వదనము గాంచిన మంగళమూర్తికి
మదిలో దుఃఖము తీరిపోయెను.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

# 118 శ్రీరాముడు తన మనస్సు సీతాదేవికి తెలియబరచుట

రాముని ముందర సీతయున్నది
రమను జూచి శ్రీరాముడు పలికెను :
''సౌభాగ్యవతీ! యుద్ధమునందు
రిపుని గూల్చి, నే నిన్ను గెలిచితి.

కోపానలమున ఏకకాలమున
నా అవమానము శాత్రవులను, మరి
నిర్జించితిని ప్రతిన తీరినది
నా పౌరుషము తెలిసె నందరకు.

నా శ్రమఫలితము దక్కినదిపుడు
నేను స్వతంత్రుడ- ప్రజాహితుడను
నా ఇల్లాలిని రక్కసుడపుడు
అపహరించగా అవమానమయె.

ఆ అవమానము పురుష కార్యమున
బలపరాక్రమము చూపి త్రుంచితి
వారిధి దాటి వాయునందనుడు
అల్లకల్లోలము చేసెను లంకను.

ఆ ఘనకార్యము హనుమ చేసెను
ఆ ఫలితమ్ము లభించె నేటికి
రవిసుతు సాయము, వ్యూహరచనము
నేటికి పూర్తిగ సఫలమైనది.

గుణహీనుడగు అన్నను వదలి
నన్నుజేరిన విభీషణాఖ్యుని
నాదు భక్తుని శ్రమ ఫలితమ్ము
నేటికి దొరకెను విజయలక్ష్మితో.''

రాముడు అటుల పలుకుచుండగా
కన్నుల నీరు ఎగసెను సీతకు
అది గమనించెను ధర్మశీలుడు
దృఢచిత్తముతో పలికెను తిరిగి.

కఠినమ్ముగను పలుకుట ఎఱుగని
రాముని మాటల కటువు ధ్వనించెను
తన నడవడితో ప్రజల నడవడి
ముడిపడి యుండును అన్నటు పలికెను :

''ఓ సీతా! నే పరాక్రమమ్మున
చేయవలసినది చేసితి నంతయు
అగస్త్యమహర్షి అసాధ్యమైన
వింధ్యగిరిని తా లొంగదీసెను.

నాకు తెలియక దుష్టబుద్ధితో
నిన్ను హరించిన రావణాసురుని
నా పరాక్రమము చూపి త్రుంచితి
నీ చెరతీర్చితి- ప్రతిన నిలిపితి.

మంగళమూర్తీ! యుద్ధమునందు
పడిన శ్రమ యది మిత్రుల సేవలు
భార్యకోసము కాదని తెలియుము-
తీరుగ నీకు తెలిపెద వినుము.

పురుషుడు స్త్రీని రక్షించవలె
ఆలి రక్షణ భర్త విధియగు
వంశకీర్తి రక్షించగ నగును
అందుకు యుద్ధము చేసితి నేను.

నాకు దూరమై బ్రతికితి వీవు
నీదు మనసుపై నీదే హక్కు
జనకనందినీ! పరపురుషుని చెర
తలిచిన కొలదీ సందేహమగు

యోచనచేసుకు జనకనందినీ!
నీకు తోచిన తావు కేగుము
నీ నిర్ణయముతొ పని యిక లేదు
నీకు అనుమతిని ఒసంగినాను.

రావణు తొడపైనుండి జారితివి
దుష్టుని దృష్టి నీపై పడినది
సద్వంశములో పుట్టిన నేను
వంశకీర్తిని కాపాడెదను.

నా అవమానము బాపుకొనుటకై
నీ చెర తీర్చితి- పురుష లక్షణము
నీకు స్వేచ్ఛ యిక జనకనందినీ!
అన్నియు తెలిసి పలుకుచుంటిని.

పోషణ భారము భరత, లక్ష్మణ
సుగ్రీవునిదో- విభీషణునిదో-
నీవే చక్కగ యోచన చేసుకు
నిర్ణయించుకో, నిశ్చయించుకో!

సౌందర్యములో ఎన్నిక వీవు
నిన్నా రాక్షసుడందుకు హరించె
చచ్చుటకైనా సిద్ధపడెనుకద!
అట్టివాడు నిను గౌరవించునా?''

కర్ణశూలమగు పలుకులు వినిన
సీతాదేవి చలించిపోయెను
మదకరి తొండపు తాకిడి తగిలిన
లతవలె జానకి వణకిపోయినది.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 119 సీతాదేవి అగ్నిప్రవేశము

మది కలవరమున మైథిలి విన్నది
మున్నెరుగని ఆ పలుకులు విన్నది
మహాభావుడు జనమధ్యమున
పలికిన పలుకుల ఉలికిపడినది.

కర్ణశూలములు కరకు కత్తులన
దేహమంత గాయమ్ముల తీరయి
ఏకధారగా కనులు కురియగ
గద్గద స్వరమున పలికెను జానకి :

''ఓ ప్రాణేశ్వర! నన్ను ఎరుగరా?
మున్ను ఎఱుగని పలుకులు మీవి
పామర స్త్రీని అన్నటు పలుకుట
నా దౌర్భాగ్యము నేను వినుటది.

నా నడవడిపై ఒట్టు పెట్టితిని
కోరు ప్రమాణము చేయుదు నేను
దుశ్చరితలతో పోల్చగ వలదు
పరీక్షించుడు శంక తీరును.

నాథా! నే నపరాధినిగాను
వివశను నన్ను అసురుడు తాకెను
దానికి నేను సహించలేను
ఆ యపరాధము దైవమ్ముదగు.

నా ఆధీనమున నున్న మనసది
నిరతము మీ పద ధ్యానమునున్నది
దేహవిషయమున అబలను నాడు
మనసు నెరుగరా మహానుభావా!

మిమ్మొడబాయని దానను నేను
నన్ను మీరు మరి తెలియకున్నచో
మీకు తెలిసెడి మార్గము లేదు
శాశ్వతముగ నే కన్ను మూసెద.

నాథా! నాడు మారుతి నంపిరి
అపుడే నన్ను వదలి వేసినచొ
ఆ విషయము ఆ మారుతి చెప్పిన
అతని ఎదుటనే తనువు రాలుకద!

ఆ విధముగ నే లంకలొ మడసిన
మీకీ శ్రమ ఇట కలుగదు కాదా?
మీ మిత్రులకు కష్టము తప్పను
మారుతి మాటలు అసువుల నిలపెను.

కోపవశులయి ఓ నరవ్యాఘ్రమ!
ఆడతనమును మదిలో నెంచి
సామాన్యుని వలె పలికిరి మీరు
మీకు తెలియని విషయము గలదా!

జనకరాజుకు తనయను నేను
భూమినుండి జన్మించిన దానను
ఆ విషయమును విస్మరించిరి
నానడవడిని మరచిపోతిరి.

చిన్నతనముగనే పాణి గ్రహించిరి
అన్న ప్రమాణము మరచిపోతిరి
మీపై భక్తిని నా నడవడిని
మరచిపోతిరా!'' అనుచు ఏడ్చినది.

కంటి నీటితో సీతాదేవి
దీనవదనుడగు లక్ష్మణుగాంచి
''ఓ సౌమిత్రీ! దుఃఖము తీర్చెడి
ఓకే ఔషధము-చితియగునయ్యా!

నాయన లక్ష్మణ! చితి పేర్పించుము
జీవించుటకిక మనసులేదయా!
నా సచ్ఛీలత మదిలో నెంచక
నాదు పెనిమిటి వదలె నిందరిలొ

అగ్ని ప్రవేశము యోగ్యమైనది''
అనుచు జానకి ఆదేశించగ
అన్న మనసును గ్రహించి తమ్ముడు
ఆ ప్రదేశమున చితి నేర్పరచెను.

ధరణీనందిని శిరసును వంచి
రామచంద్రునికి ప్రదక్షిణించెను
భగ భగ మండెడి అగ్నిహోత్రమును
సమీపించెను పలికెను ఇటుల :

''హవ్యవాహనా! లోకసాక్షివి
తనువు-మనసు భర్తది అనిశము
మది ఏ మాత్రము చలించలేదు
అది నిజమైనచొ నను రక్షించుము.

దోషము నాలో లేకపోయినచొ
నా ప్రవర్తన మంచిదైనచో
రామప్రభువును మరువకున్నచో
నను రక్షించుము అగ్నిదేవుడా!

రవి చంద్రులును వాయుదేవుడు
దశదిశలున్నూ అహోరాత్రములు
త్రిసంధ్యలున్నూ భూదేవియును
పతివ్రతనని నమ్మినకావుము.''

పవిత్రమైన హోమద్రవ్యమగు
ఆజ్యముమాదిరి సీతాదేవి
అగ్నిలొబడగ దేవతాంగనలు
పెద్దపెట్టున రోదనచేసిరి.

అనుచు జనకజ భక్తిగ నగ్నికి
ప్రదక్షిణించి ప్రణామముంచి
తనువుపైన మమకారమువదలి
అగ్నిజ్వాలలో ప్రవేశించినది.

శాపగ్రస్తయగు దేవకన్యక
నాకమునుండి భువికిజారినటు
భూమీతనయ అగ్నినిబడగ
సురగంధర్వులు అసురులు చూచిరి.

బంగరు ఆభరణమ్ములు నిండి
మెరపుతీగవలె వెలిగెడి జానకి
లోకములన్నీ చూచుచుండగా
అగ్నిహోత్రమున ప్రవేశించెను.

అగ్ని ప్రవేశము చేసెను సీత
హాహాకారము చేసెప్రాణులు
ఆశ్చర్యములో మునిగిపోయిరి
అవాక్కుగా నట నిలచిరందరు.

॥శ్రీ రఘురాముని॥

***

## 120 బ్రహ్మాదిదేవతలు శ్రీరాముని గాంచవచ్చుట– బ్రహ్మాదేవుడు శ్రీరాముని స్తోత్రము చేయుట

పుణ్యశీల సీతమ్మగురించి
అందరుపలుకుట రాముడువినెను
కనులుచెమర్చెను దుఃఖవశమున
ఆలోచించెను, అంతటిలోన

వందనమిడిన రామునిగాంచి
వారందరట పలికిరి అపుడు :
''రామచంద్ర! నువు లోకకర్తవు
అవ్యయుడవు నువు జ్ఞానమూర్తివి

అచటికి ధనపతి వచ్చినిలచెను
యముడు వరుణ దేవేంద్రులువచ్చిరి
ముక్కంటియును వచ్చె నచటికి
సృష్టికర్త తావచ్చినిలచెను.

దేవగణములకు నాయుకుడవు నువు
అగ్నిని సీత బడుటచూచియు
ఉపేక్షించితివి- నీ గురించి నువు
ఎందువలన మరి తెలియకపోతివి!

దివ్య విమానము నధిరోహించి
దేవదేవుడే వచ్చి నిలువగ
రామచంద్రుడు కరములనెత్తి
వినయమునిండి వందనమిడెను.

అష్టవసువులలొ ఋతుధాముడవు
ముల్లోములకు నియామకుడవు
రుద్రదేవుని అష్టమూర్తులలొ
అష్టమూర్తివి నీవేనయ్యా!

ద్వాదశసాధ్యులలొ ఓ రఘురామా!
ఐదవవాడవు అవ్యయుడవయా
నీ కర్ణములు అశ్వని సురలు
నీదుకన్నులు సూర్యచంద్రులు.

సృష్టికిముందర ఉన్నది నీవే
ప్రళయకాలమున నీవే ఉందువు
సర్వేశ్వరుడవు సర్వశక్తివి
తెలియనట్టుగ నడచితివేల?''

లోకపాలకులు అడిగిన ప్రశ్నకు
ధర్మమూర్తి రఘురాముడు పలికెను :
''పూజ్యులార! నే దశరథుతనయుడ
రాముడనసుచు తలంచుచుంటిని.

మీరందరును చెప్పుట వింటిని
నాకు తెలియునటు నేనెవ్వడనో
ఎందులకొఱకై జన్మనెత్తితినొ
విధాత నుడువగ వినకోరితిని.''

రాముడు అటుల అడుగుట వినిన
విరించిముదమున స్తోత్రముచేసి
శ్రీమన్నారాయణుడవు నీవని
ఈ విధముగను కీర్తనచేసెను :

అక్షరుండవు నీవు-సత్యమైనది నీవు
బ్రహ్మత్వమును నీవు-శ్రీరామభద్రా!
పరధర్మమును నీవు-నాల్గు భుజముల దేవ
విష్వక్సేనునిగ లోకాలగాచేవు.

శార్ఙ్గధన్యుడవీవు- ఓ హృషీకేశ!
పురుషుడవు నీవయ్య-పురుషోత్తముడవు
శంఖ-ఖడ్గివినీవు-విష్ణు-జిష్ణులు నీవు
బుద్ధిసిద్ధియు నీవు-బలము శక్తియు నీవు.

సేనాపతివి నీవు-గ్రామణీరత్నంబ
బుద్ధి-సత్వమునీవు-క్షమము-దమమూనీవె
ప్రభవించుతత్వంబు- ఓ ఉపేంద్రా!
మధుసూదనుడవయ్య-మంగళంబులనెలవ.

యజ్ఞభోక్తా! ఇదె-వందనంబందుకో
మహేంద్రుడవు నీవు-పద్మనాభుడవు
మహీషులు శరణంచు-చరణాలనంటేటి
మహితమూర్తివి నీవు-మంగళంబులనెలవ.

వేయి శృంగమ్ముల-వేదాత్ముడవు నీవు
వందజిహ్వాలుగల్గు-మహార్షభుడవయ్య
ఆదికర్తా నీవు-స్వయంప్రభుడవై
లోకహితమునుచేయు-లోకేశ్వరుండవు.

## బ్రహ్మకృత శ్రీరామ స్తోత్రము

నారాయణా! నీవు-చక్రాయుధుండవు
ఒంటిశృంగమ్ముతో ధరణిమోసిన దేవ!
భూతభవితములన్ని-తెలిసి కాపాడేవు
వర్తమానమ్మున పాలించు-విభుడవు

సిద్ధసాధ్యులు నీవు- ఓంకారమును నీవు
వషట్కారయజ్ఞంబు నీవయ్య దేవ!
లోకాశ్రయము నీవు-ముందు నీవుందువు
పరతత్వమున్నీవు-పరంతపుడవు.

నీ పుట్టుగిట్టుటలు - ఎవ్వరూ ఎరుగరు
సర్వభూతములందు- దర్శనమ్మిడునట్టి
గోబ్రాహ్మణులనీవు రక్షించి-పాలించు
రమ్యగుణసాంద్రుడవు - ఓ రమాకాంతా!

దిక్కులన్నియునీవు-పర్వతమ్ములునీవు
వనములన్నీ నీవు-వేయిపదములవాడ
వందశిరములు నీకు-వేయిచూపుల వెలుగు
గిరులునిండినయట్టి-వసుధంతయునునీవు.

జీవరాశులు నీవు- జీవనంబును నీవు
భూమిమోయగచాలు- ఆదిశేషుడవీవు
ఆదిదేవుడవీవు- జలములన్నీ నీవు
జగములన్నీ ఏలు- జగదేకవంద్యుడవు.

మూడులోకంబులు పాలించు- రాముడవు
నీదుహృదయము బ్రహ్మ-నిత్యమంగళమూర్తి
నీదుజిహ్వయె వాణి- సత్యమూర్తివి నీవు
దేవగంధర్వులు-నీవేను ఓదేవ!

నీరోమదేవాళి- నిత్యమున్నినుగొల్చు
నీవు కన్నులుమూయ- రాత్రియదిలోకాల
నీవు రెప్పలు తెరువ- ప్రాణులకు పగలది
నీదుశ్వాసయెస్వామి! వేదఘోషలుమాకు

సర్వలోకంబులు నీకు తనువుగ వెలుగు
స్థైర్యంబు నీవయ్య-వసుధంతనిండేవు
నీవులేనిది ఇంక- ఏమియును లేనిదే
వేదవేద్యుడవీవు-వందనంబందుకో!

సోమప్రసాదంబు- అగ్నిశక్తియు నీవు
శ్రీవత్సశోభిత- త్రైలోక్యరక్షణ
వామనుడవై బలిని- దానమడిగిన దేవ!
దేవనాథునకీవు-పట్టమును గట్టితివి.

శ్రీలక్ష్మియే సీత-విష్ణుమూర్తివి నీవు
ప్రజాపతియు నీవు-కృష్ణుడవు నీవేను
దేవవైరిని త్రుంచ-మానవుడవైతివి
రావణుని జంపేవు-మహిత కార్యంబయ్యె.

రావణుని నిర్జించి-మా కార్యమును తీర్చి
ధర్మమును నెలకొల్పి - బలము చూపించేవు
బలవీర్యసంపన్న- బాహుబలతేజుడవు
బ్రహ్మనిర్మితస్తోత్రమాల నందుముదేవ!

దుర్లభంబైనది- నీ దర్శనంబయ్యె
నీ స్తోత్రమెంతయో- అమోఘమైనది
నిన్ను భక్తితొ గొలిచి- చిత్తమున నిల్పిన
ఏ లోపములురావు- సర్వకామ్యములొసగు.

పాపరహితంబును పురాణమైనదగు
ఈ స్తోత్రపఠనంబు-మానవాళికినెల్ల
ఈప్సితంబులుతీర్చి- కాచునన్నది నిజము
పాపంబులెల్లను-పారద్రోలును నిజము.

పురాణములు నీవు- పురుషోత్తముడవీవు
నిశ్చలంబగునట్టి- భక్తితో సేవించ
ఆముష్మికంబైన-సుఖములందేనయ్య!
వందనం బందుకో- ఓ దేవదేవ!

దేవవైరిని గూల్చి- భూమిభారము తీర్చి
యశముగాంచిన నీవు- చల్లగను భువినేలి
వైకుంఠమునుజేరి- శ్రీమహాలక్ష్మితో
కొలువుతీర్చుముదేవ- ఓ జగన్నాయకా!''

* * *

కనులపండుగ అదియె కల్యాణనాయకా!
॥శ్రీ రఘురాముని॥

***

# 121 సీతాదేవిని శ్రీరాముడు స్వీకరించుట

విధాతచేసిన రామ స్తోత్రమును
హుతవాహుడు విని మనుజ రూపున
మంటలనుండి పైకి లేచెను
పుణ్యశీలను భూమికి జేర్చెను.

వడలని సరములు-స్వర్ణ భూషల
నల్లని కురులతొ మంగళమూర్తి
బాలసూర్యుని వన్నెతొ సీతను
అగ్నిప్రవేశ పూర్వము వలెనే

ప్రసన్నవదనము-వెలుగుల రేఖను
లోకసాక్షియగు అగ్ని హోత్రుడు
రామచంద్రునికి అప్పగించెను
ఆనందముతో పలికెను యిటుల:

''రామా! పావని-నీ అర్ధాంగి!
ఎట్టిపాపమును ఎరుగదు ఈమె
త్రికరణ శుద్ధిగ నిన్నేనమ్మిన
పుణ్య చరిత్ర పవిత్రశీల.

అసురాంగనలను కావలియుంచి
అనేక విధముల పరుషములాడి
అసువులు తీసెదనని భయపెట్టను-
అసురునిమాట తలంచదీమె.

నిన్నే మదిలో నిరతముతలచుచు
ఎన్నో బాధలు నీకై ఓర్చుకు
కన్నులలోనే అసువులుంచుకు
ఉన్నది రామా! నీ అర్ధాంగి.

పాపరహిత ఈ పుణ్యచరిత్ర
స్వీకరించుము నీ భార్యగను
మారుపలుకకు మంగళమూర్తీ''
అనుచు పలికెను అగ్నిదేవుడు.

అగ్ని మాటలకు రామచంద్రుడు
ఆనందముతో కన్నులవెంబడి
ఆనందాశ్రులు రాలుచుండగా
పలికెనప్పుడు బ్రహ్మనుగాంచి

''వాణీనాథా! జనకునితనయ
పాపరహితయని ముల్లోకములకు
తెలియగవలెను- బహుకాలమ్మ
పరునిచెరలో మరి ఉన్నది కాదా!

పరీక్షించక ఆదరించిన
పరులందరు ననుకాముకుడనుచు
మూర్ఖుడననుచు నిందించెదరు
అందరికిదియగు సమాధానము.

జనకజమది నాకంకితమనుచు
నామదికంతయు తెలియును, స్వామీ!
మైథిలి నాకు భక్తురాలయా!
నా మది తెలిసి మసలుచుండును.

రావణాసురుని భోగభాగ్యములు
మదిలోనైనా తలచదు సీత
సూర్యునితోడై కాంతి ఉండునటు
నాకు నీడగా సీత యుండును.

సత్యవర్తిని- సత్యమునమ్మితి
ముల్లోకములు నమ్ముటకొరకై
అగ్ని ప్రవేశము చేసెడిసీతను
ఆపక నిలచితి ఉపేక్షించితి.

ప్రజ్ఞావంతుని కీర్తి వదలదు
అటులే జానకి నన్ను బాయదు
జనకుని కూతురు నా సహధర్మిణి
ముల్లోకములలొ సచ్చరిత్రయగు.

పాతివ్రత్య ధర్మమ్ము సీతను
రక్షించునని తెలియును నాకు
చెలియలికట్టను కడలిదాటనటు
అసురుడు అగ్నిని అంటగలేడు.

దేవతలారా! పూజ్యులు మీరు
మీరు చెప్పినటు చేయుటతగును
నా హితమును మీరందరుకోరిరి
స్నేహపూరిత వాక్కులు విందును''

అనుచు పలుకుచు రామచంద్రుడు
అంతరంగమున లేచిన సీతను
అంతులేని ఆనందము నిండగ
అందరి కగపడ గుండెకు చేర్చెను.

॥శ్రీ రఘురాముని॥

## 122 దేవలోకమునుండి దశరథుడు వచ్చి సీతారామలక్ష్మణులను ఆశీర్వదించుట

జానకి సహితుడు శ్రీరామునిగని
గిరిజారమణుడు పలికెను అపుడు :
''రామా! నీవు లోకవంద్యుడవు
అక్షయకీర్తికి నెలవగువాడవు.

అతిబలవంతా! అయోధ్యకేగుము
అనిశము నిన్నే తలంచుచున్న
భరతకుమారుని సంతసపరచుము
తల్లులందరికి పండుగ చేయుము.

మహానుభావా! మా భాగ్యమున
రావణు దునిమి భయముబాపితివి
అసురభయంబను చీకటి బాపిన
సూర్యుడవీవు! రవికులాగ్రణీ!

పట్టాభిషిక్తుడవై పాలించి
బంధుజనులకు ప్రీతినిగూర్చి
వంశము నిలుపగ సంతతిబడసి
అశ్వమేధమును చేయుము నీవు.

సురలందరినీ సంతసపరచుము
భూసురోత్తముల దీవనలందుము
ధనధాన్యములు దానములిచ్చి
యశముగడించి సుఖముగ నుండుము.

రామరాజ్యమును చల్లగనేలి
మన్ననలంది మదిలో కొలువై
నాకలోకము తిరిగి చేరుము.''
అనుచుపలుకుచు శంకరదేవుడు

మరియొక దివ్య విమానము నందున
ఆశీనుడగు దశరథరాజును
రామచంద్రునికి చూపెను, అపుడు
ఆశీస్సులను గ్రహించమనెను.

శంభుని పలుకులు వినిరామువ్వురు
ఆశ్చర్యముతో ఆనందముతో
రామలక్ష్మణులు తండ్రినిగాంచిరి
తనయులగాంచి తండ్రి మురిసెను

ప్రాణముకన్న మిన్నగ నెంచే
జ్యేష్ఠుని రాముని చెంతచేర్చుకు
ఆలింగనమున ఆనందమున
తనయునితో నీరీతి పలికెను :

''అయోధ్యలో నిను వదలివచ్చితి
అమరపురంబున నుంటిని నేను
అన్ని సౌఖ్యములు అమరియున్నను
ఆనందము నా కందలేదయా!

దేవఋషులచే సన్మానమ్ము
సురసౌఖ్యములు సుఖమిడలేదు
మనసుకు శాంతి కలుగలేదయా!
సత్యమునేను నుడువుచుంటిని.

రిపుసంహరణ చేసితివీవు
నీ మది కోరిక సఫలమైనది
వనవాసమ్మది పూర్తియైనది
నాకు సంతసము చేకూరినది

కైక కోరికలు చెల్లించితివి
సౌమిత్రితొ నువు సుఖముగ నుంటివి
నిన్నుగాంచితి ఆనందించితి
కౌగలించుకొని పరవశించితి

సూర్యరశ్మితో మంచు తొలగినటు
నిన్నుగాంచగ దుఃఖముతీరెను
తండ్రిని తరింపచేసిన యట్టి
తనయుడ వీవు ధన్యుడనైతిని.

పండితసభలో తండ్రి ఓటమికి
తనయుడైనఆ అష్టావక్రుడు
తండ్రిని గెలిచిన విజ్ఞుని గెలిచి
తండ్రి గౌరవము నిలిపినాడయా!

అటులే నీవు తరింపజేస్తివి
రామా! సురలు, సురనాయకుడు
రావణధకై నీ అభిషేకమ్ము
విఘ్నముచేసిన వివరము తెలిసెను.

రామా! నీవు మనుజోత్తముడవు
నిన్నుగాంచి నీతల్లి మురియును
అభిషిక్తుడవగు నిన్ను గాంచుచు
అయోధ్యప్రజలు కృతార్థులగుదురు.

నిను స్మరియించు ధర్మవర్తనుని
భరతుని నీవు ఆదరించుము
మీరిరువురును కలిసి యుండుట
నేను చూడవలె నా కోరికది

అవనిజతోను అనుజునితోను
పదునాల్గేండ్ల వవనవాసముతో
నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొంటివి
రావణుత్రుంచి యశము గాంచితివి.

సురలందరికీ భయము బాపితివి
ముల్లోకముల కీర్తిగాంచితివి
రాజ్యమునేలుచు నీ తమ్ములతో
సుఖముగ నుండుము సుందరరామా!''

అంతట రాముడు వినయమునిండి
తండ్రికి వందన ముంచి పలికెను :
''సర్వధర్మములు తెలియును మీకు
నాదుకోరిక మన్నించుడయా!

తండ్రీ! నాదు తమ్ముడు భరతుని
కైకమ్మతొ మరి వదలితి ననిరి
ఘోరశాపమది భరించలేను
దానినిమీరు తొలగించుడయా!''

రాముని కోరిక విని దశరథుడు
సరియనిపలికి సంబరపడుచు
సుమిత్ర సుతుని కౌగలించుకొని
ముదముగ పలికెను మనసునిండుగా :

''నాయన! నీవు సీతారాముల
సేవాభాగ్యము నందినవాడవు
అందుకు సంతస పడుచుంటినయా!
ధర్మజ్ఞుడవు అన్నీ తెలియును.

రామచంద్రుడు ప్రసన్నుడైనచొ
సర్వధర్మముల ఫలమది యగును
కీర్తి గడించి సుఖములందెదవు
స్వర్గసుఖములు అందును నీకు

సిద్ధులు-ఋషులు మూడు లోకములు
అర్చనచేసే అవతారమ్మిది
రాముడు అగును పరబ్రహ్మము
భూలోకములో ఉదయించెనయా!

వేదవేద్యుడే రామచంద్రుడు
బ్రహ్మాదులు వివరించిరి కాదా?
కావున నీవు సీతారాముల
సేవలొ ధన్యత నందుము నాయన.''

అనుచు పలుకుచు దశరథరాజు
సీతను గాంచి పలికెను ప్రియముగ :
''ఓ వైదేహీ! రాముడు నిన్ను
పరీక్షించెనని వంత నొందకు.

నీ సచ్ఛీలత సత్ప్రవర్తన
లోకమ్ములకు తెలియుటకొరకై
ఆ విధముగను అనెను వినమ్మా!
అందుకు మదిలో కినుక వహించకు.

పతిసేవల పరమార్థమునీకు
పరులు చెప్పెడిది ఏమియులేదు
మామను గనుక పలుకుచుంటిని
పతియే గతియు, కనబడుదైవము''

అనుచు పలుకుచు దశరథరాజు
ఆముువ్వురకు ఆశీస్సులనిడి
ఆనందముగా ఇంద్రపురమునకు
ఆకసమంటి సాగెనప్పుడు

॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 1 2 3 సురపతి వరముతో మృతులైన శ్రీరామసేన బ్రతుకుట

''శ్రీరామా! నీ దర్శనమైనది
మేము వచ్చితిమి-ఫలము నీయవలె
కావునమదిలో కోరిక తెలుపుము
ఆనందముగా నెరవేర్చెదము''

మరియొక కోరిక మహానుభావా!
ఈ వానరులు వసించు తావుల
కాలముకాని కాలమునైనను
ఫలజలమ్ములు దొరుకుచుండవలె.''

అనుచు పలికిన దేవేంద్రునకు
ఆ ముువ్వురును నమస్కరించిరి
అంతట రాముడు కోరిక కోరెను
అది నెరవేర్చగ పలికి కోరెను :

రాముడు కోరిన వరముల కపుడు
ఆనందించెను అమరనాథుడు
ఆ విధముగను జరుగును అనగా
రామభక్తులు శ్వాసపీల్చిరి.

''ఓ సురనాయక! నాకోసమయి
వానరయోధులు భల్లూకములు
అసువులపైన ఆశ లేకను
యుద్ధము చేసిరి-హతులయిరెందరొ

గాయమ్ములతో అసువులు బాసిన
గోలాంగూల వానరవీరులు
భల్లూకములు స్వస్థత కలిగి
నిద్రనుండి మేల్కొన్నటు లేచిరి

భార్యాబిడ్డల బంధుజనులను
వదలి పోరిరి-పోరున ఒరిగిరి
వారందరినీ బ్రతికించుమయా!
ఆనందముగా వారుండవలె

బ్రతికినవారు ఆశ్చర్యముతో
రామచంద్రుని పదమ్ములబడిరి
సురలందరును రామలక్ష్మణుల
స్తోత్రము చేసిరి ఆనందముగా.

సురపతి అంతట రాముని గాంచి
వినయము నిండి పలికెను అపుడు :
'' ఓ మనుజోత్తమ! ఈ వీరులను
వారి తావులకు పంపించుమయా!

సీతకు నీవు ముదము గూర్చుము
అయోధ్యచేరి తల్లుల గాంచుము
నీకొరకై అట నియమమునున్న
భరతకుమారుని సంతసపరచుము.

శత్రుఘ్నుని మదికానందమునిడి
అభిషిక్తుడవై అయోధ్య నేలుచు
పౌరులందరిని సంతస పరచుము
రామరాజ్యము పరిపాలించుము.''

సురపతి మాటలు వినిన రాముడు
లక్ష్మణమూర్తి సీతాదేవియు
సురలకచ్చట వందనమిడిరి
సురలు సాగిరిస్వర్గలోకము

సీతారాములు లక్ష్మణమూర్తి
సేనావాహిని మధ్యనుండగా
పూర్ణచంద్రునితొ శోభిలు నింగిగ
దివ్యకాంతులు వెల్లివిరిసినవి.

॥శ్రీ రఘురాముని॥

❖❖❖

## 1 2 4 ఆలసించక అయోధ్యకేగు నిర్ణయము శ్రీరాముడు తెలుపుట

ఆనందముగా రాత్రి గడచెను
ఉదయముకాగా విభీషణాఖ్యుడు
మానవోత్తముని చూచి పలికెను
అంజలినొగ్గి పలికె వినయముగ :

''జానకిరమణా! శ్రీరఘురామా!
స్నానయోగ్యమగు మంగళజలములు
చందనాదులు పుష్పహారములు
ఆభరణమ్ములు అమరియున్నవి.

మంగళస్నానము నాచరించుము
అందుకుతగిన సేవకులుండిరి
నామదికోరిక తీర్చుముస్వామీ!''
అనగా రాముడు పలికెప్రియముగ :

''మిత్రసత్తమా! వానరరాజును
వీరులందరిని గౌరవించుము
మంగళస్నానము వారు చేతురు
నేను ఇప్పుడుస్నానమాడను

సుఖముల తేలగ సరిగలవాడు
ధర్మాత్ముడును సుకుమారుడగు
భరతుడు నాకై వేచియుండెను
అతనిని చూడక స్నానముచేయను.

నూత్నవస్త్రములు ఇపుడుధరించను
భరతకుమారుని చూతును ముందుగ
అయోధ్యకేగెద అతి తొందరగా
ఇచటికి దూరమునున్నది-పోవలె.''

అనగానప్పుడు విభీషణుండనె :
''రామా! నిన్ను ఒక్కదినములో
అయోధ్యచేర్చెద-శుభముకలుగును
దివ్యవిమానము పుష్పకమున్నది.

సూర్యకాంతితో తేజరిల్లునది
దేవలోకమున నుండు విమానము
అమోఘవేగము కలిగినయట్టి
పుష్పకమున్నది లంకాపురిలో

రావణాసురుడు యుద్ధమునందు
ధనపతినెదిరి గెలిచె పుష్పకము
నీ సేవలకై ఉంచితి దానిని
మేఘసమముగా పోగలదయ్యా!''

అనుచు వినయముగ విభీషణుండు
అనుజునితోను అమ్మసీతతో
ఒక్కదినము తన పురమున నుండగ
భక్తిగ వేడెను భక్తబంధువును.

''శ్రీకరమూర్తీ! ఈ భక్తునిచే
సేవలనంది సత్కారముగొని
సాగుము-నేను నీ మిత్రులకు
సత్కారమ్ములు చేయనెంచితి.''

అంతట రాముడు అచ్చటివారు
వినుచుండగనుపలికె ప్రియముగ :
''ఓ విభీషణా! నాకు హితుడవు
మహితకార్యమున ముందునిలచితివి.

ఉత్తమమైన స్నేహముచేసి
సత్కరించితివి సంతసమైనది
రాక్షసరాజా! నేను త్వరితముగ
అయోధ్యకేగెద తమ్ముని చూచెద.

చిత్రకూటమున నను బ్రతిమాలి
అయోధ్యకపుడు గొనిపోనెంచి
భరతుడు ఎంతో ప్రయత్నించెను
కానీ నేను సమ్మతించక

పదునాల్గేండ్లు గడచిన పిదప
వనవాసమ్ము జరిగిన పిదప
తప్పకవత్తును అన్నానయ్యా!
నా మదితొందర చేయుచున్నది.

కీర్తిశాలియగు కౌసల్యమ్మను
లక్ష్మణు తల్లి సుమిత్రదేవిని
భరతుని తల్లిని కైకాదేవిని
గురువుల చూడగత్వరపడుచుంటిని.

హితులను మిత్రుల వారిబిడ్డలను
అయోధ్యలోని జనులందరినీ
చూడగ నా మది తొందరపడెను
పుష్పకమ్ము నిట రప్పించుమయా!

నిలువగలేను అనుమతినిమ్ము
నీ సత్కారము లందితి నేను
మదిలో కినుక వలదు మిత్రమా!''
అనగా నచటికి వచ్చెవిమానము.

మేరు శిఖరమును పోలు విమానము
విశ్వకర్మచే నిర్మితమైనది
బంగరు కాంతుల తేజరిల్లునది
మణిమయవేదిక లమరియున్నది

బంగరుధ్వజములు శ్వేతపతాకలు
శోభకు నిలయము ఆ పుష్పకము
చిరుగంటలతో మధుర స్వరమున
మనోవేగమున సాగువిమానము.

కాంచన హర్మ్యములున్నవి అందు
స్ఫటికపు వజ్రపు పనితనమున్నది
స్వర్ణనిర్మిత కమలములున్నవి
మణులు ముత్యముల కవాటమ్ములవి.

అందమైన ఆ పుష్పకమ్మును
ముందరనిలిపి రాక్షసరాజు
వందనముంచి వినయమునిండి
రాముని అడిగెను ఆదేశించగ.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 1 2 5 శ్రీరాముడు తనవారందరితో పుష్పకమధిరోహించుట

ఆదేశముకై నిలబడియున్న
రాక్షసరాజుతొ పలికెను రాముడు
''లంకాధీశా! వానర వీరుల
సత్కరించుము సంతసపడెదను.

కార్యసాధకులు వీరందరును
సురలకుసైతము సాధ్యముకాని
అభేద్యమైన లంకజొచ్చిరి
అసువులనైనా లెక్కిడలేదు.

రత్నాభరణములిమ్ము వీరికి
స్వర్ణహారములు వస్త్రములిమ్ము
జయములభించెను వీరివల్లనే
వీరిని తృప్తిగ సత్కరించుము.

ఓ విభీషణా! సర్వజ్ఞుడవు
వానరవీరుల సత్కరించినచొ
త్యాగశీలివి సద్బుద్ధివని
వీరందరును తెలుసుకొందురు.

ఔదార్యముతో రాజు సర్వదా
యశము గడించుట తెలియగవలెను
కోపము గలిగిన తమ నాయకుని
వదలిపోవును సేనలన్నియు.''

రామచంద్రుని ఆదేశముతో
రాక్షసరాజు విభీషణుండు
రత్నభూషలు వస్త్రమ్ములతో
వానర వీరుల సత్కరించెను.

సత్కారమ్మును స్వయముగజూచి
కోదండరాముడు సీతాసమేతుడు
సౌమిత్రితొ ఆ పుష్పకమెక్కెను
ఉదయగిరిని రవి అన్నటు తోచెను.

సిగ్గుమొగ్గలై శోభిలుసీతను
అంకమునందు కూర్చొనబెట్టుకు
ధరణిని మోసెడి ఆదిశేషుడన
ఆసీనుడయె రామచంద్రుడు.

మానవోత్తముడు మిత్రులజూచి
వారితావులకు పొమ్మని చెప్పెను
మిత్రునికార్యము నిర్వహించిరి
సుఖముగ పొండని ఆనతినిడెను.

సుగ్రీవునితో పలికెను రాముడు :
''నా స్నేహితుడవు-నమ్మినవాడవు
అక్కరలో నా ప్రక్కనుంటివి
సచివుని తీరుగ సాయపడితివి.

ధర్మవర్తనా! నీ మది తెలుసును
అధర్మమనగా వెరతువు నీవు
నీ సేనలతో శుభముగ సాగి
సుఖముగ నేలుము వానరరాజ్యము.

ఓ విభీషణా! నీ రాజ్యమును
నీకు ఒసగితిని పరిపాలించుము
సురలతొ కలిసి సురనాయకుడే
దిగివచ్చినను గెలువరు నిన్ను.

అయోధ్యకేగెద అతితొందరగా
ఆనతినొసగుడు ఆనందముగ
మరువనుమిమ్ముఓ హితులారా!
అనుజ్ఞ వేడితి దయచేయండి.''

రాముని మాటలు వినిన భక్తులు
విభీషణుండును వానరరాజు
వందనముంచి ప్రియముగ కోరిరి
అయోధ్య వత్తుమనుచువేడిరి.

''కౌసల్యాసుత! కరుణాధామా!
నీతోవత్తుము మముగొనిపొమ్మో
కష్టమునిడక సంచరింతుము
రాజుగ నిన్ను చూతుము రామా!

అభిషిక్తుడవై వెలుగులుచిమ్మగ
కనవలెనన్నది మా కోరికయా!
నిన్నుగన్న ఆ అమ్మను చూతుము
వందనముంచి మరలెదమయ్యా!''

వారికోరికకు మదిపొంగినది
''సీతను, భరతుని, చూచు ముదమును
మించిన ముదము మీరువచ్చుటని''
ఆనందముతో సరియనె రాముడు.

వానరరాజు గెంతెనులోనికి
వానరసేనలు పుష్పకమెక్కిరి
విభీషణుడు తన మంత్రులతోను
రఘుపతి ఎక్కిన పుష్పక మెక్కెను.

మిత్రులందరు కీర్తనచేయగ
ముదముగ వినుచు రామచంద్రుడు
ధనపతివలె ఆ పుష్పకమందు
తేజరిల్లెను మురిసె విమానము.

సుఖాసీనులై సంతోషముతో
వారందరును ప్రభువును చూడగ
రాముని ఆనతినంది పుష్పకము
నింగికెగిరెను ఆనందముగ.

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 1 2 6 శ్రీరాముడు సీతాదేవికి వివిధ ప్రదేశములు చూపుట

రామచంద్రుని ఆనతినందిన
దివ్యపుష్పకము రివ్వున ఎగిరెను
గాలికి ఎగిరిన మేఘము మాదిరి
వాయువేగమున సాగె విమానము.

నలువంకలకు రాముడు చూచుచు
చూపెను సీతకు స్థలములన్నియు
''ఓ వైదేహీ! త్రికూట గిరిపై
కైలాసగిరి నిలచినట్టుగా

నిలచెను శోభగ ఈ లంకాపురి
విశ్వకర్మచే నిర్మితమైనది
అదిగో చూడుము ఆహవభూమి
రక్త మాంసముల నిండియున్నది.

పద్మనేత్ర! గను ఈ ప్రదేశమున
బ్రహ్మవరములచె బలగర్వితుడగు
రావణాసురుని నీ నిమిత్తమై
నేలకూల్చితిని మహారణమున.

ఇదే తావున రావణు తమ్ముని
అతిబలవంతుని కుంభకర్ణుని
హతముచేసితి- నిశాచరుడగు
ప్రహస్తుడిచ్చట మన్నున కలిసెను.

ధూమ్రాక్షు నచ్చట హనుమ చంపెను
రావణుతనయుని ఇంద్రజిత్తును
అచటే కూల్చెను మన సౌమిత్రి
మాయలమారి రావణుతనయుడు.

వికటుని ఇచటే కూల్చె నంగదుడు.
అదుగో అచ్చట విద్యున్మాలిని
సుషేణుడంతము చేసెను గనుము
వీరులు పోరిరి నా విజయముకై.

అసాధ్యుడైన అకంపనుండు
మహాపార్శ్వుడు, మహోదరుండును
విరూపాక్షుడు అసురవీరులు
అతిబలవంతులు ఒరిగిరిచ్చట.

ఈ ప్రదేశమున రణరంగమున
రావణాసురుని పట్టపురాణి
మండోదరి తన వేయి సవతులతో
గుండె పగులగా రోదించినది.

ఓ బింబానన! సంద్రము దాటి
రాత్రి ఇచ్చట గడిపితి మిదిగో!
అక్కడ చూడుము నలునిచె జలధిని
కట్టించితిని సేతువునీకై.

ఇంతటి సేతువు ఇంతవరకును
నిర్మించుటది జరుగలేదు విను!
గనుము జానకీ! ఈ సంద్రమ్మును
అలలతొ భీకరమైన కడలి ఇది.

ఓ సీతా! నిను అన్వేషించగ
వారిధి దాటెను వాయునందనుడు
అపుడు హనుమకు ఆతిథ్యమునిడ
నిలచిన బంగరుశైలము అదిగో.

కడలి కడుపులో దాగిన శైలము
మైనాకుడని అందురు గిరిని
వానరసేనకు నెలవు అయినది
హనుమ కరమున పవిత్రమైనది.

ఇదిగో ఇచ్చటి తీర్థము గనుము
ముత్తెపుచిప్పల శంఖమ్ములతో
ఈ తీరమ్ము సేతుబంధనము
పవిత్రక్షేత్రము ప్రసిద్ధికెక్కెను.

ఈ తీర్థములో స్నానమాడినచొ
మహాపాతకములన్నియు పోవును
పూర్వము ఇచ్చట పుణ్యమూర్తులకు
మహాదేవుడు దర్శనమిడెను.

ఇచ్చటనే లంకేశుని తమ్ముడు
విభీషణునికి శరణు నొసగితి
అతివేగముగా ఈ విమానము
సాగుచున్నది- అదె కిష్కింధ.

వానరరాజుకు రాజధాని యది
అందమైనదీనగరము సీతా!
సుందరవనములు గనుమో జానకి!
ఇచ్చట వాలిని కూల్చితి నేను.''

వాలిపాలిత నగరముగాంచి
పలికెను సీత ప్రాణేశునితో :
''స్వామీ! మనము వానరకాంతల
గొనిపోయెదము ఈ విమానమున.

వాలి భార్యయగు తారాదేవిని
సూర్యతనూజుని ఇంతిని మరియు
కపివీరుల ఇల్లాండ్రనందరిని
వెంట చేర్చుకొన కోరిక స్వామీ!''

సరియని పలికి రామచంద్రుడు
పుష్పకమ్ము నట ఆపి విషయమును
సుగ్రీవునికి తెలియబరచెను
కపి కాంతలను పిలవనంపెను

ఆనందముతో వానరరాజు
అంతఃపురమున అడుగుబెట్టెను
తారను గాంచి ముదముగ పిలచెను
సీతాదేవి కోరిక తెలిపెను.

సంబరపడినది తార అప్పుడు
అలంకరించుకు ముందుకు నడచి
కపిస్త్రీలందర నాహ్వానించెను
సీతను చూతము రండని పిలిచెను.

అయోధ్యలోన దశరథవిభుని
రాణుల చూతము- రామచంద్రునికి
అయోధ్య జనులుఎదురువచ్చుటది
మంగళకరమగు పండుగచూతము.

అనుచు అందరిని వెంటబెట్టుకొని
పుష్పకమ్మును ఎక్కిరి వారు
అంతట ఎగిరెను దివ్యవిమానము
రాముడు సీతకు చెప్పుచుండెను :

''అదిగో గనము ఋష్యమూకగిరి
బంగరు కాంతుల వెలుగు ధాతువుల
మెరపులునిండిన మేఘముపోలెను
అచ్చట కలిసితి ఈ సుగ్రీవుని.

వాలిని కూల్తును అన్నశపథము
ఆ గిరిపై నే చేసితినాడు.
చిత్ర విచిత్రములైన వనములతో
పంపాతీరము చూడుముఅదిగో!

నీ తలపులతో పంప ఒడ్డున
దుఃఖించితిని నిన్నుగానక
శబరిని గాంచితి నీ ప్రదేశమున
కబంధు నంతము చేసితి నచట.

ఓ కమలాక్షీ! ఈ తరువునుగను
అబలహర్తయగు దుష్ట దనుజుడు
రావణాసురుడు నీకొరకై ఇట
జటాయునంతము చేసెను నాడు.

ఇదియే గనుము జన స్థానము
అతి బలవంతులు ఖరదూషణుల
త్రిశిరవీరులను వాడి బాణముల
నేల కూల్చితిని నా భుజబలమున.

అదిగో అది మన ఆశ్రమసీమ
అందము లొలికెడి పర్ణశాలయది
రావణాసురుడు మాయరూపుతో.
నిన్ను హరించెను అదేచోటున.

మంగళకరముగ నిర్మలజలముల
పారెడి పావన గోదావరి అదె-
అగస్త్యమహఋషి ఆశ్రమ మదిగో!
సుతీక్ష్ణ మహఋషి ఆశ్రమమ్మొగను.

శరభంగాశ్రమ మదియే దేవీ!
మనమచటుండగ సురపతి వచ్చెను
విరాధ వధ అట జరిగెను గనుము
ఋషి ఆశ్రమములు కనబడుచున్నవి.

సూర్యతేజముతొ సమమగునట్టి
అత్రి మునీంద్రుని దివ్యాశ్రమ మది
అదిగో అదియే చిత్రకూటము
నను రమ్మనుచు భరతుడు వేడెను

సుందర వనముల అందము లొలికెడి
యమునను గనుమో పద్మదళాక్షీ!
శ్రీకరమైన ఆశ్రమ మదిగో
భరద్వాజుని దివ్యాశ్రమము.

త్రిపథగామిని గంగానది యది
పులుగులు చక్కగ తిరుగుచున్నవట
నిషాదనాథుడు గుహుడు కలిసిన
శృంగిబేర పురమదిగో గనుము.

చిక్కగ పెరిగిన వృక్ష సంపద
వన సౌందర్యము గనుము జానకీ,
యజ్ఞ సమయమున తీర్చిదిద్దిన
యూపస్తంభము లవిగో గనుము.

సరయూనదియది మంగళకారిణి
నాయనగారి రాజధాని గను
అయోధ్య అదిగోవచ్చుచుంటిమి
వందనమిడుము భక్తిమీరగా.''

అయోధ్య అదియని రాముడనగనే
వానర వీరులు రాక్షస వీరులు
సుగ్రీవుడును విభీషణుడును
సంతోషముతో గంతులేసిరి.

మంగళకరమగు అయోధ్యనపుడు
దూరమునుండి చూచిరి వారు
అమరావతిని పోలు నగరమును
విశాలకక్ష్యల వెలుగు నగరమును

తెల్లని మేడల వెలిగెడి పురమును
వెల్ల ఏనుగులు అశ్వరాజములు
దండిగనున్న సుందర నగరము
అయోధ్య నగరము గాంచిరి వారు.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 127 భరద్వాజ ముని సందర్శనము

పంచమి తిథితో వనవాసమ్ము
పదునాల్గేండ్లది పూర్తియైనది
భరద్వాజ ఋషి ఆశ్రమమ్ముగని
పుష్పకమ్మును నేలకు దింపిరి.

సీతారాములు లక్ష్మణమూర్తి
వినయముగా నట ఋషికి మ్రొక్కిరి
అంతట రాముడు అయోధ్య వివరము
భరద్వాజుని అడిగెను భక్తిగ :

''మహానుభావా! అయోధ్యనగరము
సుభిక్షమ్ముగా సుఖముగ నున్నద!
ఆరోగ్యముగా జనులు ఉండిరా?
భరతుడు చల్లగ ఏలుచుండెనా?

నా తల్లులకు క్షేమమే కదా!
ప్రజలందరును కుశలమే కదా!''
అనుచు రాముడు వివరములడుగగ
ఆనందించెను భరద్వాజుడు.

ప్రియముగ రాముని గాంచి పలికెను :
''రామా! అందరు కుశలమేనయా!
నీ పాదుకలు ముందునుంచుకొని
భరతుడు పాలన చేయుచుండెను.

నియమవంతుడై జటాధారియై
నిరతము నిన్నే స్మరణచేయుచు
నీదురాకకై వేచియుండెను
నిన్నుగాంచి తా మురిసిపోవును.

ఓ పురుషోత్తమ! తండ్రిమాటకై
సర్వభోగములు పరిత్యజించి
నారచీరలతొ వనవాసముకై
బయలుదేరు నినుగాంచితి నాడు.

భార్య సీతతో నీ తమ్మునితో
కాలినడకను నడచివచ్చితివి
స్వర్గమునుండి జారినయట్టి
దేవుని మాదిరి కనుపించితివి.

ఆనాడటుల నిన్నుగాంచితి
నీపై నాకు జాలి కలిగినది
నేడు నీవు నీ రిపుని గూల్చితివి
నిన్నుగాంచి నా కానందమగు.

నన్ను చూడగా వచ్చితివీవు
నీవు వనముల ఇడుములు పడుట
సర్వము నాకు తెలియును రామా!
నీ సుఖ దుఃఖములన్నీ తెలియును.

మునులకు అభయము నిచ్చుటయున్ను
జనస్థానమున అసురుల గూల్చుట
మారీచుడు తా మృగమగుటయును
సీతాపహరణము తెలియును రామా!

కబంధు గూల్చుట, పంపను చూచుట
సుగ్రీవునితో చెలిమి చేయుట
కోలనేసి ఆ వాలిని త్రుంచుట
సీతాన్వేషణ ఆరంభించుట

ఆంజనేయుడు సంద్రము దాటుట
లంకను మంటల కాల్చివేయుట
సీత కుశలమును నీకు తెలుపుట
నలునిచె సేతువు నిర్మించుటయు

కపి యోధులతో లంకను జొచ్చుట
లోక కంటకుని-దేవవిరోధిని
సపుత్ర బాంధవ సమేతమ్ముగా
ససైన్యములతో కూల్చుట తెలియును.

సురలందరు నిను స్తోత్రము చేయుట
సురనాయకుడు వరము నొసగుట
తపోబలమున సర్వము తెలిసితి
ఆనందించితి విజయరాఘువా!

నీకు వరములిడ తలంచినాను
కోరుము రామా! అంతియెగాక
నా ఆతిథ్యము స్వీకరించుము
రేపు సాగుము అయోధ్యనగరికి!''

అనగా రాముడు వరము నడిగెను-
త్రోవలొ తరువులు అకాలమైనను
ఫలభరితమయి తేనెలు కురియుచు
మంగళకరముగ నుండగ కోరెను.

భరద్వాజుడు సరియనినంతనె
మధురఫలములతొ నిండెను తరువులు
కపులు ప్రీతిగాఫలములు తినిరి.
స్వర్గ విజయముగ పొంగిపోయిరి.

॥శ్రీ రఘురాముని॥

❈❈❈

## 1 2 8 భరతునకు శ్రీరామునిరాక శుభవార్తను ఆంజనేయుడు తెలుపుట

ఆశ్రమమందు రాముడు నిలచెను
మనసులొ అయోధ్య నిలచినదప్పుడు
హనుమను పిలచి రామచంద్రుడు
ఈ విధముగను ఆదేశించెను :

''హనుమా! నీవు అయోధ్యకేగుము
ముందుకుసాగి బంధువులందరి
యోగక్షేమము తెలుసుకు రావలె
మిత్రుడైన ఆ గుహుని కలియుము.

శృంగిబేర పురమందున వున్న
నిషాధరాజగు గుహుడు-మిత్రుడు
నాకై ఆతడు వేచి యుండును
నా కుశలము విని ఆనందించును.

అయోధ్యత్రోవ చూపునాతడు
భరతుని గూర్చి తెలుపును అతడు
అచ్చటినుండి నేరుగ సాగి
భరతుని గనుము రాక తెలుపుము.

జానకితోను, లక్ష్మణుతోను
సుఖముగనుంటిని అనుచు తెలుపుము
అసురుడు సీతను హరించినట్టు
సుగ్రీవునితో చెలిమి చేసినటు

వాలిని కూల్చుట-సీతాన్వేషణ
నీవు వారధిని లంఘించుటయు
సీతను చూచి కుశలము చెప్పుట
అందరు సంద్రము తీరము చేరుట

సముద్రుండు నా సన్నిధి నిలచుట
మీరు సేతువును నిర్మించుటయు
రావణాసురుని సంహరించుట
నా మనోరథము నెరవేరుటయున్ను

విరించి, ఇంద్రుడు ఉమాకాంతుడు
దర్శనమిడుట వరము నొసగుట
దశరథవిభుని దర్శనభాగ్యము
మిత్రులందరితొ వచ్చుట తెలుపుము.

ఓ హనుమంతా! సర్వము తెలిసి
భరతుని ముఖమును చదువవలెనయా!
మదిలోనాయెడ భావముతెలియుము
ముఖకవళికలు పరీక్షించుము.

దేవవిరోధిని అంతముచేసి
అఖండయశమును నేను గ్రహించి
అజేయులైన మిత్రులతోను
వచ్చుచుంటినని తెలియబరచుము.

మా పూర్వీకుల రాజ్యసంపద
గజతురగములు భోగభాగ్యములు
అమరియుండగా వదలుకొనుటకు
మనసు తేలికగ సరి యనదయ్యా!

కోర్కెలు తీరేరాజ్యభోగములు
వదలుకొనుటది తేలికగాదు
సమర్థుడైన భరతుడు-రాజుగ
పదునాల్గేండ్లు రాజ్యము నేలెను.

ఆ పాలనలో సుఖము తెలిసెను
పరిపాలనలో రుచిని తెలిసెను
అందుకు అతడది కోరుకొన్నచో
అతడే రాజ్యము పాలించవలె.

భరతునియొక్క అంతరంగమును
నీవు గ్రహించి-రాజ్యము కోరిన
ముందుగవచ్చి విషయము తెలుపుము
లేనిచొ నీవట వేచి యుండుము.''

రాముని ఆనతి శిరసునదాల్చి
ఆనందముగ మనుజరూపమున
ఫణిని గ్రహించే ఖగపతి అనునటు
మారుతి రివ్వున నింగి కెగిరెను.

తండ్రి చరించే గగనమార్గమున
తనయుడు సాగెను రామబాణమై
మహాసర్పముల స్థావరమైన
గంగాయమునల మధ్య ప్రదేశము

ముదముగ గాంచిముందుకు సాగి
శృంగిబేర పురమందున ఆగి
గుహునితొ పలికెను : ''ఓ పుణ్యాత్మా!
నీ ప్రియమిత్రుడు రాముడు కుశలము

సీతాసహితుడు రామచంద్రుడు
లక్ష్మణమూర్తి కలిసిన ప్రభువు
భరద్వాజుని ఆశ్రమమందున
ముని కోరికపై రాత్రి ఆగును.

రేపటి ఉదయము ప్రభువు వచ్చును
స్వామి దర్శనము నీకగునయ్యా!
నీ స్నేహితుని దర్శించెదవు''
అనుచు పలికెను పరవశించెను.

మంగళకరమగు వార్తను చెప్పిన
ఆనందమది గుండెలొ నిండగ
అతివేగమున సాగెను ముందుకు
రామదూతనని పొంగిపోయెను.

గగనమార్గమున సాగెడి పావని
పరశురామ తీర్థమ్మును గాంచెను
గోమతి, వాలుకి, నదులను గాంచెను
ప్రజలను గాంచుచు ముందుకు సాగి.

ధనపతి వనము చైత్రరథమువలె
విరగబూసిన తరుసందతో
కళకళలాడే జనులతొ నున్న
నంది గ్రామమును గాంచెను మారుతి

క్రోసెడు దూరము నున్నది అయోధ్య
ఆ గ్రామమది నందిగ్రామము
భరతుడు వశించు ఆశ్రమమునకు
పవన నందనుడు చేరెను శీఘ్రమె.

జటావల్కలము లమరియుండగా
రామధ్యానమున మనసుయుండగా
శుష్కశరీరము నియమనిష్ఠలతొ
ఫలమూలాదుల నిగ్రహమ్ముతో

తపోరాశివలె బ్రహ్మతేజమున
రామపాదుకలు ముందు నిడుకొని
రాజ్యపాలనము చేయుచు ప్రజలను
రామరాజ్యమన పాలన చేయుచు

కాషాయాంబరధారులు అయిన
మంత్రులు సేనాధ్యక్షులతోను
పురోహితులతో కొలువుతీరిన
భరతుని గాంచెను వాయుపుత్రుడు.

ఆడంబరములు రత్న భూషలు
రాజు ధరించడుకావున ప్రజలు
రాజును చూచి అనుకరించిరి
ఆనందముగ నుండిరి అనిశము.

మూర్తిగ నిలచిన ధర్మమన్నటు
నిలచిన భరతునిగాంచిన మారుతి
రెండు చేతులతొ వందనమిడెను
శంఖనాదమున పలికెను ప్రియముగ:

''ఓ ధర్మజ్ఞా! దండక వనిలో
నార చీరలతొ మునివలె చరించు
రాముని గాంతువు అతితొందరలో
అన్న అడిగెను నీ కుశలమును.

ఎవ్వరి కొఱకై వంతలో నుంటివొ
వారి దర్శనము అయినది అనుకో!
దుఃఖము వదలుము నీవింతటితో
ఆనందమగు విషయము వినుము.

రామచంద్రుడు రావణు త్రుంచెను
సీతను గ్రహించి ప్రతిన తీర్చుకొని
బలవంతులగు మిత్రులందరితొ
బయలుదేరెను విను మహరాజా!

ఇంద్రునితో ఆ శచీదేవివలె
రామునితో వైదేహియున్నది
పుణ్య దంపతులు వారివెంబడి
శుభకరమూర్తి లక్ష్మణుడుండెను.''

ఆనందమగు వార్తను వినిన
భరతుడు తనను తానే మరచెను
ఒళ్ళు తెలియని పరశవమ్మున
స్పృహను దప్పెను నేలనుబడెను.

తెలివితెచ్చుకొని హనుమనుగాంచెను
గుండెకు హత్తుకు మాటలురాక
ఆనందాశ్రులు ధారకట్టగా
తడిపివేసెను వాతాత్మజుని.

మెల్లగ తేరుకు పలికెను భరతుడు:
''మహానుభావా! ఎవ్వరవయ్యా?
దేవుడవా నువు! మనుజుడవేనా!
ఉద్ధరించగా వెలసితివిచట.

అమితానందము కలుగువార్తను
తెచ్చితివీవు ధన్యుడనైతిని
లక్షగోవులు, నూరుగ్రామములు
కాన్కగ నిచ్చితి గ్రహించుమయ్యా!

అందములొలికే సుందరాంగులను
అలంకారముల వెలుగు కన్యలను
సత్కులయుతలను పదారుమందిని
ఒసగెదనీకు భార్యలుగాను.''

అమితానందము కలిగిన భరతుడు
రాముని చూడగ పరుగిడు మనసుతొ
మారుతిలో శ్రీరాముని గనుచు
ముదముగ చెప్పెను మారుతికపుడు.

॥శ్రీ రఘురాముని॥

✽✽✽

# 129 హనుమంతుడు శ్రీరాముని వృత్తాంతము భరతునకు చెప్పుట

శుభవార్తను విని భరతుడు ముదముగ
మారుతితో మది కలిపెనప్పుడు
''ప్రభువగు రాముడు వనములకేగెను
దుఃఖమునుంటిని ఇంతవరకును.

చల్లని వార్తని చెప్పితి వీవు
నిండుగ మనిషి నూరేళ్ళుంటే
సంతోషమును పొందును అనెడి
ఆర్యోక్తి యది నిజమనిపించును.

మహానుభావా! రామచంద్రుడు
కపులను ఎచ్చట కలిసెను తెలుపుము
వారితొ స్నేహము ఎటుల కుదిరెను
తెలియబరచుము'' అనుచు పలుకుచు

పవిత్రమైన ఆసనమ్మున
పావనినపుడు కూర్చొనజేయగ
పరమానందము నందిన మారుతి
పావనమూర్తికి వివరము తెలిపెను.

''తల్లివరములు వనవాసమ్ము
తండ్రి గతించుట- నీవువచ్చుట
రాజ్యమువలదని ధర్మబుద్ధితో
చిత్రకూటమున రాముని కలిసి

రాజ్యభారము వహించుమనుచు
రామచంద్రుని ప్రార్థన చేయుట
తండ్రిమాటను తలనుధరించి
రాముడు రాజ్యము వలదని పలుకుట

అంతట నీవు అంతరంగమున
అన్నరాముని ప్రతిష్ఠించుకొని
పురుషోత్తముని పాదుకలందుకు
రామరాజ్యమును ఏలు వివరము-

అంతయు నీకు చక్కగ తెలియును
నాకన్నను నీవెరుగుదు వన్నియు
పాదుకలనుగొని వెడలిన తదుపరి
విషయము తెలిపెద భరతకుమారా!

సేనతొ నీవు చిత్రకూటముకు
వచ్చుటచేత వనమున ప్రాణులు
కలత చెందినవి- అంతట రాముడు
ప్రజలకు దూరము వసించగోరెను.

తనసతి సీతతొ తమ్మునితోను
దండకాటవికి చేరెను అపుడు
మత్తేభములతొ క్రూరమృగములతొ
చిక్కగనున్నది దండకవనము.

దండకవనిలో సాగుచుండగా
విరాధుడను నొక రాక్షసుడపుడు
గిరివలె నిలచెను దారికడ్డముగ
రామలక్ష్మణులు వానిని కూల్చిరి.

విరాధు నంతము చేసిన వీరులు
రామలక్ష్మణులు సీతాదేవితొ
ముందుకుసాగి సాయంసంధ్యకు
శరభంగాశ్రమ తావుకుచేరిరి.

రమణీయంబగు ఆశ్రమ మందు
పుణ్యమూర్తి శరభంగుని గాంచిరి
రామదర్శనము చేసుకు ఆ ముని
స్వర్గము చేరుట చూచిరి వారు.

అచ్చటనున్న తపోధనులకు
వందనమిడి ఆశీస్సులనంది
జనస్థానమును చేరిరి వారు
పంచవటిని వసియించసాగిరి.

సీతారాములు లక్ష్మణమూర్తి
పంచవటిని వసియించు సమయమున
శూర్పణఖయను రక్కసి ఒకతె
పుంసాంమోహన రూపునిగాంచెను.

రాముని వద్దకు చేరిన వెకిలి
సీతాదేవిని చంపనెంచగా
అన్న ఆనతిని లక్ష్మణమూర్తి
ముక్కుచెవులు తెగకోసె రక్కసికి.

అంతటఅచ్చటి రక్కసి మూక
పదునాల్గువేలు శ్రీరామునిపైబడ
ఒక్క రాముడే మూడు ఘడియలలో
అంతముచేసెను అంతమందినీ!

అసురవీరులను వారినాయకుల
ఖరదూషణులను కూల్చెను రాముడు
అది గాంచిన ఆ వికృత రూపి
నేరుగ ఏడ్చుచులంకకు పోయెను.

లంకలోనున్న ప్రియ సోదరునకు
రావణాసురుని కంతయు చెప్పెను
చెల్లిమాట వినిమూర్ఖరావణుడు
జనస్థానముకు వచ్చెను వెంటనె.

తన భృత్యుడగు మాయలమారి
మారీచునితో పథకము వేసి
రత్నమయమగు బంగరు మృగముగ
ఆ మారీచుని నిలబడమనెను.

అందములొలికే మృగము అప్పుడు
సీతాదేవి ముందరతిరిగి
ఆమె మనస్సునుఆకర్షించెను
కోరెను మృగమును జనకనందిని.

మృగమును పట్టగ రామచంద్రుడు
వెంబడించెను, పరుగిడె మృగము
ఎంతోదూరము సాగెను రాముడు
అందలేదు ఆ మాయమృగమ్ము.

భరతకుమారా రాముడు సాగెను
విసిగిన రాముడు విడచె నమ్మును
రాముని వెంబడి లక్ష్మణమూర్తియు
సాగెను- దుర్విధి దాటనశక్యము.

రామలక్ష్మణులు లేని సమయమున
రావణాసురుడు కపటవేషమున
అంగారకుడా రోహిణి గొనినటు
సీతాదేవిని అపహరించెను.

అబలహర్తను జటాయువీరుడు
అడ్డుకొనెను ఆ తల్లిని కావగ
అసురుడు పోరెను ఎంతోసేపు
జటాయునంతము చేసిసాగెను.

ఋష్యమూకమున వసించు కపులము
అంబరవీధిని అసురుడు గొనిపో
అమ్మనుగాంచి తికమకపడితిమి
లంకకు చేరెను రావణాసురుడు.

బంగరు గృహమున జానకినుంచెను
ప్రలోభపెట్టెడి మాటలాడెను
గడ్డిపోచవలె రావణాసురుని
తృణీకరించి మైథిలి పలికెను.

ఆగ్రహమంది రాక్షసరాజు
అశోకవనిలో అమ్మనుంచెను
అచ్చట రాముడు మాయమృగమ్మును
అంతముచేసి మరలెను వెనుకకు.

ఆశ్రమతావుల కూలినయట్టి
అనఘుని జటాయు గాంచెనురాముడు
అమితదుఃఖమున కుమిలిపోయెను
ఆశ్రమమందు జానకిలేదు.

అనుజుడు లక్ష్మణమూర్తితొ రాముడు
ఆపుణ్యాత్ముడు, పక్షిరాజుకు
అగ్నికార్యమున మోక్షమునిడెను
అన్నదమ్ములు వెదుకసాగిరి.

అడుగుల నడచిన లక్ష్మణమూర్తితొ
అడవులు గిరులు నదీతీరములు
అమ్మను వెదకుచు తిరుగుచుండగా
అచటొకభీకర వనమునందున

అతిభీకరుడు కబంధుడనునొక
అసురుడువారిని కరములగ్రహించ
దనుజుని చంపిరి- శాపము తీర్చిరి
ఆతడు వారికి త్రోవచూపగా

రామలక్ష్మణులు పంపాతీరము
ముదముగ చేరి భక్తురాలగు
శబరికి మోక్షము ప్రసాదించిరి
ఋష్యమూకగిరి చేరిరి వారు.

ఋష్యమూకమున సుగ్రీవునితో
చెలిమిచేసెను రామచంద్రుడు
సూర్యకుమారుని అన్నగు వాలిని
వధింతునని శ్రీరాముడు ప్రతినిడి

కోలనేసి ఆ వాలిని కూల్చి
సుగ్రీవుని కపిరాజుగ నిలపెను
రాముని మిత్రుడు మా మహారాజు
రామసేవకై వీరులనంపెను.

సీతాన్వేషణ చేయుటకొరకై
లెక్కకు చిక్కని వీరులనంపెను
నాల్గుదిక్కులలొ వానరవీరులు
వెదుకసాగిరి పుణ్యమూర్తికై.

దక్షిణదిశలో వింధ్యను దాటి
దక్షిణమ్ముగా సాగిన మేము
సీతాన్వేషణ గడువు దాటెనని
వంతలొనుండగ పుణ్యవశమున

జటాయువునకు అగ్రజుడైన
సంపాతి పూజ్యుని దర్శించితిమి
లంకలొ రావణు చెరలో సీత
ఉన్నటు తెలిపెను ఆ సంపాతి.

కడలి దాటుట ఎటులోయన్న
దిగులుతొనున్న కపిసోదరుల
వంతతీర్చగ విజృంభించితి
రామనామమున ఎదిగిపోతిని.

అవలీలగను నూఱామడల
వారిధిదాటి లంక చేరితి
అందు వెదకితి - అశోకవనిలో
అమ్మను గాంచితి- రాముని చలవ.

ఆశ్రమసీమలొ ధరించినట్టి
అదే వస్త్రమున ఆ శీలవతి
అన్నపానములు వదలి - కృశించి
అసువులుంచినది రామశ్వాసతో.

అమ్మనుగాంచితి జన్మతరించెను
అంగుళీయకము ఆనవాలుగా
అందించితిని కుశలము తెలిపితి
ఆనవాలుగా చూడామణిగొని

అమ్మ క్షేమమును ప్రభువుకు తెలిపి
ఆనవాలును అర్పించితిని
అవనిజ కుశలము రాముడు వినెను-
అనఘుని కౌగిలి నాకు లభించెను.

అసువులు పోయే తరుణములోన
అమృతపానము అసువులుంచినటు
అవనిజ క్షేమము రామచంద్రునికి
అమితానందము కలిగించినది.

వీరవరేణ్యుడు విజృంభించెను
రావణు వధకై బయలుదేరెను
ప్రళయకాలమున కాల్చు అగ్నివలె
రిపు సంహరణకు నిలచెను రాముడు.

వానరసేనతొ కడలిని గాంచి
నలుని సాయమున సేతువుకట్టి
మమ్ము చేర్చుకొని లంకకుచేరి
లంక ముట్టడి చేసెను రాముడు.

కుంభకర్ణుని రాముడు కూల్చెను
ప్రహస్తు నసురుని- నీలుడు రాల్చెను
ఇంద్రజిత్తును చీల్చె లక్ష్మణుడు
అంతట రాముడు త్రుంచె రావణుని.''

॥శ్రీ రఘురాముని॥

❋❋❋

# 130 సీతారామలక్ష్మణులు నంది గ్రామము చేరుట

ఆంజనేయుడు తన్మయత్వమున
రామచంద్రుని విజయవార్తను
ఆగమనమ్మును తెలియబరచగా
భరత, శత్రుఘ్నులు పరవశించిరి.

భరతుడు వెంటనె శత్రుఘ్ననకు
ఆదేశించెను పొంగిన గుండెతొ :
''తమ్ముడా విను! అయోధ్యలోని
దేవాలయములు అలంకరించుడు

అందలి దేవతలందర కిపుడే
పూలహారముల పూజలు సలుపుడు
సుగంధ ధూపము లర్పించుకొని
మంగళవాద్యపు సేవలు చేయుడు

భూసురోత్తముల పూజలు సలుపుడు
పౌరాణికులు, స్తోత్రపాఠకులు
వందిమాగధులు, వేత్రహస్తులు
వాద్యగాండ్రును, వైతాళికులు

నాట్యకోవిదులు మంగళస్త్రీలు
శుభకరంబుగ రామప్రభువును
దర్శించగను రప్పించవలె
దివియే నేలకు దిగినటు చేయుము.''

అన్న ఆనతిని అనుంగు తమ్ముడు
శత్రుఘ్నుడు తా స్వయముగ సాగి
నందిగ్రామము అయోధ్య మధ్యలొ
బాటను చక్కగ సరిచేయుటకు

చల్లని జలమును జల్లుటకొఱకై
పూలు, లాజలు చల్లుటకొరకు
వేలమందిని నియోగించెను
అమరపురికి సరి కావలెననెను.

రాజ వీధులలొ కూడలులందు
పతాకాలను ఎత్తగ చెప్పెను
ప్రతి గృహమపుడు మంగళకరముగ
అలంకరించగ ఆనతినిడెను.

పూలుజల్లుచు దండలుకట్టి
రంగవల్లులతొ అలంకరించి
అయోధ్యలోన రాజవీధులు
కళకళలాడగ నాదేశించెను.

సూర్యోదయము కాకపూర్వమే
అయోధ్యనుండి దశరథ విభుని
రాణులు ముగ్గురు- అమాత్యవర్యులు
సేనాధ్యక్షులు-వారి భార్యలు

రాజ ముఖ్యులు విప్రోత్తములు
రామ దర్శనము చేయుటకొర్కై
బయలుదేరిరి నందిగ్రామము
శోభగ వెలిగెను చిన్నిగ్రామము.

ధృష్టి, జయంతుడు, మంత్రపాలుడు
అర్థసాధకుడు, అశోకుడున్ను
సిద్ధార్థుడును, సుమంత్రుడున్ను
అమాత్యవర్యులు ఆనందముగ.

అలంకరించిన గజరాజములను
అధిరోహించి సాగిరి అపుడు
రాజ ముఖ్యులు కొందరు అపుడు
సాగిరి వెంబడి గజముల నెక్కి

మహారథులు తమ రథముల నెక్కిరి
శక్తులు, అష్టులు, బల్లెములుగొని
వీరులు సాగిరి విజయగర్వమున
ధ్వజములతో కాల్బలము సాగెను

కౌసల్యయును సుమిత్రదేవి
వారితొబాటు కైకాదేవి
అలంకరించిన వాహనమ్మును
అధిరోహించి సాగిరి అపుడు.

శంఖ దుందుభులు మ్రోగుచుండగా
వంది మాగధులు వెనుకనుండగా
మంగళగానము సాగుచుండగా
ధర్మమూర్తియగు భరతుడు సాగెను.

నారవల్కలము ధరించినాడు
కృష్ణాజినము వెలుగుచున్నది
కృశించినట్టి శరీరమ్ముతో
రామపాదుకలు శిరమున దాల్చి

తెల్లని విరిసర శోభితమైన
శ్వేతఛత్రము వింజామరలతొ
రామ దర్శనము చేయుటకొరకై
భరతుడు భక్తిగ సాగుచుండెను.

రాజపురుషులు తోడుగ నడువగ
పూలదండలు మోదకమ్ములతొ
అమాత్య, వర్తక, విప్రులు భక్తిగ
భరతుని వెంబడి నడువసాగిరి.

వెలుగు పూర్తిగా వచ్చినదపుడు
రామదర్శనము చేయుటకొరకై
నిరీక్షించగ ఆతృత పెరిగెను
భరతుడు అపుడు ప్రక్కనవున్న

వాయునందనుని చూచి పలికెను :
"పవనకుమారా! పూజ్యుడు ఇంకను
వచ్చెడి జాడ కనబడకున్నది
కపులు సైతము కనబడరేల?

నాయన హనుమా! కపి సహజమగు
చపలచిత్తముతొ- రామాగమనము
కపి చేష్టగ నువు చెప్పలేదుగద!"
అనుచు అడిగెను సందియమ్ముతో.

అది విని పావని ఆలోచించెను
ఆలస్యమునకు హేతువు నుడివెను :
"అయ్యా! త్రోవలొ తరువులన్నియు
అమోఘ ఫలముల తేనెలు కురియును.

రాముని వరమున భరద్వాజముని
అనుగ్రహించెను ఫలసమృద్ధిని
అమరేంద్రుడును కపుల త్రోవలలొ
అనుగ్రహించెను మధుర ఫలములు.

ఫలభరితములగు తరువులగాంచి
శాఖామృగములు ఎగబడుగావున
ఆలస్యమునకు కారణమదియగు
తుమ్మెద ఝుంకారమ్ములు వినుము.

భరద్వాజముని ఆతిథ్యమునకు
రామచంద్రుడు సమ్మతించెను
అందుకు ఆగెనుఆశ్రమమందు
అదికారణమగు ఆలస్యమునకు

వినుహరాజా! కపుల సవ్వడి
భీకర గర్జన కోలాహలము
వానర సేనలు గోమతితీరము
దాటుచున్నవని తలంతునేను

నింగికి ఎగసిన ధూళిని గనుము
ధూళిమేఘమ్మై కమ్ముకున్నది
వాలుకి నదిని దాటుచుండవలె
సాల వనములో ప్రవేశించవలె.

అదిగో గనుము! అంబరవీథిని
చంద్రబింబమును పోలు విమానము
దివ్యవిమానము పుష్పకమదియే
దేవవిమానము అపూర్వమైనది.

విశ్వకర్మ నిర్మించి పుష్పకము
విరించికిచ్చెను- దానిని అతడు
ధనపతికిచ్చెను- రావణుడపుడు
కుబేరునుండి గ్రహించె బలముతొ.

దేవవిరోధిని రామచంద్రుడు
సబాంధవముగా అంతముజేసి
ఆ విమానమును అధిరోహించి
వచ్చుచుండెను మంగళకరముగ.

సూర్యకాంతులతొ వెలుగు విమానము
మనోవేగమున వచ్చుచున్నది
అరుగో వారే సీతారాములు
అందుగాంచుము లక్ష్మమూర్తిని.

తేజోవంతుడు వానరరాజు
రాక్షసతేడు విభీషణాఖ్యుడు
వారిప్రక్కగా కూర్చొనియుండిరి
అనుచు మారుతి చూపెను వారిని

మారుతి అటుల చెప్పుచుండగా
అందరుగాంచిరి పుష్పకమ్మును
అంతులేని ఆనందమునిండి
అడుగో ప్రభువని అరచిరి ముదమున.

అడుగో రాముడు! వచ్చుచుండెను
అయోధ్యరాముడు వేంచేసెనని
అమ్మసీతతో వచ్చుచుండెనని
జనులందరును అరచుచుండిరి.

వాహనమ్ములను దిగిరి వీరులు
నేలను నిలబడి ప్రభువు రాకకై
ఎన్నో కన్నులుచేసుకు నిలిచిరి
నింగిని శశివలె రాముడు కనబడె.

ధరణికి దిగెడి పుష్పకమ్ము గని
రామచంద్రుని గాంచి భరతుడు
''అన్నా! నీవు ప్రతిన తీర్చుకొని
అడుగిడితి వయా అయోధ్యలోన''

అనుచు ముదమున కనులు చెమర్చగ
కరములు మోడ్చి భక్తి వినయమున
స్వాగత వచనము పలికె నన్నకు
పులకరించిన గొంతుతో పలికెను

విశాలనేత్రుడు విశ్వమోహనుడు
విరాజిల్లెను దేవేంద్రునివలె
మేరువుపైన సూర్యబింబమై
భాసిలెనందరి ముఖముల వెలుగై.

హంసప్రతిమల తేజరిల్లెడి
దివ్యవిమానము నేలకు దిగినది
భరతుడు వెంటనె విమానమెక్కెను
అన్న పదముల సాష్టాంగపడె.

ఎంతో కాలము గడచిన పిదప
తమ్ముని గాంచిన రామచంద్రుడు
కరములనెత్తి కౌగిలించుకొని
గుండెకు హత్తుకు పులకరించెను.

భరతుడంతట లక్ష్మణమూర్తిని
పలుకరించెను ప్రేమాదరణల
తదుపరి భరతుడు పేరు చెప్పుకొని
వదిన సీతకు వందనమిడెను.

భరతుడంతట రామభక్తులను
సుగ్రీవాంగద జాంబవంతులను
నీలుని, శరభుని, వృషభ వీరులను
పనస, సుషేణుల పలుకరించుచు

ఆనందముగా యోధులందరిని
కౌగలించుకొని గౌరవించెను
మనుజరూపమున నున్న వానరులు
మనసు కలిపి మాటాడిరి అపుడు.

భరతుడు తిరిగి కపిరాజును గని
కౌగలించుకొని పలికెను ప్రియముగా :
''ఓ సుగ్రీవా! మా సోదరులలో
ఐదవ వాడవునీవైతివయా!

అక్కరలో మనప్రక్క నిలచినచో
స్నేహితుడగును నీకు తెలియును
ఆపదలో మరి హాని చేసినచొ
శత్రువాతడగు నిస్సందేహము.''

అంతట భరతుడు విభీషణునిగని
''స్నేహితుడా! నువు దైవవశమున
నా అగ్రజునికి సాయపడితివి
దుష్కర కార్యము చేయించితివి''

అనుచు ప్రియముగ సంభాషించెను.
అంతట తమ్ముడు శత్రుఘ్నుడట
అన్నలిద్దరికి నమస్కరించి
అవనిజ పదముల మ్రొక్కె వినయముగ.

కోదండరాముడు-కృశించియున్న
కౌసల్యమ్మనుగాంచి ముదమున
సాష్టాంగముగ నమస్కరించెను
పదములు కడిగెను వేడి బాష్పముల.

రాముడంతట సుమిత్రమ్మకు
కైకమ్మకును నమస్కరించి
వశిష్ఠమహాఋషి పాదపద్మముల
సాష్టాంగముగా ప్రణామమిడెను.

అయోధ్యపౌరులు ఆనందముగా
ముడిచిన కరముల వందనమిడుచు
స్వాగతవచనము పలుకుచుండగా
చల్లని చూపుల చూచెను రాముడు.

ధర్మవిదుడగు భరతుడప్పుడు
స్వయముగ రాముని పాదపద్మముల
రాజ్యమేలిన స్వర్ణపాదుకలు
భక్తిగతొడిగి పలికె వినయముగ :

''ఓ మహారాజా! నీ రాజ్యమును
ఇల్లడమ్ముగా కాపాడితిని
అయోధ్యకీవు తిరిగి వచ్చితివి
అప్పగించితిని రాజ్యము తిరిగి.

కోరిక తీరెను-జన్మతరించెను
కోసల భూపతి సేవచేసితి
ఓ మహారాజా! నీ రాజ్యమును
చక్కగ తిరిగిచూచుకోవయా!

ధాన్యాగారము కోశాగారము
సైన్యసంపద చూచుకోవయా!
నీ దయవలన సంపదలన్నీ
పదిరెట్లుగను పెంచితినన్నా!''

భరతుడు అటుల రామచంద్రునికి
రాజ్యమునిచ్చి పలుకుచుండగా
భరతునిగాంచి కపులందరును
విభీషణుండు పులకితులైరి.

అంతట రాముడు ఆనందముగా
ఒడిలో భరతుని కూర్చొనబెట్టుకు
హితులందరితో పుష్పకమ్ముపై
భరతుని ఆశ్రమ సీమను చేరెను.

నందిగ్రామమున భరతాశ్రమమున
కోదండరాముడు హితులందరితో
పుష్పకమ్ము దిగిపాద పద్మములు
ధరణి నుంచెను-పొంగెను పుడమి.

రామచంద్రుడు మృదుమధురముగా
పలికెనప్పుడు విమానమ్ముతో
''దివ్య విమానమ! ఆనతి నిడితిని
ధనపతి సేవను తిరిగి చేయుము.''

రాముని ఆనతి నంది విమానము
ఆనందముతో తన నాయకుడగు
ధనపతి చెంతకు చేరుటకొరకై
ఉత్తరదిశలో సాగెవేగముగ.

దేవగురునికి వందనముంచి
కూర్చొనబెట్టిన ఇంద్రునితీరుగ
వశిష్ఠ మహాఋషి పదముల మ్రొక్కి
కూర్చొనబెట్టెను రామచంద్రుడు.
॥శ్రీ రఘురాముని॥

❇❇❇

## 131 శ్రీరామ పట్టాభిషేకము

దేవ విరోధిని అంతము చేసిన
విజయమూర్తి శ్రీరామచంద్రునితొ
భరతుడు పలికెను భక్తివినయముల
అంజలి యొగ్గి అన్నతొ పలికెను :

''అన్నా! నీవు వనవాసముతో
అమ్మ మాటను గౌరవించితివి
అయోధ్య రాజ్యము నాకు ఒసగితివి
అది నీకిప్పుడు అప్పగించెదను.

బలమగు,వృషభము,మోయు, భారమును
లేగదూడ తా మోయలేదయా!
రాజ్య పాలనము అనెడి భారమును
భరించు శక్తి నాకు లేదయా!

జల ప్రవాహము అధికముకాగా
గండ్లు పడినఒక ఆనకట్టను
తగు బలమ్ముతో ఆపగవలెను
అంతటి పనియే రాజ్యపాలనము.

రాజ్యపాలనకు సమర్థుడవు నువు
అసమర్థుడను నేనని తెలియును
హంస మాదిరిగ కాకి ఎగరదు
అశ్వపు పరుగు ఖరముకు రాదు.

మానవనాథుడ వీవేనయ్యా!
మహితమూర్తివి నే నీవేనన్నా!
మంగళకరముగ భూమినేలెడి
శక్తిమంతుడవు నీవే స్వామీ!

చెట్టునాటి మరి రక్షణ చేయగ
బలముగ ఎదిగి విస్తరించి అది
వలయు ఫలముల పూల నిడనిచో
ఎంతటి వేదన కలుగునొ అటులే-

నీవు మమ్ములను పాలించనిచో
అంతటి వ్యథకు లోనయ్యెదము
కావున రామా! నీ భక్తులము
భృత్యులమయ్యా! మము పాలించుము.

రామా! నీవు పట్టము కట్టుకు
నింగిని వెలిగే రవిగా భాసిల
లోకమంతయు తిలకించవలె
లోకమంతటిని పాలించవలె.

భీకరాటవిని మృగముల అరపుల
మేలుకొంటివి ఓ నరపుంగవ!
ఇంతటినుండి మంగళ స్వనముల-
సంగీతమునకు నిద్రలేవవలె.

జ్యోతిశ్చక్రము తిరుగు వరకును
భూమి చల్లగా నిలచువరకును
ప్రభువుగనీవు పాలించవలె
రామరాజ్యమిల రాజిలవలెను.''

భరతుని మాటకు రామచంద్రుడు
చిరునవ్వును సంధించగనంత
పరవశించిరి- రామభక్తులు
తమ్మేలునని మురిసిపోయిరి.

శత్రుఘ్ను నానతినందిన భృత్యులు
క్షురకులు వచ్చిరి రామసేవకై-
పట్టాభిషేక సమయమ్ము నకై
జడలను విప్పి తీర్చిదిద్దిరి.

భరతుడు ముందుగ శుభకరముగను
మంగళస్నానము నాచరించెను
లక్ష్మణ, సుగ్రీవ, విభీషణులును
మంగళ జలముల స్నానము చేసిరి.

జడలు కట్టిన కేశమ్ములకు
చిక్కులు తీసిచక్కగ దువ్వగ
చక్కని రాముడుపరిమళ జలముల
మంగళస్నానము నాచరించెను.

చందనాదులు అలదిరి భక్తిగ
సుమహారముల వస్త్ర భూషల
మోహనమూర్తిని అలంకరించిరి
అందరికన్నులు రామునిమీదే.

శత్రుఘ్నుడు తను స్వయముగ నిలచి
అన్నలందరికి స్వర్ణభూషలు
అలంకారముల చేయించుచును
ఆనందముతో పులకితుడయ్యెను.

దశరథ విభుని రాణులు ముగ్గురు
ఆప్యాయముగా సీతాదేవికి
మంగళస్నానము అలంకారములు
చేయించిరిమది పులకరింతతో

వానరాంగనల కందరకపుడు
సంతోషముతో కౌసల్యమ్మ
అలంకారములు చేయించగను
ఆనందించిరి కపిస్త్రీలందరు.

శత్రుఘ్ను నానతినంది సుమంత్రుడు
అలంకరించిన దివ్యరథమును
సూర్యమండలము పోలురథమును
రామచంద్రుని ముందు నిలపెను.

రాముడు రథమును అధిరోహించగ
నూత్న వస్త్రముల కుండలాలతో
ఇంద్రతేజమున హనుమ సుగ్రీవులు
రథము వెంబడి సాగిరిభక్తిగ.

దశరథ విభుని దేవేరులును
మంత్రులందరు ముందుగసాగి
అయోధ్యచేరిరి ఆనందముగా
ఆహ్వానించిరి హితులందరినీ.

సచివోత్తములగు అశోకుడున్ను
విజయుడు సుమంత్రులను వారపుడు
వశిష్ఠమహాఋషి పదములనంటి
పట్టాభిషేకము తెలియబరచిరి.

పట్టాభిషేకము చేయుట కొరకై
చేయవలసిన శుభకార్యములను
విధివిధానముగ చేయించమని
వశిష్ఠమౌనిని కోరిరి వారు.

బ్రహ్మ ఋషిని వారందరు కోరి
రామచంద్రునికి ఎదురుకోలుగా
అయోధ్యరాముని ఆహ్వానించగ
బయలుదేరిరి మంగళకరముగ.

ఆకుపచ్చని హయముల రథమును
అధిరోహించిన దేవేంద్రునివలె
అరదము నెక్కి రామచంద్రుడు
అయోధ్య నగరికి వచ్చుచుండెను.

భరతుడురథమును తోలుచుండగా
వెల్లగొడుగు శత్రుఘ్నుడందగా
మంగళకరమగు-చామరమ్ముతో
ముదముగ వీచుచు లక్ష్మణుడుండగ

రాక్షసరాజు విభీషణాఖ్యుడు
శశినిబోలుఒక వింజామరతో
రామప్రభువుకు వీచుచుండగా
దేవగణంబుస్తోత్రము చేసిరి.

పర్వతమంతటి మదకరీంద్రము
శత్రుంజయమను ఏనుగు నెక్కి
వానరనాథుడు సుగ్రీవుండు
అరదము వెంట సాగెను ముదముగ.

మనుజ రూపముల అలంకారముల
వేలకొలదిగా వానర వీరులు
కరివాహనములు అలంకరించి
అయోధ్య త్రోవలొ సాగిరి వెనుక.

మనోహరమ్ముగ మంగళ స్వనములు
శంఖ దుందుభుల ఘోష లెగయగా
పురుషోత్తముడు రామచంద్రుడు
మంగళమూర్తి చేరె నయోధ్యకు.

మంత్రులందరు ముందుకు వచ్చి
ఆశీర్వాదము లిడిరిరామునకు
మంత్రులందరకు అభివాదములిడి
పూర్వభృత్యులను పలుకరించెను.

సచివులు, ప్రజలు, విప్రోత్తముల
నడుమ, రాముడు-తారల నడుమ
చంద్రబింబమై ఒప్పుచుండగా
రామచంద్రునికి నమస్సులిడిరి.

చతుర్విధములగు వాద్యమ్ములతో
స్వస్తి పలుకుచు-తాళ వాద్యముల
తామర పూవులుచేత ధరించి
మంగళగానము చేయుచు ముందుగ

హరిత వర్ణమగు అక్షతలందుకు
విప్రోత్తములు- కన్యలు ముదముగ
పరవశమ్మున ముందు నడచిరి
రాముడు మెల్లగ హితులతొ నడచుచు

సుగ్రీవునితో చెలిమి చేయుట-
హనుమ చేసిన మహిత కార్యము
వానర వీరుల ఘనకార్యములు
రాక్షస యోధులబల విక్రమములు

విభీషణాఖ్యుడు శరణు పొందుట
మొదలగు విషయములన్నీ ముదముగ
సచివులతోను ముచ్చటించుచు
మెల్లగ సాగెను చల్లని చూపుల.

రాముని వలన విషయము తెలిసి
సంబరపడిరి సచివులు హితులు
వానర వీరులు వెంట నడువగా
మంగళమూర్తి చేరె నయోధ్య.

అయోధ్య చేరిన విజయ రాఘవుడు
పితృ పితామహ దత్తము అయిన
రాజభవనమున ప్రకాశించెను
రామ కాంతితో వెలిగె భవనము.

రాజభవనమున రామచంద్రుడు
భక్తిగ మ్రొక్కెను తన తల్లులకు
చెంతనె వున్న ధర్మకోవిదుని
భరతుని గాంచి పలికెను అపుడు :

''అయోధ్యలో మన అశోకవనమున
సుందర సదనము- అలంకరించి
మణిమయ శోభితమగు భవనమును
విడిదిగ నిమ్ము సుగ్రీవునకు.''

అన్నమాట విని అతిమర్యాదగ
దివ్యభవనమున విడిది చేయుటకు
వానరరాజును చేర్చగ నపుడు
సుఖముగ నాతడు విడిది చేసెను.

అంతట భరతుడు వానరరాజుతొ
అభిషేకమ్మును చేయుట కొరకై
సంద్ర జలములు తెప్పించమన
వానర రాజు ఆనతి నిడెను.

కపి వీరులను నల్గుర బిలచెను
రత్నమయములగు స్వర్ణకలశములు
వారికియిచ్చి సంద్ర జలములు
సూర్యోదయముకు పూర్వమె తెమ్మనె

సంద్రజలముకై వేచియుందురని
వేగమె రమ్మని ఆనతినిడెను
సుగ్రీవాజ్ఞ తెలియునువారికి-
రామసేవ పరమార్థమువారికి.

కరులనుబోలు వానరవీరులు
గరుత్మంతుని వేగము గలిగి
నింగి కెగిరిరి ఆనందముగా
రామసేవలో పులకరించిరి.

# శ్రీరామ పట్టాభిషేక ఘట్టము

## జానకి రాముల పట్టాభిషేకము
## జగమంతటికి నయనానందము.

జానకి సహితుడు రామచంద్రుని
రత్నమయమగు ఆసనమ్మున
అయోధ్య నేలెడు సింహాసనమున
కూర్చొనబెట్టిరి మంగళకరముగ.

వృద్ధుడు వశిష్ఠు డందరి ముందు
ఎందరొ భూసురులుండిరి అందు
సుయజ్ఞుడు మరి కాత్యాయనుడు
వామదేవుడు కాశ్యపు డుండిరి.

ఋషిజాబాలి గౌతము డుండిరి
విజయుడు కలిపి ఎనిమిదిమంది
అష్టవసువులు దేవరాజుకు
అభిషేకించుట తలపుల నిండగ.

పురుషసింహుడగు రామప్రభువును
పరిమళజలముల నభిషేకించగ
తీరుగభూసురు లందరు అపుడు
మంత్రులు యోధులు అభిషేకించిరి.

ఎందరొ ఋత్విక్కులు అందరును
అభిషేకించిరి మంత్రయుక్తముగ
కన్యలుకూడా అభిషేకించిరి
కన్నులపండుగ అయినది పండుగ.

దిక్పాలకులు దేవతలందరు
దివ్యములయిన ఓషధి రసముల
అభిషేకించగ, ఋషులు మంత్రములు
వేదఘోషను నింపిరి అపుడు.

వెల్లగొడుగును శత్రుఘ్నుడందగ
వానరరాజు సుగ్రీవుడంతట
తెల్లని వింజామరతో ప్రభువును
వీచెను, గుండెలు పొంగెను హనుమకు.

అసుర భూపతి విభీషణాఖ్యుడు
మరియొక వింజామరతో వీచెను
వాయుదేవుడు ఇంద్రుని కానుక
స్వర్ణకమలముల మాలను యిచ్చెను.

సర్వరత్నముల సమాయుక్తమగు
మణిమయ శోభితమగు నొక హారము
సురపతి పంపగ వాయుదేవుడు
ప్రభువగు రాముని కిచ్చెను అపుడు.

సుర గంధర్వులు గానము చేసిరి
అచ్చర కన్యలు నాట్యము చేసిరి
పట్టాభిషేక సమయమునందు
నేలనిండుగా నవ్వేనుపంటతో.

॥జానకిరాముల పట్టాభిషేకము॥

కీర్తిమంతుడు రిపుభయంకరుడు
శ్రీరఘురాముడు సంతోషముతో
తమ్ముడు లక్ష్మణు చూచి తీరుగా
పలికెను ఎంతో ప్రియముగ నపుడు.

''సోదర లక్ష్మణ- యీ భూభారము
పూర్వీకులు బల విక్రమములతో
తీరుగ మోసిరి దానిని యిపుడు
యువరాజుగ నువు మోయుము నాతో''

సౌమిత్రపుడు ముందుకు రాక
సమ్మతి నివ్వక మిన్నకుండగ
రాజు- భరతుని ప్రియముగ పిలచి
అభిషేకించెను యువరాజుగను.

రాజోత్తముడు శ్రీరఘురాముడు
అశ్వమేధమును- పౌండరీకమును
వాజపేయమును తీరుగ చేసి
ఎన్ని యాగములొ అన్నీ చేసెను.

పురుషోత్తముడు పుడమిని ఏలెను
చల్లగ పదివేలగు వర్షములు
భూరిదక్షిణలు రాముడు యిచ్చెను
అశ్వమేధములు నూరు చేసెను.

ఆజానుబాహుడు భుజబల తేజుడు
అతి పరాక్రముడు శ్రీరఘురాముడు
తమ్ముడు లక్ష్మణుడుండగ తోడు
పుడమిని ఏలెను పుణ్యచరితుడు.

రామరాజ్యమున గల స్త్రీలందరు
వైధవ్యము నసలెరుగరు వారు
దుఃఖము లేక రోగములుండక
క్రూరమృగముల బాధలు లేవు.

చోరులు లేరు కష్టములెరుగరు
అకాలమరణము లసలే లేవు
కనుకనె వృద్ధులుపిన్నవారికి
ప్రేతకార్యములు చేయుట ఎరుగరు.

రామరాజ్యము చల్లని రాజ్యము
ఎల్లరి మనసుల దోచెను రాముడు
కావున రాముని తలచుచు జనులు
తమలో తాము స్పర్ధలు మరచిరి.

తల్లుల కడుపులు పండగ నపుడు
కలిగిరిఎందరొ సుందర శిశువులు
కడుపు పంటలు దీర్ఘాయువుతో
చల్లగ నుండిరి కడుపు చల్లగా.

ప్రజలందరకూ ప్రభువగు రాముడు
జగమంతటికీ దేవుడు రాముడు
రాముడు- రాముడు- రామచంద్రుడు
నిండెను పుడమి రామనామముతొ.

రామరాజ్యమున తరువులు విరసి
ఫలపుష్పముల శోభలీనగా
వర్షము తప్పక కురిసె క్రమముగా
వాయువు వీచెను సుఖములు కలిపి.

॥జానకిరాముల పట్టాభిషేకము।

జాంబవంతుడు హనుమంతుడును
ఋషభవీరుడు–వేగదర్శియు
కనక కలశముల– ఐదువందల
నదుల జలమును తెచ్చిరి అపుడు.

వాయువేగమున సాగిన గవయుడు
పశ్చిమ సంద్రపు శీతల జలములు
మంగళకరముగ రామసేవకై
తీసుకువచ్చి నిలచెను భక్తిగ.

రత్నశోభిత కనక కలశమున
పూర్వ సంద్రపు జలమునప్పుడు
సుషేణువీరుడు అతిభక్తిగను
అభిషేకముకై తీసుకువచ్చెను.

ఉత్తర సంద్రపు జలమునంతట
నలుడు తెచ్చెను బంగరు పాత్రతో
ఆ విధముగను మంగళజలములు
అమరెను వెంటనె శుభకార్యముకై.

దక్షిణ సంద్రపు జలమునప్పుడు
కనక కలశమున గ్రహించిఋషభుడు
రక్తచందన తరు పత్రమ్ములు
మూతగవేసి తీసుకువచ్చెను.

శత్రుఘ్నుడంతట వశిష్ఠమునికి
పుణ్యతీర్థములు వచ్చినవనుచు
విన్నవించగా అభిషేకమ్మును
వశిష్ఠ మహఋషి ఆరంభించెను.

❋❋❋

**శ్రీరఘురాముని రమ్యచరితము**
**శ్రీపతి నరుడై వెలసిన చరితము**
**శ్రీరాముడు దశకంఠుని దునిమి**
**శ్రీనిగ్రహించుట యుద్ధకాండము.**

❋❋❋

**మంగళం.**

శ్రీరామ పట్టాభిషేక ఘట్టము

పుణ్యచరితమును శ్రద్ధగ చదివి
నియమము తప్పక వినినవారికి
కీర్తి కలుగును తేజము కలుగును
సోదరప్రేమ పెరుగును చక్కగ.

కవికోకిల వాల్మీకి వ్రాసిన
రామాయణమును వ్రాయించగను
శ్రద్ధతొ ఎవ్వరు ముందుకు వత్తురొ
శుభములు-జయములు కలుగును వారి

శ్రద్ధాసక్తుల వినినవారికి
అర్థము చక్కగ నేర్చినవారికి
సర్వదేవతలు సుముఖతనుందురు.
పితృదేవతలు దీవనలిడెదరు.

ఇహపరములకు ముక్తిదాయకము
సర్వశుభముల కలుగజేయును
రామాయణమిది పుణ్యచరితము
పూజలు చేయగ దేవుని వంటిది.

జానకి రాముల పట్టాభిషేకము
జగమంతటికి నయనానందము

యుద్ధకాండమున శ్రీరామపట్టాభిషేక ఘట్టము సమాప్తము.

❈❈❈

## మంగళం

మంగళం మంగళం – వాయుపుత్ర మంగళం
ఆంజనేయ మంగళం – రామదూత మంగళం
రామచంద్ర మంగళం – జనక సుత మంగళం
సుమిత్ర పుత్ర మంగళం – భరత, శత్రుఘ్న మంగళం
కొలువుతీరు రామునకు – కోదండ ధామునకు
ఎల్ల గృహములందు ఉండి – చల్లగాను చూసేటి
రామచంద్రమూర్తికి – మంగళం – మంగళం
రామబంటు హనుమకు – మంగళం – మంగళం

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.
సర్వేజనా స్సుఖినో భవన్తు.
శుభం

❈❈❈

**సర్వం శ్రీ సీతారామచంద్ర పాదార్పణమస్తు.**

– మంగళం –

లక్ష హయములు లక్ష ధేనువులు
చక్కని వృషభము లున్నవి నూరు
పురుషోత్తముడగు రామచంద్రుడు
దానము చేసెను తీరుగవాటిని.

ముప్పదికోట్ల స్వర్ణనాణెములు
విలువగు బంగరు ఆభరణమ్ములు
వెలగల మేలగు వస్త్రము లెన్నో
భూసురోత్తములు దానములందరి.

వైడూర్యములు రత్నములుండి
వజ్రములందు పొదిగిన దానిని
కాంతులు చిమ్మెడి సుందరహారము
సుగ్రీవునికి రాముడు యిచ్చెను.

మణులు వజ్రములు అమరినయట్టి
విలువగు బంగరు భుజకీర్తులను
వాలిపుత్రునికి రాముడు యిచ్చెను
వేడుక చూడగ వచ్చిరి సురలు.

స్వర్ణభూషలు వజ్రహారములు
విలువగు వలువలు వాతాత్మజునకు
సీతామాత యిచ్చెను అపుడు
ఆనందముతో పొంగెను మారుతి.

కంఠమునున్న వజ్రహారమును
జానకి తీసిప్రభువును చూచెను
ఇంగితజ్ఞుడు విభుడు అప్పుడు
ప్రీతిగ యిమ్మనెతోచినవారికి.

వీరుడుగొప్ప తేజోవంతుడు
గుండెలో గురుతుగనిలిపినవాడు
అంతటి వేడుక కాతడుముఖ్యుడు
కావునమారుతి కిచ్చెను జానకి.

హారము దాల్చిన ఆంజనేయుడు
వెలుగులు చిమ్మెను భాస్కరు వోలె
చంద్రకాంతితో తెల్లగ మెరసే
మేఘములున్న నగమనిపించెను.

దశరథరాముడు మైందుని కపుడు
ద్వివిదుడు-నీలుడు-కపివీరులకు
వారి అభీష్టములన్నీ తెలుసుకు
ఎన్నో విలువగు కానుకలిచ్చెను.

వృద్ధవానరులు అందరు అపుడు
విలువగు భూషలు వస్త్రములెన్నో
ప్రభువు యివ్వగా అందిరి ముదమున
ఆనందముతో పొంగిపోయిరి.

వానరోత్తములు వేడుక చూచి
తీరుగ కానుకలెన్నో అంది
ప్రభువును చూచిరి తిరుగు యానముకు
చల్లని చూపుల సమ్మతించెను.

విభీషణాఖ్యుడు వేడుక చూచి
విలువగు ఆభరణమ్ములు ఎన్నో-
కులధనమును తాకాన్కగనంది
తిరిగి చేరెను లంక ఏలగా.!

॥జానకిరాముల పట్టాభిషేకము॥

చాతుర్వర్ణములందలి జనులు
బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రులు
లోభము విడచి తమ కార్యములను
తృప్తిగ చేయుచు సుఖముగ నుండిరి.

రామరాజ్యమున జనులందరును
భోగభాగ్యముల తులతూగుచును
సత్యసంధులై ధర్మము విడువక
శుభలక్షణముల శోభగ నుండిరి.

యశమునిచ్చుచు ఆయువు పెంచి
ఐశ్వర్యమును కలిగించునదగు
రాజులకందర విజయము కూర్చెడి
ఆదికావ్యమీ రామాయణమును.

కవికోకిల వాల్మీకి మహాఋషి
వ్రాసెను కమ్మగ రాముని కథను
చదివిన నరుల-వినిన అందరి
పాపములన్నీ నాశము అగును.

పుత్రుల కోరిన వారందరికీ
సంతతి చల్లగ కలుగజేయును
ఐశ్వర్యములు అందునందరికి
రాజులు రిపులను గెలుతురు ఎపుడు.

చక్కగ దీనిని వినిన స్త్రీలకు
దాశరథులతో సమమగునట్టి
దీర్ఘాయుష్కులు పుత్రులు కలిగి
తల్లిదండ్రుల యశము పెంచెదరు.

శ్రద్ధతో, శాంతము నిండగ వినిన
వారందరకగు ఎన్నో శుభములు
కష్టములన్నీ తీరును జనులకు
దీర్ఘాయువును పొందెదరందరు.

శ్రీ రఘురాముని చల్లని చూపులు
ఇచ్చును ఎన్నో వరములు నరులకు
ప్రవాసమేగిన కూరిమివారు
సంతోషముతో తిరిగి వత్తురు.

దేవతలందరు ప్రీతి నొందెదరు
గృహములనున్న ఛిద్రము తొలగి
విఘ్నములన్నీ తొలగిపోవగా
పాపవిముక్తి సుఖములు కలుగును.

రామాయణమిది ఇతిహాసమిది
పూజలనందెడి పుణ్య చరితము
వీనులవిందుగ వినుడందరును,
ఎన్నో శుభములు జయములు కలుగును

రాముని కథను వినినందరకీ
శ్రద్ధగ దీనిని చదివిన వారికి
విష్ణుదేవుడగు శ్రీరఘురాముడు
ప్రీతిగలిగి వారందర బ్రోచును.

కుంటుంబవృద్ధి సంపదవృద్ధి
అనుకూలవతి ఆలిగ దొరకి
సౌఖ్యములెన్నో కలుగును వారికి
తలచిన కార్యములన్నీ తీరును.

॥జానకిరాముల పట్టాభిషేకము॥

ఖర రక్కసుని కూల్చిన రాముడు
మధ్యభాగమును రక్షణ చేయును
జాంబవంతునికి ఆశ్రయమిడిన
రఘుపతి-నాభికి రక్షణనిచ్చును.

సుగ్రీవునాధుడు కటిని గాయును
హనుమత్ప్రభువు పిరుదుల గాయును
రాక్షసకుల విధ్వంసకుడైన
రఘుపతి రక్షలొ ఊరువులుండును.

సేతుబంధకుడు కాయు జానువులు
రావణాంతకుడు పిక్కల గాయును
విభీషణాఖ్యుని అభయ ప్రదాత
సిరికారకుడు - పదముల కాయును.

దేహమంతటికి రక్షయె రాముడు -
దీనిని పఠించు పుణ్య తత్పరుడు
చిరాయువై మరి సుఖియైయుండి
వినయ - విజయముల విరాజిల్లును.

రామనామమను రక్ష ధరించిన
పాతాళమున భూతలమందున
గగన చారులలొ కామరూపులలొ
దుష్టులకందక సుఖముగ నుందురు.

రామా- రామ- రామభద్ర రామచంద్ర
నామస్మరణ పాపహరణ చేయుచుండు
భుక్తి- ముక్తి కలుగజేయురామభక్తి
మానవాళి కిదియెనిచ్చు సర్వశక్తి.

జగతి జయించే మంత్రమిదొక్కటె
మంత్రరక్షణ కలిగిన నరుడు
ఈ స్తోత్రము కంఠస్తముచేసిన
సర్వసిద్ధులు సులభ సాధ్యములు.

వజ్ర పంజరము రామకవచము
నామస్మరణము జయమంగళము
సర్వకార్యముల విజయము తథ్యము
మాటకెదురు మరి నిలువరెవ్వరును.

శివుని కరుణచే స్వప్నమునందు
ఏవిధి వినెనో రామరక్షను
ఆ విధముగ- బుధకౌశిక మహర్షి
వ్రాసెను భక్తితొ రామరక్షను.

కల్పవృక్షములు వెలసిన తోట
ఆపదలన్నీ అణగిన చోటు
త్రిలోకముల కభిరామమైనది-
శ్రీమంతుడు-శ్రీరాముడు దేవుడు

రూపసంపదల తరుణవయస్కులు
సుకుమారులు అతిబలవంతులయి
పద్మనేత్రులు విశాలవక్షులు
నారచీరలు కృష్ణాజినముల

ఫలమూలములు తినుతాపసులు
జితేంద్రియులగు బ్రహ్మచారులు
దశరథతనయులు రామలక్ష్మణులు
సకలసాధువుల శరణాగతియగు

# నటరాజస్తుతి

హృద్యంగమమది లయబద్ధమది
మధుర తరంగము నియమబద్ధము
ప్రమధనాధ పదనాట్య విలాసము
నయనానందము శ్రవణానందము -

ప్రకృతి కన్నులు తెరచి చూడగా
ప్రమథ గణంబులు నిలచి యుండగా
ప్రతి తనువొక నయ విపంచికగా-
పలికెను గుండియ వీణ తంత్రియై -

ఘల్లు ఘల్లుమను నాదమయంకద-
ఢమఢమ ఢమరుక శంభోశంకర
తాధిం ధిమికిట భక్తవశంకర
సరిగమ పదనిస భోళాశంకర.

ఫాలనేత్రమది పాపహరంబది
ప్రాణికోటినది చల్లగ చూచును
గళమున నింపిన గరళము తొణకదు
గంగే మ్రింగును సెగలను పొగలను.-

నిత్యనూతనం నీ పదనాదం
నాదబ్రహ్మవీ వేదమూర్తివి
గిరిజావల్లభ సగము నిండిన
శైలతనూజే ఆడును సగము. -

నటరాజువట నిటలాక్షుడవట
అఖిల చరాచరప్రాణికోటికి
అభయంకరుడవు శివశంకరుడవు
అందే దొరవి అంబాపతివి.

మల్లికార్జునా బిల్వదళప్రియ
కాశీపతివి కాసినినీళ్లతో
అభిషేకించిన అభీష్టసిద్ధి
ఆత్మలింగమే అందెను భక్తుడు.-

కాలకూట విషమంతయు స్వామీ!
కరుణ కిరణముల హరించిపోవును
కటువులేని కిరాతుడవైతివి
కలిమి కోరవు కలిమి నొసగెదవు

కరి చర్మాంబర చంద్రకళాధర
దయాసింధు ఓ పన్నగభూషణ!
నీవు నేర్పిన నటకౌశలముతొ
నేలకు దిగినది గంగమ్మ.-

నీపద నూతన విన్యాసంలో
నయనానందం నందీనాయక
వందిమాగధులె ప్రమథగణంబులు
మందస్మితుడవు సుందరశివుడవు.-

మార్కండేయుడు నీ విధేయుడు
లంకాపతి నీవంక చేరెను
నమక చమకముల మహాన్యాసముల
అభిషేకింతుము రుద్రమూర్తిని.

వెన్నెలతేడట వెలుగులు చిమ్మగ
ఫణిహారమ్ములు బుసలు నింపగా
పసను నింపిన నాట్య భంగిమలు
దెసలు నింపితివి కైలాసవాస!

సరస పదమ్ముల నీ పదంబులే
పూజింతుమయా పార్వతి నాయక
ఫాలనేత్ర నిను ఏమరకుందుము
సకల జగతికి జయ మొసంగుము.

✻✻✻

రామచంద్ర చరణాలను స్మరణ చేసెద
రామచంద్ర చరణాలను కీర్తించెద
రామచంద్ర చరణాలకు శిరసు వంచెద
రామచంద్ర చరణాలను శరణు వేడెద

తల్లివి నీవే తండ్రివి నీవే
స్వామివి నీవే మిత్రుడు నీవే
అన్నియు నీవే ఆత్మారామా!
అన్యము నెరుగ అంజలి యిదిగో.

లక్ష్మణమూర్తి కుడిభాగమున
వామభాగమున జనకనందినితో
కన్నులముందర మారుతి కొలువగ
వెలసిన రఘుపతి వందనమిదిగో.

లోకాభిరామా రణరంగధీరా!
రాజీవనేత్రా రఘువంశనాథా
కారుణ్యరూపా కరుణాసముద్రా
శ్రీరామచంద్రా శరణంటినయ్యా!

శ్లో. మనోజవం మారుతతుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టం
వాతాత్మజం వానర యూధ ముఖ్యం
శ్రీరామదూతం శరణం ప్రపద్యే.

రామరామ యను మధురాక్షరములు
కవితాశాఖల కూర్చొని తీయగ
కూసిన 'కోయిల' ముని వాల్మీకి
వందనమిడితిని మునికోయిలకు.

ఆపదలన్నీ హరించునట్టి
సర్వసంపదల నొసంగునట్టి
లోకాభిరాముడు శ్రీరామునికి
తిరిగి తిరిగి నా వందనమిదిగో!

భవబంధముల బీజనాశకము
సర్వసంపదల కాలవాలము
యమదూతలకు గుండెలవియగ
రామగర్జనము చేతము రండు.

రాజశ్రేష్ఠుడు రామచంద్రుడు
సదావిజయమే పొందుచుండును
అట్టి రాముని అహర్నిశము-నే
భజించుచుందును అన్యము నెరుగక.

నిశాచరులగు దనుజుల ద్రుంచిన
రామచంద్రునికి నమస్కరింతును
రాముని మించిన ఆశ్రయమిలలో
లేదు లేదు - నే దాసుడ రామా!

చిత్తము నాది రామాలయము
చిత్తము నిత్యము భజనమందిరము
చిత్తము లగ్నము నీ కీర్తనలో
చిత్త శాంతినిడు శ్రీరఘురామా!

శ్లో. శ్రీరామ రామ రామేతి
రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం
రామనామ వరాననే.

**మంగళం**

సర్వేజనా స్సుఖినో భవన్తు.
లోకా సమస్తా స్సుఖినో భవన్తు.
శుభం

❖ ❖ ❖

బుధకౌశిక మహర్షి విరచిత

# శ్రీరామరక్షా స్తోత్రము

## (తెలుగు రచన)

## ధ్యానమ్

శ్లో. ధ్యాయేదాజాను బాహుం : ధృతశరధనుషం బద్ధపద్మాసనస్థం
పీతం వాసోవసానం, నవకమలదళస్పర్థినేత్రం ప్రసన్నం
వామాంకారూఢ సీతా ముఖకమలమిలల్లోచనం నీరదాభం
నానాలంకారదీప్తం దధతమురుజటామండలం రామచంద్రం

శ్రీరఘురాముని రమ్యచరితము
వందకోట్ల గ్రంధమ్ముల వెలసెను
పలికినట్టి ప్రతి అక్షరమ్మది
మహాపాపముల నాశము చేయును.

నీలికమల మా శ్యామలదేహము
పద్మనయన శరచాప ధరుండు
జటామకుటము కరవాలముతో
దనుజులద్రుంచి జగతిని బ్రోచెను.

సర్వవ్యాపకుడు - పుట్టుక లేకయె
లీలతొ భువిలో అవతరించిన
రామచంద్రుని జానకి సహితుని
లక్ష్మణమూర్తితొ నిలచిన ప్రభువును.

స్మరించుచుండిన సజ్జనులందరి
సర్వపాపముల హరింపజేసే
రామరక్ష - ఈ - స్తోత్రపఠనమున
సర్వకామ్యములు సఫలములగును.

శిరసు - రాఘవుడు రక్షణచేయును
దశరథ తనయుడు నొసటగాచును
కోసలాత్మజా నందనుడెపుడు
నేత్రరక్షణము చేయుచుండును

విశ్వామిత్రుని ప్రియశిష్యుడగు
రాముని రక్షలొ కర్ణములుండును
యజ్ఞ రక్షకుడు నాసిక కాయును
లక్ష్మణాగ్రజుడు ముఖము గాయును.

విద్యానిధి నా జిహ్వను గాయును
భరత వందితుడు కంఠము గాయును
దివ్యాయుధుడు గాయు స్కంధములు
భుజముల గాయును ధనుర్భంజనుడు.

సీతాపతి నా కరములు గాయును
పరశురాముని జయించినట్టి
దశరథరాముడు హృదయ రక్షకుడు
జగద్రక్షకుడు-విజయశోభితుడు.

## శ్రీరామరక్షాస్తోత్రము

విల్లు ధరించిన వారిలో శ్రేష్ఠులు
రాక్షసకుల విధ్వంసకులైన
రఘువంశమున చందమామలు
రక్షకులగుదురు మాకందరకు

అక్షయ తూణీరమ్ములు నిండి
నారికూర్చిన ధనుసులు కలిగి
రామలక్ష్మణులు అనవరతము-నే
నడచు మార్గమున రక్షణ నిడెదరు.

కవచధారియై ఖడ్గపాణియై
ధనుర్బాణములు భుజమునదాల్చిన
లక్ష్మణసహితుడు రామచంద్రుడు
ముందు నిలచి నా కోర్కెలు తీర్చును.

దశరథతనయుడు రాముడు-శూరుడు
లక్ష్మణాగ్రజుడు అతిబలవంతుడు
కాకుత్స్థుడు మరి పూర్ణపురుషుడు
రఘూత్తముడు కౌసల్యాతనూజుడు.

వేదాంతవేద్యుడు యజ్ఞమూర్తియగు
పురాణపురుషుడు పురుషోత్తముడు
జానకీపతి అతిశ్రీమంతుడు
అప్రమేయ పరాక్రమవంతుడు.

శ్రద్ధాభక్తుల సదాస్మరణము
చేయు భక్తుడు ప్రియతముడగును
అశ్వమేధక్రతు ఫలమునుమించిన
ఫలమునందున నిస్సంశయముగ

నీలనీరదశ్యాముడు రాముడు
పద్మాక్షుడు పీతాంబరధారి
నామస్తోత్రము చేయు నరులకు
భవబంధములు చిక్కులుండవు.

రామచంద్ర! ఓ లక్ష్మణాగ్రజా!
సీతాపతి రఘువంశవర్ధనా!
సుందరమూర్తీ కకుత్స్థరామా!
గుణనిధిసోమా కరుణాసాగర.

విప్రుల హితుడవు ధార్మికమూర్తీ
రాజేంద్రా! ఓ సత్యసంధుడా
దశరథనందన శ్యామలమూర్తీ
మూర్తిగ నిలచిన శాంతస్వరూపా!

లోకాభిరామా రఘుకులతిలకా!
రావణవైరీ దశముఖహారీ
వందనమిదిగో అందుకొనుమయా
సుందరరామా శరచాపధరా!

రామరామ-రామభద్ర-రామచంద్ర
వేదవ ార్త రఘువంశనాథుడ వీవు
వందనమ్ము సీతాపతి-జగతికంతయు
నాథుడవు నమ్మితిమి మమ్ముగావుము.

రఘునందనరామా శ్రీరామా!
భరతాగ్రజరామా శ్రీరామా
రణకర్కశరామా రఘురామా!
శరణం-శరణం శ్రీరామా!